# శ్రీమదాంధ్ర వచన భారతము.

సంస్కృత భారతమునకు సరియైన తెనుఁగు.

## భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక పర్వములు.







శతఘంటము వేంకటరంగ శాస్త్రి.

శ్రీ కాళహస్తీశ్వరాయ నమః.

---

# శ్రీమదాంధ్ర వచన భారతము.



సంస్కృత భారతమునకు సరియైన తెనుఁగు.

## భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక పర్వములు.

ఇది


శ్రీ కాళహస్తిసంస్థానము పండితులగు

శతఘంటము వేంకటరంగ శాస్త్రిగారిచే


రచియింపఁబడి


విండ్ల చెరువు రామయ్య, బి. ఏ., చే

ప్రకటింపఁబడినది.





28, కచ్చాలేశ్వర అగ్రహారము, చెన్నపురి.

శ్రీ . దాంధ్రవచనభారతమునకు సంవత్సరమునకు చందా 3-3-0.

తపాలాఛార్జి సహా ఆది సభాపర్వముల వెల 2-14-0.

ఆరణ్య విరాట ఉద్యోగపర్వములు వెల 5-5-0.

ఆదిపంచకము వెల 8-0-0.




---

శ్రీకాళహస్తీశ్వరాయనమః

# భీష్మపర్వము.

## ప్రథమాశ్వాసము.

క. శ్రీ విశ్వరూప సంగ్రహ
భావిత పరమేష్ఠి లేఖపతి ముఖ నిఖిల
స్థావర జంగమమయ నా
నా విష్టప నిచయ, బోధనప్రమదమయా.
దేవా, ననుఁ గృతార్థుం జేయుము.

సంతతసభక్తికోపసేవితద్వైపాయనుం డైన వైశంపాయనుం డనంతరకథాకర్ణనోదీర్ణకుతుకహృదయుండై జనమేజయుండు మునీంద్రా, యవ్విధంబున సన్నద్ధు లయినకౌరవపాండవు లెట్లు భండనం బొనర్చిరి తెలియం జెప్పవే యని యడుగ నిట్లనియె.

పుణ్యక్షేత్రోత్తమం బైనకురుక్షేత్రమందు జయార్థి యయినయుధిష్ఠిరుఁడు సకలసైన్యసమేతంబుగ శమంతపంచకబాహ్యదేశంబునఁ బ్రాఙ్ముఖంబుగ విడిసి సైనికుల కందఱకును భక్ష్యభోజ్యాదిసామగ్రిఁ గల్పించి తమవారి కడియాలములుగ నాభరణంబుల నామధేయంబులను నిర్ణయించి యీయభిజ్ఞానంబు గలవాఁడు పాండవసైనికుం డని యెఱుంగఁ దగు నని యందఱకు నిరూపించి శ్వేతచ్ఛత్రచామరప్రముఖరాజయోగ్యభద్రోపచారభాసురుండై యనుజులు, పుత్రులు, మిత్రులు, బాంధవు, లక్షౌహిణీపతులు నెడనెడఁ బరివేష్టింప వాసుదేవసహాయుండై భేరీప్రముఖవాద్రితనిస్వనంబు పాంచజన్య దేవదత్తాదిశంఖారవంబును రోదసీకుహరంబునఁ బెల్లెసంగఁ గయ్యమున కాయితమైయుండ దుర్యోధనుండు నేకాదశాక్షౌహిణులు పరివేష్టింపఁ దత్ప్రకారంబున భీష్మాభిరక్షితుండై ప్రత్యఙ్ముఖంబుగఁ బ్రతివ్యూహంబుఁ బన్నించి సమరసన్నాహంబునం బొదలె నట్టియెడఁ బాంచజన్య దేవదత్తనిస్వనంబుల కులికి యోధులు కొదమసింగముబొబ్బలు విన్న క్షుద్రమృగంబులట్లు దిగ్భ్రమంబుఁ జెందిరి. మాంసశోణితవర్షము మున్నగు నుత్పాతంబులు దోఁచె. అప్పుడు కౌరవులును బాండవులును ధర్మమునకు విరోధము వాటిల్లనీక పోరుట యుభయలోకములందును మే లని తలంచి వాగ్రణం

బునఁ బ్రవర్తించువారల వాగ్రణంబుననే యెదిరించునది. రథికుని రథికుఁడును, గజారోహుని గజారోహుండును, హయారోహుని హయారోహుండును, బదాతినిఁ బదాతియు, గామబలోత్సాహయోగ్యతలకుఁ దగినతెఱంగుగా మార్కొనునది. నమ్మిశరణన్నవానిని, విన్నఁబోయినవానిని, సంగ్రామరంగంబు దొలంగినవానిని, లాఁతితోడం బోరాడుచున్నవానిని, విముఖుని, గైదువుపడినవానిని, మైమఱు వూడ్చినవానిని నెట్టివానినైనం జంపవలదు శంఖభేరీప్రముఖవాదిత్రవాదకాదిపరిచారకులదెసం బోవల దని సమయంబు గావించిన నయ్యుభయసైన్యంబులు ప్రహర్షోత్కర్షంబుతో యుగవిగమంపునాఁటి సాగరంబులట్లు ఘూర్ణిల్లుచు మోహరించి యొండొంటిం దలపడ నుఱవడించి కయ్యమునకుఁ గాలుద్రవ్వుచుండె.

## వేదవ్యాసముని ధృతరాష్ట్రునొద్దకు వచ్చుట.

అంతఁ బ్రత్యక్షభూతభవద్భావివృత్తాంతుం డైన వేదవ్యాసమునీంద్రుఁ డయ్యిరువాగులం జూచి కురుపితామహుం డైనగాంగేయుం డీరణంబున మేను దొఱంగు నని యెఱింగి కరిపురమున కరిగి కొడుకులయనయంబునకు వగచుచు సంజయద్వితీయుండై యున్నయాంబికేయుం గాంచి యతఁడు నేసినపూజల గ్రహించి యిట్లనియె. అయ్యా, నీకొడుకులును దక్కటిరాజులును గాలపరీతులై సంగ్రామంబుఁ దెచ్చికొని ప్రాణములఁ గోల్పోవఁగఁ దొడఁగిరి. కాలవశమున నగుకార్యములయెడ వగచినం బ్రయోజనం బించుకేనియుఁ బుట్టదు కావున [illegible]గ పుడుగుము. పోరు నూడఁ గోరుదేని కన్నుల నిచ్చెదఁ జూడు మనుటయు ధృతరాష్ట్రుఁడు మునివరేణ్యా, జ్ఞాతులు సహజప్రేమంబుఁ బాసి యొండొరులఁ జంపుకొనుచుండఁ జూడ నోపను. కయ్యంపుతెఱంగు సాకల్యంబుగ వినఁ గోరెద ననియె. అనవుడు నమ్మునీంద్రుఁ డతనియెడం గరుణించి యాంబికేయా, సంజయుండు నీకు సమరప్రకారంబెల్లఁ దేటపడం జెప్పవాఁడు. సంగరాంగణంబునం బుట్టినరహస్యంబును, బ్రకాశంబును, మనస్సులలోనం దలఁచినతలంపులును, దివావృత్తాంతంబును, రాత్రిచరిత్రంబును దేటతెల్లంబుగ నెఱుంగునట్లుగను, నెక్కడఁ దిరిగినను శస్త్రాస్త్రములు దాఁకకుండగను, నేయపాయంబును గలుగకుండఁగను నీతనికి వరం బిచ్చెద ననిచెప్పి తద్వరం బతనికిఁ బ్రసాదించి పారాశర్యుండు వెండియు నిట్లనియె. ఏను గౌరవపాండవులకీర్తిని లోకమునఁ బ్రఖ్యాతంబుఁ గావించెద. ఉమ్మలికమ్ము మానుము. దైవవశమునఁ గూడినయీసంగరంబు మాన్ప నేరికి నలవి గాదు. ధర్మమేవలనం గలుగు నావలన జయము గలుగు నింతియకాని యొండు గాదు. బహుజనక్షయసూచకంబు లయినయుత్పాతంబులు దారుణాపాతంబులై తోఁచుచుండ యుద్ధమేల కాక తక్కు? కంకగృధ్రబకకాకశ్యేనాదులు ధ్వజాగ్రములఁ వ్రాలుచున్నవి. క్రవ్యాదభూతగణంబు కటకటాత్కారంబు

లు సేయుచు గజవాజిపిశితము మెసవఁ జూచుచున్నది. సేన నడుమం గ్రద్దలు దక్షిణాభిముఖంబులై పోవుచున్నవి. ఉదయాస్తమయసమయములందు శ్వేతలోహితనీలకబంధములు భానుమంతు నావరింపుచున్నవి. అహోరాత్రవిభాగం బేర్పడని తెఱంగుగా సూర్యచంద్రనక్షత్రప్రకాశంబు నిరంతరంబయి కన్పట్టుచున్నది. కార్తికపౌర్ణమాసినాఁడు చంద్రమండలంబు సహజతేజోహీనంబై యగ్నివర్ణమునం జూపట్టె. అప్పుడు నభస్తలంబును బద్మవర్ణంబై తోఁచె. రేలు మింట వరాహమార్జారంబులు పోట్లాడునినాదం బతిరౌద్రంబై వినంబడునున్నది. దేవతాప్రతిమ లకారణంబుగ వడఁకుచున్నవి నగుచున్నవి నెత్తురు గ్రక్కుచున్నవి చెమర్చుచున్నవి పడుచున్నవి. మ్రోయింపకున్నను దుందుభులు మొరయుచున్నవి. యోగగహితంబులయ్యు రాజులుమనోరథంబులు పెల్లెసంగుచున్నవి. శుకపికచాషభాసపారసమయూరాదివిహంగంబులు దారుణంబుగ నఱచుచున్నవి. గుఱ్ఱముల నెక్కి కేడెములవాండ్రు శస్త్రముల గ్రహించి యాక్రోశింపుచున్నవారు. అరుణోదయసమయంబున మిడుతలు కోటానఁగోటులు పిండుగట్టి తిరుగుచున్నవి. పూర్వాపరసంధ్యలందు దిగ్దాహంబు వ్రేడముచున్నది. పాంసుమాంసవర్షము గురియుచున్నది. అరుంధతీదేవి వసిష్ఠమునిశ్రేష్ఠునిఁ బృష్ఠభాగంబునం ద్రోచి తానగ్రభాగమునఁ జనుచున్నది. శనైశ్చరుఁడు రోహిణీశకటంబుఁ బీడింపుచున్నవాఁడు. చంద్రునిలాంఛనంబు మఱలంబడియె. మింట మబ్బు లేకున్నను నుఱుము పెల్లుగ వినఁబడుచున్నది. వాహనంబులు కన్నీరు విడుచుచున్నవి. గోవులయందు గర్దభంబులు పుట్టుచున్నవి. తల్లులతోడ బిడ్డలు రమింపుచున్నవారు. ఋతువునకుఁ దగనిపుష్పఫలములు మ్రాఁకులం జూపట్టుచున్నవి. గర్భిణులు భీకరాపత్యంబులఁ గనుచున్నారు. క్రవ్యాదభూతగణములు పక్షులతోడఁ గలిసి కుడుచుచున్నవి. మూఁడుకొమ్ములు నాలుగుకన్నులైదుకాళ్లు రెండుమేహనంబులు తలలుతోఁకలుం గలిగి దంష్ట్రాకరాళముఖంబు లయినపశువులు పుట్టి యశుభసూచకముగ వికృతవక్త్రములయి పెలుచ నఱచుచున్నవి. మూఁడుకాళ్లతో నెమళ్లు జనింపుచున్నవి. నాలుగుకోఱలు కొమ్ములుం గలిగి గరుడపక్షులు పుట్టుచున్నవి. బ్రహ్మవాదులయువిదలు నిట్లు విరూపాపత్యములఁ గనుచున్నారు. గరుడపక్షులకు నెమళ్లు పుట్టుచున్నవి. గుఱ్ఱము లావుదూడల నీనుచున్నవి. కుక్కలు నక్కలం గనుచున్నవి. ఒంటెలు కుక్కల నీనుచున్నవి. చిలుకలు దారుణముగ నఱచుచున్నవి. మనుష్యస్త్రీ లొక్కతూరి నలుగురేవురు కన్నియలఁ గనుచున్నారు. ఆకన్నియలు పుట్టినంతన దారుణాద్భుతంబుగ నర్తనమును గానమును హాసమును శస్త్రసంయుతప్రతిమాలేఖనంబునుం జేయుచున్నారు. శిశువులు దండపాణులై యొండొరువుల మార్కొనుచున్నవారు. మ్రాఁకులమీఁదఁ బద్మోత్ప

లకుముదములు గలుగుచున్నవి. ఏదిక్కు చూచినం గాడ్పులు మ్రాఁకుల విఱు
చుచు దుమ్ము రేఁచుచుఁ బెలుచ వీచుచున్నవి. పుడమి మిక్కిలి వడఁకుచున్నది.
శుక్రుఁడు చిత్ర నతిక్రమించి కురుక్షయంబు సూచించుచుఁ బూర్వాభాద్ర నారో
హించి యుత్తరాభాద్రఁ బరిక్రమించి చూచి పొగరాఁజునగ్నిచందమునఁ దేజో
దర్శనీయుండై జ్యేష్ఠ నాక్రమించినవాఁడు. మహాఘోరం బయినధూమకేతువు
పుష్యము నాక్రమించి యిరువాఁగులకుం గీడు సేయుచున్నది. చిత్రాస్వాత్యంత
రస్థితుం డైనయంగారకుఁడు వక్రానువక్రాదిగతులచే మఖాశ్రవణంబుల నిర్మ
ర్యాదంబుగఁ బ్రవేశించి రోహిణి నావరించియున్నవాఁడు. అయ్యంగారకునిని
శ్రవణస్థితుండైన బృహస్పతిని రోహిణీస్థితుండైనశని పుబ్బ నాక్రమించి పీడింపు
చున్నాఁడు. మఱియు సూర్యచంద్రులు రోహిణిని వేధింపుచున్నారు. సంవత్సర
మున కొకతూరి నక్షత్రమును రాశినిం గదలునట్టిశనిబృహస్పతు లత్యంతగమన
వేగమున విశాఖను డాయవచ్చిరి. ధూమకేతువు త్రిపూర్వాతారలం జేరి కృత్తి
కను వేధింపుచున్నది. ఏకమాసత్రయోదశులయందు సూర్యచంద్రగ్రహణం
బులు రెండును దోఁచినవి. పర్వభిన్నకాలమునం గలుగుగ్రహణములు బహుళ
జనక్షయసూచకములు. ధ్రువుఁడు ప్రజ్వలితాగ్నిచాడ్పున మండుచు నపసవ్యముగఁ
దిరుగుచున్నవాఁడు. సప్తమహర్షులు తేజోహీనతం బొరసిరి. యవ లయిదు
తలలు గలిగి కన్పడుచున్నవి. శాలిధాన్యములు నూఱుతలలతోఁ జూపట్టుచు
న్నవి. గోగణంబులు నెత్తురు పిదుకుచున్నవి. చాపఖడ్గాదిసాధనములందు మిడుఁ
గుఱులు పుట్టునున్నవి. జలం బెచ్చటఁ జూచిన నగ్నివర్ణంబై యున్నది. నానాది
క్కులందును మృగములు ప్రజ్వలితవక్త్రములై యఱచుచున్నవి. ఏకపక్షపాద
నేత్రం బయినయొక్కపక్షి ప్రతిదినంబును రాత్రి నెత్తురు గ్రక్కుచు రౌద్రంబుగ
నఱచుచు మింటఁ దిరుగుచున్నది. చతుర్దశీపంచదశీప్రతిపత్తిథులయందు సేనల
తలలపై గ్రద్దలు వ్రాలుచున్నవి. రక్షోగణములు రుధిరపరిపూర్ణవక్త్రములతోఁ
దృష్టిఁ గాంచక విహరింపుచున్నవి. మహానదులు రుధిరజలంబులై యెదురు పాఱు
చున్నవి. బావులు దట్టంపునురుగుతెట్టెల నిండి తెల్లయాఁబోతులు ఱంకెలు
వేయుచాడ్పున మ్రోయుచున్నవి. పిడుగులతోడఁ గొఱవులు పడుచు నంతటం
గవియుచీఁకటి విరియింపుచున్నది. దానిం జూచి మహర్షులు బహుజనక్షయ
మున కియ్యది సూచకంబు పుడమి పెక్కండ్రురాజులనెత్తురు ద్రావ నున్న దని
పల్కిరి. హిమవత్కైలాసమందరగిరిప్రాంతముల ఘోరారవంబు విననయ్యెడి.
చతుస్సముద్రములు వేల లతిక్రమించి ధరిత్రీతలక్షోభముఁ గావించుచందము
దోఁచెడి. రచ్చపట్లను జదుకంబులనుం గలమహావృక్షములు పిడుగులపాటునం
జేసి కూలుచున్నవి. హవ్యవాహనుఁడు విధియుతంబుగ ద్విజోత్తమహుతుండై

నీలరక్తపీతవర్ణములఁ బొరయుచు దుర్గంధం బొలయించుచు దారుణస్వనంబు చేయుచు నప్రదక్షిణశిఖాప్రచారం బొనర్చుచున్నవాఁడు. గంధరసములు విపరీతములయి యున్నవి. ధ్వజదండములు కంప మొందుచుఁ బొగరాఁజుచున్నవి. సమృద్ధగిరిదుర్గశిఖరస్థితంబు లయినభేరీపటహము లంగారవర్షముఁ గావించుచున్నవి. వాయసములు వామమండలమునఁ దిరిగి ధ్వజాగ్రముల నెక్కి పృథ్వీపీతియంబు సూచించుచు నశుభారవములు సేయుచున్నవి. తురంగమములు దైన్యము గదిరినమోములతో నుమ్మలించుచున్నవి. గజములు జలాశ్రయములై యున్నవి. పుట్టరానియీదుర్నిమిత్తములు పుట్టుటం జూచిన బహుప్రజాక్షయంబును గురుకులవినాశంబునుం బుట్టున యనితోఁచెడి. నీ విందుఁ గొంచెము నయముఁ బరికించి కొడుకును సన్మార్గమునఁ బోవఁగ శాసించి నిల్పుదేని యీకీడు తప్పు. అవ్విధంబు గావించుట కిది ప్రాప్తకాలం బని చెప్పిన విని ధృతరాష్ట్రుఁడు మహాత్మా, దైవవశమునఁ గానున్న జనక్షయముఁ దప్పింప నెవ్వరుం జాలరు. ఊరక యింట రోగపీడతోఁ జచ్చుటకంటె క్షత్రియులకు యుద్ధమున వెనుదీయక పోరాడి మేను దొఱంగుట యుభయలోకములందు మేలుగదా యనవుడు సాత్యవతేయుఁడు ముహూర్తమాత్రము చింతించి రాజేంద్రా, కాలవశమునఁ బ్రజలకు సృష్టిస్థితిలయములు గలుగుచున్న వనుట నిక్కంబు. అయినను మంచిమార్గము చూపి జ్ఞాతిసుహృత్సంబంధులకు మేలు గావింపుము. జ్ఞాతివధంబు నింద్యంబు నాకుం బ్రియంబు గాదు. కాలమే దుర్యోధనరూపమునఁ బుట్టి జనసంహారమునఁ బ్రవృత్తం బయ్యెఁగాని యొండు గాదు. హింస వేదగర్హితం బహితంబు. కులక్షయంబుఁ గావించుట గర్హ్యం బని వేఱ చెప్పవలయునే? శక్యమయియున్నకార్యము నశక్య మనిభావించుచు రాజలోకనాశమునుం జేయ నొడంబడి యుత్పథమునం బోయెదవు. రాజ్యమే నీ కనర్థ మయ్యె. ధర్మముఁ బరిత్యజించితివి. ఇఁక నైన ధర్మముఁ బరికింపరాదో. దానఁ గౌరవులును బాండవులును సుఖ మొందుదురు. నీవును గీర్తిం బొందెదవ వని చెప్పుచున్నంత నవ్వచనముల నాక్షేపించి ధృతరాష్ట్రుఁ డిట్లనియె. మహానుభావా, నీయెఱింగినట్ల భావాభావముల నేను నెఱుంగుదు. ఐనను స్వార్థమున సమ్మోహముఁ జెందుట లోకమునకు సహజంబు. నేనును లోకమువాఁడనకాని లాఁతివాఁడనే? కావున నిన్నుఁ బ్రార్థించెద. నీవే నాకు గతివి. సన్మార్గప్రదర్శకుండవు. నే నేమి చేయుదు? నాకొడుకులు నామాట మెయి నడుచువారు గారు. నాయెడఁ గీడు దలఁపవలదు. ధర్మప్రవృత్తులను భరతకులకీర్తిని సాకల్యముగ నెఱింగిననీకు నేఁ జెప్పువాఁడనే! సంగ్రామమున జయించువారికే చిహ్నములు గలుగువానిం జెప్పవే యనియడుగఁ బారాశర్యుఁడు వైచిత్రవీర్యున కిట్లనియె. అగ్నిహోత్రుఁడు ధూమరహితుఁడై ప్రదక్షిణావ

ర్తశిఖలతోఁ బుణ్యగంధ మొలయఁ బ్రసన్న తేజస్కం డగుటయు, శంఖభేరీమృదంగాదివాద్యములు గంభీరస్వనంబు లగుటయు, సూర్యచంద్రులు విశుద్ధప్రసన్నకిరణు లగుటయు, శుకక్రౌంచహంసాదివిహంగమంబులు ప్రదక్షిణగమనంబులై శుభవచనములఁ బల్కుటయు, సైనికగజతురంగంబులు గంభీరబృంహితఘోషితరవములు గావించుటయు, యోధులు వాడనిపూదండలఁ దాల్చుచుఁ దనుత్తోఁ గలిసినవానితో నిష్టవచనములు గలియనున్నవానితో నిపుణవాక్యంబులుంగా మొదలఁ బ్రతిషేధమునుఁ బిదప నర్థసంధానమునుం బొనరించుచు సంతసంబునఁ బొదలుటయు, శబ్దస్పర్శరూపరసగంధములు వికారముఁ బొరయమియుఁ, బవనాంబుదేంద్రచాపంబు లనుకూలప్రచారంబు లగుటయు, విజయలక్షణంబులు. ఏతద్విపరీతములు పరాజయలక్షణములు. సేన యలంతియైనను యోధులకు హర్షము గలుగునేని జయము సేకూఱు నని చెప్పఁ దగు. ప్రధానయోధుఁ డొక్కరుఁడు హర్షములేనివాఁ డగునేని తక్కటివారికిని సకలసైన్యములకుం బొం గడంగి విఱుగుడుపాటు ఘటించు. విఱిగినపదంపడి చేర్చుట యరిది. ఉపాయముననే సైన్యమున కుబ్బు చెడకుండ రక్షించుచు గెలుపు గొనవలయు. ఉపాయనైపుణ్యంబు గలిగియుండునేని సామాదులఁ గార్యము దీఱునట్లు చేసికొనవలయుఁగాని యుద్ధ మగునట్లు చేసికొనఁడు, సామాదులం దీఱక సమరంబే సంప్రాప్తం బయ్యెనేని నేర్పున జయము సేకూఱునట్లు చేసికొను. ఉపాయము లెస్స పరికించి పోరు సేసిరేని శూరు లేఁబండ్రైన నంద ఱేల యేవు రాఱుగురైనను మహాసైన్యంబు గెలుతురు. వైనతేయుఁ డొక్కరుండకదా పెక్కుమాఱులు పెక్కుసైన్యముల నుక్కడంచినవాఁడు. సైన్యంబు బహుళంబుగా నున్నమాత్రన జయము గలుగు నని నమ్మరాదు. దైవ మేదెస వ్రాలియుండు నాదెస జయము సిద్ధమైయుండు నని చెప్పి సాత్యవతేయుఁ డాంబికేయునామంత్రణంబు చేసి చనియె. ధృతరాష్ట్రుఁడుం గొంతవడి చింతాతత్పరుండై యుండి యట సంజయుదెస మొగంబై సంజయా, రాజులు పెక్కండ్రు బహుసహస్రార్బుదసైన్యములఁ గూర్చికొని భూమికై పోరాడి ప్రాణములనైన విడుచుచున్నవారుకదా. భూమియం దెన్నిగుణములు గలవొకో? భూమితెఱంగుఁ దెలియఁ జెప్పు మని యడుగ సంజయుండు వ్యాసమహామునికారుణ్యలబ్ధం బయినవిజ్ఞానంబునఁ దెలిసినంత చెప్పెద విను మని యిట్లనియె.

## సంజయుఁడు ధృతరాష్ట్రునకు భూమితెఱంగు సెప్పుట.

లోకమున భూతములు స్థావరజంగమభేదమున రెండుదెఱంగుల నుండు. అందు జంగమములు జరాయుజాండజస్వేదజము లనఁ ద్రివిధములై వర్తిల్లు. అందు జరాయుజంబులు సింహవ్యాఘ్రవరాహమహిషకుంజరఋక్షవానరంబు

లన నారణ్యకంబు లేడును గోమేషాజామనుష్యాశ్వాశ్వతరగర్దభంబు లన గ్రా
మ్యంబు లేడునుంగాఁ జతుర్దశప్రకారంబు లగు. ఆరణ్యకంబులందు సింహము
లును గ్రామ్యములందును మనుష్యులును శ్రేష్ఠతాపాత్రంబులు. స్థావరము లుద్భి
జ్జము లనఁ బరఁగి వృక్షగుల్మలతాతృణత్వక్సారంబు లనంగఁ బంచవిధంబు లగు.
ఈపందొమ్మిదియు మహాభూతంబు లేనుం గలిసి చతుర్వింశతిప్రకారంబై గాయ
త్రి యనంబడు. దీని నెఱింగినయతండు సేటు గాంచఁడు. ఇవన్నియు భూమియం
దే యుత్పత్తిస్థితిలయములఁ బొందుటం జేసి సర్వభూతములకు భూమియే యాస్ప
దంబు. భూమికిఁ బతి యగువాఁడు భూతజాలమునకుఁ బతి యగుఁ గావున రాజులు
భూపతిత్వంబుఁ బడయఁ గోరి ప్రాణములనైన డాపక పోరాడుదు రనిచెప్పి వెం
డియు నిట్లనియె. పృథివ్యప్తేజోవాయ్వాకాశంబు లన మహాభూతంబు లైదు. శబ్ద
స్పర్శరూపరసగంధము లనఁ దద్గుణంబు లైదు. ఎట్లంటేని. ఆకాశమునకు శబ్ద మొ
క్కగుణము. వాయువునకు శబ్దస్పర్శములు రెండుగుణములు. తేజస్సునకు శబ్దస్ప
ర్శరూపములు మూడుగుణములు. అప్పునకు శబ్దస్పర్శరూపరసములు నాలుగుగుణ
ములు. పృథివికి శబ్దస్పర్శరూపరసగంధము లయిదుగుణములు. భూతపంచకం బా
కాశవాయుతేజోజలపృథ్వు లనుక్రమంబునఁ బుట్టిపృథివ్యప్తేజోవాయ్వాకాశంబు
లనువ్యుత్క్రమంబున లయంబుఁ గాంచు. ఈ పంచభూతములవలననే సకలంబు
జనించె. తత్ప్రమాణములను మనుష్యులు తర్కమున నిర్ణయింతురు. భూతపంచ
కంబుకంటెవిలక్షణం బగుతత్త్వముతర్కమునకుం గోచరంబుగ్గాక వెలుంగుచుండు.
సర్వభూతంబులందును బ్రధానం బయినభూమితత్త్వం బెఱింగించెద వినుము. సుద
ర్శనద్వీపంబే జంబూద్వీపం బనఁబడుచున్నది. ఇయ్యది బహుళనదీనదపర్వతనగ
రాదుల సొంపు మిగిలి లవణసముద్రపరివృతంబై చంద్రమండలంబునఁ బ్రతిఫ
లించు. అందు ద్వితీయాంశమునఁ బిప్పలంబు నపరద్వితీయాంశమున శశమును
సర్వౌషధీజలసమవాయసంభృతంబై యుండు. ఈసుదర్శనద్వీపమునఁ బూర్వప
శ్చిమభాగములను సముద్రముదనుక వ్యాపించి హిమవంతంబు, హేమకూటంబు,
నిషధంబు, నీలంబు, శ్వేతంబు, శృంగవంతంబు ననఁగ నాఱుపర్వతములు సిద్ధ
చారణాదిసేవితంబులై పొల్పారుచుండు. వీనియంతర*విష్కంభంబు సహస్రయో
జనంబులు. నీలపర్వతదక్షిణము నిషధపర్వతోత్తరము నగుదేశంబునఁ బ్రాగా
యతం బయినమాల్యవంతం బనుపర్వతంబు గలదు. తత్పర్వతప్రాంతమున గంధ
మాదనపర్వతంబు గలదు. ఉక్తపర్వతమధ్యమున హిరణ్మయం బైనమేరుపర్వతం
బుభూమికిఁ గర్ణికాకారంబై విధూమపావకంబుచాడ్పున వెలుంగుచుండు. ఆమేరు

* నిమ్మపండు మొదలగు వర్తులపదార్థముల నడుమ శలాక మొదలగునవి గ్రుచ్చి కొలిచిననడిమి
కొలఁత విష్కంభము. దీనికే వ్యాసమును నామాంతరము గలదు.

వునకుఁ బొంతు పదునాఱువేలయోజనంబులు. పొడ వెనుఁబదినాలుగు వేలయోజ నంబులు. అప్పర్వతరాజం బూర్ధ్వాధ స్తిర్యక్ప్రదేశముల నంతట వ్యాపించియుండు. దానిప్రక్కలనే సర్వద్వీపము లున్నయవి. సుపర్ణపుత్త్రుఁడై నసుముఖుఁ డనుపక్షి యక్కడఁ గలవాయసంబుల మేరుప్రభాప్రభావంబునఁ గనకవర్ణములయియున్న వానిం జూచి యుత్తమమధ్యాధములకు విశేషముఁ గావింపక యందఱ నొక్క తీరు గావించునట్టి యీకొండచేరువ నుండరా దనుతలంపున దేశాంతరమున కేగెఁ గావున నచ్చైవనతేయపుత్త్రుఁడుదక్కఁ దక్కటిమాననీయులందఱు నందు వసిం తురు. సూర్యచంద్రులును నక్షత్రతారాగ్రహగణంబులతో నప్పర్వతంబు వలగొ నుచుండుదురు. దేవగంధర్వాదు లప్సరోగణసమన్వితులయి యచటిరమ్యవనం బుల విహరింతురు. బ్రహ్మరుద్రేంద్రాదు లందు వివిధయజ్ఞముల నాచరింతురు. సప్తర్షుల కది యావాసంబు. కశ్యపప్రముఖప్రజాపతులు పర్వసమయములం దచ్చటఁ జేరుదురు. శుక్రుఁ డాపర్వతముశిఖరంబున నున్నవాఁడు. అందు రత్న రాసులు కొండలై పడియుండు నందలి నాలవపాలు కుబేరుఁడు గ్రహించి మను ష్యులకుఁ గళాంశం బిచ్చుచున్నవాఁడు. తత్పర్వతోత్తరపార్శ్వమునం గర్ణికారవ నంబునందు భగవంతుఁ డైనమహేశ్వరుఁడు సూర్యత్రయంబునుంబోనినేత్రత్ర యంబున నొప్పువాఁడు పాదావలంబిని యగుకర్ణికారకుసుమమాలికను ధరించి యుమాసహాయుండై విహరింపుచున్నవాఁడు. దుర్వృత్తులకు లోచనగోచరుఁడు గానియమ్మహాదేవుని బరమతపోధనులు సేవింతురు. ఆమేరుపర్వతంబుశిఖరంబు నందు క్షీరధవళప్రవాహపరిపూర్ణ యగుమందాకినీనది ప్రవహింపుచున్నది. తత్ప్ర వాహమున సముద్రతుల్యం బైనచంద్రహ్రద మనుపుణ్యతీర్థ మేర్పడియె. ఆనదినే చంద్రశేఖరుఁడు శతవర్ష సహస్రములు శిరస్సున ధరించె. హేమకూటం బైనకై లాసంబునందును గంధమాదనశృంగములందును గుబేరుఁడు యక్షరాక్షసగణసే వ్యమానుండై విహరించుచుండు. కైలాసంబున కుత్తరమున మైనాకగిరిప్రాంత మున హిరణ్యశృంగ మగుమణిమయగిరిపార్శ్వంబునఁ గాంచనసికతావిలసితం బగు బిందుసర స్సనుతీర్థంబు గలదు. అచ్చటనే భగీరథుఁడు గంగానయనార్థము పెక్కు వర్షములు తపస్సు చేసె. మణిమయయూపంబులు హిరణ్మయచైత్యములు నిప్ప టికిం గన్పట్టుచుండు. సహస్రాక్షుఁ డచ్చట యాగముఁ గావించి సిద్ధుఁ డయ్యె. భూతేశుండు భూతగణపరివృతుండై యందు విహారతత్పరుండై యుండు. నరనా రాయణులు, బ్రహ్మ, మనువు, స్థాణువు నందుఁ బెద్దకాలంబు తపంబు సల్పిరి. గంగానది ప్రథమ మచ్చోటికి వచ్చి యందు వస్యోకసారయు నళినియు, సరస్వ తియు, జంబూనదియు, సీతయు, గంగయు, సింధువు నను నేడువఱదలై పుడమిం బ్రవహించు. అందు సరస్వతి దృశ్యాదృశ్యమై యుండు. ఈనదులే సప్తగంగ

లనంబడు. హిమవంతంబు రక్షోగణంబులకును, హేమకూటంబు గుహ్యకుల కును, నిషధము సర్పగంధర్వులకును, గోకర్ణంబు తాపసులకును, శ్వేతపర్వతంబు దేవాసురులకును, నీలగిరి బ్రహ్మర్షులకును, శృంగవంతంబు దేవతలకును నివాసం బై యుండు. తత్పర్వతంబువృద్ధి లెక్కింప నలవి గాదు. తెలియఁ గోరువాఁడు నమ్మ వలయు. ఆమేరుపర్వతముపార్శ్వభూములయందు నవవర్షము లున్నయవి. ఎట్లం టేని. ఉత్తరసముద్రమునకు దక్షిణంబై శృంగవత్పర్వతంబున కుత్తరంబై యుం డునది యైరావతవర్షము నాఁబడు. అచట సూర్యచంద్రులు మిక్కిలిప్రకాశింపరు. నక్షత్రజ్యోతిర్గణంబులు కాంత్యావరణముఁ బొందియుండు. అచ్చటిమానవులు పద్మప్రభులు పద్మనేత్రులు పద్మగంధులునై వెలుంగుచు నిరాహారులు రజోరహి తులు జితేంద్రియులునై త్రయోదశసహస్రవర్షము లాయుఃప్రమాణంబు గలిగి యొప్పుచుండుదురు. శ్వేతశృంగవద్గిరిమధ్యంబు హిరణ్మయవర్షంబనంబరఁగు. అందే హిరణ్వతీనది పాఱుచున్నది. అదియే సుపర్ణునకు నివాసంబు. అచటివారికి దశవర్షస హస్రములు దశవర్షశతములు నాయుఃప్రమాణంబు. వారు మహాబలులు ముదిత చిత్తులునై యుండుదురు. అందుశృంగవత్పర్వతంబు మణిమయంబు స్వర్ణమయంబు సర్వరత్నమయంబు ననుమూఁడుశిఖరంబుల నొప్పారు. ఆశిఖరంబులందే శాండిలి య గుస్వయంప్రభాదేవి వసింపుచున్నది. శ్వేతపర్వతదక్షిణంబునునిషధప ర్వతోత్తరం బు నగుదేశము రమణకవర్ష మనఁబొలుచు. అందలిమానవులు శుక్లాభిజనసంపన్ను లుప్రియదర్శనులునై నిర్వైరంబుగ బ్రదుకుదురు. ఈవర్షములలో మేరుపర్వత మున కుత్తరమున నీలమునకు దక్షిణమున నుండుభూము లుత్తరకురుదేశము లనంబడు. ఇవి సిద్ధభూములు. సర్వకామఫలప్రదంబు లగునిత్యపుష్పఫలముల నొప్పారినవృక్షము లందుఁ బెక్కులు గలవు. ఆపండ్లతియ్యఁదనమునకుఁ దేనెయు నెన యని చెప్ప నలవి గాదు. మఱికొన్నిపాదపములు సంతతక్షీరభాసురంబులై యొప్పు. ఆక్షీరంబు షడ్రసవిలసితంబై యమృతమునకు సాటివచ్చు. తత్ఫలంబు లందుఁ గోరినవస్త్రాభరణములు పుట్టు. అచ్చటిభూభాగంబు కొన్నిచోట్ల సర్వమణి సంభృతంబును గొన్నిచోట్ల సువర్ణసైకతవిలసితంబును గొన్నిచోట్ల వజ్రవైడూ ర్యసన్నిభంబును గొన్నిచోట్లఁ బద్మరాగసమప్రభంబునై సొంపు పెంపారుచుండు. అచ్చటికొలఁకులు పంకరహితశుద్ధస్వాదుసలిలపూరితంబులై సర్వకాలసుఖప్రదం బులై యుండు. దేవత్వంబుఁ బడయఁ దపంబు సల్పినవారు తత్తపం బించుక కొఱఁతయైనచో నాభూముల జనింతురు. అచ్చటిస్త్రీ లచ్చరమచ్చెకంటులకు సాటి వత్తురు. అమృతసన్నిభంబై నయచ్చటిక్రమాఁకులపాఁడిఁ ద్రావి చక్రవాకమిథు నంబులట్లు నిరపాయమిథునక్రీడాపరాయణలై తుల్యరూపవేషము లగునపత్యం బులఁ గాంతురు. రోగంబు లచటివారలఁ జేరరావు. దశవర్షసహస్రంబులు దశ

వర్షశతంబులు నచటివారి కాయుఃప్రమాణంబు. అచటనే తీక్ష్ణతుండములై భయానకంబు లయినభారుండము లనుపక్షులు గలవు. అవి మృతకళేబరంబుల నప్రయత్నంబుననే గుహాంగణంబులఁ జేర్చి దేశమున నేవ పుట్టనివిధముఁ గావించు. మేరుపర్వతప్రాగ్భాగంబు భద్రాశ్వవర్ష మనం బరఁగు. అందలిభద్ర సాలవనమునఁ గాలామ్రం బనుమహాద్రుమంబు యోజనోన్నతంబై నిత్యపుష్పఫలంబుల సొంపు మిగిలి సిద్ధచారణగణములకు నెలవై యుండు. అచ్చటిజను లామ్రానిపండ్లతేనియఁ ద్రావి నిత్యయౌవనంబు, నత్యంతసౌందర్యంబును, భాసమానతేజంబును, దశవర్షసహస్రాయుఃప్రమాణంబునుం బడసి పరమసంతోషావిష్టులై చంద్రకాంతిదర్శనీయ లగుచంద్రవదనలతోడ నృత్యగీతవిహారంబుల సల్పుచుందురు. మేరుపర్వతపశ్చిమభాగంబు కేతుమాలవర్షం బనం బరఁగు. అందు జంబూషండప్రాంతమున మహాజనపదం బొక్కండు గలదు. అందలిపురుషులు సువర్ణవర్ణులు. స్త్రీ లప్సరస్తుల్యలు. వారు వీతశోకులు నిరామయులునై యత్యంతముదంబునం బొదలుచు దశవర్షసహస్రంబులు జీవింతురు. ఆరెంటినడుమం గలదేశం బిలావృతవర్షము నాఁబడు. అందే మేరుపర్వత మున్నయది. నీలపర్వతదక్షిణము నిషధపర్వతోత్తరము నగుదేశమున సుదర్శననామధేయంబైనజంబూవృక్షం బేకాదశశతయోజనోన్నతంబై పొల్చారు. దానిపండులు రెండువేలయేనూఱరత్నులనిడుపు గలిగియుండు. అవి మహాస్వనం బెసంగ రాలి పుడమిం బడునెడఁ దద్రసంబు మహాప్రవాహంబై జంబూనది యనుపేరఁ బరఁగి మేరుపర్వతంబునకుఁ బ్రదక్షిణంబుగా నుత్తరకురుదేశములందుఁ బాఱి యుత్తర సముద్రమునఁ గలియు. తద్రసంబుఁ ద్రావినవారు ముదిమి గాంచక తరుణారుణకిరణగణంబుఁ బోలినతేజమునఁ దేజరిల్లుచు క్షుత్పిపాసాయాసంబులం దవులక శాంతచిత్తులై పరమానందభరితులై యుందురు. అయ్యేటినీరు పాఱినచోట్లెల్ల సువర్ణం బగుటం జేసి పసిండికి జాంబూనదం బనుపేరు గలిగె. ఇంతటికిం గారణంబైనయాజంబూవృక్షంబుపేరనే యీద్వీపంబు జంబూద్వీపం బనం బ్రఖ్యాతి వహించె. మాల్యవత్పర్వతశిఖరంబున సంవర్తకనామధేయంబైనకాలానలంబు వెలుంగుచుండు. బ్రహ్మలోకావాప్త్యర్థము తపస్సు చేసి యది యించుకకొలఁతమైన దపఃపూర్తిఁ గావించువారై పంచాశద్యోజనాయతంబైనయమ్మాల్యవంతంబుశిఖరంబునందుఁ జేరినవా రూర్ధ్వరేతస్కులు షష్టిశతసహస్రసంఖ్యాకులు భూతరక్షణార్థం బరుణునిముందఱఁ బోవుచుండి షష్టిశతసహస్రవర్షంబు లాదిత్యకిరణతాపసంతప్తులై పదంపడి చంద్రమండలంబుఁ బ్రవేశింతురు. హేమకూటోత్తరభూమి హరివర్షం బన నొప్పు. హిమవదుత్తరదేశంబు కింపురుషవర్షం బన నెగడు. హైమవతంబనియు దీనికి నామాంతరము గలదు. హిమాలయ

దక్షిణభూమి భారతవర్షం బనం బొగడొందు భారతవర్షము మొదలుగ నుత్తరవర్షములందు జనుల కాయుర్బలకీర్తితేజోధనాదు లెక్కుడై యుండు. క్షీరసముద్రోత్తరంబున భూతయుక్తం బష్టచక్రంబు మనోజవంబు నగుశకటంబున వినోదపరాయణుండై నారాయణుండు వికుంఠనిధానుం డగుచు వైకుంఠాభిధానంబున విఖ్యాతుండై విహరించుచుండు ననిన విని విచిత్రవీర్యసూనుండు భారతవర్షము నకుంగా నాకొడుకులును బాండుపుత్రులునుం బోరాడం దొడంగిరికదా? ఇట్టి లుబ్ధులుం గలరే యనిన సంజయుం డతని కిట్లనియె.

సంజయుండు ధృతరాష్ట్రునకు భారతవర్షమునం గలవిశేషములం జెప్పుట.

రాజేంద్రా, పాండవు లత్యంతలుబ్ధులు గారు. వారు తమరాజ్యముం గోరిరి. నీకొడుకు శకునిమంత్రమున నెల్లయుం దాన యేలుదు ననిపూని యింతలు గావించె. వారి నన నేల? పృథుయయాతిత్వాకుశిబిఋషభనృగకుశికగాధిసోమకదిలీపాంబరీషప్రముఖు లగుతొల్లింటిరాజులుం బెక్కండ్రు పోరాడి యున్నతిం గనిరి. వివిధసౌభాగ్యనిధానం బయినయీభారతవర్షమున కానపడుట రాజులకు సహజంబ. దీనివిస్తారంబు వివరించెద వినుము. మహేంద్ర, మలయ, సహ్య, శుక్తిమ, ద్గంధమాదన, వింధ్య, పారియాత్రము లన నిందు సప్తకులపర్వతములు గలవు. వాని ననుసరించి యుచ్చావచంబు లగుపర్వతంబులు పెక్కులు గలవు. ఆపర్వతంబులందు రత్నకాంచనాదిసంభృతంబు లగుగనులును విశిష్టధనసంపాదకపాదపసాంద్రంబు లయినసానుభాగంబులునుం బలుదెఱంగుల నుదారవిభూతిం గావించు. గంగయుం, దుంగభద్రయు, యమునయు, నర్మదయు, బాహుదయు, విపాశయు, విదిశయు, వితస్తయు, గోదావరియుం, గావేరియుం, గృష్ణవేణియుం, దామ్రపర్ణియుం, బయోష్ణియు, సరయువును, శతద్రువును, నసియు, వరుణయు, వేత్రవతియు, వేదవతియు, నిరావతియు, శరావతియు, దృషద్వతియు, బృహద్వతియుం, బురావతియు, నోఘవతియుం, బాటలావతియుం, జర్మణ్వతియు, హిరణ్వతియు మున్నగునదులీభారతవర్షమున ధనధాన్యాదివిశేషం బొడంగూర్చు. కురు, పాంచాల, సాళ్వ, మద్ర, శూరసే, నాంగ, వంగ, కళింగ, మత్స్య, కుంతల, కోసల, చేది, కరూశ, సింధు, పుళింద, దశార్ణ, కర్ణాట, లాట, వరాట, సౌవీర, గాంధార, విద, ర్భావంతి, మగధ, మాళవ, నేపాళ, మేక, లోత్క, ళాంధ్రి, ద్రవిడ, కేరళ, చోళ, కొంకణ, యవన, కాంభోజ, కిరాత, బర్బర, విదేహ, కాశ్మీరప్రముఖంబు లగుబహుదేశములు సకలసౌభాగ్యసమన్వితంబులై వెలయుచుండు. ధర్మము దప్పక యేలువానికి భూమి కామధేనువుమాడ్కిం ద్రివర్గంబు సమకూర్చుం గావున భూమి కానపడి రాజులు దమలోం గుక్కలమాడ్కిం గాట్లాడుచుండుదురు. ఒకనాండైనను రాజులకుం దమకుం గలదేశమునం దనివి గలుగదు.

దానంజేసి కౌరవులుం బాండవులును భండనమునకుఁ గడంగి రనిచెప్పిన విని ధృతరాష్ట్రుఁడు భారతవర్షవాసులయాయుఃప్రమాణంబుఁ దెల్పు మనియడుగ సంజయుండు వెండియు నిట్లనియె. భారతవర్షవాసులయాయుఃప్రమాణము కృతాదియుగభేదనిమిత్తమునం గలుగు నెట్లంటేని. కృతయుగమున జనులు ధనవంతులు ప్రియదర్శనులు తపోనిష్ఠు లుత్తమసంతానులు ధార్మికులు సత్యవాదులునై యుండుదురు. రాజులు పరమధర్మాత్ము లత్యంతశూరులు మహాత్మాసాహసులు మహాబలులు సత్యవచనులునై యుండుదురు. అప్పు డాయుఃప్రమాణంబు నాలుగువేలయేండ్లు గలుగు. త్రేతాయుగమునందుఁ ద్రిపాదవిలసితం బైన ధర్మంబుఁ గావింతురు. రాజు లపుడు తఱుచుగఁ జక్రవర్తు లగుదురు. అపు డాయుఃప్రమాణంబు మూడువేలయేండ్లు. ద్వాపరయుగంబున ధర్మము సగము కొఱఁతవడు. రాజులు పరస్పరస్పర్ధంజేసి యుద్ధకాంక్షు లగుదురు. ఆయుఃప్రమాణంబు రెండువేలయేండ్లు. కలియుగంబునందు జనులు లుబ్ధు లనృతవాదు లీర్ష్యాపరులు క్రోధవశులునగుదురు. అపు డాయుఃప్రమాణం బొక్కరీతి వ్యవస్థితంబయి యుండదు. గర్భములయందే పెక్కండ్రు సత్తురు. ఒకవేళ నపుడు బ్రదికినను బుట్టినయల్పకాలముననే చత్తు రనిచెప్పిన విని యాంబికేయుండు సంజయుఁ జూచి జంబూద్వీపంబు తెఱంగు సెప్పితివి. తక్కటిద్వీపముల తెఱంగు తెలియఁ జెప్పు మనియడుగ నతం డతని కిట్లనియె.

### సంజయుండు ధృతరాష్ట్రునకుఁ బ్లక్షాదిద్వీపములఁ జెప్పుట.

జంబూద్వీపవిష్కంభము పదునెనిమిదివేలునాఱునూఱుయోజనంబులు. ఏతదావరణం బైనలవణసముద్రము ద్విగుణప్రమాణంబై యుండు. జంబూద్వీపంబుకంటె నుత్తరోత్తరద్విగుణప్రమాణంబు గలిగి ప్లక్షద్వీప, శాల్మలిద్వీప, కుశద్వీప, క్రౌంచద్వీప, శాకద్వీప, పుష్కరద్వీపంబులు లవణసముద్రంబుకంటె నుత్తరోత్తరద్విగుణప్రమాణసమన్వితంబు లయినయిక్షురస, సురా, ఘృత, దధి, క్షీర, స్వాదుజలమయంబు లయినసముద్రములయావరణంబున నొప్పుచుండు. అందుఁ బ్లక్షద్వీపమునఁ బ్లక్షవృక్షమును శాల్మలిద్వీపమున శాల్మలివృక్షంబు నత్యున్నతత్వంబున నొప్పి ప్రఖ్యాతి వహించె. కుశద్వీపము నిస్తులవిస్తారాయామం బైనకుశస్తంబంబుకలిమింజేసి తన్నామంబుఁ గాంచె. అందు సునామ, హైమ, కుముద, పుష్పవ, త్కుశేశయ, హరిగిరినామకంబు లయినకులపర్వతంబులాఱు నౌద్భిదంబు రేణుమండలంబు సురథాకారంబు కంబళంబు ధృతిమంతంబు ప్రభాకరంబు కాపిలంబు ననుసప్తవర్షములకు వ్యవస్థఁ గావించు. అచ్చటిజనులు గౌరవర్ణులు సుకుమారులునై మరణంబుఁ గాంచక నిత్యవిహారపరాయణులై యుండుదురు. చోరులు మ్లేచ్ఛులు నచ్చటనుండరు. క్రౌంచద్వీపంబు క్రౌంచనా

మకమహాపర్వతంబున విశ్రుతం బయ్యె. అందుఁ గ్రౌంచ, వామన, కాంధకా
రక, మైనాక, గోమంద, నిబిడనామకంబు లయినపర్వతంబులు కుశలమనోను
గోష్ణప్రావరకాంధకారకముని దేశదుందుభిస్వననామంబు లగుదేశముల విభాగిం
చుచుఁ బ్రశస్తిఁ గాంచె. శాకద్వీపము క్షీరపారావారపరివృతంబై పెంపుఁ గాం
చు. అందు శాకవృక్షం బత్యంతౌన్నత్యాయామములఁ బొల్పారు. అందు మేరు,
మలయ, రైవతక, శ్యామ, జలధార, కేసరి, కౌమారంబు లన నేడు కులపర్వ
తంబులు వర్షవిభాగంబుఁ గావించు. అందు మలయమున మేఘములు వర్తిల్లు.
జలధారసానుగతజలంబు గ్రహించి పర్జన్యుఁడు సకలద్వీపములందు వర్షించు.
రైవతకంబునందు రేవతీనక్షత్రంబు బ్రహ్మప్రతిష్ఠితంబై వెలయు. శ్యామపర్వత
ప్రాంతదేశములందు జనించినవా రత్యంతశ్యామవర్ణభాసురులై యుండుదురు.
మఱియు నాద్వీపంబున ననేకజనపదంబులు గలవు. అచ్చట జనులు స్వధర్మనిరతు
లాయుష్మంతులు జరామరణవర్జితులునై గౌరీరమణపూజాపరాయణచిత్తులై
యుందురు. అచ్చటినదుల లెక్కింపఁ గొలఁది లేదు గాని సీతా, కుమారీ, సుకు
మారీ, కావేరకా, మణిజలా, చక్షుర్వర్ధనికానామకంబు లయినమహానదు లాద్వీ
పమున కత్యంతసౌభాగ్యపావనత్వంబులఁ గావించు. అచ్చటిదేశముల గణింప
నలవి గాదు గాని మృగ, మశక, మానస, మందగము లనునాలుగుదేశములు
క్రమంబున స్వస్వధర్మానుష్ఠానపరాయణు లగుబ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రు
లకు నివాసంబై యుండు. అచ్చటివారు తమంతన సర్వధర్మముల నాచరింతురు
గాని రాజదండమున ధర్మము ననుష్ఠింతు రనుమాట లేదు. పుష్కరద్వీపమునం
దుఁ బుష్కరం బనుపర్వతంబు గలదు. అందుఁ బ్రజాపతి బ్రహ్మర్షిగణసముపాస్య
మానుండై వెలయుచుండు. ఆద్వీపమున సకలజనులకన్న మప్రయత్నసిద్ధంబై
యుండుఁగాని యత్నసాధ్య మనుట లేదు. ప్రజాపతి తానేయచట సర్వధర్మ
ముల నరయుచుండుఁ గావున నేకొఱఁతయుఁ గలుగదు. ఐరావతవామనసుప్ర
తీకప్రముఖంబు లయినదిగ్గజములు తత్తత్స్థానముల వసించియుండు. వానిపరిమా
ణంబు చెప్పఁ గొలఁది గాదు. అవి నిజపుష్కరముల నిశ్వాసంబువిడుచుట యెం
తయు నాశ్చర్యవినోదములఁ గావించు ననిన విని సూర్యచంద్రరాహుప్రమా
ణం బడిగిన ధృతరాష్ట్రునకు సంజయుఁడు మఱియు నిట్లనియె. * సూర్యునివి
ష్కంభంబు పదివేలయోజనంబులు. మండలము త్రింశద్యోజనంబులు. వైపుల్యం
బేఁబదియోజలంబులు. చంద్రవిష్కంభం బేకాదశసహస్రయోజనంబులు. మండ
లము ముప్పదిమూఁడుయోజనములు. రాహువువిష్కంభంబు ద్వాదశసహస్ర
యోజనంబులు. వెడల్పు ముప్పదియాఱువేలయోజనంబులు. నిడుపఱువదియోజ

* ఈవిషయమునఁ బురాణములకు సూర్యసిద్ధాంతమునకును మిక్కిలి భేదము గానవచ్చుచున్నది.

నంబులు. ఇంతప్రమాణంబు గలుగుటంజేసి రాహువు సూర్యచంద్రుల నాచ్ఛాదింపుచున్నవాఁడు. సప్తద్వీపమండితం బయినభూమండలంబు తెఱంగు సాకల్యముగ నెఱింగినయతఁ డాయురారోగ్యబలకీర్తితేజంబులం బడయు నతనిపితృదేవతలుం దృప్తు లగుదు రనిచెప్పినపదంపడి ధృతరాష్ట్రుఁడు సంజయా, యిఁక నీవు భండనాంగణంబున కరిగి కయ్యము తెఱంగు చూచికొనిర మ్మనిపనుచుటయు నతం డట్ల యని యరిగె.

ధృతరాష్ట్రుఁడు భీష్ముఁడు శరతల్పగతుం డగుట విని దుఃఖించుట.

అత్తెఱంగున ధృతరాష్ట్రుని వీడ్కొని యరిగి సంజయుండు సమరప్రకారంబు సూచుచుండి కొన్నినాళ్లకు మగిడి వచ్చి చింతాపరాయణుండై యున్నయాంబికేయు నుచితప్రకారంబునఁ గాంచి మ్రొక్కి మహారాజా, యేను సంజయుండను సంగ్రామరంగంబునుండి వచ్చితిఁ గురుపితామహుం డైనశాంతనవుఁడు పడియె నని విలాపంబు సేసి సకలయోధవరిష్ఠుండు సర్వధానుష్కగరిష్ఠుండు నగుభీష్ముఁడు నేఁడుశరతల్పగతుం డయ్యె. ఎవ్వనిబీరమ్ము నమ్మి నీకొడుకు జూద మాడెనవ్వాఁడిమగండు శిఖండికాండజాలవిద్ధుండై పడియె. కాశిరాజుకన్నియలస్వయంవరంబుతఱి లాఁతులతోడ్పాటించు కేనియు లేక తా నొక్కరుండ యెల్లరాజుల నోడించినమహారథుఁడు నేఁడోడె. అంబానిమిత్తమునఁ బరశురామదేవునితోడఁ బెక్కునాళ్లెక్కటెక్కటికయ్యము సేసి తుది నతనికి గెలువ నలవిగాక గండుమిగిలినమేటివిల్కాఁడు నేఁడు శిఖండికి లోఁగె. శౌర్యమున మహేంద్రునకు సాటియు స్థైర్యమున హిమవంతునకు దీటును గాంభీర్యమున సముద్రునకు జోడును శాంతిని భూదేవి కీడును నగునాభారతకులధుర్యుండు శరజాలంబు కోఱలుగా విల్లు నోరుగా ఖడ్గములు నాలుకలుగా నరసింహుఁ డనం దగుఁగాని సామాన్యుఁ డగునే? తనవిక్రమంబున కులికి పాండవసైన్యంబు సింహముఁ జూచినగోగణంబుచందంబునఁ జిందఱవందఱగాఁగ నం దొక్కొక్కనాఁటికిఁ బదివేవురయోధవరులం జంపుచు లోకభీకరకృత్యములఁ గావించుచుఁ బదినాళ్లు నీకొడుకుసేనం గాచి భీష్మసూర్యుఁ డస్తమించె. నీదుర్మంత్రణంబునంజేసి యమ్మహానుభావుఁడు వాతభగ్నపాదపంబుచాడ్పునఁ బాంచాలకుమారహతుండై యంపపాన్పునం బడియె నని సంజయుం డెలుంగెత్తి పెద్దయు నాక్రందనంబు సేసి చెప్పిన విని ధృతరాష్ట్రుండు శోకావిలమానసుండై పెద్దయుంబ్రొద్దు పలుకకుండి శిశిరోపచారంబుల సేదదేఱి సంజయున కిట్లనియె. కురుకులధురంధరుం డైనభీష్ముఁ డెట్లు శిఖండిచే హతుఁ డయ్యె? వాసవతుల్యుం డైనవాతండ్రి యెట్లు రథంబునుండి నేలం బడియె? యమ్మహాత్ముఁడు లేకున్న నాకొడుకు లెట్లయిరి? గురువర్థంబు బ్రహ్మచారి యైనయమ్మహాప్రాజ్ఞుఁడు పడినపదంపడి మనవారిమనంబు లెట్లయ్యె? మహోత్సాహుఁడు

మహాబలుఁడు నగునానరవరుఁడు పడియె నని విన్నంతన నామనంబు వగలం బొగలుచున్నది. ఆబిరుదుమగండు పాండవసేనం జొచ్చుతఱి నెవ్వరు ముందఱ నరిగిరి? ఎవ్వరు వెంబడిం జనిరి? ఎవ్వరు నిల్చిరి? ఎవ్వరు మఱలిరి? ఎవ్వ రెదురు వచ్చిరి? భానుమంతుండు గాఢధ్వాంతంబునుంబోలె శత్రుసైన్యంబు విరియించు చున్నయన్నరనాథున కెవ్వరు దోడ్పడిరి. శరదంష్ట్రుఁడు ధనుర్వక్త్రుఁడు ఖడ్గజిహ్వుండునై ఘోరాకారమునం బొల్చుచుఁ దనమునుముఁ దఱుగునాతండ్రిని భండనంబునఁ బాండవయోధు లెట్లు లడ్డగించిరి? శరజాలంబున శత్రుసైన్యంబునం దలలు రాల్చుచున్నయయ్యతిరథోత్తముం బడఁ ద్రోయింపఁ గౌంతేయుం డెట్లునేర్చె? కాలానలంబువోలెఁ దీవ్రప్రతాపంబున మండుచుఁ బగఱఁ గాల్పఁ జాలినయాభీష్మభానుఁ డస్తమించునంతకు నాపదినాళ్లు పాండవసైన్యం బేపాట్లు పడియె? నాదుర్మంత్రమున నే యమ్మహావీర్యుఁడు గాలికి విఱుగుద్రుమానిమాడ్కి నేలకు వ్రాలె. తనపోరాడినపదినాళ్లును బర్జన్యునట్లు శరవర్షముఁ గురియించుచు నెదిరిడెందము బెండువడం జేయునా భీమపరాక్రము నెట్లు పాంచాలసైన్యంబు మార్కొనం జాలె? పాండునందను లెవ్విధిం బోరాడిరి? ద్రోణకృపాశ్వత్థామలు బ్రదికియుండఁగనే దేవతలకైనం జెనకరానిమాతండ్రిని శిఖండి యెబ్భంగిం బడఁద్రోచె? పరశురామదేవునితోడ నిరంతరస్పర్ధ సేయుచు నతని కోడనివీరశేఖరుండు శిఖండి కోడె నని విన్నంతన డెందమునఁ గొందలంబు సందడించెడి. శిఖండి పాండవరక్షితుండై మాతండ్రిపయిం గాండజాలంబుఁ బరఁగించునెడ మనవారెల్ల నెస్పరికించి చూచిరే? దుర్యోధనుఁడు దగినమానుసులఁ దోడుపనుపడే? మహార్వఘోషం బుఱుములుగా శరములు చినుకులుగా నమ్ము లరివోయునెడం గలుగునినదంబు పిడుగులుగాఁ గార్ముకగులు తెఱంగునం జెలంగి పాండవపాంచాలయోధుల నింద్రుఁడు దానవులంబోలెఁ బొరివుచ్చుచుండ శిఖండి యెట్టు లెదిరించి భండనంబు సేయం జాలె? బాణగదాఖడ్గములు మొసళ్లుగా విండ్లు తరంగములుగా గుఱ్ఱములు సుళ్లుగా నేనుఁగులు కొండలుగాఁ గాల్బలంబు మీలుగా శంఖదుందుభిప్రముఖవాదిత్రనిస్వనంబు ఘోషంబుగా నొప్పుచుఁ బగవారిచతురంగసైన్యముల ముంచుచున్న శాంతనవసాగరంబు పైపైఁ గ్రమ్ముచుండ నెవ్వరు చెలియలికట్టవోలె నాఁగిరి? దుర్యోధనహితార్థంబు మాతండ్రి యేమేమి సేసె? డాపటను వలపటను వెనుకను ముందఱను నతని కెవ్వరు కావలియై నడిచిరి? అందఱు మహారథులు గావలిగాఁ గిఁ గడిమి మెఱయు నయ్యాపగేయుం గెలువఁ బాండవు లెట్లునేర్చిరో యది దైవంబ యెఱుంగు. శత్రుసేనాసాగరంబు నిస్తరింపఁగఁ బెనుదీవి యని భీష్ముని నమ్మి నాకొడుకులు పగ పాటించి పాండుపుత్రుల సరకుసేయరైరి. తొల్లి దేవదానవులకు సమరం బగుడు దేవేంద్రుఁ డీశాంతనవు

నితోడ్పాటు గలుగ దనుజుల జయించె. అంతటివాఁడు నేఁడు పడియె నని నీవు చెప్పెదవు. అది యెట్లొకో యెఱుంగరాదు. ఈ దేవవ్రతుండు పుట్టినపుడు శంతనుమహారాజు శోకదైన్యమఃఖముల విడిచి యెంతయుసంతసంబునం బొదలెనఁట. లోకవిఖ్యాతుఁడు మహాప్రాజ్ఞుఁడు స్వధర్మనిరతుఁడు పరమపావనుఁడు వేదవేదాంగతత్వజ్ఞుఁడు సర్వాస్త్రవేది వినయవంతుఁడు శాంతుఁడు నగుశాంతనవుండు పడియె నని వినవలసివచ్చెఁగదా. లోకమునం గలరాజలోకమెల్ల గెలిచినజామదగ్న్యుని కజేయుం డగునాపగేయుం గెలిచినశిఖండి యెంతటిపరాక్రమవంతుఁడో? ఇట్లన నేల? కాలవశంబున శిఖండి భీష్ముం గెలిచె ననుమాట పుట్టెఁగాని పరికించిచూచిన వివిధాస్త్రవేది యగుశాంతనవుఁ డెక్కడ? పాంచాలబాలుఁ డెక్కడ? అస్త్రవిజ్ఞానంబు శౌర్యంబు తపోనిష్ఠ నిస్సమానమేధ ధైర్యము దానము మున్నగునవి యెన్ని యున్నను మృత్యువుఁ దప్పింపఁ జాలవు. భీష్ముఁడు పడినపదంపడి మనసేన మగఁడు సచ్చినయువిదమాడ్కి ని గోపాలుఁడు లేనిమందచందంబుననుం గతి దప్పకుండునే? అతండు తెగినపదంపడియును మనవారిమనంబు లెట్లయ్యె? జీవితాశ యింకనుం బెట్టికొనియున్నవారే? భీష్ముపాటు మనవారి కగాధసలిలసాగరంబున నోడ మునిఁగినట్లు కాకుండునే? నాకొడుకు లమ్మహాత్ముపాటున కెంత యేడ్చుచున్నవారో, బ్రహ్మదేవుఁడు నాగుండె ఱాతఁ జేసెఁ గాఁబోలు. కాదేని చెవులు సూఁడునట్టియిట్టికష్టపుమాట విని యింకను మేనఁ బ్రాణముల ధరియించియుండుదునే? భీష్ముఁడు నాకొడుకుఁ గాచు నని పెద్దయు నమ్మియుంటి. అక్కటా! దైవదుర్విపాకం బిట్టి దవుట యెఱుంగనైతి. గాంగేయుఁడు తెగినంతన తక్కుంగలవా రందఱు తెగినవారకా నిశ్చయించెద. ఆదిత్యునస్తమయంబుఁ బోలిన భీష్ముపాటునకు దుర్యోధనుఁ డెట్లయ్యె? కటకటా! పితామహుం జంపి పాండవులు రాజ్యము సేయఁ జూచిన వారికోర్కి కొనసాగుటెఱుంగమయ్యె. పరికించిన నధర్మంబు ధర్మంబుకంటె బలవంతం బయినచందము దోఁచుచున్నది. పాండవుల నన నేల? మనవారును దేవవ్రతుం జంపించి పుడమియెల్లఁ దార యేలఁగఁ జూచిరి కదా. సర్వధర్మములకంటె క్షత్రధర్మం బింతకష్టం బగునే? కొడుకు లెట్లగుదురో యని చింతిల్లుచున్ననాశోకమును నీవు భీష్ముపాటు సెప్పి నేయి వోసి యగ్గిని మండఁ జేయుతెఱంగున నెంతయుఁ బ్రదీప్తంబు గావించితివి. ఇఁక నాకుఁ జిత్తశాంతి యెక్కడిది? పితామహుపాటునకు నాకొడుకు లెంత కుందుదురో? ఇఁక నెంత విననున్నవాఁడనో? తెలియఁ జెప్పుము. దుర్యోధనునిదుర్బుద్ధిం గదా యింతలు పుట్టె. పాండవులకుఁ బితామహునితోడఁ బదినాళ్లు పో రెట్లు నడిచె? దుర్యోధనుఁడు దుశ్శాసనుఁడు కర్ణుఁడు శకునియు నామీఁద నేమి చేసిరి? చతురంగసైన్యకళేబరసంభృతంబై వివిధసాధనపరిపూర్ణంబై యున్నయాసంగ్రామ

సభ నాజూదరు లెట్లు సొచ్చిరి? ఆజూదమునఁ బ్రాణముఁ బణముగా నొడ్డి యె
వ్వరు తెగించి పోరాడిరి? ఎందు నీతి దప్పకుండె? ఎందుఁ దప్పె? జయించుతలం
పున నిలింపనదీతనూభవుం డెయ్యది సేసె? సంగరం బెబ్భంగి నెనంగె? ఏయేస
మయముల నెవ్వ రెవ్వ రే మేమి సేసిరి? అంతయుఁ దేటపడం జెప్పు మని విషా
దవేదనాభరితుండై ధృతరాష్ట్రుం డడుగుటయు సంజయుండు మహారాజా,
యిట్లు లడుగ నీక తగుఁగాని యొరులకుఁ దగదు. నీయనయంబునం బుట్టినచే
టును గొడుకుపై నేల యారోపించెదవు? గొడుకును నిగ్రహింప నెల్లక పాండ
వుల నన్నిపాట్లు పఱుచుటంగదా యిపుడు నీ కీవిషాదంబుఁ గుడువవలసివచ్చె.
శోక ముడిగి సాకల్యంబుగ వినుము. భవజ్జనకుం డైన వేదవ్యాసమునీంద్రునకుఁ
బ్రణామంబు లాచరించి యత్తపోధనవరుం జిత్తమున నిల్పికొని కన్నంతయు
విన్నంతయు మునివరప్రభావమున నెఱింగినంతయు భారతసమరప్రకారంబుఁ బరి
పాటిఁ దేటపడం దెల్పెద నాకర్ణింపు మని పలికి ప్రత్యక్షపరమార్థుం డైనయ
ప్పారాశర్యమునీంద్రుని పరమభక్తిమైఁ జిత్తమున ననుసంధించి యిట్లని చెప్పం
దొడంగె.

సంజయుఁడు ధృతరాష్ట్రునకు భారతరణప్రకారముఁ జెప్ప నారంభించుట.

మహారాజా, యానాఁడు నిన్ను వీడుకొని నేను మనదండు సొచ్చి గాం
గేయాదిపరివృతుండై కొలువున్న కురురాజు నుచితప్రకారంబునం గాంచి తదీ
యాదరంబునకు భాజనంబనై కొలిచియుంటి. అనంతరంబు సమరవిషయసంభాష
ణంబులు నడుచుచున్నంత సుయోధనుఁడు తమ్మునిం బిలిచి దుశ్శాసనా, పెద్దకా
లంబు పూఁచిపట్టినకౌరవపాండవసంగ్రామంబు నేఁటి కొడఁగూడినది. ఎల్లవా
రును గురుపితామహుం డైనభీష్మునకుఁ గావలియై నడుచుట యిప్పటికిఁ గర్త
వ్యంబు. ఇమ్మహాత్మునకు మన మందఱముం గావలియుంటిమేని మనల నందఱను
గాచు. ఇంత యేమిటి కంటేని, సత్యవ్రతుం డయినయీ దేవవ్రతుండు స్త్రీపూ
ర్వుండయినశిఖండిని దాను మార్కొనమి మనయుద్యోగసమయమునంద తెలి
యఁ జెప్పినవాఁడుగదా. పాండవులు నెవ్విధంబుననైనను శిఖండిని భీష్మున కెదురు
గావింపఁ జూతురు. యుధామన్యూత్తమౌజసులు వామదక్షిణచక్రరక్షకులుగాఁ
గృష్ణసారథికరథారూఢుం డైనబీభత్సుండు తాన యప్పాంచాలపుత్రునకుఁ గావ
లియై నడుచుఁ గావునఁ బ్రాచ్యదాక్షిణాత్యప్రతీచ్యోదీచ్యప్రముఖు లగుమనవా
రందఱు పితామహరక్షణతాత్పర్యంబున శిఖండిని జంపవలయు. దీనికంటె మన
కొండొకకార్యము ముఖ్యముగాఁ దోఁపదు. ఇంచుకేనియు నేమఱిన రక్ష లేనిసిం
హమును నక్క యెట్టు లట్టుల పితామహుని శిఖండి చంపుటయుం బొసఁగుఁ
గావునఁ గొంచెమేనియు నేమఱక భీష్మరక్షణంబుఁ గావించునదియని యందఱకుం

దెలియఁ జెప్పు మనినియమించి కొలువు లేచి యారాత్రి యుచితప్రకారమునఁ గడపె. అంతఁ బ్రభాతం బగుటయుఁ గురురాజు దండు భండనమునకు వెడల నియోగించిన సేనాసన్నాహం బమర్పఁగ నొండొరుల కెఱింగించుదొరలసంరంభ వచననినాదంబును, సంగరోత్సాహసముల్లసితస్వాంతు లగుయోధవీరులయార్పులును, దంతావళబృంహితంబును, ఘోటకఘోషితంబును, రథనేమినిస్వనంబును, శంఖదుందుభిప్రముఖవివిధవాదిత్రగంభీరారవంబునుం గలిసి యొక్కటియై బ్రహ్మాండభాండము నిండించుచున్నంత సూర్యోదయ మగుటయు సైన్యంబులు సంగరాంగణంబునకు నడిచె. తత్ప్రకారంబు వినుము. అప్పుడు కాంచనకుథపరిష్కృతంబు లగునేనుంగులు మెఱుంగులతోడం గూడినమొగిళులతెఱంగునం జెలంగె. అరదములు నానావిధశస్త్రాస్త్రప్రముఖసాధనసంభృతంబులై యెంతయుఁ బలుపునం జేసి నగరంబులట్లు కరం బొప్పారె. విచిత్రవల్గితచతురంబు లగుతురంగంబులు తరంగములభంగిం బొలిచె. పదాతివర్గం బనర్గళప్రతాపదీపితంబై కాలకింకరనికరంబుచందమున నొప్పె. ఇత్తెఱంగున మొత్తం బయినచతురంగసేనావ్యూహంబు సాహసోత్సాహసన్నాహదోహళంబై శత్రువులనుమృగములం బట్టఁగ నొడ్డినవలచాడ్పున నెంతయు దర్శనీయం బయ్యె. అట్టియెడఁ దీవ్రప్రతాపదీపితుం డైనశాంతనవుండు శ్వేతోష్ణీషకవచధరుండై హేమతాళకేతనవిరాజితం బైనయుత్తమరజతరథము నారోహించి శారదనీరదమధ్యమున వెలుఁగుపూర్ణచంద్రునిచందమునఁ బొల్పారుచు సర్వసేనాధిపత్యంబు నిర్వహింపఁ బూని శ్వేతచ్ఛత్రచామరప్రముఖవివిధోపచారభాసురుండై ముందఱ వెడలె. ఆచార్యముఖ్యుం డైనద్రోణాచార్యుఁడు శోణతురంగయోజితంబును గాంచనవేదికాకమండలువిరాజితంబును నగుకనకరథం బారోహించి చనియె. శారద్వతుం డైనకృపాచార్యుండు సౌవర్ణగోవృషకేతనంబు మెఱయ నరిగె. పద్మవర్ణుం డైనయాచార్యపుత్రుండు సింహధ్వజంబు గ్రాల నడిచె. రజతవరాహకేతనోల్లసితుం డైనజయద్రథుండు లక్షరథంబు లెనిమిదివేలయేనుంగు లఱువదివేవురుగుఱ్ఱపురౌతులుం దన్నుఁ బరివేష్టించికొలువ నరిగె. కళింగేశ్వరుండు పావకకేతుభాసితుండై యఱువదివేలరథములు పదివేలయేనుంగు లమితతురగపదాతివర్గంబును బెరసి రాఁగఁ జనియె. ప్రాగ్జ్యోతిషపతి యగుభగదత్తుండును, గేతుమంతుండును, విందానువిందులును, శైబ్యుఁడునునిజగజముల నారోహించి యాత్మసైన్యములతోడనడిచిరి. బాహ్లికుండును, సోమదత్తుండును, భూరిశ్రవసుండును, గర్ణపుత్రుండును, శ్రుతాయువును, జిత్రసేనుండును, శల్యుండును, శలుండును, వికర్ణుండును, గాంభోజపతి యగుసుదక్షిణుండును, క్షేమధన్వుఁడును, గోసలేశ్వరుం డయినబృహద్బలుండును మాహిష్మతీపురీనాథుం డైననీలుండును,

యాదవవర్యుం డైనకృతవర్మయుఁ, గేకేయులును, గాంధారరాజగుశకు
నియుఁ, ద్రిగర్తేశ్వరుం డయినసుశర్మయు సాళ్వసౌవీరశూరసేనాదు లగుప్రా
చ్యదాక్షిణాత్యప్రతీచ్యోదీచ్యు లగునానాదేశాధీశులును దమతమసేనావ్యూ
హంబు గొని తోడ నడిచిరి. ఇవ్విధంబునం బదియక్షౌహిణు లంతటం బెరసి
రాఁగఁ బదునొకండవయక్షౌహిణుతోఁ గురుక్షోణీవల్లభుండు మణిమయనాగ
కేతనంబు గ్రాలఁ గాంచనాలంకారభాసురం బైనగంధసింధురం బెక్కి ఛత్ర
చామరప్రముఖరాజయోగ్య భద్రోపచారంబులు సొంపుపెంపు సంపాదింప
మణిమయభూషణద్యుతిజాలంబు మెఱయ వివిధసాధనసంభృతు లయినదుశ్శాస
నదుర్విషహదుర్ముఖదుస్సహప్రముఖు లగుకురుకుమారులు ఛత్రంబులను వాహ
నంబులను గేతనంబులను వఱలి చుట్టుం బరివేష్టించి చనుదేర వందిమాగధసం
దోహస్తుతిపాఠములఁ జిత్తగించుచుఁ బరమామోదభరితుండై వెడలె. ఇట్లు
నీకొడుకుసైన్యంబులు గూడుకొని ధనుర్బాణగదాశక్తితోమరఖడ్గపరశుభిండివాల
శూలప్రముఖనానాయుధనివహసంభృతం బై కయ్యమునకుఁ గాలుద్రవ్వుచుండె.
నాఁడు చంద్రుఁడు*మఖావిషయగతుం డయ్యె. గ్రహంబులు మింటఁ బరస్పర

---

* మఖావిషయగతుఁ డనఁగా మఖాశబ్దముచేఁ దత్సహచరు లగుపితృదేవతలు ప్రకృతము
నందు గ్రహింపఁబడుచున్నారు. వారివిషయము పితృలోకము అచ్చటికి సన్నిహితుఁ డయ్యెననిభా
వము. స్వర్గలోకమున కేగువారికి దివ్యదేహలాభము చంద్రాధీన మని శాస్త్రప్రసిద్ధము. మఖావి
షయగతుఁ డనుపదమున క్లిష్టే యర్థము చెప్పఁ దగుఁగాని మఖానక్షత్రమును బొందె ననిచెప్పఁ
గూడదు. అట్టిచో మఖానక్షత్రమందు యుద్ధారంభ మని యేర్పడును. అది పూర్వోత్తరసందర్భ
మునకు నితరప్రమాణములకును విరుద్ధము. ఎట్లనిన ? "శ్లో॥ చత్వారింశ దహాన్యాస న్ద్వేచ మేనిస్సృ
తస్యవై । పుష్యేణ సంప్రయాతోస్మి శ్రవణేపునరాగత" యను శల్యపర్వవచనమునకు విరోధము
గలుగుచున్నది. అది యుద్ధమునకు ముందు తీర్థయాత్ర పోయి మగిడి భీమసేనదుర్యోధనులగదాయు
ద్ధము చూడ వచ్చినబలరాముని వచనము. అతఁడు చూడవచ్చినదినము యుద్ధారంభము మొదలు
పదునెనిమిదవది యగుచున్నది. నాఁడు శ్రవణనక్షత్రమని "శ్రవణేపునరాగత" యనువాక్యముచేత
వ్యక్తమగుచున్నది. కావున శ్రవణమునకు ముందు పదునెనిమిదవనక్షత్రమునాఁడు యుద్ధారంభ
మనినిర్ణయించు టుచితము. శ్రవణమునకుఁ బూర్వము పదునెనిమిదవనక్షత్రము మృగశీర్ష మగుచు
న్నది గాని మఖ కాదు. మఱియు "శ్లో॥ హేమంతే ప్రథమేమాసి శుక్లపక్షత్రయోదశీ। ప్రవృత్తం
భారతం యుద్ధం నక్షత్రేయమదైవతే॥" యనుభారతసావిత్రివచనముచేతను మృగశీర్షనక్షత్రమునందే
యుద్ధారంభము స్పష్టము. ఇక్కడ యమదైవత మనఁగా యుగ్మదైవత మనియర్థము. యమశబ్ద
మునకు జంట యనునర్థమును లోకప్రసిద్ధము. మృగశీర్ష పూర్వభాగము శుక్రదేవతాకమనియు నుత్త
రభాగము బుధదేవతాకమనియు వ్యవస్థ గలదు. గావున మృగశీర్షనక్షత్రము యుగ్మదైవత మగుచు
న్నది. ఇట్లు గాక యమదైవతశబ్దమునకు యముఁడు దేవతగాఁగల భరణీనక్షత్ర మనియర్థము చెప్పి
నచో శ్రవణమందు యుద్ధసమాప్తి నయనువచమునకు విరోధము వచ్చును. భరణికి శ్రవణ మిరువది
యొకటవనక్షత్ర మగుచున్నదిగాని పదునెనిమిదవది గాదు. యుద్ధారంభముమొదలు పదియవనాఁడు
శరతల్పగతుఁ డైనభీష్మునివిషయమున "శ్లో॥ అర్జునేనహతోభీష్మోమాఘమాసేసితాష్టమీ" యనియుఁ
బదియేనవనాఁడు నిహతుఁ డైనద్రోణునివిషయమునఁ "శ్లో॥ త్రయోదశ్యాంతు మధ్యాహ్నేభాగ

సంపాతమున వెలిగె. ఉదయావసరమున సూర్యుఁడు జ్వలితశిఖాభాసితుండై ద్విధాభూతునిరీతిఁ జూపట్టె. సూర్యున కభిముఖముగ వాయసనృగాలము లఱచె. మఱియునిట్టియుత్పాతంబులు నీ వారిపరాభవంబునకు సూచకంబులై తోఁచె.తోఁపకేల యుడుఁగు? భీష్మద్రోణులు ప్రతిదినంబును వఱువాతన లేచిపాండుపుత్రులకు జయంబు సేకూఱుఁగాక యని పల్కుచుండుదురు. మీయొద్ద నుండుటకారణంబుగా సమయంబుమెయిఁ బోరాడుదురు. ఇవ్విధమున సేనలన్నియుఁ గూడియున్న యవసరంబున శాంతనవుఁడు రాజులనందఱ నెలుంగెత్తి పిలిచి సంగ్రామంబు క్షత్రియులకు వివృతస్వర్గద్వారంబు. దీన నింద్రబ్రహ్మలోకముల నధిగమింపుఁడు. ఇయ్యది క్షత్రియులకు శ్రుతిబోధితధర్మంబు. తొల్లింటి పెద్దలు దీనినే యాచరిం

ద్వాజోనిపాతిత'' యనియును భారతసావిత్రియందే యుండుటవలన ''శ్లో॥ హేమంతే ప్రథమే మాసిశుక్లపక్షత్రయోదశీ'' యనుచోట శుక్లపక్షత్రయోదశీ యనుపదమునకుఁ త్రయోదశీయుక్త మగుచతుర్దశి యర్థ మని నిర్ణయింపవలయు. ''శ్లో॥ అర్జునేనహతో భీష్మోమాఖమాసేసితాష్టమీ'' యనునెడ మాఖమాసమనఁగాఁ బౌషమాసమని యర్థము నిర్ణయింపవలయు. అప్పటికి సూర్యుఁడు మకరమున కయనించియుండుటవలన మాఖమాస మనియచ్చట జెప్పఁబడినది. ఇట్లు నిర్ణయించుటవలన.నే పదునాలవనాఁటిరాత్రియుద్ధమందు ''శ్లో॥ త్రిభాగమాత్రశేషాయాం రాత్రౌ యుద్ధమవర్తత'' యను ద్రోణపర్వవచనము సంగత మగుచున్నది. మార్గశీర్షశుద్ధచతుర్థశినాఁడు యుద్ధారంభము కావున నాఁటికిఁ బదునాలవదిన మగుకృష్ణపక్షద్వాదశినాఁటిరాత్రి చంద్రోదయకాలమునకు మూఁడుముహూర్తములుమాత్రము శేషించియుండుట సరిపడుచున్నది. భగవంతుఁడు సంధికి హాస్తినపురమునకుఁ దఱలినసమయము నిర్ణయించునపుడు ''శ్లో॥ కౌముదేమాసిరేవత్యాం శరదంతేహి మాగమే'' యను నుద్యోగపర్వవచనముచేతఁ గార్తికశుక్లద్వాదశీ రేవతీనక్షత్రమునఁ గృష్ణుఁడు సంధికిఁ బోయెనని తెలియుచున్నది. ''శ్లో॥ ప్రయాధ్వం వై కురుక్షేత్రం పుష్యోద్యేతి పునఃపున'' యనువచనమున మార్గశీర్షకృష్ణపంచమీ పుష్యనక్షత్రమున సేనానిర్యాణ మనియేర్పడుచున్నవి. ఆపంచమినాఁడే కృష్ణుఁడు సంధి కాక మఱలి వచ్చుచుఁ గర్ణునితో ''శ్లో॥ సప్తమాచ్చాపిదివసాదమావాస్యాభవిష్యతి। సంగ్రామం యోజయేత్తత్రతామాహుశ్శక్రదేవతా'' మ్మని నేఁటి కేడుదినములు గడచిన పిదప నెనిమిదవనాఁ డమావాస్య వచ్చు నని చెప్పుటవలన నాకృష్ణపక్షము రెండుతిథులు క్షయించి త్రయోదశదినాత్మక మని తెలియవచ్చుటవలన నది మహోత్పాత మని యెఱుంగునది. ''సంగ్రామంయోజయేత్తత్ర'' యనువాక్యమునకు నాఁడు యుద్ధశోభనకార్యము చేయఁ దగునని యర్థము. ''తామాహుశ్శక్రదేవతా'' మ్మనుటవలన నాయమావాస్యనాఁడు జ్యేష్ఠానక్షత్రయోగము తిథిక్షయమున నెనుత్పాతముగా నక్షత్రద్వయక్షయము సంభవించుటవలన నుపపన్న మగుచున్నది. పూర్ణిమాంతమమాస మనువ్యవస్థను బట్టి యిక్కడఁ గార్తికశుక్లద్వాదశినాడు కృష్ణప్రయాణమనియు, మార్గశీర్ష కృష్ణపంచమినాఁడు సేనానిర్యాణమనియు, మార్గశీర్షశుక్లచతుర్దశినాఁడు యుద్ధారంభమనియుఁ, బౌషకృష్ణాష్టమినాఁడు భీష్మశరతల్పగమనమనియుఁ, బౌషకృష్ణద్వాదశినాఁడు రాత్రియుద్ధమనియు, నాత్రయోదశినాఁడు మధ్యాహ్నమున ద్రోణాచార్యుఁడు హతుఁడయ్యె నని యుఁ జెప్పఁబడినది. దర్శాంతము మాస మనునీదేశసంప్రదాయప్రకారము కార్తికశుక్లద్వాదశినాఁడు కృష్ణప్రయాణమనియు, నాకృష్ణపంచమినాఁడు సేనానిర్యాణమనియు, మార్గశీర్షశుక్లచతుర్థశినాఁడు యుద్ధారంభమనియు, నాకృష్ణాష్టమినాఁడు భీష్మశరతల్పగమనమనియు, నాకృష్ణద్వాదశినాఁడు రాత్రియుద్ధమనియు, నాత్రయోదశినాఁటి మధ్యాహ్నమున ద్రోణవధయనియు నెఱుంగునది.

చిరి. కావున విన్నదనము మాని కడిందిమగంటిమిం జేర్చి పోరు సేయుఁడు. నహుషనాభాగప్రముఖు లిట్టికృత్యముల నాచరించియే సిద్ధులయిరి. రోగమున నింటఁ జచ్చుట క్షత్రియులకు ధర్మంబుగాదు. వెనుదీయక విక్రమించి సంగరాంగణంబున శస్త్రనిహతుఁడగుటయే సనాతనం బయినధర్మం బనిచెప్పిన నందఱును దేవవ్రతువచనం బభినందించి చేకొని తమతమసైన్యములఁజేరిరి. అప్పుడు గాంగేయుండు గాంధారేయుం బిలిచి నేను సమరము సేయునందాఁక కర్ణుఁడు పుత్రమిత్రభ్రాతృవర్గముతోడఁ దొలఁగియుండువాఁ డని చెప్పినవిని సుయోధనుండు పితామహా, యిట్లు లాఁతులతోడ్పాటు కొంచమేనియుఁ గోరక పోరితంబు సేయ నీకుఁ దక్కమఱియొక్కనికిఁ దలంపనైన నలవియే యని బహుప్రకారంబుల నగ్గించి యట్లచేసి మనసేనకు నుచితవిధానంబున వ్యూహముఁ గావింపవే యని ప్రార్థించుటయు భీష్ముఁడు పడమరమొగంబై తానగ్రభాగంబున నిలిచి వలపట శకయవనకిరాతసేనాపరివృతు లయినకృపాశ్వత్థామలు దాపట శల్యకృతవర్మలు వెనుక బాహ్లికసోమదత్తభూరిశ్రవశ్శలాదులును నడుమఁ గురుకుమారులును గాంధారరాజును సైంధవుండును గజయోధు లయినసాళ్వకేకయులుం బరివేష్టింపఁ గురుధరావల్లభుండు నతనిముందఱ నర్జునుం జంపుదు మతనిచేఁ జత్తు మింతియ కాని యొండులే దనుశపథములు పలికి సంశప్తకులనఁ బ్రఖ్యాతులై సుశర్మమొదలుగాఁగల పదివేవురు త్రిగర్తపతులును బశ్చిమభాగంబున సర్వసేనలకుఁ గావలిగా నాచార్యుండును గలయ నెడనెడం దక్కినవారు నిలుచునట్లుగా నియమించి ముందఱ లక్షగజంబులు నొక్కొకయేనుంగునకు నూఱేసితేరులు నొక్కొకతేరికి నూఱేసిగుఱ్ఱంబులును నొక్కకగుఱ్ఱమునకుఁ బదుగురుపదుగురు విండ్లవారు నొక్కొకధనుర్ధరునకుఁ బదుగురు పదుగురు కేడెములవారు నడ్డముగ నిలుచునట్లు మానుషవ్యూహంబమర్చిన నావ్యూహము సర్వతోముఖంబై యెల్లవారికి నద్భుతావహకం బయ్యె నిట్లు నీకొడుకులసైన్యము భండనమున కుద్యోగించుచు సాగరంబు భంగి ఘూర్ణిల్లుచుండెనని చెప్పినవిని ధృతరాష్ట్రుండు సంజయా, యేకాదశాక్షౌహిణీబంధురం బైనమనవారిసైన్యంబును బాండవు లెవ్విధంబున నల్పసైన్యమున మార్కొనఁజాలి రని యడుగ నతం డతని కిట్లనియె.

### పాండవయోధులుయుద్ధమునకు వెడలుట.

మనవారు సైన్యసమేతంబుగఁ గలనికి నడచునంతకుఁ బాండవాగ్రజుండు తమ్ములును నభిమన్యుప్రభృతికుమారులును సాత్యకివిరాటద్రుపదధృష్టద్యుమ్నశిఖండిచేకితానమగధసహదేవధృష్టకేతు ప్రముఖమహారథులును బాండ్యకేకయాదినానాదేశాధీశులును నుత్తమరథముల నారోహించి తమసేనాసమూహంబును సంగరోత్సాహంబు నుడివోనిసాహసంబును సమ్మదోల్లాసంబును నెఱయఁ గేత

నవ్రాతంబులు మెఱయ నెడనెడం బరివేష్టించి చనుదేర శంఖదుందుభిభేరీపణవ
కాహళగోముఖ ప్రముఖ వివిధవాదిత్రనిస్వనంబును గరిఘటాబృంహితంబును
దురంగమహేషితంబును రథనేమిఘట్టనధ్వానంబును వీరయోధసింహనాదంబును
వందిమాగధసందోహస్తుతపాఠరవంబునుం జెంపెసంగ శ్వేతచ్ఛత్రచామర ప్ర
ముఖరాజయోగ్యభద్రోపచారంబులు సెలంగ దేవసేనాపరివృతుం డైనమ
హేంద్రునిచాడ్పున నత్యుదారవిభూతి మెఱయుచు నెడనెడ శుభనిమిత్తములఁ
గైకొనుచు సాహసోల్లాసభాసురమానసారవిందుండై గోవిందుననుమతంబున
వెడలి పుడమిఁ గ్రక్కదల సప్తాక్షౌహిణీబంధురముగఁ జేర్చి సంగ్రామభూమి కేతెం
చి గాంగేయుండు వన్నినభవదీయసేనావ్యూహంబుఁ జూచి సవ్యసాచిం బిలిచి
చూచితే పితామహకల్పితం బైనయీధార్తరాష్ట్రసేనావ్యూహంబు. ఏకాదశా
క్షౌహిణీసం భృతంబైనతదీయసైన్యంబును మన మలంతిసైన్యముతో నందఱునొక్క
గట్టిమొనగట్టి పొదువవలయు. సైన్యమలంతియైయున్నను దోఁచినట్లెల్లఁ దోలఁగక
యెల్లవారును బిండుగట్టి యెడలేకపొదువునెడఁ బెద్దసేననైనం గెలువవచ్చు నని
బృహస్పతి దివస్పతికిం జెప్పె ననివిందుము. కావున నీవును మనసేన నట్లు నడి
పించినం బగఱ గెలువవచ్చు. గాంగేయకల్పితవ్యూహంబు భేదింపఁ జాలినతెఱం
గుగా నీవు మనసేన నొక్కవ్యూహంబుగఁ బన్నింపు మనినయన్నకు ధనంజయుఁ
డిట్లనియె. రాజసత్తమా శత్రుసైన్యంబు పెద్ద యని మనకు వెఱవం బని లేదు.
మనసైన్యంబు సారవంతంబు. వారిసేనలనెల్ల నుక్కడంప నొక్కవృకోదరుండ
చాలు. పెట్టనికోట యగునబ్బలియునిప్రాపునం జేసి మనసైన్యంబు మిగుల బలవం
తం బయ్యె. లయసమయప్రభంజనుచందంబున నవ్వీరవర్యుండు చెలరేఁగెనేని
యతనియెదుర నిలువ నెంతటివారుం జాలరు. వివిధయుద్ధోపాయవిశారదుం డైన
యయ్యోధవరుండు సేనమొగంబుననిలిచెనేని శత్రువులప్రతాపంబు క్షణమాత్రన
యుడుగు. దుర్యోధనాదు లగుధార్తరాష్ట్రులాశూరకంఠీరవుం గాంచిరేని కొదమ
సింగముఁ జూచినక్షుద్రమృగములట్లు వెఱచి నలుదెసలం బాఱుట నిక్కువంబు.
అయ్యుగ్రకర్ముని కెనవచ్చువాడు శత్రుసైన్యంబున నొక్కండును లేఁడు. దేవతలకు
దేవేంద్రుఁ డెట్టు లట్టులమన కతఁడు పెనుప్రాపు గలండు. అమ్మహాబలుండు గదఁ
జేతఁ బూనెనేని యిఁక నేఁ జెప్ప నేల? లోకమెల్ల నెఱుంగు వాని కెవ్వరును దల
సూప నోడుదురు. ధృష్టద్యుమ్నశిఖండిప్రముఖపాంచాలురు శౌర్యవిశాలురు.
శైనేయుండజేయుండువిరాటద్రుపదులు యుద్ధదుర్మదులు సౌభద్రహైడింబప్ర
ముఖకుమారు లసహాయశూరులు పాండ్యకేకయచేకితానాదియోధనికరం బరిభ
యంకరంబు కృష్ణసంరక్షణంబును భవదనుగ్రహంబునుం బడసిననేను దీఱరానిపని
నైనం జేయఁ జాలుదుననితలంచెద. శత్రుగణము గెలుచుతలంపు నీచిత్తముననిం

చుక గలిగెనేని యదితప్పక నెఱవేఱు అచలవ్యూహవిధానమున మనసైన్యమును మోహరించెద. నీవ్యూహమును దొల్లి దనుజసంహారసమయమునం బురందరుఁడు పన్నించి గెలుపుగొనియె నని విందు మనిచెప్పి వజ్రాఖ్యం బయినయయ్యచలవ్యూహంబుఁ బన్నుమని ధృష్టద్యుమ్నునకుఁ దెల్పుటయు నప్పాంచాలవరుండు దాను ముందఱ నభిమన్యుద్రౌపదేయ ప్రముఖకుమారసహితంబుగా భీమసేనపరిపాలితుండై నిలిచివృకోదరునకు నకులసహదేవులఁ జక్రరక్షకులఁగా నిలిపె సాత్యకిచేకితానులుదక్షిణోత్తరభాగముల నిలిచిరి. విరాటద్రుపదులు నిజపుత్రాదిపరివృతులై యపరభాగముల నిలిచిరి. మధ్యమానీకమున ధర్మరాజు నడగొండలంబోనిగంధసింధురంబులతోడ ధవళచ్ఛత్రచామరములు మెఱయ నిలిచె. గాండీవి తాను శిఖండికిఁ గావలియై దేవవ్రతున కెదుర నిలిచె. చైద్యకేకయమాగధాదులు తమతమసైన్యములతోడ నెడనెడం బెరసిరి. ఇట్లు రాజు లందఱు తమతమకేతనంబులు నడియాలంబులుం గ్రాల నిల్చి సంగరోత్సాహదీపితులై యున్నంతఁ బార్థుండు భీమసేనుదెస మొగంబై యెలుంగెత్తి యల్లవారె ధృతరాష్ట్రపుత్రులు నూఱుగు రున్నవా రని చూపి చెప్పుటయు నందఱుం బురందరనందనువచనంబుచందంబు నభినందించిరి. ఆవ్యూహంబునందు గాండీవికపిధ్వజంబు లాఁతికేతనంబులతేజంబు లడంచుచుఁ దా నొక్కటియే యరిసైన్యభీకరంబై వెలింగె. ఉద్దండగదాదండమును మూఁపున నమర్చి రెండవసూర్యుండునాఁగ భీషణప్రతాపాతపంబు గాయుచున్నపవమానసూనుం జూచి నీసైనికులు విన్నఁబోయిన యుల్లంబులఁ దల్లడిల్లుచుండిరి. అట్లు సూర్యోదయసమయమున నుభయసైన్యములు సన్నద్ధములై యుండునంత మింట మబ్బు లేకున్నను జంఝూవాతంబు విసరె. పరాగంబు పెలుచ నెగసిన నంతటం జీఁకట్లు గ్రమ్మె. తూర్పుమొగంబుగా మహానినదంబుతోడఁ గొఱవులు పడియె. భాస్కరుఁడు హీనతేజస్కుఁ డయ్యె. మహారవంబుతోడఁ బుడమి వడఁకె. కింకిణీజాలభాసురంబు లగుకేతనంబులు తాళవనంబులం గాడ్పువీవనలం బుట్టుమ్రోఁత ననుకరించుచుఁ బెలుచ మ్రోయుచుఁ గంపించె. అవ్విధమున నిరువాఁగులు కయ్యపుగడఁక గడలుకొనఁ గూడియున్నయవసరంబున ధర్మరాజు భీష్మపరిపాలితం బైనసేనం జూచి విన్నఁనై యర్జునుం బిలిచి ధనంజయా, ధార్తరాష్ట్రసేనావ్యూహంబు సంగ్రామతత్త్వవిశారదుం డయినగాంగేయునిప్రాపు గాంచుటంజేసి యభేద్యంబయి తోఁచెడి. మన మెట్లు వారల గెలువఁ జాలుదుమో యని నామనంబున సందియంబు గదిరెడి ననిచెప్పిన విని వివ్వచ్చుఁ డిట్లనియె. రాజేంద్రా, నీమది సందియం బేల? భీమసేనప్రముఖు లగుజగజెట్టులు మనవారై యుండ వారలం గెలుచుట పెద్దపని గా దది యట్లుండె. తొల్లి దేవదానవులకు సంగ్రామంబయినతఱి సుర లసురులబ

లవీర్యంబులకు వెఱచివిన్ననగుటయుఁ గమలాసనుండు వారల నూరార్చి బలవీర్యంబు లున్నంత గెల్తురనరాదు. సత్యానృశంస్యధర్మంబు లేవలనం గల్గు నావలన జయంబు గలుగు. కావున ధర్మభూయిష్ఠు లగుమీా రధర్మభూయిష్ఠు లగుదానవులం గెల్తురనిచెప్పె నని నారదుండును భీష్మద్రోణులును నాకుఁ జెప్పిరి. కావున ధర్మనిత్యుం డైననీకు విజయలాభంబు సిద్ధంబు. మఱియుఁ గృష్ణుఁ డున్న దెస జయ మగుననినారదుండు సెప్పె. వెండియుఁ దొల్లి యకుంఠపరాక్రముం డైనవైకుంఠుండు సమరసన్నద్ధు లయియున్న సురాసురలం బిలిచి మీాలో నెవ్వరు గెల్తు మని తలంచియున్న వా రనియడుగ సురలు దేవా, నీప్రాపుఁ గాంచిమేము జయింతు మని నమ్మినవార మనిపలికి తుది నట్ల నారాయణసహాయంబునవిజయంబుఁ బడసిరి. సర్వలోకేశ్వరుం డైనయప్పరమపురుషుండు నీకు జయంబుసమకూర్చువాఁ డై యుండఁగ డెందమున సందియం బేల? జయమంగళంబు నీసొమ్మనిన విని యాఅడిల్లి ధర్మసూనుండు సాహసోత్సాహసముల్లసితుం డై తనకుఁ బ్రదక్షిణాగతు లయినఋషిపురోహిత ప్రముఖభూసురుల ప్రశంసాపురస్సరజయశోభనాశీర్వాదంబుల గ్రహించుచు బ్రాహ్మణోత్తములకు గోహిరణ్యాదినానాదానంబుల నుత్తమవిధానంబునఁ గావించుచుఁ గృష్ణసారథికదివ్యరథారూఢుఁ డైన గాండీవపాణిని సింహఖేలుం డైన వృకోదరునిం జూచి నీవారలు విన్నఁబోవుటకు మనంబున నలరుచున్నంత హృషీకేశుఁడు గుడాకేశున కిట్లనియె.

## అర్జునుఁడు దుర్గాస్తోత్రముఁ జేయుట.

కురుకులశేఖరుం డైనశాంతనవుఁడు నాయకుఁడుగాఁగ ధార్తరాష్ట్రసైన్యంబు పెద్దరయు బలవంతం బై తోఁచెడి. కావున శుచివై సంగ్రామాభిముఖముగఁ గూర్చుండి శత్రువులం గెలువఁగ దుర్గాస్తోత్రంబుఁ గావింపు మనిబోధించిన విని యర్జునుండు రథావతరణంబు సేసి భక్తివినయవినమితోత్తమాంగంబునఁ గేలుమోడ్పు ఘటియించి సకలదుర్గార్తిహారిణి యగుదుర్గాదేవిని జిత్తమున ననుసంధించి ప్రస్తుతించుటయునతనిభక్తికి మెచ్చి యద్దేవి గోవిందునెదుర నంతరిక్షస్థితయై యతనికిఁ బొడసూపి యర్జునా, యిఁకఁ గొన్నినాళ్లలోన నీవు శత్రువుల గెల్తువు. నారాయణసఖుం డయిననరుఁ డనమునివపుం డవకాని నీ వండతితోడివాఁడవు గావు. దేవేంద్రునకును నీ వజేయుండవు. విజయానందంబు నీకు సులభం బని యానతిచ్చి తత్క్షణంబ యంతర్ధానంబు నొందె. పార్థుం డవ్విధంబున దేవిప్రసాదంబుఁ బడసి తనకు గెల్పు సిద్ధ మనినమ్మి రథం బారోహించుటయు గృష్ణుఁడు పాంచజన్యంబుఁ బూరించె. విజయుఁడును దేవదత్తంబుఁ బూరించె. ప్రాతఃకాలమున నీస్తోత్రముఁ బఠించినవాఁడు యక్షరక్షఃపిశాచసర్పక్రూరజంతుశత్రురాజభయంబుల నెడలు. వివాదమున విజయముఁ బొందు బంధనము ఘటిం

చెనేని మోక్షణంబుఁ బడయు. దుర్గములఁ దరించు. చోరబాధఁ బాయు. సంగ్రామంబున విజయంబుఁ బొందు. మఱియుబలారోగ్యసంపద్విలసితుండై వర్షశతంబు జీవించు. వ్యాసమునికారుణ్యమునంజేసి నేను దీనిం జూచితి. దురాత్ములగు నీకొడుకులు క్రోధవశులై మోహమున నరనారాయణుల నెఱుంగక యొగ్గులుసేయుచున్నవారు. వ్యాసనారదప్రముఖమహర్షు లెంతవారించిచెప్పినను విన రైరి. చేటుకాల మాసన్న మయ్యె నేమి సేయ వచ్చు? ధర్మముగలచోట ధృతి కాంతి హ్రీ శ్రీ మతులు నిరతంబులై యుండు. మఱియు ధర్మ మేదెస ప్రవాలియుండు నాదెసఁ గృష్ణుఁ డుండు. కృష్ణుఁ డున్నచోట విజయంబు సిద్ధం బనిచెప్పిన విని ధృతరాష్ట్రుఁడు సంజయా, యయ్యుభయసైన్యంబులం దెవ్వరు సంతోషోత్సాహంబులం బొదలిరి? ఎవరు దైన్యంబు గదుర విన్నఁబోయిరి? ఎచ్చట మాల్యంబులు చారుసౌరభంబులం బొల్పారె? వాదిత్రనిస్వనంబెచ్చట గంభీరంబై యుండెఁ జెప్పు మనవుడు సంజయుఁడు నరేంద్రా, యుభయసైనికులును సాహసోత్సాహసమగ్రులయి యుండిరి. మాల్యగంధములును మనోహరంబులై యుండె. వాదిత్రనిస్వనంబును యోధవీరసింహనాదంబును గజబృంహితంబును దురంగహేషితంబును రథనేమిఘట్టనధ్వానంబును గంభీరంబై తోఁచె. పాండుపుత్రసేనయు భవత్పుత్రసేనయు సురాసురసేనలం బోలియుండె. పాండవసైన్యంబునం గలగంధసింధురంబులమదగంధంబును భవత్సైనుసేనాగజంబులుసహింపఁ జాలవయ్యె. రెండుసేనలును భీకరంబులును దుర్విషహంబులునై భూమండలంబొండె నాకలోకంబొండెఁ దప్పక సాధింతు మని యుడివోనిబీరమ్మునను గడంకనుం బేర్చి యుగాంతసమయసంక్షుబ్ధంబు లగుసాగరంబులట్లు ఘూర్ణిల్లుచుండె. అయ్యిరువాఁగులమోహారంబులంజూచి చూపఱు మున్నెన్నఁడునిట్టివి చూచియు వినియు నెఱుంగమని యద్భుతరసాందోళితులయి సమరప్రకారంబుఁ జూడ వేడుకవడియుండిరని సంజయుండు దెలిపె.

### భగవద్గీతాప్రారంభము.

అంత ధృతరాష్ట్రుఁడు సంజయా, ధర్మక్షేత్ర మయినకురుక్షేత్రమునం దవ్విధమున సమరసన్నాహమునం బేర్చిననావారును, బాండవులు నేమి చేసిరనియడుగ నతనికి సంజయుం డిట్లనియె. అయ్యవసరమున దుర్యోధనుఁ డట్లు కయ్యమునకు సమకట్టియున్నపాండవసైన్యముం జూచి ద్రోణాచార్యు డాయం బోయి యాచార్యా, నీశిష్యుఁ డగుధృష్టద్యుమ్నుండు నేర్పునం బన్నినయీపాండవమహాసైన్యంబుఁ జూడుము. అందు సాత్యకియు, విరాటుఁడును, ద్రుపదుఁడును, ధృష్టకేతుండును, జేకితానుండును, గాశిరాజును, బురుజిత్తుండును, గుంతిభోజుండును, శైబ్యుండును, యుధామన్యుండు, నుత్తమౌజుండును, సౌభద్రుండును, ద్రౌపదేయులును మున్నగుమహారథులు భీమార్జునుల కెనవత్తురు.

వారెల్ల మేటివిలుకాండ్రు వాఁడిమగలు. ఇట్లు కూడి భీమాభిరక్షితం బయిన యీబలము పర్యాప్తంబై యున్నది. మనలోనిదండిమగలం జెప్పెద. నీవును, భీష్ముండును, గృపాచార్యుండు, నశ్వత్థామయుఁ, గర్ణుఁడును, వికర్ణుఁడును, భూరిశ్రవసుఁడును, జయద్రథుఁడును, వెండియుం బెక్కండ్రుమహారథులునుం గలరు. యుద్ధవిశారదులు నానాస్త్రవేదులు నగునీశూరు లందఱును నాకై ప్రాణముల విడిచెద మనియున్నవారు. ఇట్లు కూడి భీష్మాభిరక్షితం బైనమనసైన్య మెంతయుఁ జాలిన దనితోఁచుచున్నది. మీ రందఱు వలయుచోట్లనెల్ల నిలిచి భీష్మునకుఁ గావలివై యుండవలయు ననుచున్నంతఁ గురుపితామహుం డమ్మహీపతికి హర్షోత్కర్షంబుఁ గావించువాఁడై పెలుచ సింహనాదంబుఁ జేసి శంఖంబుఁ బూరించుటయు నాచార్యప్రముఖు లందఱుఁ దమతమశంఖములఁ బూరించిరి. భేరీపణవాదివాద్యము లొక్కపెట్ట మ్రోసె. ఆనినాదంబు తుములంబై భూనభోంతరంబు నిండె. అపుడు శ్వేతరథ్యయోజితరథోత్తమమున నాసీనులై యున్న కృష్ణార్జునులు పాంచజన్యదేవదత్తంబులఁ బూరించుటయు భీమసేనుండు పౌండ్రంబును, యుధిష్ఠిరుం డనంతవిజయంబును, నకులసహదేవులు సుఘోషమణిపుష్పకంబులను, ద్రుపదవిరాటసాత్యకిశిఖండిధృష్టద్యుమ్నకాశీరాజసౌభద్రద్రౌపదేయప్రముఖులు నిజశంఖంబులనుం బూరించిన దారుణంబయినయానినాదంబు ధార్తరాష్ట్రహృదయపుటదారణంబై రోదసీకుహరంబునం బ్రతిస్వనం బెసంగఁ జెలంగె.

## అర్జునవిషాదయోగము.

అట్టియెడ ధనంజయుండు రణక్షోణీతలంబున మోహరించియున్నధార్తరాష్ట్రులఁ గలయంజూచి శస్త్రగ్రహణసమయం బగుడు గాండీవంబుఁ జేతఁగొని మొగల నున్నయచ్యుతుం బిలిచి వాసుదేవా, మనతేరు రెండుసేనలనడిమి చక్కటికిఁ బోనిమ్ము. దుర్బుద్ధి యైనధార్తరాష్ట్రునకుఁ బ్రియము సేయ వచ్చినతత్సైనికులలో నెవ్వరితోడఁ దొలుతఁ బోరాడవలయునో చూచికొనియెద ననవుడు హృషీకేశుండు గుడాకేశుమతంబున నుభయసేనామధ్యమున నరదంబుఁ దోలి- భీష్మద్రోణప్రముఖులయెదుర నిలిపి కుంతీనందనా, కూడియున్నకౌరవుల నందఱుం జూచికొను మనివచించె. అంత నర్జునుం డిరువాఁగుల నున్నతండ్రులఁ, దాతల, మామల, నాచార్యుల, నన్నదమ్ములఁ, బుత్రులఁ, బౌత్రుల, మిత్రులను మఱియు ననేకబాంధవులనుం జూచి పరమకృపాభరితచిత్తుండై కట్టాయితంబయియున్న యీస్వజనమును జూచినమాత్రన నామేను విరవిరవోవుచున్నది. మొగము వాడుచున్నది. కంపము వొడముచున్నది. రోమహర్షము గలుగుచున్నది. గాండీవంబు చేత నిలువక జాఱుచున్నది. త్వక్కు మిక్కిలి మెరియుచున్నది.

కాళ్లు నిలువ నోపవు. మనంబు దిరుగుడువడినవిధంబు దోఁచుచున్నది. దుర్ని
మిత్తంబులుం బెక్కు లగపడుచున్నవి. ఘోర స్వజనసంహారముఁ గావించినం గలు
గుమే లెద్దియుం గానరాదు. స్వజనవర్గము సుఖముండినం జాలు. విజయమును
రాజ్యమును సుఖములను నేఁ గోరను. ఎవ్వరికై రాజ్యభోగసుఖములు గోరం
బడు నట్టియాచార్యులు తండ్రులు తాతలు పుత్రులు పౌత్రులు మామలు
మున్నగువారు ప్రాణములను ధనములనుం ద్యజించి చివ్వకు సమకట్టియుండ
వారిం జంపి పదంపడి రాజ్యభోగములం బడసితిమేనియు నది సుఖం బగునే?
అట్టికుత్సితజీవనంబునం బ్రయోజనం బెయ్యది? శస్త్రముల ధరించి యెదిరించి
వచ్చినను వారలఁ ద్రైలోక్యరాజ్యంబు సమకూఱునేనియుఁ జంపకుండెద. ఇఁక
భూమిపొంటెఁ జంప నని వేఱ చెప్పవలయునే? ధార్తరాష్ట్రుల వధించినమాత్రన
మాకుఁ గలుగుప్రీతి యెయ్యది? పాప మొక్కండు శేషించు. కావున ధార్త
రాష్ట్రులను దదీయులనుం జంపకునికి మాకుఁ దగు. స్వజనసంహారంబు సౌఖ్యకా
రణం బని యెట్లు తలఁపవచ్చు? ధార్తరాష్ట్రులు లోభోపహతచిత్తులు గావునఁ
గులక్షయమునఁ గలుగుదోషంబును మిత్రద్రోహమునం బొడముపాతకంబునుం
బరికింపరైరి. ఎఱుకగలమనకుం బరికింపకుండఁ దగునే? కులక్షయము పొసఁగినం
గులధర్మములు నశించు. ధర్మము నశించునేని యధర్మ మభివృద్ధంబై కులమును
దూషించు. అధర్మదూషణంబునఁ గులస్త్రీలు దూషిత లగుదురు. కులస్త్రీలు దుష్ట
లయిన వర్ణసంకరం బగు. సంకరంబు నరకప్రాప్తికరంబు. అక్కులఘ్నులపితృదేవ
తలు లుప్తపిండోదకక్రియులై పతనముఁ జెందుదురు. వర్ణసంకరనిమిత్తము లయి
నయీకులఘ్నదోషములం జేసి జాతిధర్మములు కులధర్మములు నుత్సన్నము లగు.
ఉత్సన్నకులధర్ములు కలకాలంబు నరకంబునం బడుదు రనివింటిమి గదా.
అక్కటా! రాజ్యసుఖలోభమునం జేసి యత్యంతపాతకం బయినస్వజనవధంబున
కొడంబడితిమి కదా. శస్త్రవ్యాపారంబు సాలించి మిన్నకున్న నన్ను ధార్తరాష్ట్రు
లాతతాయులై వధించినను మేల యనితోఁచెడి నని చెప్పి వివ్వచ్చుఁడు విల్లమ్ము
లనుం దిగవిడిచి తేరిపయిం జదికిలఁ బడి కన్నీరు నించుచుండె.

### భగవంతుఁ డర్జునునకుఁ దత్త్వార్థము బోధించుట.

అట్లు విషాదయోగభరితుం డయియున్న పార్థుం జూచి భగవంతుం డర్జు
నా, యిట్టిసమయంబుల నీకశ్మలంబు నీ కెక్కడనుండి వచ్చె. ఇయ్యది పెద్దల
మతంబు గాదు. మఱి స్వర్గభోగప్రతిబంధకం బయశస్కరంబు. హృదయదౌ
ర్బల్యం బేల? బేలదనంబు మానుము. నీయట్టివాని కిది తగదు లెమ్మని యూ
రార్చుచుండ డెందమున దందడిం బెరుగు పెన్వగ నుడుపఁ జాలక నరుండు నారా
యణునకు వెండియు నిట్లనియె. మహాత్మా, పూజార్హు లయినభీష్మద్రోణుల నెట్టు

లెదిరించి పోరు సేయుదు? మహానుభావు లయినగురువులఁ జంపక భిక్షాన్నంబు నన్నైన శరీరయాత్ర నడుపుట మే లని నామతంబు. నిజకార్యసాధనోద్యోగు లైనగురువులఁ జంపి రుధిరాభీలంబు లయినభోగజాలంబులఁ గుడుచుట మే లగునే? పోరాడి మనము వారల గెలుచుటయుఁ బోరు సాలించిన మనల వారు గెలుచుటయు ననుసీరెంటిలో నెయ్యది పెద్దమే లగు నద్దాని నే నెఱుఁగను. ఎవ్వారిం జంపిన జీవితేచ్ఛ మానవలసియుండు వా రందఱు నిపుడు పోర నెదిరించి యున్నవారు. కార్పణ్యదోషోపహతస్వభావుండఁ గావున ధర్మసమ్మూఢచేతస్కుండనై నిన్నడిగెద. ఎయ్యది శ్రేయం బగు నద్దాని నిశ్చయించి బోధింపుము. నీకు శిష్యుఁడను. శరణాగతుం డై నన్ను శాసింపుము. నిష్కంటకంబుగఁ దైవిలోక్యరాజ్యాధిపత్యము వచ్చెనేనియు నీశోక ముడుగఁ జాల దనితలంచెద. పెక్కేల? కయ్యంబు సేయ నొల్ల ననిపలికి పార్థుం డూరకుండుటయు భగవంతుండు కలకల నవ్వుచు నతని కిట్లనియె.

—సాంఖ్యయోగప్రకారము.—

అర్జునా, వగవఁ దగనిభీష్మద్రోణాదుల గుఱించి వగచెదవు. ప్రాజ్ఞులట్లు ప్రౌఢవచనములం బల్కెదవు. ఇది పండితులలక్షణంబు గాదు. చన్నవారికి నున్నవారికిని వగవనివారకదా పండితు లనంబడుదురు. యుద్ధమున భీష్మద్రోణాదుల వధించితినేని వారికి నాశంబు గలుగుఁగదా వారు లేకుండిన నాకు రాజ్యసుఖము లేమిటికి కని వగవం బని లేదు. పరమార్థస్వరూపంబున వారందఱు నిత్యులుగాని నశించువారు గారు. ఒక్కనాఁడేనియు నేనును, నీవును, నీయున్న రాజులందఱును లే రను టొప్పను. భూతభవిష్యద్వర్తమానకాలంబులందు నందఱును బరమాత్మస్వరూపభావనావశమున నిత్యులై యున్నవారు. బాల్యము యౌవనము జరయు ననునవస్థలు కాలవశమున నొక్కటి చనుడు వేఱొక్కటి గలుగువిధమునఁ గాలవశమున నొక్క దేహము విడిచి వేఱొక్క దేహముఁ బొందుటయు దేహికిఁ గలుగుఁ గావున నయ్యది నిత్యుఁ డయినయాత్మునకు హానికారణంబు గానేరదు. కావున ధీరుఁ డందు మోహముఁ బొందడు. విషయేంద్రియ సంయోగంబులు శీతోష్ణసుఖదుఃఖప్రదంబులు ననిత్యంబులునుం గావున వాని యెడ ఖేదమోదములఁ బొరయక శాంతిఁ గొనుము. శీతోష్ణాదులు సమదుఃఖ సుఖుం డైనయేధీరునకుఁ జిత్తచలనంబుఁ గావింపఁ జాలవో యతఁడు ముక్తిఁ బడయఁ జాలు. కారణాంతరసాపేక్షంబులవుటం జేసి యసత్తు లగుఘటాదిపదార్థంబులకు భావంబును గారణాంతరనిరపేక్షంబవుటం జేసి యెల్లపుడును సత్తగునాత్మున కభావంబునుం గలుగ దని బ్రహ్మతత్త్వవిదు లయినపెద్దలు నిర్ణయించిరి. నిఖిలజగము లెవ్వనిచేత వ్యాప్తంబులై యుండు నట్టిపరమాత్ముఁడు వినాశర

హితుం డని యెఱుంగుము. అవ్యయుం డైనయాత్మునకు వినాశ మెవ్వఁడును జేయఁ జాలఁడు. ధ్వంసవికారములఁ బొరయక యప్రమేయుండై యుండునాత్మున కంత మెన్నఁడును గలుగదు. మఱి యది శరీరధర్మంబు గావున శరీరహాని యాత్మహానికారణంబు గా దని నిశ్చయించి * యుద్ధము సేయుము. ఆత్మఁడు వధించు వధింపఁబడు నని పలుకువార లిద్దఱు నవివేకులు. అతఁడు చావఁడు. చంపఁడు. కొంతకాల ముండి కొంతకాలము లేనివాఁడుగామింజేసి జన్మమరణాపక్షయాదు లగులౌకికభావవికారంబులఁ బొందడు. † ఇవ్విధంబున నవిక్రియుఁడవుటంజేసి యాత్మఁడు నిత్యుఁ డని తెలిసినవిద్వాంసుఁ డెట్టు లెవ్వనిఁ జంపును? ఎవ్వనిఁ జంపించును? ‡ జీర్ణవస్త్రములఁ బరిత్యజించి నరుఁడు నూతనములఁ దాల్చుచందమున నాత్మఁడు తనయున్నశరీరములు జీర్ణము లగుడు నూతనములఁబొందును గావున జన్మప్రధ్వంసవృద్ధ్యాదివికారంబులు శరీరధర్మంబులు గాని యాత్మధర్మంబులు గావు. సావయవపదార్థములంబోలె ఖడ్గాదిశస్త్రములు నిరవయవుండైనయాత్ముని ఛేదింపవు. అగ్ని కాల్పఁడు. నీళ్లు దడుపవు. వాయువు శోషింపఁజేయఁడు. ఇట్లచ్ఛేద్యుఁ డదాహ్యుఁ డక్లేద్యుఁ డశోష్యుఁడు నవుటంజేసి యాత్మఁడు నిత్యుఁడు. నిత్యుఁడు గావున సర్వగతుఁడు. సర్వగతుఁడు గావున స్థిరుఁడు. స్థిరుఁడు గావున నచలుఁడు. అచలుఁడుగావున సనాతనుఁడు. మఱియు నింద్రియాగోచరుఁడుగావున నవ్యక్తుఁ డచింత్యుఁ డవికార్యుఁడు. ఆత్మతత్త్వం బిట్టి దని యెఱింగి యీకూడినరాజలోకంబు నాచేఁ జచ్చు నేను జంపినవాఁడ నగుదు ననునగ పుడుగుము. అట్లు కాక నీ వొక్క వేళ లోకప్రవాదము నమ్మి యాత్మునకు జన్మమరణములు గల వని తలంతువేనియు నిందు వగవఁ దగదు. పుట్టినవానికిఁ జావును జచ్చినవానికిఁ బుట్టువును ధ్రువములై యుండ నపరిహార్యంబైనయీయర్థమున శోకింపఁ బని లేదు. జన్మమునకు ముందు గానరాక నడుమఁ గొంతకాలం బగపడుచుఁ దుదిమృతిఁ జెంది యగపడకయెపోవుట కార్యక

* ఇచ్చట యుద్ధము సేయు మనుట విధి గాదు. అర్జునుఁడు నిజధర్మ మయినయుద్ధమందుఁ బ్రవర్తించి శోకమోహప్రతిబద్ధుఁడై యూరకుండుటవలన భగవంతుఁ డాప్రతిబంధము దొలఁగునట్లు బోధించెఁ గావున ననువాద మాత్రమయ్యె. శోకమోహాదు లగుసంసారకారణముల నివర్తింపఁ జేయుటయే గీతాశాస్త్రమునకు ముఖ్యతాత్పర్యము గాన నంతమాత్ర మిచ్చట సూచింపఁబడియె.

† ఈ వాక్యముచేత నాత్మానాత్మవివేకవంతుఁ డయినవిద్వాంసునకు సర్వకర్మసన్న్యాసమునందే యధికార మనుట సూచింపఁబడియె.

‡ ఇం దిచ్చటనైనను జెప్పినయర్థము మఱలఁ జెప్పఁబడెనేని దురూహ మైనయాత్మతత్త్వమును సుఖబోధార్థము భగవంతుఁడు పలుమాఱు ప్రసంగముఁ గల్పించి బోధించెఁ గావునఁ బునరుక్తదోషవిషయము గాదని యెఱుంగవలయు.

రణసంఘాతాత్మకంబు లయినభూతములకు సహజంబు. వానియెడ వగ పేల? ఆత్మతత్త్వముఁ జూచునతఁడును నిరూపించునతఁడును వినునతఁడును బెక్కండ్రలో నెక్కఁడేనియు దొరుకుట యరిది, తక్కటివా రందఱును బరమాత్మతత్త్వంబు లెస్స యెఱుంగఁ జాలరు. శరీరము నశించినను బరమార్థస్వరూపమున నిత్యుఁడై నయాత్మునకు నాశము గలుగదు. కావున భీష్మాదులం గుఱించి శోకింప వలదు. అదియునుంగాక స్వధర్మమునుం బరికించి సమరమున సుస్థిరుండ వగుము. ధర్మవిరుద్ధముకాని యుద్ధముకంటె క్షత్రియున కొండొక్కకర్మంబు శ్రేయస్కరం బయినధర్మంబు గాదు. మఱి యది యయత్నలబ్ధం బయినయపావృతస్వర్గద్వారంబు. ఇట్టియుద్ధము లభించెనేని యేరాజులు సుఖులు గాకుందురే? శోకమోహగ్రస్తచిత్తుఁడవై నీవు విధిప్రాప్తం బైనసంగ్రామమును జేయవేని స్వధర్మమునకుఁ దప్పి మహాదేవాదిసమాగమనిమిత్తం బైనకీర్తిం బాసి పాపముఁ బొందుదువు. పెద్దకాలం బపకీర్తికిని బాత్రంబ వగుదువు. లోకమునఁ బలుదెఱంగులఁ బేరెన్నికఁ గన్నయతని కపకీర్తియన్నఁ జావుకంటెఁ బెక్కుమడుంగు లెక్కువ గాకుండునే? కర్ణదుర్యోధనాదు లందఱును నిన్నుఁ జూచి యర్జునుఁ డనికి వెఱచె నని యెల్లిదమాడుదురుగాని దయ గలిగి చాలించె ననరు. మున్నెవ్వరు నీవిక్రమంబునకు వెఱచి సమ్మానించుచుండిరో వా రందఱు నిపుడు చులకనఁ జూతురు. నీ పగవారు నీసామర్థ్యంబును నిందించుచు బహుప్రకారంబు లయినయపవాదములఁ గల్పింతురు. అంతకంటె దుఃఖతరం బొండు గలదే? కయ్యమున నీవు బలమఱి చత్తువేని నాకలోకసౌఖ్యంబుఁ గాంతువు. గెలుతువేని భూలోకసామ్రాజ్యమును బడయుదువు. కావున నిట్లు కృతనిశ్చయుండవై యనికి లెమ్ము. సుఖదుఃఖములను లాభాలాభములను జయాజయములను సమములుఁగ భావించి రాగద్వేషములం దవులక కులధర్మ మనుతలంపునఁ గయ్యమునకుఁ దొడరుము. ఇట్లు పోరినం బాపంబు చేరరాదు. * ఇదిసాంఖ్యవిషయబుద్ధి నీకుఁ జెప్పితి. ఇఁక యోగవిషయబుద్ధిఁజెప్పెద వినుము. దానఁ గర్మబంధ మెడలి సుఖింపఁ గలవు. ఇందుఁ బ్రారంభనాశమును బ్రత్యవాయమును లేదు. ఈధర్మ మించుక

* సాంఖ్యులకు జ్ఞానయోగము యోగులకుఁ గర్మయోగ మనువిషయవిభాగము నిరూపించుటకై భగవంతుఁ డిచట "ఇది సాంఖ్యవిషయబుద్ధి" యనియు "ఇఁక యోగవిషయబుద్ధిఁ జెప్పెద" ననియు వచించె. "అదియునుంగాక స్వధర్మమునుం బరికించి" యనునది మొదలుగా "ఇట్లు పోరినం బాపంబు చేరరా" దనువఱకుఁ జెప్పినలౌకికన్యాయ మర్జునునకు శోకమోహాపనయముకొఱకుఁ బ్రసంగవశమునఁ జెప్పఁబడియె. పరమార్థవస్తువివేకము సాంఖ్యము. జ్ఞానప్రాప్త్యుపాయ మనుతలంపున ద్వంద్వములఁ బాసి ఫలాపేక్ష విడిచి యీశ్వరారాధనార్థము చేయఁబడుకర్మానుష్ఠానము యోగము.

యనుష్ఠించిన జననమరణాదిలక్షణం బయినసంసారమహాభయమువలన రక్షించు. సమ్యక్ప్రమాణజనితంబవుటం జేసి శ్రేయోమార్గంబునకు నిశ్చయాత్మక మైననాచెప్పినబుద్ధియొక్కటియకాని వేఱొండు లేదు. ప్రమాణజనితవివేకబుద్ధిరహితులగు వారిబుద్ధులు బహుశాఖలు ననంతంబులై పరఁగు. † అర్థవాదఫలసాధనప్రకాశకము లగువేదవాదములం దాసక్తులైనయవిద్వాంసులు కామపరులై స్వర్గమే పరమపురుషార్థ మనిభావించి తత్సాధనకర్మములకంటె మేలు వేఱొండు లే దని కృతనిశ్చయులై భోగైశ్వర్యప్రాప్తిసాధనక్రియావిశేషబహుళంబు లవుటం జేసి పూచినద్రుమానిమాడ్కి నింపయినవాక్యముల జన్మాంతరప్రాప్తిహేతుభూతముల గువానిం బల్కుదురు. తద్వచనముల నపహృతవివేకులై భోగైశ్వర్యప్రసక్తు లయినవారి మనములందు సాంఖ్యయోగబుద్ధులు వొడమవు. వారు సంసారప్రకాశకంబు లయినవేదవచనములనే ప్రమాణముగ గ్రహింతురు. నీ వట్లు కాక నిష్కాముఁడవు గమ్ము. సుఖదుఃఖరూపము లగుద్వంద్వములఁ బాయుము. సదాసత్త్వగుణాశ్రయుఁడ వగుము. ‡ యోగక్షేమములం దవులకుము. అప్రమత్తుండవు గమ్ము. పరిచ్ఛిన్నోదకంబు లయినకూపతటాకాదులం గలుగుఫలము సర్వతఃపరిపూర్ణజలం బగుదానం గలుగుఫలమున నంతర్భూతం బయినతీరున వేదచోదితనిఖిలకర్మానుష్ఠానంబునం గలుగుఫల మంతయుఁ బరమార్థతత్త్వవిదుఁ డయినసన్న్యాసికి విజ్ఞానఫలమున నంతర్భూతం బగు. జ్ఞాననిష్ఠయం దధికారము గలుగునంతకుఁ గర్మము కర్తవ్యమైయుండుఁ గావున నీ కిపుడు కర్మమందే యధికారంబు. ఒకప్పుడైనను గర్మఫలములఁ గోరవలదు. కర్మఫలములమీఁదియాశ గలుగునేని యది జన్మాంతరంబుఁ గావించుఁ గావునఁ గర్మఫలాపేక్ష విడుచుట మేలు. ఫలనిరపేక్షకర్మాచరణమునఁ గ్లేశము దక్క నొండొక్క ప్రయోజనము గానరాదుగా యనుతలంపునఁ గర్మాచరణంబు మానవలదు. మఱి యోగస్థుండవై ఫలాసంగంబు విడిచి యీశ్వరారాధనతాత్పర్యమునఁ గర్మముల నాచరింపుము. సిద్ధ్యసిద్ధులయెడ సమత్వంబె యోగంబనంబడు. ఈశ్వరప్రీణనార్థ మనుష్ఠింపఁబడును త్తమకర్మమునకునుఫలార్థంబు చేయఁబడునికృష్టకర్మమునకునుం గడుదవ్వు గలదు. కావున నీవు ఫలసాపేక్షకర్మానుష్ఠానంబుపొంతఁ బోవక యోగబుద్ధినొండె సాంఖ్యబుద్ధినొండె నాశ్రయింపుము. ఫలతృష్ణావంతులు కృపణు లనంబడుదురు. బుద్ధియోగము

† వినువారికి కాసక్తి మఱింత యధిక మగుటకుఁగాఁ జెప్పఁబడునతిశయోక్తి యర్థవాద మనఁబడు.

‡ లేనిదానిని సంపాదించుట యోగము. సంపాదించినదానిని రక్షించుట క్షేమము, వీనియం దాసక్తి యుండునంతకు సంసారము వదలదు. కావున వీనిం దవులవల దని యర్జునునకు భగవంతుఁడు బోధించెను

గలయతండు సుకృతదుష్కృతముల రెంటిని బాసి కైవల్యఘనుం డగుఁ గావున యోగయుక్తుండ వగుము. నిజధర్మము లగుకర్మముల నీశ్వరారాధనార్థం బాచరించుచు సిద్ధ్యసిద్ధులయెడ భేద మొందక కుశలత్వమున వర్తించుటయే యోగంబు నాఁబడు. బుద్ధియుక్తు లిష్టానిష్టప్రాప్తిరూపము లగుకర్మజన్యఫలములఁ బరిత్యజించి జ్ఞానసంపన్నులై జన్మబంధములఁ బాసి సర్వోపద్రవరహితం బైనపరమపదంబుఁ బ్రాపింతురు. నీబుద్ధి యెన్నఁడవివేకకల్మషంబుఁ బాసి శుద్ధభావముఁ బొరయు నప్పుడు శ్రుతమునందును శ్రోతవ్యమునందును వైరాగ్యముఁ బొందుదువు. అనేకసాధ్యసాధనబోధకంబు లగుప్రవృత్తినివృత్తిలక్షణనానాశ్రుతులు వినుటంజేసి విప్రతిపన్నంబై యున్ననీబుద్ధి యెన్నఁడు స్థిరమై విక్షేపరహితమై వికల్పవర్జితమై యాత్మయందు నిలుచు నాఁడు వివేకప్రజ్ఞను బొందుదు వనిబోధించుచుండ నర్జునుండు దేవా, సమాధిస్థుఁ డైనస్థితప్రజ్ఞుఁ డెట్టివాఁడు? అతండెయ్యది పలుకు? స్థితిగతు లతని కెట్లని యడుగ భగవంతుఁ డతని కిట్లనియె.

మనోగతము లయినసర్వకామములను బరిత్యజించి బాహ్యలాభసాపేక్షుండుగాక ప్రత్యగాత్మస్వరూపంబునందె పరమార్థదర్శనానందలాభంబునంజేసి యితరపదార్థజాతమున నలంప్రత్యయవంతుండై యాధ్యాత్మికాధిదైవికాధిభౌతికతాపముల నుద్విగ్నుండుగాక సుఖములయెడ సస్పృహుండుగాక వీతరాగభయక్రోధుండై నముని యాత్మస్వరూపంబునఁ బరినిష్ఠితం బైనప్రజ్ఞ గలుగుటంజేసి స్థితప్రజ్ఞుండు నాఁబడు. దేహజీవితాదులయెడ స్నేహమును, సుఖములయెడ మోదమును, దుఃఖములయెడ ఖేదమునుం బొందక భయమునఁ దాఁబేలు తనయంగముల ముడిచికొన్నట్లు జ్ఞాననిష్ఠాయోగమున నింద్రియములను విషయములపొంతఁ బోవనీక యుపసంహరించునట్టిమహాత్మునిప్రజ్ఞ ప్రతిష్ఠిత యనం బరఁగు. నిరాహారుండై యుగ్రతపంబు సల్పువాఁడు నింద్రియములఁ దత్తత్కార్యములఁ బ్రవర్తిల్లనీక నిల్పఁగాని మనోధర్మం బయినరాగము నిలుపఁజాలఁడు. స్థితప్రజ్ఞుఁ డైనమహాత్మునకుఁ బరమాత్మస్వరూపము నాత్మానుసంధానమునఁ గాంచుటంజేసి రాగము తనంతన వదలు. కావునఁ బ్రజ్ఞాస్థైర్యంబు కర్తవ్యంబు. ప్రయత్నపరుండైనవిద్వాంసునిమనంబునయినను విక్షోభణశీలము లయినయింద్రియము లెట్లయిన వ్యాకులపఱిచి విషయాభిముఖముగ హరించుఁ గాన నత్యంతప్రయత్నపూర్వకంబుగా నింద్రియముల వశీకరించికొని ప్రత్యగాత్మస్వరూపంబుకంటెఁ దాను లాఁతివాఁడు గాఁ డనుదృఢనిశ్చయమున సమాధియోగముఁ బూనవలయు. అవ్విధమున వశీకృతేంద్రియుఁ డైనమహాత్ముఁడే స్థితప్రజ్ఞుఁడు నాఁబరఁగు. అట్లు కాక విషయములనే చింతించుచుండినం దదాసక్తి

పెల్లగు. విషయాసక్తివలనఁ గామము పుట్టు. కామము నిమిత్తవిశేషమునఁ బ్రతిహతం బయ్యెనా తోడన క్రోధము జనించు. క్రోధమునఁ గార్యాకార్యములయెడ సమ్మోహంబు గలుగు. సమ్మోహమున శాస్త్రాచార్యోపదేశసంస్కృతం బైన స్మృతికి భ్రంశం బావహిల్లు. స్మృతిభ్రంశంబున బుద్ధి నశించు. బుద్ధి నశించినఁ బురుషుండును నశించినవాఁడ యగు. ఎందాఁక బుద్ధి కార్యాకార్యవివేకయోగ్యం బయి యుండు నందాఁకనకదా పురుషుఁ డున్నవాఁ డగు. నష్టబుద్ధి యైనవాఁడు పురుషార్థాయోగ్యుఁ డవుటంజేసి పురుషుఁ డనం బరఁగనేర్చునే? ఇట్లు సర్వానర్థములకు మూలం బయినవిషయాభిధ్యానమునఁ దవులక యతి రాగద్వేషవియుక్తములై యాత్మవశ్యము లయినయింద్రియములం బరఁగి దేహధారణనిమిత్తము లవుకతన నవర్జనీయము లగునన్నపానాదులం గ్రహించుచు విధేయాంతఃకరణుండయి ప్రసాదంబుఁ గాంచు. ప్రసన్నాంతరాత్ముం డై నమున కాకాశముచందమున బుద్ధి యంతట వ్యాపించి యాత్మస్వరూపముననే నిశ్చల మవుటంజేసి యాధ్యాత్మికాది లగుసకలదుఃఖములును నశించు. కావున సమాధియోగంబు కర్తవ్యంబు. సమాధిరహితున కాత్మస్వరూపవిషయం బయినబుద్ధియు నాత్మజ్ఞానమునం దభినివేశమునుం గలుగదు. ఆత్మజ్ఞానాభినివేశము లేనివానికి శాంతి పుట్టదు. అశాంతునకు సుఖ మెట్లు కలుగు? ఇంద్రియములు స్వస్వవిషయములం బ్రవర్తించుచుండ మనస్సును వాని ననుసరించునేని తప్పుగాలి నావను విమార్గమగుజలమునంబోలె నామనస్సు ప్రజ్ఞను మున్నుండినయాత్మానాత్మవివేకమునుండి తప్పించి విషయములం దాకర్షించు. కావున నెవ్వఁడింద్రియములసర్వవిషయములం దవులనీక గుదియించు నతనిప్రజ్ఞ ప్రతిష్ఠిత యనఁ బేరు వడయు. జ్ఞానరహితము లయినసర్వభూతములకు రాత్రివిధమున నగోచర మైనపరమాత్మతత్త్వమునందు జితేంద్రియుం డై నజ్ఞాని జాగరూకుఁడై యుండు. ఎందుఁ బ్రసుప్తములయ్యు సకలభూతములు జాగరూకములని వ్యపదిష్టము లగు నట్టిభేదలక్షణం బయినయవిద్య పరమాత్మానుసంధానపరుం డై నజ్ఞానికిఁ బరమార్థదర్శనప్రతిబంధకంబు గావున రాత్రితుల్యం బగు. పూరణముఁ బడయుచుండియు నిజప్రతిష్ఠకుఁ జలనముఁ గానక వికార మించుకేనియుం బొరయనిసముద్రమును నానాదేశాగతము లగు జలములు సొచ్చి యడంగువిధంబున సర్వకామము లెవ్వనిఁ బొంది వికారములఁ గావింపఁజాలక లయముఁ గాంచు నతండు ముక్తిఁ బొందుఁగాని విషయతృష్ణగలవాఁ డెన్నఁడేనియుఁ బొందఁ జాలఁడు. సర్వకామములం బరిత్యజించి దేహధారణమాత్రంబునందును నిస్పృహుండై యదృచ్ఛాలబ్ధము లయినదేహధారణసాధనములందును స్వత్వాభిమానవిరహితుండై వైదుష్యాదినిమిత్తాహంకారవర్జితుండై పర్యటనంబుఁ గావించు సన్న్యాసి సంసారదుఃఖోపరమలక్షణం బైన

నిర్వాణంబుఁ బ్రాపించు. ఇట్లు సర్వసన్న్యాసపూర్వకం బయినబ్రహ్మనిష్ఠను గాంచిన మహాత్ముఁడు మోహముఁ జెందఁడు. అంతకాలమం దేనియు నీస్థితిం బడసినయుత్తముఁడు మోక్షముఁ గాంచు నని భగవంతుఁడు సాంఖ్యయోగప్రకారము బోధించుటయు ※ నర్జునుండు మహానుభావా, కర్మముకంటె జ్ఞాన ముత్తమ మని నీమతం బగునేని న న్నేల ఘోరకర్మమున నియోగించెదవు. విషయవిభాగపూర్వకముగ నీవు బోధింపుచున్నను నాకు నీవచనంబు వ్యామిశ్రంబై బుద్ధిమోహముఁ గావించుచందము దోఁచెడిఁ గావున జ్ఞానకర్మములలో నెయ్యది యాచరించినం బెద్దయు మేలు గలుగు? దాని నొక్కదాని నిశ్చయించి చెప్పు మనియడిగన గుడాకేశునకు హృషీకేశుం డిట్లనియె.

## కర్మయోగప్రకారము.

సృష్ట్యాదికాలమునందే † సాంఖ్యులకు జ్ఞాననిష్ఠయనియు యోగులకుఁ గర్మనిష్ఠయనియు నధికారిభేదమునం జేసి నిష్ఠాద్వయముఁ జెప్పితి. ‡ కర్మములనారంభింపకయేయుండిన నైష్కర్మ్యంబు గలుగదు. జ్ఞానరహితం బైన కేవలకర్మసన్న్యాసమాత్రంబుననే మోక్షసిద్ధిగలుగుటయును లేదు. ఒకఁడైన నొకప్పుడైనను క్షణమేనియుఁ గర్మము చేయకుండఁడు § ప్రాణిమాత్రు లందఱును బ్రకృతిజాతము లయినసత్త్వరజస్తమోగుణములచేతఁ జేయింపఁబడుదురు. కర్మేంద్రియ

※ భగవద్వచనమును విని యర్జునుఁడు జ్ఞానకర్మము లనురెంటిలో జ్ఞానము సాక్షాన్మోక్షసాధనమనియుఁ, గర్మము జ్ఞానసాధనచిత్తశుద్ధిసాధన మవుటవలనఁ బరంపరాసాధనమనియు, జ్ఞానకర్మములు భిన్నపురుషానుష్ఠేయము లనియు నెఱిఁగియుండుటంజేసి యుత్తమ మయినజ్ఞానమునందే నన్నుఁ బ్రేరింపక యేల కర్మమునందుఁ బ్రేరించెద వని చేసినప్రశ్న ముపపన్నము. దీనివలన జ్ఞానకర్మసముచ్చయము నిరసింపఁబడుచున్నది. సముచ్చయ మభిమతమగునేని "ఎయ్యది యాచరించినం బెద్దయు మేలు గలుగు దాని నొక్కదాని నిశ్చయించి చెప్పు" మనుప్రశ్న మసంగత మవును.

† సాంఖ్యు లనఁగా నాత్మానాత్మవిషయవివేకవంతులు. యోగు లనఁగాఁ గర్మాధికారులు. జ్ఞానకర్మములు భిన్నాధికారిపురుషానుష్ఠేయములు గాని యేకపురుషానుష్ఠేయములుగావని యీభగవద్వాక్యమున వ్యక్తమగుచున్నది.

‡ ఇక్కడఁ గర్మములనఁగా ఫలాపేక్షవిడిచి యీశ్వరార్పణబుద్ధితోఁ జేయఁబడునిత్యకర్మములు గ్రాహ్యములు. అట్టికర్మము లుపాత్తదురితక్షయమునకు నిమిత్తములై చిత్తశుద్ధికిఁ గారణములగు. దానివలన జ్ఞానము గలుగు. జ్ఞానమువలన మోక్షము. ఇట్లు కర్మము మోక్షమునకుఁ బరంపరాకారణ మగుచున్నది.

§ ఈవాక్యముచేత గుణములకుఁ జలించునట్టియజ్ఞులు కర్మాధికారు లని యేర్పడుచున్నది. గుణములకుఁ జలింపనియుత్తములు జ్ఞానాధికారు లనుట స్పష్టము. ఇట్లు జ్ఞానకర్మములు భిన్నపురుషానుష్ఠేయము లని యేర్పడుటంజేసి సముచ్చయము గీతాశాస్త్రతాత్పర్యము గా దనుట తెల్లము.

ముల గుదియించి మనస్సున నింద్రియార్థముల స్మరించునట్టిమూఢాత్ముఁడు మిథ్యా
చారుఁడు నాఁబడు. మనోవ్యాపారపూర్వకముగా నింద్రియముల నిలిపి ఫలాభి
సంధిరహితుండై కర్మేంద్రియములఁ గర్మముల నాచరించునతఁడు విశిష్టుఁ డగు.
కావున నీవు విహితకర్మం బాచరింపుము. కర్మాకరణంబుకంటెఁ గర్మకరణంబు
మేలు. కర్మ మెద్దియుం జేయకుండిన శరీరయాత్రయు నెఱవేఱ నేరదు. ఈశ్వరా
ర్పణబుద్ధి మాని ఫలాభిసంధితాత్పర్యమునఁ జేయఁబడుకర్మములు బంధనకారణము
లగుఁ గావునఫలాపేక్షారహితుండవై యీశ్వరప్రీణనార్థముకర్మములఁ జేయుము.
తొల్లి ప్రజాపతి*ప్రజలను యజ్ఞమును సృజించి యజ్ఞమున మీరు వృద్ధిఁ బొం
దుఁడు. యజ్ఞము మీ కభిమతార్థముల నిచ్చు నెట్లనిన. యజ్ఞముల నాచరించి
మీ రింద్రాదులకుఁ దృప్తిఁ గావింపుఁడు. తృప్తులయి యింద్రాదులు స్త్రీపశు
పుత్రవర్షాదుల నొసంగుదురు. ఇవ్విధమున మీరును దేవతలు నితరేతరకృత్య
ముల మేలు గనుఁ డని వచించె. దేవత లిచ్చినయన్నాదుల వారికిఁ బెట్టక
తా నొక్కరుండ యనుభవించువాఁడు తస్కరుఁ డనంబడు. దేవయజ్ఞాదుల నెఱ
వేర్చి మిగిలినయశనమును భుజించువారు సర్వపాపవినిర్ముక్తు లగుదురు. అట్లు
కాక తనకడుపు నిండించికొనుటకై వండుకొనువారు పాపభాక్కు లగుదురు. అన్న
మున భూతములు పుట్టుచున్నవి. అన్నము పర్జన్యునివలనఁ గలుగుచున్నది. పర్జ
న్యుఁడు యజ్ఞమువలనఁ గలుగుచున్నాఁడు. యజ్ఞము ఋత్విగ్యజమానవ్యాపారా
త్మకం బయినకర్మమువలనఁ బుట్టుచున్నది. కర్మము వేదమువలన నేర్పడుచున్నది.
వేద మక్షరపదవాచ్యుం డయినపరమాత్మువలన సముద్భూతం బయ్యె. దానం
జేసి వేదము సర్వగతమయ్యు యజ్ఞమునందు సుప్రతిష్ఠితంబై యున్నది. ఇవ్విధ
మున వేదయజ్ఞపూర్వకముగఁ బ్రవర్తితం బయినజగచ్చక్రము ననువర్తింపకకర్మా
ధికారిపురుషుఁ డింద్రియతర్పణపరుండై కాలముఁ గడపునేని వాఁడు పాప మార్జిం
చుచు నిరర్థకంబుగ బ్రదుకు. విషయాసక్తి మాని యాత్మజ్ఞాననిష్ఠుఁడై నిజనిర
తిశయానందలాభమునఁ బరమసంతుష్టుండై యుండుసన్న్యాసికిఁ గర్తవ్య మొక్క
టేనియు నుండదు. అమ్మహానుభావునకుఁ గర్మకరణమునఁ బ్రయోజన మకర
ణమునఁ బ్రత్యవాయమునుం గలుగదు. మఱియు నతనికి బ్రహ్మాదిస్థావరాంతభూ
తములయం దొకయర్థమును లేదు. కావున సంగరహితుఁడవై నిత్యకర్మముల
నాచరింపుము. సంగరహితుఁడై నిత్యకర్మములనాచరించునతఁడు చిత్తశుద్ధిఁ బడసి
తన్మూలముగా ముక్తిం బడయు. జనకుఁడు మున్నగువారు నిట్లు కర్మముల నాచ
రించియే మోక్షమును బ్రాపించిరి. చిత్తము పరిశుద్ధమై జ్ఞాననిష్ఠయం దిపుడే ప్రవ
ర్తింపుచున్న దని తలంతువేని లోకానుగ్రహార్థమైనఁ గర్మముల నాచరింపుము.

* ఇక్కడఁ బ్రజ లనఁగా యజ్ఞాధికారవిశిష్టులు.

శ్రేష్ఠుఁ డెయ్యదియెయ్యది యాచరించు లోకము దానిదానినే యాచరించు.
అతఁ డెద్దానిం బ్రమాణం బని గ్రహించు లోకమును దానినే ప్రమాణముగ
గ్రహించుఁ గావున సమ్యగ్దర్శనవంతుం డైనకృతార్థునకును లోక మున్మార్గమునఁ
బోవక సన్మార్గమునఁ బ్రవర్తించుటకై ప్రారబ్ధకర్మాయత్తత్వమున నిత్యకర్మములు
కర్తవ్యము లగు. నాకు ముల్లోకములందు నించుకేనియుఁ గర్తవ్యంబును బ్రాప్తం
బుగానిప్రాప్యంబును లేదు. అయినను లోకానుగ్రహార్థంబు కర్మమార్గమున
నున్నవాఁడను. నే నెకప్పుడేనియు నాలస్యంబు మాని కర్మమార్గమున వర్తింప
కుండుదునేని మనుష్యులందఱు సర్వవిధముల నామార్గము ననువర్తింతురు. నే
నూరకుందునేని యందఱుం గర్మముల విడుతురు. లోకస్థితినిమిత్తం బైనకర్మము
సాగదేని లోకము లుత్సన్నము లగు. సంకరమునకు నేన కర్త నగుదును. ప్రజలఁ
జెఱిపినవాఁడ నగుదును. కావున నవిద్వాంసులు సంగవంతులై చేయువిధమున
విద్వాంసుఁడు సంగము మాని లోకసంగ్రహార్థము కర్మముల నాచరింపవలయు.
మఱియు విద్వాంసుఁడు కర్మసంగవంతు లయినయవిద్వాంసులకు బుద్ధిభేదముఁ
గావింపక యూరకుండవలయు. కార్యకరణసంఘాతమునం దాత్మాభిమానము గల
విమూఢచిత్తుఁడు ప్రకృతిగుణములచేఁ జేయఁబడుకర్మములకెల్లఁ గర్త తా నని
తలంచు. గుణకర్మవిభాగతత్త్వవిదుఁ డైనమహాత్ముఁడు కరణాత్మకము లయినగు
ణములు విషయాత్మకము లైనగుణములయందు వర్తింపుచున్నవిగాని తాను
గా నని భావించి సంగము విడుచు. ప్రకృతిగుణములచే సమ్మూఢులై గుణకర్మ
ములందు సక్తు లగునల్పజ్ఞులకు బుద్ధిభేదముఁ గావించుట సర్వజ్ఞుఁ డయినయాత్మ
విదునకుఁ దగదు. ప్రత్యగాత్మస్వరూపుఁ డయిననాయందు సర్వకర్మములను
వివేకబుద్ధిచే సన్న్యసించి నిస్సంగుఁడవు నిర్మముఁడవునై సంతాపంబు మాని నీవు
కులధర్మ మయినయుద్ధముఁ జేయుము. ఇయ్యది నామతంబు. అసూయ విడిచి
శ్రద్ధావంతులై మదీయం బైనయీమతము ననుష్ఠించుమానవులు కర్మబంధముక్త
లగుదురు. అసూయావిలచిత్తులై దీని ననుష్ఠింపనిసర్వజ్ఞానమూఢులయినయవి
వేకులు నష్టు లని యెఱుంగుము. జ్ఞానవంతుఁడును నిజపురాకృతకర్మానుగుణముగఁ
బ్రవర్తించుఁ గావున సకలభూతంబులును బూర్వకర్మానుసారముననే ప్రవర్తిం
చును. తన్నిగ్రహంబు దుష్కరంబు. ప్రారబ్ధకర్మవశమున వివిధకర్మములందుఁ
బ్రవర్తింపుచున్నను రాగద్వేషములం దవులక మెలంగుట మేలు. విషయములం
దిష్టమగువానియెడ రాగ మనిష్టమగువానియెడ ద్వేష మనునివి సకలభూతము
లకు వ్యవస్థితములై యుండు. అవియే శ్రేయోమార్గవిఘ్నకరములు. కర్మము లాచ
రణీయము లన్నంతన సర్వకర్మముల నాచరింపఁ దగదు. మఱి తనకు ధర్మం బైనక
ర్మంబె యాచరణీయంబు. సమ్యక్సంపాదిత మైనపరధర్మముకంటె విగుణ మైనను

స్వధర్మము మేలు. పెక్కులేల ? స్వధర్మమునందుఁ జావైనను మేలు. పరధర్మము నరకాదిభయప్రదంబ యగు ననిన విని ధనంజయుండు మహాత్మా, పురుషున కిష్టము లేకున్న నెద్దానిప్రేరణంబున నిర్బంధముఁ బొందినయట్లు పాపముల నాచరించు నని యడుగ భగవంతుఁ డతని కిట్లనియె. కామము విషయము లందుఁ బురుషునిం బ్రేరించు. ఇయ్యది రజోగుణసముద్భవంబు. ఇయ్యది యే ప్రతిఘాతంబుఁ బొందునేని క్రోధముగఁ బరిణమించు. ఇది మహాశనంబు. మహాపాపంబు. ఇయ్యదియే సంసారమార్గమునఁ బ్రవర్తించువారికిఁ బునఃపునః పర్యటనంబుఁ గావించునట్టిశత్రు వని యెఱుంగుము. దుష్పూరంబు పర్యాప్తి రహితంబు జ్ఞానవంతునకు నిత్యవైరియు నగునీకామము ధూమము వహ్నిని మాలిన్య మద్దమును గర్భవేష్టనము గర్భము నెట్లు లట్టుల జ్ఞానము నావరించు. ఇంద్రియములును మనోబుద్ధులును దీని కధిష్ఠానములై యుండు. తదధిష్ఠితమై కామము జ్ఞానమును గప్పి దేహిని మోహింపఁ జేయు. కావున నీవు దొలుత నింద్రియముల నియమించి దేహముకంటె నింద్రియములు పరములనియు, నిం ద్రియములకంటె మనస్సు పరమనియు, మనస్సుకంటె బుద్ధి పరమనియు, బుద్ధి కంటెఁ బరుండై యాత్ముఁడు గలఁడనియు నెఱింగి సమాహితుఁడవై * జ్ఞానవి జ్ఞాననాశనంబు దుర్విజ్ఞేయానేకభేదంబు మహాపాపంబు నగుకామమను వైరిని నిర్జింపుమని నారాయణుఁడు నరునకుఁ గర్మయోగ ప్రకారముఁ దెలిపి మఱియు నిట్లనియె.

## జ్ఞానయోగప్రకారము.

అర్జునా, సర్గాదియం దవ్యయఫలం బయినయీయోగమును నేను వివ స్వంతునకుఁ జెప్పితి. అయ్యాదిత్యుండు మనువునకుఁ దెలిపె. అతండిక్ష్వాకునకు బోధించె. ఇట్లు పరంపరాప్రాప్తం బయినదీనిని రాజర్షు లెఱుంగుదురు. పెద్దయేఁ గాలము గడచుటంజేసి విచ్ఛిన్నప్రచారం బయ్యె. భక్తుఁడవు చెలికాఁడవు నను ప్రీతింజేసి పురాతన మయినయీయోగము నీ కిపుడు బోధించితి. ఇయ్యది పరమ రహస్య మత్యుత్తమ మనిపల్కుచున్నంతఁ గౌంతేయుండు వాసుదేవా, నీజన్మమి ప్పటియది. వివస్వంతునిజన్మముసర్గాదియందె కలిగినయది: అతనికి నీవు దొలుత నీ యోగము నెట్లు బోధించియుండనోపుదు వనియడుగుటయు భగవంతుఁ డతనికి వెండియు నిట్లనియె. నే నిపుడేవసు దేవునింటఁ బుట్టినవాఁడ ననితలంపవలదు. నీకు నునాకును ననేకజన్మములుగడచినయవి. వానినెల్ల నే నెఱుఁగుదు. నీ వెఱుంగవు. జన్మరహితుఁడనయ్యు నవ్యయాత్ముఁడనయ్యు సర్వభూతేశ్వరుఁడనయ్యు నాత్మమా

* జ్ఞానము శాస్త్రిమువలనను నాచార్యునివలనను బరమాత్మతత్త్వ మెఱుఁగుట. విజ్ఞాన మాత్మానుభవము.

యచేత దానినే యధిష్ఠించి వర్ణాశ్రమాదిలక్షణం బయినధర్మమునకు హానియు నధర్మమునకు వృద్ధియుఁ గలుగునప్పుడెల్ల నన్ని యుగములందును సాధురక్షణార్థంబును దుష్టశిక్షణార్థంబును ధర్మవ్యవస్థాపనార్థంబును నేను జన్మ మెత్తినట్లు తోఁపఁ జేయుదు. ఇట్లు మాయారూప మైనమదీయజన్మమును సాధురక్షణాదిరూప మైనమదీయకర్మమును లెస్స యెఱింగినయతం డీదేహమును విడిచి పునర్జన్మమును బొందఁడు. మఱి ప్రత్యగాత్మస్వరూపుఁ డయిననన్నుఁ బొందును. రాగక్రోధభయముల విడిచి యీశ్వరాభేదదర్శనమునఁ బరమేశ్వరుఁడై నన న్నాశ్రయించినకేవలజ్ఞాననిష్ఠులు పెక్కండ్రు పరమాత్మజ్ఞానాత్మక మైన తపమునఁ బరమశుద్ధులై మద్భావం బయినయీశ్వరత్వంబుఁ బడసిరి. ఎవ్వ రేప్రకారమున నేఫలముఁ గోరి న న్నాశ్రయింతురో వారి నట్లే తత్ఫల మిచ్చి యనుగ్రహింతును. సర్వవిధములఁ దమతమకోర్కులఁ గోరి మనుష్యులు నామార్గము ననువర్తింతురు. మానుషలోకమునందుఁ గర్మఫలములు శీఘ్రముగ సిద్ధించుటం జేసి కర్మఫలసిద్ధిఁ గోరి కొంద ఱింద్రాదిదేవతలఁ గొల్తురు. గుణకర్మవిభాగపూర్వకంబుగ బ్రాహ్మణాదిచాతుర్వర్ణ్యమును నేన సృజించితిని. అందుల కెల్ల నేను గర్తనై నను బారమార్థికదృష్టిం బర్యాలోచించి యేను గర్తగా ననియు సంసారియుఁ గాననియు నెఱుంగుము. కర్మలేపము నాకుఁ గలుగదు. కర్మఫలములమీఁదికోర్కియు నాకు లేదు. ఇవ్విధమున న న్నాత్మస్వరూపుఁ డని యెఱింగి కర్మమార్గప్రవృత్తుం డయ్యు నేను గర్త గాననియుఁ గర్మఫలస్పృహ నాకు లేదనియు నెఱుఁగువాఁడు జన్మబంధనముఁ బొరయఁడు. తొల్లింటిముముక్షువులు నీ దృఢనిశ్చయముననే కర్మములాచరించి రనియెఱింగి తత్కృతం బయినకర్మమునే నీవు నాచరింపుము. ఎయ్యది కర్మ మెయ్యది యకర్మమనునీవిషయమున మేధావంతులును మోహముఁ బొందిరి కావునఁ గర్మాకర్మస్వరూపము నీకుఁ దెలియఁ జెప్పెద. దాని నెఱింగితివేని యశుభ మగుసంసారమువలన మోక్షముఁ బడయుదువు. శాస్త్రవిహితకర్మస్వరూపంబును బ్రతిషిద్ధకర్మస్వరూపంబును నకర్మస్వరూపంబును దెలిసికొనవలయు. కర్మాకర్మవికర్మస్వరూపంబు దుర్విజ్ఞేయంబు * కర్మ

* సముద్రమునందు నావ పోవుచుండఁగ నందున్న వారు దూరమగుతీరమునందలివృక్షములు నిశ్చలములైయున్న నుదమతోడనవియును నడుచునట్లు భ్రమించువిధమున దేహాశ్రయమైనకర్మ మాత్మసమవేత మని యజ్ఞులు ప్రసిద్ధముగ భావించి యీకర్మమునకు నేను గర్త నియ్యది నాచేసినపని యేతత్ఫలము నాకు భోక్తవ్య మని తలంతురు కావున నాభ్రాంతిని విడిచి యట్లధ్యారోపితకర్మమునందుఁ బారమార్థిక మయినకర్మాభావము నెవ్వఁడు చూచునో, యావిధముననే కార్యకరణవ్యాపారోపరమము నాత్మయం దధ్యారోపించి నే నిపుడేమియుఁ జేయక యూరక సుఖమున్నవాఁడ నని తలఁచుటవలన నాత్మయం దారోపిత మయినయకర్మమునం దధ్యారోపరూప మయినకర్మమును

మునం దకర్మమును నకర్మమునందుఁ గర్మమును నెవ్వండు సూచు నట్టికర్మాకర్మ విభాగవిదుఁడు మనుష్యులలో బుద్ధిమంతుఁ డనంబడు. మఱియు నమ్మహాత్ముఁడు యోగియనియు సర్వకర్మకర్తయనియుం బేర్కొనంబడు. ఎవఁడు కామసంకల్ప ముల వర్జించి కేవలచేష్టామాత్రములుగఁ గర్మముల నాచరించు నతనిశుభాశుభ కర్మము లన్నియుఁ దదీయజ్ఞానానలమున దగ్ధము లగు. బ్రహ్మవిదు లతనిఁ బం డితుఁ డనిపలుకుదురు. కర్మఫలాసంగంబు విడిచి యథోక్తజ్ఞానమున నిత్యతృ ప్తుండై దృష్టాదృష్టేష్టఫలసాధనాశ్రయరహితుండై నవాఁడు కర్మములఁ బ్రవృ త్తుఁడయ్యు నించుకేనియుఁ జేయఁడు. ఫలాపేక్షాశూన్యుఁడును నియమితాంతఃక రణుఁడును బరిత్యక్తసర్వపరిగ్రహుఁడు నగుజ్ఞాననిష్ఠుఁడు శరీరస్థితిమాత్రప్ర యోజనార్థంబు కర్మముల నాచరించినను నభిమానరాహిత్యమునంజేసి ✻ ధర్మాధ ర్మరూపం బయినకిల్బిషము సంచుకయుం బొరయఁడు. ప్రారబ్ధకర్మాయత్తం బైన శరీరము ధరింప సాధనం బయినయన్నాదు లప్రయత్నముగ లభించిన నంతకుఁ బర్యాప్తిఁ జెందుచు శీతోష్ణాదు లగుద్వంద్వములకు విషాదము నొందక యెవరి యెడను మత్సరంబుఁ బూనక సిద్ధ్యసిద్ధులయెడఁ దుల్యుఁ డై నయతి భిక్షాటనాదు లగుకర్మములఁ జేసియు † బద్ధుఁడు గాఁడు. సర్వసంగవినిర్ముక్తుం డై నజ్ఞాన నిష్ఠుండు లోకసంగ్రహార్థము యజ్ఞాదులఁ జేసినను నాకర్మములు ఫలములతోడ నశించుఁగాని యతనికి దేహాంతరప్రారంభకములు గావు. అట్టి జ్ఞాననిష్ఠుఁడు హోమసాధనంబును, హవిస్సును, నగ్నియు, హోమక్రియయు, యజమా నుఁ డైనతానును, దనకుఁ బ్రాప్య మగుఫలమును, దనచేయుకర్మంబును బ్ర హ్మంబ యనిభావించి సమాధినిష్ఠుండై యుండుఁ గావున నతనికిఁ బ్రాప్యము బ్రహ్మమ యగుఁగాని యొండెద్దియుం గాదు. కర్మనిష్ఠు లగుకొందఱింద్రాదిదేవ

జూచునో, యతఁడు మనుష్యులలో బుద్ధిమంతుఁ డనిభావము. అధ్యారోపమునంజేసి కర్మాకర్మము లు లోకమునందు విపరీతముగ గ్రహింపఁ బడియుండుటవలనఁ దదీయతత్త్వము బోధించువాఁడై భగవంతుఁ డిది నిరూపించెను. కావునఁ గర్మమునం దకర్మ మెట్లు చూడ నగు నకర్మమునందుఁ గర్మ మెట్లు చూడ నగునని సంశయింపఁ బని లేదు. లోకమున నీవిధమునఁ గర్మా కర్మములు విప రీతగృహీతములై యుండుటవలననే "కర్మాకర్మవికర్మస్వరూపంబు దుర్విజ్ఞేయం" బనుపూర్వవాక్య ము సంగత మయ్యె. కర్మమనఁగా నిక్కడ వ్యాపారమాత్రము గ్రహింపఁబడుచున్నది.

* జ్ఞాననిష్ఠుఁడు దేహాంతరము గలుగుటకుఁ గారణ మగుటవలన ధర్మమును గిల్బిషమనియే తలఁచుఁగావున ధర్మాధర్మరూపం బయినకిల్బిష మనిచెప్పఁబడియె.

† అట్టియతి చేయుకర్మములఁ జూచి యితరు లతనిఁ గర్తయని తలంతురుగాని శాస్త్రప్ర మాణజనిత మయినవివేకమున నతఁడు దాను గర్త గా నని భావించుఁ గావున బంధన మతనికిఁ గలు గ దనిభావము.

తో ద్దేశమున యజ్ఞముల నాచరింతురు. * బ్రహ్మవిదులయినకొందఱు యజ్ఞశబ్ద వాచ్యుఁ డైనయాత్మునిఁ దామే బ్రహ్మాగ్నియందు హోమము చేయుదురు. † యోగు లయినకొందఱు శ్రోత్రాదు లయినయింద్రియములను నిగ్రహాగ్ని యందు హోమముచేయుదురు. ‡ మఱికొందఱు శబ్దాదివిషయముల నింద్రియాగ్నులయందు హోమముచేయుదురు § వెండియుం గొందఱు జ్ఞాన ప్రదీపితం బయినయాత్మసంయమయోగాగ్నియందు సర్వేంద్రియకర్మములను సర్వప్రాణకర్మములను హోమముఁ జేయుదురు. కొందఱు ద్రవ్య యజ్ఞములఁ జేయుదురు. కొందఱు తపోయజ్ఞముల సల్పుదురు. కొందఱు ప్రాణాయామాదియజ్ఞముల నాచరింతురు. కొందఱు వేదాధ్యయనయజ్ఞముల నొనర్తురు. తీక్ష్ణవ్రతు లయినయతులు జ్ఞానయజ్ఞముల ననుష్ఠింతురు. ¶ కొంద అపానంబునందుఁ బ్రాణమును వ్రేల్తురు. § కొందఱు ప్రాణమునం దపానమును వ్రేల్తురు. √ మఱికొందఱు ప్రాణాపానగతుల నిరోధించి ప్రాణాయామపరాయణు లగుదురు. ± కొందఱు నియతాహారులై ప్రాణవాయువులను వానియందే వ్రేల్తురు. యజ్ఞవిదు లయినవీ రందఱు యజ్ఞక్షపితకల్మషులై △ యజ్ఞశిష్టాన్నభోజనులై సనాతనం బయినబ్రహ్మముఁ బ్రాపింతురు. ఇందేయజ్ఞమేనియుఁ జేయనివాని కీలోకమునుం గలుగదు. ఇఁక నుత్తమలోక మెట్లు కలుగు? ఇవ్విధమున వేదమార్గములందు నానావిధయజ్ఞములు గానఁబడుచున్నవి. అవియన్నియుఁ

---

* సోపాధికం బయినయాత్మను నిరుపాధికం బయినపరబ్రహ్మస్వరూపమునం దనుసంధానము చేయుటయే యిచ్చట హోమము.

† ఇంద్రియనిగ్రహమే యిచ్చట హోమము.

‡ శ్రోత్రాదులయినయింద్రియములచేత నప్రతిషిద్ధ శబ్దాదివిషయముల గ్రహించుటయే యిచ్చట హోమము.

§ సర్వేంద్రియములను బ్రాణాదివాయువులను గుదియించుటయే యిచ్చటి హోమము.

¶ ఇది పూరక మనుపేరుగల ప్రాణాయామ మగును.

§ ఇది రేచకం బనుప్రాణాయామ మగును.

√ ముఖనాసికాద్వారములుగ వాయునిర్గమనముప్రాణగతి. అట్లుకాక యధోగమన మపానగతి. ఈరెండుగతులు నిలిపి ప్రాణధారణము చేయుట యీవాక్యముచేతఁ జెప్పఁబడినది. ఇదియే కుంభకనామకం బయినప్రాణాయామ మగును. ఇవియన్నియు ముందు వచించినయోగయజ్ఞము యొక్క భేదములు.

± జయింపఁబడినవాయువు లందితరవాయువులను బ్రవేశింపఁ జేయుదురనిభావము.

△ యజ్ఞశిష్టాన్నభోజన మనఁగా నిక్కడ యథోక్తయజ్ఞముల నాచరించి యితరకాలము లందుయదృచ్ఛాలబ్ధ మయినయన్నమును భుజించుట యని తెలియవలయును.

కాయికవాచికమానసకర్మోద్భవంబు లని యెఱుంగుము. ఎఱింగి యివియన్నియు మదీయవ్యాపారములు గావు నేను నిర్వ్యాపారుఁడ నుదాసీనుఁడ నకర్త నని భావించిన ముక్తిలభించును. ద్రవ్యసాధనసాధ్యయజ్ఞములకంటె జ్ఞానయజ్ఞ ముత్తమము. కర్మజన్యఫలములన్నియు జ్ఞానమున నంతర్భూతము లగుఁగదా. కావున జ్ఞానము సర్వోత్తమము. తత్త్వదర్శి యైనయాచార్యునాశ్రయించి దీర్ఘనమస్కారంబులు గావించి భక్తివినయపూర్వకముగ సేవించి తదీయప్రసాదంబు వడసి యుచితవిధమునఁ బ్రశ్నము చేసి తత్త్వముఁ దెలిసికొనుము. అట్టియాచార్యునివలన నెఱింగితి వేని యిఁక నెన్నఁడు నిట్లు మోహముఁ బొందవు. సర్వభూతముల నాత్మయందును నాత్మను బ్రత్యగాత్మస్వరూపుఁ డయిననాయందును నైక్యానుసంధానమునఁ గాంతువు. అత్యంతనికృష్టము లగుపాపములఁ జేసియుండినను దత్పాపసాగరంబునెల్ల జ్ఞానప్లవమునఁ దరింతువు. సమ్యక్ప్రజ్వలితంబయిన యగ్ని యింధనముల దహించుచందమున జ్ఞానాగ్ని సర్వకర్మముల దహించు. జ్ఞానమునకెనవచ్చుపవిత్ర మీలోకమున నెచ్చటనుం గానరాదు. కర్మసమాధియోగానుష్ఠానమున సంస్కృతుండై యోగ్యతం బొందినయతండు కాలక్రమమునఁ దనయం దాజ్ఞానమును బొందును. గురూపాసనాదులయం దాసక్తియు శ్రద్ధయుఁ గలిగి యింద్రియములఁ గుదియించిన మహాత్ముఁ డవశ్యము జ్ఞానవంతుఁ డగు. జ్ఞానవంతుండై యచిరంబుననే ముక్తిఁ గాంచు. ఇందు సందియంబు వలదు. ఆత్మజ్ఞానరహితుండును శాస్త్రాచార్యవాక్యముల నమ్మనివాఁడును సంశయితచిత్తుండును నశింతురు. మఱియు సంశయాత్ముఁ డుభయలోకములకుంగాక సుఖముఁ బొందక వనటలఁ బొందు. పరమార్థదర్శనమునఁ గర్మముల సన్న్యసించి జ్ఞానమున సంశయములఁ బాసినయాత్మవంతునకుఁ గర్మములు బంధకములు గావు. కావున నజ్ఞానమునఁ బుట్టి మనస్సున నెలకొన్నసంశయమును జ్ఞానఖడ్గమున నఱికి విహితకర్మానుష్ఠానము సేయుము. రణమునకు లెమ్మని వాసుదేవుఁడు జ్ఞానయోగం బుపన్యసించిన విని ధనంజయుండు మహానుభావా, * కర్మసన్న్యాసముఁ దెలిపి యంత నిలువక క్రమ్మఱఁ గర్మయోగమునుం జెప్పితివి. ఈరెంటిలో నెయ్యది

* "కర్మమునం దకర్మము నకర్మమునందుఁ గర్మమును నెవ్వఁడు చూచు నట్టికర్మాకర్మవిభాగవిదుఁడు మనుష్యులలో బుద్ధిమంతుఁ డనంబడు" ననునది మొదలుగాఁ గర్మసన్న్యాసము నిరూపించి తుదిని "విహితకర్మానుష్ఠానము సేయు" మనిచెప్పుటవలన నర్జునుఁడు భగవద్వాక్యప్రామాణ్యమునంజేసి కర్మసన్న్యాసకర్మయోగము లను రెండును గర్తవ్యములే యనియూహించి భిన్నధర్మము లయినయవి యొకప్పుడే యొక్కపురుషున కనుష్ఠింప నలవి గావని నిశ్చయించి రెంటిలో నొక్కటి కర్తవ్య మనిభావించి యెయ్యది ప్రశస్త మగునో దానిఁ జేయుట మేలని తలంచి యీప్రశ్నమును జేసెను. ఇక్కడ సన్న్యాస మనఁగా జ్ఞాననిరపేక్ష మయినసన్న్యాసము గ్రహింపఁబడుచున్నది.

నాకుఁ గర్తవ్యంబు. దేనిం జేసిన మే లగు? దాని నిశ్చయించి బోధింపు మనియ డుగ నతనికి భగవంతుఁ డిట్లనియె.

## కర్మసన్న్యాసయోగప్రకారము.

కర్మసన్న్యాసకర్మయోగములు రెండును జ్ఞానోత్పత్తికారణము లగుట వలన మోక్షసాధనంబులే. అందుఁ గర్మసన్న్యాసముకంటెఁ గర్మయోగము విశిష్ట మగు. కర్మయోగియిచ్ఛాద్వేషముల మానెనేని కర్మానుష్ఠానమునఁ బ్రవృత్తుఁడై యున్నను నిత్యసన్న్యాసి యని యెఱుంగవలయు. ద్వంద్వవర్జితుఁ డనాయాసముననే బంధనముఁ బాయు. * సాంఖ్యయోగములు విరుద్ధభిన్నఫలము లనుట యపండితవ్యవహారముగాని పండితవ్యవహారము గాదు. రెంటిలో నొక్కఁటేనియు లెస్స యనుష్ఠించినయతండు రెంటిఫల మయిననిశ్రేయసమును బొందును. సాంఖ్యులు వొందునట్టిస్థానమును యోగులును బొందుదురు. సాంఖ్యయోగములు రెండు నవిరుద్ధఫలము లని యెఱిఁగినయతఁడు పరమార్థము నెఱుఁగు. యోగము లేకుండిన సన్న్యాసంబు దుర్లభంబు. యోగయుక్తుఁడైనముని యచిరంబే పరమార్థజ్ఞాననిష్ఠాలక్షణం బయినసన్న్యాసమును బ్రాపించు. యోగయుక్తుఁడు శుద్ధచిత్తుఁడు జితశరీరేంద్రియుఁడు సర్వభూతాత్మభూతుఁడునగు మహాత్ముఁడు † కర్మములఁ జేసినను బద్ధుఁడు గాఁడు. ఆత్మతత్త్వవిదుఁడు దర్శ

---

* ఇక్కడ జ్ఞానపూర్వకకర్మసన్న్యాసము సాంఖ్యము. అది గలవారు సాంఖ్యులు. జ్ఞానప్రాప్త్యుపాయ మనుతలంపున ఫలాపేక్ష విడిచి యీశ్వరార్పణబుద్ధితోఁ గర్మముల ననుష్ఠించుట యోగము. అది గలవారు యోగులు. సాంఖ్యపదవాచ్య మయిన జ్ఞానపూర్వకకర్మసన్న్యాసము మోక్షమునకు సాక్షాత్కారణమయినను గర్మయోగము జ్ఞానోత్పత్తిసాధనమవుటవలనఁ బరంపరా కారణ మగుచున్నది. కావునఁ గర్మయోగము వలనఁ గలుగుఫలమును జ్ఞానమూలముగ మోక్షమే కాన సాంఖ్యయోగములు రెండు నవిరుద్ధఫలము లనిచెప్పఁబడినది. "కర్మసన్న్యాసముకంటెఁ గర్మయోగము విశిష్టమగు" ననువాక్య మర్జునప్రశ్నానుసారముగ జ్ఞాననిరపేక్ష మయినకర్మసన్న్యాసము నుద్దేశించి చెప్పఁబడినది కావున "సాంఖ్యులు వొందునట్టిస్థానమును యోగులును బొందుదు" రను వాక్యముచేత యోగముకంటె సాంఖ్య ముత్తమ మనియేర్పడుచున్నను బూర్వవాక్యార్థవిరోధము గలుగదు. సాంఖ్యపదబోధ్య మయినసన్న్యాసము జ్ఞానపూర్వకము గావున యోగముకంటె నుత్తమంబె. జ్ఞానరహిత మైనసన్న్యాసముకంటె నీశ్వరార్పణబుద్ధితోఁ జేయఁబడునట్టికర్మయోగమే యుత్తమ మనిభగవంతునినిర్ణయము. కావుననే "కర్మసన్న్యాసముకంటెఁ గర్మయోగము విశిష్టమగు" ననుభగవద్వాక్యము ప్రవర్తించెను. అట్టికర్మయోగమునఁ జిత్తశుద్ధి గలుగఁగా జ్ఞానము గలుగును. జ్ఞానమువలన సన్న్యాసము సిద్ధించు. ఈయర్థమే "యోగము లేకుండిన సన్న్యాసంబు దుర్లభంబు. యోగయుక్తుం డైనముని యచిరంబే పరమార్థజ్ఞాననిష్ఠాలక్షణం బయినసన్న్యాసమును బ్రాపించు" ననువాక్యములచేత నిరూపింపఁబడియె.

† అతనికిఁ గర్మానుష్ఠాన మనావశ్యక మైనను లోకసంగ్రహార్థము చేసినను దత్కర్మాచరణమున నతఁడు కర్తృత్వాద్యభిమానరాహిత్యమునంజేసి తత్కర్మఫలం బయినబంధనముఁ బొందఁ డనిభావము.

నశ్రవణస్పర్శనఘ్రాణాశనగమనవిసర్జనగ్రహణ స్వాపశ్వాసప్రలాపోన్మేషనిమేషాది కర్మములఁ జేయుచుండియు సమాహితుండై యింద్రియార్థములం దింద్రియములు వర్తింపుచున్న వని భావించి నే నేమియుం జేయ ననితలంచు. బ్రహ్మార్పణ మనుభావమున సంగముఁ ద్యజించి కర్మములఁ జేయునతండు పద్మపత్రము జలమునంబోలెఁ దత్పాపమున లిప్తుఁడు గాఁడు. కావుననే యోగులు మనోబుద్ధికాయేంద్రియాదులయందు మమతారహితులై ఫలసంగంబు విడిచి చిత్తశుద్ధ్యర్థంబు కర్మములఁ జేయుదురు చేసి సత్వశుద్ధిజ్ఞానప్రాప్తి సర్వకర్మసన్న్యాస జ్ఞాననిష్ఠా క్రమమున ముక్తిఁ బొందుదురు. అట్లు కాక ఫలార్థంబు సేయునతఁడు ఫలసక్తుఁడై బద్ధుఁ డగు. పరమార్థదర్శి యగుమహాత్ముఁడు వివేకబుద్ధిచే నిత్యనైమిత్తికకామ్య ప్రతిషిద్ధరూపము లయినసర్వకర్మములను సన్న్యసించి జితేంద్రియుండై కర్తృత్వకారయితృత్వరహితుండై నవద్వారంబై పురతుల్యం బయిన దేహమునందు సుఖముండును. కర్తృత్వమును గర్మములును గర్మఫలసంయోగమును లోకమున కాత్మసృష్టములుగావు. అవిద్యాలక్షణం బైనమాయయే యందుఁ బ్రవర్తించు. సుకృతదుష్కృతంబులను రెంటిని నాత్మ గ్రహింపఁడు. ఆత్మసిద్ధ మగుజ్ఞానము ప్రకృతిసిద్ధ మగునజ్ఞానమున నావృతం బగుడుఁ బ్రాణులు మోహముఁ జెందుదురు. అయ్యజ్ఞానమును జ్ఞానబలమున నశింపఁజేయువారి కాదిత్యుఁడు సర్వపదార్థములంబోలె జ్ఞానము పరమార్థమును బ్రకాశింపఁజేయు. పరమాత్మతత్త్వమునందే బుద్ధి నిలిపి తదాత్ములు తన్నిష్ఠులు తత్పరాయణులు నగుజ్ఞానవంతులు జ్ఞాననిర్ధూతకల్మషులై పునరావృత్తిరహితు లగుదురు. అట్టి జ్ఞానవంతులు విద్యావినయసంపన్నుఁడై యుత్తముఁడైన బ్రాహ్మణునియందును, మధ్యమ మగుగోవునందును, నధమము లగుహస్తిశ్వశ్వపాకాదులందు నంతర్యామిపురుషుం డొక్కండుగదా యని సమదర్శను లవుదురు. అట్టిసమదర్శనులు నిర్దోషంబై సర్వసమం బయినబ్రహ్మంబునందుఁ బరినిష్ఠితులవుటం జేసి మనస్సు సమభావస్థితంబై యుండుకతన నీలోకమున జీవదవస్థయందే జన్మము వశీకరించి కొనిరి గావున బ్రాహ్మణగోహస్తిశ్వాదుల నెక్కటిగఁ జూచుటం జేసి దోషవంతులు గారు. బ్రహ్మనిష్ఠుండై నబ్రహ్మవిదుఁడు సర్వభూతములయందును నిర్దోషుఁడై సముఁడైనయాత్మ యేకరూపుఁడై యున్నవాఁ డని స్థిరబుద్ధికలిమిం జేసి సమ్మోహరహితుండై ప్రియాప్రియములకుఁ బ్రహర్షోద్వేగములఁ బొరయఁడు. బాహ్యవిషయసుఖమునం దసక్తచిత్తుఁడు బ్రహ్మయోగయుక్తాత్ముఁడై యక్షయం బయినయాత్మసుఖముఁ బొందు. విషయజన్యము లయినభోగము లనిత్యములు దుఃఖనిమిత్తములును గావున వివేకి వానియెడఁ బ్రీతిఁ జేయఁడు. కామక్రోధోద్భవ మైనవేగమును మరణపర్యంత మెవ్వఁ డోర్వ శక్తుఁ డగు నతండే యోగి,

యతండే సుఖి. బాహ్యసుఖములఁ గోరక యాత్మసుఖమున నాత్మారాముఁడై యా త్మప్రకాశుం డైనయోగి జీవదవస్థయందే బ్రహ్మభూతుండై బ్రహ్మనిర్వాణము నధిగమించు. క్షీణకల్మషులు భిన్నసంశయులు సంయతేంద్రియులు సర్వభూతహి తరతులు నగుసన్న్యాసులు బ్రహ్మనిర్వాణముఁ బ్రాపింతురనుట నిస్సంశయంబు. కామక్రోధవియుక్తులు జితాత్ములు నగునాత్మజ్ఞానవంతులు జీవన్ముక్తులై ప్రార బ్ధదేహాపాయానంతరమును ముక్తులయి యుండుదురు. బాహ్యభోగముల లోఁ జేరనీక వెలిపఱిచి చూడ్కి భ్రూమధ్యమున నిలుచునట్లు చేసినవిధంబు నొనరించి ప్రాణాపానములను నాసాభ్యంతరచరములనుగా సమములనుగాఁ గావించి యిం ద్రియములను మనోబుద్ధులను గుదియించినముని మోక్షపరాయణుం డగును. కామక్రోధభయముల విడిచినయతండు సదాముక్తుఁ డనియె నిర్ణయింపఁ దగు. అట్టిమహాత్ముఁడు సర్వతపోయజ్ఞభోక్తయు సర్వలోకమహేశ్వరుఁడు సర్వభూతుఁ డు నగునన్నుఁ బ్రత్యగాత్మస్వరూపు నెఱింగి సంసారోపరతిం బ్రాపించు నని శ్రీ కృష్ణుఁడు కిరీటికిఁ గర్మసన్న్యాసయోగము నిరూపించి వెండియు నిట్లనియె.



ఆత్మసంయమయోగప్రకారము.

కర్మఫలము నపేక్షింపక నిత్యము లగుకర్మములఁ జేయునతండు * సన్న్యా సియనియు యోగియనియుఁ జెప్పఁబడుఁగాని యగ్నులను దపోదానాదులను బరి త్యజించినవాఁడు గాఁడు. దేని సన్న్యాసం బని చెప్పుదురు దాని † యోగం బని యెఱుంగుము. సంకల్పముల సన్న్యసింపనివాఁ డెవ్వఁడేనియు యోగి గాఁడు. ‡ యోగము నారోహింప నిచ్ఛయించువానికిఁ గర్మము కారణమనియు యోగా రూఢునకు శాంతి కారణమనియుఁ జెప్పఁబడు. ఇంద్రియార్థములయందును నిత్య నైమిత్తికాది కర్మములయందును సంగ మెప్పుడు వర్జించునో యట్టిసర్వసంక ల్పసన్న్యాసి యప్పుడు యోగారూఢుఁ డనఁబడు. అట్టియోగారూఢుఁడు సం సారసాగరనిర్మగ్నుఁ డయినయాత్ముని నితరనిరపేక్షముగఁ దానే యుద్ధరిం చును. ఆత్మునకుఁ దానే బంధుఁడు దానే శత్రుఁ డెట్లంటేని. ఎవ్వఁ డా త్మను దానేజయించి జితేంద్రియుఁ డనఁ బరఁగు నతని కాత్మ బంధు వగు. అట్లు కానివాని కాత్మయే శత్రు వగు. జితాత్ముఁ డైనప్రశాంతునకుఁ బరమాత్ముఁడు సాక్షాదాత్మభావమున వర్తించును. శీతోష్ణసుఖదుఃఖమానావ మానాదులయందు సముఁడై జితేంద్రియుండై జ్ఞానవిజ్ఞానతృప్తాత్ముఁడై సమలో

* ఇక్కడ సన్న్యాసమనఁగా సంకల్పత్యాగము. యోగమనఁగాఁ జిత్తసమాధానము.

† ఫలాపేక్షాశూన్యమయినకర్మానుష్ఠాన మిక్కడ యోగము. ఫలసన్న్యాసమును బట్టి యో గము సన్న్యాస మనిచెప్పఁబడినది.

‡ ఇక్కడ యోగమనఁగా ధ్యానయోగము.

ష్టాశ్మకాంచనుండై యవిచాల్యుం డై నయోగి సమాహితుఁ డనఁబరఁగు. ప్రత్యు
పకారముఁ గోరక యుపకరించువానియెడను, స్నేహముగలవానియెడను, బగవాని
యెడను, నేపక్షమునుం జేరక యూరకుండువానియెడను, విరుద్ధులయినయిరు
దెఱంగులవారికి హితముఁ గోరునట్టిమధ్యస్థునియెడను, దన కప్రియునియెడను,
దేహసంబంధియెడను, శాస్త్రానువర్తి యగుసజ్జనునియెడను, ప్రతిషిద్ధకారి యగు
పాపాత్మునియెడను సమబుద్ధి యగునతఁడు యోగారూఢులలో నుత్తముఁ డనఁగఁ
బేర్కొనఁబడును. గిరిగుహాద్యేకాంతప్రదేశములయందు వసియించి యోగి
నియతాత్ముఁడుఁ ద్యక్తతృష్ణుఁడు నిష్పరిగ్రహుఁడునై పరిశుద్ధ మగువివిక్తదేశ
మున నత్యున్నత మతినీచమునుగాక సమ మైనచేలాజినకుశోత్తర మగుస్థిరాసన
మునందుఁ గూర్చుండి మనస్సును విషయములం దవులనీక యేకాగ్రముగ నియ
మించి కాయశిరోగ్రీవమును నిశ్చలముగను సమముగను నిలిపి చూడ్కి నిజనా
సికాగ్రముఁ జూచువిధముఁ గావించి యేదిక్కునుం జూడక ప్రశాంతాంతఃకర
ణుండును విగతభయుండును బ్రహ్మచారివ్రతస్థితుండునై పరమేశ్వరుఁ డైననా
యందుఁ జిత్త మనుసంధించి మత్పరుండై యంతఃకరణశుద్ధ్యర్థము యోగముఁ
జేయవలయు. ఇవ్విధమున నెల్లపుడు నాత్మసమారాధనముఁ జేయుయోగి నియ
తమానసుండై మత్సంస్థము మోక్షనిష్ఠము నగుశాంతిం బొందును. ఆయోగము
నుచితప్రకారముననె చేయవలయు నెట్లంటేని. అత్యాహారముఁ జేయువానికిని
నిరాహారునికిని నతినిద్రావంతునకును నతిజాగరూకునకును యోగము సిద్ధింపదు
*ఉచితాహారుఁ డుచితగమనుఁ డుచితవ్యాపారుఁడు నియతకాలసముచితనిద్రా
జాగరణుండు నగువానికి సంసారదుఃఖక్షయకరం బగుయోగం బలవడు. నియ
తంబై యేకాగ్రతం బొంది యెవనిచిత్తము బాహ్యార్థచింత మాని కేవలాత్మని
ష్ఠంబై యుండు నానిస్పృహుఁడు యోగి యనఁ బేరు వడయు. వాయురహిత
ప్రదేశమునందు దీపము కదలకున్నవిధమున సమాధినిష్ఠుం డైనయోగి నిశ్చ
లుండై యుండు నని యోగవిజ్ఞులు పల్కుదురు. యోగాభ్యాసమున నేకాగ్రీ
భూతమై చిత్త మెప్పటి కుపరతిం గనునో, సమాధిపరిశుద్ధాంతఃకరణమునఁ బర
మాత్మస్వరూప మెప్పటికిఁ గని యాత్మ తుష్టిం బొరయునో, యింద్రియాగోచ
రంబై బుద్ధిగ్రాహ్యం బైనయాత్యంతికసుఖ మెప్పటి కెఱుంగ నగునో, యెం
దుండి తత్త్వచ్యుతిబొందఁడో, యేయాత్మలాభముఁ బొంది యింతకంటె లాభాం
తరము లే దనితలంచునో, యెం దుండి నిర్వృతుండై మహాదుఃఖములకుం

* గర్భగోళమునందు రెండుపాళ్లు వ్యంజనాదులతోఁగూడినయన్నముచేతను నొక్కపాలు జలముచేతను నిండించి మిగిలినయొక్కపాలును వాయుసంచారార్థ మూరక నిలుపవలయు నని యోగుల కాహారపరిమాణము గలదు.

జరింపఁడో, యప్పటి కయ్యది దుఃఖసంయోగములకు వియోగముఁ గావించున ట్టియోగ మని తెలియఁ దగు. నిర్వేదరహితంబై నిశ్చయసహితం బైనబుద్ధిచే నాయోగము సాధింపవలయు. సంకల్పసంభవము లైనసకలకామములను ద్యజించి వివేకయుక్తం బయినమనస్సుచే నంతట నింద్రియసముదాయము గుదియించి ధైర్యగృహీత మగుబుద్ధిచే మనస్సు నాత్మనిష్ఠంబుఁ గావించి యేమియుఁ జింతింపక మెల్లమెల్లగ నుపరతిం బొందవలయు. యోగాభ్యాసముఁ జేయునతండు దొలుత మన స్స్వేచ్ఛాప్రవృత్తి నేవలం బోయిన నాయాప్రవృత్తి నేవలం బోనీక నిలుపవలయు. అట్లు ప్రశాంతమనస్కుండై ప్రక్షీణమోహాదిక్లేశుండై నిష్కల్మషుం డైనబ్రహ్మభూతుని నిశ్శ్రేయససుఖము తనంతన చేరు. యోగయుక్తుఁడు సర్వసమదర్శనుండై యాత్మయందు సర్వభూతములను సర్వభూతములయందు నాత్మను జూచు. అట్లే సర్వభూతములయం దాత్మస్వరూపుం డైననన్ను నాయందు సర్వభూతములను జూచువానికి నేను బరోక్షుఁడను గాను. అతండును నాకుఁ బరోక్షుఁడు గాఁడు అవ్విధమున సర్వభూతములయం దేకత్వభావనమున నాత్మానుసంధానముఁ జేయుయోగి సర్వప్రకారముల వర్తించినను మన్నిష్ఠుండ యగు. సుఖదుఃఖములయెడ నందఱను దన్నుఁ జూచికొనునట్లు చూచువాఁడు పరమయోగి యని నామతం బనిన విని యర్జునుండు మధుసూదనా, నీచెప్పినసామ్యయోగమును మనశ్చాంచల్యంబునం జేసి స్థిరముగ నెఱుంగనయ్యెద. కృష్ణా, మనస్సు చంచలం బింద్రియవిక్షేపణశీలంబు బలవంతంబు దృఢమునుం గావునఁ దన్నిగ్రహంబు వాయునియమనం బెట్టు లట్టుల దుష్కరంబయి తోఁచెడి ననిన గుడాకేశునకు హృషీకేశుం డయ్యా, మనస్సు చంచలంబు గావునఁ దన్నిగ్రహంబు నీచెప్పినట్లు దుష్కరంబ. అయిన నభ్యాసమునను వైరాగ్యమునను గాలక్రమమున నిగ్రహింపనవలయును. మనస్సును నిగ్రహింపకుండిన యోగము సాధింప నలవి గాదు. నిగృహీతమనస్కునకు సులభ మనిపలికె. అట్లు పలుకుచున్నంతఁ గౌంతేయుండు కృష్ణా, కర్మమార్గమునఁ బ్రయత్నరహితుఁడై యోగమార్గమున శ్రద్ధావంతుఁడై యోగాభ్యాసముఁ జేయుచుండి యంతకాలమున భ్రష్టుండైన వాఁడు యోగసిద్ధిని బొందఁడుగదా? మఱివాఁ డేగతిఁ బొందు? కర్మమార్గయోగమార్గములకు రెంటికిం దప్పి బ్రహ్మపథమున మూఢుండై గాలికిఁ బాఱుమబ్బు చందమున నిరాశ్రయుండై నశించునా? ఈసంశయంబుఁ బాపుము. సంశయవిచ్ఛేదకుఁడు నీకంటె నాకు మఱియొక్కఁడు లేఁ డనిన విని భగవంతుఁడు మఱియు నిట్లనియె. పార్థా, వాని కీలోకమందును నాలోకమునందును నాశము గలుగదు. యోగ్యకర్మముఁ జేసినవాఁ డెవ్వఁడేనియు దుర్గతిని బొందఁడు. ఆయోగభ్రష్టుఁడు స్వానుష్ఠితయోగమహిమసముపలబ్ధము లయినపుణ్యలోకముల కరిగి

పెక్కేండ్లచ్చట వసించి భోగక్షయం బగుడు యథోక్తకర్మానుష్ఠానపరు లగుశ్రీమంతులగృహములనుండెడి యోగవంతు లగుదరిద్రులగృహములనుండెడి జనించు. అట్టిజన్మము మనుష్యలోకమున మిక్కిలి దుర్లభము. అట్లు జనించి యతండు పూర్వజన్మవాసనావశమున సద్బుద్ధియోగయుక్తుండై పూర్వకృతసంస్కారము ననే సిద్ధినిమిత్తం బయినప్రయత్నముఁ జేయును. యోగాభ్యాసము పూర్ణముగఁ జేయక యోగతత్త్వజిజ్ఞాసార్థ మల్పకాలము మేనియుఁ దద్విచారము చేసి నయతండును దన్మహిమంబున సన్మార్గమునందుఁ బ్రవర్తితుఁడై వేదోక్తకర్మానుష్ఠానఫలము నతిక్రమించును. అయత్నపూర్వకముగ నభ్యసించునట్టియోగి విగతకిల్బిషుండై యనేకజన్మసంపాదితసంస్కారమహిమమున సముత్పన్నసమ్యగ్దర్శనుండై పరమగతిం బ్రాపించు. తపస్వులకంటెను, శాస్త్రార్థపాండిత్యముగల వారికంటెను, గర్మాచరణపరులకంటెను, యోగి యధికుఁడు గావున నర్జునా, నీవు యోగి వగుము. యోగులందఱిలోపలను మద్గతాంతరాత్ముఁడై శ్రద్ధతో నన్ను భజించువాఁ డుత్తముఁ డని విష్ణుఁడు జిష్ణున కాత్మసంయమయోగంబుఁ బ్రతిపాదించి వెండియు నిట్లనియె.

విజ్ఞానయోగప్రకారము.

పరమేశ్వరుం డైననాయందు మనస్సు నిలిపి నన్నే యాశ్రయించి యోగము సాధించుచుండి సమస్తశక్త్యైశ్వర్యాదిసమగ్రుఁ డైననన్ను నిస్సంశయముగ నెఱుంగఁ గలవు. తత్ప్రకారంబుఁ దెలియఁగ స్వానుభవరూపం బైనవిజ్ఞానముతోడ జ్ఞానము సాకల్యముగఁ జెప్పెద వినుము. దానిం దెలిసితి వేని యంతకంటె జ్ఞాతవ్యము వేఱొక్కటి యుండదు. మనుష్యసహస్రములలో నెక్కఁడు సిద్ధికై యత్నము నేయు. యత్నము చేసినసిద్ధులలో నొకానొకఁడు నన్ను లెస్స యెఱుంగు. పంచతన్మాత్రలు, మనఃకారణ మయినయహంకార, మహంకారకారణ మయినమహత్తత్త్వ, మహంకారవాసనావత్తయి యవిద్యాసంయుక్త మయినయవ్యక్తము ననునీభేదముల మదీయమాయాశక్తిపదవాచ్యం బయినప్రకృతి యష్టవిధములఁ బరఁగు. ఇయ్యది సంసారబంధనాత్మకంబు గావున నికృష్టంబై యపర యనంబడు. దీనికంటె నితరంబై క్షేత్రజ్ఞలక్షణం బైనప్రకృతి మదాత్మభూతం బగుటం జేసి యుత్కృష్టంబై పర యనంబరఁగు. ఇయ్యదియే ప్రపంచమునఁ బ్రాణధారణమునకు నిమిత్తంబై నయది. పరాపరంబు లయిన యీరెండుప్రకృతులవలననే సర్వభూతములు పుట్టిన వని యెఱుంగుము. ప్రకృతిద్వయమూలముననే యేను జగత్సృష్టిస్థితిలయకారణభూతుఁడ నైతి. నాకంటెఁ గారణాంతరంబు లేదు. సూత్రమునందు మణు లెట్టు లట్టుల నాయందు సర్వ

లోకము లనుస్యూతములై యున్నవి. * జలములయందలిరసంబు నేను. సూర్య చంద్రులయందలి ప్రభ నేను. వేదములయందలి ప్రణవము నేను. ఆకాశమునందలిశబ్దము నేను. పురుషులయందలి పౌరుషము నేను. భూమియందలి † పుణ్యగంధము నేను. అగ్నియందలితేజస్సు నేను. సర్వభూతములసనాతనబీజము నేను. బుద్ధిమంతులబుద్ధి నేను. ప్రగల్భులప్రాగల్భ్యము నేను. బలవంతుల § కామరాగవర్జితం బైనబలము నేను. భూతములయందలి ధర్మావిరుద్ధకామము నేను. సాత్త్వికరాజసతామసలక్షణంబు లయినసర్వపదార్థములును నావలననే పుట్టినవనియెఱుంగుము. అవి నాకు వశములగుఁగాని యేను దద్వశుఁడను గాను. గుణత్రయమయము లయినభావములచేత జగ మంతయు మోహితమయియునికిం జేసి గుణాతీతుఁ డవ్యయుఁడు నగునన్ను జనులెఱుంగనేరరు. గుణమయం బై మత్స్వభావభూతం బైనమదీయమాయ యతిక్రమింపనలవిగానియది. స్వాత్మభూతుఁ డైననాయెడ నెవ్వరు సర్వప్రకారములఁ బ్రపత్తిం జేయుదురు వా రీమాయను నిస్తరింతురు. మోహవశులై దుష్కృతములఁ జేయునరాధములు మాయాపహృతవివేకులై హింసానృతాదు లగునాసురలక్షణములఁ బొందుటంజేసి నాయెడఁ బ్రపత్తిఁ జేయఁ జాలరు. ఆపన్నుఁడు జిజ్ఞాసుఁడు ధనార్థి జ్ఞాని యను నలువురు సుకృతులు నన్ను భజింతురు. జ్ఞాని నిత్యయుక్తుఁడై యేకభక్తి గావున నందఱిలో విశిష్టుఁ డగు. జ్ఞాని నా కత్యంతప్రియుఁడు. అతనికి నేను నట్లే యత్యంతప్రియుఁడను. ఆపన్నజిజ్ఞాసుధనార్థిజ్ఞాను లనుచతుర్విధభక్తులు నుత్కృష్టులైనను జ్ఞాని సమాహితాంతరాత్ముఁడై పరమప్రాప్యుఁ డైననన్నే పొందినవాఁడు గావున నా కాత్మభూతుఁ డని నామతము. బహుజన్మము లెత్తినపదంపడి జ్ఞానవంతుఁడు బహుజన్మార్జితజ్ఞానపరిపాకమహిమమున సర్వము వాసుదేవుఁడే యనినిశ్చయించి నన్నుఁ బొందును. అట్టిమహానుభావుఁ డత్యంతదుర్లభుఁడు. ప్రకృతినియమితులై

* ఉదకసారము రస మనఁబడును. రసభూత మయినపరమాత్మస్వరూపమునందు జల మనుస్యూతమయియున్న దనిభావము. ఈవిధముననే సర్వము నెఱుంగునది. అన్నిపదార్థములయందు సారభూతముగాఁ బరమాత్మస్వరూప ముండుటవలననే "నాయందు సర్వలోకము లనుస్యూతములై యున్న" వనువాక్యము పపన్న మయ్యెను.

† గంధము పుణ్యేతరముగాఁ గొన్నిపార్థివములయం దుండినను బుణ్యేతరత్వ మవిద్యాధర్మము గావున నది సంసారిసంబంధి యగుఁగాని పరమాత్మసంబంధి గా దనియూహించునది.

§ అసన్నికృష్టవిషయములపైఁ గలుగుతృష్ణ కామము. సన్నికృష్టవిషయములమీఁదియాసక్తి రాగము. ఇవి రెండు సంసారిధర్మములు గావునఁ దద్వర్జితంబై దేహధారణమాత్రార్థ మైనబలమే పరమాత్మసంబంధి యని తెలియఁదగును. ధర్మావిరుద్ధకామ మనుచోటను నీవిధముననే యూహించునది.

జనులు తత్తత్కామముల నపహృతజ్ఞానులై తత్తన్నియమముల గ్రహించి యన్య దేవతల నాశ్రయింతురు. ఎవ్వఁడెవ్వఁ డేయేదేవతాతనువులయందు భక్తి గలిగి శ్రద్ధతో నర్చింపఁ దలఁచు వానివాని కాశ్రద్ధ నిశ్చలమైయుండునట్లు చేయుదును. వాఁ డాశ్రద్ధతో నాయాదేవతాతనువుల నారాధించి మద్విహితము లయినత త్తత్కామములనే పొందును. అల్పప్రజ్ఞు లయినయట్టివారికిఁ దత్ఫలము కొంతకా లమునకు నశించు. ఇతరదేవతాపూజలఁ జేసినవారు తల్లోకములఁ బొందుదురు. నన్నారాధించినవారు నన్నుఁ బొందుదురు. అవివేకులు వ్యయరహితము నిరతిశయ మునగుమదీయపరమాత్మస్వరూపము నెఱుంగక నన్ను ముందవ్యక్తుఁడై యిప్పుడు ప్రకాశముఁ బొందినవానిఁగాఁ దలంతురు. యోగమాయాసమావృతుఁడైన నేనందఱకుఁ బ్రకాశుఁడనుగాను. కావుననే మూఢజనులు జననవ్యయరహితుఁ డైనన న్నెఱుంగలేరు. గతవర్తమానాగామిభూతముల నన్నింటిని నే నెఱుంగు దు. సర్వభూతములు కామక్రోధజనిత మైనద్వంద్వమోహమున నుత్పత్తికాల మునందే మోహముఁ బొందును. బహుపుణ్యకారు లైనయెవ్వరిపాపకర్మములు పుణ్యబలమునఁ బ్రక్షీణప్రాయము లగునో వారు ద్వంద్వమోహనిర్ముక్తులై దృఢ వ్రతులై నన్ను భజింతురు. పరమేశ్వరుఁ డయినన న్నాశ్రయించి జరామరణ మోక్షార్థ మెవ్వరు ప్రయత్నము సేయుదు రట్టివారు పరబ్రహ్మమును గృత్స్న మయినయధ్యాత్మవిషయమును సమస్తకర్మములనుం దెలియుదురు. అధిభూతాధి దైవాధియజ్ఞవిజ్ఞానసహితంబుగా న న్నెవ్వరు దెలియుదు రట్టిసమాహితచిత్తులు ప్రాణప్రయాణకాలమందును నన్నుఁ దలంతు రని భగవంతుఁడు విజ్ఞానయోగ ముపదేశించిన విని పాండుపుత్రుఁడు పురుషోత్తమా, బ్రహ్మ మనఁగ నెయ్యది? అధ్యాత్మ మనఁగ నెయ్యది? కర్మ మనఁగ నెయ్యది? అధిభూత మనఁగ నెయ్యా ది? అధిదైవ మనఁగ నెయ్యది? అధియజ్ఞుఁ డనఁగ నీదేహమున నెవ్వఁడు? నియ తాత్ముఁడు ప్రాణప్రయాణకాలమున ని న్నెట్లెఱుంగుదురు? తెలియఁ జెప్పు మనియడుగ జనార్దనుఁ డిట్లనియె.

## అక్షరపరబ్రహ్మయోగప్రకారము.

నాశరహితుండై యక్షరపదవాచ్యుం డైనపరమాత్మ పరబ్రహ్మము. ఆపరమాత్మునకుఁ దత్తద్భూతదేహనిరూపితం బయినప్రత్యగాత్మభావము స్వభా వము. అదియే యధ్యాత్మము. భూతవస్తూత్పత్తికరంబై యింద్రాదిదేవతోద్దేశ మునఁ జేయఁబడుచరుపురోడాశాదిద్రవ్యపరిత్యాగాదికంబు కర్మంబు. నాశశీలం బై జన్మవంతం బైనప్రాణిజాతం బధిభూతంబు. సర్వప్రాణికరణముల కనుగ్రా హకుఁ డైనపురుషుఁ డధిదైవము. సర్వయజ్ఞాభిమాని నైనయే నధియజ్ఞుఁడను. అంతకాలమున నన్ను స్మరించుచుఁ గళేబరము విడుచువారు మదీయం బైనపర

మాత్మస్వరూపం బధిగమించి నన్నే యుంగుదురు. ఇందు సందియము లేదు. అం
తకాలమున నెవండేభావమును స్మరించుచుఁ గళేబరంబుఁ జాలించు నతండు తద్భావ
భావితుండై యాభావముఁ బొందును. కావున సర్వకాలములందును నన్నే స్మరిం
పుము. నాయందు మనోబుద్ధుల నర్పించి శాస్త్రీయ మగుయుద్ధము సేయుము.
నిస్సంశయముగ నన్నే పొందఁగలవు. అభ్యాసయోగమున సమాహితంబై యనన్య
గామిగానిచిత్తమున శాస్త్రాచార్యోపదేశప్రకారము దప్పకుండ సూర్యమండలాం
తర్వర్తియు సర్వజ్ఞుఁడును బురాణుఁడును సర్వలోకేశ్వరుఁడును సూక్ష్మముల
కంటె సూక్ష్ముఁడును దత్తత్కర్మఫలజాతమును దత్తత్ప్రాణులకు విభజించియి
చ్చువాఁడు నచింత్యరూపుఁడును నిత్యచిత్ప్రకాశుఁడు నజ్ఞానాంధకారబహిస్థితుఁడు
నగుపరమాత్మునునిశ్చలభక్తియోగబలయుక్తుండై భ్రూమధ్యమునఁ బ్రాణమును
నిలిపి యప్రమత్తుఁడై మరణకాలమున ధ్యానించునతఁ డప్పరమపురుషుని బ్రాపిం
చు. వేదార్థజ్ఞులు దేని నక్షరం బనిపల్కుదురో, వీతరాగులు సమ్యగ్దర్శనమున
దేనిం బ్రవేశింతురో, జిజ్ఞాసులు దేనిఁ దెలియఁ గోరి బ్రహ్మచర్యవ్రత మాచ
రింతురో, యట్టిపదమును సంగ్రహప్రకారమునఁ జెప్పెద నాకర్ణింపుము. సర్వ
ద్వారముల నియమించి హృదయపుండరీకమునందు మనస్సును నిష్ప్రచారముగఁ
గావించి యూర్ధ్వగామిని యగునాడిచేత నాత్మప్రాణమును మూర్ధమునందు నిలిపి
యోగధారణయందు సమాహితుండై పరబ్రహ్మాభిధానంబై యేకాక్షరం బైన
ప్రణవము నుచ్చరించుచు దేహముఁ జాలించినయతఁ డుత్తమగతిం బడయు.
అనన్యచిత్తుండై యెవ్వఁడు నిత్యము నన్ను స్మరించు నట్టినిత్యయుక్తుఁ డైన
యోగికి నేను సులభుఁడను. పరమసంసిద్ధి యగుమోక్షమును బొందినమహాత్ములు
నన్నుఁ బొంది దుఃఖాలయ మస్థిరము నగుపునర్జన్మముఁ బొందరు. బ్రహ్మలోక
మునుక సర్వలోకములును గాలపరిచ్ఛిన్నము లగుటవలనఁ బునరావృత్తిం బొం
దును. నన్నుఁ బొందినం బునరావృత్తి గలుగదు. కాలసంఖ్యావిదులు బ్రహ్మకు
సహస్రయుగములు పగ లనియు రాత్రియు నంతయనియుం జెప్పుదురు. అందు
బ్రహ్మపవలింటిసమయమునం దవ్యక్తమువలనఁ జరాచరాత్మకము లయినసర్వవ్య
క్తులు పుట్టి రాత్రి వచ్చుడు నాయవ్యక్తమునందె లయముఁ బొందును. ఇప్పుడు
దృశ్యమాన మైనభూతసముదాయ మంతయుఁ బలుమాఱులు పుట్టి లయముఁ
బొందినయదియకాని వేఱు కాదు. పూర్వోక్త మైనయవ్యక్తముకంటెఁ బరుండై
వ్యక్తపదవాచ్యుండై సనాతనుం డైనపరమాత్ముఁడు సర్వభూతములు నశించినను
దాను నశింపఁడు. అతండే యజ్ఞులకు వ్యక్తుఁడుగామిం జేసి యవ్యక్తుఁ డనఁబడు.
అతండే యక్షరుండు. అతండే పరమప్రాప్యుఁడు. అతండే నేను. దేనిం బొందినఁ
బునరావృత్తి గలుగదో యదియే మదీయపరమస్థానంబు. సర్వవ్యాపకుఁడు

సర్వాంతర్యామియు నగునప్పరమపురుషుఁడు జ్ఞానలక్షణం బైనభక్తిచేత గమ్యుండు. ఏకాలమున మృతిం బొంది యోగు లపునరావృత్తిని బునరావృత్తినిం బొందుదు రాకాలమును జెప్పెద వినుము. * అగ్ని, జ్యోతి, స్పహస్సు, శుక్లపక్ష, ముత్త రాయణషణ్మాసము లనునీమార్గమున మృతులయి బ్రహ్మవిదులు క్రమమున బ్రహ్మముఁ బ్రాపింతురు. ధూమము, రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనషణ్మాసము లనునీమార్గమున మృతులయి కర్మఠులు చంద్రసన్నిధాపితం బయినకర్మఫల మనుభవించి పుణ్యక్షయం బగుడుఁ గ్రమ్మఱుదురు. ఈరెండును శుక్లకృష్ణగమ నములనంబడు. ఇవి శాశ్వతములు. ఒకటి యనావృత్తిని మఱియొకటి యావృత్తినిం గావించును. ఈరెండుమార్గములు లెస్స యెఱింగినయోగి మోహముఁ జెందఁడు గావున నర్జునా, సర్వకాలములయందును యోగయుక్తుఁడ వగుము. యోగి వేదయజ్ఞతపోదానములఁ గలుగుఫలమును విచారించి యామార్గము నతి క్రమించి యోగమార్గమునఁ బరమస్థానమును జేరు నని పుండరీకాక్షుఁడు పాండవున కక్షరపరబ్రహ్మయోగంబు తెఱం గెఱింగించి మఱియు నిట్లనియె.

రాజవిద్యారాజగుహ్యయోగప్రకారము.

అసూయారహితుఁడ వైననీకుఁ బరమగుహ్య మైనయిజ్ఞానమును విజ్ఞానసహితముగఁ జెప్పెద వినుము. దాని నెఱింగిన సంసారమోక్షము గలుగు. ఈజ్ఞానము విద్యలకెల్ల రాజగుటంజేసి రాజవిద్యయనియు గోప్యములకెల్ల రాజగుటవలన రాజగుహ్యమనియుఁ బేర్కొనఁబడును. ఇయ్యది పరమపవిత్రము, ప్రత్యక్షవిజ్ఞేయము, ధర్మావిరుద్ధము, సుఖానుష్ఠేయము, వ్యయవర్జితఫలప్రదము. ఆత్మజ్ఞానరూప మయినయీధర్మమునందు శ్రద్ధలేనినాస్తికులు నన్నుఁ బొందలేక మృత్యుయుక్తనరకాదిప్రాప్తిరూప మయినసంసారమార్గమునఁ బరిభ్రమింతురు. కరణాగోచరస్వరూపుఁ డైననాచేత నీజగ మంతయు వ్యాప్తమైయున్నది. సర్వభూతములు మన్నిష్ఠములు. నేను వానియం దవస్థితుఁడ నగాను. ఆత్మస్వరూపుఁ డైననాచేత నాత్మవంతము లగుటంజేసి సర్వభూతములు మన్నిష్ఠము లని వ్యవహరింపఁబడుఁగాని విచారించిన సంసర్గరహితుఁ డైననాయందు భూతములు లేవు. మదీయం బైనయైశ్వరయోగముఁ జూడుము. చిత్రముగఁ దోఁచు. భూతముల భరించుచుండియు నేను భూతస్థుఁడఁ గాను. మదీయ పరమాత్మస్వరూపంబు భూతభావనంబు. ఆకాశస్థితంబై వాయు వంతట వ్యాపించువిధమున సర్వభూతములు సర్వగతుం డైననాయందు సంసర్గరహితప్రకారమున నున్నవని యెఱుంగుము. ఇవ్విధమున స్థితికాలమున మన్నిష్ఠము లయినసర్వభూతములు ప్రళయకాలమునందు మదీయం బైనయపరప్రకృతిం బొందుచున్నవి. ఆభూతము

* ఇక్కడ నగ్న్యాదిశబ్దములచేతఁ దత్తదభిమానిదేవతలకు గ్రహణము.

లనే కల్పాదిసమయమున నేను బూర్వోక్తప్రకృతి నాశ్రయించి సృజింపుచున్న వాఁడను. అవిద్యావశమున నస్వతంత్ర మయినసమస్తభూతసముదాయమును బలుమాఱులు సృజింతును. ఇట్లు సృష్ట్యాదులు చేయుచుండినను సర్గనిమిత్తము లయినకర్మము లభిమానము విడిచి యుదాసీనుని ట్లున్ననాకు బంధకములు గానేరవు. నేను సాక్షిభూతుఁడనై యుండఁగఁ త్రిగుణాత్మకం బయినమదీయమాయ చరాచరాత్మకం బైనప్రపంచమునెల్ల సృజింపుచున్నది.. ఈకారణముననే లోకము విపరివర్తనముఁ గాంచుచున్నది. అవివేకులు సర్వభూతనియామక మైన మదీయపరమాత్మస్వరూపము నెఱుఁగక మనుష్యదేహ మాశ్రయించినవాఁ డని న న్నవమానింతురు. వారు వ్యర్థకాములు వ్యర్థకర్ములు వ్యర్థజ్ఞానులు విగతవివేకులునై మోహకర మయినరాక్షసాసురప్రకృతులం జెంది చెడుదురు. మహాత్ము లైనకొందఱు శమదమదయాదిలక్షణం బైనదైవప్రకృతిం జెంది యనన్యచిత్తులై భూతాదికారణభూతుఁడై యవ్యయుఁ డై నన న్నెఱింగి యెల్లపుడు నన్నుఁ గీర్తించుచు దృఢవ్రతులై యత్నపరులై నిత్యభక్తియుక్తులై నన్ను నమస్కరించుచుఁ బరబ్రహ్మస్వరూపం బొక్కటియే యంతటఁ గల దనునైక్యభావమునను నతఁ డొక్కఁడే చంద్రాదిత్యాదిభేదభిన్నుఁడై యున్నవాఁ డని పృథగ్భావమునను సర్వతోముఖుఁడై విశ్వరూపుఁ డై నన న్నన్ను బహుప్రకారముల జ్ఞానయజ్ఞమునఁ బూజించుచు నుపాసింతురు. ఎ ట్లుపాసించిన నుపాస్యుఁడు నేన యగుదు. ఎట్లంటేని శ్రౌతస్మార్తకర్మములునేన. పితృదేవతల కొసంగఁబడుస్వధాన్నంబు నేన. సర్వప్రాణిభోజ్యం బయినయన్నంబు నేన. మంత్రము నేన. పురోడాశాదికంబు నేన. అగ్ని నేన. హవనకర్మంబు నేన. ఈజగమునకుఁ దల్లియుఁ దండ్రియుఁ దాతయు నేన. ప్రాణులకుఁ గర్మఫలముఁ గల్పించువాఁడను నేన. వేదితవ్యంబు నేన. పవిత్రంబు నేన. ప్రణవంబు నేన. ఋగ్యజుస్సామవేదంబులు నేన. కర్మఫలము నేన. పోషకుఁడు నేన. ప్రభుఁడు నేన. ప్రాణులకర్మాకర్మములకు సాక్షి నేన. సర్వప్రాణుల కావాసంబు నేన. శరణంబు నేన. ప్రత్యుపకార మపేక్షింపక యుపకరించుసుహృదుఁడు నేన. జగదుత్పత్తిస్థితిలయకారణంబు నేన. నిక్షేపంబు నేన. తఱుఁగనిబీజము నేన. అమృతము నేన. మృత్యువు నేన. కార్యకారణములు నేన. నేన యాదిత్యుఁడనై యెండ గాయుదు. నేన పర్జన్యుఁడనై వాన గురియుదు. నేన వర్షము నిగ్రహింతు. త్రయీవిదు లయినకర్మఠులు సోమపానము సలిపి శుద్ధకిల్బిషులై యజ్ఞము లాచరించి స్వర్గలోకప్రాప్తిఁ గోరుదురు. వారు తత్కర్మఫలమున నాలోకముఁ బ్రాపించి దివ్యము లయినభోగము లనుభవించుచు నచ్చటఁ గొంతకాల ముండి పుణ్యక్షయంబగుడుఁ గ్రమ్మఱ మర్త్యలోకమునకు వత్తురు. వేదచోదితకర్మానుష్ఠానపరు లయినకామకాము లివ్విధ

మున గతాగత భ్రమణముఁ బొందుదురు. పృథగ్భావము విడిచి పరమాత్ముఁడైన నన్నాత్మస్వరూపునిగ నేకత్వబుద్ధిం గనుచు నుపాసనాపరులయి పరమార్థ మెఱిఁగిననిత్యయుక్తులకు నేన యోగక్షేమములఁ గావించెద. అన్యదేవతాభక్తులై యాస్తిక్యబుద్ధితోఁ బూజించు వారును నన్నుఁ బూజించువారలే యగుదురుగాని పరమార్థతత్త్వ మెఱుంగమింజేసి వారుగావించినపూజ లజ్ఞానపూర్వకంబులగు. సర్వయజ్ఞములకు భోక్తయుఁ బ్రభుఁడు నగునన్నుఁ దెలియమింజేసి వారు పరమార్థచ్యుతిం గాంతురు. దేవతాభక్తులు దేవతలను, శ్రాద్ధాదిక్రియాపరు లయిన పితృభక్తు లగ్నిష్వాత్తాదిపితృదేవతలను, వినాయకమాతృగణాదిభూతభక్తులు భూతములనుం బొందుచాడ్పున మద్భక్తులు నన్నుఁ బొందుదురు. మద్భజనంబు దుష్కరంబునుం గాదు. నియతభక్తిపూర్వకముగ శుద్ధబుద్ధితోఁ బత్రపుష్పఫలతోయములలో దేని సమర్పించినను గ్రహింతు. కావున నీవు దేనిం జేయుదువు, దేని భుజియింతువు, దేని వేల్తువు, దేని బ్రాహ్మణుల కిత్తు, వేతపము నాచరింతువు, దానినెల్ల మదర్పణంబుఁ గావింపుము. ఇట్లు సల్పితివేని సన్న్యాసయోగయుక్తాత్ముఁడవై శుభాశుభఫలము లయినకర్మబంధనములఁ బాసి నన్నుఁ బొందుదువు. సర్వభూతములయెడను నేను సముఁడను. నా కొక్కఁడును ద్వేష్యుఁడును బ్రియుఁడును లేఁడు. భక్తిపురస్సరముగ నన్ను భజించువారు నాయందు వర్తింతురు. నేనును వారియందు వర్తింతును. అత్యంతదురాచారుఁడు నన్యభావన మాని నన్ను భజించునేని యతండు సమ్యఙ్నిశ్చయుఁ డగుటంజేసి సాధుఁడనితలంపవలయును, సమ్యగ్వ్యవసాయమహిమమున నే వాఁడు శీఘ్రముగ ధర్మచిత్తుఁడై శాంతిఁ బొందును. కౌంతేయా, పెక్కు లేల? మద్భక్తుఁడు సెడఁడని దృఢముగ నమ్ముము. పాపజన్ము లయినస్త్రీవైశ్యశూద్రులును నన్నాశ్రయించి పరమగతిం బొందుదురు. పుణ్యజన్ము లయినబ్రాహ్మణులను భక్తు లయినరాజర్షులనుం జెప్ప నేల? అనిత్యంబయ్యు నసుఖంబయ్యుఁ బురుషార్థసాధనం బైనయీ మనుష్యలోకముఁ బొందితి వికఁ దడవు సేయవలదు. నన్ను సేవింపుము. మనస్సు నామీఁద నిల్పుము. మద్భక్తుఁడ వగుము. మత్పూజఁ గావింపుము. నన్ను నమస్కరింపుము. ఇట్లు చిత్తసమాధానమున వర్తింతువేని సర్వభూతములకుఁ బరమప్రాప్యుఁడై ననన్నుఁ బొందుదు వని వాసుదేవుఁడు వాసవాత్మజునకు. రాజవిద్యారాజగుహ్యయోగం బవగతంబు గావించి వెండియు నిట్లనియె.

### విభూతియోగప్రకారము.

భరతపుంగవా, నామాట కెంతయుఁ బ్రీతి నొందు వాఁడవు గావున నీహితముఁ గోరి యింకనుం బరమవచనములఁ జెప్పెద వినుము. సురలును మహర్షులును మదీయప్రభవప్రభావముల నెఱుంగరు. వారి కెల్లను సర్వప్రకారముల నాదికారణం

బు నేన. ఆదిరహితుఁ డజుఁడు సర్వలోకమహేశ్వరుఁడు నగునన్నుఁ దెలిసినవివేకవంతుఁడు సర్వపాపవిముక్తుఁ డగు. బుద్ధి, జ్ఞాన, మసమ్మోహము, క్షమ, సత్యము, దమము, శమము, సుఖము, దుఃఖము, భావ, మభావము, భయ, మభయ, మహింస, సమత, తుష్టి, తపస్సు, దానము, కీర్తి, యకీర్తియు ననునానావిధము లయినభావములు భూతవర్గమునకు నావలననే కలుగుచుండు. మద్గతభావనావిశిష్టు లయినపురాతనమహర్షుల నేడ్వురను మనువుల నల్వురను నేను మనస్సుననే యుత్పన్నులం జేసితి. లోకమునం గలచరాచరాత్మకం బయినప్రాణిజాలమునెల్ల వారు సృజించిరి. మదీయం బైనయీవిభూతియోగప్రకారమును లెస్సయెఱింగినయతండు సమ్యగ్దర్శనస్థైర్యముఁ గాంచు నిది నిస్సంశయంబు. పరమాత్మస్వరూపుఁడైన నేను సర్వమునకుం గారణభూతుఁడనియు సర్వము నావలనఁ బ్రవృత్తం బయ్యె ననియు నెఱింగి బుధులు పరమార్థతత్త్వాభినివేశసమన్వితులై నన్ను భజించుచు నాయందే చిత్తము నుంచుచు నాయందె ప్రాణముల నుపసంహరించుచుఁ బరస్పరము తత్త్వార్థము విచారించుచు మదీయజ్ఞానబలైశ్వర్యాదులఁ గీర్తించుచు సంతుష్టులై యాత్మారాము లగుదురు. ప్రీతిపూర్వకముగ భజించునట్టి నిత్యాభియుక్తులకు నన్నెఱుంగ సాధనం బయినబుద్ధియోగము నొసంగుదు. ఆత్మభావస్థితుఁడనై నేను బ్రహ్మచర్యాదిసాధనసంస్కారభాసమానం బైనజ్ఞానదీపమునఁ దదీయమోహాంధకారంబు విరియింతు ననిన విని యర్జునుఁడు దేవదేవా, నీవే పరబ్రహ్మమనియుఁ, బరధామమనియుఁ, బరమపవిత్రంబనియు, శాశ్వతపురుషుఁడనియు, నాదిదేవుఁడనియు, నజుఁడనియు, విభుఁడనియు వ్యాసనారదాసితదేవలప్రముఖు లయినమహర్షులు నాకుఁ జెప్పిరి. నీవు నట్లే పలికెదవు కావున నదియెల్ల సత్య మని తలంచెద. దేవదానవాదు లెవ్వరేనియు భవదీయప్రభవప్రభావములఁ జెలియరు. పురుషోత్తమా, నిన్ను నీవే యెఱుఁగుదువు. జగత్పతీ, లోకములనెల్ల నీ వేవిభూతులచే వ్యాపించియుండుదు వాభవదీయదివ్యవిభూతులనెల్ల నాకుఁ దేటపఱుపుము. యోగేశ్వరా, నిన్ను నే నెట్లు తెలియుదును? ఏ యే పదార్థములయందు నీవు చింత్యుఁడవు? ఆత్మయోగైశ్వర్యవిశేషమును ధ్యేయపదార్థవిస్తరంబును నాకెఱింగింపుము. అమృతతుల్యం బులయిననీదివ్యవాక్యముల వినుచుండినం దనివి తీఱ దనియడిగిన పార్థునకు భగవంతుఁ డిట్లనియె. కురుశ్రేష్ఠా, మదీయదివ్యవిభూతుల సాకల్యముగఁ జెప్ప నలవి గాదు. అవి యనంతములు. ప్రధానములఁ జెప్పెద వినుము. ప్రత్యగాత్ముఁ డైననేను సర్వభూతాంతర్యామినై యుండుదు. భూతములయాదిమధ్యాంతములకు నేన కారణంబు. ఆదిత్యులలో సూర్యుఁడు నేను. మరున్నామకదేవతలలో మరీచి నేను. నక్షత్రములకుఁ

జంద్రుఁడు నేను. వేదములలో సామవేదంబు నేను. దేవతలలో నింద్రుఁడు నేను. ఇంద్రియములలో మనస్సు నేను. భూతములచైతన్యంబు నేను. రుద్రులలో శంకరుఁడు నేను. యక్షరాక్షసులలోఁ గుబేరుఁడు నేను. వసువులలోఁ బావకుఁడు నేను. పర్వతములలో మేరువు నేను. పురోహితులలో బృహస్పతి నేను. సేనాపతులలోఁ గుమారుఁడు నేను. జలాశయములలో సముద్రము నేను. మహర్షులలో భృగుఁడు నేను. వాక్కులలోఁ బ్రణవంబు నేను. యజ్ఞములలో జపయజ్ఞము నేను. స్థితిమంతములలో హిమాలయంబు నేను. వృక్షములలో నశ్వత్థము నేను. దేవర్షులలో నారదుఁడు నేను. గంధర్వులలోఁ జిత్రరథుఁడు నేను. సిద్ధులలోఁ గపిలాచార్యుఁడు నేను. అశ్వములలో నుచ్చైశ్శ్రవము నేను. గజములలో నైరావతము నేను. మనుష్యులలో రాజు నేను. ఆయుధములలో వజ్రాయుధము నేను. ధేనువులలోఁ గామధేనువు నేను. జనయితలలోఁ గందర్పుఁడు నేను. సర్పములలో వాసుకి నేను. నాగులలో ననంతుఁడు నేను. యాదస్సులకు వరుణుఁడు నేను. పితృదేవతలలో నర్యముఁడు నేను. నియామకులలో యముఁడు నేను. దైత్యులలోఁ బ్రహ్లాదుఁడు నేను. గణించువారిలోఁ గాలము నేను. మృగములలో సింహము నేను. పక్షులలో గరుత్మంతుఁడు నేను. పవనముఁ జేయువారిలో వాయువు నేను. శస్త్రధారులలో దాశరథిరాముఁడు నేను. మత్స్యాదులలో మకరము నేను. ప్రవాహములలో గంగ నేను. సర్గములయాదిమధ్యాంతములు నేను. విద్యలలో నధ్యాత్మవిద్య నేను. వాదజల్పవితండాదులలో నర్థనిర్ణయవాదము నేను. అక్షరములలో నకారము నేను. సమాసములలో ద్వంద్వము నేను. అక్షయకాలంబు నేను. విశ్వతోముఖుఁడయినకర్మఫలవిధాత నేను. మృత్యువులలో సర్వహరమృత్యువు నేను. భావికల్యాణములయభ్యుదయము నేను. స్త్రీలలో శ్రీవాక్కీర్తిస్మృతిమేధాధృతిక్షమలు నేను. సామములలో బృహత్సామంబు నేను. ఛందస్సులలో గాయత్రి నేను. మాసములలో మార్గశీర్షము నేను. ఋతువులలో వసంతర్తువు నేను. ఛలవ్యాపారములలో జూదము నేను. తేజస్వులతేజస్సు నేను. జయవంతులజయంబు నేను. వ్యవసాయవంతులవ్యవసాయము నేను. సత్త్వవంతులసత్త్వంబు నేను. యాదవులలో వాసుదేవుఁడు నేను. పాండవులలో నర్జునుఁడు నేను. మునులలో వేదవ్యాసుఁడు నేను. కవులలో శుక్రుఁడు నేను. దమనముఁ జేయువారిదండము నేను. గెలువఁ గోరువారినీతి నేను. గుహ్యములమౌనంబు నేను. జ్ఞానవంతులజ్ఞానము నేను. సర్వభూతముల కెయ్యది బీజ మయ్యది నేను. చరాచరాత్మకము లయినభూతములలో మద్విరహితంబయినది యొక్కటియును లేదు. మదీయదివ్యవిభూతు లనంతములు. వాని నన్నింటిం జెప్ప నలవి గాదు. ప్రధానములఁ జెప్పితి. పెక్కులు చెప్ప నేల? శ్రీమంతమూర్జితమునగు పదార్థమెల్ల మ

దీయతేజోంశసంభూతం బని యెఱుంగుము. అది యట్లుండె. మిక్కిలి విచారింప నేల? ఏకాంశమున నే నీజగమంతయు నాక్రమించియున్నవాఁడ నని నిశ్చయింపు మని యిట్లు సర్వభూతేశ్వరుఁడు విభూతియోగంబు వినిపించిన విని విజయుండు పరమేశ్వరా, నాయెడ ననుగ్రహముకలిమిం జేసి పరమగుహ్యం బయినయధ్యాత్మతత్త్వ మవగతంబుఁ గావించినకతన మదీయమోహము వాసె. భూతోత్పత్తిలయములను భవదీయదివ్యమాహాత్మ్యమును నీవలన సవిస్తరముగ వింటి. నీవచించినదియెల్ల నట్ల యని తలంచితి. నీ యీశ్వరరూపముఁ జూడఁ గోరెద. తగునేని యనుగ్రహించి చూపవే యని ప్రార్థించినఁ బార్థునకు శ్రీభగవంతుఁ డిట్లనియె.

## విశ్వరూపసందర్శన యోగప్రకారము.

గుడాకేశా, శతసహస్రప్రకారములు నానావర్ణాకృతివిశిష్టము లప్రాకృతములు నగుమదీయరూపములఁ జూడుము. అందే ద్వాదశాదిత్యుల నష్టవసువుల నేకాదశరుద్రుల నశ్వినులనిద్దఱను సప్తమరుద్గణములను గాంతువు. మున్నెన్నఁడుం గననియనేకాశ్చర్యములను గనుము. నారూపమునందే చరాచరాత్మక మయినసకలప్రపంచము నవలోకింపుము. * మఱియు నీ వెయ్యది గోరుదువు దానినెల్ల నీక్షింపుము. ప్రాకృత మయినయీచక్షుస్సున నప్రాకృతం బగుమదీయవిశ్వరూపము నాలోకింపఁ జాలవు గావున దివ్యచక్షుస్సు నిచ్చెద. మదీయయోగశక్తిప్రభావముఁ గనుఁగొను మనిపలికి మహాయోగేశ్వరుం డై నహరి యనేకవక్త్రనేత్రం బనేకాద్భుతదర్శనం బనేకదివ్యాభరణంబు దివ్యానేకోద్యతాయుధంబు దివ్యమాల్యాంబరధరంబు దివ్యగంధానులేపనంబు సర్వాశ్చర్యమయం బనంతంబు విశ్వతోముఖంబు పరమంబు నగునిజవిశ్వరూపంబుఁ బార్థునకుఁ జూపె. ఏమి చెప్పుదు. ఏకకాలమున మింట వేవురుసూర్యులు వెలింగిరేనియు నప్పటితేజంబు నావిశ్వరూపుతేజమునకు సరిగా దనితోఁచెఁ గావున నది యిట్టి దని చెప్పఁ గొలఁది గాదు. అప్పు డర్జునుఁడు దేవదేవునిశరీరమునందు బహుధావిభక్తం బై నజగం బంతయు నేకస్థితంబై యుండఁ జూచి విస్మయాక్రాంతచిత్తుండై రోమాంచసాంద్రగాత్రుండై యద్దేవదేవునకు సాష్టాంగదండప్రణామం బాచరించి కృతాంజలియై యిట్లని విన్నవించె. దేవా, నీదేహమునందు సర్వదేవతలను సకలభూతసంఘములను బద్మాసనస్థుఁ డై నచతుర్ముఖుని వసిష్ఠాదిఋషులను వాసుకిప్రభృతు లగునురగులనుం జూచుచున్నవాఁడ. విశ్వేశ్వరా, గదాచక్రఖడ్గకిరీటాదిభాసురంబై తేజోరాశియై దీప్తానలార్కప్రకాశంబై సర్వతోదీప్తిమంతంబై దు

* అర్జునుఁడు ముందు జయపరాజయము లెవ్వరి కగునో యనివితర్కించినవాఁడు గావున నదియు నిపుడు చూచికొనఁ దగు నని భగవంతునియభిప్రాయము.

ర్శిరీషంబై యనేకబాహూదరవక్త్రనేత్రంబై యనంతరూపంబై యప్రమేయం బై ననీదివ్యరూపంబుఁ జూచుచున్నవాఁడఁగాని దీనియాదిమధ్యాంతములఁ జూడ నయ్యెద. మఱియుఁ జంద్రసూర్యులు నీకుఁ గన్నులై కన్పట్టుచున్నారు. దీప్తహు తాశనుండు వక్త్రంబై చూపట్టుచున్నాఁడు. స్వతేజమున నీవిశ్వమెల్లఁ దపింపఁజే యుచున్నవాఁడవు. అనిర్వాచ్యయోగశక్తిసంపన్నుఁడై ననిన్నుఁ జూచి నీవే ముము క్షువేద్య మయినపరబ్రహ్మమనియుఁ బ్రపంచపరమాశ్రయుఁడవనియు నిత్యధర్మ పాలకుఁ డయినపురాణపురుషుఁడవనియుఁ దలంచెద. నీ వొక్కరుండవే భూమ్యం తరిక్షమధ్యమును సకలదిక్కులను వ్యాపించితివి. మహాత్మా, విచిత్రం బయిన నీయుగ్రరూపముఁ జూచి ముల్లోకములు వెఱఁ జెందె. దేవాంశమునఁ బుడమిఁ బుట్టినరాజు లందఱు నిన్నుఁ జేరుచున్నవారు. కొందఱు వెఱచి కేలు మోడ్పు ఘటియించి స్తుతింపుచున్నవారు. సిద్ధులును మహర్షులును సంక్షోభభూ తులై లోకస్వస్తికాములై సంపూర్ణస్తుతులఁ గావింపుచున్నవారు. రుద్రు లాది త్యులు వసువులు సాధ్యులు విశ్వదేవు లశ్వినులు మరుత్తులు పితృదేవతలు గం ధర్వు లసురులు యక్షులు సిద్ధులు మున్నగువారెల్ల విస్మితులై నిన్నుఁ జూచు చున్నవారు. బహువర్ణంబై బహువక్త్రనేత్రోదరోరుపాదంబై బహుదంష్ట్రా కరాళంబై నభంబు నొరయుచున్ననీరూపంబుఁ జూచి లోకంబులట్లు నేనును భీతుండనై ధైర్యమును శాంతినిం బొందఁ జాలనయ్యెద. ఎక్కడఁ జూచినను గా లానలతుల్యంబులయిన భవదీయదంష్ట్రాకరాళముఖములే యగపడుచున్నవిగాని దిక్కు లగపడవు. సుఖముఁ గాననయ్యెద. దేవా, ప్రసన్నుఁడ వగుము. అనికి సమకట్టి వచ్చినయీధార్తరాష్ట్రులు భీష్మద్రోణకర్ణాదు లగుయోధవీరులతోడ నతిరయమున భయంకరము లయిననీవక్త్రములఁ జొచ్చుచున్నవారు. అట్లు చొ చ్చునెడఁ గొందఱు నీకోఱలనడుమఁ జిక్కి తలలు పొడిపొడి యగుచు నడఁగిపో వుచున్నవారు. అనేకనదీప్రవాహములు వేగమున నభిముఖములై సముద్రముఁ జొచ్చి యడంగుతెఱంగున నీయున్నశూరు లందఱు తేజోదీప్తము లయిననీవ క్త్రకుహరములఁ జొచ్చి యడఁగుచున్నవారు. మండుచున్నయగ్గిలోనం బడు మిడుతలవడువున నీనోళ్లం జొచ్చుచున్నజనులనెల్ల నీవు నమలుచు మ్రింగుచున్న వాఁడవు. నీతేజము లోకముల నంతట నిండి బిట్టు గాయుచున్నది. ఉగ్రరూపుఁ డైననీ వెవ్వఁడవో యెఱుంగనయ్యెద. ప్రసన్నుఁడవై చెప్పుము. నీప్రవర్తనంబు నే నెఱుంగ ననిన విని భగవంతుఁ డతని కిట్లనియె. అయ్యా, నేను లోకక్షయ కరుం డైనకాలుండను. ప్రవృద్ధుండనై లోకముల నుపసంహరింపఁగఁ బ్రవర్తిం చితి. నీశత్రుసైన్యంబున నున్నభీష్మద్రోణాదులు నీ వూరకున్నను భూమిపయి నుండువారు గారు. కావున లెమ్ము. శత్రువుల గెలువుము. కీర్తిఁ గొనుము. సమృ

ద్ధం బైన రాజ్యము ననుభవింపుము. భీష్మద్రోణకర్ణసైంధవాదు లయినవీ రండ ఱు నాచేఁ జంపఁబడినవార లేకాని యొండు గాదు. నీవు నిమిత్తమాత్రంబుగమ్ము. వారికి వెఱవకుము. వెతఁ జెందకుము. రణమున వైరుల గెల్తు వని హరి బోధించిన విని కిరీటి వేపమానగాత్రుండై దండనమస్కారంబుఁ గావించి యంజలిపుటంబునిట లతటంబున ఘటియించి యత్యంతభీతుండై డగ్గుత్తిక వెట్టి శ్రీకృష్ణునితో మఱియు నిట్లనియె. హృషీకేశా, భవదీయదివ్యమాహాత్మ్యకీర్తనమున జగము ప్రహృష్టంబై యనురక్త మవుట సముచితంబు. రాక్షసులు వెఱచి నానాదిక్కులఁ బాఱుచు న్నవారు. సిద్ధు లందఱు ప్రణమిల్లుచున్నవారు. హిరణ్యగర్భునకు నాదికారణ భూతుఁడై గురుతరుఁడైన నీ కేల ప్రణమిల్లకుండుదురు? దేవదేవేశ్వరా, పర బ్రహ్మంబు నీవ. కార్యకారణంబులు నీవ. పురాణపురుషుఁ డయినయాది దేవుఁడు నీవ. విశ్వనిధానంబు నీవ. సర్వజ్ఞుఁడు నీవ. వేద్యుఁడు నీవ. పరమపదంబు నీవ. సర్వప్రపంచంబు భవద్వ్యాప్తంబై యున్నయది. వాయుయమవరుణాగ్ని ప్రజా పతిచంద్రప్రపితామహాదు లందఱును నీవ. వేమాఱులు నీకు మ్రొక్కెద. మఱియుం బెక్కుమాఱులు నీ కెఱఁగెద. నీముందఱఁ బ్రణమిల్లెద. పిఱుంద జోహారొనర్చెద. అంతటను నమస్కారంబులు గావించెద. అనంతవీర్యుండై నీవు సర్వము నాక్రమించియునికిం జేసి సర్వంబు నీవ. మహానుభావా, నిన్నుఁ బరమాత్ముఁడని యెఱుఁగక చెలికాఁ డనిభావించి యోకృష్ణా, యాదవా, నెచ్చెలీ, యని పిలుచుచుంటిని. మేలమాటకై సహవిహారశయనాసనభోజనములందుస త్కరింపనైతి. నాతప్పు లన్నియు మన్నింపఁగ నప్రమేయుఁడైన నిన్ను వేమా ఱు లభ్యర్థించెద. చరాచరాత్మకం బయినలోకమున కెల్ల నీవు తండ్రివి, గురుఁడవు, పూజ్యుఁడవు. ముల్లోకములందును నీకుఁ దుల్యుఁ డొక్కరుఁడును లేఁడు. ఇఁక నధికుఁడు లేఁ డని వేఱ చెప్పవలయునే? కావునఁ బ్రశ్రయావనతుండనై ప్రణా మపూర్వకముగ లోకస్తుత్యుం డగు నిన్నుఁ బ్రార్థించెదఁ బ్రసాదింపుము. కొడుకు తప్పును దండ్రియుఁ, జెలికానియపరాధమును మిత్రుఁడును, బ్రియురాలితప్పి దమును బ్రియుఁడు నెట్టు లట్టుల నాయపరాధమును సైరింపుము. అదృష్టపూర్వం బయిననీవిశ్వరూపముఁ జూడ సంతసంబు వొడమియు మనస్సు గడుం బెగడు గుడుచుచున్నయది. జగన్నివాసా, యింక నీరూప ముపసంహరించి యెప్పటి యట్ల గదాచక్రకిరీటాదిసముల్లసితం బయినసౌమ్యరూపంబు గ్రహింపు మని ప్రార్థించుటయు నవ్విశ్వరూపుఁడతని కిట్లనియె. అర్జునా, నీయెడఁ బ్రసన్నుఁడనై యాత్మయోగమహిమమున నాద్యంతరహితంబై తేజోమయం బయినమదీయ దివ్యరూపంబు నీకుఁ జూపితి. వేదాధ్యయనంబునను యజ్ఞాచరణంబునను దానా నుష్ఠానంబునను నుగ్రతపశ్చరణంబునను వివిధక్రియలను నీరూపంబు లాఁతుల

ఈఁ జూడ నశక్యంబు. మున్నెవ్వరుం జూడరైరి. ఘోరం బయినయిట్టిమదీయ
రూపంబు సూచుటవలన వ్యథఁ బొందకుము. మోహముఁ ద్యజింపుము. నిర్భ
యుండవై సంప్రీతచేతస్కుండవై నాతొల్లింటిరూపముఁ జూడుము చూపెద
ననిపలికి వాసుదేవుండు నిజసౌమ్యరూపము ధరించి భీతచిత్తుం డైనయప్పాండు
పుత్రు నూఱడింపుచున్నంత నతండు జనార్దనా, సౌమ్యం బయినమానుషరూ
పముఁ జూచి యిప్పుడు ప్రసన్నచేతస్కుండనై ప్రకృతిస్థుండ నైతి ననిన భగ
వంతుఁడు వెండియు నిట్లనియె. దర్శనాగోచరం బయిననాదివ్యరూపముఁ జూచి
తివి. దేవతలుం బ్రతిదిన మీరూపముఁ గాంచఁ గోరుచుండుదురు. వేదాధ్యయ
నాదులంజేసినవారికిని నీవుచూచిననారూపము దృశ్యము గాదు. అనన్యభక్తులు
నన్నుఁ దెలియుదురు, చూతురు, మత్పదం బయినమోక్షముఁ బ్రాపింతురు.
పరమేశ్వరుఁ డైననాకొఱకుఁ గర్మములఁ జేయుచు నేన పరముఁ డనితలఁచుచు
సర్వభూతములయందును వైర మైత్తిక ధనపుత్రమిత్రకళత్రబంధుభోగసంగర
హితుం డైనమద్భక్తుఁడు నన్నుఁ బొందు నని యిట్లు యోగేశ్వరుం డైననారా
యణుండు నరునకు విశ్వరూపప్రపంచంబు సూపి తగినతెఱం గుపన్యసించిన విని
యతండు దేవా, యిట్లు సంతతసమాహితులై నిన్నుపాసించుభక్తులు నిర్దేశా
నర్హమయినపరబ్రహ్మమును భావించు జ్ఞాననిష్ఠులు ననునీయిరుదెఱఁగులవారిలో
నెవ్వరు యోగవిత్తము లనియడుగుటయు హరి యిట్లనియె.

### భక్తియోగప్రకారము.

విశ్వరూపుఁడై పరమేశ్వరుఁ డైననాయందు మనస్సు నిలిపి పరమశ్ర
ద్ధాసమన్వితులై నన్నుపాసించుభక్తులు యుక్తతములు. ఇంద్రియసముదాయము
గుదియించి సర్వభూతహితులై సర్వసమబుద్ధులై యెవ్వరు కరణాగోచరంబై య
నిర్దేశ్యంబై యచింత్యంబై సర్వగతంబై కూటస్థంబై యచలంబై ధ్రువంబై యక్ష
రం బైనపరబ్రహ్మము నాత్మానుసంధానపూర్వకముగ నుపాసింతురో వారు నన్నే
యధిగమింతురు గావున నట్టిజ్ఞానులమహిమంబుఁ జెప్పఁ గొలఁది గాదు. ఐనను
సమ్యగ్దర్శను లైనయమ్మహాత్ములకు దేహాభిమానపరిత్యాగాదినిమిత్తం బయినక్లే
శము మిక్కిలి యెక్కుడు. దేహుల కవ్యక్తతత్వార్థగతి యత్యంతదుష్కరంబక
దా. సర్వకర్మములను నాయందు సన్న్యసించి మత్పరాయణులై యనన్యయోగ
మున నన్ను ధ్యానించుచు నుపాసించుభక్తులను నేను మృత్యుయుక్త మగుసం
సారసాగరమునుండి శీఘ్రముగ నుద్ధరింతు. నీవును నాయందు మనోబుద్ధుల నిలు
పుము. శరీరనాశానంతరము మదాత్మకుఁడవై నాయందే వసింతువు. అత్తెఱఁగునఁ
జిత్తస్థైర్యమున సమాధినిష్ఠుఁడు గాఁజాలవేని యభ్యాసయోగమున నవ్విధముప
నుపడఁ బ్రయత్నము సేయుము. అభ్యాసమునుం జేయఁ జాలవేని మత్కర్మప్ర

ధానుఁడ వగుము. అందులకును నేరవేని మద్యోగము నాశ్రయించి యతాత్ముఁడవై సర్వకర్మఫలత్యాగముఁ జేయుము. అభ్యాసముకంటె జ్ఞాన ముత్తమము. జ్ఞానముకంటెఁ దద్విశిష్టధ్యాన ముత్తమము. దానికంటెఁ గర్మఫలత్యాగ ముత్తమము. దానివలన శాంతిగలుగు. సర్వభూతముల యెడ వైర మెత్తక మిత్రతాకారుణ్యములు గలవాఁడు నిర్మముఁడు నిరహంకారుఁడు సమసుఖదుఃఖుఁడు క్షమావంతుఁడు నిత్యసంతుష్టుఁడు నియతాత్ముఁడు దృఢనిశ్చయుఁడు మత్సమర్పితమనోబుద్ధి లోకానుద్వేజకుఁడు లోకోద్వేగరహితుఁడు హర్షామర్షాదిముక్తుఁ డనపేక్షుఁడు శుచి దక్షుఁ డుదాసీనుఁడు గతవ్యథుఁడు సర్వారంభపరిత్యాగి త్యక్త శుభాశుభుఁడు శత్రుమిత్రతుల్యుఁడు సమద్వంద్వుఁడు సంగవర్జితుఁడు యదృచ్ఛాలాభసంతుష్టుఁడు నిరావాసుఁడు స్థిరచిత్తుఁడు భక్తిమంతుఁడు నగునరుఁడు నాకుఁబ్రియుఁడు. ధర్మావిరుద్ధ మమృతత్వకారణంబు నగుదీనిని యథోక్తముగ ననుష్ఠించుశ్రద్ధావంతులగుభక్తులు నాకత్యంతప్రియు లనిదామోదరుండు భక్తియోగంబుఁ దెలియం జెప్పిన విని విజయుండు కేశవా, ప్రకృతిపురుషులను క్షేత్రక్షేత్రజ్ఞులను జ్ఞానజ్ఞేయములనుం దెలిసికొనఁగోరెద ననియడుగ శౌరియతనికిట్లనియె.

### క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగప్రకారము.

కౌంతేయా, యీశరీరము * క్షేత్ర మనంబడు. దీని నెఱింగినయతండు క్షేత్రజ్ఞుఁ డనం బరఁగు. సర్వక్షేత్రములందును క్షేత్రజ్ఞుఁడు నేన యని యెఱుంగుము. క్షేత్రక్షేత్రజ్ఞుల నెఱుంగుటయే జ్ఞాన మని నామతము. ఆక్షేత్ర మేగుణములుగలయది, యేవికారములుగలయది, యత్కార్య, మాక్షేత్రజ్ఞుఁడు పాధిభూతము లయినయేశక్తులుగలవాఁ డనునీయర్థము సంక్షేపరూపముగఁ జెప్పెద నాకర్ణింపుము. ఈతత్త్వమును ఋషులు నానావిధములఁ జెప్పిరి. నానావిధవేదవచనములందునిది బహువిధముల నుపపాదితమై కన్పట్టుచున్నది. హేతునునిశ్చితంబు లయినబ్రహ్మసూత్రములందును బహుధానిరూపితంబై యున్నది. † పంచతన్మాత్ర, లహంకారము, బుద్ధి, యవ్యక్తము, దశేంద్రియంబులు, మనస్సు, శబ్దస్పర్శరూపరసగంధంబు, లిచ్ఛాద్వేషసుఖదుఃఖ ‡ సంఘాతచేతనాధృతులును సవికారంబైనసమష్ట్యాత్మకక్షేత్రము. § అమానిత్వ, మదంభిత్వ, మహింస, క్షాంతి, యార్జవ, మాచార్యోపాసనము, శౌచము, స్థిరత్వ, మాత్మవినిగ్రహ, మింద్రియా

* కర్మఫలనిష్పాదకమయి క్షేత్రతుల్య మగుటవలన క్షేత్రనామకంబయ్యె.

† ఇందు మహదాదులు వికారములు. ఇచ్ఛాద్వేషాదులు గుణములు గావున గుణవికారసహితముగ క్షేత్రలక్షణము నిరూపింపఁబడియె.

‡ దేహేంద్రియములకూడిక సంఘాతము.

§ ఇవి జ్ఞానసాధనములవుటవలన జ్ఞానపదమున వ్యవహరింపఁబడిరియె. క్షేత్రక్షేత్రజ్ఞపరిజ్ఞానమే ముఖ్య మగుజ్ఞానము.

ర్థములయెడ వైరాగ్య, మనహంకారము, జన్మమృత్యుజరావ్యాధులయెడదుఃఖ దోషదర్శనము,విషయప్రీతిరాహిత్యము,పుత్రదారగృహాదులయెడనాసక్త్యభావ, మిష్టానిష్టములయెడ నిత్యసమచిత్తత్వము, నాపై ననన్యయోగభక్తి, వివిక్తదేశసేవిత్వము, ప్రాకృతజనసమాజమునందుఁబ్రీతిరాహిత్య, మధ్యాత్మజ్ఞాననిత్యత్వము, తత్త్వజ్ఞానార్థదర్శనము ననునివి జ్ఞాన మనంబడు. ఏతద్విపరీతంబు లగుమానిత్వదంభిత్వాదు లజ్ఞానము నాఁబడు. ఇఁక జ్ఞేయముఁ జెప్పెద. దానిం దెలిసిన నమృతత్వప్రాప్తి గలుగు.పరబ్రహ్మము జ్ఞేయము. అది యాదిరహితంబు.*సత్తుగా దసత్తునుం గాదు. † మఱియు సర్వతస్సంగతపాణిపాదశిరోవక్త్రనేత్రశ్రోత్రవిశిష్టంబు. సర్వమునావరించి యుండునది. § సర్వేంద్రియగుణావభాసమానంబయ్యు సర్వేంద్రియవర్జితంబు. సర్వసంశ్లేషరహితంబు. సర్వభరణశీలంబు. నిర్గుణంబు. సుఖదుఃఖమోహాదిరూపంబునఁ బరిణతంబు లయినసత్త్వాదిగుణముల కుపలంభకము. భూతబహిరంతర్వర్తమానంబు. చరం బచరంబు సూక్ష్మమును గావున నవిజ్ఞేయంబు. ‡ దూరస్థంబు. ✓ సన్నిహితంబు.భూతవర్గమునం దవిభక్తమయ్యు విభక్తము విధమునఁ దోఁచునది. సర్వభూతములయుత్పత్తిస్థితిలయములకుఁ బరమకారణభూతంబు. జ్యోతిస్సులకుఁ బ్రకాశక మగుజ్యోతిస్సు. మోహాంధకారమునకుఁ బరంబు. జ్ఞానస్వరూపంబు. జ్ఞానగమ్యంబు. సర్వహృదయస్థితంబు. ఇట్టిపరబ్రహ్మంబుజ్ఞేయంబు. △ ఇవ్విధమున క్షేత్రక్షేత్రజ్ఞ జ్ఞానజ్ఞేయలక్షణము సంక్షేపముగఁ జెప్పితి. ¶ ప్రకృతియుఁ బురుషుఁడు ననాదులనియు వికారములు గుణములును బ్రకృతి

* ఇంద్రియగోచరపదార్థము లోకమునందు సత్తని వ్యవహరింపఁబడుటవలన నారీతిని జూడఁగా నింద్రియాగోచర మయినపరబ్రహ్మము సత్తుగా దనితోఁచును గావున "సత్తుగా" దనంబడియె. శాస్త్రాచార్యోపదేశసంస్కృతపరమార్థబుద్ధిచేఁ జూడఁగా సత్తగుటవలన "నసత్తునుంగా" దనఁబడియె.

† పరబ్రహ్మము క్షేత్రజ్ఞుఁడే కావున నాక్షేత్రజ్ఞుఁడు సర్వక్షేత్రాంతర్యామి యవుటవలనఁ దన్మూలముగ బ్రహ్మమునకుఁ బాణిపాదాదివిశిష్టత్వకల్పన ముపపన్నము.

§ సర్వేంద్రియములలో నంతఃకరణము ప్రధానము గావున నంతఃకరణగుణము లయినయధ్యవసాయాదులచేత నెఱుఁగబడఁదగిన దనిభావము.

‡ ఆత్మజ్ఞానశూన్యుల కగమ్యము గావున వారికి దూరస్థము.

✓ ఆత్మజ్ఞానవంతులకు సుగమము గావున వారికి సన్నిహితము.

△ జ్ఞేయ మైనపరబ్రహ్మమే క్షేత్రజ్ఞుఁడు గావున జ్ఞేయలక్షణముఁ జెప్పఁగా క్షేత్రజ్ఞలక్షణమును జెప్పఁబడినదే యని యూహించునది. బ్రహ్మమే క్షేత్రజ్ఞుఁ డనువిషయము "సర్వక్షేత్రములందును క్షేత్రజ్ఞుఁడు నేన యని యెఱుంగు" మనుభగవద్వచనమునఁ బ్రస్ఫుటము. అర్జునప్రశ్నములలోని క్షేత్రక్షేత్రజ్ఞ జ్ఞానజ్ఞేయలక్షణములు నిరూపింపఁబడినవి కావున నిఁకఁ బ్రకృతిపురుషలక్షణము నిరూపింపఁబడును.

¶ ప్రకృతియనఁగా మాయ. ఇదియే యవిద్యయనియు క్షేత్రమనియు వ్యవహరింపఁబడుచున్నది.

సంభవములనియుఁ దెలియుము. † కార్యకరణకర్తృత్వమునం బ్రకృతి కారణమ
నియు సుఖదుఃఖభోక్తృత్వమునఁ బురుషుఁడు కారణమనియుఁ జెప్పఁబడు. పురు
షుఁడు ప్రకృతిస్థుండై ప్రకృతిసంభవము లగుగుణముల ననుభవించు. పురుషు
నకు సదసద్యోనిజన్మములందుగుణసంగము కారణంబు. ఈదేహమునం దంత
ర్యామియై యున్నపురుషుఁ డుపద్రష్టయనియు ననుమంతయనియు భర్తయని
యు భోక్తయనియు మహేశ్వరుఁడనియుఁ బరమాత్ముఁడనియుఁ, బరుఁడనియుఁ
జెప్పఁబడుచుండు. పురుషుని, బ్రకృతిని, దద్గుణములను లెస్సయెఱింగినయతండు
సర్వవిధముల వర్తించినను బునర్జన్మముఁ గాంచఁడు. కొందఱు ధ్యానముసను
గొందఱు సాంఖ్యయోగముసను గొందఱు కర్మయోగముసను నాత్మయం దాత్మ
ను గనుచున్నవారు. ఇట్లు తెలిసికొనఁ జాలక కొందఱు శుశ్రూషాదుల నాచా
ర్యుల నుపాసించి తదనుగ్రహమునఁ దెలియుచున్నవారు. వారును బరమార్థ
శ్రవణపరాయణులై సంసారముఁ దరింపుచున్నవారు. స్థావరజంగమాత్మకం బయి
నపదార్థమెల్లను ‡ క్షేత్రక్షేత్రజ్ఞసంయోగముననే కలుగుచున్న దని నిశ్చయిం
పుము. సర్వభూతాంతర్యామియై భూతములు నశించినను దాను నశింపక సర్వ
సముఁడై యుండుపరమాత్ముఁ జూచినవాఁడు పరమార్థదర్శి యని నిర్ణయింపఁ
దగు. సర్వావస్థితుం డై నయీశ్వరుని సమదృష్టిం జూచుచు మూఢులయట్లు
§ లాత్మహింసఁ గావించికొనని బ్రహ్మవిదుఁడు పరమగతిం బ్రాపించు. సర్వకర్మ
ములను బ్రకృతి చేయుచున్న దనియెఱింగినవాఁ డాత్ముఁ డకర్తయని నిశ్చయిం
చును. అద్వితీయుం డై నపరమాత్మునియందే భూతములు నానావిధములై వర్తిం
పుచున్నవనియు సర్వ మాత్మమయమనియు నెప్పు డెఱుఁగు నప్పుడే యతండు
బ్రహ్మైక్యభావనం గాంచు. అవ్యయుఁ డై నయీ పరమాత్ముఁడు శరీరస్థుఁడయ్యు
ననాదిత్వము నిర్గుణత్వముం గారణములుగాఁ గర్తయును గర్మఫలలిప్తుఁడునుం
గాఁడు. ఆకాశముచందమున సూక్ష్ముఁడై సర్వగతుఁడై నపరమాత్ముఁడు లిప్తుఁడు
గాఁడు. ఈలోకమునెల్ల సూర్యుఁ డెట్లట్ల క్షేత్రజ్ఞుఁడు క్షేత్రములెల్లఁ బ్రకా
శింపఁ జేయు. ఇవ్విధమున క్షేత్రక్షేత్రజ్ఞులయంతరమును, భూతప్రకృతి యగున

---

పురుషుఁడనఁగా జీవుఁడు. ఇతఁడే క్షేత్రజ్ఞుఁడు. ఈప్రకృతిపురుషులే విజ్ఞానయోగప్రకరణమునం
దలి పరాపరప్రకృతులు. దీనిచేతఁ బ్రకృతిపురుషులు క్షేత్రక్షేత్రజ్ఞులే యని యేర్పడుచున్నది.

† కార్య మనఁగా శరీరము. కరణము లనఁగా దేహారంభకవికారములు.

‡ విషయవిషయిభూతము లయినక్షేత్రక్షేత్రజ్ఞుల కితరేతరతద్ధర్మాధ్యాసమే క్షేత్రక్షేత్రజ్ఞసం
యోగము. క్షేత్రజ్ఞుఁడు నిరవయవుఁడుగావున నవయవసంశ్లేషద్వారకసంబంధము మొదలయినదిగాదు.

§ పరమాత్మభూతుఁడైనతన్నుఁ దా నెఱుంగక యనాత్మము నాత్మఁగ భావించుట యాత్మ
తిరస్కారము. అదియే యాత్మహింస.

విద్యవలన మోక్షమును జ్ఞానచక్షుస్సునం జూచినవారు పరమగతిఁ బ్రాపింతు రని పురుషోత్తముఁడు పార్థునకు క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము బుద్ధ్యారూఢముఁ గావించి వెండియు నిట్లనియె.

గుణత్రయవిభాగయోగ ప్రకారము.

భారతా, మఱియు జ్ఞానములలో నుత్తమ మయినజ్ఞానముఁ జెప్పెద దానిఁ దెలిసి మునులు పరమసిద్ధిం బొందిరి. ఈజ్ఞానము నాశ్రయించి మత్సారూప్యముఁ బొందినవారు సర్గకాలమున జనింపరు. ప్రళయసమయమునఁ జలింపరు. త్రిగుణాత్మకం బయినమదీయమాయ జగదుత్పత్తికారణమగుటంజేసి యోని యనంబడు. అందు నేను సర్వభూతజన్మకారణ మయినబీజము నుంచెద. దానివలన సర్వభూతము లుత్పన్నము లగు. కావున సర్వయోనులందు జనించుమూర్తులకెల్ల మదీయమాయ యోనియనియు నేను గర్భాధానంబుఁ గావించుతండ్రి ననియు నిరూఢవ్యవహారంబు గలుగు. ప్రకృతిసంభవము లగుసత్త్వరజస్తమోనామకగుణములు మూఁడు నవ్యయుం డై నక్షేత్రజ్ఞుని దేహమునందు బంధించు. అందు సత్త్వము నిర్మల మగుటంజేసి ప్రకాశకంబై నిరుపద్రవంబై సుఖసంగమునను * జ్ఞానసంగమునను బంధకం బగు. రజస్సు రాగాత్మకంబై తృష్ణాసంగసముద్భవకారణంబై కర్మసంగమున దేహికి బంధకం బగు. తమస్సజ్ఞానజన్యంబై సర్వదేహిమోహనంబై ప్రమాదాలస్యనిద్రలచే బంధకం బగు. ఇవ్విధమున సత్త్వము దేహిని సుఖసక్తుం గావించు. రజస్సు కర్మసక్తు నొనరించు. తమస్సు జ్ఞానము నావరించి ప్రమాదసక్తుం జేయు. ఈదేహమునందు సర్వేంద్రియములందును బ్రకాశాత్మకజ్ఞానము గలిగెనేని సత్త్వము వృద్ధిఁ గాంచెననియు లోభప్రవృత్తికర్మారంభానుపశమస్పృహలు గలిగెనేని రజస్సు ప్రవృద్ధం బయ్యెననియు నప్రకాశాప్రవృత్తిప్రమాదమోహములు గలిగెనేని తమస్సు పెరిగెననియు నూహింపవలయు. సత్త్వవృద్ధియయినతఱి దేహమువిడిచినయతం డుత్తమలోకములఁ బడయు. రజస్సు ప్రవృద్ధంబై యుండ దేహాపాయంబుఁ బొందినయతండు కర్మాచరణాసక్తంబైనమనుష్యజన్మ మెత్తు. తమస్సు పెరిగియుండఁగఁ జచ్చినవాఁడు పశ్వాదియోనులందుఁ బుట్టును. సాత్త్వికకర్మమునకు నిర్మలఫలంబనియు రాజసకర్మమునకు దుఃఖము ఫలమనియుఁ దామసకర్మమున కజ్ఞానము ఫలమనియుఁ బెద్దలు సెప్పుదురు. సత్త్వమువలన జ్ఞానంబును రజస్సువలన లోభంబును దమస్సువలనఁ బ్రమాదమోహాజ్ఞానంబులుం గలుగు. సాత్త్వికు లూర్ధ్వలోకముల కరుగుదురు. రాజసులు మధ్యలోకమున నుండుదురు. తామసు లధోలోకములకుఁ బోవుదురు. కార్యకారణవిషయరూపమునఁ బరిణతము లయి

* ఇక్కడ జ్ఞాన మంతఃకరణధర్మము.

నగుణములకంటె నన్యుఁడు కర్త గాఁ డనియు నాత్ముఁడు గుణాతీతుఁడనియుఁ దెలిసినవిద్వాంసుఁడు మద్భావం బధిగమించు. దేహారంభకము లయినయీమూఁడుగుణముల నతిక్రమించిన దేహి జన్మమృత్యుజరాదుఃఖవిముక్తుఁడై యమృతత్వప్రాప్తుఁడగు ననిన విని యర్జునుఁడు మహాత్మా, గుణాతీతుఁ డేచిహ్నములఁ గనుపట్టును? ఎట్లు గుణముల నతిక్రమించును? వానియాచారం బెయ్యది? తేటపఱుపు మనియడుగఁ గమలనాభుండు వెండియు నిట్లనియె. గుణత్రయలక్షణములగుప్రకాశప్రవృత్తిమోహములు ప్రవర్తించెనేని ద్వేషింపక నివర్తించెనేని కోరక యుదాసీనునివిధమున వర్తించుచు గుణములకుఁ జలింపక కార్యకరణవిషయపరిణతము లయినగుణము లొండొంట వర్తించు ననిభావించి స్వరూపస్థితుండై సమసుఖదుఃఖుండై ప్రసన్నుండై సమానలోష్టాశ్మకాంచనుండై తుల్యప్రియాప్రియుండై తుల్యనిందాస్తుతియై తుల్యమానావమానుండై తుల్యశత్రుమిత్రపక్షుండై దృష్టాదృష్టార్థకర్మపరిత్యాగశీలుఁడై నయతఁడు గుణాతీతుఁ డనంబడు. అవ్యభిచార మయినభక్తియోగమున నన్ను సేవించునతఁడు గుణములనతిక్రమించి బ్రహ్మత్వముఁ జెందు. అమృతం బవ్యయంబు శాశ్వతంబు జ్ఞానయోగధర్మప్రాప్యంబు సుఖస్వరూపం బైకాంతికంబు నగుబ్రహ్మమునకు నేన ప్రతిష్ఠానం బని యిట్లు హరికిరీటికి గుణత్రయవిభాగయోగంబుఁ దేటపఱిచి మఱియు నిట్లనియె.

### పురుషోత్తమప్రాప్తియోగప్రకారము.

* ఊర్ధ్వమూల మధశ్శాఖము నగునశ్వత్థవృక్ష మొక్కటి గలదు. దానికి వేదములు పర్ణములు. దానిం దెలిసినవాఁడు వేదవిదుఁ డనంబడు. † శబ్దస్పర్శరూపరసగంధములు చివుళ్లుగాఁగ సత్త్వాదిగుణములఁ బెరిగి దానికొమ్మలు క్రిందను మీఁదను వ్యాపించియున్నవి. § దానికి మూలములు కర్మానుబంధములై మనుష్యలోకమునందుఁ గ్రింద. వ్యాపృతంబులై యున్నవి. అయ్యశ్వత్థవృక్షమునకు రూపంబు నాద్యంతప్రతిష్ఠానంబులును గానరావు. దృఢరూఢమూలం బయినదానిం బుత్రమిత్రకళత్రధనాదిసంగపరిత్యాగం బనుదృఢశస్త్రమున నఱికి దానికిమీఁద నున్నపరమపదముఁ బొందఁగ సంసారమాయావృక్షప్రవృత్తికిఁ గారణభూతుఁ డైనయాపురుషు నాశ్రయింతు నని చిత్తానుసంధానపూర్వకముగఁ

---

* ఊర్ధ్వ మనఁగా నవ్యక్తమాయాశక్తిమంతం బయినబ్రహ్మము. సంసారవృక్షము. తన్మూలమని యర్థము. ఆవృక్షమునకు మహదహంకారపంచతన్మాత్రాదులు శాఖాతుల్యములు. ఆశాఖ లధోభాగమునఁ గలది యనిభావము. అశ్వత్థవృక్ష మనఁగా సంసారవృక్ష మని తాత్పర్యము. కర్మకాండము లగువేదములు ధర్మాధర్మఫలసాధనప్రకాశకంబులై సంసారరక్షకములు గావునఁ బత్రతుల్యములవుటంజేసి వేదములు పర్ణములనంబడియె. † ఇక్కడఁ గొమ్మ లనఁగాఁ గర్మఫలములు.

§ ఇక్కడ మూలము లనఁగాఁ గర్మఫలజనితరాగద్వేషాదివాసనలు.

జింతించుచు జ్ఞాననిష్ఠ నడుపవలయు. అప్పరమపదముఁ బ్రాపించినవారు పునరావృత్తిం జెందరు. మానమోహారహితులై వర్జితసంగదోషులై నివృత్తకాములై సుఖదుఃఖాదిద్వంద్వదుఃఖనిర్ముక్తులై నయధ్యాత్మనిత్యులు వ్యయశూన్య మగు నప్పదముఁ బ్రాపింతురు. ఆపదమును సూర్యచంద్రాగ్నులుం బ్రకాశింపఁ జేయఁజాలరు. అదియే మదీయపరధామంబు * మదీయాంశభూతుండై సనాతనుండైనజీవుఁ డొకశరీరము విడిచి వేఱొకశరీరముఁ బొందునెడ వాయువు పువ్వులనుండి పరిమళముఁ గొనుచందమునఁ దనకు విషయోపభోగాధిష్ఠానములగుశ్రోత్రాదిజ్ఞానేంద్రియములనైదింటిని షష్ఠం బగుమనస్సును నాకర్షించును. విమూఢులు జీవుఁ డుత్క్రమింపుచున్నను దేహమున నున్నను శబ్దాదుల ననుభవింపుచున్నను గుణాన్వితుఁడై యున్నను నిట్టివాఁ డని లెస్స యెఱుంగనేరరు. జ్ఞానచక్షుష్కు లెఱుంగుదురు. ప్రయత్నపరు లైనయోగులు కొంద ఱాత్మానుసంధానమునఁ జూతురు. అసమాహితచిత్తులు యత్నపరులయ్యుఁ గనుఁగొనఁ జాలరు. చంద్రాదిత్యాగ్నులయందుఁ గలతేజము నాయదియే యని తెలిసికొనుము. ఏను భూమిని బ్రవేశించి బలమున సర్వభూతముల ధరింపుచున్నవాఁడను. రసాత్మకుఁ డైనసోముఁడనై సర్వౌషధులను బోషింపుచున్నవాఁడను. వైశ్వానరనామధేయుం డైనయుదరాగ్నినై ప్రాణులదేహముల నాశ్రయించి ప్రాణాపానసమానయుక్తుఁడనై భక్ష్యభోజ్యలేహ్యచోష్యరూప మయినచతుర్విధాన్నమును బచనంబుఁ గావింతు. సర్వహృదయములయందును నేనున్నవాఁడను. స్మృతిజ్ఞానాపోహములును నావలననే గలుగు. సర్వవేదవేద్యుఁడు నేన. వేదాంతకర్తను నేన. వేదవిదుఁడను నేన. లోకమునందు క్షరుఁడనియు నక్షరుఁడనియు రెండుదెఱంగులఁ బురుషులు గలరు. సర్వభూతములు క్షరుఁడు. కూటస్థుఁ డక్షరుఁడు. పరమాత్ముఁ డీపురుషులకంటె నుత్తముఁడు. అవ్యయుఁ డైనయయ్యీశ్వరుఁడే లోకత్రయము నావేశించి భరింపుచున్నవాఁడు. క్షరాక్షరపురుషులకంటె నుత్తముఁడ నగుటంజేసి యేను లోకవేదములందుఁ బురుషోత్తముఁ డనఁ బ్రసిద్ధుఁడనైతి. ఇట్టిపురుషోత్తముఁడగు నన్ను మోహారహితుఁడై యాత్మైక్యానుసంధానముననెఱింగినసర్వజ్ఞుఁడు సర్వభావముల నన్నుఁ బొందును. అనఘా, గుహ్యతమంబయినయీశాస్త్రము నీకుఁ జెప్పితి. దీనిం దెలిసినబుద్ధిమంతుఁడు కృతార్థుఁ డగుననిపార్థునకుఁబరమపురుషుండు పురుషోత్తమప్రాప్తియోగంబెఱింగించి మఱియునిట్లనియె.

* ఘటపరిచ్ఛిన్నాకాశము ఘటోపాధివశమున ఘటాకాశమై ఘటాంశమనివ్యవహరింపఁబడురీతి నవిద్యాకల్పితశరీరోపాధిపరిచ్ఛిన్నుఁ డైనయాత్ముఁ డాత్మాంశభూతుఁ డనఁ బడియె. కావుననిరవయవుఁ డైనపరమాత్మున కంశ మెట్లని విచారింపఁ బనిలేదు. అంశసామ్యముననంశభూతుఁ డనఁబడియె.

## దైవాసురసంపద్విభాగయోగప్రకారము.

అభయ, మంతఃకరణశుద్ధి, జ్ఞానయోగవ్యవస్థ, దానము, దమము, యజ్ఞము, వేదాధ్యయనము, తపస్సు, ఋజుత్వ, మహింస, సత్య, మక్రోధము, త్యాగము, శాంతి, యపైశునము, భూతదయ, యలోలత్వము, మార్దవము, హ్రీ, యచాపలము, ప్రాగల్భ్యము, క్షమ, ధృతి, శౌచ, మద్రోహ, మాత్మస్తుత్యభావము ననుగుణములు దైవసంపదభిజాతునకుఁ గలుగు. దంభము, దర్పమతిమానము, క్రోధము, పారుష్య, మజ్ఞాన మనునివి యాసురసంపదభిజాతునకుఁ గలుగు. దైవసంపత్తు మోక్షమునకు నాసురసంపత్తు బంధనమునకుం గారణం బగును. నీవు దైవసంపదభిజాతుండవు గావున వగవం బని లేదు. ఈలోకమునందు దైవాసురభేదమున భూతసర్గములు రెండు గలవు. దైవమును సవిస్తరముగఁ జెప్పితి. ఇంక నాసురముఁ జెప్పెద వినుము. ఆసురు లయినజనులు ప్రవృత్తినివృత్తిమార్గముల రెంటిని నెఱుంగరు. శౌచాచారసత్యములు వారికి లేవు. జగమంతయు నసత్యమనియు ధర్మాధర్మప్రతిష్ఠాశూన్యంబనియు నిరీశ్వరమనియు మిథునక్రియాసంభూతమనియుఁ గామహేతుకమనియుం బలుకుదురు. ఇట్టిదుర్వివేకం బాశ్రయించి నష్టాత్ములైనయల్పబుద్ధులు క్రూరకర్ము లగుశత్రువులై లోకక్షయం బాపాదింతురు. పూరింపరానికామము నాశ్రయించి దంభమానమదాన్వితులై మోహమున నసన్నిశ్చయముల గ్రహించి యశుచివ్రతములం బ్రవర్తించుచు మరణాంతంబై యపరిమేయం బైనచింతను బొంది కామభోగమే పరమపురుషార్థ మనినిశ్చయించుచు నాశాపాశశతబద్ధులై కొందఱు కామభోగార్థ మన్యాయమున నర్థ మార్జించి దీని నే నిప్పుడు పొందితి, దీనిం బొందఁగల, నియ్యది నాకుఁ గల, దియ్యదియు రాఁగలయది, యీశత్రుం జంపితి, నికను గొందఱఁ జంపఁగలను, నేన యీశ్వరుఁడను, భోగవంతుఁడను, సుఖవంతుఁడను, బలవంతుఁడను, సిద్ధుఁడ, నాఢ్యుఁడను, మహాకులీనుఁడను, నాతో సరివచ్చువాఁ డింకెవ్వఁడు గలఁడు. యజ్ఞముల నాచరింతును. దానములఁ జేయుదును. మహామోదమునఁ బొదలుదు నని యిట్టు లవివేకమోహితులై వివిధప్రకారముల విభ్రాంతులై యపరిశుద్ధము లగునరకములం బడుదురు, ఆత్మస్తుతిపరాయణు లైన స్తబ్ధులు కొందఱు ధనమానమదాన్వితులై దంభమున నవిధిపూర్వకముగ నామమాత్రయజ్ఞములఁ జేయుదురు. మఱియు వారు బలదర్పకామక్రోధాహంకారసంశ్రితులై యాత్మపరదేహములయందును సాక్షిభూతుఁడై సర్వసముఁడైన నన్నాయెడ ద్వేషాసూయలం జూపుదురు. అత్యంతక్రూరు లయినయానరాధములను గ్రూరప్రాయము లయినవ్యాఘ్రసింహాదియోనులందుఁ బడఁద్రోయుదు. క్రూరయోనులం బొందినమూఢు లేజన్మమునందును నన్నుఁ బొం

దనేరక యధమగతిం జెందుచు సంసారచక్రమునఁ బరిభ్రమించుచుందురు. కామక్రోధలోభము లనుమూడు నాత్మనాశనకారణములు నరకద్వారములుఁ గావున నామూటినిం బరిత్యజింపవలయు. తమోద్వారము లైనయీమూటినిం బాసిననరుఁ డాత్మశ్రేయస్సమాచరణపరుండై యుత్తమగతిం బ్రాపించు. శాస్త్రవిధి నుల్లంఘించి కామమునఁ దోఁచినట్లు ప్రవర్తించునతఁడు సిద్ధిని సుఖమును బరమగతినిం బొందఁ జాలఁడు. కార్యాకార్యవ్యవస్థానమునందు శాస్త్రము ప్రమాణము. కావున శాస్త్రవిధానోక్తం బయినకర్మంబు నాచరింపు మని యిట్లు దేవదేవుండు దైవాసురసంపద్విభాగయోగము విజ్ఞాతార్థంబుఁ గావించిన విని పాండవుఁడు కృష్ణా, శాస్త్రవిధానమును బరిత్యజించి యాస్తిక్యబుద్ధిసమన్వితులై దేవపూజలఁ జేయువారినిష్ఠ యెట్టిది? సాత్త్వికరాజసతామసములలో నదియెయ్యదియగు నని యడుగ నతనికి భగవంతుఁ డిట్లనియె.

### శ్రద్ధాత్రయవిభాగయోగప్రకారము.

స్వభావజనితం బైనశ్రద్ధ సాత్త్వికరాజసతామసభేదములఁ ద్రివిధం బగు. అంతఃకరణానురూపముగ నెల్లవారికిని శ్రద్ధ వొడముచున్నది. ఎవని కెట్టిశ్రద్ధ గలుగు నతఁడు తచ్ఛ్రద్ధానురూపుఁ డగు. సాత్త్వికులు దేవతలను, రాజసులు యక్షరాక్షసులను, దామసులు భూతప్రేతగణములను బూజింతురు. దంభాహంకారకామరాగబలాన్వితులై యవివేకులు శరీరస్థిత మగుభూతసముదాయమును గృశింపఁ జేయుచు నంతర్యామిపురుషుం డైననన్నుల్లఘించుచు శాస్త్రవిహితము గానిఘోరతపము సల్పునట్టివా రాసురనిశ్చయు లని యెఱుంగుము. సర్వజనుల కాహారయజ్ఞతపోదానములు త్రివిధములై పరఁగు నెట్లంటేని. ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివర్ధనము రసస్నేహవంతము స్థిరము హృద్యము నగునాహారము సాత్త్వికులకుఁ బ్రియము. కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహకమై దుఃఖశోకరోగప్రద మైనయాహారము రాజసులకుఁ బ్రియము. మందపక్వము గతరసము దుర్గంధము పర్యుషిత ముచ్ఛిష్ట మశుద్ధము నగునాహారము తామసులకుఁ బ్రియము. విధిచోదితం బనుతాత్పర్యమున ఫలము నపేక్షింపక మనస్సమాధానపూర్వకముగఁ జేయఁబడుయజ్ఞము సాత్త్విక మనంబడును. ఫలాపేక్షం జేయంబడునదియు దంభార్థ మనుష్ఠింపఁబడునదియు రాజస మనంబడును. విధిహీనముగను మంత్రహీనముగను శ్రద్ధాహీనముగను నన్నహీనముగను దక్షిణాహీనముగను జేయంబడుయజ్ఞము తామసము నాఁబడు. తపస్సు శారీరవాఙ్మయమానసభేదమునఁ ద్రివిధంబై పరఁగు. అందు దేవద్విజగురుప్రాజ్ఞపూజనంబు శౌచంబు ఋజుత్వంబు బ్రహ్మచర్యం బహింస యనునివి శారీరతప స్సనంబడు. అనుద్వేగకరము సత్యము ప్రియము హితము నగువచనము స్వాధ్యాయాభ్యాసము నను నివి

వాఙ్మయతపస్సు నాఁబడు. మనఃప్రసాదము సౌమ్యత్వము మౌన మాత్మనిగ్రహ
ము భావసంశుద్ధి యనునివి మానసతపస్సు నాఁబడు. త్రివిధమగు నాతపస్సు ఫలా
పేక్ష మాని శ్రద్ధాపూర్వకముగఁ జేయఁబడునేని సాత్త్వికమనియు, సత్కార
మానపూజల నపేక్షించి దంభార్థము చేయఁబడునేని రాజసమనియు, నవివేక
నిశ్చయమున నాత్మపీడాపూర్వకముగ నొండెఁ బరస్వాపహరణార్థమొండెఁ జేయఁ
బడునేని తామసమనియుఁ జెప్పఁబడు. దేశకాలపాత్రవిచారపూర్వకముగాఁ బ్ర
త్యుపకారమును గోరక విధివిహిత మనుభావమునఁ జేయఁబడుదానము సాత్త్వి
కము. ప్రత్యుపకారార్థముగాని పరలోకఫలార్థముగాని ఖేదపూర్వకముగఁ జేయఁ
బడుదానము రాజసము. అదేశకాలములం దపాత్రభూతులకు సత్కారశూన్య
ముగ నవమానపూర్వకముగఁ జేయఁబడుదానము తామసము. ప్రణవమును
దత్సత్పదములును బ్రహ్మనిర్దేశములు గావునఁ దొలుతఁ బ్రణవము నుచ్చరించి
బ్రహ్మవాదులు విధివిహితము లయినయజ్ఞదానతపఃకార్యములఁ జేయుదురు.
తచ్ఛబ్దము నుచ్చరించి ఫలాభిసంధిరహితులై ముముక్షువులు యజ్ఞతపోదానక్రి
యలఁ జేయుదురు. సద్భావసాధుభావప్రశస్తకర్మములందు సచ్ఛబ్దము ప్రయో
గింపఁబడు. మఱియు యజ్ఞతపోదానస్థితియుఁ దదర్థకర్మంబును సచ్ఛబ్దవాచ్యంబ.
శ్రద్ధారహితముగఁ జేయఁబడుహోమదానతపఃకర్మం బస త్తనంబడు. అది
యుభయలోకములందును సాధనంబు గాదని యిట్లు హృషీకేశుండు గుడాకేశునకు
శ్రద్ధాత్రయవిభాగయోగంబుఁ దేటపఱిచినవినియతండు కేశవా, సన్న్యాసత్యాగ
శబ్దములయర్థముల నెఱుంగఁగోరెద ననియడుగ మాధవుఁడతనికిమఱియునిట్లనియె.

### మోక్షసన్న్యాసయోగప్రకారము.

కామ్యకర్మపరిత్యాగము సన్న్యాస మని కొందఱును సర్వకర్మఫలత్యా
గము త్యాగ మని కొందఱు నందురు. కర్మము బంధకారణంబు గావునఁ ద్యా
జ్య మని కొందఱును యజ్ఞదానతపఃకర్మము త్యాజ్యము గాదని మఱికొందఱును
జెప్పుదురు. త్యాగనిశ్చయముఁ జెప్పెద వినుము. * గుణభేదమునంజేసి త్యాగ
ము త్రిప్రకారంబై ప్రవర్తిల్లు. యజ్ఞదానతపఃకర్మములు కర్తవ్యములేకాని త్య
క్తవ్యములు గావు. ఫలాభిసంధిరహితుల కవి చిత్తశుద్ధికారణములు. ఈకర్మము
లును సంగము విడిచి ఫలముఁ గోరక కర్తవ్యములేయని నామతము. చిత్తశుద్ధి
కారణం బయిననిత్యకర్మముఁ బరిత్యజించుట యనుపపన్నము. మోహమునఁ
బరిత్యజించిన నాత్యాగము తామసమనంబడును. ఆచరణము కష్ట మనుభావ

* త్యాగసన్న్యాసశబ్దవాచ్య మయినయర్థ మొక్కటియే యనిభావించి యిచ్చటఁ "త్యాగనిశ్చయముఁ జెప్పెద విను" మని భగవంతుఁడు చెప్పెను. ఈప్రశ్నోత్తరములు కర్మాధికృతునకు సంబంధించినవిగాని జ్ఞానికి సంబంధించినవి గావు.

మునఁ గాయక్లేశమునకు వెఱచి త్యజించిన నాత్యాగము రాజస మనంబడును. ఆత్యాగము నిష్ఫలము. విధిచోదితముగావునఁ గర్తవ్య మనుబుద్ధిం జేయుచు ఫలాసంగముఁ ద్యజించిన నాత్యాగము సాత్త్వికము నాఁబడు. కామ్యకర్మము శరీరారంభక మని దానియెడఁ గినియక నిత్యకర్మము చిత్తశుద్ధిసాధన మని దానియెడ సంగముఁ బెట్టక సంశయము మాని మనస్సమాధానపూర్వకముగఁ ద్యజించునట్టిత్యాగి యాత్మజ్ఞానవంతుఁ డనఁ బరఁగు. సర్వకర్మములను దేహి త్యజింపఁ జాలఁడు. కావునఁ గర్మఫలత్యాగి త్యాగి యనంబడు. ఇష్టానిష్టమిశ్రభేదమునఁ ద్రివిధ మగుకర్మఫలము పారమార్థికత్యాగరహితు లయినకర్త్రాధికారులకుఁ గలుగు. పరమార్థసన్న్యాసులై కేవలజ్ఞాననిష్ఠులగు పరమహంసపరివ్రాజకులకుఁ దత్ఫలములు గలుగవు. ఇచ్ఛాద్వేషసుఖదుఃఖాభివ్యక్తి కాశ్రయంబై యధిష్ఠానపదవాచ్య మగుశరీరము, నుపాధిలక్షణుండై భోక్తృపదబోధ్యుఁడై నకర్తయును, శ్రోత్రాదీంద్రియములును, వివిధప్రాణాపానాదిచేష్టలును, జక్షురాదీంద్రియానుగ్రాహకులై దైవపదగమ్యులై నయాదిత్యాదిదేవతలును ననునీపంచకంబు సర్వకర్మనిష్పత్తికారణం బని వేదాంతసిద్ధాంతమున నిర్ణయింపఁబడియె. నరుఁడు మనోవాక్కాయములఁ జేయున్యాయ్యకర్మమునకుఁగాని యన్యాయ్యకర్మమునకుఁగాని యీపంచకము కారణము. ఇట్లు కర్మము పూర్వోక్తపంచకనిర్వర్త్యంబై యుండ నిత్యశుద్ధబుద్ధముక్తుం డైనయాత్మఁ గర్తఁగఁ దలంచువాఁ డసంస్కృతబుద్ధియవుటంజేసి పరమార్థముఁ దెలియనేరఁడు. ఎవ్వఁడు నేను గర్త నని యహంప్రత్యయముఁ బొందఁడో యెవ్వనిబుద్ధి కర్మఫలలిప్తంబు గాకుండునో యతం డీలోకములఁ జంపినను జంపినవాఁడు గాఁడు. వధప్రయుక్తఫలమునుం బొందఁడు. జ్ఞానజ్ఞేయజ్ఞాతృభేదమునఁ గర్మచోదనము త్రివిధంబు. కరణకర్మకర్తృభేదమునఁ గర్మసంగ్రహము త్రిప్రకారంబు. అందు జ్ఞానకర్మకర్తలకు గుణభేదమునంజేసి మూఁడుభేదములు గల వని కాపిలసాంఖ్యదర్శనమునఁ జెప్పఁబడియె. ఆభేదములనుం జెప్పెద వినుము. అవ్యక్తాదిస్థావరాంతము లయిననానావిభక్తభూతగణములం దవిభక్తంబై యవ్యయంబై యాత్మవస్తు వొక్కటియ యున్న దని యేజ్ఞానమున నెఱుఁగఁబడు నయ్యది సాత్త్వికజ్ఞానము. శరీరభేదమునంజేసి యాత్మభేద మేజ్ఞానమున నెఱుఁగఁబడు నయ్యది రాజసజ్ఞానంబు. శరీరపరిచ్ఛిన్నుఁడే జీవుఁడనియు దారుపాషాణాదిమాత్రుఁడే యీశ్వరుఁడనియు నిర్యుక్తికముగ నతత్త్వార్థ మేజ్ఞానమున నెఱుఁగఁబడు నయ్యల్పజ్ఞానము తామసజ్ఞానము. రాగద్వేషసంగఫలాపేక్షారహితంబుగఁ జేయఁబడునిత్యకర్మము సాత్త్వికకర్మము. ఫలాసక్తినొండె నహంకారముననొండె బహుళాయాసమునఁ జేయఁబడుకర్మము రాజసకర్మము. మీఁదు పరికింపక యర్థశక్తిక్షయముఁ జింతింపక ప్రాణిపీడకుఁ దలఁకకయా

త్మసామర్థ్యముఁ బరిశీలింపక కేవలమోహమునఁ జేయఁబడుకర్మము తామసకర్మము. సంగము విడిచి యహంకారము మాని సిద్ధ్యసిద్ధులయెడ వికారముఁ బొందక ధృత్యుత్సాహములఁ జేయునట్టికర్త సాత్త్వికకర్త యనంబడును. రాగలోభసమన్వితుండై కర్మఫలార్థియై పరపీడాకరస్వభావుఁడై బహిరంతశ్శౌచరహితుఁడై హర్షశోకాన్వితుఁడైనకర్త రాజసకర్త యనంబడును. అసమాహితుఁడసంస్కృతబుద్ధి యవినయపరుఁ డత్యంతమాయావి యతిమాత్రపరవిభేదనతత్పరుఁ డలసుఁడవసన్నస్వభావుఁ డతిచిరకారియు నగుకర్త తామసకర్త నాఁబడును. బుద్ధిధృతులకును గుణభేదనిమిత్తమున మూఁడుదెఱంగులు గల వెట్లంటేని. ప్రవృత్తినివృత్తులను గార్యాకార్యములను భయాభయములను బంధమోక్షములనుం దెలియుబుద్ధి సాత్త్వికబుద్ధి. ధర్మాధర్మాదుల లెస్సయెఱుంగనిబుద్ధి రాజసబుద్ధి. అధర్మమును ధర్మమనియు నకార్యమును గార్యమనియు నిట్లు సర్వార్థములను విపరీతముగ గ్రహించుబుద్ధి తామసబుద్ధి. సమాధిచేత మనఃప్రాణేంద్రియవ్యాపారములను శాస్త్రవిరుద్ధమార్గమునఁ బోనీక నిలుపునట్టిధృతి సాత్త్వికధృతి. ఫలాకాంక్షం జేసి ప్రసంగవశమున ధర్మార్థకామములం బ్రవర్తింపఁజేయుధృతి రాజసధృతి. స్వప్నభయశోకమదవిషాదములఁ బ్రవర్తింపఁజేయుధృతి తామసధృతి. అభ్యాసమున రతినిదుఃఖశాంతినిం గావించుసుఖమునకును గుణభేదముననే మూఁడుదెఱంగులు గలవు వివరించెద వినుము. జ్ఞానవైరాగ్యధ్యానసమాధ్యారంభమునఁ దొలుత విషమురీతి దుఃఖాత్మకంబై పరిణామమున నమృతతుల్యంబైన యాత్మబుద్ధిప్రసాదజన్యసుఖము సాత్త్వికసుఖము. విషయేంద్రియసంయోగమునఁ దొలుత నమృతతుల్యంబై పరిణామమున విషసమానంబైనసుఖము రాజససుఖము. తొలుతను గడపటను నాత్మమోహనంబగునిద్రాలస్యప్రమాదజన్యసుఖము తామససుఖము. గుణత్రయరహితపదార్థ మొక్కటేనియు భూలోకముననొండె స్వర్గలోకముననొండెఁ గన్పట్టదు. పెక్కు లేల? దేవతలు నట్టివారుగారు. స్వభావజన్యగుణములం జేసి బ్రాహ్మణాదులకును గర్మములు భిన్నభిన్నములై యుండు వినుము. శమము, దమము, తపస్సు, శౌచము, క్షాంతి, యార్జవము, జ్ఞానము, విజ్ఞాన, మాస్తికత్వము ననువిని బ్రాహ్మణకర్మములు. శౌర్యము, ప్రాగల్భ్యము, ధైర్యము, దాక్ష్యము, యుద్ధముననపరాఙ్ముఖత్వము, దానము, ప్రభుశక్తిప్రకటీకరణ మనునివి క్షత్రియకర్మములు. కృషిగోరక్షావాణిజ్యములు వైశ్యకర్మములు. పరిచర్య శూద్రకర్మము. స్వస్వకర్మసమాచరణపరు లయి నరులు భూతప్రవర్తకుఁడై సర్వవ్యాపకుఁడైనయీశ్వరు నారాధించి క్రమమున జ్ఞాననిష్ఠాయోగ్యతం బొరయుదురు. గుణరహితమైనను స్వధర్మమే సాధ్వనుష్ఠితమయినపరధర్మముకంటె నుత్తమము. స్వభావప్రాప్తం బయినకర్మంబు నాచరిం

చువాఁడు కిల్బిషంబుఁ బొరయఁడు. కావునఁ గాంగేయా, సహజకర్మము దోష వంతం బయినను బరిత్యాజ్యంబు గాదు. పరికించిచూచిన నగ్ని ధూమమున నెట్టు లట్టుల సర్వకర్మములు త్రిగుణాత్మకములగుటంజేసి సహజదోషమున నావృ తంబులై యుండు. సర్వసంగనిర్ముక్తుండై వశీకృతచిత్తుండై విగతస్పృహుఁడైన యతిఁడు సమ్యగ్దర్శనపూర్వకం బయినసర్వకర్మసన్న్యాసమునఁ బరమ మయిన సద్యోముక్తిసిద్ధింబడయు. సహజకర్మమున నీశ్వరు నారాధించుటం గలుగుసిద్ధిం బొందినయతిఁడు బ్రహ్మమునధిగమించువిధమునుసంక్షేపముగఁ జెప్పెదవినుము.ఆసి ద్ధియే పరమజ్ఞాననిష్ఠ యనంబడును. శుద్ధబుద్ధియుక్తుండై ధైర్యమునఁ గార్యకర ణసంఘాతమును వశీకరించికొని శబ్దాదివిషయములఁ బరిహరించి రాగద్వేషములఁ దొలఁగించి జనశూన్యము లయినగిరిగుహాదులం జేరి మితాశనుండై యతవాక్కా యమానసుండై ధ్యానయోగపరుండై వైరాగ్యఘనుండై బలదర్పకామక్రోధ పరిగ్రహాహంకారవర్జితుండై నిర్మముఁడై నశాంతుఁడు బ్రహ్మభూతుఁ డగు. బ్రహ్మభూతుఁ డయినప్రసన్నాత్ముఁడు శోకమును గాంక్షనుం బాయును. మఱి యు సర్వభూతసమవర్తనుండు మద్భక్తిం బడసి భక్తియోగమున నే నెట్టివాఁడ ననియు నెవ్వఁడ ననియుఁ దత్త్వనిర్ణయపురస్సరముగఁ దెలిసి నన్నుఁ జేరు. మద్భ క్తుఁడు సర్వకర్మములఁ జేయుచున్నను మత్ప్రసాదమున నవ్యయశాశ్వతపదంబుఁ బ్రాపించును. సర్వకర్మములను మనస్సున సన్న్యసించి బుద్ధియోగమున మత్ప రుండై యెల్లపుడును జిత్తము నామీఁద నిల్పుము. మచ్చిత్తుండవై తేసి సంసార హేతుభూతము లైనసర్వకర్మములను మదనుగ్రహమునఁ దరింతువు. అహం కారమున నామాట వినవేని చెడియెదవు. మఱియు నహంకారగ్రస్తుఁడవై యుద్ధముఁ జేయ ననినిశ్చయింతువేని నీనిశ్చయము మిథ్య యగుంగాని కొ నసాగనేరదు. ప్రకృతి నిన్నుఁ దప్పక యుద్ధమున నియోగించు. స్వభా వజ మగుస్వకర్మమున నీవు నిశ్చయముగ బద్ధుఁడవయ్యు మోహమున దానిం జేయ నిచ్ఛయింపవయేనియు నాకర్మముఁ బరవశుఁడవై తప్పక చేయుదువు. ఈశ్వ రుఁడు సర్వభూతహృదయస్థితుండై నిజమాయామహిమంబున బొమ్మలంబోలె నాడించుచున్నవాఁడు. తప్పించికొనఁ దరము గాదు. శరణభూతుఁడై నయాపర మేశ్వరునే సర్వభావముల నాశ్రయించి తత్ప్రసాదమునఁ బరమశాంతిం బొరసి యుత్తమపదంబుఁ బ్రాపింతువు. గోప్యములలోనెల్ల గోప్య మగుపరమజ్ఞానము నీకుఁ దెల్పితి. అంతయు నీవు లెస్స యరసి తోఁచినట్లు చేయుము. నీవు పరమే ష్టుఁడ వనుభావమున సర్వగుహ్యతమం బయినవచన మింకొక్కటి నీహితముఁ గోరి చెప్పెద నాకర్ణింపుము. మద్గతమనస్కుండవై మద్భక్తుఁడవై మత్పూజకుం డవై నాకు మ్రొక్కుము. నన్నే పొందెదవు. ఇంతయు సత్యంబు. సర్వధర్మము

లను బరిత్యజించి ప్రత్యగాత్మభూతుఁడై నన్ను శరణువొందుము. నేను నిన్ను సర్వపాపములం దొలఁగింతు. వగవకు మని యివ్విధమున భక్తవత్సలుండైన శ్రీభగవంతుఁ డర్జునునకు మోక్షసన్న్యాసయోగంబు హృద్గతంబుఁ గావించి మఱియు నిట్లనియె. ఇప్పరమజ్ఞానంబు తపోరహితునకు నభక్తునకు నశుశ్రూషునకు నాయెడ నసూయపడువానికిం జెప్పవలదు. పరమగుహ్యం బైనదీని మద్భక్తుల కెవ్వండు సెప్పు నతండు నాపై నత్యంతభక్తింజేసి నన్నే పొందు నింతయు నిస్సంశయంబు. అతనికంటె నాకుఁ బ్రియతముఁడును బ్రియకృత్తముఁడును నెండొకండు గాఁడు. ధర్మ్య మగుమనయీసంవాద మెవ్వఁడు పఠించు నతండు జ్ఞానయజ్ఞమున నన్నారాధించినవాఁ డని నామతము. అసూయమాని శ్రద్ధతో వినునట్టివాఁడును బాపవిముక్తుండై పుణ్యలోకములఁ బ్రాపించు. పార్థా, నాచెప్పినదెల్ల నేకాగ్రచిత్తుఁడవై విన్నవాఁడవకదా ? నీయజ్ఞానమోహము వాసెనే? యనియడిగిన శ్రీభగవంతున కర్జునుండు దేవా, నీయనుగ్రహమున మోహము నడలె. సందేహ మెడలె. ఆత్మతత్త్వవిషయస్మృతి గలిగె. కృతార్థుఁడనైతి. నీయానతిమెయిఁ జేయుదు నని విన్నవించి గృహీతాయుధుం డయ్యె.

ధృతరాష్ట్రమహీశా, పరమాద్భుతంబు రోమహర్షణంబు గుహ్యతమంబు నగు నీవాసుదేవపార్థపరమసంవాదంబు యోగేశ్వరేశ్వరుం డైనశ్రీకృష్ణుండు సెప్పుచుండఁగ శ్రీవేదవ్యాసమహామునియనుగ్రహమునఁ బ్రత్యక్షముగ నుండి వింటిని.. మహారాజా, కేశవార్జునులపుణ్యాద్భుతసంవాదమును బరమచిత్రం బయినహరివిశ్వరూపంబునుం దలంచితలంచి సారెసారెకు సంతుష్టుండ నగుదు. యోగేశ్వరుం డైనశ్రీకృష్ణుఁ డెచ్చట నుండు నచ్చట గాండీవధరుం డైనపార్థుఁ డుండును. ఆచోట శ్రీవిజయభూతినీతులు తప్పక యుండు నని నామతం బని సంజయుండు ధృతరాష్ట్రునకు భగవద్గీతానిరూపణంబుఁ గావించె.

సంజయుఁడు ధృతరాష్ట్రునకు వెండియు నిట్లనియె. అవ్విధమున నారాయణుఁడు తత్త్వార్థ ముపదేశింప విగతమోహుఁడై నరుఁడు గాండీవమును బాణములనుం జేతఁ బూనుటయుఁ బాండవయోధులు శంఖములొత్తి సింహనాదము లొనరించిరి. భేరీపణవానకప్రముఖవాదిత్రములెల్ల నొక్కపెట్ట మ్రోయుటయు నమ్మహానినదం బత్యంతతుములం బయ్యె. దేవగంధర్వపితృసిద్ధచారణాదులు గుంపులు గూడి మహేంద్రపురస్కృతులై యాఘోరసంగ్రామంబుఁ జూడ వేడుక గడలుకొనినచిత్తంబులతో సన్నిహితులై మింటఁ జూపట్టిరి.

## ధర్మరాజు పాదచారియై భీష్మునొద్దకుఁ జని యుద్ధమున కతనియనుజ్ఞ గొనుట.

అట్లుభయసైన్యములు పోరికిఁ గట్టాయితంబై యుగాంతసమయసాగరంబులట్లు ఘూర్ణిల్లుచుండ యుధిష్ఠిరుండు మైమఱువు వూడ్చి యాయుధములతోడ

దేరిపయిం బెట్టి రథంబు డిగ్గి కేల్దోయి మొగిచి పాదచారియై ప్రాఙ్ముఖముగఁ బితామహుఁ డున్నచోటికిఁ బోవుచుండె. అంతఁ దటాలున రథావతీర్ణుఁడై ధనంజయుఁడు దానుం దోడ సరిగె. భీమసేననకులసహదేవులును వాసుదేవుఁడును వెంబడిం జని కొన్నియడుగుల నతని నెదిరిరి. అ ల్లెడ్డ మహారాజా, నీనిశ్చయం బెయ్యది? మమ్మెల్ల విడిచి పాదచారివై శత్రుసేనామధ్యమునఁ జన నేల యని యర్జునుఁడును, రాజేంద్రా, శత్రువులు గయ్యమునకుఁ గాలుద్రవ్వుచుండఁగ నీవిట్లు మైమఱపు పూన్చి యాయుధముల విసర్జించి తమ్ములను విడిచి యెచ్చటికిఁ బోయెద వని భీమసేనుఁడును, భరతపుంగవా, జ్యేష్ఠభ్రాత వైననీ విట్లు పోవుచుండఁగ నామనంబు కొందలం బందుచున్న దెక్కడ కేగఁ దలఁచితో చెప్పుమని నకులుఁడును, నృపాలా' యత్యంతభీకరం బైనరణము ప్రాప్తమయినం బోరుట మాని పగవారి కభిముఖుఁడవై యిల్లెచ్చటికిఁ బోయెద వని సహదేవుఁడు నడుగుచుండఁగ నేమియుం బలుకక ధర్మరాజు గాంగేయుఁ డున్న దెసకుం బోవుచుండె. అప్పుడు మహాప్రాజ్ఞుఁ డగుగోవిందుఁడు నవ్వుచు నిమ్మహారాజునభిప్రాయంబు నే నెఱింగితి. ఇతఁడు గురువు లగుభీష్మద్రోణకృపశల్యులయనుమతిఁ గొని యుద్ధము సేయఁ దలఁచినవాఁడు గావున వారియొద్దకుఁ బోవును. పురాకల్పమున గురువృద్ధబాంధవులయనుజ్ఞ వడసి యథాశాస్త్రముగ దురము సేయునతఁ డెంతటిమహనీయులతోడనైనం బోరాడి గెల్చు గొను నని వినియుందుము. అవ్విధమునఁ బోరు సేయువానికి విజయంబు సిద్ధం బని నామతం బని వచించె. అట్టియెడ నీకొడుకుసేనవారు నిరాయుధుండై యీధర్మపుత్త్రుఁడీపదనున నిట్లు పోవునే. నిశ్చయముగ నితఁ డనికి వెఱచె. ఇతఁడు కులపాంసనుఁడు గాకుండునే యనువారై భీమార్జునమాద్రేయులు మేటిమగ లుండఁగ నీపిఱికి కిట్లు శాంతనవు శరణు సొర నేల యనువారై యల్పసత్త్వుఁ డగునితఁడు లోకవిశ్రుతం బైనభారతకులమునఁ బుట్టఁ దగునే యనువారై మనధార్తరాష్ట్రులే వెఱవనిబిరుదు లని నీకొడుకులఁ గొనియాడువారై ముదమున నుత్తరీయముల విదిర్చువారై పాండవుల నిందించువారునై యుండ నాదురాలాపముల సరకుసేయక ధర్మాత్మజుండు పితామహుని డాయం బోవుటయు నందఱు నితండు తాతతో నేమని తెల్పికొనునో యతండు నితని కెయ్యది చెప్పునో కృష్ణార్జునులును భీష్ముఁడును సమరముఁ గొనియాడుదురో తెలియవలయు నని సంశయితచిత్తులై యేమియుం బలుక కూరకుండిరి. అంత ధర్మరాజు భ్రాతృపరివృతుండై శరశక్తిప్రముఖసాధనగణసమాకులం బయినశత్రుసైన్యంబుఁ జొచ్చి రయమున నాపగేయుపాలి కరిగి యమ్మహానుభావుసపాదములఁ దనచేతి నంటుచుఁ బ్రణామంబుఁ గావించి పితామహా, నీతోడఁ బోరాడువాఁడనై యెఱింగింప వచ్చితి నానతిమ్ము దీవింపు

మనిన విని భీష్ముఁ డతని నాదరార్ద్రదృష్టిం జూచి పాండునందనా, నీరాకకుఁ బ్రీతిఁ జెందితి. రాకుండుదు వేని పరాజయంబు గలుగ శపియింతు ననియుంటి. వచ్చి మేలు చేసికొంటివి. అనుజ్ఞ యిచ్చితి. యుద్ధము సేయుము. విజయంబు నీక య్యెడు మనిపలికి మఱియునీకోర్కి నెఱవేర్పఁగ నాకుఁ బెద్దయుఁ దలంపు గలదు. లోకమున నర్థమునకుఁ బురుషుఁడు దాసుఁ డగుఁగాని పురుషున కర్థము దాసము గాదుగదా. నే నర్థనిమిత్తమున ధార్తరాష్ట్రులకు లోఁగియుండుటం జేసి క్లీబుని చందమున నీకుఁ దోడ్పడఁ జాలకున్న వాఁడఁ గావున యుద్ధముదక్క మఱి యెయ్యది కోరినను నీ కిచ్చెద. వరంబు గోరు మనిచెప్పిన విని ధర్మరాజు మహాత్మా. కౌరవులకుఁగాఁ గయ్యము సేయుము. నాకు మేలు చిత్తమునఁ దలంచుచుండు మదియె నాకోరినవరం బని ప్రార్థించుటయు భీష్ముఁ డందుల కట్ల యగుం గాక నిన్నుఁ జూడఁగ మఱియు నెయ్యదియేనియుం జెప్పఁ దలఁచినచందము తోఁచు చున్నది. దాఁప నేల చెప్పుమనవుడుఁ బాండవాగ్రజుండు పితామహా, నీకు మ్రొక్కెద. సంగ్రామమున నిన్ను గెలుచు టెట్లో యెఱుంగనయ్యెద. నామేలు గోరు దేని దానిం జెప్పు మనియడుగ నాపగేయుండు నేను రణము సేయుచున్నంతకు మహేంద్రుఁడైనను నన్ను గెలువ నోపఁడు. నన్ను గెలువ నుపాయం బెఱుంగ నీతూరి వత్తు వని పలికినం దద్వచనంబుఁ దలఁ దాల్చి ధర్మాత్మజుం డతనికిఁ బాద ప్రణామం బాచరించి యనుజ్ఞాతుండై యందఱుం జూచుచుండఁగఁ గ్రమ్మఱియె.

ధర్మరాజు గురుకృపశల్యుల యనుజ్ఞ వడయుట.

అట్లు క్రమ్మఱి కౌంతేయాగ్రజుండు భ్రాతృపరివృతుండై భారద్వాజునర దమునెద్ద కరిగి యయ్యాచార్యునకుఁ బ్రదక్షిణప్రణామము లొనరించి మహాత్మా, విగతకల్మషుఁడనై నీతోడఁ బోరు సేయఁగ ననుజ్ఞ గ్రహింప వచ్చితి. శత్రుజయంబు గలుగ దీవింపు మని ప్రార్థింప నక్కుంభసంభవుండు ధర్మసంభవున కిట్లనియె. నీవు వచ్చుటంజేసి మే లయ్యె. రాకుండు దేని పరాజయము గలుగుత మని శపియింప నుంటిని. నీకావించినసత్కారమునకు సంతుష్టుఁడ నైతి. అనుజ్ఞ యిచ్చితి. కయ్యము సేయుము. జయముఁ గొనుము. అర్థమున కందఱును దాసు లగుట నీయెఱింగినదియకదా. అర్థనిమిత్తమునంజేసి యేను గౌరవులకు లోఁగవలసివచ్చె. దానంజేసి నీ కనిఁ దోడ్పడవలసినవాఁడనయ్యు నమ్మాట పుట్టింపఁ జాల నైతి. యుద్ధముదక్క నెండెద్దియేనియుం గోరుము. అవ్వరము నిచ్చెద. నీగెలుపు నా కాశాస్యంబ యనిన విని యుధిష్ఠిరుఁ డాచార్యవర్యా, కౌరవులకుఁగా యుద్ధముఁ జేయుచుండినను నావిజయంబు నప్పుడప్పుడు చిత్తమునఁ దలంపునకుఁ దేవలయు నిదియ నాకోరినవర మనుటయు ద్రోణుఁడు వెండియు నిట్లనియె. రాజేంద్రా, హరి మంత్రియైయుండ విజయంబు నీసొమ్ము గాక తక్కునే. నీవు గెల్తు

వని నిశ్చయముగ నే నెఱుఁగుదు. ధర్మ మేవలన వ్రాలియుండు నాదెసఁ గృష్ణుఁ
డుండు. కృష్ణుఁ డున్న దెస జయంబు సిద్ధంబు. పొమ్ము రణము సేయుము. ఇంక
నెయ్యదియేనియుఁ జెప్పఁ దలఁతువేని చెప్పు మనవుడు ధర్మరాజు ద్విజసత్తమా,
నిన్ను గెలువ నుపాయం బెయ్యది తెలియ నానతి మ్మనియడుగుటయు నేను
బోరు సేయుచుండునంతకు నన్ను గెలువ నేరికిని దరంబు గా దనియె. అనవుడు
యుధిష్ఠిరుఁ డబ్భారద్వాజుమొగమునం జూడ్కి నిల్పి యార్యా, నిన్ను గెల్చుట
దుష్కరం బనియెఱింగియకదా ప్రణామపూర్వకముగ నిన్నుఁ బ్రార్థించెద. ఆత్మవ
ధోపాయంబు నీవ కరుణించి యానతీవలయు నని తఱిమి యడిగిన విని గురుండు
నే నస్త్రగ్రహణంబు మాని ప్రాయోపవేశముఁ జేయునంతకు నన్ను గెలువ
నెంతటివారలును జాలరు. పెద్దయు నమ్మిక గలయతండు పరమదారుణం బయిన
వచనంబుఁ జెప్పఁగ వినినంగాని నేను శస్త్రాస్త్రముల విడువ నింతయు నిశ్చితంబని
వచించి సమరమున కనుజ్ఞ యిచ్చుటయుఁ గౌంతేయాగ్రజుం డట్లు గుర్వనుజ్ఞాతుం
డై క్రమ్మఱి కృపాచార్యునెద్ద కరిగి యాశారద్వతునకుఁ బ్రదక్షిణనమస్కారము
లాచరించి నీతోఁ గయ్యము సేయఁగ ననుమతి గ్రహింప వచ్చితి. విజయాశీ
ర్వాదపురస్సరముగ నానతి మ్మనుటయు నాగౌతముఁ డతని కిట్లనియె. మదీయా
నుజ్ఞం బడయ నీవు రాకుండుదువేని యపజయం బయ్యెడు మని శాప మిఁ
దలఁచియుంటి. వచ్చి మేలు చేసికొంటివి. కౌరవులయర్థముఁ గుడుచుటం జేసి నీ
కనిఁ దోడ్పడరాఁ జాలక క్లీబునియట్లు యుద్ధేతరంబుఁ గోరికొమ్మని చెప్పవలసివ
చ్చె. ఇష్ట మైనవరముఁ గోరికొమ్మనుటయు ధర్మనందనుఁ డాచార్యా, నావిన్న
పంబు విను మడిగెద నని చెప్పి మీఁద నేమియుం జెప్పక వ్యథితచిత్తుండై యూర
కుండె. గౌతముఁడును దదీయాభిప్రాయ మూహించి యెఱింగి నరేంద్రా, నే
నవధ్యుఁడను. పోర విజయంబు గొనుము. నీరాకకు సుప్రీతుండనైతి. ప్రతిదిన
మును బ్రాతరుత్థితుఁడనై నీకు జయంబు గలుగ దీవించుచుండుదు నిది సునిశ్చి
తంబు పొ మ్మనవుడుఁ గుంతీతనయజ్యేష్ఠుండు తదనుజ్ఞాతుండై శల్యునెద్దకుఁ జని
యమ్మద్రేశ్వరునకుఁ బ్రదక్షిణప్రణామములు గావించి నరేశ్వరా, నీతో సమ
రము సేయఁగ ననుజ్ఞఁ బొందువాఁడనై యరుదెంచితి. నాకు శత్రుజయంబు
సేకూఱ దీవన లిమ్ము. నీయనుజ్ఞ వడసితినేని పగఱ గెల్తు ననిపలికిన ధర్మాత్మజున
కమ్మద్రేశ్వరుఁ డిట్లనియె. నీరాక మే లయ్యె. రాకుండిన శపింతును. వచ్చి సత్క
రించి పూజించుటకు సంతుష్టుఁడ నైతి. అనుజ్ఞ యిచ్చితి. రణము సేయుము.
గెలువుము. అర్థనిమిత్తమునఁ గౌరవులవాఁడనైతిఁ గావున యుద్ధముఁ దక్క మఱి
యెద్దానిం గోరిన నియ్య నున్నవాఁడఁ గోరికొను మనిన మాతులునకు భాగి
నేయుఁ డిట్లనియె. కౌరవులవాఁడవై కయ్యముఁ జేయుము. నామేలు చిత్తమునఁ

దలంచుచుండుము. కర్ణునకు సారథి నగుదేని యతనికిఁ దేజోహీనత్వంబు కర్తవ్యం బని యుద్యోగసమయంబునందు నిన్నుఁ బ్రార్థించియుంటిఁగదా. అయ్యర్థము మఱవవల దియ్యది యనావరం బనవుడు శల్యుఁ డట్లయగుఁ గాక పొమ్మని వీడ్కొలిపె. అట్టియెడఁ గయ్యంపువేడుకఁ జూడ నచ్చోటికి వచ్చియున్న రాధేయునొద్దకుఁ జని జనార్దనుఁ డయ్యా, నీవు భీష్మునిమీఁది రోషమున సంగ్రామమునకు రాక తొలఁగినవాఁడ వనివింటి. అతండు పడునంతకు మాలోఁ గలిసి యాశాంతనవుని మార్కొని దురంబు సేయుము. అతండు పడినపదంపడి క్రమ్మఱి ధార్తరాష్ట్రునకు సాహాయ్యముఁ జేయఁ దగు నిది నీకుఁ బోలు నని తలంచెద ననవుడుఁ గర్ణుఁడు కేశవా, నేను దుర్యోధనుహితముఁ గోరి ప్రాణములనైన విడుతుఁగాని యతనికి విప్రియంబుఁ జేయ నింతయు నిక్కువం బనిపలికినం గమలనాభుండు మఱలి పాండవులయొద్ద కేతెంచె.

యుయుత్సుఁడు పాండవులలోఁ గలియుట.

అవ్విధమున భీష్మద్రోణకృపశల్యులయనుజ్ఞఁ గొని యుధిష్ఠిరుండు తమ్ములు వాసుదేవుఁడుం దోడ రాఁగ మఱలి సైన్యమధ్యమున నిలిచి చేయెత్తి యిపుడు ధార్తరాష్ట్రులఁ బాసి మాలోఁ గలిసి యాశ్రయించినవారలను నేను బరమాదరంబునఁ బ్రోతు నని పేరెలుంగెత్తి చెప్పుటయు నీకొడుకు యుయుత్సుఁడు ధర్మరాజుమొగమునఁ జూచ్కి నిలిపి మహారాజా, నన్నుఁ గలిపికొందువేని మీలోఁ గలిసి గాంధారేయుల మార్కొని పోరాడెద ననిపలికె. అందులకుఁ గడుం బొంగి ధర్మాత్మజుండు యుయుత్సూ, రారమ్ము. మన మందఱముం గలిసి యవివేకులయినదుర్యోధనాదుల మార్కొందము. వాసుదేవసహితుల మైనమే మందఱము నిన్ను వరింపుచున్న వారము. పాపాచారులయిన దుర్యోధనాదులు బ్రదుకఁ బోవరు. ధృతరాష్ట్రజనితుండ వైననీవైనను బ్రదుకు మనుటయు యుయుత్సుఁడు నీకొడుకులను విడిచి దుందుభి మ్రోయించి యెల్లవారి కెఱింగించి పాండవసైన్యమునఁ గలిసె. అంత ధర్మరాజు కవచంబుఁ దొడిగి రథారూఢుఁడై ధృతాయుధుం డయ్యె. భీమార్జునాదులును నిజరథముల నారోహించి తొల్లింటియట్ల వ్యూహముఁ బన్నించుటయు రథస్థు లయిన పాండవులం జూచి ధృష్టద్యుమ్నాదులు పరమానందభరితులై సింహనాదములు గావించిరి. తక్కటిరాజు లందఱుఁ బాండవులయొద్ద మాన్యమానసం బింత యొప్పునే యనుచు నెంతయుం బ్రశంసించిరి. మ్లేచ్ఛాదిరాజులు పాండవులయుత్కర్షంబు వినమెల్లక యసూయాకలుషితులై యుండునంత శంఖదుందుభిప్రముఖవాద్యములు పెలుచ మ్రోసె నని చెప్పిన విని ధృతరాష్ట్రుఁడు సంజయా, యిట్టు లిరువాఁగును గయ్యంపుఁగడంక

గడలుకొన నుండునంతఁ దొలుత నెవ్వరు దాఁకి రనియడుగ నాసూతపుత్రుండు విచిత్రవీర్యపుత్రున కిట్లనియె.

యుద్ధారంభము.

నరేంద్రా, దుర్యోధనవచనప్రకారమున దుశ్శాసనుండు పురికొల్పఁగ మీవారిసైన్యంబు భీష్మపురస్కృతంబయి కవియుటయుఁ బాండవసైన్యంబు భీమసేనపురస్కృతంబై తాఁకె. అప్పు డుభయసైన్యంబులందును శంఖభేరీమృదంగాదివాదిత్రనినదంబును గంధసింధురబృంహితంబును హయహేషితంబు వీరయోధసింహనాదంబునుం బ్రచండవాతోద్ధతసాగరసంక్షోభంబు విడంబించుచుఁ బెలుచ నెసఁగె. పెద్దయాఁబోతుఱంకె కెనవచ్చుభీమునిసింహనాదము సకలనిస్వనంబుల నడంచునుఁ గడు నడరె. పిడుగుపాటునకు సాటియైనవానియార్పు విని సింగముబొబ్బ విన్నపెఱమృగములచందమున నీసేనవారు వెఱచి వెగడుపడిరి. వాహనములును బెదరి మూత్రపురీషముల విసర్జించె. అట్టియెడ నీకొడుకులు దుర్యోధనుండు, దుశ్శాసనుండు, దుర్ముఖుండు, దుస్సహుండు, దుర్మర్షణుండు, వివింశతి, చిత్రసేనుండు, వికర్ణుండు, పురుమిత్రుండు ననువారు సౌమదత్తిప్రముఖసహాయులై భీముం దలపడి యతిరయమున విండ్ల నమ్ముల సంధించుచు విద్యుదన్వితంబు లగునంబుదంబులచందంబున మెఱయుచు నాశీవిషోపమంబు లయిన ఘోరనారాచములఁ గురియుచుండునంత ద్రౌపదేయు లేవురును సౌభద్రుండును మాద్రేయులును ధృష్టద్యుమ్నుండును మీవారిం దాఁకి యింద్రుఁడు గిరిశిఖరముల వజ్రములంబోలె నిశితశరముల నొంచుచు నుభయసైనికులుం బరాఙ్ముఖులు గాక గండడఁపుటయు వారి పోరు సంతతజ్యాఘోషభీషణంబై యభిరామం బయ్యె. పెఱరాజులు ద్రోణశిష్యుల లాఘవంబును నిమిత్తవేధిత్వంబును నింత యొప్పునే యనుచు విస్మయాక్రాంతచిత్తులయి చిత్రప్రతిమలయట్లు చూచుచుండ దుర్యోధనుండు సేనలకుఁ జేయి వీచుటయు యుధిష్ఠిరుఁడును దమసైనికులఁ బురికొల్పుటయుఁ బ్రళయసమయసంగతసంక్షోభసాగరములచందమున నారెండుసేనలు ప్రతిఘటించి పరస్పరస్పర్ధమైఁ బెలుచ నడర నత్తొలితాఁకు శంఖభేరీనినాదసమాకులంబై యోధనికరక్ష్వేళావిలంబై పదాతిపాదఘట్టనజనితచటులరవనిబిడంబై పరస్పరాయుధవిఘట్టనోత్థనిస్వనోన్మిశ్రంబై వాజిహేషాఘోషనీరంధ్రంబై కరిఘటా ఘంటారవోప బృంబృంహితధ్వని సాంద్రంబై యత్యున్నతకేతనపటాంచలచాంచల్య సముదంచితనినదనిబిరీసంబై రథనేమిఘట్టనధ్వానబంధురంబై యత్యంతసంకులంబై యొప్పె. బహుళపరాగపటలం బెగసిరవిమండలంబుఁ గప్పె. అ ట్లతితుములంబై సమరంబు సెల్లుచున్నంత మీతండ్రియం దటికంటె నెక్కువ మెఱయుచుఁ గాలదండోపమం బయినఘోరకార్ముకంబుఁ

జేతం బూని యర్జునుం గవియుటయు నవ్వీరవర్యుండు నుద్దండం బయినగాం
డీవంబు గ్రహించి యమ్మేటిమగనిం దాఁకుటయు నెండొరులు గెలువఁ గడంగి
గండడరిన నయ్యిరువురిపోరు తుల్యప్రకారంబై చూపఱకగ్గించునట్టిదయ్యె. సాత్య
కికృతవర్మ లొండొరులం దలపడి యితరేతరశరప్రహారపరిక్షతగాత్రులై వసం
తసమయకుసుమితపలాశపాదపంబులట్లు శోభిల్లిరి. అభిమన్యుఁడు బృహద్బలుం
దాఁకిన నక్కోసలేశ్వరుండు విక్రమించి యతనికేతనంబుఁ గూల్చి సారథిం
జంపుటయు సౌభద్రుండు రౌద్రరసోల్లసితమూర్తియై తదీయరథసారథిం జంపి
కేతనంబుఁ గూల్చి యొక్కబాణమున వానిపార్శ్వభాగము నోనేసి యేకాదశ
శరముల రక్తసంసిక్తగాత్రుం గావించె. భీమసేనసుయోధను లొండొరుల దాఁకి
యత్యంతచిత్రప్రకారమున నెండొరులపై నంపసోనలఁ గురియించిన సర్వభూత
ములు వెఱఁ గందె. దుశ్శాసనుండు నకులుం దలపడి మర్మభేదనకర్మఠంబు
లయినతీవ్రనారాచంబులు పెక్కులేసి నొంచుటయు నమ్మాద్రీపుత్త్రుండు గనలి
యవలీల నతనికేతనంబుఁ గూలం ద్రోచి విల్లు దునిమి యిరువదేనుతూపులఁ
బరఁగించినం గోపించి నీకొడుకు వానిగుఱ్ఱములఁ జదిపి టెక్కెముఁ గూల్చెఁ. దుర్ము
ఖుండు సహదేవుం దాఁకి పెక్కుబాణమ్ము లేయుటయు నప్పాండవావరజుం డొక్క
శరమున వానిసారథిం గూల్చి నొంచిన నతండును గండడరుటయు వారిరణంబు
దారుణం బయ్యె. యుధిష్ఠిరుఁడు శల్యుని మార్కొనిన నమ్మద్రేశ్వరుం డలిగి
యతనివిల్లు దునుముటయుఁ గౌంతేయాగ్రజుం డొండుకోదండంబుఁ గొని వాఁడి
తూపుల నతనిం గప్పి నిలునిలు మనియదల్చె. ధృష్టద్యుమ్నుండు ద్రోణుం
దాఁకిన నయ్యాచార్యుండు కోపించి యతనిచాపంబుఁ దునియ నేసి కాలదండ
సమం బైనఘోరశరమున నతనిఱొమ్ము గాడ నేయుటయు నప్పాంచాలవరుం
డలిగి వేఱొక్కవిల్లెత్తి పదునాలుగువాఁడినారసమ్ముల గురునిమేనం గీలించిన
నయ్యిరువురు సముదగ్రసంరంభావష్టంభసముల్లసితులై పోరుటయు నాసంగ్రా
మంబు భీమం బయ్యె. శంఖుఁడు భూరిశ్రవునిం దాఁకి నిలునిలు మనియదల్చి దక్షిణ
భుజంబు నోనేయుటయు నాసోమదత్తపుత్త్రుం డలిగి యవ్విరాటపుత్త్రుజత్త్రుదే
శంబు గాడ నేసిన నయ్యిద్దఱిపోరు దేవదానవసమరంబుభంగి నతిఘోరం బయ్యె.
ధృష్టకేతుండు బాహ్లికుం దలపడిన నక్కురుసింహుఁడు వానిపైఁ బెక్కమ్ములఁ
బరఁగించి సింహనాదముఁ జేసినం గోపించి యాచేదీశ్వరుండు తొమ్మిదివాఁడియ
మ్ముల నతని నోనేయుటయు నయ్యిరువురు శూరులు కుజబుధులయట్లు తాఁకి
ఘోరంబుగఁ బోరిరి. ఘటోత్కచుండు బలసూదనోద్యతుం డైనపురుహూతుని
విధమున నలంబుసుం దాఁకి తొంబదియమ్ములం బరఁగించి నొంచినం గినిసి
యాక్రూరకర్ముఁడు నిశితాగ్రంబు లయినబహుమార్గణముల నాభీమసేనపుత్త్రు

నో నేసిన నయ్యిరువురు రాక్షసేశ్వరు లితరేతరకాండఖండితగాత్రులై పొలిచిరి. శిఖండి యశ్వత్థామం గవిసిననయ్యాచార్యపుత్రుండు తీక్ష్ణనారాచంబున నతని నొంచుటయు నప్పాంచాలరాజపుత్రుండు పరమనిశితం బయినశరంబున నతనిం గాడ నేయుడు వారిసమరంబు భీకరం బయ్యె విరాటుండు భగవదత్తుం దాఁకి శరవర్షంబున ముంచిన నతండు కోపించి యనర్గళప్రసారంబుగ శరాసారంబుఁ బరఁగించె. కృపాచార్యుండు బృహత్క్షత్రుం దాఁకి బాణజాలముఁ గురిసిన నక్కేకయుండు బాణవర్షమున నతనిం గప్పుచుండి కొండొకవడి కయ్యిద్దఱుం బరస్పరకోదండములఁ దునిమి యితరేతరతురంగములం గూల్చి విరథులై కరవాలంబు వెఱికి నేలకు డిగుటయు వారిపోరుఘోరం బయ్యె. ద్రుపదుఁడు సైంధవుఁ దలపడుటయు నాజయద్రథుఁడు పరమసంరంభోద్రిక్తుండై మూఁడువాఁడితూపు లేసిన నప్పాంచాలనాథుండు ఘోరాకారంబు లయిననారసంబు లనేకము లేయుటయు నయ్యిద్దరికయ్యంబు శుక్రాంగారకులసమరంబువిధమునఁ జూపఱకు సమ్మోదావహం బయ్యె. నీకొడుకు వికర్ణుండు రయమున శ్రుతసోముం దాఁకి శరములఁ బరఁగించిన నప్పవమానపౌత్రుఁడు ననురూపముగ బాణజాలంబుఁ గురియించె. చేకితానుండు సుశర్మను గవిసి శరవర్షమునఁ గప్పిన నతఁడుం దదనుగుణముగా మార్గణగణములం బ్రయోగించె. శకుని ప్రతివింధ్యుం దాఁకి పరాక్రమించిన నయ్యుధిష్ఠిరపుత్రుండును సింహము గంధసింధురమునుబోలె నతనిం దాఁకి యురువడించు నిశితశరజాలంబు గురిసి యింద్రుఁడు దానవుంబోలె నొంచిన నాసౌబలుండును లెస్స మార్కొని నూలుకొని కయ్యంబు సేసె. శ్రుతకర్మ సుదక్షిణుం దాఁకిన నాకాంభోజనాథుఁడు వానిపైం బటుశరములఁ బరఁగించినం గోపించి యాసహదేవపుత్రుఁడు బహుళశిలీముఖముల వాని నొంచె. ఇరావంతుఁడు శ్రుతాయువుం దాఁకి వానిరథ్యములఁ జంపి తమవారు పొంగ నార్చి పేర్చిన నాశ్రుతాయు వల్గి ఫాల్గునిహయంబుల నిజగదాదండమునఁ జదుపుటయు వారిదురంబు విస్మయమేదురం బయ్యె. విందానువిందులు కుంతిభోజుని దత్పుత్రునిం దాఁకి బహుళశరాసారంబుఁ బరఁగించి యనువిందుఁడు గదఁ గొని కుంతిభోజు నడిచిన నతం డలిగి శరవర్షమున నయ్యావంతిరాజావరజు ముంచె. తత్పుత్రుం డైనపురుజిత్తు విందుని బాణవర్షమునఁ గప్పుటయు నతండునుం దదనురూపంబుగ విక్రమంబు సూపె. కైకేయు లేవురు గాంధారుల నేవుర మార్కొని పోరాడిరి. నీకొడుకు దీర్ఘబాహుఁ డుత్తరుని మార్కొని తొమ్మిదియమ్ము లేయుటయు నవ్విరాటపుత్రుఁడు భవత్పుత్రుని శరాసారమగ్నుం గావించె. చేదిరా జులూకుం దాఁకిన నతఁడుం దలపడుటయు వారిపోరు ఘోరం బయ్యె. ఇత్తెఱంగున నిరువాఁగునఁ జేసుఁగలబిరుదుమగలెల్లఁ దమకుఁ దమకుఁ బోలినవారితోడ నూలుకొనిపోరాడ

నత్యంతసంరంభసముద్రిక్తం బయినయాద్వంద్వయుద్ధము చతురంగబలంబులు
తమతమజాతిం బెక్కులుపెక్కులుగఁ దలపడి యున్మత్తులవిధమునను గ్రహా
విష్టులచందమునునుం బెనంగుచుండ ముహూర్తమాత్రంబు దేవాసురసమరస
మంబై సిద్ధచారణదేవర్షిప్రముఖస్తూయమానంబై యంకుశములఁ బొడిచి మా
వంతులు పురికొల్పఁగఁ బ్రబలఘీంకారంబొనర్చి రయంబున నితరేతరప్రహా
రంబు సరకుసేయక పరస్పరదంతవిఘట్టనంబుఁగావించుచుఁ బెద్దయుఁ బెనంగునవి
యుఁ జూడ్కి కగపడ్డతురగపదాతిగణంబులశుండాదండముల నీడ్చి మింటి కెగయ
నెత్తి విసరి నేలఁ బెట్టి కాలఁ జమరునవియు నిపుణరథికశరప్రహారములకు నొచ్చి
భైరవారావంబు సేయుచు నెటకేనియుం బాఱునవియు విదీర్ణకుంభములై
కూలునవియు నగుగంధసింధురంబులును, రావుతులపురికొలునం జేసి రయంబు
మెఱయముందటికాళ్లు మీఁది కెత్తి తటాలున సైన్యసంఘాతంబున దూఁకున
వియుఁజామరాపీడచాంచల్యంబు మొగమునకు వింతసొంపు సంపాదింప నెదిరిఁ
జేరవం జేరనీక ఖురఖురోద్ధూతధూళిపటలంబునఁ జీఁకట్లు పచరించుచుఁ జిత్ర
మండలగతులఁ జరించునవియు దంతిదంతప్రహారంబునను దారుణమార్గణాపా
తంబునను నొచ్చి నేలకు వ్రాలునవియు నగుతురంగంబులును, విజిగీషామనీషం జేసి
చలంబు మెఱయ బలంబు నెఱయ నొండొరులపై నురువడించి వాలంపగములఁ
గురియించువారును విండ్లు దునిసిన వేఱువిండ్ల నతిరయమునఁ గొనువారును మొ
గంబులు జేవుఱింప గండడరి చతురంగంబులఁ గూల్చువారును సారథులు
పడినం దారే రథచోదనంబుఁ గావించుచుఁబోరువారును విరథులయినం బలు
కయు వాలునుం గొని నేలకు డిగి విక్రమంబు సూపువారును లాఁతులతేరుల
నెక్కఁబోవువారును బరస్పరాభిఘాతంబునం జేసి రాలినకిరీటకేయూరాదిభూషణ
మణిగణంబున సంగరాంగణంబునకుఁ జెలువుగావించువారును జిక్కినం దండ్రి
కొడుకు కన్న తమ్ముఁడు మామ యల్లుఁడు చెలిచుట్ట మనిచూడక బిట్టు నొంచువా
రును నేలం గూలియుఁ గైదువు విడువక కడిమి మెఱయఁ బోరాడం దమకించు
వారును జేయి దునిసినం దక్కటిచేతఁ గైదువుగొని కవియువారును గాలు దుని
సిన నెదిరిమీఁదికి దూఁకువారును దలదునిసినం బొమముడిపాటు విడువనితలల
నొప్పువారు నగురథికులును, నన్యోన్యశక్తి పరశుప్రాసకుంతభిండివాల శూల
ప్రముఖప్రహరణప్రహారమున మడియువారును వారణతురంగరథసంపాతంబునఁ
గాలుసేతులు విఱుగ డొక్కలు సెదరఁ బ్రక్కలవియఁ దలలు నలుగఁ బడెడువా
రును రథికు లేయువాఁడితూపులతాఁకునం జేసి నెత్తుటం జొత్తిల్లుచుఁ గూలువా
రును నేలం గూలి జీవితాశంజేసి వగచువారును బిపాసార్తులై నీళుల వెదకువా
రును నీకొడుకులనిమిత్తముననింత పుట్టెఁగా యనినిందించువారును దమ్ముఁ దార

దూఱువారును దిక్కు దోఁపక నలుదెసలఁ బాఱువారు నగుపదాతులును, దంతావళప్రహారంబున విఱుగుకేతనవ్రాతంబులును, గేతనవ్రాతపాతంబునఁ గూలు మావంతులును, మావంతులపాటునం బాఱునేనుంగులును, నేనుంగులు పాఱుటకు వెఱచి పఱచుతురంగములును, దురంగఖురోద్ధూత పాంసుపటలతిరోహితదృష్టులై తమతమవారలం బొడువఁ గడఁగుభటులునై యునికిం జేసి యత్యంతతుములంబై పరమరౌద్రంబై నిర్మర్యాదంబై యతిఘోరంబై చెల్లుచుండ మధ్యాహ్నం బయ్యె.

భీష్ముఁడు పాండవసేనపై విజృంభించుట.

అయ్యవసరమున దుర్యోధనుపనుపున దుర్ముఖుఁడును గృతవర్మయును గృపాచార్యుఁడును శల్యుఁడును వివింశతియును దోడుపడఁగ శాంతనవుఁడు తాలకేతనశోభాభిరాముఁడై పాండవసైన్యంబుఁ గవిసి చేదికాశిపాంచాలవీరులఁ బెక్కండ్రఁ జెండాడి వీరవిక్రమనృత్యంబు సేయుచుండఁ దత్సైనికులు నెచ్చియయ్యాపగేయునెదుర నిలువ నోడి బెండువడినం జూచి యభిమన్యుండు మన్యుసముద్ధతిం బేర్చి పిశంగతురంగయోజితరథారూఢుండై కనకకర్ణికారకేతుసముల్లాసంబునం దాఁకి కృతవర్మ నెక్కువాలమ్మున నొప్పించి శల్యుని బాణపంచకమున నొంచి నిశితభల్లమున దుర్ముఖుసారథితలఁ దెగనేసి వివింశతివిల్లు దునిమి వాఁడితూపుల నాల్గింటఁ గృపునిగుఱ్ఱముల నోనేసి తొమ్మిదియమ్ముల భీష్ముని మేననాటి కేతనంబు బిట్టేసి యందఱను వెగడుపఱిచి కొఱవి ద్రిప్పినతెఱంగున నతిలాఘవంబు మెఱయ విక్రమక్రీడ సలుపుచున్నంత నాసౌభద్రునిధనుర్విద్యానైపుణంబుఁ జూచి దేవతలు మెచ్చిరి. భీష్మాదులు నితండు గాండీవికి సముఁ డధికుఁ డగుఁగాని తక్కువ గాఁ డనిపలికిరి. అప్పుడు మీఁతండ్రి వాని మార్కొని శరనవకం బేసి భల్లత్రితయమునఁ గేతనంబుఁ గూల్చి మూఁడువాఁడితూపుల సారథి నేయుటయుఁ గృపశల్యప్రముఖు లగునయ్యేవురురథికులు నెక్కుపెట్ట తలపడి బాణజాలంబుఁ గురిసిన నయ్యర్జునసూనుండు మైనాకపర్వతంబుచాడ్పున నచలుండై నిలిచి శరవర్షమునఁ దదీయమార్గణగణంబుల మాయించి బహుళమార్గణముల శాంతనవుమేనం గీలించి తొమ్మిదింట నతనికేతనంబు విఱుగ నేయుటయుఁ దాళధ్వజంబు నేలం గూలె. కూలినం జూచి వృకోదరుం డనుజపుత్త్రునకు హర్షోత్కర్షంబుఁ గావించువాఁడై పెలుచ నార్చె. అందులకుఁ గినిసి భీష్ముఁ డత్యద్భుతముగ రౌద్రమున మెఱసి సౌభద్రునిపై శరపరంపరలం బరఁగించుచుండ నభిమన్యురక్షార్థంబు భీమసేనుండును ధృష్టద్యుమ్నుఁడును సాత్యకియుఁ గైకయు లేవురును విరాటుఁడును దత్పుత్రుఁడును రయమున మీఁతండ్రిం దాఁకుటయు నవ్వీరశేఖరుం డుక్కుమిగిలి ధృష్టద్యుమ్నుని మూఁడమ్ములను సాత్యకిని

శరనవకంబునను నొా నేసి యొక్కట భీమసేనుని కేతనంబునుం గూల్చినఁ దదీయ సింహధ్వజంబు గూలె. అందులకుఁ గడు నలిగి వృకోదరుండు మూఁటఁ బితామహుం గాడ నేసి యొక్కయమ్మునఁ గృపాచార్యుని నెనిమిదివాలికతూపులఁ గృతవర్మని నొప్పించె. అయ్యెడ విరాటపుత్రుఁ డగు నుత్తరుఁడు భీము కేతనంబు పాటునకుఁ గినిసి తనయేనుఁగును శల్యుపయిం బఱపిన నమ్మద్రేశ్వరుఁడు దాని వేగం బుడిపె. అంత నిలువక యాసింధురము క్రోధసముదగ్రంబై యతనితేరి కాఁడిఁ గాలఁ బట్టి గుఱ్ఱముల నాల్గింటిని నిజశుండాదండమునఁ నీడ్చి విసరినేలతో వ్రేయుటయు నిహతరథ్యుండై శల్యుఁడు కోపించియుత్తమశక్తిం గొని యుత్తరుని బిట్టేసిన నాశక్తి వానిమైమఱువు సించి యొమ్ము దూరిపోవుటయు నవ్విరాటపుత్రుఁ డంకుశతోమరముల విడిచి నేలం బడ మృతుఁడయ్యె. అంత నిలువక మద్రరాజు కరవాలంబుఁ గొని తేరు డిగ్గి రయము మెఱయ నయ్యుత్తరు దంతావళంబుకరము నఱికిన నది యార్తస్వరముఁ జేయుచునేలం బడి చచ్చె. మద్రపతియుఁ గృతవర్మరథ మధిరోహించె.

### భీష్ముఁడు శ్వేతుం జంపుట

అవ్విధమున నుత్తరుఁడు శల్యనిహతుఁ డగుటయు వానితోడఁబుట్టువు శ్వేతుఁడు కోపించి మనసేనపయిం గవిసి భీష్మాదియోధవీరుల విండ్లు దునిమిన వారు వేఱువిండ్లు గొని సప్తశిలీముఖముల నతనిగుఱ్ఱములపై నేసిననా శ్వేతుండు గ్రమ్మఱ వారిధనువుల నఱుకుటయు వారు శక్తులఁ బ్రయోగించి యార్చిరి. శ్వేతుఁడు సప్తభల్లముల వాని నడుమన తునియలు గావించుటయు శాంతనవుఁడు వేఱొక్కవిల్లెత్తి దివ్యబాణం బరిఁద్రొసి యేసిన వాఁడు మూర్ఛితుఁ డగుటయు సారథి తేరు దొలంగించె. అంతఁ గొంతవడి కతంబు నేద దేఱి యితరతురంగములఁ బూన్చినయుత్తమస్యందనం బారోహించి రయమునం దాఁకి యవ్వీగుల రథ్యసారథుల నొంచి కేతనములం గూల్చి శరజాలంబుఁ గురియించి శల్యుపయిం గవిసినం జూచి నీసైనికులు శల్యుఁడు శ్వేతునకుఁ జిక్కె నని హాహాకారంబు లొనరించిరి. అప్పుడు దుర్యోధనుఁడు భీష్మపురస్సరుఁడై తాఁకి మద్రపతిం దప్పించుటయు నప్పుడు శ్వేతభీష్ములకుఁ బోరు ఘోరం బగుచుండ భీమసాత్యకిసౌభద్రకేకయవిరాటులు శిఖండిధృష్టద్యుమ్నపురోగములై శ్వేతునకుఁ దోడ్పడుటయు శాంతనవుండు క్రోధదీపితుండై వారలనెల్ల వారించి శ్వేతుం దాఁకిన నయ్యిరువురు డొల్లెడుతలలును దునిసినకాలుసేతులును గూలినకేతనంబులును విఱిగినతేరులును జదిసినగుఱ్ఱములును బడినకైదువులునుంగా నతిరౌద్రంబుగ భండనతాండవంబు సల్పుచున్నయవసరంబున వెఱచి దిక్కు దోఁపక పాఱునెడ సంరంభసముద్రిక్తులై యొకళ్లొకళ్లంబట్టి పెనఁగుచు నెదిరిం గ్రిందఁ ద్రోచువా

రును ద్రోచిన లేచిపఱచుచు మున్ను గన్నిడినవారల మార్కొనువారును బాం
సుపటలం బెగసి చీఁకట్లు గావింపఁ గన్ను గానక యెదిరిం దాఁకఁబోయి గజ
వాజిస్యందనములపయిం దప్పి పడువారును మౌర్వీఘోషం బుపలక్షించి కవియు
వారును బాణశబ్దంబేనియు వినఁబడనీక పటహనాదంబు మేదురంబై యుండ
నామధేయములను దెలియమింజేసి తమవాఁడు లాఁతివాఁ డని యరయక తల
పడువారునై యుభయసైనికులు బెండుపడియుండ మనవారు శ్వేతునకు వెఱచి
బాణపాతదూర మొదిఁగినం దదీయసైన్యంబుఁ జూచి భీష్ముఁడు గ్రీష్మాదిత్యునట్లు
వెలుంగుచు శ్వేతుపై నడరి శరజాలంబుఁ బరఁగించి దనుజసంహారోద్యతుం
డైననారాయణులీల మెఱసి తఱిమినం బాండవసైన్యంబు కార్చిచ్చుపొదివినకా
ననంబుచందం బయ్యె. అట్టియెడ శ్వేతుండు జాతకోపుఁడై యాటోపమున శాంత
నవుఁ దాఁకి విజృంభించిన నయ్యిరువురువాఁడిమగలు మత్తవృషభములు అంకెలు
వేయుచందమున సింహనాదములఁ జేయుచు దివ్యాస్త్రముల నేయుచు గండడ
రుచుండ శ్వేతునికోల్తలు చూచినవా రితండు లేకుండిన భీష్ముఁడు పాండవసేన
నొక్కపూఁటన సమయింపఁడే యనుచుండ భీష్ముఁడు శ్వేతుని విడిచి యితరసై
న్యంబుపయిం గవిసె. పాండవులు ముదమునఁ బొదలిరి. అంత దుర్యోధనుండు
పాండవసైన్యముపయిం గవిసె. శ్వేతుఁడును గాంగేయుని విడిచి నీకొడుకుసై
న్యంబుఁ జించి చెండాడి చిందఱవందఱ గావించి క్రమ్మఱ మత్తసింధురంబుచంద
మున భీష్ము మార్కొని వాఁడితూపుల నేడింట నొప్పించిన నతం డందుల కించు
కేనియుం జలింపక పదిశరమ్ము లేయుటయు నావైరాటి నవ్వుచు నద్భుతముగఁ
బంచవింశతివిశిఖముల నమ్మరున్నదీనందనుపైఁ బరఁగించి శరదశకంబునఁ గోదం
డంబుఁ ద్రుంచి నిశితమార్గణమునఁ గేతనముఁ గూల నేసినం జూచి యందఱు
వానికడిందిమగంటిమికి వెఱచి భీష్ముని హతునకా వగచిరి. భీష్ముకేతనంబు పడినం
గాంచి పాండవులు ప్రహర్షోత్కర్షమున శంఖము లొత్తిరి. అంత దుర్యోధనుండు
క్రోధవశుండై భీష్మశ్వేతులలో నొక్కరుఁడు నేఁడు మడియువిధంబుగా నున్నది
కావున నందఱుం బిఱుదీయక పట్టి పొదువుఁ డని యెలుంగు రాల్పడం జెప్పి సేన
లకుఁ జేయి వీచుటయు బాహ్లీకకృపకృతవర్మశల్యవికర్ణచిత్రసేనవివింశతులు
బహుళవేగమునం బఱతెంచి చుట్టు ముట్టి శ్వేతునిపయిం బ్రబలశస్త్రాస్త్రజా
లంబు గుప్పించినం గినిసి శ్వేతుఁడు కరలాఘవంబు మెఱయ సిధురంబులపయిం
గవియుసింహముచాడ్పున వారలపైఁ గవిసి తదీయసకలశస్త్రాస్త్రముల నడఁగించి
పెక్కమ్ముల భీష్మునివిల్లు దునిమినం గంగాపుత్రుండు వేఱొండుశరాసనంబుఁ గొని
కంకపత్రశిలీముఖములు వానిపైఁ బెక్కులు పఱపించె. అందులకుఁ దలఁకక
యతండు బహుళమార్గణంబు లేసి భీష్ముని నెత్తుటఁ జొత్తిల్లం జేయుటయు నం

దళు భీష్ముఁడు పడునొకో యని వెతఁ జెందుచుండిరి. అంత దేవవ్రతుండు క్రో
ధోద్ధతుండై వాలికయమ్ములు పెక్కు లేసిన నతం డవియన్నియుఁ బ్రతిశరముల
నడంచి క్రమ్మఱ నతనిచాపమ్ము నిశితభల్లమునఁ దునిమె. అంతఁ గ్రోధమూర్ఛి
తుండై గాంగేయుండు కార్ముకాంతరం బెత్తి యత్యంతలాఘవంబున నాలుగమ్ము
లఁ దదీయరథ్యముల నాల్గింటినిం జదిపి రెంటఁ గేతువుఁ ద్రుంచి యొక్కట సార
థితలఁ ద్రెవ్వ నఱికిన నతండు విరథుండై వ్యాకులతోపబృంహితకోపావేగభరి
తుఁడై యుండ గాంగేయుండు నిశితశరసంఘముల వానిపయిం బరఁగించె. విర
థుఁడై శ్వేతుఁడు తేరు డిగ్గి కాలదండోపమంబై మహాఘోరం బయినకనక
గదఁ జేతఁ బుచ్చుకొని గాంగేయా, నిలునిలు మెక్కడకుఁ బోయెదవు నన్నుఁ
జూడు మనిపలుకుచు గిరగిరం ద్రిప్పి భీష్ముపై నేయుచుండ నీకొడుకులు పితా
మహుం బేరెలుంగెత్తి పిలిచి పాండవప్రియంకరుండై వీఁడు నీ కనర్థముఁ జేయు
చున్నవాఁ డని పల్కుచుండ నవ్వాఁడిమగండు కొఱవి తెఱఁగున మండుచుఁ
బైపైవచ్చుచున్నయాశక్తి నెనిమిదియమ్ముల నవశకలంబులఁ గావించుటయు
మీవార లార్చిరి. తనశక్తి యట్లు వమ్మగుటకుఁ జింతించి యించుకసేపు వాఁ
డితికర్తవ్యతామూఢుండై రోషంబు పెచ్చుపెరుగ గదఁ జేతం బూని దండ
పాణి యగునంతకుఁ గ్రేణిసేయుచు నత్యద్భుతప్రతాపదీపితుండై మేఘము గిరిశిఖ
రము నెట్టు లట్టుల కవియుదెంచి గిరగిరం ద్రిప్పి వేయుచున్నంతఁ దత్ప్రభావవి
దుఁడు గావున మీతండ్రి తటాలునఁ దేరు డిగ్గె. శ్వేతునిగదతాఁకునం జేసి భీష్ము
నిరథరథ్యసారథులు పలుతునియలగుడు శల్యప్రభృతు లయినరథికు లందఱు
నప్పుడొక్కపెట్ట శ్వేతుం దాఁకిరి. అంతలోన గాంగేయుండు వేఱొక్కతే రెక్కి
యక్కడరఁ దాఁకుటయు "గాంగేయా, యింకఁ దడవు సేయఁ జనదు. వీని
కిది బ్రహ్మవిహితం బయినమృత్యుకాలంబు. వేవేగ వీని వధియింపు" మనువచ
నములు దేవదూతసముచ్చారితములు మింట వినవయ్యె. ఆమాటలు విని భీష్ముఁ
డు వాని వధింపఁ గడంగుచున్నంతఁ దద్రక్షణపరాయణులై సాత్యకిధృష్టద్యుమ్నభీ
మసేనకైకయధృష్టకేతుసౌభద్రులు గవియుటయు ద్రోణశల్యకృపాదు లడ్డపడి
వారల వారించుచుండిరి. అట్టియెడ శ్వేతుఁడు ఖడ్గముఁ జేతఁ బుచ్చికొని భీష్ముని
విల్లు నఱికిన నతం డొండుకోదండం బెత్తి దేవదూతవచనంబుఁ దలపోయుచు
న్నంత భీమసేనాదు లగువీరులు ద్రోణాదుల నతిక్రమించి యడ్డపడుటయు మీ
తండ్రి భీమసౌభద్రుల నఱువదియమ్ములను సాత్యకిని శరశతంబునను ధృష్టద్యు
మ్ను నిరువదింటను గైకయుల నైదింటను వారించి యుడివోనిచలమున శ్వేతుం
దాఁకి బ్రహ్మాస్త్రాభిమంత్రితం బైననిశితమార్గణం బేసె. అయ్యస్త్రంబు దేవదాన
వాదులు సూచుచుండఁగ వానికవచంబు భేదించి యురముఁ వ్రచ్చి నేలఁ జొచ్చు

టయు నతం డస్తంగతభానుమంతునియట్లు ప్రక్షీణతేజుండై గిరిశృంగంబుభంగి నేలం గూలె. అట్లు శ్వేతుఁడు భీష్మనిహతుఁ డగుటయుఁ బాండవులు వగలఁ బొగిలిరి. నీకొడుకులు ముదమునఁ బొదలిరి. దుశ్శాసనుం డవార్యనిస్వనోల్లాసభాసురుండై నర్తనం బొనరించె నని సంజయుండు సెప్పిన విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

సూతపుత్రా, మత్స్యసేనాపతి యగుశ్వేతుఁడు పడినపదంపడి పాండవులును బాంచాలురు నేమి చేసిరి? వార లందఱు నంతప్రయత్నంబు సేయుచుండినను మాతండ్రి వానిం జంపుటకు నామనంబు మిక్కిలి ప్రీతిం జెందుచున్నది గాని ప్రత్యవాయచింతనమున లజ్జఁ బొందదు. గాంగేయుండు ప్రేమానురాగభరితుండై యున్నను వాఁ డతనితోడిపగఁ జేసికొనిసర్వస్వంబు పోయినం గొఱగాదని పాండవులనే యాశ్రయించి తదీయప్రతాపమున సంకటమునకుఁ బాల్పడి యార్యవృత్తి ననుష్ఠించె. వానితండ్రి యగువిరాటుఁ డజ్ఞాతవాససమయమునఁ బాండవుల రక్షించె. అట్టివిరాటునికొడుకుం జంపఁగఁ బాండవు లూరకుండిరే? ఇంక వార లేమి చేయుదురో యనితలంచిన మనంబు బెండువడియెడి. పితామహునకు నాచార్యునకును గృపాచార్యునకును నాకును గాంధారికిని వాసుదేవునకును బాండవులకును యుద్ధ మనభిమతము. మేమందఱమును బలుదెఱంగుల బలుమాఱులు వల దని వారించితిమి. వ్యాసకణ్వనారదజామదగ్న్య ప్రముఖమహర్షులును వారించి హితముఁ జెప్పిరి. ఎవ్వ రెంత చెప్పినను వినక దుష్టచిత్తుండైనదుర్యోధనుఁడు కర్ణసౌబలదుశ్శాసనులమత మనువర్తించి పాండవులతోఁ బగ పెట్టుకొని యింత చేసె. శ్వేతవధమునకు భీష్మునిజయమునకుం గోపించి పుండరీకాక్షుసహాయుండైనపార్థుం డామీఁద నేమి చేసె? అర్జునువలనిభయము నామనమున నెప్పు డుడుగకుండు. వాఁ డత్యంతశూరుఁడు. తలఁచినది తత్క్షణంబ సేయువాఁడు. పగవారిమేనుల నతండు చించిచెండాడుఁగాక యూరకుండునే? ఉపేంద్రతుల్యుఁ డమోఘక్రోధసంకల్పుఁడు నగునయ్యింద్రనందనుం జూచి మావారిమనంబు లె ట్లయ్యె? ఇంద్రాదినానాస్త్రవేది యయినయతనిం జూచి యెవ్వరికిఁ దలఁక కుండవచ్చు? శ్వేతవధానంతరము పాండవసేనానాయకుం డైనధృష్టద్యుమ్నుఁ డేమి చేసె? మున్ను మనవారు చేసినతప్పులవలనను శ్వేతునివధమునను బాండవులమనములెరియకుండునే? వారిక్రోధముఁ దలఁచికొంటి నేని రేలుంబవళ్లు నిద్ర పట్టదు. దుర్యోధనునిమిత్తమున నింత పుట్టెం జూచితే? ఆమీఁద నాకయ్య మెట్లుచెల్లె? తెలియఁ జెప్పు మనియడిగినధృతరాష్ట్రునకు సంజయుఁ డిట్లనియె. రాజేంద్రా, స్థిరచిత్తుండవై వినుము. నీయనయముననయింతలు పుట్టె. ఆత్మదోషమును దుర్యోధనుమీఁద నేల యారోపించెదవు? నీవు తెగువఁ బూని తెఱుంగుపఱిచిన నెవ్వ

రేపనువారు? అదియెల్ల నిపుడు గతజలసేతుబంధనప్రాయంబు నింటఁ జిచ్చు దరికొన్నయపుడు బావిఁ ద్రవ్వుచందమును నగుంగాని యొండు గాదు. అది యట్లుండె. అట్లు భీష్ముఁడు విక్రమించి శ్వేతుం జంపుటయుఁ గృతవర్మ రథస్థుండై యున్నశల్యుం జూచి విరాటసుతుం డైనశంఖుఁడు క్రోధమున మండుచు శక్ర చాపతుల్యం బయినకోదండముఁ గొని గొనయంబు సారించి రథిగణపరివృతుండై తాఁకి బాణమయవర్షముఁ గురియించుచుండ మద్రరాజరక్షణతాత్పర్యమున మీఁవా రేడుగురు రథికు లతనిం జుట్టు ముట్టిరి. భీష్ముఁడును దాళమాత్రం బయి నయుద్దండకార్ముకంబుఁ గొని యాశంఖుం దలపడుటయుఁ బాండవసేన వాతవేగ హతం బయిననావచందమున వ్యాకులం బయ్యె. అట్టియెడ నర్జునుఁడు శంఖరక్ష ణతాత్పర్యమున వానిఁ దలకడచి తాను భీష్ముం దాఁకినఁ గొలవి కొలవిం దాఁకి నట్లు వారిరువురకుం బోరు మహాఘోరంబై చెల్లుచుండె. చూపఱు వెఱఁ గంది చూచుచుండిరి. అప్పుడు శల్యుఁడు గదాపాణియై రథంబు డిగ్గి శంఖురథ్యముల నాల్గింటిం జమపుటయు వాఁడు ఖడ్గధరుండై తేరు డిగి విజయచ్చు తేరిమాటునకుఁ బోయె. భీష్ముఁ డంతఁ గొండొకసేపు సవ్యసాచితోడం బోరాడి యతని విడిచి ధృష్టద్యుమ్నుపయిం బడి శస్త్రాస్త్రగ్రామంబున రోదసీకుహరంబు నించి పాం చాలమాత్స్యకేకయప్రభద్రకసేనలనెల్లఁ జక్కాడుచు వేసవితటిఁ గాఱడవులఁ జేర్చుకార్చిచ్చుచాడ్పున వెలుంగుచు మధ్యందినమార్తాండునివడువునఁ బ్రచండ ప్రతాపాటోపదీపితుండై యుండ నాదండిమగనిం జూడ నోడి పాండవసైనికులు వలి పట్టినపసులయట్లు వ్యాకులులై నిరుత్సాహులై వెఱచఱచుటయు శాంత నవుఁ డశాంతప్రతాపుఁడై సైన్యంబున పీఁధులఁ దీర్చి యాశీవిషోపమంబు లయిన క్రూరనారాచంబులఁ బరఁగించుటయు నయ్యాపగేయు తేజంబుకంటెఁ దనతేజంబు తక్కువ యనుతలంపునంబోలె నెదుర నిలువనోడి జరఠభానుమంతుఁ డస్తగిరి గృహాగ్రహముఁ జేరఁ బోవుటయుం గని ధనంజయుండు వాసుదేవుననుమతంబున సేనల దివియింపం బంచిన రణముఁ జాలించి పాండవులు శిబిరమున కరిగిరి. నీకొడుకులును బరమానందభరితాంతఃకరణులై భీష్ముం గొనియాడుచు నిజశిబర ములకుఁ జనిరి.

### ధర్మరాజు కృష్ణునితో సంభాషించుట.

అవ్విధమున భీష్మునికొల్లల కోహటించి ధర్మనందనుండు చిన్నవోయిన మొగంబుతో శిబిరమునకుఁజనిదురంతచింతాక్రాంతుండై మురాంతకున కిట్లనియె. వాసుదేవా, యెండినయడవిం గాల్చుకార్చిచ్చుచందమున మనసైన్యమునెల్ల నీఱు సేయుచున్నభీష్మునిఁ జూచితివిగదా. మన కవ్వాఁడిమగనిఁ దేఱిచూడనైన నలవి గాకుండెడి. అమ్మేటివిలుకానియంపసోనకుఁ జెదరి మనమూఁకలు మొగదిరుగుచుం

డు. క్రోధదీపితుం డై నయమునినైనను వజ్రపాణి యైనదేవేంద్రునైనను శూల
ధరుం డై నవరుణునైనను గదాహస్తుం డై నకుబేరునైనను మార్కొని గెలువవ
చ్చుఁగాని భీష్ము నెదిరింపరాదు. ఆత్మబుద్ధిదౌర్బల్యమున భీష్ముఁ డనునగాధసాగరం
బు నిస్తరింపఁ జాలక మునిఁగితి. రణ ముడిగి యడవికిఁ బోయెద. అక్కడఁ
గాయ. లాకులుం దినుచు శరీరయాత్ర గడపుట మేలుగాని యీరాజుల నంద
అను ప్రత్యక్షమృత్యువై నభీష్మున కప్పగించుట మేలు గాదు. మహాస్త్రవిదుఁ
డై నయయ్యాపగాసుతుమునుమునఁ బడి మనవార లగ్గిం బడినమిడుతలట్లు మ్ర
గ్గుచున్న వారు. రాజ్యకాంక్షం జేసి తమ్ములనుం గ్రూరకృత్యమునకుఁ బురికొల్పితి.
వారలును భ్రాతృసౌహార్ద్దమునం జేసి నానిమిత్తమున రాజ్యభ్రష్టులై సర్వసుఖములఁ
బాసి తుది జీవితాశను విడిచి యిందులకు డిగినవారు. ఈభీష్మునిబారిం బడి బ్రదుకు
దు రనియుం జెప్ప నలవి గాకుండు. చాలుఁ జాలు నీరణమునఁ బదివేలు వచ్చె. బ్రదికి
యుండినఁ దపంబుసేయ వచ్చు నింతియకాని సుహృద్బాంధవప్రముఖులఁ జంపింప
నొల్లను. భీష్ముఁడు దివ్యాస్త్రముల మేటిశూరులతల లేఱుచున్నవాఁడు. ఇప్ప
డెద్దానిం జేసిన మే లగు? సవ్యసాచి సమరమున మధ్యస్థుఁడై యున్నచందము
దోఁచుచున్నది. మహాబలుఁ డై నభీముఁ డొక్కరుఁడు కేవలబాహుబలమున
క్షాత్రధర్మంబుఁ దలపోసి వీరఘాతిని యగుగదఁ గొని సాహసోత్సాహముల
కనురూపముగ గజవాజిరథపదాతివ్రాతంబుపయి దుష్కరకృత్యముఁ జేయుచు
న్నవాఁడు. ఇవ్వీరుఁ డార్జవయుద్ధమునఁ బెద్దకాలమునకుఁ బగఱ భంజింపఁ గలఁడు.
దివ్యాస్త్రవేది నీనెచ్చెలి యనితలంచిన నతం డిప్పుడు భీష్మద్రోణులదివ్యాస్త్ర
నిహతు లగుచున్నమనవారల నొప్పరికించినవాఁడు. పితామహుపరాక్రమంబు
నకుఁ గొలఁది లేదు. భీష్మదావానలంబుఁ జల్లార్ప నేమగండు కార్మొగు లగు
నొకో యనిచింతించెద. యోగేశ్వరా, భవత్ప్రసాదమునఁ బాండవులు పగఱ
గెలిచి రాజ్యప్రాప్తులై బాంధవసుహృద్గణంబులతో ముదమునఁ బొదలుదురని
పలికి చింతాశోకవ్యాకులచిత్తుండై యుండునంత గోవిందుడుఁ బాండవులకుఁ బర
మానందముఁ గావించువాఁడై ధర్మనందనున కిట్లనియె. భరతవర్యా, వగ పుడు
గుము. నీయట్టివానికి వగవఁ దగునే. మేటివిలుకాండ్రైననీతమ్ములు లోకమున
నెల్ల బిరుదుమగ లని పేరు గొన్నవారు. నేనును నీకుఁ బ్రియంబు సేయఁ బూని
యున్నవాఁడను. సాత్యకియు విరాటద్రుపదులును దక్కటిరాజులును నీకుఁ బ్రియ
ము సేయ నాయితపడియున్నవారు. నీసేనాపతి యైనధృష్టద్యుమ్నుఁడు నీకు హిత
మును బ్రియమునుం జేయ నున్నవాఁ డని నీచిత్తమునకే తెల్లంబుగదా. మఱియు
శిఖండి భీష్మవధార్థంబు జనించినవాఁడు. నీకును వగపు తగునే, యనియగ్గించినం
గౌ తేయాగ్రజుండు గదాగ్రజుపలుకులకు సంతసం బొంది యమ్మహాత్ముఁడు విను

చుండ ధృష్టద్యుమ్నున కిట్లనియె. వీరవర్యా, నామాట సైరణతో వినుము. వాసుదేవసమ్మతుఁడ వైననీవు సురలకుఁ గార్తికేయుఁ డెట్టు లట్టుల మాకు సేనానాయకుఁడవు. విక్రమించి కౌరవులఁ జెండాడుము. నేనును భీమార్జునులును నకులసహదేవులును సౌభద్రుఁడును ద్రౌపదేయులును దక్కటిప్రధానరాజు లందఱును వివిధసాధనములఁ గొని నీవెంట వత్తుమని ధర్మరాజు పలికిన విని ధృష్టద్యుమ్నుఁ డెల్లవారికిని హర్షోత్కర్షముఁ గావించువాఁడై మహారాజా, యేనుబరమేశ్వరువరమున ద్రోణవధార్థము జనించుట యందఱకును దెల్లంబకదా. భీష్మద్రోణకృపశల్యజయద్రథాదుల నెల్లవారలను మార్కొని యుక్కు మిగులఁ బోరాడెద నని సాహసోత్సాహములు పొంపిరివోవఁ బల్కుటయు ధర్మజుండు సంగరోల్లాసభాసురముఖవికాసుం డయ్యె. తక్కటిపాండవులును బరమానందమునఁ బొదలిరి. అట్టియెడ ధర్మరాజు ధృష్టద్యుమ్నుం బిలిచి యయ్యా, తొల్లి సురాచార్యుండు సురేశ్వరునకుఁ గ్రౌంచనామకం బయినవ్యూహము నుపదేశించె. అయ్యది శత్రుసైన్యవిధ్వంసంబుఁ గావింప నోపినయది. అందఱు రాజులావ్యూహ మెఱుంగరు. కావున నాసంవిధానంబున నెల్లి మనసేనలఁ బన్నింపుమని యాన తిచ్చి యందఱును దమతమశయనస్థానములకుఁ బోవం బనిచి తాను నభ్యంతరమందిరమున కరిగి యుచితవిధానమునం బ్రవర్తిల్లె.



రెండవనాటి యుద్ధము.

ప్రభాతం బగుటయు ధృష్టద్యుమ్నుఁడు క్రౌంచవ్యూహం బమర్చె. అందు సవ్యసాచి పురుహూతశాసనంబున విశ్వకర్మనిర్మితంబును నిందాయుధసవర్ణవివిధపతాకాలంకృతంబును గంధర్వనగరసన్నిభంబును నభోనర్తనచర్యావినోదబంధురంబును గపివరాధిష్ఠితంబును నగుకేతనంబు గారిలఁ గృష్ణసారథికం బయిన యుత్తమస్యందనం బారోహించి తరణిమండలమధ్యవర్తి యగునారాయణుకరణిం బొల్పుచు ముంగలియై పొలిచె. బహుళసేనాపరివృతుండై రథనియుతముతోడ ద్రుపదుఁడు శిరోభాగమున నిలిచె. కుంతిభోజుఁడును శైబ్యుఁడును గన్నులయిరి. దశార్ణదాశేరకానూపకిరాతాధిపతిప్రముఖులు లక్షయు లక్షయు డెబ్బదివేలరథములతోడ గండస్థానముల వర్తించిరి. భీమసేనుఁడును ధృష్టద్యుమ్నుఁడును దక్షిణవామపక్షముల రక్షించుచు నిలిచిరి. ద్రౌపదేయులు నభిమన్యుఁడును సాత్యకియును బిశాచదరదపాండ్యౌఢ్రాదులతోడ భీమసేనుదిక్కును నకులసహదేవఘటోత్కచప్రముఖులు శంబరవత్సాదులతోడ ధృష్టద్యుమ్నువలనుం బన్నిరి. హూణపటచ్చరనిషాదప్రముఖపరివేష్టితుండై యుధిష్ఠిరుం డర్బుదంబు నిరువదివేలునుం దేరులు దోడు నడువఁ బృష్ఠభాగమునఁ బొలిచె. కేకయపరివృతుండై విరాటుండు పదివేలురథములతోడఁ గావలియై జఘనంబున నిలిచె.

మఱియు నందు రథవారణగణంబులు పర్వతోపమంబులై తేజరిల్లుచుండెఁ దంతావళంబులందును గేతనంబులందును శ్వేతాతపత్రంబు లత్యంతదీప్తిం బరఁగె. అవ్విధంబునం బాంచాలవరుండు క్రౌంచవ్యూహవిధానమున సేనల నమర్చుటయు యోధవీరు లాయోధనోత్సాహసముదగ్రులై సూర్యోదయంబు వేచుచు నాహవక్షోణికి నడతెంచిరి. అంత నక్కడ నీకొడుకు దుర్యోధనుండు సర్వసేనాసమన్వితుండై నడతెంచి యభేద్యంబయినపాండవసేనావ్యూహంబుఁ జూచి గాంగేయకుంభసంభవశారద్వతగురుపుత్రమద్రరాజసౌమదత్తిదుశ్శాసనప్రముఖులఁ గలయ నవలోకించి యగ్గించువాఁడై యిట్లనియె. మీలోనొక్కఁడొక్కఁడే సైన్యములతోడఁ బాండవుల నుక్కడంప నేర్తురు. భీమాభిరక్షితంబయినపాండవ సైన్యమున కింత యని కొలఁది వెట్టవచ్చుఁగాని గాంగేయరక్షితంబయినయస్మద్బలంబునకుఁ గొలఁది చెప్పఁదరమే? కావున దుశ్శాసనచిత్రసేనశత్రుంజయవికర్ణసువీరనందోపనందకులు శూరసేనవేణికకుర్కురరేచకత్రిగర్తమద్రకయవనాదిపరివేష్టితులై సత్యవ్రతుండై నదేవవ్రతునకుఁ గావలియై సేనమొగమున నిల్చునది. తక్కటిబిరుదుమగలందఱుఁ దగినచోట్ల వర్తించునది యనిపలికిన విని యాపగాతనూజుండునుం బాండవసైన్యంబుదఱునుఁ జాలినతెఱంగునం బన్నిరి. అందు భీష్ముఁడు మహాసైన్యపరివృతుండై దేవసేనాగ్రంబునం బొలుచుపురందరుం బురడించుచు సేనాముఖంబునంబొలిచె. తీవ్రప్రతాపధుర్యుండై నయాచార్యుండు కుంతలదశార్ణమాగధవిదరనమేలకసైన్యంబులు గొలువ నమ్మరున్నదీనందను వెంట నంటి నడిచె. గాంధారసింధుసౌవీరశిబివసాతిగణపరివృతుండై సౌబలుం డాచార్యు వెంబడిం జనియె. అశ్వాతకలికర్ణవామనకోసల దరదవృకక్షుద్రకమాలవగణంబులు గొలిచిరాఁగసర్వసోదరసమన్వితుండై సుయోధనుండు సైన్యమధ్యమున వెలింగె. శలశల్యులు భగదత్తభూరిశ్రవులు విందానువిందులును వామపార్శ్వమునను సుశర్మసోమదత్తులు శతాయుశ్శ్రుతాయువులు గాంభోజనాథుఁడును దక్షిణపార్శ్వమునను నడిచిరి. కృపాశ్వత్థామకృతవర్మలు బలుమూఁకల వీక మెఱయ రారాజువెనుకటిదెసకుఁ గావలియైరి. కేతుమంతుఁడు వసుధానుఁడు మున్నగు నానాజనపదేశ్వరులు వారివెనుకటిదెస నిలిచిరి. అట్లు మోహరంబు దీర్చినంజూచి సైనికులు పెలుచ నార్చి శంఖము లొత్తుటయుఁ గురుపితామహుఁడు నిజసింహనాదముఖరితరోదసీగహ్వరంబు శంఖధ్వానంబునం బూరించె. భేరీపణవమృదంగాది వాద్యము లొక్కపెట్ట మ్రోసె. అట్టియెడఁ గృష్ణార్జునులు పాంచజన్యదేవదత్తములను ధర్మరాజనంతవిజయంబును వృకోదరుండు పౌండ్రంబును నకులసహదేవులు సుఘోషమణిపుష్పకంబులను ద్రుపదధృష్టద్యుమ్నశిఖండిసాత్యకివిరాటసౌభద్రద్రౌపదేయప్రముఖులు దమతమచిందంబులనుం బూరించి సింహనాదములఁ

గావించుటయు నానినదంబు తుములంబై పరఁగె ననిన విని ధృతరాష్ట్రుఁడు సంజయా, యవ్విధమునఁ బోరికిసమకట్టినయుభయసైనికులలో నెవ్వరుదొలుతఁ పడిరనియడుగ నవ్విచిత్రవీర్యపుత్రునకు సూతపుత్రుఁ డిట్లనియె.

అయ్యవసరమున దుర్యోధనుఁడు తమవారలఁ బురికొల్పఁగ మేటిరథికులుద్దామకేతుశోభాభిరామంబుగాఁ గలియుటయుఁ బాండవరథికులును వీఁక మెఱయఁ దాఁకుటయు నుభయసైన్యంబులందును నిపుణధనుర్ధరప్రయుక్తనిశితశరసంపాతంబునం జేసి గజవాజిరథపదాతివర్గములు నేలం గూలుచుండె. అప్పుడు భీష్ముఁడు గ్రీష్మాదిత్యసమతేజుండై భీమార్జునసౌభద్రవిరాటధృష్టద్యుమ్నులను గేకయుల నేవురనుం దాఁకి యంపసోనం బఱపించుచు నొంచుచున్నంతఁ బాండవసైనికులత్తొమ్మండ్రుమేటిదొరలును జేది మత్స్యయోధులు నయ్యోధవరుం గడవ నేరమికి బెండువడినచిత్తములతో నుత్తలంపడుచుండఁ బితామహువిక్రమంబున కల్గి ఫల్గునుండు పుండరీకాక్షున కిట్లనియె. జనార్దనా కురుపితామహుండు నన్నుగేడించి మనవారలపై విజృంభించిన నితనికోర్తుల కెల్లవారును వెఱచి పఱచున్నవారు. అవ్వాఁడిమగనియిప్పటికడిమి నాకుం జూడ దుర్యోధనహితాచరణతాత్పర్యంబున మనవారలనెల్ల నిమేషమాత్రన విధ్వంసంబుఁ గావించుతెఱంగు దోఁచుచున్నయది. ఇదియ తఱిగాఁ గొని యాచార్యుండును శారద్వతుండును మద్రపతియు దుర్యోధనాదు లగుధార్తరాష్ట్రులునుం గుమి గూడి మనవారలం దఱుమఁ గడఁగుచున్నవారు. ఇంకఁ దడవు సేసినం గార్యంబు దప్పుఁ గావున నతిత్వరితగమనంబున మనతేరతని కభిముఖముగఁ బఱపుము. అస్మదీయసైనికరక్షణార్థం బమ్మహావిక్రముం జెండాడెద ననిన వనజనాభుండు నీవిక్రమమునకుఁ దగినతెఱంగుగఁ దేరు వోనిచ్చెద. కడిందిమగటిమిఁ జూపు మని చెప్పి యతిరయమున నరదంబు నడుపఁ గవ్వడి సమున్నతభైరవారావనిష్ఠురవానరకేతనస్ఫూర్తిమార్తురకార్తిఁ బచరింపఁగఁ దన కడ్డవడినశూరసేనాతిమిరంబు నిజప్రతాపభానూదయంబునఁ బొడవడంగించుచు సుహృదులకు సంతసంబును నరాతిసైనికులకు సాధ్వసంబునుం గావించుచు గంగాపుత్రుం దాఁకిన నవ్వాఁడిమగండు సైంధవసౌవీరకేకయప్రముఖపరివేష్టితుండై యతని మార్కొనియె. గాండీవపాణియైనసవ్యసాచిం దాఁకఁగఁ గురుపితామహుం డాచార్యుండు సూర్యసూనుండునుం దక్కఁ దక్కటివారు నేర్తురే! అట్లు సురనదీసూనుండు సురనాథసూనుం దాఁకి డెబ్బదేడువాఁడినారసంబు లేసినఁ గుంభసంభవుం డిరువదేనుమార్గణములను గృపుఁడు పంచశతశరములను దుర్యోధనుఁ డఱువదినాలుగువాలికతూపులను శల్యుఁడు తొమ్మిదియమ్ములను గురుపుత్రుఁ డఱువదివిశిఖములను వికర్ణుం డార్తాయనియు మూఁడేసిబాణమ్ములనుం బ్రయోగించినం గొంచెమేనియుం జలింపక నిలింపపతితన

నయుఁ డాయమ్ములనెల్ల మాయించి యిరువదేనింట భీష్ముని నఱువదింట ద్రోణునిఁ దొమ్మిదింట గృపుని నేనింట దుర్యోధనునిఁ జెఱి మూట వికర్ణార్తాయనులను నొప్పించి యుక్కు మిగులుచుండ సాత్యకివిరాటధృష్టద్యుమ్నద్రౌపదేయసౌభద్రు లయ్యర్జునునకుఁ దోడుపడిరి. అందుఁ బాంచాలవర్యుఁ డాచార్యుం దలపడియె. తక్కటివారును దక్కటివారలఁ దాఁకిరి. అట్లు భీష్మునకుఁ దోడుపడినవారల సాత్యకిప్రముఖులు మార్కొని పోరాడుచున్నంత నాపగేయుం డర్జునుం దాఁకి యెనుఁబదియమ్ముల నెక్కయుమ్మడి గురియించిన మీవార లత్యంతసంతోషమునం బొదలుచుండిరి. అట్టియెడ గాండీవి పితామహుం గేడించి వీఁక మెఱయ మీమూఁకలఁ జొచ్చి చీకాకుపఱచుచుండ దుర్యోధనుఁడు దురంతచింతాభరితుండై శాంతనవునెద్దకుఁ జని పితామహా, చూచితే సవ్యసాచి మాధవసహాయుండై యస్మదీయసేనల మూలధ్వంసముఁ గావింపుచున్నవాఁడు. నీవు, నాచార్యుఁడును బ్రదికియుండఁగనే యిట్టు లైన నింక నే మనం గలదు. నీకయికదా కర్ణునియ స్త్రసన్యాసమునకు నియ్యకొంటిని. నీవు పాండవులమేలు గోరినవాఁడవు కావున లెస్స పోరాడవు. ఇఁకనైనం గాండీవి పడుతెఱంగు చిత్తమునం గావించి యిం చుకసేపు వాఁడిమగంటిమిం బేర్చినంగదా కార్యంబు చక్కంబడు ననిపల్కిన నప్పలుకులు చెవులు సూఁడినం దనలోఁ గుత్సించుచుఁ గటకటా! క్షత్రధర్మం బింతకష్టం బగునే యనిరోయుచు మీతండ్రి బీభత్సుం దాఁకుటయు శ్వేతవాహనయోజితరథద్వయసమాగూఢు లయినయయ్యిద్దఱునీరులం జూచిసకలరాజులు సింహనాదములను శంఖధ్మానంబులను గావించిరి. అప్పుడు ద్రౌణిదుర్యోధనవికర్ణులు భీష్మునకుఁ దోడుగ నేతేరం జూచి పాండవు లర్జునునకుఁ దోడుపడిరి. అత్తఱి మరుత్తటినీపుత్త్రుఁడు మరుత్పతిపుత్త్రుపైఁ దొమ్మిదియమ్ములు పఱఁగించిన నమ్మేటి విలుకాఁడు దొలుత మర్మభేదనకర్మఠంబు లైనదశవిశిఖంబుల నప్పితామహు నొ నేసి యేదిక్కు చూచినం దనమార్గణమ్ము లేకాఁగ బహుళశరాసారంబుఁ గురియించుటయు శాంతనవుఁడు తదీయశరజాలంబెల్లఁ దనకాండజాలంబున మాయించిన నయ్యిరువురుశూరశేఖరు లెక్కువతక్కువలు లేకుండ భండనంబు సల్పునెడ నితరేతరశరప్రహారంబునఁ దుత్తునియలై పడినయొండొరులకాండఖండములు కొండలట్టు లగపడియె. అంతఁ గడిమి మెఱసి కిరీటి యిరువదేనువాలికతూపుల నయ్యాపగేయుమేనం గీలించినం గోపించి యాతండు తొమ్మిదియమ్ముల నతనిపయిం బఱపె. అటఁ గొండొకవడి కయ్యిద్దఱు పరస్పరరథంబులను నితరేతరకేతనంబులను శరజాలంబున ముంచి సమరక్రీడ సల్పుచుండఁ గోపాటోపదీపితుండై యాపగాసుతుండు దేవకీసుతునురమ్ముఁ బటుశరత్రితయంబున గాఢ నేయుడుఁ బార్థసారథి శాంతనవశరవిక్షతగాత్రుండై యామనితఱిం బొలుచుపూచినమో

దుగుచందంబునం బొదలె. అందులకుఁ గడుం గినిసి క్రీడి మూఁడువాఁడితూపుల నాపగేయుసారథిని నొప్పించిన నతండును గండడరి గతప్రత్యాగతచిత్రమండలగమనంబులఁ దేరు దోలుటయు దేవకీసూనుఁడును బృథాసూనురథంబు నత్యంతవిచిత్రగమనంబుల నడుపుటయు సారథులసామర్థ్యంబునం జేసి సైన్యమధ్యమున నారథద్వితయము సాగరంబుఁ గలంచుగిరిద్వయము ననుకరించె. అంత నయ్యిరువురుబిరుదుమగలు పరస్పరప్రహరణంబున కంతరము వేచుచుఁ జిత్రప్రకారమునఁ బోరాడుచు సింహనాదసమామ్రేడితశంఖారవము లొనరించిన నానినాదంబునను రథనేమినిస్వనమునను బుడమి గడగడవడఁకుచు నవిసె. ఉభయసైనికవీరులును ధార్మికుపాపవర్తనంబుమాడ్కి శశవిషాణప్రాయంబైనయమ్మేటిమగలతారతమ్యంబుఁ బరికింప నేరక యడియాలముల లెస్స పరిశీలించి వారల నెఱింగిరకాని యొండుగా దయ్యె. అవ్విధమున నయ్యిరువురు గొంతవడి శరజాలతిరోహితులై యదృశ్యతం బొందియు గొంతవడి ప్రకాశముఁ బొందియు సమానప్రకారమునఁ బోరాడుచుండ దేవగంధర్వచారణమహర్షిప్రముఖు లద్దిరా! వీరివిక్రమంబుఁ జెప్పఁ గొలఁదియె. ముల్లోకంబు లొక్కటియై గట్టిమొన గట్టి వచ్చిన నీవాఁడిమగల గెలువఁ దరము గాదు. ఈసమరంబుఁ జూడ మహాద్భుతం బయ్యె. ఇంక నిట్టివి చూచుట యెంతయు నరిది. దేవవ్రతుఁ బార్థుఁడు గెలువఁ జాలఁడు. దేవతలకుఁ జెనకరానిపార్థుని దేవవ్రతుఁడును గెలువ నేరఁడు. యుగములు గ్రుంగునందాఁక నేనియు నియ్యాలంబు నడుచుచుండు నని తోఁచెడి నని పలుకుచు నవ్వీరవర్యుల నగ్గించిరి.

### ద్రోణాచార్యధృష్టద్యుమ్నులద్వంద్వయుద్ధము.

అట్లయ్యిద్దఱుం దద్దయు నుడివోనిబీరంబు పెంపారఁ బోట్లాడుచుండఁ బాండవకౌరవయోధులు పెక్కండ్రు సాహసోత్సాహంబులు నెఱయ దురంబు సల్పుచుండిరి. అందు ద్రోణాచార్యుండును ధృష్టద్యుమ్నుండును గడుం గడిమి మెఱయఁ దాఁకి రనవుడు ధృతరాష్ట్రుఁడు సంజయా, వారిపోరు వినఁ గోరెదఁ జెప్పుము. పౌరుషముకంటె దైవమే బలవత్తరమని యొప్పుకొనక తప్పదు. కాకున్నఁ గురుపితామహుఁడు పాండవుల గెలువ నేరకుండునె? అమ్మహావీరుని విక్రమంబు మనకుఁ గ్రొత్తయె? నిక్కంబ యతం డలిగెనేని చరాచరవ్రాతంబుతోడ ముల్లోకంబుల నీఱుసేయ నోపునుగదా యనిన సంజయుఁ డిట్లనియె. రాజేంద్రా, స్థిరచిత్తమున దారుణరణప్రకారము లెస్స వినుము. దేవతలు దేవేంద్రునితోడ వచ్చి ముట్టినను బార్థు గెలువఁ జాలరు. నీవారలం జెప్పనేల? ఇఁక నామాటలు చాలింపుము. అవ్విధమున నాచార్యుండు పాంచాలవరుం దలపడి పటుశరముల నతనియరదమును గుఱ్ఱములను నొప్పించినం గోపిం

చి ధృష్టద్యుమ్నుండు సరంభావష్టంభమునం బేర్చి యయ్యాచార్యుపైఁ దొంబది
వాఁడితూపుల నేసి నిలునిలు మని యదల్చుటయు నక్షీణప్రతాపదీపితుం డైన
ద్రోణుండు బాణాసారమున నతనిం గప్పి వజ్రాయుధసదృశంబై రెండవమృత్యు
దండంబునాఁగ నొప్పారుఘోరనారాచం బరిపోసి యేసినం జమూనికరంబున హా
హాకారం బెసంగె. ఆనారసంబు తనపయిం బడవచ్చుచుండ నయ్యేకవీరుండు
కొండచాడ్పున నిశ్చలుండై వింటినేర్పున దానిం బలుతునియలు గావించి
యగ్గురునిపయి శరవర్షముఁ గురియించి పరమసంతోషమునం బొదలి పాం
చాలపాండవు లితం డిట్టు లత్యంతదుష్కరకృత్యంబు సేయునే యనిపొగడుచుండఁ
గడిమి మెఱసి స్వర్ణవైదూర్యవిభూషితంబు మహావేగంబు నగుదివ్యశక్తి నగ్గురు
నిపాటు గోరి బిట్టేసె. ఏసినం గొంచమేనియుసంచలింపక యక్కోదండగురుండు
నగుచు నవలీలం దాని మూడుతునియలుగనఱికినం గినిసి పాండవసేనానాయకుండు
శరాసనగురుని వాలంపసోనం గప్పుటయు నయ్యతిరథోత్తముఁడునిమేషమాత్రన
తదీయశరజాలంబు మాయించి ద్రుపదపుత్రునికోదండంబుఁ దునిమె. ఛిన్నకార్ము
కుండై ధృష్టద్యుమ్నుఁడుసముద్దండగదాదండంబు చేతం బూనియాచార్యుపయిం
బిట్టేసిన నబ్భారద్వాజుండు దాని నడుమన పొడిపొడిగావించినం దద్విక్రమమునకుఁ
జూపఱు వెఱఁగందిరి. అట్లుగద నఱికి గురుఁడు కనకపుంఖము లగునిశితభల్లములఁ
బృషతపౌత్రునిమైమఱు వఱువుల్లు గావించినం గడునలిగి యప్పాంచాలరాజకుమా
రుండు కడిందిమగంటిమిం బేర్చి ద్రోణుం బాణపంచకమున గాడ నేయుటయు
నప్పు డయ్యిరువురు రక్తసంసిక్తగాత్రులై యామనితఱిం బూచినమోదుగుల
చందమున నొప్పిరి. అంత నాచార్యుఁ డుదగ్రకోపసమగ్రుండై ద్రుపదతనయు
నివిల్లు దునిమి కార్మొగులుగిరిశిఖరంబునుంబోలె నిశితశరజాలమునం గప్పి సారథి
తల ద్రెవ్వ నేసి గుఱ్ఱముల నాల్గింటినిం గూల్చి యంతలో నతండు వేఱొక్కవి
ల్లెత్తిన దానిం దునిమి సింహనాదం బొనర్చె. అట్లు ధృష్టద్యుమ్నుఁడు విరథుఁడై
గదఁ జేతం బూని తేరు డిగ్గునంత నబ్భారద్వాజుండు చూపఱు పరమాద్భుతం
బొంది పొగడ దానిం బొడిచేసిన నాద్రుపదపుత్రుఁడు వాలుఁ బలుకయుం గొని
మదపుటేనుంగుఁ గవియ వచ్చుసింగంబు తెఱంగున నాచార్యుం దాఁకిన నతండు
భుజబలంబు నెఱయ నస్త్రప్రయోగకౌశలంబు మెఱయ వాలంపగములం గప్పిన
నప్పాంచాలవరున కప్పుడు గురుం గడవరాకుండె. అట్టియెడ భీమసేనుఁ డాధృష్ట
ద్యుమ్నునకుఁ దోడ్పడఁ దలంచి యతిరయమునఁ జనుదెంచి యతనిం దనతే
రెక్కించుకొని యేడువాఁడితూపులఁ జాపాచార్యునొప్పించుటయు దుర్యోధనుఁ
డాచార్యునకుఁ దోడ్పడఁ గాలింగుని బనిచిన నాశ్రుతాయువు బహుళచమూ
సమేతుఁడై భీమసేనుం దాఁకె. ద్రోణుఁడు ధృష్టద్యుమ్నుని విడిచి విరాటద్రుప

దుల మార్కొనియె. ధృష్టద్యుమ్నుఁడు ధర్మజునొద్ద కరిగె. కాళింగులకును భీమ సేనునకును ఘోరం బైనపోరు సెల్లె ననవుడు నాంబికేయుఁడు సంజయా, పర మాద్భుతబలుఁ డైనభీమసేనుని గాళింగు లెట్లు మార్కొనిరి. దండపాణి యైన యమునియట్లు గదాపాణియై రణక్షోణిం దిరుగునెడ వానిం జెనక వచ్చునే యని యడుగ నతనికి సంజయుఁ డిట్లనియె.

భీముఁడు కాళింగునితో యుద్ధముఁ జేయుట.

అవ్విధమునఁ గళింగనాథుఁ డైనశ్రుతాయువు బహుళరథికసమన్వితుండై భీముని దాఁకునెడ నక్కళింగునికిఁ దోడ్పడువాఁడై కేతుమంతుఁడు పదివేలయేనుఁ గులును నిజనిషాదబలమునుఁ దోడ రా వృకోదరుం దలపడియె. చేదిమత్స్యక రూశసైన్యములు భీమునకు ముందఱ నిలిచి కళింగనిషాదసైన్యములం దలపడు టయు నారెండుమూఁక లొండొరులం గెలువఁ గోరి పెద్దయుం బెనంగుచున్నంతఁ గళింగనిషాదసేనలు లెక్కకు మిక్కిలియై యునికిం జేసి చేదిమత్స్యకరూశసైన్యం బులు కొంతవడికి దైన్యంబు నొంది చేయునది లేక యుక్కు దక్కి పాఱినం బవ మానసూనుండు చలంబు డింపక భుజబలంబు మెఱయ రయంబు నెఱయ నిం చుకేనియు సంచలింపక నిశితశరనికరంబుఁ గురియించి దనుజసంహారోద్యతుం డైనవృత్రారాతిభంగి నభంగురతీవ్రప్రతాపంబు దీపింపఁ జేయుచుఁ గళింగని షాదసేనల నేట్లాడుచుండఁ గళింగపతిపుత్రుఁ డైనశక్రదేవుఁడు భీముని మార్కొని యొక్కయుమ్మడి సాయకసంచయంబుఁ బరఁగించి యతని తేరిగుఱ్ఱములఁ జదిపి ప్రా వృట్పయోధరంబుచందంబున శరవర్షంబు గురియించె. విరథుఁడయ్యును వృకో దరుఁడు వెఱపుఁ దక్కి యుక్కునం బేర్చి తనపయిం బడునంపసోన సరకుసేయక ఘోరాకారం బైనగదాదండంబుఁ జేతం బూని బిట్టేసిన నగ్గదతాఁకునం జేసి నుగ్గై శక్రదేవుఁడు సారథిసహితంబుగ నేలం గూలె. కొడుకుచావునకు రోషవి

పాదంబులు మనంబునఁ బెనంగొనంగఁ గళింగపతి తేరిగములతోడ వాయు సూను నడుముటయు నబ్బలియుండు బుషభచర్మనిర్మితం బై కాంచనార్ధచంద్ర నక్షత్రసమంచితం బైనపలుకయు దారుణరణక్రియాభీలం బైనకరవాలంబును గ్రహించి యెదిరించినం జూచి శ్రుతాయువు వాయుసుతునసువులఁ గొనఁ గడంగి ఘోరనారాచంబు లెస్స యరివ్రాసి యేసిన నాసమరశౌండుండు నిజ ప్రచండనిస్త్రింశమున దాని రెండుతునియలుగ నొనర్చి యార్చి పేర్చె. అందు లకుఁ గడుం గినిసి కళింగపతి చతుర్దశతోమరము వేయుటయు వాయుసూనుం డు వాలు గొని వానినడుత్రోవన పలుతునియలు గావించిన మీావారిమూఁకలు చీకాకుపడియె.

### భీముఁడు భానుమంతుని జంపుట.

భీమసేనుపరాక్రమంబుఁ జూడ నోర్వక కళింగపతితమ్ముఁ డగుభానుమంతుఁడు దంతావళం బెక్కి యన్న కడ్డపడి వడముడిం దలపడి పటుశరాసారంబునం గప్పి పెలుచ నార్చిన నమర్షోత్కర్షఘూర్ణమానస్వాంతుండై బకాంతకుండు కళింగసేనలెల్ల నల్లాడుచు నితండు మనుష్యమాత్రుండు గాఁ డని నివ్వెఱఁ జెందఁగ నత్యుద్భటప్రకారంబున సింహనాదం బొనర్చి యురువడించి వాని యేనుఁగుకొమ్ములమీఁదికి లంఘించి కరవాలంబున వానితలఁ దఱిగి కుంభికుంభస్థలంబు నఱికి తొలంగ నుఱికె. భానుమంతుఁడును నిజదంతితోడ నేలం గూలె. అత్తెఱంగునఁ గళింగరాజానుజుం గూల్చి తనపదాతిత్వంబును నిస్సహాయత్వంబునుం దలంపనిబీరంపుపెంపు పొంపిరివోవఁ బులుఁగుల వేఁటాడుమేటిడేగచాడ్పున మెఱసి కాలాంతకయమునివిధమున నేరికిం దేఱిచూడరానికైవడిం బొలిచి కొఱవి ద్రిప్పినతెఱంగున నంతటఁ దానకా నగపడుచు వీథులఁ దీర్చి పెక్కుపోకలం బోయి యనలీలం బరమాభీలంబయినకరవాలంబున శుండాలంబులదంతములం దఱిగియుఁ దొండముల నఱికియుఁ గుంభముల నవియించియుఁ దురంగములయంగములం బగల్చియుఁ దేరుల నుగ్గాడియుఁ గేతనములఁ గూల్చియుఁ బదాతివ్రాతంబుఁ దునుమాడియు వాహనంబులనుండి యయ్యైయారోహకులఁ ద్రోచియు వీరవిక్రమవిహారంబు సల్పుచుండ వానికోల్తల కోహటించి కాళింగసైన్యంబు దైన్యంబుఁ జెందియు బమ్మరించియుఁ దిగుగుడువడియు నొచ్చియుఁ జచ్చియు వెఱచియుఁ బఱచియుఁ జిందఱవందఱయయ్యె. రణాంగణంబున నెక్కుడఁ జూచినను నలిగినయోధమస్తకంబులును దునిసినకరికరదంతకుంభనివహంబులును విఱిగినశక్తియష్టితోమరశరాసనప్రముఖహేతివ్రాతంబులును దెగినగజవాజికళేబరంబులును గూలినకేతనస్యందనసందోహంబులును నఱవఱలైనమైమఱువుల్లును ద్రెస్సినవివిధభూషణగణంబులును నుగ్గైనయోక్త్రకశాఖలీనకుథాదిసంఘాతంబులునై ఘోరాభిరామంబయ్యె. అట్టియెడ నాపగేయుండు వృకోదరుకోలుతలు సూచి తలపడఁ జనుదెంచుచున్నంతఁ గళింగపతి యతని కడ్డము సొచ్చి తాను దాఁకి తొమ్మిదియమ్ముల నతనిఱొమ్మునం గీలించినం గళింగబాణార్దితుండై బకమర్దనుఁ డంకుశమునఁబొడువఁ జెలరేఁగునేనుంగుభంగిఁ బెచ్చుపెరిగి శుష్కేంధనంబుల దరికొనునగ్నిచాడ్పునఁ బ్రస్ఫురితతేజోదుర్నిరీక్షుండై యప్పుటికిఁ దేరాయితపఱిచి తెచ్చి మ్రోలం జూపట్టినతనసారథిని విశోకుం గారవించి రథారూఢుండై కాళింగునిఁ జుఱచుఱం జూచి నిలునిలు మనియదల్చుటయు వాఁడు వాఁడిమి మెఱసి మఱియుం బెక్కుతూపు లేసె. ఏసిన నతండు ద్రొక్కువడ్డ పాముపగిదిఁ గినుక గదుర దివ్యశరముల శరాసనమున సంధించి యేడువాఁడికోలల

నాశ్రుతాయువును గాడ నేసినవాఁడు మూర్ఛిల్లుటయు సారథి తేరుఁ దొలఁగించె. అంత నిలువక భీముఁడు రెంట వానిచక్రరక్షకు లగుసత్యసత్య దేవనామకులం జంపినం గనలి నిషాదపతి యగు కేతుమంతుఁడు కళింగపతిమీఁది చెలిమి దవిలి తన్ను మార్కొన్న వానినంతకుపురంబునకనుచుటయుఁ గళింగయోధులు పెక్కండ్రు క్రుక్కి మిగిలి తన్నతిమినం గదపండువు సేసి వారల రెండువేలయేడునూఱుగురఁ జక్కఁ బెట్టి యాగాడ్పుపట్టి సింహనాదంబు గావించి చిందముఁ బూరించె. ఆ మోఁతకు గ్రాహగ్రస్తంబయినకొలనువిధమునఁ గలఁతవడినకళింగసైన్యంబుతోడఁ బుడమి సంచలించె. కళింగసంహారోద్యతుం డైనభీమునిసింహనాదము విని భీష్ముఁ డతిరయమునఁ బఱతెంచుటయు ధృష్టద్యుమ్నుఁడు సాత్యకిశిఖండులం దోడ్కొని తాను బారావతవర్ణతురగయోజితంబు కోవిదారకేతనవిరాజితంబు నగు తే రెక్కి యతి రయంబునఁ జనుదెంచి వృకోదరునకుఁ దోడ్పడి భీష్ముఁ దాఁకె. ధర్మరాజును గజానీకమధ్యమున వెలుంగుచు వారివెన్నంటి చనియె. ఆమేటిమగలు ముగ్గురు వేఱువేఱ మూఁడేసి బాణమ్ము లేసిన నాదేవవ్రతుండు శిఖండికి మాఱేయు టుడిగి ధృష్టద్యుమ్ముని శైనేయుని మూఁడేసియమ్ముల నొప్పించి భీముపయిం బటుప్రదరంబులఁ గురిసి రథ్యములం గూల్చె. నిహతరథ్యరథస్థితుండయ్యు వాయుసుతుండు వెఱపనుమాట యించుకేనియు లేక ప్రబలశక్తిని గాంగేయుతేరిపయిం బడ నేసిన నాధనుర్ధరవరుఁడు నడుమన దాని రెండుగఁ బుడమిం బడఁ గూల్చె. అందుల కోర్వక వృకోదరుఁడు గదఁ జేతం బూని తేరు డిగ్గుటయు ధృష్టద్యుమ్నుఁ డతని ననునయించి తనరథం బెక్కించి తొలంగించికొని యరిగె. అట సాత్యకి భీమునకుఁ బ్రియంబు సేయువాఁడై కురుపితామహుసారథిం గూల్చుటయు వాయువేగంబు లైనయతని తేరిగుఱ్ఱములు తే రీడ్చికొని సమరధరణీతలంబుఁ దొలఁగి కడుదవ్వు చనియె. అవ్విధమున భీముఁడవక్రవిక్రమాటోపదీపితుండై తన్నుఁ గాంచినకాళింగు లితండు మనుష్యుఁడు గాఁడు కాలాంతకుఁడై యిట్లు జగములు సమయింపఁ దోఁచినవాఁడుగాఁబోలు నని వా విడిచి యఱచుచుండఁ దత్సేనాకాననంబు రూపుమాపి మాంసకర్దమం బయినరక్తనదీప్రవాహంబుఁ బాఱించుటయుఁ గాళింగులు వానిఁ జూడ నోడి పఱచుచుండిరి. పాంచాలమాత్స్యాదులగుపాండవయోధులు భీమునివిక్రమాటోపంబుఁ బొగడిరి. వాయుపుత్రుఁడును బాంచాలరాజపుత్రుం గౌఁగిటఁ జేర్చి సాత్యకిదెసఁ జూడ్కి నిగిడించుటయు నాశైనేయుఁ నవ్వడముడికిఁ బరమానందముఁ గావించువాఁడై తేరు డిగ్గి ధృష్టద్యుమ్ను తేరిమీఁదికిఁ జని భీముని గాఢపరిరంభమున నాదరించి యోమహాబలనందనా, సహాయబలంబులు లేక పోక పెనఁగునట్టికళింగనిషాదసైన్యంబును కళింగపతిపుత్రుఁ డగుశక్రదేవుని నిషాదపతి యగు కేతుమంతునిం జూపి వారల

మూఁకలఁ జీకాకుపఱుచుటం జూడ నీబలం బింత యని కొలఁది యిడం దగునే యని ప్రస్తుతించి క్రమ్మఱి నిజరథం బధిరోహించి కౌరవసైన్యంబుఁ జెండాడుచుండ మధ్యాహ్నం బయ్యె.

అయ్యవసరమున నశ్వత్థామయు శల్యుఁడును గృపుఁడును దన్నుఁ దాఁకినం బాంచాలరాజకుమారుండు తనతేరిమీఁద నున్నభీముని నీవు నాపోరు నూచుచుండు మని సవినయముగఁ బ్రార్థించి డించి కడంగి యశ్వత్థామరథ్యములఁ జంపుటయు నతండు మద్రపతితేరెక్కి బహుళశరముల నాధృష్టద్యుమ్నుని నొంచుచుండె. శల్యకృపు లప్పార్షతుపయిం గడిమి చూపుచుండ దవ్వనం జూచి యభిమన్యుండు రయమునం జనుదెంచి యిరువదేనింట శల్యుని దొమ్మిదింటఁ గృపుని నెనిమిదింట నశ్వత్థామను గాడ నేయుడు నతని ద్రౌణి యొక్కతూపునను శల్యుఁడు పండ్రెంటను శారద్వతుండు మూఁటను నొప్పించుచున్నంత లక్ష్మణకుమారుఁడును వారికిఁ దోడ్పడి చూపఱు వొగడ సౌభద్రుం బటుశరాసారమున ముంచె. అంతఁ గ్రోధదీపితుండై యర్జునసూనుండు దనవింటినేర్పేర్పడ నేనూఱువాలికయమ్ముల నాదుర్యోధనసూనుమేనం గీలించిన నతండునుం గినిసి క్రీడికొడుకువిల్లుఁ దునిమె. తునిమినం గిరీటినందనుండు వేఱొక్క కార్ముకంబునఁ బలుతూపులు సంధించి లక్ష్మణకుమారుపయిం బడ నేసె. అవ్విధమున నీమనుమ లిద్దఱుచలంబు డింపక పోరాడుచుండ భవదగ్రనందనుండు నిజనందనరక్షణతాత్పర్యమున నభిమన్యుం దలపడుటయు భీష్మద్రోణప్రముఖు లయినరథికవరు లందఱు నెక్కపెట్ట వానిం దాఁకిరి. అందఱుఁ ద న్నొకనిం బొదివినను బాండుపౌత్రుఁ డించుకేనియు సంచలింపక యందఱ కన్నిరూపులై యేట్లాడుచుండునంత ధనంజయుం డతిత్వరితగమనంబునఁ బఱతెంచి యమ్మహారథుల నందఱ మార్కొని యుడివోనిబీరంపుఁబెంపు సొంపార గాండివజ్యాఘోషంబు భీషణంబుగఁ బటుశరాసారంబుఁ గురియించి యేనుంగులఁ గూల్చియుఁ దేరుల నుగ్గుసేసియు గుఱ్ఱముల నుఱుమాడియుఁ బదాతివర్గంబులఁ జెండాడియుఁ బ్రళయసమయప్రచండరుద్రుని మాడ్కి రౌద్రంబున వెలుంగుచుండ నక్కోదండవిద్యావిశారదుం జూడ నోడి దిక్కు దోఁపక యిటు నటుం బాఱు సైనికులపదఘట్టనసముద్ధూతపాంసుపటలంబు నింగిదాఁక నెగసి రవిమండలంబుఁ గప్పుకతనఁ జీఁకట్లు మిఱుమిట్లుగొనుటయు నార్తనాదంబులు సెలంగఁ దప్పించికొనఁ బోయి యతనిమునుమునన పడువారు నిదెయదె గాండీవి తనబారిం బడినవారితల లేఱుచున్నవాఁ డని వెఱచఱచుచుఁ దొలంగం బోయి తత్తఱపాటునఁ గాలుసేతులు విఱుగఁ దలలు పగుల డొక్క లదరఁ బ్రక్కలు సెదర నేలం గూలువారు నగువిరథరథికులు నేనుంగులు వడిన గజారోహకులును గుఱ్ఱములు సచ్చినరావుతులును గాయపడినపదాతులునై

సంగ్రామభూమితలంబు ఘోరంబయి రాలినమణిమయభూషణగణంబులను దుని
సినసువర్ణకవచంబులను గుప్పలై యున్నరత్నకాంచనచిత్రితవివిధహేతివ్రాతంబు
లను నభిరామంబునై పొలిచె. ఏమి చెప్పుదు నప్పు డప్పార్థునిచూడ్కి కగపడుమ
గవాఁ డొక్కఁడేనియు మనవారిమూఁకలఁ గలుగఁ డయ్యె. మార్కొందు మని
కడంగినవా రందఱును గాండీవిబాణానలంబున గ్రమ్మఁదిపోయిరకాని యొండు
గాదయ్యె. అట్లు మనవారిమూఁకలు చేవచెడి కడిమి నేటఁ గలిపి వాఁడిమి నెడలి
చలంబు సడలి తోఁచినకెల్లల విఱిగి పాఱుచుండఁ గృష్ణార్జునులు పాంచజన్యదేవ
దత్తంబుల నొత్తిరి. పెనుగాలికిఁ దూలుమొయిళులట్లు విప్పచ్చునంపసోనకుఁ
బటాపంచలైనమూఁకలఁ బురికొల్ప నెరవుఁ గానక కురుపితామహుఁడు సూర్యా
స్తమయసమయం బుపలక్షించి యాచార్యునకిట్లనియె, కృష్ణసహితుఁడై యీ
యర్జునుఁ డర్జునుఁడు సైన్యముల నెట్లు చేయు నట్లు చేయుచున్నవాఁడు. వీనిం
బోర గెలువ నలవి గాదు. వీఁ డిపుడు కాలాంతకయమునివిధమున ఘోరా
కారమునఁ గన్పట్టుచున్నవాఁడు. విఱిగినమనసేనలఁ గూర్పఁగ వలను గాకు
న్నది. వారిసైన్యముకంటె మనసైన్యంబు మిగులఁ జేవ చెడియున్నవిధంబు
తోఁచుచున్నది. భానుమంతుఁడును బడమర సేరుచున్నవాఁడు. చీఁకట్లు గ్ర
మ్మికతనఁ జూడ్కులు సారించుటయు దుష్కరం బయ్యెడి. మనయోధులు వెఱ
చియు డస్సియు నింక నిప్పుడు పోరాడఁ గడఁగనిచందంబుగా నున్నది. నేఁటి
కయ్యముఁ జాలించుట యిప్పటికిఁ దగినపని యని చెప్పి యబ్భారద్వాజు
ననుమతంబున సేనలఁ దివియించుటయుఁ బాండవులును దమసేనలఁ దివియిం
చిన నందఱుం దమతమశిబిరములకుఁ జనిరి. అరుణకిరణుండు వరుణదిగ్వధూ
టీనిటలతటవిన్యస్తకాశ్మీరతిలకంబుసొంపు గ్రేణిసేయుచుఁ దన్నితంబినీవిలాసశై
లకందరంబుఁ జూడ వేడుక గడలుకొనినవిధంబునంబోలెఁ బశ్చిమాచలసానుభా
గంబుఁ జొచ్చె. కురుపాండవులరణక్షోణిం బాఱురక్తనదీప్రవాహంబు గగనదర్ప
ణంబునఁ బ్రతిబింబితం బయ్యెనోనాఁగ సంధ్యారాగంబు సెలంగె. కౌరవయో
ధులమనంబుల సమ్మోహమ్ముతోడఁ దిమిరమ్ము గ్రమ్మె. పుడమికౌరవరథికగాత్రవి
చ్యుతవిభూషణమణిగణంబుల నొప్పారుచుండఁ దనకు రిత్తగా నుండఁ దగ దనుత
లంపునంబోలె గగనంబు తారకానికరంబునఁ బొలిచె నని సంజయుండుధృతరాష్ట్రు
నకుం జెప్పె నని వైశంపాయనుండు దెల్పుటయు జనమేజయుండు ముదితహృద
యుం డయ్యె.

శా॥ నానారూపసమస్తధర్మములసంత్యాగంబుఁ గావించి వి
ద్యానిష్ఠుం బరమేశ్వరుం డొకఁడె ప్రత్యగ్భూతుఁ డద్వైతుఁ డా

త్మానందుండు నఁటంచు నాత్మశరణాయాతుం బ్రసాదించి యం
హోనిర్ముక్తు నొనర్చు నానిగమవేద్యుం జిత్తమం దెన్నెదన్.

ఇది శ్రీకాళహస్తినగరాధినాథ శ్రీమద్దామరకుమారాక్కమహీపాల కరుణాపుర
స్సరబహుమానపాత్ర, సంస్కృతాంధ్రభాషాకవిత్వచమత్కారపరితోషితబు
ధస్తోమ సీతారామ కవిలలామపుత్ర, సకలశాస్త్రనిరంకుశపాండితీధుర్య
లక్ష్మీ నరసింహసుధీవర్యసచ్ఛాత్ర, విబుధజనవిధేయ, వేంకటరంగనా
మధేయప్రణీతం బైనశ్రీమదాంధ్రవచనభారతంబునందు భీష్మపర్వం
బున సంజయుండు ధృతరాష్ట్రునకు భూమితత్త్వం బెఱిఁగించి భార
తరణప్రకారంబుఁ జెప్పఁ బూనుటయు, రణరంగమున మోహా
విష్టుఁ డైనయర్జునునకు భగవంతుఁ డుపనిషదర్థజాతంబు
బోధించుటయు భీష్మునిదినద్వయయుద్ధమునన్నది

ప్రథమాశ్వాసము.



శ్రీకాళహస్తీశ్వరాయనమః.

## ద్వితీయాశ్వాసప్రారంభము.

క. శ్రీమహితవీతరాగభ
యామర్షపరాశరాత్మజాదిమునీంద్ర
స్తోమవిభావ్యమహామహి
మామేయ జగత్ప్రచారణాదృతమాయా ॥

దేవా, ననుఁ గృతార్థుం జేయుము.

సంతతసభక్తికోపసేవితద్వైపాయనుండైన వైశంపాయనుం డనంతరకథాకర్ణనోదీర్ణకుతుకహృదయుండైన జనమేజయున కిట్లనియె. అంత ధృతరాష్ట్రుఁ డనంతరవృత్తాంతం బెట్టు లనియడుగ సంజయుఁ డతని కిట్లనియె.

### మూఁడవనాఁటియుద్ధము.

అంత నారాత్రి వేగుటయు శాంతనవుఁడు నీకొడుకులగెలుపు గోరి సకలసైన్యపరివేష్టితుండై సంగ్రామరంగమున కరిగి గరుడవ్యూహవిధానమున సేనలఁ బన్నించె. అందుఁ దా నుత్తాలతాలకేతనశోభితుఁడై చంచుస్థానంబుఁ గొనియె. ద్రోణకృతవర్మలు కన్నులచోట్ల నిలిచిరి. కృపాశ్వత్థామలు త్రిగర్తకేకయవాటధానపరివృతులై శిరస్థానంబు గ్రహించిరి. శలశల్యభగదత్తజయద్రథభూరిశ్రవులు సింధుసౌవీరమద్రకచమూగణంబులతోఁ గంధరంబున నమరిరి. సకలసోదరసేవితుండై రారాజు పృష్ఠభాగంబునం బొలిచె. విందానువిందులు కాంభోజశకశూరవరూథినులతోడఁ బుచ్ఛాకారంబుఁ దాల్చిరి. కలింగమగధదాశేరకులు దక్షిణపక్షంబును గోసలేశ్వరుండైన బృహద్బలుండు కరూశవికుంజకాదిసేనలతోడ వామపక్షంబునుం గొనిరి. అంతఁ బాండవులును సర్వసేనాసమేతులై పోలకలని కేతెంచిరి. అపుడు పితామహుఁడు నేర్పునఁ బన్నినమీవారిమోహరంబుఁ జూచి సవ్యసాచి ధృష్టద్యుమ్నుం బిలిచి కౌరవసేనావ్యూహంబు భేదింపఁ జాలినతెఱంగుగా మనసేనల నర్ధచంద్రవ్యూహమునఁ బన్నించుట యుఱవనిచెప్పి నానాదేశరాజగణములతోడ భీమసేనుని విరాటద్రుపదులును దక్షిణోత్తరశృంగముల నిలిపి వారివెనుకటిదెసఁ జేదికాశకరూశపౌరవసేనాగణంబులు గొలువ నీలుని ధృష్టకేతుని నియమించి నడుమఁ బాంచాలప్రభద్రకసైన్యంబులతో ధృష్టద్యుమ్నశిఖండులను నిలువం బంచి వారివెన్నంటి కరిఘటామధ్యంబున ధర్మరాజును నునిచి యతని వెనుకఁ దద్రక్షణార్థంబు శౌర్యధారేయుండైన శైనేయుని నవి

జేయులై నద్రాపదేయులను శత్రుభీకరమన్యుం డైనయభిమన్యుని వీర్యదుర్దాంతుం డైనయిరావంతుని( బ్రబలమాయావికచుం డైనఘటోత్కచుని బలామేయులై నకైకేయులను నిలువం బంచి సకలజగద్రక్షకుం డైనపుండరీకాక్షుండు రక్షకుండుగా( దాను వామపార్శ్వమున నిలిచి గట్టిమొగ్గరంబు( గట్టి శంఖధ్వానసింహనాదబంధురంబుగా( గురుసేనం దలపడుటయు నుభయసైన్యంబులందును దమకు( దమకు( బోలినతెఱంగుగా( జతురంగబలంబు లొండొంటిం దాఁకి ప్రాణములమీఁదియాశ( దొఱంగి యశము( గోరి నిర్మర్యాదంబుగ నీడంబోక పెనంగినం గ్రందుకయ్యం బయ్యె. ఏదిక్కు చూచిన రాలినరత్నభూషణనికరంబులను గనకచిత్రితనానాహేతివ్రాతంబులను నిండియుండుటంజేసి సంగ్రామరంగంబు వివిధకుసుమమాల్యముల నలంకరించినచందంబున నభిరామంబై కన్పట్టె. మఱియు నాసంకులంబున( బాంసుపటలం బెగసి రవిమండలంబు( గప్పినం దూర్పిది పడమర యిది తమవాఁ డితండు లాఁతి యితం డని విశేషమించుకేనియు( గానరామికతన నడియాలంబులను నామగోత్రంబులను నిజపరవిభాగ మొక్కవిధమున నెఱింగి సాహసోత్సాహంబులు పొంపిరివోవ( బోరాడుచుండ గజవాజిపదాతిగాత్రనిర్యద్రుధిరధారల నాపరాగం బడంగుటయు( గను విచ్చి కాంచినంగబంధంబులు లెక్కయిడ నయితి గాక లోకవిధ్వంసము( దెలుపునుత్పాతంబులై తోఁచె. అట్లిరుదెఱంగులవారును గడిమి మెఱసి విస్మయమేదురంబుగ దురంబు సేయుటయు భీష్మద్రోణసురక్షితం బవుటంజేసి కౌరవవ్యూహము భేదింప(గ( బాండవులకును భీమార్జునసురక్షితం బవుటంజేసి పాండవులమొన చిక్కుపఱుప(గ( గౌరవులకును నలవి గాక యెక్కువతక్కువల నిరూపింపరానివిధమున నాయోధనంబు సెల్లుచున్నంత భీష్మద్రోణసైంధవపురుమిత్రవికర్ణశకునిప్రముఖులు భీమసేనఘటోత్కచసాత్యకిచేకితానద్రాపదేయప్రముఖులు( దలపడి దేవదానవులచందంబున( బోరి పరస్పరశరవిక్షతగాత్రులై పూచినమోదుగులట్లు వెలుంగుచు గగనచరము లగుగ్రహగణంబులచందంబునం బొల్చుచుండిరి. అప్పుడు దుర్యోధనుండు ఘటోత్కచభీమసేనులం దాఁకె. ధర్మజమాద్రేయధృష్టద్యుమ్నులు భీష్మద్రోణుల మార్కొనిరి. సౌభద్రుఁడు సాత్యకియును సౌబలుం దలపడిరి. అట్లందఱు ద్వంద్వములై పోరుచుండ గాండీవి తక్కటిరాజలోకంబునెల్లఁ దాను మార్కొనుటయు నారథికు లందఱు( జుట్టు ముట్టి శక్తిగదాపరిఘముసలాద్యాయుధంబులను శరగణముల నమ్మహారథుపయిం గప్పిన నతండు కోపాటోపదీపితుండై విలువిద్యనేర్పేర్పడ గాండివజ్యాఘోషంబు భీషణంబుగ వాలంపసోనఁ గురియించిన నందఱును వెగడుపడియు ఱిచ్చపడియుఁ దోఁచినక్రెల్లఁ బాఱిరి. దేవగంధర్వాదు లద్దిరా! యిప్పౌరునివిలువిద్య నేర్పింత యొప్పునే యని ప్రస్తుతించిరి.

### దుర్యోధనుఁడు భీమునితో యుద్ధము చేసి మూర్ఛిల్లుట.

దుర్యోధనుండు భీమఘటోత్కచులం దాఁకిన వా రిరువురు నొకళ్లొకళ్లకు మిగిలి పోరుటయు రారాజు నుడివ్రానిచలంబునం బిట్టేయుచుండ వృకోదరుం డలిగి యోరా యని నవ్వి తీవ్రనారాచంబు ఱొమ్ము గాడ నేసిన సుయోధనుండు మూర్ఛిల్లి తేరిమీఁద నొఱగంబడుటయు సారథి తొలంగించె. గాంధారులు వివిధాస్త్రంబులఁ బరఁగించి సాత్యకి తేరు తిలమాత్రశకలములు గావించిన నతం డభిమన్యునరద మెక్కుటయు నేకరథారూఢులై యయ్యిద్దఱు దర్శసమాగతు లగుదివాకరనిశాకరులకరణి నొప్పి క్రూరనారాచము లేసి యాసౌబలుని నొంచి తదీయబలంబు విచ్చిపోవం జేసిరి. దుర్యోధనుండు మూర్ఛిల్లినం దత్సైన్యంబు కర్ణధారుండు లేనినావపగిది వికలంబై పాఱుచుండ వృకోదరుండు వెన్నంటి తఱిమినం దిక్కు గానక భీష్మద్రోణులమఱుఁగు సొచ్చుటయు నక్కడ నతండు ధర్మజమాద్రేయ ధృష్టద్యుమ్నులతోడం గలిసి పోరుచుండె. అతిశయిత సంరంభావష్టంభవిలసితుండై ధృష్టద్యుమ్నుఁడు శత్రునిర్మూలనచణంబు లయిననిశితమార్గణగణంబులఁ దనమునుమునం బడినమూఁకల నేట్లాడుచుండఁ బటాపంచ లగుచున్న నీసేనల నిలువరింపఁగ నవక్రవిక్రమధౌరేయుం డై నయాపగేయునకు లోకనుతశౌర్యుం డై నయాచార్యునకును నలవి గాకుండె. అది య ట్లుండ నర్జును మార్కొన్న సైనికు లతనిబారిం బడి నిలువనేరక పాఱుటయుఁ దనమునుము బయలైన నమ్మేటిమగండును గూడముట్టిన భీష్మద్రోణానీకంబు సింగముఁ గన్న లేళ్లగమి తెఱంగున భయవిషాదకంపితంబై యిట్లయ్యె నని నిరూపింపనైనను వలను గానిరీతిని విఱిగె. అట్లు తమసైన్యం బత్యంతదైన్యంబుఁ జెందియు విషాదంబు నొందియు వెగడువడియు ఱిచ్చపడియుఁ గలంగి తొలంగినఁ గడుం గినిసి భీష్మద్రోణు లెలుంగురాల్పడ నందఱం బిలిచి పురికొల్పి నిలువరించుచున్నంత మధ్యాహ్నంబయ్యె. అప్పుడు దుర్యోధనుండు మూర్ఛ దేఱి యచ్చోటికి డాయ వచ్చుటయుఁ బాఱుచున్న సైనికు లందఱు నతనిం జూచి లజ్జావిహ్వలులై క్రమ్మఱి పోరికిఁ గడంగిరి.

### దుర్యోధనుఁడు భీష్ముని నిందించుట.

అవ్విధంబున వికలం బయిననిజసైన్యంబుఁ జూచి దురంతచింతాక్రాంతుండై దుర్యోధనుఁడు భీష్మున కిట్లనియె. పితామహా, నీవు నాచార్యుఁడును గృపాచార్యుఁడు నశ్వత్థామయు మీసుహృదులును బ్రదికియుండఁగనే మన మూఁక లిట్లు విఱిగి పఱచుట యెంతయు మీపరాక్రమంబున కననురూపంబు. మీకుఁ బాండవులయెడఁ బెద్దయుఁ గూరిమికలిమిం జేసి యొప్పరికించుకతన నిట్లు లయ్యెఁగాని మీరు నిక్కంబ యలిగితి రేని మీప్రాపుఁ గాంచినవారల నేరికైనం దేఱి చూడవచ్చునే. సైన్యంబు తిరుగుడువడినం జూడ సైరణ గలిగెఁగాని వార

ల బిట్టు నొంపఁ దలంపు వొడమదయ్యె. మీరు పాండవులను సాత్యకిధృష్టద్యు మ్నులను లెస్స మార్కొన మని మున్న చెప్పిన నే నప్పుడే తగినవిధంబుఁ జేసి యుండుదు నట్లును జేయరైతిరి. మీమాటల నమ్మి యేను గర్వుండు సమరము నకు రామి కియ్యకొని మోసపోయితి. ఇంతట నయినను నాకు మేలు చేయఁగఁ దలంపు చిత్తముల నించుకేనియుఁ గలదేని కడిందిమగంటిమిం బేర్చి మీకుఁ బోలినతెఱంగుగఁ బోరాడుఁడు. ఇంక నేమి చెప్పఁగల దనిపలికిన విని గాంగే యుండు క్రోధారుణితలోచనుండై పలుమాఱులు నవ్వి నవ్వి రాజపుత్రా, యే నుద్యోగంపుఁదఱి బెక్కుదెఱంగుల నీకు హితము బోధించినను వినవైతివి. పాం డుపుత్రులు నాక కాదు సురగణపరివృతుండై నపురందరునకు నజేయులు. ఏండ్లు సెల్లిననా కెంత సేయ వలవి యగు నంతయు శక్తికొలంది లేక ప్రాణముల డాఁపక చేయుదు. నీవును నీవారలునుం జూచుచుండుఁడు. నేఁడు పాండవులను వారివారలను నిలువరించెద ననుటయు సుయోధనుండు పితామహువచనముల కుఁ బ్రహర్షోత్కర్షముఁ బొంది శంఖముఁ బూరించిన భేరీప్రముఖవాదిత్రము లొక్కమొగి మ్రోసె. అయ్యులివు విని పాండవసైనికులు శంఖదుందుభిమురజ జాదివాద్యములు మ్రోయించి రనిన విని ధృతరాష్ట్రుఁడు సంజయా, నాకొడుకు నుడుల కలిగి యట్లు ప్రతిన వట్టినమాతండ్రియనంతరసమరప్రకారం బెట్టు లని యడుగ నతని కతం డిట్లనియె.

## భీష్ముఁడు పాండవసేనపై విజృంభించుట.

అట్టిమధ్యాహ్నసమయమున దేవవ్రతుండు డపరసూర్యుఁ డనం దేజోదుర్నిరీ క్షుండై మహాసేనా సమన్వితులై ననీకొడుకులు పరివేష్టింపఁగఁ బాండవసైన్యంబు పైఁదలపడి కొఱవిద్రిప్పిన చందమునఁ దనరథము వివిధమార్గములఁ బఱపించుచు మాయఁగావించిన విధమున నేదిక్కుచూచినం దాన కానవచ్చుచు నిరంతర మం డలీకృతచారుకార్ముకుండై మౌర్వీనినాదంబు రోదసీకుహరంబు నవియింపం బెలుచనడరి క్రూరనారాచ పరంపరలఁ గురియించి యొక్కబాణమునఁ బెక్కం డ్రను బెక్కుబాణముల నొక్కనిం గాఁజెప్పి చెప్పి పిలిచి పిలిచి నిర్మర్యాదంబుగ నరాతిసైన్యంబుఁ గనుపుకొట్టుచు వీధులఁదీర్చి విక్రమనర్తనంబుఁ గావించుచుండఁ బాండుపుత్రసైన్యంబున నొక్కఁడేనియు నతనిం జూడనైనంజాలక పైపైఁబడు తదీయమార్గణగణంబులఁ జూచి వెఱచఱచుచుఁ దదీయశరానలంబున మిడుతు లట్టు లడంగిపోవుచుండిరి. ఏమిచెప్పుదు నతనిశర మొక్కటేనియు వమ్ముగాక బిట్టునొంచుచుండె. ఆదండిమగని మార్కొందునని తలంచినవాఁ డవ్వవహిలోత్త రక్షణంబుననే నేలం గూలియుండు. భీష్ముని విజృంభణంబున కుబ్బి మనవారువా రిసైనికులం దలపడి పోరాడునెడ నిలుము నిలిచితినని యెలుంగుము మఱలి చక్క

నిలుము నిలిచితిఁ గొట్టుము మార్కొనుము రమ్ము వెఱవనేల యెక్కడికిఁబోవచ్చు నేదిట్టనై యుండ నీకు వెఱవఁదగునే యనువీరాలాపంబులును నోతండ్రి యోయన్న యోమామ యోచెలీ వలను నన్ను విడువు మనుభీతవచనంబులును గోదండగుణఘోషంబులును నొండొంటిం దాఁకి యుచ్చిపోవు హేతివ్రాతంబుల చప్పుళ్లును దునియలై పడుకాంచనకవచకిరీటకేతననిస్వనంబులును గొండలు పగులునట్లు పెలుచ నెసఁగె. వికీర్ణచిత్రవర్మశిరస్త్రాణబంధురంబై రణస్థానంబు వివిధజలదశకలసాంద్రంబైన శారదనభోమండలంబు ననుకరించె. భీష్మబాణపాతంబునం గూలిన వాజివారణస్యందనసందోహంబుల యిఱుకటమునం జేసియు మాతంగగాత్రశిలాఘోరంబు మాంసకర్దమంబు నగునెత్తురుటేఱు పాఱుటం జేసియు సంగరక్షోణీతలంబున రథప్రచారం బత్యంతదుష్కరంబయ్యె. చూప ఱిట్టి పోరుచూచియు వినియు నెఱంగమని పిచ్చలించిరి. అత్తెఱంగున భీష్ముఁడు గ్రీష్మాదిత్యుని విధమునఁ దేజరిల్లి యేపుమీఱి యరాతిసైన్యంబునఁ దలలేఱుచుండఁ బాండవసైనికులు తండ్రికొడు కన్న తమ్ముఁడు చెలి చుట్ట మని యొకళ్లొకళ్లం బిలుచుటమాని యాత్మరక్షణతాత్పర్యమునఁ గత్తళంబులఁ బుచ్చియుఁ గైదువుల విడనాడియుఁ గేశపాశంబుల జాఱవైచియు నెక్కనితో నెక్కండు గలియక తోఁచినట్లెల్ల గోపాలుండు లేని గోకులంబుచందంబునఁ బాఱుచుండఁ జూచుచున్న కృష్ణార్జునులకును నిలువరింప నలవిగాకుండె. అట్లు విఱిగి పఱచుచున్నసైన్యముఁజూచి జనార్దనుండు పార్థుం బిలిచి సవ్యసాచీ, నీవు తొల్లి భీష్మద్రోణప్రముఖు లగుధార్తరాష్ట్రసైనికుల మార్కొని విజృంభింతునని చెప్పియున్నవాఁడవు గదా. ఆమాటలెల్ల నడుపఁగ నీయది ప్రాప్తకాలంబు. మోహమున బుద్ధిభ్రంశముఁ బొందకుండు దేని యిప్పు డీయాప గేయుని నీటడంగింపుము. ప్రజాప్రళయార్థము నోరు దెఱచియున్నయంతకుపగిది నత్యంతభీకరుండై నభీష్ముని జూచి మనరథికులు సింహముచూడ్కి కగపడ్డ క్షుద్రమృగములట్లు వెఱపునఁ బఱచుచున్నవారు. ఇం కొక్కింతతడ విట్టుల యుండు వేని మనసైన్యము మిగులుట యరిది. ఇంతటనైన నీమాట సత్యముఁ గావించి విక్రమింపుమని చెప్పినం గిరీటి యిప్పుడే పితామహునకభిముఖముగ మనతేరుపఱపుము. తత్సైన్యంబు పాయలువడం దీర్చి యక్కురువృద్ధుం గూల్చెద ననవుడు మధుసూదనుం డత్యంతదీప్తిమంతం బగుతదీయస్యందనోత్తమంబు భీష్మునికెదురుగఁ దోలుటయు విఱిగి పఱచుచుండినపాండవానీకంబు కిరీటిరథంబు వెన్నంటిచనియె. తన్ను మార్కొన వచ్చుచున్నయర్జునుం గాంచి పితామహుండు సింహనాదంబుఁ గావించి శరపరంపరలు గురియించుటయు క్షణమాత్రలోన సవ్యసాచిరథము సారథి కేతనసహితంబు గఁదదీయశరాసారమునఁ బ్రచ్ఛన్నంబై యదృశ్యంబయ్యె. అందులకుఁ గొందలంబందక యరవిందనాభుఁడు ధైర్యధుర్యుండై

నెచ్చినరథ్యములఁ దడవి తేర్చి యుద్భటరయమునం దఱుముటయుఁ బాండవ
మధ్యముండు శంఖారవబంధురంబుగ గాండీవగుణక్వణనంబుఁగావించి నిశితశరము
లంగురిసి కురుపితామహుకార్ముకంబుఁ దునిమిన నతం డొండొకవిల్లెత్తి నిమే
షమాత్రన సజ్యంబు గావించి గొనయమ్ము సారించుచుండునంతఁ గాంగేయుం
డాకోదండమునుం దెగ నేసె. ఏయుటయుం బార్థునివింటినేర్పుఁ గొనియాడుచుఁ
బితామహుఁ డొండుచాపంబున గోపంబులు సంధించి యతనితేరిపయిం గుప్పిం
చినం గమలనాభుండు సారథ్యచాతుర్యంబు మెఱయ నతనియమ్ములు వమ్ముగు తెఱం
గునం దేరు వివిధమండలచిత్రగతులఁ బఱపింపఁగ నయ్యాపగాతనూజుండు జాత
క్రోధుండై కృష్ణార్జునులయంగంబులఁ దీవ్రబాణములం గీలించి నెత్తుటఁజొత్తిల్లఁ
జేయుటయు వారు విషాణోల్లిఖితగాత్రంబులై నయాఁబోతులరీతి నొప్పిరి. అంతని
లువక శాంతనవుం డశాంతకోపసంరంభుండై కిరీటిగాత్రంబునను మురారియం
గంబునను బలునారసంబులు నాటి నగుచు నార్చి పేర్చినం గృష్ణుండు భీష్మవిక్ర
మం బంతకంత కగ్గలంబగుటయుఁ బార్థునిసమరమార్దవంబునుం జూచి యక్క
టా! యాపగేయుఁ డిట్లు మధ్యాహ్నమార్తాండునివిధమున నుగ్రుండై మేటిమ
గల నేఱియేఱి చంపుచుండ యుధిష్ఠిరసైన్యంబు నేఁటితో ముగియుంగాని కొంచె
మైనను మిగులునని తోఁపదు. కురుయోధులు వీరువిఱుగుటం జూచిమఱియుఁ దఱు
ముచున్నవారు. వాఁడితూపుల నొప్పింపఁబడియు నర్జునుఁడు గౌరవబుద్ధింజేసి భీష్ము
నొండొకటి చేయఁదలఁపఁడు. ఇఁక నాలసించినఁ గార్యము దప్పుఁ గావున నేనీ
భీష్ముని వధియించి పాండవులభరముఁ దీర్తు నని తనలోఁ దలంచుచున్నంత నాశం
తనుసూనుఁడు వాసవితేరిపయిఁ బటుశరాసారంబు గురియించిన నెక్కడఁ జూచినం
గాంగేయ మార్గణగణంబులే కాని భూమియు దిక్కులు నంతరిక్షంబును సూర్య
మండలమును లోచనగోచరంబులు గాకుండె. దుమ్ము రేఁచుచు గాడ్పులు పరుషప్ర
కారంబున విసరె. దెసలెల్ల వ్యాకులంబు లయ్యె. అట్టియెడ ద్రోణకృపులును
గృతవర్మభూరిశ్రవసులును వికర్ణజయద్రథులును శ్రుతాయుస్సుదక్షిణులును విం
దానువిందులును క్షుద్రకమాలవసౌవీరాంబష్ఠపతులును బహుళరథగజవాజిప
దాతివర్గములతోడ శాంతనవునానతిమెయి నతిరయమున వివ్వచ్చుం దాఁకుచు
న్నంత శినిప్రభుం డమర్షసంభ్రమంబులు మనంబునఁ బెనఁగొనంగ సురేంద్రు
నకుఁ దోడుపడు వెన్నునిచందమునఁ బురందరతనూజునకుఁ దోడ్పాటు సేయవచ్చి
తిరుగుడువడి సఱచుచున్న పాండవచమూగణంబులం జూచి చేయెత్తియందఱం
బిలిచి యోక్షత్రియకులప్రజాతులారా, యనిమొనం బాఱుట మనకుఁ గులధ
ర్మంబు గాదని పెద్దలుసెప్పఁగ వినియుందురు గదా. నిజప్రతిజ్ఞలఁ దప్పక తాలి

మీఁబూని వీరధర్మంబుఁ బాలింపుఁడని యెలుంగేర్పడంజెప్పుచుండ సాత్యకికి దైత్యాంతకుం డిట్లనియె.

**శ్రీకృష్ణుఁడు చక్రముఁగొని భీష్మునిమీఁది కుఱుకుట.**

పాఱిపోవు చున్నవారలఁ బిలువ నేల. వీరియడిబీరంబెల్ల నేఁడు తెలిసె. ఈయున్నవార లందఱుం బోయినం బోవుదురుగాక. ఏనొక్కండన భీష్ముని గూల్చి ద్రోణునిప్రాణములఁ గొని పదంపడి తక్కటివారలఁ జక్కఁబెట్టి భీమార్జునులకును మాద్రేయులకును బ్రియంబుగా ధార్తరాష్ట్రులను వారివారలను నిర్మూలంబుగ విధ్వంసంబుఁ గావించి యజాతశత్రునకుఁబట్టంబుగట్టుదునని పలికి దివ్యచిత్తమునఁజక్రాయుధముఁ దలంచుటయు సహస్రసూర్యప్రకాశంబు సహస్రవజ్రసంకాశంబు సహస్రారప్రభా ప్రవిభాసమానంబు సునాభంబు నగునద్దివ్యసాధనంబు తత్క్షణంబ మ్రోలంగన్పట్టె. సూర్యోదయ సముల్లసితం బయినవేయిఱేకుల తమ్మిపూవుకైవడి నిజప్రభుకోపోదయప్రబుద్ధంబయి శత్రునిర్మూలనప్రక్రమోదగ్రం బయినయాసహస్రచక్రారచక్రంబుఁ జేతంగ్రహియించి దైత్యమర్దనుండు పగ్గముల నెగలమిడిచి తేరుడిగ్గి దివ్యమేచకగాత్రమునఁబీతాంబరంబు చెఱంగు కార్మొగులుకుఱంగటఁ జెలంగుమెఱుంగు తెఱంగునఁ గుఱంగలింపఁ బుండరీకాక్షుఁ డగుటమాని ఫుల్లశోణారవిందసవర్ణలోచనుండై యుగవిగమసమయకుపితరుద్రునిమాడ్కి రౌద్రంబు నమెఱసి దిక్కులు పిక్కటిల్ల సింహనాదంబుఁ గావించి మత్తమాతంగంబుఁ గవియు సింగంబుచాడ్పున నాటోపంబు దీపింపఁ జక్రంబు గిరగిరంద్రిప్పుచు భీష్ముని డాఁకనుఱుకుచుండ సర్వసైనికు లమ్మహాత్ముని ఘోరాకారంబుఁ జూడనోడి నివ్వెఱఁ జెందియుఁ గొందలంబందియుఁ దేఁకువ సెడియు బీఱువడియుఁ జెయ్యులుదక్కి వెల్లఁ బోయిరి. అప్పుడు మరుత్తటినీతనూజుండు తత్తఱపడక యోసర్వేశ్వర జగన్నాయక దేవదేవా, వేవేగ విచ్చేసి నన్ను నేలఁ బడంద్రోయుము. జగన్నాథా, సర్వశరణ్యుఁ డైననీచేతం బాలిసితినేని యీలోకమునఁ గృష్ణునితోడ భీష్ముఁడు పోరె ననుకీర్తిని నాలోకంబున నుత్తమపదంబునుం బొందఁ జాలుదు. ముల్లోకములందు నిజయశంబు నెఱపి యిఁక నీప్రసాదం బొక్కండ వేఁడియున్నవాఁడ. భక్తవత్సలా, కరుణింపు మని ప్రార్థించుటయు నాభాగీరథీపుత్రునకు దేవకీపుత్రుఁ డిట్లనియె. లోకక్షయమునకు మూలం బయినదుర్యోధనునకు మేలు సేయఁగ నీవు పూనితివి. దుర్ద్యూతదేవి యైనరాజును వారించి మంచి తెరువు గఱపుట ధర్మపథస్థితుఁ డైనసన్మంత్రికి మొదటిపని. అది తన కలవిగాదేని కాలపరిపాకమున ధర్మ మెడలి వర్తించు నట్టికులపాంసనుని వర్జించుట యనంతరకర్తవ్యంబుగదా యనవుడు భీష్ముఁడు యదుప్రవీరువదనంబునఁ జూడ్కినిలిపి దేవదేవా, దుర్యోధను నకార్యములఁ బోవకుండ నే నెన్నియేఁదెఱం

గుల బోధించుట యందఱకుం దెల్లంబు. యాదవు లందఱు దుష్పథప్రవృత్తుండని కంసునివర్జించినను వాఁడు తనబుద్ధి మానఁడయ్యెఁ గదా. వినాశకాల మాసన్న మగుడు విపరీతబుద్ధిమై నడుచువారలు లాఁతులుసేయుహితోపదేశముల నాదరిం తురే? మఱి విధివిహితం బయినక్లేశముఁ గుడుతురని విన్నవించుచున్నంతఁ బార్థుం డు తేరుడిగ్గనుఱికి యతిరయమునం బఱచి యప్పరమపురుషు నెయిదిపిఱిందిదెసం గ్రుచ్చిపట్టినం బీనోన్నతలంబబాహుండై నయమ్మహానుభావుఁ డాజానులంబమా నబాహుండైనయాఫల్గునుని విపులవిటపవిలసితం బయినమహాపాదపంబుఁ గొని పోవుమహావాతంబుచాడ్పునఁ గొనిపోవ నాతండు తోడం బదియడుగులరిగి పుడ మిచక్కంద్రొక్కి యీడిగిలఁబడి యోపినకొలంది తదీయచరణంబులఁ బట్టి మెట్ట కేలకు నిలువం బెట్టి యడుగులపయింబడి మహానుభావా,కోప ముపసంహరింపుము. పాండవులకు నీవకదా గతి. కైదువు కేలఁబూననని ప్రతినవట్టి యిట్టులు చేయఁద గునే? పుత్రసోదరులయాన భవత్సహాయుండ నగుదునేను గౌరవులం జంచి చెండా డెద. నా కపకీర్తియు నీకుఁ బ్రతిజ్ఞాభంగమునుం గలుగ నిట్టులు చేసిన నింక నేమనంగల దని విన్నవించినం జిత్తగించి పురుషోత్తముండు గాండీవివచనోప న్యాసమునకు ముదితహృదయుండై తత్ప్రియంబు సేయం దలంచి క్రమ్మఱి యేతెం చి నొగలెక్కి యుగ్యంబులపగ్గంబులఁ గొని పాంచజన్యంబుఁబూరించినం గిరీటియుఁ దేరెక్కి దేవదత్తంబు నొత్తుటయు సింహనాదంబులును భేరీమృదంగపటహప్రము ఖవాద్యనిస్వనంబులును జెలంగె. విఱిగిపఱచిన వారందఱుం బార్థునరదంబు వెన్ను దన్ని మోహరించి పోరికిఁ గడంగిరి.

అర్జునుఁడు విజృంభించి కురుసేనం జెండాడుట.

అట్లు రథారూఢుండై సవ్యసాచి మేఘగర్జానినాదసన్నిభం బగుగాండీవ గుణక్వణనంబు భూనభోంతరంబుఁబూరింప బీరంపుఁబెంపు పొంపిరివోవం గౌరవ సైన్యంబు మార్కొని చించి చెండాడుచుండె. ఆసేనకుఁ దలకడచి భీష్మదుర్యోధ నశల్యభూరిశ్రవులవ్వీరుండాఁకి శక్తితోమరగదాసత్తభల్లంబులనేసిన నాసవ్యసా చిభీష్మునిశక్తిని దుర్యోధనుతోమరంబును నెక్కొక్కయమ్మునంద్రుంచి మద్రపతి గదను రెంటఁదునిమి సౌమదత్తిశరసత్తకంబు నేడింటను బొడిచేసి మహేంద్రా స్త్రంబు గాండీవంబున సంధించి యేయుటయు నమ్మహనీయ సాధనంబున బహుళ ఘోరాకార శరపరంపరలు జనించి దిక్కులువిదిక్కులుంగలయ నెఱసి యేనుంగులఁ బీనుంగులఁ గావించియుఁ దురంగంబులయంగంబులఁ జెక్కియుఁ దేరులఁ బొడచేసి యుఁగేతనంబులఁ గూల్చియుఁ బదాతి గాత్రంబులఁ దఱిగియు రథికుల తలల నఱికి యుసారథులఁ దునిమియు రథ్యములఁ జదిపియు విండ్ల విఱిచియు హేతివ్రాతంబుల నుగ్గుసేసియుఁ దొడవుల రాల్చియు మైమఱువుల్లు దుల్చియుఁ గండలఁ గోసియు

నెత్తురు లురులించియు ఘోరకృత్యంబు సేయుచుండ గాండీవి యంత నిలువక వివిధబాణము లరివ్రాసి యేయుచుండె. గాండీవ జ్యాఘోషంబు విని విరాట ద్రుపద ప్రముఖు లయినదండనాథు లచ్చటికి వచ్చి వివ్వచ్చునకుఁ దోడ్పడుచున్నంత ద్రోణకృపాశ్వత్థామసైంధవబాహ్లికాదులు నప్పాండవమధ్యముం దాఁకి యోపిన క్రోలంది పెనఁగుచుండిరి గాని యాబిరుదుమగనియాటోపం బుడుపఁ జాలరైరి. అవ్విధంబున ధనంజయుండు కోల్తలు సేయుచుఁ గౌరవ సేనామధ్యంబునఁ గేశసంచయంబు శైవాల జాలంబు గాఁ గవచనిచయంబులు కల్లోల పరంపరలు గా విభిన్నాస్థి పటలంబు సూక్ష్మశిలాగణంబు గాఁ బ్రేవుల ప్రోవులు ఫేన పుంజంబులు గా మేదోమాంసమస్తిష్కబృందంబు కర్దమంబు గాఁ బృథుల దంతి గాత్రసంఘాతంబులు తీరంబులు గా రక్తనదీ ప్రవాహంబుఁ బాఱించి రక్షఃపిశాచాదిగణంబులకును గృధ్రగోమాయువర్గంబులకుఁ దర్పణం బొనర్చుచు లేళ్లగముల నడుమ వెలుంగుసింగము తెఱంగున నొప్పుచు జనార్దనుఁడును దానును జిందముల మ్రోయించి సింహనాదములు గావించిరి. అంత గభస్తిమాలి యస్తగిరిమస్తకప్రశస్తనిస్తుల కర్ణికారస్తబకాకారంబుఁ దాల్చుటయుఁ గ్రమంబున సంజకెంజాయ రంజిల్లె. అప్పటికిని గాండీవి యైంద్రాస్త్రంబు ఘోరాకారంబై యేఁచుచుండ నిలువ నోపక ద్రోణభీష్మబాహ్లికదుర్యోధనులు తమ సేనలఁ దివియింపఁగఁ బంచి చిన్నఁబోయినమొగమ్ములతో నద్దిరా! యాచార్యుని భీష్ముని గృపద్రౌణి ప్రముఖు లగుమేటిశూరుల నందఱను నొక్కయర్జునుండు గెలిచె నవ్వాఁడిమగనిశౌర్యంబునకుఁ గొలంది గలదే యని సవ్యసాచిం బొగడుచున్ననిజ సైన్యంబులతోఁ గరదీపికాసహస్రంబు వెలుంగ శిబిరమునకుఁ జనిరి. పాండవులును దమసేనలఁ దివియ నియమించి యర్జునుం గొనియాడుచు నుబ్బునం బొంగుచు సకల సైన్య సమేతులై లెక్కకు మిక్కిలిగఁ గరదీపికా నికరంబులు వెలుంగ శిబిరమున కరిగిరి.

## నాల్గవనాఁటియుద్ధము.

మఱునాఁడు ప్రభాతంబున సురనదీసూనుండు సమరసన్నద్ధుండై ద్రోణ కృపాశ్వత్థామబాహ్లికసోమదత్తభూరిశ్రవశ్శల్యజయద్రథప్రముఖు లయినమహారథులను దుర్యోధన దుశ్శాసన ప్రభృతు లగునీకొడుకులనుం దోడ్కొని గంగా ప్రవాహముచందమునఁ బఱపైనచతురంగసకలచమూసమూహంబులు పరివేష్టించి కొలిచి రాఁగ దేవసేనామధ్యమునఁ దేజరిల్లుదేవరాజుం గేలిసేయుచు నుత్తాల తాలకేతుశోభాభిరామంబుగ నడచిన నాసైన్యంబు రథనేమిఘట్టనధ్వానబృంహిత హేషితక్ష్వేళారవబంధురంబై వివిధకేతనజాలరశ్మిచ్ఛటాభిరామంబై గర్జితోల్లాసంబులు విద్యుత్ప్రకాశంబులు నెసంగ నీరదపటలనీరంధ్రం బైననభోమండలము

నకు సాటి వచ్చుచుఁ జూడ నొప్పారె. అంతఁ బాండవమధ్యముండు పుండరీకాక్ష
సారథికం బైనరథం బారోహించి కేతనకపిప్రభ లరాతిభయంకరంబులై నిగుడ
ధర్మజభీమమాద్రేయసౌభద్రసాత్యకిధృష్టద్యుమ్నశిఖండిప్రముఖు లగుమహారథు
లు వివిధసేనావ్యూహపరివేష్టితులై తోడ నేతేరఁ గయ్యంపునేల కరుదేరుటయు
శంఖారవంబులును సింహనాదంబులును భేరీపణవప్రణాదంబులును మౌర్వీనిర్ఘో
షంబులును బెలుచ నెసఁగె. అంతసైనికనికరచరణఘట్టనసముత్థితంబై ధరణీపరాగ
పటలంబు గగనమంటపమున మేలుకట్లు గట్టినవిధంబునం బొలుచుచుండ నుభ
యసైన్యంబులందును రథికుఁడు రథికుని గజారోహుఁడు గజారోహుని హయా
రోహుఁడు హయారోహుని బదాతి పదాతినిం గాఁ బొలిన భంగి నెల్లఁ దలపడి
యిరువాఁగును వినిహతసారథికంబును విధ్వస్తరథికంబును బ్రభగ్నరథంబును
రుగ్ణకేతనంబును నికృత్తమత్తేభంబును విచ్ఛిన్నఘోటకంబును వినిపాతితసాది
హస్తిపకంబును బరేతపాదాతంబును విదీర్ణనానాహేతివ్రాతంబును విశీర్ణభూష
ణంబునుంగాఁ బోరుచున్నంత శంతనుసూనుం డనూనక్రోధదీపితుండై కపిధ్వ
జుం దాఁకి శరవర్షంబుఁ గురియించుచుండ ద్రోణకృపశల్యవివింశతిభూరిశ్రవసులు
దుర్యోధనపురస్సరులై యక్కిరీటిని మార్కొనిరి. అప్పు డభిమన్యుండు దాను
దండ్రికిఁ దలకడచి యావీరుల నందఱం బొదివి యందఱ కన్నిరూపులై దివ్యా
స్త్రప్రయోగకౌశలంబు నెఱపుచు మహామంత్రహుతుండై యధ్వరవేదీమధ్యం
బునం బ్రజ్వరిల్లు వీతిహోత్రుని విధంబునఁ దేజరిల్లుచు మీసైన్యంబున శోణిత
ప్రవాహంబుఁ బాఱించుచుండె. అంత నతని నతిక్రమించి శంతనుపుత్రుండు
వాసవపుత్రుం దాఁకి శరపరంపరలు గురిసినం గినిసి కవ్వడి వడి యడరం బెక్కు
తూపు లేసి తదీయశరజాలంబు మాయించి గాండీవగుణక్వణనంబు గర్జారవం
బుగాఁ బర్జన్యునిచందమున నొప్పి భీష్మునరదంబుపై వాలంపసోనలఁ బరఁగించిన
నవ్వీరశేఖరుఁడునుం జీఁకట్లువిరియించుభానునిభంగిఁ దన్మార్గణగణంబుల మాయిం
చి యనురూపముగఁ బోరుచుండ నందఱుం జేష్టలుదక్కి వెఱఁగుపడిచూచుచుండిరి.

అట్టియెడ నశ్వత్థామయు భూరిశ్రవుఁడును జిత్రసేనుఁడును శల్యుఁడును
శల్యపుత్రుఁడును సింగపుఁగొదమం బొదువుమదపుటేనుంగులతెఱంగున నభి
మన్యుం బొదివి వివిధశరముల నేయుచుండ నాదండిమగండు లాఘవలక్ష్య
శుద్ధిశౌర్యశస్త్రాస్త్ర నైపుణంబుల నితండు నిరుపమానుఁ డని సురలు పిచ్చలింప
దవ్వునఁ జూచుచున్నవివ్వచ్చుఁడు తనప్రతాపాటోపంబునకుఁ బొంగి యా
ర్యాఁగ నయ్యేవురు దొరల మార్కొని మండలీకృతంబై యాదిత్యమండలంబున
కెనవచ్చు చారుకోదండమున వివిధబాణము లరివోసి యొక్కవాలికతూపున
ద్రోణసుతుగాత్రమ్ము గాడ నేసి నాలుగింట శల్యునిరథ్యముల నొప్పించి యతని

మేన నొక్క భల్లమ్ము నాటి యెనిమిదింట నతనికొడుకు కేతనంబుఁ గూల్చి యేక
బాణమున భూరిశ్రవునిశక్తిం ద్రుంచి యంతకంత కగ్గలంబుగఁ బేర్చి వాఁడిమి
సూపుచుండ నయ్యిరువురు దొరలు నతని మార్కొనఁ జాలరైరి. అత్తఱి దుర్యోధ
నుండు పనుపఁగఁ ద్రిగర్త మద్ర కేకయు లిరువదేనువేలరథములవారు కృప కృ
తవర్మ సమన్వితులై యాదొగలకుఁ దోడ్పడి యతనిం బిట్టుదాఁకినఁ గొడుకు నం
దఱొక్కమొగిఁ బొదువుటం జూచి సవ్యసాచి తాను దలకు మిగిలి వారలనందఱను
మార్కొని యేపు చూపుచున్నంత ధృష్టద్యుమ్నుండు బహుళచతురంగసమే
తుండై యర్జునునకు ముంగలియై యక్కౌరవానీకంబుఁ దాఁకి గొనయమ్ము సారించి
పటుప్రదరంబులం గుప్పించి కృపాచార్యుజత్రుభాగంబు నొవ్వ మూఁడువాఁడి
తూపులేసి పదింట మద్రేశ్వరు నొంచి కృతవర్మచక్రరక్షకుని పౌరవసుతుండైన
దమనుని నొక్కొకనాగసమునఁ జంపి యార్చె.

### ధృష్టద్యుమ్నుఁడు శల్యపుత్రుని జంపుట.

ఆర్చినం గోపించి శల్యపుత్రుఁడు ముప్పదింట నాధృష్టద్యుమ్నుని బదింట
నతనిసారథిని నొవ్వ నేసిన నమ్మహావీరుండు రోషసముద్రగుండై తీవ్రభల్లంబున
వానివిల్లు దునిమి రయమున నిరువదేనింట నతని నొప్పించి నాలుగింట గుఱ్ఱములఁ
జదిపి యొక్క వెడఁదయమ్మున సారథిఁ జంపిన విరథుండై శల్యనందనుండు పలు
కయు వాలునుం గొని తేరు డిగ్గ నుఱికి ధృష్టద్యుమ్నునిశరాసారంబుఁ బలు
కఁ ద్రిప్పుచు జడియ మోఁదుచుఁ దేరు డాయ వచ్చుటయు నప్పాండవసేనా
నాయకుండు గదఁ గొని యామద్రరాజసుతుతలఁ బగుల నడిచిన నతండు కర
వాలంబును శరవారణంబునుం గ్రింద విడిచి నేలం గూలుటయు మనసైన్యమున
హాహాకార మెసఁగె. అట్లు కొడుకు సచ్చుటకు ఖేదామర్షంబులు మల్లడిగొన
మద్రేశ్వరుండు పాంచాలరాజసూనునుం దాఁకి యంకుశముల మత్తవారణంబు
నెట్టు లట్టుల శరత్రయమున నొవ్వ నేయుటయు ధృష్టద్యుమ్నుఁడును రోషవిస్ఫు
రితుండై కవియుటయు నియ్యిద్దఱియాలంబు పరమాభీలం బయ్యె ననిన విని
ధృతరాష్ట్రుఁడు సూతపుత్రా, పౌరుషముకంటె దైవమే బలవత్తరం బని తలంచెద.
కాకున్నఁ బాండవసైనికులు మనసైనికులఁ జంపఁ జాలుదురె. నిత్యంబును నీవు
మావారిచావునొవ్వులును వారిబలుపుగెలుపులునుం జెప్పెదవు. ఓపినకొలంది
పిఱుసనక యందఱుం గడిమి మెఱసి పోరుచున్నను వారు గెలువను వీ రోడనుం
గతం బేమియో యెఱుంగ నయ్యెడ. దుర్యోధనునిమిత్తమునం జేసి సర్వదుఃఖము
లును నాకు విన వలసె. పాండవులకుఁ బరాజయంబును మావారికి విజయంబు
నొడఁగూర్చువెరవును గాన నయ్యెడ ననవుడు సంజయుండు రాజేంద్రా, నీ యప
నయంబునం గలిగినచేటు విన కుండఁగఁ దప్పించికొనఁగఁ దగునే. సుస్థిరుఁడవై

సమరప్రకారంబు విను మని మఱియు నిట్లనియె.

అట్లు శల్యధృష్టద్యుమ్నులపోరు సెల్లుచుండునంత మద్రపతి యేపుమీఱి తొమ్మిదియమ్ముల నెవ్వ నేసినం గ్రోధోత్సేకదీపితుండై యప్పాంచాలవరుం డద్భుతంబు సంధిల్ల నతనిం బలుతూపుల నొంచి ఘోరప్రకారంబు సేయుచున్నంత శల్యుఁ డలిగి నిశితభల్లమున నతనివిల్లు దునిమి గిరిశిఖరంబుఁ గప్పు ప్రావృట్పయోధరంబుచందంబున శరాసారమున నప్పార్షతుం గప్పినం గినిసి సౌభద్రుఁ డతిద్రుతగతి నేతెంచి మద్రరాజుం దాఁకి మూఁడువాఁడికోలల గాడ నేయుడు శల్యరక్షాపరత్వంబున దుర్యోధన దుశ్శాసన దుర్మర్షణ దుర్ముఖ దుస్సహ వికర్ణ వివింశతి చిత్రసేన పురుమిత్ర సత్యవ్రతులు నీకొడుకులు పదుండ్రు దలపడుటయు భీమసేన మాద్రేయ ద్రౌపదేయులు ధృష్టద్యుమ్నసౌభద్రుల కుఁ దోడ్పడినం బోరు ఘోరంబయ్యె. పరస్పరస్పర్థంజేసి వా రొండొరులకు మీఱి హస్తలాఘవంబు సంధిల్ల నద్భుతం బావహిల్లఁ దద్దయు నాలుకొని క్రందుకయ్యంబు సేయుచున్నంత నీకొడుకులు పేర్చి ధృష్టద్యుమ్ను నెదిర్చి దుర్యోధనుండు నాల్గింటను దుశ్శాసనుండు మూఁటను దుర్మర్షణుఁ డిరువదింటను దుర్ముఖుఁడు తొమ్మిదింటను దుస్సహుఁ డేడింటను వికర్ణ వివింశతి చిత్రసేన పురుమిత్రసత్యవ్రతు లేనింటను నొప్పించిన నప్పాంచాలవీరుఁ డందుల కించు కేనియుఁ జలింపక వారలఁ బ్రత్యేకం బిరువదేనుశరముల నేయుటయు సౌభద్రుఁడు పదేసి వాఁడికోలలఁ బరఁగించె. మాద్రేయులు మామను దాఁకి యద్భుత ప్రకారమున శరాసారంబుఁ గురియించిన నమ్మద్రరాజు వారలపయి నంపగములం బ్రయోగించుటయు వా రంపులకుఁ దలఁకక పెద్దయుఁ బోరుచుండిరి.

భీముఁడు గదఁ గొని విజృంభించుట.

అంత నీకొడుకులయేపుసైరింపక వాయుసూనుండు నేఁటితోఁ గలహముఁ దీర్తునని తలఁచి గదాపాణియై రథావతరణంబుసేసి యుత్తుంగశృంగసముద్దామం బయినకైలాసభూధరంబుచందంబునఁ బొల్పుచు నీకొడుకులమీఁదఁ గవియుటయు వారు కాందిశీకు లగుడుఁ గురుక్షోణీవల్లభుండు మాగధుం బిలిచి నీవు భీమసేనునియే పుడుపు మని పనిచి కరిఘటాసమన్వితుండై తాను నమ్మాగధుని వెన్నుదన్ని నిలిచె. వృకోదరుండును దనపయిఁ గవియ వచ్చుచున్న గజానీకంబుఁ జూచి మృగేంద్రవిక్రమంబు పొంపిరివోవ విపులాంసపీఠమున నుద్దండగదాదండం బమర్చికొని దానవనిషూదన ప్రక్రమా భీలుండై నవృత్రశత్రుని మాడ్కి నొప్పుచు మీవారిగుండియ లవియ నార్పులు నిగుడించుచు జలదపటలంబు విరియించు మహామారుతంబువిధంబునఁ గరిఘటలం బెలుచఁ గూల్చుచున్నంత నకులసహదేవ సౌభద్రద్రౌపదేయధృష్టద్యుమ్ను లమ్మహాబలునకుఁ దోడై వివిధశిత విశిఖములఁ

బరఁగించినం బృథులపాషాణవర్షమునం గూలునుత్తుంగవిటపివిటపంబులవిధమున
గజానోకహకులతలలు నేలం బడుచుండె. అప్పుడు మాగధుఁ డైరావతసమంబయి
న తనగంధసింధురంబును సౌభద్రునరథముపయిం బురికొల్పిన నవ్వేల్పులతేని
మనుమఁడు నిశితభల్లమున నయ్యేనుఁగుం గూల్చి వేఱొక్కవాఁడియమ్మున నమ్మా
గధుతలఁ దఱిగె. అంతఁ బవమానపుత్రుఁడు ధరిత్రీధరంబులఁ గూల్చు సుత్రా
మునివిధమున నగ్గలించి యగ్గజానీకంబు సొచ్చి దంతముల నఱికియుఁ జెక్కులఁ
జెక్కియుఁ గుంభములఁ బగిల్చియుఁ దొడలఁ దెగఁజూచియు వీఁపులఁ జాఁగఱ
గొనియుఁ బీనుంగుపెంట గావించిన నమ్మత్తేభయూథములు నెత్తురు గ్రక్కుచు
నిజారోహకులు నేలం బడి నలుగఁ గూలినం దత్కళేబరంబులు గిరిశిఖరంబు
లట్టులొప్పె. అత్తెఱంగున మరుత్తనయుండు విక్రమకుతూహలియై యురువ
డించి గజరక్తసంసిక్తగాత్రుండై తదీయకేశమజ్జారుధిరదిగ్ధంబై యుగాంతసమయ
కాలదండోపమంబైనయుద్దండగదాదండంబుఁ గేలం బూని శ్మశానతాండవవి
నోది యగుశూలపాణిం గ్రేణిసేయుచుఁ బసులఁ దోలుపశుపాలుని తెఱంగున
గజానీకంబుఁ దెరల్చుచు విక్రమనర్తనంబుఁ గావించుచున్నంత హతశేషము
లగుకుంజరంబు లజ్జరాసంధమర్దనుం జూచి యముని జూచినట్లు వెఱచి ప్రబల
ఘీంకారంబులఁ జేయుచు జిఱ్ఱునం దిరిగి నిజసేనాస్యందనంబులఁ జెదరఁ దొరుగం జే
యుచుఁ బఱచుచుండె. అవ్విధమునవృకోదరుం డురువడించుచుండ దుర్యోధనుండు
భీముని సమయింపుఁ డని యెలుం గేర్పడం జెప్పి సకలసైన్యములకును జేయి వీ
చిన మీమూఁక లన్నియు వీఁక మెఱసి పాంసుపటలంబు రేఁచుచు నొక్కపెట్ట
వానిం దాఁకి చంద్రోదయసమయసముజ్జృంభితసాగరంబువోలె ఘూర్ణిల్లు
చున్నంతఁ జెలియలికట్టవోలెఁ బవనతనయుఁడు దాను వానినెల్ల నాఁగి తమ్ములు
కొడుకులు మఱఁదులుం దనకు బాసట గాఁగ నురువడించి గదపందువు సేయుచు
సాదిహస్తిపకుల హయద్విరదములనుండి డొల్లించుచు నేనుంగులఁ జాపకట్టు
పడం జేయుచు గుఱ్ఱముల సమయఁ జూచుచుఁ దేరుల నుఱుమాడుచుఁ గాలుబ
లంబుఁ జదియమోఁదుచుఁ గార్చిచ్చుపొదివినకాననంబునుంబోలె మనసేనల విధ్వం
సంబుఁ జేయుచుండ నతసమునుము మృత్యుదేవత కాటపట్టై తోఁచె. గద
యెత్తికొని యతండు దిరుగునపు డెవ్వరిదెసం జూడ్కి సారించునో యని
యందఱు నెదిఁగిరి కాని యొక్కఁడేనియు ముందు ద్రొక్కఁడయ్యె. అట్టియెడ
భీష్ముఁ డతని మార్కొని బహుళశరపరంపరలు గురియుచుండ సాత్యకి వడ
ముడి నతిక్రమించి పితామహుం దాఁకి జ్యాఘోషభీషణంబుగఁ బేర్చి భవదీయ
సేనాకాననంబుఁ దీవ్రబాణార్చుల నేర్చుచు నార్చిన నతని మార్కొన మగలు
లేమిఁ జీకాకుపడుచున్న మూఁకలం జూచి యలంబుసుఁడు తలపడి శరదశకం

చేయుటయు నాకై నేయుండు వానికి మాఱేసి వారించి నాల్గింట వాని నొప్పించి సింహనాదంబు సేసి పట్టపవలింటిభానుమంతునిచాడ్పున నిజతీవ్రప్రతాపాతపంబు గాయుచుండె. అప్పుడు ఘోరవిక్రముండైన భూరిశ్రవుఁ డాశినిప్రవరుం దాఁకి నిశితాంకుశముల మహాదంతావళంబునుంబోలెఁ దొమ్మిదియమ్ముల నొప్పించినం గినిసి సాత్యకి పెక్కుతూపుల నాసోమదత్తిని నొప్పించి చూపఱు వెఱఁగుపడ వారించుటయుఁ గురుధరానాయకుండు సోదరపరివృతుండై తా నతనికిఁ దోడ్పడుటయుఁ బాండవులును యమప్రవీరునకు బాసట యగుడు దారుణరణంబు సెల్లె. భీముఁడు గదఁ గొని మీవారల నొంచుచుండె.

### దుర్యోధనుఁడు భీముని మూర్ఛితుం జేయుట.

దుర్యోధనుఁ డప్పుడు క్రోధమూర్ఛితుండై భీముని మార్కొని తొమ్మిదియమ్ముల నతని నొమ్ము గాడ నేయుడు నమ్మహాబలుఁడు తేరెక్కి సారథి యగువిశోకుం బిలిచి యీధార్తరాష్ట్రు లందఱును నన్ను నొంపను జంపనుం గడంగినవారు. నీవు చూచుచుండ వీరలం బొరివుచ్చెదఁ బటురయంబున హయంబులఁ బఱపు మనిపలికి యవక్ర విక్రమ విభూషితుండై మూఁడుతూపుల నందఱునొమ్మునా నేసినం గినిసి భవదగ్రనందనుం డఱువది విశిఖముల వడముడిం గాడనేసి మూఁట విశోకుని నొప్పించి నవ్వుచుఁ దదీయకార్ముకముష్టిభాగంబు మూఁటఁ దునియ నేసె. భీముఁడు తననొప్పి సరకుగొనక సారథి బాధితుఁ డవుటకుఁ గనలి వేఱొక్కవిల్లెత్తి సంరంభోద్రేకంబున దుర్యోధనుచాపంబుఁ ద్రుంచుటయు నతం డొండుకోదండంబుఁ గైకొని క్రోధారుణితలోచనుండై కాలమృత్యుసన్నిభంబైనఘోరనారాచంబున వడముడియురము బిట్టేసిన నతండు తద్బాణార్దితుండై మూర్ఛఁ జెంది తేరిపయిఁ జదికిలఁ బడియె. అంతలకుఁ గడుం గినిసి పాండవమహారథులు పరమసంరంభమున శరజాలంబుఁ గురియుచుండ నంతలోఁ దెలిసి వృకోదరుఁడు కన్నుఁగవం గెంపు గదుర నురువడించి దుర్యోధను నెనిమిదింటను శల్యుని బంచవింశతివిశిఖంబులను నొప్పించిన నమ్మద్రపతి యనికిఁ దొలఁగి పఱచె.

### భీముఁడు సేనాపతిసుషేణప్రముఖకురుకుమారులఁ జంపుట.

భీమునివిక్రమాటోపంబు సైరింపక నీకొడుకులు సేనాపతి, సుషేణుఁడు, జలసంధుఁడు, సులోచనుఁ, డుగ్రుఁడు, భీమరథుఁడు, భీముఁడు, వీరబాహుఁ, డలోలుపుఁడు, దుర్ముఖుఁడు, దుష్ప్రధర్షుఁడు, వివిత్సుఁడు, వికటుఁడు, సముఁడు నను వారు పదునలుగురు క్రోధసంరక్తలోచనులై వడముడిం దాఁకి పటుప్రదరంబులు గురియించిన నతండు గోటియలపిండులోనం జొరఁబడుతోఁడేలుకై వడిని బన్నగపరిహారోన్నతుం డైనవైనతేయునిమాడ్కిని సెలవుల నాకుచు నురువడించి వారలఁ దఱిమియఱిమి యొక్కక్షురప్రంబున సేనాపతిం దునిమి మూఁట జలసంధుం జంపి యొ

క్క శితభల్లమున నుగ్రునితలఁ గుండలములతోడఁ గూల్చి యొక్క మార్గణమున సు
షేణుని మిత్తికి బలిచేసి డెబ్బదింట వీరబాహుని రథరథ్యసారథిసహితంబుగఁ బర
లోకమున కనిచి యొక్కొక్కయమ్మున భీమభీమరథులఁ బొరివుచ్చి యొక్క శరపన్నగం
బునకు సులోచనుప్రాణముల నెరచేసినం జూచుచున్న హతశేషులు వానికి వెఱచి
ప్రాణరక్షణతాత్పర్యమునఁ బఱచిరి. అంత శాంతనవుఁడు మహారథులందఱకుం
జేయివీచి యక్కటా! వృకోదరుఁడు ధృతరాష్ట్రతనూజుల నేఱియేఱి చంపుచున్న
వాఁడు. అందఱు వీనిం బొమవుఁ డని మెలుంగురాల్పషం జెప్పి తానుం దాఁకినఁ
బ్రాగ్జ్యోతిషపతి యగుభగదత్తుఁడు గజారూఢుఁడై యప్పితామహునకుఁ దలకడచి
శరాసారంబుఁ గురియించిన నతండు కార్మొగులుగప్పిన రేవెలుంగుభంగి నదృశ్యుఁ
డయ్యె. అందులకుఁ గోపించి యభిమన్యుప్రముఖు లగుమహారథు లాభగదత్తుని
మార్కొని వానిమేనను మాతంగగాత్రంబునను బటుశిలీముఖములం గ్రుచ్చిన
నయ్యేనుంగు నెత్తుటం జొత్తిల్లి చిత్తతితతిఁ దరణికిరణపరీతంబై నజలధరంబు నను
కరించె. అంత వెండియుఁ బ్రాగ్జ్యోతిషపతి పురికొల్పఁగ నాగంధసింధురం బంత
కాకారంబునఁ బొలిచి రయం బినుమడింపఁ బుడమి యద్రువ నందఱు విన్నఁబోయి
చెయ్వులుదక్కి చూచుచుండఁ బాండవసేనాసరోవరంబుఁ గలంచుచుండ భగద
త్తుఁడు మరుత్తనయువక్షమ్ముఁ దీవ్రశరమున గాడ నేయఁగ నతండు సోలి కేతనదండ
మూఁతగొనుటయుఁ బ్రాగ్జ్యోతిషాధినాథుఁడు పెలుచ నార్చె.

### ఘటోత్కచుఁడు మాయఁ గావించి కురుబలంబు నొప్పించుట.

భగదత్తునార్పునకుఁ గ్రోధసముద్ధురుండై ఘటోత్కచుఁడు వీరల మాయా
బలమునంగాని నొంప వలను గాదని తనలో నిశ్చయించి యంతర్హితుండై తత్క్ష
ణంబ తానైరావతారూఢుఁడై పాండవులకుఁ దోడ్పడ నేతెంచిన మహేంద్రుని
విధమున నగపడి తనపరిచరు లగురాక్షసుల నంజనవామనాదిదిగ్గజంబులరూప
ములు మన కెట్లు వినంబడు నవ్విధంబునఁ దద్రూపముల ధరియించి కొల్పింప నియ
మించి మాయాప్రభావమునఁ దత్ప్రకారమునం జూపట్టి యాభగదత్తుం దాఁకి
తద్గజంబుపయి నిజచతుర్దంతిమహావారణంబుఁ దోలి పటుశిలీముఖవ్రాతంబుఁ గురి
యించిన నాప్రాగ్జ్యోతిషపతిగంధసింధురంబు బహుళశరపీడితంబయి పిడుగుపా
టున కెనవచ్చుప్రబలఘీంకారం బొనర్చుటయు భీష్ముఁడు ద్రోణదుర్యోధనుల
కిట్లనియె. ధనుర్ధరవరుండై నభగదత్తుఁడు హైడింబునకుఁ జిక్కి యుక్కడక్కె. రాక్ష
సుఁడు మహామాయుఁడు. భగదత్తుఁడు పరమకోపనుఁడు. ఇరువురు నొకళ్లొకళ్లం
జంపఁగ మృత్యుద్వయంబురీతి మార్కొన్నవారు. మీఁద నేమి గాఁగలదో కాని
యిప్పటికిఁ జూడఁ బాండవులదెస సంతోషసముద్రిక్తపటుసింహనాదములును భగ
దత్తునదెస సింధురార్తరవంబులును వినంబడుచున్నవి. ఇప్పు డతనికిఁ దోడ్పాటుఁ

గావించుట మనకుఁ గర్తవ్యంబు. ఇంచుకసే పొప్పరికించితిమేని యీరౌద్రసం గ్రామంబున నతండు తలంపరానిదశకుఁ బాల్పడెనా కార్యంబు సెడు. వాఁడు దండిదండనాథుఁడు. మనయెడఁ గడు ననురక్తుఁడు. సత్కులప్రసూతుఁడు. శూరశే ఖరుఁడు. బాసటమై వానింబ్రోవనవలయు నని చెప్పిన విని భారద్వాజపురస్స రులై మనమహారథులందఱుం బరమరయమునఁ జని వానికిఁ బ్రాపగుడు యుధిష్ఠి రప్రముఖు లయినపాండవవీరులు పాంచాలమాత్స్యప్రభృతి సకలసైన్యములతో నాహిడింబానందనునకుఁ దోడ్పడిరి. వారలం జూచి మఱింత విక్రమించి వాఁడు తనయేనుంగులం బురికొల్పి యశనిపాతఘోషతుల్యంబుగా సింహనాదంబుఁ గా వించి పేర్చిన నంతకంతకుఁ బెచ్చుపెరుగుచున్న వానిపటుపరాక్రమముఁ జూచి పితామహుఁ డాచార్యున కిట్లనియె. ఘటోత్కచునితో నిపుడు పెనంగ నాకుఁ జూడ మేలని తోఁపదు. సంధ్యాసమయంబు దఱియ వచ్చె. ఇపుడు వీనికి బలం బెక్కుడగుచున్నది. సహాయసంపదయుం బెంపు గాంచె. దేవరాజు తాను వచ్చి మార్కొన్న నిపుడు వీనిం గెలువఁ దరము గాదు. పాండవపాంచాలురతీవ్రబా ణప్రహారమునకు మనవా రెంతయు డస్సియున్నవారు. మీఁదుమిక్కిలి గెలుపు గనుటం జేసి వారు డప్పి గణింపక యోహటింపక పెనంగుచున్నవారు. ఇఁక నేఁటి కయ్యముఁ జాలించి మెల్లి రేపకడన వచ్చి పోరుద మనుడు నందఱు నందులకు సంతిసిల్లి యియ్యకొనుటయుఁ బితామహుఁడు మనసేనలఁ దివియఁ బనిచె. ఉపా యమున నాఁటిసంగ్రామంబుఁ జాలించి పాండవుల కోడుటం జేసి సిగ్గుపెల్లున వాం చినమోములతోఁ గ్రమ్మఱిన నిజయోధవీరసందోహంబు పరివేష్టించి కొలిచిరాఁగ దుర్యోధనుఁడు సోదరులు వ్రెలియుటం గూరినకొండలంబునను బరాజయమునం బొడమినయవమానమునను జిత్తము త్తలంపడ శిబిరమునకుఁ జనియె. పాండవసై నికులు భీమసేనఘటోత్కచులఁ బొగడుచుఁ దూర్యస్వనములును శంఖారవము లును సింహనాదములును బెంపెసంగఁ బ్రహర్షోత్కర్షమునఁ బొదలుచు సంధ్యా సమయమున నాత్మశిబిరములఁ జేర నరిగి రని సంజయుండు నాలవనాఁటికయ్యం పుఁదెఱంగు సెప్పిన విని ధృతరాష్ట్రుఁడతని కిట్లనియె.



ధృతరాష్ట్రుఁడు చింతించుట.

సూతపుత్రా, పాండవులు దేవతలకును దుష్కరం బయినకార్యముఁ జే యుచు నాకొడుకుల గీడ్పఱచుట విన్నంతన భయమును విస్మయంబు నిఁక నెట్లు కాఁగలదో యనువగపును బొడముచున్నది. విదురునిమాటలెల్ల నిపుడు దలం పునకు వచ్చి చిత్తము నీఱుసేయుచున్నవి. దైవయోగమున నంతయు నతండు సెప్పినట్లే యగపడుచున్నది. దివ్యాస్త్రవిదు లయినభీష్మప్రముఖుల కోహటింపక పాండవులు కడిమిఁ జూపుదురుగదా. వా రేమితపము సేసిరో యేవరములఁ

బడసిరో యేమంత్రముల నేర్చిరో కాని గగనమంటపమునఁ దారకానికరం బులట్లు తేవులు వ్రేరయక వెలుంగుచున్న వారు. పాండవులు మనసేనలఁ జిందఱ వందఱ గావించుటకు నామనమున సైరణ వ్రేడమ దయ్యె. నాకొడుకులట్లు వారును బోర వధ్యులేకదా. ఈశోకసాగరంబుఁ గడవ నీఁద నోపనయ్యెద. దారుణం బయినపుత్రవ్యసనంబు ప్రాప్తంబయ్యె. నిస్సంశయముగ భీముఁడు నాకొడుకులనెల్లఁ బొలియింపఁగలఁడు. వాని మార్కొని మావారలఁ బ్రోచువార లేరునుం గన్పట్టరు. ఇందులకుఁ దగినకారణంబుఁ దెలియఁజెప్పుము. తనవార లట్లు విముఖులయినపదంపడి దుర్యోధనుం డేమి చేసె? భీష్మద్రోణకృపాశ్వత్థామశకు నిజయద్రథవికర్ణాదు లేమి నిశ్చయించి రని యడుగ నతనికి సంజయుఁ డిట్లనియె. రాజేంద్రా, సావధానుఁడవై వినుము. పాండవులు మంత్రములను మాయలను విభీషికలనుం జేయక న్యాయవిరోధము పొసఁగనీక విమలకీర్తిరింబడయఁ గోరి శక్తికొలఁదిసమరముఁ జేయుచున్న వారు. ధర్మంబే వారికి గెలుపు సమకూర్చుచున్నది. వారలు సర్వకార్యములను ధర్మావిరుద్ధముగఁ జేయుట యందఱకును బ్రస్ఫుటంబకదా. ధర్మ మేదెస ప్రాలియుండు నాదెస జయంబు సేకూఱుట సిద్ధంబు. నీకొడుకులు దుష్టచిత్తులు గావునఁ బాపలోలురై హీననిష్ఠురకర్మములఁ జేయుదురు. దానం జేసి ధార్మికు లైనపాండవుల గెలువనేరక యోడుచున్న వారు. పుట్టిననాఁటంగోలె మీవారు నీచులై లెక్కకు మిక్కిలిగ నికారములు చేసినను నుదారచిత్తులవుటం జేసి వా రవి గణింపక సంధిఁ గోరినను గొనసాగదయ్యె. ఆపాపంపుఫలమెల్ల నిపుడు బూరుగుపండువిధమునఁ బరిపక్వమై యనుభవమునకు వచ్చె. వల దనినం బోవదు. నీకును గొడుకులకును మీకుఁ బ్రియులయినశకునికర్ణాదులకుం గుడువక తీఱునే. విదురుఁడును భీష్మద్రోణులును నేనును మీమేలు గోరి యెంత వాదించి చెప్పినను నీవు కొడుకులమతమ పూని పాండుపుత్రుల గెల్తు మని యడియాసలఁ బట్టికొని తుది వినవైతివి. పాండవులే జయించుటకుఁ గతంబుఁ దెల్పెద నింకనైన వినుము. ఆనాఁటిరేయి దుర్యోధనుఁడు శిబిరమున కరిగి సోదరమరణమునను సేనాక్షయంబునను బరాభవంబునను వగం బొగులుచు సవినయముగఁ బితామహుపాలికిఁ బోయి మహానుభావా, నీవు నాచార్యుఁడును శారద్వతుఁడు నశ్వత్థామయు శల్యకృతవర్మసుదక్షిణసోమదత్తసౌమదత్తివికర్ణప్రముఖు లగుమహారథులును మూఁడులోకములనైనను సాధింపఁ జాలినవారు నన్ను గెలిపింపఁ బోరుచుండినను బాండురాజపుత్రులే గెలువఁ గతంబెయ్యదియో యెఱుంగ నయ్యెదఁ దెలియఁ జెప్పుమని యడుగుటయు నాదేవవ్రతుండు వత్సా, యేను బలుమాఱు పలుదెఱంగులఁ బాండుపుత్రులతోడ సంధిఁ గొని శాంతిఁ బొందుట మేలని యెంత చెప్పినను వినక కయ్యమునకుఁ గాలుద్రవ్వితివి. ఇంకనైనను నామాటపట్టి వారి

తోడిపొత్తున మెలంగి సోదరసుహృద్బాంధవసహితంబుగ సుఖంపుము. నారాయ ణునితోడ్పాటునంజేసి పాండవు లజేయ్యులు. పురాణగీతం బయినవారాయణమహి మంబు వివరించెద వినుమని దుర్యోధనునకు భీష్ముఁడు వెండియు నిట్లనియె.

భీష్ముఁడు దుర్యోధనునకు విశ్వోపాఖ్యానముఁ జెప్పుట.

తొల్లి గంధమాదనగిరిశిఖరంబున బ్రహ్మదేవుఁడు సురలు మహర్షులును గొలువఁ గొలువుండి యంతరిక్షపథమునఁ బెజరిల్లుచున్న విమాన మొక్కండు గాంచి యందు గోవిందుఁ డారోహించియునికి నెఱింగి లేచి నియతచిత్తుండై యంజలి బంధంబు ఘటియించి సన్నిహితుఁడై నయప్పరమపురుషునకుఁ బ్రణామము లొ నర్చి యుత్కృష్టప్రకారమున నర్చఁగావించి కొలువ నున్న దేవర్షు లందఱును లేచి ప్రాంజలులై వెఱఁగుపడి చూచుచుండ సంతోషగద్గదస్వరమున నిట్లని ప్రస్తు తించె. సీ॥ విశ్వేశ్వరా, విశ్వ, విశ్వావసూ, విశ్వవిజయ, విష్వక్సేన, విశ్వమూర్తి, విశ్వకర్తా, విశ్వవేశ్మభూత, విశాలనయన, గతాగామినాథ, కృష్ణ, విశ్వగుణో పేత, విశ్వలోకారాధ్య, విశ్వావతారప్రవీణ, పరమ, విశ్వదిగీశానవినుత, విశ్వా త్మక, విశ్వసృష్టిస్థితివిలయకారి, తే॥ గీ॥ విశ్వభూతాత్మభూతాత్మ, వేదవేద్య, విశ్వ సాక్షి, యోగేశ్వర, విజయదాయి, విశ్వసుఖ ప్రణాశన, విమలచరిత, విశ్వమో గాత్మ, గుహ్యాత్మ, విష్ణుదేవ, నీవు సర్వోత్కృష్టుండవై వర్తింతువు. పరాబ్రహ్మ పధారి యగునీకుఁ బాదములు భూమి, బాహువులు దిక్కులు, శిరస్సు దివంబు, శరీరంబు దేవగణంబు, నేత్రంబులు చంద్రాదిత్యులు, తేజస్సు వహ్ని, శ్వాసము వాయువు, స్వేదము సలిలము, శ్రోత్రము లశ్వినులు, జిహ్వ సరస్వతి, భవదీయ సంఖ్యాపరిమాణంబును దేజఃపరాక్రమములను నెవ్వరు నెఱుంగరు. నియతభక్తిస మన్వితులై దేవగంధర్వమహర్షియక్షరాక్షసమనుష్యాదులు నిన్నుఁ బూజించుచు న్నవారు. నీయనుగ్రహమున నీప్రపంచమునెల్ల నేను సృజించితి. నాకును నీజగంబు లకును నీవు రక్షకుఁడవు. సర్వభూతములకును నీవ గతివి. రాక్షసులు పెక్కండ్రు జనించుటంజేసి భూమి భారము నోర్వఁ జాలకున్నది. కావున నీచెలి యగు నరుని బాండురాజక్షేత్రమున జనింపఁ జెప్పి నీవు యదుకులమున నవతరించి భూభా రంబువాపి ధర్మముఁ గావు మని పలుదెఱంగులఁ బ్రస్తుతించి ప్రార్థించిన నాలకించి భక్తవత్సలుండైన యప్పరమేశ్వరుండు మందహాసరోచిరుదంచితలలితగంభీరనిస్వ నంబున నట్ల యగుంగాక యనిపలికి తత్క్షణంబ యంతర్హితుం డయ్యె. అంత దేవర్షిగంధర్వులు పరమాశ్చర్యకుతుకభరితులై దేవా, నీవు మ్రొక్కి ప్రస్తుతిం చిన యమ్మహానుభావుఁ డెవ్వం డనియడుగ వారికి మధురస్వరంబునఁ బరమేష్ఠి యిట్లనియె. అమ్మహాపురుషుఁడు సర్వయోగేశ్వరుఁడు సర్వలోకేశ్వరుఁడు సర్వకా రణకారణభూతుఁడు నగునారాయణుఁడు. దైత్యదానవరాక్షసులు పెక్కండ్రు

మనుష్యజన్మములెత్తి భూభారంబుఁ గావించిరి కదా. దానిం దొలఁగింప నరుని తోడ నమ్మహాత్ముని మనుష్యులలో నవతరింపఁగఁ బ్రార్థించితి. అతండట్లయగుంగాక యనిపలికి విచ్చేసె. నరనారాయణులు పురాణమునులని యందఱు నెఱుంగుదురు గదా. దేవతలకు నజేయులగునమ్మహాత్ములు లోకానుగ్రహార్థము భువి నవతరించు వారు. మనుజజన్మ మెత్తినమాత్రన పూజించుటలు మాని యవమానించువారు సెడుదురు. అ ప్పరమపురుషునివలననే సకలలోకస్రష్ట యగునేను జనించితిని. అతండే గుహ్య మవ్యక్త మక్షరము శాశ్వతము నగుపరబ్రహ్మంబు. ఆత్మ యోగమాయాప్రభావమున నరజన్మ మెత్తినయప్పురాణపురుషులు మనుష్య మాత్రు లనిభావించి యవమానించువారు తామసు లనంబడుదురు. ఈప రమార్థం బెఱింగి సర్వప్రకారముల నతనిఁ గొల్చునది యనిపలికి కమలసం భవుండు దేవర్షిగంధర్వాదులఁ దదావాసములకుఁ బోవంబనిచి తానును నిజా వాసమునకుఁ జనియె. వారును బరమామోదమునం బొదలి తమతమనివాస ములకరిగిరి. వ్యాసనారదజామదగ్న్యమార్కండేయులవలన నే నీవృత్తాంతమెల్ల నెఱింగితిని. వాసుదేవుఁడు బ్రహ్మదేవునకుం దండ్రియఁట. ఇఁక నతనికి మ్రొక్కి కొల్వకుండుట పోలునే. ఈయర్థమును నారదపారాశర్యప్రముఖమహర్షులును నేను ను నీకుఁ బలుమాఱులు చెప్పినను బెడచెవిం బెట్టితివి. ఇఁకనైనను వాసుదేవుని తోడికలహము మాని పాండవులతోడి పొత్తున బ్రదుకుము. నీవు తమఃగపరీతుఁ డై నరాకసుఁడవ కాఁబోలు. కాకున్న నరనారాయణులతోడఁ గలహింతువే. సర్వ లోకమయుఁడు శాశ్వతుఁ డవికారుఁడు చరాచరగురుఁడు లోకనాయకుఁడు సత్వమ యుఁడు నగునద్దేవదేవు నాశ్రయించి బ్రదుకుము. కృష్ణుఁడున్నచోట ధర్ముముండు. ధర్మమున్నయెడ జయంబు సిద్ధంబు. పాండవు లప్పరమపురుషు నాశ్రయించి శ్రే యోమార్గముఁ గని గెలుచుచున్నవారు. ద్వాపరకలిమధ్యమున దుష్టశిక్షణంబును శిష్టరక్షణంబును ధర్మపరిపాలనంబునుం జేయఁగ లీలామనుజుండైన యాసర్వభూ తేశ్వరుని బ్రహ్మక్షత్త్రియవైశ్యశూద్రు లందఱును నిజోచితప్రకారమున నారాధిం తురు. నీ కేబుసను బరాభవంబు మతి పుట్టదో యెఱుఁగనయ్యెద నని కురుపితామ హుఁడు సెప్పఁబోయి మఱియు నిట్లనియెం. పితామహా, వాసుదేవుఁడు సర్వలోకమహనీ యుఁడనఁబడుఁ గదా? తదాగమప్రతిష్ఠల నెఱుఁగఁ గోరెద ననియడుగ నతని కతం డు మఱియు నిట్లనియె. వాసుదేవుఁడే దైవతములకెల్ల దైవతము. పురుషోత్తమునికం టెఁ బరముఁడు లేఁడు. అతనిమాయ యత్యద్భుతంబనిర్వచనీయంబు. తొలుత న తండు జలముల సృజించి యందు యోగనిద్రాపరుండై ముఖమున నగ్నినిఁ బ్రాణ మున వాయువును మనస్సున సరస్వతిని వేదములను సృజించి యట దేవర్షిగణము లను సర్వలోకములను మృత్యువును సృజించె. బ్రహ్మదేవుని భూతభవద్భావిపదార్థ

జాతంబులను నతండ సృజించె. సర్వభూతములకును ముందు సంకర్షణుం గల్పించె. అతండే యాదిశేషుం డనం బరంగి ధరాతలమునెల్ల వహించుచున్నవాఁడు. మధు వనురాక్షసుం డద్దేవునికర్ణరంధ్రమునం బొడమి బ్రహ్మకుం గీడు గావించుచుండ వా నిం జంపె. దానం జేసి నారాయణుఁడు మధుసూదనుం డనం బరంగె. మత్స్య కూర్మ వరాహ వామనాద్యవతారము లెల్ల లోకానుగ్రహార్థ మతండే యెత్తినవాఁడు. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు క్రమమునం దదీయ ముఖబాహూరు పాదములం జనించిరి. దర్శపౌర్ణమాసులయందు నియత విధానమున నాలోక నాథు నారాధించినవా రుత్తమపదంబుం బ్రాపింతురు. హృషీకేశుఁడే తల్లియుం దండ్రియు గురుఁడు నాచార్యుఁడు నని మునులు భావించి ధ్యాననిష్ఠు లగుదురు. కృష్ణునిప్రసాదముం బడసిన యుత్తములకుం బుణ్యలోకము లక్షయ్యములై యుం డు. భయములు పొసంగినపుడు కేశవు శరణుసొచ్చినయతండు మేలిమిం గాంచు. కృష్ణుఁడు తన్నాశ్రయించినవారల సర్వప్రకారముల రక్షించుం గావునం దద్భ క్తు లెప్పుడును మోహముం బొందరు. కావుననే యుధిష్ఠిరుఁడు సర్వప్రకారముల వాసుదేవు నాశ్రయించె. నీవునమ్మహనీయు నాశ్రయింపుము. ఈ యుపాఖ్యా నముం బఠించినవారు సుఖింతురు. తొల్లి నిమిత్తవిశేషమున దేవతలు సిద్ధులు సాధ్యులు మున్నగువా రొక్కచోం గూడియుండఁగ బ్రహ్మర్షు లనేకులు వేఱువేఱ భగవత్తత్త్వము వారికి విస్తరించి చెప్పిరి. ఎట్లంటేని. భగవంతుఁడు సర్వలోకభా వనుం డని నారదుఁడు వలికె. భూత భవిష్య ద్వర్తమానంబు లన్నియు జనార్ద నుఁడే యని మార్కండేయుఁడు నుడివె. యజ్ఞఫలప్రదాత యగుయజ్ఞపురుషుం డును సర్వభూతదేవుఁడును బురుషోత్తముఁడే యని ద్వైపాయనుండు వాక్రుచ్చె. సర్వములకు స్రష్ట కేశవుఁడే యని యంగిరసుఁడు వక్కాణించె. నారాయణుని శరీరమున నవ్యక్తమును మనస్సున వ్యక్తమును వాక్కున దేవగణంబును బ్రభ వించె నని దేవలుఁడు వచించె సర్వలోకములు విరాణ్మూర్తి యగు దామోదరుని సర్వాంగముల సంభృతములై యున్నవని తాపసు లనేకులు చెప్పిరి. సర్వధర్మ ములకును సర్వయోగములకును గతి మధుసూదనుఁడు కులమున నసులక్కుమారప్ర ముఖులు పొగడిరి. ఇవ్విధమున ననిర్వచనీయుం డై నపుటించి ప్రార్థించుటంబుం దల పోసి యద్దేవదేవు నాశ్రయింపు మని భీష్ముఁడు సెప్పిన విని సుయోధనుఁడు కేశ వుని బహూకరించె. అంత శాంతనవుఁడు వింటివిగదా వాసుదేవుని మహిమంబు. అర్జునుఁడును వాసుదేవుఁడును లీలామనుష్యులై నరనారాయణు లవధ్యుల జేయు లని నిశ్చయించి యిప్పుడైన శాంతిం బొంది పాండుపుత్రులతోడ సంధి చేసి హతశేషులనైనను బ్రదికించికొని సుఖింపుము. కానున్నం జేసెమెదవని పలికి యూరకుండె. దుర్యోధనుఁడును బితామహువచనములం జెడచెవిం బెట్టి తదను

జ్ఞాతుండై నిజనివాసమునకుఁ జని యారాత్రి యుచితప్రకారమునఁ గడపె.

## ఏనవనాఁటి యుద్ధము.

అంత నమ్మఱునాఁడు సూర్యోదయసమయమున నీదుర్మంత్రమునం బొడమిన కయ్యంబు సేయంగడంగి భీష్మపురస్సరులై మీవారు సకలసైన్యసమేతంబుగఁ బోలకలనికి నడిచి మకరవ్యూహం బమర్చి యుండునంతఁ బాండవులును భండనోత్సాహము సెలంగ సంగ్రామరంగమునకుఁ జనుదెంచి చమూగణముల శ్యేనవ్యూహవిధానమున నమర్చి ప్రతిఘటించిరి. అందుఁ దుండమున భీమసేనుండును నేత్రముల శిఖండిధృష్టద్యుమ్నులును శిరస్సున సాత్యకియుఁ గంధరంబున గాండీవియు వామపక్షమునఁ బాంచాలసేనాపరివృతుండై ద్రుపదుండును దక్షిణపక్షంబున నిజాక్షౌహిణీపరివృతు లయిన కేకయులేవురును వారిపిఱుంద సౌభద్రద్రౌపదేయులును వీఁపున మాద్రేయఘటోత్కచాదిపరివృతుండై యుధిష్ఠిరుండును నిలిచిరి. అంతభీమసేనుఁడు మీవారిమకరవ్యూహంబు మొగంబుఁ జించి భీష్మం దలపడి పటుపరాక్రమంబు మెఱయ సాయకానీకంబుఁ బరఁగించినం గోపించి యాపగేయుండు దివ్యాస్త్రములు పెక్కు లేసి యురువడించి పాండవవ్యూహంబు భేదించుచున్నంత ధనంజయుం డతని మార్కొని తదీయదివ్యాస్త్రజాలము మాయించి యప్పితామహుపై నంపసోనఁ గురిసి యేపు చూపుచుండఁ బ్రహ్మాస్త్రోత్కర్షమునఁ బొదలి పాండవయోధు లొక్క పెట్టఁ దాఁకి కౌరవవీరుల నొప్పించుచున్నంత దుర్యోధనుఁడు భారద్వాజున కిట్లనియె. ఆచార్యవర్యా, నీవును బితామహుఁడును మా హితము నెల్లకాలమును గోరినవారని మిమ్మాశ్రయించి మీప్రాపున దేవతలనైనను గెలువఁ జాలుదునని యున్నవాఁడను.ఇఁకఁ బాండవుల జయించుటం జెప్పనేల. అందులకుఁ దగినతెఱంగున మీరు విక్రమంబు సూపినంగదా కార్యము నెఱవేఱును. ఇఁక మీఁకుఁ బెద్దయుంబ్రొద్దు చెప్పనలయునే? మాకు మేలు సమకూఱువిధము సేయుఁడనిపలికిన విని యాచార్యుం డవార్యశౌర్యంబున నరిసైన్యంబుపయిం గవియుటయు సాత్యకి యౌద్ధత్యంబు నెఱయ నక్కోదండగురుని నిలువరించుటయుఁ బ్రగండకయ్యం బయ్యె.

## సంకులయుద్ధము.

అంతఁ గోపదీపితుండై కుంభసంభవుండు నవ్వచు నాశైనేయుజత్రుదేశమున శరదశకంబు నాటుటయుఁ గోపించి బకాంతకుండు ద్రోణుం దలపడి పటుప్రదరము లేసి నొంచినం జూచి శాంతనవుఁడును మద్రేశ్వరుఁడు నయ్యస్త్రగురునకుఁ దోడ్పడి బహుళశిలీముఖముల నాప్రకోదరుం గప్పిరి. అందుల కలిగి సౌభద్రుఁడును ద్రౌపదీపుత్రులేవురును వారలం దాఁకి నిశితబాణజాలముల నొనొయుచున్నంత శిఖండి వారికి బాసటయై భీష్మద్రోణులమీఁద శరాసారముఁ

గురిసినం బితామహుఁడు స్త్రీపూర్వుఁ డైనవాని నేయుట తనకు వ్రతభంగమని తలఁచి యూరకుండె. దుర్యోధనచోదితుండై యాచార్యుండు భీష్ముని గావఁబూని యుగాంతాగ్నిపోలెఁ బ్రజ్వరిల్లుచు శిఖండిని నిశితశరనికరమున నొప్పించుచు న్నంత దుర్యోధనుఁడు సేనాగణపరివృతుండై పితామహునకుఁ గావలియై నిలిచె. పాండవులును గాండీవిపురస్సరులై భీష్ముం దలపడి యురువడించిన నాపూర్వాహ్ణం బున సంకులసమరం బయ్యె. రథికబాణపాతంబునను గజశుండాదండప్రహారంబు నను రవుతులయీఁటెపోట్లను గాల్బలంబులపిడికిటియేట్లను సకలాంగములు నలఁ గ వికలంబులగు చతురంగబలము లిలాతలమునఁ గూలఁ బడునెడం బొడము నిన దంబునను భేరీశంఖపటహప్రముఖవాద్యనిర్ఘోషంబునను గరిబృంహితంబునను దురగహేషితంబునను వీరయోధపటుసింహనాదంబునను నొండొంటిం దాఁకి యు చ్చిపోవు వివిధహేతివ్రాతంబులచప్పుళ్లను మౌర్వీఘోషంబులను బరమతుములం బయ్యె. సైనికపాదఘట్టనసముత్థితంబై ధరణీపరాగంబెగసి తదీయగాత్రనిస్సర ద్రుధిరప్రవాహమునఁ గర్దమంబై కాందిశీకుల త్వరితగమనమునకుఁ బ్రతిరోధ ముఁ గావించుచుండె. ఎక్కడఁ జూచినను సైనికకరచరణశిరోనికరంబులను గటక కిరీటకుండలకేయూరాదివివిధభూషణగణంబులను రణాంగణంబు ఘోరాభిరా మం బయ్యె. అప్పుడు దుర్యోధనుఁడు కాళింగపరివృతుఁడై భీష్ముని బురస్కరించి కొని పాండవుల నెదుర్కొనుటయు వారును వృకోదరపురస్సరులై భీష్ముని మార్కొ నినం బోరు ఘోరం బయ్యె. అట్టియెడ ధనంజయుండు పటుసింహనాదంబు నను బాంచజన్యదేవదత్తనిస్వనంబునను దిశాతటంబులు బీటలువాఱఁ గేతనకపి ప్రభలు చూడ్కులు మిఱుమిట్లుగొనఁ బితామహుం గవిసి గాండీవద్యుతులు మెఱుంగుతళతళలుగా జ్యాఘోషంబు గర్జారవంబుగాఁ బ్రావృట్పయోధరం బుకై వడి నొప్పుచు నిశితశరాసారంబుఁ గురిసినం గురుసైనికులు తదీయ దివ్యాస్త్రమోహితులై తూర్పిది పడమర యిది యని యేర్పఱుప నేర్పరులు గాక వెఱచి పఱచుచు నొండొరులఁ గూడికొని భీష్మునిమఱుఁగుఁ జొచ్చినం బితామహుండు వారికిఁ బెనుప్రాపై నిలిచె. అర్జునుకోల్తలల నూచి సుయోధ నుండు మద్రసౌవీరగాంధారత్రిగర్తగోపాలకాళింగబలంబులను బదునాలుగు వేవురుగుఱ్ఱపురావుతులనుం దోడుపఱిచి శకునిదుశ్శాసనజయద్రథుల నాపగే యునకు బాసటగాఁగఁ బంచిన నతండు తత్సహాయుండై కిరీటితోడఁ బోరుచుండె. మఱియు నవంతిపతులు కాశిరాజుం దాఁకిరి. సైంధవుఁడు భీమసేనుని మార్కొ నియె. సోదరపుత్రసహితుండై యుధిష్ఠిరుఁడు శల్యుఁ దలపడియె. వికర్ణుఁడు సహదేవునిఁ జిత్రసేనుఁడు శిఖండిని శకునిదుర్యోధనులు మత్స్యనాథుని ద్రో ణుఁడు ద్రుపదచేకితానసాత్యకులను గృపహార్దిక్యులు ధృష్టద్యుమ్నునిం దలపడి

కడిమి మెఱయఁ బోరుచుండ నిరువాఁగును జమూగణంబులు వికలంబులుగాఁగఁ బదాతులు సావఁగఁ బాఱెడుఘోటకంబులును నిశితకుంతతోమరాదివిక్షతంబులై పరసింధురంబులమదగంధము నోర్వక తిరుగుడువడి యెదుర్కొను రథపదాతివర్గంబులఁ దొండమున నీడ్చి నేలం బెట్టి కాలం జమురుచుఁ గూలంద్రోయుచుఁ బఱచు నేనుంగులును రథికసారథులు పడుటం జేసి పెద్దయునెచ్చినవి కావునఁ గయ్యంపు నేల నిలువ నోడి రథ్యము లీడ్చికొని పోవఁ బుడమి యద్రువఁ బీనుంగుదట్టంబులపై నిటునటుం బొరలుచుఁ బెనుగాలికిఁ దూలుమేఘపటలములపగిది నొప్పు నరదంబులును గజములయిఱుకటంబునను రథసమ్మర్దంబునను దురగఖురపాతంబునను రథికశరప్రహారంబునను బరస్పరకుంతక్షురికాదినానాయుధసంఘట్టనంబునను మడియుకాల్బలంబులునై మత్తమాతంగంబు గలంచినకమలాకరంబుచందమునఁ జూడ నొప్పె. అట్లు కయ్యంబు గజిబిజి యగుడు శిఖండి విరాటసమన్వితుండై భీష్ముఁ దాఁకి సాయకగణంబుఁ బరఁగించె.

అర్జునుఁడు ద్రౌణికృపవికర్ణాదులఁ బెక్కండ్రఁ దలపడి యేపుమాపె. భీమసేనుఁడు దుర్యోధనదుస్సహులను బ్రాచ్యదాక్షిణాత్యరాజవర్గంబును మార్కొనియె. సహదేవుఁడు సౌబలోలూకులఁ బ్రతిఘటించె. ధర్మరాజు గజానీకంబుఁ దాఁకె. నకులుఁడు త్రిగర్తసేనల నురువడించె. సాత్యకిచేకితానసౌభద్రులు సాల్వకేకయుల నెదిరించిరి. ధృష్టకేతు ఘటోత్కచులు నీకొడుకులం గవిసిరి. ధృష్టద్యుమ్నుఁ డాచార్యుం దాఁకె. ఇవ్విధమున నిక్కడనక్కడనుం జేయఁగలదండిమగలు ద్వంద్వంబులై ప్రతిఘటించి శంఖారవసింహనాదబంధురంబుగాఁ బోరుటయు నుభయసేనలందును డొల్లెడుతలలును దొరిగెడునుష్ణీషంబులును గూలెడుతేరులును విఱిగెడుకేతనంబులును వ్రాలెడునేనుంగులును వ్రీలెడుగుఱ్ఱములును సోలెడుకాల్బలంబులును నఱవఱ లగుమైమఱువుల్లును దునిసెడుహేతిసంఘాతంబులునై దారుణప్రకారంబు చూపట్టె. ఎగసినపాంసుజాలంబు పెల్లునం జేసి దిక్కులును విదిక్కులును సూర్యమండలంబును గప్పట్టవయ్యె. సకలజనులును మోహావిష్టులైరి. నానావర్ణకవచోష్ణీషకిరీటాదిప్రభాపటలంబున నారణాంగణంబు మిగుల శోభిల్లె. గ్రహగణంబులు నింగి నెట్టులట్టుల శూరశేఖరు లందుఁ బొల్చిరి.

### భీష్ముఁడు పాండవసేనం గవిసి విజృంభించుట.

అవ్విధమునఁ దుములసమరంబు సెల్లుచున్నంత మధ్యాహ్నం బయ్యె. అట్టిమధ్యాహ్నసమయంబునఁ గ్రోధసముద్ధతుండై భీష్ముఁడు భీమసేనుని మార్కొని రుక్మపుంఖము లగుక్రూరనారాచముల నేసిన నతండు కోపించి ఘోరశక్తిం బ్రయోగించిన నప్పితామహుండు దాని శితశరములఁ దునియ నేసి వేఱొండుతీవ్రభల్లమున నాపవమానసూనుకోదండంబు రెండుతునియలుగఁ గావించె.

సాత్యకి యపుడు భీష్ముని దలపడి గొనయంబు సారించి బహుళమార్గణంబుల
నొం నేయుటయు నవ్వీరవర్యుఁ డలిగి సాత్యకిసారథితలఁ దఱుగుటయు మనోవా
యురయంబు లయినహయంబులు తద్రథంబు నీడ్చికొని పాఱినం బాండవసైన్య
మున హాహాకారపురస్సరంబుగా నడ్డపడుఁడు పట్టుఁడు నిలుపుఁ డనుమాటలు
పెలుచ విననయ్యె. అత్తఱి మరుత్తటినీతనూజుండు దనుజసేనం గవియునగారి
తెఱంగునఁ బాండవసేన నుఱుమాడుచుండఁ బాంచాలసోమకులు క్షాత్త్రధర్మముఁ
దలపోసి ధృష్టద్యుమ్నపురస్సరులై యప్పితామహుం దాఁకి మీమూఁకల నొం
చుచున్నంత ద్రోణప్రముఖులు మీవారికిఁ దోడ్పడుటయు విరాట ప్రభృతులు
గాండీవిపురోగములై వారివారికి బాసట యైరి. అట్టియెడ విరాటుఁడు శరత్ర
యమున భీష్ముం గాఁడ నేసి తదీయరథ్యములను మూఁట నొప్పించినం గోపించి గం
గానందనుండు పదింట నతని నొంచె. అశ్వత్థామ సవ్యసాచిని మార్కొని యా
ఱువాఁడికోలల నతనిఁబొమ్ము నొం నేసినం గినిసి యమ్మేటిమగం డొక్కశరమున
నతనివిల్లు దునిమి తొమ్మిదింటఁ దద్గాత్రంబు నొప్పించె. అంత నవ్విల్లు ద్రుంచుటకు
సామర్థ్యుండై యాచార్యపుత్త్రుఁ డొండుకోదండముఁ గొని తొంబదిశితశరములఁ
గిరీటిని డెబ్బదివాలమ్ముల వాసుదేవునిం గాఁడ నేసిన శౌరికన్నుఁగవ కెంపుఁ గనుం
గొని కవ్వడి యత్యంతక్రోధతామ్రాక్షుండై దీర్ఘోష్ణనిశ్వాసంబులు నిగిడించి
వగచి పరమదారుణంబు లయినబహుళమార్గణంబుల దృఢవామముష్టిగృహీతం
బయినగాండీవంబున నరివూసి యేసిన నయ్యమ్ము లయ్యాచార్యసుతుకంకటంబు
వ్రచ్చి నెత్తు రురులించినను నోహటింపక చక్క నిలిచి శరము లేయుచుండ
నౌరౌర! యితండు డెప్పరంబులఁ జొప్పడిన నించుక వెఱచువాఁడయ్యుఁ గృష్ణా
ర్జునులకుఁ బ్రతిఘటించి యిప్పు డెంతకైనం దలఁకక నిల్చినవాఁడు. వీనిబీరం బింత
యొప్పునే యని చూపఱు వానిం బ్రశంసించిరి. ఇతండు బ్రాహ్మణుండు ద్రోణా
చార్యునకుఁ బ్రియపుత్త్రుండు నా కత్యంతమాననీయుండుఁ గావునఁ బెద్దయు
నొప్పింపరా దని కరుణావిష్టుండై కిరీటి యతనిం గ్రేడించి మీసేనపయిం గవిసి
శరాసారముఁ గురియుచుండె. దుర్యోధనుఁడు భీమసేనుని మార్కొని శిలాసదృ
శములు గృధ్రపత్త్రాభిరామములు నగువిశిఖములు పెక్కు లేసి నొంచినం గ్రోధ
దీపితుండై వాయుసూనుండు మౌర్వి కర్ణాంతకృష్టంబుగా నలవరించి శితశరదశ
కము నతనివక్షోభాగమున నాటినం దదీయశరపరివృతంబయి రారాజుహారతరళ
రత్నరాజంబు గ్రహగణపరీతుఁడైననభోమణి ననుకరించె. భీమబాణవిద్ధుండై
యతండు సిడులుచూపినగంధసింధురంబుచందంబున నత్యంతక్రుద్ధుండై యతని
పయిం బటుప్రదరసీకరంబుఁ బరఁగించుటయు వడముడియుం గడిమి నదరి
కయ్యంబు సేసిన నయ్యిరువురిపోరు దేవాసురసమరంబు తెఱంగునఁ జూడ నొప్పె.

## అభిమన్యుఁడు కురుసేనపై నురువడించుట.

అప్పు డభిమన్యుఁడు చిత్రసేనపురుమిత్రసత్యవ్రతులం దలపడి చిత్రసేన పురుమిత్రుల నేడుతూపులను సత్యవ్రతుని డెబ్బదింటను నొంచి వీర్యనర్తనంబుఁ గావించుచు మీఁమొనలం జించుచుండ వారలిగి చిత్రసేనుఁడు పదింటను సత్యవ్రతుఁడు తొమ్మిదింటను బురుమిత్రుఁ డేడింటను నవ్వీర్యధుర్యుం గాఁడ నేసి రక్తసంసిక్తగాత్రుం జేసిన నతం డోహటింపక ప్రబలశరజాలంబుఁ బ్రయోగించి చిత్రసేనునివిల్లు దునిమి యొక్కతీవ్రభల్లంబు బిట్టేసిన నది యతనిమైమఱువు దూరి నెత్తురు లురులించె. అంత మీఁవారు సంరంభోద్రిక్తులై యొక్కపెట్ట యతనిం దాఁకిన నవ్వాఁడిమగం డందఱ కన్నిరూపులై వేసవితఱిం బేర్చుకార్చిచ్చు శుష్కతృణపుంజంబుల నట్టు లట్టుల నీసైన్యంబు రూపుమాపుచుండె. అట్లప్రతిహతవిక్రమంబున వెలుంగుచున్నసౌభద్రుం జూచి శుభలక్షణుం డైనలక్ష్మణకుమారుండు దాను మార్కొనినం గినిసి యర్జునపుత్రుం డాతేసినారసంబుల నా దుర్యోధనపుత్రునిఁ దత్సారథినిం గాఁడ నేయుటయు నతం డందులకుఁ జలింపక యద్భుతప్రకారమున వానిపైఁ బటుశిలీముఖములఁ బరఁగించె. అందులకుఁ గడుం గినిసి కిరీటినందనుండు నీమనుమనిరథ్యసారథులఁ గూల నేసిన నారాజపుత్రుఁడు హతాశ్వసారథికం బయినరథమునఁ గూర్చుండి యాశీవిషోపమంబు ఘోరరూపంబు నగుశక్తిం బ్రయోగించినం గృష్ణభాగినేయుండు దానిం బలుతునియలుగావించె. అప్పుడు కృపాచార్యుఁడు డాసి లక్ష్మణుఁ దనతేరెక్కించికొని యందఱుం జూచుచుండ నచ్చోటు వాసె. అట్లు మహారథు లందఱు బీరంపుఁబెంపు సొంపారఁ బోరుచున్నంత నాపగేయుండు విక్రమించి పాండవసేనం జెండాడుచుండె.

## సాత్యకిభూరిశ్రవసులయుద్ధము.

అయ్యవసరంబున సమరదుర్మదుం డైనసాత్యకి మీఁసేనపయిం గవిసి కరలాఘవంబు మెఱయ ధనురాకర్షణశరగ్రహణసంధానప్రయోగంబు లూహింపరానిరయము నెఱయ జ్యాఘోషభీషణంబుగఁ బటుశరాపాతంబుఁ గురియుటయు మనమూఁకలు చిందఱవందఱ లయ్యె. సాత్యకివిక్రమంబుఁ జూచి కురుమహీవల్లభుండు పదివేవుర రథికులఁ బురికొల్పుటయు నాశినివీరుఁడు దివ్యాస్త్రములు పెక్కు లేసి వారల నందఱను ముహూర్తమాత్రలోన గీటడంచి పైపైఁ దఱుముటయుఁ గురువర్యుఁ డైనభూరిశ్రవుఁడు యూపకేతుశోభాభిరామంబుగా నవ్వీరుని మార్కొనియె. మార్కొని యింద్రాయుధసవర్ణం బయిననిజకోదండమునఁ బన్నగోపమము లగుశరనికరంబులు సంధించి లాఘవచాతుర్యమును సురలు వొగడం గుప్పించినం గృష్ణానుజుపరిచరులు వెగడుపడి పాఱిరి. అప్పుడు సాత్యకిపుత్రులు పదుగురు చిత్రవర్ణాయుధధ్వజవిభాసితులై సోమదత్తిని దలపడి యో

కురువర్యా, మాయందఱితో నొండె మాలో నొక్కనితో నొండె నెదిరించి పోరుము. మమ్ము గెల్చినం గీర్తిఁ బొందుదువు. మేము గెల్చితిమేని సుప్రీతచేతస్కుల మగుదు మని చివ్వకుఁ బిలిచిన నాసోమదత్తతనయుండు సాత్యకితనయులారా, మీ రందఱును గలిసి నాతోడఁ బోరాడుఁడు. మిమ్మందఱినుం బొరివుత్తు ననవుడు వారలతనిపయి నంపసోనఁ గురిసి యురువడించుచున్నంత నపరాహ్ణం బయ్యె. అయ్యపరాహ్ణసమయంబున నాసోమదత్తనయుండు వారియమ్ములనెల్లఁ బ్రతిశరములఁ బొడవడంగించి విండ్లు దునిమి యందఱితలల నొక్కపరి యవలీలం దఱిగినఁ బిడుగుపాటునం గూలుబ్రమాఁకులకై వడి వారు పదుండ్రు నేలం గూలిరి. అంతఁ బుత్రశోకార్తుండై సాత్యకి క్రోధాద్ధత్యం బెసంగ నాభూరిశ్రవుం దలపడిన నతండును వీర్యధుర్యుండై ప్రతిఘటించుటయు నయ్యిరువురు దొర లొండొరులతేరిగుఱ్ఱములఁ జంపి విరథులై నేలకు డిగి ఖడ్గఖేటకధారులై చలంబు పెల్లున శార్దూలంబులలీల నాలంబు సేయుచుండ నందఱును జూడఁగ భీమసేనసుయోధనులు వారలఁ దమరథము లెక్కించికొనిరి. అట్టియెడ నాపగేయుని మార్కొని ధనంజయుండు పోరు సేయువాఁడు మీసేనలఁ జించి చెండాడుచుండ సుయోధనుఁ డతనిఁ దాఁకఁగ నిరువదివేవురురథికులఁ బంపుటయు భండనోద్దండుండై గాండీవి వారలనందఱను ముహూర్తమాత్రన సమరక్షోణికి బలి చేసె. ప్రొద్దు గ్రుంకుతఱి నయ్యిరువదివేవురు రథికులు గాండీవాగ్నిం బడి మిడుతలట్లు మడిసినం జూచి కురుసైనికులు సమ్మోహంబుఁ జెందిరి. మత్స్యకేకయప్రముఖులు కిరీటిసౌభద్రులప్రాపుఁ గాంచుటం జేసి యుత్కనం జెలంగిరి. అప్పుడు పితామహుఁడు పడమటి దెస సంజకెంజాయ రంజిల్లుటం జూచి సేనలఁ దివియించుటయు నుభయసైనికులు తమతమశిబిరములకుఁ జని యారాత్రి యుచితవిధమునఁ గడపిరి.

## ఆఱవనాఁటియుద్ధము.

అంత నమ్మఱునాఁడు ప్రభాతంబున నుభయశిబిరంబులందును సంగరోత్సాహసంభ్రమరవంబులును వాద్యనిస్వనంబులును రథగజతురంగవ్రాతంబులసవరణలం గడంగుభటులపరస్పరాహ్వాననినదంబులు నొక్కటియై యత్యంతతుములం బయ్యె. సూర్యోదయావసరమునఁ బాండవాగ్రజుండు ధృష్టద్యుమ్నుం బిలిచి నేఁడు మనసేనల మకరవ్యూహవిధానంబున నాయితపఱుపు మనిన నతం డట్ల చేసె. అందు ధనంజయుండును ద్రుపదుఁడును శిరస్సు గ్రహించిరి. నకులసహదేవులు కన్నులఁ బొలిచిరి. భీమసేనుఁడు చంచుపుటంబునం బరఁగె. సౌభద్రద్రౌపదేయహైడింబసాత్యకిపరివృతుండై యుధిష్ఠిరుండు కంఠమున నమరె. విరాటధృష్టద్యుమ్నులు బహుళసేనాపరివృతులై వీఁపున నిలిచిరి. కేకయపంచకంబును ధృష్టకేతుచేకితానులును వామదక్షిణపక్షంబు లయిరి. కుంతిభోజశతానీకులు

మహాసైన్యపరివేష్టితులై చరణముల కమరిరి. శిఖండియు నిరావంతుండును సోమకసమేతులై పుచ్ఛస్థానంబు గ్రహించిరి. ఇవ్విధంబునం బన్ని యుద్దామకేతన హేతివ్రాతశోభాభిరామంబుగాఁ గౌరవుల మార్కొనుటయు దేవవ్రతుండు మన సేనలఁ గ్రౌంచవ్యూహప్రకారంబునఁ బన్నించి ప్రతిఘటించె. అందు భారద్వాజుండు తుండంబును గృపాశ్వత్థామలు నయనంబులను గాంభోజపతి బాహ్లికసమన్వితుండై మస్తకంబును శూరసేనాదిసేవితుండై కురురాజు కంధరంబును మద్రసౌవీరకేకయయుతుండై భగదత్తుఁ డురమ్మును బహుళశ్రిగర్తచమూసమేతుండై సుశర్మ వామపక్షంబును శకచూలికతుషారయవనులు దక్షిణపక్షంబును శ్రుతాయుశ్శతాయుర్భూరిశ్రవులు జఘనంబునుం గ్రహించిరి. ఇట్లు లొండొరులకుఁ గావలియై మహారథు లందఱు వ్యూహముఁ బన్ని భీష్మపురస్సరులై కయ్యమునకుఁ దొడంగిన సేనాద్వయమునందును జతురంగబలంబులు నిర్మర్యాదంబుగా నొండొంటిం దలపడి క్రందుకయ్యంబు సేయుచున్నంత భీమార్జునప్రముఖమహారథసురక్షితం బయినపాండవసేన నక్షత్రసముదయసముల్లసితం బయినయామినిచాడ్పునఁ దేజరిల్లె. భీష్మద్రోణకృపశల్యసుయోధనాదిగుప్తం బయినకురుసైన్యంబు గ్రహగణోజ్జ్వలం బైనగగనంబుకరణి వెలింగె. అప్పుడు భీమసేనుఁడు సేనమొగమున నున్నద్రోణుం దాఁకి శితశరముల నేసిన నయ్యాచార్యుఁడు తొమ్మిదివాఁడియమ్ముల నమ్మారుతతనయు నాయంపుచోట్లం గాఁడ నేసిన నతండు క్రోధోద్ధతుండై గురునిసారథిం దునిమె. అందుల కెంతయుం గోపించి భారద్వాజుండు తాన రథచోదనంబుఁ జేయుచుఁ బాండవానీకంబును దూలరాశిం గాల్పునగ్గిచందమున రూపుమాపుచున్నంతఁ గేకయసృంజయాదులు పలాయనపరు లైరి. అయ్యవస్థం జూచి పార్థుండు గండడరి విక్రమవిహారంబు సల్పుచున్నంత మీవారి కమ్మేటివిలుకానిఁ గడువరాకుండె ననుటయు ధృతరాష్ట్రుఁడు సంజయున కిట్లనియె.

**ధృతరాష్ట్రుఁడు పాండవవిజృంభణమునకుఁ జింతిల్లుట.**

సంజయా, మనసైన్యంబు శాస్త్రోక్తప్రకారమునఁ గల్పితంబయ్యు దృఢవిక్రమంబయ్యుఁ బాండవులం దలపడి చిందఱవందఱ యగుచున్నదికదా. అందులకుఁ గతం బేమియో యెఱుంగరాదు. మనబలఁగమున నందఱును మిగుల వృద్ధులును బాలురును గృశులును స్థూలురును గాక తారుణ్యశరీరలాఘవబలసారారోగ్యములఁ గడు నొప్పినవారు. సాహసోత్సాహధురంధరులు. బాహుయుద్ధమునందును గదాసమరమునందును ఖడ్గరణమునందును శక్తిముసలభిండివాలకుంతప్రాసాదినానాహేతిసంగ్రామంబునందును ధనుర్విద్యయందును గజరథాశ్వారోహణంబునందును దఱితోఁ దాఁకుటయందును దొలంగుటయందును మిక్కిలి నేర్పరులు. మఱియు

వా రందఱు మన కుపకారముఁ జేయుదు మనుబుద్ధినెండె సౌహార్దసంబంధాది నిమిత్తములనెండె మనలఁ జేరినవారుగారు. మఱి తండ్రులు తాతలు మొదలుగ మనపోషణమునఁ బెరిగి కొందఱును సఖ్యసంబంధములఁ గొందఱును మనలం గలిసి కీర్తిఁ గోరి ప్రాణముల నిత్తుమని పూనినవారు. లోకపాలసదృశు లైన భీష్మద్రోణకృపాశ్వత్థామకృతవర్మజయద్రథదుశ్శాసన భగదత్తవికర్ణసౌబలబాహ్లీకప్రముఖశూరశేఖరగుప్తంబై సారవంతం బైనమనసైన్యము పాండవులచేఁ జచ్చుటం జూడఁగ దైవంబుతక్క మఱియెద్దియు నిందులకుఁ గారణము గాదని తోఁచెడి. ఇట్టివి తొల్లి యెప్పుడైనను సనాతనబుషులైన నెఱింగియుండుదురె. సర్వసంప్రతిపన్నంబయ్యు మనసైన్యము లాఁతులయల్పసైన్యములచేఁ జచ్చుచున్నది. మనభాగ్యం బేమన వచ్చు. తొలుతనే విదురుఁడు మతిమంతుడు గావునఁ బెద్దయు నాలోచించి మీఁదఁ జేటు వచ్చు ననితలంచి పలుదెఱఁగుల సంగరము తగదని హితము బోధించినను మందాత్ముఁడు గావున నాకొడుకు దుర్యోధనుఁడు వానిమాటలు వినఁడయ్యె. ఇఁకఁ జింతించినం బ్రయోజనం బెయ్యది? తొలుత ధాత యెట్టులు కాఁగ నియమించె నది కాకమానునే యనుటయు సంజయుఁడతని కిట్లనియె. నరేంద్రా, నీదోషముననే యీవ్యసనమంతయు మూఁడినయది కాని యొండు గాదు. ఆత్మదోషముల నేల దుర్యోధనుపయిం బెట్టెదవు. అతండు మీఁద వచ్చుచేటు దెలియఁడ కావున నెట్లు చేసిన నతనికిఁ జెల్లును. నీ వంతయు నెఱింగియు నూరకుంటివి. ఆనాఁ డాపాపపుజూదము సాగనిచ్చినం గదా యింతలు పుట్టె. ఎంద ఱెంత యొత్తిచెప్పినను వినవైతివి. ఇప్పుడు యుద్ధమును నీవలనన కలిగె. కావునఁ దత్ఫలముఁ గుడువుము. తాను జేసినకర్మము ను లాఁతులు గుడుతురె. ఈలోకమునందు నాలోకమునందును నీకు దీనిఫలము గుడువక తప్పించికొన వలను గాదు. కావున నిఁక నీమాటలు సాలించి స్థిరచిత్తుండవై కయ్యంపుఁదెఱంగు వినుమని సంజయుఁ డతనికి మఱియు నిట్లనియె.

### భీమసేనుఁడు కురుసేనం గవిసి విజృంభించుట.

అవ్విధమున నాఁడవనాఁటిపూర్వాహ్ణమున సంగ్రామంబు సెల్లుచున్నంతఁ గీచకాంతకుండు శాంతనవగుప్తం బయినమనమొగ్గరంబు శితశరములఁ జించి యేడ్తెఱ మెఱయుచుండ దుశ్శాసనదుర్విషహదుస్సహదుర్మదజయజయత్సేనవికర్ణచిత్రసేనసుదర్శనచారుచిత్రసువర్మదుష్కర్ణాదు లైననీకొడుకులు పెక్కండ్రు శతసహస్రరథికులు దమకు బాసటగాఁగ నెక్కమొగి నతనిం దాఁకి జీవముతోడన వీనింబట్టుదు మని తమలో నిశ్చయించి యుగవిగమంపుఁదఱిఁ గ్రూరమహాగ్రహములు సూర్యుంబోలెఁ జుట్టుముట్టి శితశిలీముఖగణములఁ గురిసిన నందఱుఁ ద న్నఱుముటకుఁ గొంచెమేనియు వెఱవక వడముడి దేవాసురసమరమున నసురు

లపయి నుసువడించు వాసవువిధంబునం బేర్చి దదీయదుర్వ్యవసాయం బెఱింగి యందఱం బిలుకుమార్పంగ నెంచి రథావతరణంబు సేసి గదాపాణియై మహార్ణవంబుం ద్రిప్పుమందరనగంబుచాడ్పునం గురుసేనం దిరుగుడుపఱుచుచుండె. అంత ధృష్టద్యుమ్నుఁడు ద్రోణునితోడం బోరుచుండినవాఁ డతనిం గ్రేడించి భీమసేను నరదంబు డాయవచ్చి యం దమ్మేటిదొరను గానక చింతాదూనమానసుండై తత్సారథి యగువిశోకుం బిలిచి బాష్పగద్గదస్వరమున నాకుం బ్రాణములకంటెం బ్రియుం డైనభీమసేనుం డెక్కడ యనియడుగ విశోకుఁడు కృతాంజలియై యతని కిట్లనియె. మహాబలుం డైనభీమసేనుఁడు తన్ను ధార్తరాష్ట్రులు పెక్కండ్రతో డ్పాటునం బెరిగి కవియుటయు ముహూర్తమాత్రం బిక్కడం దేరు నిలిపికొని యుండు మని నా కానతి యొసంగి గదాపాణియై యొక్కండ కురుసేనాసాగరంబుం జొచ్చినవాఁడు. మీచెలికాం డంపుం బోయినతోడన ప్రబలసమ్మర్దము పరమతుములంబై విననగుచున్న దనిన విని యప్పాంచాలరాజనందనుండు విశోకా, భీముం డొక్కఁడు దారుణరణమునం బోరాడుచుండ నే నూరక ప్రాణములం బెట్టికొని చూచుచుండినం బ్రయోజనంబు లేదు. వాని నొక్కని రణమున విడిచి యేను బోయితినేని క్షత్రియు లందఱు నన్నే మందురు. తనకుం దోడ్పడువారల రణమున విడిచి ప్రాణరక్షణతాత్పర్యమున నింటికిం జనువానికి దేవతలు కీడు గావింతురు. భీముఁడు నాకు నెచ్చెలి సంబంధి యత్యంతప్రియుండు. నేను నతనియెడ నతిశయితప్రేమసౌహార్దముల నెఱపుచుండుదును. కావున దానవనిషూదనోద్యతుం డైనసురేంద్రునిచందమునం గురువీరులం దలపడి పోరుచున్నభీమసేను నొద్దకుం బోయెద నని చెప్పి తదీయగదాప్రహారమునం బీనుంగులై పడినయేనుంగులతిట్టలజాడం జనియె. అట్లు చని యక్కడ మ్రాంకుల విఱుచుమహావాతంబుచాడ్పున వాజివారణపదాతివర్గంబుల నేలం గూల్చియు నుద్దండగదాదండమున వీరయోధులతలలు పగుల వ్రచ్చియుం బ్రతిభటులు హాహాకారములు సేయుచు వెఱచిపఱుచు తెఱంగున నేడ్తెఱ మెఱయుచుం గాలాంతకునిమాడ్కి గోధవిషముం గ్రక్కుచున్నవృకోదరుం గని ధృష్టద్యుమ్నుం డతని నూరడించి యపగతశల్యుం గావించి తనరథంబు నెక్కించికొని గాఢాలింగనంబుం జేసి మెల్ల వారును జూచుచుండఁగం దద్విక్రమంబుం గొనియాడుచుండె.

### ధృష్టద్యుమ్నునిమోహనాస్త్రమున ధార్తరాష్ట్రులు తెలివిదప్పుట.

అప్పుడు దుర్యోధనుండు తమ్ములకడ కేగి దురాత్ముం డైన ద్రుపదపుత్త్రుఁడు వృకోదరునకుం దోడ్పడ వచ్చినవాఁడు. ఇఁక నీదిక్కు రాకుండ నిప్పు డందఱును గూడి వీని రణక్షోణికి బలి చేయవలయు నని చెప్పుటయు నన్నమాటమెయి నీ కొడుకు లందఱు లయకాలధూమకేతువులట్లు రథనేమిఘోషములం బుడమి

గ్రక్కదల మౌర్వీనాదబంధురంబుగా నప్పాంచాలధురంధరుం దాఁకి వారిదపట లంబు గిరిశిఖరము నెట్టు లట్టుల బహుళశరాసారంబునఁ గప్పినం గోపించి యతం డు మోహనాస్త్రం బేయుటయు నీకొడుకులు తెలివి దప్పి తేరులపయి నొఱగిరి. అట్టియెడ నాచార్యుఁడు ద్రుపదునితోడఁ బోరుచుండి కాండత్రయమున నొప్పిం చిన నప్పాంచాలరాజు తొలంగి పోవుటయు శంఖముఁ బూరించి సోమకుల వెగ డుపఱిచి పాండవసైన్యంబుఁ గవియువాఁడు ధృష్టద్యుమ్నునిమోహనాస్త్రమున నీకొడుకులు తెలివి దప్పుట విని యతిరయంబున నేతెంచి కురుసైన్యంబుఁ గను పుకొట్టుచున్న భీమధృష్టద్యుమ్నులను విగతచేతనులై పడియున్ననీకొడుకులనుం జూచి కోపవిషాదభరితుండై ప్రజ్ఞాస్త్రమున నమ్మోహనాస్త్రము శాంతముఁ గావించి గాంధారేయులఁ బ్రత్యాగతచేతనులం జేసి భీమపార్షతుల మార్కొను టయు మధ్యాహ్నం బయ్యె. అట్టిమధ్యాహ్నసమయమున యుధిష్ఠిరుఁడు సౌభ ద్రప్రముఖు లయినపదునిద్దఱుమహారథులఁ బిలిచి నిస్సహాయులై యాచార్యప్ర భృతులతోడఁ బోరుచున్న భీమసేనధృష్టద్యుమ్నులకుఁ దోడ్పడుఁ డని నియమిం చుటయుఁ గేకయు లేవురును ద్రౌపదీపుత్రు లేవురును ధృష్టకేతుఁడును సుభ ద్రాసూనుపురస్సరులై బహుళసైన్యంబు తోడరాఁగఁ జని సూచీముఖవ్యూ హముఁ బన్ని కౌరవానీకంబుఁ జించియేపు చూపుచుండిరి. భీమసేనభయావిష్టయు ధృష్టద్యుమ్నమోహితయు నగుమనసేన సౌభద్రప్రముఖులకోల్తల కోహటించి చీకాకుపడి పెద్దయుఁ దెరువు నడిచి మూర్ఛిల్లినతరుణివోలెఁ జెయ్వులు దక్కి యుండె. అక్కరణిని విక్రమాటోపంబు సూపుచు నభిమన్యుప్రముఖులు కనకకేత నకాంతిరుచిరంబుగా భీమధృష్టద్యుమ్నులఁ దఱియఁ జనుటయు వారు వారలఁ జూచి సుప్రీతులైరి. అప్పు డాచార్యుఁడు పటురయంబున మార్కొనవచ్చుటయు ధృష్టద్యుమ్నుఁడు నీకొడుకులఁ జంపుట మాని వృకోదరుఁ గేకయరథము నధిరో హింపఁ జేసి తా నయ్యాచార్యుం దలపడియె. అంత నాభారద్వాజుండు రాజ ఋణముఁ దీర్చువాఁడై వాఁడిమి మెఱసి ధృష్టద్యుమ్నువిల్లు దునిమి బహుళ బాణముల నేయుటయు నప్పాంచాలరాజనందనుండు వేఱుచాపంబు గొని డెబ్బ దియమ్ముల నతనిపయిం బరఁగించె. అంపులకుఁ గోపదీపితుండై చాపగురుం డక్కోదండంబునుం దునిమి నాలుగుబాణముల వానితేరిగుఱ్ఱముల నాల్గింటిని జంపి యొక్కతీవ్రభల్లమున సారథిని యమసదనంబునకుఁ బంపుటయు విరథుఁడై యప్పాండవసేనానాయకుండు తేరు డిగ్గ నుఱికి యభిమన్యురథము నెక్కె. ఆచా ర్యుని కోల్తలకుఁ దిరుగుడువడినసేనలం గూర్పఁగ నమ్మహారథుల కందఱకు నలవి గాకుండె. మనవారు సంతసంబునం బొదలిరి. చూప ఱబ్భారద్వాజువిక్రమంబుఁ బొగడిరి.

### దుర్యోధనాదులు తెలివిఁ బొంది భీమసేనుం గవియుట.

అంతలోన నాచార్యుఁ డేసినప్రజ్ఞాస్త్రమున నీకొడుకు లందఱు విగతమోహు లగుటయు దుర్యోధనుఁడు తమ్ములును దానును భీమసేనుని డాఁకిన నతండును వారల మార్కొని బహుళశిలీముఖము లేసినం గినిసి రారాజు క్రూరనారాచమున నతని నొ నేసె. అంతఁ గ్రోధదీపితుండై వృకోదరుండు శరత్రయమును దుర్యోధనుభుజద్వయమునను వక్షస్థలమునను౦ గీలించిన నందులకు ధరాధరేంద్రంబుపగిది నచలుండై యతఁడునిలుచుటయు నయ్యిరువురకుఁ బోరు ఘోరం బయ్యె. అట్టియెడ దుశ్శాసనాదు లగుదుర్యోధనానుజులు తమపూర్వమంత్రణముఁ దలపోసి నిస్సహాయుండై యున్న యాభీమునిఁ బట్టి బంధింపఁ దలఁచి ప్రాణములకుఁ దలఁకక యొక్కపెట్ట యందఱుం గూడముట్టుటయు వారలఁ జూచి యప్పవనసూనుండు కరిగణములపయిం గవియువన్యగంధసింధురంబుచందమున వారల నందఱను మార్కొని వివిధమార్గణముల నొప్పించుచున్నంత సౌభద్రప్రముఖు లగు నాపన్నిద్దఱుమహారథు లతనికిఁ దోడ్పడుటయు నాధనుర్ధరవరులం జూచి నీకొడుకు లనికిఁ దొలఁగి పఱచిరి. భీమసేనుఁడు వారలు తొలఁగి బ్రదికిపోవుటకుఁ జింతిల్లుచుండ ధృష్టద్యుమ్నాదిసమేతుఁడై యభిమన్యుఁ డప్పవమానసూనుం బురస్కరించికొని దుర్యోధనాదులం దఱుముటయు వారు మఱలి దురంబు సేయుచుండ నపరాహ్ణం బయ్యె. అప్పుడు సౌభద్రుఁడు వికర్ణుతేరిగుఱ్ఱములఁ జంపి యిరువదేనుతూపులు వానిమేనం బరఁగించిన నతండు చిత్రసేనునితేరెక్కె. అంత వికర్ణచిత్రసేనదుర్జయు లుక్కుమిగిలి యాసుభద్రానందనుతోడఁ బోరుచుండిరి. దుశ్శాసనుఁడు కేకయుల నేవురను మార్కొని యద్భుతం బావహిల్ల సమరంబు సలిపె. ద్రౌపదేయు లేవురు దుర్యోధనుం డాఁకి యొక్కొకఁడు మూఁడేసి శరముల నతనిపై నేయుటయు దుర్జయుఁ డన్నకు మిగిలి తాను వారలపైఁ గ్రూరశరములం గురిసినం గినిసి వారు తీవ్రబాణముల నతనిమేనం గీలించిన నక్కుమారుఁడు నెత్తుటం జొత్తిల్లి గైరికాదిధాతుపటలపాటలనిర్ఝరీపరీతధరిత్రీధరంబుచందమునం బొలిచె. అయ్యవసరమున మొగ్గరంపువలపటిదెసఁ గపిధ్వజుండు గాండివజ్యాఘోషభీషణంబుగఁ గవిసి వివిధవిశిఖనికరంబుఁ బరఁగించి లయసమయరుద్రునిమాడ్కి రౌద్రమున మెఱసి యేత్తెఱ నెఱపుటయు నాదెస నెక్కడఁ జూచిన రక్తసిక్తసర్వాంగములై నేలం గూలి శైలంబులరీతి నొప్పెడిమత్తమాతంగంబులును విచ్ఛిన్నగాత్రంబులై పడినతురంగంబులును విఱిగి వికలంబులై యున్నరథంబులును దలలు దెగఁ గవచములు దునియ భుజములు విఱుగం బడినకాల్బలంబునై సంగ్రామరంగంబు బీభత్సంబై యుండ శోణితజలంబు శరావ ర్తంబు గజద్వీపంబు తురంగతరంగంబు నగుసేనాసాగరంబు మనమహారథవరే

ణ్యులకు రథనౌతార్యం బయ్యె. అమ్మేటివిలుకాని మార్కొనంగ మనవారిలో నొక్కఁడునుం గడఁగఁడయ్యె. అంతఁ బ్రొద్దుగ్రుంకఁ దఱియుం దఱియవచ్చె.

భీముఁడు దుర్యోధను నధిక్షేపించి పోరి విరథుంజేయుట.

అప్పుడు దుర్యోధనుండు భీమసేనజిఘాంసాయత్తచిత్తుండై రభసంబున నతనిదెసకుఁ దేరు వఱపించినం గోపించి యాకీచకాంతకుం డిట్లనియె. రాజాధమా, వినుము. ఏండ్లుపూండ్లు పూఁచిపట్టినయాలం బిప్పటికి సమకూఱె. తొలఁగక యనిమొన నిలుతువేని ప్రాణములఁ గొనియెద. నీవు కుంతిదేవియెడ నొప్పమి చేసితివి. పాపపుజూద మాడి మ మ్మడవులకుఁ బంపి సంకటపఱిచితివి. ద్రౌపదిని సభామధ్యమున భంగపఱిచితివి. పుట్టిననాఁటంగోలెఁ గర్ణసౌబలులమతమున మచ్చరంబు వట్టి నిచ్చలు మాకుఁ గీడులే చేసితివి. పడరానిపాట్లల్లఁ బడి మేము కురుకులక్షేమంబుఁ గోరి సకలలోకపూజార్హుం డైనదాశార్హుని సంధి పొంటెఁ బంపఁగా నద్దేవదేవుని కెగ్గు చేసితివి. బిరుదుమగవానిపోలె నులూకుచేఁ గొన్ని పరుసంబులు చెప్పిపుత్తెంచితివి. ఆపాపంబులెల్ల నడంగిపోవ నేఁడు నిన్నును నీకుఁ గూర్చుసుహృద్బాంధవులనుం బొరివుత్తు ననిపలికి విల్లెత్తి వజ్రసన్నిభంబులయినముప్పదియాఱు ఘోరశరముల నతనిమేనం గీలించి రెంట విల్లు దునిమి మఱియు రెంట సారథిం జంపి నాలుగింట నశ్వచతుష్టయంబును సమయించి వెండియురెంట నాతపత్రంబు నఱికి మూఁటఁ గేతనంబుఁ ద్రుంచి సింహనాదంబుఁ గావించె. భీమసేనశరనికృత్తం బై మణిమయనాగేంద్రకేతనంబు మేఘమండలంబుఁ బాసినమెఱుంగుతెఱంగున నేలం గూలె. అంతకుఁ దనివి సనక బకాంతకుండు దరహాసంబు వదనంబునఁ దనరఁ దీవ్రాంకుశమున మత్తగజంబునుంబోలె నిశితశరశతమునఁ బొడుచుటయుఁ దదీయశరపీడితుండై దుర్యోధనుండు తేరిపై నొఱగఁ బడినం జూచి కృపాచార్యుండు తనతేరెక్కించికొనియె. అట్టియెడ జయద్రథుఁడు వేనవేలురథములు దన్నుఁ బరివేష్టించిరాఁగ భీముం దాఁకి శరపరంపరలు గురియించుటయు వారిపోరు ఘోరం బయ్యె. అంత నక్కడ సౌభద్రప్రభృతు లగు పన్నిరుగురుమహారథులకును నీకొడుకులకుం గయ్యంబు సెల్లుచుండ నభిమన్యుండు మన్యువశుండై సురాసురసమరసముద్ధతుం డైనవజ్రపాణివిధమునం బేర్చి వారల నొక్కొక్కని నై దేసివాఁడితూపుల నొ నేయుటయు నలిగి వా రందఱు నతనిం జుట్టుముట్టి మేఘబృందంబులు మేరుగిరింబోలె శరజాలమునఁ గప్పినం గోపించి యయ్యర్జునతనయుండు పదునాలుగుశరముల వికర్ణునిరథ్యసారథికేతనంబులం గూల్చి వానిమేనఁ బటుభల్లంబులు నాటుటయు నయ్యవి తదీయకవచంబు సించి నెత్తురు లురులించి శోణితధారాపరీతంబులై యయ్యాహవక్షోణికి మండనం బయ్యె. అయ్యెడరు నూచి తక్కటినీకొడుకు లవ్వీరుం దలపడి వానికో త్తులకోహ

టించి చెయ్వులు దక్కిరి. అంతదుర్ముఖుఁడు శ్రుతకర్మను మార్గణని యొక్కబాణ మున ధ్వజముఁ గూల నేసి యాఱింట గుఱ్ఱములఁ జంపి యేడింటి సారథిం బొరి వుచ్చి యెదింట నయ్యర్జునపుత్రుని నొప్పించిన నాద్రౌపదీసూనుఁ డనూనకోపదీపి తుండై మండుచున్నకొఱవితెఱఁగున భీకరం బైనశక్తిని నేయుడు నది దుర్ము ఖుమెయిమఱువు దూరి మేను రక్తసిక్తంబుఁ గావించె. విరథుఁడై నయయ్యర్జునపు త్రుని భీమపుత్రుం డైనశ్రుతసోముఁడు నిజరథం బెక్కించికొనియె. ద్రౌపదే యుం డైనశ్రుతకీర్తి భవత్పుత్రుం డైనజయత్సేనుం దలపడి పోరుచున్నంత నీ కొడుకు గండుమిగిలి వానివిల్లు దునిమినం జూచి శతానీకుఁడు తాను వానికిఁ దల కడచి మనజయత్సేనుం దాఁకి యార్చి పేర్చి వానిఱొమ్ముఁ గాఁడ నేయుటయు దు ష్కర్ణుం డానకులపుత్రునిచాపముఁ ద్రుంచె. త్రుంచినం గినిసి యతం డొండువి ల్లెత్తి నిలునిలు మనియదల్చి క్రూరనారాచములఁ బరఁగించి యొక్కబాణమున వానిశరాసనముఁ దెగ నేసి రెంట సారథిని సమయించి పంద్రెంటఁ గల్మాషవర్ణం బు లయిన రథ్యములఁ దెగటార్చి నిశితభల్లమున వక్షోభాగంబుఁ గాఁడ నేయు టయు వాఁడు గతచేతనుఁడై తేరిమీఁద నొఱగె. అప్పుడు శతానీకుం జంపు వారై నీకొడుకులు శరాసారముఁ గురియుచు వానిమార్గణనం జూచి కేకయ రాజు లేవురు నానకులసుతునకు బాసట యగుటయు నీకొడుకులు దుర్ముఖ దుర్జ యదుర్మర్షణశత్రుంజయశత్రుసహు లయ్యేవురుదొరలఁ దాఁకినం గయ్యంబు పరమదారుణంబయి చెల్లె. అప్పుడు సూర్యుఁడు పడమటఁ గ్రుంకుటం జూచి కు రుపితామహుండు కొండొకవడి పాంచాలసేనలఁ బెక్కండ్రఁ బొలియించుచుండి సూర్యుఁడు గ్రుంకఁగఁ జీఁకట్లు గ్రమ్ముటఁజేఁ దమసేనలఁ దివియించి శిబిరమున కరిగె. ధర్మనందనుండును భీమసేనధృష్టద్యుమ్నుల నెంతయుఁ గొనియాడుచు సక లసైన్యపరివృతుండై నిజశిబిరమున కరిగె.

దుర్యోధనుఁడు భీష్మునితోఁ దనపరిభవంబుఁ జెప్పుకొనుట.

అవ్విధమున నందఱుఁ దమతమవీడుపట్లకుఁ జనినపదంపడి దుర్యోధనుం డయ్యాఱవనాఁటికయ్యంబునఁ బెద్దయు డయ్యుటం జేసి చింతాదూనమానసుండై పితామహుపాలికిఁ జని యిట్లనియె. మహాత్మా, శాస్త్రోక్తవిధానమున మనము మ కరవ్యూహంబుఁ బన్ని యరాతిభీకరంబుగ మోహరించియుండఁ బాండవులు మృత్యుదండసంకాశంబు లత్యంతప్రకాశంబులు నగువిశిఖంబులఁ బరఁగించి మొ గ్గరంబు భేదించి మనవారలనెల్ల వెగడుపఱిచిరి. భీముఁడు నీయెదుటన నన్నుఁ బరి భవించె. తదీయబాణప్రహారంబున నెత్తుటఁ జొత్తిల్లి మూర్ఛితుం డైననే నిప్పటికిని లెస్స సేద దేఱనయ్యెద. కోపారుణితనేత్రుఁ డగుకాలాంతకుచందమునఁ బొలుచునావృకోదరుఁ జూడ నోడుదు. నీవు గెలిపింతు వనినమ్మి పోరికిఁ దొడఁ

గిననాకు విజయం బాపాదింపుము. పాండవులం గరుణింపక తెగటార్పు మని తెల్పిన విని మందాకినీనందనుండు భవన్నందను కోపవిషాదము లెఱింగి నగుచు నిట్లనియె. కుమారా, సర్వవిధముల నీకు గెలుపును సౌఖ్యమునుం గావింపఁ గోరి యేను మిక్కిలికడంకతోఁ బరసైన్యంబుఁ జొచ్చి యోపినకొలంది యేపు సూపుచున్నవాఁడఁగాని యెకప్పుడైనను బ్రాణముల దాఁచుటగలిగెనే? పాండవు లలఁతులఁ బోవువా రని తలంపవలదు. వారికిఁ దోడ్పడినవా రందఱును మహారథులును శూరశేఖరులును గృతాస్త్రులును జితశ్రమములును గీర్తిమంతులును నీ యెడఁ బెద్దయుఁ బగ పాటించినవారును గావునఁ గ్రోధముఁ గ్రక్కుచుఁ బోరుచున్నవారు. నీతదర్థంబు నేను జీవితాశఁ దొఱంగి దేవదానవులనేనియుఁ జంపుదునని పూనినవాఁడను. నీశత్రువులఁ బరిమార్పఁ గడంగకుండుదునే? నేనును ద్రోణుఁడును శల్యకృపకృతవర్మాశ్వత్థామజయద్రథబాహ్లికసోమదత్తవిందాను విందసుశర్మమాగధబృహద్బలవికర్ణచిత్రసేనప్రముఖు లగుమహారథులును సకల చతురంగబలములును నీకై జీవితములఁ ద్యజింప నాయితపడియుండుట నీవు నెఱుఁగుదువుకదా. వీరు దేవత లెత్తి వచ్చినను గెలువ నేర్తురు. అయిన నిం కొక్కటి చెప్పెద వినుము. నీహితంబుఁ గోరిననా కది చెప్పక యూరకుండఁ జనదు. పాండవులు దేవదానవాదుల కేనియు నజేయులు. అట్టివారికి వాసుదేవుఁడు సహాయుఁడఁట. ఇఁకఁ జెప్పనేల? అయినను నీమాటమెయి వారితోడఁ బోరాడెద. వారల నేను గెలుచుటయొండె నన్ను వారు గెలుచుటయొండెఁ బొసఁగుఁగాని నిక్కంబుగ వారల నేన గెల్తు ననిచెప్ప నలవి గా దనిపలికి విశల్యకరణి యనునోషధి నిచ్చి విగతవేదనుం గావించుటయు దుర్యోధనుఁడు విగతశల్యుం డై యప్పితామహువచనములకు ముదంబునం బొదలుచు నిజనివాసంబునకుఁ జని యారాత్రి సముచితప్రకారమునఁ గడపె.

## ఏడవనాఁటియుద్ధము.

అంత నమ్మఱునాఁటివేకువ దేవవ్రతుండు దండు గూర్చికొని భండనాంగణమునకుఁ జనుదెంచి యొక్కొకయేనుంగున కేడురథము లొక్కొకరథమున కేడేసిగుఱ్ఱము లొక్కొకగుఱ్ఱమునకుఁ బదుగుఱువిలుకా డొక్కొక్కవిలుకాని కేడుగురుపదాతులునుగా సైన్యం బమర్చి యయ్యైచోట్ల నాయాయిపడవాండ్ల నుండ నియమించి దేవగణపరివేష్టితుం డైనదేవేంద్రునిచందమున ననేకవీరరథికపరివృతుం డైనసుయోధనుని మధ్యభాగమున నిలిపి మండలవ్యూహంబుఁ గావించి చిత్రసేనాదు లగుపదివేవురురథికులు దోడ్పడఁ దాను సేనాముఖంబునం బొలిచిన నమ్మోహరంబు వివిధవాద్యనాదంబులును శంఖారవంబులును రథనేమినిస్వనంబులును మౌర్వీఘోషంబులును సింహనాదంబులును నింగి ముట్టఁ గయ్య

మునకుఁ గట్టాయితంబై యుండునంత ధర్మనందనుండు కురుసైన్యముఁ జూచి తమదండు వజ్రవ్యూహమున సమర్పఁగఁ బడవాళ్లఁ బంచిన వారు తత్ప్రకార మున నమర్చి యార్చి పేర్చుటయు నాలంబు పరమాభీలంబై చెల్లె. అప్పుడు ద్రోణాచార్యుఁడు విరాటుని, నశ్వత్థామ శిఖండిని, దుర్యోధనుఁడు ధృష్టద్యుమ్ను ని, మద్రపతి మాద్రేయులను, విందానువిందు లిరావంతుని, జేయంగల మహా రథులు పెక్కండ్రు ధనంజయునిం దాఁకిరి. భీమసేనుండు కృతవర్మను మఱియుం బలువుర బలియురను, సౌభద్రుండు చిత్రసేనవికర్ణదుర్మర్షణులను, ఘటోత్క చుఁడు భగదత్తుని, సాత్యకి యలంబుసుని, ధృష్టకేతుఁడు భూరిశ్రవసుని, యుధి ష్ఠిరుండు శ్రుతాయువును, జేకితానుండు కృపాచార్యునిం, దలపడిరి. అట్టియెడఁ గిరీటి వాసుదేవుం బిలిచి గాంగేయుండు నేర్పునం బన్నినకతన సుశర్మాదు లగు వీరులు యుద్ధకాములై యున్నవారు. చూడుము. నీయెదుట వీరినెల్ల నొక్కమా త్రన తెగటార్చెద ననిపలికి గొనయంబు సారించి విశిఖజాలంబుఁ బరఁగించిన న్వాలుకా అందఱును బ్రావృట్పయోధరంబులు మేరువునుబోలె శరాసారమున నతనిం బూరించినం గృష్ణార్జునులు తదీయశరసంఛన్నులై యదృశ్యులైరి. అప్పుడు మనసేనల హాహాకారంబు లెసఁగె. దేవగంధర్వ మహర్షిప్రముఖులు విస్మయముఁ బొందిరి. అందుల కత్యంతకోపాటోపదీపితుండై మహేంద్రనంద నుం డైంద్రాస్త్రంబుఁ బ్రయోగించిన నమ్మహాసాధనంబు మార్తురమార్గణగణం బుల ముహూర్తమాత్రన మాయించి సకలబలంబులను నెత్తుటఁ జొత్తిల్లఁ జేసె. ఏమి చెప్పుదు నం దొక్కఁడైనను దప్పించికొననేరఁ డయ్యె, అట్లద్భుతం బావ హిల్ల సవ్యసాచి పోరుచుండ గత్యంతరముఁ గానక వెఱచి పఱచి మనవారు పితామహునిమఱుఁగు సొచ్చిరి. అట్లు సుశర్మాదు లర్జునున కోడి పాఱుటయు బల ములెల్ల సంక్షుబ్ధంబు లగుటయుం జూచి గాంగేయుండు విజయుం దలపడ నతి త్వరితగతిం బోవుచుండఁ గురురాజు విక్రమాటోపదుర్నిరీక్షుం డైనపార్థుం దాఁకునెడఁ బితామహునకుఁ బెక్కండ్రుమహారథులఁ దోడ్పాటుపఁ దలఁచి సుశ ర్మను బిలిచి యందఱు వినంగ నిట్లనియె. కురుకులధుర్యుం డైనగాంగేయుండు జీవితాశం దృజించి ధనంజయు మార్కొనఁ బోవుచున్నవాఁడు. మీ రందఱు నతనికిఁ గావలియై నడుచుట మే లనిన నట్ల యని వారందఱుం గ్రమ్మఱి మరు న్నదీనందనునకు బాసటయై యరిగిరి. అట్లు వచ్చుచున్నభీష్ముం జూచి గాండీవి కేతనకపిప్రభలు సెలంగ నమ్మేటిమగనిం దాఁకుటయు నర్జునభయంబునం జేసి మన సైన్యంబుల నినాదంబు పరమతుములంబై పరఁగె. మనవారు సవ్యసాచితేరి నొగలపయిం గూర్చుండి యుగ్యంబులపగ్గంబులఁ జేతఁ బూని పట్టపవ లింటి భానునిచాడ్పునఁ దేజరిల్లు జనార్దనుని బాండవులు శ్వేతహయకా

ర్మకవిలసితుఁడై శ్వేతగ్రహంబుభంగిని వెలుంగుచున్న గాంగేయునిం జూడ నోడిరి. అప్పుడు త్రిగర్తసేనాపరివృతుం డైనదేవవ్రతునకును సవ్యసాచికిని ఘోరసంగ్రామంబు చెల్లె. ద్రోణాచార్యుఁడు విరాటుం దలపడి యొక్కబాణము నఁ గేతుదండముఁ గూలనేసి వేఱొక్కట విల్లు దునిమిన నతండు వేఱువి ల్లెత్తి జ్వలితపన్నగంబులంబోనియమ్ములు పెక్కు లేసి మూఁడువాఁడితూపుల నయ్యా చార్యుమేనం గీలించి యైదింట సారథిని నొప్పించి నాలుగింట గుఱ్ఱముల నొ నేసి యొక్కొక్కబాణమునఁ గేతనకోదండముల బిట్టేయుటయు నాద్విజోత్తముఁ డు కోపించి యవ్విరాటురథ్యముల నెనిమిదింట సమయించి యొక్కవాలికయ మ్మున సారథిం గూల్చిన నమ్మత్స్యపతి తనతేరు డిగ్గ నుఱికి రయమున శంఖునిరథ మెక్కి యక్కుమారుఁడును దానును బెక్కునారసంబులఁ గురియుటయు నాచా ర్యుం డలిగి యాశీవిషోపమం బైనక్రూరనారాచంబు శంఖునిఱొమ్ముఁ గాఁడ నేసి నఁ దద్బాణవిద్ధుఁడై యవ్విరాటరాజసుతుఁడు రక్తసిక్తగాత్రుండై విల్లమ్ములం దిగవిడిచి తండ్రి చూచుచుండ నేలఁ బడి గతాసుఁ డయ్యె. కాలాంతకునిపోలె భీకరుఁ డైనయాభారద్వాజునెదుర నిలువ నోడి విరాటుఁడు కాందిశీకుఁ డయ్యె. ద్రోణుఁడు పాండవసేనలప్రాణముల బాణానలమునఁ బీల్చుచుండె. శిఖండి యశ్వ త్థామను దాఁకి భ్రూమధ్యమున మూఁడువాఁడినారసముల నాటుటయు నతండు సమున్నతకాంచనశిఖరత్రితయసముల్లసితం బయినమేరుగిరి ననుకరించుచుఁ గో పారుణితనేత్రుండై యరనిముసంబులోన బాణజాలంబుఁ గురియించి రథరథ్యకే తనసారథులం గూల్చుటయు వాఁడు వాలును బలుకయుం గొని తేరు డిగ్గి పులుఁ గుపయి నురువడించుడేగచాడ్పున నత్యద్భుతప్రకారమునఁ దిరుగుచు నాచార్య పుత్రుఁ డేయుశరజాలమునెల్లఁ గరవాలమున నఱుకుచుఁ గోల్తల సేయుచుండె. అంత నశ్వత్థామ కరలాఘవము మెఱయ నంపసోనం గురియుచుచు వానిఖడ్గచ ర్మములఁ దునియలు గావించుటయు నప్పాంచాలరాజపుత్రుఁడు సాత్యకితేరెక్కె. సాత్యకి యలంబుసుం దాఁకి పటుశరములఁ గురియుచుండ నారాక్షసేశ్వరుఁ డర్ధ చంద్రబాణమునఁ దత్కోదండముఁ దునిమి రాక్షసమాయఁ గావించి యెక్కడఁ జూచిన రణరంగము శరమయంబుఁ గాపించుటయు వెగడుపడక సాత్యకి యద్భుతం బావహిల్ల నొండువిల్లు గ్రహించి యర్జునానుగ్రహలబ్ధం బయినయైంద్రాస్త్రిం బు సందీపితంబుఁ గావించి యమ్మాయయెల్ల మాయించి కార్మొగులు వారిధారలఁ బర్వతంబునుంబోలె ఘోరశరాసారముల ముంచిన వెగడుపడి సురేంద్రునకు నవిజేయుం డైనయాదైతేయుఁడు వెఱచి పఱచె.

దుర్యోధనుఁడు ధృష్టద్యుమ్నునిచే విరథుఁ డగుట.

అట్టియెడ ధృష్టద్యుమ్నుఁడు దుర్యోధనుం దలపడి బహుళవిశిఖములఁ గప్పి

నం జలింపక రారాజు పరమాద్భుతంబుగఁ దొంబదియమ్ముల నతనిపై నేయుటయు
నప్పాంచాలవరుండు కడుం గినిసి దుర్యోధనువిల్లు దునిమి శరసప్తకంబున హయ
చతుష్టయముం గూల్చిన నిహతాశ్వుం డైనతేరు డిగ్గ నుఱికి కృపాణపాణియై య
ప్పాండవసేనాపతిం దలపడుచుండునంత శకుని తా నడ్డంబు చని తనతేరెక్కించి
యనికిఁ దొలఁగించె. అట్లు దుర్యోధను నోడించి ప్రబలపరాక్రమసముదగ్రుండై
ధృష్టద్యుమ్నుండు సురేంద్రుఁ డసురసేనంబోలె మనసేన నెల్లఁ జిందఱవందఱ
గావించుచుండ భీముఁడు కృతవర్మం దాఁకుటయు నయ్యాదువర్యుం డతనిపయిం
బెక్కుబాణముల నేయుటయుఁ గోపదీపితుండై కిమ్మీరవైరి యతని తేరిగుఱ్ఱము
లను సారథినిం జంపి బహువిశిఖముల మేనం గీలించిన నాహార్దిక్యుఁడు తదీయ
బాణవిద్ధుండై నీకొడుకు సూచుచుండఁగనె నీమఱంది యగువృషకునితేరెక్కి
తొలఁగి చనియె. భీముఁ డంతి నంతకాకారంబునఁ బొల్చుచు మనసేనల నుఱు
మాడుచుండె ననిన విని యాంబికేయుండు సంజయా, నీ వెప్పుడును బాండవు
లజయసంతోషములను మనవారిపరాజయదుఃఖములనుం జెప్పెదవు. అల్పబలు
లయ్యును వారు ప్రబలబలు లయినమనవారలం గెలువఁగ దైవ మొక్కండె
కారణంబుగా నోపునెకో యనవుడు సంజయుఁ డతని కిట్లనియె. మనవారు శక్తి
కి నుత్సాహమునకుఁ బౌరుషమునకును దగినరీతిం బోరుచున్నవారు. ధర్మము పాం
డవుల గెలిపించుచున్నది. స్వాదువయ్యు గంగాజలము సముద్రమునఁ గలిసి తన
స్వాదుత్వంబుఁ దొఱఁగిన తెఱంగున మనవారు శూరులయ్యుఁ బాండవులఁ గ
లిసి తమపౌరుషంబుఁ దొఱంగుచున్నవారు. ఓపినకొలఁది పోరుచున్నవారియెడ
నేల దోష మారోపించెదవు? నీవును నీకొడుకులును జేసినయనయముననే రాజ్య
నాశనం బయినయీఘోరక్షయంబు పొసఁగె. ఆత్మాపరాధంబునకు శోకింప నేల?
ఇప్పటికిని రాజులు ప్రాణములు నైన విడుతు మని తెగువఁ బూని వీరస్వర్గకాంక్షం జే
సి విక్రమించుచున్నవారుగాని యొండు గాదు. అది యట్లుండె. సమాహితచిత్తుండ
వై సమరప్రకారం బవధరింపుము. ఏడవనాఁటిపూర్వాహ్ణమున నట్లు పోరు సెల్లుచు
న్నంత నవంతిపతు లగువిందానువిందు లిరావంతుం దాఁకి శితశరముల నతనిపయిం
బ్రయోగించి యద్భుతంబుఁ జూపుటయుఁ గోపదీపితుండై నాలుగమ్ముల ననువిం
దు తేరిగుఱ్ఱములఁ జదిపి తీక్ష్ణభల్లమునఁ గేతనకోదండములఁ దునిమిన నతండు
విందుతేరెక్కె. అంత నయ్యన్నదమ్ము లిద్దఱు నేకరథారూఢులై రవిమండల మ
దృశ్య మగువిధమున శరాసారంబుఁ గురిసిన నయ్యర్జునాత్మజుండు క్రోధారుణి
తనేత్రుండై వారలఁ బటుశరజాలమున నొంచి సారథితలఁ ద్రెవ్వ నఱుకుటయుఁ దదీ
యరథ్యములు తేరీడ్చుకొని పాఱిపోయె. అవ్విధమున నానాగరాజసుతాసుతుం
డవంతిపతులం గెలిచి కోల్తల సేయుటయు మనసైన్యము విషముఁ ద్రావిన

చందమునఁ జెయువులుదక్కి యుండె. ఘటోత్కచుండు రజతవర్ణరథారూఢుండై
భగదత్తుం దాఁకిన నాప్రాగ్జ్యోతిషేశ్వరుఁడు సుప్రతీకం బనుతనయేనుంగు నెక్కి
మార్కొనుటయు వారిపోరు దేవదానవసంగరంబుభంగిఁ గొంతవడి చూచుఖేచ
రులపొగడ్తకుఁ బాత్రం బయ్యె. అంత భగదత్తుఁ డుక్కుమిగిలి శరపరంపరలు
పరఁగించినం బాండవసైనికు లందఱు వెఱచి పఱచిన మనసేనల నార్పులు
సెలంగె. ఘటోత్కచుఁ డందులకుఁ గోపించి మేఘము మేరుగిరింబోలెఁ బ్రా
గ్జ్యోతిషపతిం బటుకాండజాలమున ముంచుటయు నాతం డలిగి వానికెల్ల మా
ఱుసేసి యయ్యసురసర్వాంగముల నిషుగణంబులఁ గీలించి నొంచిన నతం డందుల
కుఁ జలింపక కొండవ్రాలె ధీరుండై నిలిచి విక్రమించుటయు భగదత్తుఁడు చతు
ర్దశతోమరములు వానిపై నేసె. హిడింబానందనుం డంత వానిం దునియలు
గావించి భగదత్తగాత్రంబున వజ్రసన్నిభంబు లయినడెబ్బదితూపులు నాటినఁ
గడుం గినిసి యారాజు నవ్వుచు వానిగుఱ్ఱముల నాల్గింటిని జమునిప్రోలి కనుచు
టయు రాక్షసేశ్వరుఁడు హతహయ మగునరదమున నుండి శక్తిం బ్రయోగించె.
అట భగదత్తుఁడు తనపయిం బడవచ్చుచున్నయాశక్తిని మూఁడుతునియలుగ
నఱకుటయు హైడింబుఁడు పురందరునకు నముచి యెట్లట్ల వానికి వెఱచి పాఱె.
అత్తెఱంగున దేవతలకేనియు నవిజేయుం డై నఘటోత్కచుం గెలిచి ప్రాగ్జ్యోతిషే
శ్వరుండు తనయేనుఁగును బాండవసేనపయిం బురికొల్పుటయు నది వన్యమత్త
సింధురంబుచేతికిఁ జిక్కినతమ్మితీఁగ మాడ్కి వికలం బయ్యె.

### శల్యుఁడు కవలతోడఁ బోరి మూర్ఛితుఁ డగుట.

శల్యుఁడు నకులసహదేవులఁ దాఁకి శరనికరంబుఁ బరఁగించినం గినిసి స
హదేవుఁడు మామను దలపడి విశిఖజాలముఁ గురియుటయు నల్లునివింటినేర్పునకుఁ
జిత్త మెలర్పఁగ నతండు నవ్వుచు నాలుగుబాణముల నానకులునితేరిగుఱ్ఱముల
నాల్గింటిం బరిమార్చిన నతం డయ్యరదము డిగి యనుజునితే రెక్కె. అట్లన్నద
మ్ములిద్దఱు నొక్కతేరిపయిం బొలిచి గొనయమ్ములు సారించి యొక్కపెట్ట పెక్కు
బాణము లేయుటయు నందులకుఁ జలింపక మద్రేశ్వరుం డవలీల నయ్యమ్ములం
బ్రతివిశిఖములఁ దునుమాడుచుండ నత్యంతకోపదీపితుండై సహదేవుఁడు క్రూర
భల్లమ్ము గొని మామమేనుం గాఁడ నేసిన నతండు మూర్ఛితుండై తేరిమీఁద
నొఱగఁబడినం దదీయసారథి తేరు దొలఁగించె. శల్యుఁడు మూర్ఛితుఁ డగుటకు
మనవారు విన్నఁబోయిరి. మాద్రేయులు సంతోషంబుపెల్లున శంఖములఁ
బూరించి సింహనాదములు గావించి దైత్యసేనం గవియునింద్రోపేంద్రులచంద
మున మనసేనం గవిసి కోల్తల సేయుచుండ మధ్యాహ్నం బయ్యె. అప్పుడు
ధర్మరాజు శ్రుతాయువును దాఁకి తొమ్మిదివాలికయమ్ముల నేసిన వానిం దునిమి

యతం డతనిపయి నేడువాఁడితూపుల నేయుటయు ధర్మరాజు తద్బాణవిద్ధుఁడై నెత్తుటఁ జొత్తిల్లి యత్యంతక్రుద్ధుఁడై వరాహకర్ణమార్గణంబు వానిఁబొమ్మున నాటి యొండొకభల్లంబునఁ గేతుదండంబుఁ గూల్చె. తనకెక్కుముపాటునకుఁ గడుం గనలి శ్రుతాయువు పాండవాగ్రజుమేన శరసప్తకంబుఁ గీలించిన మిగుల నలిగి ధర్మరాజు యుగాంతజ్వాలాజాలకరాళుం డై నయనలునివిధంబునఁ దేజో దుర్నిరీక్షుండై వెలుంగుచుండ నతనికోపావేగంబునకుఁ దలఁకి దేవగంధర్వదాన వాదు లీనృపాలుఁడు క్రోధమున మూఁడులోకముల దహింపఁ జాలినవాఁ డేమి గానున్నదో యని వ్యాకులతం బొందిరి. సకలభూతములును నివ్వెఱఁ జెందె. అప్పుడు లోకములకు సేఁగి పొసఁగకుండ శాంత్యర్థము దేవర్షులు స్వస్తి వచించిరి. మనసైన్యము లామహీపాలునాకారంబుఁ జూడ నోడి జీవితమున నాశ మాని చింతిల్లుచుండె. అంతఁ గొంతవడికి ధర్మరాజు ధైర్యమునఁ దాన కోపము డగ్గఁ ద్రావి శ్రుతాయువువిల్లు దునిమి గుఱ్ఱముల సమయించి సారథిం జంపి వాఁడినా రసమున బొమ్ముఁ గాఁడ నేయుటయు శ్రుతాయువు తేరు డిగ్గ నుఱికి ప్రాణరక్షణ తాత్పర్యమున నందఱుఁ జూచుచుండఁగ వెఱచి పఱచె. ధర్మజుకోల్తల కోహ టించి మనమూఁకలు పరాఙ్ముఖంబు లయ్యె. చేకితానుఁడు కృపాచార్యుం దల పడి శరనికరంబుఁ బరఁగించిన నతం డలిగి వానివిల్లు దునిమి గుఱ్ఱములం జంపి సారథిం దెగటార్చి చక్రరక్షకులఁ బరిమార్చిన నయ్యాదవవరుండు గదాపాణియై రథంబు డిగ్గి వృత్రవధోద్యతుఁ డై నపురందరునివిధమునఁ బొలిచి యతనిగుఱ్ఱము లను సారథినిం జదియ మోఁదినం గోపించి కృపాచార్యుఁడు పదునాఱువాల మ్ములు వానిమేన నాటుటయు నతండు తత్ప్రహారమున రక్తసిక్తాంగుఁడై కడునలిగి యాగదం గ్రమ్మఱఁ గృపుతేరిపయిం బడ నేసె. కృపుఁడును దానిఁ దునియలు గావించిన నతండు లాఘవమునఁ దేరిమీఁదికరవాలంబుఁ గొని గౌతముఁ దల పడుటయు నాద్విజుండును గృపాణపాణియై యతనిం దాఁకుటయు నయ్యిరువురు శూరులు కొండొకసేపు కృపాణవినోదంబు సల్పి పరస్పరనిస్త్రింశప్రహారముల నొచ్చి నేల కొఱగుటయుఁ గరకర్షణుఁడు చేకితానుని దనతే రెక్కించుకొనియె. శకుని కృపాచార్యునిఁ దనతే రెక్కించికొనియె. ధృష్టకేతుఁడు భూరిశ్రవసుని దాఁ కి తొంబదియమ్ములు బొమ్మున నాటుటయు నాసోమదత్తతనయుఁడు కిరణమాలా పరీతుం డై నగభస్తిమాలిపోలెఁ దద్బాణపరివృతుండై పొలిచె. అందుల కలిగి భూరిశ్రవసుఁడు శరజాలంబుఁ బరఁగించి యతనిసారథిని రథ్యములనుం బొరివు చ్చుటయు నాధృష్టకేతుఁడు శతానీకునరద మెక్కె. చిత్రసేనవికర్ణదుర్మర్షణులు ముగ్గురు వాతపిత్తకఫములు శరీరమునుంబోలె నభిమన్యుం దలపడి పటుశర ములఁ బరఁగించిన నతండు మువ్వురను విరథులం గావించియు భీమువచనంబు

దలపోసి చంపఁడయ్యె. అట్లు దీనదశకు వచ్చిననీకొడుకులం జూచి కురుపితామ
హుండు సుశర్మాదు లగుపెక్కండ్రుమహారథులు పరివేష్టించి రాఁగఁ దా నడ్డప
డి యాసౌభద్రుఁ దాఁకుటయుం జూచి గాండీవి భీష్మప్రముఖు లయినపెక్కండ్రు
మహారథులు నిస్సహాయుఁడు బాలుఁడు నగునభిమన్యుం దలపడిరి మనతేరు రయ
మున నద్దెసం బఱపు మని వాసుదేవునకుఁ జెప్పి యతిత్వరితంబుగఁ బితామ
హుని మార్కొనుటయు మనమూఁకల హాహానినాదంబు రోదసిం బర్వె.

అర్జునుఁడు సుశర్మాదులం దాఁకి విజృంభించుట.

అప్పు డర్జునుఁడు సుశర్మను బిలిచి యయ్యా, నీవు నాకుఁ బూర్వవైరివ
నియు యుద్ధలంపటుఁడవనియు నెఱుంగుదు. నాతోడిపగకు ఫలం బిప్పుడు చూ
చెదవు. ఎన్నఁడో చచ్చినతాతలను ముత్తాతలనుం జూపెద నని పరుషంబులు
వలికిన నేమియుం బలుకక సుశర్మ యనేకరథికపరివృతుండై చుట్టు ముట్టె మేఘ
పటలంబు సూర్యమండలంబునుంబోలెఁ గాండజాలంబున సవ్యసాచిం గప్పుటయు
నతం డాక్షణంబ సేనలనెల్ల నిశ్శేషములు గావించువాఁడై త్రొక్కఁబడ్డపాము
పగిదిఁ గడు నలిగి విండ్లఁ దునిమియుఁ గేతనంబులఁ గూల్చియుఁ గంకటంబులఁ
జించియుఁ దలలఁ దఱిగియుఁ బరమాభీలముగఁ గోల్తల సేయుచు నెత్తురుటేఱు
పాఱించినం గురుసైన్యమున నందఱు నయ్యతిరథోత్తమునకు మొగముఁ గాన్పిం
ప నోడిరి. అట్టియెడ సుశర్మ ముప్పదియిరుగురుచక్రరక్షకులతోడ గాండీవిం
దాఁకి గొనయమ్ములు సారించుచు శరనికరంబుఁ గురిసినం గిరీటి యఱువదియ
మ్ముల నాముప్పదియిద్దఱం బొలియించి భీష్మునిమీఁది కడరె. తనవారిచావునకుఁ
గొందలపడి సుశర్మ క్రమ్మఱ ననేకమహారథపరివృతుండై యర్జును మార్కొను
టయు శిఖండిప్రముఖు లగుమహారథులు కొందఱు పార్థునకుఁ దోడ్పడిరి. అంతఁ
బాండవమధ్యముండు గాండీవజ్యాఘోషభీషణంబుగా నాత్రిగర్తుల మార్కొని
పటుప్రదరంబుల నొంచి సైంధవప్రముఖు లగుమహారథులు కొంద అడ్డపడిన
వారిం గ్రేడించి సౌభద్రునితోడఁ బోరుచున్నగాంగేయుం దాఁకె. యుధిష్ఠిరుఁ
డును శల్యునిఁ గ్రేడించి భీమసేననకులసహదేవసహితుండై గాండీవికి బాసటయై
నడిచె. అవ్విధమునఁ బాండవు లేవురు నొక్కమొగిఁ దాఁకినం బితామహుఁడు
సంచలింపక పోరుచున్నంత సైంధవుఁ డడ్డపడి ధర్మజభీమమాద్రేయులవిండ్లు
దునిమె. అంత వారు వేఱువిం డ్లెత్తునంతలోన దుర్యోధనుండు కృపశల్యశలచి
త్రసేనసమన్వితుండై పాండవుల మార్కొని క్రోధవిషంబుఁ గ్రక్కుచుఁ దీవ్రా
నలప్రకాశంబు లగుదారుణమార్గణంబుల నేయుటయు నప్పటిపోరు దేవదానవ
సమరంబు తెఱంగున ఘోరం బయ్యె. అట్టియెడ శిఖండి దేవవ్రతుపయిం గాండ
జాలంబుఁ గురిసిన నాసత్యవ్రతుం డతని నేయ నొల్లక శిఖండిచాపంబుఁ దుని

మినం గోపదీపితుండై యజాతశత్రుఁ డప్పాంచాలకుమారున కిట్లనియె.

—ధర్మరాజు శిఖండికిఁ దేజస్సంతేజనంబుగాఁ బలుకుట.—

ఏను భీష్ముని జంపుదు నని తండ్రి వినఁగఁ బ్రతిజ్ఞ చేసి యది రిత్తగాఁగ నిట్టు లూరకుంట నీకుఁ దగునే? ఉత్తమక్షత్రియకులమున జనించిననీకు మిథ్యాప్రతిజ్ఞుఁ డనుఅట్టుఁ బడయఁ బోలునే? కులమును ధర్మమును గీర్తిని రక్షించికొనుము. శాంతనవుఁడు విల్లు దునుము నోడి బంధులను సోదరులనుం దొఱంగి యెక్కడ కేగఁ దలఁచితివి. నీకిది యననురూపంబు. భీష్మునికొల్లలకు వెఱచు చున్నమనమూఁకలం జూచియు నేల యూరకుండెదవు. వెఱచితివి కాఁబోలు. ముఖమునఁ బ్రహర్షవికాసంబును దోఁపదయ్యె. లోకవిశ్రుతశౌర్యుఁడవై ననీవు ధనంజయుతోడ్పాటు వడసియు నిట్లు పిఱికివై యుండఁ దగునే? కాలాంతకునివిధమున వెలుంగుచు నరాతిసేనలం గనుపుకొట్టు మని పలుదెఱంగుల ధర్మరాజు వానికిఁ గోపోద్దీపనంబుగాఁ బరుషములు పలికిన నతం డూరకుండుట యుఅవుగా దని తనలో నిశ్చయించి యాపగేయుమీఁది కడరె. అతని కడ్డపడి శల్యుఁడు ఘోరాస్త్రం బేసిన యుగాంతాగ్నిసమప్రభావం బయినయయ్యనలాస్త్రమునకుఁ దలఁకక బాణజాలము నేయుచు శిఖండి వారుణాస్త్రమున దాని నడఁగించుటయు నందఱు స్వస్థచిత్తు లయిరి. భీష్ముఁ డప్పు డురువడించి ధర్మరాజుచాపంబుఁ దునిమి సింహనాదంబు సేసినం గినిసి వాయుసుతుండు తేరు డిగ్గి గదాపాణియై యేతెంచుచుండ జయద్రథుఁ డడ్డపడి మృత్యుదండసన్నిభంబు లయిన తీవ్రబాణముల నేనూఱింటి నెక్కుడయుమ్ముడిగఁ గురిసె. అందుల కించుకేనియుఁ జలింపక యమ్మహాబలుఁడు రోషభీషణశోణలోచనుండై సింధురాజు తేరిగుఱ్ఱముల నాల్గింటిం దనగదాదండమునకు బలి చేసినం గోపించి దుర్యోధనుండు రయమున వడముడిం దాఁకుటయు నతండు సింహనాదంబుఁ గావించి గదాదండంబుఁ ద్రిప్పుచు మార్కొనిన నతనిచేరువ మేలంగనేరక సకలసైనికులును రారాజును విడిచి తొలంగి పోయిరి. ఆసమ్మర్దసమయమునఁ జిత్రసేనుఁడు దా నడ్డపడినం బ్రభంజనాత్మజుం డతనితేరు రథ్యసారథిసహితంబుగా నుగ్గుసేయుటయు నతండు వాలును బలుకయుం గొని తేరుడిగ్గి మార్కొనుచున్నంత వికర్ణుఁ డతనిఁ దనతేరెక్కించికొనియె. భీమునివిక్రమమునకుఁ బాండవులు ప్రహర్షోత్కర్షముఁ బొందిరి. అప్పుడు భీష్ముఁడు యుధిష్ఠిరుం దాఁకి సంకులప్రకారంబునఁ బోరినఁ బాండవపాంచాలసైన్యంబుల నందఱును ధర్మరాజును మృత్యువాతఁ బడినవానిఁగాఁ దలపోసి చేయునది లేక చింతిల్లుచుండ మాద్రేయు లన్నకుఁ దోడ్పడి భీష్ముపయిం బటుశరనికరములు వేనవేలు గురిసి మేఘపటలంబు రవిమండలంబునుంబోలెఁ గప్పిననయ్యాపగేయుఁడు వానినెల్లఁ బ్రతిశరముల నడఁగించి యెక్కడఁ జూచినం

దనబాణములకాఁ గురియించినం దద్బాణములు పక్షులబారులట్లు చూడ నొప్పె. అంతఁ గొంతవడికి ధర్మరాజు భీష్మశరజాలమున నదృశ్యుఁ డగుటయు నప్పాండవాగ్రజుండు కోపించి యతనిపయిం గ్రూరనారాచ మొక్కఁ డేసిన దాని నడుమన తునియలు గావించి భీష్ముఁ డతనిగుఱ్ఱములఁ జంపినం గౌంతేయాగ్రజుండు నకులునితే రెక్కె. కవలును గోపదీపితులై భీష్మం గప్పుటయు నతండు కోల్తల సేయుటయుఁ బోరు ఘోరం బయ్యె. అయ్యవసరమున ధర్మరాజు భీష్మవధంబుఁ గోరుచుఁ దమవారలకుఁ జేయి వీచిన నందఱు నొక్కపెట్ట శాంతనవుం దాఁకుటయు మృగమధ్యమునఁ జరించుకొదమసింగము తెఱంగున విక్రమించి యయ్యాపగానందనుండు కాఱడవి నేర్చుకార్చిచ్చుచందమున వెలుంగుచు నిపుణనరుఁడు తాళఫలముల రాల్చువిధమున రథికులతలల డొల్లఁజేయుచుఁ బాండవసైన్యంబులం గనుపుగొట్టుచున్నంత నాసమరంబు భీకరం బయ్యె. అట్టియెడ శిఖండి భారతపితామహుని మార్కొని నిలునిలు మనియదల్చుచున్నంత స్త్రీపూర్వుఁడైనయతనిం గ్రేడించి శాంతనవుఁడు పాంచాలసృంజయసేనలం దలపడుటయు వారు శంఖారవసింహనాదబంధురంబుగ నతనిం దాఁకి యుక్కుమిగిలి పోరుచున్నంతఁ గమలబాంధవుఁ డస్తగిరిశిఖరప్రాంతంబుఁ గైసేయుటయుఁ జలంబుడింపక సాత్యకిధృష్టద్యుమ్నులు శక్తితోమరప్రముఖవివిధసాధనంబులఁ బరఁగించుచు నేపు చూపుచుండ మనమూఁకలు చీకాకుపడియె. అందుల కోర్వక విందానువిందులు ధృష్టద్యుమ్నుం దాఁకి శరాసారంబుఁ గురియించి రథ్యములఁ గూల్చిన నప్పాంచాలరాజకుమారుండు సాత్యకితే రెక్కినం గినిసి ధర్మరాజు బహుళసేనాపరివృతుండై యాయవంతీశ్వరులఁ దలపడి పోరుచుండె. బీభత్సుండును క్రోధదీపితుండై వజ్రపాణి యసురులంబోలె మనసేనలఁ బొలియించుచుండె. ద్రోణుఁడును నీకొడుకునకుఁ బ్రియంకరుండై పాంచాలురఁ దాఁకి యగ్ని తూలరాశి నెట్టు లట్టుల యేర్చుచుండె. దుర్యోధనాదు లగునీకొడుకులు భీష్మునిప్రాపున నిల్చి పాండవసైన్యంబుతోడఁ బోరుచున్నంత సూర్యుఁడు పడమర సేరుటయు సంజకెంజాయ రంజిల్లె. అట్టియెడ నాఘోరసంగ్రామంబునంజేసి రక్తనదీప్రవాహంబులు మాంసఖాదనలోలుపంబు లయినభూతభేతాళరక్షోగణంబులపిపాసఁ దీర్చుచుఁ బ్రవర్తించె. నక్కలఘోరారవంబులు బహుళంబు లయ్యె. అప్పుడు సుశర్మాదులం గెలిచి కురుసైన్యంబు నేలకుఁగోలకుఁ దెచ్చి ముదితహృదయుం డైనయర్జునుండును దుర్యోధనాదుల నోడించి మనమూఁకలఁ జీకాకుపఱిచి పరమానందభరితుం డయినభీమసేనుండు నెదుటఁ గాన్పించినం బ్రహర్షోత్కర్షంబునఁ బొదలి పాండవాగ్రజుండు సేనలఁ దివియించి శిబిరంబున కరుగుటయు మనవారును భీష్మం బురస్కరించికొని శిబిరమునకుఁ జనిరి. అట్లు లిరు

తెఱంగులవారును శిబిరముల కరిగి స్కంధావారంబునకు సముచితప్రకారంబున రక్షఁ గావించి నిపుణచికిత్సకాపనీతశల్యులై తెలినీటఁ గృతస్నానులై స్వస్తికృత్యము లొనర్చి వందిమాగధసందోహస్తుతివచనంబులకును గీతవాదిత్రనిస్వనమునకు నలరుచుఁ బరస్పరపరాక్రమంబులఁ జెప్పికొనుచుఁ గొండొకపుచ్చి యుచితవిధమున సుఖసుప్తులైరి.

## ఎనిమిదవనాఁటి యుద్ధము.

అంతఁ బ్రభాతం బగుటయుఁ గౌరవులును బాండవులును సమరసన్నద్ధులయిరి. అంతఁ గురుపితామహుఁడు కూర్మవ్యూహం బమర్చి మాలవదాక్షిణాత్యావంత్యపరివృతుండై తాను సేనాగ్రంబున నిలిచి పుళిందపారదక్షుద్రకులతోడ నాచార్యునిఁ దనవెనుకను నబ్భారద్వాజునిపిఱుందిదెస మాగధపిశాచకళింగబలములతోడ భగదత్తుని నాప్రాగ్జ్యోతిషపతియనంతరంబ మేలకత్రైగర్తచిచ్ఛిలాదిగణంబులతోడ బృహద్బలుని నాకోసలేశ్వరునిపృష్ఠభాగంబునఁ గాంభోజయవనసేనలతోడ సుశర్మను నాత్రిగర్తపతిపిఱుంద నశ్వత్థామను నాయాచార్యసుతువెన్నంటి సకలసోదరులతోడ దుర్యోధనుని నాకురుక్షోణీవల్లభుననంతరంబు కృపాచార్యుని నిలిపి ఛత్రకేతనాభిరామంబుగాఁ బోరి కాయితపడుటయు ధర్మరాజు ధృష్టద్యుమ్నుం బిలిచి కౌరవసేనావ్యూహమునకుఁ బ్రతివ్యూహం బమర్పు మనుటయు నతండు శృంగాటకవ్యూహం బమర్చె. అందు శృంగద్వయంబున భీమసేనసాత్యకులు బహుళచతురంగసేనలు పరివేష్టింప నిలిచిరి. నాభిప్రదేశంబునఁ గపికేతనస్ఫూర్తి యెసంగ గాండీవి నిలిచె. మధ్యభాగమున నకులసహదేవసహితుండై ధర్మరాజు పొలిచె. అతనిపిఱుంద సౌభద్రద్రౌపదేయహైడింబవిరాటద్రుపదప్రముఖులు నిలిచిరి. తక్కుఁగలసేన లన్నియు నయ్యైచోట్ల నిలిచె. అట్లు పాండవయోధులు శృంగాటకవ్యూహం బమర్చి వాద్యరవసింహనాదభుజాస్ఫాలననిస్వనమేదురంబుగా దురంబునకు సమకట్టిరి. అంత నుభయసేనలందును జతురంగబలంబులు నిర్మర్యాదంబుగ నొండొంటిం దాఁకుటయు రథికకాండజాలమున నుగ్గయినతేరులును, మిడుఁగుఱు లెగయునట్లు ఱాయి ఱాయిం దాఁకినవిధమున నితరేతరవిషాణంబు లొరయుచు నెదురుపడినవానిం గూల్చునేనుంగులును, నేనుంగులు కూలునెడఁ బర్వతాగ్రమునుండి నేలం బడుమహీరుహంబులవిధంబునఁ దదీయకుంభస్థలములఁ బాసిపడుమావంతులును, బరస్పరఖురప్రహారంబునను సాదిహేతిపాతంబుననుం దెగి పడుగుఱ్ఱములును, రథగజవాజిసంఘర్షంబునను వారిదపటలంబుఁ బాసి వచ్చుకార్మెఱుంగులతెఱంగున నెప్పువివిధబాణకృపాణాదులప్రహారముననుఁ గృత్తగాత్రులైనకాలుమానుసులునై పరమాభీలంబుగ నాలంబు చెల్లుచుండె. అట్టియెడ నాపగేయుఁడు రెండవసూర్యుఁడునాఁగ నేరికిఁ దేఱిచూ

డరానివిధమున వెలుంగుచుండ ధర్మరాజుశాసనంబునఁ బాంచాలసోమకసృంజయులు ధైర్యధుర్యులై చతురంగబలములతోడనమ్మరున్నదీసూనుం దలపడుటయు నవ్వాఁడిమగండు రథికుల విరథులఁ గావించియు సాదిహాస్తిపకపదాతిమస్తకంబులఁ దఱిగియు నేనుంగులఁ గూల్చియు గుఱ్ఱములఁ జదిపియుఁ గడిమి సూపుచుండఁ బాండవసైన్యంబున నెక్కఁడేనియు నతనియెదురఁ గాన్పింపఁడయ్యె. అట్టియవసరంబున భీముఁడు పితామహుం దాఁకి సింహనాదంబు సేసిన సోదరగణపరివృతుండై దుర్యోధనుఁ డతనికి బాసట యగుటయు వారల నందఱ సరకుగొనక కిమ్మీరవైరి నిశితభల్లమునఁ బితామహుసారథిం గూల్చుటయు గుఱ్ఱములు తేరు దోలంగ నీడ్చుకొని పోవుచున్నంత మధ్యాహ్నం బయ్యె.

భీముఁడు సునాభప్రభృతు లగుకురుకుమారులఁ జంపుట.

అప్పుడు నీకొడుకులు తనపై నడరినం గినిసి వడముడి నిశితనారాచమున సునాభుతలఁ దెగ నేయుటయుఁ గోపించి యాదిత్యకేతుఁడు డెబ్బదింటిని మహోదరుండు తొమ్మిదింటినిఁ బహ్వాశి యైదింటిని గుండధారుఁడు తొంబదింటిని విశాలాక్షుఁ డేడింటిని నపరాజితుఁడు పెక్కులునుఁ బండితకుండు మూఁటిని వాఁడినారసంబుల నేసిన నాకీచకాంతకుఁడు తమతొల్లిటిపాట్లు తలపోసి నిశితశరమున నపరాజితుతలఁ దెగ నేసి క్రూరభల్లంబునఁ గుండధారుని మృత్యులోకమున కనిచి శితశిలీముఖంబునఁ బండితకుం బరిమార్చి మూఁడుబాణముల విశాలాక్షుతల నేలఁ బడఁ ద్రోచి ఘోరనారాచంబున మహోదరుఱొమ్ము వ్రచ్చి కూల్చి పటుప్రదరమున నాదిత్యకేతుని నాతపత్రంబును శాతభల్లమున వానిమస్తకంబును నఱికి తీక్ష్ణమార్గణంబున బహ్వాశిని యమునింటి కతిథిం గావించినం దక్కటివారు జూదంబునాఁడు సభలో నాడినమాటలనెల్ల నేఁడు వీఁడు చెల్లించుచున్నాఁ డనితలంచి నివ్వెఱం జెంది పఱచిరి. దుర్యోధనుఁడును భీముని ప్రతిజ్ఞావచనంబును విదురవాక్యంబునుం దలపోసి చింతిల్లుచు నీభీముని బొడివి చంపుఁ డని యందఱతోఁ జెప్పుచుండినను నెక్కఁడైనను వానియెదుర నిలువఁ జాలఁడయ్యె. మహాప్రాజ్ఞుఁ డైనవిదురుఁ డెయ్యది వచించె నయ్యదియె ప్రాప్తంబయ్యె. నీవు లోభమోహసమావిష్టుఁడవై పుత్రులమీఁది ప్రేముడిం దవిలి యతనివచనముల విననైతివి. నిక్కువంబుగ భీముఁడు నీకొడుకులకు మిత్తియై పుట్టినవాఁడు. మీరు తగువారిమాట లాదరింతురే? అది యట్లుండె.

దుర్యోధనుఁడు భీష్ము నధిక్షేపించుట.

అంత దుర్యోధనుఁడు తనతమ్ములచావునకుఁ బరమశోకార్తుండై శాంతనవుపాలి కరిగి పితామహా, భీమసేనుఁడు గండడరి నాతమ్ములనుం బెక్కండ్రుశూరులనుం బరిమార్చె యేపు చూపుచుండినను నీవు మధ్యస్థుఁడవై చూచెదవకాని

మామేలు గోరి పోరాడవు. ఇట్టు లొప్పరికించుట మున్న తెలిసియుండిన మేలై యుండు. నిను నమ్మి యింతపడితి. మాయెడ దైవంబును బ్రతికూలం బైనవిధంబు దోఁచుచున్న దని బాష్పపూరిత లోచనుండై పలికిన విని దేవవ్రతుండు కుమారా, తొలుతనే యేను నాచార్యుఁడును విదురుఁడును గాంధారియు నెంత తేర్చి చెప్పినను వినక పాండవులతోడిపోరు పెట్టికొంటివి. ఇందు నన్ననినం బ్రయోజనం బెయ్యది? నాయోపినకొలంది సమరంబు సేయుచున్న వాఁడను. నేనును భారద్వాజుండును మీకుఁగాఁ బ్రాణములనైన విడువ నున్నవార మని మున్న చెప్పితిమిగదా. మీపైఁ బగ పట్టిన భీముఁడు నేఁడు మీవా రగపడిన నూరక పోనిచ్చునే. దేవతలైనను బాండుపుత్రుల జయింప నోపరు. శోకము మాని స్థిరచిత్తుఁడవై యశముఁ గోరి పోరు సేయు మనియె ననిన విని ధృతరాష్ట్రుఁడు సంజయా, యామీఁద భీష్మద్రోణకృపు లేమి చేసిరి? ప్రతిదినమును నాకొడుకులే యోడుటకును జచ్చుటకును దైవోపహతికం టె నితరకారణంబు దోఁపదు. కాకున్న భీష్మద్రోణకృపాశ్వత్థామభగదత్తసౌమదత్తిప్రముఖు లగుమహారథులు పెక్కండ్రు బాసటయైయుండఁ బాండవులకు వారలం గెలువఁ దరమే? నేనును బితామహుఁడు నాచార్యుఁడును విదురుఁడును గాంధారియు నెంత వారించి చెప్పినను హితమ్ము వినక దుర్యోధనుఁడు కులమునకెల్లఁ జేటు దెచ్చె. భీముఁడు తనప్రతిన [illegible]ంచునుగాని యూరకుండునే యనిన ధృతరాష్ట్రునకు సంజయుఁ డిట్లనియె. మహారాజా, పాండవుల కెగ్గు దలంపవలదు. కొడుకుల వారింపుము. వారింపకుండిన మీఁదఁ గీడు మూఁడు నని హితవాదు లందఱును బలుదెఱంగులఁ బలుమాఱులు సెప్పినను జావ నున్నవాఁడు పథ్యౌషధమునుంబోలె నించుకేనియు నీవు గ్రహింపవైతివి. అప్పు డట్టులు చేసి యిప్పు డిట్టు లనుభవింపఁ జాల ననినఁ దీఱునే? అది యట్లుండె. స్థిరచిత్తుఁడవై సమరప్రకారము వినుము. అట్టిమధ్యాహ్నసమయంబునఁ గురుకుమారులు పెక్కండ్రు పొలియుటకుఁ గోపించి గంగానందనుండు భీముం దాఁకుటయు ధర్మరాజు చేయి వీచినం జూచి ధృష్టద్యుమ్నశిఖండిసాత్యకులును విరాటద్రుపదులును గేకయధృష్టకేతుకుంతిభోజులును నభిమన్యుఘటోత్కచులును భీష్ముం దలపడిరి. అప్పుడు దుర్యోధనుండు సకలరాజులును వారిపయిం బురికొల్పుటయు గాండీవి ద్రౌపదేయచేకితానపరివృతుండై వారల నందఱం గవిసె. ఆచార్యుండు పాంచాలుర మార్కొనియె. అట్లు కౌరవులును బాండవులును రెండుమొత్తంబులై యొండొరులఁ దాఁకినం గ్రంమకయ్యం బయ్యె. ఆచార్యబారిం బడి పెక్కండ్రురథికులు నొచ్చియుఁ బోక పెనంగుచుఁ దెవులుపట్టినవారియట్లు వెతలఁ గుందుచుండిరి. భీమసేనునకుఁ జిక్కి మనసైన్యగజంబులు కూలునవియు ద్రావాలునవియుఁ దిరుగఁబడుపడునవియుఁ

దొండములు నెడల్లు దునిసినఁ బ్రబలఘీంకారంబు సేయునవియు నయ్యె. నకు
లసహదేవులమునుమునఁ బడి హయానీకంబులు పతితసాదికంబులయి నాలుకలు
వెడలించుచు రోఁజుచు నఱచుచు నేలం గూలె. గాండీవిం బ్రతిఘటించి యతని
కోల్తల కోహటించి రథికులు వెఱచఱచి విచ్చిపఱచినం గయ్యంపునేల విఱిగి
నతేరులను గూలినసిడంబులను దునిసినగొడుగులను నుఱుమైనచామరంబులను
బొడిమైనకైదువులను ద్రెస్సినహారకేయూరాదివిభూషణంబులను నభిరామంబై
వసంతసమయంబునఁ గుసుమవిసరసముల్లసితంబైనయుద్యానంబు ననుకరించె.
భీష్మద్రోణాదు లడరినం బాండవసైన్యంబును దైన్యంబుఁజెందె.

ఇరావంతుఁడు శకునితమ్ములఁ జంపుట.

అయ్యవసరంబున శకుని కృతవర్మలు కాంభోజారట్టజవనాయుజాద్యుత్త
మతురంగబలములతోడఁ బాండవసేనం గవిసి నొప్పించుచున్నంతఁ గామవర్ణజ
వంబులైనగుఱ్ఱపుదడములతోడ నిరావంతుఁ డయ్యుద్ధఱం దాఁకె. ఆకుమా
రుఁడు తొల్లి యైరావతుఁ డనుభుజగరాజుకూఁతు రులూచి యనునది తనపతి
వైనతేయనిహతుఁ డగుటయు నపత్యార్థంబు తండ్రియనుమతి వడసి పార్థుం గా
మింప నతండు గ్రహియించిన నానాగరాజసుతయం దర్జునునకు జనించినవాఁడు.
ఆభుజగరాజదౌహిత్రుండు తనపితృవ్యుఁడు పార్థునిమీఁదియాసుగ దన్నుఁ బరి
త్యజించినఁ దల్లిప్రోవునఁ బెరిగి రూపగుణబలవీర్యసంపన్నుండై నెగ్గి యర్జునుఁ
డింద్రలోకమున కరిగినపు డది యెఱింగి యచ్చటి కేగి కృతాంజలియై తండ్రికిఁ
బాదాభివందనంబుఁ గావించి తనజన్మక్రమంబు సవిస్తరంబుగఁ దేటపఱిచినం
బూర్వవృత్తాంతముఁ దలంపునకుఁ దెచ్చి వివ్వచ్చుఁడు వాని మెచ్చి చేదోయిం
గ్రుచ్చి కౌఁగిటం జేర్చి కుమారా, మాకుఁ గౌరవులతోడఁ బోరు పొసఁగునెడ
నీవు తోడ్పాటు సూపవలయు ననిన నట్లయగుంగాక యనిపలికినవాఁడు గావున
నుహ్వాదధిపయుం జరించునంచలసిందునాఁగ నొప్పారుతురంగములగములతోడఁ
దలపడి తనగుఱ్ఱపుదడములఁ బురికొల్పినం గామజవంబులైనయాహయములు
గరుడపక్షపాతనిస్వనంబునుంబోని దారుణరవం బెసంగ మనహయములమీఁద
నడరి క్షణమాత్రఁ గలఁచి తిరుగుడుపఱిచి రూపుమాపె. అప్పుడు శకునితమ్ములు
గజుఁడు గవాక్షుఁడు వృషభుఁడు చర్మవంతుఁ డార్జవుఁడు శుకుఁడు ననువా రాఱు
గురు తమయున్నయుఁ దక్కటిశూరులును వలదు వల దనుచుండ వినక కడంక
మెఱయఁ దాఁకినం బన్నగరాజసుతాతనూజుఁడు వీరల నందఱం దెగటార్పఁగ
నందఱుఁ గడంగుఁ డని తనవారికిఁ జెప్పిన నట్ల యయ్యిరావంతునిజోదులు సాబ
లుఁరం దలపడి శరనికరంబుఁ బరఁగించి నొంచినం గినిసి వా రందఱును గుమిమై
యర్జునసుతుం జుట్టుముట్టి ఱొమ్మునను నీఁపునను బార్శ్వములను నిశితప్రాసముల

నాటిరి. అవ్విధంబున నందఱుం గుమిఁగూడి తన్నుఁ దాఁకినం జలింపక యయ్యి
రావంతుఁడు ధైర్యధుర్యుఁడై వాఁడితూపుల వారల మూర్ఛితులఁ జేసి వారు తన
మేనఁ గీలించిన ప్రాసంబులనే తీసితీసి వారిమేనుల నాటి వాలును బలుకయుం
గొని గుఱ్ఱము డిగ్గి యాగాంధారరాజకుమారులకుత్తుకలు గోయఁ బోవుచు
న్నంత మూర్ఛ దేఱి వారు క్రోధసమావిష్టులై యతనిపై నడరి శరములఁ బరఁ
గించిరి. ఇరావంతుఁడును లాఘవంబునఁ దదీయబాణములఁ బలుకచేఁ జదియ
నడుచుటయు నాసౌబలులు కాలుమానిసి మైనపైనిఁ బలువు రొక్కపెట్ట చుట్టు
ముట్టి పట్టుకొనం దగు నని తమలో నూహించి బాణకృపాణపాణులై పదాతు
లై డాయ వచ్చుటయు నర్జుననందనుండు వారివిండ్లను గైదువులను నఱికి తలలు
దఱుగుచుండ వృషభుఁ డొక్కరుఁడు తప్పించికొని పఱచె.

ఇరావంతుఁ డలంబుసునిచేఁ జచ్చుట.

అప్పుడు దుర్యోధనుం డాగాంధారకుమారుల చావునకు వగచుచు ఋష్య
శృంగపుత్రుండును బహుళమాయావిశారదుఁడును బకవధనిమిత్తమునం జేసి భీ
మునిమీఁదఁ బెద్దయుఁ బగ పాటించినవాఁడు నగు నలంబుసుని బిలిచి రాక్షసే
శ్వరా, చూచితే యిరావంతుఁడు మనమూఁకలఁ జీకాకుపఱుచుచున్నవాఁడు.
నీవు కామగమనుండవు. సకలమాయావిశారదుండవు. భీమునకు శత్రుఁడవు.
కావున నిపుడు నువడించి యీయిరావంతునిఁ బరిమార్పు మనిన నతం డట్లయని
యానాగరాజసుతాసుతుం దాఁకిన నతండు చలంబు డింపక కడిమి మెఱసి యం
దఱకుం జాలుచుఁ బోరుచుండె. అంత నారాక్షసుఁ డిది యుపాయంబు గాదని
మాయఁ గావించి వివిధయుద్ధవిశారదులును హయారోహణప్రవీణులు నగురా
క్షసుల ద్విసహస్రసంఖ్యాకులను సృజించిన వారు గవిసి యిరావంతునిగుఱ్ఱముల
నన్నిటినిం జదిపి తాముం జచ్చుటయు బాణకృపాణపాణులైనయయ్యిద్దఱి
పోరు ఘోరం బయ్యె. అట్టియెడ నర్జునసుతుఁడు క్రోధోద్రిక్తుండై సమీపగ
తుఁడై నరాక్షసునివిల్లుఁ గరవాలంబున నఱికి శరపంచకం బేసిన నయ్యసుర రయ
మున మాయాబలమున నుప్పరమునకు లంఘించిన నిరావంతుఁడును దోడన వాని
వెన్నంటి యెగసి తదీయసర్వాంగములనుం గోసె. కోసినను వాఁడు కామరూ
పుఁడు గావునఁ గ్రమ్మఱ నెప్పటియట్ల యగపడుటయు నిరావంతుఁడు కోపదీపి
తుండై పోక పెనంగుచుఁ దీక్ష్ణపరశ్వధమునఁ దలఁ దునిమె. తునిమినను
వాఁడు రాక్షసులకు సహజ మయినమాయాప్రభావమున సింహనాదముఁ జే
యుచుఁ దలతోడ నెదురఁ గన్పట్టె. అవ్విధమున క్రమ్మఱను నఱికిన నెన్నిమాఱులు
నఱికినను వాఁడు నెత్తురు పఱవఁ గూలియుఁ గ్రమ్మఱ నెప్పటియట్ల యెదురఁ జూపట్టు
టయుం జూచి యిరావంతుఁ డిది రాక్షసమాయ కావున వీఁ డలంతులఁ బోవఁడు

నేనును మాతృకులసిద్ధం బయిన మాయఁ గావింతు నని తనలో నూహించి మాయా ప్రభావమునఁ దాను ఫణాద్యుతులు సెలంగ శేషరూపము ధరించి వివిధపన్నగసమేతుండై యయ్యసురం గప్పిన నతం డందులకు వెఱవక గరుడాకృతియై యాపాములనెల్ల మ్రింగి విమోహితచిత్తుఁడైన యయ్యిరావంతునితలను గరవాలమున నఱుకుటయుఁ గుండలకిరీటోల్లసితం బయినయతని యుత్తమాంగంబు పద్మేందుసదృశంబై వికారరహితంబై చెన్నున నొప్పుచు నేలం బడియె. అట్లలంబుసుఁడి రావంతుని జంపుటయు నీకొడుకు లుల్లసిల్లిరి. భీష్మద్రోణులు పాండవసైన్యంబును భీమార్జునులు మనసేనలనుం దాఁకి వీరవిక్రమవిహారంబు సల్పుచుండఁ జతురంగంబులు నిర్మర్యాదంబుగ నొండొండం దలపడి పోక పెనంగినం గ్రందుకయ్యం బయ్యె. ఉభయసైనికులు నవ్వీరవరులకు వెఱచి ప్రాణంబులమీఁది యాసచేఁ గుందుచుండి రనిన విని ధృతరాష్ట్రుఁ డిరావంతుఁడు మృతుఁడైనపదంపడి మహాబలులైనపాండవసైనికు లేమి చేసి రనియడుగ సంజయుఁ డతని కిట్లనియె.

### ఘటోత్కచుఁడు దుర్యోధనునితో యుద్ధము చేయుట.

ఇరావదవధమునకుఁ గోపించి ఘటోత్కచుఁడు భూమండలం బల్లాడ సాగరంబులు గలంగఁ బర్వతంబులు కంపింప మనవారు సింగముబొరిం బడినయేనుంగులై తొలంగఁ బెలుచ నార్చి ఘోరశూలంబుఁ గేలం బూని నానాప్రహరణపాణు లయినరాక్షసులు పెక్కండ్రు తోడ రాఁగ మనమూఁకల మీఁద నడరె. ఏమి చెప్పుదు నప్పటివానివికృతాకారంబుఁ జూచి నిజసైనికులును బరిభ్రమించిరి. ఇఁక మనవారలఁ జెప్పవలయునే? అప్పుడు దుర్యోధనుఁడు శరశరాసనము లగ్రహించి సింహనాదము చేసి నడగొండలంబోనియేనుంగులతోడ వంగాధిపతి వెంట నంటి రాఁగ నాహైడింబునిఁ దాఁకినం బోరు ఘోరం బయ్యె. ఘటోత్కచభటులు శక్తినారాచభిండివాలపరశుముసలాదిసాధనంబులను గిరిశిఖరంబులను వృక్షములనుం దెచ్చి పడవైచి కుంభములఁ బగిల్చియుఁ గొమ్ముల నుగ్గుచేసియు నొడళ్లు నఱికియు నెత్తురు లురులించియు నేనుంగులనెల్లఁ బీనుంగులఁ గావించుచుండ దుర్యోధనుండు క్రోధతామ్రేక్షణుండై ప్రాణములమీఁదియాస మాని వానిఁ దాఁకిన నిశితశరాసారంబుఁ గురిసి వేగవంతుఁడు మహారౌద్రుఁడు విద్యుజ్జిహ్వుఁడు ప్రమాథి యనువారల నల్వురఁ బ్రధానరాక్షసులఁ జంపె. అందులకుఁ దీవ్రక్రోధదీపితుండై హిడింబానందనుండు సురేంద్రాశనిసమప్రభం బైనచాపంబుఁ జేతఁ గొని గొనయమ్ము సారించి నిశ్చలధైర్యుండై యున్నరారాజున కిట్లనియె. ఓరీదురాత్మా, దుర్ద్యూతమున నాతండ్రు లయినపాండవుల నోడించితివి. పరమపతివ్రతాశిరోమణి యైనపాంచాలి నేకవస్త్రయు రజస్వలయునై యున్న

తఱి నిది తగ దని యించుకేనియుఁ దలంపక సభకు రప్పించి భంగపఱిచితివి. నీకుఁ బ్రియము సేయువాఁడై సైంధవుఁ డాసాధ్వి వనముల నాశ్రమమున నొంటిమై యున్నపు డపహరించె. ఇంకను బెక్కు లపచారంబులు చేసితివి. అవి యన్నియు నేఁటితోఁ దెగ నిన్నుఁ బరిమార్చి మాతండ్రులఋణముఁ దీర్చెద. పాఱిపోక చక్క నిలు మని యవుడుగఱచి బొమలు ముడివెట్టి కార్ముకగుణక్వణనంబుఁ గావించి ప్రావృడ్వారిదంబు వారిధారలఁ బర్వతంబునుంబోలె శరాసారమునం గప్పిన నందులకుఁ జలింపక భవదగ్రనందనుండు క్రోధసమావిష్టుండై క్రూరపన్నగంబుచాడ్పున రోఁజుచుఁ దీక్ష్ణనారాచముల నిరువదేనింటిని వానిపయి నేసె. తద్బాణవిద్ధుండై ఘటోత్కచుండు నెత్తుటఁ జొత్తిల్లి ప్రస్రవన్మదసలిలం బయినకుంజరంబు ననుకరించుచు నీకొడుకుం జంపువాఁడై యశనిప్రకాశం బయినమహాశక్తిని గొండలనయినం బగిలింపఁ జాలినదాని నెత్తుచున్నంత వంగపతి కురురాజునకు మిగిలి తనయేనుఁగుఁ బఱపుటయు నతం డెత్తినశక్తి యయ్యేనుఁగుపయిం బడినం దద్గజంబు రక్తసంసిక్తంబై నేలం గూలె. వంగేశ్వరుండును ధరణికి లంఘించె. మనసేనలు విచ్చిపఱచె. దుర్యోధనుఁ డందులకు వ్యథితచిత్తుండయ్యు క్షత్రధర్మమును నాత్మాభిమానంబునుం దలపోసి తాలిమిఁ గొని కొండవోలె నచలుండై నిలిచి కాలానలసమం బైనవాఁడితూపు నెక్కుదాని నయ్యాసురపై నేసిన వాఁడు నేర్పున దానిం దప్పించి కొని మనమూఁకలెల్ల నివ్వెఱఁ జెందఁగఁ బ్రళయజలధరంబుచాడ్పున నార్చి పేర్చియున్నంత శాంతనవుఁడు బాహ్లికజయద్రథకృపాశ్వత్థామాదులు వినంగ నాచార్యున కిట్లనియె. ఘటోత్కచుఁడు దుర్యోధనుం దలపడి పోరుచుఁ బెలుచ నార్చుచున్నవాఁడు. సంగ్రామంబున వానిం గెలుచుట దుష్కరంబు. రాజునకుఁ బెద్దయు డెప్పరంబు పొసంగకుండ మీరు వాని మార్కొనవలయు. రాజరక్షణంబుకంటెఁ బరమకృత్యంబు గలదే యనియె.

### ఘటోత్కచుఁడు ద్రోణాదులతోడఁ బోరుట.

అనుటయు ద్రోణకృపాశ్వత్థామలును బాహ్లికసోమదత్తభూరిశ్రవసులును శల్యసైంధవబృహద్బలులును విందానువిందులును వికర్ణచిత్రసేనవివింశతులును బహుళరథానీకంబులతోడ నతిరయమున దుర్యోధనుం దలకడచి భీమసేనసూనుం దాఁకుటయు నతండు మైనాకగిరివోలె నచలుండై నిలిచి శూలముద్గరప్రముఖనానాప్రహరణపాణు లయినరాక్షసు లనేకులు తనకుఁ దోడ్పడఁగ వారలఁ దలపడుటయు నయ్యుభయసైనికులకుఁ బోరు ఘోరం బయ్యె. అప్పుడు రోషభీషణుండై మహార్వఘోషంబుఁ గావించి ఘటోత్కచుండు కడిమి మెఱసి యర్ధచంద్రబాణమున నాచార్యువిల్లుదునిమి నిశితభల్లమున సోమదత్తుసిడముం బడ నేసి మూఁడువాఁడితూ

పుల బాహ్లికునురమున నాటి యొక్క మార్గణమునఁ గృపుని నొంచి మూఁటఁ జిత్ర
సేనుం గాఁడనేసి యొక్క శరము వికర్ణుజత్రుదేశమునఁ గీలించిన నవ్వికర్ణుఁడు తేరిప
యి నెఱగం బడియె. అంతనిలువక యప్పవమానపౌత్రుండు పంచదశశిలీముఖము
లభూరిశ్రవసునిమైమఱువు సించి నొప్పించి యశ్వత్థామవివింశతులసారథుల రెంటఁ
జదిపి యొక్క విశిఖమున సైంధవునివరాహకేతనంబుఁ గూల్చి మఱియొక్కటఁ
గోదండంబుఁ దునిమి నాల్గింట నవంతిపతులరథ్యముల సమయించి యొక్క పటు
ప్రదరమ్మున బృహద్బలుఁ దేరిమీఁద నెఱగఁ బడ నేసి వాలంపగముల మద్రప
తిం బీడించి యందఱను వెగడుపఱిచి దుర్యోధనుని మార్కొనియె. అంత నమ్మ
హారథు లందఱును దాలప్రమాణంబు లయినకార్ముకములఁ గొని గుమిగూడిన
సింగముల తెఱంగున నాహైడింబుం దాఁకి ప్రావృషేణ్యమేఘములు పర్వతంబు
నుంబోలె శరధారాసారమున ముంచుచుండినం గినిసి యతం డించుకేనియు సంచ
లింపక గగనంబునకు లంఘించి దిక్కులద్రువ భీమనాదం బొనరించె. ఆనినాదం
బు విని ధర్మరాజు భీముం బిలిచి మనఘటోత్కచుఁడు ద్రోణాదు లగుపెక్కంద్రు
మహారథులతోడఁ దలపడి పెద్దయు నార్చుచున్నవాఁడు. అదె వానియార్పు విన
వచ్చుచున్నది. ఇక్కడఁ బితామహుఁడు పాంచాలురం గనుపుకొట్టుచున్నవాఁడు.
కావున మనకిప్పు డిక్కడ నక్కడనుం దోడ్పడవలసియుండు. ఇచ్చటికి విష్వచ్చుండు
గలండు. అచ్చటికి నీవుపోయి విక్రమింపు మనుటయు నతం డట్ల యని సత్యధృతి
సౌచిత్తిశ్రేణిమద్వసుధానకాశిరాజసుతులును సౌభద్రద్రౌపదేయులును క్షత్ర
దేవక్షత్రధర్మానూపపతులు నాఱువేలగంధసింధురంబులును బెక్కువేలహయరథప
దాతులునుం బరివేష్టించిరాఁగఁ బర్వకాలంపుసాగరంబుభంగి సైన్యములు ఘూ
ర్ణిల్లునట్లుగ ఘోరసింహనాదంబుఁ గావించుచు ఘటోత్కచునకుఁ దోడ్పడియె.
అప్పుడు భీమసేనుం జూచి విన్నఁబోయినమొగమ్ములతో మనవారు ఘటోత్కచుని
విడిచి యతనిం దలపడుటయుఁ బోరు ఘోరంబయ్యె. చతురంగబలము లొం
డొంటిందాఁకి యత్యంతసమ్మర్దంబుగాఁ బోరుడుఁ బాదనేమిసముత్థితం బైనకెం
ధూళి భూనభోంతరము నిండుటయుఁ జీఁకట్లు గ్రమ్ముకతనఁ దండ్రిని గొడుకును
గొడుకు తండ్రినిం దెలిసికొనఁజాలక నిర్మర్యాదంబుగఁ బెనంగుచుండిరి. అట్టి
యెడ శస్త్రపాతంబునను మనుష్యగర్జితంబునను హయహేషితంబునను గరిబృం
హితంబుననుం బొడమినయులివు ప్రేతశబ్దంబుమాడ్కి దారుణంబయ్యె. కైదు
వులపాటున డొల్లుతలలనినదంబు తాలు దండడిం బడునపు డెట్టు లట్టుల వినం
బడియె. కేశశైవాలశోభితంబై రక్తనదీప్రవాహంబు రణక్షోణిం బాఱె. కొమ్ము
లు విఱిగినను గుంభములు పగిలినను గోపమున జిట్టనం దిరుగుచు గర్జాసమంబు
లయినప్రబలఘీంకారంబు లొనర్చుచు నంగములెల్ల నెత్తుటఁ జొత్తిల్లుటంజేసి

సౌదామినీశోభితంబు లగుమేఘములరీతిని ధాతురాగరంజితంబు లగుధరాధరంబు లచాడ్పునను నెప్పుచు డాకె మెఱయ డీకొని పోరి పదంపడి తొండములు తెగినం గూలినయేనుంగులు ఱెక్కలు నఱికినకొండలవిధంబున నొప్పె. నారాచతోమరనిహతులై సాదులు పడుటయు శరవిక్షతసర్వాంగంబులై రక్తసిక్తంబులై నతురంగములు శిఖరములు పడినధాతురంజితపర్వతంబు లనం బొలిచె. క్రోధసమావిష్టులై మదాంధులై పదాతు లోపినకొలంది పెనంగి రథహయపదాతివర్గముల మర్దించుచుండిరి. రథికులు యుద్ధకాంక్షులై జయము నొండె స్వర్గము నొండెఁ దప్పక సాధింతు మనికడంగి స్వయంవరోల్లాసభాసురమానసులై యత్యంతశక్తి మెఱయ ధైర్యము నెఱయ దుష్కరకృత్యములఁ జేయుచుండిరి. అట్లు పరమాభీలసమ్మర్దంబుగా సంగ్రామంబు సెల్లుచుండఁ దఱచుగ మనమూఁకలు విముఖము లగుటయుఁ గ్రోధదీపితుండై దుర్యోధనుఁడు భీముని దాఁకి యింద్రాశనిసమప్రభం బయినకార్ముకమునఁ బెక్కుతూపుల సంధించి యేసి యర్ధచంద్ర శరమున విల్లు దునిమి యతిగయమునఁ గొండలనైనం బగిలింపఁ జాలినశితశర మొక్కఁ డరిఁబోసి యొమ్ముఁ గాఁడ నేయుటయు వృకోదరుఁడు గాఢవిద్ధుఁడై కేతనదండ మూఁత గొనియె. తదవస్థుఁడైనభీమసేనుం జూచి ఘటోత్కచుఁడు నభిమన్యు ప్రముఖు లగుమహారథులును గ్రోధోద్దీపితులై సంభ్రమమున నార్చుచు దుర్యోధనుమీఁదికిఁ గవియుచున్నంత నాచార్యుఁడు కృపాశ్వత్థామసైంధవాదు లగుమనవారిం బిలిచి పెద్దయెలుంగున నిట్లనియె. తడవు సేయక యెయిది దుర్యోధనుని రక్షింపుఁడు. అభిమన్యుప్రముఖు లైనపాండవమహారథులు పెక్కండ్రు భీమసేనపురస్సరులై పెలుచ నార్చుచు జయముఁ గోరి నానాశస్త్రముల గ్రహించి యతనిం దలపడుచున్నవారు. వారిపోరతనికి మిగుల భరంబై యుండుఁ గావున వేగమ యెయ్దుఁ డనిపలికిన విని కృపాశ్వత్థామసైంధవసోమదత్తభూరిశ్రవులును శల్యవివింశతిచిత్రసేనవికర్ణులును విందానువిందులు నాచార్యుం బురస్కరించికొని యిరువదియాఁడుగులకొలఁది పఱచి యెయిది రారాజునకుఁ గావలియై నిలిచిరి. అప్పుడు భారద్వాజుండు భీమునిపై నెక్కుపెట్ట షడ్వింశతివిశిఖముల నేసియంత నిలువక మేఘము వారిధారలఁ బర్వతంబునుం బోలె బహుళశరాసారంబున నతని ముంచిన నావృకోదరుఁడు కడుం గోపించి పదివాఁడియమ్ముల నాచార్యువామపార్శ్వమున నాటుటయు గాఢవిద్ధుండై యావిప్రవృద్ధుండు మూర్ఛితుండై తేరిపయి నొఱగం బడియె. అందుల కెంతయుం గోపించి దుర్యోధనుఁడు నశ్వత్థామయుం దనపై నెక్కుపెట్ట యురువడించినం జలింపక వాయుపుత్రుండు రయమునఁ దేరు డిగ్గి కాలదండోపమం బైనగదాదండంబుఁ జేత నమర్చికొని శిఖరశోభితం బైనకైలాసభూధరంబు ననుకరించుచు

నవ్వీరులం దాఁకుచున్నంత నాచార్యుండు మూర్ఛదేఱి యతనిమీఁదఁ గవియు
టయు నందఱుం గుమిగూడి యతనిం జుట్టుముట్టి సెలకట్టెల నేయుచు బిట్టు
నొంచుచుండునంత నభిమన్యుప్రముఖు లగుపాండవమహారథులు నతనికిఁ దోడ్ప
డి మనమహారథులతోడఁ బోరుచుండిరి. అం దనూపనాథుఁడు నీలమేఘసవర్ణగా
త్రుఁడు నగునీలుఁడు భీమునిమీఁది చెలిమిం జేసియు నశ్వత్థామమీఁదియాసునం
జేసియు నాద్రోణిం దాఁకి తొల్లి నిజతేజంబున ముల్లోకములకు వెఱపుఁ గావిం
చినవిప్రచిత్తినామకదానవుమీఁద నురువడించుసురేంద్రునిచందమునఁ దీవ్రప్ర
తాపదీపితుండై జ్యాఘోషంబు భీషణంబుగాఁగ నిశితశిలీముఖం బతనిమేనం
గీలించుటయు నాచార్యసుతుండు క్రోధసమన్వితుండై యింద్రాశనిప్రభం బైన
కోదండంబుఁ బుచ్చికొని గొనయమ్ము సారించి నీలునిఁ జంపఁ దలంచి నాల్గుభల్ల
ముల రథ్యములఁ జంపి రెంటఁ గేతనంబుఁ గూల్చి యొక్కనిశితభల్లమ్ము వానియు
రమ్మున నాటుటయు నయ్యనూపపతి మూర్ఛితుండై తేరిపయి నొఱగం బడియె.

### ఘటోత్కచుఁడు మాయఁ గావించుట.

తదవస్థుం డైననీలుం జూచి ఘటోత్కచుఁడు క్రోధదీపితుండై రాక్షస
భటులతోడ నశ్వత్థామను దాఁకిన నతండు రోషరూషితుండై హైడింబుని ముం
దఱ నున్నరాక్షసులం బరిమార్చుటయు ఘటోత్కచుఁ డమర్షోత్కర్షభరితుండై
ఘోరరూపం బైనమాయఁ గావించె. తదీయమాయాప్రభావమున దుర్యోధనుం
డును ద్రోణాశ్వత్థామశల్యాదు లగుమహారథు లందఱును దక్కటిచతురంగబ
లంబులును నరాతిహేతివ్రాతవిక్షతగాత్రంబుల నొప్పి నెత్తుటఁ జొత్తిల్లి నేలకు
వ్రాలి పొరలునట్లు మనమూఁకల కగపడుటయు నందఱును విన్నఁబోయి విము
ఖులై యేనును దేవవ్రతుండు నెలుంగెత్తి వెనుదీయక పోరుఁడు, పాఱవలవ,
దియ్యది ఘటోత్కచుఁడు ప్రయోగించినరాక్షసమాయగాని నిక్కంబు గాదు,
వెఱవం బని లే దని యెంత చెప్పి యాఁగినను మామాటల నమ్మక కాందిశీకులై
క్రమ్మఱి శిబిరమునకుఁ జనుచుండిరి. మనమూఁక లట్లు చిందఱవందఱ యగుట
కెంతయు నుబ్బి పాండవులు సంతోషమున నార్చి పేర్చుటయు నాదెసశంఖదుందు
భినినాదంబు పెలుచ నెసఁగె. అవ్విధమున ఘటోత్కచునిమాయకు వెఱచి మన
సేనలు పాఱుటయుఁ జింతాశోకభరితుండై దుర్యోధనుండు గాంగేయునొద్దకరిగి
పెద్దయు నిట్టూర్పులు నిగిడించి యిట్లనియె. పితామహా, పాండవులు వాసుదేవు
నెట్టు లట్టుల యేనును నిన్నాశ్రయించి నీవు గెలిపింతు వని నమ్మిపాండవులతోడఁ
బగ పెట్టికొంటిని. నాకుఁ దోడ్పడ వచ్చినపదునొకండక్షౌహిణులును నీయాన
తిమెయి నడుచుచున్నవి. ఏనును నీమాట దాఁటకున్నవాఁడను. నీవిక్రమ
మునకుఁ గొలఁది పెట్ట నేరికిఁ దరము గాదు. ఇది యిట్లున్నను బాండవులు నానాఁ

టి కుక్కు మిగులుచున్నారు. భీమసేనఘటోత్కచప్రముఖులు నన్నింతకు మున్న నిర్జించిరి. ఎండినమ్రాఁకు నగ్గి మెట్టు లట్టు లది నామనం బేర్చుచున్నది. ఇంక నైనను నీ వారాక్షసుం జంపి మమ్మనుగ్రహింపుమీ యనిన దుర్యోధనునకుఁ బితామహుఁ డిట్లనియె. కుమారా, నీవు వర్తింపవలసినవిధముఁ దెలిపెదవినుము. సర్వవిధంబులను సర్వావస్థలందు నాత్మరక్షణముఁ జేసికొనవలయు. నీవు ధర్మజభీమార్జుననకులసహదేవు లలో నేరితోనైనను బోరాడుము. రాజునకు రాజుతోడఁ బోరు తగుంగాని లాఁతులతో నెల్లఁ బోరుట పోలునే. నేను నాచార్యుఁడు నాచార్యపుత్రుఁడును గృపాచార్యుఁడును శల్యకృతవర్మసౌమదత్తిప్రముఖులును నీతమ్ములందఱును నీకుఁగా నారాక్షసుని మార్కొని పోరుదుము. మఱియు నీకతనిపై మీఁదుమిక్కిలి కోపంబు గలదేని యీభగదత్తుం బనిచెద ననిచెప్పి యాప్రాగ్జ్యోతిషపతిం బిలిచి రాజేంద్రా, యుద్ధదుర్మదుఁ డయినఘటోత్కచుం డేచి మనమూఁకల నేఁచుచున్న వాఁడఁట. ఇంద్రుఁడు తారకాసురుంబోలె నీవు వేగమ యయ్యసురం గవిసి కడిమి మెఱసి నిలువరింపుము. నీవు దివ్యాస్త్రము లెఱింగినవాఁడవనియు నింతకుమున్ను రాక్షసులఁ బెక్కండ్రఁ బరిమార్చినవాఁడవనియుం దెలిసి వాని మార్కొనఁ జాలినవాఁడవు నీవ యని నిశ్చయించి చెప్పితి. నిజసైన్యములతోడ నద్దెసకుఁ గవిసి వానిం దెగటార్పుమనియె.

## భగదత్తుఁ డేనుఁగుతోడఁ బాండవసేనపయిం గవియుట.

అనవుడు సర్వసేనాపతి యగుశాంతనవునచనము విని భగదత్తుఁడు గర్జానిర్ఘోషతుల్యం బయినసింహనాదంబున దిశల బీఁటలువాఱించుచుఁ దనసుప్రతీకంబుతోడ ఘటోత్కచుఁ దలపడుటయు భీమసేనాభిమన్యుద్రౌపదేయసత్యధృతిక్షత్రదేవచేదిదశార్ణపతివసుధాను లతనికిం బాసటమై నిలిచిన నుభయసైనికులకును యమరాజ్య వృద్ధికరంబుగాఁ జతురంగబలము లొండొంటిం దాఁకునెడ నిపుణహస్తిపకోపనీతంబులవుటం జేసి తలలు డీకొనియుఁ గొమ్ముల గ్రుచ్చియు రోషసంరంభమునఁ బెద్దయుఁ బ్రొద్దు పోరి బలమఱి కూలునేనుంగులును, బలంబు మెఱయఁ జలంబునెఱయ సింహనాదభీషణంబుగ వింటినేర్పు చూపుచుఁ జిక్కినవారిం జంపుచుఁ జిక్కి చచ్చుచు ననేకప్రకారు లయినరథికులును, ప్రాసపాణు లయినరవుతులుపురికొల్పఁగఁ జామరాపీడములు చలింప మీఁది కెగయుచుఁ బ్రతిఘటించినవానిం జదిపి లాఁతిపోట్లం జదియుగుఱ్ఱములును, శక్తితోమరాద్యాయుధంబుల నెదిరిం బొడిచి తత్ప్రహారంబునకు గ్రుక్కుచు వికలంబులైనకాల్బలంబులునై పోరు ఘోరంబై చెల్లుచుండునంత భగదత్తుండు ప్రసవన్మదధారాభిరామంబై నిర్ఝరీపరీతగిరి ననుకరించుసుప్రతీకంబుపయిం గూర్చుండి యైరావతంబుమీఁదిపురందరునిచందమున నొప్పుచు భీమసేనుని మార్కొని గ్రీష్మాపగమసమయజలధరంబు

వారిధారలఁ బర్వతంబు నెట్టు లట్టుల బహుళశరాసారంబునఁ గప్పె. అందులకుఁ గోపదీపితుండై వృకోదరుండు భగదత్తపార్ష్ణిగ్రాహరథికులఁ బెంకండ్రఁ దీవ్ర బాణములఁ బొరివుచ్చిన నతం డలిగి తనయేనుఁగు నతనియరదముపయిం దోలుటయు నది యరివ్రాసి విడిచినయమ్ముచందంబున నతిరయమున భీమసేనుం దాఁకినం జూచి యభిమన్యుప్రముఖు లగునమ్మహారథు లందఱు నయ్యేనుఁగుం జుట్టుముట్టి బహుళశిలీముఖముల దానిమేనం గీలించిన నయ్యది శోణితసిక్తంబై ధాతురాగచిత్రితకులపర్వతంబుచాడ్పున నొప్పె. అప్పుడు దశార్ణపతి గజారూఢుండై భగదత్తగజముం దాఁకిన నాసుప్రతీకము చెలియలికట్ట సాగరంబునుంబోలె నద్దశార్ణపతివారణంబును నిలువరించుటయుఁ బాండవు లందులకు మెచ్చిరి. అంతఁ బ్రాగ్జ్యోతిషపతి రోషరూషితుండై చతుర్దశతోమరము లయ్యేనుఁగుపయి నేయుటయు నవి దానికవచంబుఁ జించి పుట్టలోఁ జొరఁబడుపాములవిధంబున మేను సొచ్చుటయు నాగజంబు జిఱ్ఱనం దిరిగి భైరవారవంబుఁ జేయుచు మహావాతంబు పాదపంబులంబోలెఁ దమమూఁకలభంజించుచు వెఱచి పఱచె. అయ్యేనుఁ గట్టులోడి పాఱినం గినిసి పాండవమహారథికులు భీమసేనపురస్సరులై సింహనాదభీషణంబుగ భగదత్తుం దాఁకి వివిధవిశిఖమ్ములను నానాశస్త్రములనుం బ్రయోగించుచు నొక్కయుమ్మడి మీఁది కురువడించినం గోపించి భగదత్తుఁడు నిర్భయుండై యంకుశమున నడిచియుఁ బాదాంగుష్ఠమునఁబొడిచియుఁ దనయేనుఁగుం బురికొల్పిన నది తత్క్షణంబ సంవర్తకానలంబుచాడ్పున రోషప్రజ్వలితంబై పాండవులచతురంగబలంబుల నేలం బెట్టి కాలం జమురుచుండ ఘటోత్కచుండు దీప్తవక్త్రనేత్రుండై భీషణాకారంబునం బొల్చిరోషప్రజ్వలితుండై కొండలనైనం బగిలింపఁ జాలినశూలంబుఁ జేతం గొని భగదత్తనాగంబుపై నేసె. స్ఫులింగమాలాభీలంబై పయిం బడవచ్చుచున్నయాశూలమును భగదత్తుఁడు దారుణం బయినయర్ధచంద్రబాణమున నఱికిన నది శక్రముక్తంబై నభోగతం బైనమహాశనివిధంబున నొప్పె. అట్లది రెండుతునియలగుడు నారాజు వహ్నిశిఖోపమం బైనరుక్మదండమహాశక్తి నయ్యసురపై నేసి నిలునిలుమనియదల్చుటయు నతండు తటాలున వియత్తలమునకు లంఘించి దానిం బట్టుకొని సింహనాదంబు సేసి మోఁకాలఁ బెట్టి విఱుచుటయుఁ జూచుచున్న ఖేచరులబ్బురం బందిరి. భీమసేనాదు లగుపాండవులు ఘటోత్కచుండు లెస్సచేసె నని ప్రస్తుతివచనముల భూనభోంతరంబు నించిరి. వారిప్రహర్షాలాపముల సైరింపక తీవ్రప్రతాపదీపితుండై భగదత్తుఁడు ధనుష్టంకారం బొనర్చి విమలతీక్ష్ణంబులు జ్వలనప్రభములు నగునారాచముల నరివ్రాసి యొక్కట భీమునిఁ దొమ్మిదింటఁ దత్పుత్రుని మూఁట సౌభద్రుని నేనింటఁ గేకయపతుల నేవురను నొక్కట షు

త్ర దేవుదక్షిణభుజమును నేనింట ద్రౌపదీపుత్రపంచకంబును నొా నేసి యంత నిలువక మఱియు నొకయమ్మున క్షత్రదేవువిల్లు దునిమి నాల్గింట భీమసేనునితురంగములఁ జంపి మూడింటఁ దదీయసింహధ్వజంబుఁ గూల్చి వెండియు మూట సారథి నొా నేసిన నావిశోకుఁడు మూర్ఛితుండై రథమున నెఱగఁ బడియె. తనసారథి మూర్ఛితుం జేతకుఁ గోపారుణితలోచనుండై ప్రభంజనాత్మజుండు విరథుఁడు గావున గదాపాణియై తేరు డిగ్గ నుఱికి శిఖరసముల్లసితధరాధరంబుచందమునఁ బొల్చుటయు మనమూఁకలు నివ్వెఱఁ జెంది విన్నఁబోయె. అప్పుడు శత్రుసంహారోద్యతుం డైనధనంజయుండు తనమునుము బయలైన భీమఘటోత్కచులున్నచోటికి వచ్చుటయు రారాజు మనసేనలకుఁ జేయి వీచినం గౌరవానీకంబు భగదత్తపురస్సరంబై యమ్మేటివిలుకానిం దలపడుటయుఁ బోరు ఘోరం బయ్యె.



అప్పుడు భీమసేనుఁడు వివ్వచ్చుం దఱియ నరిగి యిరావంతుఁ డలంబుసునితోడం బోరి మడియుటఁ దెలిపిన విని శోకావిలమానసుండై ధనంజయుండు పెద్దయుంబ్రొద్దు నిట్టూర్పులు నిగిడించి కొండొకవడి యూరకుండి యెట్టకేలకు ధైర్యంబుఁ దెచ్చికొని వాసుదేవున కిట్లనియె. విదురుఁడు మహాప్రాజ్ఞుఁడు గావునఁ దొలుతనే యుద్ధమునఁ గౌరవపాండవులకు ఘోరభయ మగు నని యెఱింగి పలుదెఱంగుల ధృతరాష్ట్రుని వారించె. అతండు సెప్పినట్లే వారిచే మనవారు గొందఱు మనవారిచే వారివారు గొందఱును బొలిసిరి. అక్కటా! కుత్సితకర్మం బైనను యుద్ధ మర్థనిమిత్తమునఁ జేయఁబడుచున్నది. జ్ఞాతిసంక్షయనిమిత్తం బైనయర్థంబు గాల్పనే? ధనములేనివానికిఁ జావు మేలుగాని జ్ఞాతివధమున ధనార్జనంబు మేలు గాఁ దోఁపదు. కృష్ణా! సమాగతు లయినజ్ఞాతులఁ జంపి యేమి పొందఁగలము. కర్ణసౌబలులదుర్మంత్రమునను దుర్యోధనునపరాధమునను క్షత్రియులు దెగుచున్నవారు. అజాతశత్రుఁడు మహానుభావుఁడు గావున నైదూళ్లిచ్చినను మాకుఁ జాలు ననిచెప్పిపుత్తెంచె. అది యిప్పటికిఁ జూడ నెంతయే మేలని తోఁచుచున్నది. ఆదుర్యోధనుఁడు దుర్మతి గావున నందులకు నియ్యకొనఁడయ్యె. రణరంగమునఁ బడియున్నరాజులం జూచి నామనంబు పొగులుచున్నది. నాచే నిందఱు తెగిరికదా యని నన్ను నేన నిందించికొనియెద. క్షత్రధర్మం బింతకష్టంబై యుండునే? జ్ఞాతులతోడఁపోరు నాకు సమ్మతంబు గాకుండిన నిప్పు డూరకుండినం జాలమి పెట్టుదురు గావున నపకీర్తికి వెఱచి యింకను నాలమునకుఁ గడంగెద. ధార్తరాష్ట్రసేనలపయిం దేరు పఱపుము. అపారం బైన సంగ్రామసాగరంబు నీఁదెద. శాంతియై నూరకుండఁగ నిది తఱిగా దనుటయుఁ బుండరీకాక్షుండు వాయువేగంబు లయినగుఱ్ఱములఁ దఱుమ మనమూఁకలు వా

తోద్ధూతకల్లోలమాలికాభిరామం బైనపర్వసమయంపుసంద్రంబుచందమున స్ఫారనాదగంభీరంబై ఘూర్ణిల్లుచుండ నపరాహ్ణం బయ్యె. అట్టియెడ నీకొడుకులు వసువులు దానవుంబోలె నాచార్యుం బరివేష్టించి భీమసేనుం దాఁకిరి. భీష్మకృపభగదత్తసుశర్మలు ధనంజయుం దలపడిరి. బాహ్లీకకృతవర్మలు సాత్యకిని మార్కొనిరి. అంబష్ఠకుఁడు సౌభద్రుం గవిసె. తక్కటివారు తక్కినవారిం బ్రతిఘటించుటయు రణంబు దారుణం బయ్యె.

భీముఁడు వ్యూఢోరస్కకుండలిప్రభృతు లగుకురుకుమారులఁ జంపుట.

భీమసేనుఁడు తన్ను మార్కొన వచ్చిననీకొడుకులంజూచి పురోడాశంబు వ్రేల్వ మండువహ్నిచాడ్పునఁ గ్రోధమున దీపించుటయు వారు ప్రావృట్పయోధరములు ధరాధరంబు నెట్లు లట్టుల బహుళశరాసారమునం గప్పినం గోపించి యతండు క్రొల్పులివీఁక మెఱసి సెలవుల నాకుచు వారిధారలఁ బర్వతమును ముంచువారిదంబుచందంబున నాచార్యుఁడు పటుశరాసారంబున ముంచినఁ గొంచెమేనియు సంచలింపక వర్షధారలకుఁ దడియకుండఁ దలవాంచి పోవుమహోక్షంబులీలఁ దదీయశరపరంపరలు సరకుసేయక గొఱియలలోనఁ జొరఁబడిన తోఁడేలుచందమున నురువడించి నిశితక్షురప్రమునఁ దీక్ష్ణభల్లమునఁ దీవ్రబాణమున వెడందయమ్మున వాఁడికోలను వాలికతూపున శాతమార్గణంబున ఖరశరంబునఁ దిగ్మవిశిఖంబున వ్యూఢోరస్కునిఁ గుండలిని ననాధృష్టినిఁ గుండభేదుని వైరాటుని దీర్ఘలోచనుని దీర్ఘబాహునిఁ గనకధ్వజునిం బడ నేయుటయు నాకుమారులు రక్తసంసిక్తగాత్రులై వసంతసమయంబునఁ జూచినచూతంబులట్లు చూడ నొప్పి పడిమడిసిరి. హతశేషు లయిననీకొడుకులు సింగముఁ గన్నక్షుద్రమృగంబులట్లు కాలాంతకతుల్యుఁ డైనయావృకోదరుం జూడ నోడి పఱచిరి. అర్జునుఁడు గాంగేయగౌతమభగదత్తసుశర్మ లేయుబాణములకెల్ల మాఱు సేయుచుఁ బెక్కమ్ములఁ బరఁగించి మనమూఁకల యమపురమున కనుచుచుండె. అభిమన్యుఁడు నంబష్ఠుం దలపడి విరథుం గావించిన నతండు సిగ్గు గదుర రయమునఁ గరవాలం బతనిపై నేసి తేరు డిగ్గి కృతవర్మరథం బెక్కె. యుద్ధమార్గవిశారదుఁ డైనసౌభద్రుఁడు లాఘవమున నాకృపాణంబుఁ దట్టివేయుటయు నందఱు నయ్యర్జునాత్మజుం బ్రశంసించిరి. ధృష్టద్యుమ్నాదు లయినపాండవయోధులకును దక్కినమనయోధులకుఁ బోరు ఘోరరూపంబై చెల్లుచుండె. ఏమి చెప్పుదు నప్పరమాభీలసమ్మర్దంబున నొండొరులం దలపడి సిగలఁబట్టి వంచియు, గోళ్ల గిచ్చియుఁ, బండ్లఁ గఱచియుఁ, బిడికిళ్లఁ బొడిచియు, మోఁకాళ్ల నడిచియు, నరచేతులఁ జఱచియు, భుజములఁ బెనంగియుఁ, గృపాణముల నేసియుఁ, దండ్రి కొడు కనివిచారింపక నిర్మర్యాదంబుగ నొపినకొలంది పోరి పరస్పరప్రహారంబునను నానావిధహేతి

వ్రాతసంపాతంబునను గజవాజిరథక్షోభంబునను భిన్నమస్తకులై విదీర్ణగాత్రులై నేలం బడుపదాతులును, దొండములు తునియఁ గుంభము లవియ గాఢవేదనం జేసి ప్రబలఘీంకారం బొనర్చునేనుంగులును, నాలుకలు వెడలించి లాలాజలంబుఁ గ్రక్కుచు శోణితసిక్తంబులై నేలం బడుగుఱ్ఱములును, బహుధాభగ్నంబులై కొండలంబోలి పడినకింకిణీజాలభూషితస్యందనంబులును, శ్మశ్రుకుండలకిరీటమండితంబులై ధరఁ దొరిగియుఁ జెన్ను దఱుఁగక పద్మేందుసదృశప్రభంబు లయిన యాననంబుల నొప్పువీరరథికమస్తకంబులును, గంకటకేయూరభూషితంబులై భవ్యాంగరాగరూషితంబు లై నవిచ్ఛిన్నబాహుదండంబులును, హస్తిహస్తోపమంబు లయినయూరువులునై ఘోరంబయ్యుఁ గయ్యంపునేల తైలధౌతంబులవుటం జేసి నిర్మోకము విడిచినపాములఁ బోలినకనకపుంఖశరనికరశకలంబులును,జాతరూపమయపట్టసప్రాసభిండివాలశక్తియష్టితోమర ప్రముఖనానావిధహేతివ్రాతఖండంబులును, నెత్తుటం జొత్తిల్లి శాంతజ్వాలంబు లైనయనలములఁ బోలినపసిఁడిమైమఱువుల్లియఱవలులును, రాలినమణికనకభూషణగణంబులును, బరాగపటలకంబళకుథావళులును, వివిధఛత్రచామరసంఘాతంబులునుం గలిగి దివ్యాంబరాభరణములఁ దాల్చినయుత్తమసీమంతినివిధమునను వివిధగ్రహనక్షత్రసమంచితంబయినగగనంబుచందమునను నభిరామంబయియుండునంత నాదిత్యుం డస్తగిరిశిఖరాంతర్హితుం డగుటయుఁ జీఁకట్లు గ్రమ్ముకతన నుభయసైనికులు రాజాజ్ఞమెయి యుద్ధావహారంబుఁ గావించి తమతమశిబిరముల కరిగిరి.

దుర్యోధనుఁడు కర్ణాదులతోడ నాలోచించుట.

అవ్విధమున శిబిరమున కరిగినపదంపడి దుర్యోధనుఁడు పాండవుల జయిం పఁగ నిరపాయం బయినయుపాయం బెయ్యదియో యనిచింతించుచుఁ గర్ణశకుని దుశ్శాసనుల రావించి యేకతంబ సూతపుత్రున కిట్లనియె. కర్ణా, భీష్మద్రోణ కృపశల్యసోమదత్తులు పాండవులం బిట్టేయరు. అందులకుఁ గారణం బెఱుంగనయ్యెద. వారల వధింపకునికిం జేసి యుక్కుమిగిలి ప్రతిదినంబును మనమూఁకలఁ జంపుచున్నవారు. ఏను నానాఁటఁ బ్రక్షీణబలుఁడను బ్రక్షీణశస్త్రుఁడను నగుచున్నవాఁడను. దేవతలకు నజేయు లయినపాండవేయులు నన్నుఁ బరాభవించిరి. ఎట్టు వారల గెలువనేర్తు నని పెనుసందియంబు నామనమున నెలకొనియున్న దనిపలికినం గర్ణుఁ డతని కిట్లనియె. భరతపుంగవా, వగవం బని లేదు. ఏను నీకుఁ బ్రియంబు సేయుదు. భీష్ముఁడు కయ్యముఁ జాలించుఁగాక. అతఁడు సాలించెనేని నేను పాంచాలురను బాండవులను నాభీష్ముఁడు సూచుచుండఁగనే నీయాన క్షణమాత్రన తెగటార్తును. భీష్ముఁడు పాండవులమీఁది కారుణ్యమునం జేసి వారలనొప్పింపఁడు నేయ నొల్లఁడు. మఱియు నమ్ముదుకఁడు రణాభిమానియును రణప్రియుండునకాని

పాండవులఁ దెగటార్పఁ జాలఁడు. ఇంకను నతండు నిన్ను గెలిపించు నని తలంప
వచ్చునే ! నీవు శీఘ్రంబ వానిశిబిరమున కరిగి గురువృద్ధుఁ డైనయతనిం బ్రా
ర్థించి సమరం బుడుగునట్లు చేసిరమ్ము. నే నెవరి నెట్లు చేయుదు నది పదంపడి
చూతు వనిచెప్పిన విని దుర్యోధనుఁడు దుశ్శాసనుం బిలిచి యిపుడు భీష్మునిశిబి
రంబునకుఁ జనియెద. బలఁగమెల్ల నాయితపడి యుండునట్లు చేయు మనిపలికి
యటఁ గర్ణునిదెస మొగంబై యయ్యా, భీష్ముఁడు రణము సాలించినపదంపడి
నీబీరంబును లావును బలంబునుం జూపవలయు ననియగ్గించి యనిచె.

### దుర్యోధనుఁడు భీష్మునొద్దకుఁ జని తనపరాభవముఁ జెప్పికొనుట.

అంత మజ్జనశాల కరిగి యారాజు సురభిసలిలములఁ గృతస్నానుండై దివ్య
దుకూలములఁ గట్టి కాశ్మీరభావితంబు గావునఁ గనకవర్ణంబై లలితపరిమళసము
ల్లసితం బైనకమ్మగందం బలంది కటకకేయూరహారకిరీటాదినానామణిమయభూ
షణగణముల ధరించి దేవపరివృతుం డైనసురేంద్రునట్లు భ్రాతృపరివృతుండై
సింహఖేలగమనంబునఁ గొన్నియడుగులు నడిచి కక్ష్యాంతరంబులు గడచి యు
త్తమహయం బారోహించి తమ్ములు గజతురగరథముల నెక్కి వెంట రాఁగ
నానాయుధపాణులై రక్షకభటులు చుట్టునుం బరివేష్టించి నడువ గంధతైలసే
చితంబు లైనకాంచనకరదీపికాసహస్రంబులు వెలుంగ వేత్రఝర్ఝరపాణులు
కాంచనోష్ణీషధారులు నగుకంచుకులు తొలంగుతొలంగుం డని యెడ గలుగ
జడియ వందిజనసందోహస్తుతిపాఠరవంబులను వైతాళికజయశబ్దంబులను మధు
రవాదిత్రనిస్వనంబులనుం జిత్తగించుచు రాజులసవినయాంజలిబంధంబుల హస్తి
హస్తోపమదక్షిణభుజ మెత్తి గ్రహించుచు మెల్లమెల్లన భీష్మశిబిరముఁ దఱియ
నరిగి ద్వారదేశమునఁ దురంగంబు డిగ్గి యభ్యంతరమునకుఁ జని యాపితామహు
నకు సవినయముగ నెఱఁగి యతనిగద్దియచేరువఁ గాంచనసర్వతోభద్రాసన
మునం దదనుజ్ఞాతుండై కూర్చుండి బాష్పపూరితలోచనుండై గద్గదస్వరంబున
నిట్లనియె. పితామహా, నిన్నాశ్రయించుటం జేసి మేము సురాసురులనైనం గెలు
వఁ జాలుదుము. పాండుసుతులం జెప్ప నేల? కావున మాపైఁ గరుణించి
యింద్రుఁడు దానవులంబోలె వారలఁ దెగటార్పుము. ఏను పాంచాలసో
మకకేకయాదుల నందఱం బరిమార్తు నని యిచ్చినబాస తప్పకుండఁ జేయుము.
వారిమీఁదికారుణ్యముననొండె నాపై ద్వేషముననొండె నాదౌర్భాగ్యముననొండె
నీకు వారలఁ జంపఁగఁ దలంపు గలుగదేని యాహవప్రోద్దాముఁ డైనకర్ణుడుఁ
రణము సేయ ననుజ్ఞ యిమ్ము. అమ్మేటిమగఁడు వారలను వారివారలనుం బరిమా
ర్చు ననిచెప్పి పిదప నేమియుఁ బలుకక కూరకుండుటయు మందాకినీనందనుండు
నీకొడుకుపలుకులు దనచెవులకు ములుకులై సోఁకుటయు మహానాగంబువోలె

రోఁజుచు నత్యంతవిషాదభరితుండై ప్రియవచనం బెద్దియుం జెప్పక పెద్దయుం బ్రొద్దు పలుకక చింతించిచింతించి ముల్లోకముల నేర్చువిధమునఁ గోపాటోపదీపితుండై కన్నుఁగవఁ ద్రిప్పుచుఁ గొండొకవడికిఁ దనకుఁ దాన యూఱడిల్లి పదంపడి సామపూర్వముగ భవత్పుత్రున కిట్లనియె. దుర్యోధనా, ప్రాణములమీఁది యాశ మాని నీకుఁ బ్రియము సేయం దలంచి శక్తికొలఁది పోరుచున్ననన్ను నీ వేల యిట్లు దారుణవచనశల్యములఁ బొడిచెదవు. ఇంద్రాదు లడ్డపడినను విక్రమించి ఖాండవముఁ గాల్చినప్పుడును, నీవు ఘోషయాత్రకుఁ బోయి మీకర్ణుఁ డోడిపాఱఁగ నీవును నీతమ్ములును గంధర్వులకుఁ జిక్కుటయు వారలం గెలిచి మిమ్ము విడిపించినపుడును, విరాటుపసులం బట్టినతఱి నిన్ను నన్ను నాచార్యుని గృపాశ్వత్థామలను మీకర్ణామలనుం గెలిచి యుత్తరకుఁ బ్రీతిఁ గావించువాఁడై తలచీరలం గ్రహించి మనల నందఱ నోడించినపుడును నర్జునువిక్రమంబు నీవును గన్నులారఁ జూచినవాఁడవకదా. ఇంద్రునకు నజేయు లైననివాతకవచాదుల నతండు సంపుట నీచెవి సోఁకియేయుండుఁగదా. అవ్వీరశేఖరుం గెలువ నెవ్వండును నేరఁ డింతయు నిక్కువంబు. సర్వేశ్వరుఁడు దేవదేవుఁడు సనాతనుఁడు సృష్టిస్థితిలయకారణభూతుఁ డనంతశక్తిసంపన్నుఁడు సకలభువనరక్షకుఁడు నగు వాసుదేవుఁ డతనికి రక్షఁగావింప దీక్షఁ బూనియున్నవాఁడు. పాండవులతోడిపగవలనం జేటు పాటిల్లకమాన దని నారదాదిమహర్షు లెంత వారించినను వినక వాచ్యావాచ్యము లెఱుఁగక ప్రల్లదములు పలికితివి. ముమూర్షుఁ డైననరుఁడు సర్వవృక్షములను గాంచనంబులఁగఁ జూచుతెఱంగున నీవు సర్వంబు విపరీతంబుగఁ జూచుచున్నవాఁడవు. వలదనిన వినక పాండుసుతులతోడఁ బోరు గావించికొంటివి. శక్తికొలఁది కయ్యము సేయుము. నీమగఁటిమిం జూతుము. శిఖండితక్కఁ దక్కినపాంచాలురను సోమకసృంజయులను నేను గీటడఁగించెద. నాకు శిఖండిని మార్కొనఁ దగదు. అందులకుఁ గారణంబు నీ వెఱుంగుదువుకదా. ఇఁక నేను సమరమునఁ బాంచాలురఁ జంపుటయొండె వారిచేఁ జచ్చుటయొండెఁ గాఁగలయది. శిబిరమున కరిగి సుఖముగ నిద్రింపుము. రేపు నీకుఁ బ్రియముగ నోపినకొలంది పోరెద. పుడమి గలుగునందాఁక నాకయ్యము లోకవిశ్రుతంబై యుండుఁగాక యని వీడుకొల్పుటయు దుర్యోధనుఁ డతనికి సాష్టాంగదండప్రణామం బాచరించి నిజశిబిరమున కరిగి సుఖనిద్రసలిపె.

### తొమ్మిదవనాటి యుద్ధము.

అంతఁ దెలతెల వేగుటయు నిదుర మేల్కాంచి కర్తవ్యములఁ దీర్చి కురుక్షోణీవల్లభుండు పడవాళ్లం బిలిచి యుద్ధసన్నాహమున వెడలుఁడు భీష్ముఁడు నేఁడు సకలపాంచాలురఁ బరిమార్చువాఁ డనిన నయ్యాపగేయుండు నీకొఱకు

నుడుల విని రాత్రివిలపితంబుఁ దలపోసి యది త న్నవమానించినవిధంబుగ భావిం
చి పరమనిర్వేదంబు నొంది పరులచే మాటపడవలసివచ్చెఁగా యని తనలో
విసివి విన్వచ్చు నెదిర్చి పోరాటకు వగచుచున్నంత దుర్యోధనుం డతనిచందం
బెఱింగి దుశ్శాసనుం బిలిచి నేఁ డిరువదిరెండువేలరథములఁ బితామహునకుఁ
గావలియై యుండఁ బంపుము. ఏండ్లుపూండ్లు పూఁచిపట్టినయాలం బిప్పటికి సమ
కూఱె. పాండవవధంబును మనకు సర్వరాజ్యాగమంబును గాఁగలయది. మనము
లెస్స గావలియై యుండుదుమేని యిమ్మేటిమగండు మనకార్యమును సాధించి
యిచ్చువాఁడు. స్త్రీపూర్వుఁ డయినశిఖండిమీఁదఁ దాను గవియమి మనయుద్యో
గంపుసమయంబునన యిమ్మహాత్ముఁడు వివరించెఁగదా. కావలి లేనిమహాసింహము
నైనను దోఁడేలు చంపనోపుఁ గావున సర్వవిధంబుల గాంగేయపాలనంబు మనకుఁ
గర్తవ్యంబు. దాన మనకు విజయంబు సిద్ధంబు. ఆచార్యుండును శారద్వతుండును
శల్యశకునివివింశతిప్రముఖులును శాంతనవరక్షణపరత్వమున జాగరూకులై యుం
డుట లెస్స యనిచెప్పిన నందఱును సురేంద్రుని బృందారకు లెట్టు లట్టుల మం
దాకినీనందనుం బరివేష్టించి పుడమి గ్రక్కదల సంగరోత్సాహంబున నడుచు
చుండ దుర్యోధనుండు వెండియు దుశ్శాసనుం బిలచి యుధామన్యూత్తమౌ
జులు దనకు వామదక్షిణచక్రరక్షకులుగాఁ గృష్ణసారథికరథం బారోహించి గాం
డీవి కావలియై పురికొల్పఁగ శిఖండి పితామహుపయిం గవియ వచ్చుఁ గావున
నతని కెడ గలుగకుండఁగ మనము నిపుణప్రకారమున మెలంగవలయు ననిపలు
కుచున్నంత శాంతనవుఁడు సేనల సర్వతోభద్రవ్యూహమునఁ బన్నించె. అందుఁ
గృపకృతవర్మశైబ్యశకునిసైంధవసుదక్షిణులును నీకొడుకులునుం బరివేష్టింప నా
యాపగేయుండు ముందఱను ద్రోణశల్యభూరిశ్రవోభగదత్తులు వలపటను ద్రౌ
ణిసోమదత్తవిందానువిందులు దాఁపటను శ్రుతాయురలంబుసప్రముఖులు వెను
కను ద్రిగర్తపరివృతుండై సుయోధనుండు నడుమను దక్కినమహారథు లెడ
నెడం గలిసి నిలిచి ప్రజ్వలితాగ్నులమాడ్కి వెలుంగుచుండిరి. మనవారిమోహ
రంబు సూచి సవ్యసాచి ధృష్టద్యుమ్నుం బిలిచి కౌరవవ్యూహమునకుఁ దగినరీ
తిని మనము మోహరింపవలయు ననిచెప్పి భీష్మునికట్టెదుట శిఖండిని నిల్పి యత
నికిఁ దా నెక్కవలనికిఁ గావలియై నిలిచి ఘటోత్కచు నెక్కదెసనిలిపి భీమసేన
మాద్రేయులును ధృష్టద్యుమ్నవిరాటసాత్యకులునుం గొలువ ధర్మనందను ముం
దఱ నుండఁజెప్పి చేకితానకుంతిభోజులను నభిమన్యుద్రుపదకైకయులును దక్కిన
మహారథుల నందఱను నయ్యజాతశత్రునికెలంకుల నియమించి గట్టిమొన గట్టిన
నుభయసైన్యంబులు భేరీమృదంగపణవశంఖారవంబులును వీరయోధసింహనా
దంబులును గరితురగరథనిస్వనంబులును భూనభోంతరంబు నిండ నొండొంటిం

దాఁకె. అట్టియెడఁ బక్షిజాలంబు ఘోరముగ నఱచుచు మింటఁ దిరిగె. ఆదిత్యుఁడు నిస్తేజస్కుఁడయ్యె. బెట్టిదపుగాడ్పులు విసరె. వఱఘు లఱచె. దిగ్దాహంబు గన్పట్టె. అస్థిరుధిరభూయిష్ఠంబై పాంసువర్షంబు గురిసె. వాహనములుకన్నీరును శకృన్మూత్రంబులను విడిచె. యోధులత్స్వేశారవంబులు వినఁబడనివిధంబుగ శునకవాయసస్వనంబులు బలిసె. దివాకరుం దాఁకుచుఁ గొఱవులువడియె. అవ్విధమున భయసూచకంబు లయినయుత్పాతంబులు దోఁచుచుండ నుభయసైన్యంబులు చండవాతోద్ధూతసాగరంబులభంగి ఘూర్ణిల్లుచుండె.

## అభిమన్యుఁడు కౌరవసేనపై విజృంభించుట.

అయ్యవసరంబునఁ బిశంగతురంగయోజితరథోదారుండై నసుభద్రాకుమారుండు కౌరవసేనపయి నడరి వార్షుకజలధరంబుభంగి యమదండసన్నిభములగుఘోరనారాచములఁ గురిసి చతురంగబలములఁ బ్రేతరాజనివేశనమున కంపుచుండ వానికోల్తలల కోహటించి మనమూఁకలు పెనుగాలికిఁ బఱచుదూదికైవడిఁ దోఁచినట్లెల్లఁ బాఱియుఁ బంకనిర్మగ్నంబు లయినసింధురంబులపోలె గతిఁ గానక చీకాకుపడియు నగ్గిలోనం బడినమిడుతలవకువునఁ బొడవడంగియు బెండువడియున్నంత ద్రోణద్రౌణికృపసైంధవు లడ్డపడిన నమ్మేటివిల్కాఁడు పూచినమ్రానినుండి వెడలుతేంట్లబారులచాడ్పున శరజాలంబులఁ బరఁగించి యమ్మహారథుల నందఱను వెగడుపఱిచి యవక్రవిక్రమాటోపంబున దీపించుచుండ నందఱునితండు రెండవగాండీవిగాని సామాన్యుండు గాఁడని పలుదెఱంగుల నగ్గించిరి. ఏమి చెప్పుదు వానికోదండంబు మడలీకృతంబై యెల్లపుడు సూర్యమండలమునకుఁ బోల్పఁ దగి యేదిక్కు చూచిననుం గానవచ్చుచు మేఘపటలంబునడుమ మెఱయుకార్మెఱుంగు తెఱంగునం గాన నయ్యె. అతం డట్లు మయాసురసంహారోద్ధతుండై నపురుహూతునిమాడ్కి సుహృదులకు మోదముఁ గావించుచు నురువడించిన మదిరాపానవిహ్వల యగుతరుణికరణిఁ జెయ్వులు దక్కి యార్తనాదనిబిరీసంబై మారుతోద్ధూతసాగరంబుభంగిఁ గలంగిననిజసేనం జూచి సుయోధనుఁ డలంబుసుం బిలిచి రాక్షసేశ్వరా, చూచితే యభిమన్యుఁడు రెండవకిరీటియనం బేర్చి వృత్రారిసుతుఁడు సురసేన నెట్టు లట్టుల మనసేనఁ జిందఱవందఱ గావించుచున్నవాఁడు. సర్వవిద్యాపారగుఁడ వైననీవు మార్కొనుటదక్క వీని మగంటిమికి మందు వేఱొక్కటి గానంబడదు. కావున రయమున నడరి వానిం బిలుకుమార్పుము. భీష్మద్రోణులపాపున మేము పార్థుం బరిమార్పఁ గడంగెదమనిన నాఋశ్యశృంగపుత్రుఁడు తత్క్షణంబ వార్షుకవారిదస్ఫూర్జితోపమం బయినసింహనాదంబుఁ గావించుచుఁ బాండవసేనపై నడరుటయు వానియార్పునకు గుండియలు పగులఁ గొందఱు సమసిరి. సైన్యమంతయుఁ బవనోద్ధూతార్ణవంబు

భంగిఁ గలంగె. అట్టియెడ నభిమన్యుఁడు వానిం దలపడుటయు నారాక్షసుఁ డతనిం గ్రేడించి బలుఁడు సురసేనంబోలెఁ బాండవసేనం దఱిమి యఱుముటయు నయ్యది యేనుంగుచేతఁ జిక్కినపద్మలత కెనయైయుండ ద్రౌపదీపుత్రు లేవురు యుగవిగమంపుఁదఱిఁ బంచగ్రహములు చంద్రుంబోలె వాని నఱిమి నిశితశరము లేయుచుండ యుధిష్ఠిరపుత్త్రుం డైనప్రతివింధ్యుఁ డుక్కుమిగిలి తీక్ష్ణమార్గణములఁ గత్తళంబు వ్రచ్చి వాలికతూపుల మేనం గీలించిన నయ్యసుర నెత్తుటం జొత్తిల్లి సూర్యకిరణసంస్యూతం బయినజలధరంబురీతిని గాత్రసంసక్తంబు లయినబాణముల నిండి శిఖరసమేతం బయినభూధరంబుభంగినిం జూడ నొప్పె. అలిగినపాములంబోనివారివాలికతూపులకు నొచ్చి యద్దనుజుండు ముహూర్తమాత్రంబు మూర్ఛితుండై కొండొకవడికి లేచి యేచినకోపంబున నప్పాండవకుమారులకేతనంబులఁ గూల్చి విండ్లఁ దునిమి నవ్వుచు నై దేసియమ్ముల నొక్కొక్కని నొా నేసి సంరంభసముద్రిక్తుండై గుఱ్ఱములం జదిపి సారథుల సమయించి పెక్కుమార్గణగణంబుల ననర్గళముగఁ గురియుచు జిఘాంసామనీషం దఱియుచున్నంత సౌభద్రుండు రౌద్రంబు మొగంబునం దళుకొత్తఁగఁ దమ్ములఁ దలకడచి యయ్యసురపై నడరుటయు వృత్రవాసవులసమరంబుచందమున వారిపోరు ఘోరం బయ్యె ననవుడు ధృతరాష్ట్రుఁడు సూతసుతా, వారికయ్యంబెట్లు చెల్లె? భీమార్జుననకులసహదేవ సాత్యకి ఘటోత్కచులయాలంబు విధం బెట్టు లనియడుగ భీమార్జునాదులు భీష్మ ద్రోణప్రముఖులతోడ నుక్కుమిగిలి పోరి రదియట్లుండె. అలంబుసాభిమన్యుసంగ్రామప్రకారంబుఁ దొలుత వివరించెద విను మని యాంబికేయునకు సంజయుఁ డిట్లనియె.

## అభిమన్యుఁ డలంబుసునితో యుద్ధముచేయుట.

అవ్విధమునఁ దనపై నడరినయభిమన్యుం దాఁకి యలంబుసుఁడు నిలునిలు మని యదల్చిన నాసౌభద్రుం డయ్యసురకుఁ దనతండ్రులకుం గలవైరంబుఁ దలపోసి దిక్కులుపిక్కటిల్ల నార్చి పేర్చి యెదిర్చినం జూప అలంబుసుఁడు వివిధమాయావిశారదుఁ డభిమన్యుఁడు దివ్యాస్త్రగ్రామంబు నేర్చినవాఁడు, వీరిపో రెట్టులు కాఁగల దోయని చూచుచుండిరి. అప్పు డభిమన్యుం డేచి నారాచత్రయంబును సాయకపంచకంబును వానిపై నేసిన నతం డలిగి తొలుతఁ దొమ్మిదియమ్ముల విజయసూనుపయిం బరఁగించి తోడన పెక్కుబాణంబుల నొా నేసినం గోపించి గాండీవికొడుకు తొమ్మిదియమ్ముల వానిఁబొమ్ము నాటనేయుటయు నవి వానిమైమఱువు వ్రచ్చి మేను సించిన నతండు నెత్తుటఁ జొత్తిల్లి కుసుమితాశోకతరునికరనిబిడం బయినపర్వతంబువిధంబునను గార్చిచ్చు పొదివినం గాలుచున్నకాననంబుచాడ్పునను జూడ నొప్పె. అంత నత్యంతక్రుద్ధుండై యలంబుసుఁడు బహుళశరముల నభిమన్యుగా

త్రంబు నొ నేసిన నతండునుం గోపించి యింద్రుఁడు మయాసురుంబోలెఁ దీవ్రవిశి
ఖముల నతని మేన నాటి విముఖుం గావించిన నయ్యసుర యంతటఁ జీఁకట్లు గ్రమ్ము
నట్లు మాయఁ గల్పించె. అమ్మాయాతిమిరంబునం జేసి పాండవసైనికు లభిమన్యుం
గానక వగచుచుఁ దమ్మును లాఁతులనుం దెలియఁ జాలక కొందలం బందుచుండు
నంత సుభద్రాసూనుండు సూర్యాస్త్రంబు సముద్దీపితంబుఁ జేయుటయు నామాయ
యెల్లఁ బొడవడంగినం బ్రకాశంబు గలిగె. అట్లది వమ్మగుట కలిగి యతండు పె
క్కు మాయలఁ గావించినం గిరీటినందనుండు దివ్యాస్త్రముల నేయుచు వానిమాయ
లెల్ల మాయించుటయు వాఁడు వెఱచి పఱచినం బాండుపౌత్రుండు మనమూఁకల
పైఁ గవిసి కోత్తలల సూఁపుటయు మనసేన వన్యగంధసింధురంబు గలంచినతమ్మికొ
లని చందంబున వికలం బయ్యె. అట్లు సౌభద్రుఁడుమన మూఁకలనెల్ల నేలకుంగో
లకుఁ దెచ్చుచుండఁ గినిసి భీష్మద్రోణప్రముఖు లగుమహారథు లొక్కపెట్ట వానిఁ
జుట్టుముట్టి బహుళశరజాలంబుఁ గురిసినం గొంచెమేనియు సంచలింపక తండ్రి
కిని మామకు నెనవచ్చుచు బెట్టిదుండై వాఁడిమగంటిమిం బేర్చుచుండునంత
నర్జునుండు పుత్రరక్షణతాత్పర్యమునఁ దోడ్పడుటయు నాపగేయుండు రాహువు
భాస్కరుంబోలె నమ్మేటిమగనిం దాఁకిన నతని నతిక్రమించి నీకొడుకులును శార
ద్వతుండు నయ్యర్జునుని మార్కొనిరి. అందుఁ గృపుఁడు కిరీటిపై నిరువదేనమ్ముల
నేయుటయుఁ బాండవప్రియంకరుండై సాత్యకి క్రోల్పులి కుంజరంబునుంబోలె
నతనిం దాఁకి శితశరములఁ బ్రయోగించె. అందుల కలిగి కృపాచార్యుఁడు రయ
మునఁ గంకపత్రవిలసితము లయినతొమ్మిదియమ్ముల నాశైనేయుపయి నడరించు
టయు నతండు కోపదీపితుండై కార్ముకంబుఁ గర్ణాంతకృష్టంబుఁ గావించి శిత
శిలీముఖం బేసినం బరమకోపనుం డైనయాచార్యసుతుండు దాని నడుమన రెం
డుతునియలు చేసె. అంత శినివర్యుండు కృపుని విడిచి రాహువు చంద్రుంబోలె
నశ్వత్థామం గవిసిన నతం డతనికోదండంబు రెండుఖండములు గావించి పెక్క
మ్ములం బరఁగించె. అంత శైనేయుఁడు వేఱొక్కధనువు గొని యఱువదియమ్ముల
నాచార్యసుతునురమ్ముఁ గాఁడ నేయుటయు నతండు మూర్ఛితుండై కేతుదండం
బూఁతగొని కొంతవడికిఁ దెలిసి కోపదీపితుండై నిశితనారాచ మొక్కఁడు బిట్టే
సిన నది పాము లాఁగనుంబోలె మేను సొచ్చె. అంత నిలువక యశ్వత్థామ వేఱొ
క్కభల్లమున నతని కేతనంబు నేలం బడఁ గూల్చి సింహనాదంబు సేసి గ్రీష్మాప
గమసమయజలధరంబు దివాకరుంబోలె ఘోరశరములం గప్పినం గినిసి సాత్యకి
వీర్యోద్ధత్యంబు మెఱయఁ బెక్కుమార్గణముల నయ్యమ్ములనెల్ల నడంచి మేఘప
టలనిర్ముక్తుం డైనతపనుపగిది వెలుంగుచు శరసహస్రంబుఁ గురియుటయు నా
చార్యపుత్రుండు తదీయబాణజాలసంవృతుండై రాహుగ్రస్తనిశాకరునిమాడ్కిఁ

జూడ నొప్పె. అప్పు డాచార్యుఁడు పుత్రరక్షణపరుండై శైనేయుం దాఁకి వాఁ
డితూ పొక్కటి యేసినఁ గోపించి యతం డశ్వత్థామను విడిచి ద్రోణుపై నడరి
యిరువదిబాణములఁ బరఁగించి నొంచుచున్నంత గాండీవి సాత్యకిం దలకడచి
గురుం దలపడుటయు బుధశుక్రులవిధమున నాగురుశిష్యులు పోరి రనపుడు నాం
బికేయుఁడు సంజయా, యాచార్యుఁడు ధనంజయునకుఁ గడుం గూర్చు నతండును
గురుపై మిక్కిలి భక్తి సేయుఁగదా. వా రిరువురు ప్రీతిభక్తులఁ దొఱంగి యెట్లు
పోరిరి? తెలియఁ జెప్పు మనియడుగ నరేంద్రా, పోరాట గలిగినప్పుడు గురువు
శిష్యుఁడు తండ్రి కొడుకు కనిచూడక నిర్మర్యాదంబుగ వాఁడిమిం బేర్చుట క్షాత్ర
ధర్మంబు గావున ద్రోణుఁ డర్జునుమీఁదిప్రీతిని నర్జునుఁడు ద్రోణునిమీఁదిభ
క్తినిం గణింపక పోరి రత్తెఱంగు విను మని ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె.

### ద్రోణార్జునులయుద్ధము.

అట్టియెడ నర్జునుండు గండడరి యాచార్యుమేన మూఁడువాఁడితూపులం
గీలించినం గణింపక యతండు కోపదీపితుండై కార్చిచ్చు కాననంబునుంబోలెఁ
బార్థుం బొదివి శరవర్షంబుఁ గురియుచున్నంత దుర్యోధనుపనుపునఁ ద్రిగర్తేశ్వ
రుం డైనసుశర్మ ద్రోణునకుఁ దోడ్పడి తైలధౌతంబు లైనయయోముఖశిలీము
ఖంబుల నిగిడించుటయు సుశర్మ చాపముక్తంబులై యయ్యమ్ములు శరదాగమం
బునఁ గ్రౌంచబిలంబు వెలువడునంచపిండులట్టులు చూడ నొప్పుచుఁ బండ్లప్రేఁ
గున నేలకు వ్రాలినతియ్యమావిమ్రాఁకుం బులుఁగు లెట్టు లట్టుల గాండీవిరథం
బుఁ గప్పె. అందులకుఁ గడుం గినిసి కిరీటి పెలుచ నార్చుచు నయ్యమ్ములనెల్లఁ
బ్రతిశరముల మాయించి యుగవిగమసమయరుద్రుమాడ్కి రౌద్రరసోల్లసితమూ
ర్తియై త్రిగర్తరాజును దత్పుత్రుని శరాసారమున ముంచి నొంచినం బిఱుదీయక
త్రిగర్తులు పార్థుం జంపుదుము చత్తు మింతియకాని యొండు లేదని. కృతనిశ్చ
యులై యతనిం దలపడి శరపరంపరలు పరఁగించినం గొంచెమేనియు సంచలిం
పక కొండవోలె నచలుండై పాండవమధ్యముండు దా నొక్కండ యందఱ కన్ని
రూపులై తదీయకాండములనెల్ల ఖండములం గావించి దేవదానవాదులు పిచ్చ
లింపఁగ మహావాతంబు వారిదంబులంబోలెఁ ద్రిగర్తసేనలఁ బటాపంచలు గా
వించి యంత నిలువక వాయవ్యాస్త్రం బేసినం దదస్త్రప్రభావమునఁ బెనుగాడ్పు
పుట్టి త్రిగర్తసేనలఁ గూలం ద్రోచుటయు మనమూఁకలు చీకాకుపడియె. అప్పు
డయ్యెడరు సూచి యాచార్యుండు శైలాస్త్రం బేయుటయు నాగాలి యడఁగె.
దిక్కులు ప్రసన్నము లయ్యె. అంత నర్జునుండు కన్నుఁగవఁ గెంపు గదుర విక్ర
మించి త్రిగర్తరథికులనెల్ల విముఖులం గావించినం జూచి దుర్యోధనుండును బాహ్లి
కుండును గృపాశ్వత్థామశల్యసుదక్షిణవిందానువిందులు నతనిం దాఁకినం గ్రందు

కయ్యం బయ్యె. అప్పుడు భగదత్తుండును శ్రుతాయువును బహుళకరిఘటాసమేతులై వృకోదరుం దలపడిరి. శలశకునిభూరిశ్రవులు నకులసహదేవుల మార్కొనిరి. కురుకుమారపరివృతుండై మీతండ్రి యుధిష్ఠిరునిపై నడరె. ఇట్లు నాలుగుమొత్తములై శూరు లొండొరులం దాఁకి పోరుచుండిరి. అందు భీముఁడు తనపై నడరినకరిఘటలం జూచి కోపదీపితుండై సింహవిక్రమంబు మెఱయ గదాపాణియై తేరు డిగి యేనుంగులనడుమ నిలిచి మేఘమండలమధ్యగతుం డైనమార్తాండునివిధమునఁ బొలిచి గద యెత్తి మోఁదుటయు నవిమహావాతంబునకు మేఘజాలంబువ్రోలెఁ దెరలిన వెండియుం దఱిమి కొమ్ములఁ బట్టి లాఁగి పెఱికి వానిచేతన కుంభములఁ బగిల్చి తదీయమేదోమజ్జారుధిరసంసిక్తగాత్రుండై లయకాలంపుశూలపాణికైవడి రౌద్రరసోల్లసితమూర్తియై గదపండువు సేయుటయు వానికట్టెదుట నిలువ నోడి మనయేనుంగులు జిఱ్ఱనం దిరిగి నిజబలముల మర్దించుచుండ మధ్యాహ్నం బయ్యె.

## భీష్ముఁడు పాండవసేనపై విజృంభించుట.

అట్టిమధ్యాహ్నసమయంబున నాపగేయుండు పాంచాలపాండవసోమకులం దలపడి శరపరంపరలు గురిసి యెల్ల వల్లు నుఱుచు తెఱంగునఁ గోలుమసఁగుచుండునంత ధృష్టద్యుమ్నశిఖండివిరాటద్రుపదు లతనిపై నడరి బహుళశిలీముఖము లేయుటయుఁ గ్రోధానలదహ్యమానమానసుండై యవ్వాఁడిమగండు శిఖండికి మాఱేయుటుడిగి ధృష్టద్యుమ్నవిరాటుల మూఁటను ద్రుపదు నొక్కటను నొప్పించె. అందులకుఁ గినిసి ధృష్టద్యుమ్నుఁడు మూడింటను ద్రుపదుఁ డిరువదేనింటను విరాటుండు పదింటను శిఖండి పంచవింశతివిశిఖంబులనుం గాఁడ నేసినం గాంగేయుండు రుధిరపరిప్లుతుండై కుసుమితరక్తాశోకపాదపంబుచందంబునఁ జెలంగుచు వారిమువ్వుర వేఱువేఱ మూఁడేసియమ్ముల నొప్పింప నిశితభల్లమున ద్రుపదుకోదండంబు రెండుఖండములు గావించిన నంతం డొండువిల్లెత్తి యైదింట నాపగేయుని నూ నేసి మూఁటఁ దత్సారథిని నొప్పించుచున్నంత ధర్మరాజు చేయి వీచి కరిఘటలపై నడరి గదపండువు సేయుచుండినవృకోదరుని ద్రౌపదేయపంచకంబును గేకయపంచకంబును సాత్యకినిం గూడఁ బెట్టుకొని పితామహుం దలపడుటయు నప్పు డిరువాఁగునఁ జేయంగలమగలు దమకుఁ దమకుఁ బోలినవారిం దలపడినం గ్రందుకయ్యం బయ్యె. అత్తుములంబున నేదిక్కు చూచినం బరస్పరశరప్రహారంబున హతసారథులై భగ్నరథులై విద్రుతతురంగులై మడియురథికులు, నితరేతరవిషాణవిఘట్టనంబునను వివిధహేతివ్రాతసంపాతంబునను మొగదిరిగి నిజబలంబుఁ ద్రొక్కుచుఁ బఱచుచు నేలం గూలినవమేఘప్రతీకాశంబులై యొప్పునేనుంగులును, దంతిరథికసాదిప్రహారంబునఁ జదియుఘోటకంబులును, జలం

బు డింపక పోరిపోరి తుది బలమఱి నేలకు వ్రాలినకాల్బలంబులును, వ్రేల్లినచెట్క్యంబులును, డొల్లినహారకేయూరకిరీటాదిభూషణంబులును, బఱియలైనఛత్ర చామరంబులును, దుత్తుమురైనచెక్కుడెఱంగులకై దువులును, నఱవఱలైనమై మఱువుల్లునుంగా, సంగరాంగణంబు ఘోరాభిరామం బయ్యె. కేశజాలంబు శైవలశాద్వలంబుగా, రథములు మడుఁగులుగా, శరనికరంబులు సుల్లుగా, గుఱ్ఱములు గండుమీలుగాఁ, దలలు తాలుగా, నేనుఁగులు మొసల్లుగాఁ, గవచోష్ణీషగణంబులు ఫేనపుంజంబులుగాఁ, గరవాలంబులు కమఠంబులుగాఁ, గేతనవ్రాతంబులు తరుసంఘాతంబులుగాఁ, గ్రవ్యాదగణంబులు హంసకారండవాదినికరంబులుగాఁ, గోదండఖండము లస్థిసమూహంబులుగా, యమరాజ్యస్థితికారణం బయిననెత్తుటేఱులు పాఱుటయు నుదారశూరులు ప్రేతరాజపురంబుచెంగటం బాఱువైతరణిం బోలినయానదిం దురంగమాతంగశతాంగప్లవముల నెట్టకేలకు దాఁటుచుండ నపరాహ్ణం బయ్యె. అక్కటా! దుర్యోధనునపరాధంబునం జేసి యింద్రసమభోగులు కుబేరసమసమృద్ధులు బృహస్పతిసమనయవిదులు నగుమహారాజులెల్ల నీయాలమునఁ బొలియుచున్న వారు. ధృతరాష్ట్రుఁడు పాపాత్ముఁడు గావున లోభమోహితుండై గుణవంతు లయినపాండవులతోఁ బగఁ బెట్టికొన్నవాఁ డని యెల్లవారును నిన్నును నీవారలను నిందించుచుఁ బాండవులఁ బొగడుచుండిరి. అమ్మాటలు విని దుర్యోధనుం డందఱుఁ గలయం జూచి యేల తడవు సేసెదరు కడంగి పోరుఁ డని పురికొల్పుటయు భీష్మాదు లదియు నిదియు విననియట్ల కడంగుటయు నక్షద్యూతనిమిత్తంబయినయాయాలంబు సెల్లె. తొలుత నెంత వారించినను నీవు విననైతివి గావునఁ దత్ఫలం బిప్పుడు గుడువుము. పాండవకౌరవు లందఱును జీవితాశం దొఱంగియశముఁ గోరి ఘోరం బయినపోరొనర్చుటయు దైవవశమున నొండె నీయనయంబున నొండె జనక్షయం బయ్యె.

ద్వంద్వ యుద్ధము.

అంత నక్కడ నర్జునుండు మనమూఁకలం గనుపుకొట్టుచుండ సుశర్మకోపించి డెబ్బదింట వాసుదేవునిఁ దొమ్మిదింటఁ బార్థుని నొంచేసిన నాగాండీవి లయకాలరుద్రుమాడ్కి రౌద్రంబున మెఱసి నిశితశరపరంపరలు గురిసిన వెఱచి వాహనంబుల విడిచి పఱచునారోహకులును, రథములు విఱుగ గుఱ్ఱములు మడియ సారథులు పొలియం గాందిశీకు లగురథికులును, శస్త్రాదుల విడిచి పాఱుకాల్బలంబులును, మేటికాతు లెంత పురికొల్పినం దిరుగక మొగతిరుగుగజవాజిగణంబులునై, పరమసమ్మర్దంబు సెల్లుచున్నంత సుశర్ముఁడిరుగుడువడినమొన నిలువరింప నయితి గాకుండె. అట్లుందఱుం బోవఁగ సుశర్మయు నతనితమ్ములును భీఱదీయక చలంబు వట్టి పోరుచుండ దుర్యోధనుండు తద్రక్షణతాత్పర్యంబున భీష్ముం

బురస్కరించికొని బహుళసేనాసమన్వితుండై పార్థుం దాఁకుటయుఁ బాండవయో
ధులు నర్జునుప్రాపున నిలిచి హాహాకారకృతోత్సాహులై పితామహుపై నడ
రుడుఁ దాలధ్వజంబును బాండవవరూథినులం దలపడుటయు నిక్కడ నక్కడనుం
జేయంగలబిరుదుమగలు ద్వంద్వయుద్ధమునకుఁ దొడంగి రెట్లంటేని. సాత్యకి కృత
వర్మను మార్కొనియె. ద్రుపదుఁడు ద్రోణుం దాఁకె. భీమసేనుఁడు బాహ్లికుం
దలపడియె. అభిమన్యుఁడు చిత్రసేనుపై నడరె. అడరినం జిత్రసేనుం డతనిపయిం
బెక్కుతూపు లేసిన నతండును మూఁడుబలునారసములం గప్పుటయు బుధశనై
శ్చరులదురంబుచందమున వారిపోరు ఘోరం బయ్యె. అంత వీరోద్రిక్తుండై
సౌభద్రుండు తొమ్మిదింట నాచిత్రసేనునిరథ్యసారథులం గూల్చుటయు నతండు
దుర్ముఖుతే రెక్కి తొలంగి చనియె. ద్రుపదుఁడు ద్రోణునిపై డెబ్బదితూపులఁ
బరఁగించి సారథి నైదింట నొంచినం గోపించి చాపాచార్యుఁడు పలునారసంబు
లతనిమేనం గీలించి వాలికతూపుల సారథి నొనేసిన నప్పాంచాలరాజు సిగ్గటి
పూర్వవైరంబుఁ దలపోసియుఁ జేయునది లేక తొలంగి పఱచె. భీమసేనుఁడు
బాహ్లికుం దలపడి బహుళమార్గణము లేసి రథ్యములఁ జంపి సారథిం గూల్చి
రథము నుగ్గుసేసిన నాప్రపితామహుఁడు పరమసంశయగతుండై లక్ష్మణకుమారు
తే రెక్కి తొలంగె. సాత్యకి కృతవర్మపై నడరి బహుళవిశిఖముల నతని వెగడు
పఱచి భీష్మపయిం గవిసి లాఘవము సురుల పొగడ నఱువదినునిశితశరము
లేసినం గోపించి పితామహుండు మృత్యుదండోపమం బైనశక్తి నతనిపై నేసె.
నాగకన్యకాసన్నిభం బైనయాశక్తిం జూచి శైనేయుండు వెఱవక యత్యంతలా
ఘవంబున మీఁదికి నుంకించుటయు నది నేలం బడియె. అంత నతిరయమున
నావృష్ణివీరుఁడు తనతేరిపై నున్నశక్తిని గొని పితామహురథంబుపై నేసిన నమ్మే
టిమగండు దానిం గాండద్వయంబున రెండుఖండములు గావించి సాత్యకిఱొమ్మునఁ
దొమ్మిదియమ్ములు పరఁగించినం బాండవరథికులు సాత్యకిరక్షణతాత్పర్యమునఁ
బెక్కండ్రొక్కుమొగి వచ్చి భీష్ముం జుట్టుముట్టుటయుఁ దుములసమరం బయ్యె.

**దుర్యోధనుఁడు భీష్మునకు సహాయబలంబుఁ బంపుట.**

అట్లు పాండవయోధులు చుట్టుముట్టినం బ్రావృట్కాలంబున మేఘమం
డలంబునడుమిసూర్యునట్లున్న శాంతనవుం జూచి భవదగ్రనందనుండు దుశ్శాసనుం
బిలిచి చూచితే పాండవవీరులు పెక్కండ్రు పితామహు నావరించినవారు. ఇమ్మ
హాత్మునకు డెప్పరంబు వాటిల్లకుండ మన మెల్లపుడు నితనికిఁ గావలియై యుండ
వలయుఁ గాకున్నఁ గార్యంబు దప్పుఁ గావునఁ దడవు సేయక యీవీరశేఖరునకుఁ
దోడ్పడఁ దగువారలఁ బంపు మనవుడు దుశ్శాసనుండు బహుళవరూథినులతోడఁ
దానును దురంగసేనాపరివృతుండై సాబలుండును నతనికిఁ దోడ్పడుటయు ధర్మ

జుండును మాద్రేయులును దమవారికి బాసటలై వారలం దాఁకిరి. అప్పుడు దుర్యోధనుండు వెండియుఁ బదివేవుర మేటిగుఱ్ఱపురవుతులఁ బంపుటయు నవి ఱెక్కలు గట్టినట్లు ప్రబలరయమునఁ బుడమి గ్రక్కదల వెదురుటడవి గాలునెడఁ బొడముసులివున కెనయగుఖరఖురరవంబు పెంపెసంగ ధరణీపరాగం బెగసి రవి మండలంబుఁ గప్పఁగ హేషితస్వనంబున దిక్తటంబుల బీఁటలువాఱించుచు రయమునఁ బఱతెంచి హంసనిబిడం బైనకమలాకరంబుకరణి రణాంగణంబునకు నూతనకాంతివిభూతిఁ గావించుచుఁ బున్నమనాఁటిమహాదధివిధంబున ఘూర్ణిల్లుచుఁ బైనడరుటయు ధర్మరాజు గవలును దానును వానిపయిం గవిసి మహోపాదపంబులనుండి నిపుణవనపాలకుండు పండ్లు రాల్చుచాడ్పున రావుతులతలలు ద్రెవ్వ నఱికి ప్రాసకుంతములఁ బొడిచియు వాఁడియమ్ముల నడిచియుఁ గోలుమసంగిన నాదండిమగలం జూడ నోడి విచ్చునవియు నొచ్చునవియుఁ బాఱునవియుఁ గూలునవియునై సింహముం జూచినమృగములట్లు ఘోటకములు విటతాటంబులగుడుఁ బాండవులు సింహనాదంబులను శంఖారవంబులనుం గావించినం దద్బలంబున భేరీభాంకారంబులు నింగి ముట్టె. అయ్యవస్థం జూచి దీనమానసుండై దుర్యోధనుండు శల్యుంజూచి మద్రేశ్వరా, పాండవాగ్రజుండు కవలుం దానును గోలుమసంగి మనసేనలఁ జిందఱవందఱ గావించుచున్నవాఁ డద్దెసం జూడుము. పాండవసాగరంబునకు నీవు చెలియలికట్టవై విక్రమంబు నెఱపు •మనిన నట్లయనిశల్యుఁడు మహానదీప్రవాహమువిధమునఁ బఱ పైనబహుళసేన తోడరాఁగవారలం దలపడుటయు సమ్మద్రరాజును ధర్మరాజు పదిశరములను నకులసహదేవులు వేఱువేఱ సప్తనిశితశరములను నేసి నొంచినం గోపించి యతండు వారల మువ్వురఁ బ్రత్యేకంబ మూఁడేసిబాణముల నొప్పనేసి వెండియు యుధిష్ఠిరుమేన నఱువదిశితసాయకములం గీలించి మాద్రేయుల వేఱువేఱ రెంట నొప్పించుచున్నంత వృకోదరుండు శల్యునిబారిం బడినయన్నదమ్ములం గనుంగొని మృత్యువాతం బడినవారలకా వగచి రయమునఁ దా నతని కడ్డపడుటయు సాయాహ్నమున సంగ్రామంబు భీమం బయ్యె. అట్టియెడ మీతండ్రి తాలధ్వజాభిరామంబుగఁ దాను వారిపై నడరి భీమునిఁ బండ్రెంటను సాత్యకిని దొమ్మిదింటను నకులుని మూఁడింటను సహదేవుని నేడింటను ధృష్టద్యుమ్నునిఁ దొమ్మిదింటను నొప్ప నేసి యుధిష్ఠిరుని వక్షస్థలంబునందును బాహుద్వయంబునందును బండ్రెండు నారసములం గీలించి యార్చి పేర్చిన నతనిపయిం గవలు పండ్రెండుతూపులను సాత్యకి శరత్రయంబును ధృష్టద్యుమ్నుఁడు డెబ్బదియమ్ములను భీమసేనుఁ డేడునారసంబులను ధర్మజుండు పండ్రెండుకాండంబులనుం బరఁగించిరి. భీష్మునకు బాసటయై యాచార్యుఁడు సాత్యకిభీమసేనులపైఁ బ్రత్యేకంబ యైదేసిబాణము లేసిన

వార లతనిపై వేలువేలు మూఁడేసివాలికతూపులఁ బరఁగించిరి. ప్రాచ్యోదీచ్య శూరసేనప్రముఖు లగుపాండవయోధులు భీష్మునిపై బలుతూపు లడరించుటయు నానా దేశసమాగతు లయినకౌరవయోధులు వారలపైఁ బెక్కుబాణమ్ము లేసిరి. అంతఁ బితామహుఁడు కోపాటోపదీపితుండై రథము వేదిగా, విల్లు జ్వాలగా, శక్తిగదాదు లింధనంబులుగా, శరములు మిణుఁగుఱులుగా, నగ్నియై వెలుంగుచు నరాతిరథికుల నేర్చుచుఁ బొదివి వివిధవిశిఖములం గుప్పించి నిపుణవనపాలకుండు తాళఫలముల రాల్చుపగిది మేటిశూరులతలలు డొల్లిపడం జేసియుఁ, గేతువులఁ గూల్చియుఁ, దేరుల నుగ్గుసేసియు, వాహనములనుండి యారోహకులఁ ద్రెల్లించియు, నేనుంగులఁ బీనుంగులు గావించియు, గుఱ్ఱముల సమయించియుఁ, గాల్బలంబుల నుఱుమాడియుఁ, దొడవుల రాల్చియుఁ, గైదువులఁ బొడిసేసియు, నెత్తురు లురులించియు, వీరవిక్రమవిహారంబు సల్పుచుండ నవ్వాఁడిమగనియశనినిర్ఘోషసమజ్యాఘోషంబు వినుటకును నోరు దెఱచినమృత్యువున కెనవచ్చునాశూరుని చుఱుక్కు కగపడుటకు నోడి పాండవయోధులు చీకాకుపడిరి. ఏమి చెప్పుదు నామేటివిలుకాఁ డేయునారస మొక్కటేనియు వమ్ముగాక మైమఱువుఁ దాఁకి మిట్టిపడి ప్రాణములఁ గొనుచుండె. ఒకళ్లొకళ్లతోడం జెప్పక తండ్రి కొడు కన్న తమ్ముఁడు ప్రియుఁడు సఖుఁడు సంబంధి యనిచూడక హతశేషులు కత్తళంబు లూడ్చియు సిగముడి విడిచి వెండ్రుకలు జాఱవైచియు వెఱచఱచి పఱచిరి. గోపాలుండు లేనిగోకులంబువిధమునఁ దిరుగుడుపడినతమసేనం జూచి వాసుదేవుఁడు తేరు నిల్పి యర్జునుఁడు మోహావిష్టుఁడై యున్నవిధం బూహించి యతని కిట్లనియె. వీరవర్యా పెక్కునాళ్లగోలెఁ గోరినకయ్య మిప్పటికిఁ జేకూఱె. మోహ మొందక శౌర్యధుర్యుండవై యుదువడింపుము. ఉపప్లావ్యమునకు సంజయుఁడు వచ్చినపుడు నన్ను మార్కొన వచ్చినభీష్మద్రోణప్రముఖు లగుమహారథుల నందఱనుం బీచమడంతు నని చెప్పినమాట సత్యం బగువిధముఁ జూడుము. విగతమోహుఁడవై క్షత్రధర్మంబుఁ దలంచి కడిమి మెఱసి పోరు మనవుడు విభ్వచ్చుఁడు వాంచినతల యెత్తక చూడ్కి యడ్డముగ సారించి గోవిందున కిట్లనియె. అవధ్యు లయినభీష్మద్రోణాదుల వధించి నరకోత్తరం బయినరాజ్యము సాధించినమాత్రఁ బ్రయోజనం బెయ్యది ? వనవాసదుఃఖములకంటె నియ్యది దుఃఖతరంబు గాకుండునే? సర్వధర్మజ్ఞుఁడ వైననీవు పురికొల్పుటంజేసి కవిసి నీమాటమెయిఁ గురుపితామహుం గూల్చెద. తేరదైసఁ బఱపు మనుటయు వనజనాభుం డతనియరదమ్మునకు సమ్ముఖముగఁ దేరు పఱపుటయుఁ దెరలినపాండవసైన్యములు గూడుకొని కవిసె. కవిసినం గోపించి గాంగేయుండు సింహానాదంబు సేసి రథ్యసారథిసహితంబుగా నర్జునరథంబు శరాసారంబునం గప్పినం దిగ్విభాగం బేర్పడకుండినం బుండరీకాక్షుండు

నేర్పున రథ్యములం దడవి తేర్చుచు రథచోదనంబు సేయుచుండ విప్వచ్ఛుండు గాండీవజ్యాఘోషభీషణముగ నడరి పితామహునివిల్లు దునిమె. అంత నయ్యాప గేయుండు నిమేషాంతరమాత్ర నొండువిల్లు గొని సజ్యంబు సేయుచుండ నక్కో దండంబును రెండుఖండంబులు గావించుటయు మరున్నదీనందనుం డౌరా! కౌం తేయా, యని యతనికరలాఘవం బగ్గించి యొండుకార్ముకం బెత్తి పార్థునరదంబు పయిం బటుశరజాలంబుఁ బరఁగించుటయు గోవిందుండు స్యందనంబు వివిధమం డలచిత్రగతులం బఱపుచు నతనియమ్ములెల్ల వమ్ము సేయుచుండఁ గ్రోధదీపితుండై మీఁతండ్రి వివిధవిశిఖములం గుప్పించుటయు వాసుదేవార్జునులు తదీయశరవిక్ష తగాత్రులై పెద్దయుంబ్రొద్దు పోట్లాడికొమ్ములం గ్రుచ్చికొని నెత్తుటం జొత్తిల్లిన యాఁబోతులచాడ్పునం దోఁచిరి.

శ్రీకృష్ణుఁడు మునికోలఁ గొని భీష్మునిమీఁది కురుకుట.

అయ్యవసరంబున యుగవిగమభాస్కరునివిధమున నుభయసేనామధ్యభా గంబునఁ దీవ్రప్రతాపంబు గాయుచు మేటిశూరులతల లేఱుచున్న భీష్ముని, మెత్త వడినకవ్వడినిం, జూచి మహాయోగేశ్వరుండై నవాసుదేవుఁ డక్షీణక్రోధతామ్రే క్షణుండై యుగ్యంబులపగ్గంబుల నొగల ముడిచి మునికోలఁ జేతఁ గొని తేరు డిగ్గ నుఱికి దిక్కులు పిక్కటిల్ల సింహనాదంబు గావించి జలధరంబుచెంగటికార్మె ఱుంగుతెఱంగున లలితపీతాంబరంబుచెఱంగు దివ్యమేచకగాత్రంబునకు వింత సొంపు సంపాదింపఁ బాదఘట్టనంబునఁ బృథివీచక్రంబు సంచలింప మత్తమాతం గంబుపయి నడరుసింగంబుతెఱంగున గంగానందనుపయిం గవియఁ బోవుచుండె. అప్పుడు మనవా రమ్మహానుభావునిరోషభీషణరూపవేషంబులఁ జూడ నోడి యదెయదె పొలిసెఁబొలిసె భీష్ముఁ డని మొక్కపలుకుగాఁ బలుకుచుండిరి. ధైర్య ధౌరేయుండై నయాపగేయుండు సంభ్రమింపక వింటినారి సారించి యోదేవ దేవా, వేవేగ విచ్చేయుము నీకుఁ బ్రణమిల్లెద. నన్నుఁ బోరఁ బడఁ ద్రోయుము. నీచేఁ బొలిసిన నీలోకమున నక్షీణకీర్తియు నాలోకమున శాశ్వతసద్గతియుం గలు గుట తప్పదు. ఇచ్చమెయిఁ బ్రహరింపుము. నీదాసుఁడ ననివిన్నవించుచున్నంతఁ గిరీటి తటాలున రథంబు డిగ్గ నుఱికి వెంబడిం బఱచి రయంబున నెయిది పీనాయ తబాహుద్వయంబున నమ్మహాబాహుం బట్టి యమ్మహానుభావుండు గొనిపోవఁ దొడఁగిన పదియడుగులకొలంది నడిచి ధరాతలం బూని మెట్టకేలకు నిలువం బట్టె నెట్టున నయనంబులు జేవుఱింప మహానాగంబువోలె రోఁజుచున్ననారాయణున కుఁ బ్రణయమున నిట్లనియె. దేవా, పోర నెక్కింత డయ్యుట తప్పఁగాఁ గొని యిట్లు నీ వడరిన నే మనం గలవాఁడ. తలపడి పోరుట మాని మాకు హితంబుఁ జింతించుచుండుదు నని బాస చేసి నీవే దానిం దప్పితివయేని నిన్ను లోకంబు

మెచ్చునే. ఈయున్నశూరులపనులఁ జక్కంబెట్టుట నాభారము. శస్త్రసుకృతసత్యంబులయాన శత్రువిధ్వంసంబుఁ జేయుదు. పూర్ణచంద్రుంబోలిన పితామహుని నీవు సూచుచుండఁగ నేలఁ బడం ద్రోచెద. సైరణఁ గొని నాపయిం గరుణించి తేరెక్కు మని సవినయంబుగఁ బార్థుఁడు ప్రార్థించినం జిత్తగించి యించుకేనియుం బలుకక క్రోధదీపితుండై మగిడి నొగ లెక్కి పగ్గములఁ గొనుటయు నివ్వచ్చుండు దేరెక్కె.

అంతఁ దీవ్రప్రతాపదీపితుండై భీష్ముఁడు గ్రీష్మాదిత్యుఁడు రసములంబోలె నరాతియోధులప్రాణములఁ బీల్చుటయుఁ బట్టపవలింటిభాస్కరునిరీతి వెలుంగుచున్నయయ్యమానుషవిక్రమముం జూడ నోడి దిక్కు గానక పాండవసేనలు పంకనిర్మగ్నంబు లయినగోవులచాడ్పునఁ జేయునది లేక బెండువడియె. ఏమి చెప్పుదు నప్పు డప్పాండవబలంబులు భీష్మబారిం బడి బలుమానిసి కాలం జమిరినచీమలచందమున నలిగులి యగుచుండె. చండభానుండు కాలవశమున శాంతభానుండై తీవ్రప్రతాపాతపంబు గాయుచున్నయయ్యాపగేయునెదుట నుండఁ దగదనుతలంపునంబోలెఁ బశ్చిమాచలసానుభాగమున మఱుఁగుపడుటయు సంజకెంజాయతోడఁ జీఁకట్లు గ్రమ్మె. అప్పటికి సేనలఁ దివియించుటయ కర్జంబుగాఁ దలంచి పాండవులు భీష్మబాణార్దితులయి కయ్యంబు మాని పరాజయవిషాదంబు మొగముల నంకురింప శిబిరమునకుఁ జనుటయు మనవారలును బితామహుం బలుదెఱంగుల నగ్గించుచుఁ బ్రహర్షోత్కర్షమునం బొంగుచు శిబిరమునకుఁ బోయిరి.

## పాండవులు కృష్ణునితో నాలోచించుట.

అట్లు తమసైన్యంబు దీనదశకు వచ్చినం గొందలం బందుచు శిబిరమున కరిగి ధర్మరాజు నాఁటిరేయి వృష్ణిపాంచాలసృంజయులును దమ్ములును వాసుదేవుఁడుం దాను రహస్యప్రదేశంబున మంతనం బుండి గోవిందునకిట్లనియె. కృష్ణా! భీష్మునిక్రొవ్వాలు సూచితివిగదా. అమ్మేటిమగండు మత్తశుండాలంబు పుండరీకవనంబునట్టు లట్టుల మనమూఁకలఁ గలంచుచున్నవాఁడు. కాననం బేర్చుకార్చిచ్చువిధమునం బొదివి తక్షకవిషోపమతీవ్రబాణార్చుల మనసేనల నీఱుసేయుచున్నవియన్నదీనందనుం దేఱి చూడనైనం దరము గాదు. నిజాయుధధారు లయినయింద్రాదిదిక్పాలురనైనం గెలువనచ్చుఁ గాని విల్లు చేతఁ బూని కోలుమసంగిన గంగానందనుం గెలువరాదు. ఆత్మబుద్ధిదౌర్బల్యంబునంజేసి కడవరానిశోకసాగరమున మునిఁగితి. అతనిబారిం బడినవారెల్ల నగ్గిపయిం బడినమిడుతలవడువున మృత్యువాతం బడినవారకాని యొండు గాకుండెడి. రాజ్యంబుమీఁదియడియాసంజేసి పెక్కండ్రఁ జంపించితి. ఇఁకఁ జాలు. తమ్ములును వివిధబాణముల నొచ్చిరి.

చిన్ననాఁటఁ గోలె వీరు నాపయిం గలిగినసౌహార్దంబు నిమిత్తంబుగా రాజ్యముఁ గోల్పోయి పడరానిపాట్లెల్లఁ బడిరి. పాంచాలియుఁ బలువెతలంగుల నిడుమలఁ గుడిచె. జీవితము దక్కించుకొనినదియే పదివే లనుకొనియెద. ఇఁక బ్రదుకు గలకాలము వనమున నిల్చి తపోనిష్ఠమై నుండెదఁగాని యుద్ధము సేయనొల్లను. నన్నును నాతమ్ములను ననుగ్రహింపఁ దలంతువేని ధర్మమునకుఁ జేటు వాటిల్లనితెఱంగుగ మా కెయ్యది యిప్పటికి హితంబగు దానిం దెలియఁ జెప్పు మనవుడు ధర్మరాజు నూరార్పువాఁడై శ్రీకృష్ణుఁ డిట్లనియె. మహారాజా, నీకు విషాదం బేల? దుర్జయులు శత్రుసూదనులు శూరశేఖరులు వాయువైశ్వానరతేజులు నగుతమ్ములు భీమార్జుననకులసహదేవులు నీకుఁ గలరు. వీర లెంతయైనం జేయఁ జాలుదురు. ఏనును నీపనిచినపని సేయ నాయితపడియున్నవాఁడను. భీష్ముం దెగటార్పఁగ వివ్వచ్చుఁ డియ్యకొనకుండునేని నన్నుఁ బంపుము. అందఱు చూచుచుండ నే నొక్కండన యతనిపై నడరి యొక్కమాత్రన యక్కురువృద్ధుఁ గూల్చెద. నాపరాక్రమంబుఁ జూడుము. మీ కెవ్వఁడు పగతుఁ డతండ నాకుఁ బగతుఁడు. మీ కెవ్వఁడు చెలియతండ నాకుం జెలి. నీయనుఁగుఁదమ్ముఁ డైనయర్జునుఁడు నాకు నెచ్చెలి మఱది శిష్యుఁడును గావున నతనికిఁ గండలు గోసియైన నిత్తును. అతండును నాకుఁగాఁ బ్రాణములనైనను విడుచును. ఏన విక్రమించి పితామహుని మర్దింతునుగాని యుపప్లావ్యంబున నర్జునుండు భీష్ముం జంపుమనని పట్టినప్రతిజ్ఞకు భంగము పొసఁగునొక్కో యని విచారించెద. అతం డియ్యకొనునేని తదనుజ్ఞాతుండనై పితామహుం బరిమార్చుట నిక్కువంబు. ఇంత యేల? ధనంజయుండు భీష్ముం దెగటార్పఁ జాలనివాఁడయినం గదా మన కిన్నివితర్కంబులు కర్తవ్యంబు లగు. దేవదానవాదు లందఱును గుమిగూడి గట్టిమొన గట్టి వచ్చినను నీతమ్ముఁడు గెలువ నోపినవాఁడు. మహావీర్యుఁడైనను ముదిఁ దప్పి హీనబలుం డైనశాంతనవుం జంపఁ జాలు నని యొక్కపెద్దమాటగాఁ జెప్పవలయునే యనిన విని యుధిష్ఠిరుండు వెండియుఁ బుండరీకాక్షున కిట్లనియె. మహాత్మా, నీచెప్పినదెల్ల నిక్కువంబ. లోకనుతశౌర్యులైనతమ్ములును సర్వలోకమహేశ్వరుం డైననీవును నాకార్యంబు నెఱవేర్పఁ బూనియుండఁగ నాకు వగవం బని లేదు. పోరు టుడిగి హితచింతనంబు సేయుదు నని బాస యిచ్చిన నీకుఁ బ్రతిజ్ఞాభంగంబు పొసఁగుట నాకెంతయు నసమ్మతంబు. దానం జేసి పితామహుని మార్కొన నిన్నుఁ బంపఁగ నామనస్సు గొలుపదు. భీష్మునకును నాకు నొక్కసమయంబు గలదు. యుద్ధారంభమున నే నమ్మహాత్మునియనుజ్ఞఁ గొనం బోయినపుడు దుర్యోధనునకుఁగాఁ బోరుదు నీకు విజయంబు సేకూఱ మదిని గోరుచుండుదు నని పలికినవాఁడు. కావునఁ దద్వధోపాయం బమ్మహాత్మునే యడిగి

వర్తము. నాపయిం గలకారుణ్యమునంజేసి యతండు నిజవధోపాయంబు నెఱిం గించు. అతండు బోధించుహితంబు తెఱంగున నడుతము. చిన్ననాఁట దండ్రి సచ్చినను మ్మైత్తి పెంచినతాతను జంపఁగ నుపాయంబు వెదకుచున్నమాజన్మం బేటికి? అక్కటా! క్షత్త్రధర్మం బింతకష్టకర్మంబై యుండునే యనుటయుఁ గృ ష్ణుఁడు యుధిష్ఠిరున కిట్లనియె, మహాప్రాజ్ఞా, నీవచనంబు సముచితంబు. నాకు నదియే యుచితం బని తోఁచుచున్నది. వివిధయుద్ధవిశారదుం డైన దేవవ్రతుండు వరప్రభావమున నితరుల కవధ్యుండు గావున నెన్నినాళ్లయినం బోరఁ గలఁడు. మఱియుఁ జూడ్కులనే మనమూఁకల నీఱుసేయనోపుఁ గావునఁ దద్వధోపాయం బమ్మహాత్మునే యడిగి తెలిసికొనుట యుఱవు. నీ వడిగినం దప్పక చెప్పుఁ గావున నట్ల చేయఁ దగు ననియె.


పాండవులు రహస్యప్రకారమున భీష్మునొద్దకుఁ బోవుట.

అంతఁ బాండవులు వాసుదేవసమన్వితులై శస్త్రకవచాదులఁ బరిత్య జించి రహస్యప్రకారమునఁ గౌరవస్కంధావారమున కరిగి భీష్మశిబిరముఁ జొచ్చి యుచితప్రకారమున నప్పితామహుం గాంచి యతనియడుగుల కెఱఁగుటయు నమ్మందాకినీనందనుండు ముందుగ గోవిందుని స్వాగతప్రశ్నమున నాదరించి పదం పడి పాండవులఁ గుశలం బడిగి మీ రేమిపని గలుగ నిప్పు డిటకు వచ్చినవార లు? పరమదుష్కరకృత్యంబైనను మీకుఁ బ్రియంబు సేయందలంచి చేసెదఁ జెప్పుఁ డని పలుమాఱులు ప్రీతిపురస్సరంబుగ నడిగినం బితామహునకు ధర్మ రాజు దీనాననుండై యిట్లని విన్నవించె. మహాత్మా, మాకు జయంబును రాజ్యం బును సమకూఱు తెఱంగుఁ దెల్పుము. నీవు పోరుచుండ నానాఁట మాసేనలు తఱుఁగుచున్నయవిగాని యొండు గాదు. నిన్ను గెలువఁగ నెంత కడంగినను గొంచెమేనియు నుపాయంబు దోఁపకుండెడి. ఎప్పుడు చూచిన నీచేతికోదండంబు మండలీకృతంబై కన్పట్టుఁగాని యెప్పుడు బాణంబు లరిపోయుదువో యెఱుంగరా దు. మధ్యాహ్నమార్తండునివిధమున వెలుంగుచుఁ జతురంగబలంబులఁ జక్కాడు చున్ననిన్ను మార్కొనఁగ నేమగవాఁడును గలుగఁ డయ్యె. కావున నిన్ను గెల్వఁ గ వెరవు నీవ యానతిచ్చి మాకు క్షేమం బొడఁగూర్పు మనినధర్మరాజునకు మీ తండ్రియిట్లనియె. ధర్మనందనా, నేను బ్రతికియుండునంతకు మీకు జయంబు గలుగనేరదు. నన్ను నిర్జించితిరేని యందఱం గెలువనోపుదురు. జయముఁ గోరు దురేని ముందుగ నన్ను నిర్జింపఁ గడంగుఁడు. ఇచ్ఛమెయి నన్నుఁ బ్రహరింపుఁ డనుజ్ఞ యిచ్చితి నిదియ మీకు మే లనిన విని ధర్మరాజు మహానుభావా, నిజాయు ధధారు లైనయింద్రాదిదిక్పాలురనైనం గెలువవచ్చుఁగాని నిన్ను గెలువరాదు. దేవతలేనియు నీకో ల్తలల కోహటింతురు. ఇఁక మమ్ముఁ జెప్పికొనవలయునే.భవద్విజ

యోపాయంబు నీవ యానతీవలయు నని మఱియు నడుగ నతం డతనికి వెండి యు నిట్లనియె. పాండవాగ్రజా, నీచెప్పినదెల్ల నిక్కవంబు నాచేతం గార్ముకం బుం డునంతకు నన్ను గెలువ నెవ్వరుం జాలరు. ఏను శస్త్రగ్రహణంబు మానినప్పు డు జయింపవచ్చు నందుల కుపాయంబుం దేటపడం జెప్పెద నాకర్ణింపుము. కై దువు విడిచినవానిని నేల బడినవానిని మైమఱు వుల్లాడినవానినిం గేతనం బుగూలినవానిని వెఱచినవానినిం బఱచినవానిని నీవాఁడనని శరణుసొచ్చినవానిని నాఁడుదానిని స్త్రీనామధేయుని స్త్రీపూర్వుని వికలుని నేకపుత్రకుని నప్రశస్తన రుని నేను మార్కొని పోరు సేయను. మీశిఖండి స్త్రీపూర్వుం డమంగళ్యధ్వ జుండుం గావున వానిం దాఁకను. నాఁ డంగనాపూర్వుఁ డవుట మీకందఱకుం దెల్లంబకదా. వాని ముందు నిలిపి యే న స్త్రము వేయు టుడిగియున్నతఱి వేచి యర్జునుఁడు నాపై శరజాలంబుం గురియునది. అర్జునుం డూరకుండి శిఖండిచే నెన్నికాండజాలంబు లేయించినను వానికి నాకు నొప్పి యించుకేనియుం గలు గదు. వాసుదేవుఁడు నర్జునుండునుం దక్క లాఁతు లెవ్వరు నన్ను నొా నేయ, జాలరు. ఇట్లు చేసినం గాండీవిబాణవిద్ధుండనై యేను బడుదు. పదంపడి ధార్త రాష్ట్రులం గెలుచుట మీకు సుకరం బని పితామహుండు పరలోకదీక్షితుండై కరుణించి పాండవాగ్రజున కాత్మజయోపాయంబుం దేటపఱచినం దెలిసి పాండవు లమ్మహాత్మునిచరణంబుల కెఱఁగి యనుజ్ఞ వడసి వాసుదేవసహితంబుగ మగిడి శిబిరమున కరిగిరి. అప్పు డర్జునుండు లజ్జావిషాదంబులు మనంబునం బెనంగొ నంగ గోవిందున కిట్లనియె. వాసుదేవా, కురువృద్ధుండును మహాప్రాజ్ఞుండును గురుఁడు నై నసప్పితామహుని నే నెట్లు పోరం బడం ద్రోయుదు. చిన్ననాఁడు పాంసురూషితగాత్రుండనై యే నాఁటలవెంటం బడి యమ్మహానుభావుకుఱు వెక్కి తండ్రీ యనిపిలువఁగ నతండు వత్సా, నేను నీకుం దండ్రిం గాను. మఱి నీతండ్రికిం దండ్రి నని పలుకుచుం బలుతెఱంగుల నుపలాలించుచు నెత్తి పెంచి పెద్దవానిం జేసి శస్త్రాస్త్రాదిసకలవిద్యల నేర్పించె. అతనిం బరిమార్పఁగ నాకు మనసు గొల్పదు. మనమూఁకలను నన్నునుం బరిమార్చినం బరిమార్పుఁగా కనియుండెద. నీమది కెయ్యది యుచితం బనితోఁచు దానిం జెప్పు మనియడుగ వనజోదరుండు విజ యుని కిట్లనియె. భీష్మం జంపుదు నని బాసం జేసి క్షత్రధర్మస్థితుండ వై ననీ విపు డందుల కొల్ల నసం బోలునె? యుద్ధదుర్మదుం డై నగాంగేయుం దెగటార్పనవ లయు. అతనిం జక్కఁబెట్టకున్న నీకువిజయంబు గలుగదు. దైవవిహితం బయి నయీకార్యంబునకుం బిఱుదీయం బనిలేదు. అంతకున కెనవచ్చుభీష్ముని మార్కొ నఁగ నీ వొక్కండవ చాలుదువుగాని వజ్రపాతిక్తైన నోపఁడు. నామాట వినుము. స్థిరచిత్తుండవై భీష్ముం బరిమార్పుము. మఱియుఁ గైదువుఁ గేలం బూనితన్నెదిరించు

వాఁడు వయోగుణవృద్ధుండై నను సందియంబు మాని పరిమార్చుట నీతి యని తొల్లి బృహస్పతి దివస్పతికిఁ జెప్పె నని విందుము. తన్ను మార్కొనువారిపై నడరి పోరుటయు, నాత్మరక్షణంబును, దగువారిని జయోపాయం బడిగి తెలిసికొనుటయు, నుత్తమక్షత్రియునకు శాశ్వతధర్మంబై యుండ నీకు వగ పేల? యనిన విని యర్జునుండు వెండియుఁ గృష్ణున కిట్లనియె. శిఖండి భీష్మవధార్థంబు పుట్టినవాఁడని యందఱకుం దెల్లంబుగదా ? స్త్రీపూర్వుం డనుతలంపునం జేసి యతం డతనిపైఁ గవియఁడు. కావున నప్పాంచాలపుత్రుం బురస్కరించికొని నే నతనికిఁ గావలినై లాఁతుల నెల్ల నిశితశరంబుల నిలువరించెద. వాఁడు గాంగేయుపై నడరుఁగాక యనిన నందులకు మాధవుఁడును బాండవులు నియ్యకొని ముదమునఁ బొదలుచు నా రాత్రి సుఖనిద్రసేసి రనిన విని ధృతరాష్ట్రుఁడు సంజయా, మఱునాఁడు శిఖండి పురస్సరులైన పాండవులకును భీష్మునకును భండనం బెట్లు సెల్లె ననియడుగ నాంబికేయునకు సంజయుం డిట్లనియె.



పదియవనాఁటి యుద్ధము.

అంత నమ్మఱునాఁడు పాండవులు మార్తండోదయావసరమున భేరీమృదంగశంఖారవబంధురంబుగా నెత్తి వచ్చి మోహరించిరి. అందు శిఖండి తనకు భీమార్జును లిరుగెలంకులఁ గావలియైయుండ సేనాగ్రంబున నిలిచె. ద్రౌపదేయసౌభద్రసాత్యకిచేకితానులు వారివెనుకటి దెస కమరిరి. ధృష్టద్యుమ్నాది పాంచాలురముం దిడికొని యుధిష్ఠిరుండు కవలు దనకుఁ జక్రరక్షకులుగాఁగ మధ్యభాగమునఁ బొలిచె. విరాటద్రుపదులును గేకయపంచకంబును ధృష్టకేతుండును జఘనపార్శ్వమునకుఁ గావలియైరి. తక్కగలశూరు లందఱు నెడనెడ నిలిచిరి. ఇట్లు గట్టిమొగ్గరం బమర్చి సింహనాదబంధురంబుగఁ బేర్చి యుండునంత మనవారును బోరి కాయితంబై నడిచి యగ్రభాగమున భవత్తనయపరివృతుం డైన గాంగేయుండును నతనివెనుక ద్రోణాశ్వత్థామలును వారిపిఱుంద గజానీకపరివృతుండై భగదత్తుండును నటఁ బిఱిందిదెసఁ గృపకృతవర్మలును వారివెన్నంటి కాంభోజమాగధసౌబలబృహద్బలులును నిలిచి వ్యూహ మమర్చిరి. దినదినమును భీష్ముఁ డాసురపైశాచరాక్షసంబులైన వివిధవ్యూహములఁ బన్నుచుండె. అవ్విధమునఁ బితామహుపంపున మనవారును మోహర మమర్చినం బోరు ఘోరం బయ్యె. అప్పుడు శిఖండిని బురస్కరించికొని యుధిష్ఠిరభీమార్జునులు మాద్రేయసాత్యకిసమన్వితులై యురువడించినం గౌరవయోధులకు వారిపోరు తలమునుకలయ్యె ననిన విని యాంబికేయుఁడు సంజయా, మనసేనల నట్లు పాండవసైనికులు నెప్పించుచుండఁ గినిసి మాతండ్రి యేమి సేసెఁ జెప్పు మనియడుగుటయు నతనికి సంజయుఁ డిట్లనియు. మనమూఁకల నట్లు చీకాకుపఱుచుటకుఁ గోపదీపి

తుండై యాపగేయుఁడు పాండవపంకేజంబుపై నడరి నానాస్త్రములం గుప్పించి పాంచాలసృంజయసైన్యంబులం జొచ్చి వాహనంబులనుండి యారోహకుల దొల్లి పడం జేయుచుఁ గోలుమసంగి నిరంతరమండలీకృతకోదండుండై వజ్రపాణి దానవుల నెట్టు లట్టులు వెగడుపఱుచుటయుఁ బార్థులుదీనాననులై వెఱఁ గంది య తని నాఁగఁ జాలక యివ్విలుకానిప్రతాపం బింత యగునే యని యగ్గించుచుఁ గొంతవడికిఁ దమసైన్యంబు కార్చిచ్చుపొదివినకాననంబుచందంబున దీనదశకు వచ్చినం గోపవిషాదములు మనంబులఁ బెనంగొనంగ శిఖండిని బురికొల్పుటయు నప్పాంచాలకుమారుండు జాహ్నవీకుమారుందాఁకి మూఁడువాఁడితూపుల ను రమ్ముఁ గాఁడ నేయుడు నతండు వానికి మాఱేయ నొల్లక నవ్వుచు నిట్లనియె. శిఖండినీ, నీశస్త్రాస్త్రనైపుణం బెంత చూపినను నీకు మాఱేయను. మఱియు నీయమ్ములు నాగాత్రమ్ము నొంపఁ జాలవు. బ్రహ్మదేవుఁడు ని న్నెట్లు పుట్టించె న ట్లాఁడుదానవుగాని నడుమఁ గారణాంతరమునఁ బుంస్త్వము వచ్చినమాత్రన మ గవాఁడ వగుదువే? యనవుడు శిఖండి క్రోధమూర్ఛితుండై పెలవుల నాకుచుఁ బితామహున కిట్లనియె. నీవు పెక్కండ్రక్షత్రియులఁ బోర గెల్చితనియు జామద గ్న్యుని బవరమున మెప్పించితనియు వినియున్నవాఁడను నీప్రభావ మంతయు నెఱింగియే పాండవులకుఁ బ్రియము సేయఁదలంచి యాత్మయశము లోకముల నింపఁ గోరి నిన్ను మార్కొంటిని. సత్యంబు సాక్షిగా నిన్ను బరిమార్తును. చక్క నిల్చి మగంటిమిం బేర్చుము. నీవు శస్త్రాస్త్రనైపుణం బెంత చూపినను నా కించు కేనియు వెఱపు లేదు. నామునుమునం బడి బ్రదికిపోవ నేర వని పలికి యైదు నిశితశరముల నప్పితామహునిమేననాటె. అప్పలుకులు విని సవ్యసాచి యిదియ తఱి యని తలంచి శిఖండిని బిలిచి వెఱపు దక్కి భీష్ముపై నారసంబులు గుఱి యుము నిన్నుఁ దలపడువారలనెల్ల నేను మార్కొని తెరలించెద. ఏను గలుగ నీకు వెఱవం బనిలేదు. భీష్ముం జంపక తొలంగుదేని లోకమెల్ల నిన్నుఁ బరిహ సించును. మఱియు నీనిమిత్తమున మేమందఱమును బరిహాసభాజనం బగుదుము. ద్రోణాశ్వత్థామకృపసుయోధనచిత్రసేనవికర్ణజయద్రథవిందానువిందసుదక్షిణభ గదత్తజయత్సేనభూరిశ్రవశ్శల్యాలంబుసనుశర్మాదు లెందఱు వచ్చినను సముద్రంబు నకు వేలనై యాఁగుదు. నీవు పితామహుని సాధింపు మనియె ననిన నాంబికే యుఁడు శిఖండి మాతండ్రి నెట్లు మార్కొనియె? అతని కెవ్వరు గావలియైనడ చిరి? ఆపదియవనాఁడు మాతండ్రి యెట్లు పోరె? లోకనుతశౌర్యుండైనయమ్మహా త్మునిఁ బాంచాలపుత్త్రుఁ డెదిర్చె ననివిన్నంతన నామనంబు కోపోద్దీపితం బయ్యె. ఆబవరమున నమ్మేటిమగనికి దనుర్భంగము లెవ్వియేనియుఁ బొసంగెనా యని యడుగ నతనికి సంజయుఁ డిట్లనియె. ఘోర మీతండ్రికివీర్యోద్రేకమునఁ బోరు

నంతకు రథధనుర్భంగము లెవ్వియుఁ బొసఁగవయ్యె. అమ్మహాశూరున కట్లు చేయ
నెవ్వఁడు గలఁడు. సంగ్రామప్రకారంబు వినుము. అనేకశతసహస్రచతురంగబల
పరివృతుండై యాపగాసుతుండు పాండవసేనలపై నడరి కోలుమసఁగినం బాశ
హస్తుండైన యంతకునిఁ జూచినట్లు వారివారలతనిం జూచి మొగతిరిగి పఱచు
చుండఁగ వ్వాడి సింహనాదంబుఁ గావించి గాండివజ్యాఘోషభీషణంబుగా నడరి
మనమూఁకల నేలకుఁ గోలకుఁ దెచ్చుటయు మనవారలు సింగముఁ జూచినక్షు
ద్రమృగములట్లు వెఱచఱచి పఱచిరి.

## దుర్యోధనుఁడు భీష్మునితో నిజసేనాక్షయంబుఁ దెల్పుట.

అత్తఱి నుత్తలంపడుచిత్తముతో భవత్తనయుండు మరుత్తటినీతనయుం
జేరం బోయి యిట్లనియె. పితామహా, శ్వేతతురంగయోజితంబును గృష్ణసారథి
కంబు నగురథోత్తమం బెక్కి బీభత్సుఁడు గవిసిన మనసేనలు కార్చిచ్చుపొదివిన
కాననంబుచందమున రూపఱుచున్నవి. గోపాలుఁడు పసులంబోలె గాండివి మన
మూఁకలఁ దఱుముచున్నవాఁడు. అద్దెసఁ జూడ్కి సారింపుము. చిచ్చునకుఁ గరు
వలితోడన్నగతి వడముడియు నాకవ్వడికిఁ దోడ్పడ సేనలనెల్ల నలిగలి చేయు
చున్నవాఁడు. అయ్యిరువురయనియుండిన నిప్పుడు సాత్యకియుఁ గవలును సౌభ
ద్రుండును ధృష్టద్యుమ్నుఁడును ఘటోత్కచుండు నెక్కపెట్ట మారిమసఁగిన ట్లడ
రినవారు. ఇందఱిట్లు కసిమసఁగిననాఁగుటకును బోరుటకును వెఱవు దోఁపదు.
నీవుదక్క మఱి యెవ్వరును విఱిగినవారలఁ గూర్పఁగను బగఱఁ బీఁచమడంపఁగను
నేరరు. శత్రుశరార్దితులకు శరణం బగు మనిపలికిన విని దేవవ్రతుండు ముహూ
ర్తమాత్రం బేమియుం బలుకక చింతించుచుండి కొంతవడికిఁ దనలో నొక
తెఱంగున నిశ్చయముఁ జేసికొనినవాఁడై నీకొడుకునకిట్లనియె. దుర్యోధనా,
స్థిరచిత్తుఁడవై నామాట వినుము. ఒక్కొక్కనాఁటికిఁ బదివేవురుమేటిమగలఁ
జంపుదు నని నీకు బాస యిచ్చినవాఁడనుగదా. అది తప్పకుండ నీతొమ్మి
దినాళ్లు బవర మొనర్చితి. నేఁడు నవ్విధంబునం బోరెద. మఱియుఁ బాం
డవులఁ జంపియొండె వారిచేఁ జచ్చియొండె మీయన్నమున మనినఋణముఁ
దీర్చెద నింతయు నిక్కవం బనిపలికి పాండవసైన్యములపయిం గవిసిపొగ
లేనియగ్నివోలెఁ గోపాటోపమున మండుచు నుత్తరాయణగతుం డయిన
భాస్కరుండు నిజచండకిరణంబుల జలంబులంబోలె శస్త్రాస్త్రములఁ జతురంగసేనల
ప్రాణములఁ గొనుచుఁ బదివేలయేనుంగులను నన్నిగుఱ్ఱములను రావుతులతో
డం బొరివుచ్చి లక్షకాల్బలంబు సమయించిన నతనిం దేఱిచూడక యందఱు
విన్నఁబోవుటయుఁ బాండవపాంచాలయోధులు పెక్కండ్రుక్కుమిగిలి యతనిం
దలపడి చుట్టుముట్టి నానాబాణములఁ బరఁగించినం బయోధరపటలపరీతం

బైనమేరుభూధరంబుభంగి నొప్పు చతండు కొంచెమేనియు సంచలింపక పైపై నడరుటయుఁ బరమాభీలం బైనయాలంబు సెల్లె.

## ద్వంద్వయుద్ధము.

అట్టియెడ నర్జునుండు శిఖండికి ధైర్యంబుఁ జెప్పి పురికొల్పిన నతం డతని నెదిర్చినం బార్థుపలుకులు విని ముదమునఁ బొదలి ధృష్టద్యుమ్నుఁడును సౌభద్రుఁడుం దోడ్పడ నడరుటయు యుధిష్ఠిరుండును గవలును విరాటద్రుపదులును భీమసేనసాత్యకులును జేకితానఘటోత్కచులునుం గూడ ముట్టుటయు మనవారును భీష్మరక్షణతాత్పర్యమున వారలం దలపడిరి. అందుఁ జిత్రసేనుఁడు చేకితానుం దాఁకె. కృతవర్మ ధృష్టద్యుమ్నుం దలపడియె. భూరిశ్రవుఁడు భీమసేనుని మార్కొనియె. వికర్ణుఁడు నకులు నెదిర్చె. కృపాచార్యుఁడు సహదేవునిపై నడరె. దుర్ముఖుఁడు ఘటోత్కచుని వారించె. దుర్యోధనుఁడు సాత్యకి కడ్డపడియె. సుదక్షిణుఁ డభిమన్యుం బ్రతిఘటించె. అశ్వత్థామ విరాటద్రుపదుల నిలువరించె. భారద్వాజుఁడు ధర్మరాజు నాఁగె. శిఖండిపురస్సరుఁ డైనయర్జునుపయి దుశ్శాసనుండు గవిసె. వెండియుం గొందఱు భీష్ముని మీఁది కురువడించుటయు మనవారలు వారలనెల్ల మార్కొనిరి. అప్పుడు ధృష్టద్యుమ్నుఁడు పేరెలుం గెత్తి గాండీవి భీష్ముని మార్కొనుచున్నవాఁడు. ఇతనిం దాఁటి యతండు రానేరఁడు. గావున మీఱు వెఱవం బని లేదు. కిరీటితోడి బవరంబునఁ బురందరుఁడైన గెలుపుఁ గొనలేఁడు. వయోవృద్ధుండై విగతవీర్యుం డైనగాంగేయుం జెప్పనేల? అందఱు నొక్కమ్మడి పొదువుఁ డని చెప్పి చేయి వీచుటయు సర్వసేనానాయకువచనం బాకర్ణించి వారియోధులు గాంగేయరథంబు మీఁదికిఁ గవియుటయు మనవారలు నిలువరించుచుండిరి. దుశ్శాసనుఁ డట్లు వెఱపు దక్కి యుక్కు మిగుల నర్జునుంబోలెఁ దదీయశరములు పితామహునుపయిం బడకుండ నాఁగినం గోపించి కిరీటి శస్త్రాస్త్రజాలములు గుప్పించుటయు మనమున్నసేనుఁడును బెఱుదివియక కసిమసంగుటయుఁ జంద్రాదిత్యసన్నిభులయిన దుశ్శాసనశ్వేతవాహనులపోరు మయశక్రసమరంబుచాడ్పునఁ జూపఱకు విస్మయావహం బయ్యె. అంత గండడరి దుస్ససేనుఁడు కిరీటిని మూఁడమ్ములను వాసుదేవు నిరువదేనుతూపులను నొప్పించినం గోపించి యర్జునుండు వానిమేన నూఱువాలమ్ములఁ గీలించె. అందుల కలిగి నీకొడుకు పార్థునిపై బాణపంచకం బేసి వెండియు మూఁడువాఁడికోలల నతనిఫాలభాగంబున నాటుటయు నమ్మేటివిలుకాఁడు శృంగత్రయసముల్లసితం బయినమేరుధరాధరంబుకరణి నొప్పుచు రక్తసంసిక్తగాత్రుండై పుష్పితాశోకపాదపంబు ననుకరించె. అంతఁ బరమక్రోధదీపితుండై పాండవమధ్యముండు శరజాలంబుఁగురిసి పర్వకాలమున రాహువునిశాకరుంబోలె గప్పిన నొచ్చి యతండు కంకపత్రవిలసిత

శితశరము లేయుటయుఁ గడుం గినిసి క్రీడి దుస్ససేనునివిల్లు దునిమి మేనమూఁ
డువాలమ్ము లేసె. నీకుమారుఁడు వేఱు చాప మెత్తి సజ్యముఁ గావించి యద్భు
తం బావహిల్ల యమదండోపమంబు లయిన యయ్యర్జునబాణముల నడుమన
తునియలు గావించి సునిశితశరముల నతనిపై నేయుటయు నప్పార్థుండు కోపా
టోపదీపితుండై కనకపుంఖములు శిలాశితములు నగుబహుళమార్గణముల నే
యుడు నవి యంచలపిండులు చెఱువునుబోలె దుశ్శాసనుగాత్రంబుఁ జొచ్చిన
నొచ్చి యతండు మూర్ఛ వచ్చి తేరిపయి నొఱగఁ బడుటయు సారథి తేరు పితా
మహు తేరి మఱుఁగునకుఁ బఱపె. అప్పు డగాధం బయినయర్జునశరార్ణవమున
మునుఁగుచుండిన దుస్ససేనునకు భీష్ముఁడు పెనుదీవి యయ్యె. అంతఁ గొంతవడి
కతండు తెలిసి మగిడి యర్జునుం దాఁకి శరనికరంబుఁ బరఁగించిన నతం డతనిపై
పెక్కుతూపులఁ గురియుటయుఁ బోరు ఘోరం బయ్యె. సాత్యకి తన కడ్డపడిన
యలంబుసుపయిం గోపించి నవ్వుచు నవలీలం దొమ్మిదియమ్ములు పరఁగించినం
గినిసె యతండు వృష్ణివీరునిపై నన్ని బాణమ్ము లేసె. ఏసినం గోపించి సాత్యకి
యారక్కసుపైఁ బెక్కమ్ములఁ గురియుటయు నతం డతనిపై వివిధవిశిఖంబు లేసి
దిక్కులు పిక్కటిల్ల సింహనాదంబుఁ గావించినం గోపరూషితుండై శైనేయుం
డు శౌర్యధౌరేయుండై యంపలకు సంచలింపక యయ్యసురుపై శరనికరంబుఁ
బరఁగించుచున్నంత భగదత్తుఁడు వానిం దలకడచి సాత్యకి నెదిర్చి యంకుశముల
మత్తసింధురంబునుంబోలెఁ దీవ్రబాణగణములఁ బొడుచుటయు శినివీరుఁ డారక్క
సుని విడిచి యాప్రాగ్జ్యోతిషపతిపై నడరి బహుళశిలీముఖములఁ గురిసె. భగద
త్తుఁడును గినిసి శితభల్లమున సాత్యకిశరాసనంబు రెండుఖండములు గావించుట
యు నవ్వాఁడిమగఁడు కార్ముకాంతరం బెత్తి శితశరముల నతనిపై నేసె. నొచ్చి
భగదత్తుండు క్రోధాయత్తుండై యయోమయంబు కనకవైడూర్యచిత్రితంబు
యమదండోపమంబు నగుఘోరశక్తి నేయుటయు శైనేయుఁడు దాని నడుమన
రెండుతునియలుగ నేసిన నది చల్లాఱినకొఱవిమాడ్కి హతప్రభంబై నేలం
బడియె. అట్లు భగదత్తునిశక్తి వమ్మగుటయు దుర్యోధనుండు తమ్ములం బిలిచి
యీసాత్యకి ప్రాణములతోడఁ దప్పించికొనపోవనేరక యిచ్చటనే తెగుతెఱం
గుగా నందఱు నిప్పుడ చుట్టుముట్టవలయు. ఇతండు తెగనేని పాండవులు ప్రక్షీ
ణబలు లగుదు రనిన నన్నమాటమెయి నందఱుం గూడుకొని తాఁకియు మన
వారి కతనిం గెలువరా దయ్యె. అభిమన్యుఁడు దన కడ్డపడినసుదక్షిణునిపై నఱు
వదినాలుగువాలికతూపులు పరఁగించినం గినిసి యక్కాంభోజనాథుఁడు పంచశ
రము లతనిమేనం గీలించి తొమ్మిదింట సారథి నో నేసిన నయ్యిరువురకుం గ్రం
దుకయ్యం బయ్యె. అశ్వత్థామ విరాటద్రుపదులం దాఁకిన విరాటుఁడు దశభల్ల

మ్ములను ద్రుపదుఁడు మూఁడువాఁడికోలలను నతనిమేన నాటుటయు నాగురుపు త్రుఁడు కోపదీపితుండై పెక్కునారసములఁ బరఁగించి నొంచినను జలింపక వృద్ధులయ్యు వా రతని నాఁగుచుండిరి. కృపాచార్యుఁడు సహదేవుం దాఁకి డెబ్బది తూపు లేసినం గినిసి యతం డతనివిల్లు నఱికి తొమ్మిదియమ్ములు మేనం గీలించె. అంతలో నతండు వేఱువిల్లెత్తి పదితూపుల నమ్మాద్రిపిన్నకొడుకుపై నేసిన నతండు నతనియొమ్ము గాఁడ నేయుటయు మత్తశుండాలంబులపోట్లాటవిధమున వారి పోరు భీకరం బయ్యె. వికర్ణుఁడు నకులుం దలపడి యఱువదితూపు లేసినం గోపించి యతండు డెబ్బదేడుశితశిలీముఖముల నేయుటయుఁ గ్రోల్పులులపగిదిని బెద్దయాఁబోతులవిధముననను నయ్యిరువురు పోరుచుండిరి. ఘటోత్కచుఁడు తనపై నడరినదుర్ముఖునురమ్ము వాలమ్మున నొవ్వ నేసిన నతండతనిపై నఱువది బాణములం గుప్పించుటయు వారిసంగరంబుభీకరం బయ్యె. ధృష్టద్యుమ్నుఁడు దన్నాఁగినకృతవర్మపై నేఁబదియేనుమార్గణము లేయుటయునతం డతనిపైఁ గంకపత్రపరిచ్ఛదంబు లై నతొమ్మిదివిశిఖమ్ములు పరఁగించుటయు వారియాలంబు వృత్రమహేంద్రసంగ్రామతుల్యంబయ్యె. భూరిశ్రవుఁడు భీమునిదలపడి నిలునిలు మనియదల్చుచు వాఁడినారసంబున ఱొమ్ముగాఁడ నేయుడు వక్షస్థలస్థితం బయి నయాశిలీముఖముల నతండు తొల్లి కుమారశక్తిసహితం బయిన క్రౌంచపర్వతంబుభంగిఁ జూడ నొప్పె. అంత నయ్యిద్దఱు నెక్కువతక్కువలు లేకుండ నేసిన మాఱేయుచు నొంచిన నొప్పించుచు వివిధబాణములఁ గురియుచుండఁ జూచు చుఖేచరవ్రాతంబునకు వారికయ్యంబు విస్మయావహం బయ్యె. ఆచార్యుండు యుధిష్ఠిరుం దాఁకి పటుశరాసారంబుఁ గురిసి తఱిమినం బాండవపాంచాలసేనలు వెఱవక చలంబు మెఱయఁ బ్రతిఘటించి పోరుచుండె. చిత్రసేనుఁడు చేకితానుం దాఁకి కడిమి మెఱయం బోరుటయునతండును బెట్టిదుండై పేర్చుటయు వారి సంగ్రామంబు భీష్మం బయ్యె.

ద్రోణుఁ డశ్వత్థామను భీష్మునకుఁ దోడ్పడు మని చెప్పుట.

అత్తెఱంగున నిరువాఁగునం జేయంగలబిరుదుమగలు ద్వంద్వంబులై భీష్ముం గావను ద్రోవనుం బూని బవరంబు సేయుచున్నంత సకలనిమిత్తవిశేషవిదుండై నద్రోణాచార్యుఁడు రిపుబలంబుఁ బ్రతాపానలంబున నీఱుసేయుచున్న యశ్వత్థామం బిలిచి యిట్లనియె. పుత్రా, పార్థుఁడు భీష్ముం బడఁద్రోవఁగఁబూని యున్నచందము దోచుచున్నది. నిమిత్తంబులు పెక్కులు గానంబడుచున్నవి. దొనలనుండి యమ్ములు మీఁది కెగయుచున్నవి. విల్లదరుచున్నది. శస్త్రములు మోగముఁ ద్రెవ్వఁ జూచుచున్నవి. నామతియు నత్యంతనూరిరపరికారంబై

యున్నది. మృగపక్షులు నలుదెసల ఘోరముగ నఱచుచున్నవి. కౌరవసేనలప యిం గ్రద్దలు వ్రాలుచున్నవి. ఆదిత్యుఁడు తేజంబు దఱిఁగి కన్పట్టుచున్నాఁడు. దెసలెల్ల నరుణంబులుగాఁ దోఁచెను. పుడమి చెమర్చియు వెతఁ జెందియు వడఁకుచున్నది. వఱళ్ళు లఱచుచున్నవి. సూర్యమండలమునుండి కొఱవి పడుచున్నది. కబంధసహితంబై పరివేషము సూర్యచంద్రుల నావరించుచున్నది. కురువర్యుని దేవతాయతనదేవత లకారణంబుగఁ జలించుచున్నవి. నవ్వుచున్నవి. నృత్యముఁ జేయుచున్నవి. పలవించుచున్నవి. గ్రహములు దివాకరున కపసవ్యముగఁ దిరుగుచున్నవి. చంద్రుఁడు తలక్రిందై చూపట్టుచున్నవాఁడు. మనయోధుల యొడళ్లు తేజోహీనంబులై యగపడుచున్నవి. సేనాద్వయంబునందును పాంచజన్యదేవదత్తనిర్ఘోషంబు మిక్కిలి విన నగుచున్నది. వివ్వచ్చుఁడు యోధుల నందఱను గ్రేడించి శిఖండిని ముం దిడికొని శాంతనవుపై నడరి కోలుమసఁగుచున్నవాఁడు. ఎయ్యది కానున్నదో యని నామనంబు మిగుల వగలఁ బొగులుచున్నది. మేను నిడువెంద్రుకలతో విరవిరవోవుచున్నది. సత్యవ్రతుం డైనదేవవ్రతుండు శిఖండిపై మా ఱేయు టుడుగుఁగదా. మఱియు ధర్మనందనుమొగమునఁ గ్రోధము రూపుఁ దాల్చియున్నట్లు తోఁచుచున్నది. అద్దెసం జూడుము. బలవంతుఁడు బుద్ధిమంతుఁడు శౌర్యవంతుఁడు శస్త్రాస్త్రనైపుణ్యవంతుఁడు లక్ష్యశుద్ధిమంతుఁడు నిమిత్తవిజ్ఞానవంతుఁడు దేవదానవాదులకేనియు నవిజేయుఁడు నగుకిరీటి కపికేతనశోభాభిరామంబుగా గాండివజ్యాఘోషభీషణంబుగాఁ గౌరవసేనలపై నడరి కేతనంబులఁ గూల్చియు విండ్లుదునిమియుఁ బ్రాసతోమరప్రముఖసాధనసంఘాతంబుల నఱికియు మైమఱువు ళ్లఱువుల్లు చేసియుఁ గోల్తల చేసి చతురంగబలముల రూపుమాపుచున్నవాఁడు. తపము, దానము, దమము, సచ్చరిత్రము, బ్రాహ్మణప్రియత్వము మున్నగుసద్గుణంబులెల్ల ధర్మరాజానుజుం డైనయతనికి సహజములు. అంత వాఁ డలిగిన నేమి గాకుండు. అంతియకాక చిచ్చునకు గాడ్పు తోడ్పడుచాడ్పున భీముఁడును గవలును వానికి బాసటమై యున్నవారు. వెండియు సర్వలోకనాథుఁ డైనవాసుదేవుఁడు వానిపూన్కి నెఱవేర్పఁగ బద్ధదీక్షుఁడై యున్నవాఁడు. తపోగంధశరీరుం డైనయతనికోపమే కురురాజుమూఁకల సమయింపఁ జాలును. విల్లెత్తి కవిసి కసిమసంగినం జెప్పవలయునే! అమ్మేటివిలుకానిబారిం బడి సైన్యంబు మందరక్షుబ్ధసాగరంబుచందం బయ్యె. హాహాకారములు పెలుచ వినంబడుచున్నవి. ఇక్కడ సాత్యకిధృష్టద్యుమ్నవృకోదరమాద్రేయసమన్వితుండై ధర్మరా జురువడించుచున్నవాఁడు. రెండవగాండీవినాఁగ నుపేంద్రసదృశుం డైనయభిమన్యుఁడు వీఁడె యడరినవాఁడు. వీరల మాఱ్కొన కచటికిఁ బోవుట నాకుఁ దగదు. కావున నీవు రయమునఁ

బాండవమధ్యమున కడ్డపడి మగంటిమిం బేర్చి పోరాడుము. రాజుసొమ్మున మని నవారికిఁ బ్రాణముల డాఁపఁగ నిది యదను గాదు. స్వర్గమునైన విజయము నైన వెనుదీయక సాధింపఁగ నిపుడు కడంకమై నడరవలయు. పెద్దయు డెప్పరంబు చొప్పడ నగు నని శంకించి ప్రియపుత్రుం డైననిన్నుఁ బంచెద. అతండే జాహ్నవీసూనుండు యమవరుణతుల్యపరాక్రముండై పాండవసేనాకాననం బేర్చుచుఁ బేర్చుచున్నవాఁడు. వేవేగ నడువు మనుటయు నశ్వత్థామ తండ్రిమాట మెయి వడిం బఱచి మిన్నేటికొడుకునకుఁ దోడ్పడం జనియె.

భీముఁడు కృపాదు లగుపదుగురితోడఁ బోరుట.

ద్రోణుఁ డశ్వత్థామకుఁ జెప్పుచుండినవిధంబు విని కృపశల్యకృతవర్మభగదత్తవిందానువిందజయద్రథచిత్రసేనవికర్ణదుర్మర్షణులు పదుండ్రు మేటిమగలు రయమునం జని భీష్మునితోడఁ బోరుచున్నభీముం దాఁకి కృపశల్యులు ప్రత్యేకంబ తొమ్మిదింటను సైంధవకృతవర్మలు మూటను వికర్ణచిత్రసేనభగదత్తులు వేఱువేఱ పదింటను విందానువిందు లైదింటను దుర్మర్షణుఁ డిరువదింటను నో నేసినం గనిసి వృకోదరుండు శల్యు నేడింటను గృతవర్మజయద్రథులఁ బ్రత్యేకంబ యెనిమిదింటను విందానువిందుల వేఱువేఱ మూఁడింటను దుర్మర్షణు నిరువదింటను జిత్రసేను నైదింటను వికర్ణుని బదింటను నెవ్వ నేసి కృపాచార్యువిల్లు దునిమి యేడువాఁడితూపు లతనిమేన నాటె. కృపుఁడును దక్షిణంబ యొండొక విల్లు గొని పదివాలమ్ముల నంకుశముల నేనుఁగుంబోలె నవ్వడముడిం గాఁడ నేయుడుఁ గ్రోధదీపితుండై యతం డతనిఁ బెక్కుమార్గణమ్ముల నొప్పించి సింధురాజుగుఱ్ఱములను సారథిని మూఁడువాఁడికోలల మిత్తికి బలిచేసిన నతండు తేరు డిగ్గనుఱికి శితశరనికరంబుఁ బరఁగించె. అందులకు సైరింపక బకాంతకుఁడు రెండుభల్లముల విల్లు నఱకుటయు జయద్రథుండు విరథకార్ముకుండై చిత్రసేనురథ మధిరోహించె. భీమసేనువిక్రమము సైరింపక శల్యుఁడు భీమునిపైఁ బెక్కుతూపు లడరించి నిలునిలుమనియదల్చుచున్నంతఁ గృపకృతవర్మభగదత్తవిందానువింద చిత్రసేనదుర్మర్షణవికర్ణసైంధవు లతనిపయిం గవిసి శరనికరంబుఁ గురిసినం గోపించి మారుతాత్మజుండు వారల నందఱను వేఱువేఱ యైదేసియమ్ముల నొంచి శల్యుపై నెనుబదితూపు లేయుటయు నమ్మద్రపతి యలిగి వానిమేనఁ బదునాలుగుశరములం గీలించి యొక్కవాలమ్మున సారథి నో నేసె. తనసారథి యగువిశోకుఁ డందులకు వెతఁ జెందుటయుఁ బరమరోషరూషితుండై కిమ్మీరవైరి మద్రరాజునురమ్ము మూఁడువాఁడి యమ్ముల నొంచి తక్కఁగలయందఱను మూఁడేసిబాణముల హతదర్పులం జేయుటయు వా రందఱుం గినిసి మూఁడుమూఁడువిశిఖములఁ బరఁగించిరి. అందులకు నెవ్వ కవ్వడముడి వర్షధారకుఁ గులశైలం బెట్లు

లట్టుల నిశ్చలుండై క్రోధదుర్దాంతుండై శల్యునిమీఁద బాణత్రయంబు నాటి భగదత్తునిగాత్రమ్మున నూఱుసాయకములం గుప్పించి కృపునిఁ బెక్కుబాణముల నొంచి కృతవర్మవిల్లు దునుముటయు నాహార్దిక్యుఁ డతనిభూరిమధ్యభాగమున నెక్కయమ్ము నాటె. అంత భీముఁడు వెండియుం గృతవర్మ నెనిమిదిశరములను మద్రపతిం దొమ్మిదియమ్ములను భగదత్తుని శరత్రయమునను గౌతమప్రభృతుల రెండేసివిశిఖములను నొంచుటయు వా రతనిపై నెక్కుపెట్టి పెక్కునారసములఁ బరఁగించిరి. అవియెల్ల సరకుగొనక వాయుసూనుఁడు వారలనెల్లఁ దృణముగఁ దలంచి యుఱక పటుశరాసారంబుఁ గురియుచుండ భగదత్తుండు కనకదాంతం బయినశక్తిని సైంధవుఁడు పట్టసతోమరంబులను శాగద్వతుండు శతఘ్నిని శల్యుఁడు వాలికతూపులను దక్కినవార లైదేసిమార్గణమ్ములను నేసిరి. అప్పు డెంతయుఁ గోపించి భీమసేనుఁ డొకవాలికతూపునఁ దోమరంబును మూఁడింటఁ బట్టసంబును దిలప్రమాణఖండములు గావించి తొమ్మిదియమ్ముల శతఘ్నిం ద్రుంచి మూఁట శక్తిం బఱియలుగావించి యాపదుండ్రుదొరలపై మూఁడు మూఁడుతూపులు వేఱువేఱ యేసి నొంచుచుండె.

## అర్జునుఁడు భీమునకుఁ దోడ్పడి కురుసేనం జెండాడుట.

అయ్యవసరమున నర్జునుఁడు భీమునిపై నందఱు శూరు లడరుటం జూచి తా నతనికి బాసటయై యాపదుగురుదొరలం గవిసి యేడ్తెఱ మెఱయుటయు మనవారలు గెలుపుపై నాస మానిరి. అప్పుడు దుర్యోధనుండు సుశర్మను బిలిచి త్రిగర్తేశ్వరా ! భీమార్జును లదె మనవారల నుక్కడంచుచున్నవారు. నీవు వేగ మ యరిగి వారల నాఁగు మనిపుత్తెంచిన నాప్రస్థలాధిపతి యనేకసహస్రరథపరి వృతుండై యర్జును మార్కొనియె. అర్జునుండును వారలపైఁ గవిసి బలునారస ముల శల్యుని నొప్పించి సుశర్మకృపాచార్యభగదత్తసైంధవవికర్ణచిత్రసేనదుర్మ ర్షణకృతవర్మవిందానువిందులను వేఱువేఱ మూఁడేసిబాణముల నొప్పించె. అంత జయద్రథుఁడు చిత్రసేనరథస్థితుండై భీమార్జునులపై సాయకతతిం గుప్పించె. తక్కినదొరలును వారల వేఱువేఱ మూఁడుమూఁడువాఁడితూపుల నేసిరి. అందు లకుఁ గడుం గినిసి వారు త్రిగర్తయోధులం బిట్టేయుటయు సుశర్మ తొమ్మిదియ మ్ముల వారిపై నేసి సింహనాదంబుఁ గావించుటయు నాకౌంతేయులు గోగణం బులనడుమఁ గ్రీడించుకొదమసింగముల తెఱంగున నేడ్తెఱ మెఱసి శాతసాయక జాలంబుఁ బరఁగించి వాహనములనుండి యారోహకులఁ ద్రెళ్లించియు హేతివ్రా తంబులఁ దునుమాడియుఁ జతురంగబలంబులతలలు దఱుగుటయుఁ గయ్యంపు నేల నెక్కడఁ జూచినం గజగాత్రశకలంబులును దురంగాంగఖండములును రథ భంగంబులును బదాతులమొడళ్లతునియలునుంగా బీభత్సంబై యుండఁ బార్థప

రాక్రమమునకుఁ జూపలు వెఱగందిరి. అప్పుడు సుయోధనుండు కోపవిషాదభ రితుండై కృపకృతవర్మాదులఁ బురికొల్పి యయుతార్బుదచతురంగసేనం బఱపినఁ బార్థుం డలిగి యాగుఱ్ఱములనెల్లఁ దక్షిణంబ మృత్యుసదనంబున కనిచి తనపైఁ గవిసినమహారథుల నందఱను వివిధవిశిఖముల నొప్పించుటయు రౌద్రసముద్రిక్తుఁ డై మద్రేశ్వరుఁడు క్రీడియురమ్మున నిశితభల్లముల నాటె. నాటినం గడు నలిగి విప్వ చ్చుఁ డతనికోదండంబు ఖడించి యేనునిశితశరముల మర్మములం బొట్టెయుటయు నమ్మద్రపతి యొండువి ల్లెత్తి మూఁట వాసుదేవుని నేనింట నర్జునునిఁ దొమ్మిదింట వృకోదరబాహువక్షములనుం గాఁడ నేయుచున్నంత దుర్యోధనుండు పనుపఁగ ద్రోణజయత్సేను లడ్డపడిరి. అందు జయత్సేనుఁ డెనిమిదింట భీముని నేసిన నతండు కోపదీపితుండై పదునేనుశరముల నమ్మాగధు నొప్పించి యొక్కనిశితభ ల్లమున సారథిం గూల్చుటయు గుఱ్ఱములు తే రీడ్చుకొని పఱచె. అంత ద్రోణుఁ డు భీముం దలపడి యెనిమిదియమ్ము లేసిన నతండు గురునిపై నఱువదియేనుతూ పు లడరించె. అర్జునుఁడును దన కడ్డపడినసుశర్మపైఁ బెక్కునారసంబులు నిగి డించి తదీయసైన్యంబును మహామారుతంబు మేఘబృందంబునుంబోలెఁ దెరలిం చుటయు భీష్మదుర్యోధనబృహద్బలు లక్కౌంతేయులపై నడరిరి. యుధిష్ఠిరుండు ధృష్టద్యుమ్ననకులసహదేవసమన్వితుండై పితామహుపైఁ బాంచాలసృంజయ సేనలతోడఁ గవిసె. శిఖండియు వారిప్రాపున సురక్షితుండై మందాకినీనందను మీఁద శరములు నిగుడించుటయు నప్పటియాలంబు భీష్ముం గావనుఁ దోవనుం గాఁ బండెను చఱచినచందం బయ్యె. అట్టియెడ ధృష్టద్యుమ్నుఁడు తమసేనలకుఁ జేయి వీచుటయు సేనాపతియానతింజేసి ప్రాణములమీఁదియాశఁ దొఱంగి యొ క్కపెట్ట తనపయిఁ గవిసినతదీయసేనల శాంతనవుఁడు సాగరంబును వేల యెట్టు లట్టుల యాఁగుచుఁ బోరుచుండె ననిన విని యాంబికేయుఁడు సంజయా, యా మీఁదఁ గౌరవపితామహునకును బాండవులకును బవరం బెట్లు చెల్లె ననియడుగ నతం డతని కిట్లనియె. భీష్మార్జును లట్లు కోలుమసంగిన నిక్కడ నక్కడను బెక్కం డ్రు పొలిసిరి. భీష్ముఁడు తనపట్టినప్రతినమెయి నాఁడునుఁ బదివేవురురథికుల నప్ప టికిఁ బొరివుచ్చి వెండియుం గోలుతల సేయుటయు నేరికిం దేఱి చూడరాకుండె. అప్పుడు భీష్మునిబాణానలంబున ప్రమందిపోయినవారినామగోత్రంబులైనం దెలియ నయ్యెద.

## భీష్ముఁడు ధర్మరాజుతోఁ ద న్నేయుఁ డనిచెప్పట.

అవ్విధంబున భీష్ముఁడు గ్రీష్మాదిత్యునివిధమునఁ బ్రతాపాతపంబు గాయు చుఁ బదినాళ్లు తనప్రతినపగిదిఁ గోలుమసఁగి యాలంబు పరమాభీలప్రకారమునఁ జేసిజీవితంబున నిర్వేదంబుఁ జెంది యప్పటికిఁ దన్ను డాసినధర్మరాజున కిట్లనియె.

యుధిష్ఠిరా, నీవు మహాప్రాజ్ఞుఁడవు సర్వశాస్త్రవిశారదుఁడవును గావున ధర్మస్వర్గమూలం బైనయొక్కవచనంబుఁ జెప్పెద నాకర్ణింపుము. చిన్ననాఁటంగోలె ననేకప్రాణజాలంబు క్షాత్రధర్మంబునఁ బొలియించి యింక నీమేనిపొత్తు వలదని నిర్వేదంబుఁ జెందితి. కావున నాఁకుఁ గూర్తువేని పార్థుం బురస్కరించికొని పాంచాలసృంజయాదిపరివృతుండవై నన్ను గెలువం బూనుమనిచెప్పిన విని పాండవాగ్రజుఁడు బహుళసేనాసమన్వితుండై దేవవ్రతుపయిం గవిసె. ధృష్టద్యుమ్నుఁడు నవ్వచనంబు విని తమసేనలకుఁ జేయి వీచి భీష్ముం డలుకుముఁడు పోరుఁడు గెలువుఁడు. రిపుజిష్ణుఁ డై నజిష్ణుఁడు మహాబలుఁ డై నమహాబలనందనుండును బాండవసేనానాయకుం డై నధృష్టద్యుమ్నుఁడునుం గలుగ మీకు వెఱవం బనిలేదని పురికొలుపుటయు వారిమూఁకలు బ్రహ్మలోకసాధనతాత్పర్యమునఁ గ్రోధ మెసఁగ శిఖండిని ముం దిడికొని యాపగాసుతుం దాఁకిన మనవారును దోడన యడ్డపడుటయుఁ బోరుఘోరం బయ్యె. చేదిపాంచాలసేనలతోడ గాండీవి శిఖండినిబురస్కరించికొని పితామహుపై నడరుటయు నీకొడుకు లనేకరథికులతోడ నతని మార్కొనిరి. సాత్యకియశ్వత్థామను ధృష్టకేతుఁడు పౌరవుని యుధామన్యుఁడు దుర్యోధనుని విరాటుఁడు సైంధవుని యుధిష్ఠిరుఁడు శల్యుని భీముఁడు కరిఘటలను ధృష్టద్యుమ్నుఁడాచార్యుని సౌభద్రుఁడు బృహద్బలునిం దాఁకుటయు నేమిఘట్టనధ్వానంబును శంఖదుందుభినిర్ఘోషంబును గజవాజి బృహింతహేషితరవంబును జ్యాఘోషంబును సింహనాదస్వనంబును నొండొంటం దాఁకుకై దువుల చప్పుడును దారుణంబై యెసఁగె. ఆకాశంబు నిష్ప్రకాశం బయ్యె. వీరులతోడవులం దేజంబు దఱిగె. అత్తుములంబునకుఁ బుడమి వడకె. పరాగం బెగసి శస్త్రకాంతులం బెరసి విద్యుద్విలసితంబు లయినమేఘమండలంబులచాడ్పునఁ జూడ నొప్పె. చతురంగబలంబులొండొంటిం దలపడియె. అవ్విధముననుభయసైన్యములు భీష్మనిమిత్తమునం జేసి యామిషార్థంబు పోట్లాడుడేగలచాడ్పునఁ గవిసి రభసంబునఁ బోరుచున్నంత నభిమన్యుఁడు బృహద్బలుని నొంచి దుర్యోధను మార్కొనుటయు నతం డతని యురమున శరత్రయంబు నాటె. నాటినం గినిసి సౌభద్రుఁడు మిత్తికిఁ జెలియలు నాఁగఁ దనరుశక్తి నేయుడు రారాజు నిశితక్షురప్రమున దాని నడుమన రెండు ఖండములు గావించిన నయ్యిద్దఱిపోరు భరంబయ్యె. అశ్వత్థామ తనపైఁ గవిసిన సాత్యకిఱొమ్మున వాఁడినారసంబుఁ గీలించినం గోపించి యతండు కంకపత్రబాణములు దొమ్మిది వానిపై నేసె. అందుల కలిగి యాచార్యసూనుఁడు సాత్యకిపై దొమ్మిదియమ్ము లేయుడు నతం డతనిబాహువక్షోదేశముల ముప్పదితూపు లడరించినమెచ్చి యాద్విజపుంగవుఁ డతనిపై మూఁడమ్ము లేసినం దత్సంగ్రామంబు భీమంబయ్యె. పౌరవుఁడు ధృష్టకేతుపైఁ బెక్కమ్ములు పరఁగించిన నతం డతనివిల్లు

దునిమి యార్చుటయు నాచేదీశ్వరుఁ డొండువిల్లెత్తి డెబ్బదిమూఁడువాఁడికోల
లప్పౌరవుపయిం గుప్పించిన నయ్యిద్దఱు గొంతవడికిఁ బరస్పరబాణముల విచ్ఛిన్న
కార్ముకులు విభిన్నరథులు విరథులునై వాలును బలుకయుం గొని నేలకు డిగి
కరేణువుపై నడరుకొదమసింగముల తెఱంగునఁ గోలుమసంగి గతప్రత్యాగతా
దివివిధచిత్రమండలగతులం దిరుగుచుఁ బోరుచుండఁ గొండొకవడి ఉక్కుమిగిలి
పౌరవుఁడు ధృష్టకేతునిఫాలభాగముఁ గాఁడ నేసినం గినిసి యతం డతనిజత్రుదే
శంబుఁ గరవాలంబున నఱకుటయు నన్యోన్యప్రహారములం జేసి యయ్యిద్దఱు
మూర్ఛితు లగుడు జయత్సేనుఁడు పౌరవుని సహదేవుఁడు ధృష్టకేతువునుం దమ
తేరు లెక్కించుకొని తొలంగించిరి. చిత్రసేనుఁడు సుశర్మం దాఁకి యఱువదితొ
మ్మిదియమ్ము లేసిన నతం డలిగి పదిపదిబాణములం బలుమాఱు వేయుటయు
వాఁడు ముప్పదియమ్ములు ప్రయోగించిన నాలం బాభీలం బయ్యె. సౌభద్రుఁడు
తనపైఁ గ్రమ్మఱ నడరి యిరువదేనువాలమ్ము లేయుటయు నతం డతనిపై నెని
మిదిశరములఁ గీలించి విల్లు దునిమిన నతండు వేఱువి ల్లెత్తి తలపడిన నయ్యిద్దఱి
సమరంబు దేవాసురులుపోరునప్పటిబలివాసవులసంగ్రామంబుపోలె భీకరం బయ్యె.
భీమసేనుఁడు కోలుమసంగి తనపై నడరినకరిఘటలం గూల్చిన నవి నేలకు డిగిన
యనేకాంజనపర్వతము లనం జూడ నొప్పె. యుధిష్ఠిరుఁడు మద్రరాజుం దాఁకు
టయు నతం డతనిపయిం గవిసినం బరమాభీలప్రకారమున నాలంబు సెల్లె.
సైంధవుఁడు విరాటుం దలపడి తొమ్మిదిశితశరమ్ము లేసిన నతం డతనిపై ముప్పది
తూపు లడరించుటయుఁ జిత్రకార్ముకకృపాణపాణు లయినవారిజన్యంబు సామా
న్యంబు గాకుండె. ద్రోణుఁడు ధృష్టద్యుమ్నుం దాఁకి పెక్కునారసంబు లేసి విల్లు
ద్రుంచి యేఁబదితూపులు మేనం గీలించుటయు నప్పాంచాలకుమారుం డొండు
కోదండం బెత్తిన దానిం దునుముటయు నతండు కోపించి యమదండోపమం
బయినగద నేసిన నాచార్యుఁ డేఁబదింట దానిం బఱియలువాపిన నతండు కోపో
ద్దీపితుండై యేపు చూపుటయు రణంబు దారుణం బయ్యె. అర్జునుని భగదత్తుఁ
డేనుంగుతోడఁ దాఁకిన నమ్మేటివిల్కాఁడు బహుళశరవర్షంబు గురిసిన నతండు
క్రీడినిఁ గ్రేడించి ద్రుపదుపై నడరె. అర్జునుఁడును శిఖండిని భీష్మునిమీఁదికిఁ
బురికొల్పుటయు మనవారలు పెక్కండ్రుయోధు లడ్డపడుటయు మహామారు
తంబు మేఘబృందమునుంబోలెఁ దెరలించిన శిఖండి గాంగేయుపైఁ బెక్కమ్ములు
గురిసె. భీష్ముఁడు క్రోధారుణితలోచనుండై రథంబు వేదిగా ధనుర్బాణంబులు
జ్వాలలుగా నసిగదాదు లింధనంబులుగా నగ్నివోలె వెలుంగుచు క్షత్త్రియుల
నీఱుసేయుచు దివ్యాస్త్రముల నిగుడించుటయు వాహనంబు లారోహకహీనంబు
లయ్యె. రథంబులును హతరథికంబు లయ్యె. నేర్పరి యగువనపాలకుఁడు తాళఫ

లంబుల రాల్చుపగిది భటపటలంబుతలలు డొల్లిపడం జేయుచుండె. భీష్మునియ
మ్మొక్కటేనియు వమ్ము గాక గుఱి యగువారలనెల్లఁ గూల్చుచుండె. అప్పు డత
ని కగపడినవా రందఱుఁ బ్రేతలోకమునకుఁ బోవుచుండఁ జూచి పెఱవారలో
దుఁగుచుండిరిగాని యొండుగాదయ్యె. అర్జునుఁడు శిఖండియుఁ దక్క నెండొక్క
రుఁ డతని మార్కొనువాఁడు లేఁ డయ్యె. అట్టిపరమసమ్మర్దమున శిఖండి పదిభ
ల్లములు గాంగేయునురమ్మున నాటుటయుఁ గ్రోధదీపితుండై కటాక్షించుచు నతని
యాఁడుదనముఁ దలఁచి యూరకున్నంత నర్జునుఁడు శిఖండీ, తడయ నేల? పితామ
హుం దఱిమి యఱుము. నీవుదక్క మఱియెవ్వఁడును మనబలమున నవ్విలుకాని
మార్కొనువాఁడు గానంబడఁడు. నీపౌరుషంబుఁ జూపు మనిపురికొల్పుటయు
నతం డతనిపైఁ బెక్కుసాయకములు గురిసె. అవి గణింపక నిలింపనదీసూనుఁడు
పాండవసేనపయిం గవిసి యేపు చూపుటయుఁ బాండవరథికులును బెక్కం డ్ర
తనిం దాఁకిరి. అప్పుడు దుశ్శాసనుఁడు వారల నందఱం దాఁకి నిపుణప్రకారమున
బహువిశిఖపటలంబు గురిసి యందఱ నొక్కమాత్రన నిలువరించిన వారు వాని
మార్కొనఁ గడంగకుండుటయుఁ జూచుఖేచరులు నీకొడుకువిక్రమమునకు విస్మ
యం బందిరి. అర్జునుఁడు కోపదీపితుండై వానిం గెలిచి పితామహుపై నడరు
టయు శిఖండియు నతనిపై శరవర్షంబు గురియుచుండె. అందులకుఁ జలింపక
మందాకినీనందనుఁ డుష్ణార్తుఁడు శీతలజలంబులంబోలె శిఖండికాండముల గ్రహిం
చుచు నవ్వుచుఁ బాండవసేనల నేలకుఁగోలకుం దెచ్చుచు విచ్చుతోడ నెక్క
టెక్కటిబవరంబు సేయుచున్నంత సుయోధనుఁడు సైనికుల కిట్లనియె. అందఱు
నొక్కపెట్ట గాండీవిం దలపడుఁడు. ఉత్తాలతాలకేతనశోభాభిరాముఁడై నజాహ్న
వీసూనుండు గలుగ మీకు వెఱపేల? అమ్మహాత్ముఁడు దేవతలనైనం దెరలింపఁ
జాలును. మనుష్యమాత్రు లయినపాండవులం జెప్పవలయునే? ఏనుం బార్థుం
దాఁకి యేపు చూపెద నని పురికొల్పుటయు విదేహకళింగదాశేరకనిషాదసౌ
వీరబాహ్లీకదరదప్రతీచ్యోదీచ్యమాలవాభిషాహశూరసేన శిబివసాతిసాళ్వశకత్రిగ
ర్తాంబష్ఠకేకయు లొక్కపెట్ట మిడుత లగ్గింబోలె నర్జును నావరించిరి.

అర్జునుఁడు కౌరవసేనపై విజృంభించుట.

గాండీవియుఁ గోపాటోపదీపితుండై దివ్యాస్త్రంబు లేసి యమ్మూఁకలనెల్లఁ
జీకాకుపఱుచుచు దుశ్శాసనుఁ డడ్డపడినం బెక్కుబాణమ్ము లేసి మైమఱువు సించి
రక్తసిక్తగాత్రుం గావించి రథ్యములం గూల్చి సారథిం జంపుటయు విరథుఁడై
వాఁడు తొలఁగ నుఱికె. అంత వివింశతియుఁ గృపాచార్యుఁడును వికర్ణుఁడును
శల్యుఁడునుం దనపైఁ గవియుటయుఁ గపిధ్వజుండు వేఱువేఱ యిరువదేసియమ్ముల
వారల నందఱను విరథులం జేసి పొగలేనిచిచ్చుచాడ్పున మండుచుఁ గోలుమ

సంగి మనమూఁకలఁ జెండాడి సంగ్రామభూతలంబెల్లఁ బీనుంగుపెంటగను నాయు ధాభరణశకలనిబిడంబుగను రక్తనదీప్రవాహనీరంధ్రంబుగనుం గావించిన రుధిర సముక్షితంబై కయ్యంపునేల సంధ్యారాగలోహితం బయినశారదాభ్రపటలంబు ననుకరించె. శ్వసృగాలగోమాయువులు రక్తపానమాంసఖాదనలోలుపంబులై వ్రాలె. క్రవ్యాదభూతగణంబులకోలాహలం బెసంగె. శ్వేతచ్ఛత్రరథపతాకా దులు పఱియలై యానెత్తుటేటఁ దేలుచుండె. అప్పుడు భీష్ముఁడు దివ్యాస్త్రం బొకండు సముద్దీపితంబుఁ గావించుటయు శిఖండి యడరుటయుఁ బితామహుఁ డేయు టుడిగె. అర్జునుఁ డది తఱిగాఁ గొని యురువడించి పితామహునకు మోహ మగునట్లులు మనమూఁకలం గనుపుగొట్టుటయు నిరువాఁగునఁ జతురంగబ లము లొండొంటిం దలపడి పెనంగినం బోరు భీకరం బయ్యె. అంత శల్యకృప చిత్రసేనదుశ్శాసనవికర్ణులు రథాంతరముల నెక్కి సన్నద్ధులై పాండవసేనం దఱు ముటయు మహామారుతవేగంబునకు నావ యెట్లట్లు వారిధిరమున కయ్యాది తిరుగుడువడుచుండ గాంగేయుఁడునుం గవిసి నవమేఘసన్నిభంబులైనయిభం బులఁ గూల్చియుఁ దురంగములఁ జదిపియుఁ దేరుల విఱిచియుఁ గాల్బలంబుఁ జక్కాడియు నేత్తెఱ మెఱయుటయు నరాతిసైనికులు వెఱచి పఱచిరి. అట్టి యెడఁ గవ్వడియుఁ గోపోదగ్రుండై యురువడించినం జూచి మనవారును బ్రహ్మ లోకదీక్షితులై కవియుడుఁ బాండవయోధులును సేనాపతి పురికొల్పఁగ నీవును నీకొడుకులును గౌంతేయులకుఁ జేసినయెగ్గులు దలంచి యగ్గలికమైఁ దాఁకి మీ తండ్రిపై విశిఖపరంపరలు గుప్పించినం గోపించి యాపగేయుండు జామదగ్న్యకరుణం బడసినదివ్యాస్త్రంబు లేయుచు నేపు మీఱి నాఁడు పదివేలయేనుంగు లను నన్నిగుఱ్ఱములను బండ్రెండువేవురురథికులను బదునాలుగువేలకాల్బలంబును సమయించె.

భీష్ముఁడు విరాటునితమ్ముఁ డగుశతానీకుం జంపుట.

అట్టియెడ విరాటునితమ్ముఁ డగుశతానీకుఁడు పాండవసేనాక్షయమున కోర్వక భీష్మునిపైఁ గవిసి పెక్కుబాణంబు లేయుటయు నతండు కోపించి యాశ తానీకుం దెగటార్చి వెండియుఁ దనపై నడరినవారలనెల్ల మిత్తికి బలి చేసి యే దిక్కు చూచినం దనయమ్ములకా శరజాలంబుఁ బరఁగించి పట్టపవలింటిభానుమం తునిపోలె వెలుంగుచు మహేంద్రుఁడు దానవసేన నెట్టు లట్టుల పాండవసేనం గనుపుకొట్టుచు రెండుసేనలనడుమ నిలుచుటయు నతని నెవ్వరుం గన్నెత్తి చూడ నేరక యోహటించునంత మురాంతకుఁడు పార్థున కిట్లనియె. భీష్ముఁ డిరువాఁగు నడుమ వెలుంగుచుఁ బ్రతాపంపుటెండ గాయుచున్నవాఁడు. ఇతనిం బరిమా ర్పకున్న మీకు గెలుపు గలుగనేరదు. ఇట్టు లొప్పరింపరాదు. నీవుదక్క నొం

డొకం డమ్మేటివీరుని మార్కొనఁ జాలఁడు. అతనియలుఁగులసోన లాఁతి యెవ్వఁడు నోర్వ లేఁడుకావున నతిరయమున విక్రమింపు మనుటయు గాండీవి కేతనకపి స్ఫూర్తి మార్తుర కార్తిఁ గావింపఁగ నాపగేయుపై నడరియతనిరథరథ్యకేతన సహితంబుగ శరజాలమునం గప్పిన నతండును మాఱేయుచు వానినెల్ల మాయిం చుచుండె. అప్పుడు భీమసేననకులసహదేవధృష్టద్యుమ్నచేకితానకేకయసాత్యకి సౌభద్రఘటోత్కచకుంతిభోజశిఖండివిరాటప్రముఖులు గాండీవిప్రాపున నాప గాతనూజుం దాఁకి పటుశిలీముఖజాలంబుఁ గురిసినం గినిసి యతండు శిఖండికి మాఱేయుట మాని తక్కఁగలవారలయమ్ములఁ బొడవడంగించుచు నవ్వుచు నవలీలఁ బాండవసేనల నేలకుఁ గోలకుం దెచ్చుచుఁ బెక్కుపోకలం బోవుచుఁ గ్రీడించుచుండఁ గ్రీడి శిఖండిని ముం దిడికొని యతనిపైఁ గవిసి యనర్గళప్రసా రంబుగ మార్గణాసారంబుఁ గురియుటయుఁ దక్కినవారును గడిమి మెఱసి యయ్యా మరతటినీతనూజుం దలపడి శక్తితోమరపరశుప్రాసముద్గరముసలభిండివాలప్ర ముఖంబు లయిననానాహేతివ్రాతంబు లొక్కపెట్ట యేసిరి. దాన విశీర్ణకవచుఁ డయ్యు మాతండ్రి డించుకేనియు వెతఁ జెందక యుగాంతానలసమప్రకాశుండై పాండవసేనం జొచ్చి ధృష్టకేతుప్రముఖుల సరకుగొనక శిఖండిదెసం గన్నెత్తక భీమార్జునసాత్యకిద్రుపదవిరాట ధృష్టద్యుమ్నులపయిం గవిసి యయ్యాఱుగురు దొరలను నిశితశరముల నొంచేయుడు వారు వేలువేల పదిపదియంబకము లమ్మే టిమగనిపై నేసిరి. శిఖండియుఁ గాండజాలంబుఁ బరగించుచుండె. అట్టియెడ నర్జునుఁడు శిఖండిని బురస్కరించుకొని పోరుచు నమ్మరున్నదీతనూజుచాపంబు దుని మినం దాని నోర్వక ద్రోణకృతవర్మసైంధవభూరిశ్రవశ్శలశల్యభగదత్తులు కిరీ టిం దాఁకి శస్త్రజాలముఁ బరఁగించుటయు భీమసేనసాత్యకిధృష్టద్యుమ్నవిరాట ద్రుపదఘటోత్కచాభిమన్యు లేడుగురు దొరలు క్రోధమునం బెరిగి చిత్రకార్ముక పాణులై వారల కడ్డపడుటయు నమరంబు దేవదానససంగరంబుభంగిఁ దుములం బయ్యె. అప్పుడు శిఖండి గాండీవిరక్షితుండై భీష్ముపయిం బదితూపులు నాటి సారథిమేన నన్నియమ్ములు గీలించి యొక్కశరముఁ గేతనంబుపై నేయుటయు నాపగాసూనుం డొండుకోదండం బెత్తి కిరీటిపైఁ గవియఁ దలఁచుచున్నంత నక్కౌంతేయుఁడు శరత్రయమున దానిం దుంచె. వేఱొండుచాపం బతం డెత్తు టయు దానిం గూడ నఱికె. అ ట్లెత్తినవిండ్లనెల్ల వివ్వచ్చుఁడు ద్రుంచుచుండ సాభండనోద్దండుండు గిరివిదారణచణం బైనశక్తిం బార్థుపైరిపయిం బడ నేసె. ఏయుటయు ధనంజయుఁడు శరపంచకమున దాని నైదుతునియలుగ నఱుకుటయు మేఘబృందపరిభ్రష్టంబు లైనసౌదామినీఖండము లనంగ నాశక్తిశకలంబులు నేలం బడియె.

### భీష్ముఁడు పోరు చాలింతు నని తనలోఁ జింతించుట.

అట్లు శక్తి విఫలం బగుటయు శాంతనవుఁడు క్రోధసమన్వితుండయ్యుఁ గొంత విచారించి నారాయణుండు పాండవులకుఁ దోడ్పడకుండు నేని వారల నందఱను నే నొక్కవింటనే గెలువ నోపుదును. వాసుదేవాశ్రయులై పాండవు లవధ్యు లగుటంజేసియు శిఖండి స్త్రీపూర్వుఁ డవుటంజేసియు వీరి మార్కొనఁగ నాకు మనస్సు గొలుపదు. సత్యవతీవివాహమున సంతుష్టుండై మాతండ్రి నాకవధ్యత్వమును స్వచ్ఛందమరణమునుం బ్రసాదించె. ఇపుడు నాకుఁ జూడ శరీరాపాయంబునకుఁ బ్రాప్తకాలం బయ్యె నని తోఁచుచున్నది. కావున దేహత్యాగంబునకుఁ బూనుట మే లని తనలో దలఁచుచున్నంత నంతరిక్షమున నుండి ఋషులును వసువులును భీష్మా, నీతలంపు సముచితంబు. అదియే మాకుం బ్రియంబు. కావున యుద్ధ ముడుగు మని పలికిరి. అట్టియెడ మాతండ్రిమేన సురభిలలితశీతలానిలంబు వీచె. కుసుమవర్షము గురిసె. దివి దేవదుందుభులు మ్రోసె. అంతరిక్షగతు లయినఋషులయు వసువులయు వచనములు భీష్ముఁడు దక్క నితరు లెవ్వరు వినరైరి. వ్యాసమునికారుణ్యమునం జేసి యే నొక్కండను వింటిని. భీష్ముఁడు రథమునుండి పడఁ బోవు నని యత్యంతసంభ్రమమున సురలు పలుకుచున్నంత నప్పలుకులు విని దేవవ్రతుండు గాండీవి తనపై నమ్ము లేయుచుండినను దాను మాఱేయు టుడిగి యూరకుండె. శిఖండి యప్పుడు బలుతూపుల నతని యురమున నాటినం బృథివీకంపమునఁ బర్వతము లెట్టు లట్టుల యాబాణముల సరకుసేయక నిశ్చలుండై యుండె. అంత సవ్యసాచుఁడు నవ్వుచు గాండివగుణక్వణనంబుఁ గావించి యొక్కపరి యిరువదేనుక్షుద్రశరము లేసి పదంపడి శరశతముల మర్మస్థానముల నొంచేయుటయు జాహ్నవీసూనుండు కార్ముకంబుఁ జేతఁ గొని తన్మార్గణములనెల్లఁ దత్క్షణంబ మాయించుచుండె. అర్జునబాణములే యమ్మహాత్ముని నొప్పించుచుండెఁగాని శిఖండికాండము లేమియుం జేయఁ జాలకుండె. అంతఁ గిరీటి శిఖండిపురస్సరుఁడై పితామహునిపయిం బదినారసంబు లేసి కార్ముకంబుఁ దునిమి యొక్కటఁ గేతనంబుఁ గూల్చి పదింట సారథిని నొవ్వనేయుటయు భాగీరథీపుత్రుఁ డొండువిల్లు గొనియె. కొనునంతన సవ్యసాచి భల్లత్రయమున దాని శకలత్రయముఁ గావించె. ఇట్లొక్కనిముసంబులోన శాంతనవుఁడెత్తినవిండ్ల నెల్ల నఱకుటయు నతండు భీభత్సుం దలపడక యూరకుండుటయు నిరువదేనమ్ము లతం డతనిపై నేసె. అప్పు డర్జునబాణపీడితుండై కురుపితామహుం డప్పటికి డాసి వచ్చినదుశ్శాసనుం బిలిచి పార్థుఁడు పరమక్రుద్ధుఁడై యిప్పుడు లాఁతులఁ దాఁకుట మాని నన్నే కవిసి శస్త్రాస్త్రములఁ బరఁగించుచున్నవాఁడు. వజ్రధరుండైనను వీనిం గెలువఁ జాలఁడు. నన్నును దేవదానవాదు లెవ్వరును జయిం

పనేరరు. మనుష్యమాత్రులం జెప్ప నేల యని పలుకుచున్నంత సూర్యాస్తమ యసమయము సన్నిహితం బయ్యె. అంత నర్జునుండు శిఖండిని ముం దిడికొని శరనికరంబుఁ గురిసినం దద్బాణపీడితసర్వాంగుండై గాంగేయుండు దుశ్శాసను నకు వెండియు నిట్లనియె. గాండీవిబాణమ్ముల మిక్కిలి నొచ్చితిని. వజ్రసమస్పర్శ ములు నావరణభేదనపూర్వకముగ మర్మనికృతనంబుఁ జేయఁ జాలినవియు నగు నీబాణములు జోకల్లమాడ్కి మదీయగాత్రమ్ములను నొంచుచున్నవి. బ్రహ్మదం డసమస్పర్శములు యమదూతతుల్యములు క్రుద్ధభుజగోపమంబులు నగునీనారస ములు కర్కటిగర్భంబుమాడ్కి నాసర్వాంగముల వ్రచ్చుచున్నవి. పరికించి చూడ నీశరములు గాండీవివిగాని శిఖండివిగావు. ఇట్టియమ్ముల శిఖండి యెక్కడఁ బడసె. ఎప్పు డిట్లు బిట్టేయ నేర్చె. జిష్ణునిబాణములుదక్క లాఁతులబాణములు నన్ను నొంపఁజాలవు. అసువులఁ గొనిపోవువిధంబున నెంతయు నేఁచుచున్న వని పలుకుచు ముల్లోకముల సీఱుసేయువానిపగిదిఁ గ్రోధోద్ధతుండై యర్జునుమీఁద శక్తి నేయుటయు నతండు దాని మూఁడమ్ముల మూఁడుతునియలు గావించె. అంత శాంతనవుఁడు రథంబునన యుండి వాలును బలుకయుఁ జేతఁ బూని యర్జు నాశుగములనెల్ల వారించుచు నఱుకుచుండ నర్జునుఁడు సాయకజాలంబుఁ బరఁ గించి వాలుం బలుతునియలు గావించె. అంత ధర్మరాజు సేనలకుఁ జేయి వీచు టయుఁ బాండవసైనికులు పెక్కం డ్రొక్కుమ్మడిం దాఁకి ప్రాసపరశుప్రముఖనా నాయుధంబు లేయుచు సింహనాదబంధురంబుగాఁ బేర్చి పోరికిఁ గడంగుటయు గంగావర్తంబు సముద్రంబునుంబోలె వారిసైన్యంబు మనమూఁకలఁ జీకాకుప ఱుచుటయుఁ బోరు తుములం బగుడు సంగరాంగణంబు రుధిరాసారపంకిలంబై సమవిషమభేదములు దెలియమింజేసి దురవగాహంబై ఘోరరూపం బయ్యె. అప్పుడు ధనంజయుఁ డేత్తెఱ మెఱసి మనవారల నేలకుం గోలకుఁ దెచ్చుచుండి నను వెఱచియు సౌవీరకితవప్రాచ్యప్రతీచ్యోదీచ్యమాలవాదియోధులు పితామ హుని విడువక పాండవయోధులతోడఁ బెనంగుచుండిరి. భీష్ముం బట్టుఁడు పొడు వుఁడు పోరుఁడు త్రోయుఁడు ననుపలుకులు వారిసైన్యంబుల నింగి ముట్టె. ఏమి చెప్పుదు నప్పుడు మీతండ్రిగాత్రమునఁ గిరీటిశరములు దాఁకనిచోటు వ్రేలెఁ డైనం గలుగదయ్యె.

### భీష్ముఁడు శరతల్పగతుం డగుట.

అవ్విధంబున నర్జునబాణవిక్షతగాత్రుండై భాగీరథీపుత్రుం డాదిత్యుఁ డస్తగిరిశిఖరముచేరువకుఁ జనునవసరంబున వెండియుం గాండీవిబాణజాలవిద్ధుండై నీకొడుకు లందఱుఁ జూచుచుండ సూర్యుఁడు పశ్చిమాచలసానుభాగంబునం బడు విధంబునఁ దూర్పుతలగాఁగ శరజాలపరివృతసర్వాంగుండై ధరణితలంబుఁ దాఁ

కక మామనంబులతోడం బడియె. ఇంద్రధ్వజంబువోలె నిఖిలధనుర్ధరకేతనప్రా యుం డైనయమ్మహానుభావుఁడు పడునెడఁ బుడమి గడగడవడఁకె. వాన గురిసె. భూమ్యంతరముల హాహాకారంబు లెసంగె. అట్లు శరతల్పగతుం డైనయాదేవవ్ర తుని దేవభావంబు సొచ్చె. పడుచుండి యమ్మందాకినీనందనుండు దక్షిణాయనగతుం డైనసూర్యుం జూచి దేహత్యాగంబున కిది సముచితకాలంబు గా దని తనలోఁ జింతించుచుండి యక్కటా! యనుష్ఠితమహావ్రతుఁ డైనదేవవ్రతుండు దక్షిణాయ నమున మేను సాలించు ననిపలుకుదేవర్షులపలుకులు విని యుత్తరాయణంబు వచ్చునందాఁక మేనఁ బ్రాణము లిడికొనియుండెద నని వారి కుత్తరం బిచ్చి ప్రా ణముల ధరించియుండె. అట్లుండునంత గంగాదేవి దక్షిణాయనమునఁ గాయ త్యాగంబు సముచితంబు గాదని కొడుకునకుఁ దెలపఁబుపఁగఁ గొందఱు మునుల హంసరూపధారులం బంపుటయు వారు దేవవ్రతునకు భాగీరథీదేవిసందేశంబుఁ దెల్పిన నమ్మహానుభావుఁడు మునులారా, యిప్పుడు దక్షిణాయనం బగుట నెఱిం గియే యే నుత్తరాయణంబురాక ప్రతీక్షించుచు మేనఁ బ్రాణముల ధరించియు న్నవాఁడను. సత్యవతీవివాహమునిమిత్తమున బ్రహ్మచర్యవ్రతంబును రాజ్యత్యా గంబునుం బూనిననాపూన్కికి మెచ్చి మాతండ్రి శంతనుమహీపాలుండు నాకు స్వచ్ఛందమరణంబు వరముగఁ బ్రసాదించెఁ గావున నాయియ్యకోలు లేకుండినం బ్రాణములు నాయొడలు విడిచి పోవఁ జాలవు. రవి యుత్తరాయణగతుం డైన పదంపడి మేను సాలింతు నని మాతల్లి మందాకినీదేవి కెఱింగించునది యనుట యు వార లతని వీడుకొని యరిగిరి. కౌరవశేఖరుఁడును భారతపితామహుండును లోకవీరుండును నగుదేవవ్రతుం డట్లు శరతల్పగతుఁ డగుడుఁ బాండవసైన్యంబున సింహనాదంబులును శంఖధ్వానంబులును వివిధవాదిత్రనిస్వనంబులును భీమసేన భుజాస్ఫాలనక్ష్వేళారవంబులును బెలుచ నెసంగె. మనవారు విగతేంద్రియవృ త్తులై నష్టబుద్ధులై విగళితకర్తవ్యచింతనులై విహ్వలులై శూన్యప్రాయులై న్యస్తశస్త్రాస్త్రులై యాక్రోశనతత్పరులై కాందిశీకులై మోహావిష్టులై క్షత్ర నిందకులై యున్నవారని విని ధృతరాష్ట్రుఁడు సంజయా, గుర్వర్థం బను ష్ఠితబ్రహ్మచర్యుఁడు దేవసన్నిభుఁడు నగునమ్మహానుభావుఁడు పడినపదంపడి మ నవారివర్తనం బెవ్విధం బయ్యె. ఆతతాయి యైనశిఖండిపై నతం డమ్ముల నేయకుండె నని విన్నప్పుడే పాండవులు కౌరవులం గెల్తు రనితలఁచితిని. ఇంత కంటె దుఃఖ మొండు గలుగునే? తండ్రి పడియె నని విన్నను బాపమతియైన నామనంబు నాఱువ్రక్కలు గాదయ్యె. దీనిం దేవుఁడు ఱాతఁ జేసెఁ గాఁబోలు. జయేచ్ఛాకలితుం డైనభీష్ముఁడు తాఁ బడియుఁ బదంపడి యేమి చేసె? జామ దగ్న్యునకు నోడనియాదివ్యాస్త్రివేది శిఖండిచేఁ బడియె నని వినఁగ నమర్షంబు

పెచ్చు పెరుఁగుచున్నది. మీఁదివృత్తాంతం బెట్లని యడుగ సంజయుఁ డతని కిట్లనియె. అక్కారణిని సాయాహ్నంబునఁ గౌరవులకు ఖేదమునుఁ బాండవులకు మోదమునుం గావించుచు భీష్ముఁడు శరతల్పగతుం డగుటయు హాహాకారంబు లెసంగె. విశీర్ణకవచధ్వజుండై యమ్మహాత్ముఁడు పడినం జమూద్వయంబునందు రథికులు భయభ్రాంతు లైరి. కామార్తుం డైనతండ్రికిఁ బ్రియంబు గావించు వాఁడై యాజితేంద్రియుఁడు బ్రహ్మచర్యంబుఁ బూనె. రాజ్యముఁ ద్యజించె. ఇంతటివారుం బుడమిఁ బుట్టుదురె. ఇతండు బ్రహ్మవిద్వరిష్ఠుం డని జనులెల్ల నెక్కటిగ నప్పుడు పలికిరి. అప్పుడు దుర్యోధనానుమతిం దుశ్శాసనుండు నిజసేనాపరివృతుండై పరమరయమున ద్రోణానీకంబునకుఁ జని యయ్యాచార్యుం గాంచి యందఱు నితం డేమి చెప్పఁగ వచ్చెనో యని యఱ్ఱు లెత్తి చూచుచుఁ జెవు లొగ్గియుండఁ బితామహుఁడు శరతల్పగతుఁ డయ్యె ననవుడు నాభారద్వాజుండు మూర్ఛితుండై తేరిపయి నొఱగంబడి కొండొకవడికిఁ దెలిసి సేనలఁ దివియించి యమ్మందాకినీనందనునొద్దకుఁ జనియె. కర్ణదుర్యోధనులు నత్యంతశోకావిలమానసు లైరి. అయ్యవసరంబున నుభయసైనికులు సమరంబు సాలించి తత్కాలసముపగతశాంతిభరితులై కవచంబు లూడ్చియుఁ గైదువుల విడనాడియు నమ్మహానుభావుం గొలువఁ బోయి ప్రణమిల్లి నిలిచిరి. అర్జునుఁ డొక్కరుఁడు ధనుర్బాణపాణియై యరిగె.

### అర్జునుఁడు భీష్మున కమ్ములతలగడ నమర్చుట.

అంత శాంతనవుఁడు తన్నుఁ గొలువ వచ్చినకౌరవపాండవులను స్వాగతం బడిగి దేవసన్నిభు లయినమీదర్శనమున సంతుష్టమానసుండ నైతి. తల వ్రేలుచున్నది. కావునఁ దగినతలగడఁ గల్పింపుఁ డనుటయు ననేకులు త్వరితగతిం బోయి యత్యుత్తమమృదులోపధానంబులు పెక్కులు దెచ్చి యిచ్చుటయు జేవవ్రతుండు వారలం గటాక్షించి నవ్వుచుఁ బార్థివులారా, వీరశయ్యం బ్రాపించినవారి కిట్టివి తగ వని పలికి సర్వలోకమహారథుఁ డైనయర్జునుం బిలిచి ధనంజయా, నా కిప్పటి కేయుపధానంబు తగు నని నీకుఁ దోఁచు దానిం గల్పింపుము. నీవు క్షత్రధర్మవిదుఁడవు బుద్ధిసత్త్వగుణాన్వితుఁడవు గావునఁ జెప్పితి ననిపలికె. పితామహువచనంబు విని బాష్పపూరితలోచనుండై సవ్యసాచి యమ్మహానుభావునిపాదములకుఁ బ్రణామంబుఁ గావించి యట్ల యని మఱియు ననుజ్ఞ గ్రహించి గాండీవంబుఁ బుచ్చుకొని మూఁడువాలమ్ము లభిమంత్రించి పెడతలఁ దాకి మెత్తిపట్టుకొని యగ్రంబులు నేల నాటుకొనియుండునట్లు గావించి యేసినం బ్రీతుండై భారతకులశ్రేష్ఠుండు మెచ్చి వత్సా, శయనమునకుఁ దగినయుపధానంబుఁ గావించితివి. ప్రీతిఁ జెందితి. ఇట్లు చేయకుండిన శాపం బొసంగుదు నని

యుంటివి. మేలొనర్చికొంటివి. శరతల్పగతుండ నైనక్షత్రియుండిట్లే యుండవలయు
నని చెప్పి రాజుల నందఱం గలయం గనుంగొని యిట్లనియె. అర్జునుఁ డిచ్చిన
యుపధానంబుఁ జూచితిరిగదా. అతనితోడిపోరు మీకుఁ దగదు. ఇంక నైన
శాంతిఁ బొందుఁడు. ఏనును రవి యుత్తరాయణంబుఁ బొందునంతకు నిట్లే శరత
ల్పగతుండ నై ప్రాణముల ధరించియుండెద. అందఱు మద్రక్షణమున జాగరూ
కులై యుండవలయు. చుట్టు నగడ్తఁ ద్రవ్వించునది యనుటయుఁ బాండవులును
గౌరవులు నమ్మహానుభావు నిరక్షణంబున నేర్పున మెలంగఁ దగువారల నియమించి
పరిఖఁ ద్రవ్వించి యచ్చోటెల్ల సురక్షితంబుఁ గావించిరి. అంతఁ గొంతవడికిఁ
జికిత్సకులు సకలసాధనపాణులై వొడసూపి శల్యచికిత్సఁ జేయుదు మనివిన్నవిం
చినం జిత్తగించి మీతండ్రి శరతల్పగతునకుఁ జికిత్స యనుచితంబు. క్షత్రధర్మ
మునఁ గడుఁ బొగడ్త కెక్కిననా మేను శరానలముననే దగ్ధవ్యం బనిపలికి వారల
నుచితప్రకారంబున సత్కరించి యనుపుటయు భానుమంతుఁ డస్తగిరిం జేరె.

అర్జునుఁడు భీష్మునకు దివ్యాస్త్రజలంబుఁ ద్రావ నిచ్చుట.

అత్తఱి నటనర్తకవాదకగాయకగణికాకులవినోదంబులం జిత్తగించుచు
మత్తటినీతనూజుండు తీవ్రశరవేదనాదూయమానగాత్రుండై డప్పిఁ బొంది
పన్నగంబుభంగి రోఁజుచు రాజుల నందఱం గలయం గనుంగొని భూపాలురారా,
యగ్నివర్ణ[1] గోకలితంబై [2] గవ్యతుల్యంబై [3] గవ్యేతరం బయిన [4] గవ్య
[5] పయస్సుఁ ద్రావఁ గోరెద. వేగ తెచ్చి నా డప్పివాపుఁ డనుటయు ననేకు లనేక
ప్రకారంబు లగునానావిధభక్ష్యములను శీతలసలిలకుంభములనుం దెచ్చి ముంద
టం బెట్టినం జూచి శరశయ్యాగతుండ నైననాకు వీని నుపయోగించు టనుచితంబు.
ధనంజయుం జూడఁ గోరెద ననియె. అనవుడు నర్జునుఁడు డాయం జని యమ్మహా
త్మునిచరణముల కెఱఁగి వినయవినమితోత్తమాంగుండై కేల్దోయి మొగిచి పితా
మహా, యేమి సేయుదుననుటయు నద్దేవవ్రతుండు పరమప్రీతుండై యర్జునా,
నీయమ్ముల వేఁడిమిం జేసి నామేను మిగుల నెరియుచున్నది. మర్మములెంతయు నొ
చ్చుచున్నవి. ముఖము వాడుచున్నది. పెదవు లెండుచున్నవి. నీళులు ద్రావఁ
గోరియుండెద. ఏసలిలంబు నా కిపుడు ద్రావం దగు నప్పానీయంబు వేగ తెచ్చి
యిమ్మని పలికె. అంత నతండు వల్లె యని రథం బెక్కి యందఱును వెఱచునట్లుగ
గాండీవగుణక్వణనంబుఁ గావించి తేరమ్మహాత్మునకుఁ బ్రదక్షిణంబుగఁ బో నిచ్చి
యందఱును జూచుచుండ నొక్కశరముఁ బర్జన్యాస్త్రమున నభిమంత్రించి గాంగే

[1] బాణము. [2] ఆవు. [3] ఆవు. [4] భూమి. [5] ఉదకము. అగ్నివర్ణబాణముచేతఁ దేఁబడినదియు నావుపాలకుఁ దుల్యము నావుపాలకంటె నితరము నగు భూజలమును ద్రావఁ గోరెద నని భావము.

యువలపటిదెస నవనిం గాఁడ నేయుటయుఁ దోడన యత్యంతశీతలంబు దివ్యపరిమళోల్లసితం బమృతతుల్యంబు నగుసలిలంబు మహాధారయై ధాత్రీతలంబు వెలువడి వచ్చినం దానిఁ బితామహున కిచ్చి యమ్మహానుభావునిడప్పి దీర్చి తనియం జేసె. అర్జుననమానుషకృత్యమునకు రాజు లందఱు పరమాశ్చర్యావిష్టులై శీతార్దితంబు లయినగోగణంబులవిధమున వేపమానగాత్రులై యుత్తరీయములు విదిర్చుచుండిరి. అప్పుడు శంఖదుందుభినినాదంబు తుములం బయ్యె. పితామహుఁడు నివృత్తపిపాసుఁడై పరమతృప్తుఁడై గాండీవిం బిలిచి యందఱు వినంగ నిట్లనియె. ధనుర్ధరవరేణ్యా, నీ కిది చిత్రంబు గాదు. నీవును వాసుదేవుఁడును నరనారాయణు లనుపురాణమునులని నారదుఁడు నాకుఁ దెల్పినవాఁడు. శ్రీకృష్ణసహాయుండ వైననీవు దేవతలకు నశక్యం బయినకార్యంబుఁ జేయుదువు. జంతుజాలములలో మనుష్యుఁడును బక్షులలో వైనతేయుఁడును జలాశయములలో సాగరంబును బశువులలో గోవును దేజస్వులలో నాదిత్యుఁడును బర్వతంబులలో హిమవంతంబును వర్ణములలో బ్రాహ్మణవర్ణమును నెట్టులట్టుల నీవు విలుకాండ్రలో నెల్ల నుత్తముఁడవు. ఈయర్థంబును నేనును విదురుఁడును ద్రోణాచార్యుఁడును సంజయుఁడును నాందజామదగ్న్యప్రముఖమహర్షులునుం బలుమాఱులు సెప్పినను విపరీతబుద్ధి యగుదుర్యోధనుఁడు పెడచెవిం బెట్టె. శాస్త్రముల నుల్లంఘించి పెద్దలమాట నిరాకరించినయమ్మందాత్ముఁడు భీమునిచేఁ దొడలు విఱుగ నడువం బడు ననిపలుకుటయు దుర్యోధనుండు దీనాననుండై యుండె.

## భీష్ముఁడు దుర్యోధనునకు హితోపదేశంబు చేయుట.

అప్పుడు పితామహుఁడు నీకొడుకునకిట్లనియె. దుర్యోధనా, ధీమంతుఁడగు పార్థుఁడు చేసినపనిం జూచితివిగదా. ఈపనిని లాఁతులెవ్వరును జేయనేరరు. ఆగ్నేయవారుణ సౌమ్యవాయవ్యవైష్ణవమాహేంద్రపాశుపతబ్రాహ్మవైవస్వతాది దివ్యాస్త్రములనెల్ల నేర్చినవార లీలోకమునఁ గృష్ణార్జునులుదక్క సితరులు లేరు. సురాసురు లందఱు నొక్కటియై యెత్తివచ్చినను గాండీవిం గెలువఁ జాలరు. ఆహవోద్దాముఁడు సత్యసంధుఁడు సకలసుగుణసంపద్విలసితుఁడు నగుసవ్యసాచితోడిపొందు నీకు మేలు. సర్వలోకమహేశ్వరుం డైనదామోదరుండు వారి కెందాఁకఁ దోడ్పడియుండు ధర్మనందనుమొగమునఁ గ్రోధ మగ్గలంబై యెంతకు మీసేనల సమూలధ్వంసంబుఁ గావింపకుండు భీమసేననకులసహదేవు లెంతకు నీసకలసైన్యములనుం బరిమార్పకుండుదు రంతకుమున్న నీవు పాండవులతోడ సంధిఁ గావించి మనుట యెంతయు నుచితంబు. ఈపోరు నాతోడ ముగియుఁగాక. నాపలుకు లింకనైన నీకుఁ బ్రియము లగుఁగాక. నీకును గులమునకును లోకమునకును నావచనంబు క్షేమంకరంబు. క్రోధంబు డిగ్గఁ ద్రావి శాంతిఁ బొందుము.

అర్జునునితోడిపో రింకనైనం జాలింపుము. హతశేషులైనం బ్రదుకుదురుగాక. పాండవుల కర్ధరాజ్యం బిమ్ము. నీవు హాస్తినపురంబు నతం డింద్రప్రస్థంబును దొల్లింటియట్ల యేలుచుండిన నెంత యొప్పునో. మిత్రద్రోహంబు సేయకుము. దుర్యోధనుఁడు దురాత్ముఁ డనునపకీర్తికి భాజనంబు గావలదు. పోరికి వచ్చినవారు తండ్రికొడుకులు నన్నదమ్ములును మాతులభాగినేయులును బరస్పరసౌహార్దంబు పొంపిరివోవఁ బరమానందమునఁ బొదలుచుఁ దమతమయావాసంబులకుఁ జనుదురుగాక. ఇప్పటి కిది యుచితంబు. మోహావిష్టుఁడవై నామాట వినవేని యెల్లయుం గోల్పడి తుదిఁ గుందుదువు. అందఱును దుర్యోధననిమిత్తమున లోకక్షయం బయ్యె నని నిన్ను దూఱుదురు. ఇంతయు నిక్కువం బని శరవేదనాపీడితుఁడయ్యు నీకొడుకులమేలు గోరి భాగీరథీపుత్త్రుండు వచించి పదంపడి యేమియుం బలుకక యూరకుండుటయు సర్వార్థసహితంబు హితంబు నగుతద్వచనంబును ముమూర్షువు పథ్యౌషధంబునుంబోలె గ్రహింపక విన్ననై మిన్నకుండె. అంత నందఱు నమ్మందాకినీనందనునకు ముమ్మాఱులు ప్రదక్షిణప్రణామంబు లాచరించి తదనుజ్ఞ వడసి యమ్మహానుభావునకుఁ దగినరక్షాపరుల నియమించి శిబిరములకుఁ జనిరి. అట్లు చనుచున్నయెడ వాసుదేవుఁడు భీష్మశరతల్పగమనసంతుష్టుండై ధర్మాత్మజుం జూచి మహారాజా! భాగ్యవశమున భీష్ముని జయించితివి. సర్వశస్త్రాస్త్రపారగుఁ డైనయమ్మహాత్ముఁడు దేవదానవాదులకు నవిజేయుఁడు. భవదీయక్రోధంబ యతనిం గూల్చె ననుటయు ధర్మరాజు మాధవుమొగమునం జూడ్కి నిల్పి యోమహానుభావా, నీప్రసాదంబు వడసినమాకు మేలు గలుగ కేల తక్కును? నిన్నాశ్రయించినవారికి విజయంబు నితరులకుఁ బరాజయంబును గలుగుట సహజంబకదా. భక్తాభయంకరుండైననీవు మాకు రక్షకుండవై యుండ మాకు విజయంబు సమకూఱు టిదేమి యబ్బురం బనవుఁడు బుండరీకాక్షుండు రాజేంద్రా, యిట్టులు పలుక నీకుఁ దగుఁగాని లాఁతులకుఁ దగునే యని యిట్లు సరససల్లాపగోష్ఠిం బరమముదమునఁ బొదలుచు సకలసేనాపరివృతులై శిబిరమున కరిగి యుచితప్రకారమున నుండిరి.

### కర్ణుఁడు భీష్ముం గాంచఁ బోవుట.

అంతఁ గొండొకవడికిఁ గర్ణుఁడు భయవిషాదవేపమానమానసుండై శరతల్పగతుండై యున్నశాంతనవునొద్ద కరిగి జన్మశయ్యాగతుఁ డగుకార్తికేయుని పోలెఁ జూడ నొప్పుచు నిమీలితాక్షుం డైనయమ్మహాత్ముం గాంచి పాదముల పయిం బడి కురుశ్రేష్ఠా, యేను రాధేయుఁడను వచ్చితిని. నీ కెప్పుడును ద్వేష్యుఁడనై యుంటి నని కినుకఁ బూనక దయార్ద్రహృదయుఁడవై కనువిచ్చి చూడు మని బాష్పధారాపూరితలోచనుండై గద్గదస్వరంబునం బలుకుటయు గాంగేయుఁ

డెట్టకేలకుఁ గన్నులు దెఱచి సాదరావలోకనంబునఁ బ్రసాదించి చేరువకుఁ జేరి యొకచేతఁ గౌఁగిలించికొని రక్షకభటుల నవలఁ బోవం బనిచి యతనికిఁ బ్రీతి పూర్వకముగ నిట్లనియె. కర్ణా, నీరాకకు మెచ్చితి. వచ్చి మేలు చేసుకొంటివి. నీవు రాధేయుఁడవుగావు. మఱి కౌంతేయుఁడవు. రాధాధిరథులు నీకుఁ దల్లిదండ్రులు గాదు వేదవ్యాసుఁడును నారదుఁడును నా కీయర్థముఁ దొల్లి దెల్పిరి. నీపై నామనమున ద్వేషమించుకేనియు నెప్పుడైనను లే దింతయు నిక్కవము. అకారణంబుగఁ బాండునందనులను దూషింతువనియు బిడ్డలలోఁ బగస్పరిభేదంబుఁ బుట్టింతువనియు నది మానుదు వని కినియున ట్లగపడుదు. అది శిక్ష గాని కోపంబు గాదు. శత్రు దుస్సహుఁడవనియు శూరశేఖరుఁడవనియు బ్రాహ్మణప్రియుఁడవనియు మహావదాన్యుఁడవనియు నిరుపమానుఁడవనియు దేవతుల్యుఁడవనియు నే నెఱుంగుదును. ఇంతటివాఁడవయ్యును నీచాశ్రయణంబునంగాఁబోలు ధర్మలోపంబుగఁ బల్కుదువు. ఎంతగుణవంతులకైనను దుర్జనాశ్రయంబున బుద్ధి సెడకుండునే? నాపలికినపరుషవచనములు కోపప్రయుక్తంబు లని తలంపవలదు. పాండవులతోడఁ బగ వారించుటకై నీయుత్సాహం బడంగు నని చెప్పితి. శస్త్రాస్త్రవిద్యయందు నీవు గాండీవికి సమానుఁడవు. దుర్యోధనునకుఁ గన్నియఁ దేఁ గాశికి బోయి యొక్కవింటన నీ వక్కడఁ గూడినరాజుల నెల్ల గెలిచితివిగదా. జరాసంధుఁడు నీ కోడెఁగదా. తేజోబలాదులం జూడ నీవు దేవకుమారుఁడవకాని మనుజమాత్రుఁడని యూహింపఁదగదు. నీమీఁదికోపమెల్ల నేను నేఁడు విడిచితి. సుప్రీతుండ నైతి. కడచినది కడచె. ఇఁక నందులకు వగవనేల? దైవవిహితంబు పౌరుషంబునం దప్పింప నెవరు నేర్తురు? పాండవు లేవురును నీకుఁ దమ్ములు. నాకుఁ గూర్తువేసి వారితోడఁ గలిసి పగ నేఁటితో మొదలు తెగ నడంగింపుము. పుడమిం గలరాజు లందఱు సమరంబు మాని సంతోషమునఁ దమతమపురముల కనుగుదురుగాక యని బోధించిన విని కర్ణుఁడు పితామహున కిట్లనియె. మహానుభావా, నీవచించినదెల్ల నిక్కనంబు. నేను రాధాసుతుండనుగాననియుఁ గుంతీతనయుండననియు నేను నెఱుంగుదును. అయిన నొక్కటి విన్నవించెదఁ జిత్తగింపుము. కుంతీదేవి దయ మాలి నన్నుఁ బరిత్యజించుటయు రాధాధిరథులు నన్నుఁ బెంచి పెద్దవానిం జేసిరి. మఱియు దుర్యోధనుఁడు నన్నుఁ బరమాదరమున మనిచె. పాండవులు వాసుదేవు నెట్లట్లు దుర్యోధనుఁడు నేను దన్ను గెలిపింతు నని పెద్దయు నమ్మియున్నవాఁడు. నాశరీరంబును ధనపుత్రమిత్రకళత్రాదిజాతంబును దుర్యోధనుసొమ్మని నిశ్చయించియున్నవాఁడను. అతనికి దెప్పరంబు పొసంగునెడ నేను దొలఁగుట యుచితం బగునే? సుయోధను నాశ్రయించి యేను జిన్ననాఁటఁ గోలెఁ బాండవులకుఁ గోపముఁ గావించినవాఁడను. క్షత్రియున కింట రోగపీడం

జచ్చుటకంటె యుద్ధమరణం బెంత మే లగు? నీవ చింతింపుము. ఇయ్యనర్థ మవ శ్యము గాఁగలయది. దైవసంకల్పితంబుఁ దప్పింపఁగ నేరు నేర్తురు? పృథివీక్షయ సూచకంబు లయిననిమిత్తములు మీరు మున్నగువారలుం జెప్పఁగ వింటిని. కాంచి గంటిని. పాండవులును వాసుదేవుఁడును నవిజేయు లని యెఱిఁగియెఱిఁగియే యేను బోరికి నడిచెద. స్వధర్మప్రీతమానసుండనై ప్రాణములకుఁ దెగి యర్జును తోడఁ బోరాడెద. మీఁద నేది యైనను మేల. నీ వనుజ్ఞ యొసంగు దేని పోరికిఁ గట్టాయితంబై యున్నవాఁడను. ప్రసన్నుఁడవై యాన తిమ్ము. అజ్ఞానమున నొండెఁ జాపలమున నొండె నింతకు మున్ను నాపలికినప్రల్లదంబులు సైరింప వేఁడెద నని విన్నవించుటయుఁ బితామహుఁ డతనికి వెండియు నిట్లనియె. పగ యడఁగించుట యశక్యం బగు నేని నిరహంకారుఁడవు విగతసంరంభుఁడ వపగతక్రోధుఁడవునై ధర్మంబు దప్పక శక్త్యుత్సాహముల కనురూపముగఁ బోరుము. క్షత్రధర్మజితము లగుపుణ్యలోకములను ధనంజయువలనం బొందఁగలవు. ధర్మసహిత మగు యుద్ధముకంటె క్షత్రియున కుత్తమకర్మం బొండు లేదు. యుద్ధమున కను జ్ఞ యిచ్చితి. నీయిచ్ఛయేఁ జేయుము. బిడ్డలలోనం బరస్పరభేదంబు పుట్టకుండ గను గులనాశంబు గలుగకుండఁగను లోకములకు సేగిపొసఁగకుండఁగను నోపి నకొలంది యత్నము చేసితి నది కొనసాగదయ్యె. విధివిలసితం బనుల్లంఘ్య మని వీడుకొల్పుటయుఁ గర్ణుఁడు గాంగేయునకుఁ బ్రదక్షిణప్రణామంబు లాచరించి సుప్రసన్నచిత్తుం డైనయతనియనుజ్ఞఁ బడసి తే రెక్కి దుర్యోధనునొద్ద కరిగె నని సంజయుఁడు ధృతరాష్ట్రునకుఁ జెప్పె నని

క. అనఘుఁడు వైశంపాయన
మునినాథుఁడు భీష్మపర్వమును వివరింపన్
విని యజ్జనమేజయమే
దినీవిభుఁడు మోదవారిధిం దోఁగె నొగిన్.

ఉ. అన్యము లైనసాధనచయంబులయం దనపేక్షుఁడై జగ
న్మాన్యదురూహనైజమహిమంబునఁ గారణకల్పనం బసా
మాన్యముగాఁగ నెవ్వఁడు సమస్తజగంబు లొనర్చు యోగమూ
ర్ధన్యుల నూర్ణనాభమువిధంబున నప్పరమాత్ముఁ గొల్చెదన్.

ఇది శ్రీకాళహస్తినగరాధినాథ శ్రీమద్దామరకుమారాక్ష్మామహీంపాల కరుణాపు
రస్సరబహుమానపాత్ర, సంస్కృతాంధ్రభాషాకవిత్వచమత్కారపరితోషి
తబుధస్తోమ సీతారామకవిలలామ పుత్ర, సకలశాస్త్రనిరంకుశపాండితీధు
ర్య లక్ష్మీనరసింహసుధీవర్య సచ్ఛాత్ర, విబుధజనవిధేయ, వేంకటరంగ
నామధేయవిరచితంబయిన శ్రీమదాంధ్రవచనభారతంబునందు భీష్మ
పర్వంబునఁ బాండవసేనమీఁదఁ గోలుమసంగిన గాంగేయునిపైఁ
గృష్ణుఁడు నొగలు డిగి కవియుటయుఁ, గృష్ణుఁడు పురికొల్పఁగ నర్జు
నుఁడు శిఖండిని ముందిడికొని భీష్మునిపయిం బాణజాలంబు గురి
యుటయుఁ, బదినాళ్లు పోరాడి భీష్ముఁడు గాండీవిశరవిద్ధుండై
శరతల్పగతుం డగుటయు నన్నది ద్వితీయాశ్వాసము.

భీష్మపర్వము - సమాప్తము.



శ్రీ కాళహస్తీశ్వరాయ నమః.

# ద్రోణపర్వము.

## ప్రథమాశ్వాసము.

క. శ్రీసంభృతిప్రవణనా
నాసత్సౌఖ్యప్రకల్పనానిపుణసకృ
ద్ధీసమవహితధ్యానా
భ్యాసా వ్యాసాదిమునిమనోంతరవాసా.

దేవా, ననుఁ గృతార్థుం జేయుము.

సంతతసభక్తికోపసేవితద్వైపాయనుం డైనవైశంపాయనుం డనంతరకథాకర్ణనోదీర్ణకుతుహృదయుండై జనమేజయుండు మునీంద్రా, దేవవ్రతుండు పడినపదంపడి ధృతరాష్ట్రుఁ డేమి చేసె. భీష్మద్రోణాదులప్రాపునఁ బాండవులం గెలిచి రాజ్యమెల్లఁ దాన యేలఁ దలంచినయాదుర్యోధనుఁ డెబ్భంగి సలిపెఁ దెలుపవే యనియడుగుటయు నతని కిట్లనియె.

అంత ధృతరాష్ట్రుఁడు భీష్మునిపాటునకుఁ జింతాశోకభరాక్రాంతస్వాంతుండై శాంతిం బొందక కొడుకులగెలుపుఁ గోరువాఁడు కావున ననంతరసమరప్రకారం బెఱుంగువాఁడై కురుక్షేత్రంబునకు సంజయుం బనిచిన నతండు గొన్నినాళ్లు భండనంబు సూచుచుండి యొక్కనాఁటిరేయి శిబిరమునుండి కరిపురమునకుఁ జనుదెంచి యంతఃపురగతుం డైనయాంబికేయు నుచితప్రకారమునఁ గాంచి తన్నెఱింగించుటయు నతండు శాంతనవపతనఖిన్నమానసుండయ్యుఁ బుత్రవిజయకాంక్షఁ జేసి సంజయా, లోకనుతశౌర్యుం డైనమాతండ్రి పడినపదంపడి శోకసాగరనిర్మగ్ను లైనకౌరవు లేమి చేసిరి? మహాత్ము లగుపాండవులసైన్యము ముల్లోకములనైన వెఱపింపఁ జాలు ననియడుగ నతనికి సంజయుం డిట్లనియె. నరేంద్రా, సత్యపరాక్రముఁ డైనభాగీరథిపుత్రుఁడు శరతల్పగతుఁ డైనపదంపడి యిక్కడియక్కడిభూపాలు రెల్లరు నతనిం గాంచ వచ్చుటయు విష్వచ్చుఁ డతనికిఁ దలగడయుఁ ద్రావ నీళులు నిచ్చుటయు మున్నగునాఁటివృత్తాంతమెల్ల నీకుఁ దెల్పితిఁగదా. వీరశయ్యాగతుం డైనయమ్మహానుభావుఁడు బోధించినహితం బాదరింపక కౌరవులు క్రోధసంరక్తనయనులై కాలచోదితులు గావున సమ

రంబ కర్తవ్యం బని తమలో నిశ్చయించి యద్దేవవ్రతున కుచితరక్షావిధానంబుఁ గల్పించి ప్రదక్షిణనమస్కారపూర్వకముగఁ దదనుజ్ఞ వడసి శిబిరమున కరిగి రేయి సనుఁ బ్రభాతం బగుటయు నిక్కడ నీయానతిం గొని యేను శిబిరము సేరున వసరంబున భండనమునకు వెడలునుత్సాహంబున సవరణలు గావించుచుండిరి. అట్టియెడ భీష్మశూన్య మైనకురుసేన పాలకవిరహితం బై వృకగణాక్రమణసంకులం బై నగోవత్రియలగుంపువిధంబునను, దారకాహీనం బై నగగనంబుచందంబునను, సస్యశూన్యం బై నభూమిరీతిని, సంస్కారవర్జితం బై నవాక్యభంగిని, భర్తృరహిత మైనయంగనచాడ్పునను, నీళులులేనినదిమాడ్కిని, శరభనిహతసింహం బై నగిరిగుహావడువునను, విపరీతవాతాహతభగ్నం బై ననావకైవడిని, సొంపుదప్పి లబ్ధలక్ష్యు లై నపాండవవీరులకుఁ జిక్కి బలినిగ్రహంపునాఁటిదానవవరూథినివిధమున వాఁడిమి నెడలి వ్యాకులంబై సాధ్వసావిలంబై విహ్వలంబై విపన్నంబై యుండ సైనికులు కర్ణుఁడు గాంగేయుమీఁదియలుకఁ జేసి యతండు పోరనపదినాళ్లు దాను మంత్రిమిత్రబాంధవగణసహితంబుగ ననికి రాక తక్కినవాఁడు గావున సర్వధనుర్ధరవర్యం డై నయతండె యిపుడు మనకు రక్షగావింప నోపినవాఁడయ్యాపద్బాంధవు నాశ్రయించుటయ యిప్పటికిఁ గర్తవ్యం బని దృఢనిశ్చయులై కర్ణ కర్ణ కావు మని యందఱు నొక్కయెలుంగునఁ బల్కిరి. ఆరాధేయుఁడు మనవారియుద్ధోద్యోగసమయమున రథాతిరథుల నిరూపించుచో భీష్ముఁడు తన్నర్ధరథుఁ డనిపలికె ననియతనిపయిం గినిసి నీవు బ్రదికియుండునందాఁక నేను బోరికి రాను. నీవే పాండవుల జయించితి వేని యెట్టులైన రారాజు నియ్యకొల్పి యడవి కేగెద. వారలం గెలువనేరక హతుఁడ వగుదేని పదంపడి యేను విక్రమించి శత్రువిధ్వంసంబుఁ గావింతు నింతియకాని నీవున్నయెడ నాపోరు గల్గ దనిపలికెఁ గదా. ఆకారణమున భీష్ముఁడు పోరినపదినాళ్లు రణమునకు రాక నిల్చినకర్ణుఁ డింక ననికి వచ్చి గోవిందుఁడు సురలంబోలెఁ దమ్ము గెలిపించు నని పెద్దయు నమ్మి మనసైనికు లతనిం దలంచి రనవుడు ధృతరాష్ట్రుఁడు క్రూరపన్నగంబుచాడ్పున రోఁజుచు సంజయా! భయాకులచిత్తులై యార్తులై మనవారు తన్నుఁ దలంచినం గర్ణుఁడు వచ్చి వారలఁ గాంచి నాకొడుకులజయాశ సఫలంబు గావించెనే యనియడుగ నతని కతం డిట్లనియె.

అతిరథప్రవరుఁ డై నయాపగానందనుఁడు శరతల్పగతుం డగుట విని కర్ణుఁ డుదీర్ణవిషాదుం డై శోకార్ణవమగ్ను లయినకౌరవుల నుద్ధరింపఁగ నెంచి భ్రాతృభావంబు నెఱపువాఁ డై నీకొడుకులయొద్దకు వచ్చి యక్కటా! శౌర్యధైర్యధుర్యుఁడు మహనీయచర్యుఁడు శాంతిదాంతివిలసితుఁడు నోజస్తేజోవిరాజితుఁడు మేధావినయభూషణుఁడుఁ బ్రియహితభాషణుఁడు దివ్యాస్త్రవిశేషజ్ఞుఁడుఁ

గృతజ్ఞుఁడు ద్విజశత్రుఘాతకుఁడు నిత్యసత్యవ్రతుఁడు నగుదేవవ్రతుఁడు పడినపుడె యోధు లందఱును బడి రని తలంపవలయు. శత్రునిర్మూలనప్రక్రముఁడయిన యయ్యవక్రపరాక్రముఁ డొరులచేఁ బడుట చంద్రునకుఁ గళంకంబట్టి దయ్యె. కర్మయోగమున ధ్రువముగ నగువానిం దప్పింప నేరును నేరరు. వసుప్రభావుఁడు వసువీర్యసంభవుఁడు నగునవ్వసుంధరాధ్యక్షుండు వసుగణంబుఁ జేరువాఁడై పడిన సర్వవసువులను విడువకుండఁగఁ గౌరవులకుఁ దీఱునే. ఆశూరశేఖరుఁడు లేకుండ రే పెవ్వఁడు ముక్తసంశయుండై తెగించి పోరికిఁ గడఁగునో యని కన్నీరు జాలువాఱఁ బలవించినం గురుసైనికు లందఱును నీకొడుకులును విషాదభరభరితులై యార్తనాదంబులు సెలంగఁ బరిదేవనంబుఁ గావించుటయు శోకభరాక్రాంతు లైనవారలకు సంగరోత్సాహంబుఁ గల్పించువాఁడై రాధేయుఁడు మఱియు నిట్లనియె. దైవవశమునఁ బలుదెఱంగుల విపరివర్తమానం బగునీజగంబున నంతయు నస్థిరంబ యనితలంచెద. కాదేని మీ రిందఱు పోటుమగ లుండఁగ మేరుధీరుఁ డైనకురుపితామహుఁడు పడునే? భూమికి వచ్చినసూర్యునిచాడ్పున నాపగేయుండు వీరశయనగతుం డైనపదంపడి కొండల డొల్లింపఁ జాలినమహావాతంబును బాదపంబు లెట్టు లట్టుల మనవారలర్జును నాఁగఁ జాలరు. అనాథంబై యార్తరూపంబై హతోత్సాహం బైనకురుసైన్యమును నేను భీష్మనిభంగిఁ బాలించెద. భండనశౌండుఁ డైనశాంతనవునియనంతరంబు నాతల కెత్తినబరు వైనమీప్రోపు నెట్లుచేయకుండుదు? ధర్మరాజు ధైర్యమేధాధర్మసత్త్వసముల్లసితుండు. వృకోదరుండు నాగాయుతబలుండు. మహేంద్రనందనుం డైనయర్జునుఁడు బహుళదివ్యాస్త్రవిదుండు. కవలు యమోపమలు. శైనేయుం డవిజేయుఁడు. మఱియు వారికి వారిజోదరుండు పెనుఁబ్రోపై యుండు. వారలం గెలువ దేవతలకేనియుఁ దరంబు గాదు. ఇఁక మనుష్యమాత్రుండు వారల మార్కొన నోపు ననితలంపవచ్చునే? తపమునఁ దపంబును బలమున బలమును నడంచువిధమున మనస్వులయినవారల మనస్వియగునే నడంపఁ జాలుదు. పెక్కులేల? నేను శత్రుయోధుల నిశితమార్గణముల యమపురమునకుఁ బనిచి విమలకీర్తి నెఱపుదు నందులకుఁ జాలనేని యేలినవానిఋణంబుఁ దీర్పఁ గడంగి వారిచేఁ బొలియుదు నింతయు నిక్కువం బనిపలికి తనసారథిం బిలిచి యిట్లనియె. నామనంబు శత్రునిరాసపూర్వకంబుగఁ గౌరవరక్షణంబున ధృతోత్సాహంబై యున్నది కావున మహాప్రభావు లైనపాండవుల జయింపఁ గడంగెద. ఇపుడు కడంగి కౌరవసైన్యంబుఁ గాచినంగదా రారాజు చిన్ననాఁటంగోలె నన్ను మిత్రుఁ డని మన్నించి మనుచుటకుఁ దఱితోఁ దోడ్పడినవాఁడ నగుదు. కాకున్న నన్నందఱు మిత్రద్రోహి యనకుండుదురే. అమ్మాట పుట్టిన నా కోర్వరాదు.

ప్రాణములపై నాస మాని యరాతుల మార్కొని పౌరుషంబు పొంపిరివోవ వీరకృత్యంబు సేసి శత్రుసంఘములఁ దెగటార్చెద. అంతకుఁ జాలనేని భీష్ముని తోడివాఁడనై వీరలోకం బధిగమించెద. కురుసైన్యము హతప్రాయంబై పరిదేవనబహుళంబై యున్నయిత్తటి నియ్యదియ నాకుఁ గర్తవ్యం బనినిశ్చయించితి. పాండవులను వారివారలనుం బరిమార్చి యఖిలమహారాజ్యంబు సుయోధనుని కిచ్చెద. కనకవిచిత్రం బయినకత్తళంబును మణివిలసితం బయినశిరస్త్రాణంబును రవిమండలసన్నిభం బయినకార్ముకంబును వహ్నివిషాహిసంకాశంబు లైనశరంబులనుం దెమ్ము. మఱియు నిశితమార్గణగణపరిపూర్ణంబు లయినతూణీరంబులఁ బదునాఱింటిని బహుళదివ్యధనుర్బాణశక్తిగదాప్రముఖనానాసాధనంబులను జాంబూనదచిత్రితం బయినశంఖమునుం దేరిపయిం బెట్టుము. కనకమయం బైనహస్తికక్ష్యను సూక్ష్మాంశుకసమ్మృష్టం బయినయిందీవరప్రభ కేతుదండమునఁ జేర్పుము. చిత్రమాల్యంబు నమర్పుము. శారదాభ్రప్రకాశము లగుదివ్యాశ్వముల మంత్రపూతసలిలములఁ గృతస్నానములఁ గావించి కాంచనభూషణముల నలంకరించి రత్నచిత్రితరథమునఁ బూన్చి తెమ్ము. ప్రస్థానోచితపరికారమున దధిపూర్ణకాంస్యహేమపాత్రంబులఁ దేరను జయభేరుల మ్రోయింపనుం బంపుము. నీవు వేవేగ తేరు శాస్త్రోక్తప్రకారమున సమరసన్నాహసముచితముగ నాయితపఱిచి తెచ్చి ధర్మజభీమార్జుననకులసహదేవవాసుదేవసాత్యకిరక్షితం బయినపాండవసైన్యంబుపయిం బఱపుము. వింటినే పేర్పడ నప్పుడు నేను వారలఁ దెగఁ జూచెద. కాదేని భీష్మునితోడివాఁడనై పరలోకముఁ బ్రాపింతు నని మున్న యెఱింగించితిఁ గదా. దుర్బలభక్తు లయినలాఁతులతోడ్పాటు నేఁ గోర ననిపల్కినం దదీయసారథి తత్పరికారమున సర్వంబు సవరించి తేరు దెచ్చె. తెచ్చుటయు రాధేయుం డామోధనోత్సాహంబు పొదలఁ గౌరవరథికాభివంద్యమానుండై దేవగణపూజ్యమానుం డైనసురేంద్రునిచాడ్పున నొప్పుచు రథం బధిరోహించి విమానమధ్యం బలంకరించిన నిలింపపతిసొంపుఁ గ్రేణిసేయుచు జాహ్నవీసూనుండు శరతల్పగతుం డైనచోటికిఁ జని మహావాతసమూహంబున వట్టిపోయినసాగరంబుభంగిని మంహేంద్రపాతితం బయినమైనాకమహీధరంబుమాడ్కిని గగనచ్యుతుం డైనయాదిత్యునివిధమునను దొల్లి వృత్రనిర్జితుం డైనసుత్రామునిచందమునను సవ్యసాచిశరవిద్ధుండై శరతల్పంబుఁ బ్రాపించి యమునాహ్రదస్థితంబై మదనిమీలితలోచనంబై యున్నమత్తవారణంబు ననుకరించుచు వాఁడిమిపోఁడిమి దఱిఁగియున్నయప్పితామహుం గాంచి తేరు డిగ్గి పాదచారియై సవినయంబుగ డాయ నరిగి యగాధసమరసాగరము దాఁటఁ బూనినమనవారికిఁ బెనుదీవియై యుండి నయమ్మహాస్త్రవిదుఁడు పడుటకు వగచి శోకమోహపరిప్లుతుండై బాష్పవ్యాకు

లలోచనుండై పాదప్రణామం బాచరించి కేలుమోడ్పు ఘటియించి మహాత్మా, కర్ణుఁడను వచ్చితి. నీకు భద్రంబకదా. క్షేమపుణ్యాం బైనవచనంబు పలుకుము. కన్నెత్తి నన్నుఁ జూడుము. ధర్మపరుం డైననీ విట్టు లగుటం జూడ సుకృతంబు ఫలవంతంబు గాదని తలంపు వొడమెడి. మంత్రవ్యూహప్రహరణకోశసంజననాదుల నీకు సాటిరాఁ దగువాని నెక్కనిం జూడను. విశుద్ధబుద్ధివిలసితుఁడవై కౌరవులకు భయం బుడుపఁ జాలిననీ విట్టు లయిన నేఁడుమొదలుగఁ బాండవులు క్రోల్పులులు క్షుద్రమృగములంబోలెఁ గురుసైనికులఁ దెగటార్తురు. నేఁడు కౌరవయోధులు సవ్యసాచిశౌర్యం బెఱింగినవారు గావున గాండీవగుణక్వణనంబునకె వజ్రపాణి కసురు లెట్టు లట్టుల నివ్వెఱఁ బొందుదురు. గాడ్పుతోడ్పాటునం బేర్చినకార్చిచ్చు శుష్కగుల్మతృణద్రుమంబులంబోలెఁ గృష్ణసారథికుం డైనగాండీవి భండనంబున నేఁడు కురువీరులఁ బరిమార్ప కుడుగునే. కపిధ్వజరశ్మిచ్ఛటాభిరామం బైనయద్దివ్యరథంబున నారూఢుం డైనగాండీవపాణిని మార్కొనఁగ నీవు దక్క లాఁతులు నేర్తురే. అందఱు వానియెలుంగు విన్నంతన తొలంగుదురు. వానియమానుషకృత్యంబులు లెక్కకు మిక్కిలియై యుండు. ఎక్కటిబవరమునఁ బరమేశ్వరు మెప్పించి యితరదుర్లభం బయినపాశుపతాస్త్రంబు సాధించినయమ్మహావీరునివాఁడిమి చెప్పఁ గొలఁదియే? లోకనుతశౌర్యం డైనపరశురాముని గెల్చిననీకును వానిం గెలువరాకుండె. నేను నోపినకొలంది భండనోద్దండుం డైనయప్పాండవమధ్యముం బోర మార్కొన నున్నవాఁడ. అనుజ్ఞ యిత్తువేని యంతకుఁ జాలుదు ననివిన్నవించుటయుఁ బ్రీతచేతస్కుండై మీతండ్రి దేశకాలోచితముగ నతని కిట్లనియె. కర్ణా! నదులకు సాగరంబు, తేజస్సులకు భాస్కరుఁడు, సత్యమునకుసత్పురుషులు, బీజములకు భూమి, భూతములకుఁ బర్జన్యుఁడు, నెట్టులట్టులు నీవుసుహృదులకుఁ బ్రతిష్ఠానంబవు. సురలు సురేంద్రుంబోలె బాంధవులు నిన్నుఁ బొంది సుఖింతురుగాక. శత్రువులకు మానహానిని మిత్రుల కానందమునుం గావింపుము. విష్ణుదేవుఁడు దేవతలకుఁబోలెఁ గౌరవులకు నీవు పెనుఁబ్రాపగుట యెఱుంగుదు. దుర్యోధనునకుఁ బ్రియముసేయం బూని నీవు మున్ను కాంభోజాంబష్ఠవిదేహగాంధారులను గిరివ్రజగతు లగునగ్నజిత్ప్రముఖులను హిమవద్దుర్గకాంతారనిలయు లగుకిరాతులను నుత్కలమేఖలపౌండ్రకకళింగాంధ్రనిషాదత్రిగర్తబాహ్లికులనుం గెలిచి దుర్యోధనవశగతులం జేసితివి. వెండియు ననేకఖండముల ననేకయోధుల దుర్యోధనార్థంబు నిగ్రహించితివి. దుర్యోధనుఁ డెట్లట్ల నీవుం గౌరవులకు గతివి. మేలు గోరి చెప్పెద. యుద్ధము సేయుము. నీవును దుర్యోధనునివిధమున నాకుఁ బౌత్రసముఁడవు. కావున నీయెడ సుప్రీతుఁడను. మనమతని కెట్టు లట్టులు ధర్మమున నందఱును మనకుఁ బ్రియులు. శరీరసంబంధము

కంటె సజ్జనులతోడిస్నేహసంబంధ మెక్కు డని పెద్దలు సెప్పుదురు. కావున సత్యసంగతుండవై దృఢనిశ్చయమున దుర్యోధనునివిధమునఁ గురుబలంబుఁ గావు మనిపలికిన విని కర్ణుం డయ్యాపగేయునిపాదంబుల కెఱఁగి యనుజ్ఞాతుఁడై మగిడి కురుసైన్యంబుఁ జేరం జని బీరము పెంపార నుత్సాహంబు వాటించి పలుకుటయు దుర్యోధనప్రముఖు లగుకౌరవు లందఱు నతనికడంకకు మెచ్చి సింహనాదంబులను భుజాస్ఫాలనంబును మౌర్వీనిర్ఘోషంబులను శంఖధ్వానంబులనుం గావించిరి.

అప్పుడు దుర్యోధనుఁడు పరమసంతుష్టహృదయుండై రథస్థుఁడైన కర్ణుం జూచి రాధేయా, నీవు గలుగ నాసైన్యము నాథసహితంబై యున్నది. నీవలన నొక్కహితంబుఁ దెలియఁ గోరియున్నవాఁడ ననుటయు నతండు మహారాజా, చెప్పఁ దలఁచినదానిం జెప్పుము. నీవు ప్రాజ్ఞతముఁడవు. అనేకజనులఁ బాలించువారు కార్యజ్ఞులు గాకుండుదురే. అన్యాయ్యం బయినవాక్యము నీవు సెప్పవని నాకు నిశ్చయంబు. వినఁ గోరెదఁ జెప్పు మనియడుగుటయు రారాజు రాధేయున కిట్లనియె. వయోవృద్ధుండును విక్రమధౌరేయుండును శ్రుతసంపన్నుఁడును నిఖలయోధగుణసముల్లసితుండును నగుభీష్ముఁడు సేనాపతియై పదినాళ్లు పోరఁ బగవారల గీటడంచి వీరశయనంబుఁ బ్రాపించెఁగదా. ఇఁక నెవ్వని సైనాపత్యమున నిలుపఁ దగునో యని విచారించెద. నాయకుఁడు లేకుండునేని సేన కర్ణధారుఁడులేనినావకైవడిని నధ్యక్షుండులేనిసాతుమాడ్కి నిం గృచ్ఛ్రగతం బగు. శాంతనవుననంతరం బెవ్వని సేనాపతినిగా నియమింపఁ దగునో నీవు నిశ్చయింపుము. నిస్సంశయముగ నతనికిఁ బట్టముఁ గట్టుదు ననుటయు దుర్యోధనునకుఁ గర్ణుఁడిట్లనియె. రాజపుంగవా, సమరశూరు లయిన మనవారిలో సేనాపతిత్వంబు నిర్వహింపఁ జాలనివారు గలరే. కులబలవిక్రమబుద్ధివిభవముల నందఱుం జాలినవారలే. అందఱిలో నెవ్వండు విశిష్టుం డని లెస్స పరిశీలించి యతని నప్పదంబున నిలుపవలయుఁ గాని యొక్కపరి యందఱను నిలిపినం గార్యంబు దప్పు. మఱియు సమానులలో నొక్కని సేనానాయకుం జేసి సత్కరించినం దక్కినవారు స్పర్ధాభిభూతులయి వైమనస్యంబుఁ జెంది పోరికిఁ గడంగ రనితలంచెద. కావున విలుకాండ్ర కందఱకు నాచార్యుఁడు వృద్ధుఁడు ధనుర్ధరవరేణ్యుఁడు నీకు గురుఁడు శుక్రాంగిరసనీతివిదుఁడు బుద్ధిమద్వరిష్ఠుఁడు సర్వగుణశ్రేష్ఠుఁడు నగుద్రోణుని సేనానాయకుం జేయు టుచిత మనితలంచెద. వెండియు నమ్మహావీరుఁ డుండఁగ లాతివానికి సైనాపత్యంబుఁబొందఁ దగదని నిశ్చయించెద. అతండు సేనాముఖమున నిలిచిన నొక్కఁడైనను వెంబడిం జనక నిలుచునె. కావున నాచార్యుని సేనాపతిత్వంబున నిలిపి తత్పురస్సరులమై మనము కార్తికేయపురోగములయిన సురలు

దానవులంబోలెఁ బాండవుల మార్కొని విజయంబు సాధింతమనుటయు దుర్యో ధనుండిదియ యుచితం బనినిశ్చయించి సేనామధ్యగతుం డై నకుంభసంభవుపాలికిం బోయి యిట్లనియె.

దుర్యోధనుఁడు ద్రోణాచార్యుని సర్వసేనాధిపతిం జేయుట.

ద్విజసత్తమా, వర్ణశ్రేష్ఠత్వమునను, జన్మమహిమంబునను, వయోవృద్ధత్వమునను, బుద్ధివిలాసమునను, శాస్త్రజ్ఞానమునను, వీర్యోత్కర్షమునను, నస్త్రధృష్యత్వమునను, నర్థజ్ఞానమునను, దక్షత్వమునను, నీతివిశేషమునను, జయవిధానమునను, దపోమాహాత్మ్యమునను, గృతజ్ఞత్వమునను, మఱియు సర్వగుణములను నీకు సరివచ్చువాఁ డొండొకఁడు గన్పట్టఁడు. రుద్రులకుఁ గాపాలియు, వసువులకుఁ బావకుఁడును, యక్షులకుఁ గుబేరుఁడును, మరుత్తులకు వాసవుఁడును, విప్రులకు వసిష్ఠుఁడును, తేజస్సులకు భాస్కరుఁడును, పితృదేవతలకు ధర్మరాజును, యాదోగణములకు వరుణుఁడును, నక్షత్రములకుఁ జంద్రుఁడును, దైత్యులకు భార్గవుఁడు, నెట్టు లట్టు దండనాథులకు నీవు కార్యనిర్వాహకుండవు. ఇట్టినీవు సర్వసేనానాయకుఁడవై యక్షౌహిణుల నడిపింపఁగ నీప్రాపుఁ జెంది మేము కార్తికేయపురస్సరులై నసుర లసురులంబోలెఁ బాండవులం గెలువఁ గడంగుదుము. కరుణించి సేనానాయకత్వంబు నిర్వహించి నీవు సేనాముఖంబున దివ్యధనుర్ధరుండవై పొలిచి నిలిచిన మహోక్షంబు వెంబడిం జనుగోగణంబులచందమున నీపిఱిందిదెసఁ జనుదెంచువమ్ము ధనంజయుండు గెలువ నోపఁ డనుటయు మనరాజు లందఱును దుర్యోధనునకు హర్షోత్కర్షంబుఁ గావించువారై జయశబ్దపూర్వకముగ నాచార్యుం గొనియాడి పరమసమ్మోదభరితహృదయులై సింహనాదంబులు గావించుటయు సంతుష్టచిత్తుండై భారద్వాజుం డిట్లనియె. షడంగవిలసితం బయినవేదంబును మానవాదు లయినయర్థశాస్త్రములును వివిధదివ్యాస్త్రములను నేర్తును. మీరు నాయెడఁ గొన్నిగుణంబు లుగ్గడించి వేఁడుటం జేసి కురురాజుకోర్కి నెఱవేఱ సేనాపతిపదంబుఁ బొంది పాండవుల మార్కొని దురంబు సేసెద. మద్వధార్థంబు విధిసృష్టుం డై నధృష్టద్యుమ్నుం డెగటార్ప నాకు వలను గాదుగాని తక్కిన పాంచాలురం బరిమార్చెద. నన్నుఁ జూచి పాండవులు సంతోషమున ననికి రా నోపరు. ఓపినకొలంది రారాజుకార్యంబు నెఱవేర్తు ననుటయు దుర్యోధనుఁడు విధివిహితప్రకారంబున దివ్యకలశముల భవ్యసలిలములఁ దెప్పించి శంఖారవంబులును స్వస్తిపుణ్యాహవాచనరవంబులును సింహనాదంబులు నాశీర్వాదంబులును స్తుతిపాఠకస్తోత్రగీతంబులును నృత్యంబులునుం జెలంగ ద్రోణాచార్యుని సర్వసేనాధిపతిత్వంబున నభిషేకించి పాండవులఁ బరాజితులఁగాఁ దలంచి భీష్ముఁడు లేఁడనుకొఱంత మనమునఁ దలంపక యుల్లసిల్లిరి. అవ్విధమున సేనాధిపతిత్వపద

విభాసితుండై యాచార్యుండు సేనాముఖంబునం బొలిచి రాధేయాదియోధవీర సమన్వితుండై యడరి కడిందిమగంటిమిం బేర్చి పాంచాలకేకయసోమకప్రభద్ర కాదు లగువీరులఁ బెక్కండ్రను నక్షౌహిణిపైఁ గొంతబలమును విరాటద్రుపద ప్రముఖు లగురాజుల ననేకులనుం గూల్చి ఛత్రచామరధనుర్బాణకృపాణాదులఁ బొడిపొడిచేసి సంగరాంగణంబుఁ బీనుంగుపెంట గావించి నెత్తురుటేఱులు పాఱించి లయకాలసమయచండభానునిచాడ్పునఁ బ్రతాపాతపము గాయుచు వెలింగి తుది స్వర్గతుం డయ్యె. ఏమి చెప్పుదు దుష్టచరితుఁ డయినధృష్టద్యుమ్నుఁడే గురునిమ రణమునకుఁ గారణం బయ్యె. అట్టియెడ మనవారును జూచుఖేచరులును ధిగ్ధిక్ఛ బ్దంబులం బల్కుటయు నానినాదంబు తుములం బయ్యె. క్రూరకర్ములయినపాం డవులు విజయలాభంబున కుబ్బి పుడమి వడఁక సింహనాదములు గావించి రనిన విని ధృతరాష్ట్రుఁడు పరమవిషాదభరితుండై సంజయున కిట్లనియె.

ధృతరాష్ట్రుఁడు ద్రోణునిమరణమునకుఁ జింతించుట.

సంజయా, ద్రోణుఁ డేమి సేయుచుండఁ బాండవు లంతకుఁ గడంగిరి తేరు విఱిగెనో విల్లు దునిసెనో యేమఱియుండెనోకాని కాకున్న శస్త్రాస్త్రవిశా రదుండు దుష్ప్రధర్షణుండు లాఘవలక్ష్యశుద్ధిదూరపాతనాదిసమన్వితుండు చిత్ర యోధనప్రకారనిపుణుఁడు నగుభారద్వాజుం దెగఁజూడ నాధృష్టద్యుమ్ననకుఁ దరం బగునే? చతుర్విధధనుర్విద్యాపారగుఁడైనద్రోణాచార్యుం బాంచాలపు త్రుఁడు వధించె నని విన్నఁ బౌరుషంబుకంటె దైవమే బలవత్తరం బని దృఢ ముగఁ దోఁచెడి. దైవబలము లేక పౌరుషబలము నమ్మినవా రనర్థంబులఁ బొందు దురు. బ్రాహ్మదైవాదిదివ్యాస్త్రగ్రామంబు నేర్చి బ్రాహ్మణులకు సకలరాజకుమా రులకును నేర్పి లోకోత్తరుఁడనఁ బొగడికెఁ గన్నగురుండు పడుట సముద్రము వట్టి పోవుట మేరువు చలించుట సూర్యుఁడు పడుటయు నెట్టు లట్టుల యవితర్కితసం భవంబు. అమ్మహానుభావుఁడు పడియె నని విన్ననామనంబు నూఱుప్రయ్యలు గా కున్నది. విధిహతకుండు ఱాతఁ జేసెఁగాఁబోలు. ఇతరదుఃఖమున నితరులకుఁ జావు గలుగదొకో. మందభాగ్యుఁడఁ గావున నేను బ్రదికియున్నవాఁడ. దుష్టశిక్ష ణంబును శిష్టరక్షణంబును జేయునాద్విజశ్రేష్ఠుండు మందాత్ముఁడైననాకొడుకున కుఁగాఁ బ్రాణములఁ గోల్పడియె. ధీరమేధాతులితసురాసురాచార్యుం డైనయా ధనురాచార్యుఁ డెట్లు హతుఁ డయ్యెనో దైవంబ యెఱుంగు. వ్యాఘ్రచర్మపరి వారణరుక్మపరిష్కారం బయినరుక్మరథంబఁట. సింధువిషయజాతంబులు వాతర యంబులు వివిధరథగమనప్రకారనిపుణంబులు నధికబలసముల్లసితంబులు నగుశో ణరథ్యంబులఁట. రథికుఁడు ద్రోణాచార్యుఁడఁట. ఆరథికుని ధృష్టద్యుమ్నుండు పరి మార్చెనఁట. అక్కటా! యయ్యశ్వములు పాండవవాహినిం గడవఁ జాలవయ్యె

నొక్కొ. ఇంక నేమనం గలను. సంగ్రామమధ్యమునఁ గొందఱైనను గరిబృంహి
తవాజిహేషిత జ్యాక్షేపరవంబులను శరపాతమును సైఁచి విన్నఁబోవకుండిరె?
విల్లుపట్టినవారికెల్ల నాచార్యుఁడైనద్రోణుఁ డాకయ్యమున నేమి చేసె? శూరు
లందఱును సురలు సురేంద్రుంబోలె నతని నాశ్రయించియుండుదురుగదా. రౌ
ద్రకర్ముఁడైనయక్కుంభసంభవుం జూచి పాండవులు వెఱచి పఱవక మార్కొను
టకుఁ జాలిరే? ధర్మరాజు సకలసేనాసమేతుండై యాదివ్యాస్త్రవేదిని నిలువరిం
చెనే? అర్జునుఁడు దా నందఱ నాఁగుచుఁ జాపకర్ముఁడైనధృష్టద్యుమ్ను నాచా
ర్యుముంగల నిలిపి శరము లేయించెఁగాఁబోలు. గాండీవిప్రాపు లేకుండిన నప్పాం
చాలకులపాంసనుం డాచార్యు నెదిరింప నోపునే? చీమలగములు క్రూరపన్న
గంబునుంబోలెఁ జేదిమత్స్యకేకయకరూశపాంచాలాదు లందఱుం జుట్టుముట్టి
గిట్టిరొక్కొ. ఆఖ్యానపంచమంబు లయినచతుర్వేదములను సాంగధనుర్వేదమును
నేర్చి బ్రహ్మక్షత్రియప్రవరుఁ డనఁ బొగడికెఁ గన్నవృద్ధబ్రాహ్మణుఁడు శస్త్రనిహతుఁ
డయ్యెఁగదా. క్షుద్రమత్స్యములు తిమింగిలమునుంబోలె శ్రీకాము లైనపాండవులా
చార్యుని వధింపఁగ నెట్లు తెగించిరి? వేదకాము లయినబ్రాహ్మణులుధనుర్విద్యాకా
ములయినక్షత్రియులు నిరతం బెవ్వనిఁ బాయకుందురో యట్టిమహానుభావుఁడు
పాంచాలాధమునిచేఁ జచ్చె నని విన్నంతన నామనంబు పురపురఁబొక్కుచున్నది.
మనయోధులందఱు చూచుచుండఁగ నాద్రుపదకులపాంసనుఁ డెట్లు గురుం జంప
నోపె. సవ్యదక్షిణపార్శ్వములను బూర్వపశ్చిమభాగములను నాబ్రాహ్మణున కెవ్వ
రునుగావలివై నడువరొక్కొ. ఎంతయాపద పొసఁగిన నాశూరశేఖరుఁడు గడంగి
పోరునుగాని వెన్ను చూపి పఱచువాఁడు గాఁడు. అదియకదా యుత్తమశూరు
లకు లక్షణంబు. అమోఘశౌర్యుఁడైనయాచార్యుఁడు పొలిసె నని తలంపను
నామనంబు బెండువడియె నింకఁ గథలు వినం గొలుపదు. ఒక్కింతసేపు మిన్న
కుండుము. లబ్ధసంజ్ఞుఁడనై యడిగెద నప్పుడు చెప్పుదువుగాని యనిపలుకుచుఁ
గొడుకులగెలుపునెడ నిరాశుండై శోకభరమునఁ బొగిలి నేలం బడుటయుఁ గొలు
చుచున్నపడఁతులు మెల్లన లేవ నెత్తి యాసనంబుఁ జేర్చుటయు శోకాశ్రుపూ
ర్ణనయన లగుభరతకులాంగనలమృదుకరస్పర్శంబులను లలితశీతలమారుతవీజనా
ద్యుపచారమునను బెద్దయుంబ్రొద్దునకు మూర్ఛదేఱి వేపమానగాత్రుండై వెం
డియు సంజయున కిట్లనియె. సంజయా, ధర్మనందనుఁడు వాశితాసంగమయం
బునఁ బ్రతిద్విరదముల గణింపనిమత్తశుండాలంబుచందంబున మోహారంబున
నెదిరిం గణింపక యడరుచు నుదయగిరిశిఖరగతుం డైనచండభానునిపగిదిఁ దేజో
దుర్నిరీక్షుఁడై మనసేనలనెల్ల నీఱుసేయఁగఁ గ్రోధవీక్షణంబు సారించువాఁడు.
భీమసేనుఁడు మహాకాయుఁడు మహోత్సాహుఁడు నాగాయుతబలుఁడు సమర

ప్రియుఁడు ఘోరకర్ముఁడు ననఁ బరఁగువాఁడు. అర్జునుఁడు శూరుల కందఱకు నుత్తముఁడు. గాండివప్రభలు విద్యుత్ప్రకాశములుగా రథనేమిజ్యాఘోషము లుఱుములుగాఁ బర్జన్యునట్లు శరవర్షముఁ గురియించు. అశనిఘాతసంకాశము లయి నతద్బాణపాతముల నేమగం డోర్వఁ గలఁడు? వాఁడు పోరికిఁ దొడరునేని యంత కాకారమునఁ బొల్చి రక్తనదీప్రవాహములఁ బాఱించుఁగాని మిన్నకుండునే. స్ఫారరథీథితిఘోరకేతనకపిభైరవారావంబులను గాండీవనిర్ఘోషంబులను దేవదత్తా భీలరవంబులను విక్రమోల్లసితతదీయశ్వేతాశ్వరవంబులను దిక్తటంబుల బీఁటలు వాఱింపఁజాలు. మృత్యుసన్నిభుఁడై నయావీరుఁడు వాయువు వారిదపటలంబు లంబోలె రిపుప్రాణములఁ గొనుట నిక్కవంబు. అయ్యమానుషకర్మునకు వాసు దేవుఁడు తోడఁట. వాసుదేవసారథికంబు ధనంజయరథికంబు నగురథమును మా ర్కొన దేవదానవాదులును జాలరు. ఇఁక లాఁతులఁ జెప్ప నేల? నకులుఁడు సుకు మారుఁడయ్యు వివిధయుద్ధవిశారదుఁడు వానియార్పునకే సర్వసైనికులు వెలవెలఁ బోవుదురు. సహదేవుఁడు శత్రుదుర్జయుఁ డార్యవ్రతుఁ డమోఘుఁడు ననఁ బొగ డికఁ గన్నవాఁడు. సాత్యకి రామకృష్ణతుల్యుఁడు. ధనంజయునకు శిష్యుఁడై సక లశస్త్రాస్త్రముల నేర్చినవాఁడు. సౌవీరరాజుం జయించి యతండు భోజకన్యకం దెచ్చుట యందఱకుఁ దెల్లంబుకదా. ధైర్యశౌర్యబ్రహ్మచర్యసత్యాదిసుగుణంబు లన్నియు ముల్లోకములు కేశవునం దెట్లు లట్టుల వానియందు సుప్రతిష్ఠితంబులు. పాంచాలకుమారుఁడై నయుత్తమౌజుఁడు సార్థకనామధేయుఁడు. ధనంజయవిధే యుఁడు. దిక్పాలకసన్నిభుఁడు. చేదిపతి యగుధృష్టకేతుఁడు శస్త్రాస్త్రబలస్ఫీతుఁడు. వాఁడు దమవారల నందఱనుం దొఱంగి పాండవులఁ జేరినవాఁడు. కేతుమం తుండు శౌర్యసారవంతుండు. గిరిద్వారమున నజేయుఁడైనరాజపుత్రుని వాఁడు వధించె. శిఖండి యఖండవిక్రమోదాత్తుండు. స్త్రీపుంసగుణాగుణముల లెస్స మెఱింగినవాఁడు. దేవవ్రతవధార్థంబు పుట్టినవాఁడు. అభిమన్యుఁడు వీర్యబలముల వాసుదేవార్జునుల కెనవచ్చువాఁడు. తేజోమేధల నహర్పతిబృహస్పతులకుఁ దుల్యుఁ డు. సకలాస్త్రములును సత్యబ్రహ్మచర్యాదిగుణములును వానియెడ సుప్రతిష్ఠితంబు లై యుండు. అబాలవిక్రముఁడైనయబ్బాలుఁ డాలంబునకుఁ గడంగెనేని నోఱు దెఱచి లోకముల మ్రింగఁ జూచునంతకుపగిదిం బొల్చుఁగాని యొండు గాదు. ద్రౌపదేయు లజేయులు. ధృష్టద్యుమ్నపుత్రు లయినక్షత్రంజయక్షత్రదేవక్షత్ర ధర్ములు క్రూరకర్ములు. పంద్రెండేండ్లు గాంగేయునితో సకలాస్త్రములు నేర్చిన వారు. వృష్ణిప్రవరుండై నచేకితానుఁడు నూఱుగురుమేటిశూరులకేనియు నధికుఁ డనిచెప్పవలసినవాఁడు. కైకేయు లేవు రన్నదమ్ములు సత్యవిక్రములు, రక్తవర్మా యుధధ్వజులు, పాండవులకుఁ బినతల్లికొడుకు లవుటంజేసి వారికిఁ గడుం గూర్తురు.

యుయుత్సుఁ డాయోధనలంపటుఁడు. వారణావతంబున వానిం గెలువఁ బూని పెక్కండ్రురాజు లాఱునెలలు పోరియుఁ దుది నోడిరి. ధృష్టద్యుమ్నుఁడు సంగ రావష్టంభసముద్రిక్తుఁడు. దుర్యోధనున కనర్థమును ద్రోణవధయునుం జేయఁ బుట్టినవాఁడు. స్త్రీకాముకుఁ డగుకాశిరాజపుత్త్రు నతండు సంపు టందలు నెఱిం గినదియకదా. శైబ్యుండు కల్పితారాతివైక్లబ్యుండు. అతండు పెక్కండ్ర రాజు ల జయించి పుష్కలాన్నపానదక్షిణాబహుళంబుగ దశాశ్వమేధము లాచరించి బహుళగోదానము లొనర్చి ధర్మపథము దప్పకుండ రాజ్య మేలినవాఁడు. గంగ యందలిసికతాగణంబులనైనను లెక్కింపవచ్చుఁగాని యతం డిచ్చినగోగణముల లెక్కింపఁ దరము గాదు. ఔశీనరుఁ డైనశిబి యొక్కండ కాక తక్కినవా రెవ్వ రును నిట్లు చేయరై రనియు నింకనుం జేయఁబోవరనియు సురలు పొగడిరి. మనుష్యదుర్లభం బయినయుత్తమగతిం బ్రాపించినయయ్యౌశీనరునకు మనుమఁ డగుశైబ్యుఁడు నట్టివాఁడ యనం దగు. విరాటుండు వీర్యాటోపదీపితుండు. ద్రుప దుఁ డనుపమానశౌర్యధుర్యుఁడు. ఘటోత్కచుఁడు ఘోరవివిధమాయావినోద లంపటుఁడు. పాండవులజయంబు గోరువాఁడు. వాఁడు నాకొడుకులకుఁ గంటకంబు వీ రందఱు నాచార్యుం బొదివిన మనవారిలో నెవ్వరయినను మార్కొని యాఁ గక చూచుచుండిరొక్కొ. పెక్కు లేల? సకలలోకసృష్టిస్థిత్యంతమూలభూతుఁడై లోకనాథుఁ డైననారాయణుఁడు వారికి నాథుఁడు. అద్దేవదేవునిదివ్యకర్మములఁ బెద్దలు సెప్పఁగ విన్నవారముకదా. భక్తిస్థైర్యార్థము నేనును వానినిం గొన్నిం టిఁ జెప్పెద విను మని యిట్లనియె.

## ధృతరాష్ట్రుఁడు సంజయునితోఁ గృష్ణునిదివ్యచరిత్రములఁ జెప్పుట.

గోవిందుఁడు గోపకులమునఁ బెరుఁగుచుండి పిన్ననాఁటనే యమునాతీర వనమున నశ్వరూపధరుం డైనయశ్వాసురుం జంపె. వృషభాసురుం దెగటార్చె. ప్రలంబజంభమురనరకుల వధించె. జరాసంధమిత్త్రుఁ డైనకంసునిఁ గూల్చె. పర మనియమమునఁ బత్నీసమన్వితుండై దుర్వాసుని నారాధించి యుత్తమవరములఁ బడసినశూరసేనపతిని రామసహాయుండై పరిమార్చె. కంసభ్రాతయు సమగ్రా క్షౌహిణీపతియు నగుసునాముం బొరివుచ్చె. పుడమిం గలరాజలోకంబునెల్ల గెలిచి భోజకన్యక యగురుక్మిణిం గ్రహించె. ఉపాయమున జరాసంధుని గీటడఁ గించె. ధర్మరాజురాజసూయమునఁ బూజార్థము వాదులాడినశిశుపాలుని మృ త్యుపురమున కనిచె. సముద్రమధ్యమున గుప్తంబు కామగమనంబు సౌభనామ కము నగుదైత్యపురమును భంజించె. యవనుం గెలిచె. పాతాళతలవాసి యగుపం చజనుం బిలుకుమార్చి పాంచజన్యముఁ గొనియె. వరుణదూతాపహృతుండై నంద

గోపకుం దేర సలిలాంతర్గతంబును యాదోగణసంకులంబు నగువరుణస్థానంబున కరిగి యతనిం గెలిచి యానందగోపకుం దెచ్చె. పార్థసహితుండై ఖాండవదహనమునఁ బావకుఁ దృప్తుం గావించి యతనివలన నాగ్నేయాస్త్రంబును జక్రాయుధమునుం బడసె. సత్యభామకుఁ బ్రియము సేయువాఁడై వైనతేయు నారోహించి యమరావతి కరిగి శతక్రతుం గెలిచి పారిజాతంబుఁ బుడమికిఁ దెచ్చె. అంగవంగకళింగమాగధకాశికోసల మత్స్యకరూశపౌండ్రావంత్య పార్వతీయదశేరకకాశ్మీరౌరసికపిశాచముద్గల కాంభోజవాటధాన చోళపాండ్యత్రిగర్తమాలవదరదశకఖసాదుల నందఱను నిర్జించె. కృష్ణున కోడనివారుం గలుగుదురే? సంధికార్యార్థం బిచ్చటికి వచ్చినపుడు మనవారికురుద్యోగం బెఱింగి యమ్మహానుభావుఁడు సభలో నద్భుతం బావహిల్ల విశ్వరూపప్రపంచంబుఁ జూపఁగ నేను నద్దేవదేవుకరుణంజేసి కన్నులఁ బడసి చూచితిని. అట్టివి చేయఁగ లాఁతులు నేర్తురే? అప్పురమపురుషునకు సరివచ్చువాఁ డెవ్వఁడును గలుగమి సిద్ధంబు. అయ్యుదారచరితుండు తలంచెనేని గదసాంబప్రద్యుమ్నానిరుద్ధవిదూరథిచారుదేష్ణప్రముఖు లయినయాదవవీరులును బాండవులకుఁ దోడ్పడ వత్తురు. హరి యెచట నుండు నచ్చటన యుండు నట్టిబలభద్రుండును వారికి బాసట యగు. అమ్మహాత్ముఁడు నాగాయుతబలుఁడు. వా రందఱు నేల? సర్వలోకజనకుం డైనజనార్దనుండు వారికి గెలుపుఁ గావింపనుండఁగ మనవా రెట్లు గెలువ నోపుదురు? ఒకవేళఁ బాండవులు జయింపనేరరేనియుఁ దానైనఁ జక్రపాణియై కవియు. అప్పు డెవ్వఁడెదిర్చి నిలువఁ జాలఁడు గదా. కౌరవు లందఱు గిట్టిమొన గట్టి సాహసోత్సాహదీపితులై పాండవుల నందఱనుం జంపిరేనియుఁ గృష్ణుఁడు మనవారలనెల్లఁ దెగటార్చి కుంతికిఁ బట్టంబు గట్టుట తప్పదు. కేశవార్జును లొండొరుల కాత్మతుల్యులు. కౌరవులకు జయము గలుగనేరదు. సర్వలోకములందును బీభత్సుఁ డపరాజితుఁడు. దుర్యోధనుఁడు దైవయోగమున మూఢుఁడై మృత్యుపాశబద్ధుఁడు గావునఁ గృష్ణార్జునులమహిమము నెఱుంగఁడు. వారు పురాణమును లయిననరనారాయణు లని పెద్దలు సెప్పుదురు. ఏకాత్ములయ్యును వారు మనుజలోకమున ద్విధాభూతులై యగపడుచున్నవారు. ఇచ్ఛ పుట్టదుగాని పుట్టెనేని వారు యుగములనైనం గ్రుంగింపఁ జాలుదురు. బ్రహ్మచర్యాదివ్రతానుష్ఠానంబులును వివిధక్రియలును దివ్యాస్త్రములును మృత్యువును వారింపఁ జాలవుగదా. లోకసంభావితులు కృతాస్త్రులు యుద్ధదుర్మదులు నగుభీష్మద్రోణులు హతులైనపదంపడి నా బ్రదుకు గాల్పనే. ము న్నేసిరి నజాతశత్రుకడం జూచి యసూయపడుచుంటి మాసిరిచే నిపుడు బ్రదుకవలసె. నాయనయంబునఁ గురుకులక్షయంబు ప్రాప్తం బయ్యె. కాలపరిపాకప్రాప్తులం జంపఁగ బహుళసాధనములఁ గొనం బని లేదు. తృణములైనను

వజ్రతుల్యములై నెంపఁ జాలు. అజాతశత్రునికోపవీక్షణమున నే మహాత్ములగుభీష్మద్రోణులును నిహతు లైరని తలంచెద. అతనియెడ ధర్మంబును మనవారియెడ నధర్మమును సుస్థిరమై యుండుటంజేసి యవియే వారికి వీరికిని జయాజయములు గావింపుచున్నవి. సర్వవినాశంబు గాఁగఁ గ్రూరకాలంబు దఱిసె. ఏమి చేయవచ్చు? మన మొకతెఱంగునఁ జింతించినకార్యములు దైవప్రాతికూల్యము నంజేసి వేఱొక్కతెఱంగునఁ బరిణమించుచున్నవి. అపరిహార్య మవిచార్యము నగునీయర్థమున నూరక చింతించినం బ్రయోజనంబు గానరాదు. సమరప్రకారముఁ దేటపడం జెప్పు మనియడుగ నాంబికేయునకు సంజయుఁ డిట్లనియె.

ద్రోణుఁడు దుర్యోధనునకు ధర్మరాజును బట్టి యిచ్చునట్లు వరం బిచ్చుట.

అవ్విధమున సేనాధిపత్యపదవిభాసితుండై భారద్వాజుండు దుర్యోధనా, శాంతనవునంతరంబు నన్ను సర్వసేనానాయకపదంబున నభిషేకించి సత్కరించుటంజేసి సంతుష్టుఁడనైతి నిందులకుఁ దగినఫలము నావలనఁ బొందుము. నీకోరినవరము నిచ్చెద నడుగు మని రాజు లందఱు వినంగఁ బల్కుటయు దుర్యోధనుఁడు కర్ణశకునిదుశ్శాసనులతోడ నాలోచించి భూసురోత్తమా, నాకు వరమొసఁగఁ దలఁతువేని ధర్మరాజును బ్రాణములతోడఁ బట్టియి మ్మనియడిగె. అడుగుటయు ముదితహృదయుండై యాచార్యుఁడు కుమారా, యజాతశత్రుని వధింపు మని కోరక పట్టియిమ్మని వేఁడుటకుఁ బ్రీతి నొందితి. ఏల యిట్లు కోరితివో యెఱింగింపుము. ఆధర్మపుత్రుం డజాతశత్రుం డనుమాట యన్వర్థం బయ్యె. భండనమునఁ బాండవుల గెలిచి వారిరాజ్యమును వారి కిచ్చి సౌభ్రాత్రంబు నెఱపఁ బూనితివో యేమి సేయం దలంచితి వనియడుగ నీకొడుకు దనమనమునం గల కుటిలాభిప్రాయంబు దాఁప నేరఁడయ్యె. బృహస్పతియంతవారికి నాకారగోపనం బత్యంతదుష్కరంబకదా. అట్లు దుర్యోధనుఁడు దనయాశయంబు డాఁపనేరక యాచార్యున కిట్లనియె. ఆచార్యవర్యా, యుధిష్ఠిరుని మనము వధించితిమేనియుఁ బార్థుఁడు మనల నందఱనుం జంపుట నిక్కువంబు. వారల నిశ్శేషముగ విధ్వంసంబుఁ జేయఁగ మనకె కాదు సురలకు నశక్యంబు. సత్యప్రతిజ్ఞుం డైనధర్మరాజుం బట్టి తెచ్చితివేని మగుడ జూద మాడి యతని నోడించి తమ్ములతోడ నడవికిఁ బంపి పెక్కేండ్లు నిష్కంటకముగ రాజ్యమేలఁ దలఁచితి ననిచెప్పుటయు నీకొడుకుకుటిలాభిప్రాయంబునకు రోసి గురుం డవ్వరంబున కెద్దియేని యెడఁ గల్పించి యిచ్చువాఁడై యిట్లనియె. రాజపుత్రా, ధనంజయుండు గావలియైయుండునేని ధర్మరాజుం బట్టి తేర నాకు శక్యంబు గాదు. మహేంద్రపురస్సరులై దేవదానవు లందఱు నొక్కటియై గట్టిమొగ్గరంబు గట్టి వచ్చిరేనియు నక్కోదండపాండిత్యవిశారదుం బోర మార్కొనఁ జాలరు. నాకు శిష్యుఁడై నావలన ధను

ర్విద్య నధిగమించినవాఁడయ్యు నతండు నాకంటెఁ బెక్కుమడుంగు లధికుఁడు. తపోమహిమసమధిగతవీర్యప్రభావుఁడు. తరుణుఁడు. అన్యదుర్లభంబు లయిన యైంద్రపాశుపతాద్యస్త్రములు వానికి వశములై యున్నయవి. నీ వతనిఁ బెద్దయు నలిగించినవాఁడవు. వాని మార్కొన నాకుఁ దరము గాదు. అతం డొండొక్క చోటి కరుగు తెఱంగుగా నుపాయంబు సమకట్టుదు వేని ముహూర్తమాత్రన ధర్మనందనుం బట్టి తెచ్చెద నని యాచార్యుఁడు సాంతరముగఁ బ్రతిజ్ఞ చేయుటయు మందాత్ము లయిన నీకొడుకులు ధర్మజుం బట్టువడినవానిగా వగచి యుబ్బుచుండిరి. దుర్యోధనుండు నాచార్యుని ప్రతిజ్ఞకు స్థైర్యముఁ గావించువాఁడై సర్వసైన్యములందు నావృత్తాంతంబుఁ జాటించుటయు మనసైనికు లుబ్బునంబొంగుచు సింహనాదములను శంఖధ్వానంబులనుం గావించిరి.

అక్కడ ధర్మనందనుం డాప్తులవలన నయ్యుదంతమెల్ల నెఱింగి తమ్ములుఁ దగువారుం గొలువఁ గొలువుండి గాండీవి దెస మొగంబై వింటివిగదా యాచార్యుండు నన్నుఁ బట్టి ధార్తరాష్ట్రున కిచ్చునట్లు ప్రతిన పట్టె పదంపడి నీవు లేనిచో నట్లు చేయఁ జాలుదు నని యెడఁ గల్పించినవాఁడఁట. అమ్మందాత్ముని కోర్కి కొనసాగనివిధముగ నీవు గంటికి ఱెప్ప యెప్పగిది నప్పగిది నాకుఁ గావలివై యుండవలయు. తగు తెఱంగున నీతిఁ గావించి పోరికి నడువు మనుటయు నర్జునుఁడన్న కిట్లనియె. రాజేంద్రా. గురువధమును నిన్నుఁ గావక యొప్పరికించుటయు నొక్కటియే యని నానిశ్చయము. ప్రాణములనైనను విడుతుఁగాని యివి చేయను. ఏను ప్రాణములఁ గలుగునంతకు నాచార్యుఁడ కాదు దేవదానవులు విష్ణుదేవునితోడ్పాటునం బేర్చి వచ్చినను నిన్నుఁ బట్టికొనఁ జాలరు. నక్షత్రములతోడి నింగి కూలినం గూలుఁగాని పుడమి పలుప్రయ్యలైన నగుఁగాని యక్కురుకులాధముకోర్కి కొనసాగనేరదు. మఱియు నింకొక్కటి విన్నవించెద. మనకుఁ బరాజయంబు రానేరదు. నావచనం బెన్నఁడు నసత్యంబు గాదు. ధనురాచార్యువలని వెఱపు మాను మనుటయు ధర్మరా జూఱడిల్లె. తత్సైనికులు ముదమునం బొదలుచు నార్పులు నిగుడించి శంఖభేరీప్రముఖవాదిత్రములు మ్రోయించిరి. అయ్యులివు విన మనవారును బ్రస్థానభేరి సఱువం బంచిరి. అంత నిరువాఁగును బొలికలనికి నడుచుటయుఁ బోరు సెల్లె. తత్ప్రకారంబు విను మని సంజయుఁడు ధృతరాష్ట్రున కిట్లనియెఁ

## ద్రోణుని ప్రథమదిన యుద్ధము.

అయ్యవసరమున సేనానాయకత్వ పదవిభాసితుం డై నద్రోణాచార్యుఁడు కనకవేదికాకేతనోల్లాసభాసురుండై ముంగలివై నడువ మనవారు వెడలి శకటవ్యూహం బమర్చిరి. అందు వలపట సైంధవకళింగవికర్ణుల, వారివెన్నంటి గాం

ధారచమూగణపరివృతుండై శకునియు, డాపటఁ గృపకృతవర్మచిత్రసేనవివింశతిదుశ్శాసనులును, వారివెంబడి కేకయయవనకాంభోజపతులును, నడుమమద్రత్రిగర్తాంబష్ఠప్రతీచ్యోదీచ్యమాలవశిబిశూరసేనశూద్రమలదసౌవీరకితవప్రాచ్యదాక్షిణాత్యచమూగణసేవ్యమానుండాచార్యపురస్సరుండునగురాజును, సేనాముఖమున సౌవర్ణహస్తికేతనోల్లాససముదీర్ణుం డైనకర్ణుండును నిలిచిరి. సూర్యసమతేజుం డైనరాధాతనూజుం జూచి మనవారు భీష్ముఁడు లేనికొఱఁతఁ దలఁపక విగతశోకులై యపగతసాధ్వసులై యుపగతసంతోషులై సంగతసాహసులై యనుగతోత్సాహులై కర్ణునిఁ జూచి పాండవు లనిమొన నిలువ నోపరు. ఇంద్రపురోగము లగుబృందారకులనైనను గెలువనోపినవైకర్తనునకు బలపరాక్రమహీనులైనపాండవులం గెలుచుట దుష్కరంబె? భీష్ముఁడుపదినాళ్లు పోరియు మూఁకలఁ జంపుచుఁ బ్రేమమునం బాండవులఁ బట్టిపొలార్చెఁగాని బిట్టు గిట్టఁడయ్యె. కర్ణుఁడు వారియెడ జాతకోపుఁడు గావునఁ బగ్గలించి వారల విధ్వంసంబుఁ జేయకుండుగఁ డని తమలోనం గర్ణుం బ్రశంసించుచు భండనోత్సాహమునఁ బొదలుచుండిరి. అట్టియెడఁ బాండవులును గయ్యంపువేడుక గడలుకొనినమనంబులతో సకలసేనాపరివృతులై నడతెంచి క్రౌంచవ్యూహం బమర్చి మోహరించిరి. అందు మిన్నుదాఁక నెగసినయుత్తుంగకేతనాంచలంబున వెలుంగుకపిరోచులు యుగాంతసమయసూర్యప్రభలట్లు మార్తురకుఁ బరమార్తిఁ గావింప వాసుదేవసారథికంబు శ్వేతరథ్యయోజితంబునై కాలచక్రంబుమాడ్కి దృష్టిప్రతిఘాతచణం బయినయుత్తమస్యందనం బారోహించి గాండీవపాణి ముంగలియై నడిచె. అవ్విధమున నుభయసేనాగ్రముల నిల్చినకర్ణార్జును లొండొరులపైఁ గ్రోధవిస్ఫురితవీక్షణంబులు సారించుచుండిరి. అట్లిరువాఁగును గయ్యంపుఁగడంక గడలుకొనం బేర్చియుండునంత భారద్వాజుఁడు దనతేరించుకవొనిచ్చుటయు నార్తనాదపూర్వకముగ ధాత్రి కంపించె. ప్రబలవాతోద్ధూతంబై దుమ్ము రేఁగి సూర్యమండలంబుఁ గప్పె. మాంసాస్థిరుధిరవర్షము గురిసె. కాకగృధ్రశ్యేనాదులు మనసేనపయి వ్రాలె. దారుణముగ నక్కలఱచె. మాంసఖాదనశోణితపానలోలుపంబు లయినక్రవ్యాదభూతగణములనినాదములు పెలుచ వినవచ్చె. పిడుగొండి దెసం జుట్టి సంగ్రామరంగమున నంతటం గొఱవులు పడియె. మెఱుములు నుఱుములును బెల్లుగ నేత్రశ్రోత్రగోచరంబు లయ్యె. భాస్కరమండలంబు పృథులపరివేషాంతర్హితంబయి కానరాకుండె. మఱియుఁ బరమదారుణంబు లయినయుత్పాతంబులు పెక్కులు తోఁచె. అయ్యుత్పాతంబులకుఁ దలంకక శంఖభేరీమృదంగాదివాద్యముల మ్రోయించి యుభయసైన్యములు కుసుమితచూతవనంబులు రేయి కూరుకుఁ జెంది సోలసియున్నవిధమునఁ గొండొకవడి నిశ్చేష్టితంబులై యుండె.

### ద్రోణాచార్యుఁడు పాండవసేనపై విజృంభించుట.

అంత రుక్మరథుఁ డైనద్రోణాచార్యుఁ డపరసూర్యుఁ డనం జూడ నొప్పుచుఁ బాండవసేనపై నడరి యేదిక్కు చూచినం దానకా నగపడుచు నిశితశరజాలములఁ గురియుచుఁ బాంచాలసైన్యములం గనుపుకొట్టుచు దానవనిషూదనోద్యతుం డైనమహేంద్రునిచందమునను శుష్కపాదపవనముల నేర్చుదవానలంబు విధంబుననుం బేర్చి తనపయిం గవిసినధృష్టద్యుమ్నునకుఁ జే యార్పరాక వెగడుపడువిధముగ నుఱువడించి మధ్యాహ్నమార్తండునివిధమున వెలుఁగుచు నశనినిర్ఘాతతుల్యం బయినమౌర్వీనిర్ఘోషంబుననే పగవారిగుండియ లవియించుచు రథగజవాజిపదాతిశకలంబుల ధరాతలంబుఁ గప్పుచు రక్తజలంబు రథావర్తంబు హస్త్యశ్వగాత్రతీరంబు కవచోత్పలసంయుతంబు మాంసపంకసమాకులంబు మేదోమజ్జాస్థిఖండసైకతంబు మణికిరీటఫేనలంబు ప్రాసమీనంబు వరనాగఘోటకసలిలంబు శరవేగప్రవాహంబు సంగ్రామజలధరపరిపూరితంబు వీరపాదపాపహరణచణంబు రథనాగహ్రదోపేతంబు కంకగృధ్రనిషేవితంబు శూరవ్యాళసంకీర్ణంబు విదీర్ణశస్త్రహంసకారండవంబు చక్రకూర్మంబు గదామకరంబు కేశశైవాలశాద్వలంబు క్రవ్యాదభూతతృప్తికరంబు నగురక్తనదీప్రవాహంబుఁ బాఱించుటయుఁ బాండవయోధు లాశరాసనగురుం జూడ నోడి యొడుఁగుచుండిరి. ఏమి చెప్పుదు నెప్పుడు చూచిన నతనిచాపంబు మేఘమండలమధ్యంబున వెలుంగుమెఱుంగు తెఱంగునం జూపట్టె. అట్టియెడ యుధిష్ఠిరుఁడు ధనంజయధృష్టద్యుమ్నులం బిలిచి యాచార్యుని వారింపుఁ డనిపంచిన వా రాదివ్యాస్త్రవేదిం దాఁకుటయు నవ్వీరుండు కెంపారులోచనములం జూచి కోఱవి ద్రిప్పినచందమున నేదిక్కు చూచినం దానకా నగపడుచుఁ బటుశరాసారంబుఁ బరఁగించి వృద్ధుఁడయ్యుఁ దరుణుని విధమునఁ బొల్చుచుఁ బ్రతాపాతపంబు గాయుచుండ బెఱుసనక ధృష్టద్యుమ్నుఁడు పైపై నడరుటయు గురుం డప్పాంచాలరాజకుమారు మేనం బదితూపులు నాటి చతురంగంబులనెల్ల నేలఁ గలుపుచున్నంతఁ బాండవు లేవురును ద్రౌపదేయు లేవురును గైకేయు లేవురును సౌభద్రుండును విరాటద్రుపదులును సాత్యకిధృష్టకేతుశిఖండిచేకితాన యుయుత్సుఘటోత్కచప్రముఖు లగునద్దెసదొరలు నయ్యాచార్యుమీఁది కడరుటయుఁ గృపకర్ణశల్యద్రౌణికృతవర్మభూరిశ్రవోభగదత్తపౌరవాలంబుసప్రముఖు లగుమనయోధులుం దలపడిరి.

### ఉభయవీరులద్వంద్వయుద్ధము.

అట్లు తలపడుటయు నిరువాఁగునఁ జేయంగలదొరలకు ద్వంద్వయుద్ధంబు సెల్లె. అందు శతమాయావిశారదుం డైనశకుని సహదేవుం దాఁకి నిశితశరముల రథసారథిధ్వజంబులఁ గూల్చినం గోపించి పాండవావరజుండు వానికోదండంబుఁ

దునిమి కేతుదండముఁ గూల్చి రథ్యములఁ జంపి సారథిం దెగటార్చి యఱువది
యమ్ముల నతనిమేనం గీలించుటయు సౌబలుండు గదాపాణియై తేరు డిగ్గుటయు
సహదేవుఁడు గదఁ గొని ధరణికి లంఘించిన నుత్తుంగశృంగాభిరామంబు లయిన
పర్వతములమాడ్కి నొప్పుచు నయ్యిద్దఱు పోరిరి. వివింశతి భీమసేనుని మార్కొ
ని రథ్యకేతుకార్ముకభంగంబుఁ గావించిన మనవా రతనిం బొగడిరి. అందుల
కోర్వక వృకోదరుండు గదాపాణియై తేరు డిగ్గి వానిరథ్యముల జదియ మోఁదు
టయు వివింశతియు శరవారణముఁ జేతం బూని రథము డిగ్గి మత్తశుండాలంబు
పయిం గవియుగంధసింధురంబువిధమునఁ గవియుటయుఁ బోరు ఘోరం బయ్యె.
శల్యుఁడు నకులుం దాఁకి నవ్వుచు నవలీల శరశతం బేసినం గినిసి యతం డతని
సారథిం జంపి కార్ముకంబుఁ దునిమి కేతనంబుఁ గూల్చి గొడుగు విఱిచి శంఖ
ముఁ బూరించె. కృపుఁడు ధృష్టకేతుం దలపడి పటుప్రదరంబులు వరఁగించిన
నాచేదీశ్వరుం డలిగి వానిం బ్రతిశరముల మాయించి డెబ్బదితూపులఁ గృపుని
మేనం గీలించి మూఁటఁ గేతనంబుఁ ద్రుంచుటయు నాశారద్వతుం డలిగి కాండ
జాలంబుఁ గురిసిన నతండు వానినెల్ల నడుచుచుఁ బోరుచుండె. సాత్యకి కృతవర్మ
ఱొమ్ము గాఁడ నేసి వెండియు డెబ్బదితూపు లతనిమేన నాటుడు నతండు డెబ్బదే
డుమార్గణములు నతనిపై నేసిన నవ్వాసుదేవానుజుండు మారుతంబునకుఁ గొం
డవ్రాలెఁ దదీయకాండజాలమున కచలుండై నిలిచి కడిమి మెఱసి పోరుచుండె.
ధృష్టద్యుమ్నుఁడు సుశర్మపై నడరి మర్మములు నొవ నేయఁగ నతం డతనిజత్రు
దేశంబు నొవ్వ నేసె. విరాటుఁడు నిజసేనాపరివృతుఁడై కర్ణుం దాఁకి వివిధశర
ము లేసిన నతండును గండడరి కోల్తల నేయుటయు వారిదురంబు విస్మయమే
దురం బయ్యె. భగదత్తుఁడు ద్రుపదుం దాఁకి సారథికేతనసహితంబుగా రథంబుఁ
గూల్చిన నప్పాంచాలపతి యతనియురమ్ము గాఁడ నేసె. భూరిశ్రవుఁడు శిఖండిని
మార్కొని సాయకౌఘమునం గప్పినం గోపించి శిఖండి తొంబదియంబకంబు ల
తండు కంపింప నేసె. రాక్షసప్రవరు లైన ఘటోత్కచాలంబుసు లొండొరులం
దాఁకి మాయలు గావించి చతురప్రకారమునఁ బోరిరి. చేకితానుఁ డనువిందుం
దాఁకిన వారిపోరు దేవదానవసమరసమం బై చూడ నొప్పె. లక్ష్మణుండు క్షత్ర
దేవుం దాఁకుటయు వా రిరువురు విష్ణుహిరణ్యాక్షులట్లు పోరిరి. పౌరవుఁడు యు
ద్ధకాంక్షియై యభిమన్యుం దాఁకి శరములు గురిసిన మన్యుసముద్ధతిం బేర్చి యతండు
వానిశరములకు మా జేసి కేతుచ్ఛత్రతురంగముల నేలం బడ నేసి యేడువాఁ
డితూపులువానిమేన నాటి శరపంచకమున సారథిని నొంచి సింహనాదంబుఁ గావిం
చి యప్పౌరవుపాణిములఁ గొనువాఁడై నిశితశరం బరివ్రాయుచున్నంతఁ గృత
వర్మ రెంట నమ్మార్గణంబుతోడ నతనివిల్లు దునిమె. అంత సౌభద్రుండు కృపా

ణశరవారణంబుల గ్రహించి పలుపోకల వాఁడిమిం బేర్చి యతని తేరిమీఁదికి లం
ఘించి సారథిం గాలఁ దన్ని నేలఁ బడం ద్రోచి యంబుధిం గలంచి క్రూరనా
గంబు మీఁదికెత్తుగరుడునివడువున నప్పౌరవు కేశపాశంబుఁ బట్టి మీఁది కెత్తి
వృషభంబుపై నడరుకొదమసింగంబు తెఱంగున నేపు చూపుచున్నంతఁ దదవస్థుఁ
డైనపౌరవుం జూచి యమర్షవశుండై జయద్రథుఁడు వాలును బలుకయుం గొని
తటాలునఁ దేరు డిగ్గ నుఱికి యడరుటయు నభిమన్యుఁడు పౌరవుని విడిచి పులుఁ
గుపయిం గవియుడేగచందమున జనకద్వేషి యగునతనిపయిం గినుక వొడమఁ
గవిసి తత్సహాయులైనరాజు లేయుచున్నప్రాసపట్టసాదుల గృపాణంబున నఱు
కుచుఁ బలుకం జడియుచు విక్రమించుచున్నంత నతండును వాఁడిమి మెఱసి
తోడన యఱుముటయు నయ్యిద్దఱు ఱెక్కలు గలకొండలచాడ్పునను నఖదంతా
యుధంబు లగుసింహశార్దూలంబులమాడ్కినిం జూప నగ్గింప నవక్షేపనిపాతా
దులయెడ నించుకేనియు నెక్కువతక్కువలు నిరూపింపరానివిధమున వివిధమా
ర్గములఁ జరించుచుఁ బోరుచుండిరి. అట్టియెడ నభిమన్యుఁ డేచి కరవాలం బతని
పయిం బడ నేయుచున్నంత నాసింధుపతియు నుక్కుమిగిలి యతనిబలుకం జదియ
మోఁదువాఁడై నిజకృపాణం బేయుటయు నది దానిం దాఁకి మిట్టిపడి విఱిగె.
విఱుగుటయు నాజయద్రథుఁ డాఱడుగులుపిఱింది కొదిఁగి తే రెక్కినం బాండు
పౌత్రుండు పిఱికివై యోడితి వని యతనిం దూలనాడి తత్సైన్యంబుఁ గనుపు
కొట్టుచుండె. అప్పుడు సింధురాజరక్షణపరులై మనవారు పలువురు వానిం దాఁ
కినం గొంచెమేనియు సంచలింపక యయ్యభిమన్యుం డందఱ. కన్నిరూపులై ప్ర
తాపాతపంబు గాయుచుఁ గ్రోధవీక్షణంబు సైంధవుదెస సారించుచున్నంత మద్ర
రాజు ఘోరాకారం బైనతనకనకచిత్రితగదాదండంబు విసరి వైచుటయు న
య్యర్జునాత్మజుండు లాఘవంబున మీఁది కుఱికించి పడుచున్నపన్నగంబుఁ బట్టుకొ
ను వైనతేయునివిలాసంబు మెఱయఁ దదీయశక్తిం బట్టికొని కరవాలంబుజళిపించి
సకలసైనికులార్వఁగ నాశక్తినే శల్యు తేరిపయిం బడ నేసినం దానితాఁకునఁ
జేసి తదీయసారథి సమసె. కెలన నున్న యుధిష్ఠిరభీమసేనులును నకులసహదేవు
లును విరాటద్రుపదులును సాత్యకిధృష్టద్యుమ్నులును కేకయశిఖండిద్రౌపదేయ
ప్రముఖులు నయ్యభిమన్యుం గొనియాడుచు నార్చిరి. పగవారిగెలుపున కోర్వక
నీకొడుకు లందఱు నాసౌభద్రుం జుట్టుముట్టి ప్రావృట్పయోధరంబులు పర్వతం
బునుంబోలె బహుళశరాసారంబున వానిం గప్పుచున్నంత సారథిపాతమునకుఁ
గ్రోధదీపితుండై యున్నశల్యుఁడు నీకొడుకులకుఁ బ్రియంబు సేయువాఁడై రథము
డిగి గదాపాణియై యభిమన్యు నెదిర్చె ననిన విని యాంబికేయుండు సూతపుత్రా,
పలువుఱు పలుతెఱంగులం గన్నులు గలిగి యొనరించుద్వంద్వయుద్ధములు నీవు

చెప్పఁగ వినియు నింకను వినఁగోరెద. ఎంత విన్నను దనివి పుట్టదయ్యె. దేవదా
నవసమరసమం బైనకురుపాండవులసంగ్రామమును లోకమున జనులిటమీఁదఁ బె
ద్దకాలము కథలుగాఁ జెప్పుకొనియెద రనితలంచెద. శల్యసౌభద్రులపోరు సెప్పు
మనుటయు సంజయుఁ డతనికిట్లనియె.

భీమశల్యులగదాయుద్ధము.

అట్లెదిర్చినశల్యుం జూచి యభిమన్యుండు దాను నశనిసన్నిభం బయిన
తనగదం గొని రారమ్మని పిల్చి మార్కొని నిల్చుటయు వృకోదరుం డుద్దండం
బయినతనగదాదండంబు విపులాంసపీఠమున నమర్చికొని యభిమన్యుని వారించి
తా నమ్మద్రరాజును మార్కొని కొండవోలె నచలుండై యుండుటయు నతం
డును మత్తశుండాలంబుపయిం గవియుక్రోల్పులివీఁక మెఱసి పోరికి సమకట్టుట
యుఁ దూర్యనిస్వనంబులును, శంఖారవంబులును, సింహనాదంబులును, భేరీ
భాంకారంబులును, మద్రపతితోఁ గోర్వఁగ భీమసేనుండును భీమసేనుప్రహారంబు
సైరింప మద్రరాజును జాలుదురకాని లాఁతు లోర్తురే యనుసాధువాదంబు
లును, నింగి ముట్టె. అట్లయ్యిద్దఱు గదాయుద్ధమునకుఁ దొడరి మహోక్షాత్షు
ములపగిది ఘోరారవములు సేయుచు వివిధమండలావర్తమార్గములఁ దిరుగు
చుఁ బరస్పరగదాదండముల నొండొరులతాఁకుఁ దప్పించికొనుచు నొకండు డాపలి
కెలనికి జరిగిన నొండొకఁడు వలపటికెలని కొదుఁగుచు గుఱిచూచి యేటు దప్ప
కుండ నేయం బూనిన నితరేతరప్రహారంబు లన్యోన్యగదాదండములఁ దాఁకు
టయు నాఘోరసాధనంబులు రెండు ప్రస్ఫురితవిస్ఫులింగజ్వాలాజాలాభీలంబులై
రౌద్రరూపంబులై వానకాలంపుమునిమాపున ఖద్యోతగణసాంద్రము లగుపా
దపంబుల ననుకరించుచుఁ గొఱవులమాడ్కి మెఱయుచుండ నఖదంతాయుధంబు
లయినశార్దూలములచందమునఁ గడిందిమగంటిమిం బేర్చి పెద్దయుంబ్రొద్దు పోరి
వా రిరువురు పరస్పరగదాప్రహారవిక్షతగాత్రులై నెత్తుటం జొత్తిల్లి పూచినమో
దుగులట్లు పొలిచిరి. వారిగదాభిఘాతరవంబు వజ్రనిర్ఘోషసమంబై యంతట
విననయ్యె. అట్లు రక్తసిక్తాంగులయ్యు వారు చలంబు డింపక వెండియు నితరేతర
ప్రహారంబుల సరకుసేయక వివిధాంతరమండలమార్గములం దిరుగుచు ధైర్యధు
ర్యులై పోరుచు నెనిమిదియడుగులకొలంది వెనుక కరిగి యటఁ దటాలునం దాఁకి
గదల నొకళ్లొకళ్ల నడిచికొని తత్ప్రహారమున సోలి నేలకు వ్రాలినం జూచి కృత
వర్మ గదాప్రహారపీడితుండై మూర్ఛిల్లి చెయ్వులు దక్కియున్నశల్యుం దనతే
రెక్కించి యనికిఁ దొలంగించె. భీముఁడు నిమేషమాత్రన మూర్ఛ దేఱి గదా
పాణియై లేచి యురునడించి మనమూఁకల నేలకుం గోలకుఁ దెచ్చుటయు నొక్కఁ
డైనను వానియెదుర నిలువఁ జాలఁడయ్యె. పాండవులు మనవారలం గెలిచిన

వారు గావునఁ బ్రజ్వలితాగ్నులువోలె వెలుంగుచుఁ బరమసంతుష్టులై సింహనాదములను శంఖారవంబులను నొనరించి భేరుల మ్రోయించిరి. అట్లు మనమూఁకలు విఱుగుట కోర్వక కర్ణపుత్త్రుం డైనవృషసేనుఁడు వారల కడ్డపడి యస్త్రజాలంబుఁ గురియించి నరవాజిరథద్విరదనికరంబులు శకలంబులు గావించి నిదాఘసమయమార్తండునివిధమున వెలుంగుచు మహామారుతంబు పాదపంబులంబోలె రథికసారథిమస్తకంబులఁ గూల్చుచుండ నయ్యేకవీరుని మార్కొనమగలు లేకుండునంత నకులపుత్త్రుఁ డైనశతానీకుఁడు వానిం దాఁకి మర్మభేదనకర్మఠంబు లయినతీవ్రమార్గణంబులఁ బదింట నతనిమేన నాటినం గినిసి కర్ణాత్మజుండు నకులాత్మజుచాపంబుఁ దునిమి కేతనంబులఁ గూల్చుటయు భ్రాతృరక్షణతాత్పర్యమున ద్రౌపదేయు లందఱు నతనిం దలపడి శరజాలంబుఁ బరఁగించినం ద్రోణిప్రముఖు లగుమనమహారథు లయ్యైవురుకుమారులం జుట్టు ముట్టి జలదములు పర్వతములంబోలె నంపసోనం గప్పుచున్నంతఁ బాంచాలీపుత్త్రరక్షణపరులై పాండవపాంచాలమాత్స్యకేకయసృంజయవీరులు వారిపై నడరుటయుఁ గ్రోధోద్ధతు లయిననాగగరుడులపోలెఁ దీవ్రయుద్ధసన్నద్ధు లయినయయ్యిరుదెఅంగులదొరలకు దేవదానవసమరసమం బయినభండనంబు సెల్లుచుండ నాసంగ్రామరంగం బుదితానేకకాలసూర్యసాంద్రం బయినగగనంబుకరణి నొప్పె.

## ద్రోణాచార్యుఁడు ధర్మరాజుతో యుద్ధము చేయుట.

అప్పుడు పాండవు లుక్కుమిగిలి మనమూఁకలఁ గలంచుటయు మనవారు వారికి వెఱచి విఱిగి పఱచినం గుంభసంభవుండు పేరెలుం గెత్తి శూరులారా, యనిమొనంబఱవఁ జనునే యనిచెప్పి పిలిచి యందఱం బురికొల్పి శోణతురగచతుష్టయయోజితరుక్మరథారూఢుం డైనతాను జతుర్దంతదంతీంద్రంబుచందమున నొప్పుచుఁ బాండవానీకంబుపైఁ గవిసి యుధిష్ఠిరుం దాఁకిన నతం డతనిపైఁ గంకపత్త్రోల్లసితంబు లయిననిశితశరముల నేసె. ఏసినం గినిసి గురుఁ డతనివిల్లు దునిమి తఱిమి యఱిమినం బాండవాగ్రగజచక్రరక్షకుండు పాంచాలకుమారుండు నగుకుమారనామధేయుఁ డార్చి చెలియలికట్ట కడలి నెట్టు లట్టుల యాచార్యు నాఁగి యతనిఱొమ్మున వాఁడికోలం గ్రుచ్చి శరపరంపరలు పరఁగించిన నక్కుమారువిక్రమంబునకు మెచ్చి యద్దెసవారు సింహనాదంబు లొనరించిరి. అందుల కోర్వక గురుండు నిశితకాండమున వానిం దెగటార్చి నిజసైన్యంబు గాచుచు నరిసైన్యంబు పాయవడం జేయుచుఁ దనపై నడరినవీరుల నందఱం దాఁకి శిఖండిని నుత్తమౌజుని బంచ్రెండ్రుపంచ్రెండుకాండముల నొప్పించి నకులసాత్యకుల నేనింట హతదర్పులఁ గావించి సహదేవు నేడింట స్రుక్కించి మూఁడేసియమ్ముల ద్రౌపదేయులయే పుడిపి పదింట విరాటువాఁడిమిపోఁడిమి యడంగించి

ధర్మనందనుపైఁ బంచ్రెండుశితశరముల నేసి తఱుముచున్నంత యుగంధరుఁ డడ్డ పడి వారించె. అంపల కలిగి యయ్యాచార్యుం డతనిం గూల్చి యుధిష్ఠిరుమీఁది కుఱుకుచున్నంతఁ బాంచాలప్రవరు లైనవ్యాఘ్రదత్తసింహసేను లతని నాఁగి సాయకాసారమునఁ దద్రథంబుఁ గప్పి యేఁబదితూపు లతనిమేనం గీలించి నెం చిన మనదెస నార్తనాదం బెసంగె. అంతఁ గన్నుల నిప్పులు రాల నాచార్యుం డుదగ్రక్రోధుండై గొనయంబు సారించి భల్లద్వయమున నావ్యాఘ్రదత్తసింహ సేనులమస్తకద్వయంబు నేలకు బలి చేసి యంతకాకారమునం బొలుచుచు శర వ్రాతమునఁ బాండవయోధుల నందఱను నొప్పించి ధర్మరాజు తేరు డాయుటయు వారివారు గురునికోల్తలల కోహటించి యక్కటా! నేఁడు ధార్తరాష్ట్రుఁడు కృతా ర్థుండు గాఁగలఁడు. ద్రోణుఁడు ధర్మజుం బట్టికొన కుడుగఁడు. ఎయ్యది తుదియో యని యార్తనాదంబులు సేయుచుండ దవ్వున లాఁతులతోడఁ బోరుచున్నధనంజ యుండు విని తనమనసునఁ బొఱుచున్ననెత్తుటేఱుం దాఁటి శ్వేతరథ్యఖరఖు రఘట్టనధ్వానంబునను నేమిఘోషంబునను గాండివజ్యాఘోషంబునను దేవద త్తాభీలరవంబునను దిక్కులుబీటలువాఱంచుచు నతిత్వరితగమనంబున నడతెం చి ధర్మరాజునకుఁ బ్రాపై ద్రోణానీకంబుఁ దాఁకి యయ్యాచార్యుని బటుప్రద రముల నొప్పించి శరగ్రహణసంధానమోక్షణంబు లిట్టు లని నిరూపింపరాని తెఱం గున దోర్విలాసంబు మెఱయ విలువిద్యనేర్పేర్పడ నెక్కుడఁ జూచినం దనబాణం బులకా భూనభోంతరంబుఁ గప్పి చీఁకట్లు పచరించి కోలుమసంగి మనవారితల లేఱుచున్నంత సూర్యాస్తమయం బగుటయు గాండీవిభయంబునం బొడమినస మ్మోహంబునను సంధ్యాసమరతిమిరంబున నెదిరి యితండు తనవాఁ డితం డని తెలియనేరక సైన్యములు ఱిచ్చవడియు బీఱువడియుఁ గలంగియుఁ దొలంగియుఁ దెరలియు మఱలియుఁ జీకాకుపడియుండునంత ద్రోణదుర్యోధనాదులు తమసై న్యంబులఁ దివియ నియమించివిన్నఁబోయినమొగమ్ములతో శిబిరమునకుఁ జనిరి. పదంపడి గాండీవియుఁ దమసేనలఁ దివియించి మనోహరస్తుతివచనముఖరు లయి నమాత్స్యపాంచాలాదియోధవీరులు గొలిచిరాఁగ నగ్రజానుజసహితుండై వా సుదేవసారథికదివ్యరథారూఢుండై తారాగణపరివృతుండై యంబరమునవెలుం గుచంద్రుం గ్రేణిసేయుచు నిజశిబిరంబున కరిగె.

ద్రోణాచార్యుల రెండవనాఁటి యుద్ధము.

అంత నారాత్రి వేగుటయు మనవారు సమరసన్నద్ధులై సైన్యములతోడ వెడలి కయ్యంపునేలకు నడుచునెడ నాచార్యుండు వ్రీడావిషాదంబులు మనంబునఁ బెనంగొనంగ దుర్యోధనున కిట్లనియె. రాజేంద్రా, ధనంజయుండు కావలిమై యుండునంతకు ధర్మరాజుం బట్టరా దనియుఁ గృష్ణార్జును లజేయులనియు నుపా

యాంతరమునం గిరీటి నచ్చోటు వాపు దేని దృష్టద్యుమ్నాదు లెంద ఱుండినను నే పగ్గలించితిఁగదా. అది యట్లు యగుంగాని యొండు గాదు. ఆధర్మజుండు పోరి కిఁదొలంగి పోవక నిల్చియుండవలయు. వెఱచి పఱచునేని యది మనకు విజయ ముకంటె నెక్కుడకదా యనుచున్నంతఁ ద్రిగర్తపతి యగుసుశర్మ రారాజున కిట్లనియె. మహారాజా, గాండీవి నెందుకడకుఁ గొంపోవఁగ నేముదక్క లాఁతులు చాలరు. అతండు దుర్మదాంధుఁడై మావలనం దప్పు లేకున్న నెప్పుడును మా కెద్దియే నెగ్గు సేయుచుండుటం జేసి మా కతనిపైఁ గినుక యగ్గలంబై యుండు. వానిచేసిననికారములు దలపోయుచు రేలెల్లఁ బెన్వగం బొగులుచుందుము. కావున మే మతని నెందుకడకుఁ జీరి నీకుఁ బ్రియంబును మాకు యశస్కరం బును నీమూఁకలకు శ్రేయస్కరంబు నగుపనిం జేయ నున్నవారము. పెక్కు లేల? నేఁ డర్జునుఁడొండెఁ ద్రిగర్తులొండెఁ జావవలయుఁగాని వేఱు గాదు. మా ప్రతిజ్ఞ తప్ప దియ్యది నీచిత్తంబున కెక్కునే యనుచుండ నతనితమ్ములు సత్యవ్ర తసత్యకర్మసత్యవర్ము లనువారు వారిపక్షంపుయోధులుం బదివేలరథములవారు నట్లు పలికి విజయుం జీరువారై మగుడుటయు మాలవతుండికేరప్రభృతులు ముప్పదివేలరథంబులవారు నేముం ద్రిగర్తులతోడివార మగుదు మనిపలికి రారా జునానతిం గని వారితోడం గలిసి చనిరి. అట్లు వా రందఱు వెడలి ఘృతా భ్యంజనము చేసి మంగళస్నాతులై దివ్యాంబరాభరణంబులను ధనుర్బాణతూణీ రాదిసాధనంబులను ధరించి బ్రాహ్మణులకు గోహిరణ్యాంబరాదిబహుళదానము లాచరించి ముందట హుతవహుం బ్రజ్వలితుం గావించి వలగొని యగ్నిసాక్షి కంబుగ సర్వభూతములు వినంగ నే మర్జునుం జంపక మఱల మని ప్రతిజ్ఞ చేసి తద్బాణపీడితులై వెనుకకు వత్తుమేని యసత్యవాదులకును, బ్రహ్మఘాతకులకును, మద్యపానులకును, గురుదారరతులకును, బ్రహ్మస్వాపహారులకును, రాజద్రో హులకును, శరణాగతులఁగావనివారికిని, యాచకులఁ బీడించువారికి, నిల్లు గా ల్చువారికిని, గోవులఁ జంపువారికిని, లోకములకుఁ గీడు సేయువారికిని, బ్రాహ్మ ణులతోడఁ గలహించువారికిని, ఋతుసమయమున భార్యలతోడ సంగమింపని వారికిని, శ్రాద్ధమైథునపరులకును, నాత్మాపకారులకును, నిల్లడపెట్టినసొమ్ము ముచ్చిలినవారికిని, వేదనిందకులకును, నపుంసకునితోడం బోరువారికిని, దీనుల ననుసరించి పీడించి బ్రదుకఁ గోరువారికిని, నాస్తికులకును, నగ్నిపరిత్యాగులకును, దల్లినిఁ బ్రోవనివారికిని నేగతి గలుగు నాదుర్గతిం బొందువారమని శపథంబులు పలికి గాండీవిపని చక్కఁబెట్టి యుత్తమగతులం బ్రాపింతు మని యుబ్బుచు విష్వచ్చుం జీరువారై దక్షిణంబుగ నరిగిరి. అంతకుమున్న పాండవులు సైన్యస ముదయంబులు గొలువ సంగరాంగణమునకు వచ్చి పోరికిఁ గట్టాయితంబై యడ

రుచుండిరి. అట్టియెడఁ ద్రిగర్తు లర్జునునొద్ద కరిగి మాతోడం బోరుదువుగాని యిటు రమ్మని పిలుచుటయు విభీభత్సుండు ధర్మనందనుం దఱియ వచ్చి మహా రాజా, త్రిగర్తేశ్వరుం డైనసుశర్మ బహుళరథపరివృతుండై నన్నుఁ బోరికిఁ జీరు చున్నవాఁడు. సమరమునకు రమ్మని పిలిచినం బోవకుండుట యుత్తమక్షత్రియు లకుఁ బాడిగాదు. కావున వారలం బరిమార్పఁగ నా కనుజ్ఞ యిమ్మని యడుగుట యు ధర్మరాజు వత్సా, ద్రోణాచార్యునిప్రతిజ్ఞ కొనసాగకుండఁ జూచికొనవల యుఁగదా నీవు చెంగట లేకుండినం బలవంతుఁడు శూరుఁడు కృతాస్త్రుఁడు జితశ్ర ముఁడు నగుగురుం డేమి చేయునో యనితలంచెద ననిన ధర్మజున కర్జునుండు వెండియు నిట్లనియె. పాంచాలవరుం డైనయీసత్యజితుఁ డాచార్యుని నాఁగఁ గలఁడు. ఇతని నతిక్రమించి రాక యతనికి దుష్కరంబు. ఇవ్వీరునిమేనం బ్రా ణములు గలుగునంతకు నెంత యగ్గలించియు నగ్గురుండు తనప్రతిన నెఱవేర్పఁ జాలఁడు. ఇతండు పడెనేని యప్పటికిఁ దొలంగుట కర్తవ్యం బనిన నట్ల చేయుదు ననిపలికి ధర్మరాజు తమ్మునిం బలుమాఱు గౌఁగిలించికొని విజయాశీర్వాదంబులు ప్రయోగించి వీడుకొల్పె.

## అర్జునుఁడు ధర్మజునానుజ్ఞఁ గొని సంశప్తకులపైఁ బోరికిఁ బోవుట.

అవ్విధమున ధర్మరాజును వీడుకొని గాండీవి యాఁకొన్నకొదమసింగము లేళ్లగమిపయిం గ్రేళ్లువాఱు తెఱంగునఁ ద్రిగర్తరథికులం దాఁకువాఁడై రయ మునఁ జనుచున్నంత నంతకుమున్న రణాంగణంబునకు దక్షిణమున నొక్కసమప్ర దేశమున నిజరథచయంబెల్ల నర్ధచంద్రవ్యూహమునఁ బన్ని పోరికిఁ గట్టాయితం బై యుండి వచ్చుచున్నవిభీభత్సుం గాంచి ప్రహర్షోత్కర్షంబుఁ బొంది భూనభోం తరంబులు నిండఁగఁ బెలుచ నార్చుటయు వారియు బ్బెఱింగి కవ్వడి చిఱునగవు మొగమునఁ జిగురొత్తఁగఁ బుండరీకాక్షున కిట్లనియె. చూచితే త్రిగర్తవీరు లాసన్నమరణులై నన్ను మార్కొన వచ్చి ముదమునఁ బొదలుచు నగుచున్న వారు. వారి కిది వగవం దఱిగాని యుబ్బునకుఁ దఱియె? లెస్స పరికించిన నుబ్బు నకే తఱి యని యిప్పుడు నాకుం దోఁచుచున్నది. ఇప్పుడు నాచేతం బొలిసి దుర్జనదుర్లభము లగుపుణ్యలోకములఁ జేరుదురుగదా యనిచెప్పి త్రిగర్తవా హినిం జొచ్చి దేవదత్తం బొత్తుటయుఁ దదీయఘోరనిర్ఘోషమునకు సంశప్తకులు ఱిచ్చపడియుండిరి. తదీయరథ్యములు వివృత్తనేత్రంబులు స్తబ్ధశ్రోత్రంబు లవష్ట బ్ధకందరంబులు ప్రస్ఖలితపదంబులునై మూత్రము విడిచి నెత్తురు గ్రక్కె. అంత సంశప్తకులు మెల్లన వాహనములఁ దడవి తేర్చి యార్చి పేర్చి విభీభత్సుపయిం బటుకారండజాలంబుఁ బరఁగించినం గోపించి తీవ్రవిక్రముం డైనకిరీటి తన్మార్గణ ములం ద్రుంచి యాపదివేవురుదొరలపయిం బ్రత్యేకంబ మైదేసిబాణమ్ము లేసిన

వారుం గినిసి క్రీడిపైఁ బదిపదితూపులు వరఁగించిరి. ధనంజయుండు వానిం బొడిచేసి మూఁడేసియమ్ముల వారిపై వేలువేల యేసిన నయ్యయుతరథికు లొక్కొక్కఁడు నతనిపై నైదేసికాండముల నడరించినం గన్నుఁగవఁ గెంపు గదుర నమ్మేటిమగండు రెండురెండుకాండముల వారల నందఱను నొంచె. అందులకుఁ జలింపక వారు వర్షధారలు తటాకంబును భ్రమరసంఘంబులు కుసుమితవనంబు నెట్టు లట్టుల కేశవార్జునులఁ దమశరనికరములు గ్రమ్మునట్లు కావించుచుండ సుబాహుం డుబ్బి శితశిలాసంకాశంబు లగుముప్పదివాఁడితూపులు కిరీటికిరీటమున నాటుటయు నతం డుదితార్కమయూఖబంధురం బైనయుదయశైలముకరణిం జూడ నొప్పుచు వారిపై శరనికరముల నడరించి యొక్కభల్లమున సుబాహుకరత్రాణంబు నఱుకుటయు సుశర్మ్మండును సురథుండును సుధర్మ్మండును సుధన్వుండును వారికి బాసటయై యడరిరి. అడరినం గోపించి ఫల్గునుండు వారికేతనంబు లన్నియుం గూల్చి సుధన్వునిమస్తకంబు హయకోదండసహితంబుగ నేలం బడ నేయుటయు వానిప్రాపున నున్నవారు కొందఱు వెఱచఱచి దుర్యోధనానీకంబుఁ గూడం బోవుటయు నర్జునుండు తక్కినవారిపైఁ బెలుచ నడరి యెడతెగకుండఁ గాండజాలంబులఁ గురియుటయు నాసంశప్తకులు సూర్యకిరణంబులకుఁ జీఁకటులును మృగేంద్రవిక్రమంబునకు మృగగణములు నెట్టు లట్టుల కిరీటికోత్తలల కోహటించి విఱిగి పఱచిరి. అట్లు వారు విఱిగి పఱచుటకుఁ గ్రోధాకులుండై త్రిగర్తేశ్వరుండు పేరెలుం గెత్తి యోశూరులారా, యేల పఱచెదరు? ఎల్లవారు వినంగ నట్లు శపథంబులు పలికి యిట్లు పాఱిన నెవ్వరి కేమని చెప్పవారు? ఈకర్మ్మమున మిమ్ముఁ జూచి యందఱు నెల్లిదంబునఁ జూడకుండుదురె? ఉత్తమక్షత్రియుల కిది ధర్మ్మంబు గాదని యేల తలంపరైతిరి? అందఱము నెక్కటియై పురందరనందనుం బొదువుదము మఱలుఁ డనిచెప్పిన మగఁటిమి పాటించి వారు సింహనాదంబులను శంఖధ్వానంబులనుం గావించి మగిడి కవ్వడిమీఁది కడరుచున్నంత నారాయణగోపాలురు వివిధాయుధపాణులై కృష్ణునకుఁ దారు సాటి యనితలంచి యీాసునం బేర్చి త్రిగర్తయోధులకుఁ దోడ్పడి పార్థుం దాఁకిరి.

## సంశప్తకులును నారాయణగోపాలురు నెక్కపెట్ట యర్జునుం దాఁకి పోరుట.

అట్లు నారాయణగోపాలబలసహాయులై సంశప్తకులు తనపై నడరుటయు విష్వచ్చుఁ డచ్యుతునాలోకించి వారిపయిం దేరు రయమునం బఱపుము, వారు ప్రాణములు గలుగునంతకుఁ బో రుడుగువారు గారని తోఁచుచున్నది. పశుగణసంహారోద్యతుం డైనరుద్రునిమాడ్కి రౌద్రమునం బేర్చి నేఁడు వీరినెల్లఁ గూల్చెద. మదీయబలధనుర్విద్యావిలాసములం జూతు వనిన స్మేరాననుండై జనార్దనుండు వివిధమండలగతప్రత్యాగతాదిగమనంబుల నరదంబుఁ బఱపుటయు శ్వేతహయ

యోజితం బయినయమ్మహనీయస్యందనంబు విమానంబులు మోచినగగనమంట
పంబుచందమునను దేవదానవసమరంపునాఁటిమహేంద్రరథంబు తెఱంగునను నని
ర్వచనీయప్రచారమహనీయంబై వివచ్చునకు మెప్పు గావించుచుండ నతండు
గసిమసంగిన సైరింపక నారాయణగోపాలురు బహుళశరవ్రాతంబు పరఁగించినం
గృష్ణార్జునులు తద్బాణజాలప్రచ్ఛన్నులై ముహూర్తమాత్రం బదృశ్యులైరి.
అంతఁ బెద్దయు నల్గి ఫల్గునుండు పరాక్రమం బినుమడింప బొమలు ముడివెట్టి
యవుడు గఱచి గాండివజ్యాఘోషంబు నిగిడించి దేవదత్తంబుఁ బూరించి త్వష్ట
యిచ్చినదివ్యాస్త్రము గాండివమున సంధించి యేయుడుఁ దదస్త్రమాయాప్రభావ
మున నయ్యోధులకుఁ దమలోఁ దా మొండొరులు గాండీవపాణిగా నగపడుటయు
మోహితులై వీఁడే యర్జునుఁ డితండె గోవిందుఁ డని యొకళ్లొకళ్లతోడం జెప్పి
కొనుచు నితరేతరశరములఁ దమ్ముఁ దార యేసికొనుచు నిజాయుధవిక్షతగాత్రులై
నెత్తుటం జొత్తిల్లి పూచినమోదుగులచాడ్పున నెప్పిరి. అర్జునుపై వా రేయున
స్త్రములన్నియుఁ ద్వాష్ట్రమునఁ బొడవడంగుచుండె. అట్లు తదస్త్రమునఁ బెక్కం
డ్రు వొలియుటయు నవ్వుచుఁ గవ్వడి మాలవమావేల్లకత్రిగర్తయోధులపైఁ
గవిసి వాఁడితూపుల నొంచినం గినిసి వారు నానాస్త్రములఁ బరఁగించి యేదిక్కు
చూచినం దమబాణములకాఁ గప్పిన నర్జునుఁడును కేశవుఁడును దేరు నగపడకుం
డుటయు వారు కృష్ణార్జునులు దమయమ్ములఁ దెగి రనితలంచి పరమసమ్మోదము
నం బొంగి యుత్తరీయాంచలంబుల విద్రుచుచు నార్చుచు శంఖభేరీప్రముఖవాది
త్రముల మ్రోయించుచున్నంత మురాంతకుండు తదీయశరవిద్ధుండై తనయట్లు
డస్సిన బీభత్సుం గానక యర్జునా, యెక్కడ నున్నవాఁడవో యగపడవు. ప్రాణ
ములతోడ నున్నవాఁడవకదా యనవుడు గోవిందువచనంబు విని ధనంజయుండు
రయమున గాండీవంబున వాయవ్యాస్త్రము సంధించి యేసి వారిశరాసారంబు
క్షణమాత్రన మాయించె. తదస్త్రప్రభావముననే సంశప్తకులు గజవాజిరథాయు
ధగణములతోఁ బెనుగాలికిఁ బాఱుశుష్కపర్ణచయములవిధమున దాదవ్వులం
బఱచిరి. అక్కరణిం జీకాకుపడినసంశప్తకులపై నురువడించి యర్జునుఁడు బెట్టిదం
పుటంపసోనం బరఁగించినం దదీయబాణగణప్రహారమునం జేసి తెగినతలలును దుని
సినచేతులును విఱిగినకాళ్లును నలఁగినతొడలును ప్రీలినవీఁపులును సమసినగుఱ్ఱ
ములును జదిసినయేనుంగులును బొడిమైనఛత్రచామరంబులును నుఱుమైనయా
యుధంబులునుంగా సంగరాంగణంబు రౌద్రబీభత్సంబై యార్తనాదనీరంధ్రింబై
శోణితప్రవాహపంకిలం బయ్యె.

### ద్రోణప్రభృతులు పాండవులపై నడరుట.

ఇవ్విధమున నర్జునుఁ డొండుకడకుఁ బోవుట కుల్లముల నుల్లసిల్లుచు మన

వారు సైన్యముల గరుడవ్యూహవిధానమునఁ బన్ని పాండవులం దాఁకిరి. ఆగ
రుడవ్యూహమునం దాచార్యుఁడు తుండమున నిల్చె. సోదరాదిపరివృతుండై కురు
ధరిత్రీవిభుండు శిరంబునఁ బొలిచె. కృపకృతవర్మలు నయనంబు లైరి. భూతశ
ర్మక్షేమశర్మకరకాక్షులు సింహలప్రాచ్యశూద్రాభీరదశేరకశకయవనకాంభోజ
హంసపదశూరసేనదరదకేకయచమూగణంబులతోడఁ గంధరంబున కమరిరి.
బాహ్లికసోమదత్తభూరిశ్రవశ్శల్యు లొక్కయక్షౌహిణితోడ దక్షిణపక్షంబును
విందానువిందకాంభోజు లశ్వత్థామపురస్సరులై వామపక్షంబునం గ్రహించిరి.
కళింగాంబష్ఠమాగధపౌండ్రమద్రకగాంధారశకునప్రాచ్య పార్వతీయవసాతిశిబిసై
న్యములు వీఁపున నిలిచె. కర్ణుఁడు పుత్రమిత్రబంధుసమన్వితుండై పుచ్ఛస్థానంబుఁ
గొనియె. జయద్రథభీమరథసంపాతిభూమింజయవృషక్రాథనైషధులు బహుళ
సైన్యములతో నురస్సున నిల్చిరి. నడుమఁ బ్రాగ్జ్యోతిషేశ్వరుం డైనభగదత్తుం
డు విధివదలంకృతం బయి నిర్ఝరీపరీతం బయినకులశైలంబుచాడ్పున మదధారా
పరీతం బైనతనసింధురంబుపయిం గూర్చుండి యుదయపర్వతశిఖరారూఢుం
డైనమార్తాండుం గ్రేణిసేయుచు శ్వేతాతపత్రభాసురుండై కృత్తికాయోగ
యుక్తుం డైనరాకానిశాకరుకరణి నొప్పుచుఁ బార్వతీయసేనాగణపరివృతుండై
దేవగణపరివేష్టితుం డైనయాఖండలునిమాడ్కిఁ దేజరిల్లుచు నిలిచె. అట్లు పన్ని
నమనసేనలం జూచి ధర్మరాజు ధృష్టద్యుమ్నుం బిలిచి యాచార్యుం జూపి యో
విక్రమధుర్యా, నేను నేఁడీబ్రాహ్మణునకుఁ జిక్కకుండ వెరవున మనసేనలం బన్ని
జాగరూకతమై మెలంగవలయు ననుటయు నతనికి ధృష్టద్యుమ్నుఁ డిట్లనియె.
మహారాజా, ద్రోణునిఁ దదీయులను నేను నిలువరించెద. నామేనఁ బ్రాణములు
గలుగునంతకు నీకు వెఱవం బని లేదు. ఆచార్యుండు నన్ను గెలువ నేరఁ డనిపలికి
తమసేనల మండలార్ధవ్యూహవిధానమునఁ బన్ని తగినచోట్లఁ దగువారల నిల్పి
తాను సేనాముఖమునం బొలిచి యాచార్యుం దలపడుటయు నబ్భారద్వాజుండు
తన కతండు దొలుత నగపడుట యుత్పాతంబుగ భావించి విన్నఁబోవుటయు నది
యెఱింగి నీకొడుకు దుర్ముఖుండు గురునకుఁ బ్రియంబు సేయువాడై ధృష్టద్యు
మ్నుం దాఁకుడు నతండు వానిం బటుశరప్రచ్ఛన్నుం గావించి యాచార్యునిపై
నడరుటయు నతండును గురునకుఁ దలకడచి బాణజాలంబుఁ గురియుటయు వారి
పోరు ఘోరం బయ్యె. అట్టియెడ ద్రోణుఁడు ధృష్టద్యుమ్నుం గ్రేడించి యుధి
ష్ఠిరానీకంబుపై నడరి శరజాలంబుఁ బరఁగించి చండమారుతంబు మేఘపటలం
బునుంబోలెఁ దెరలించుటయు వెఱచఱచి పాండవచమూగణంబులు దమ్మును
లాఁతులను నెఱుంగఁజాలక యడియాలముల నించుక యెఱుంగుచు నిర్మర్యాదం
బుగఁ బెనంగుటయుఁ బరమతుములం బయినసమరంబు సెల్లె. అట్టియెడ నాచా

ర్యబాణప్రహారమునం జేసి మణినుయకవచభూషణగుణంబులు శాణోల్లిఖితంబు లై నరీతిం దేజరిల్లె. విశీర్ణపతాకానికరనిబిడంబు లయినరథవాజివారణంబులు బలాకాశబలజలధరంబులట్టు లొప్పె. అంతఁ గొంతవడి కురువడించి చతురంగ బులుతమతమజాతిం దలపడి సంకులముగఁ బోరునెడ నేనుంగు లితరేతరదంతస ఘర్షణంబునం బొడమినమిడుఁగుఱుల నిండి సౌధామినీసముల్లసితంబు లగుకార్మొ గులు తెఱంగునం జూడ నొప్పె. మఱియుఁ బ్రాసకుంతాదిప్రహారంబునను రథికశ రసంపాతంబునను గరిఘటలు గర్జాసమఘోరఘీంకారంబులఁ గావించుచు జఱ్ఱన మొగదిరిగియు మావంతులపురికోలునంజేసి మగిడి పైపై నడరి కొండొకవడి కారోహకులువడినం దమమూఁకలఁ గాలఁ జమురుచుఁ బాఱి తోమరాదిప్రహా రంబున నేలంగూలునెడఁ బుడమి వడంకుచుండె. అప్పుడు కయ్యంపునేల యేనుం గులపీనుంగులయిఱుకటమునఁ బృథులశైలజాలసంభరితం బైనభంగిఁ దనరె. ఏమిచెప్పుదు నాచార్యునికోల్తలకు రథగజవాజిగణంబు లారోహకశూన్యంబు లయ్యె. రక్తధారాప్రవాహంబునం జేసి నేల పంకిలం బగుడుఁ బ్రాణరక్షణతా త్పర్యమునఁ బాఱఁ దలంచియుఁ గాలుమానుసులు కర్దమనిర్మగ్నంబు లయిన కాళ్లు వెలుకఁ జాలక బమ్మరించిరి. గజౌఘమహావేగంబు మృతనరశైలంబు రథౌఘతుములావర్తంబు నగుసైన్యసాగరంబునఁ దమయట్టివా రనేకులు పడి ప్రమ్మదిపోయినను విజయధనవాంఛం జేసి వీరవణిక్కులు వాహనయానపాత్రములఁ గడవ దాఁటం గడంగుచుండిరి.

ద్రోణుఁడు సత్యజిత్తు మొదలగువారలం జంపుట.

అవ్విధమున ద్రోణాచార్యుఁడు విక్రమించి పాండవసేనలం జీకాకువఱిచి కరియూథపతిపై గవియుమృగేంద్రంబుచాడ్పునఁ బాండవాగ్రజుం గవియుచు న్నంతఁ దద్బలంబున నాచార్యుండు ధర్మరాజుం బట్టెప్రతినఁ దీర్చుచున్నవాఁ డని యొక్కమొలుంగుగా హాహాకారంబు సెలంగె. అట్టియెడ సత్యజిత్తు పరమరయమున ధర్మరాజరక్షణపరుండై యాచార్యుం దాఁకుటయు నయ్యిరువురిసమరంబు బలి వాసవసంగరతుల్యం బయ్యె. అంత నేచి సత్యజిత్తు నిశితశరమున నాచార్యుని నొవ నేసి యాశీవిషోపమము లగునైదమ్ములఁ దత్సారథిని మూర్ఛితుం గావించి పదింట రథ్యముల నొప్పించి పదిపదితూపులఁ జక్రరక్షకులయంగములం గీలించి మండలగతిం జమూముఖమునం దేరు పోనిచ్చి కేతుదండంబుఁ దూఁగాడ నేయుటయుఁ గ్రుద్ధుండై కుంభసంభవుండు వీఁ డలంతులఁ బోవఁ డని యూ హించి మర్మభేదనకర్మఠంబు లయినతీవ్రమార్గణములఁ బదింట నాసత్యజిత్తును నొంచి సంహితకాండం బైనకోదండంబునుం ద్రుంచె. త్రుంచినం గోపించి య ప్పాంచాలవరుఁ డొండుకోదండం బెత్తి ముప్పదికంకపత్రశరముల నాచార్యు

మేశం గీలించిన సభ్భారద్వాజుండు సత్యజిత్తు బారిం బడినవాఁడ యనితలంచి పాండవసైనికు లార్చి పస్త్రముల విద్రుచుచున్నంత వృకుఁ డయ్యాచార్యుం దలపడి యఱువదియమ్ముల ట్రొమ్మున నాటి బహుళశరజాలంబుఁ బరఁగించుటయుఁ జూపఱు వానివింటినేర్పుఁ బొగడిరి. అందుల కత్యంతకోపాటోపదీపితుండై చాపగురుండు కన్నుల నిప్పులు రాలం జూచి వృకుని రథ్యసారథులతోడ జముఁ బ్రోలి కనిచి సత్యజిత్తువిల్లు దునిమె. అంత నతం డొండువి ల్లెత్తి యాచార్యు నిమేనం బటుప్రదరంబుల నాటి రథ్యములను సూతుని నొప్పించి సిడముఁ గంపింప నేయుఁడు నాచార్యుఁడు తదీయశరార్దితుండై యిఁక వీనియెడ నుపేక్ష దగదని తనలో నిశ్చయించి వానిని రథ్యములను సారథినిఁ జక్రరక్షకులను శరసారమున ముంచి యెత్తినవిండ్లనెల్ల నఱికె. నఱికిన నతండు చలంబు డింపక దివ్యాస్త్రంబు లేయం దొడంగినం జూచి యుద్దీర్ణరోషుండై గురుండర్ధచంద్రబాణమున వానితలఁ దఱిగె. అట్లు సత్యజిత్తు ద్రోణాచార్యునిచే హతుఁ డగుటయు ధర్మరాజు వేగవంతంబు లయినరథ్యములఁ దఱిమించుచుఁ బఱచె. అప్పుడు పాంచాలకేకయమత్స్యచేదికరూశకోసలసైనికులు రాజరక్షణపరులై ద్రోణుం దలపడుటయు నతండును ధర్మజుం బట్టికొనం బూని యగ్గి దూదికుప్పలంబోలె నాసేనల రూపుమాపుచుండునంతఁ గోపించి విరాటుతమ్ముఁడు సూర్యదత్తుఁ డతనిం దలపడి సూర్యరశ్మిప్రతీకాశము లగునారాచతూపుల నయ్యాచార్యునిఁ దత్సారథిని రథ్యములను నొప్పించి యార్చి పేర్చి వెండియుం గాండజాలంబుఁ బరఁగించె. అందుల కలిగి గురుఁ డొక్కశరమున నాసూర్యదత్తుతలఁ గుండలములతోడ నేలం బడ నేసి హిమవచ్ఛిఖరాకారం బైనతనవేదికాధ్వజంబు గ్రాల మత్స్యపాంచాలాదిసేనలపయిం గవిసి మెఱుంగు మెఱసినట్లు విల్లు వెలుంగుచుండ ధనురాకర్షణశరగ్రహణసంధానమోక్షణప్రకారంబు లూహింపరానిరయమునం బేర్చి జ్యాఘోషభీషణంబుగ వడగండ్లు గురియురీతిం బటుశరాసారంబుఁ బరఁగఁ జేయుచు దైత్యగణసంహారవిహారపరాయణుం డైననారాయణునిచాడ్పున నొప్పుచుఁ గవచగణములు తరంగములుగా, సిడములు సుళ్లుగా, గజవాజిచయంబులు గ్రాహనికరంబులుగాఁ, గరవాలంబులు మీలుగా, నెమ్ములపౌ ళ్లిసుకగా, భేరీమురజములు కచ్ఛపములుగా, గదాఖేటకములు తెప్పలుగాఁ, గేశజాలంబు శైవాలంబుగా, మనుజమస్తకంబులు పాషాణంబులుగా, దలచీరలు నురుఁగుగా, వికీర్ణాంత్రసికరం బురగనివహంబుగాఁ, గేతనంబులు పాదపంబులుగా, సైన్యములను తరువుల నురులం ద్రోయురక్తనదీప్రవాహంబుఁ బాఱించి క్రవ్యాదగణముల నోలలార్చె. అంతఁ బరమరోషమునఁ బాంచాలమాత్స్యాదిచమూగణపరివృతులై పాండవయోధులు పెక్కం డ్రట్లు ప్రతాపాతపంబు గాయుచున్న

యాకుంభసంభవుం జుట్టు ముట్టి శరజాలంబునం గప్పిరి. అందు శిఖండివసుధా
నక్షత్రదేవులు వేఱువేఱ నైదింటిని క్షత్రధర్మ యిరువదింటినిఁ జేకితానోత్త
మౌజులు ప్రత్యేకంబ మూఁటిని యుధామన్యుఁ డెనిమిదింటిని సాత్యకి నూఱెం
టిని ధృష్టద్యుమ్నుఁడు పదింటిని నయ్యిరువురితోడ్పాటునం దఱియ వచ్చినపాండ
వాగ్రజుండు పంద్రెంటిని నేసినం దత్పక్షవీరులు క్షేమధృతి సేనప్రముఖులు కొంద
ఱతనిపయిం బెక్కుబాణమ్ములు నేసిరి. అంతఁ గోపప్రజ్వలితుండై ద్రోణుఁడు మత్త
సింధురంబుచందమున విక్రమించి దృఢసేనుం గూల్చి నవశరప్రయోగతీవ్రుండై న
క్షేముం జంపి యొక్కనిశితభల్లమున వసుధానుని నాయోధనవసుధకు బలి చేసి
పంద్రెంట శిఖండిని నిరువదింట నుత్తమౌజుని నెనుబదింట క్షేమవర్మని నిరువది
యేడింట సుదక్షిణుని నిఱువదినాలుగింట యుధామన్యుని ముప్పదింట సాత్యకిని
నొప్పించి నిశితభల్లమున క్షత్రదేవునిఁ జేరిపయి నేలగిలం బడ నేసి యుధిష్ఠిరుఁడెన
కఱునుటయు నప్పాండవాగ్రజుండు తొలఁగిపఱచె. అట్టియెడ సుమిత్రుం డను
పాంచాలకుమారుఁడు గురుం దలపడి శరనికరంబుఁ బరఁగించినం గినిసి యయ్యా
చార్యుండు వానివిల్లు దునిమి రథ్యముల గీటడంగించి సూతుం బొరివుచ్చి యత
నిం గూల్చె. అట్లు సుమిత్రుం డాచార్యునిచేహతుఁ డగుడుఁ బాండవసైన్యంబు
లందు ద్రోణుం బట్టుఁడు పొమ్ముఁడు చంపుఁ డను నెలుంగులు పెలుచ విన
నయ్యె. అంత సాత్యకియు ధృష్టద్యుమ్నుఁడును జేకితానుండును శిఖండియు వార్ధ
క్షేమియుఁ జైత్రసేనియు సేనాబిందుఁడును సువర్చనుండును మున్నగువారు
పలువురు మహారథు లడ్డపడినను వారల నందఱం గెలిచి కుంభసంభవుండు దను
జసంహారోద్యతుం డైనపురుహూతునిచాడ్పున విక్రమించుటయు మాత్స్యపాం
చాలాదిమహారథులు వెఱఁగుపడి చెయ్వులు దక్కి చూచుచుండి రనిచెప్పిన విని
యాంబికేయుండు సంజయా, యట్లు పాండవపక్షంబునం జేరినబిరుదుమగ లంద
ఱు నాచార్యునికోల్తల కోహటించిరకాని యొక్కండేనియు మార్కొని రాఁజా
లకుండెఁగదా యనుటయు నతం డతని కిట్లనియె. అవ్విధంబున నాచార్యునిశర
వేగంబునకు సింధువేగమునఁ బఱచుతేపలపగిదిఁ బాండవయోధులు తొలంగి
పాఱుటయు మనవారు సింహనాదములను భేరీప్రముఖవాదిత్రనిస్వనంబులనుం
గావించుచున్నంతసైన్యస్థితుం డైనదుర్యోధనుఁ డానందసాంద్రుండై కలకల
నగుచుఁ గర్ణున కిట్లనియె. రాధేయా, సింగముఁ గన్నమెకముల తెఱంగున ద్రోణ
బాణములకు వెఱచి పాండవయోధులు పఱచుచున్నవారు. మహావాతభగ్నము
లయినద్రుమములపగిది విఱిగినవారు. గురునంపసోనం దలపోసి యింకఁ గయ్యా
మునకు రారని తలంచెద. చూడుము. అద్దెసఁ గౌరవులకును మండలగతిప్రచం
డుఁడైనయాచార్యునకునుఁ జిక్కి పానకంబున కేనుంగు లెట్టు లట్టుల తిరుగుడు

పడి యొకళ్లొకళ్లతోడం గలియక పాఱుచున్నవారు. వాఁడె భీముఁడు తమవా
రెవ్వరుం జేసిన లేమిం బస్మరించుచు మనవారికిఁ జిక్కినవాఁడు. ఇట్టిదియుం
జూచితేఁగా యని నాకెంతయు సంతసం బయ్యె. ఆమరాత్ముఁ డిప్పుడు సర్వము
ద్రోణమయముగ భావించి రాజ్యమునెడను జీవితమునెడను నాశ మానియుండు
ననియూహించెద ననవుడుఁ గర్ణుఁ డతని కిట్లనియె. రాజేంద్రా, భీముఁడు నట్టి
వాఁ డగునె? మేనఁ బ్రాణములు గలుగునంతకు వాఁడు పో వుడుగువాఁడు గాఁడు.
అతండు మనవారియార్పులు విని సైరించునే? శూరులు బలవంతులు కృతాస్త్రు
లు యుద్ధదుర్మదులు నగుపాండవులు విఱిగి పఱతురన్న నింక నేమి గలదు.
విషముఁ బెట్టించియు నిల్లు గాల్పించియు జూద మాడియు నడవులకుఁ బంపియు
నీవు వారి కెన్నియే నెగ్గులు చేసినవాఁడవు. అవి వారు మఱతురే. అన్నియుం
దలపోసి పోరుదురు. వృకోదరుం డలిగి యఱిమెనా చెప్పఁ దరము గాదు. మేటి
బలియురనెల్ల నేఱియేఱి చంపువాఁడు. బాణకృపాణగదాదియుద్ధముల వాఁ డతి
ప్రచండుఁడు. అల్లవారె సాత్యకిప్రముఖు లగుమహారథులు భీమసేనునకుఁ దో
డ్పడి యతండు పురికొల్పఁగఁ దత్పురస్సరులై యాచార్యుం దలపడుచున్నవారు.
అందఱు నెక్కయుమ్మడిం గవియుచు రేని రక్షణంబుఁ బడయని దీపములను మి
డుత లెట్టు లట్టుల గురుసేనం గీటడంపఁ జాలుదురు. నిక్కవంబుగ నిప్పు డాచా
ర్యునకుఁ బెద్దయు దెప్పరంబు గాఁగలయది. మన మందఱమునుం గూడ ముట్టు
ద మనుటయు దుర్యోధనుండు భ్రాతృపరివృతుండై యాచార్యుం గావ నడుచుట
యుఁ బాండవయోధులు వివిధకేతనాభిరామముగా నతనిం బిలుకుమార్పఁగ నడ
రుటయుఁ బరమసమ్మర్దం బయ్యె ననవుడు ధృతరాష్ట్రుఁడు సూతనందనా, యప్పు
డడరినపాండవయోధుల రథధ్వజాదిచిహ్నములఁ దెల్పు మనియడుగ నతనికి సం
జయుం డిట్లనియె.

### సంజయుఁడు ధృతరాష్ట్రునకు బాండవయోధులరథచిహ్నములఁ జెప్పుట.

భీమునిగుఱ్ఱములు మనుఁబోతువన్నె గలయవి. సాత్యకియశ్వములు రజతవ
ర్ణములు. యుధామన్యుతురంగములు సారంగవర్ణములు. ధృష్టద్యుమ్నురథ్యములు
పారావతవర్ణములు. క్షత్రధర్మహయములు శోణవర్ణములు. శిఖండిపుత్రుం డైన
క్షత్రదేవునితురగములు పద్మపత్రవర్ణములు. నకులుగుఱ్ఱములు శుకపక్షవర్ణ
ములు. ఉత్తమౌజునిసైంధవములు మేఘవర్ణములు. సహదేవువాహనములు తిత్తి
రివర్ణములు. యుధిష్ఠిరునశ్వములు గజదంతవర్ణములు. ద్రుపదుగుఱ్ఱములు కాం
చనవర్ణములు. విరాటుగుఱ్ఱములు పాటలవర్ణములు. వైరాటియశ్వములు హరి
ద్వర్ణములు. కేకయులగుఱ్ఱము లింద్రగోపకవర్ణములు. అమితౌజునినిహాయము
లామపాత్రవర్ణములు. శిఖండికాండములు దంతవర్ణములు. ధృష్టకేతుఘోటకం

బులు సారంగశబలంబులు. దుర్జయుహయములు శబలవర్ణములు. బృహత్క్షత్రు
తురంగమములు పలాలధూమవర్ణములు. సేనాబిందునశ్వములు కౌశేయవర్ణము
లు. కాశిరాజపుత్రునశ్వములు క్రౌంచవర్ణములు. ప్రతివింధ్యునిగుఱ్ఱములు కృష్ణ
గ్రీవంబులు నితరాంగశ్వేతంబులునై యుండు. సుతసోమునిగుఱ్ఱములు మాష
పుష్పవర్ణములు. ఆద్రౌపదీపుత్రుఁడు సోముని ప్రసాదమునం బుట్టి సహస్రసోమ
ప్రకాశుండై యాపేరు వహయుట నీకు విదితంబకదా. నకులపుత్రుఁడైన శతానీకు
నియశ్వములుసాలపుష్పవర్ణంబులు. శ్రుతకర్ముగుఱ్ఱములు మయూరకంఠవర్ణంబులు.
శ్రుతకీర్తిహయములు మాషపత్రవర్ణములు. అభిమన్యునశ్వములు పిశంగవర్ణములు.
తానెక్కుండ నీకొడుకులం బాసి పాండవులపాలికేగినయుయుత్సునశ్వముల *పలా
లకాండవర్ణంబులు. వార్ధక్షేమియశ్వములునట్టివ. సౌచిత్తియశ్వములునీలపాదంబు
లు. శ్రేణిమంతునిగుఱ్ఱములు కౌశేయవర్ణములు. సత్యధృతితురంగములరుణంబులు.
చేకితానుతురంగములు పింగలకౌశేయవర్ణములు. కుంతిభోజునశ్వములింద్రాయు
ధవర్ణములు. రోచమానునిగుఱ్ఱములు గగనవర్ణములు. పాంచాలకుమారుఁడై
నసింహసేనునిగుఱ్ఱములు శశలోహితవర్ణములు. పాంచాలవరుండైన జనమేజయు
హయములు సర్షపపుష్పవర్ణములు. దండధరువారువంబులు సారసకేసరవర్ణము
లు. వ్యాఘ్రదత్తుగుఱ్ఱములు మూషకవర్ణపృష్ఠములు రాసభవర్ణసర్వాంగములునై
యుండు. సుధన్వునశ్వములు చిత్రవర్ణములు. కోసలపతిపుత్రుఁడగు సుక్షేత్రుని
ఘోటకంబులు చక్రవాకోదరవర్ణంబులు క్షేమసుతుండైన సత్యధృతిగుఱ్ఱములు శ
బలవర్ణము. శుక్లునిగుఱ్ఱములును కేతనాదులును శుక్లవర్ణములు. సముద్రసేనసూనుం
డైన చంద్రసేను వాహనములు చంద్రవర్ణములు. శైబ్యునిగుఱ్ఱములునీలోత్పలవర్ణం
బులు. రథసేనునిరథ్యములు† కలాయపుష్పవర్ణములు. పటచ్చరవిభుతురగములు శు
కవర్ణములు. చిత్రాయుధుగుఱ్ఱములు కింశుకవర్ణములు. నీలునిగుఱ్ఱములును కేత
నాదులును నీలవర్ణములు. చిత్రునిగుఱ్ఱములును కేతనాదులును చిత్రవర్ణములు. రో
చమానసూనుండైన హేమవర్ణునశ్వంబులు పుష్కరవర్ణములు. దండకేతునశ్వము
లు కుక్కుటాండవర్ణములు. కేశవుండు విక్రమించి తండ్రిం జంపి పాండ్యప్రాకా
రకవాటం బవనయించి బంధులఁ బ్రోదోలుటయు భీష్మద్రోణకృపజామదగ్న్యు
లవలన దివ్యాస్త్రముల నేర్చి రుక్మికర్ణగాండీవిమాధవుల కెనవచ్చుచు ద్వార
కను వారించి భూమండలం బెల్లఁ దాన యేలుదు ననిపూని పదంపడి హితకా
ములైన సుహృదులు వారింపఁగ వైరానుబంధముఁ బరిత్యజించి తనరాజ్య మే
లుచున్న పాండ్యునిగుఱ్ఱములు చంద్రవర్ణములు. తదనుయాయులగుఱ్ఱము లాటరూ

* పలాల మనఁగా గింజలేనివరిపోఁచ మొదలగునది.

† కలాయ మనఁగా గుండ్రనిసెనగలు.

షకవర్ణములు. ఘటోత్కచునిగుఱ్ఱములు నానావర్ణములు. భరతుల నందఱను విడిచి ధర్మరాజుం జేరినబృహంతునిగుఱ్ఱములు దువర్ణవర్ణములు. తక్కగలమత్స్యపాంచాలచేదికాశికరూశకోసలాదినానాయోధులయశ్వములు నానావర్ణములై యుండు. ఆచార్యునిధ్వజంబు కాంచనవేదికాకమండలుశోభితంబు. ధర్మరాజుకేతనంబున గ్రహణాన్వితుం డైనసోముఁడును సందోపసందకము లనుదివ్యమృదంగముఁలు రెండును వెలుంగుచుండు. భీమసేనునిడమున రజతసింహము దనరు. నకులునిపతాకయందు సువర్ణపృష్ఠం బయినశరభము సెలంగు. సహదేవు నిటెక్కమున ఘంటయు రాజతహంసమునుం బొలుచు. ద్రౌపదేయులమైమకేతనంబులందును గ్రమంబున ధర్మవాయుదేవేంద్రాశ్విదేవతల ప్రతిను లమరు. రావణాసురసముఁ డైనఘటోత్కచుపడిగమీఁద గద్ద యుండు. అభిమన్యుపతాకపై సౌవర్ణశార్ఙ్గపక్షి యొప్పారు. ధర్మరాజువిల్లు మాహేంద్రంబు. భీమునికార్ముకము వాయవ్యంబు. అర్జునకోదండంబు గాండీవం బనుట సుప్రసిద్ధంబకదా? నకులుని చాపంబు వైష్ణవంబు. సహదేవుశరాసనం బాశ్వినంబు. ఘటోత్కచునిధనస్సు పౌలస్త్యంబు. బలభద్రుఁడు తాను సంపాదించిన రౌద్రనామకం బైనధనుస్వరంబును మెచ్చి సౌభద్రున కిచ్చెఁ గావున నతనికార్ముకంబు రౌద్రంబు. ద్రౌపదీపుత్రులవిండ్లు వరుసను రౌద్రాగ్నేయకౌబేరయామ్యగిరిశము లనం దనరు. తక్కినవారికినిం బలుదెఱంగు లగుకేతనచాపంబులు గలిగియుండె. అట్లుద్దామకేతుశోభనాభిరామయంబుగా నామగోత్రప్రఖ్యాపనపూర్వకంబుగా నాచార్యు యింగవిసి రనవుడు ధృతరాష్ట్రుఁడు సంజయున కిట్లనియె.

## ధృతరాష్ట్రుఁడు చింతించుట.

సంజయా, వృకోదరప్రముఖు లయినయోధులు దేవతలనైనను జయింపనేర్తురుగదా. దైవయోగమున నన్నియు నెడఁగూడు. కాకున్నఁ బెద్దకాలంబు రాజ్యముఁ బాసి యడవులకుఁ జని నారలు గట్టి కూరలు దిని మఱియు నజ్ఞాతవాసంబు నడిపి వచ్చినయధిష్ఠిరున కందఱుమహారథులు నన్నియక్షౌహిణులును దోడ్పడునే? భాగ్య మొక్కతెఱంగున నుండ మనము వేఱొక్కతెఱంగునఁబోవఁ దలంచితిమేనియు నది కొనసాగమి నిక్కవంబు. మందాత్ముఁ డైనదుర్యోధనుఁడు కేకయులు నాకుఁ దోడ్పడిరి, కోసలులు నాకు బాసటమైరి, మాగధులు నన్నుఁ బొందిరి, వంగులు నన్ను విడిచిపోవ మనిరి, పుడమి యంతయు నాయదియకాని యిందఱం గెలిచి పాండవు లేలఁజాలుదురే, యని నాతోఁ బలుదెఱంగులఁ బలుమాటలు చెప్పుచుండె. ఇందఱు బాసటమైయున్నను ద్రోణుఁడు ధృష్టద్యుమ్నునిచే నిహతుఁ డయ్యెగదా. ఇంక నే మనం గలదు. మనభాగ్యమి ట్లున్నది.సర్వాస్త్రపారగుఁడు సమరదుర్మదుఁడు నగు నాచార్యుని మృత్యు వెట్లు చేరవచ్చెనో

కాని యెఱుంగరాదు. భీష్మద్రోణులు పడి రని విన్నంతన నామనంబు మోహా
విష్టం బయ్యె. నాకు జీవితాశయు నిప్పుడులేదు. పుత్రమతావలంబి యగునాకు
విదురుఁ డెయ్యది సెప్పె నది యెల్లదుర్యోధనునిమిత్తమునఁ గుడువవలసివచ్చె.
కొడుకు లందఱు గొల్లపోవుచున్న ను దుర్యోధనుం డొక్కఁడై నను బ్రాణములతో
మిగులునా యనియుండెద. ప్రధానులు తెగినపదంపడి తక్కఁగలవారు బ్రదుకు
దురని యెట్లు తలంపవచ్చును? భీష్మద్రోణులు పడి రన్నపుడే నిరాశుఁడనైతి.
వారిప్రాపు వొందియకదా మనము సుఖముంటిమి. కానున్నది కాఁగలయది. ధ
ర్మముఁ ద్యజించి యర్థపరుండై నరా జన్నిటం జెడు ననుట నిక్కువంబు. అదియ
ట్లుండె. సమరప్రకారంబుఁ జెప్పుము. ఎవరు పోరి రెవరు తొలంగి రెవరు పఱ
చిరి. భీమార్జునులు దలంపునకు వత్తురేనిమీఁద నేమియుం దోఁపదు. అట్లు పాం
డవు లాచార్యునిపై నడరిన మనవా రెల్లయిరి. తత్ప్రకారంబుఁ దేటపడం జెప్పు
మనియడుగ సంజయుఁడు ధృతరాష్ట్రున కిట్లనియె.



పాండవయోధు లట్లు పెక్కం డ్రొక్కుమొగిం గూడుకొని యాచా
ర్యుం దాఁకి చుట్టు ముట్టుటయు నెగసినపరాగంబు పెల్లున రవిమండలం
బుఁ గప్పి చీఁకట్లు పచరించుకతన నేమియుం గానక గురుని హతునకా వగ
చుచున్నంత సుయోధనుండు పేరెలుం గెత్తి శూరులారా, శక్తికి నుత్సాహము
నకు బలమునకు ననురూపముగఁ బాండవులం దలపడుఁ డనిపలుకుటయు మన
వారు బరవసంబున వారల మార్కొనిరి. అందు దుర్మర్షణుఁడు దొదవ్వున భీమ
సేనుం దాఁకి యంతకాకారంబునం బొలిచి బాణజాలంబుఁ గురియుటయు నతం
డలిగి శరపరంపర లడరించినం బోరు ఘోరం బయ్యె. కృతవర్మ సాత్యకిం దల
పడి పోరె. సైంధవుఁడు క్షత్రవర్మపై నడరి బలునారసంబు లేసిన నతం డాజయ
ద్రథు కేతనకార్ముకములఁ దునిమి పదింట మర్మముల నొంచిన నాసింధుపతి యొం
డువి ల్లెత్తి క్షత్రవర్మపయిం బాణనికరంబుఁ బరఁగించె. సుబాహుఁడు యుయు
త్సుని మార్కొనినసతం డతనిభుజములఁ గాండద్వయమున నఱికె. శల్యుఁడు
యుధిష్ఠిరుం దాఁకి వేల సాగరంబు సెట్టు లట్టుల యాఁగిన నప్పాండవాగ్రజుం
డతనిపయి మర్మభేదనచణంబు లయినమార్గణంబులఁ గురిసిన నతండు ధర్మజుపై
నఱువదినాలుగమ్ము లడరించి యార్చుటయు నయ్యార్పున కలిగి యారాజశ్రేష్ఠుం
డతనివిల్లును బడగయునుం దునుముటయు జను లఱచిరి. బాహ్లికుఁడు ద్రుపదుం
దలపడుటయు నావృద్ధవీరు లిరువురు మత్తసింధురములచందమునఁ బోక పెనం
గిరి. విందానువిందులు విరాటు నెదిరించినబలిపై నడరినయింద్రాగ్నులయట్లు
వాఁడిమి మెఱయునయ్యుద్ధతియాలంబు దేవదానవసమరంబుచాడ్పున నాభీలం

బయ్యె. మత్స్యకేకయు లొండొరులం దలపడిరి. భూతకర్మ నకులసుతుం డైన శతానీకుని మార్కొనిన నతం డతనిబాహుమస్తకంబులఁ దఱిగె. వివింశతి శ్రుతసోముం దాఁకి బాణములం గప్పిన నతండు పెక్కుతూపుల నతని నొంచె. భీమరథుఁడు సాళ్వుం దాఁకి యాఱమ్ముల నాలుగుగుఱ్ఱములను సారథి నారథికునిం బిలుకుమార్చె. చిత్రసేనపుత్రుఁడు శ్రుతకర్మం దాఁకుటయుఁ దండ్రులకార్యముఁ దీర్పఁ బూనినయయ్యిద్దఱిసమరంబు తుములం బయ్యె. అశ్వత్థామ తండ్రికిఁ దోడ్పడువాఁడై ప్రతివింధ్యుం దాఁకి శితశరములఁ గప్పిన నయ్యుధిష్ఠిరపుత్రుఁ డయ్యాచార్యపుత్రునిపై నిపుణకృషీవలుండు విత్తులఁ జల్లుచందమునఁ గాండజాలం బడరించుచున్నంత నతనితమ్ములు నలువు రన్నకుఁ దోడ్పడి యశ్వత్థామపై శరవర్షంబుఁ గురిసిరి. అట్టియెడ దుశ్శాసనాత్మజుండు శ్రుతకీర్తిపై నడరుటయు నభిమన్యుండు మన్యుసముద్ధతిం బేర్చి వానిం దలపడి మూఁడువాఁడికోలలఁ దదీయచాపకేతనసారథులం గూల్చి ద్రోణునిమీఁది కడరె. లక్ష్మణకుమారుఁడు పటచ్చరపతిం దాఁకిన నతండు వానిచాపంబును గేతనలాంఛనంబును నఱికి యతనిపై నంపగములం బరఁగించె. వికర్ణుఁడు శిఖండిం దలపడి యిషునికరం బేయుటయు నతండును శరనివహంబుఁ గురియుటయు నీకొడుకు క్కుమిగిలి పోలిచె. అంగదుఁ డుత్తమౌజుని మార్కొనిన నయ్యిరువురిపో రిపువాఁగునం బ్రమోదామృతకరంబయి చెల్లె. దుర్ముఖుఁడు పురుజిత్తునెదిర్చి వాఁడికోలలం గప్పిన నతండు వానిభ్రూమధ్యమునఁ గ్రూరనారాచంబు నాటుటయు మనదుర్ముఖుని ముఖము నాళోల్లసితం బగునళినంబుకరణి నొప్పె. కర్ణుఁడు లోహితకధ్వజులయినకేకయులేవురను దలపడి శరవర్షమున నిలువరించుటయు వారు నతనిపై బలుతూపు లడరించుటయు నాసమ్మర్దమున వారొండెఁ గర్ణుఁడొండె నగపడక పటుప్రసిరసూతు లైరి. నీకొడుకులు దుర్జయజయవిజయులు క్రమమున నీలకాశ్యజయత్సేనులం దాఁకిన వారిపోరు సింహవ్యాఘ్రతరక్షువులకు ఋక్షమహిషర్షభంబులతోడఁబోట్లాటచాడ్పునఁ జూపఱ కద్భుతావహం బయ్యె. క్షేమధూర్తిబృహంతులు సాత్వతుని మార్కొనుటయు వారిసంగరంబు మత్తేభంబులతోడిసింగముకయ్యంబు తెఱంగున నాశ్చర్యకరం బయ్యె. చేదిపతి యంబష్ఠపతిం దాఁకిన నయ్యంబష్ఠపతి వాఁడిశలాక నతనిమేన నాటుడువాఁడు విల్లమ్ములం దిగవిడిచి నేలం బడియె. కృపుఁడు వార్ధక్షేమిం దాఁకి యలంతియమ్ములు పెక్కు లేసి నిలువరించిన నలిగి యతం డతనిపై నడరుటయు నాలంబాభీలం బయ్యె. భూరిశ్రవుఁడు మణిమంతుం దలపడి శరములఁ బరఁగించినం గినిసి యతండు నడిం బేర్చి యాతనిఛత్రకేతనకార్ముకంబుల నఱికి సారథినిం జంపినను సోమదత్తతనయుండు కృపాణపాణియై రయమునఁ దేరు డిగ్గ నుఱికి యామణి

మంతుని కేతనంబును గుఱ్ఱములను సారథినిం గృపాణమున నఱికి మగిడి రథం బెక్కి తాన రథచోదనంబుఁ గావించుచు నొండుకోదండం బెత్తి పాండవసైన్యం బు నొంచుచుండె. అసురసంహారతీవ్రుం డైనపురందరునట్లు వెలుంగుచున్నపాం డ్యుని వృషసేనుఁడు తాఁకి నిలువరించుచున్నంత ఘటోత్కచుండు గదాపరిఘప ట్టసనిస్త్రింశముసలముద్గరచక్రభిండివాలప్రముఖనానాహేతివ్రాతంబులం గుప్పిం చుచు నడరుటయు నారాక్షసుని రాక్షసేశ్వరుం డైనయలంబుసుఁడు మార్కొ నిన నయ్యిద్దఱురక్కసులపోరు శంబరపురందరసమరంబుభంగిఁ బరమసమ్మర్దం బ య్యె. ఇవ్విధమున ననేకులు ద్వంద్వములై కూడి ద్రోణుం గావను ద్రోవనుం బూని యేత్తెఱ మెఱసి పోరుటయుఁ జూపఱు వెఱఁ గందె ననవుడు ధృతరాష్ట్రుఁ డు సంజయా, యట్లు వీరవర్యులు ద్వంద్వయుద్ధమునకుఁ దలపడిన నామీఁదిక య్యం బెట్లు చెల్లె. సంశప్తకులపై నురువడించినక్రీడియనంతరసమరప్రకారం బె ట్లని యడుగుటయు సంజయుండు రాజేంద్రా, ధనంజయసమరప్రకారంబుఁ బిద పఁ జెప్పెద నిది విను మని ధృతరాష్ట్రున కిట్లనియె.

భీముఁడు వంగాధిపతిం జంపుట.

అట్లందఱు ద్వంద్వములై పోరునెడ దుర్యోధనుఁడు గజానీకపురస్సరుండై భీముపై నడరుటయు నతం డేనుంగుచీరినయేనుంగుభంగిని నాఁబోతుచీరినయాఁ బోతురీతిని నడరి కిరణజాలంబుల సారించునుదితార్కుం దలఁపించుచు వివిధబా ణగణంబులు నిగిడించిన నవి కుంభములు వగిలియుఁ దొండములు దెగియుఁ గాళులు విఱిగియుఁ బలుదెఱంగులఁ జిందఱవందఱలై మహావాతమునకు మేఘ జాలం బెట్టు లట్టుల తెరలి భీమ్మశరవిక్షతగాత్రంబులై నెత్తుటఁ జొత్తిల్లి రవికిర ణస్ఫూతంబు లయినయంబుదంబుల ననుకరించుచుఁ జూడ నొప్పియున్నంతఁ గో పాటోపదీపితుండై భవదగ్రనందనుం డప్పవననందనుపైఁ దాన కవిసి పెక్కు తూపు లడరించె. అందుల కెంతయుఁ గినిసి భీముఁడు నేఁటితో వీనిపని చక్కఁ బెట్టవలయు నని పూని కెంపారుకన్నులఁ జుఱచుఱం జూచి సర్వాంగములందు ను బాణములం గీలించిన నతండు క్రుద్ధుండయ్యె నగుచు రవికిరణసన్నిభంబు లయినతీవ్రబాణము లతనిపై నేసె. ఏయుటయుఁ గోపించి వృకోదరుండు భల్ల ద్వయంబున నతనిఫణిరాజకేతనంబును జారుకార్ముకంబునుం దునిమి బలుతూ పుల నొంచుచున్నయవసరంబున వంగాధిపతి మాతంగారూఢుండై భీమునిం దాఁకె. తాఁకుటయు భీమసేనుఁడు తనపైఁ గవియవచ్చుచున్నయవ్వేంగపతి యే నుంగుకుంభస్థలమునఁ గ్రూరనారాచంబు నాటిన నది దానికుంభము వ్రచ్చి వెడలి పుడమిం బడియె. అయ్యేనుంగును వజ్రాహతం బయినపర్వతంబుమాడ్కిఁ గూలె. అట్టియెడ వడముడి కడు వడిం బేర్చి యావంగాధీశ్వరుతల నిశితభల్లము

నఁ దునిమె. తునుముటయు మనసేనలు వానికి వెఱచి పఱచె.

భగదత్తుఁ డేనుఁగుతోఁ బాండవసేనపైఁ గవియుట.

అట్టియెడఁ బ్రాగ్జ్యోతిషేశ్వరుం డైనభగదత్తుండు తనయేనుఁగుం గొల్పిన నయ్యది క్రోధవ్యావృత్తనేత్రం బై తొండమున నీడ్చియుఁ గాలఁ బట్టి నేలఁ జమిరియుఁ బలుదెఱంగులఁ బాండవవరూథినులఁ జిందఱవందఱగావించుచు వృకోదరునరదముం బట్టి యీడ్చి నేలతోఁ ద్రేసిన నది గుఱ్ఱములతోడ నలిగులియగుడు వడముడి తటాలునం బుడమికి లంఘించి నేర్పునం దానియుదరంబు క్రింద నిలిచి పీనాయతభుజదండమునఁ బలుమాఱులు దాని నడిచిన నది భీముం బట్టికొన నెంచి కులాలచక్రంబు భంగి గిరగిరం దిరుగుచున్నంత నాగాయుతబలుం డైనమహాబలనందనుం డచ్చోటు వాసి యెదుర నిల్చె. నిల్చుటయు నాసుప్రతీకము తొండమున నవాయుసూను నెత్తి కొంతవడి జానువులపయిం బెట్టి యదిమి యట నతనికంధరంబుఁ దొండమునం జుట్టి నేలతోఁ ద్రేయనున్నంతఁ గీచకాంతకుండు నేర్పున నప్పట్టు దప్పించికొని మగుడఁ దదీయోదరంబుక్రిందు సొచ్చి యట నచట మెలంకువ కీ డని తలపోసి యప్పటికిఁ దమవార లయ్యేనుంగు మార్కొనివచ్చుటం జూచి తాఁ దొలఁగుటయు వారివారలు భీముఁడు భగదత్తునిమత్తసింధురంబుచేఁ జచ్చె ననియఱచుచు నప్పవనసూనుఁ డున్న దెసకుఁ బఱచిరి. అప్పుడు ధర్మరాజు భీమునకుఁ గీడు మూఁడెఁగాఁబోలు నని వగచి సకలచమూగణపరివృతుండై ధృష్టద్యుమ్నుని మున్నిడికొని యవ్వారవారణంబు మార్కొని యందఱు నెక్కయుమ్మడిం బటుప్రదరంబులు గురియుచున్నంత భగదత్తుం డయ్యమ్ములనెల్ల నంకుశమునఁ బొడిచేయుచు నేనుఁగుం బురికొల్పుటయు నగ్గజేంద్రంబునకు నవ్వీరులకుం బోరు ఘోరంబయ్యె. అయ్యవసరంబున దశార్ణపతి తనమత్తేభంబు దానిపయిం గొల్పుటయు నాశుండాలంబులు రెండును ఱెక్కలుగలపర్వతంబులచాడ్పున నుక్కుమిగిలి పోరుచున్నంత నేచి భగదత్తునేనుంగు కొంత వెనుక కొదిగి క్రమ్మఱి డీకొని దశార్ణేశ్వరుపార్శ్వభాగంబు నెవ్వ నడిచిన నతండు దానం డయ్యుటయు నయ్యెడఁ గని ప్రాగ్జ్యోతిషపతి సప్తతోమరంబులు బిట్టేసిన నద్దశార్ణపతి నేలం బడియె. అట్లు దశార్ణనాథుండు తెగుటయు ధర్మనందనుండు బహుళరథికపరివృతుండై యతనిం జుట్టు ముట్టినఁ దత్పరివృతుండై గజారూఢుం డైనభగదత్తుండు వనమధ్యమునం గిరిశిఖరమున వెలుంగుజ్వలితహుతవహుపగిదిం దేజరిల్లుచుఁ దనయేనుఁగును సాత్యకితేరిమీఁదికిం బఱపుటయు నది తదీయరథంబు నీడ్చి వడి నేలతోఁ ద్రేసిన నాశినివర్యుండు సారథిసహితంబుగఁ దటాలునఁ బుడమికి లంఘించె. అవ్విధమున నయ్యేనుంగు పరమఘోరంబుగ నభంగురవిక్రమంబున మెఱసి యెదిర్చినవారలఁ జించిచెండాడు

చున్నంతఁ బాండవయోధులు దాని నెక్కడానిని నూఱుగజంబులుగ భావించి నివ్వెఱపడి దిక్కు గానక యిటునటుం బాఱుచుండునంత బకాంతకుండు రోష రూషితుండై సాధుకల్పితోపనీతం బైనయొండుతేరెక్కి యక్కరివరంబుపై నడ రుటయు నాదంతావళంబు శుండాదండనిస్సరచ్ఛీకరాసారముఁ గురిసి పవనసూ నుతేరిగుఱ్ఱముల వెఱపించుచుండె. అట్టియెడ రుచిపర్వ యంతకాకారమునం బొల్చి దానిపై నురువడించి శరనికరంబుఁ గురిసినం బ్రాగ్జ్యోతిషేశ్వరుండు వాఁ డియమ్మున నతనిం బిలుకుమార్చె. అట్లు తన్ను మార్కొన మగలు లేమింజేసి యంతకంత కగ్గలంబుగ వాఁడిమి మెఱయునాభగదత్తునిపై నలిగి యభిమన్యుం డును ద్రౌపదేయులును జేకితానుండును ధృష్టకేతుండును యుయుత్సుండును నెదిర్చి యార్చి పేర్చి ప్రావృట్సమయోదపటలంబు పర్వతంబు నెట్టు లట్టుల బహు శశరాసారమున నతనిం గప్పుటయుఁ గోపించి యాభగదత్తుండు శుండాలంబును బరిగోలలఁ బొడిపించియు నంకుశమున నడిచియు నంగుష్ఠమునఁ బొడిచియుఁ గొలుపుటయు నది మూరిఁబోయి తొండము సాఁచి స్తబ్ధశ్రోత్రనేత్రంబై రయ మున వారిపై నడరి యుయుత్సురథ్యసారథులం జంపిన నతండు నడిం దిగి తొ లంగి యభిమన్యుతేరెక్కె. పాండవయోధు లందుల కెంతయుం గింకిరిపడి ఘోర ప్రకారమున సింహనాదములు గావించి దానిం జంపువారై యుదితాదిత్యుండు కిరణజాలంబునుంబోలె విషుజాలంబుఁ బరఁగించుచున్నంత సౌభద్రుండు సంద్రెం టిని యుయుత్సుండు పదింటిని ద్రౌపదేయధృష్టకేతులు వేఱువేఱ మూటిని నమ్ముల నాటినఁ దద్బాణవిద్ధంబై య మ్మత్తసింధురంబు నెత్తుటం జొత్తిల్లి సూర్య కిరణసంస్యూతం బైనజలధరంబుచాడ్పున నొప్పె. అంత భగదత్తుఁడు పరమకోపావి ష్టుండై పెద్దయుఁ గడంక యడరఁ బురికొల్పఁగ నగ్గజంబు శరార్దితంబయ్యు నే పగ్గలించి సవ్యదక్షిణప్రకారమున నడరి కనుపుగొట్టుటయుఁ బాండవసేనలు పసులవాఁడు కోలఁ గొని వెలిచినపసులచందమునను డేగ లఱిమినకాకులవిధ మునను జీకాకుపడి తెక్కలుగలకొండచాడ్పున నలిరేఁగినయయ్యేనుఁగునకుఁ జి క్కి సముద్రమధ్యమున సుడిగాలికి వికలం బగుచున్నకలమున నున్నబేహారులట్లు సాధ్వసావిష్టంబులై యుండునంత నంతకంత కగ్గలించి యగ్గజంబు రిపువాహిను లం గలంచుచుండ ధరణీపరాగం బెగసి నింగిఁ గప్పుడు నేదిక్కు చూచిన నయ్యే నుంగునకా వగచి వారివారు సుప్రతీకంబట్టిబెట్టిదపుటేనుంగులు పదివేలు చుట్టు ముట్టినట్టు లిట్టలంబుగ వెఱచఱచి రని చెప్పి సంజయుండు నరేంద్రా, గాండీవిస మరప్రకారము మున్ను నీ వడిగితివికదా దానిం జెప్పెదను విను మని ధృతరా ష్ట్రునకు వెండియు నిట్లనియె.

అర్జునుఁడు భగదత్తుకొత్తల మాన్పఁ దేరు దోలు మని హరితోఁ జెప్పుట.

అట్లు భగదత్తునికొత్తలకుఁ గలంగి తమసేనలు వెఱచఱచుచున్నంత నెగసినపాంసుపటలంబుఁ జూచి పార్థుఁడు కృష్ణున కిట్లనియె. మాధవా, ప్రాగ్జ్యోతిషేశ్వరుఁ డేనుఁగుం గొల్పి యగ్గలికంబున మెఱయుచున్నవాఁడు. అదె యద్దెస మనవారిఘోరారవంబులు వీతెంచెడి. భగదత్తుండు పురందరునకుఁ దక్కువ గాఁడు. గజయానచాతుర్యమున నతని నెండె దేవేంద్రుని నెండె మొదల లెక్కింపవలయు. అయ్యేనుంగు జితశ్రమం బప్రతిహతప్రచారంబు తాఁకోర్వఁ గలదు. అగ్నిస్పర్శమునేనియు సరకుగొనదు. నేఁటితో మనసేననెల్ల నది నుఱుమాడఁ జాలు. నేను నీవును దక్కఁ బెఱవారు దానిం జక్క మార్కొని నిలువనేరరు. ఇఁకఁ దడవు సేయం జనదు. అద్దెసం దేరు వఱపుము. ఇంద్రమిత్రుం డైనయా భగదత్తుని వానియేనుంగునుం బిలుకుమార్చెద ననుటయు గోవిందుఁ డట్లయని యద్దెసం దేరు పోనిచ్చె. అట్టియెడఁ ద్రిగర్తముఖ్యులు పదివేవురు నారాయణగోపాలురు నాలుగువేవురును బార్థువెంట నంటి యర్జునా, మమ్ము గెలువ కెచ్చటి కేగెదవు రమ్ము దురమ్ము సేయు మనుటయు ధనంజయుఁడు పిలిచినసంశప్తకుల తోడఁ బోరాడవలయు, భగదత్తునికొత్తలకుఁ జేవ చెడినబలంబులఁ గావవలయు, రెండు నిప్పు డవశ్యకర్తవ్యంబులై యున్న వెయ్యది చేయుదు, నెయ్యది విడుతు, నని తనలో విచారించి కొంతవడికి సంశప్తకులపై నడరుటయ యప్పటి కవశ్యకర్తవ్యం బని నిశ్చయించి వారిపై నడరె. అర్జునుం గెలువఁ గర్ణదుర్యోధనులు చింతించి యందులకుఁ ద్రిగర్తులు చాలుదు రని నిశ్చయించి యతని నిస్సహాయునిగా నట్లు వాపి పాండవమహారథుల నందఱనుం దా మందఱును మార్కొనుట మున్న నీ కెఱింగించితిఁ గదా. మనవా రెన్ని వెరవులు పన్నినను వారియెడ నవి యెల్ల వమ్మగుచుండు నది యట్లుండె. అట్లడరినయర్జునుని సంశప్తకు లందఱు నెక్కుపెట్ట తాఁకి పార్థుండును గృష్ణుండును రథంబును రథ్యంబులును నిజసాయకచ్ఛన్నంబులై యొక్కింతసే పగడకుండునట్లు శరాసారంబుఁ గురిసిరి. తదీయసాయకాసారవిద్ధుండై జనార్దనుం డించుక డయ్యుటయు వివ్వచ్చుం డలిగి బ్రహ్మాస్త్రం బేసినం దత్సైన్యంబునఁ దునిసినకాలుసేతులును విఱిగినకేతుకోదండంబులును గూలినరథికసారథులును రాలినభూషణాయుధగణంబులునై ఘోరాభిరామప్రకారంబు చూపట్టుటయు మత్తశుండాలమునకుఁ జిక్కినతమ్మితీవచాడ్పున నిగూపింపరానిదీనదశకు వచ్చినత్రిగర్తసైన్యంబుఁ జూచి చూపఱు పేర్కొనిరి. విస్మయదరహాసంబు వదనారవిందమునఁ దళుకొత్తఁగ గోవిందుఁడు తనకరంబున విజయు కరంబుఁ బట్టి పార్థా నీవింటినేర్పుఁ బొగడఁ గొలఁదియె? ఇంద్రయమప్రభృతులకు నలవిగానిపని నీవు చేయఁ జాలినవాఁడవు. సంశప్తకు లనేకులు తెగి రన

వుడుఁ గ్రీడి యింక భగదత్తుదెసకుఁ దేరు పఱపు మనుటయు హరి యట్లచేసె.
అట్లతిత్వరితగమనంబున నర్జునుండు ద్రోణానీకంబుపై సాయకజాలకంబుఁ గురి
యుచు వచ్చుచున్నంత సుశర్మాదులు వేవేగ వెంట నంటి వచ్చి యుద్ధార్థులయి
పిలుచుటయుఁ గిరీటి హరి కిట్లనియె. వీఁడె సుశర్మ భ్రాతృసమన్వితుండై న
న్ననికిం బిలువ వచ్చినవాఁడు. వాఁడె భగదత్తుఁడు మనసేనల నుగ్గుచేయుచున్న
వాఁడు. సంశప్తకులం బరిమార్పవలయునో శత్రుభయార్దితు లైనస్వజనులఁ
గావలయునో యనియెఱుంగనేరక డోలాయమానమానసుండై ననాకుఁ గర్త
వ్యంబుఁ దెల్పు మనవుడు హరి సంశప్తకవధంబ కర్తవ్యం బనిచెప్పి యాత్రిగర్త
లపయిం దేరు పఱపె. అట్లు క్రమ్మఱి కవిసి వివ్వచ్చుం డేడువాఁడితూపుల సుశ
ర్మను గాఁడ నేసి రెండలంతియమ్ములఁ గేతనకార్ముకములఁ దునిమి వానితమ్ముని
రథ్యసారథిసహితమ్ముగ నాఱమ్ముల జముప్రోలి కనిచినం గోపించి సుశర్మ క్రూర
పన్నగసంకాశం బగుశక్తిని నర్జునుమీఁదను ఘోరతోమరంబు వాసుదేవుని
మీఁదను నేసె. ఏయుటయు నర్జునుఁ డారెంటిని మూఁడేసియమ్ములం ద్రుంచి
పెక్కుబాణము లొక్కయుమ్మడిం గురియుటయు నతండు తద్బాణవిద్ధుండై
మూర్ఛవోయె.

### అర్జునుఁడు భగదత్తునిపైఁ దలపడుట.

అట్లు సుశర్మ మూర్ఛిల్లినం బాండవమధ్యముండు క్రూరపన్నగంబుపై
నడరుగరుడునివడువునఁ గడు వడిం బేర్చి యెదిర్చిన మనసేనాకాననంబుఁ గార్చి
చ్చుమాడ్కి ని నీఱుసేయుచుఁ బాయలువడం జేయుచు భగదత్తునిఁ దాఁకి కురు
కులక్షేమనిర్వహణగృహీతంబయ్యు దుర్దాత దేవి యగునీకొడుకుమూఁకలం గను
పుకొట్టఁగఁ బుట్టినగాండీవంబుగొనయమ్ము సారించుచు శరనికరంబుఁ బరఁగించినం
గొండ తాఁకినకలంబుచందమున మనసైన్యంబు వికలం బగుటయు నందుల
కోర్వక పెక్కండ్రు మనమహారథు లతనిం జుట్టు ముట్టినం బద్మాకరంబుఁ గలం
చుషష్టిహాయనమత్తకుంజరంబువీఁక మెఱసి యమ్మేటివిలుకాఁ డందఱఁ జిందఱ
వందఱగావించుటయు భగదత్తుం డలిగి తనయేనుఁగు సతనియరదంబుపయిం
గొలిపి పటుప్రదరనికరంబు గుప్పించుటయు నప్పాండవమధ్యముండు ప్రతిశరంబు
ల వానినెల్ల నడుమన పొడిచేసిన నయ్యిద్దఱిసమరంబు పరమతుములం బయ్యె.
అంతఁ బ్రాగ్జ్యోతిషేశ్వరుం డేచి సవ్యసాచిసాయకసముదాయంబు మాయించి
బలుతూపు లడరించి హరినిం గిరీటిని నొప్పించి తద్రథంబు నుఱుముసేయఁగ
శుండాలంబుఁ బురికొల్పుటయు హరి యక్కుంజరంబు వలపలించి తేరు దొలఁగిం
చినం బ్రక్కయేటున నయ్యేనుఁగు నేయ వల నొప్పియున్న నది క్షాత్రధర్మంబు
గాదని కిరీటి యేయు టుడిగి హరినేమియు నననేరక యూరకయుండె. కిరీటిర

థంబు తొలంగిన నెదుర నున్నచతురంగబలంబులనెల్ల నాస్తంబేరమంబు నుఱుమాడుచున్నంతఁ గ్రోధదీపితుండై వివ్వచ్ఛుండు క్రమ్మఱి యయ్యేనుంగుపై నడరె ననవుడు నాంబికేయుఁడు సంజయా, యట్లు లలిగినకవ్వడి పదంపడి యేమి చేసె. భగదత్తుఁడు నమ్మేటివిలుకానిపై నెబ్భంగి నడరెఁ దెలియం జెప్పు మనియడుగ నతనికి సంజయుం డిట్లనియె.

### అర్జునుఁ డేనుంగుతోడ భగదత్తునిఁ జంపుట.

అవ్విధమున నమ్షోత్కర్ష భరితుండై గాండీవి ప్రాగ్జ్యోతిషపతిపయిం గవియుటయు నతం డంతకాకారంబునం బొల్చి కార్ముకంబుఁ గర్ణాంతకృష్టంబుఁ గావించి క్రూరనారాచంబు లరిఁ బోసి కృష్ణార్జునులపై నేయుటయుఁ దదీయనిశితసాయకంబులు నారాయణుమైమఱుఁగు వచ్చి నెత్తురు లురులించినం జూప అక్కటా! నేఁడు క్రీడియు వాసుదేవుఁడును భగదత్తున కగపడి మృత్యువాతం బడినయట్టు లయిరి. ఇంక నేమి కాఁగలదో యని తలంచుచున్నంత నర్జునుండు గండడరి నిశితశరమున నాభగదత్తునివిల్లు దునిమి యొక్కవాఁడికోలం దత్పరిచరుం జంపి యవలీల నతనిమేనం బటునారసంబులు పెక్కులు గ్రుచ్చుటయు నతండు సూర్యకిరణసంకాశంబు లయినచతుర్దశతోమరంబు లర్జునునిపై నేసె. అంతఁ గోపదీపితుండై కిరీటి యాపదునాల్గుతోమరంబులం బ్రత్యేకంబ ముత్తునియలు గావించి శరజాలమున నేనుంగుపక్కెర నుగ్గుచేసె. అట్లు విశీర్ణకవచంబై బీభత్సునారాచార్దితంబై నెత్తుటఁ జొత్తిల్ల భగదత్తునిమత్తేభంబు ధాతురాగరంజితంబై కప్పియున్నమేఘపటలంబు విచ్చినపర్వతంబుచాడ్పున నొప్పుటయుఁ గడుం గనలి యాప్రాగ్జ్యోతిషపతి హేమదండం బయోమయంబు నగు క్రూరశక్తిని వాసుదేవునిపై నేసె. ఏయుచున్నంతన సవ్యసాచి దాని రెండుఖండములు గావించి తదీయకేతనాతపత్రంబులఁ బొడిచేసి పదితూపులు మేనం గీలించుటయు నొచ్చి భగదత్తుండు కోపించి బహుళతోమరంబు లొక్కపెట్ట యేసి యర్జునుకిరీటంబు నగల్చినం గ్రీడి దానిం జక్క సవరించి లోకము మెచ్చి చూచునట్లు విక్రమింపు మనవుడు నాభగదత్తుం డత్యంతక్రోధవిస్ఫురితుండై వింటం బలుతూపులు సంధించి మాధవుపై నేసినం గాండీవి వానినెల్లఁ దునిమి డెబ్బదిరెండుచండకాండముల నతనిమర్మంబుల నొా నేసె. గాండీవిశరజాలవిద్ధుండై యత్యంతక్రుద్ధుండై యంత నాభగదత్తుండు వైష్ణవాస్త్రమున నభిమంత్రించి యంకుశమున నప్పాండవమధ్యమునురోభాగంబుఁ గాఁడ నేయుచున్నంత దనుజాంతకుండు గాండీవికిఁ దనవక్షస్థలంబు నడ్డంబుగా నమర్చుటయు సర్వాస్త్రవిధ్వంసనోదగ్రం బయినయయ్యస్త్రరాజంబు శ్రీవత్సలాంఛనువత్సభాగమున వైజయంతియై తనరె.. అది తన కవమానముగ భావించి యర్జునుండు పుండరీకాక్షుం

బిలిచి మహాత్మా, పోరుట మాని సారథ్యముఁ జేయుదు నని బాస యిచ్చి యిట్లు చేసిన ని న్నే మనం గలవాఁడను. అయ్యస్త్రమునకుఁ జిక్కినపుడొండె దాని నివారింపఁ జాలకుండినఁ బొండెఁగదా యిట్టులు చేయం జను. ధనుర్బాణపాణి యగు నేను సురాసురుల నైనను గెలువఁ జాలుదు నని నీచిత్తమునకును విదితంబ కదా యనుటయు వనజోదరుఁడు పార్థా, గుహ్య మగు పురావృత్తముఁ జెప్పెద వినుమని యిట్లనియె. లోకపరిత్రాణార్థం బేను నాలుగుమూర్తుల ధరించి యున్న వాఁడను. అం దొక్కటి భూలోకమునఁ దపశ్చర్యానిరూఢం బై యుండు. వేఱొ క్కటి లోకులు సేయుసాధ్వసాధుకర్మములకు సాక్షిభూత మై పరఁగు. మఱియు నొక్కటి మనుష్యలోకము నాశ్రయించి మనుజసహజంబు లయినకర్మములు చేయుచుండు. ఇంకొక్కటి వర్షసహస్రయోగనిద్రాపరాయణ మై తనరు. అది వర్ష సహస్రాంతమున నుత్థితం బై యుత్తముల కుత్తమవరము లిచ్చుచుండు. ఆసమ యం బెఱింగి భూదేవి తనపుత్త్రుఁ డగునరకాసురునిమిత్తమున నతండు దేవదాన వులకు నవధ్యుఁ డై పరఁగునట్లుగను వైష్ణవాస్త్రకలితుఁ డై తనరునట్లుగను వర ములు వేఁడుటయు నే నద్దేవికి సుప్రీతుండ నై మదీయ వైష్ణవాస్త్రంబు నొసంగి యీయస్త్రంబుప్రభావమున నీకొడుకు లాఁతులకు జేయుండై యుండు నని చెప్పు టయు భూమి తనకోరినయర్థంబుఁ బడసి నన్ను వీడ్కొని యరిగె. తదస్త్రప్రభా వమున నే నరకాసురుఁ డితరుల కవధ్యుఁ డయ్యె. అయ్యస్త్రంబు నీభగదత్తుండు వడసె. అయ్యస్త్రరాజమునకుఁ జావనివాఁడు దేవదానవులలో నైనం గలుగఁడు. దానం జేసి నేను నీ కడ్డముగ నామే నమర్చితిఁగాని యొండుగాదు. ఉపాయ మున నయ్యస్త్రమును దొలఁగించితిని. పరమాస్త్రవిముక్తుం డై నయీభగదత్తు నిప్పుడు విక్రమించి నేను నరకుం జంపినయట్లు చంపు మనుటయు నుల్లసిల్లి మ హేంద్రనందనుండు పటుకాండముల నాప్రాగ్జ్యోతిషేశ్వరుపైఁ గురిసి సుప్రతీకం బుకుంభస్థలమునడుమ వాఁడినారసము నాటె. నాటిన నమ్మత్తేభంబు వజ్రాహతం బయినపర్వతంబుమాడ్కిఁ బెద్దయు నొచ్చి తనకేఁ డెంత పురికొల్పినను గామినీ జనంబు పేదమగనివచనంబునుంబోలె వానిపూన్కియెల్ల వమ్ముచేసి కొమ్ములు నేల నాని యతిదీనముగ నఱచుచుఁ గూలి చచ్చె. అంత నర్ధచంద్రబాణమున నర్జు నుండు భగదత్తునురమ్ము బిట్టేయుటయుఁ దత్ప్రహారమున విదీర్ణవక్షుండై విల్ల మ్ములం దిగవిడిచి మహీధరాగ్రమునుండి మారుతవేగమున డొల్లిపడుకుసుమితక ర్ణికారపాదపంబురీతిఁ గరికుంభమునుండి నేలం బడియె. అట్టియెడ నర్జునబాణ విద్ధం బై వానిమస్తకంబు డొల్లునెడఁ గామ్రదుంచినం బడుతామరసంబుచా డ్పునం జూడ నొప్పె.

## అర్జునుఁడు గాంధారులం గనుపుకొట్టుట.

అవ్విధంబున నింద్రనందనుం డింద్రసఖుం డై నభగదత్తుని నేనుంగుతోడఁ బీనుంగు గావించి మాఱుమలయువారు లేక కోలుమసంగి యాప్రాగ్జ్యోతిషపతి కళేబరంబు వలగొని మనమూఁకలపై నడరి యురువడించుచున్నంత గాంధార రాజతనూజు లయినవృషకుఁ డచలుఁడు ననువా రయ్యవక్రవిక్రముం బూర్వ పశ్చిమభాగములఁ దాఁకి తీవ్రాశుగంబు లేయుటయుఁ గోపించి కిరీటి వృషకుని రథరథ్యసూతకేతనాతపత్రకార్ముకములఁ దిలప్రమాణఖండములు గావించి శర వ్రాతంబులను నానాప్రహరణంబులను దనపై నడరినగాంధారుల నందఱం జీకా కుపఱిచి యేనూఱుగురువీరుల మృత్యువునకు బలి చేసినం గోపించి వృషకుం డచలునితే రెక్కి యతండును దానును ప్రావృట్పయోధరంబులు శైలము నెట్టు లట్టుల క్రీడిం బాణవర్షమునఁ గప్పి యింద్రునిపైఁ గవిసినవృత్రబలులవిధమున నేపు చూపుచుండఁ గోపోద్రేకభరితుం డై గాండీవి యేకరథస్థులు పరస్పరసమా శ్లిష్టగాత్రులు తుల్యలక్షణులు నగునయ్యన్నదమ్ముల నిద్దఱను నొక్కనిశితశరమున ఖండించుటయు వారు రథమునుండి నేలం బడి గతాసులయిరి. అట్లతివిక్రము లయినమేనమామ లిద్దఱు మడియుటకు నీకొడుకు లెంతయుఁ బలవించిరి. తమ్ములు సచ్చుటకు శోకామర్షభరితుం డై శకుని కృష్ణార్జునుల మోహింపఁ జేయువాఁ డై పెక్కుమాయలు వన్నినం దన్మాయాప్రభావమున లగుడాయోగుడశతఘ్నీశక్తి గదాపరిఘనిస్త్రింశశూలముద్గరపట్టసముసలాదినానాహేతివ్రాతంబులు కిరీటితేరి చుట్టుం బడియె. ఖరోష్ట్రమహిషసింహవ్యాఘ్రాదిక్రూరజంతుచయంబులు వివిధ రక్షోగణంబులును వేనవేలుగఁ బుట్టి క్షుత్పరీతంబులై యర్జునుని మ్రింగఁ గడంగె. అంత దివ్యాస్త్రవేది యగునర్జునుఁడు తత్క్షణంబ వానినెల్లఁ బొడవడంగించుటయు నీమఱఁది యంతటం గటికిచీఁకట్లు పచరించిన నాసంతమసంబునం బార్థునకు వెఱపు పుట్టింపఁగ ఘోరారవంబు లెసఁగె. అందులకుఁ దలంకక కౌంతేయుండు జ్యోతిరస్త్రమున నాచీఁకటినెల్ల విరియించుడు శకుని యేదిక్కు చూచినను సలిల మయముగా మాయగావించుటయుఁ బార్థుం డాదిత్యాస్త్రం బేసి యానీళ్లెల్ల వట్టిపోవం జేసె. అట్లు తనపన్నినమాయలన్నియు వమ్మగుటయుఁ బార్థబాణవి ద్ధుఁ డై శకుని రథ్యవేగమునం జేసి యతిరయమునఁ దోలఁగి పఱచె. అవ్విధమున శకుని సిగ్గఱి సరివారు నగ ననికిఁ దొలఁగుటయు నర్జునుండు దివ్యాస్త్రప్రయోగ కౌశలంబు మెఱయ నేపు చూపుచున్నంతఁ గురుసైన్యంబు దైన్యంబుఁ జెంది యతనికి వెఱచి కొండతాఁకునఁ బాయలై నగంగాప్రవాహముచందమున రెండు ముత్తంబులై యొక్కటి ద్రోణునిసూరెలను నొక్కటి దుర్యోధనునికెలఁకులను నిలిచినం దఱిమితఱిమి మహామారుతంబు మేఘమండలంబు విరియించుపగిదిఁ

దెరలించుచుండ నొక్కండేనియు నగ్గాండీవిని మార్కొ్నం జాలఁ డయ్యె. ఎదిర్చి నవా రందఱు నగ్గిలోనం బడుమిడుతలట్లుగ్రమ్మగ్గిరి. ఏమి చెప్పుదు నర్జునుం డొక్కతూపు నేసిన నయ్యెది యొక్కగుఱ్ఱమును సమయించి యొక్కరథికునిఁ బొరివుచ్చి యొక్కయేనుఁగుం గూల్చి యొక్కకాలుమానిసిం బరిమార్చి మఱి పుట్టలోని కేగుపాముచందమున నేల సొచ్చుచుండె. ఒక్కొ్క్కయ మ్మిట్టు చేయుచుండ నతం డేయుపెక్కుబాణముల మనమూఁక లెట్లయ్యె నని వేఱ యడుగ నేల? రణాంగణం బెచ్చటఁ జూచినం బీనుంగుపెంటలైయె కన్పట్టె. తండ్రి కొడుకును గొడుకు తండ్రిని మిత్రుఁడు మిత్రునిం జుట్టము చుట్టమునుం జూడక పార్థబాణప్రపీడితులై మనవారు వెఱచి పఱచి రనిన విని ధృతరాష్ట్రుఁడు సంజయా, యర్జునుకో ల్తల కట్లు మూఁకలు విఱిగిన నప్పుడు మీామనంబు లె ట్లయ్యె. క్రమ్మఱఁ గూర్ప వలను గాదని తలంచెద ననవుడు నతనికి సంజయుఁ డిట్లనియె.

అట్టియెడ మూర్ఛదేఱి సంశప్తకనారాయణగోపాలబలావశేషులు వచ్చి పార్థుం గ్రమ్మఱ దురమ్మునకు రమ్మని పిలిచినం గిరీటి సేనాదక్షిణభాగమునం జని త్రిగర్తనారాయణగోపాలురతల లేఱుచుండె. ఇక్కడ ద్రోణుప్రాపుఁ గాంచి మనవారు నీకొడుకునకుఁ బ్రియము సేయువారై యశముఁ గోరి పాండవులపై నురువడించుటయు భీమసాత్యకిధృష్టద్యుమ్నులు యుధిష్ఠిరుతోడ నడరి ద్రోణుం జంపుఁ డని తమవారలఁ బురికొల్పుటయు నీకొడుకులు ద్రోణున కడ్డపడుఁ డని యెలుం గేర్పడం జెప్పుచుఁ గౌరవుల కందఱకుం జేయి వీచిరి. అప్పుడు కౌరవపాండవులకు ద్రోణరక్షణనిగ్రహంబు లొడ్డుగాఁగ సమరద్యూతంబు సెల్లె. ద్రోణుఁ డేయేదెస నడరు నాయాదెస కెల్ల ధృష్టద్యుమ్నుఁ డడ్డపడుచుఁ దోడఁ గవియుచుండె. పాండవులు సంరంభోద్రిక్తులై మనవారు తమ్ముఁ బఱచినపా ల్లెన్నుచుఁ గోపదీపితులై ప్రాణరక్షాపరత్వంబు మాని పైపై నడరుటయు ఱాయి ఱాయిం దాఁకినట్లు వారికిని మనవారికినిఁ దుములసమరం బయ్యె. ఇట్టిపోరులు ము న్నెన్నఁడుం జూచియు వినియు నెఱుంగ మని పెద్దలు పలికిరి. ఆసంకులమునకు ధరణి కంపించె. అంత ద్రోణుం డేచి వారిమూఁకలపై శరాసారంబుఁ గురిసిన ధృష్టద్యుమ్నుఁడు వానినెల్ల మాయించి ద్రోణుపయిం గురుసేనపయిం బటుప్రదరంబు లడరించుటయు నాచార్యుండు వాని మాయించి మా ఱేయుటయు నాగురుశిష్యులపోరు నిరుపమానంబై యత్యద్భుతం బయ్యె.

### అశ్వత్థామ నీలునిఁ జంపుట.

అయ్యవసరంబున నీలుఁడు శరములు స్ఫులింగములుగా మణిమయకార్ముకద్యుతులు మంటలుగా నగ్నిపోలెఁ దేజరిల్లుచుఁ గురుసేనాకాననంబుఁ గాల్చుచుండ నశ్వత్థామ యతనిం దాఁకి యయ్యా, యోధవరశరానలదగ్ధు లయినవా

రిపై నేల విక్రమంబు సూపెదవు? చాలుదేని నన్నుఁ బోర గెలువు మనుటయుఁ గ్రోధోద్దీపితుం డై నసీలుండు బాణజాలం బేసిన నాచార్యపుత్రుండు భల్లత్రయ మున నతనిధనుర్ధ్వజఛత్రంబుల నఱికె. అంత నానీలుఁడు రయమునఁ బలుకయు వాలునుం గొని తేరు డిగ్గ నుఱికి యశ్వత్థామతలఁ దెగ వ్రేయ నుంకించు చున్నంత నేచి యయ్యాచార్యపుత్రుండు నిశితభల్లమునఁ గుండలోల్లసితం బయినవానిమస్తకంబు నవలీలం దునుముటయుఁ బూర్ణచంద్రవదనుండును బద్మ పత్రాయతనేత్రుండు నిందీవరపత్రనీలగాత్రుండును నగునానీలుఁడు ద్రోణ పుత్రనిహతుండై నేలం బడియె. అప్పుడు పాండవసైనికులు గాండీవిం దలంచి కొని యక్మేటివిల్కాఁడుండిన మన కిన్నిపాట్లు పడం బని లేదుగదా యనిచిం తించుచుండ వృకోదరుండు నీలవధంబున కలిగి వీఁక నడరి తన కడ్డపడినబాహ్లికు నఱువదియమ్ములను గర్ణుం బదితూపులను నొ నేయుటయు నాచార్యుం డతనిపై నిశితశరములఁ గురిసి మెడ గలుగకుండ మగుడ నిరువదియాఱువాఁడికోలల నాయమ్ముల నాటిన నదియ తఱిగాఁ గొని కర్ణుండు పంౘ్రెంటను నాచార్యపు త్రుఁ డేడింటను దుర్యోధనుఁ డాఱింటను నతని నొవ్వ నేసినం గోపాటోపసందీ పితుండై మారుతాత్మజుం డేఁబదితూపుల గురునిఁ బదింటఁ గర్ణునిఁ బంౘ్రెంట దుర్యోధనుని నేనింట నశ్వత్థామను నొంచి ఘోరారవంబుఁ జేసె. అవ్విధమున నంద ఱొక్కనిం బొదివి పోరుచున్నంత ధర్మరాజు భీమునకు బాసట యగుఁడని తమవారికిఁ జేయి వీచుటయు నకులసహదేవసాత్యకిద్రౌపదేయప్రముఖులు తో డ్పడిన నేడ్తెఱ మెఱసి వృకోదరుండు ద్రోణానీకంబుపై నడరినం గ్రందుకయ్యం బయ్యె. ఏమి చెప్పుదు నప్పరమసమ్మర్దమున వాహనములనుండి తలక్రిందుగ డొల్లిపడునారోహకులును, నేనుంగులు తొండముల నీడ్చి యొమ్ములఁ గొమ్ముల నదిమియుఁ గాళ్లఁ జమిరియు గిరగిరం ద్రిప్పివైచియు మైమఱువుల్లు బొడిచేసియు నేలం గూల్చిన నలుఁగులసందడిం బడి మడియుకాలుమానునులును, నేలనా దులతోడం దేకులు నుగ్గయినం గాఁడిసాము గొని పెరెమెత్తుచు రథికశరసంపా తంబునను దారుణవారణశుండాదండప్రహారమునను జదియుగుఱ్ఱములును, రథ ములు విఱిగినం బలుకయు వాలునుం గొని నేలకు డిగి కడిందిమగంటిమిం బేర్చి మెదిర్చి మోపినకోలంది పోరి పగఱయంపవెల్లి మునింగి కుండలోల్లసితంబు లైనతలలు దెగ నేలం బడి వెఱచఱచుచుఁ బఱచుతురంగంబులచరణఘట్టనం బునఁ దుత్తుమురై యిది యియ్యంగం బని యేర్పఱుపరానివిధమునఁ దెరలి యిటునటుం బొరలురథికగాత్రంబులును, సెలకట్టెలయేటులను రథికులబాణము లపోటులను దమకు సరి యగురిపుగంధసింధురంబులప్రహారములను వికలాంగం బులై కూలి శైలజాలంబున కెనవచ్చుమాతంగంబులును, నోతండ్రీ! యోకొడు

కా! యోచెలీ! యెట నున్నవాఁడ వని యెుంతోరులంబిలుచుచుఁ బ్రాణరక్షాపరత్వం
బున క్షాత్రధర్మం బుడిగి పాఱుభీతజనంబులును, దఱిసినం దూపుల నేయ వలను
గామింజేసి గదల నడిచియుఁ దలపట్టి యీడ్చియుఁ గరవాల మెత్తినం బలుక
గొని దానిం జడియుచు వెనుదీయక వాడిమిం బేర్చి చిక్కినవారితలలేఱుజగజె
ట్లునునై, పరమాభీలంబై, ధరణీపరాగం బెగసి మగిడి గజవాజినరగాత్రనిస్సర
ద్రుధిరపూరమునఁ బంకిలంబై, ఘోరప్రకారంబై యుండునంత ధృష్టద్యుమ్నుఁ
డిదె ద్రోణుం బట్టెఁగఁ దఱె యని తమవారికిఁ జేయి వీచి యాచార్యుం బట్టుఁడు
పొదువుఁడు తఱుముఁ డఱుముఁడు వెఱవం బనిలేదని పలుకుచు నప్పటి కెదిర్చి
నదుర్ధర్షుతేరిపయిం గవియుటయు ద్రోణకృపకర్ణద్రౌణిజయద్రథ విందానువిం
దులు క్షాత్రధర్మంబుఁ దలపోసి పాంచాలపాండవసైనికులం దాఁకినం బరమాభీ
లసమ్మర్దం బయ్యె. అంతలోన గాండీవి సుశర్మాదు లగుసంశప్తకులను నారాయణ
గోపాలురనుం గెలిచి శోణితనదీప్రవాహంబు నిస్తరించి యస్త్రగభస్తిచయమున
సంశప్తకసాగరంబు వఱునట్లుగొల్పి యుగాంతాదిత్యుం గ్రేణిసేయుచు ద్రోణా
దిమహారథపీడ్యమానం బై ననిజసైన్యంబుఁ గాచువాఁడై కేతనకపిప్రభ లరాతు
లచూడ్కులు మిఱుమిట్లుగొలుప మనవారిపయిం గవిసి తీవ్రాస్త్రజాలంబు నిగి
డించినం గజాశ్వరథయోధులు తద్బాణవిద్ధులై కడు నొచ్చి సిగలు జాఱ వైచి
యు వెఱచియు విచ్చిపఱచియు వీఁపుఁ జూపియుఁ బరాఙ్ముఖవధంబు క్షాత్రధర్మ
నిందితం బని యమ్మేటివిల్కాఁడొప్పరికించినం బాఱి యోకర్ణకర్ణా, దీనదశకు
వచ్చినమమ్ముఁ గావు మని మొఱ పెట్టికొనిరి.

### కర్ణార్జునులయుద్ధము.

కౌరవసైనికు లట్లు మొఱ పెట్టిన నారాధేయుండు క్రోధవిధేయుండై
యమ్మధ్యమపాండవేయుం దాఁకి యాగ్నేయాస్త్రం బేసిన నాదివ్యాస్త్రవిదుఁడు
వారుణాస్త్రమున దానిం బ్రతిహతంబుఁ గావించి శరనికరంబుఁ బరఁగించి సింహ
నాదంబు సేయుచున్నంత భీమసాత్యకిధృష్టద్యుమ్ను లాద్యుమణితనూభవుపై
నడరి వేఱువేఱ మూఁడువాఁడికోల లేయుటయు నాకర్ణుఁ డుదీర్ణరోషుండై సవ్య
సాచిమార్గణగణంబుల వారించి యమ్ముగురుదొరలవిండ్లు మూడునుం దుత్తుని
యలు చేసె. కృత్తకార్ముకులై యమ్ముగ్గురు కోఱలుపెఱికినపాములపగిదిం జూప
ట్టి కోపానలదహ్యమానులై శక్తులం బ్రయోగించిన నాశక్తిత్రయంబును
వైకర్తనుండు మూటఁ దున్మి యార్చి పేర్చి యర్జును నెదిర్చి సాయకానీకం బడ
రించినం గోపించి యప్పాండవమధ్యముండు శరసప్తకంబున నాసూతసుతుని నొంచి
యాఱింట శత్రుంజయుంజంపి యొక్కభల్లమున విపాటునిశిరఃపాటనంబు గావించి
కర్ణుండు సూచుచుండఁగనె వానితమ్ముల ముగ్గురం బిలుకుమార్చె. భీముఁ

డప్పుడు తేరు డిగి కర్ణునిసహాయులం బదివేవురఁ గరవాలంబున నఱికి తే రెక్కి యొండువిల్లెత్తి బాణదశకంబును గర్ణునిమేన నాటి మైదింట గుఱ్ఱముల నొప్పించె. ధృష్టద్యుమ్నుఁడును వాలు బలుకయుం బూని తేరు డిగి చంద్రవర్మబృహత్క్షత్రులతలలు దఱిగి మగిడి రథస్థుండై యొండుకోదండంబుఁ గొని డెబ్బదిమూఁడువాఁడితూపులఁ గర్ణునిపై నడరించె. సాత్యకియుఁ గార్ముకాంతరంబు గ్రహించి యఱువదినాలుగుబలుతూపులఁ గర్ణుం గాఁడ నేసి యార్చి భల్లద్వయమున శరాసనముఁ దునుమాడి వెండియు రెండుకాండముల తనిభుజద్వయమునను నొక్కవాలికతూపు వక్షోభాగముననుం గీలించి నొంచుచున్నంత ద్రోణదుర్యోధనజయద్రథులు సాత్యకిసాగరమున మునుఁగుచున్న కర్ణు నుద్ధరించిరి. భీమార్జుననకులసహదేవాభిమన్యుధృష్టద్యుమ్నులు సాత్యకికిఁ గావలియై ద్రోణాదుల మార్కొనినం బరమదారుణం బయినరణంబు సెల్లె. రథికులఁ గవిసియురథికులును, నేనుంగులపై నడరునేనుంగులును, గుఱ్ఱముల మార్కొను గుఱ్ఱములును, గాలుమానుసులం దలపడుకాలుమానుసులును, గుఱ్ఱములు నేనుఁగులుఁ గాలుమానసులుం గవిసినతేరులును, దేరులును గుఱ్ఱములును నేనుంగులుం దలపడినకాలుమానుసులును, గాలుమానుసులు తేరులు గుఱ్ఱములునుం బ్రతిఘటించినయేనుంగులును, నేనుంగులును దేరులును గాలుమానుసులుం గవిసినగుఱ్ఱములును, గుఱ్ఱములు నేనుంగులునుం దలపడినరథపదాతిచయంబులును, రథపదాతిచయంబులం బ్రతిఘటించినగజవాజినికరంబులును, గజరథగణంబుల మార్కొన్నహయపదాతివర్గంబులును, గజపదాతివ్రాతంబులు కవిసినహయరథంబులునై, వీడంబోక పెనంగుచున్నంతఁ గమలబాంధవుం డపరగిరిశిఖరంబుమాటున కరుగుటయు మనవారు గాండీవికోత్తలకు వెఱచి యుద్ధావహారంబ యప్పటికి మే లని భావించి యాచార్యుననుమతంబున సేనలఁ దివియించి యద్దిరా! యర్జుననివిలువిద్య నేర్పింత యొప్పునే యతనిపయిం గేశవునకుఁ జెలిమి యిట్టు లవాఙ్మనసగోచరంబై యుండునే యనిపొగడుచుఁ జింతాదూయమానమానసులై యున్నతమవారు కొలిచి పరివేష్టించిరాఁగ నిజశిబిరమునకుఁ జనిరి. పాండవులును సేనలఁ దివియించి ముదంబునం బొదలుచు నాత్మశిబిరమున కరిగిరి.

## ద్రోణాచార్యుని మూఁడవనాఁటియుద్ధము.

అంత నమ్మఱునాఁటివేకువన లేచి నీకొడుకు దుర్యోధనుండు శత్రువుల యేపునకుఁ జింతాదూనమానసుండై ప్రణయాభిమానంబులు దనమనంబుఁ ద్రిప్పఁగ నందఱు వినంగ సంరంభవశుండై యిట్లనియె. ద్విజోత్తమా,నీకు మేము నిక్కవంబుగ ద్వేష్యులముగాఁబోలు. కాకుండిన సమీపగతుం డైనయుధిష్ఠి

రునిఁ బట్టక విడుతువె? పట్టనవలయు నని నీచిత్తమునఁ గోర్కి గలుగునేని డాయ వచ్చినయతం డెట్లు తప్పించికొనిపోవ నేర్చు? పాండవులకా దింద్రాదులైనను నీనిగ్రహింపఁదలఁచినవానిఁ దప్పింపఁజాల రని నే నెఱుంగుదు. ప్రీతుండవై నాకుఁ దొలుత వరం బొసంగి పదంపడి యట్లు చేయకునికి పాడియే? ఆర్యులు భక్తుల కాశాభంగముఁ గావింప రని నేఁ జెప్పవలయునే యనుటయు లజ్జితుండై భారద్వాజుండు దుర్యోధనున కిట్లనియె. ఎల్లకాలము నీకు మేలు చేయం గడంగుచున్నన న్నిట్టు లనఁ దగునే. దేవదానవగంధర్వయక్షరాక్షసాదులును గాండీవిపాలితుని నిగ్రహింపనేరరు. అమ్మేటివిల్కానిబీరంబు నీకుం దెలియు. అతనికి జగదధీశ్వరుండు తోడయియున్నవాఁడు. అతని మార్కొనఁ బరమేశ్వరుండు దక్క నొండొక్కరుండు వలంతి గాఁడు. నాపలుకు లెన్నఁడు నసత్యంబులు గావు. తెలిసి తెలిసి న న్నేలయిట్లు తూలనాడెదవు. నేఁటికయ్యమున వారిలో నుత్తమమహారథు నొక్కనిం గూల్పఁగఁ గడంగెద. సురలకు నభేద్యం బయినవ్యూహం బమర్చెద. నేఁడును సవ్యసాచి నొండువలనికిఁ గొనిపోవఁ దగువారలఁ బంపుము. అతం డుండునేని యేవ్యూహమునైనను భేదింపఁజాలును. అతం డెఱుంగనిసంగ్రామరహస్యంబొక్కటియేనియుం గలుగదనుటయు సంశప్తకులు మేముదక్క లాఁతులు గాండీవి నొండుకడకుం గొనిపోవఁ జాలగు. కావున నేమ యప్పని చేయుదుమని పలికి తత్ప్రకారంబున సేనాదక్షిణభాగమునఁ ద్రిగర్తసేనల నమర్చి విప్వచ్చుం జివ్వకుఁ జీరిన నతండు వారలం గవిసి యశ్రుతదృష్టపూర్వంబు నద్భుతావహంబు నగునాహవంబు సలిపె. అట్లు క్రీడి యొండువలనికిఁ బోవుటయు నిక్కడ మన వారు సైన్యసమేతులై పొలకలనికి నడిచి యాచార్యుండు పన్నినపద్మవ్యూహమున సురక్షితులై యుండఁ బాండవులు సకలసేనాసమేతులై యనికి వచ్చి యభేద్యం బయినయప్పద్మవ్యూహంబుఁ జించి చొరనేరకున్నంత ధర్మరాజువచనంబున నభిమన్యుండు మధ్యందినమార్తండునివిధమున వెలుంగుచు నావ్యూహంబు భేదించి యితరదుష్కరం బయినవీరకర్మం బాచరించి బృహద్బలప్రముఖు లగు యోధవీరుల వధించి గురుకర్ణప్రముఖు లగునాఱుగురుమహారథులు చుట్టు ముట్టి వంచనమైఁదన్ను విరథుం జేసిన నేలకు డిగి గదాపాణియై దుశ్శాసనునుతుతోడం బోరి వానిం జంపి తత్ప్రహారమునఁ దానును గతాసుఁ డగుటయు మనవారు ముదమునం బొదలిరి. పాండవులు శోకార్తులై నాఁటికయ్యముఁ జాలించి శిబిరములకరిగి రని యభిమన్యువధం బెఱింగించిన విని యాంబికేయుండు సంజయునకిట్లనియె.

**ధృతరాష్ట్రుఁ డభిమన్యుమరణమునకుఁ జింతిల్లుట.**

సూతపుత్రా, యప్రాప్తయౌవనుఁ డైనయబ్బాలునిఁ బెక్కండ్రు మహా

రథు లెట్టు లక్కటికంబు మాని చుట్టు ముట్టి వధియించిరి? ఆకుమారుండు దెగ టారె నని విన్నంతన నాగుండియ లవియుచున్నవి. అక్కటా! ధర్మశాస్త్రాచార్యులు క్షత్రధర్మం బింతకష్టముగ విధించిరే. రాజ్యకాంక్షం జేసి శూరు లందఱు బాలుం డనివిచారింపక యత్యంతసుకుమారుం డైన యాకుమారుం బరిమార్చిరిగదా. అతనిసమరవిహారంబైనం దేటపడం జెప్పుమనియడుగుటయు సంజయుండు రాజ పుంగవా, యబాలవిక్రముం డైనయబ్బాలునివిక్రమవిలాసంబు చెప్పం గొలంది గాదు. అతండు కొల్తలు సేయంగ మనమూంకలు కార్చిచ్చుపొదివినశుష్కతృణ పుంజములచందమున నేపు దఱిగె. పాండవు లేవురును గృష్ణుండును సంగరోద గ్రులు జితశ్రములు సురలకు నవిజేయులు సత్వకర్మాన్వయబుద్ధికీర్తియశశ్శ్రీసంప న్నులు. వారికి సరివచ్చువాం డింతకు లేడింకనుం గలుగడు. అందు ధర్మరాజు సత్యధర్మనిరతుం డనియు శమదమవిప్రార్చనాదినిఖిలగుణసమంచితుం డనియు దేవ తలును బొగడ నెగడినవాడు. భీమసేనుండు మహాబలకోపసమగ్రుండు. ప్రళయకా లాంతకుండును జామదగ్న్యుండును రథస్థుం డైనభీమసేనుండును సమాను లని యం దఱుం జెప్పుదురు. ప్రతిజ్ఞాకర్మదక్షుం డైనగాండీవికిం దుల్యుం డెచ్చోటనుం గానంబ డండు. దమవినయస్థైర్యశౌర్యౌదార్యగురువాత్సల్యంబు లనునాఱును నకులునియం దునుప్రతిష్ఠితంబులు. సహదేవుండు శ్రుతగాంభీర్యమాధుర్యసత్వరూపవిక్రమముల నశ్వినులకు సమానుండు. పాండవులకుం గలయీగుణములెల్లను గృష్ణునియెడం గలసకలగుణంబులును సౌభద్రునెడం గూడియున్నవి. అక్కుమారుండు ధైర్య మున యుధిష్ఠిరునకును సచ్చరిత్రమునం గృష్ణునకును భీమకర్మమున భీమునకును రూపవిక్రమశ్రుతముల ధనంజయునకును వినయమునం గవలకును సరివచ్చువాండు పలువురచేం దెగె. అందులకు వగచినం బ్రయోజనంబు పుట్టదు. శోకము విడిచి సుస్థిరుండవై సమరప్రకారం బాకర్ణింపు మని ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె.

### ద్రోణాచార్యుండు పద్మవ్యూహం బమర్చుట.

అవ్విధమున నాచార్యుండు పద్మవ్యూహముం బన్నునెడ వివిధదేశాధీశు లగురాజులు తేఁకులును, రక్తమాల్యాంబరభూషణమండితులు చందనాంగరాగ లేపసురభిగాత్రులు లక్ష్మణకుమారపురస్సరు లన్యోన్యసమసుఖదుఃఖులు పరస్ప రతుల్యసాహసులు మిథస్స్పర్ధాగరిష్ఠు లితరేతరహితాచరణనిరతులు నగుపదివేవు రు రాజకుమారులు కింజల్కంబులును, గర్ణదుశ్శాసనకృపప్రముఖమహారథపరివృ తుండై రారాజు కర్ణికయునుంగా నభేద్యభంగి వ్యూహం బమర్చి శ్వేతాతపత్ర భాసురుండై యుద్యతకార్ముకుండై యుదితార్కుం గ్రేణిసేయుచుం గుంభసంభ వుండు దానుసేనాగ్రంబునం బొలిచి ద్వారదేశంబున సైంధవుని నతనికిం గావలి

గా శల్యాశ్వత్థామభూరిశ్రవఃప్రభృతుల నిరుగెలంకులను నిలిపి మోహరించి క య్యమునకుఁ గట్టాయితంబై యుండునంతఁ బాండవయోధులును సాత్యకిచేకితాన ధృష్టద్యుమ్నులును ద్రుపదవిరాటకుంతిభోజులును సౌభద్రదక్షత్రధర్మబృహత్క్ష త్రులును మాద్రేయఘటోత్కచధృష్టకేతులును శిఖండియుధామన్యూత్తమౌజు లును ద్రౌపదేయకేకయసృంజయగణంబును యుధిష్ఠిరభీమసేనపురస్సరులై యనికి నడతెంచి భారద్వాజుం దాఁకిన శౌర్యధుర్యుం డైనయయ్యాచార్యుండు వివిధశర వ్రాతం బడరించి ప్రవాహమునకుఁ గొండయు సాగరంబునకు వేలయు నెట్టుల ట్టుల నిలువరించుటయు గురుశరార్దితులై యమ్మహారథు లందఱును నయ్యతిర థోత్తము నెదుర నిలువ నోడిరి. అప్రతిహతభుజబలవీర్యమునఁ దీండ్రించుచు న్నయాచార్యుం జూచి ధర్మరాజు పలుదెఱంగుల వితర్కించి యెట్టును నాద్వి జోత్తముం జెనక నేరక కృష్ణార్జునుల కెందునుం దక్కవగానియభిమన్యుండ యిప్పుడు గురునికోల్తల కోహటింపక రిపుబలంబుల సమయింపఁ జాలినవాఁడని తనలో నిశ్చయించి యక్కుమారున కిట్లనియె.

## ధర్మజుఁ డభిమన్యునిఁ బద్మవ్యూహము భేదింపు మనిచెప్పుట.

కుమారా, ధనంజయుండు వచ్చి మనలఁ గేరడంబులు పలుకనివిధంబుఁ జూడుము. ఆచార్యకల్పితం బయినయిప్పద్మవ్యూహంబు భేదింపఁ గృష్ణుఁడొండె నర్జునుఁడొండెఁ బ్రద్యుమ్నుఁడొండె నీవొండె నేర్తురు. తక్కినవార లెవ్వరు నెఱుంగరు. నీతండ్రులును మేనమామలును సకలసైనికులును నీవలన నీవరముఁ బడయ నున్నవారలు. కావున రయమున నిమ్మహావ్యూహంబు భేదించి ద్రోణా నీకంబుపయిం దలపడి విక్రమంబు సూపు మనిన యుధిష్ఠిరున కభిమన్యుఁ డిట్ల నియె. మీజయంబుఁ గోరి నేను బద్మవ్యూహంబు భేదించి ద్రోణానీకంబు సొచ్చి విక్రమించెద. తొల్లి యొక్కనాఁడు మాతండ్రివలనఁ బద్మవ్యూహంబు భేదించు తెఱం గెఱింగితిఁగాని డెప్పరంబు చొప్పడినచోఁ గ్రమ్మఱి వచ్చుతెరువుఁ దెలియ నమ్మెద ననవుడు ధర్మరాజు మహారథోత్తమా, నీవు మొన సించి త్రోవ చేసి తేని యాతెరువున మే మందఱమును నీకుఁ గావలియై వెంట వత్తు మనుచు న్నంత భీముఁ డిట్లనియె. కుమారా, నీ వించుక త్రోవ చూపిన నీవెంట నేనును సాత్యకిధృష్టద్యుమ్నులును మత్స్యకేకయపాంచాలప్రభద్రకయోధులునుం జొ చ్చి మేటిశూరులతల లేటియేటి యయ్యనీకంబు చీకాకుపడం జేయుదు మనుట యు నభిమన్యుఁడు వెండియు నిట్లనియె. ఏను దురాసదం బైనద్రోణానీకంబు జ్వలితాగ్నిం జొచ్చుపతంగంబుభంగిం జొచ్చి మాతృపితృకులంబులు రెంటికినిం గీర్తిఁ గావించి తండ్రికిని మేనమామకును బ్రీతి యొనరించెద. అతిరథోత్తమగు త్తం బయినకౌరవసైన్యసాగరంబు నెక్కుబాలుండు గలంచె నని చూచుఖేచరులు

నన్నుఁ గొనియాడునట్లు కోలుమసంగెద. అర్జునుఁడును సుభద్రయును నన్నుఁ గొడుకుఁగాఁ బడసినందుల కింత చేయఁ జాలకుండుదునే? నన్ను మార్కొనినప గతుఁడు ప్రాణములతోడఁ బోవనేరఁడు. నేఁ డరాతిసైన్యంబు నేలకుఁ గోలకుం దేకుండిన నే నర్జునాత్మజుండఁ గాను. పెక్కు లేల యనుచున్నంత ధర్మరాజు కుమారా, యిట్టులు పలుకుచున్ననీకు బలోత్సాహంబులు పెంపెసఁగుఁగాత. వసురుద్రాదిత్యసాధ్యమరుత్కల్పు లయినమహావీరులు పాలింప దురాసదం బైన ద్రోణానీకంబు భేదింపు మనుటయు నాసుభద్రానందనుండు శౌర్యసముద్రి క్తుండై సారథిం బిలిచి సుమిత్రా, మనతేరు రయమున ద్రోణసేనపయిం బఱపు మనిన నాసుమిత్రుఁ డోయాయుష్మంతుఁడా, పాండవులు నీపయిం బెద్దమో పెత్తిరి. లెస్సగ బుద్ధిం బరిశీలించి యటఁ బోరుట తగును. ఆచార్యుండు దివ్యా స్త్రవిదుఁడు జితశ్రముఁడు. నీవు యుద్ధవిశారదుఁడవైనం బాలుఁడవు. పరమసు కుమారుండవు. నీకుఁ దెలియనిది నేఁ జెప్పవాఁడనె? నీవ చింతింపు మనిన సార థికి సౌభద్రుఁ డిట్లనియె. సుమిత్రా, ద్రోణుఁ డనఁగ నెంతవాఁడు. ఈయున్న రాజు లందఱును నైరావతారూఢుండై దేవగణసమన్వితుఁ డైనదేవేంద్రుఁడు నెత్తివచ్చినను నేను గెలువఁ జాలుదు. ఈరిపుసైన్యమంతయు నావిక్రమంబునఁ బదునాఱవపాలిది గానేరదు. కృష్ణార్జును లిద్దఱుఁ దామ యెదిర్చిననుం బిఱుదీ యక పోరాడఁ జాలుదు. పదపద యని సారథిం దఱిమి యతనిమాటలు గీటునం బుచ్చిన నాసారథి నాతిముదితచిత్తుండై కాంచనాలంకారభాసురంబు లయిన రథ్యములఁ బఱపె.

### అభిమన్యుఁడు పద్మవ్యూహము భేదించుట.

అవ్విధమున నభిమన్యుఁడు కనకకర్ణికారకేతనాభిరామంబుగా మత్త శుండాలంబులపయిం గవియుసింహకిశోరంబుచందమున బరవసంబు చేసి ద్రోణా దులపయి నడరిన వారుం దలపడుటయు నత్తఱి సంపూర్ణగంగాప్రవాహము గలిసినసాగరంబుభంగి ముహూర్తమాత్రం బత్యంతతుములంబయియుండ నభే ద్యం బగునాపద్మవ్యూహంబు మొనఁ జించి ప్రవేశించుటయు మనశూరులు నానా వాదిత్రనిర్ఘోషంబులును, సింహనాదంబులును, భుజాస్ఫాలనంబులును, మౌర్వీ గుణక్వాణనంబులును, హలహలాశబ్దంబులును, నిలుము నిలుము పోవల దిదే నే నిక్కడ నున్నవాఁడ వాడిమిం జూపు మనునెలుంగులును, గరిబృంహితంబు లును, ఘోటకహేషితంబులును, రథనేమినిస్వనంబులును, కేతనకింకిణీజాలశిం జితంబులును, నింగి ముట్టఁ బుడమి యద్రువ నతనిం దాఁకిన నక్కుమారకంఠీ రవుం డకుంఠవిక్రమమున నలిరేఁగి మర్మభేదనకర్మఠంబు లైనతీవ్రమార్గణ గణంబులఁ గురిసినం గురుసైనికు లగ్గిం బడినమిడుతలట్లు మడియుచుండిరి.

ఏమిచెప్పుదు. మనసైన్యంబునఁ బన్నగంబులపైఁ గవియువైనతేయునిచాడ్పునను, దానవసంహారోద్యతుం డైనవిష్ణుదేవునివిధంబునను, లయసమయమున జగము లుపసంహరించుశూలపాణిభంగినిం గోలుమసంగి రౌద్రరససముద్రేకబంధురుం డైనయాసౌభద్రునిపటుప్రదరనికరంబు తాఁకునం జేసి దైన్యంబుఁ జెందినమన సైన్యంబునఁ బొడిమైనకత్తళంబులును, దునియలైనబొమిడికంబులును, విఱిగినధనుర్బాణచర్మకృపాణతోమర పరశుముసలముద్గలభిండివాలశక్తిగదాదిహేతి సంఘాతంబులును, దెగియుఁ జారుమణికిరీటకుండలమండితంబులై యమర్షవశమున నవుడుగఱచుటను బొమముడిపాటును విడువనిరక్తసిక్తవీరయోధమస్తకంబులును, దుత్తుమురై గంధర్వనగరాకారంబు లయినతేరులసర్వోపకరణంబులును, గూలినయేనుంగులును, నలఁగినఘంటావిషాణగ్రైవేయకకక్ష్యాకంబళాదులును, మడిసిననానాదేశోద్భవోత్తమాశ్వంబులును, గ్రుడ్లు తేలగిలఁబడ నాలుకలు వెలికిరాఁగఁ దెగటారినహయారోహులును, జచ్చినకాలుమానుసులతిట్టలును, జుట్టలై పడినప్రేవులప్రోవులును, నఱవఱలయినఛత్రచామరంబులును, దుమురైనపడగలునుంగా, సంగ్రామరంగంబు రౌద్రభీభత్సంబై, గజవాజిపదాతివ్రాతగాత్రనిస్సరద్రుధిరధారాప్రవాహఘోరంబై కుశపరిస్తృతం బయినయధ్వరవేదివిధమున నభిరామంబునై కన్పట్టె. అట్లు క్రౌంచదారణుండు తెరలించినయసురసేనవిధమునను మందరంబు గలఁచినసాగరంబుచందమునను నభిమన్యుని కోల్తలకోహటించి, తిరుగుడువడినకురుసైన్యంబున మనయోధులు నోళ్లను బెదవులు నెండఁగ నొడళ్లు సెమర్పఁగఁ గాలుసేతులు దడఁబడఁ బులకలు ప్రొడమ నుత్సాహంబు దఱిఁగి సాహసముఁ దొఱఁగి బీరంబు వీటిఁబుచ్చి కడు నొచ్చి నామగోత్రములఁ బేరెలుంగునం జెప్పి తమవారలఁ జీరుచు వెఱచఱచియు విచ్చి పఱచియు దీనదశకు వచ్చినం జూచి సుయోధనుండు తా నక్కుమారశూరుం దాఁకె. అప్పు డాచార్యుఁడు రాజుం గావఁగ నందఱు నభిమన్యుపై నడరుఁ డని పలికి తాను నతనిమీఁదఁ గవియుటయుఁ గృపాశ్వత్థామకర్ణకృతవర్మశకునిబృహద్బలశలశల్యసోమదత్తిపౌరవవృషసేను లొక్కపెట్టయయ్యర్జునాత్మజుం దాఁకి నిశిత శరజాలంబుఁ గురిసి వెగడుపఱిచి క్రోల్పులుల నోటికండను బెఱికినట్లు నేర్పున రారాజు నతనిబారిం బడి మడియకుండఁ దప్పించిరి. అందుల కెంతయుం గినిసి సౌభద్రుఁడు పటుప్రదరనికరంబుఁ బరఁగించి యావిలుకాండ్ర నెల్లఁ గలగుండుపఱిచి యార్చి పేర్చుటయు నయ్యార్పున కలిగి ద్రోణప్రముఖు లగుమనమహారథు లందఱు నొక్కుమ్మడి నతనిం జుట్టుముట్టినానాలింగము లగునిషుజాలము లడరించిన నభిమన్యుండు తద్బాణములనెల్ల నంతరిక్షమునఁ దుత్తుమురు గావించి పెక్కుతూపులఁ దద్గాత్రంబుల నాటుటయుఁ జూపఱద్భుతం బందిరి. దానం

గోపించి మనవారు వానిం జంపువారై పఱపుఁ గొన్న సంభ్రమచందమునఁ జుట్టును ముట్టి సిఱుతివియక కోలల నేసిన నంమల కోహటింపక యక్కుమా రుండు సముద్రమునకుఁ జెలియలికట్టవ్రాలె వారి కడ్డంబై యాఁగి పోరుచు న్నంత దుస్సహుఁడు తొమ్మిదింటిని, దుశ్శాసనుఁడు పండ్రెంటిని, శారద్వతుండు మూటిని, ద్రోణుఁడు పదునేడింటిని, ద్రోణపుత్రకృతవర్మలు వేఱువేఱ యేడిం టిని వివింశతిడెబ్బదింటిని, బృహద్బలుఁ డెనిమిదింటిని, మద్రపతి యాఱింటిని, శకునిభూరిశ్రవులు వేఱువేఱ మూఁడింటిని, నిశితబాణము లేసిన నక్కుమారకం తీరవుం డుక్కు మిగిలి స్రుక్కక యక్కోదండధరుల నందఱను మూడుమూడు వాలమ్ముల నొంచి సమంచితశిక్షాభ్యాసంబు మెఱయఁ జలంబు నెఱయ గరుడాని లరయములు సారథివాక్యకరంబులు నగును త్తమరథ్యములనేర్పునంజేసి వివిధమం డలగతులం దిరుగుచు సమరతాండవంబు సల్పుచుండె.



అభిమన్యుఁ డశ్మకాదులఁ జంపుట.

అట్లు దనకు మాఱుమలయువారు లేమింజేసి కోలుమసంగినపార్థపుత్రు నిపై నశ్మకసూనుం డడరి పదియమ్ము లేసి నిలునిలు మనియదల్చినం గోపించి యయ్యర్జునతనూజుండు పదితూపుల సిడమును గుఱ్ఱములను సారథినిఁ గార్ముకం బును భుజద్వయమును మస్తకమును నఱికి నేలం గూల్చినమనబలంబు పలాయ నపరాయణం బయ్యె. అంత ద్రోణకృపులును గర్ణాశ్వత్థామలును శల్య శకునులును సోమదత్తభూరిశ్రవులును శలక్రాథులును వివింశతివృషసేనులును సుషేణకుండభేదులును ప్రతర్దనబృందారకులును లలిత్థప్రబాహుదీర్ఘలోచను లును దుర్యోధనపురస్కృతులై తాఁకి శరాసారంబుఁ గురిసిన నొచ్చియు నాకు మారుండు కన్నుఁగవం గెంపు సొంపార బరవసంబు సేసి కర్ణునిపై నిశితనారా చంబు బిట్టేసిన నది యతనిమఱువు వ్రచ్చి వల్మీకప్రవేశతీవ్రం బయినమహానా గంబుచాడ్పున మేను సొచ్చిన నతండు క్షితికంపంపుఁదఱిఁ గొండ యెట్టు లట్టుల కంపించె. అట్లు కర్ణుం జీకాకుపఱిచి యక్కుమారశూరుండు శరత్రయమున సు షేణదీర్ఘలోచనకుండభేదులం బరిమార్చినం గర్ణుం డంతలోనఁ దెప్పిఱిల్లి యిరువ దినారసము లయ్యింద్రనందననందనుమేనం గీలించుటయు నశ్వత్థామకృతవర్మలు నేడేసివాఁడితూపు లేసిరి. దానం గోపాటోపదీపితుండై కిరీటిపుత్రుండు చాపపా ణియై పాశహస్తుఁడై నయంతకునాకారమునఁ బొల్చి యప్పటికి డాయ వచ్చినమ ద్రపతిపై నడరి యంపసోనం గురిసి నీసేనలు వెఱవఁ బెలుచ నార్చె. శల్యుఁడు తద్బాణవిద్ధుండై స్రుక్కి తేరిపయి నొఱగఁ బడియె. తదవస్థుం డైనశల్యుంజూచి మనమూఁకలు భారద్వాజుండు సూచుచుండగనె సింగముఁ గన్న లేళ్లగమియట్టు లాకుమారుం జూడ నోడి విచ్చి పఱచిన నాజ్యాసిక్తుం డైనహుతవహుపగిదిఁ

ప్రతాపార్చిరుదగ్రుం డై నయ్యగ్గాండీవిపుత్రుని జూచుఖేచరు లగ్గించి రనుటయు వై
చిత్రవీర్యుం డు సంజయా యట్లు మనమహారథులతోడ నీడంబోవక పెనంగుచు
న్నయక్కుమారు నెవ్వరు నాఁగఁ జాలరై రొక్కో యనవుడు సంజయుఁడు ధృతరా
ష్ట్రున కిట్లనియె. అట్లు శల్యుఁడు మూర్ఛిల్లినం గోపించి వానితమ్ముఁడు పటుశరములఁ
గురియుచు నభిమన్యుపైఁ దలపడిన నమ్మేటిమగండు బెట్టిదంపుటమ్ముల నేసి వానికే
తనాతపత్రంబులఁ దుమురుచేసి రథోపకరణంబుల నుగ్గుగావించి విల్లు దునిమి
సారథిం గూల్చి గుఱ్ఱముల సమయించి చక్రరక్షకులఁ ద్రుంచి కాలుచేతులు
నఱికి తలఁ దఱిగిన నాశల్యానుజుండు మహామారుతభగ్నం బై నయుత్తుంగపాద
పంబుమాడ్కి నేలం గూలుటయు సకలభూతములకు నభిమన్యువిక్రమంబు మె
చ్చొనరించె. అప్పుడు శల్యుసైనికు లందఱును గొందలంబున నినుమడించినరోష
మునం బేర్చి యార్పులును హుంకారంబులును జ్యాతలనిర్ఘోషంబులును బాణశ
బ్దములును రథనేమిస్వనంబులును బార్థనందనా మమ్ము మార్కొని బ్రదికిపోవలే
వనునెలుంగులును దిశాటంబుల బీటలువాఱింప నాసుభద్రాసూనుం డాఁకిన
నవ్వీరవర్యుండు ధైర్యధుర్యుండై నవ్వుచు వాసుదేవార్జునానుగ్రహలబ్ధం బయిన
తనధనుర్విద్య నేర్పేర్పడ మృదుపూర్వముగ లఘుచిత్రాస్త్రముల నేయుచు నేదిక్కు
చూచినం దనబాణములు ధనుర్మండలస్ఫురణంబు నారిమ్రోతయునుంగా వెగడు
పఱిచి గర్జితోపమక్ష్వేళారవంబులు నిగిడించుచు శరదాగమసమయగభస్తిమాలి
మాడ్కిఁ గ్రమక్రమంబునఁ బరమదారుణుండై క్షురప్రవిపాఠనారాచార్ధచంద్రభ
ల్లాంజలికప్రముఖంబు లగువివిధబాణములం గుప్పించిచూచుచున్నయాచార్యుండు
విస్మయం బందఁగ మనవారినెల్ల విముఖులం గావించె ననిన విని ధృతరాష్ట్రుఁడు
సంజయా, నామనుమఁ డిట్లు చేఁతకు మోదంబును మనవారు పలువు రతని
నెక్కొని నాఁగఁ జాలరై రిగదా యని సిగ్గును మనంబునఁ బొడముచున్నది.
అసురసేనం గవియుకుమారులీల నలిరేఁగినయక్కుమారునియనంతరసమరప్రకా
రంబుఁ దేటపడం జెప్పు మనియడుగ సంజయుం డాంబికేయున కిట్లనియె.

దుర్యోధనుఁడు ద్రోణుం దూఱుట.

అవ్విధమున మనవారలనెల్ల విముఖులం గావించి సౌభద్రుండు గొఱవి
ద్రిప్పినచందమున నేదిక్కు చూచినం దానకా నగపడుచుఁ గోల్తల సేయుచుండ
నాచార్యుండు ప్రహర్షోత్కర్షవికస్వరలోచనుండై నీకొడుకు మర్మంబులు గాఁడి
పోవం బలుకవలయు ననుతలంపునఁ గృపాచార్యుని కిట్లనియె. చూచితే సౌభ
ద్రుండు రౌద్రరసోల్లాసభాసురుండై తండ్రులకును బంధువులకును సుహృదులకు
నుం బరమానందంబుఁ గావించుచు విక్రమించుచున్నవాఁడు. వీనికి సరివచ్చు
విలుకాఁ డొక్కఁడును లేఁడు నిక్కువంబు. మనమూఁకలనెల్ల నొక్కపెట్ట విలు

కుమార్చఁ దలంపఁడుగాని తలంచిన నంతయు విధ్వంసంబుఁ జేయనోపును. అట్లు తలంపమి మనకుఁ బెద్దమే లయ్యె నని యభిమన్యు నగ్గించి పలుకుటయు నప్పలుకులు విని దుర్యోధనుం డాచార్యు దెసం గినుక వొడమ లేనినవ్వు నవ్వుచుఁ గర్ణశల్యదుశ్శాసనబాహ్లికుల కిట్లనియె. వింటిరే గురునివచనంబు నిఖిలమూర్ధాభిషిక్తుల కాచార్యుఁ డై నయీబ్రాహ్మణోత్తముఁడు మూఢుఁ డై నయర్జునసుతుం జంపఁ దలంపఁడు. ఇతండు నిక్కంపుఁగినుక వొడమి యడరెనేని మార్కొని బ్రదుకుమనుజుండునుం బుడమిఁ గలఁడే. శిష్యుఁ డై నయర్జునుమీఁదివాత్సల్యము నం జేసి తత్పుత్రుని నో నేయ నెల్లక యప్పిన్నవాని నెంతయుఁ బెద్దచేసి పేర్కొనుచున్నవాఁడు. ఆబాలుండును బాలిశుండు గావునఁ దనకోర్తలయెల్లనాచార్యగోపనంబున సాగుచున్న దనిభావింపక యది తనబీరం బని తలంచినవాఁడు. రయమున నందఱు వానిం బొదువుఁ డనుటయు నందఱు నతనిం గవియనున్నంత దుశ్శాసనుఁ డన్న కిట్లనియె. మహారాజా, పాండవులును బాంచాలురును జూచుచుండఁగ రాహువు దివాకరుంబోలె నే నీసౌభద్రుం గప్పి తెగటార్చెద. ఇతండు దెగటారినం గృష్ణార్జునులు జీవితముల విడుతురు. కృష్ణార్జునులీల్గినం దక్కిన పాండవులు నలువురు నెక్కపూఁటలోన వారితోడిగతిం బొందుదురు. కావున వీనిం బరిమార్చుట మనకు విజయమూలంబు. నాకు మేలు గూర్చఁ గడంగుచుండుము. ఇదె నేను నీపగతుం బరిమార్చెద ననిపలికి సింహనాదంబు చేసి దుశ్శాసనుం డభిమన్యుపయిం గవిసి శరవర్షంబుఁ గురిసిన నక్కుమారుండు వానియమ్ములనెల్లఁ బ్రతివిశిఖములఁ బొడవడంగించి యిరువదియాఱువాలమ్ము లతనిమేనం గీలించినం గోపించి నీకొడుకు మత్తశుండాలంబుమాడ్కిఁ బిఱుదివియక పైపై నడరుటయు నక్కుమారుఁడునుం దోడ్తోడ వాఁడివాలమ్ములఁ గురియుటయు రథశిక్షావిశారదు లగునయ్యిరువురకుఁ బోరు ఘోరం బయ్యె.

### అభిమన్యుఁడు దుశ్శాసనుని మూర్ఛితుం జేయుట.

అట్టియెడ నేచి యభిమన్యుండు శరనికరంబుఁ బరఁగించినం దుశ్శాసనుండు తదీయశరవిద్ధుండై కాలు చే యార్పనేరక ఱిచ్చపడియుండునంత నవ్వుచు నతని కిట్లనియె. ధార్తరాష్ట్రాధమా, శూరమ్మన్యుఁడు త్యక్తధర్ముఁడు క్రూరకర్ముఁ డాక్రోశనపరుఁడు నగుని న్నాలంబునఁ జూడఁగంటి. ఆనాఁ డాసభలో ధృతరాష్ట్రుఁడు వినంగఁ బ్రల్లదంబులు పలికి ధర్మరాజును గనలించుటకు మదోన్మాదమున భీము నుల్లసం బాడుటకును గితవుఁ డగుశకునిమాయ బలముగాఁ గొనినడిపిన యాపాపపుజూదపుఁదఱి నీచేసినకొఱగాములకును బరమపతివ్రత యగుద్రౌపదీదేవిని భంగపఱుచుటకును బరవిత్తాపహారంబునకును జల్లాఱునికోపమునకును జ్ఞాననాశకం బగులోభమునకును ద్రోహాత్యాహితంబులకును సమగ్రఫలంబు

నిప్పుడు కుడువుము. మీవా రందఱుఁ జూచుచుండఁగ నిప్పుడు నిన్ను మదీయ నిశితశరజాలమున సాధుం జేసెద. తొలంగి పాఱక చక్క నిలుతువేని నాతల్లి దండ్రులబుణముఁ దీర్చుకొనియెద ననిపలికి కాలానలసదృశప్రభం బయినయొక్కవిశిఖం బరివ్రాసి దుశ్శాసనుమేను గాఁడిపోవ నేయుటయు నయ్యమ్ము వానిఁ బొమ్ముఁ దాఁకి మిట్టిపడి జత్రుదేశంబు వ్రచ్చి వల్మీకప్రవేశతీవ్రం బయినపన్నగంబుచందమునఁ జొచ్చుటయు నభిమన్యుండు వెండియుఁ గర్ణాంతాకృష్టసంహితంబు లైనయిరువదేనుబలుతూపు లడరించినం గాఢవిద్ధుండై మనదుస్ససేనుఁడు మూర్ఛిల్లి తేరిమీఁద నెఱగం బడుటయు సారథి రయమునఁ దేరు దొలఁగించె. పాండవపాంచాలాదు లందుల కెంతయు మోదమునం బొదలి పెలుచ సింహనాదము లొనరించి నానావాద్యములు మ్రోయించుచు ధర్మజభీమసేనమాద్రేయులును ద్రౌపదేయులును సాత్యకిచేకితానులును ధృష్టద్యుమ్నశిఖండులును విరాటద్రుపదులును గేకయధృష్టకేతులును బాంచాలసోమకసృంజయప్రభద్రకులును నయ్యభిమన్యునకుఁ దోడ్పడువారై యతం డరిగినత్రోవన ద్రోణానీకంబు నేలకుఁ గోలకుఁ దెచ్చుచుఁ దఱిమి వచ్చుచున్నంత దుర్యోధనుఁడు కర్ణున కిట్లనియె. రాధేయా, చూడుము. అభిమన్యుఁడు దుశ్శాసనుని మూర్ఛిల్లం జేసి తనకు మాఱుపడువారు లేమిం జేసి మనమూఁకలఁ గనుపుకొట్టుచున్నవాఁడు. అతనికి బాసటగా సింహసంహనను లగుపాండవపాంచాలమహారథులు తఱిమికొని వచ్చుచున్నారు. నీ వడ్డపడి యక్కుమారు నిలువరింపు మనియె.

### అభిమన్యుఁడు కర్ణుని నోడించుట.

అనవుడు రారాజువచనంబు విని రాధేయుండు సౌభద్రుం దాఁకి తీవ్రశరజాలంబుఁ గురిసి యతనికిఁ దోడ్పడ వచ్చుచున్నవారలపయిం బడఁ గొన్నియమ్ముల నిగిడించిన నది తన కవమానంబుగ నెంచి యభిమన్యుండు సముద్రిక్తమన్యుండై డెబ్బదిశిలీముఖములఁ గర్ణుమేనంజొనిపి ద్రోణుం దలపడుటయు నక్కుమారవీరుని మార్కొనఁగ నయ్యాచార్యుఁడుదక్క లాఁతులు చాలరైరి. అంతఁ గొంతవడికిఁ గర్ణుఁడు తెప్పిఱిల్లికొని సముదీర్ణక్రోధుండై జామదగ్న్యకరుణాలబ్ధం బయినతనయస్త్రవిద్యనే ర్పేర్పడ శస్త్రాస్త్రవర్షంబుఁ గురియుటయుఁ దదీయవిశిఖగాఢవిద్ధుండయ్యు సౌభద్రుండు చలింపక నిశితభల్లముల ద్రోణాదులవిండ్లు దునిమి ధనుర్మండలనిర్ముక్తంబు లయినయాశీవిషోపమఘోరశరముల నిగిడించి రాధేయు నిరథ్యసారథులను గేతనాతపత్రంబున నగల నేసినం గోపించి కర్ణుండు బాణపంచకంబు ఫాల్గునిమేనం గీలించె. అందులకు నత్యంతకోపాటోపదీపితుండై యర్జునతనూజుండు క్షణమాత్రలోనఁ గర్ణుకేతనకార్ముకముల నేలఁ బడం ద్రోచి శితవిశిఖమున నతని నొప్పించుటయు సౌభద్రుం బ్రశంసించునులివులు పెలుచ విన

నయ్యె. అప్పుడు కర్ణుతమ్ముఁడు ధనుష్టంకారముఁ గావించుచు నన్నరుఁ దలకడచి యర్జునతనూజున కడ్డపడి నవ్వుచు నవలీలం బదియమ్ములఁ దదీయకేతనచ్ఛత్రతు రంగసూతులం బిట్టేసి యతనిమేనం బెక్కుతూపు లడరించి నొంచిన నీకౌడుకు లుల్లసిల్లిరి. వారియుల్లాసంబునకుఁ గోపించి యక్కుమారమహారథుండు చిఱున గవు మొగమునం దళుకొత్తఁగ నవలీల నెక్కువాలికయమ్మున నక్కర్ణానుజుతల నఱకుటయు నది వాతోద్ధూతంబై గిరిశిఖరమునుండి పడుకర్ణికారపాదపంబు చందమున రథమునుండి నేలం బడియె. తమ్ముఁడు సచ్చుటకు వ్యథితచిత్తుఁడై కర్ణుఁడు కోపభరితుండై క్రమ్మఱ నభిమన్యుని మార్కొని తదీయపటువిశిఖజాల గాఢవిద్ధుండై వానియెదుర నిలువ నోడి నిపుణతురంగరయమునం జేసి యనికిఁ దొలఁగిపఱచుటయుఁ దక్కఁగలమనశూరుల నక్కుమారుండు కోల్తల నేసి తఱు ముటయు మూఁకలు వెఱచఱచి భాఱుదీఱినమిడుతలట్లు లేదిక్కు చూచిన శర మయంబై యుండఁగ నిది తెరు వనినిరూపింపనేరక విచ్చి సైంధవుమాటునకుఁ బఱచె. అంత సౌభద్రుండు శంఖముఁ బూరించివట్టియడవిపయిం బేర్చుకార్చి చ్చుచందమునఁ గురుసేనం బొదివి వివిధశితశిలీముఖములం గుప్పించి యేనుంగులఁ గూల్చియుఁ దేరుల నుగ్గుసేసియు గుఱ్ఱముల నుఱుమాడియుఁ గాలుమానుసుల నఱికియు విండ్లు దునిమియుఁ బడగలఁ బడవైచియుఁ గత్తళంబుల డుల్చియుఁ దొడవుల రాల్చియు గదల విఱిచియుఁ గరవాలంబులఁ దుమురుసల్పియుఁ దలలఁ గోసియుఁ గాలుసేతులఁ దఱిగియుఁ బీనుంగుపెంట గావించుటయు క్షణమాత్ర లోనఁ గయ్యంపునేల యగమ్యరూపం బయ్యె. నెచ్చియు నీడంబోక పెద్ద పెనం గురాజకుమారులపరస్పరాహ్వాననినదంబు భీరుభీకరంబై దారుణంబై పరఁగె. అప్పరమాభీలసమ్మర్దమున నెగసినధరణీపరాగంబు గజవాజినరగాత్రంబుల వెలు వడునెత్తురులఁ బంకిలం బగుడు నందుఁ జిక్కువడినకాళ్లు వెఱుకఁ జాలక పిఱికి పోతులు బమ్మరించుచుండునట్లు విక్రమక్రీడ సల్పి యవ్వేల్పులతేనిమనుమఁడు మధ్యాహ్నచండమార్తండుపగిది నేరికిం దేఱిచూడరాక వెలుగుచుండె ననిన విని యాంబికేయుఁడు సంజయా, యత్యంతసుకుమారుఁ డగునబ్బాలుఁ డొక్కరుఁ డరాతిసేనం జొచ్చి విక్రమించునెడఁ బాండవసైనికు లెవ్వరేనియు నతనికిఁ దోడుపడిరే యనియడుగ గావల్గణి యావిచిత్రవీర్యపుత్రున కిట్లనియె.

## సైంధవుఁడు పద్మవ్యూహము సొచ్చుపాండవుల వారించుట.

అక్కుమారకంఠీరవునకుఁ దోడుపడువారై యుధిష్ఠిరభీమసేననకులసహదే వులును శిఖండిసాత్యకిధృష్టద్యుమ్నధృష్టకేతులును ద్రుపదవిరాటకేకయులును మాత్స్యపాంచాలకేకయాదిచమూగణములతోడ మనమూఁకలపయి నడరి కో ల్తల నేయుచుండ నీయల్లుఁడు సింధురాజు సంరంభావష్టంభసముద్రిక్తుండై తాను

వారల మార్కొని దివ్యాస్త్రగ్రామంబు గుప్పించుటయు నమ్మహారథు లందఱు నెంతకడంగియునావృద్ధక్షత్రపుత్రుం గడవఁ జాలరై రనవుడు నతం డంతకుం జాలఁగ నేతపముల నేదానముల నేహోమముల నొనరించెనో కోపోద్దీపితులై యడరినపాండురాజపుత్రుల నతం డాఁగె ననఁగ నబ్బురం బయ్యెడి. అందులకుం గతం బెయ్యది యని సంజయు నడిగినధృతరాష్ట్రున కతం డిట్లనియె. పార్థివాగ్రణీ, పాండవులవనవాసంపుఁదఱి వారు వేఁటకుం బోవఁగఁ బాంచాలి నపహరించినకతన భీమసేనుండు తన్నుఁ బరిభవించుటకు సంతప్తచిత్తుండై సైంధవుఁడు పాండవుల నెల్లయినం గెల్తునని పూని యింద్రియముల గుదియించి యెండకు వానకు నోర్చి యాఁకలియు నీరువట్టును సైరించి కృశత్వమునకుం దలఁకక నరాలఁ గప్పి నమేనితో నెప్పి చిత్తసమాధానపూర్వకంబుగఁ దీవ్రతపమున మహాదేవునారాధించుటయు భక్తవత్సలుం డైనయప్పరమేశ్వరుం డొక్కనాఁడు కరుణించిస్వప్నాంతంబునఁ బొడగట్టి జయద్రథా, నీదపమునకు మెచ్చితి వరము వేఁడుమనవుడు నతం డద్దేవదేవునకుఁ బ్రణామంబు లాచరించి కేల్దోయి మోడ్చి దేవా, నే నుక్కుండడన పాండుపుత్రుల భండనమున నిలువరింపఁగ వరము వేఁడెద ననిన నవ్వేడికో లాలించి మహేశ్వరుండు ధనంజయుండు లేనితఱిఁ దక్కుంగలనలువుర నాఁగఁ జాలుదు వనిప్రసాదించుటయు మేల్కని జయద్రథుండు పరమముదమునం బొదలుచు వీటి కరిగె. తద్వరప్రభావమునం జేసి సైంధవుఁడు పాండవులనందఱను వారింపఁ జాలె. అతనిసమరప్రకారం బవధరింపుము. ఆసైంధవుఁడువజ్రమణిభూషితంబై జ్యోతిర్గణపరివృతం బైనగగనమండలంబున కెనవచ్చునినుపకత్తళంబు మేనం దాల్చి కిరీటకుండలాంగదాదిభూషణముల నలంకరించికొనివరాహకేతుప్రభావిభాసమానంబును విధివత్కల్పితంబునై గంధర్వనగరంబురీతిబంధురం బైన యుత్తమస్యందనం బారోహించి ఛత్రచామరాదిరాజోపచారములనొప్పి యుప్పరవీధిని వెలుంగు రేవెలుంగు తెఱంగునఁ దేజరిల్లుచు ననికి వచ్చినవాఁడు పాండవుల నాఁగి శరజాలంబులఁ బరఁగించి సౌభద్రుండు దెరల్చినపట్లు క్రమ్మఱఁ దగుమూఁకలఁ బూరించి మూఁడువాఁడితూపుల సాత్యకిని నెనిమిదిశరముల వృకోదరుని నఱువదితూపుల ధృష్టద్యుమ్నుని బదిపదియమ్ముల శిఖండివిరాటులను మార్గణపంచకమున ద్రుపదునిఁ బంచవింశతివిశిఖములఁ గేకయులనేవురను మూఁడేసిసాయకంబుల ద్రౌపదేయులను డెబ్బదివాలమ్ముల ధర్మరాజునుం బిట్టేసినం జూపఱు విస్మయం బందిరి. అందుల కోర్వక యుధిష్ఠిరుండు సితపీతవర్ణం బయిననిశితభల్లమున నవ్వుచు నవలీలం దత్కార్ముకంబుఁ దునుముటయు రెప్పపాటులోన నతం డొండువి ల్లెత్తి పదితూపులు పాండవాగ్రజుమేనం జొనిపి తక్కుంగలవారలమూఁడేసియమ్ముల నొంచినం గోపించి వృకోదరుండు నిశితభల్లత్రయమున జయద్రథు

నిఛత్ర కేతనకోదండములు దునిసిపడ నేసె. ఏయుటయుం గినుక వొడమ సింధు రాజు వేఱుచాపంబుఁ గొని రోపం బరిఁ బోసి వడముడిపడగం బడనేసి విల్లు ద్రుంచి గుఱ్ఱముల సమయించుటయు హతౄరథ్య మగురథముఁ దటాలున నెఱిఁగి గిరిశిఖరమునకు లంఘించుసింగముభంగి సాత్యకితే రెక్కె సింధుపతిపరాక్రమం బును సర్వభూతములుం బొగడె. అవ్విధమున సైంధవుఁ డడ్డపడుటం జేసి యభి మన్యుండు వ్యూహంబుఁ జించి త్రోవ చూపినను బాండవులకు వానిం గడవరా మికతన నతనికిఁ దోడ్పడ వలను గాకుండె.

అభిమన్యుఁడు కురుసేనం జీకాకుపఱుచుట.

అత్తెఱంగున నసహాయశూరుం డైనసుభద్రాకుమారుండు కోలుమసం గినం గురుసైన్యంబు దైన్యంబుఁ జెంది మహామకరంబు గలంచినసాగరంబుభంగిఁ దిరుగుడువడినం జూడనేరక కర్ణపుత్రుం డైనవృషసేనుఁ డడ్డపడి శరాసారంబునం గప్పినఁ గన్నుంగవఁ గెంపు పెంపార నిలింపపతిపౌత్రుండు వానివిల్లు దునిమి సార థితల నఱికి తద్గాత్రంబుల మార్గణంబులఁ జొనిపి నొంచినం జవనాశ్వవేగంబునఁ గయ్యమునకుఁ దొలంగుటయు నభిమన్యుసారథి తనయరదంబు నొండొక్కవల నికిం దఱిమె. అంత వసాతిప్రభుఁడు సింహవిక్రముం డైనయక్కుమారుం దాఁకి రుక్మపుంఖము లగునఱువదిశిలీముఖము లేసి యోరా యింకఁ బ్రాణముఁ దప్పిం చికొని పోవజాలుదువే యనవుఁడు నవుడుగఱచి క్రీడికొడుకు దూరపాతి యైనశి తనారాచము వానియంగంబుఁ గాఁడిపోవ నేయుటయు నత్తూపుతాఁకున నతండు నేలం బడి నీల్గె. అట్లువసాతీశ్వరుండు తెగుటయు మనవార లతనిం జంపువారై మార్వీఘోషణభీషణంబుగఁ బలువు రొక్కయుమ్మడి తలపడి పటుప్రదరంబు లడ రించిన నక్కుమారుండు నలిరేఁగి శస్త్రాస్త్రజాలంబుఁ గురిసి ఘోరప్రకారంబునం బోరి తనమునుమున నగపడ్డవారలతలలఁ దఱిగియు భుజముల నఱికియుఁ గాళ్లఁ దునిమియుఁ దొడవులు పొళ్లుచేసియుఁ గండలఁగోసియుఁ సిడములఁ బడనేసియుఁ దేరుల నుగ్గాడియు నేనుంగులఁ గూల్చియు ఘోటకంబులఁ జదిపియుఁ బదాతివ ర్గంబులఁ జెండాడియు గొడుకులు పఱియలుగావించియుఁ జామరలు దుమురుచే సియు నేదిక్కు చూచినం దానకా మెఱుఁగుమెఱసినతెఱంగునఁ గయ్యంపునేల నెల్లెడలం దిరుగుచుండ నతనిధనుర్బాణకవచకిరీటాదులరత్నకాంచనప్రభాజాలం బొక్కండ లోచనగోచరం బగుచుండెఁగాని తదీయసకలగాత్రంబులు నగపడ కుండె. సేనామధ్యమున నవ్విధమున మధ్యాహ్నమార్తండునిపగిదిఁ దేజరిల్లుచు న్నయన్నరసూనుం గన్నెత్తి చూడనైనం జాలక మనమూఁకలు బమ్మరించుచుండె. అవ్విధమున నభిమన్యుఁడు కాలపక్వభూతప్రాణములఁ గొనునంతకునివిధమునం బొలిచి శూరులయాయుస్సుఁ గొనుచు మనమూఁకలఁ గలంచుచు నసదుమెక

ము పైఁ గవియుక్రోల్పులివీఁక మెఱసి సత్యశ్రవసుం దాఁకుటయు మనమహారథు లహమహమికమై నతని మార్కొనిన నక్కుమారకంఠీరవుండు గండడరి వార్ధిమ ధ్యంబున క్షుద్రమత్స్యములం బొదువుతిమింగిలంబుభంగి నందఱం బొదివినం బెక్కండ్రు వెఱచఱచి విచ్చిపఱచుచున్నంత ధైర్యధుర్యులయినశూరులు కొందఱు మహావాతవిభ్రాంతం బగుకులపర్వతంబువిధంబున మఱలక నిలిచి యెంతవారించి యు సముద్రసంగతంబు లగునేఱులతీరున వికలం బయినసేనాగణంబు నిలువరింపఁ జాలరైరి. అప్పుడురుక్మరథనాముఁ డగుశకుఁ జేయి వీచి యోశూరులారా యే నుండఁగ మీకు వెఱవ నేల? అదె సౌభద్రుం బట్టుదు నని యెలుంగురాల్పడం జెప్పి యతనిం దలపడి మూఁడువాఁడితూపుల నురమున నాటి మూఁడేసియలుఁ గుల రెండుభుజములనుం గీలించి సింహనాదంబుఁ జేయుటయు నందుల కెంతయు నల్గి యఫల్గువీర్యుం డైనఫాల్గుని వానిబాహుద్వయంబు సాయకద్వయంబునఁ దఱిగి యాయతలోచనంబు సుందరభ్రూయుగోల్లసితంబు నగువానిమస్తకంబున ఱికె. అట్టియెడ నయ్యెడరున కలిగి కదనదుర్మదు లగుతత్సుహృదులు నూఱుగు రురాజుకుమారులు తాలమాత్రంబు లగుకోదండంబులం గొని మార్వి సారిం చుచు నతనిం జుట్టుముట్టి శరవ్రాతంబుఁ బరఁగించి రథ్యకేతనతురగసారథిసహి తంబుగఁ దద్రథంబుఁ గప్పిన నయ్యర్జుననందనుండు క్షణమాత్ర మదృశ్యుఁ డగుడు దుర్యోధనుం డతని మడిసినవానినకాఁ దలపోసి పరమామోదభరితుండై యుండె. సిడులుచూపినయేనుంగుతెఱంగున నాసౌభద్రుండు రౌద్రంబు మొగం బునం దనరఁ దపోమహిమమున నర్జునుండు తుంబురుప్రముఖగంధర్వులవలనఁ బడసినగాంధర్వమాయం బ్రయోగించినం దన్మాయాప్రభావమున వారికి దనయట్టి వారుపెక్కండ్రు గన్పట్టినతెఱం గగుడు వారు డిల్లబోయియున్నంతఁ గొఱవిద్రిప్పిన చందమునఁ దనతేరు వివిధమండలగతులం బఱపి సితశరనికరములఁ దదీయప్రాణ ములఁ బీల్చియుఁ గేతనకార్ముకాదులఁ గూల్చియు ఘోరప్రకారంబు సల్పిన నారాజకుమారులు నూఱుగురు తలలు దెగ నెత్తుటం జొత్తిలుమేనుల నెప్ప నేలం బడి మైదేండ్లకుఁ గాయుపూచినయెలమావితోఁపుచాడ్పున నొప్పిరి. అట్ల క్కుమారునిచే నమ్మద్రకుమారులు పొలియుటకును దమచతురంగసైన్యంబు ప్రక్షీణప్రాయం బవుటకును విషాదసాధ్వసావిష్టుండై దుర్యోధనుండు తాన యవ్వీరుని మార్కొని యోపినకొలంది పోరి యంతకంతక గ్గలంబగునతనివిక్ర మంబు సైరింపఁ జాలక తదీయసాయకజాలంబునఁ బెద్దయు నొచ్చి బీఱువోయి మాఱుమొగమువడి పఱచె ననిన విని ధృతరాష్ట్రుఁడు సంజయా, సౌభద్రు నొక్కనిఁ బలువురు మేటివిల్కాఱు వారింప లేరైరనిన మనంబున నమ్మిక వొ డమ దయ్యె. తప్పఁ దలంచితి నిది విచిత్రంబు గాదు ధర్మము వారల గెలిపింపఁ

గడంగియుండ సందియపడ నేల? దుర్యోధనుఁడు విముఖుండై తొలంగినపదం
పడి మనవారు సౌభద్రుని మాఱుకొనఁ జాలరై రొకో యనవుడు సంజయుఁ
డతని కిట్లనియె.

### అభిమన్యుఁడు లక్ష్మణకుమారుం జంపుట.

అత్తెఱంగునం గోలుమసంగినకిరీటినందనుముందఱ నిలువ నేరక సుహృ
త్సంబంధిబాంధవులఁ దొఱంగి వాహనములం దఱిమికొని వీరయోధులు పాఱు
చున్నంత ద్రోణకృపాశ్వత్థామశకునికృతవర్మకర్ణబృహద్బలదుర్యోధను లయ్యా
యోధనదుర్మదుం దాఁకి వానిబెట్టిదంపుటంపగములతాఁకోర్వఁ జాలక మాఱు
మొగంబు వెట్టి తొలంగుటయు దుర్యోధనసుతుం డగులక్ష్మణకుమారుండు బాల్య
దర్పమున గతభయుండై తేఁకువ మెఱసి యయ్యభిమన్యుపయిం గవియుటయుఁ
బుత్రరక్షాపరుండై కురుక్షమానాయకుండు వానికిఁ దోడ్పడినం గురుప్రముఖు
లగుమహారథవరులు మగిడి క్రీడికొడుకుపై నడరి పటుప్రదరనికరంబులు గురిసిరి.
అభిమన్యుం డంత వారలనెల్ల నిజశరసంచయంబున విష్వగ్వాతంబు పయోదప
టలంబులంబోలె నొక్కమాత్రలోనఁ దెరలించి పుట్టిననాఁటఁగోలెఁ బెద్దయు
గారామునం బెరిఁగి కుబేరసుతునకు దీటగుచున్నసీమనుమనిపైఁ గవిసి మత్తగ
జంబుపయిం గవియుగంధసింధురంబువీఁక మెఱసి యంపసోనం బరఁగించినం గినిసి
దుర్యోధనాత్మజుం డర్జునాత్మజుభుజద్వయమునందును వక్షమునందునుం దీవ్రబా
ణములు నాటె. నాటుటయుఁ గ్రీడిపట్టి కట్టియం గొట్టినపాముపగిది నలిగి బెట్టి
దుండై యోరాలక్ష్మణకుమారా, పరలోకమునకుఁ బోవ నున్నవాఁడవు గావున
నీమేనుగలయంతలోన లోకములో నందఱకు మెచ్చు గూరఁ బోరుము. ఇదె
నీవార లందఱుఁ జూచుచుండ నిన్ను జముప్రోలి కనిచెద ననిపలుకుచుఁ దో
లూఁడ్చినక్రూరపన్నగంబునుంబోని యొక్కనిశితభల్లమునఁ గుండలకిరీటోల్లసితం
బత్యంతసుందరంబు నగులక్ష్మణకుమారుతలఁ ద్రెవ్వ నఱుకుటయు హాహాకా
రంబు లెసంగె.

అవ్విధమునఁ బ్రియపుత్రుం దెగటార్చుట కభిమన్యునిపై నలిగి దుర్యో
ధనుండు వీనిం జంపుఁ డని మేటిదొరల కెలుంగు రాల్పడం జెప్పి చేయి వీచు
టయు ద్రోణకృపకర్ణాశ్వత్థామకృతవర్మబృహద్బలు లాఱుగురుదొర లతనిమీఁద
నడరి కాండజాలంబుఁ బరఁగించిన నాభండనోద్దండుండు వానికెల్ల మాఱేసి
బలుతూపు లయ్యాఱుగురుమహారథులమేనం గీలించిన వా రతనియెదుర నిలువ
నోడి మాఱుమొగంబు వెట్టిరి. అంత నభిమన్యుఁడు తమవారి కడ్డపడినసైం
ధవుం గెల్చువాఁడై తదనీకంబుమీఁదికిఁ గవియుచున్నంతఁ గ్రాథపుత్రుఁడు కా
ళింగనిషాదబలసమన్వితుండై కరిఘటలు వేనవేలుతోడరాఁగ నయ్యర్జునాత్మజుం

దాఁకి పెద్దయుఁ బోరాట పెట్టికొనుటయుఁ గడుం గోపించి సుభద్రాసూనుఁడు మహామారుతంబు మేఘజాలంబునుంబోలె నెక్కమాత్రలోనం దెరలించె. తెర లించినం గోపించి క్రాథపుత్రుండు గాండివిపుత్రుపై శరవ్రాతంబుఁ బరఁగించు చున్నంత ద్రోణాదు లగుమహారథులును గూడ ముట్టి నెట్టన బాణజాలం బడ రించిన నక్కుమారవీరుండు తన్మార్గణంబులఁ బొడవడంగించి కడంగి క్రాథపుత్రు నిధనుర్బాణంబుల నఱికి గొడుగుఁ బఱియలువాపి పడగం బడ నేసి గుఱ్ఱములఁ బరిమార్చి సారథిం దెగటార్చి కిరీటకుండలోల్లసితం బయినమస్తకంబునుం దఱు గుటయుఁ గులశీలశ్రుతకీర్తిశస్త్రాస్త్రబలముల నిక్కుమారుండు పరమోదారుండు వీనియెదుర నిలువరా దనితలఁకి కొందలం బంది మనవా రందఱుఁ దఱచుగ లేటమొగమువడి రనిన విని యాంబికేయుఁడు సంజయా, త్రిహాయనపిశంగతు రంగయోజితరథోదారుం డై నయాసుభద్రాకుమారుఁడు సంగ్రామమునఁ బిఱు తివియక కులానురూపముగ నాకసంబున నర్తనంబుఁ గావించుకై వడి నట్లు వాఁడి మిహోఁడిమి వెలుంగుచుండ మనవా రేరైన నతని నాఁగఁ జాలిరే యనవుడు సంజయుం డతని కిట్లనియె.

అభిమన్యుఁడు బృహద్బలుం జంపుట.

అట్టు లభిమన్యునికోల్తల కోహటించి మనవారు విముఖు లగుటయు ద్రోణకృపకర్ణద్రౌణిబృహద్బలకృతవర్మ లాఱుగు రతనిం దాఁకిరి. పాండవు లందఱు సింధురాజుపై నడరిన నతనికిఁ గావలిగాఁ గొంద ఱడ్డెన కరిగిరి. మఱి కొందఱు ద్రోణాదులకు బాసటవై నిలిచిరి. ఇట్లు మనసైన్యంబులు రెండు మొత్తములై పాండవచమూగణంబులను సౌభద్రునిం దలపడి పోకపెనంగు చుండ గండడరి గాండీవితనయుం డేఁబదితూపుల నాచార్యుని, నిరువదియమ్ముల బృహద్బలుని, నెనుబదియలుఁగులఁ గృతవర్మను,నఱువదికోలలఁ గృపుని, రుక్మ పుంఖములు మహావేగము లాకర్ణచోదితంబులు నగుపదిబాణముల నశ్వత్థామను, నిశితపాతం బైనయొక్కకర్ణినారాచంబునఁ గర్ణుని, నొప్పించి కృపునిగుఱ్ఱములను జక్రరక్షకులనుం గూల్చి పదియమ్ము లాగాతమునురమ్మునం గీలించి నీకొడుకు లంద ఱుంజూచుచుండఁగ బృందారకుం దెగటార్చి కోలుమసంగుటయుఁ గోపించి య శ్వత్థామ యిరువదేనుకుప్పెకోల లతనిపయిం బడనేసె. అందుల కల్గి ఫాల్గుని నీకొ డుకులు సూడఁగ నాగురుపుత్రునిమేనం బదివాఁడితూపులు కీలించిన నతండు నతనిపై నఱువదిశితకాండములం బరఁగించె. దానం జలింపక నిలింపపతిపౌ త్రుండు మైనాకశైలంబుచాడ్పున సుస్థిరుండై మీఁది కడరుచున్నంత నాచార్య పుత్రుండు డెబ్బదిరెండుశితకాండముల నేసి నొంచుటయు భారద్వాజుండును బుత్రరక్షాపరుండై కిరీటిపుత్రునిపై నూఱుతూపు లడరించుటయు నది తఱిగాఁ

గొని పితృరక్షణపరుం డైనయశ్వత్థామ యఱువదింటినిఁ గర్ణుఁ డిరువదిరెండు
భల్లంబులను గృతవర్మ పదునాలుగువాఁడికోలలను బృహద్బలుం డేఁబదిసెలక
ట్టియలను గృపాచార్యుఁడు శరదశకంబును నేసిరి. ఏయుటయు నక్కుమారపం
చాననుండు కడుం గోపించి పదిపదివాలమ్ముల వారియాయమ్ముల వాలాయమ్ము
నాఁటి కర్ణినారాచమున బృహద్బలునురమ్ముఁ గాఁడిపోవ నేసి ముహూర్తమాత్ర
లోనం దదీయరథ్యసారథికేతనకార్ముకంబుల నేలఁ బడంద్రోచిన నక్కోసలేశ్వ
రుండు విరథుండయ్యు బరవసంబుచేసి వాలుం బలుకయుం గొని యరదంబు డిగి
కవ్వడికొడుకుతలఁ ద్రెవ్వ నేయ నుంకించుచున్నంత నంతకాకారభీకరుండై యభి
మన్యుం డొక్క తీవ్రబాణమున నాకోసలపతిఱొమ్ము వ్రచ్చుటయు నాబృహద్బ
లుండు నేలం బడి గతాసుఁ డయ్యె. అంత బాణకృపాణధారులై నపదివేవురుజ
గజెట్లు పైపై నడరుటయుఁ గన్నుంగవఁ గెంపు సొంపార సౌభద్రుండు వీరో
ద్రిక్తుండై యప్పదివేవురనుం జమునికడ కనిచి యప్రతిహతప్రచారుండై తిరు
గుచుఁ గర్ణునిపై నొక్క కర్ణినారాచంబును మఱియు నేఁబదితూపులనుం బరఁగిం
చినం గినిసి రాధేయుం డన్నిమార్గణముల నేయుటయు నక్కుమారుండును జ
లంబు డింపక వెండియుం గాండజాలంబుఁ గురియుటయు నయ్యిద్దఱుశూరులు
నెత్తుటం జొత్తిల్లి పూచినమోదుగులట్లులు చూడ నొప్పిరి. అట్టియెడఁ జిత్ర
యోధు లయినకర్ణసచివు లాఱుగురు సౌభద్రుపై నడరుటయు నాబిరుదుమగం
డు వారలనెల్ల రథరథ్యసారథికేతనములతోడఁ ద్రుంచి ద్రోణాదులపైఁ బదిబది
తూపు లడరించి మగధపుత్రుం డైనయశ్వకేతుని నాఱువాలమ్ముల హయసార
థిసహితంబుగా సమయించి మార్తికావతికపతి యగుకుంజరకేతను నొక్కకుప్పె
కోలం గూల్చి తనకు మాఱుమలయువారు లేమింజేసి యగ్గలిక మెఱసి మూఁ
కలఁ జీకాకుపఱచి యార్చి పేర్చె. అప్పుడు దుశ్శాసనసుతుం డడ్డపడి హయములపై
నాలుగమ్ములను సూతునిమేన నొక్కబాణమ్మును సౌభద్రుగాత్రమున శరదశకం
బును నాటిన నల్గి ఫాల్గుని పదియమ్ముల నాదుశ్శాసనసుతుని నొప్పించి క్రోధసం
రక్తనేత్రుండై యెలుంగు రాల్పడ నిట్లనియె. ఇంతకుమున్న నీతండ్రి దుస్సే
నుఁడు నాతోడం బోరి యోడి పిఱికియై వెఱచి పఱచె. అది నీవు నెఱింగియుం
డుదువు. భాగ్యమున నీవు నాతో బవరము సేయ వచ్చితివి. తొలంగి పఱవకుం
డినఁ బ్రాణములఁ గాచికొనఁ జాల వింతయు నిక్కువం బనిచెప్పి వేణుకలితం
బైనయొక్కవాఁడికోలం గొని వానిగాత్రముఁ గాఁడిపోవ నేయుటయు నశ్వత్థామ
మూఁడుబాణంబులం దానిం దునియలు గావించె. అంత నతనిం గ్రేడించి క్రీడి
కొడుకు శల్యునిపై నడరి మూఁడువాలమ్ముల నేసిన నమ్మద్రరాజు గృధ్రపత్రాభి
రామంబు లగుతొమ్మిదితూపు లతనిపయిం బిట్టేసినం జలింపక యయ్యభిమన్యుం

డద్భుతంబు సంధిల్ల మద్రపతివిల్లు దునిమి చక్రరక్షకులం బరిమార్చి క్రూరనా రాచమ్ములా అతనిమేనుఁ గాఁడ నేసి క్రుక్కించి శత్రుంజయచంద్రకేతుమ హామేధసువర్చసూర్యభాసు లనువేవురురథికులం జంపి విక్రమతాండవంబు స ల్పుచుండె.

ద్రోణాదు లభిమన్యుని వంచనమై విరథుం జేయుట.

అయ్యవసరంబున నీమఅంది శకుని యయ్యభిమన్యునిపై మూఁడుతూపు లేసి యతం డేయుతీవ్రబాణములకు డిల్లపోయి దుర్యోధనున కిట్లనియె. ఈసౌ భద్రుని మన మందఅముం గూడ ముట్టి నొప్పింతము. ఇట్టు లింక నొక్కింతత డవు గడచిన మనల నొక్కొక్కనిఁగా నీవీర్యధుర్యుండు సంపుట నిక్కంబు. ద్రోణ కృపాదులతోడ నాలోచించి వీనిం జంపఁగ నుపాయంబు నిర్ణయింపు మనుచుం డునంతఁ గర్ణుఁడు ద్రోణున కిట్లనియె. ఆచార్యా యీకుమారశూరునిశౌర్యంబు చెప్పఁ గొలఁది గాకుండు. శీఘ్రింబ వీనిం జంపఁగ నొక్కవెరవు గలుగదేని వీఁ డెల్లవారలం దెగటార్చుట సిద్ధం బనవుడు భారద్వాజుం డిట్లనియె. కుమారుఁ డయ్యు నీరథోదారుఁ డించుకేనియు నెడ గలుగకుండ నెల్లదిక్కులం దానకా నగపడుచు శరాసారములఁ గురియుచున్నవాఁడు. ఎడ గలదేని చూడుఁడు. అద్దిరా వీనిశీఘ్రిత్వం బింతయొప్పునే. విల్లెత్తుటయు నారిసారించుటయుఁ దూపులు గొనుటయు సరిఁబోయుటయు విడుచుటయు నెప్పుడు చేయునోగాని చూచి నిరూపింప నలవి గాదు. రథప్రచారంబులం గోదండమండలం బొక్కండె కన్ప ట్టుచున్నది. ఈకుమారుఁడు దారుణసాయకంబులఁ బరఁగించి వెగడుపఱిచినను నాకుఁ బరమానందమయ్యెడి. ఇతం డెందును గాండివికిఁ దక్కువగాఁ డని తలంచెద ననుటయు నభిమన్యుబాణగాఢవిద్ధుండై రాధేయుండు రణాంగణ మునం బాఱుట మగంటిమి గాదని నిలువవలయు నని నిల్చియున్నవాఁడఁ గాని యింకొక్కింతసే పిట్లయిన విచ్చిపోవకుండఁ దీఅదు. పరమదారుణము లగు నీకుమారుమార్గణములు నాగుండియలు వ్రచ్చుచున్న వనిపలికిన నాచార్యుం డించుక నవ్వుచుఁ గర్ణున కిట్లనియె. తొల్లి నేను సవ్యసాచి కభేద్యం బయినయొ క్కకవచధారణం బుపదేశించితి. దాని నితండు తండ్రివలన నెఱింగినవాఁడుకాఁ బోలు. కావున మనయమ్ములు వాని నొంపఁ జాలవు. దానంజేసి యతండు నెవ్వక క్రొవ్వున నివ్విటిల్లి మనపైనలుఁగులసోనం బరఁగించుచున్నవాఁడు. విల్లు చేత నున్నంతకు నితనిం గెలువ దేవదానవాదులును జాలరు. ఎదిర్చి విల్లుఁ ద్రుంచుటయు నశక్యంబు. కావున వంచనమై వెనుకటిదెసకుం జని విల్లు ద్రుం చి విరథుం గావించిన నితని సాధింపవచ్చు. నీకు సమ్మతంబేని యిప్పని చేయు మనవుడుఁ గర్ణుఁడు రయమునఁ బిఱిందిదెస కొదిఁగియరిగి యభిమన్యుండు చూడ

ఖండఁగ విశిఖములఁ గురిసి విల్లు ద్రుంచుటయు నాక్షణంబ కృతవర్మ గుఱ్ఱములనుం గూల్చె. కృపుఁడు సారథిం బరిమార్చె. ఆలోన ద్రోణాశ్వత్థామశకునిదుర్యోధనప్రముఖులు విరథుఁ డనాయుధుఁడు నగునక్కుమారుపై దయ మాలి శరజాలంబుఁ గురిసినం జలింపక క్షాత్రధర్మపరిపాలనపరుండై యాసౌభద్రుండు ఖడ్గఖేటకంబుల గ్రహియించి యుప్పరమునకు లఘించి లాఘవంబు మెఱయ బలంబు నెఱయఁ గౌశికాదు లగువివిధమార్గములం జరించుచు నంతరిక్షవిహారోల్లాసనభాసురుం డైనవైనతేయునిచాడ్పున నెప్పుచున్నంత మనవారు తలలు మీఁది కెత్తి చూచుచు నెవ్వనిమీఁదం బడునో యనితలఁకుచు బాణజాలంబుఁ బరఁగించిన నబ్బాలుండు కేడెమున నాతూపులనెల్ల జదుపుచుండునంత నాచార్యుం డొక్కక్షురప్రకోలం గొని వానికరవాలంబు ముష్టికి నఱికినం జూచి రాధేయుండు శితశరసంచయంబునఁ గేడెము దునిమె. అంత నభిమన్యుండు ఖడ్గఖేటకవిరహితుండై నేలకు వచ్చి రథచక్రముం గొని ద్రోణునిపై నురువడించునెడఁ జక్రరేణూజ్జ్వలగాత్రుండై యక్కుమారుఁడు చక్రాయుధధరుం డైనవాసుదేవునికి సరివచ్చుచు ద్రోణాదు లేసినబాణములతాఁకున నెత్తుటం జొత్తిల్లి రక్తసిక్తవస్త్రధరుండై నిటలఘటితభ్రూకుటిపుటచటులుండై సింహనాదబంధురుండై దేవతలకేనియుం దేఱిచూడరాక రోషభీషణశోణలోచనుండై మారుతోద్ధూతకేశాంతుఁడై ఘోరాభిరాముండై చూడ నొప్పె. అప్పుడు మనవారు పలువురు తదీయచక్రంబు ఖండంబులు గావించి నిరాయుధుం జేసినం దలంకక యాసౌభద్రుండు తేరిమీఁద నున్నగదఁ బుచ్చికొని యశ్వత్థామపై నడరినం బ్రజ్వలితాశనిసన్నిభం బైనయయ్యుద్దండగదాదండముం జూచియాచార్యపుత్రుండు మూడడుగులక్రొలందిపిఱిందికి జరుగుటయు నతనిగుఱ్ఱములను సారథిని జక్రరక్షకులనుఁ గదకు బలి చేసి సుబలపుత్రుం డైనకాలికేయుం దెగటార్చి తదనుచరు లగుగాంధారుల డెబ్బదియేడుగురం బొలియించి బ్రహ్మవసాతీయులఁ బదుగురురథికులఁ బరిమార్చి కైకేయుల నేడుగురురథికుల సమయించి పదియేనుంగులం గూల్చి దుస్ససేనుకొడుకుతేరును గుఱ్ఱములనుం దుమురుగావించి గదావిక్రమక్రీడనంబు సల్పుచుండె.

### అభిమన్యుదుశ్శాసనసుతులిరువురుచచ్చుట.

అంత రథము డిగ్గ నుఱికి దుశ్శాసనసుతుండు గదాపాణియై యభిమన్యుని మార్కొని నిలునిలు మనియదల్చిన నయ్యర్జునసుతుండును దోడ నడరుటయు నయ్యిరువురుకుమారులు త్ర్యంబకాంధకులవీఁక మెఱసి యన్యోన్యవధకాంక్షులై యితరేతరగదాఘాతంబుల సోలి నేలకు వ్రాలిరి. అంతఁ గొంతవడికి దుస్ససేనుకొడుకు తెప్పిరిల్లికొని లేచి యభిమన్యుమస్తకంబు గదాదండమున నడిచిన

నతండు నట్లు వానిం గొట్టుటయు నిద్దఱును గతాసులై పడిరి. ఇవ్విధమున నభి
మన్యుఁడు పలువురితోడం బోరి తమ్మితీఁగం గలంచి వ్యాధగణంబులకుఁ జిక్కి నమ
త్తమాతంగంబుమాడ్కి ని వేసవితఱిం గాననం బేర్చి చల్లాఱినకార్చిచ్చుకైవడిని
నిగురుజొంపముల డొల్లిపడం జేసి యడంగినమహామారుతంబువిధమునను బీఱెండ
గాసి పడమర సేరుచుండుభానునిచాడ్పునను రాహుగ్రహగ్రస్తుం డైనచంద్రుని
చందంబునను వట్టిపోయినమున్నీటిపగిదిని మనవారలం బెక్కండ్రఁ బొరిపుచ్చి
సేనలనెల్ల నేలకుఁగోలకుఁ దెచ్చి తుదిఁ దెగి పడియె. అప్పటికిని వానినెమ్మొగమ్ము
కాకపక్షపరివృతలోచనంబై పూర్ణచంద్రప్రకాశంబై చెలువు దఱుఁగక పొలిచె.
అక్కుమారుండు పడుటకు మనవారు పరమానందమునఁ బొదలి సింహనాదం
బులు గావించిరి. లాఁతివారేడ్చిరి. అప్పు డంతరిక్షభూతము లదృశ్యములై
యక్కటకటా! ద్రోణకర్ణప్రముఖు లైనమహారథు లాఱుగురు ధర్మమునకుఁ దప్పి
వంచనఁ గొని నిస్సహాయుం డైనకుమారు నొక్కనిం జంపిరి. ఇది యధర్మంబు
దీనికి సంతసంబు దగ దని యొక్కమొగిం బలికె. అంతకుమున్ను సౌభద్రుండు
కోలుమసంగునెడఁ దెగినకుండలలోల్లసితవీరమస్తకంబులను దునిసినకిరీటంబులను
బడినపడగలను బఱియలైనగొడుగులను దుమురైనఛత్రచామరంబులను ద్రెస్సి
నభూషణగణంబులను బొడివైనహేతివ్రాతంబులను నఱవఱలైనమైమఱువుల్లను
గూలినయేనుంగులనుఁ జచ్చినగుఱ్ఱములను విఱిగినతేరులను నలఁగినపదాతికళేబ
రంబులను బాఱిననెత్తురుటేఱులను ఘోరాభిరామం బైనరణాంగణంబు సౌభద్రు
నిసుందరగాత్రమునం జేసి తారానికరబంధురంబై పూర్ణచంద్రోదయమంజులంబై
సంధ్యారాగరంజితం బైనగగనమండలంబు ననుకరించె. అవ్విధమున నప్రాప్త
యౌవనుం డైనయక్కుమారుండు పడినం బాండవచమూగణంబులు ధర్మరాజు
సూచుచుండఁగనే వెఱచఱచి విచ్చిపఱచుటయు యుధిష్ఠిరుండు బరవసంబు చేసి
చేయి వీచి మేల యూరక పఱచెదరు. అభిమన్యుండు పలువురు దన్నుఁ బొదివి
ననుం జలింపక లేటమొగంబు వెట్టక యోపినకొలంది పోరి వీరస్వర్గంబు సాధిం
చినవాఁడు. మనము నట్లె కోల్తలల సేసి పగఱ భంజింత మని మెలుంగు రాల్ప
డం జెప్పి పురికొల్పి కొండొకవడి పోరుచుండ సాయాహ్నమున మనవారు సౌభ
ద్రుబాణములఁ బెద్దయు నొచ్చినవారు గావున నాఁటికయ్యంబు సాలించి శిబిర
మున కరుగ మఱలుటయు వారలును సూర్యాస్తమయం బగుడు మాంసఖాదన
రుధిరలోలుపంబు లగుభూతభేతాళశ్రకవ్యాదాదిగణంబులయుత్సవంబు దఱియు
టయుఁ జల్లాఱినహుతవహునిచందమున నొప్పినయభిమన్యుకళేబరంబుఁ జూచుచు
శోకభారాక్రాంతులై శిబిరములకుఁ జనిరి.

అభిమన్యు మరణమునకు ధర్మరాజు దుఃఖించుట.

అట్లు కొండలంబు పెల్లున డుల్లపడినయుల్లంబుతో ఱిచ్చపడి యుధిష్ఠిరుండు శిబిరమున కరిగి యభిమన్యుపయిం దవిలినమనంబుల నొచ్చి సకలరాజులు చింతాక్రాంతులై చుట్టుం గొలిచియుండఁ బెద్దయుం బ్రొద్దు పలుకకుండి యప్పటప్పటి కగ్గలం బగువనటఁ బట్టఁ జాలక ధైర్యం బెడలి గాంభీర్యంబు సడలి యిట్లని విలపించె. అక్కటా! యత్యంతసుకుమారుం డైనకుమారుఁడు నాకుఁ బ్రియంబు సేయువాఁడై గోగణంబు సొచ్చుసింహంబు తెఱంగున నభేద్యం బగుపద్మవ్యూహంబు సించి ద్రోణానీకంబు సొచ్చి యచ్చట శూరశేఖరులనెల్ల నేలకుఁ గోలకుఁ దెచ్చి మా కత్యంతశత్రుఁ డైనదుశ్శాసనుని మూర్ఛితుం గావించి వెగడుపఱిచి బృహద్బలలక్ష్మణప్రముఖుల ననేకులఁ జంపి దుస్తరంబయి నద్రోణానీకమహార్ణవం బీఁది తుది నాదుస్ససేనుకొడుకుపా లయ్యె. ఆకుమారుం గోలుపోయి యర్జునుమొగము నే నెట్లు చూతును.? ఎంతయుం గూర్చుకొడుకును గానక యలందురుచున్నసుభద్ర నేమని చూచువాఁడను. సంశప్తకులం బొరివుచ్చి కృష్ణార్జునులు వచ్చి యభిమన్యుం గానక యడిగిన నే నేమి మాఱుపలుకువాఁడను.? అర్జునునకును నారాయణునకు నతనిచెలియలికిం బ్రియజయములఁ గోరునేన యిట్టులు విప్రియంబు చేసితి. లోభోపహతచిత్తుండు మీఁద వచ్చుచేటు పరికింపనేర్చునే? నాలోభంబ యింతకు మూలం బయ్యె. మోహమున లోభవశుఁడనై యున్నతగిరిశిఖరమున నున్నతేనెపెరం గొన నుద్యమించువాఁడు తప్పినం బొసఁగుపాటు విచారింపనివిధంబునఁ బద్మవ్యూహభేదనంబునకు సౌభద్రుం బంపితి. స్వాదుభోజ్యభోజనంబునందును నుత్తమవాహనారోహణంబునందును మేలితొడవులఁ దొడుగునెడను మృదులశయ్యాశయనంబునందునుం బంపక యుద్ధమునకుఁ బంపితి. బాలుఁడు సుకుమారుఁడు వివిధయుద్ధములఁ జూడనివాఁ డనియరయక స్వార్థపరుండనై కుమారా నీవు మొన భేదింపు మంటి. పుత్రమరణశోకార్తుం డైనబీభత్సుని వేఁడిచూడ్కిఁ జూడఁబడుబ్రతుకు కంటె వానితోడిలోకంబుఁ బొందుట మనకు మేలు. అలుబ్ధుఁడు మతిమంతుఁడు హ్రీమంతుఁడు క్షమావంతుఁడు ధైర్యవంతుఁడు శౌర్యవంతుఁడు రూపవంతుఁడు బలవంతుఁడు వపుష్మంతుఁడు మానవంతుఁడు ప్రేమవంతుఁడు సత్యవంతుఁడు నగుకుమారుం గోల్పడి యెట్లు బ్రదుకవచ్చు? మహేంద్రునకు నజేయు లైననివాతకవచపౌలోమకాలకేయులం జంపి యభయార్థుల కభయం బొసఁగి కాచి విమలయశంబున వెలసినయర్జునునికుమారునకు మూఁడినకీడుఁదప్పింప నెవరునుదోడుపడ రైరి. పుత్రవధశోకద్విగుణితక్రోధోద్భటుం డైనబీభత్సునివలనంగౌరవులకుఁ బెద్దయుం జేటు వాటిల్లకమానదు. కౌరవసాగర మింకిపోవఁ గాలంబుమూఁడె.

క్షుద్రస్వభావుఁడు క్షుద్రసహాయుఁడు నగుదుర్యోధనుఁడు గాండీవికెగ్గుచేసి తమ వారలనెల్లఁ గోల్పోయి యలఁదురి యలఁదురి తుదిఁ దానుంజచ్చుట సిద్ధంబు. విజయంబును సామ్రాజ్యంబు నింద్రపదవియుం గలిగెనేనియునప్రతిమపరాక్రముండైనయభిమన్యుండు లేకుండినం బ్రియంబు గా దని పలుదెఱంగుల వాపోవుచుండె.

వేదవ్యాసమహాముని ధర్మరాజునొద్దకు వచ్చుట.

అట్టియెడఁ బ్రత్యక్షుసర్వార్థుం డైనపారాశర్యమునీంద్రుండు విచ్చేయుటయు ధర్మరాజు విధియుతముగా నర్చించి సుఖాసీనుం గావించి శోకసంతాపమునఁ జిత్తము త్తలంపడ నిట్లనియె. మునీందా! బాలుఁడయ్యు నబాలవిక్రముఁ డయినమాయభిమన్యుఁడు నేఁడు నాపంపున నాచార్యకల్పితం బయినపద్మవ్యూహంబు సించి లోనికిఁ జొచ్చి ద్రోణాదు లగుమేటిమహారథులు పలువురు మాఱుమొగమునడునట్లు వాఁడిమిపోఁడిమి మెఱసి పెక్కండ్రం జంపి తోడ్పడఁబోవుచున్నమమ్ము సైంధవుఁ డాఁగుటయు నొక్కరుండ చిక్కినం బాడి విచారింపక గురుప్రముఖు లాఱుమారుని వంచనమైఁ జంపిరి. యుద్ధజీవులకు సమముగఁ బోరుట తగుంగాని విషమముగ నిట్లు చేఁత పోలునె? దానంజేసి నామనంబు శోకసంతాపసంతప్తంబై శాంతిం గానదయ్యె ననిన ధర్మరాజునకు వేదవ్యాసుండిట్లనియె. ధర్మనందనా, సర్వశాస్త్రములను నేర్చిమహాప్రాజ్ఞుఁడనం బొగడికఁ గన్ననీకు నిట్టులు శోకింపఁ దగునే? నీయట్టివారువ్యసనములకు మోహముఁ జెందుదు రే? బాలుఁడయ్యు సౌభద్రుఁడు పలువుర మేటిశూరులం బరిమార్చి వీరస్వర్గంబు సాధించె. అందులకును వగవం దగునే? అదియునుంగాక విధివిధానం బనుల్లంఘ్యంబు. దేవదానవగంధర్వాదులును గాలప్రాప్తం బైనమృత్యువును దప్పించుకొననేర రనవుడు ధర్మరాజు వెండియు నమ్మునికిట్లనియె. నాగాయుతబలులు వాయువేగబలులు మహాశూరులు నగురాజులు విక్రమించి జిగీషామనీషం బోరుచు హతులై నేలం బడుచున్నవారు. అట్టివీరులకుఁ జా వెట్లు కలుగునో యని సంశయం బయ్యెడి. మృత్యు వనఁగ నెయ్యది. ఎవనివలనం బుట్టినయది. ఎట్లు ప్రజల సంహరించుచున్నది. దేనం బ్రజలు సత్తురు. సవిస్తరంబుగఁ దెలుపవే యనియడిన ధర్మజునకుఁ గృష్ణద్వైపాయనుండు నృపాలా, యిందుల కొక్కయితిహాసంబుఁ జెప్పెద. అది పుత్రమరణశోకాపనోదనంబు, ధనాయుఃపుష్టిమంగళకరంబు, స్వాధ్యాయంబురీతిఁ బావనంబు. పుత్రులను రాజ్యమునుం బడయఁ గోరి ప్రతిదినంబును వఱువాత దీని వినిన మే లగు. నీకుఁ జెప్పెద వినుమని యిట్లనియె. తొల్లి కృతయుగమున నకంపనుఁ డనురాజు సంగ్రామమధ్యమున నరాతులకుఁ జిక్కియుండ నారాయణసమబలుఁడు కృతాస్త్రుఁడు మేధావియు నగునయ్యకంపనుకొడుకు హరియనువాఁడు కోట్లల చేసి యరిసైన్యంబులం

బలు దెఱంగుల దైన్యంబుఁ జెందించి పేర్చి తుదిఁ బగవారిచేఁ దెగుటయు నకం
పనుఁడు దా నుక్కుమిగిలి శత్రువులం గెలిచి కుమారునకుఁ బ్రేతకృత్యములు
నిర్వర్తించి నగరు సేరి రాజ్యవిజయంబుల సాధించియుఁ బుత్రమరణవిషాదంబు
చిత్తము నుత్తలపఱుప రేయింబవల్లు సుఖముఁ గానక యలందురుచున్నంత నార
దుండు కరుణించి వానికిఁ బొడసూపిన నారాజు విధియుతముగా నమ్మునిం బూజిం
చి తనశోకప్రకారమెల్ల నెఱింగించి నీయట్టు లడుగుటయు లతని కద్దేవముని
యీయాఖ్యానంబుఁ దెలిపె.

### నారదుఁ డకంపనునకు మృత్యూత్పత్తిక్రమంబుఁ దెలుపుట.

బ్రహ్మదేవుఁడు సృష్ట్యాదికాలమునఁ బ్రజల సృజించి నానాఁటి కెక్కుడ
గుచున్నప్రజల మోవఁజాలనిభూదేవి ప్రార్థనంబునఁ బ్రజాసంహారంబుఁ గావింపం
దలంచి యందులకుఁ దగినయుపాయంబుఁ జింతించుచున్న నవ్విరించిరోషమునం
జేసి యనలంబు పుట్టి సకలచరాచరభూతములఁ గాల్చుచున్నంత శంకరుం డప్పం
కజాసనుపాలి కరిగి ప్రజాక్షయం బుపసంహరింపుము. నీసృజించినప్రజల నీవ సంహ
రింపఁ బోలునే? ప్రజలం గావుము. ప్రసాదింపు మని శరణుసొచ్చినం బరమేష్ఠి
కామవైరిం జూచి యయ్యా కామమున నామేనఁ బుట్టిననీకోర్కిఁ దీర్పకుండ నాకుఁ
దగదు. ప్రజాసంహారంబు నాకోర్కి కాకుండినను బెద్దయుఁ బ్రేఁగు మోవఁ జాలక
యిలాదేవి వేఁడిన నవ్వేఁడికో లాలకించి యద్దేవికి మేలు సేయఁ జింతించునాకో
పమున నగ్ని పుట్టి యిట్లు జగముల నీఱుసేయుచున్న దనుటయు భూతపతి ప్రజా
పతి కిట్లనియె? దేవా, కోప ముడుగుము. ప్రసన్నుండవై చరాచరాత్మకవిశ్వం
బుఁ బ్రోచుము. నీయనుగ్రహమున నీజగమంతయు నతీతానాగతవర్తమానకా
లముల నొక్కరీతిం జెడకుండుఁగాక. నీక్రోధమునం బుట్టినయగ్ని యిట్లు జగ
మంతయు నిశ్శేషముగ నేర్చుచుండ నూరకునికి పోలునే? పోయినవారు పోయిన
నున్నవారలయినం బ్రదుకఁగ ననుగ్రహింపుము. నీనియోగమున నేను లోక
ములఁ బాలించుచున్నవాఁడ. నీవే యిట్లు చేయం గడంగిన నింక నే మనం గల
వాఁడ ననిన విని హిరణ్యగర్భుఁడు తనతేజం బుపసంహరించుటయు నయ్యగ్ని
యడంగె. అట్టియెడ నాసర్వలోకపితామహుని సకలేంద్రియద్వారంబులనుండి
రక్తజిహ్వాస్యయు నరుణాంబరయు నీలవర్ణయుఁ బింగలోచనయుఁ గనకకుండల
భూషితయు నగునొక్కయతివ జనించి దక్షిణదిక్కు పట్టిపోవుచుండ విధాత యో
మృత్యువా యనిపిలిచి ప్రజాసంహారచింతాపరుండనై నామేనం బొడమిననీకు
సకలప్రజాసంహారంబు కార్యంబు నాపంపునంజేసి యది చేసియు నీవు మేలు
పొందెద వనిపలికినం గ్రమ్మఱి యమ్మానిని పంకజాసనుపాలికి వచ్చి పెద్దయుం
బ్రొద్దు చింతించి యెలుంగు రాల్పడ నేడ్చినం దానికన్నీటిచుక్కలు చింది క్రిందఁ

బడకుండఁగ భూతహితంబుఁ గోరి తనకరపుటంబునం బట్టి మెల్లన దాని ననున
యించిన నయ్యబల వినయమున వంచినతీఁగకై వడి వినమ్రయై కేల్దోయి మొగిచి
యజున కిట్లనియె. నీచే సృజియింపఁబడి నారీజన్మం బెత్తితినే నెఱిఁగియెఱిఁగి
యెట్లు క్రూరకర్మమున కొడంబడుదు? నాయెడం బ్రసన్నుండ వగుము. అధర్మం
బునకు వెఱచెద. ప్రియులైనకొడుకులను దండ్రులను జెలులను నన్నదమ్ములను
బతులను భార్యలను బలువెఱంగు లగుచుట్టలనుం జంపినఁ దద్వియోగవిషాదవ
శులై తదీయులు రాల్చుబాష్పబిందువులకు వెఱచి శరణాగతురాల నైతి. యము
నింటికిఁ బోవఁగ నామనసు గొలుపదు. చేదోయిఁ దల నిడి యాక్రూరకర్మము
నకు నన్నుఁ బంపకుండఁగ నిన్ను వేఁడికొనియెద. నీచేత ననిపించుకొనిపోయి
ధేనుకాశ్రమమునఁ దపమున నిన్నే యారాధింతు ననియున్నదానను. నా కీవరం
బొసంగు మనివిన్నవించుటయు విని విరించి మృత్యువా, ప్రజాసంహారనిమిత్త
మున సృజియింపఁబడిననీ కప్పని చేయకుండఁ దప్పదు. విచారింపక యందులకుం
గడంగుము నావచనంబునంజేసి పాపంబు నిన్నుఁ బొరయదు. నీచరిత్రం బనింద్యం
బై పరఁగు ననవుడు నాయబ్జముఖి యబ్జాసనుని వీడ్కొని ప్రాంజలియై మగిడి
ప్రజాహితచింతనతత్పరయై సంహారమునకుఁ దొడరకుండునంతఁ దనంతన శాంత
ప్రసన్నుఁడై పరమేష్ఠి యాననాంబుజంబున దరహాసంబు దళుకొత్తఁగ నిఖిలలో
కంబులం జూచుటయు నయ్యవి తొల్లింటియట్టు లయ్యె. అక్కన్యయు రయమున
ధేనుకాశ్రమమున కరిగి యం దింద్రియముల గుదియించి యేకపాదస్థితయై
యేకవింశతిపద్మవర్షములును నట సప్తపుణ్యారణ్యములకుఁ బోయి యందుఁ జతు
ర్దశపద్మహాయనంబులును బిదప మృగములతోడిదియై పద్మాయుతవత్సరంబు
లును బదంపడి పుణ్యశీతలామలసలిల యగునర్మదానది కరిగి తజ్జలంబులం దేని
మిదివేలేండ్లును ననంతరంబు పంచగంగలయందు మేరుశైలంబునందును బుష్క
రంబులందును గోకర్ణక్షేత్రంబునందును నైమిశారణ్యంబునందును మలయగిరి
యందును బెక్కువేలేండ్లు పరమనియమమున సలిలపవనమాత్రమున శరీరయా
త్ర నడుపుచుఁ దీవ్రతపంబుఁ జేసి యామీఁదం దేవతలకు యజ్ఞవాటం బైనహి
మవద్గిరిశిఖరంబున నంగుష్ఠంబు నేల మోపి నిలిచి యత్యంతసమాధానపూర్వక
ముగ నిఖర్వసంవత్సరములు నన్యదేవతలం దొఱంగి విరించిం గుఱించి యత్యు
గ్రతపోనుష్ఠానంబు సల్పుచున్నంత దానినిష్ఠకు మెచ్చి లోకాధ్యక్షుండు సాక్షా
త్కరించి మృత్యువా, యేల యిట్టిఘోరతపంబు సల్పెద వనియడిగి యది తా
నధర్మభీరువు గావున బ్రజాసంహార ముడుగుట వరముగఁ బడయఁ గోరుట నె
ఱింగి దాని కిట్లనియె. కల్యాణీ, నానియోగంబునంజేసి ప్రజాసంహారమువలని
యధర్మము నిన్నుఁ బొరయదు. నాపలు కెన్నఁడుం దప్పదు. కావునఁ జతుర్విధ

భూతజాలంబు నుపసంహరింపుము. యముఁడు నాధివ్యాధులును నీకు సహాయవ
ర్గంబు. దీనం బాపంబుఁ బొందక ఖ్యాతిం బొందునట్లు నీకు నేనును దేవతలును
వర మిత్తు మనిన నవ్విని యావనిత ప్రాంజలియై దేవా, యిప్పని నాకుఁ జేయక
తప్పదేని నీయానతిఁ దలఁ దాల్చెద. నావిన్నపం బొక్కటి వినుము. లోభక్రో
ధేర్ష్యాసూయాద్రోహమోహహ్రీత్యాగము లన్యోన్యపరుషంబులై దేహులదే
హములం జేరునట్లు లేర్పఱుపవలయు ననవుడు బ్రహ్మ దానికి వెండియు నిట్ల
నియె. మృత్యువా, నీచెప్పినట్ల చేసెద. అధర్మము నిన్నుఁ జేరదు. నీయ
శ్రుబిందువులు నాచేతం బట్టితింగదా. అవియె వివిధరోగంబులై ప్రాణులఁ
బీడించిన హతప్రాయు లగువారల నీవు చంపుము. ధర్మేశ్వరియు ధర్మనిత్యయు
నై నీవు కామక్రోధముల వర్జించి కాలపక్వంబు లగుప్రాణిజాలంబులజీవముల
నాకర్షింపు మనుటయు నది మాఱుపలికినం బ్రహ్మదేవుఁడు శపియించునొక్కొ
యనివెఱచి యందుల కియ్యకొనియె. అదియే మృత్యు వనుపేరం బరఁగి
కామక్రోధవర్జితులై యాధివ్యాధిపీడితకాలపక్వజంతువర్గసంహారంబుఁ గావించు
చుండు. అమర్త్యులును విధివశమున మర్త్యు లగుదురు. మర్త్యులు నమర్త్యు
లగుదురు. భీమకర్ముఁడు భీమనాదుఁ డుగ్రానంతతేజోవిశిష్టుఁడు నగువాయువు
విధివశమున నెక్కు దేహముఁ జొచ్చి యందుఁ గొంతకాల ముండి క్రమ్మఱ నట
లేచి దేహాంతరముల కరుగుచుండు. ఇదియే మరణంబు నాఁబడు. దానిం దప్పిం
చుకొనుట యరిది. నీకొడుకు వీర్యధుర్యుండై శత్రువులం జించి చెండాడి విము
ఖుఁడుగాక యోపినకొలఁది పోరి కాలపరిపాకమున దుఃఖభూయిష్ఠం బయిన యీ
లోకము విడిచి సకలజనప్రార్థనీయంబు సర్వదుర్లభంబు పుణ్యకృద్గమ్యంబు నగు
నుత్తమలోకంబు సాధించి యందు సుఖమున్నవాఁడు. వానికి వగవం బని లేదు.
అందఱను దండపాణియై మృత్యువు సంహరింపదు. మఱి కామక్రోధాదివ్యాధివ
శులై తమకుఁ దామ సంహారంబుఁ జేసికొందురు. దైవసృష్టి యిట్టిదని యెఱింగి
పుత్రశోకంబుఁ బరిహరింపు మని నారదుఁడు సుహృదుండై చెప్పిన విని యకం
పనుండు దేవమునివరేణ్యా, భవదీయవచనోపన్యాసమున విగతశోకుండ నైతి.
కృతార్థుండ నైతి నని పలికి ప్రణమిల్లుటయు నద్దేవర్షివర్యుం డతని వీడ్కొని
నందనవనంబునకుఁ జనియె. ఈయాఖ్యానంబు వినినవారును వినిపించినవారును
బరమపావనులై యాయుస్స్వర్గయశోధనములం బడయుదు రని పారాశర్యుండు
తెల్పిన విని పాండవాగ్రజుండు క్షత్రధర్మస్వరూపం బిట్టిదిగదా. యనితలంచి
పలువురితోడం బోరాడి పరాఙ్ముఖుండుగాక శస్త్రమరణంబుం బొందినయభిమ
న్యుండు పరమపావనుండై యక్షయ్యపుణ్యలోకసౌఖ్యం బనుభవించు నని నిశ్చ
యించి శాంతశోకుండై వెండియు సాత్యవతేయుం జూచి మునివరేణ్యా, తొల్లిం

టిరాజర్షు లనేకులు యజ్ఞముల నాచరించునెడ దక్షిణాదుల నేరీతి నొసంగి విప్రులం దనిపిరి ? పురాణరాజర్షిచరిత్రంబుల వినఁ గోరెద ననియడుగుటయు నమ్మునీంద్రుఁడు నరేంద్రా, నీప్రశ్నముఁ జూడఁగ వీరస్వర్గము సాధించినయభిమన్యుని లోకమునకును వివిధాధ్వరకారు లైనపూర్వరాజర్షులలోకములకు నంతరం బెఱుంగఁ గోరిన విధంబుదోఁచెడి. వారికి నితనికిం దారతమ్యంబు గలదు. రాజర్షుల పుణ్యచరిత్రంబు విన్నం బుత్రశోకంబు కొంత తఱుఁగుఁ గావున వివరించెద వినుమని ధర్మరాజునకు వేదవ్యాసుఁడు మఱియు నిట్లనియె.

వేదవ్యాసుఁడు ధర్మరాజునకు సువర్ణష్ఠివిచరిత్రంబుఁ జెప్పుట.

శైబ్యపుత్రుం డైనసృంజయుఁ డనురాజు రాజ్య మేలుచుండఁగ నతనికిఁ గూర్చుచెలు లగుపర్వతనారదమునీంద్రు లొక్కనాఁ డతనియొద్దకుఁ జనుదెంచి విధివదర్చితులై యుత్తమాసనముల నాసీనులై యిష్టకథాసల్లాపములనుబుసుపుచ్చుతఱి సుందరాంగి యగునాసృంజయుకూఁతు రచ్చోటికి వచ్చి వారికి మ్రొక్కి దీవనలం బడసి యుండునంతఁ బర్వతుఁడు దానిపయిం దవిలియద్దిరా యిక్కన్యక పుడమికి వచ్చినచందురేఖయో రవిప్రభయో జ్వలితజ్వలనశిఖయో శ్రీహ్రీకీర్తిధృతిపుష్టిసిద్ధులలో నొక్కతెయోగాని యందఱివంటిది కాదని తనలో వితర్కించి యక్కన్నియ యెవ్వతె యని సృంజయు నడుగ నతండు తనకూఁతురని తెలుపుచున్నయెడ నారదుఁడు నృపాలా, యేను దీనిం బత్నిఁగా గ్రహింపఁ దలఁచినాఁడ నిత్తువే యనియడుగ నతం డిత్తు ననవుడుఁ బర్వతుఁ డలిగి యేను మనస్సున వరించినకన్యకను గోరుటంజేసి నీకు స్వర్గగమనంబు ప్రతిహతంబయ్యెడు మని శాపం బిచ్చిననారదుఁడును గోపించి వరణం బనఁగ మనస్సంకల్పంబు, మాట చెప్పుట, బుద్ధిని నిశ్చయించుట, పరస్పరసంభాషణంబుల నియ్యకొనుట, యుదకధారాపూర్వకంబుగ దానముఁ బ్రతిగ్రహించుట, మంత్రపురస్సరంబుగఁ బాణిగ్రహణము చేయుట, సప్తపదియుననఁ బరఁగు. ఇవి యయినచో భార్యాత్వంబు సిద్ధించుట శాస్త్రసంప్రదాయ సిద్ధంబై యుండ మనస్సంకల్పమాత్రమున భార్యాత్వంబుఁ గలుగనితఱి వరించిననాపై నలిగి శాపంబిచ్చితివి గావున నేను లేకుండిన నీకును స్వర్గగమనంబు ప్రతిహతం బయ్యెడు మని పర్వతునకుఁ బ్రతిశాపం బిచ్చి కొంతవడికి శాంతరోషులై పుత్రార్థియగుసృంజయునింట సుఖోపచారములకు మెచ్చుచుండిరి. అంతనొక్కనాఁడు తపస్స్వాధ్యాయనిరతులు వేదవేదాంగపారగులు నగుబ్రాహ్మణులు గూడి నారదుం జేరి మునీంద్రా, యనపత్యుం డైనమానృపాలునకుఁ బుత్రవరంబుఁ బ్రసాదింపవే యనిప్రార్థించుటయు నద్దేవముని సృంజయుదెస మొగంబై యో రాజర్షివర్యా, బ్రాహ్మణులు ప్రసన్నులై నీకుఁ బుత్రు నిమ్మని కోరుచున్న

వాఁడు గావునఁ గృతార్థుఁడ వైతివి. ఎట్టికొడుకుం బడయఁ దలఁచితో చెప్పు మనియడుగ నతని కతం డిట్లనియె. మునివల్లభా, యశస్వియు రూపవంతుఁడు నగుకుమారుం గోరెద. మఱియు నాకుమారుఁడు మూత్రపురీషలాలాజలస్వేదములెల్ల సువర్ణమయంబులై యుండునట్టివాఁడు గావలయు నని తెల్పిన నట్ల యగుంగాక యని నారదుఁడు వర మిచ్చుటయు సృంజయున కట్టికుమారుండు జనించిన వానికి సువర్ణష్ఠీవి యనుపేరు పెట్టిరి. ఆకుమారునిమూత్రపురీషలాలాస్వేదాదుల వలనఁ బుట్టినకాంచనంబున నారాజు గృహప్రాకారదుర్గదేవబ్రాహ్మణాయతనశయనాసనస్థాలీభాజనాదివ్రాతంబులు కాంచనమయములు గావించి సంతసిల్లుచున్నంతఁ దెక్కలికాండ్రు దాని నెఱింగి నిశీథమున నాకుమారుం బట్టికొని యడవికెత్తికొనిపోయి చంపి పొట్ట కోసియందుఁ గాంచనంబుఁ గానక తత్కళేబరం బచ్చట విసర్జించి పాపకారులైనయమ్మూర్ఖు లన్యోన్యనిహతులై నిరయమునకేగిరి. అట సృంజయుండును రేయి నిద్రించుచుండినకొడుకుం గానక యెల్లచోట్ల వెదకించి చోరవృత్తాంత మంతయుఁ దెలిసి యాపుత్రశవమున కనంతరకర్తవ్యములఁ దీర్చి వరదత్తుం డైనపుత్రుఁడుం జచ్చెఁగా యని వావిడిచి యేడ్చుచుండునంతఁ గరుణించి నారదమునీంద్రుం డచ్చోటికి విచ్చేసి సృంజయా, కామములయెడఁ దనివి నొందవలయుఁగాని యెన్నఁడు నిట్లే వనరుచుండినం దరి సేరరాదు చచ్చినవాఁడుమగిడి రానేర్చునే? ఏడ్చినంజిత్తతాపంబును గాయక్లేశమునుం దక్క నొండెద్దియుం గలుగమి నిక్కువంబు. వగ పుడుగుము. ఎందఱేని మహారాజులు పెద్దకాలంబు ధర్మముఁ దప్పక రాజ్య మేలిరి. నేనుం జూచితిని. వారందఱుఁ బుడమిం దిరముగ నుండఁజాలిరే? వారిచరిత్రంబులు జెప్పెద దానం గొంతశోకం బుపశమిల్లు విను మని యిట్లనియె.

## షోడశరాజచరిత్రము.

అవిక్షితునితనయుం డైనమరుత్తుం డనురాజు సంవర్తమునీంద్రుఁడు బృహస్పతిమీఁదియీసునం జేసి తనకు యాజకుఁడై నిర్వహింప హిమవత్పర్వతకనకపాదంబున సకలయజ్ఞోపకరణములు సువర్ణమయములుగఁ గల్పించి సుర లందఱు సభాసదులై హవిర్భాగముల గ్రహింప మరుత్తులు పరివేష్టలుగాఁగ నపరిమితదక్షిణలనుబరిశుద్ధంబు లయినదధిఘృతభక్ష్యభోజ్యాదిపదార్థములను వస్త్రాభరణాద్యలంకారములను ఋత్విక్ప్రముఖసకలబ్రాహ్మణులకుఁగోరినట్లు సంతృప్తిఁ గావించి యనేకాధ్వరము లొనరించి వివిధదానముల విప్రుల కిచ్చి రాష్ట్రమునఁ గాలవర్షములు గోరినట్లు కురియఁ బ్రజలకుఁ బీడయనుమాట లేకుండ లెస్సయేలి యౌవనస్థుండై సంతానవంతుండై వేయేండ్లు రాజ్యభోగము లనుభవించి పుణ్యవంతుఁడు కీర్తిమంతుఁడునై నెగడె. అతని కెల్లకాలము పుడమి నుండఁ కలిగెనే?

సుహోత్రుఁ డనురాజు ధర్మమున రాజ్యముఁ బడసి ఋత్విక్పురోహిత ప్రముఖబ్రాహ్మణులవలనఁ బ్రజాపాలనంబును దానంబును యాగంబును శత్రు జయంబును దనకు ధర్మం బనియెఱింగి ధనుర్విద్య నేర్పున శత్రువుల గెలిచి ధర్మ ముల దేవతల నారాధించి మ్లేచ్ఛాటవికాదికుప్రజనుత్కర్షరహితంబుగా నుత్త మోత్కర్షసహితంబుగాఁ బరిపాలించుచు నిజసుగుణములకు భూతజాలము లను రక్తంబులై యుండ ధర్మమున నర్థము సంపాదించి తనమేలినడవడికి మెచ్చి పర్జ న్యుఁడు కనకగ్రాహకర్కటకమత్స్యాదిరూపములఁ బెక్కేఁడులు కాంచనవర్షము గురియ వాపీకూతటాకనదీనదంబులు హిరణ్మయంబులై యునికి కెంతయు నబ్బురం బందు చుఁ గురుజాంగలంబుల నశ్వమేధసహస్రంబును రాజసూయశ తమును మఱియుం బలుదెఱంగులగునిత్యనైమిత్తికకామ్యయాగములు ప్రభూ తదక్షిణాన్నసంతృప్తద్విజగణంబుగ నాచరించి పేరెన్నికఁ గనియె. అతఁడుం దుదిఁ గాలధర్మంబు నొందె.

పౌరవుఁ డైనయంగనృపాలుఁడు వేయివేలశ్వేతాశ్వముల విడిచి యప్ర తిహతప్రచారంబులై యవి వచ్చుటయు ననేకాశ్వమేధము లాచరించి యందు సకలాలంకారభాసురంబు లైనపదివేలయేనుంగులను నన్నిపతాకాదిచిత్రితహే మస్యందనంబులను వివిధభూషణభూషిత లగుపదిలక్షలకన్నియలను హేమశృం గములు రౌప్యఖురములు కాంస్యదోహనములు సవత్సములు నగు కోటిధేను వులను నసంఖ్యాకదాసీదాసఖరోష్ట్రాజావిగణంబులను బహుళాశ్వములను నా నాగృహక్షేత్రారామంబులను వివిధరత్నరాసులను దక్షిణగా వేదవిద్యావ్ర తస్నాతులు శిక్షాక్షరవిధిజ్ఞులు నానాదేశాగతులు నగునుత్తమబ్రాహ్మణులకొ సంగి స్వాదుమృష్టాన్నంబు వెట్టి యంగునికి సాటివచ్చువాఁడు లేఁ డని యెల్ల రుంబొగడ నెగడి ధర్మమున రాజ్య మేలుచు మఱియు సర్వకామఫలప్రదము లగునానాయజ్ఞముల గుణోత్తరముగ నాచరించె. అతఁడును గాలము దీఱినం బోయెఁగాని యీలోకమునన యుండఁజాలెనె?

ఔశీనరుం డైనశిబిమహీపతి సకలద్వీపసంభృతం బైనక్షితిమండలం బెల్లఁ దా నెక్కరథికుండై గెలిచి సర్వమూర్ధాభిషిక్తులకు సమ్మతుండై నిష్కకోటిసహ స్రంబులను ననేకహస్త్యశ్వపశుధాన్యగోజావిగణంబులను భూమండలంబును దక్షిణగాఁ బెట్టి యనేకాశ్వమేధముల నొనరించె. వర్షధారలను నక్షత్రంబులను గంగాసికతలను మేరుగిరిపాషాణములను సముద్రమునందలిరత్నములను వివిధ ప్రాణిజాలములను లెక్కించినను లెక్కింపవచ్చుఁగాని శిబిదత్తంబు లైనగోవుల గణింప నలవి గాదు. కాలత్రయమునందును శిబి కెనవచ్చురాజు లేఁ డని ప్రజా పతి తాన వచించె. మఱియు నతనియజ్ఞములందలియూపచషాలాద్యుపకరణం

బులును నగరులలోని ప్రాకారతోరణంబులును దేవబ్రాహ్మణాయతనంబులును హిరణ్మయంబులై పరఁగె. శుచిస్వాద్వన్నపర్వతంబులును దధిఘృతమధుపయో నదులును నెందఱు బ్రాహ్మణు లుపయోగించినను దఱుఁగవయ్యె. అతనిపుణ్యకర్మమునకు మెచ్చి శంకరుఁ డక్షయ్యధనంబును విపులశ్రద్ధయును విమలకీర్తియును సంకల్పితార్థసిద్ధియును సర్వభూతప్రియత్వమును వరముగఁ బ్రసాదించె. ఆశిబిమహీపతి యిపు డున్నవాఁడె?

దశరథపుత్త్రుఁ డైన శ్రీరామచంద్రుఁడు తండ్రిపంపున సీతాలక్ష్మణులును దానును నడవుల కేగి జనస్థానవాసు లగుఖరదూషణప్రభృతిరాక్షసులఁ బలువురఁ బరిమార్చి జానకి నపహరించి యెగ్గు సేసినరావణుని దేవబ్రాహ్మణకంటకునిం దెగటార్చి తండ్రిమాటమెయిఁ బదునాలుగేఁడు లడవులఁ గడపి మగిడి యయోధ్యకుఁ జనుదెంచి యశ్వమేధాదు లగునానామఖముల విధియుతముగ నొనరించి ధర్మమున రాజ్య మేలె. ఏమి చెప్పుదు. రామరాజ్యమునఁ దత్సహవాసార్థులై ఋషిదేవతలు భూమికి వచ్చియుండిరి. అప్పుడు క్షుత్పిపాసలు నాధివ్యాధులును బ్రజలఁ బీడింపవయ్యె. పెద్దవా రుండఁగఁ జిఱుతవాండ్రు సచ్చుట గలుగదయ్యెఁ గావునఁ బుత్త్రాదులకుఁ బితృప్రభృతులు శ్రాద్ధక్రియలు సేయుట పొసఁగదయ్యె. మఱియుఁ గ్రూరజంతుభయమును నకాలమృత్యువును ఘటింపదయ్యె. అందఱు ధర్మపరులు నాచారవంతులును గులోచితవృత్తినిరతులును బహుళసంతానవంతులును దృఢగాత్రులును గామక్రోధాదిరహితులును నీతిబాధావర్జితులును బ్రాణములరీతి నితరేతరమిత్త్రులు నాయుష్మంతులునై పెంపొందిరి. అవ్విధమున రామరాజ్య మని తనపేరు సకలజనులును దండ్రి నెట్లట్ల తన్నుఁ జూచుచుఁ బొగడఁగఁ బేరెన్నికఁ గాంచి పదునొకండువేలయేఁడులు ధర్మపథమున నేలి తనవంశం బెనిమిదితెఱంగుల నేర్పఱిచి శ్రీరాముఁడును గాలవశగతుఁ డయ్యె.

భగీరథుఁడు తనపూర్వవంశ్యులకు సద్గతిఁ గావించువాఁడై గంగానదిని భూమికిఁ దెచ్చి యమ్మహానది తనపేర భాగీరథియనం బరఁగునట్లు చేసి యప్పుణ్యనదీతీరమున యజ్ఞవాటము విధ్యుక్తప్రకారమునఁ గట్టించి యందుఁ బసిడియిటికలఁ జయనంబు చేసి హేమభూషిత లగులక్షకన్యకలను నందఱు రాజపుత్రులను నొక్కొకకన్నియకుఁ దురంగచతుష్టయయోజిత మగునుత్తమరథము నొక్కొకతేరికిఁ గాంచనాలంకారభాసురంబు లైననూఱేనుంగులను నొక్కొకరాజకుమారునకు వేయిగుఱ్ఱములను నొక్కొకగుఱ్ఱమునకు నూఱుమొదవులను నొక్కొకధేనువున కన్నియజావికటంబులను నమర్చి విప్రులకు దక్షిణ యిచ్చి మఱియుం గోరినపదార్థములనెల్ల సంతృప్తిగా నొసంగి దేవత లగ్గించునట్లు శాంతవిఘ్నముగను నిరామయముగను సమ్యగ్విధానవిహితముగను మహామఖములఁ గావిచేసి.

అట్లతండు యజ్ఞాచరణపరుండై యున్నతఱి గంగాదేవి రూపు దాల్చి వచ్చి యతనికుఱు వెక్కినం గంధర్వులు దేవపితృమనుష్యులు వినఁగ నపత్యభావంబు వహించినజాహ్నవీదేవి నేఁడు భగీరథునుత్సంగ మెక్కి వరించె ననిపలికిరి. అతం డెచ్చట నధ్వరము లాచరించె నచ్చోట వసింపఁ గోరి పాదపంబు లెలమి వహిం చె. ఆభగీరథుండు పుణ్యకర్మాచరణమునను బ్రాహ్మణప్రసాదమునను బుణ్యలోక మధిగమించె. అతం డిప్పు డిచ్చట నున్నవాఁడా?

దిలీపుఁడు జలస్తంభనాదివిద్యలు నేర్చి శత్రువుల నడంచి రాజ్యమెల్లఁ దనవశముఁ జేసికొని ధర్మపథమున నేలుచు యజ్ఞశాలామార్గంబులును వేదియు ను యూపచషాలాదియజ్ఞోపకరణములును హిరణ్మయములకా నమర్చి యజ్ఞశత ము లాచరించి తత్త్వజ్ఞానార్థసంపన్నులు సోమయాజులు బహుకుటుంబులు నగు నుత్తమబ్రాహ్మణుల కనేకులకు వసుసంపూర్ణ మగువసుధామండలము దక్షిణగా నిచ్చి మృష్టాన్నముఁ బెట్టి సంతృప్తిఁ గావించె. అతనియింట నెల్లపుడును వేదా ధ్యయనఘోషంబును మౌర్వీగుణక్వణనంబును గ్రోలుఁడు గ్రోలుఁ డనునులివును భుజియింపుఁడు భుజియింపుఁ డనునెలుంగునుం దఱుఁగక వినంబడుచుండు. స్వర్గ లోకవాసులు నతనిపుణ్యమగణ్యం బనితలంచుచుండిరి. ఆదిలీపుఁడును నీలోక మును విడిచె.

మాంధాతృఁడు తనతండ్రి యగుయువనాశ్వుఁడు వేఁటపోయి డస్సి మగిడి యిలు సేరి సత్రశాలలో ద్విజోత్తములు పుత్రార్థము కల్పించినపురోడాశము నెఱుంగక త్రావి తత్ప్రభావమునఁ జూలు దాల్చినం గనుబ్రొద్దులు దఱియుడు నశ్వినులు నేర్పున గర్భగోళంబు వెడలింపఁగ వెలువడి తండ్రితొడపై నుండ సురలు తమలో నీకుమారుఁ డేమి ద్రావునో యనివితర్కించుచుండునంత నిం ద్రుఁడు * "మాం ధాతా" యనిపలికి తనవ్రేళులఁ బయోమృతపరిపూర్ణము లఁ గావించి పండ్రెండునాళ్లు నోటఁ బెట్టిన నయ్యమృతంబుఁ ద్రావి మనుష్య మానమునఁ బండ్రెండేఁడులవాఁడై యెంతయుఁ బెరిఁగి యింద్రోదితప్రకారము న మాంధాత యనుపేరఁ బరఁగి సకలవిద్యల నేర్చి శౌర్యధైర్యధుర్యుండై జితేం ద్రియవర్యుండై స్తుత్యసత్యధర్మచర్యుండై తనరి జనమేజయసుధన్వగయశూన బృహద్రథాసితనృగులం గెలిచి సూర్యోదయాస్తమయములు మేరగాఁ గలభూ మండలంబెల్లఁ దనవశము చేసికొని ధర్మము దప్పక యేలి యశ్వమేధరాజసూ యముల సలిపి యోజనోన్నతంబులు దశయోజనాయతంబులు నగుహిరణ్మయ రోహితమత్స్యములఁ జేయించి బుత్విక్పురోహితప్రముఖుల కొసంగి బహుప్ర కారంబు లత్యంతస్వాదువులు నగునన్నపర్వతములను భక్ష్యభోజ్యరాసులను మ

గ. * మాం నన్ను, ధాతా. త్రాగువాఁడు, అనియర్థము.

ధుదధ్యాజ్యనదులనుం గల్పించి నానాదేశాగతు లగుసాంగవేదవిద్యాబ్రిహ్మణులకు సంతర్పణముఁ గావించి దేవర్షులం దనిపి విమలయశము లోకమున నంతట నెఱపి పుణ్యలోకముల కరిగె. ఆమాంధాతకు నీలోకముననే యుండ నలవి యయ్యెనే?

యయాతి దేవదానవసమరమున దేవతలకుఁ దోడ్పడి విక్రమించి శౌర్యపాటవమున భూమండలంబెల్లఁ దాన యేలుచు నగ్నిష్టోమవాజపేయాతిరాత్రచాతుర్మాస్యాశ్వమేధరాజసూయసత్రయాగాదికంబు లయినబహుళాధ్వరముల నాచరించి యత్రబ్రాహ్మణవిత్త మంతయు బ్రాహ్మణుల కిచ్చి పృథివిని నాలుగుభాగములుగ విభాగించి యుచితవ్యవస్థ యేర్పఱిచి శుక్రపుత్రి యగుదేవయానియం దిద్దఱును వృషపర్వకూఁతు రగుశర్మిష్ఠయందు ముగ్గురునుగా నేవురుకొడుకులఁ బడసి సకలదేవతావనములందును రెండవయింద్రుండునాఁగఁ బెక్కువేలయేండ్లు విహరించి యప్పటికిని గామసుఖములఁ దనియక నిర్వేదంబు నొంది కామములఁ ద్యజింపనివానికి భూమిం గలవ్రీహియవపశుస్త్రీహిరణ్యములెల్లఁ గూడినను దృప్తి గలుగదని నుడివి ధృతిమంతుండై వైరాగ్యఘనుండై పూరుఁ డనుకుమారునకు రాజ్యాభిషేకముఁ గావించి వనమునకుఁ జని తపము సలిపి తత్ప్రభావమున నుత్తమగతిం బడసె. అతండును భూలోకమునఁ గలకాల ముండఁజాలెనే?

అంబరీషుఁడు సకలశాస్త్రములను దివ్యాస్త్రములను నేర్చి సంగ్రామమునఁ గోటిరాజులం గెలిచి వసుంధరాతలంబెల్లఁ దనవశముఁ జేసికొని శాస్త్రోక్తప్రకారమున ననేకయజ్ఞముల నాచరించి యందు మోదకాపూపపూరిశష్కులీప్రముఖము లగుస్వాదుభక్ష్యములను నుత్తమపానకంబులను వివిధాన్నజాలంబులను దధిఘృతమధుఫలమూలాదిపదార్థవ్రాతంబులను నిచ్చి విప్రవర్యులకు సంతర్పణం బొనర్చి హిరణ్యకవచులు శ్వేతాతపత్రులు సపరివారులు ననేకయాగాచరణపవిత్రులు నగురాజులఁ బెక్కండ్రను ఋత్విజులకు వశంవదులఁగా సమర్పించి యీనృపాలుండు సేసినట్టు లాదినృపాలురును దాఁబోవురాజులును జేయఁ జాలరని తన్ను మహర్షు లందఱును బొగడ నెగడె. అతండు నీలోకము విడిచె.

శశిబిందుఁడు లక్షభార్యలను బెండిలియై యొక్కొకభార్యకు వేవురువేవురు కొడుకులుగాఁ బదికోట్లకొడుకులం గని యందఱకు వేదవేదాంగములను సాంగధనుర్వేదమును నేర్పించి వారిసుగుణగణంబులకు నెమ్మనమున నలరుచు యూపచషాలాదిసకలోపకరణములు స్వర్ణమయములుగా నమర్చి భూరిదక్షిణాన్నపానదానసంతర్పితవిప్రగణంబుగను సంతుష్టపుష్టసకలజనాకీర్ణంబుగను శాంతవిఘ్నంబుగను నిరామయంబుగను నశ్వమేధయాగము జేసి ఋత్విజులకు హిరణ్మయకవచాదిభూషితు లయినతనపదికోట్లకొడుకులను నొక్కొకకొడుకునకు నూఱేసిరథములను నన్నిమదపుటేనుంగులను నందఱుకన్నియలను నొక్కొకకన్నియకు నూఱేసి

యేనుంగులను నొక్కొకయేనుంగునకు నూఱేసి తేరులను నొక్కొకతేరునకు శతహ యములను నొక్కొకగుఱ్ఱమునకు వేయిధేనువులను నొక్కొకధేనువున కేఁబదిగొ ఱియలనుగా నమర్చి యిచ్చె. అతండును బెక్కేఁడులు పుడమి యేలి తుది దివమున కరిగె.

గయుఁడు నూఱువర్షములు హుతశిష్టాశనుండై నియమంబు సలిపి తన నియమమునకు సుప్రీతుఁడై నయగ్నిదేవునివలనఁ దపోబ్రహ్మచర్యవ్రతనియమ గురుప్రసాదముల వేదపరిజ్ఞానమును, లాఁతులకుఁ బీడ గలుగకుండ స్వధర్మమున నక్షయ్యధనాగమమును, బ్రాహ్మణుల కొసంగునెడ నిరతశ్రద్ధయును, సవర్ణప త్నులయెడఁ బుత్రజననంబును, నన్నదానమునెడ నత్యంతాసక్తియును, ధర్మని రతత్వమును, సంకల్పితార్థములు నిరంతరాయముగ నెఱవేఱుటయు ననునీవర ములఁ బడసి క్షాత్రధర్మముల శత్రువుల జయించి శతవర్షములు దర్శపూర్ణమా సాగ్రయణాదుల యాగపరుండై నూఱేండ్లు వఱువాత నిదుర లేచినతోడన రెండులక్షలునఱువదివేలమొదవులను లక్షగుఱ్ఱములను నన్నినిష్కములను బ్రా హ్మణుల కిచ్చి పరమపుణ్యఘనుండై సకలనక్షత్రములందును నక్షత్రదానముల నాచరించి సంప్రాప్తసుకృతుండై యిరువదియాఱుయోజనములవెడల్పు ముప్పది యోజనములనిడివియునుగాఁ గనకమణిజాలచిత్రితయజ్ఞవేదిని గట్టించి యజ్ఞోప కరణములెల్ల స్వర్ణమయములుగా సవరించి యశ్వమేధయాగంబు సేసి యావేది యంతయు ఋత్విజుల కొసంగి యథోక్తభూరిదక్షిణలను మృష్టాన్నంబునను వస్త్రాభరణసంచయంబులను భూసురులకు సంతర్పణంబుఁ గావించి సకలసముద్ర పర్వతద్వీపవననదీనదములందును నంతరిక్షమునందునుం గలభూతజాలమునెల్లఁ దనిపి గయునకు సాటిగా నేరాజులును యజ్ఞములఁ జేయరై రని యెల్లవారును వినుతింపఁ బ్రశస్తిఁ గాంచె. మఱియు నతనియశ్వమేధమున నందఱును లెస్స భుజియించినను నిరువదిమైదన్నపర్వతంబులును బెక్కుదధిఘృతకుల్యలును లెక్క యిడరానివస్త్రాభరణరాసులును శేషించె. ఆనృపాలునిపేరనే యక్షయవటప్ర సిద్ధం బయినగయాక్షేత్రంబు వినుతి కెక్కె. బ్రహ్మసరస్సును బ్రస్తుత్యం బయ్యె. అట్టివానికి నీలోకమును విడువవలసెఁగాని తిరముగ నిట నుండ నలవి యయ్యెనే?

రంతిదేవుఁడు సర్వవిద్యల నధిగమించి క్షాత్రధర్మమున రాజుల నందఱనుఁ దనకు లోఁజేసికొని ధర్మముఁ దప్పక పరిపాలించుచు నిరువదివేవు రుత్తమపాచ కులు రేలుంబవల్లు క్రొత్తక్రొత్తగా నుత్తమపదార్థములు వండ నప్పదార్థజాతం బంతయు నభ్యాగతులకు నతిథులకుఁ గడుపు నిండ భక్తితోఁ బెట్టి పశువు లుత్త మలోకముల సాధింపఁ గోరి తామ వచ్చిన విశసనముఁ గావించి యత్యంతనిష్ఠా గరిష్ఠుండై సత్రయాగముఁ జేసి యయ్యా, నాయిచ్చునది యత్యల్పమైనను గదు

ణించి తనియవలయు ననిపలుకుచు వచ్చినసకలభూసురుల కొక్కొకసౌవర్ణనిష్కం బిచ్చి ఋత్విజులకుఁ గుంభస్థాలీపిఠరశయనాసనవాహనప్రాసాదగృహారామముల సువర్ణమయంబులుగాఁ గల్పించి యొసంగె. మఱియు నమ్మహీపాలునివంటయింట బ్రాహ్మణార్థము విశసనము చేయంబడినపశుగణంబులచర్మరాశినుండి పాఱినయేఱు చర్మణ్వతియనం బరఁగి పరమపావనం బయ్యె. నూఱేడులు మూఁడుపక్షములం బ్రతిదినంబునుం బ్రత్యేకంబ గోశతపురస్కృతంబు లగువేయిసౌవర్ణవృషభములను నిన్నిసువర్ణనిష్కములను నిచ్చె. ఎన్నఁడేనియు బ్రాహ్మణుల కెయ్యదియేనియు నియ్యకుండిన నాఁడు నాచేయి రిత్తయై డెందమునం గొందలంబు పుట్టించుచున్న దని యారాజపుంగవుండు పలుకును. అతనియింటికి రాత్రిప్రొద్దుననైనను నతిథి వచ్చెనేని గవాలంభముఁ జేసి స్వాద్వన్నము వండి పాచకులు శాకసూపాదుల లెస్స భుజియింపుఁ డనిపలుకుచు నిర్బంధించి కుడువం బెట్టుదురు. అమరులు హవ్యములను బితరులు కవ్యములనుఁ దామ ప్రత్యక్షముగ వచ్చి గ్రహియించుచుండిరి. అతనికిఁ గలధనసమృద్ధి కుబేరునకుం గలుగ దని యందఱును బొగడుదురు. అతండును దివంబునకుఁ జనియెఁగాని యీలోకముననే యెల్లకాల ముండఁగలిగెనే?

భరతుఁడు దుష్యంతునకు శకుంతలయందు జనించి కణ్వమునిపుణ్యాశ్రమమునఁ బెరిఁగి బలవంతుండై నెగడి సింహశార్దూలాదివన్యక్రూరజంతుజాలముల నెల్ల నీడ్చి కోఁటలు పట్టి యాడించుచు దమింపఁజేసి యాకృత్యమునఁ దనకు సర్వదమనుఁ డనుపే రచ్చటితాపసులు పెట్టఁగఁ బరఁగి సర్వవిద్యల నేర్చి యెల్లరాజుల నరిగాపులఁ జేసికొని చక్రవర్తి యన వాసికెక్కి యమునాతీరమున నూఱును సరస్వతీతటమున మున్నూఱును గంగాకూలమున నన్నూఱు నశ్వమేధము లొనరించి నూఱురాజసూయములను వేయివాజపేయములను నగ్నిష్టోమాతిరాత్రోక్థ్యవిశ్వజిత్ప్రముఖయాగములు పెక్కులునుం గావించి నూఱుబారలనిడివిగలకాంచనయూపస్తంభమును వేయిపద్మములధనమును గణ్వముని కొసంగి హిరణ్మయగజవాజిస్యందనసందోహంబులను దాసీదాసవర్గంబులను ధాన్యరాసులను నజావిగణములను సవత్సోత్తమగోబృందంబులను గ్రామసముదాయంబులను గృహారామక్షేత్రనికరంబులను ఋత్విజులం దృప్తులం గావించి భూరిదక్షిణాన్నదానముల విశిష్టవిప్రజనములకు సంతర్పణంబు సలిపె. అతండును మేను దొఱంగె.

పృథుఁడు యత్నమునఁ బ్రథఁ గాంచుటంజేసి పృథుఁడనియు క్షతమువలనఁ బ్రజలకుఁ ద్రాణముఁ జేయుకతన క్షత్రియుఁడనియు సకలప్రజలను రంజిల్లజేయుట కారణంబుగా రాజనియుం బరఁగి యేలుచుండె. అపుడు సస్యములు పుడమి నంకురింపమింజేసి యకృష్టపచ్యం బగుభూమండలమునం గలస్వాదుఫలా

దులఁ దినుచు హిరణ్మయకోమలదర్భాస్తరణములపై శయనించుచు నరోగులు
సిద్ధార్థులు సకలసుఖోపేతులునై సకలజనులు నగరగ్రామవిభాగం బేర్పడమింజేసి
గిరిగృహాదుల వసించుచుండ నెక్కనాఁడు సప్తర్షులు వనస్పతులు శైలములు దేవా
సురనరపుణ్యజనోరగపితృగంధర్వాదులు నతనియొద్ద కరిగి నీవు సమ్రాట్టవు
క్షత్రియుఁడవు రాజవురక్షకుఁడవుం గావున నెల్లకాలము సుఖముండునట్లుగ మా
కేర్పఱుపు మనియడుగ నతండు వాసయోగ్యదేశమును సస్యాదిసమృద్ధియుం
గల్పించిన వీరియభిలాషంబు నెఱవేర్చినట్లగు నని నిశ్చయించి యాజగవధనుష్పా
ణియై రథమునం గూర్చుండి సముద్రములు జలస్తంభనముఁ జేసి త్రోవయి
య్యఁగ సకలద్వీపములకుఁ జని వింటఁ బెక్కుబాణము లరిఁ బోసి యేసి మిఱ్ఱు
పల్లము లెక్కువతక్కువ లేకుండ సవరించి జనపదంబులు నగరంబులు గ్రామ
ములు పల్లెలుఁగాఁ బలుదెఱంగుల మనికిపట్టు లేర్పఱిచి ధనుష్టంకారమాత్రన
ధాత్రిని వెఱపించి వీరు కోరినట్లు పాడిపిదుకు మనుటయు భూమిదేవి వత్సం
బును దోహకుఁడును బాత్రంబునుం గలిగెనేని తత్తదనురూపముగఁ బాలొసం
గుదు ననుటయు నట్లుచేసికొనుఁ డని తన్నడిగినవారికిఁ దేటపఱిచిన వారు
వల్లేయని తొడంగిరి. అందు వనస్పతులు తొలుతఁ బ్లక్షము దోహకుఁడుగా
సాలంబు వత్సంబుగా నౌదుంబరంబు పాత్రంబుగాఁ దెగియు నంకురించుటయ
నుదుగ్ధంబు పితికె. అంతఁ బర్వతంబులుమేరువు దోహకుఁడుగా నుదయగిరి
వత్సముగా నశ్మపాత్రమున రత్నౌషధీదుగ్ధముపిదికె. అట నసురులు ద్విమూర్ధ
దోహకుఁడుగా విరోచనుఁడు వత్సముగా నామపాత్రమున మద్యదుగ్ధముఁ బిది
కిరి. మనుష్యులు పృథువు దోహకుఁడుగా స్వాయంభువుఁడు వత్సముగా క్షేత్ర
పాత్రమునఁ గృషిసస్యదుగ్ధముఁ బితికిరి. సర్పములు ధృతరాష్ట్రుఁడు దోహ
కుఁడుగాఁ దక్షకుఁడు వత్సముగా నలాబుపాత్రమున విషదుగ్ధముఁ బితికిరి.
సప్తర్షులు బృహస్పతి దోహకుఁడుగా సోముఁడువత్సముగా ఛందః పాత్ర
మున బ్రహ్మదుగ్ధంబుఁ బితికిరి. పుణ్యజనులు కుబేరుఁడుదోహకుఁడుగా వృషధ్వ
జుఁడు వత్సముగా నామపాత్రమున నంతర్ధానదుగ్ధముఁ బితికిరి. గంధర్వాప్సర
సలు విశ్వరుచి దోహకుఁడుగాఁ జిత్రరథుఁడు వత్సముగాఁ బద్మపాత్రమునఁ బు
ణ్యగంధదుగ్ధముఁ బితికిరి. పితరు లంతకుఁడు దోహకుఁడుగా వైవస్వతుఁడు వత్సం
బుగా రజతపాత్రమున స్వధాదుగ్ధముఁ బితికిరి. ఇత్తెఱంగుననందఱు వలసినదుగ్ధ
ములఁ బితుకుటయు లోకమున నయ్యైవారి కయ్యైపదార్థములు మిక్కిలి గలిగె.
ఆపృథుచక్రవర్తి వివిధయజ్ఞముల నాచరించి ఋత్విజులకఱువదియాఱువేల
హిరణ్మయకుంజరంబులను మణిరత్నభూషితంబగుభూమిని నిచ్చి వివిధదక్షిణాన్న

దానముల ద్విజులకుఁ దృప్తిఁ గావించి శాశ్వతకీర్తి సాధించెఁగాని శాశ్వతశరీరం బుఁ బడయఁ జాలఁ డయ్యె.

జామదగ్న్యరాముఁడు తనతండ్రికిఁ గీడు చేసినకార్తవీర్యునిపై నలిగి వేవురముసలమునను వేవురఖడ్గమునను బరశువున నెనిమిదివేవురనుంగాఁ బదివేవుర హైహయులఁ జతురంగబలములతోడఁ గూల్చి యంతం దనివిసనక నిరువదియొక మాఱు నానాదేశాధీశక్షత్రియులతలలఁ దఱిగి తద్రుధిరమునఁ బంచహ్రదములుగ ట్టి పితృతర్పణముఁ గావించి బ్రహ్మద్వేషు లయినవారలఁ జతుర్దశసహస్రసంఖ్యాకు లఁజంపి పరశురాముఁ డనుపేరు విన్నంత నందఱు వెఱచునట్లు వాఁడిమిం బేర్చియష్టా దశద్వీపసంభృతం బైనధరిత్రీమండలంబెల్లఁ దనవశముఁజేసికొని యనేకయాగము లొనర్చి యశ్వమేధంబుఁ జేసి యందు సప్తనలోత్సేధ మగుసువర్ణమయయజ్ఞవేదిని ఋత్విజుల కొసంగి భూమియెల్ల మరీచిపుత్రుఁడైనకశ్యపున కిచ్చి యమ్ముని తన భూమిలో నుండవల దనిన నట్లయని బాణజాలమున సముద్రుని నొప్పించి కొంత దేశము సంపాదించి మహేంద్రపర్వతమున నున్నవాఁడు. అతఁడు నపరితోషమున విశ్రాంతిఁబొందెనేని యిఁకమీఁద బ్రదుకఁ జాలఁడు. వారందఱు కీర్తిమంతులు తేజోవంతులు దానదాక్షిణ్యాజ్యాదిసంపన్నులు. అంతవారే పరలోకగతులైన నింక నీకొడుకున కేమియు నెఱుంగనికుఱ్ఱవానికి వగవం బోలునే? యనిన సృం జయుం డేమియుం బలుకక యూరకుండె. ఊరకుండుటయు నారదుఁ డోసృం జయా, నాచెప్పినయర్థమెల్ల గ్రహించి బుద్ధ్యారూఢంబుఁ గావించికొంటివేకా కున్న శూద్రాపతిశ్రాద్ధంబువోలె నష్టంబయ్యెనే యనియడుగ నతం డద్దేవము నికిఁ గృతాంజలియై మహానుభావా, పుణ్యం బైనపూర్వరాజన్యులచరిత్రము విని ధన్యుఁడనైతి, నిట్టివారుం గలరే యనువిస్మయమున శోకము చీఁకటి యర్కతేజ మునంబోలె నడఁగెవిపాపుఁడనైతి, విగతవ్యథుఁడనైతి, నేమి చెప్పనం జేయను న్నవాఁడ ననవుడు మెచ్చి నారదుఁడు భాగ్యమున నీవు శోక ముడిగితివి నీకోరిన వరం బిచ్చెదఁ గోరికొమ్ము మేము మిథ్యావాదులము గా మనుటయు నాభూపా లుఁడు మునీంద్రా, నీవు ప్రసన్నుఁడ వగుటకంటె నెండొక్క వరం బేల యని విన్నవించె. అందులకు మెచ్చి నారదుఁడుదస్యుహతుండై దుర్మరణముఁ బొంది నరకవాసక్లేశ మనుభవించుచున్ననీకొడుకుం గ్రమ్మఱఁ దెచ్చియిచ్చెద ననుచు న్నంత మునివాక్యప్రభావమునంజేసి కుబేరతుల్యుం డైనసువర్ణష్ఠీవి వచ్చి యెప్ప టియట్ల మ్రోలం గన్పట్టుటయు నందఱు పరమానందాద్భుతమగ్నం దేలిరి. సృంజయుండును లబ్ధపుత్రుండై సంతోషమునఁ బొదలి భూరిదక్షిణాన్నబంధురం బుగ వివిధయజ్ఞముల నాచరించి పెక్కేఁడులు రాజ్యమేలె. ఆసువర్ణష్ఠీవి బాలుఁ డనధీతవిద్యుఁ డన భ్యస్తధనుర్వేదుఁ డకృతదారుఁ డనపత్యుఁ డప్రాప్తపురుషా

ర్థుఁడు నగుటంజేసి నారదుఁడు వానిం బ్రతికించె. నీకొడు కభిమన్యుఁడు సకలశా స్త్రముల నేర్చి విలువిద్య నేర్పున నిరుపమానుండై దానభోగము లనుభవించి యాహవక్షోణీతలంబునఁ బగఱ బెండువడంజేసి పెక్కండ్రఁ బొలియించి యప రాజ్ముఖుండై యోపినకొలంది పోరి శస్త్రమరణంబుఁ జెంది యుత్తమలోకంబున కరిగె. తొల్లింటిరాజులకుఁ గలిగినలోకములకంటె నభిమన్యులోకము లత్యు త్తమములు. బ్రహ్మచర్యశమదమాదినియమముల నొప్పి తపోనిష్ఠులై ధ్యానవివక్షిద ర్శను లైనయోగులు ప్రాపించునట్టిపరమపదంబు సముల్లసితచంద్రతనుగతుండై ప్రాపించె. దుఃఖములఁ గడచి సుఖములు గుడువ నేగినయభిమన్యునిఁ గ్రమ్మఱ నీలోకమునకుఁ దెచ్చుట తగదు. ఈయర్థమునుఁ దిరముగఁ జిత్తమున నిలిపికొని విగతశోకుఁడవై ధైర్యము గొని శత్రువుల వధింపఁ గడంగుము, బ్రతికియుండు నంతకు శోకింపఁ దగుఁగాని యుత్తమలోకమున కరిగినపదంపడి వగచుట యవి వేకంబు, అట్టివారికి వగచినం బాపంబు గలుగు. కావున శోకముఁ బరిహరిం పుము. వెట్టితలంపె శోకంబుగాని వేఱు గాదని నిశ్చయింపుము. మృత్యూత్పత్తి ప్రకారంబును దపోమహిమంబును సర్వభూతప్రవర్తనంబును విభూతిచాంచల్యం బును వింటివిగదా. శోక ముడుగుము. పోయివత్తు నని ధర్మరాజును వీడ్కొని సాత్యవతేయమునీంద్రుఁ డాక్షణంబ యంతర్హితుం డయ్యె. ధర్మనందనుండును వ్యాసకథితంబు లయినయుపాఖ్యానములు డెందమునఁ దలపోయుచు శోకము డిగ్గఁద్రావియు నర్జునుఁడు వచ్చినపిదప నతని కేమనఁ గలవాఁడ ననిచింతిం చుచుండె.

—(అర్జునుఁడు శిబిరమునకు వచ్చునెడ దుర్నిమిత్తములఁ గని కృష్ణునితోఁ జెప్పుట.)—

అంత నక్కడ నర్జునుండు దివ్యాస్త్రములఁ బరఁగించి సంశప్తకులఁ జంపి సూర్యాస్తమయానంతరమున సంధ్యారాగం బుపలక్షించి త్రిగర్తాదిసైనికులు తన కోహటించి కయ్యము సాలించియరిగినం దానును మఱలి శిబిరమునకు వచ్చువాఁడు దుర్నిమిత్తములం గాంచి బాష్పగద్గదకంఠుండై పుండరీకాక్షున కిట్లనియె. కృష్ణా యేలొకో నామనంబు భయవిహ్వలం బయ్యె. మాట తడఁ బడుచున్నది. వామభుజనేత్రములు వెడవెడ యదరుచున్నవి. మేను విరవిర వొవుచున్నది. ఎద్దియే ననిష్టము డెందమునఁ దోఁచుచున్నది. ఏదిక్కుచూ చినం బలుదెఱంగు లగునుత్పాతములు వెఱపు పుట్టించుచున్నవి. భ్రాతృసచివ సమన్వితంబుగ ధర్మరాజు కుశలముండునే? యనుటయు వనజనాభుం డయ్యా, భ్రాతృసచివసమన్వితముగ ధర్మరాజు కుశలముండువాఁడు. ఎయ్యదియేనియు నించుక యనిష్టము పొసఁగియుండనోపు ననితలఁచెద వగవకు మనియూరార్చుట యు నించుక యూఱడిల్లి యర్జునుఁడు వాసుదేవుఁడును దానును మార్గము

ననే సంధ్యోపాసనముఁ గావించి నాఁటికయ్యమున నడిచినవృత్తాంతములనెల్లఁ జెప్పి కొనుచు శిబిరము డాయవచ్చి యెప్పటిసొంపు దప్పియున్న శిబిరముఁ గనుంగొని ధనంజయుఁడు చింతాశోకవ్యాకులహృదయుండై దామోదరున కిట్లనియె. జనార్దనా, మంగళవాద్యము లేలొకో శిబిరమున మ్రోయింపరు, శంఖములఁ బూరింపరు, సింహనాదములఁ గావింపరు, తాళలయానుగుణముగ వీణలువాయింపరు, వందిమాగధులు ప్రస్తుతివచనములఁ బలుకరు, యోధు లెదురయ్యుఁ దల లెత్తి నన్నుఁ జూచుట మాని తలలు వాంచికొని పోవుచున్నారు, వ్యాకులత్వముఁ బొరసియున్న స్వజనముఁ జూచి నామనస్సు తల్లడపడుచున్నది. నాయన్నదమ్ములకును ద్రుపదవిరాటాదులకును సేమముగలిగియుండునెక్కొ, సౌభద్రుఁడు నిత్యంబు తమ్ములతోడ నన్నెదుర్కొనువాఁడుగదా, ఆకుమారుఁడు చిఱునగవు నెమ్మొగమ్మున సొంపుపెంపు సంపాదింప నేలొకో నేఁడు రాఁడని చెప్పుచుఁ జింతాశోకవ్యాకులసకలజనసమన్వితంబై యున్నశిబిరముఁ జొచ్చి సౌభద్రుం గానక వగం బొగలుచు నందఱం జూచి యిట్లనియె.

ఏలొకొ మీరు నన్నెదుర్కొనరు. ముఖవర్ణంబును బ్రసన్నంబు గాదయ్యె. అభిమన్యుఁ డగపడఁడు. ఆచార్యుఁడు నేఁడు పద్మవ్యూహ మమర్చె నని వింటిని. దాని భేదింపఁగ నభిమన్యుండుదక్క లాఁతు లెఱుంగరు. నే నతనికి భేదించుట చెప్పియుంటిఁగాని వెడ్డరంబైనం దప్పించికొనువిధంబుఁ జెప్పనైతి. ఆమొనభేదింపఁగ మీరు వానిం బంపరుగదా. అయ్యనీకంబు భేదించి కుమారుఁడు పరులకుఁ జిక్కఁడుగదా. సింహవిక్రముఁ డగునాకుమారునకుఁ గీడడరదుగదా. హరికిఁ గూర్చుమేనల్లుఁడు కుంతీదేవికిఁ బ్రియపౌత్రుండు కేశవతుల్యవిక్రముఁడు నగుసుభద్రగారాబుకొడుకున కెవ్వఁడు చేటుఁగావించె? మృదుకుటిలకుంతలుండు, బాలమృగలోచనుండు, మత్తశుండాలవిక్రాంతుఁడు, గున్నమావిమ్రాఁకుమాడ్కిఁ బొదిదియగువాఁడు, స్మితపూర్వభాషణుఁడు, శాంతుఁడు, గురువాక్యకరుఁడు, మహోత్సాహుఁడు, మహావీర్యుఁడు, సమరప్రియుండు, జ్ఞానవంతుఁడు, కృతాస్త్రుఁడు, పితృప్రియహితరతుండు, కయ్యమున వెఱవనిబంటు, ముందుమిగులని ప్రోడ, భక్తులఁ బ్రోచుసామి, రథాతిరథగణనమున మహారథుఁ డనం బేర్కొనఁబడినబిరుదు, నాకంటె నెక్కుడగువిలుకాఁడు, ప్రద్యుమ్నునకు నాకును హరికినిం గూర్చుశిష్యుఁడు, భక్తుఁ, డనురక్తుఁడు, నీచపథమున నడువనియుదాత్తుఁడు, కృత మెఱిఁగినగుణవతుఁ, డుపకారి, మాటకారి, చదువరి, నేర్పరి, యేను గారాముసఁ బెంచినదుజ్జుఁడు, లాఁతులకలిమికిఁ జూపోపునట్టియుత్తముఁడు, పిఱుతివియక యని నడరుజోదు, బాలుఁడయ్యును నబాలవిక్రముఁడు నగునభిమన్యునిఁ గానకున్న నే బ్రతుకఁ జాలను. గండుఁగోయిలయులివున కెనవచ్చువానితిన్నని

యెలుంగు వినకుండినను వేల్పులకును బడయరానివానిసొగసుమొగమునుం జూడకుండినను నాకుఁ జిత్తశాంతి యెక్కడిది? మృదులశయనతలమున నిద్రించి వేఁబోకట వందిమాగధసందోహస్తుతివచనముల మేల్కనుసుకుమారుఁడు నేఁడక్కటా యక్కయ్యంపునేలఁ బలువురఁ ద్రోచుదారయయ్యుఁ దా ననాథునియట్టులు పడి వీనులు సూడఁ జాలినవఱలుయలుఅపులు వినుచు నెట్లున్నవాఁడో సమరవిముఖుండుగానియతని నమరస్త్రీలు వరింప నుపాసింతురుగాఁబోలు. ఎండ వేఁడిమి సోఁకకుండఁగ వెలిగొడుగునీడ నుండునాయొడయనికలువతేఁకులకుసరివచ్చుకన్నుఁగవఁబొలుపారునెమ్మోము రేణురూషితంబు గాకుండునే. హాపుత్రా! నీనెమ్మోము నెల్లప్రొద్దును జూచుచుండినను దనియనినన్ను భాగ్యహీనుని విడనాడి యెట కేగితో! సుకృతిగమ్యం బగుసంయమనీపురమున కరిగి నిజకాంతిపుంజముల నద్దేశము వెలిఁగించుచున్నాఁడవే? నిక్కువంబుగ యముఁడును వరుణుఁడును గుబేరుఁడును నిన్ను వెఱవనిమగండని పూజింతు రనిబహువిధముల నొడపగిలినబేహారిచందమున వగలఁ బొగిలిపొగిలి వనరివనరి ధర్మరాజున కిట్లనియె.

అర్జునుఁడు ధర్మరాజు నభిమన్యుమరణప్రకారం బడుగుట.

కౌరవేశ్వరా, సౌభద్రుండు పద్మవ్యూహంబు భేదించి ద్రోణకృపకర్ణాదులగుపలువురుయోధవీరులకు నిస్సహాయుండై తా నొక్కరుండ చిక్కి యోపినకొలంది పోరి వారిబారిం బడి మడిసెనే? అప్పుడు తండ్రీ వేవేగ యెద్దు మని నన్నుఁ దలంచి పిలువకుండునే? తప్పఁ జెప్పితి. కృష్ణునల్లుఁ డస్మత్పుత్రుఁడు నగు సౌభద్రుఁడు లాఁతులఁ దోడ్పడఁ బిలుచువాఁడే? అబ్బాలునిపై నాక్రూరచిత్తులెట్టులు కట్టెండితనమునఁ బెక్కుతూపు లడరించిరో. నిత్యము నావచ్చుతఱిఁ జిఱునగవుమొగముతోడ నెదురువచ్చుముద్దుబిడ్డఁడు నేఁడురాఁడయ్యె. నెత్తుటఁ జొత్తిల్లినమేనితోఁ గయ్యంపునేలం బడి పుడమికి వచ్చి వేవెలుంగుభంగి నున్నవాఁడుకాఁబోలు. అక్కటా! సౌభద్రుం గానక మేనఁ బ్రాణములు దాల్చియున్ననాగుండె ఱ్రయ్యలు గాదయ్యె. ధాత ఱాతఁ జేసియుండనోపు. కొడుకు మడిసె నని విని సుభద్ర యెట్లు బ్రతుకనేర్చును? ద్రౌపది యేవిధమున మేనితో నుండఁగలదు? అయ్యిరువుర నే నెట్లు చూచువాఁడ? మగనిం గానక నవ్రోఢ యగునుత్తరయుత్తలంపా పెత్తెఱుంగుననాఱఁగలదు? ఆకోడలి నెట్లు గాంచువాఁడ? అక్కడ నేను సంశప్తకులతోడం బోరునెడ దర్పోద్రిక్తులైనధార్తరాష్ట్రులపటుసింహనాదము వింటిని. మఱియు నుబ్బునం బొంగుచున్నయవ్వెంగలులం బిలిచి పేరెలుం గెత్తి యోధర్మబాహ్యులారా! బీభత్సు నెదిర్చి పోరనేరక బాలుఁడైనయభిమన్యుం జంపి యేల ప్రుల్లిపడియెదరు? కేశవార్జునులకు విప్రియముఁజేసినమీకెలమియెక్కడిది. ఇదిమీకేడ్వఁ దఱిగాని సంతసింపఁ దఱిగాదు. మీచేసినపా

పంబు ఫలము శీఘ్రముగఁ గుడువఁగలరు ? ఇంత యధర్మము వమ్మగునే ? బాలు నొక్కనిం బెక్కండ్రు పొదివి చంపియుల్లసిల్లరాదని తూలనాడుచుండ వింటేఁగాని కృష్ణుఁడు విని నని చేయూర్పరానిపోరు పెల్లునఁ జెవిం బెట్టనైతి. కృష్ణుఁడైన నా కప్పుడు తెలియఁ జెప్పఁడయ్యె. చెప్పియుండినం బాలఘాతకు లగునాక్రూరుల నందఱ నొక్కమాత్రలోన శరానలమునఁ గాల్చియుండుదు నని కన్నీరు జాలువాఱఁ బలవించుచున్నంత ననునయపూర్వకముగా మురారి యతని కిట్లనియె. భారతసత్తమా, యుద్ధజీవనులగుక్షత్రియుల కందఱకు నిదియే పోకడ. క్షత్రియులకు వెనుదీయక పోరనచ్చుట ధర్మం బని ధర్మశాస్త్రాచార్యులు విధించియుండుట నీ వెఱుంగవే ? అభిమన్యుఁడు విముఖుఁడుగాక మోపినంత పోరుచేసి శస్త్రిమరణంబుఁ జెందినవాఁడు గావున నుత్తమలోకముల సుగతిం బొందువాఁడు. విదితవేద్యుఁడైననీకుం జెప్పవలయునే ? ఇదియే తొల్లింటిపెద్దలు నడిచినత్రోవ యగుట నీకు విదితంబు కదా ? నీ విట్టు లడలుచుండిన నన్నదమ్ములును జెలులును జుట్టలును నెల్లరాజులును దీనులై తల్లడిల్లుచున్నవారు. వగ పుడిగి వీరిం దేర్పు మని యనునయించుచున్నంత నన్నదమ్ములం జూచి యయ్యా, యభిమన్యుఁడు వడిన తెఱంగైనం దెలియఁ జెప్పరాదొ యెవ్వరు వానిని నేలకుఁ దెచ్చిరో యప్పాపాత్ములత్రుళ్లడగించెద. మీ రందఱు కృతాస్త్రులాయుధపాణులై యుండఁగ దేవేంద్రుఁడు తాన యెత్తి వచ్చినను సౌభద్రుం బరిమార్పఁ గలఁడె ? అక్కటా ! మీరు నాకొడుకును బ్రోవఁ జాల రని యెఱింగియుండిన డెప్పరము చొప్పడినప్పు డేను దోడై బిడ్డను గాచికొనియుండుదు. మీశౌర్యంబు గాల్పనే ? మీకుఁ బౌరుషంబు లేదు. పరాక్రమము సున్న. మిమ్ము నమ్మి చిన్నికొమరుం గోలుపోయితి. మోసపోయితి. మీకుఁ గవచశస్త్రాయుధాదు లలంకారార్థంబకాని యొండు కాదు. మి మ్మననేల ? అత్యంతదుర్బలులు పిఱికిపోతులు పోరుతెఱంగెఱుంగనివారు నగుమీపై నమ్మిక యుంచిన నన్నే నిందించికొనియెద. మీకుఁ బలుక నోరు గలదే యని శోకామర్షదహ్యమానమానసుండై తోఁచినట్లెల్లఁ బలుకుచుఁ బెద్దయు రోఁజుచున్నయర్జునుం బల్కరింపను గన్నెత్తి చూడనునెవ్వరును జాలకుండునంత దనుజాంతకుండును ధర్మరాజు ననునయవచములఁ బల్కుచుండిరి. అతండును బ్రేమబహుమానములు కారణములుగా వారిద్దఱమాటలు చెవియొగ్గి వినుచుండు. అట్టియెడ వాసుదేవుఁ డనునయవచనములఁ బల్కి యించుక యూరార్చినం జూచి ధర్మరా జర్జునున కిట్లనియె.

ధర్మరా జర్జునున కభిమన్యువధప్రకారంబుఁ జెప్పుట.

శూరాగ్రణీ, నీవు సంశప్తకులఁ జంపఁగఁబోయినపదంపడి యాచార్యుఁ డిక్కడఁ బద్మవ్యూహముఁ బన్ని నన్నుఁ బట్టగ మిక్కిలి కడంక చేయుటయుఁ

దదీయబాణార్దితులమై మే మాగురునియెదుర నిలువఁ జాలమైతిమి. ఇఁక నా మొన భేదింపఁ జాలమైతి మని వేఱ చెప్పవలయునే? అప్పు డామొగ్గరంబు భేదింపఁగ మనలోనెల్ల నెక్కుడయభిమన్యుఁడె యెఱింగినవాఁడు కావున నేన పిలిచి కుమారా, తొలుతనీ వించుక భేదించి తెరువు గావింపుము. ఆ తెరువున మే మందఱముం గూడ ముట్టుదు మనిపనిచిన నబ్బాలుఁడు నీయుపదేశప్రభావమునను శౌర్యమునను నెప్పి యది తనకు మోవరానిమోపని తలంపక సాగరంబు సొచ్చు సుపర్ణునిరీతి నస్మద్వచనచోదితుండై సాదిచోదితం బైనయుత్తమాశ్వముమాడ్కి నడరి ద్రోణానీకంబుఁ జొచ్చె. వాఁడు సొచ్చినతెరువుననే యేముం గూడఁ జొరఁ బోయిన రుద్రవరప్రభావమునం జేసి సైంధవుఁడు మా కడ్డపడియె. అంత నక్కడ ద్రోణకర్ణకృపద్రౌణిబృహద్బలకృతవర్మ లాఱుగురురథికు లబ్బాలుం జుట్టుముట్టిన నందఱితోడనుం బెనంగి యెనిమిదివేవురురథికులను తొమ్మిదివేలయేనుంగులును లక్ష్మణకుమారప్రభృతు లగు రెండువేవురరాజకుమారులను గోసలేశ్వరుండైనబృహద్బలునిం జంపి యెక్కటిబవరంబు సేయుచు వంచనచే నయ్యాఱుగురు మేటిమగలు తన్ను విరథుం జేసిన గదాపాణియై పోరి దుశ్శాసనసుతుని విరథుం గావించి వానితోడ గదపోట్లాట యొనరించి తానును వాఁడును బరస్పరప్రహారముల నెచ్చి కాలధర్మము నొందిరి. మనకు శోకముఁ గావించునట్టియభిమన్యుని కథ యిది. మనయభిమన్యుఁడు బాలుఁడయ్యుఁ గడిందిమగఁటిమిం బేర్చి యపరాఙ్ముఖుండై పోరి వీరస్వర్గముఁ బ్రాపించె నని ధర్మరాజు చెప్పఁగ విని యర్జునుఁడు హాపుత్రా యని వేఁడినిట్టూర్పు నిగిడించిమూర్ఛిల్లి నేలం బడియె. అందుల కందఱును గొందలం బందుచు ఱెప్ప లార్పకచూచుచుఁ జుట్లం గూర్చుండి చెయ్వులు దక్కి యుండిరి.

అర్జునుఁడు సైంధవుం జంపుదు నని ప్రతిజ్ఞ చేయుట.

అంతఁ గొంతవడికి శిశిరోపచారముల మూర్ఛ దేఱి యర్జునుండు పుత్రమరణశోకసంతాపసంతప్తం బయినచిత్తమున సైంధవునిమీఁదికోపం బంతకంత కగ్గలంబుగాఁగఁ గన్నీరు జాలువాఱఁ బలవించుచుఁ బెద్దయు రోఁజుచు చేయి చేతం బెట్టి చఱచుచు నున్మత్తునిరీతి నిటునటుం జూచుచు ధర్మరాజున కిట్లనియె. నరేంద్రా, సత్యముగ నేను బ్రతిజ్ఞ చేసెద వినుము. ధార్తరాష్ట్రప్రియంకరుఁడు నాకుఁ బరమవిద్వేష్యుఁడు నగుసైంధవుఁడు ప్రాణరక్షాపరత్వమునఁ బాఱిపోకుండునేని మనలను గృష్ణుని శరణువేఁడఁడేని యెల్లి యబ్బాలఘాతకుం బరిమార్చెద. మఱియు వానికిఁ గావలియై ద్రోణకృపాదు లెందఱు వచ్చి పైఁబడినను మదీయశరవర్షమునం గప్పి తెరలించెద. ఇట్లు చేయఁ జాలనేని పుణ్యలోకములకుఁ దప్పుదు. వెండియు మాతృఘాతకులుఁ, బితృఘాతకులు, గురుదారరతులుఁ,

భిక్షుకులు, సాధువుల దూఱువారు, నిల్లడవెట్టినసొమ్ముల గ్రుచ్చిలించువారు, నిల్లాలిని నిష్కారణముగ నిందించువారు, నమ్మించి మోసపుచ్చువారు, బ్రహ్మఘాతకులు, గోఘాతకులు, దేవతాతిథులకుఁ బెట్టక పాయసాదులఁ దామ తిను వారు, స్వాధ్యాయనిష్ఠు లైనయుత్తమబ్రాహ్మణులను గురువులనుం దిరస్కరించు వారు, గోబ్రాహ్మణాగ్నులఁ బాదముల స్పృశించువారు, జలమున మూత్రపురీషనిష్ఠీవనంబులఁ జేయువారు, వివస్త్రులై స్నానము సలుపువారు, వంధ్యాతిథులు, లంచముఁ దీయువారు, నసత్యవాదులు, వంచకులు, స్వాత్మాపహారులు, మిథ్యాభిశస్తులు, భృత్యదారపుత్రాదులు సూచుచుండ వారికిఁ బెట్టక తార తినువారుఁ, దమమాటమెయి నడుచుచున్నసాధువులఁ బరిత్యజించు వారు, నుపకారుల నిందించువారు, నుత్తమప్రాతివేశ్యునకు శ్రాద్ధక్రియయందుఁ బెట్టనివారు, నసర్హులకుఁ బెట్టువారు, వృషలీపతులు, మద్యపానరతులు, భిన్నమర్యాదులుఁ, గృతఘ్నులు, భ్రాతృనిందకులు, మఱియు నానాప్రకారు లైన యధార్మికులును బోవునధమగతికిఁ బోవువాఁడను. మఱియు నొక్కప్రతిజ్ఞ చేసెద. ఎల్లి ప్రొద్దు గ్రుంకకమున్న సింధురాజుతలఁ ద్రెవ్వ నేయనేని యందఱును జూచుచుండ నగ్నిలోఁ బడుదు. దేవదానవాదు లెవ్వరును నింక వానిఁ గావఁ జాలరు. స్వర్గలోకమున కేగి యింద్రునిమఱుఁగుఁ జొచ్చినను బాతాళమునకుఁ బఱచినను రేపు సైంధవుం జంపుట నిక్కవం బని ప్రతిజ్ఞ చేసి గాండీవముఁ దెప్పించి సవ్యదక్షిణముల నాకర్షించి నారి సారించుటయు నానినాదంబు భూనభోంతరము నిండె. అట్టియెడ జనార్దనుండు పాంచజన్యముఁ బూరించినం గిరీటియు దేవదత్తం బొత్తుటయు నత్తుములధ్వానంబున నాకసంబును భూమియుఁ బాతాళంబును బ్రతిస్వనం బిచ్చె. అప్పుడు పాండవసైనికులు భేరీప్రముఖవాద్యముల మ్రోయించి సింహనాదముఁ గావించి ముదితహృదయులై యనుజ్ఞ వడసి తమతమనివాసముల కరిగిరి.

అర్జునుప్రతిజ్ఞ విని సైంధవుఁడు భయపడి దుర్యోధనునితోఁ జెప్పికొనుట.

ఆనినాదము విని యిక్కడ జయద్రథుఁడు తనలో నిది యేమియోయని విచారించుచుండి తన వేగులవారివలన ధనంజయుఁడు చేసిన ప్రతిజ్ఞ యంతయు సవిస్తరముగ నెఱింగి శోకసమ్బాధహృదయుండై పెక్కండ్రురాజులు గొలువం గొలువునఁ గార్యచింతనపరుండై యున్న దుర్యోధనునొద్దకుఁ దత్క్షణంబ యరిగి గాండీవివలని వెఱపున నుత్తలంపడుచిత్తమున సిగ్గుమాలి యిట్లనియె. వింటిరే మీరెల్ల ధనంజయుండు దనకొడుకు మడియుటకు నేన మూలం బని నాపయిం గినిసి యెల్లి ప్రొద్దుగ్రుంకకయమున్న నన్నుఁ జంపునట్లుగను నది యసాధ్యంబైనం దా ననలంబుఁ జొచ్చునట్లుగనుం బ్రతిజ్ఞ చేసెనఁట. ఇంద ఱుండఁగ నాదు

ర్బుద్ధికి నామీఁద నింతకినుకకుఁ గతం బెయ్యదియో యెఱుంగరాదు. మీ కెల్ల శుభం బగుఁగాక. ప్రాణరక్షాపరుండనై యేను గయ్యము మాని యింటికిఁ బోయెద. ద్రోణదుర్యోధనకృపశల్యబాహ్లికదుశ్శాసనాదులు జమునింటికిఁ బోయిన వానినైనం దేరఁ జాలువారు నన్నుఁ గావం గడంగుదురని బాస యిత్తురేని నమ్మి యిచ్చటన యుండెద. మీరిందఱును నాప్రోపున కాయితపడి ప్రాపై యుండ నర్జునుండు న న్నేమి చేయఁగలఁ డని తలంచెద. అట్లునుం దలంపరాదు. పాండవసైనికులు వగవఁ దఱిమైనయియ్యెడ నుమ్మలికమ్ము మాని చిందమ్ముల నొత్తియు నార్చియుం బేర్చినవారు. నాకుం జూడ నింతకు మూలము గాండీవిప్రతిజ్ఞ దక్క నొండొక్కటి తోఁపదు. లెస్స పరికించి చూచిన నిక్కడివార లందఱును వాని ప్రతినఁ దప్పింపఁ జాలమి నిక్కువంబు. దేవతలకు నవిజేయులైనపౌలోమకాలకేయాదుల వధించియు నెక్కటిబవరమునఁ బరమేశ్వరునకు మెచ్చొనరించియుఁ బొగడ్త కెక్కిన యక్కిరీటి తో లాఁతులఁ బోల్పవచ్చునే? వాఁడు ప్రతిజ్ఞ చేసెనని విన్నమొదలుగాఁ జచ్చెడి వాని కెట్టు లట్టుల నాకు గాత్రావసాదంబు గలిగె. దేవదానవగంధర్వాదులు నర్జునచికీర్షితంబుఁ దప్పింప నేరరన్న నింక నిక్కడివారలం జెప్పనేల? కావున నా విలుకాని కగపడకుండ భండనాంగణంబుఁ దొలంగి పాఱుటయే ప్రాణరక్షాపరుండనైన నా కిపుడు కర్తవ్యంబని భయవ్యాకులచిత్తుండై సైంధవుండు సెప్పిన విని స్వకార్యసాధనోద్యోగి యైన దుర్యోధనుం డతని కిట్లనియె. నరోత్తమా, వెఱవవలదు. ద్రోణకృపాదు లగుకొందఱు మహారథులు జమునింటికిఁ బోయినవానినైనం దేరఁ జాలుదు రని నీవ పేరుకొంటివిగదా. అట్టివా రందఱును గట్టిమొన గట్టి నీకుఁ గావలియైయుండ గాండీవికి నిన్నుఁ దేఱి చూడ నయిన నలవి యగునే? ఎల్లిమదీయసకలసైన్యములును నిన్నుఁ గాచుచునడుచునట్లు నియమించెద. చింత విడువుము, క్రీడివలని వెఱపుడుగు మనియనునయించుటయు సింధురాజు రారాజును దోడుకొని ద్రోణుని పాలికిఁ జని యయ్యాచార్యునకుఁ బ్రణామంబుఁ గావించి వివ్వచ్చునిప్రతిజ్ఞవలనితనవెఱపు నివేదించి నాకును గాండీవికి నస్త్రగ్రహణసంధానప్రయోగలక్ష్యశుద్ధిదూరపాతనాదులయెడ విశేషం బెట్టిది యని యడుగ గురుం డతని కిట్లనియె. సింధుపతీ, నీకు నర్జునునకు నాచార్యకంబు తుల్యప్రకారంబ. ఐన నతండు వివిధశ్రమంబుల కోర్చి యలవరించుటం జేసియుఁ బాశుపతాది దివ్యాస్త్రగ్రామంబు గడించుటం జేసియు నీకంటె నతండే పెక్కుమడుంగులెక్కుడువాఁడు. అది యట్లుండె. ఏను గలుగ నీకు వెఱవనేల? మదీయబాహుబలసంరక్షితుఁడై ననిన్నుఁ జెనక సురలును వలంతులు గారు. పార్థునకును బరమదుస్తరం బైనయభేద్యవ్యూహ మొక్కండు రే పమర్చెద. వెఱపు దక్కి కులపరంపరాప్రాప్తం బయినక్షాత్రధర్మము వట్టి పోరుము.

మఱియు విధియుతముగ వేదములఁ జదివి వివిధభోగములఁ గుడిచి యధ్వరము లొనరించియున్న నీకు మృత్యువన్న నెవ్వెఱవఁదగునే? అదియునుంగాక యెవ్వరును స్థిరకాలజీవులు గారు. మఱి యెన్నఁడైనం జావవలసినవార లనుట నిక్కువంబు. కౌరవులును బాండవులును నేనును నాకొడుకును గాలముదీఱినపుడీమేను విడిచి యుత్తరలోకముల కేగువారము కాని యొండు గాదు. క్షత్రియకులప్రజాతున కింటఁ దెవులున నవసి చచ్చుట కంటె శస్త్రమరణం బెంతయే మేలని ధర్మశాస్త్రాచార్యులు విధించుట నీవు నెఱుంగుదుగదా. నియమపూర్వకముగ వివిధ తపోదానాదులనాచరించిన యుత్తములు వొందులోకములను క్షత్రియులువెఱవకయు లేటమొగంబు వెట్టకయుఁ బోరి శస్త్రఘాతమున మేనుదొఱంగినం బొందుదురు. క్షత్రధర్మనిష్ఠితుం డైననీకుఁ బ్రాణత్రాణపరాయణత్వంబు తగదని యూరార్చి బోధించిన నూఱడిల్లి జయద్రథుం డాచార్యుని దుర్యోధనాదులను వీడ్కొని నిజావాసమున కరిగె. దుర్యోధనప్రముఖులును గురుననుజ్ఞఁ గొని తమతమనెలవులకుఁ బోయిరి. ఆచార్యునివచనంబు విని మనవార లర్జునువలని వెఱపు విడిచి సంతోషమున నార్చుచు భేరీప్రముఖవాదిత్రముల మ్రోయించిరి.

## కృష్ణార్జునులు సంభాషించుట.

అంత నక్కడ వాసుదేవుఁడు పార్థుం బిలిచి యర్జునా, నాతో నాలోచింపక సర్వరాజసమక్షమున నెల్లి సైంధవుతలఁ ద్రెవ్వ నేయుదు నని దుష్కరప్రతిజ్ఞ చేసితివి. ఇయ్యది మనకు మోవరానిమోపయ్యె. నీవు ప్రతిజ్ఞ చేసినప్పుడిక్కడఁ బుట్టినసింహనాదశంఖారవముల విని కౌరవులు పుత్రశోకార్తుం డైనభీభత్సుం డీరేయియే యనికి నడకట్టి వచ్చునెకో యని తలఁచి తలఁకి కయ్యమునకు వెడలుసన్నాహమున నుండునంత సింధురాజు తనచారులు సెప్పఁగ నీప్రతిజ్ఞ విని రాజలోకంబుతోడఁ గార్యాలోచనంబున నున్నదుర్యోధనునొద్దకుఁ జని నీప్రతిజ్ఞయెల్లయుం దెలిపి దేవతలకు నవిజేయు లైనపౌలోమకాలకేయాదుల గెలిచియు నెక్కటిబవరంబునఁ బరమేశ్వరునకు మెచ్చొనరించియు నైంద్రపాశుపతాదిదివ్యాస్త్రగ్రామంబు సాధించియుఁ బేరెన్నికఁ గన్నగాండీవిచంపఁ దలంచినవానిం బ్రదికింపఁగ నాచార్యాదులు మేటిశూరులయ్యును వలంతులు గారు గావునఁ దాను బ్రాణత్రాణపరాయణత్వంబునసమరముఁ దొఱంగి పోవుదునని తెలియఁ బలికెనఁట. పలుకుటయు దుర్యోధనుఁడు ధనంజయునివలని వెఱపు మాను మనియనునయించి యతండును దానునుద్రోణునొద్ద కరిగి యెల్లయుం దేటపఱిచిన నగ్గురుండు నీ కభేద్యం బయినతెఱంగుగా నెల్లి శకటవ్యూహంబు నునందుఁ బశ్చార్థమునఁ బద్మవ్యూహమునుఁ, బద్మకర్ణికామధ్యంబున సూచీవ్యూహమును నమర్చి సూచీమూలస్థానమున సైంధవుని నిలిపి కృపకర్ణశ

ల్యాశ్వత్థామవృషసేనభూరిశ్రవుల నాఱుగురుదొరల నతనికిఁ గావలియైయుండ నియమించి తా నగ్రభాగమున వీర్యధుర్యుండై పొలిచియాసింధుపతిం గాచు వాఁడ ననిచెప్పెనట. ఇదియెల్లయు మనచారులవలన నిప్పుడు వింటిని. అయ్యా ఱుగురుదొరలం గెలువక సైంధవుం దెగటార్ప నలవి గాదు. వారిలో నొక్కని గెలుచుటయు దుష్కరంబు. అందఱును గూడి యొక్కపనికై యుక్కడరం గ డంగి కొలువసంగిన నింక నే మనం గలను. కావునఁ గార్యసిద్ధిపొందెడు నిపు ణమంత్రవిదు లగుసచివులతో నాలోచించుట మే లనిన వనజనాభునకు ధనం జయుం డిట్లనియె. మహాత్మా, నీవివరించినయాఱుగురుకౌరవశూరులునునాలోఁ జక్కసాము గాఁజాల రని నానిశ్చయము. తదస్త్రములెల్ల మదస్త్రములఁ బ్ర తిహతంబు లగుట యందరును జూడఁ గలరు. ఆచార్యుండు తమవారలును దానును మదీయాస్త్రవీర్యంబుఁ జూచుచుఁ జేయునది లేక కార్యము సెడనని చింతించుచుండ నే నెల్లి ప్రొద్దు గ్రుంకకమున్న సైంధవుతలఁ దఱుగుట సుని శ్చితంబు. వసువులు రుద్రు లాదిత్యులు సాధ్యులు విశ్వదేవు లశ్వినులు దిక్పాలు రు పితృగంధర్వాదులు ముల్లోకములం గల యశేషప్రాణులును వచ్చి యడ్డపడి నను సత్యము సాక్షిగాఁగ నేను రేపు సైంధవుని జంపుదు. నీవ చూచెదవు. అ ప్పాపాత్మునిఁ గావఁ బూనినయాచార్యుని మొగ్గరంబు నే తొలుత నేపగ్గలించి సుర లగ్గింపఁ జించి దుర్యోధనచింతితం బైనసైంధవవధద్యూతంబున గెలుపు గొని యెద. రేపు నాయమ్ములాయమ్ములు సోఁకఁగఁ గూలుగజవాజినరగాత్రఖండము లును బాఱుశోణితనదీప్రవాహములును గయ్యంపునేల నతిసాంద్రంబులై క్రవ్యా దగణములకు సంతర్పణంబును విద్విషద్వర్గమునకు ఖేదంబును మిత్రబంధువ్రా తంబునకు మోదంబునుం గావించు. ఇంద్రయమవరుణకుబేరమహాదేవాదులయ నుగ్రహమునఁ బడసినదివ్యాస్త్రముల సముద్దీపితములఁ గావించి సురలు పిచ్చలిం చునట్లు సల్పెద. విల్లు గాండీవమఁట. విలుకాఁడు నేనఁట. సారథి నీవఁట. ఇంక దుష్కరకృత్యం బొక్కండు గలుగు ననితలంపఁ బోలునే? నీయనుగ్రహమునకుఁ బాత్రభూతుఁడగునాకుఁ బ్రతిజ్ఞానిర్వహణం బెట్లు దుష్కరం బగు? ఇంద్రాదిది వ్యాస్త్రములను గాండీవమును ధనంజయుని నలంతిగఁ జూడవలదు. ఏను గెలు తుఁగాని గెలువంబడను. సముద్రమునందు జలమును జంద్రునందు లక్ష్మియు బ్రాహ్మణులందు సత్యమును సాధువులందు సన్నతియు యజ్ఞములందు శ్రీయు నారాయణునందు జయము నెట్లు లట్లులు నాయందుఁ బట్టినప్రతిజ్ఞ సుస్థిరంబు. పెద్దయుఁ గార్యము దఱియవచ్చెఁ గావున రేపకడన విజయాపహప్రకారమున మనతే రాయితపరుపు మనిపలికి పుత్రశోకార్త యగునీచెలియలిని బతివియో గవిహ్వల యగునుత్తరను నుచితవచనములఁ దేర్పవలయుఁగదా. అందులకు నీవు

దక్కు లాఁతులు సాల రనవుడు దామోదరుండు ధర్మరాజును వీడుకొని క్రీడిని దోడుకొని తదావాసమున కరిగి యభ్యంతరంబు సొచ్చి పుత్రశోకమునఁ గుందుచున్న కూరిమిచెలియలి కిట్లనియె.

### శ్రీకృష్ణుఁడు సుభద్ర నూఱడించుట.

సుభద్రా, శోక ముడుగుము. కాలప్రాప్తంబు లగుశుభాశుభములఁ దప్పించికొనఁ బ్రాణుల కలవి గాదు. నీకుమారుఁ డుత్తమక్షత్రియకులసంభూతునకు ధర్మప్రాప్తం బయినశస్త్రమరణమునఁ బుణ్యైకగమ్యములు సర్వకామఫలప్రదములు నగునుత్తమలోకములఁ బ్రాపించినవాఁడు. తపోబ్రహ్మచర్యాదినిష్ఠలతినియమమున నడిపినవారికిఁగాని యాలోకములు పెఱవారికి గమ్యములు గావు. వీరులయింట వీరునకుఁ బుట్టి వీరున కిల్లాలివై వీరుఁ డగుకొడుకును గనిన నీకు క్షాత్రధర్మముఁ బరికింపక యిట్లు వగవఁ బోలదు. వానిచావునకు మూలంబైనసైంధవుని నీమగం డెల్లి నిజముగఁ జంపువాఁడు. అర్జునుఁడు చంపుదు నని ప్రతిన వట్టినపదంపడి యాబాలఘాతకునకు దేవేంద్రునిప్రాపు గాంచినను బ్రదుకు గలుగదు. శమంతపంచకబాహ్యదేశమున సైంధవునితల తెగి పడియె నని రేపు మునిమాపున వినఁగలవు. కులక్రమాగతధర్మమున నాకలోకప్రాప్తుఁ డైన యభిమన్యుంగూర్చి శోకింపరాదు. నవోఢ యగుకోడలి నూరార్పు మని చెప్పుచున్నంత సుభద్ర యంతకంతకు స్వాంతమునం బెచ్చుపెరుఁగుచున్న శోకావేగమున నట్లని పలవించె. హాపుత్రా! నిర్భాగ్యురా లగునాకు నీ వెట్టు లబ్బుదువు. వత్సా, విశాలలోచనసుందర మగునీనెమ్మొగము ధరణీరేణురూషితంబయ్యె నవ్వోదితం బైనచంద్రబింబమురీతి నచ్చోటెల్ల వెలిఁగింపకుండునే? అక్కటా! మృదులశయనమునఁ బవ్వళించుసుకుమారుఁడవు వట్టినేల నెట్టులు పరుండెదవు. వరస్త్రీలు చుట్టునుం గొలువఁ గ్రీడించుప్రోడ విపుడు నక్కలు చుట్టునుం బరివేష్టింప నెట్టు లుండెదవు. వందిమాగధసందోహస్తుతిపాఠరవముల నాలకించువీనులఁ గ్రూరక్రవ్యాదరవముల నెట్టులు వినియెదవు. పాండవపాంచాలయాదవు లిందఱుండియు ననాథునియట్లపోలె నిస్సహాయుండై చిక్కిననిన్నుఁ గయ్యమున నెవ్వఁడు నేలకుఁ దెనేర్చెనో. నిన్నుఁ గానకుండిన నేను బ్రదుకఁ జాలను. కర్ణాంతాయతలోచనము సుందరకేశము మంజులవచనము దివ్యపరిమళోల్లాసభాసురము నగు నీనెమ్మొగము నెప్పటియట్ల నిర్వ్రణంబై యుండ నింకెప్పుడు చూడఁగలదానను. భీమసేనునిభుజబలంబును పార్థునివిలువిద్యనేర్పును బాంచాలురశౌర్యంబును యాదవులవీర్యంబును జేదిమత్స్యకేకయాదులవిక్రమంబునునుం గాల్పనే? రణమున దెప్పరమునకుఁ బాలైనని న్నిందఱును దప్పింపనేరరైరి. కొడుకా! నిన్నుఁ గన్గొననినాకు లోకమెల్లఁ బాడువాఱియున్నది. శౌరి కల్లుఁడవు గాండీవికిఁ బుత్రుఁడవు

నగునీవు రణమున నెట్లు పడితివో అయ్యో యున్నయట్టు లుండి యెట్టులో మటుమాయ మైతివి. నీపుట్టుక మొదలుగా నెల్లయుఁ గలయట్టు లయ్యె. మను ష్యజన్మ మిట్లు జలబుద్బుదచలం బగునే? కుఱ్ఱా! నీయెడఁబాటునఁ గుందుచున్న నీక్రొత్తడి యెట్లు మేనఁ బ్రాణములఁ దాల్చియుండనోపును. దూడసచ్చినయా వుకై వడి నాక్రందనంబు సేయుచున్నయన్నాతి నోయన్నా! నే నెవ్విధమున నూఱడింపనేర్తును. అక్కటకటా! నిన్నుఁ గని పెంచి పెద్దవానిం జేసి యింక నీవును నీబిడ్డలును భక్తి సేయ సుఖముగ మైమఱచియుండఁ గోరుచుండ ని త్తఱి నాచిత్తమున నుత్తలంపాటు నివ్వటిల్లఁజేసి తఱలితివే. ఎంతపాజ్ఞులైనను గాల గతిం దెలియఁ జాలరు. కేశవుఁడు నాథుఁడై యుండ ననాథునిపోలె నెక్కటిక య్యమున మడిసితి వింక నే మనం గలదు. యాయజూకులు దానపరులు నాచ రితబ్రహ్మచర్యులుఁ బుణ్యతీర్థావగాహనపావనులుఁ గృతజ్ఞులు వదాన్యులు గురు శుశ్రూషానిరతులు నగునుత్తమబ్రాహ్మణులును, బ్రాహ్మణకార్యములఁ జక్కప ఱచియు గోధాన్యాదిదానముల నొనరించియు ననేకాధ్వరముల నాచరించియు ధర్మపథమున వర్ణాశ్రమవిభాగపూర్వకముగఁ బెక్కేఁడులు రాజ్య మేలి తాపస తపష్షష్ఠాంశము గ్రహించియుఁ దుదిఁ బిఱుసనక యనిమొన శస్త్రిమరణంబుఁ బొందియు వాసిఁ గన్నమహారాజులును, మాతాపితృపరిచర్యయు ఋతుకాల భార్యాసంగమంబును బరదారధననిస్పృహయు సర్వభూతప్రియత్వంబును మద్య మాంసానృతదంభపరపీడానివృత్తియు నింద్రియజయంబును జ్ఞానతృప్తియుం గల యుత్తములు నేలోకములకుఁ జనుదు రట్టియుత్తమపుణ్యలోకముల కరిగి సుఖ ముండు మని పలుదెఱంగులఁ బరిదేవనంబు సేయుచున్నంత ద్రౌపదియు నుత్త రయు నచ్చోటికి వచ్చుటయు నమ్ముగురును బెద్దయుంబ్రొద్దు విలపించివిలపించి వగచివగచి పొగిలిపొగిలి తల్లడిల్లి మూర్ఛిల్లి నేలం బడినం గృష్ణుండు భృశదుః ఖితుండై శిశిరసలిలసేచనాద్యుపచారములఁ జేయించినం గొండొకవడికిఁ దెలిసి సుభద్ర లేచి కూర్చుండుటయు నుచితవచనముల నూరార్చి పాంచాలిం బిలిచి ద్రోవదీ యుత్తర నూఱడింపుము. సౌభద్రుఁ డితరదుర్లభము లైనయుత్తమలో కములకుఁ జనియె. ఇంక వానికి వగవం దగదు. మనకులమున నున్నయందఱును వానియట్లు పుణ్యగతి కేగవలయు ననియే మనము గోరవలయు. అందఱము నందులకుఁ బరమానందమున నొడంబడియున్నవారము. కానున్నది కాఁగల యది యని బహువిధములఁ నాశ్వాసనముఁ గావించి మగిడి ధర్మరాజునొద్ద కరిగి యతని నామంత్రణంబు సేసి యర్జునునితోడం దదావాసమున కరిగె.

అవ్విధమున నర్జునావాసమున కరిగి మురాంతకుండు మజ్జనంబుఁ గావించి వైడూర్యసన్నిభము లగుదర్భలఁ బఱపించి లాజచందనకుసుమాదుల విధియుత

ముగ నలంకరించి యాయుధోత్తమములఁ జుట్లనుం బెట్టించి యుండునంతఁ బార్థుఁ
డును గృతస్నానుండై వచ్చుటయు నచ్యుతుం డతని నయ్యాస్తరణమునఁ గూ
ర్చుండఁబెట్టి యయ్యా, నీవు నిత్యంబును రేయి నలుపుశివపూజఁ గావింపు మనిన
విజయుఁడు వివిధార్చనముల వాసుదేవపూజావిధానమున వాసుదేవు నర్చించు
టయు నాపూజలఁ గొని స్మేరవదనుండై జనార్దనుండు నీ విందు శయనింపుము
నీకార్యమునకు దగినవెరవు విచారించువాఁడనై పోయివచ్చెద నని కిరీటిని వీ
డ్కొని యాయుధపాణు లైనయుత్తమభటుల నర్జునుం గాచికొనియుండ నియ
మించి నిజావాసమున కరిగి దారుకుఁడు చేరువం జేరి పరిచర్యఁ గావింపఁగ మేలి
మెత్తనిపాన్పుపయిం బవ్వళించె. ఆరేయి పాండవులవీటివారెల్లరును గూరుకు
మాని పుత్రశోకార్తుండై యర్జునుండు రేపు ప్రొద్దు గ్రుంకకమున్న సైంధవుతలఁ
దఱుగుదుననియు నందులకుఁజాలకుండిన ననలంబు సొత్తుననియుం బ్రతిజ్ఞ చేసె.
అది యెట్లు కొనసాఁగఁగలదో. సత్యవచనుం డైనయమ్మహానుభావుఁడు తనప్రతిజ్ఞ
నెఱవేఱకుండినం బ్రాణములఁ దాల్చునే? పాండవులగెలుపెల్ల గాండీవితలమీఁ
దన యున్నయది. మనము దానహోమాదులఁ జేసి యెంతయేనిపుణ్య మార్జిం
చియుండుదుమేని తత్ఫలముననైన నర్జునుప్రతిజ్ఞ నెఱవేఱుఁగాక యని పలుకుచుఁ
దదేకచింతాపరాయణులై యుండ వేగుజాము దఱియ వచ్చె.

శ్రీకృష్ణుఁడు దారుకునితో నర్జునప్రతిజ్ఞావిషయము లగువచనములఁ జెప్పుట.

అట్టియెడ మేలుకాంచి నారాయణుండు సెజ్జచేరువ నున్న దారుకుం బిలిచి
పుత్రశోకార్తుండై పార్థుండు రేపు ప్రొద్దు గ్రుంకకమున్న సైంధవుఁ జంపుదు
నని ప్రతిజ్ఞ చేసినవాఁడు. దాని విని దుర్యోధనుండు ద్రోణాదులతోడ నాలో
చించి యది నెఱవేఱనితెఱంగుగా నభేద్యవ్యూహముగఁ దమసేనల నమర్చి యెట్టు
లైన నాజయద్రథుం గావఁ బూనియున్నవాఁడు. ద్రోణగుప్తుం డైనవానిం జం
పఁగ దైత్యదానవధ్వంససముదగ్రవిక్రముం డైనశక్రుండును జాలఁడు. భారద్వా
జప్రముఖులు పెక్కం డ్రొక్కటియై సింధుపతిం గావఁ బూనినం గిరీటికిఁ దనప్ర
తిజ్ఞ నెఱవేర్చుట దుష్కరం బయ్యెడి. ఐనను నే నందులకుఁ దగినవిధముఁ జేసి
సవ్యసాచి తనప్రతిజ్ఞ కొనసాగించునట్లు కావింప నున్నవాఁడను. ప్రతిన సెల్లకుం
డిన సత్యవ్రతుం డైనపార్థుఁడు బ్రదుకఁ దలంపఁడు. అతండు లేకుండిన నీలోక
మెల్లను నా కుండినట్లు గాదు. పుత్రమిత్రకళత్రజ్ఞాతిబాంధవాదు లందఱును
నాకుఁ గవ్వడియట్లు కూర్చువారు గారు. కావున నేనైనం గడంగి కర్ణసుయో
ధనాదుల నాయోధనధరిత్రికి బలి చేసి వాసవసుతునిప్రతిజ్ఞఁ గొనసాగించెద.
క్రోధావేగదుర్నిరీక్షుం డైననాకోత్తల రేపు సూచెదవు. అర్జునున కెవ్వఁడు పగ
తుఁ డతండ నాకుం బగతుఁడు. అతని కెవ్వఁడు ప్రియుఁ డతండ నాకుం బ్రి

యుఁడు. దేవదానవగంధర్వాదు లందఱును నాకు నర్జునునకుం గలచెలిమికలిమి నెల్లి తెల్లముగ నెఱుంగఁగలరు. రేపకడన కయ్యమునకు వెడలునపుడు నీవు మన తేరు సైన్యసుగ్రీవమేఘపుష్పబలాహకములం బూన్చి గరుడధ్వజం బెత్తి చక్రగదాప్రభృతినిఖిలాయుధములఁ బెట్టి మాతోడన తోలుకొని వచ్చి కయ్యంపునేలకుఱంగటం బెట్టికొనియుండునది. ఆర్షభస్వరమున నేను బాంచజన్యం బొత్తినపుడు మాచెంగటికిఁ బరమరయమునఁ దెచ్చునది. ఒక్కపవలింటిలోన మేనత్త కొడుకులవగఁ దీర్చెద. ధార్తరాష్ట్రు లందఱును జూచి బమ్మరించుచుండ బీభత్సుం డెల్లి సైంధవుతలఁ దఱుగువాఁడు. మఱియు నెవ్వని నెవ్వనిఁ గవ్వడి దాఁకు వారెల్ల మడియుటయొండె నోడిపాఱుటయొండెఁ గాఁగలయది యని దామోదరుండు పలికిన విని దారుకుండు మహానుభావా, నీవు సారథికృత్యమునకుఁ బూనినపుడే విజయశోభనంబు సవ్యసాచిసొమ్మని నిశ్చయించితి. ఏలినవానియానతి మెయిఁ దేరు దెచ్చి తఱి వేచియుండెద ననివిన్నవించుటయు గోవిందుండు కార్యచింతాపరుండై యుండె.

**కృష్ణార్జునులు స్వప్నమునఁ గైలాసమునకుఁ బోవుట.**

అర్జునుండును శయ్యాతలంబుఁ బ్రాపించి సైంధవుం జంపఁగ నెయ్యది వెర వగునో యనివిచారించుచుఁ గూర్కుఁ జెందుచున్నంతఁ బెద్దయుంబ్రొద్దునకుఁ గలలోఁ గృష్ణుండు కాన్పించిన సభక్తికంబుగఁ బ్రత్యుత్థానముఁ గావించి యుత్తమాసనమున నాసీనుం జేసి తాఁ గూర్చుండక నిలుచుండి కార్యచింతాపరుండై యుండ సర్వజ్ఞుఁడయ్యు గోవిందుఁడు పార్థా, యేమి చింతించెదవు. వగం బొగులనేల ? కాల మందఱకు ననుల్లంఘ్యము. సర్వభూతములకును గాలప్రాప్తంబు లగుశుభాశుభఫలములఁ దప్పించికొన నలవి గాదు. కార్యకాలమున నిట్లు శోకింపఁ దగదు. శోకంబుపెల్లున నాధివ్యాధులు పెరుఁగుటంజేసి మనసికాయదౌర్బల్యంబును ద్విషజ్జనమోదంబును సుహృజ్జనఖేదంబునుం గలుగు నింతియ కాని యొండు గాదు. వగ పుడిగి నీచింతించుకార్యముఁ దెలియఁ జెప్పు మనియడిగిన వాసుదేవునకుఁ బాండవుఁ డిట్లనియె. దురాత్ముఁ డైనసైంధవుని రేపు తెగటార్తు నని ప్రతిన వట్టితిఁగదా. నాప్రతిజ్ఞ కొనసాగనివిధమున దుర్యోధనుండు తనకుఁ గలసైన్యములనెల్ల నెల్లి వానికిఁ గావలియై యుండునట్లు గురునిసహాయమునఁ బన్నించువాఁడఁట. ఆమూఁకలనెల్లఁ జీకాకుపఱుచుచు సైంధవుఁ జేరుటకుమున్న సూర్యుఁడు గ్రుంకునొక్కో. అట్లు లైనం బ్రతిజ్ఞ కొనసాగనేరదుగదా యనిచింతించుచున్నవాఁడ నని తెల్పుటయు హరి యోకిరీటీ, మహాదేవునను గ్రహమునఁ బడసినపాశుపతాస్త్ర మభిమంత్రణసంధానప్రయోగమోక్షణపూర్వకముగా లెస్స బుద్ధ్యారూఢమై యుండునేని సింధురాజుం బరిమార్పఁగలవు. అట్లు

కాదేని యప్పరమాస్త్రము లెస్స యలవరించికొనఁగ భక్తవత్సలుం డయినయ
ప్పరమేశ్వరుం జిత్తమున ధ్యానింపుము. ధ్యానించిన నద్దేవదేవుఁడు క్రమ్మఱ నీ
కయ్యది యుపదేశించు ననుటయు నట్లయని విజయుండు పాదప్రక్షాళనంబు చేసి
యాచమించి శుచియై నియతచిత్తమునఁ జిత్తజధ్వంసిని ధ్యానించె. అంతఁ గొం
తవడికి వేగుజామున బ్రాహ్మముహూర్తమున నర్జునుండు తనవలపలిచేయిఁ దోయ
జాక్షుండు పట్టికొని రాఁగ గగనమార్గమున నుత్తరాభిముఖుండై పోవునట్లు కాం
చె. అవ్విధమునఁ గృష్ణార్జును లిరువురును బోవుచు శ్వేతపర్వతంబును, యక్షేశ్వ
రవిహారస్థానం బయినదివ్యసరస్సును, సంతతపుష్పఫలభరితతరునికరభాసురతీరయుఁ
బావనసలిలపూరితయు నగుగంగానదినిఁ, గిన్నరోద్గీతనాదికందరబంధురం బైన
మందరపర్వతంబును, స్నిగ్ధాంజనచయమంజులం బైనకాలపర్వతంబును, బ్రహ్మ
తుంగంబును, సుతుంగశతశృంగశర్యాతివనాశ్వశిరస్థానాథర్వణస్థానప్రముఖపు
ణ్యాశ్రమములను, మహామందరంబును, మఱియు ననేకతాపసాశ్రమములను,
వివిధవిహారస్థానంబులను, నానానదులనుఁ, బెక్కుపర్వతములనుం జూచుచుఁ దదీ
యరామణీయకంబున కెంతయు నలరుచు నతిరయమునఁ జనిచని గ్రహనక్షత్రసో
మసూర్యవైశ్వానరసముదయసమప్రభం బైనకైలాసశైలమున కరిగి తదీయశి
ఖరవరమున సహస్రభాస్కరప్రభావిభాసమానుండును జటాధరుండును శూల
పాణియును వల్కలాజినాచ్ఛాదనుండును నేత్రసహస్రచిత్రగాత్రుండును పార్వ
తీపరిశోభితవామభాగుండును బ్రహ్మవాదు లగుమహర్షులయు సురలయు వివిధస్తో
త్రములను గంధర్వగానములను నప్సరోనృత్యములనుం జిత్తగించుచున్న మహాదేవుం
గాంచి ప్రపంచకారణభూతుఁడు విశ్వకర్ముఁ డజుఁ డీశానుఁ డవ్యయుఁడు పంచభూతా
త్మకుఁడు సర్వేంద్రియప్రేరకుఁడు యోగేశ్వరుఁడు బ్రహ్మవిన్నిధి కాలకోపుఁడు మ
హానుభావుఁ డధ్యాత్మవేదివిజ్ఞేయుఁడు నగు నప్పరమేశ్వరునకుఁ ద్రికరణశుద్ధిగా మ్రొ
క్కుటయు సుప్రసన్నుండై యీశ్వరుండు మందహాసరోచిరుదంచితవదనారవిం
దుండై వారల స్వాగతం బడిగి లేవం జెప్పి యేమిపని గలుగ మీరిద్దఱు నిటకుఁ జను
దెంచితిరి కోరుఁడు చేయుదు ననుటయు వాసుదేవార్జునులు లేచి కేల్దోయి మొగిచి

సీ. ఈశ్వరాయ శివాయ విశ్వసృష్టిస్థితిప్రవిలయకారిణే భవ్యదాయ
నిత్యాయ రుద్రాయ సత్యాయ ధూమ్రాయ దక్షాధ్వరధ్వంసదక్షిణాయ
వృషభధ్వజాయ వాణీశశక్రాదిసంస్తుతయోగమాయా శితిగళాయ
భక్తానుకంపినే పార్వతీపతయే సహస్రశిరోదృక్కరాంఘ్రికాయ
ఆ. వె. సోమశేఖరాయ శూలభృతే హిర
ణ్యకవచోజ్జ్వలాయ హైమవర్ణ

భాసురాయ భూతపావిభవద్విభ
వే నిటాలచక్షుషే. నమోస్తు.

అనిబహువిధంబులం బ్రస్తుతించిరి. అంత నర్జునుఁడు తాను రేయి మాధవుని మేన
నర్చించినదివ్యకుసుమమాల్యాదులం జూచి హరిహరులయభేదమునకు విస్మయం
బంది దేవా, భవదీయపాశుపతాస్త్రంబుఁ బ్రసాదింపవే యని శంకరుని వేఁడుటయు
నయ్యీశానుఁడు వారలఁ గరుణార్ద్రవిలోకనమున నాదరించి మీకోరినమెయి మదీ
యాస్త్రం బిచ్చెద. ఈచెంగట నున్నయమృతమయసరోవరమున నేను దానవుల వ
ధియించిన విల్లమ్ములున్నయవి తెండనుటయుఁ గృష్ణార్జునులు శివాజ్ఞ మెయిఁ ద్రోవఁ
జూప వచ్చినపార్షదులతోడ దివ్యైశ్వర్యచర్యాధుర్యం బగునాసరోవరము డాయం
జని యందు ఫణాసహస్రశోభితంబులై యనలజ్వాలాజాలముఁ గ్రక్కుచుఁ బరమా
భీలంబులై యున్న పన్నగంబులం గాంచి యీశ్వరధనుర్బాణములే యీరూపముల
నగపడుచున్నవి. కృతశౌచులకు నియతమానసులకుఁగాని యివి లాఁతివారికి నిజ
రూపంబులఁ జూపవని తమలో నూహించి పాదప్రక్షాళనాచమనంబు లొనరించి
వేదవిదు లయినయన్నరనారాయణులు కృతాంజలులై శతరుద్రీయంబు జపించి
యాయుక్తనుధనుర్బాణముల కుపస్థానంబుఁ గావించిననవి మహేశ్వరుమాహాత్మ్య
మునంజేసియురగరూపము విడిచి నిజరూపములఁ దాల్చి చూపట్టుటయు వానిం
గ్రహించి వాసుదేవార్జునులు పరమసమ్మోదభరితస్వాంతులై యంతకాంతకుసన్ని
ధికిఁ జనిరి.అట మహానటుపార్శ్వమునుండి బ్రహ్మచారి యొకఁడు వెడలి వచ్చి యా
పరమకోదండం బెత్తి సజ్యంబుఁ గావించి గొనయమ్ము సారించి బాణం బరిఁ బోసి
చూపినం గాండీవి తదీయదృఢముష్టిని స్థానకంబును లెస్స చూచి మృత్యుంజయ
ప్రోక్తం బైనమంత్రము విని యావిల్లు దాను గ్రహించి శరము సంధించుట యల
వరించికొని క్రమ్మఱ నెప్పటివిధంబున శంభునానతిమెయి నాసరస్సున నక్కార్ముక
మార్గణంబుల నుంచి మున్నరణ్యమునం దనకుఁ బ్రసన్నుండై యాపన్నగాభర
ణుం డయ్యస్త్రం బనుగ్రహించుటఁ దలఁపించి దేవా, యది యట్టుల కాఁ బ్ర
సాదింపవే యని వేఁడికొనిన నవ్వేఁడికోలాలించి పరమకరుణాయత్తుండై పరమే
శ్వరుం డయ్యా, యది యట్టుల కాక తక్కనే యనినం బార్థుండు పాశుపతా
స్త్రంబు లెస్స పడసినవాఁడై సాంద్రరోమాంచసముదంచితగాత్రుండై కృతా
ర్థుండై పరమామోదమునం బొదలుచుఁ బుండరీకాక్షుఁడును దాను నమ్మహాదే
వునకు సభక్తికంబుగ సాష్టాంగదండప్రణామంబు లాచరించి వీడుకొని యాక్షు
ణంబ శిబిరంబు సేరి శయనస్థానంబుఁ బ్రాపించిరి. ఇత్తెఱంగున నర్జునుండు స్వ
ప్నముఁ గనియె. శ్రీకృష్ణుండును దారుకునితోడ నిష్టకథాసల్లాపవినోదపరుండై
యుండె. అప్పటికిఁ దూర్పు తెలతెలవాఱుచుండుటయు సయ్యది యర్జునునకు

స్వప్నావసానమయంబై సంఘటిల్లె నని సంజయుండు ధృతరాష్ట్రునకు జెప్పె నని వైశంపాయనుండు జనమేజయున కెఱింగించుటయు నానరేశ్వరుండు మోదవిక స్వరుం డయ్యె.

ఉ. ఇంద్రియపంచకంబునకుఁ బ్రేరకుఁడై తగఁ బ్రాణిసంచయం
బుం ద్రిగుణాత్మకక్రియలు పూన్కి నొనర్పఁగఁ బంచి యోగని
స్తంద్రతఁ గర్మసాక్షి యనఁ జాలుచు నొందక తద్గుణార్థస
క్తిం దనరేణుమాత్రయుఁ బ్రకృష్టత నొప్పెడిదేవు నెంచెదన్.

ఇది శ్రీకాళహస్తినగరాధినాథ శ్రీమద్దామరకుమారాక్క మహీపాల కరుణాపుర స్సరబహుమానపాత్ర, సంస్కృతాంధ్రభాషాకవిత్వ చమత్కారపరితోషిత బుధస్తోమ సీతారామకవిలలామ పుత్ర, సకలశాస్త్రనిరంకుశపాండితీధుర్య లక్ష్మీనరసింహసుధీవర్య సచ్ఛాత్ర, విబుధజనవిధేయ, వేంకటరంగనామ ధేయవిరచితం బైన శ్రీమదాంధ్రవచనభారతంబునందు ద్రోణపర్వం బున ద్రోణుని సర్వసేనాధిపత్యాభిషిక్తుం జేయుటయు, దుర్యోధను నకుఁ బ్రీత్యర్థంబు ద్రోణుఁడు ధర్మరాజును బట్టుదు నని ప్రతిజ్ఞ చేయుటయు, సంశప్తకు లర్జునుని నొండుకడకుఁ జీరి పోరి పెక్కం డ్రు మడియుటయు, నర్జునుఁడు భగదత్తుని సుప్రతీకమను నేనుంగుతోడఁ జంపుటయుఁ, బలువురుమహారథులు ధ నంజయుండు లేనితఱి వంచనచే నభిమన్యుని వధిం చుటయు, వేదవ్యాసుఁడు ధర్మరాజునకు శోకోపశ మనంబుఁ గావించుటయుఁ, బుత్రమరణశో కార్తుండై పార్థుండు సైంధవుం జంపుదు నని ప్రతిజ్ఞ చేయుటయు నన్నది

ప్రథమాశ్వాసము

సమాప్తము.



శ్రీకాళహస్తీశ్వరాయ నమః.

## ద్వితీయాశ్వాసప్రారంభము.

క. శ్రీశాశ్వతానుపమనై
జేశనసంవ్యాపనప్రవృత్తినిమిత్తా
వేశాన్వితేశ్వరపదా
యాశాద్యరిదూరమునిచయధ్యేయపదా.

దేవా, ననుఁ గృతార్థుం జేయుము.

సంతతసభక్తికోపసేవితద్వైపాయనుం డైనవైశంపాయనుం డనంతర కథాకర్ణనోదీర్ణకుతుకహృదయుం డైనజనమేజయున కిట్లనియె.

అవ్విధమున దామోదరుండు దారుకునితోడఁ దత్కాలసముచితకథా వినోదంబున నున్నంతఁ బ్రభాతం బయ్యె. అయ్యవసరంబున ధర్మనందనుండు మాగధమధురగీతంబులను వందిజనస్తుతివచనంబులను శంఖదుందుభిమృదంగ ప్రముఖశుభవాద్యనిస్వనంబులను మేలుకాంచి కాంచనాంబరుం దలంచుచుఁ బాన్పు డిగ్గి కరణీయములం దీర్చి మజ్జనశాల కరిగి లఘుపరిధానంబులఁ దాల్చి భద్రాసనంబునఁ గూర్చుండుటయు బలియురు నేర్పరులు నగుజెట్లు నలుఁగిడ మలోద్వర్తితగాత్రుండై కృతస్నానులు శుక్లవస్త్రధరులు నగునూటయేఁబండ్రు పరిచారకజనులు కనకకుంభముల సురభిశీతలసలిలములఁ దెచ్చితెచ్చి జలకమా ర్పఁగ నియమమునం గృతమజ్జనుండై యగ్నిసన్నిధానసంప్రాపితోష్ణం బైనశ్వే తోష్ణీషంబు శిరమునం జుట్టి కొంతవడి తడియొత్తి పెన్నెఱు లార్చి ధౌతాంబర ముల ధరియించి పుండ్రధారణం బొనరించి సురభిచందనంబు మేన నలఁది మేలి పూదండలఁ దాలిచి తూర్పుమొగముగఁ గేలుమోడ్పు ఘటియించి నిలిచి మంత్ర రాజంబు జపియించి సూర్యోపస్థానంబుఁ గావించి వినయవినమితోత్తమాంగుండై యగ్నిహోత్రగృహంబున కరిగి పవిత్రము లగుసమిత్కుశప్రముఖంబుల మంత్ర పూతముగ నగ్నిలో వేల్చి యచ్చోటు వెడలి రెండవకక్ష్యాంతరంబుఁ గడచి యచట శాంతులు దాంతులు వేదవిదులు నగునుత్తమబ్రాహ్మణులం గాంచి నమస్కరించి యాశీర్వచనపూర్వకంబు లగుతదీయదివ్యకుసుమాక్షతలం గ్రహించి మధుఘృతఫలాదిపదార్థజాతంబులను, హేమశృంగములు రౌప్యఖురములు సవ త్సములు నగుకపిలధేనువులను, ననేకాశ్వములను, నుత్తమవస్త్రములను నొసంగి

మఱియు వేలువేల యొక్కొకకాంచననిష్కంబును నిచ్చి వారల వలగొని యటఁ జని దివ్యకుసుమములు పూర్ణకుంభములు జ్వలితజ్వలనుఁ డక్షతపూర్ణపాత్రములు గోరోచనము సర్వాలంకారసముల్లసిత లగుకన్నియలు దధిసర్పిర్మధూదకములు మంగళవిహంగంబులు మున్నగునుత్తమవస్తునికరంబుల దర్శనస్పర్శనంబులఁ గావించి వెలుపలికక్ష్యాంతరంబునకుఁ జని యచటఁ బరిచారకులు ముక్తావైదూర్య జాలభూషితంబు నిస్తులాస్తరణసమంచితంబు సురుచిరావరణపరిస్ఫురితంబు సర్వ సమృద్ధివిలసితంబు విశ్వకర్మనిర్మితంబు నగుసౌవర్ణసర్వతోభద్రసింహాసనంబుఁ దెచ్చి యుంచుటయు నందుఁ గూర్చుండి పరిచరులు దెచ్చిసమర్పించినవివిధము త్తమయభూషణముల నలంకరించికొనినయాధర్మనందనురూపంబు శత్రుజనశో కావహంబై చెలంగె. మఱియు నిరుగెలంకుల నుచితభటులు హేమదండమండి తంబులైనచంద్రావదాతచామరంబులు వీవఁగ నమ్మహీపాలవరేణ్యుండు కార్తె ఱుంగు తళతళలఁ దుఱంగలించుతోయదంబుచందంబునం జూడ నొప్పె. అత్తె ఱంగున నజాతశత్రుండు కొలువుదీఱి వందిమాగధవైతాళికస్తుతివచనంబులను గాంధర్వగానప్రసంగంబునుం జిత్తగించునెడఁ గొండొకవడికి సమరసన్నాహంబు సవరించువీరభటులపరస్పరాహ్వాననినదంబులును రథనేమిఘోషంబులును దురం గఖరఖురనాదమేదురహేషారవంబులును గజఘటాఘంటారవ్యూపబృంహితబృం హితధ్వానంబులును శంఖభేరీప్రభృతివాద్యనిస్వనంబును గాలుమానుసులు సం భ్రమంబున నడుగు లిడునెడఁ బొడమునులివును బెల్లెసంగుటయు నందులకుఁ బుడ మి గ్రక్కదలుచుండె.

## శ్రీకృష్ణుఁడు ధర్మరాజు నెద్దకు వచ్చుట.

అట్టియెడ ఖడ్గకవచధరుఁడును గుండలాదిమండితుఁడు నుచితవయస్సమం చితుఁడు నగుప్రతీహారి యొక్కం డభ్యంతరమునకుఁ జనుదెంచి సవినయముగ మోఁకాళులు నేలకు మోపి ధర్మరాజునకుఁ గృతప్రణాముండై కేల్దోయి మొగిచి దేవా, వాసుదేవుఁడు ద్వారదేశమున విచ్చేసియున్న వాఁ డని విన్నవించి తదాజ్ఞం బడసి రయమున నమ్మహాత్ముని సుప్రవేశితుం గావించుటయు సన్నిహితుఁడైన యచ్యుతునకు సముచితప్రకారమున నర్ఘ్యాదివిధుల నుపచారము లాచరింపఁగఁ దగినవారలం బనిచి పాండవాగ్రజుండు పరమప్రీతుండై యమ్మహానుభావుం బ్రశంసించి యిట్లనియె. మధుసూదనా, రాత్రిసుఖమునఁ గడపితే, ప్రసన్నం బులై యన్నియు విజ్ఞాతంబు లయ్యెఁగదా యని యడుగఁ బురుషోత్తముఁ డందు లకు సదుత్తరం బొసంగి యత్తెఱంగునన కౌంతేయాగ్రజు నడిగి యుచితసంభా షణంబు నడుపుచున్నంత దౌవారికుండు వచ్చి మహారాజా, భీమసేనుఁడును గవలును విరాటద్రుపదులును సాత్యకిధృష్టద్యుమ్నులును యుధామన్యూత్తమా

జులును శిఖండిచేకితానులును గైకేయద్రౌపదేయులును దక్కంగలరాజులును
దేవరదర్శనార్థంబు వచ్చి యున్నవా రని నివేదించి తదాజ్ఞం బడసి వారిప్రవే
శంబు నడిపిన వారందఱును దమకుఁదమకుఁ బోలినచోట్లఁ గూర్చుండిరి. పుండ
రీకాక్షుఁడు సాత్యకిని దనగద్దియపయిఁ గూర్చుండఁ బెట్టికొనియె. అట్లందఱును
బెరసి కొలువై యున్నయెడ యుధిష్ఠిరుఁడు మధురగంభీరస్వనమున మధుమర్దనున
కిట్లనియె. భక్తవత్సలా, సురలు సురేంద్రు నెట్టు లట్టుల మేము నిన్నొక్కని
నాశ్రయించి యుద్ధమున జయమును శాశ్వతసుఖమునుం బడయ వేఁడియున్న
వారము. రాజ్యభ్రంశము శత్రువులనికారము వనవాసము మున్నగుమాపాట్లెల్ల
నీయెఱింగినవియకదా. అస్మజ్జయసుఖములు భవదధీనంబులు. అర్జునుఁడు పట్టి
నప్రతిన నెఱవేఱునట్టు లనుగ్రహించి మమ్ము దుఃఖార్ణవమునం గడతేర్పుము.
ఈమున్నీరు దాఁటఁ దమకించుమాకుఁ దేప నీవకదా. సారథికృత్యమునకే
యొడంబడిననీవు చేయునంతటిమేలు రిపువధోద్యతుం డైనరథికుఁ డెవ్వాఁడును
జేయఁ జాలఁడు. ఆపదలు మూఁడినపుడు యాదవులట్టుల పాండవులును నీకు
రక్షణీయు లని యేను జెప్పికొనవలయునే? దేవదేవేశ్వరా, నీకిదె కేలుమోడ్పు
ఘటియించెద. నీవు పురాణపురుషుఁ డనియుఁ బురుషోత్తముఁ డనియు నార
దుఁడు నాం కెఱిఁగించె. భవదీయభవ్యమహిమంబు యథార్థంబు గాఁగ మ
మ్మనుగ్రహింపు మని ధర్మరాజు నిండోలగంబున నందఱు వినంగ విన్నవించు
టయు దేవకీనందనుండు మేఘగంభీరనినదంబునఁ గుంతీనందనున కిట్లనియె.
రాజేంద్రా, దేవదానవాదులలో నెక్కఁడును మనయర్జునునకు సరివచ్చు విలు
కాఁడు చూపట్టఁడు. అతండు వీర్యదుర్దముఁడు దివ్యాస్త్రవేది నిర్వక్రవిక్రమో
ల్లసితుఁడు మహాబలుఁడు సమరశౌండుఁడు సంరంభామర్షసముద్దీప్తుఁడు పరమ
తేజోమహితుఁడు. అట్టివానికి నీశత్రువుల గెల్చు టొక్క పెద్దపని గాదు. దవా
నలంబు కాననంబునుంబోలె నతండు ధార్తరాష్ట్రసైన్యముల నీఱుసేయుటతప్పదు.
నేఁడు సౌభద్రఘాతకుఁ డైనయప్పరమపాపాత్ముని సైంధవుని బీభత్సుఁడు దనవా
లంపగముల కెర చేయువాఁడు. శ్యేనగృధ్రగోమాయుగణంబులు వానిమాంస
ముఁ గబళింపఁగలవు. ఇంద్రాదు లడ్డపడి కాచినను నేఁడు సైంధవుఁడు యమ
పురమున కరుగుట నిక్కువంబు. అప్పాపశీలుం జంపి ధనంజయుఁడు నీమదివగ
దీర్చువాఁడు. ఊఱడిల్లు మని చెప్పుచున్నంతఁ బార్థుఁడు నచ్చటికి వచ్చి తనకు
మ్రొక్కుటయు ధర్మరాజు ప్రీతిబహుళంబుగ లేచి బిగికౌఁగటం గ్రుచ్చికొని
శిరంబు మూర్కొని విజయాశీర్వాదంబులు ప్రయోగించి నెమ్మొగమ్మునఁ జెలున
గవు దళుకొత్తఁగ నిట్లనియె. అన్నయర్జునా, విజయంబు నీకుఁ జేకూఱుట నిక్క
వంబు. ఇప్పటినీమేనికాంతియు మురాంతకునిప్రసన్నత్వంబును నయ్యర్థమును నిర్ణ

యించుచున్న వనుటయు నర్జునుఁ డచ్యుతుననుగ్రహమునఁ దనకు స్వప్నమున మహేశ్వరసాక్షాత్కారంబు మున్నగువిచిత్రశుభవృత్తాంత మంతయు సవిస్తరముగఁ దేటపఱుచుటయు నందఱు నద్భుతరసాందోళితమానసులై చంద్రచూడునకుఁ బ్రణామములు గావించి యభినందించి కొండొకవడికి ధర్మరాజుననుజ్ఞఁ గొని పోరికి సమకట్టి నడుచువారై యరిగిరి. కృష్ణార్జునసాత్యకులును యుధిష్ఠిరుని వీడుకొని యేకరథారూఢులై పార్థభవనమునకుఁ జనిరి.

## అర్జునుఁడు యుద్ధమునకు వెడలుట.

చని యచట గోవిందుఁడు ధనంజయునరదమున సమరసన్నాహసముచితంబుగ సమంచితకపిధ్వజం బెత్తి బాలారుణప్రకాశంబు నీరదనిస్వననీకాశనిర్ఘోషంబు నగునారథోత్తమంబును జైత్రమంత్రముల నభిమంత్రితంబుఁ గావించి యంతకుఁ గృతాహ్నికుఁడై నపార్థున కెఱింగించుటయు నమ్మహారథవరుఁడు కవచకిరీటసముజ్జ్వలుండై శరశరాసనధరుండై తపోవిద్యావయోవృద్ధులు జితేంద్రియులు నగునుత్తమబ్రాహ్మణులవిజయాశీర్వాదములం గ్రహించుచు నారథవరంబుఁ జేరంజని ప్రదక్షిణంబుఁ గావించి యుదయమహీధరంబు నారోహించు భాస్కరునిభంగి వెలింగె. అప్పుడు వాసుదేవసాత్యకులు స్వర్యాతియజ్ఞమున కరుగుమరుత్పతివెంబడిం జనునశ్వినులపోలె నయ్యర్జునునరద మెక్కిరి. అందు జనార్దనుండు యుగ్యంబులపగ్గంబులఁ గొని మొగలపయిం గూర్చుండి సారథ్యమునకుఁ గడంగె. అప్పు డయ్యిద్దఱినడుమం గూర్చున్న వివ్వచ్చుఁడు బుధశుక్రసమన్వితుండై నతారాపతివిధమునఁ దమోనిరసనచణుండై తారకామయంబున మిత్రావరుణసమన్వితుండై నసురపతి తెఱంగున శత్రువధోత్సాహదోహలితచిత్తుండై మంగళగీతస్వనంబును సూతమాగధస్తుతివచనంబులనుం జిత్తగించుచు వెడలుచుండె. అట్టియెడ సురభిశీతలమందమారుతాందోళనంబు మున్నగుశుభశకునములను నెమ్మనమ్మున నలరుచు విజయుండు సాత్యకిం జూచి శినిపుంగవా, యేను నేఁడు సైంధవుం దెగటార్చి విజయంబు సాధించుట నిక్కవంబు. అయ్యర్థంబు సూచించుచు శుభశకునంబు లెన్నియేఁ దోఁచుచున్నవి. సింధురాజు నేఁడు యమసదనంబునకుఁ జనువాఁడై నావింటిబలిమిఁ బ్రతీక్షించి యున్నవాఁడు గావున వానియున్నెడకుఁ బోయెద. సైంధవవధంబును ధర్మరాజరక్షణంబును మనకుఁ దుల్యంబుల కావున నీరెండు నెఱవేఱఁగ నే నొక్కటియు నీ వొక్కటియుం బూనవలయు. నీవుండిన నేనుండినయట్ల నమ్మి యుండుదు. వాసుదేవతుల్యుఁడ వగునిన్ను గెలువ దేవేంద్రునకు నలవిగాదు. నీవును బ్రద్యుమ్నుండును నానమ్మినమహారథులు. నే నొక్కండన సైంధవుం దెగటార్పఁ జాలుదు. నాకుఁ దోడు లే దని విచారింపక రాజరక్షణమునఁ బరమప్రయత్నము సేయుము. నాకుఁ దోడు వాసుదేవుఁడు

గలఁడు. కృష్ణుఁడును నేనును లేమింజేసి రాజుం బట్టఁగ నాచార్యుం డుత్సహించుఁ గావున నేమఱక కావలివై యుండుము పొమ్మని వీడ్కొల్పిన వల్లేయని సాత్యకి ధర్మజుం డున్నయెడకుఁ జనియె ననినసంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె.

**ధృతరాష్ట్రుఁడు చింతించుట.**

సంజయా, ధనంజయుండు పుత్రశోకంబును బ్రభూతక్రోధంబును ముప్పిరిగొనఁ గాలాంతకునివిధమునఁ దోఁచుచు గాండీవఘోషంబును దేవదత్తారవంబును దిక్తటంబులు బీఁటలువాఱ నిగుడఁగఁ గేతనకపిప్రభలు చూడ్కుల మిఱుమిట్లుగొలుప రణరంగమునకు నడుచునప్పుడు వానికిఁ గృతాపరాధు లయినమనవారు మొగ్గరంబున నగ్గలిక మెఱయ నిర్భయులై నిలువఁజాలిరే? మున్ను మనవారిశిబిరమున సూతమాగధస్తుతిపాఠరవములును శుభవాదిత్రనిస్వనంబులును వీనుల కింపుగా వినవచ్చుచుండుఁగదా. వికర్ణవివింశతిదుర్ముఖచిత్రసేనాదు లగుకుమారులవీడుపట్ల నిరుత్సాహంబు లగుదీనాలాపంబులు వినఁబడుచున్నవి. విశేషించి సైంధవునియింట ఘోరారవంబు విననయ్యెడి. మఱియు నశ్వత్థామయింట బ్రాహ్మణక్షత్రియవైశ్యులు శిష్యకృత్యంబు సల్పుచు వివిధసల్లాపంబులను నానావిధవాద్యరవంబులను బహువిధగీతంబులను నయ్యాచార్యపుత్రుచిత్తంబు నలరించుచుండుదురుగదా. అతనియింటను నిప్పుడు నానినాదంబు తొల్లింటియట్టులు తోఁపదయ్యె. నిరతంబు భూరిశ్రవునిభవనంబున ఋత్విజులు యాజనప్రకారంబులు వివరింతురు. అదియు నేఁడు నేలొకో వినంబడదు. ఆచార్యునినివేశనమున నెడపక జ్యాఘోషంబును బ్రహ్మవాదంబును స్యందననాదనినదంబును మనమున నుల్లాసంబుఁ గావించుచుండు. అయ్యులివును నేఁడు వినంబడదు. వెండియు విందానువిందకేకయప్రముఖులయునికిపట్ల దీనస్వనంబులే విననయ్యెడి. ఏమికీడు మూఁడెనో. సర్వలోకాభిగమ్యుఁడై నజనార్దనుఁడు కౌరవులకుఁ బాండవులకును సంధిఁ గావింప నిచ్చటికి వచ్చినపుడు దురాత్ముఁ డగుదుర్యోధనుని నేను బహుప్రకారంబుల ననునయించి వత్సా, వాసుదేవవచనం బనుల్లంఘ్యంబునఁ గ్రోధానలంబుఁ జల్లార్చి శాంతిఁ బొంది పాండవులతోడిపొత్తున మనుము. మొఱకుఁదనమున హితవాది యగుకేశవుని నిరాకరింతువేని తప్పక చెడియెదవు. పాండవులును నామాట పట్టుదురుగాని నీకుఁ గీడుఁ దలంప రని యెంతబోధించినను వినక నాకొడుకు దుర్యోధనుఁడు కర్ణశకునిదుశ్శాసనులమాటయె కొని యెంతచేటుఁ దెచ్చికొనియె. కాలపక్వుఁడు గావున వాఁ డెంద ఱెన్ని చెప్పినను చెడచెవిం బెట్టె. జూదము నేనొల్లనంటి. విదురుఁడు తగ దనియె. భీష్ముఁడు వల దనియె. ద్రోణకృపాశ్వత్థామలు వారించిరి. బాహ్లీకసోమదత్తసైంధవాదులు నిషేధించిరి. వీరిమాటవట్టి జూదమాడకుండునేని తనకును దనవారికిని నిరామయ మగుసుఖజీవనం బమరియుండు.

పాండవులు మృదుచిత్తులు మధురవచనులు వృద్ధసమ్మతులు ప్రాజ్ఞులు ధర్మనిర తులు గావున సుఖముఁ బడయఁగలరు. ధర్మపరుఁ డగువాఁ డెవ్వఁడేనియు నైహి కసుఖమును నాముష్మికభోగమునుం బడయు టరిదియె? శత్రుభీకరుఁ డైనవృకో దరుఁడును నిర్వక్రవిక్రమస్ఫూర్జనుం డైనయర్జునుండును నవిజేయు లైనమాద్రే యులును ఘోరసాంపరాయుం డైనశైనేయుండును భుజవీర్యద్యుమ్నుం డైన ధృష్టద్యుమ్నుండును నఖండితప్రతాపోద్దండుం డైనశిఖండియుఁ గదననిరాఘాటుం డైనవిరాటుండును వీర్యదుర్మదుం డైనద్రుపదుండును దుర్జయు లైనకైకయు లును నధిగతధనుర్విద్యావైశారద్యుం డైనచైద్యుండును శౌర్యదీపితు లైనద్రౌ పదీసుతులును భుజబలానూనుం డైనచేకితానుండును మఱియుం బెక్కండ్రు మేటిదొరలును గూడి సర్వలోకేశ్వరుం డైనశ్రీకృష్ణునిమతంబున సంగరాంగ ణంబునకు నడువ దుర్యోధనాదిదుష్టచతుష్టయంబ నేర్చుఁ గాని ప్రాణములమీఁ దియాశ గలమానవుఁ డెవ్వఁ డేనియు వారల మార్కొండు నని నడుచునే? నారా యణుఁడు గాండివిసారథికృత్యమున కొడంబడినపుడె వారికి గెలుపు సుస్థిరం బయ్యె. మనకుఁ బెనుప్రాపగుభీష్మద్రోణులు పడి రని నీవ చెప్పితివి గదా. విదురుఁడు బోధించినహితము వినమికి ఫల మిదె తోఁచె. ఈదురవస్థం జూచి నాకొడుకు లిపుడు వగం బొగులుదురు కాఁబోలు. వేసవితఱిం బేర్చినకార్చిచ్చు శుష్కతృ ణపుంజంబునుంబోలె గాండీవి మనసేనల నెక్క మాత్రలోన నీఱుచేయుచుండును. అర్జునున కెగ్గు చేసి మనవారు మఱునాఁ డెట్టు లతనియెదుర నిలువఁజాలిరి? కయ్యం బెబ్బంగిఁ జెల్లె? మనవారిమనంబు లెట్టులయ్యె. దుర్యోధనుఁడును గర్ణ శకునిదుశ్శాసను లేమి చెప్పిరి? లోభక్రోధవికృతచిత్తుండును దుర్వృత్తుఁడు నగు నాదుర్యోధనునికొఱగాములం బుట్టినకయ్యంబు తెఱంగు దుర్నీతి యయ్యెఁ గాకుండెఁ దెలియఁ జెప్పు మనినయాంబికేయునకు సంజయుం డిట్లనియె.

రాజేంద్రా, సంగ్రామప్రకారంబు సర్వంబుఁ జెప్పెద. సావధానుండవై వినుము. ఇది యంతయు నీయనయంబునం గలిగెఁ గాని యొండు గాదు. అప్పుడు కొడుకులకు మంచితెరువు చెప్పక యిప్పు డేడ్చినం బ్రయోజనం బెయ్యది? ఇప్ప టినీయేడ్పు గతజలసేతుబంధనప్రాయంబు. విధివిధానం బనతిక్రమణీయంబు గావున శోకంబు దక్కి వినుము. ఆనాఁడే జూదము వారించియుండిన నీనాఁ డిది పడవలసి యుండదుగదా. అది య ట్లుండె. పాండవు లుపప్లావ్యంబున నుండి సంధిఁ గోరినపుడైనఁ దెఱంగుఁ గావించిన నీకీడు మూఁడునే? దుర్యోధనుఁడు నీమాట వినక తనయిచ్చమెయి నడుచునేని వానిం బట్టి బంధించినఁ దక్కుఁ గలవా రైన బాగుండుదురుగదా. ప్రాజ్ఞులలో నగ్రేసరుం డనం బేరువడసి యు నీవు నీకొడుకులను బాండవులను నెక్కరూపకాఁ దలఁపక భేదము దలఁచి

కర్ణశకునిదుర్యోధనులమతంబ యనువర్తించితివి. నేను నప్పుడు పోలినభంగుల నెల్ల హితముఁ దెల్పితి. నాహితవచనం బెల్ల విషమిశ్రం బయినతేనెచాడ్పున నీకుఁ దోఁచె. కృష్ణుఁడు నజాతశత్రుని భీష్మద్రోణులను నంతగ మన్నింపక నిన్నె మన్నించి పలుదెఱంగుల నీకు హితముఁ దెలిపె. నీవు దాని వినకుండినం జూచి తొల్లింటిమన్ననకు నీవు తగ వని తనదివ్యచిత్తమునఁ దలంచి కాఁగలది కాక మాన దని నిశ్చయించి భండనమునకుఁ బాండవులఁ బురికొలిపె. నీవు రాజ్య కాముఁడవై యకారణంబ నీకొడుకులు పాండురాజుకొడుకులం దిట్టుచుండినను విని సైరించుటంగాదె యిప్పు డింతపడవలసె. పాండురాజు భుజబలంబున దిగ్విజయంబు చేసి రాజ్యవృద్ధియు సంపత్సమృద్ధియుం గావించి విమలయశోభరితుం డయ్యె. అతనికొడుకులును దండ్రికంటెఁ బెక్కుమడుంగు లెక్కుడు వీర్యవంతులై సకలదేశాధీశుల నోడించి కీర్తిమంతులై కులమునకు వన్నెఁ బెట్టిరి. లుబ్ధుండవై నీవు వారికి రాజ్యభాగంశంబుఁ గావించితివి. అప్పు డట్టు లెఱిఁగియెఱిఁగి యిప్పుడు తప్పెల్లఁ గొడుకులపయిం బెట్టినం జెల్లదు. ఏమి చేయవచ్చు. కౌరవులు చలంబు డింపక పాండవసేనం జొచ్చి ప్రాణరక్షణతాత్పర్యంబు మాని యోపిన కొలంది పోరుచున్నవారు. జనార్దనుఁడు హితమంత్రిగా నర్జునుండు విలుకాఁడుగా భీమసేనసాత్యకులు కావలిగాఁ బెంపుఁ గాంచినపాండవసైన్యంబు నెదిరింపఁ గౌరవయోధులు దక్క లాఁతిమానవుఁ డెవ్వఁడేనియు వలంతి యగునే? క్షత్రియు లందఱు క్షాత్రధర్మంబుఁ దలపోసి పోలినవిధమునఁ బోరుచున్నవారు. వగ పుడిగి కయ్యంబు తెఱంగు విను మని సంజయుండు వెండియు నాంబికేయున కిట్లనియె.

## కౌరవసేనావ్యూహనిర్మాణము.

అంత నారేపకడన భారద్వాజుండు సేనావ్యూహంబుఁ దీర్ప దొరఁకొను చున్నంత మనయోధు లామోధనోత్సాహభరితులై గొనయమ్ములు సారించుచు విండ్ల నెక్కువెట్టుచుఁ గరవాలంబుల నొఱలఁ దీయుచు నడచుచు నర్జునుం డెల్లొకో యింతకు రాక తడవు చేసె. వాసుదేవుఁ డతనిం దఱిమికొని రాఁడు. మానధనుం డైనభీమసేనుఁ డింకను బొడసూపఁడు. పాండవవీరు లింకెప్పుడు గడంకమై వత్తురో యని పలుకువీర్యవచనంబులయులివును గేతనకింకిణీరవంబులును రథనేమినిస్వనంబులును దురంగఖురధ్వానంబులును గరిఘటాఘంటారవంబులు నొక్కటియై దిక్కులు పిక్కటిల్ల మ్రోఁగుచుండ నాచార్యుండు శోణతురంగ యోజితరథారూఢుండై సైన్యంబున నెల్లెడలం గలయం దిరుగుచు శంఖముఁ బూరించి జయద్రథుపాలికిఁ బోయి యయ్యా, నీవును భూరిశ్రవుండును గర్ణుండును నశ్వత్థామయు శల్యుండును వృషసేనుండును గృపాచార్యుండును గూడుకొని యొక్కచో నుండుఁడు. మనబలంబులలో మే లేర్పఱిచి లక్షగుఱ్ఱంబులును

నఱువది వేలరథంబులును బదునాలుగు వేలమదపుటేనుంగులు నిరువదియొక్క వేల పదాతులును గైకొని నాతీర్చుమోహరంబునకు వెనుకటిదెస యోజనత్రయ మాత్రదూరంబున నిలువుండు. అట్లైన దేవగణపరివృతుండైన దేవేంద్రుఁడైన నిన్నుఁ దేఱిచూడ రాదు. పాండవు లెంతటివా రనిన విని సైంధవుండు తనమ నంబున నెంతయు నూఱడిల్లి యామహారథులు నాసైన్యంబులును దనబలము లోనిమేలైనపదివేవురు గుఱ్ఱపురౌతులును బరివేష్టింప నట్లనిలిచె. ద్రోణుం డును జతుర్వింశతిక్రోశదీర్ఘంబును దశక్రోశవిస్తృతంబునుగా శకటవ్యూహంబుఁ గల్పించి దానిపిఱిందిసగంబున గర్భవ్యూహంబుగాఁ బద్మవ్యూహం బేర్పఱిచి యాపద్మవ్యూహము మొదలుగ సేనాగ్రంబుదనుకఁ గ్రమంబున సూచీవ్యూ హంబు వన్నించి సూచీముఖంబునఁ గృతవర్మయు నతనివెనుకఁ గాంభోజరాజును నతనిపిఱుంద జలసంధుఁడును నతనియనంతరంబు సూచీమూలంబున దుర్యోధ నుఁడు బహుళసైన్యపరివృతుండై కర్ణసైన్యంబుదెసకుఁ జాలి నిగుడునట్లుగా వ్యూహంబుఁ గావించె. వికర్ణదుశ్శాసనులు సింధురాజకార్యసాధనోద్యోగులై యనీకాగ్రంబున నిల్చిరి. దుర్మర్షణుండు వేయిరథములు మూఁడువేలగుఱ్ఱము లును నూఱేనుంగులును లక్షకాల్బలంబును దన్నుఁ బరివేష్టింప మిగిలి యర్జునుని నేన నిలువరింతు నని పలుకుచు సేనాముఖమున వేయినూఱువిండ్లపెట్టుదవ్వున నిలిచె. సైంధవుఁ డాచార్యుఁడు సెప్పినవిధంబున సకలసైన్యంబులు మోహరించి యుత్సాహంబు సందిల్లఁ బొలిచియుండ నాచార్యుండు శోణహయయోజితరథా రూఢుఁడై వేదికాకమండలుకేతనంబును శ్వేతోష్ణీషంబును ధవళకవచంబును గ్రాలి కోపదీపితుండైనయంతకునివిధమున దుర్నిరీక్షుండై నారిసారించుచుఁ దా నగ్రభాగంబున సేనలకెల్లఁ గావలియై నిలిచె. కుంభసంభవుఁడు తీర్చిన మోహరంబుఁ జూచి ఖేచరు లద్భుతం బందిరి. సర్వభూతములు నీవ్యూహము భూతలంబునెల్ల నొక్కమాత్రలోన మ్రింగఁ జాలు నని ప్రశంసించె. కురువల్ల భుండును బ్రమోదతరంగితాంతరంగుఁ డయ్యె. అత్తెఱంగున మనసైన్యంబు మోహరించి కయ్యమునకుఁ గట్టాయితంబై శంఖదుందుభిప్రముఖవివిధవాద్యని నాదబంధురంబై యుండ రౌద్రముహూర్తంబున సవ్యసాచి కృష్ణసారథికరథా రూఢుండై కేతనకపిచ్ఛవిచ్ఛటలు మనవారిచూడ్కుల మిఱుమిట్లు గొలుపఁ బొడ చూపుటయు మనమూఁకలవలపటిదెస శివారుతంబు వాయసస్వనంబు నుల్కా పాతంబు విష్వగ్వాతంబు భూకంపంబు మున్నగు నుత్పాతంబులు దోఁచె. అక్క డ ధృష్టద్యుమ్నుండును నకులపుత్రుఁ డయినశతానీకుండును బాండవసైన్యంబు మోహరించి కలనికి నడిపించికొని వచ్చిన నాసైన్యంబు భేరీమృదంగప్రభృతి

వాద్యనినాదబంధురంబై యోధవీరాస్ఫాలనరవభరితంబై యొప్పె. ఆమోహరంబు నకు ముందఱ బాణపాతదూరంబున నర్జునుండు జాంబూనదకిరీటరోచులును జారుకుండలాంగదప్రభలును జెలంగ శుక్లమాల్యాంబర కాంతు లెసంగఁ బొల్చి తనపూనినమహావ్రతంబు నెఱవేర్చువాఁడై దండపాణి యైనయంతకునివిధమునను శూలపాణి యైనసీలలోహితునిచందంబునను పాశపాణి యైనవరుణుని తెఱంగునను దానుగాండీవపాణియై క్రోధాటోపంబు దీపింపఁ జేయుచు గాండీవగుణక్వణనంబుఁ గావించుచు రథస్థుండై యుదయగిరిశిఖరాధిరూఢుం డైనమార్తండునిచాడ్పునఁ దేజోదుర్నిరీక్షుండై దేవదత్తం బొత్తుటయుఁ గృష్ణుండును పాంచజన్యంబుఁ బూరించె. ఆశంఖవరంబులరవంబునకు మనసైనికులు పిడుగుపాటున కెట్టు లట్టుల యంగంబులు వడఁక డిల్లం బోయిరి. వాహనంబులు మూత్రపురీషస్రవణంబుఁ జేసె. అంతఁ గేతనవానరుండు పెలుచ నార్చుటయు నచ్చటిభూతంబులెల్ల నోళ్లు దెఱచి యఱచిన నేమి చెప్పుదు మనమూఁకలలో వెఱవనివాఁ డొక్కఁ డైనం గలుగఁడయ్యె. అప్పు డొక్కపెట్ట వారిసైన్యంబున శంఖభేరీమృదంగాది వాద్యంబు లన్నియుఁ బెలుచ మ్రోఁగె.

దుర్మర్షణాదు లర్జునుం దలపడి యోడుట.

అట్టియెడ దుర్మర్షణుండు సకలసైనికులం బిలిచి యేను గలుగ నర్జును నకు వెఱవం బనిలేదు. యుద్ధదుర్మదుం డైనయగ్గాండీవిని నే నగ్గలిక మెఱయఁ దాఁకి చెలియలికట్ట సాగరంబునుంబోలె నొక్కమాత్రలోన నాఁగుదు. తాయి తాయిదాఁకినట్టుల మాయిరువురిపోరు భీకరంబయ్యెడి. మీ రందఱుఁ జూచు చుండుఁడు. నే నొక్కండన యతనిపేఁచ మడంచెద నని బీరంబులు వలుకుచుం డునంత నవ్వుచుఁ గవ్వడి మురారిం జూచి దుర్మర్షణు దెసకు మనయరదంబుఁ బఱ పింపుము. వానిం గెలిచి శత్రుసైన్యంబుఁ జొచ్చెద ననుటయు వనజోదరుఁడు తే రతనికట్టెదుటికిఁ బఱపిన దుర్మర్షణునకుఁ దోడ్పడఁ బెక్కండ్రు యోధులు బహుళసైన్యంబులతోడం దలపడి కృష్ణార్జునులపయిం గాండజాలం బడరించు టయు గాండీవి శరాసారంబుఁ గురియించి ప్రావృట్పయోధరంబుఁ బర్వతం బులంబోలెఁ గప్పిన నత్తాఁకు పరమదారుణం బయ్యె. ఏమి చెప్పుదు నప్పు డప్పార్థుండు నిపుణవనపాలకుఁడు తాళఫలంబుల నెట్లట్లు ప్రబలరవం బెసఁగ వీరయోధులతలలు దఱిగి డొల్లిపడం జేయుటయుఁ గుండలశిరస్త్రాణవిలసితంబులై యుద్భ్రాంతనేత్రంబులై బొమముడిపాట్లను నవుడుకఱచుటలను విడువక నేల నిండి మెట్టతామరవిరులకరణిం జూడనొప్పుశూరులయుత్తమాంగంబులును, మీఁది కెత్తినకరవాలమ్ములను వింట సంధించినయమ్ములను బొడవ నెత్తినప్రాస

కుంతభిండివాలమ్ములను మోఁద నుంకించి యెత్తినగదాదండమ్ములను విడువక క్రోధోత్సాహసాహసంబులపెంపునం జేసి తలలు దెగుట యెఱుంగక యయ్యై రవడిం గొన్నియడుగులు నడిచి తప్పియిటునటుం బడఁబోయి తమవారిపయి నొండె నొం డొంటిపై నొండెఁ బడి పరస్పరహేతివిక్షతగాత్రంబులై నెత్తుటం జొత్తిల్లి నేలం బడి పుడమికి వచ్చినవిద్యుద్విలసితమేఘపటలంబులవిధంబునఁ గన్పట్టువీరులకబంధములును, మొండెములు పడునెడఁ దదీయహేతిక్షతగాత్రులై పార్థుఁడిదె వచ్చె నదె నారి సారించె నదె యమ్మరిఁబోసె నని సర్వంబు పార్థమయముగాఁ దలపోయుచుఁ దమతమవారలం బిలుచుచు నిటునటుం బొరలుచు ముమూర్షావస్థులైన ప్రాణావశిష్టులును, క్రీడిబాణంబులతాఁకోర్వలేక మొగతిరిగినం గాళ్లనడిచియు నంకుశములఁ బొడిచియు నతనియెదురం బఱపనేరక విఫలప్రయత్నులై తమ్ముఁ దార దూఱుకొను హాస్తికులును, గశాఘాతంబునను బాదప్రహారంబునను హుంకారంబులను గుఱ్ఱముల ముందఱికి నడిపింపఁ బూనియు నవి నడువమికిఁ దమలో నేవగించుకొను రావుతులును, సారథులు సచ్చినం దార రథచోదనంబు సేయుచుఁ బోరఁ గడంగి యంతలోనం దేరులు నుగ్గైనం గదలు విసరివేసి సవ్యసాచిబాణంబుల కెరయగురథికులును, మహామారుతంబునకు విరియుమేఘబృందముచందమునఁ బటాపంచలై పాఱియు నెక్కడఁ బోయినం దప్పించుకొనఁ జాలక క్రీడియమ్ములం దెగిపడినయేనుఁగులపీనుంగులును, గాలు చేయి డొక్క ప్రక్క యని యేర్పఱుపరానివిధంబునఁ బలుతునియలై పడినకాలుమానుసులయొడళ్లతునియలును, బహుశకలంబులైనతురంగగాత్రఖండంబులును, మొదళ్లు దెగిపడి మహాభుజంగంబుల కెనవచ్చు కేయూరాంగదవలయభూషితవీరయోధబాహుదండంబులును, ఛత్రచామరాదులపొళ్లును, నానాయుధఖండంబులునై సంగ్రామరంగంబు ఘోరం బయ్యె. పెక్కు లేల? పార్థుఁ డేయునొక్కబాణంబునకే హస్తిహాస్తికులును దురంగతౌరంగికులును సారథిరథికులును బెక్కండ్రు కాలుమానుసులుం గూలుచుండిరి. అతని మార్కొందు నని తనలోఁ దలంచుచుండునంతనె యమ్మేటివిలుకానివాలమ్ము మస్తకమ్ముఁ దఱుగుచుండె. అవ్విధంబున నివాతకవచాంతకుండు ఘోరాకారుండై మధ్యందినమార్తండునిపగిది నేరికిం దేఱిచూడరాక వెలుంగుచు సంగ్రామరంగముఁ గలయం గ్రుమ్మరుచు బాణ మెప్పుడు గ్రహించునో యెప్పు డరిఁబోయునో యెప్పు డేయునో యని యూహింప రానిరయమున నెక్కడఁ జూచిన బాణమయంబుఁ గావించి యేఱియేఱి చంపుచుండ మనసైన్యంబు దైన్యంబుఁ జెంది వెఱచఱచియు విచ్చిపఱచియుఁ దిరుగుడువడియుఁ గలగుండువడియుఁ జెప్పరానిదీనదశకు వచ్చెననినవినియాంబికేయుఁడు సంజయా, యప్పు డప్పార్థు నెదిరింప

మనలో నెవ్వరును జాలక ద్రోణుశరణు సొచ్చిరే యని యడుగుటయు నయ్యం బికానందనునకు సూతనందనుం డిట్లనియె.

దుశ్శాసనుఁ డర్జునుతోడం బోరి యోడుట.

అట్లు మనసైన్యంబు హతవీరంబై గతోత్సాహంబై పలాయనోద్యతంబై యుండునెడ దుశ్శాసనుండు కాంచనవిచిత్రకవచశిరస్త్రాణంబులు సెలంగ బహుళగజఘటాపరివేష్టితుండై బృంహితనినదంబునను ఘంటాస్వనంబునను మౌర్వీగుణక్వణనంబునను శంఖారవంబునను రోదసీకుహరంబు నిండించుచు నర్జునుపయిం దలపడిన నాశూరవర్యుఁడు ఱెక్కలు గట్టినకొండలం బోని యయ్యేనుఁగులతండంబులం జూచి సింహనాదంబుఁ గావించి వాతోద్ధూతం బైనయర్ణవంబుఁ ద్రిప్పుమహామకరంబుచందంబున నగ్గలించి యగ్గజానీకంబుఁ గలంచి బాణజాలం బడరించి యాసింధురంబులఁ జాపకట్టువడం జేసి గాండీవజ్యాఘోషంబు నిగిడించి దేవదత్తం బొత్తుటయు మురాంతకుండు పాంచజన్యంబుఁ బూరించె. ఆదారుణస్వనంబుల కులికి తెలివి తప్పి మనవారు దిక్కు దోఁపక విన్నఁబోయిరి. అంతఁ గొంతనడికిఁ దెప్పిఱిల్లికొని మగుడ నేనుంగులఁ బురికొల్పుటయుఁ గోపించి సవ్యసాచి యనేకశతమార్గణంబులం గుప్పించిన నక్కుంజరంబులు మావంతులు దెగుడుఁ బ్రబలఘీంకారంబులు సేయుచు ఱెక్కలు దెగినకొండలట్లు నేలం గూలె. అర్జునుబాణములకు వెఱచి మొగతిరిగి యూహింపరానిరయమునఁ బాఱునెడ మీఁదిమావంతులు గాండీవిబాణవిక్షతాంగులై నెత్తుటఁ జొత్తిల్లి మూర్ఛిల్లి వ్రాలియు రజ్జుబంధమునఁ జిక్కినకాళులఁ బెకలించుకొననేరక తలక్రిందై వ్రేలుచు నుగ్రతపోనిష్ఠ నాచరించురీతిం జూపట్టిరి. ఏమి చెప్పుదు నొక్కొకయమ్మునకు రెండు మూడు గూలుచుండె. తేరులును వికలసర్వాంగంబులై నుగ్గునూచ మయ్యె. ఎప్పుడు చూచినం గాండీవంబు మండలీకృతంబై నర్తనంబుఁ జేయుతీరునఁ గన్పట్టుఁ గాని యొండు గాదు. ఏచోటఁ గాంచినం గరికుంభంబులును దంతంబులు నంకుశశకలంబులును రథావయవఖండంబులును విండ్లతునియలును దెగినతలలును విఱిగినకాళులును నుసిగినభుజములును నలఁగిన మొండెములును బొడిమైనతొడవులును గూలినకేతనంబులునై కయ్యంపునేలఘోరదర్శనం బయ్యె. అట్లు దనమూఁకలెల్ల గాండీవిబాణానలంబున గ్రమ్ముటయు దుస్ససేనుఁ డనూనభయార్దితుండై ప్రాణరక్షణతాత్పర్యంబునఁ బఱచి శకటవ్యూహముఖమున నున్నయాచార్యునిమఱుఁగుఁ జొచ్చె.

అర్జునుఁడు ద్రోణునిచే ననుజ్ఞాతుండై ముగ్గరంబు సొచ్చుట.

అవ్విధమున దుస్ససేనుసేనలం గనుపుకొట్టి యర్జునుండు సైంధవవధత్వరితచిత్తుండై ద్రోణాచార్యునగ్రభాగమునకుఁ జని కృష్ణునినుమతమునఁ గృతాం

జలిమై యయ్యాచార్యున కిట్లనియె. బ్రాహ్మణోత్తమా, నామేలు చింతింపుము.
స్వస్తివచనంబు పల్కుము. భేదింపరానిసైన్యమును నీయనుగ్రహమునఁ జొర
నున్నవాఁడ. పాండురాజును ధర్మరాజును వాసుదేవుఁడు నెట్లట్ల నీవును నన్నుఁ
జూతువు. అశ్వత్థామయట్టుల నీకు నేను రక్షణీయుండఁ గదా. భవత్ప్రసాద
మున నేఁడు సైంధవుం దెగటార్చి ప్రతిజ్ఞ చెల్లించెద నని విన్నవించిన నాచా
ర్యుం డించుక నగుచు సవ్యసాచీ, నన్ను గెలువక జయద్రథుం గెలువ నీ కలవి
యగునే యని పలికి వాఁడితూపుల నర్జునుమేనను గృష్ణుగాత్రంబునను రథరథ్య
కేతనంబులపయిం గుప్పించె. అంతనర్జునుండును గురుననుమతి వడసి క్షత్రధర్మ
వ్యవస్థితుండై పెక్కుతూపు లేసి గురుఁ డేసినవాలమ్ముల మాయించి వెండియు
నతనిమేనఁ దొమ్మిదియమ్ముల నేయుటయు నాచార్యుండు ప్రతిశరముల నతని
తూపుల ఖండించి విషానలసంకాశంబు లయినతీవ్రనారాచంబుల నరనారాయ
ణులమేన నాటుడుఁ బాండవమధ్యముండు గురునివిల్లు దునియ నేయఁదలంచు
చుండె. అంతలో నబ్భారద్వాజుండు నవ్వుచు గాండీవిగుణంబుఁ దునియనేసి
రథరథ్యకేతనంబులపై శరజాలంబు గుప్పించి కృష్ణార్జునుల శరవర్షమున ముంచె.
అంతలో నర్జునుండును గాండివంబును సజ్యంబుఁ గావించి యొక్కయ మ్మేసినం
తలో నాఱునూఱువాలికతూపుల గురువుపై నడరించి తదనీకంబుపై నేడునూఱు
వాలమ్ములను మఱియు వేనవేలు కాండములను బరఁగించిన నాసైన్యంబునఁ బె
క్కండ్రు రథికులు విగతరథ్యసారథికేతనంబు లగురథంబులనుండి నేలం బడిరి.
అర్జునబాణప్రహారమునంజేసి మత్తమాతంగంబులు వజ్రాహతచూర్ణితంబు లయి
నగిరిశిఖరంబులమాడ్కిని మారుతోద్ధూతమేఘపటలంబులభంగిని ననలదగ్ధవేశ్మ
ములచందమునను రూపుమాసె. గుఱ్ఱములు హిమాలయసానుతటంబులందు
వారివిహతంబు లయినహంసలతెఱంగునం గూలె. కాలుమానుసులు ప్రళయకా
లమార్తండకిరణంబులకు జలాశయంబు లెట్టు లట్టుల పొడవడంగిరి. అవ్విధమున
ధనంజయుండు తీవ్రప్రతాపాతపంబుఁ గాయుచుండ నాచార్యుండు శరవర్షము గురి
యించి క్రీడివాఁడియమ్ముల నడంచి యొక్కవాలికనారసంబు కిరీటిఱొమ్మున నాటు
టయు నతండు తత్ప్రహారమున భూకంపమునఁ బర్వతంబువోలె విహ్వలితగా
త్రుండయ్యు ధైర్యధుర్యుండై యాచార్యుమేనం గొన్నియమ్ములు నాటె. అందు
లకుఁ గోపించి గురుండు మురారిమేన నేనమ్ములను గిరీటిగాత్రంబున డెబ్బదిమూఁ
డువాఁడియమ్ములను నాటి కేతనంబుపయిం బదుమూఁడుబాణంబు లేసి నిమేష
మాత్రలో శరాసారముఁ బరఁగించి యర్జునుస్యందనం బదృశ్యంబుఁ గావించె. ఏమి
చెప్పుదు నెప్పుడు మండలీకృతం బైనగురునికోదండంబునుండి యెడపక యమ్ములు
వాసుదేవార్జునులపయిం బడుచుండె. అవ్విధమునఁ బరస్పరస్పర్ధాసమృద్ధమై విరా

మరహితంబై ద్రోణార్జునులయుద్ధము సెల్లుచుండఁ గార్యచింతనతత్పరుం డైన దామోదరుండు ధనంజయుం జూచి పార్థా, మన కిచట రిత్తకాలయాపనం బేల? ద్రోణుఁ గ్రేడించి చనుటయ యిప్పటికిఁ దగినపని యనుటయు నర్జునుఁడును నీయిచ్చమెయిఁ జేయు మనవుడుఁ దన్మతం బెఱింగి గోవిందుఁడు గురునకుఁ బ్రదక్షిణముగఁ దేరు వోనిచ్చుచుండె. అప్పు డాచార్యుఁడు పార్థుం బిలిచి యయ్యా, పోర మార్కొన్నపగతుని గెలువక క్రేడించి పోవుట యొప్పునే యనుటయు నర్జునుఁడు మహాత్మా, నీవు నాకు గురుఁడవుగాక పగతుఁడ వగుదువే? శిష్యుఁ డనగుటంజేసి యేను నీకుఁ బుత్రసముఁడఁగదా. నిన్ను రణమున గెలువ నేరికిఁ దరంబగు నని పలుకుచు రయమున నాచార్యుం గ్రేడించి తేరు తఱిమికొని శకటవ్యూహంబు సొచ్చి పోవుచుండఁ బార్థచక్రరక్షకు లగుయుధామన్యూత్తమౌజులు నతని తేరుజాడ వట్టికొని తోడన యరిగిరి. అప్పుడు కృతవర్మయుఁ గాంభోజుండును శ్రుతాయువును నభీషాహశూరసేనశిబివసాతిమావేల్లకలలిత్థకేకయమద్రకసైనికులును నారాయణగోపాలురును సైంధవవధతాత్పర్యంబున నర్జునుండు ద్రోణుం గ్రేడించి ద్విరదయూథంబు సొచ్చువన్యమత్తశుండాలంబుచందంబున శకటవ్యూహంబు సొచ్చుటయు నాచార్యుండు వెంటం దఱిమికొని వచ్చుటం గాంచి నిర్భయులై ప్రతీకారములు రోగమునుం బోలె వారింపం దొడంగిన నేకవీరుండై నయయ్యర్జునునకును వారలకును బోరు ఘోరంబై చెల్లె. కోపాటోపదీపితుండై గాండీవి యేసినయమ్ములతాఁకు పెల్లునంజేసి కూలినయేనుంగులును జచ్చిన గుఱ్ఱములును విఱిగిన తేరులును మడిసినకాలుమానిసులును శకలంబులైనయాతపత్రాదులునై తత్సైన్యంబు దైన్యంబుఁ జెందుచున్నంత నాచార్యుండును గూడమట్టి మర్మభేదనకర్మఠంబు లయినతీవ్రమార్గణంబుల నిరువదేనింటిని గిరీటిపై నేయుటయు నతండును గురునిశరములఁ బ్రతిశరముల మాయించి మఱియుం గాండజాలంబుఁ బరఁగించె. అందుల కలిగి గురుండు ప్రావృట్పయోధరంబు పర్వతంబునుం బోలె నర్జునుం గాండజాలసంవృతుం గావించి యంత నిలువక బ్రహ్మాస్త్రము సముద్దీపితముఁ గావించినం గిరీటి యావనస్థుఁడయ్యు వృద్ధగుగురుం గడవనేరక కొంతవడి చింతించి తానును బ్రహ్మాస్త్రంబ ప్రయోగించుటయు నయ్యుత్తమాస్త్రంబులు రెండును బ్రశాంతంబు లయ్యె. అందులకుఁ గినిసి శరాసనగురుండు పంచవింశతివిశిఖంబులఁ గ్రీడిం గాఁడనేసి వాసుదేవువక్షోభుజదేశముల డెబ్బదియాశుగంబులఁ గీలించుటయుఁ గిరీటి నవ్వుచు గురుశరములకు మాఱేయుచు జయద్రథునిపైఁ జిత్తము నిగుడ నింక నిక్కడఁ బెద్దయుఁ దడవు సేయరాదు. ఇమ్మేటివిలుకాని గెలుచుట యరిది యని తనలోఁ దలంచి యగ్గురుం గ్రేడించి కృతవర్మనియనీకంబు సొచ్చుటయుఁ గుంభజుండు మగిడి సేనాముఖరక్ష

ణంబునకుఁ జనియె. అంతఁ గృతవర్మయుఁ గిరీటిని మార్కొని పదియమ్ము లేసి
నం గినిసి యతనిపై నొక్కయుమ్మడి నూఱమ్ములను మఱియు మూఁడమ్ములనుం
బరఁగించిన నాభోజపతి నగుచు వాసుదేవార్జునులపయిం బ్రత్యేకంబ యిరువ
దేనుమార్గణంబులం గీలించినం గోపించి గాండీవి యతనికోదండంబు ఖండంబులు
గావించి కుపితపన్నగోపమంబులు వహ్నిశిఖాకారంబులు నగుతీవ్రశరముల డెబ్బ
దిమూఁడింటి నేసె. అంతఁ గృతవర్మయు నొండుకార్ముకం బెత్తి సాయకపంచక
మున బీభత్సువక్షస్స్థలంబున నాటి మఱియు నైదమ్ములం గాఁడ నేయుడుఁ బా
ర్థుండు తొమ్మిది యమ్ముల భోజపతి స్తనాంతరంబునం బిట్టేసి నొంచుచున్నంత ము
రాంతకుండు నివాతకవచాంతకుం జూచి యయ్యా, యిపుడు వీనిం గరుణింప
రాదు. బంధుభావంబు విడిచి తెగటార్పు మని బోధించిన విని విజయుండు నానా
విశిఖశతంబులం గుప్పించి యాహార్దిక్యుని మూర్ఛితుం జేసి కాంభోజసైన్యంబుఁ
జొచ్చె. అంతలోనం దెలిసి కృతవర్మ యర్జునుండు తన్నుఁ గడచి చనుట కలిగి
చేయునదిలేక తదీయచక్రరక్షకు లగుయుధామన్యూత్తమౌజుల మార్కొని నారి
సారించి మూఁడమ్ముల యుధామన్యుని నాలుగుమార్గణంబుల నుత్తమౌజుని నొం
చుటయు వా రలిగి వేఱువేఱ పదేసియమ్ములు నతనిమేనం గీలించి మఱియు మూ
డుమూఁడువాఁడికోలలు పరఁగించి యొక్కఁడు విల్లును మఱియొక్కఁడు సిడముం
ద్రుంచిన నాతం డలిగి వారివిండ్లు దునిమి శరజాలంబుఁ గురిసె. అంత నప్పాం
చాలకుమారులును వేఱువిండ్లు గొని యర్జునుండు కరుణించి క్రేడించి పోవుటం
జేసి ప్రాణావశిష్టుం డై నయాభోజపతితోడం బెద్దయుఁ బెనంగుచుండిరి.

## శ్రుతాయుధుం డనురాజు కిరీటితోడఁ బోరి చచ్చుట.

అంతకు విప్వచ్చుండు సింధురాజును మార్కొనం దఱిమికొని వ్యూహంబు
సొచ్చుటయు శ్రుతాయుధుం డనురాజు క్రోధమూర్ఛితుండై ధనుర్గుణక్వణనంబుఁ
గావించుచు మార్కొని యర్జునుమేన మూఁడువాలికతూపులను జనార్దనుగాత్రం
బున సప్తతిశిలీముఖములనుం గీలించి కేతనంబుపయి నిశితక్షురప్రం బేసిన నర్జు
నుండు కోపించి యంకుశంబులు మత్తసింధురంబునుం బోలెఁ దొంబదియమ్ముల
నాశ్రుతాయుధుం గాఁడనేసె. ఏసినం గినిసి శ్రుతాయుధుండు రయమున డెబ్బది
యేడువాఁడినారసములఁ గిరీటిమేనం గీలించిన నమ్మేటివిలుకాఁడు వానివిల్లు దునిమి
యేడుతూపులు ఱొమ్మున నాటుటయు నారాజు క్రోధోద్ధతుండై యొండుకోదండం
బుఁ గొని పార్థునిభుజవక్షోదేశములఁ గాండనవకంబుఁ బరఁగించె. అందులకు నగుచు
నరుఁ డొక్కయుమ్మడి పెక్కమ్ము లతనిపై నేసి హయచతుష్టయంబును సారథిం
జదియ నడిచి వెండియు డెబ్బదినారసంబు లతనిమేనం గీలించుటయు నాశ్రుతా
యుధుఁడు రథము డిగ్గ నుఱికి వరుణలబ్ధం బై నతనయుద్దండగదాదండంబుఁ గొని

పురందరనందనస్యందనంబుపయిం గవిసె. ఆశ్రుతాయుధుండు తొల్లి వరుణుం డు పర్ణాశ యనునది తోడ సంగమించినం బుట్టినవాఁడు. ఆతండు పుట్టినపుడు పర్ణాశ నాకొడుకు శత్రువుల కవధ్యుండు గా వరం బొసంగు మని వేఁడిన నతండు మనుష్యుల కమర్త్యత్వంబు కానిపని. పుట్టిననరునకు మరణం బనివార్యంబు. కావున దివ్యాస్త్రం బొక్కటి యిచ్చెద. దాన నితండు శత్రువుల కజేయుండై నెగడు. అందులకు నీవు సంతోషింపుము. మఱియు నొక్కటి చెప్పెద వినుము. నాయిచ్చుదివ్యాస్త్రంబు తనతోడం బోరాడక యూరకుండువానిమీఁదం బ్రయోగింపరాదు. ప్రయోగించిన నది క్రమ్మఱి ప్రయోగించినవానిన వధించు నని చెప్పి సర్వవీరఘాతనసముద్దండం బయినగదాదండంబు నొసంగె. అది యెల్లను దానెఱింగియు శ్రుతాయుధుండు కాలపరిపాకమునం జేసి యానియమంబు దలఁపోయక యగ్గదాదండంబుఁ బుండరీకాక్షునిపయిం బడ నేసె. ఏయుటయు నది కృష్ణు నేమియుఁ జేయఁజాలక మగిడి రయమున వచ్చి వరుణవచనప్రకారమున నాశ్రుతాయుధునిపయిం బడుటయు నతండు పెనుగాలికి విఱిగినమ్రానిమాడ్కి నేలం బడి గతాసుఁ డయ్యె. అట్లు శ్రుతాయుధుఁడు తనయాయుధమున హతుఁడగుటయు మనసైనికులు హాహాకారంబులు నార్తనాదంబులునుం జేయుచువిచ్చి పఱచిరి.

అర్జునుఁడు కాంభోజసుదక్షిణప్రభృతులఁ జంపుట.

అంతఁ గాంభోజరాజతనూజుం డైనసుదక్షిణుండు గాండీవి నతిరయమున మార్కొనుటయు నబ్బిరుదుమగండు వానిమేను వ్రయ్యఁగ నేడమ్ముల నేసిన నొచ్చి యాసుదక్షిణుండు ఫల్గునుపైఁ బదిబాణములను వాసుదేవునిపై శరత్రయంబును వెండియుఁ గాండీవిపైఁ గాండపంచకంబును బరఁగించినం గోపించి విజయుఁడొక్కబాణమున విల్లు దునిమి వేఱొక్కటఁ గేతనంబుఁ గూల్చి రెండు వానిమేనం గీలించె. అందులకుఁ గడుం గోపించి యక్కాంభోజపతి మూఁడువాఁడియమ్ములఁ బార్థుమేన నాటి యార్చి కనకఘంటాసముల్లసితం బయినఘోరశక్తి నేయుడు నది క్రీడిమేను దాఁకి మిడుఁగుఁఱు లెగయ వడిం దిరిగి నేలం బడియె. శక్తిప్రహారమునఁ బార్థుఁడు గాఢమూర్ఛితుండై కొండొకవడికిఁ దెలిసి యొక్కపెట్ట నాలుగునారాచంబులఁ బరఁగించి హయసారథికేతనకోదండంబులం దునిమి మఱియుఁ బెక్కుతూపులఁ దేరు తునియలు గావించి యొక్కవాఁడియమ్మున బొమ్మ గాఁడనేయుడు నాకాంభోజసుదక్షిణుండు కీలెడలినరథంబునుండి పడుసిడంబు వడువునను బెనుగాలికిగిరిశిఖరంబునుండి పడుకర్ణికారమహీరుహంబుచందంబునను భ్రష్టమకుటాంగదాదిభూషణుండై తేరినుండి డొల్లిపడియె. అట్లు శ్రుతాయుధుండును గాంభోజసుదక్షిణుండును నీల్గుటయు మనమూఁకలు దిక్కు గానక

పఱచె. అయ్యెడరుచూచి యభీషాహశూరసేనశిబివసాతివీరులు పెక్కండ్రొ
క్కమొగి వివ్వచ్చు నఱిమిన నమ్మహారథుండు బహుళశిలీముఖములు బరఁగించి
షష్టిశతయోధులం బిలుకుమార్చుటయుఁ దక్కినవారు వెఱచి పఱచి క్రమ్మఱ
క్షత్రధర్మంబుఁ దలపోసి పార్థుం జుట్టుముట్టుటయు నమ్మేటిమగండు వారితలలఁ
దఱిగియుఁ జేతుల నఱికియుఁ గాళ్లఁ దునిమియుఁ బలుదెఱంగుల బీభత్సంబుఁ
జేయుటయుఁ దెగిపడినతదీయాంగఖండంబులం జేసి పుడమి కాకగృధ్రాదినిబిడం
బై నయభ్రచ్ఛాయమాడ్కిం జూపట్టె. అందుల కత్యంతకోపాటోపదీపితులై
శ్రుతాయువు నచ్యుతాయువు ననువా రిద్దఱుదొరలు బాహుగర్వంబునం జేసి
గీర్వాణపతిసుతుసవ్యదక్షిణభాగంబుల నఱిమి నీకొడుకునకు విజయంబుఁ గావిం
చువారై జలధరంబులు తటాకంబునుంబోలె నయ్యర్జునుం బటుశరాసారపూరితుం
గావించి యంత నిలువక కడిమి మెఱసి శ్రుతాయుండు నిశితపీతతోమరంబును
నచ్యుతాయుండు తీక్ష్ణశూలంబును విసరివేయుటయు నర్జునుండు శ్రుతాయునితో
సమరంబుపాటునఁ గడు నొచ్చినవాఁడుగావున నచ్యుతాయునిశూలప్రహారంబు
గాయమునకు క్షార మెట్టులట్టులు తనకు మిక్కిలి బాధాకరం బగుడు మూర్ఛిల్లి
కేతనదండం బూఁతఁ గొనుటయు వనజనాభుండు లలితోపచారంబు లొనరించె.
అది తఱిగాఁ గొని వారు బహుళశరపరంపరలు గురియించి కిరీటిరథం బదృ
శ్యంబుఁ గావించిరి. అంతలోఁ దెలిసి పార్థుండు సమరక్రోధభరితుండై యైం
ద్రాస్త్రంబు సముద్దీపితంబుఁ గావించుటయుఁ దదస్త్రప్రభావమునం జేసి పెక్కు
వాఁడితూపు లుద్భవిల్లి వారియమ్ములనెల్లఁ దునిమి తుది యాశ్రుతాయు రచ్యు
తాయువులతలలను జేతులనుం దఱుగుటయుఁ దత్కబంధంబులు వాతోద్ధూతం
బు లయినపాదపంబులభంగి నేలంగూలె. అయ్యిద్దఱుదొరలు తటాలునం బడుట
సముద్ర మింకినట్లు సకలజనులకు విస్మయాపాదకం బయ్యె. అట్లు వారలం జంపి
నిలింపపతిపుత్రుండు కౌరవసేనలో నేఱియేఱి యుత్తములం జంపుచుఁ దఱిమి
కొని పోవుచున్నంత శ్రుతాయురచ్యుతాయువులకొడుకులు నియుతాయువు దీ
ర్ఘాయువు ననువారు క్రోధశోకములు మనంబునం బెనంగొనంగ నర్జునుం దలపడి
వివిధమార్గణంబులఁ బరఁగించుటయుఁ గిరీటి ముహూర్తమాత్రలోన వాఁడియ
మ్ముల నయ్యిద్దఱను దండ్రుల నెడఁబాయుట మీకుఁ దగదని వారితోడ యమ
పురంబునకుఁ బనిచె. అత్తెఱంగున మత్తమాతంగంబు గలంచినకమలాకరంబు
భంగి మనసైన్యంబు వికలం బగుడు దుర్యోధనుండు పురికొల్పఁగ నంగకళింగ
ప్రాచ్యదాక్షిణాత్యబాహ్లీకప్రముఖులును, ముండార్ధముండజటిల సూచీజటిలాది
నానాకారులును బహుళాసురమాయావిదులు నసంఖ్యాకులు నగుమ్లేచ్ఛయవను
లును నపారగజానీకంబుతోడ నెక్కపెట్ట యర్జునుపయిం దలపడి నానాహేతి

వ్రాతంబులు గురిసినం జలింపక పాండవమధ్యముండు గాండీవప్రయుక్తంబు లయినయమితనిశితశరనికరంబుల ముహూర్తమాత్రలోన మిడుతలబారులతీరునఁ బరఁగించిన నేమి చెప్పుదుఁ దత్ప్రహారంబునం జేసి యావీరులు తలలు దెగినరూపును బాహుదండంబులు దునిసినరూపును దొడవులు పడినరూపును గాళ్లు విఱిగినరూపును నెత్తుటం జొత్తిల్లినరూపునునైరి. కుండలకిరీటోల్లసితంబు లయి నతలలును భుజంబులునుం బెరసి పడియుండుటం జూడఁ బాములు చుట్టుకొన్న కనకశిలలరీతిం గన్పట్టె. ఏనుఁగులు నెత్తురు గ్రక్కుచు వానకాలమునాటిగైరిక ధాతురంజితఝరీపరీతగిరిశిఖరంబులట్టులు చూడ నొప్పునవియుఁ బ్రబలఘీంకారంబుఁ జేయునవియు జిఱ్ఱనం దిరుగునవియుఁ దప్పికొనఁ బాఱుచుఁ దమసైన్యంబుల నుగ్గునూచంబు సల్పునవియుఁ బాఱియు దిక్కుగానక గాండీవమునకు బలియై విభిన్నకుంభములై విభగ్నవిషాణంబులై వినికృత్తచరణంబులై విగతారోహకంబులై కూలునవియు నయ్యె. అట్లు గజానీకంబును మ్లేచ్ఛాదిగణంబులనుం గనుపుగొట్టి శోణితనదీప్రవాహంబుఁ బాఱించి కంకగృధ్రాదులకును భూతభేతాళంబులకును దృప్తిఁ గావించి తనకు మాఱుమలయువారు లేక కమలాకరంబుఁ గలఁచుమత్తమాతంగంబు తెఱంగునను శుష్కతృణగుల్మంబుల దరికొనుదవానలంబుపథంబునను నుద్దండవిక్రమాటోపంబునఁ బెంపుఁ గాంచి గజవాజినరకళేబరంబుల రణక్షోణిం గప్పి విక్రమనర్తనం బొనరించుచు వాసుదేవుఁ డనుగాద్భుతోద్భాటునం బెచ్చువెఱిగి తనధనంజయనామంబు సార్థంబుగాఁ బార్థుండు మనమూఁకల నీఱుసేయుచు సైంధవుం దఱియఁ జనుచుండ నంబష్ఠపతి యగు శ్రుతాయు వడ్డపడి శరాసారంబుఁ గురియుటయుఁ గవ్వడి వడిం బేర్చి వానిగుఱ్ఱములం జంపి సారథిం దెగటార్చి విల్లు దునిమిన నతండు క్రోధపర్యాకులలోచనుండై గదాదండంబు విసరి కేశవుపయిం బడనేసె. ఏసినం గినిసి కిరీటి కనకపుంఖమ్ములగునిశితశరమ్ముల నగ్గద నుగ్గుచేసి మేఘపటలంబు దివాకరుంబోలె శరాసారంబుఁ గప్పుటయు నయ్యంబష్ఠనాథుఁ డొండుగదం గొని విసరివేయ నుంకించుచున్నంత రయమున విప్పచ్చుండు నిశితక్షురప్రంబుల గదాదండంబుతోడ మీఁది కెత్తినబాహుదండంబుల రెంటినిం దఱిగి యొక్కవాలమ్మునఁ దలఁ దునుముటయుఁ గీలెడలినయింద్రధ్వజంబుకరణి నాశ్రుతాయువు నేలం గూలె. కూడియున్నమూఁక లన్నియు వెఱఁగుపడియు నివ్వెఱపడియు ఱిచ్చపడియు బెండువడియుఁ బలువ్రాకలఁ బఱచె. క్రీడి మనసైన్యంబుఁ దఱిమికొనిచనియె.

దుర్యోధనుఁడు ద్రోణుని దూలనాడుట.

అవ్విధమున శ్రుతాయుధుండును గాంభోజసుదక్షిణుండును శ్రుతాయురచ్యుతాయువులును నియుతాయుర్దీర్ఘాయువులును లెక్కకు మీఱినమ్లేచ్ఛయవ

నాదిగణంబులు నంబష్ఠపతియును నానాసైన్యంబులును నర్జునునిగాండీవాగ్ని కెర యగుటకుఁ జింతాశోకవ్యాకులచిత్తుండై భవత్తనయుండు దుర్యోధనుం డొక్క రుండు రయమున నాచార్యుపాలికిం జని యిట్లనియె. భూసురోత్తమా, పార్థుండు మనసైన్యంబు దిరుగుడుపఱచి సింధురాజుం దఱియఁ జనియె. అనంతరకృత్యంబుఁ జింతింపుము. జయద్రథుఁడు గాండీవిచేఁబడకుండునట్లు చూచికొనుము. నీవకదా మాకు దిక్కు. క్రోధమారుతప్రేరితుండై సవ్యసాచి దవానలంబున కెనవచ్చుచు మదీయసైన్యకాననంబు నీఱుసేయుచున్నవాఁడు. సేనాముఖంబుఁ జించి క్రీడి లోనికిఁ జొచ్చినప్పుడే జయద్రథునకుఁ గావలియై యున్న మహారథులు పరమసంశయంబుఁ బొందిరి. అర్జునుఁడు ప్రాణంబులతో ద్రోణుం గడవఁ జాలఁ డని యందఱుం దలంచి యుండిన నీవు చూచుచుండఁగ నయ్యది విపరీతం బగుదు మనసైన్యంబు శూన్యప్రాయం బయ్యె. నీవు పాండవులకు మేలు దలంచువాఁడ వని యెఱింగి యుఁ గార్యసమయమున మోసపోయితి. శక్తికొలఁది మీచిత్త మనువర్తించు చుండినను నీ వది తలపోయక పరమభక్తు లయినమమ్ము విడిచి మా కెల్లకాలంబు కీడే రోయుపాండవులకు మేలు సమకూర్తువు. ఏను పాండుపుత్రుల నిగ్రహింతును సింధురాజునకు వెఱవం బనిలే దని నీవు బాస యీకుండిన నతని నేఁటి యాలమునకుఁ దోడ్తేక యింట నిలిపియుండుదు. నీమాట నమ్మి యతనిం దెచ్చి మృత్యువాతం బెట్టితి. యమదంష్ట్రాంతరంబునఁ జిక్కినవాని నైనం దప్పింప వచ్చుఁగాని యర్జునుమునుమునం బడినవానిఁ దప్పింప శక్యంబుగాదు. మాయొద్దనుండి మాయన్నముఁ దినుచు మాకుఁ కీడు రోయుచుండుదువుగాని యొండు గాదు. తేనె పూసినకత్తి యని నిన్ను నెఱుంగనైతి. నాయార్తప్రలాపంబులకుఁ గినియక యింకనైనం గరుణించి సైంధవుం గావు మనిన విని యాచార్యుండు దుర్యోధనున కిట్లనియె. రాజపుత్రా, నీమాటలకు నేను గినియను. నీవు నశ్వత్థామయు నా కొక్కరూపయగుట నీ వెఱుంగవే? సత్యంబు పలికెద వినుము. అర్జునునకు సారథి శ్రీకృష్ణుండు. రథ్యములు మహారయంబులు. దానంజేసి యతం డించుక తెఱపియైనం బరమరయమునం బ్రవేశించి నిజకార్యంబుఁ దీర్చువాఁడై చనియె. అతండు చనునప్పుడు నేను వెంటఁ దవిలి క్రోశమాత్రదూరంబుదనుక శరజాలంబుఁ బరఁగించుట నీకును బ్రత్యక్షంబకాదె. విశేషించి వృద్ధ నగుటం జేసి శీఘ్రయానంబునకుఁ జాలను. సేనాముఖంబున ధృష్టద్యుమ్నప్రముఖు లగుతదీయయోధులు వ్యూహముఁ బన్ని కడిందిమగంటిమిం బేర్చియున్నవారు. మఱియు సర్వరాజసమక్షమున యుధిష్ఠిరుం బట్టి యిత్తు నని నీకుబాస యిచ్చితిఁగదా. ధనంజయుండు చెంగట లేమిం జేసి యందుల కిదియ తగినతఱియై యుండు. కావున సేనాముఖంబు విడిచి యిఁక నిపుడు పార్థుపయిం గవియఁబోవుట నాకుఁ దగదు. రాజపు

రాజపుత్రుఁడవు శూరుఁడవు సమర్థుఁడవు విదితాస్త్రుఁడ వగునీవు తగినశూరులం
బురికొల్పుకొని యొకధనంజయుని మార్కొనక వెఱచి పఱచుట పోలునే? తడవు
సేయక పొమ్మనినగురునకు దుర్యోధనుండు వెండియు నిట్లనియె. ఆచార్యా,
వజ్రపాణి యైనపురందరునైన నని మార్కొని గెలువ వచ్చుఁగాని గాండివి నెది
రించి చక్కనిలిచి పోర నాకుఁ దరమే? అతండు విల్లు పట్టినవారికెల్ల గురుండ
గునిన్నును గృతవర్మనుం గడిచి శ్రుతాయుధుం బరిమార్చి కాంభోజసుదక్షిణుం
దెగటార్చి శ్రుతాయురచ్యుతాయువులఁ బొరివుచ్చి నియుతాయుర్దీర్ఘాయులఁ
జంపి యంగకళింగప్రాచ్యదాక్షిణాత్యయవనమ్లేచ్ఛగణంబుల సమయించి యపా
రకరిఘటలం గూల్చి మాఱులేక మారిమసఁగినట్లు చెలరేఁగినయర్జునుతోడిపోరు
నకు నన్నుఁ బొమ్మనుట నీ కుచితంబని తోఁచునే? నీయానతిమెయి నడచువాఁడ.
యశంబుచేకూఱు తెఱంగుగా నన్ను శాసింపు మనవుడు భారద్వాజుండు భవదగ్ర
తనూజున కిట్లనియె.

ద్రోణుఁడు దుర్యోధనునకు దివ్యకవచంబు దొడుగుట.

కుమారా, పార్థుండు నీచెప్పినంతటివాఁడ కాని యలంతి గాఁడు. అయి
నను నీవు వాని నోర్చునట్లు నిరపాయం బైనయుపాయంబు సేసెద. అందుల కం
దఱు నద్భుతం బావహిల్లఁ జూతురుగాక, అది యెయ్యది యం టేని? నీకొక్క
కవచధారణంబుఁ గావించెద. దేవదానవయక్షరాక్షసాదులబాణము లెవ్వియు
నాకత్తళంబు సింపఁజాలవు. కృష్ణార్జునులకాదు ముల్లోకంబు లొక్కటియై కూడి
ముట్టినను నీకు వెఱవం బనిలేదు. కావున నాకవచంబుఁ దొడిగికొని కవ్వడిని
మార్కొను మని పలికి యుదకంబు స్పృశించి యాచమించి యొక్కకాంచనవ
ర్మంబు నతనికిఁ దొడిగి యందు మహనీయంబు లగుతత్కవచమంత్రంబులు జపపూ
ర్వకముగ నావహించి బ్రహ్మయు బ్రాహ్మణులును సరీసృపశ్రేష్ఠంబులును నహు
షయయాతిదుంధుమారభగీరథ ప్రముఖరాజర్షులును నేకపాదబహుపాదవిపాదం
బు లగుసకలజంతువులును లక్ష్మీశచీస్వాహాస్వధారుంధతులును నసితదేవలవిశ్వా
మిత్రాంగిరోవసిష్ఠకశ్యపమహర్షులును ధాతయు విధాతయును దిక్కులును దిక్పా
లకులును షణ్ముఖుండును వివస్వంతుండును దిగ్గజంబులును భూమ్యంతరిక్షంబులును
గ్రహంబులును భూభరణధుర్యుం డైనశేషఫణియును నీకు స్వస్తి గావింతురు. తొ
ల్లి సురలు వృత్రాసురుతోడికయ్యంబున క్షీణతేజోబలులై వెఱచి బ్రహ్మేంద్రపుర
స్సరులై చని నారాయణుశరణు సొచ్చి దేవా, వృత్రభయార్దితు లైనమమ్ముఁ గావవే
యని ప్రార్థించినం జిత్తగించి యద్దేవదేవుఁడు బ్రహ్మాదులం జూచి సురలఖేదంబు మా
న్పుట నాకుఁ గర్తవ్యం బై యున్నను దొల్లి త్వష్ట వర్షాయుతశతంబు తీవ్రతపంబున
మహేశ్వరు నారాధించి వృత్రునిఁ బుత్రునిఁగాఁ బడసినవాఁడుగావున నతని విక్ర

మం బ్రతిహతం బయ్యె. వానిం బరిమార్పంగఁ దలంతు రేని శీఘ్రంబ కైలాసంబున
కరిగి పరమేశ్వరుం గనుఁడు. అద్దేవదేవుం గాంచి వేఁడికొనకుండిన మీ కీయా
పద తీఱదనుటయు బ్రహ్మాదు లయినయమరులు నారాయణుననుమతిం గొని
రయమున రజతగిరి కరిగి కోటిసూర్యసమప్రభావిభాసమానుం డైనమహాదేవు
నవలోకించిరి. సర్వభూతేశ్వరుండు వచ్చిననిర్జరుల స్వాగతం బడిగి యేమిపని
గలుగ నిచ్చోటికి వచ్చితిరి. నాదర్శనంబు నిష్ఫలంబు గాదు. మీకోరినవరం
బిచ్చెద నడుగుఁ డనుటయు గీర్వాణులు తమతేజోబలం బెల్ల వృత్రతేజంబున
హతం బగుడు మూర్తులెల్ల జర్జరితంబు లయ్యె దిక్కు గానక నీశరణు సొచ్చితిమి.
మహేశ్వరా, కరుణించి కావవే యని నివేదించిన నవధరించి శశిధరుండు సుప
ర్వులారా, మీయభిప్రాయం బెఱింగితి. త్వష్ట్రుతేజోభవం బయినవృత్రతేజంబు
మీకు దుస్సహం బయ్యె. మీకు మేలు గావించెద నని పలికి యింద్రుం బిలిచి
మదీయగాత్రసంభవం బయినయీదివ్యకవచంబు నిచ్చెద. నాయుపదేశించు
మంత్రమున నీకవచంబు ధరించితివేని వృత్రుం గెలువఁజాలుదు వని యమ్మంత్ర
రాజంబుతోడ నాకవచంబుఁ బ్రసాదించినం గ్రహించి సంతసించి యింద్రుఁడు
తత్కవచగుప్తుండై పోరి వృత్రుం గెలిచె. దానిం బురందరుఁ డంగిరసున
కొసంగె. అతండు బృహస్పతి కిచ్చె. బృహస్పతి యస్మద్గురుం డైనయగ్నివేశ్యు
నకుఁ బ్రసాదించె. అస్మద్గురుండు కరుణించి నా కొసంగె. దీనిప్రభావం బిట్టిది.
ఇమ్మహనీయకవచంబును దొల్లి దేవాసురసమరసమయమున సురజ్యేష్ఠుండు
విష్ణువునకుఁ దొడిగినట్లు నేను నీకుఁ దొడిగి బ్రహ్మసూత్రమున బంధించెద నని
చెప్పి భారద్వాజుండు విధిపూర్వకంబుగ నద్దివ్యకవచంబుఁ దొడిగి యనిచినం బర
మానందంబునం బొదలి దుర్యోధనుండు నేవురుత్రిగర్తరథికులును మత్తమాతంగ
సహస్రంబును నియుతాశ్వంబులును బెక్కండ్రుకాలుమానుసులును మఱియు
ననేకమహారథులునుం బరివేష్టించి రాఁగ శంఖభేరీప్రముఖవాద్యనాదంబులు
సెలంగ సముద్రముచందమునఁ బఱపైనమహాసైన్యంబుతోడ విరోచనపుత్రుండు
వృత్రశత్రుంబోలె గాండీవిని దలపడం జనియె.

### ధృష్టద్యుమ్నద్రోణాచార్యులయుద్ధము.

అంత నిక్కడ సేనాముఖంబునఁ బాండవులు ధృష్టద్యుమ్నపురస్సరులై
యాచార్యుపయిం దలపడుటయు నామధ్యాహ్నసమయమున ఘోరం బైనపోరు
సెల్లె. అట్టికయ్యము నెన్నఁడుఁ జూచియు వినియు నెఱుంగము. అప్పుడు కౌర
వపాండవసైన్యంబు లొండొంటిం దలపడుటం జూడ శిశిరాపగమసమయమున
వాతమిశ్రము లగుమహామేఘములచాడ్పునను వానకాలమున సంపూర్ణప్రవా
హము లగుగంగాయమునలు గూడినకైవడినిం జూపట్టె. అట్టియెడ ధృష్టద్యు

మ్నుండు సంరంభావష్టంభంబునం బేర్చి కార్చిచ్చుమాడ్కిఁ దీంద్రించి మనసేనా కాననంబు నీఱుసేయుచుండ భారద్వాజుండు శరవర్షమున వారించుటయు సర్వ ప్రయత్నములను మహాప్రవాహములు దృఢమహాసేతువునుంబోలె వారికి గురువుం గడవరాకుండుటయు నిరువాఁగునఁ జేయంగలదొరలు కడిమి మెఱయు టయు సంగ్రామంబు నానాశస్త్రములు పుోవాతంబుగాఁ గనకగదాదండకాం తులు విద్యుత్ప్రకాశములుగా శరపరంపరలు వర్షధారలుగా భారద్వాజుడు మారుతంబుగాఁ గాలమేఘంబుచాడ్పునం జూడ నొప్పె. అంతఁ గొంతవడికిఁ గౌరవులు పలుమఱు ద మ్మఱుముటయుఁ బాండవులును ధృష్టద్యుమ్నుప్రాపున వారలం దలపడిరి. ద్రోణుఁ డెవ్వరిం దాఁకఁ దలంచినను ధృష్టద్యుమ్నుఁడు దా నడ్డపడి మాఱేయుచు వారించుచుండె. ఇవ్విధమున గురుం డెంత యత్నము చేసినను నప్పాంచాలరాజకుమారునొద్ద వమ్మగుటయు నవ్వీరుమ్రోల నిలువఁ జాలక మనసైన్యము మూడుమొత్తములై కొంత కృతవర్మను గొంత జలసం ధునిఁ గొంత ద్రోణునిం జేరుటయుఁ బాండురాజతనూజసైనికులు నందుల కను రూపముగ మూడుతెఱంగులవారై యఱిమిరి. ద్రోణుపాలం జేరినసైన్యముల నెల్ల ధృష్టద్యుమ్నుఁడు శరాసారమున ముంచి వెగడుపఱుచుటయుఁ గుత్సితుఁ డగురాజురాజ్యము దుర్భిక్షవ్యాధితస్కరగణములంబోలె మీసైన్యంబు పరమ వికలంబగుడు నాతుములమున నెగసినధరణీపరాగంబుపెల్లునంజేసి చూడ్కులు సారించుటయు దుష్కరంబైనం గోపించి చాపగురుండు కాలాగ్నిపోలె మండి పడుచు సాయకజాలంబుఁ బరఁగించి యొక్కబాణంబునఁ బెక్కుచతురంగంబులం గూల్చుచుండె. ఏమి చెప్పుదు నాచార్యుబాణము తాఁకెనేని మేనఁ బ్రాణ ములు వెట్టికొన్నవాఁ డొక్కఁడేనియుం గలుగఁడు. సూర్యకిరణతాపసంతప్తంబై సోలియున్నపాండవసైన్యంబు ద్రోణుబాణంబులు తాఁకుడుఁ దిరుగుడుపడియె. ధృష్టద్యుమ్నశరార్దితంబై కౌరవసైన్యంబు కార్చిచ్చు పొదివినకాననంబుచందం బున నేపఱి దైన్యంబుఁ జెందె.

### ద్వంద్వయుద్ధము.

అట్టిపరమసంకులంబున ధైర్యధుర్యులై వెఱపు దక్కి యిక్కడియక్కడి వీరులు పోరుచుండఁ గొందఱు ద్వంద్వయుద్ధమునకుఁ దలపడిరి. అందు వివింశ తిచిత్రసేనవికర్ణులు ముగురు బహుళసైన్యపరివృతులై భీమసేనుని మార్కొనిరి. బాహ్లికదేశనాథుఁడు నిజసేనలతోడ ద్రౌపదీపుత్రుల నేవురఁ బంచేంద్రియార్థ ములు శరీరమునుంబోలె నఱిమి శరజాలంబుఁ బరఁగించి పోరె. శైబ్యుఁడు కాశి రాజుం దాఁకినవారిపోరు మత్తమాతంగములపోట్లాటయట్టులు దర్శనీయం బయ్యె. శల్యుండు సింధురాజుకడనుండి యుత్తరిత్తి సేనాముఖంబుఁ జూచుచుండినవాఁడు

గావున నాసంకులమున వడి నేతెంచి యప్పటి కొదవినధర్మరాజుం దలపడి శరజాలంబుఁ గురిసిన నయ్యాజాతశత్రుండు పంచశతబాణంబులు బరఁగించుటయు న య్యిద్దఱిభండనంబు శంబరపురందరులసంగరంబు తెఱంగునం జూడనొప్పె. దుశ్శాసనుండు సాత్యకిం దాఁకి తొమ్మిదివాలికయమ్ములం గాఁడనేయుడు నాశైనేయుం డించుక మూర్ఛిల్లి తెలిసి తీక్ష్ణసాయకంబులఁ బదింటి నాదుస్ససేనుమేనం గీలించిన నయ్యిరువురు పరస్పరశరవిక్షతగాత్రులై పూచినమోదుగులట్లు పొలిచిరి. నీయుపేక్షయుఁ గర్ణునియాలోచనంబును గారణంబులుగా నింత చేటునకు మూలంబైనశకుని తాను దనవారితోడ నకులసహదేవుల మార్కొని వారిశరములకు విముఖుండై చేయునదిలేక బమ్మరించుచుఁ బైపైఁబడుమాద్రేయులయమ్ములతాఁకోర్వఁజాలక ద్రోణానీకమునకుఁ బఱచె. విందానువిందులు విరాటుం దలపడుటయు నయ్యవంతీశ్వరులకును మత్స్యపతికిని మత్తగజములకు సింగమునకుం బోలెఁ బోరు ఘోరంబై చెల్లె. బాహ్లీకుఁడు శిఖండిని దాఁకిన నతండు మర్మభేదనచణంబు లయినతీవ్రమార్గణంబుల బిట్టేయుడుఁ గోపించి బాహ్లికుండు తొమ్మిదివాలమ్ముల శిఖండిపయిం బరఁగించుటయు నయ్యిద్దఱిసమరంబు ఘోరశరశక్తిగణనీరంధ్రరోదసీకుహరంబై భీతులకు భీకరంబై శూరులకు సమ్మోదావహంబై చూపట్టె. అలాయుధుఁడు రాక్షసగణపరివృతుండై ఘటోత్కచుం దాఁకిన నతండును గండడరుటయు నయ్యిరువురికయ్యంబు రామరావణసమరంబుచందంబునఁ బరమదారుణం బయ్యె. అలంబుసుఁడు కుంతిభోజు నెదిరించిన నతండు నిశితశరనికరములఁ బరఁగించుటయుఁ గుంతిభోజశరార్దితుండై యలంబుసుఁడు నెత్తుటం జొత్తిల్లి కుసుమితపలాశమహీరుహంబుచాడ్పునం జూడనొప్పి కోపించి బహువిధాయసశిలీముఖముల నాకుంతిభోజుం బిట్టేసి పెలుచ నార్చుటయు నారాజును గోపదీపితుండై పిఱుతివియక పెనంగిన నయ్యిద్దఱిసంగ్రామంబు జంభశక్రసమరంబుచందంబున భీకరం బయ్యె.

అట్లు సంకులసమరంబు సెల్లుచున్నంత వెండియుఁ బాండవకౌరవులు మూఁడుదెఱంగులై భీమసేనుఁడు జలసంధుని ధర్మరాజు కృతవర్మను ధృష్టద్యుమ్నుఁడు ద్రోణుని మార్కొని పోరుచుండిరి. అందు ద్రోణధృష్టద్యుమ్నులవింటినేర్పునంజేసి యిరువాఁగునందును డొల్లెడుతలలును దొరఁగెడుశోణితంబును రాలెడుతొడవులును గూలెడుకేతనంబులును దునిసెడునాయుధంబులును జదిసెడుగుఱ్ఱములును జచ్చెడునేనుంగులును మడిసెడుకాలుమానుసులును నేల నిండెడుమొండెములును విఱిగెడుతేరులునై పరమసంకులంబై రక్తపానమాంసఖాదనలోలుపంబు లగుక్రవ్యాదభూతగణంబులకుఁ దృప్తికారణంబై రణంబు సెల్లుచుండ ధృష్టద్యుమ్నుఁడు పరమావష్టంభమునం బేర్చి తనపారావతసవర్ణహయ

ముల నాచార్యశోణతురంగములఁ దాఁకునట్లు డాయంబోనిచ్చి విద్యుత్ప్రకాశస ముల్లసితం బగుశారదనీరదప్రకాశబుద్ధిం జూపఱకుఁ గల్పించి కరవాలంబును గేడెమునుం గొని యామిపార్థి యగుడేగచాడ్పునఁ దనతేరినొగ లతిక్రమించి గురు నితేరినొగ లెక్కి యందఱకు నద్భుతావహంబుగాఁ జిత్రగతుల మెఱయుచు నగ్గు రుం డేచుశరములఁ బలుక జడియుచుఁ గుంభజునితలఁ దెగవేయ నుంకించుచు న్నంత నయ్యాచార్యుండు నిశితశరశతమునఁ బలుకను దునుకలు గావించి పదింట ఖడ్గము ఖండించి యనువదినాల్గింట నతనిరథ్యముల నాల్గిఁటిం జంపి మఱికొన్ని యాశుగముల సారథినిం జక్రరక్షకులనుం బరిమార్చి కేతనాతపత్రంబులం దునిమి యప్పాంచాలసుతుప్రాణంబులు గొనువాఁడై జంభాంతకుండు వజ్రంబునుంబోలె నొక్కతీవ్రబాణంబు లెస్స వింట నరింబోసి యేయుచున్నంత సాత్యకి రయమునఁ బదునాలుగువాలమ్ముల నమ్మార్గణమ్ము శకలంబులు గావించి సింగమువాతిమెకము నుంబోలె ధృష్టద్యుమ్ను నాచార్యబాణమునకు గుఱియైన వానిం దప్పించె. అందులకు సాత్యకిపైఁ గడునలిగి యాచార్యుం డిరువదియాఱు సాయకంబులఁ బరఁగించినం గినిసి సాత్యకి వానికి మాఱేసి తాను నిరువదియాఱుతూపులు గురుని స్తనాంతరమునం గీలించె. అంతలోనఁ బాంచాలరథికులు వెక్కండ్రు గూడముట్టి యాచార్యుం దలపడిరి. ధృష్టద్యుమ్నుండు నొండుతేరెక్కె ననిన విని యాంబికేయుండు సంజయా, సాత్యకి ధృష్టద్యుమ్నుం దప్పించినందులకుఁ గోపించి భారద్వాజుండు సత్యకతనూజుపై నేమిచేసె నని యడుగుటయు నంబికా నందనునకు సూతనందనుం డిట్లనియె.

సాత్యకిద్రోణాచార్యులయుద్ధము.

అవ్విధమున సాత్యకి ధృష్టద్యుమ్నుం దప్పించినందులకుఁ గుంభసంభవుండు మండలీకృతకోదండంబు తెఱచిననోరుగా నిశితనారాచములు కోఱలుగాఁ గ్రో ధవిషము గ్రక్కుచుఁ గాలభుజంగంబురీతి సంరంభతామ్రాక్షుండై గగనమండ లంబు నాక్రమింపఁ జాలినశోణాశ్వములం బరమరయమున నయ్యుయుధానుం బొదువ వచ్చుచున్నంత శక్తిఖడ్గములు పిడుగులుగా స్వర్ణపుంఖశిలీముఖరోచులు మెఱుంగుతళతళలుగా మౌర్వీగుణక్వణనంబు గర్జితంబుగా శరాసారంబుఁ గురి యుచుఁ దన్నుఁ దఱియ వచ్చుచున్నద్రోణజారుఘామారుతంబుఁ జూచి ఘోర సాంపరాయుం డైన శైనేయుండు నవ్వుచు నిజసారథి కిట్లనియె. సారథీ, యీబ్రా హ్మణుఁడు నిజధర్మము విడిచి క్షాత్రధర్మవ్యవస్థితుండై ధార్తరాష్ట్రునకుఁ బెను ప్రాపై పోరుచున్నవాఁడు. శూరమాని యగునయ్యాచార్యున కభిముఖముగ రయమున మనయరదమ్ముఁ బోనిమ్మనుటయు సారథి యట్లు చేయుటయు రజతవ ర్ణము లగుతదీయరథ్యములు వాయువేగమున నరదము గురుని తేరికి సమ్ముఖమ్ముఁ

గావించిన నబ్భారద్వాజుండును సత్యకసూనుండును వానకాలంపుమొయిళులట్లు
వేనవేలుశరములఁ బరఁగించి భూమ్యంతరిక్షములను నఖిలదిక్తటంబులనుం గప్పి
సూర్యాతపంబునకు వాయుప్రచారంబునకు నించుకేనియు నెడ గలుగకుండఁ
గటికిచీఁకట్లు పచరించినఁ గొండొకవడి యెయ్యదియుం గానరాకుండె. అయ్యిరు
వురిశరము లొండొంటిం దాఁకి యుచ్చిపోవునెడం బొడమినయులివు పిడుగుపా
టున కెనవచ్చుచుండె. పరస్పరమౌర్వీగుణక్వణనంబు వజ్రనిర్ఘాతపతితపర్వతశిఖ
రంబులరవంబు ననుకరించె. అట్లయ్యిరువురు నుడివోనిచలంబున నెక్కువతక్కు
వలు లేకుండఁ గడిమిమెఱసి పరస్పరచ్ఛత్రవిదళనంబును నితరేతరకేతనపాతనం
బునుం గావించి యన్యోన్యమార్గణవిక్షతాంగులై నెత్తుటం దోఁగి యొండొరు
లరథరథ్యసారథులఁ బృథులశరాంచితులం జేసి యిరువాఁగున సకలయోధులు
నివ్వెఱఁగందియు విభ్రాంతిఁ జెందియు వాద్యరవంబుల వారించియు సింహనా
దంబులఁ బరిహరించియు నేకాయత్తచిత్తులై యపరిమితకుతుకమున తెప్పపాటు
వొరయక చూచుచుండఁగ విమానగతులైనసురలును నారదాదిమహర్షులును
సిద్ధచారణాదివిద్యాధరాదులును బిచ్చలింపఁగ గతప్రత్యాగతమండలాదివివిధగ
మనంబులఁ దేసులు వోనిచ్చి హస్తలాఘవంబు మెఱయ విలువిద్యనేర్పు నెఱయ
రణక్రీడ సలుపుచున్నంత సాత్యకి యుద్దండుండై యాచార్యునివిల్లు ద్రుంచిన
నతం డొండుకోదండం బెత్తి సజ్యముఁ గావించుడు నిమేషమాత్రలోన దానిం
దునిమె. అంత నగ్గురుం డగ్గలిక మెఱసి వేఱుశరాసనంబుఁ గొనిన నద్దానినిం
ద్రుంచుటయు నెండుచాపంబు గురుండు గొనియె. పదంపడి వడి నక్కోదండం
బును ఖండములు గావించి చూచుఖేచరులు వొగడ నాచార్యుం డెత్తినవిండ్లనెల్ల
నెక్కుమాత్రలోనఁ దునియలు సేయుచుండఁ దొమ్మిదివిండ్లు తత్ప్రకారమునఁ
దునియలగుడు గురుండు తనమనంబున నౌరా సాత్యకి విలువిద్యం బొగడ్త కెక్కి
నవాఁడు. పరశురాముఁ డొండెఁ గార్తవీర్యార్జునుఁ డొండె సవ్యసాచియొండె భీష్ముఁ
డొండెఁ గాక లాఁతు లింతనేర్తురే యని యగ్గించి యొండువిల్లెత్తి పరమరయ
మున సజ్యంబుఁ గావించి బహుశాస్త్రంబు లేయుడు సాత్యకి ప్రత్యస్త్రంబుల
వానినెల్ల నడంచువాఁడై గురుం డేయఁ బూనినయస్త్రంబ తాను నేయుచు నాచా
ర్యునస్త్రముల మాయించుచుండ మనసైనికు లతనిదివ్యాస్త్రవిజ్ఞానంబును సమ
యోచితవివేకంబును బుద్ధిస్ఫురణంబునుం బ్రశంసించిరి. అంతఁ గోపాటోపదీపితుం
డై చాపగురుండు కడిమి మెఱసి వడిం బేర్చి యాగ్నేయాస్త్రం బేయుటయు శైనే
యుండు వారుణాస్త్రం బేసిన హాహాకారంబు లెసంగె. అంతరిక్షచరంబు లగుభూత
ములును ఆచ్చవడియె. అట్టిదివ్యాస్త్రంబులు రెండును పరస్పరసమాహితంబులై
క్రమ్మఱ గురుని సాత్యకినిం జేరె. అప్పటికి మధ్యాహ్నంబు దిరుగుటయు యుధి

స్థిరభీమసేననకులసహదేవధృష్టద్యుమ్నవిరాటకేకయప్రముఖులు సాత్యకికిఁ దోడు పడినం జూచి దుశ్శాసనప్రముఖు లగు రాజకుమారులు పెక్కండ్రు బహుళసేనల తోడ నాచార్యునకు బాసట యగుడుఁ బాణసుపటలంబు పెల్లగయుటం జేసి యాహవమహీతలంబు ధ్వాంతదంతురం బగుటయు నిర్మర్యాదం బైనఘోర సంగ్రామంబు చెల్లె.

విందానువిందు లర్జునుని చేఁ జచ్చుట.

అట్టియపరాహ్ణసమయమున నక్కడ ధనంజయుండు సైంధవుని డాయం బోవువాఁడై వాసుదేవునిచిత్తమున కెక్కునట్లుగ నిశితశరముల సేనానికాయముఁ గూల్చుచు రథమార్గముఁ గల్పించుచుండ వివిధరథశిక్షావిదుండగుజనార్దనుం డుత్తమమధ్యమాధమంబు లగుమండలగమనంబులఁ దేరు పఱుపుటయు మనోవే గము లయినయయ్యుత్తమాశ్వము లూహింపనైనం గొలఁదిగానిరయమునఁ బఱచుచుండె. ఏమిచెప్పుదు సవ్యసాచిస్యందనవేగంబు సూర్యునరదమునకు నింద్రు రథమునకును మహేశ్వరుశతాంగమునకును గుబేరుతేరికినిం గలుగదయ్యె. అర్జు నుఁడు తనయెదుటఁ గ్రోశమాత్రదూరమున నున్నవారి నుపలక్షించి యేయుసా యకము లతనితే రాగుటఁ గడచి క్రోశమాత్రంబు చనినపదంపడి పడుచుండె. వైణవంబు లాయసంబు లగునతనిదివ్యబాణంబులకు వెఱచి యద్దివ్యరథంబు సూచినతోడన మనసైనికులు వెఱపున నొదిఁగి తెరు విచ్చుచుండిరి. అట్లు క్షుత్పి పాసాపరిశ్రాంతంబులయ్యు నతనిగుఱ్ఱములు పరమరయమునం గజవాజనరకళేబ రంబులదిట్టలపై నప్రతిహతప్రచారంబునఁ బఱచుచుండ నవంతిపతు లగువిందా నువిందుల న్నదమ్ము లిరువురు శ్రాంతవాహనుండై నయాశ్వేతవాహనున కడ్డ పడి యఱువదినాల్గువాలమ్ముల ఫల్గునిని డెబ్బదియంబకంబుల నంబుజాక్షుని శర శతంబున హయచతుష్టయమును నొంచినం గోపించి మర్మజ్ఞుండయినయర్జునుండు మర్మభేదనతీవ్రంబు లగుతొమ్మిదియమ్ముల వారిపయిం బరఁగించె. అందులకు నొ వ్వక నవ్వుచు నవ్వసుధేశ్వరులు చక్రగాండీవధారుల శరాసారమునం గప్పి సింహ నాదంబుఁ జేసినం గినిసి కిరీటి భల్లద్వయమున వారికార్ముకద్వయముఁ దునిమి శర యుగమున ధ్వజయుగమునుం గూల్చిన వారు వేఱువిండ్లెత్తి కృష్ణార్జునులపై శరజాలంబుఁ బరఁగించిరి. అందులకుఁ గడుం గోపించి సవ్యసాచి శరద్వితయం బునఁ దదీయశరాసనద్వితయంబునుం దునిమి మఱియుం బెక్కమ్ముల వారిసారథు లను గుఱ్ఱములను జక్రరక్షకులనుం జంపి నిశితక్షురప్రంబున విందునితలఁ దఱు గుటయు వాఁడు వాతభగ్నం బగుపాదపంబుచందంబున నేలం గూలె. అన్నచా వునకు విషాదంబు నమర్షంబును మనంబునఁ బెనంగొనంగ ననువిందుఁడు గదాపా ణియై హతాశ్వసారథిక మైనరథము డిగ్గనుఱికి గదాదండంబు గదాగ్రజుఫాలభా

గంబు దాఁక నేయుటయు నందులకు మందరధరుం డించుకయుఁ జలింపఁడయ్యె. అంతఁ దీవ్రక్రోధోద్ధతుండై పార్థుండు శరపట్కమున నయ్యనువిందునిశిరంబును గంధరంబును భుజద్వయంబును జరణయుగంబును నఱికినం బలుతునియలై తత్కబంధంబు నేలం బడియె. అట్లు విందానువిందులు మృతులగుటయు నవంతిసైనికులు పెక్కండ్రొక్కమొగిం గాండీవిం దాఁకి బహుళశిలీముఖములు నిగిడించిన నొక్కమాత్రలోన వృత్రశత్రుపుత్త్రుండు వారల నందఱను సమరభూమికి బలిచేసి వేనవిం బేర్చి కాననం జేర్చుకార్చిచ్చుచాడ్పునఁ దేజోదుర్నిరీక్షుండై యాసైన్యంబులఁ గడచి జలదపటలంబుఁ బాసినదివాకరుకరణి వెలుంగుచుండఁ గౌరవులతనియెదుర నిలువనోపక పటాపంచలై పఱచి యద్దిరా యింతటివాఁడు గలఁడే యని యబ్బురంబును నానందంబునుం బొంది కొండొకవడికిఁ గవ్వడిగుఱ్ఱములు డప్పిగొనియుసికియు సింధురాజు దవ్వుననునికియుఁ బ్రొద్దు మీఱుటయుం బరికించి యెట్టులైన నీడంబోక నేఁడు పెనంగుట యుఱవని తలంచి ధైర్యధుర్యులై క్రమ్మఱి యమ్మరుత్పతితనయుం బొదివి యార్చిపేర్చిరి.

అర్జునుఁడు తనగుఱ్ఱములడప్పి తీర్పఁగ నమ్ములఁ గొలను గల్పించుట.

సరభసోద్యమంబున నట్లు పైపైఁ గ్రమ్ముచున్న కౌరవయోధులం జూచి సవ్యసాచి నగుచు వారల సరకుగొనక వనజోదరుం బిలిచి మహాత్మా, గుఱ్ఱములు బహుళజలార్దితంబులై గ్లానిఁ జెందినచందంబు దోఁచెడి. సైంధవుఁడిక్కడకును దవ్వున నున్నవాఁడు. ఎయ్యది చేసిన మేలగు నద్దానిం జింతింపుము. నీవు సమయజ్ఞుండవు సముచితజ్ఞుండవు మహాప్రాజ్ఞుండవు. విశేషించి నీప్రాపున గెల్పుగాంతు మని యున్నవారము. గుఱ్ఱముల విప్పి శల్యముల విడఁదీసి యించుక సేపు సేదదేర్చిన మేలని నాకుఁ దోఁచుచున్న దనుటయు జనార్దనుండు నామతంబు నదియ యనవుడు నట్లేని సర్వసైన్యంబులను నే నాఁగెద. యథోచితంబుగ గుఱ్ఱములకు విశ్రాంతిఁ గావింపు మని పలికి గాండీవపాణియై తేరు డిగియె. జయకాంక్షు లగుమనసైనికు లదియ యదనుగాఁ గొని జ్యాఘోషంబుఁ గావించుచు దివాకరుం గప్పుమొయిళులతెఱుగునను సింహముం జుట్టుముట్టుమత్తశుండాలంబులవిధమునను నందఱు నొక్కయుమ్మడి భూమిస్థితుం డైనధనంజయుం బరివేష్టించి విచిత్రశస్త్రాస్త్రములం గప్పినం గోపించి యతండు వారియస్త్రములనెల్లఁ బ్రత్యస్త్రముల నుపసంహరించి విలువిద్యనేర్పేర్పడ నేచాయఁ జూచినం దనసాయకంబులకా శరజాలంబుఁ బరఁగించి నెగసినపాంసుపటలంబు పెల్లునం బుట్టినచీఁకట్లు శరసంఘర్షజనితానలంబున విరియించుచు రణాంగణంబు పీనుంగుపెంటగా నొనరించి శరములు తరంగములుగా ధ్వజము లావర్తములుగా నేనుఁగులు మొసళ్లుగాఁ గాలుమానుసులు మీలుగా వాద్యనినదంబు కల్లోలమాలికాస్ఫాలనర

వంబుగా నుష్ణీషములు కమఠములుగా నాతపత్రంబులు ఫేనపుంజములుగా గజ
గాత్రంబులు పాషాణంబులుగాఁ బైపయిం బడ వచ్చుచున్నకురుసేనాసాగరంబు
నకుఁ దాను జెలియలికట్టయై యాఁగి యందఱ నొక్కయుమ్మడిగఁ జక్కాడుచు
న్నంత మురాంతకుండు పార్థున కిట్లనియె. అర్జునా, గుఱ్ఱములు పెద్దయుం బ్రొద్దు
పరమజవమునఁ దఱిమికొనివచ్చుటంజేసి నీరువట్టుపెల్లునఁ బెద్దయు డస్సియున్నవి
గావున నెడల్లు మునుఁగఁ గ్రుంకనై తిగాకున్నను ద్రావనయినం జాలినసీళులు
గలిగినం దేఱి మన కెంతపనియైన నీగుఱ్ఱము లొనర్చు ననుడు విజయుండు వన
జనాభుం జూచి మహాత్మా, యందులకు విచారం బేల? చాలినంతపానీయం బిదె
కల్పించెద నని పలికి దివ్యాస్త్రమునఁ బుడమిఁ బగిల్చి హంసకారండవాదిశోభి
తంబు విమలశీతలసలిలపూరితంబు వికచకమలకువలయాదిప్రసూనవిరాజితంబు
మత్స్యకూర్మగణాకీర్ణంబు పరమాగాధంబు నగుసరోవరంబుఁ గల్పించి రెండవ
విశ్వకర్మనాఁగ సకలసాధనములు శరములుగా నాకొలని కాచ్ఛాదనంబుగ నిల్లు
గట్టుటయు గోవిందుండు పరమానందభరితుండై యర్జునుం బొగడె. మనవారు
విస్మయంబును భయంబునుం బొందిరి. నారదాదిమహర్షు లయ్యద్భుతంబుఁ జూడ
వచ్చిరి. చూచుఖేచరులు మున్నెన్నఁడు నిట్టివిచూడమని యాశ్చర్యానందం
బులం బొదలిరి. అంత నారాయణుండు తేరు డిగ్గి గుఱ్ఱములంగొని యక్కొలని
కిఁ జనియె. అంత నర్జునుండు భూతలస్థితుండయ్యు రథస్థితు లగుపలువురురథికుల
తోడం బోరుసేయుచు మనమూఁకల నీఱు సేయుచున్నంత నశ్వకర్మకుశలుం
డైనవాసుదేవుండు రథ్యములశల్యము లపనయించి సుఖముగఁ గడిగి దివ్యాస్త్ర
ప్రభావమునంజేసి నీళులతోడం బుట్టినఖాణంబు మేపి సేద దేర్చి కట్టాయితంబు
లైనయయ్యుత్తమాశ్వములం గొనివచ్చి తేరికిఁ బూన్చుటయు సవ్యసాచి రథా
రోహణంబుఁ జేసె. అది చూచి మనవా రద్దిరా వాసుదేవార్జునులశౌర్యధైర్య
చాతుర్యంబు లింత యొప్పునే యనువారై తరుణీమధ్యమునఁ గ్రీడనంబు సల్పు
విలాసియుంబోలె నిందఱుదొరలయెదుర నిర్భయంబుగ గుఱ్ఱములు విడిచి యిం
తతడవు తగినవిధమున మేపి జనార్దనుండు మఱలఁ బూన్చునే యనువారై భూత
లస్థితుండయ్యు సవ్యసాచి కురుసేనాసాగరం బెల్లఁ దా నొక్కరుండ యాఁగె నింక
రథారూఢుఁ డైననేమనం గలదు కోఱలు పెఱికినపాములట్టుల మనము చేయున
దిలేక బమ్మరించుచుండ సైంధవుని సాధించు ననువారై మనశౌర్యంబు గాల్పనే
క్షత్రియులందఱు చూచుచుండ నిందఱనుం దృణీకరించి బాలక్రీడనంబుచాడ్పున
నర్జునుండు తేరు డిగ్గి వీరులతోడఁ బెనంగుచు శరములఁ గొలను గల్పించి దాని
కిల్లు గట్టె నిట్టియద్భుతంబు లెన్నఁడుం జూడ మనువారై యెట్టులయిన నోపిన
కొలఁది యాఁగి పోరుట కర్తవ్యంబుగాని యూరకునికి తగదు తడవక కడంగుఁ

డనువారై దుర్యోధనదుర్బుద్ధింజేసి క్షత్రియకులమున బహుజనులకుఁ జేటు మూఁడె దీని నాధృతరాష్ట్రుఁ డెఱుంగఁ డేమి చేయవచ్చు ననువారై సైంధవుఁ డింక బ్రదుకఁబోఁడు పరలోకకృత్యంబులు వానికిఁ జేయవచ్చు ననువారై యుపాయం బెఱుంగనిదుర్యోధనుకృత్యంబు లిట్లు విపరీతఫలంబులే యగు ననువారై సింహంబు లేళ్లగములంబోలెఁ గౌరవమూఁకలం దఱిమి పాండవమధ్యముందు పరమరయమున సైంధవుం జేరఁబోవు ననువారై పలుదెఱంగులఁ దమలో నూహించుచున్నంత దనుజాంతకుండు పాంచజన్యం బొత్తి వాయువేగమునఁ దేరు దోలుటయుఁ గ్రోధదీపితులై కౌరవయోధులు పెక్కం డ్రడ్డపడియు వారింప లేక తనకపిప్రభలు మిఱుమిట్లు గొల్పుటంజేసియుఁ బాంసుపటలంబు పెల్లునఁ జీఁకట్లు గ్రమ్ముటంజేసియుఁ జూడ్కులు సారించుటకునుం జాలక విషాదంబు నొందిరి. ఆపరమసమ్మర్దముఁ జూచి దుర్యోధనుం డాచార్యకృతకవచబంధుండై పార్థుం గవియ వచ్చుచుండె. మనవా రతనిరాకఁ జూడక యర్జునుం దాఁకఁబోయియు వెఱపు పెల్లునంజేసి కొంద ఱోడుఁగుచుండిరి. మఱికొందఱు రణమున వెనుదీయుట క్షాత్రధర్మంబు గాదని తలపోసి కడంగి రాహుముక్తు లగుసూర్యచంద్రులచందమునను వలఁ జించి వెడలినగండుమీలతీరునను వెలుంగుచున్ననరనారాయణులం గాంచి యొప్పినకొలంది పోరి యర్జునబాణములతాఁకోర్వఁజాలక వెగడుపడిరి. అర్జునుండు సేనాముఖమున నున్నయాచార్యుని గృతవర్మనిం గడవఁ జాలఁ డనియు సింధురాజుం జేరనైన నేరఁడనియుఁ బెద్దయు నమ్మియుండినవారు గావున నది విపరీతం బగుడు సైంధవునిపై నాశ విడిచి యప్రతిహతం బగువాసుదేవార్జునులగమనంబుఁ జూచి మరుభూమి దాఁటి తనివి దీఱ నీళులఁ ద్రావి మదించినయేనుఁగులతెఱంగునను సింహవ్యాఘ్రగజాదిక్రూరజంతుదంతురంబులగు కాంతారంబులం గడచినవణిజులవిధంబునను ద్రోణాదుల నతిక్రమించి భయం బింతయులేకప్రసన్నాననులై వీరు ద్రోణశరపాతవిక్షతగాత్రంబులం దోఁచి నెత్తుటం దోఁగియునికియు వీరికిఁ గుసుమితకర్ణికారపాదపంబులకుంబోలె శోభావహం బయ్యెఁ గాని యొండుగాకున్నది. సముద్రము నీఁదినట్లు ద్రోణాదులమహానీకంబులం గడచి వచ్చి రింక వీరి కసాధ్యం బెయ్యది యని తమలోఁ దలంచుచుండ సూర్యానలప్రకాశు లగుకృష్ణార్జునులు పెద్దయు దవ్వ నడిచి కర్ణకృపాశ్వత్థామశల్యభూరిశ్రవోవృషసేనులు తనకుఁ గావలియై యుండ నడుమనున్నసైంధవుని దూరదవ్వులం గాంచి యామిషంబుఁ గాంచినడేగలట్లు పరమానందంబునం బొదలి సైంధవుని హతునకా వగచిరి. అంతఁ బార్థుఁడు మురారిం బిలిచి వాఁడె జయద్రథుఁడు తనకుఁ గర్ణాదు లాఱుగురు రక్షకులుగాఁగ నడుమనున్నవాఁడుగదా. కర్ణాదులు కాదు మహేంద్రాదులు దేవగణముతో వచ్చి యడ్డపడిన

ను నేను నేఁడు సైంధవుం దెగటార్చుట నిక్కవంబు. ఇఁక నీ డెక్కడికిఁ బోఁ గలఁ డనవుడు మురారియు నీయుత్సాహంబునకు మాఱు పొసఁగనేర్చునే యది యట్లకాఁగలయది యని తమలోఁ గృష్ణార్జునులు మాటలాడుచు మహారయము న నరుగుచుండిరి.

**కవచధారణమున దుర్యోధనుం దలపడి యోడుట.**

అంత దుర్యోధనుండు ద్రోణాచార్యుఁ డొసంగినకవచంబు ధరియించి వచ్చువాఁ డప్పటి కెయిది సింధురాజుం దఱియఁ బోవుచున్నయర్జునున కడ్డపడు టయు మనసైన్యంబున శంఖభేరీప్రముఖవాదిత్రనిస్వనంబును సింహనాదంబు లునుం బెంపెసంగె. సైంధవరక్షకు లగుకర్ణాదులును రారాజునుత్సాహంబునకుఁ బ్రహర్షంబుఁ జెందిరి. అట్టియెడ వాసుదేవుఁడు ధనంజయుం జూచి పార్థా, సుయోధనుఁడు నిన్ను వారించువాఁడై కడంగుటయు నెంతయు నాశ్చర్యం బయ్యెడి. ఇతండు మహారథవర్యుఁడు నిరుపమానుఁడు కృతాస్త్రుఁడు యుద్ధదు ర్మదుఁడు దృఢాస్త్రుఁడు చిత్రయుద్ధవిశారదుఁడు. మఱియుఁ బుట్టిననాఁటంగోలె నెంతయు గారామునఁ బెరిఁగినవాఁడు. సర్వకాలము మీతోఁ బగ పాటించు వాఁడు. వీనితోడిపోరు నీ కెప్పుడొడఁగూడినయది. ఇయ్యది మాకు జయాజ యములు పణబంధములుగాఁ గలజూదం బయ్యె. పెద్దకాలముగోలె నీలో నణఁగి యున్నక్రోధవిషము నేఁడు వెడలఁగ్రక్కుము. వీఁడుకదా సర్వానర్థములకును మూ లము. రాజ్యార్థి యగురాజు నీతోడిభండనమునకు రా వెఱచుఁగాని కడంగఁడు. అట్లుండియు నేఁడు కాలము మూఁడి నిన్నుఁ జెనక వచ్చినవాఁడు. ఆత్మసాఫల్యంబుఁ గావింపుము. భవద్బాణగోచరుం డైనవాఁడు బ్రదికి పోవవచ్చునే? ఐశ్వర్యమదస మ్మూఢచిత్తుండుగావున నీశౌర్యం బెఱుంగక వచ్చినయీదురాత్మునిం బరిమార్పు ము. దేవదానవ గంధర్వాదులును ముల్లోకములునుం గూడివచ్చినను నిన్ను గెలువరాదు. ఇఁక నీదుర్యోధనుఁడు గెలువఁ గలుగునే. ఈపాపాత్ముఁడకదా ధర్మరాజును మాయాద్యూతమున నోడించినవాఁడు మీరాజ్యము నాఁచికొన్న వాఁడును ద్రౌపదిని సభలో భంగపెట్టినవాఁడును. మఱియు లెక్క యిడరాని యెగ్గు లెన్నియే మీకుఁ జేసినవాఁడు నీదురాత్ముఁడ యగుట నీవెఱుంగవే? భాగ్యవశమున వీఁడు నీబాణములకుఁ దాన గుఱియై వచ్చె. మనకోర్కులెల్లఁ గొనసాగునట్లుగా మహేంద్రుఁడు జంభాసురుంబోలె దంభశీలుం డైనయిద్దురా త్ముని నీవు కరుణింపక తెగటార్పుము. వీఁడు సచ్చెనేని యీకురుసైన్య మనా థంబై విచ్చలవిడిం బఱచు. వీనితో వైరమూలముఁ ద్రెవ్వనఱికి యవభృథంబు సేయు మనుటయుఁ గిరీటి దేవా, నీవచించినవిధమునఁ జేసితి ననితలంపుము. అన్యాయమునఁ బెక్కుకాలము మారాజ్య మనుభవించియుఁ గృష్ణను బరిభవిం

చియుఁ బలుదెఱంగు లగునెగ్గు లెన్నియేఁ జేసియు మమ్ముఁ గాఱించినయీపాపా
చారులఁ ద్రెవ్వనేయుదు. ఒండుమాటలు మాని వాని కభిముఖముగ మన
తేరు వ్రోని మ్మనవుడుఁ గృష్ణుఁడు తత్క్షణంబ యట్లు చేసె. కృష్ణార్జునులట్లు తనపై
నలిగి వచ్చుటకు నించుకేనియు వెఱవక దుర్యోధనుండు చక్కనిలిచి యాఁగుటకు
మనయోధులు పొంగి యార్చిపేర్చి పోరు చూచుచుండిరి. అట దుర్యోధనుం
డును నవ్వుచుఁ గేశవార్జునులఁ బోరికిఁ బిల్చుటయు సంతుష్టచిత్తులై వారు
పాంచజన్యదేవదత్తంబు లొత్తిన నాఘోరనాదము విని మనవారు కడు వెఱచి
కురురాజు నగ్నిలో వ్రేల్చినవానిఁగాఁ దలంచి యతనిపై నాశ మాని యదెయదె
రాజు సచ్చెఁ జచ్చె నని యఱచుచున్నంత దుర్యోధనుండు పేరెలుం గెత్తి మీకు
వెఱవం బనిలేదు. కృష్ణార్జునుల నే నిదె యమలోకమునకుఁ బనిచెద నని
జయాపేక్షులై వారల వారించి సంరంభవశుండై సవ్యసాచి కిట్లనియె. అర్జునా,
నీవు బహువిధదివ్యాస్త్రముల నేర్చినవాఁ డని విందుము. ఆపేరు నాపరోక్షమునఁ
జెల్లె. నిక్కంబ పాండురాజునకుఁ బుట్టినవాఁడ వగుదువేని నీబలవీర్యములు
నాపయిం జూపుము. వాసుదేవునివీర్యంబును నీశౌర్యంబును నిపుడు నే నెఱుంగు
దుఁగదా యని పలికి మర్మభేదనతీవ్రంబు లయినమూఁడమ్ములఁ బార్థుమేన నాటి
నాలుగింట గుఱ్ఱములపయిం బడనేసి పదింటి వాసుదేవు స్తనాంతరంబునఁ గీలించి
యొక్కభల్లమున మురారిచేతిమునికోలఁ దునిమినం బార్థుఁడు చిత్రపుంఖములు
శిలాశితములు నగుచతుర్దశశరములం బిట్టేసిన నయ్యవి దుర్యోధనుకత్తళంబుఁ
దాఁకి మిట్టిపడినం జూచి సవ్యసాచి తోడన తొమ్మిదియమ్ములను బంచాశుగమ్ము
లనుం బరఁగించిన నయ్యవియు నట్ల యతనివర్మంబు భేదింపఁజాలక తిరిగిపడు
టయుఁ గ్రమ్మఱ నిరువదేనమ్ముల నేసిన నవియు నిష్ఫలంబు లగుడుఁ గృష్ణుఁడు గ్రీడి
కిట్లనియె. పార్థా, నీయమ్ములు దుర్యోధనుమైమఱువు వ్రయ్యఁజాలక మిట్టిపడుటం
జూడ ఱా నడిచినచందం బయ్యె. మున్నెన్నఁడు నిట్టివి చూడనైతి. గాండీవమునకుఁ
దొల్లింటిబలిమి తఱిఁగెనే? భవదీయముష్టిగ్రహణంబు దృఢముగాకుండునే? నీభు
జబలమున కేమైనం గొఱంత గలిగెనే? ఈదురాత్మునకుఁ జేటుకాలము మూఁడిన
నిట్లు విపరీతంబులు పొసఁగునో. పిడుగుల కెనవచ్చునీయమ్ములు నేఁడు వీనిం
దాఁకి వమ్మగుటకు నామనంబున విస్మయంబును విచారంబును బొడముచున్నవి.
తెలియం జెప్పుమని యడిగినదనుజాంతకునకుఁ గాలకేయాంతకుం డిట్లనియె. మ
హాత్మా, లోకత్రయవృత్తాంతమెల్ల నెఱుంగునీ కియ్యది తెలియకుండునే? నేన
తెలుపవలయునేని విన్నవించెద. వినుము. ఇది యొక్కకవచధారణంబు. దీని భేదింప
వజ్రపాణియు వలంతిగాఁడు. దీనిని ద్రోణుఁ డొక్కరుం డెఱుంగు. అతం డొక్క
సమయమునఁ గరుణించి నాకుఁ బ్రసాదించె. ఆకవచధారణంబు నేఁడు వీనికా

చార్యుండు గావించియుండవలయు. కావుననే ధైర్యమున నన్నుఁ గవియ వచ్చి
నవాఁడు. ఆఁడుదానిపోలె దానిం దనమేని కడ్డముగఁ దగిలించికొని వచ్చెఁగాని
తత్ప్రభావం బెఱుఁగఁడు. ఇది యభేద్యంబయ్యెనను నావింటినేర్పునను జేతులలావు
నను వీని నోడించెద. ఇంద్రుఁ డంగిరసున కొక్కమహాస్త్రం బిచ్చె. అతనివల
నం బృహస్పతి వడసి క్రమ్మఱఁ బురందరున కొసంగె. మహేంద్రుఁడు నాకుఁ
బ్రసాదించె. అది సర్వకవచభేదనశీలంబు. దానిం బ్రయోగించి వీనిమైమఱువు
సించెద నని పలికి గాండీవమ్మున నమ్ము సంధించి తదస్త్రం బభిమంత్రించి యేయు
చున్నంత దూరగతుండయ్యు నశ్వత్థామ సర్వాస్త్రఘాతి యైనయొక్కదివ్యాస్త్ర
మున నడుమన ఖండించినం జూచి విస్మయాక్రాంతుండై కౌంతేయుండు జనార్ద
నుం జూచి మదీయాస్త్రం బాచార్యపుత్రునస్త్రమున నడంగె. రెండవమాఱు
ప్రయోగించిన నయ్యస్త్రము ప్రయోగించినవానిన వధించుఁగావున నింక దానిం
బ్రయోగింపరాదు. ఐనను సాధారణబాణములనే పగవాని నోడించెదఁ జూడు
మని పలుకుచున్నంత గాంధారేయాగ్రజుం డాశీవిషోపమమ్ము లయినతొమ్మిది
యమ్ములఁ గృష్ణులగాత్రముల నాటి తోన శరజాలంబు గుప్పించిన మనవారు పొంగి
వాద్యనాదములను సింహనాదములనుం గావించిరి. అంతఁ బరమక్రోధసముద
గ్రుండై పార్థుండు దుర్యోధనుగాత్రమునం గవచరక్షితంబు గానిచోటు గానక
కొంతచింతించి నిశితశరజాలంబుఁ బరఁగించి యతనితేరిగుఱ్ఱములను సారథిని
జక్రరక్షకులనుం జంపి విల్లు దునిమి తేరు నుగ్గాడి విరథుం డైనవానియఱచేతుల
శితశిలీముఖములం గ్రుచ్చినం జూచి సుయోధనుఁ డాచార్యకృతకవచధారణ
ప్రభావము లెస్స యెఱుంగనివాఁడుగావున నిష్ఫలం బనుతలంపున దానిం
బుచ్చి యొండుకంకటంబుఁ దొడిగికొని వెగడుపడియుండ నయ్యెడరు చూచి
పెక్కండ్రురథికులు బహుళసేనలతోడం దలపడి యస్త్రనికరంబుఁ గురిసి కృష్ణా
ర్జునులును దద్రథంబును నగపడకుండఁ గప్పటయుఁ గోపదీపితుండై పురుహూ
తతనూజుండు నానాస్త్రనికరంబులు గురిసిన నెక్కడఁ జూచినను గూలెడునేనుఁ
గులును విఱిగెడుతేరులును జచ్చెడుగుఱ్ఱములును సమసెడుకాలుమానుసులునై
పరమఘోరసమరంబు సెల్లుచుండె. అప్పుడు పద్మనాభుఁడు నేను శంఖము నొత్తు
దుఁగాని నీ వెడతెగక శరజాలముఁ గురియుచుండు మని పలికి తాను రజోరూ
షితపక్ష్మాంచలుఁడు స్విన్నగాత్రుఁడు నయ్యుఁ బాంచజన్యంబుఁ బూరించిన నాతు
ములనినదమునను గాండీవజ్యాఘోషమునను వెఱచి మనసైనికులు సచ్చియు
నొచ్చియు నేలం బడుటయు నర్జునరథంబును వాసుదేవుఁడు దఱిమిన వాతోద్ధూతం
బైనజలధరంబుమాడ్కి సింధుపతిదెసకు వడిం జనియె.

—కర్ణాదు లగుదొర లొక్కపెట్ట యర్జునుం దలపడుట.—

అంత సింధురాజరక్షకు లయినకర్ణకృపాశ్వత్థామశలశల్యభూరిశ్రవోవృషసేనులు పరమక్రోధభరితులై పుడమి యద్రువ సింహనాదంబులను జ్యాఘోషంబులను శంఖారవంబులనుం గావించి యొక్కమొగిఁ గిరీటిం దలపడుటయుఁ గృష్ణార్జునులు పాంచజన్యదేవదత్తములం బూరించిరి. ఆఘోరనాదమునకు ధరణి వడఁకె. శైలములు గ్రక్కదలె. అర్ణవములు ఘూర్ణిల్లె. దిక్తటంబు లదరె. అవ్విధమున నాదొరలు వ్యాఘ్రచర్మపరివృతంబులు సువర్ణచిత్రంబులు జ్వలితజ్వలనప్రకాశంబులు నాజానేయవాజియోజితంబులు నగురథోత్తమముల నారోహించి పాండవమధ్యముం దలపడునెడ వారిమాటున సైంధవుండును దుర్యోధనుండును నానాదేశరాజులును నర్జును మార్కొనుచున్నంత నశ్వత్థామ దామోదరు డెబ్బదిమూఁడుకాండంబులను గాండీవిని భల్లత్రయంబునను నొక్కయమ్మునఁ గపికేతనంబును నాల్గింట గుఱ్ఱములనుం బెట్టేయుడు వాసుదేవునిపైఁ బెక్కుతూపు లడరించుటకుఁ గ్రోధోద్దీపితుండై పాండవమధ్యముం డశ్వత్థామమేన నాఱునూఱుబాణములం గీలించి పది కర్ణునిగాత్రంబు నాటి మూఁట వృషసేనుని నొంచి యొక్కవాఁడియమ్మున శల్యునివిల్లు ముష్టికిఁ దెగ నేసె. ఏసినం గోపించి శల్యుండు వేఱువి ల్లెత్తి పృథాసూనునిపై ననూనమార్గణంబులఁ బందింటి నడరించినం దోడన భూరిశ్రవుడు మూటిని రాధేయుండు ముప్పదిరెంటిని దత్పుత్రుఁడేడింటిని నాసందున జయద్రథుఁడు డెబ్బదిమూఁడింటిని గృపాచార్యుండు పదింటిని నేసిరి. అంతలో నాచార్యపుత్రుండు పార్థునిపై నఱువదియంబకంబులను బరఁగించి యంతనిలువక తోన గాండీవిపయిం గాండపంచకం బడరించె. అందులకుఁ జలింపక నిలింపపతిపుత్రుండు నవ్వుచు హస్తలాఘవంబు మెఱయఁ గర్ణునిఁ బండ్రెంటను భూరిశ్రవోవృషసేనులను బ్రత్యేకంబ మూఁడింటను మద్రపతిం బదింటను ద్రౌణి నెనిమిదింటను శారద్వతుని నిరువదేనింటను సింధురాజును శరశతంబునను మఱియు నాచార్యసుతుని సప్తతిశరముల నొప్పించి మద్రరాజువిల్లు శరముతోడ ముష్టికిఁ దునిమె. అట సోమదత్తతనయుండు కోపించి వసుదేవతనయుచేతిమునికోల నొక్కదాని నఱికి పాండురాజతనయుని డెబ్బదిమూట నేసినం గోపించి కిరీటి నానాశరంబు లడరించి మహామారుతంబు మేఘపటలంబు నెట్టు లట్టుల తన్ను మార్కొనినవారల నందఱనుం దెరలించెననిన నప్పు డాదొరలకేతనంబు లెట్టులు దోఁచె? నెవ్వరెవ్వరియడియాలంబులు మిక్కిలి వెలింగెనని ధృతరాష్ట్రుం డడుగుటయు సంజయుం డిట్లనియె. అందఱికేతనంబులును నానావర్ణముల నొప్పి మిక్కిలి విరాజిల్లె. అందు సవ్యసాచికేతనంబు ఘోరవానరవిరాజితంబై మనసేనలకు వెఱపుఁ గల్పించుచుండె. ఆచార్యపుత్రకేతనంబు

బాలసూర్యసమప్రకాశం బైనసింహలాంగూలంబునం బొల్పారుచు నింద్రధ్వజ మున కెనవచ్చుచు మనవారికి సంతోషదాయకం బయ్యె. రాధేయునిధ్వజము కాంచనహస్తికక్ష్యాసముజ్జ్వలంబై కుసుమమాలికాభిరామంబై మారుతేరితం బై నర్తనంబు గావించుచందమునం జూడనొప్పె. కృపాచార్యునిసిడంబు గోవృషోల్లసితంబయి త్రిపురాంతకునిచాడ్పున వెలింగె. వృషసేనునిపతాక రత్నచిత్రితకనకమయూరభాసురంబై కుమారపతాకయట్లు లుల్లసిల్లె. మద్రరాజుపడగ సౌవర్ణసీతాభిరామం బయ్యె. సింధురాజుకేతువు బాలారుణప్రకాశం బగుహేమ వరాహమునం బొలుపారి దేవాసురసమరంపునాఁటిపూషధ్వజంబుకై వడిఁ గన్పట్టె. భూరిశ్రవునికేతనంబు సోమసూర్యచిత్రితం బయినసమున్నతయూపస్తంభంబునం దేజరిల్లె. శలునిధ్వజంబు కాంచనమయూరచిత్రితం బై నరజతగజమునం బొలిచె. రారాజుకేతనంబు కింకిణీశతబంధురంబై మణిమయనాగమునఁ బొలుపుఁ గాంచె. అన్నిధ్వజములును లయసమయసూర్యకిరణంబులమాడ్కి వెలుంగుచుండినను వానరలక్షణం బయినగాండీవికేతనం బాతొమ్మిదింటికంటె మిక్కిలి వెలింగె. అట్లుండఁ బు నెక్కనిం బొదివినను నందఱం దృణీకరించి పురందరనందనుండు గండడరి యాబిరుదుమగలనెల్ల నాఁగుచు నుక్కడంచుట పరమాద్భుతం బయ్యె నని నవిని యాంబికేయుం డక్కడ సేనాముఖమున నాచార్యునకును బాండవులకును భండనం బెట్లు నడిచె నని యడుగ సంజయుం డతని కిట్లనియె.

## ధర్మరాజు ద్రోణునితో యుద్ధము చేసి యోడిపోవుట.

అయ్యపరాహ్ణసమయమున నాచార్యునకును బాంచాలపాండవసైనికులకును గ్రందుకయ్యం బగుచుండఁ గేకయేశ్వరుం డై నబృహత్క్షత్రుని క్షేమధూర్తియుఁ, జేదినాథుం డై నధృష్టకేతునిఁ ద్రిగర్తనాయకుం డై నవీరధన్వయు, నకులుని వికర్ణుండును, సహదేవుని దుర్ముఖుండును, సాత్యకిని మగధరాజపుత్రుండై నవ్యాఘ్రదత్తుండును, ద్రౌపదేయుల నేవురను సోమదత్తుండును, భీమసేను నలంబుసుండునుం దలపడిరి. అప్పు డాచార్యుండు ధర్మరాజుం దాఁకిన నప్పాండవాగ్రజుండు గురునిపైఁ దొంబదియంబకంబులం బ్రయోగించుటయుఁ గినిసి చాపాచార్యుండు ధర్మజుస్తనాంతరంబునఁ బంచవింశతివిశిఖముల నాటి తోడన హయసూతధ్వజములపై నిరువదిశరము లడరించినం జూచి కౌంతేయాగ్రజుండు పాణిలాఘవంబు మెఱయ వాని కెల్ల మాఱేసి యాఁగె. అఁగినం గోపించి భారద్వాజుండు ధర్మతనూజువిల్లు దునిమి బహుళశరముల నతని నదృశ్యుం గావించిన నందఱు ధర్మపుత్రుని హతునకాను బరాఙ్ముఖీకృతునకాను వగచుచున్నంత నెట్టకేలకు నతం డొండువి ల్లెత్తి ద్రోణముక్తసాయకజాలంబెల్ల నద్భుతం బావహిల్లఁ దునిమి క్రోధరక్తాక్షుండై తోన కనకదండం బష్టఘంటోజ్జ్వలంబు గిరివిదారణ

చణంబు మహాఘోరంబు నగునిజశక్తి నభ్భారద్వాజుపై నేసి యార్చె. అందు లకు సర్వభూతంబులు వెఱచి ద్రోణునకు స్వస్తి వచించె. ధర్మరాజభుజముక్తంబై యద్దివ్యసాధనంబు నిజప్రభాపటలమున గోదోంతరంబు వెలిఁగించుచు దీప్తాననంబైనక్రూరపన్నగంబుచాడ్పునఁ దనపయిం బడ వచ్చుచుండ నాచార్యుండు బ్రహ్మాస్త్రం బభిమంత్రించి ప్రయోగించుటయు నయ్యస్త్రరాజం బాశక్తిని రూపడఁగించి ధర్మజుతేరిపయిం బడఁబోవుచుండె. దానిం జూచి కుంతీసుతజ్యేష్ఠుండు దానును బ్రహ్మాస్త్రంబు సముద్దీపితంబుఁ జేసి గురుం డేసినబ్రహ్మాస్త్రము శాంతముఁ గావించి శరపంచకం బగ్గురునిమేనం గీలించి యొక్కక్షురప్రమున విల్లు దునిమె. అందుల కలిగి యాభూసురోత్తముఁ డానరోత్తమునిపై గదాదండంబు విసరివైచుటయు నతండును బ్రతిగద నేసిన నిరువురిగదలు నొండొంటిం దాఁకి మిణుఁగుఱు లెగయించుచు నేలం బడియె. అంత ద్రోణుండు మిక్కిలి యలిగి శరచతుష్టయమునఁ దురగచతుష్టయముం జదిపి యొక్కభల్లంబునఁ గేతుదండంబుఁ గూల్చి మూఁడువాఁడియమ్ములఁ బాండవాగ్రజుమేనం గీలించిన నయ్యజాతశత్రుండు హతాశ్వం బైనతేరు డిగ్గి నిరాయుధుండు నూర్ధ్వబాహుండునై యూరకుండె. తదవస్థుం డైనయతని నేయఁ జేతులాడక గురుండు చెంగటిమూఁకలఁ గనుపుకొట్టుచు ధర్మజుం దఱియ వచ్చుచున్నంతఁ గటకటా! యాచార్యుండు ధర్మజుం బట్టికొనియె ననునెలుంగులు నింగి ముట్టుటయు సహదేవుఁడు రయమున నేతెంచి యన్నను దనతే రెక్కించుకొని తొలంగిచనియె.

ద్వంద్వయుద్ధమున క్షేమధూర్తిప్రముఖులు చచ్చుట.

క్షేమధూర్తి బృహత్క్షత్రుం దాఁకి పెక్కుబాణమ్ముల నొమ్మఁ గాఁడనేయుటయు నాకేకయపతి వానిం దొంబదియమ్ముల నొంచి ద్రోణానీకంబు భేదింపఁ బోవుచుండఁ గోపించి క్షేమధూర్తి యాతనిచాపంబుఁ దునిమి తొంటి పలుతూపుల నతనిమేనం గీలించిన నవ్వుచు బృహత్క్షత్రుఁడు వేఱువిల్లు గొని శరజాలంబుఁ బరఁగించి తదీయరథరథ్యసారథులం జక్కాడి యొక్కనిశితభల్లమునఁ దలఁ దఱుగుటయుఁ గిరీటమండలోల్లసితం బయినయాక్షేమధూర్తితల గగనపతితం బగుజ్యోతిస్సుతెఱంగున నేలం బడియె. బృహత్క్షత్రుఁడు తనకుఁ జేరువ నున్న మనమూఁకలపై నడరె. వీరధన్వుఁడు ధృష్టకేతుం దలపడిన నాత్రిగర్తపతిచేదినాయకులు మత్తమాతంగంబులభంగిని గిరిగహ్వరవాస్తవ్యంబు లగుక్రూరశార్దూలంబులవిధంబునను బరస్పరజిఘాంసామనీషం జేసి పోరుచు సిద్ధచారణసంఘములకు విస్మయాపాదకంబుగా నానాశరజాలములఁ గురియుచుఁ బోరు సేయుచున్నంత వీరధన్వుఁ డుక్కుమిగిలి నగుచు నొక్కభల్లమున ధృష్టకేతునిశరాసనము రెండుతునియలు చేసినం గోపించి యాచేదినాథుండు తునిసినవిల్లవలవైచి ఘోర

శక్తిని భుజద్వయమునం బట్టి మీఁది కెత్తి విసరివేయుటయుఁ దత్ప్రహారంబునం జేసి త్రిగర్తేశ్వరుం డై నయావీరధన్వుఁడు విదీర్ణహృదయుండై నేలం బడియె. అట్లువీరధన్వుఁడు పడినం జూచి మనమూఁకలు విఱిగె. దుర్ముఖుఁడు సహదేవుం దలపడి యఱువదియమ్ము లడరించి యార్చిపేర్చినం గినిసి యప్పాండవావరజుండు వీరరసబంధురం బయినదరహాసంబు నెమ్మొగమ్మునం దళుకొత్త నీకొడుకుమేనం దొమ్మిదియమ్ములు గీలించి యొక్కభల్లమునఁ గేతనంబుఁ గూల్చి కాండచతుష్టయమునఁ గాండచతుష్టయముం జదిపి నిశితభల్లమున సారథితలఁ ద్రెవ్వ నఱికి యొకక్షురప్రమున విల్లు దునిమి తోన బాణపంచకమున నొంచినం దుర్ముఖుండు విముఖుండై హతాశ్వసారథికం బై నతేరు దిగ్గనుఱికి యప్పటికి డాసిననిరమిత్రుతే రెక్కె. అంత నిలువక సహదేవుఁడు నిశితభల్లమున నాత్రిగర్తపతిపుత్రుం జంపి ఖరాసురవధంబుఁ గావించినశ్రీరామునిచాడ్పునం దేజరిల్లుచుండఁ ద్రిగర్తసైన్యంబున హాహాకారంబు లెసంగె. నకులుఁడు వికర్ణుని ముహూర్తమాత్రలోన నద్భుతంబుగ గెలిచె. వ్యాఘ్రదత్తుఁడు సాత్యకిని మార్కొని శరజాలమున నతని రథహయసారథికేతనములం గప్పినం గృతహస్తుం డై నశైనేయుఁడు వానినెల్ల వారించి నిమేషమాత్రలోన నమ్మగధరాజుపుత్రుని రథతురగసారథికేతనంబులతోడ నేలం బడఁగూల్చినఁ దమరాచకొడుకు సచ్చుటకు శోకామర్షంబులు పెనంగొనంగ మాగధులు పెక్కం డ్రొక్కమొగిఁ దన్నుఁ జుట్టిముట్టి నానాయుధజాలంబుఁ గురిసినం జలింపక సాత్యకి శరపరంపరలు పరఁగించి పలువురం జక్కాడినఁ దక్కినవా రతనియెదుర నిలువనోడి విఱిగి పఱచుటయు నాచార్యుండు క్రోధోద్వృత్తలోచనుండై తాన యాశినివరుం దలపడియె. సోమదత్తపుత్రుఁడు ద్రౌపదీపుత్రులం దాఁకి యొక్కొకని నై దేసియమ్ములం బిట్టేసి తోన వేఱువేఱ యేడేడు వాఁడితూపుల నొంచి వెగడుపఱచిన నకులపుత్రుం డై నశతానీకుం డతనిం గాండద్వయమున నొవ్వనేసి యార్చుటయుఁ దక్కినవారును బ్రత్యేకంబ మూఁడేసియమ్ము లతనిపై నడరించిరి. అంత నాసోమదత్తసుతుఁడు వారివక్షోభాగములఁ దీవ్రభల్లములఁ గ్రుచ్చుటయు నయ్యన్నదమ్ము లేవురు నలిగి యతనిం జుట్టుముట్టి యర్జునసుతుండు శరచతుష్టయమున గుఱ్ఱముల నాల్గింటిని భీమసేనసూనుండు శితశరముల శరాసనమును ధర్మరాజతనూజుండు కేతనంబును నకులతనయుండు సారథినిం దునుముడు సహదేవపుత్రుఁడు నిశితక్షురప్రమునఁ దలఁదఱుగుటయు నాసోమదత్తుసుతునిశిరంబు బాలారుణప్రకాశంబగుకిరీటమున నద్దేశమును వెలిగించుచు నేలం బడినం జూచి మనసైనికులు వెఱచఱచి పఱచిరి. అలంబుసుఁడు భీమసేనుం దాఁకి లక్ష్మణునిపై నడరినయింద్రజిత్తులీల నొప్పి సర్వభూతములకు సమ్మదాద్భుతంబు లావహిల్లఁ బోరుచుండ వృకోదరుఁడు క్రోధసముద్ధురమందహా

నంబు వదనంబునం బెంపెసంగ శితశరముల నొంచిన నార్చిపేర్చి యయ్యసుర వృకోదరునిం దత్తైనికులం దలపడి భీముని మేన నేనమ్ములం గీలించి తత్సహాయ రథికుల ముప్పదుండ్రం బొరివుచ్చి చతుశ్శతరథికుల నొప్పించి యొక్కవాలికయ మ్మున నతని మేను గాఁడ నేయుడు వాయుసూనుం డతనియేటున వ్రాలి తేరిపయిం జదికిలంబడి కొండొకవడికిం దెలిసి ఘోరకార్ముకగుణక్వణనంబు గావించి శిత విశిఖముల నయ్యసురమేన నాటుటయు నీలాంజనచయప్రకాశుం డగునయ్యలం బుసుఁడు భీమశరవిక్షతాంగుఁడై నెత్తుటం జొత్తిల్లి పూచినమోదుగుచందమున నొప్పుచు నెడపక తనపయిం బడువడమడియలుగుల కలిగి యన్న యగుబకుని చావు మనంబునం దలంచి ఘోరరూపంబు బూని భీమున కిట్లనియె. ఓరీ కౌం తేయాధమా, నిలునిలుము. నాయెదురం బడిననీ వింక నెచ్చటికిం బోవచ్చు. నే ను లేనప్పుడు నాయన్న యగుబకాసురుం జంపి పోఁజొక్కించుకొన్నట్లు కాదు. ఇదె నాబీరంబు చూడు మని పలికి రాక్షసమాయచే నంతర్థానంబు జెంది బ హుళశరజాలంబు గురియుటయు భీముఁడు గగనంబెల్ల నిజశరపూరితంబు గా వించిన నిలువం జోటు లేక యారాక్షసుండు మగుడ నిమేషమాత్రలోనం దేరిప యిం దోఁచి యట రసాతలమున కరిగి క్రమ్మఱ నింగికి నెగసి యొక్కపరి యణు మాత్రుండుగను వేఱొక్కపరి మహాకాయుఁడుగను మఱియొక్కపరి యతిస్థూలుం డుగను వివిధరూపములం దాల్చి యుఱుము మెఱిమినట్లు లట్టహాసంబు సేయుచు గగనస్థితుండై శక్తిపరశుపట్టస ప్రాసభిండివాలశూల ప్రభృతినానాసాధనంబులం దోనతోన పైపై నడరించుటయుం దదాయుధవ్రాత పాతమునం జేసి పాండవ సైన్యమున గజవాజిపదాతిరథనికరంబులు నుగ్గునూచమయి రథావర్తంబు హ సినక్రంబు ఛత్రహంసంబు బాహుపన్నగంబు నగుశోణితనదీప్రవాహంబు ర క్షోగణసంతర్పణావహంబై ప్రవర్తిల్లినం జూచి హతశేషు లగుపాంచాలపాండ వయోధులు వానిమొన నిలువఁజాలక వెఱపు గదిరినయుల్లములతోఁ బఱచిరి. మనవారు ప్రహర్షోత్కర్షభరితులై సింహనాదములను వాద్యరవములనుం గావిం చిరి. అయ్యార్పు సైరింపనోపక వృకోదరుండు కన్నుల నిప్పు రాలఁగ నయ్య సురం జూచి త్వాష్ట్రం బైనదివ్యాస్త్రంబు బ్రయోగించినం దదస్త్రమున బహు శసాధనములు వ్రేదమి యమ్మాయలనెల్ల మాయించి యారాక్షసుని బిట్టునొంచి న వాఁడు భీమసేనునెదుర నిలువనోడి ద్రోణానీకమునకుం బఱచినం బాండవులు పొంగియార్చిరి.

## అలంబుసుఁడు ఘటోత్కచునిచేఁ జచ్చుట.

అవ్విధమున ద్రోణానీకమునకుం జని యక్కడం బాండవసైన్యంబుం గను వుకొట్టుచున్నయలంబుసుని ఘటోత్కచుండు దలపడి శితశరము లడరించిన నబ్బ

కానుజుండు హిడింబాసుతుపైఁ బెక్కుతూపు లేయుటయు నారాక్షసప్రవరుల
కిరువురికిని దొల్లి శక్రశంబరులకును రామరావణులకును నెట్టు లట్టుల తుములస
మరంబు సెల్లె. ఘటోత్కచుఁడు వింశతివిశిఖముల నలంబుసుని స్తనాంతరమునం
గ్రుచ్చి యార్చిన నతండు నతనిపైఁ బెక్కుతూపు లడరించుటయు నంత నయ్యి
రువురును మాయాయుద్ధమునకుఁ దొడరి యెక్కువతక్కువలు లేకుండ హైడింబు
డు గావించినమాయ నలంబుసుండు నలంబుసుండు సూపినమాయను హైడింబు
డునుఁ జూపుచుఁ బరస్పరమాయల నితరేతరమాయల మాయించుచు రణవిహా
రంబు సల్పుచుండఁ గోపించి రభసంబున ధర్మజభీమసేననకులసహదేవులును
ద్రౌపదేయులును నయ్యలంబుసునుం జుట్టుముట్టి కొండవుల నేనుఁగుంబోలె నంతట
బాణజాలంబుఁ గురిసిరి. అందులకుఁ గడుం గినిసి యలంబుసుఁడు నిజమాయా
ప్రభావమునఁ దదస్త్రవేగమెల్ల నుడిపి తద్రథధ్వజనిర్ముక్తుండై కార్చిచ్చు పొది
వినకాననంబుఁ బాసినద్విరదంబుచందంబున నెప్పి ధనుర్గుణక్వణనంబు గావించి
యిరువదేనమ్ముల వృకోదరునిఁ బంచాశుగంబుల హిడింబాసుతుని శరత్రయమున
నజాతశత్రుని సాయకసప్తకంబున సహదేవుని డెబ్బదిమూడుతూపుల నకులుని
నైదేసియమ్ముల ద్రౌపదీసుతులం బిట్టేసి యార్చినం గినిసి భీమసేనుండు తొమ్మిది
వాలమ్ములను సహదేవుఁడు సాయకపంచకంబునను యుధిష్ఠిరుఁడు శరశతమునను
నకులుఁ డఱువదినాల్గుతూపులను ద్రౌపదీసుతులు మూఁడేసియాశుగంబులను
హిడింబానందనుం డేఁబదియలుగులను వాని నెప్పించిరి. తోడన హైడింబుఁ
డయ్యలంబుసునిపై సప్తతిసాయకంబు లడరించి సింహనాదంబుఁ గావించిన
నయ్యార్భనకుఁ బుడమి వడంకె. కొండలు సంచలించె. అర్ణవంబులు ఘూర్ణిల్లె.
అందులకుఁ గోపితుండై బకానుజుండు వారల నందఱను నైదేసిసాయకముల
నెంచుటయు ఘటోత్కచుఁ డేడువాఁడియమ్ముల వానిపయి నడరించినం గినిసి
యయ్యసుర పరమరయమున రుక్మపుంఖములు శిలాశితములు నగునారసముల
ఘటోత్కచుగాత్రంబు వ్రయ్య నేయుటయుఁ బాండవు లందఱుం గూడి శితసా
యకములఁ బరఁగించిన నబ్బకానుజుండు వెగడుపడియె. అట్టియెడ ఘటోత్క
చుఁడు వానిఁ జంపఁగఁ దలఁచి నెగ నెగఁ దాఁకఁగఁ దనతేరు వానితేరు డాయం
బోనిచ్చి కాఁడికి లంఘించి పాముం బట్టుగరుడునితీరున భుజద్వయమునం బట్టి
యయ్యసురం గిట్టి మీఁది కెత్తి పలుమాఱులు క్రిందికి మీఁదికి నెగయించుచుఁ
బూర్ణకుంభమును శిలాతలంబునంబోలె నేలం బడవైచి బలవిక్రమములు పొంపి
రివోవఁ దదీయాంగములు నలుగనడిచి యెమ్ములు పొడిపొడి గావించి వానిం
జిత్రవధప్రకారమునం జంపుటయుఁ బాండవసైనికులు పరమామోదభరితులై
సింహనాదంబులను వాద్యఘోషంబులను నుత్తరీయాంచలవిధూననంబులనుం

గావించిరి. మనవారు గులగుల లైనకొండపోలెఁ గూలియున్న వానిపీనుఁగుఁ జూచి శోకభరాక్రాంతులై హాహాకారంబు లొనర్చిరి. భూతలంబునం బడిన యంగారకుంబోనివానిశవముఁ జూచి సకలజను లాశ్చర్యముఁ బొందిరి. అవ్విధమున ఘటోత్కచుఁ డలంబునం జంపి సింహనాదంబుఁ గావించుటయుఁ బాండవులు వానిం బ్రశంసించిన నామహారవంబు నింగి ముట్టె ననిన విని యాంబికేయుండు సంజయా, సాత్యకి నాచార్యుఁడు తాన తలపడియెఁగదా వారిద్దఱికయ్యం బెట్లయ్యె ననియడుగ సంజయుం డతని కిట్లనియె.

## సాత్యకిద్రోణాచార్యులయుద్ధము.

అవ్విధమునఁ దనకు మాఱుమలయువారు లేక సాత్యకి వీర్యోద్ధత్యమున మెఱసి కురుసేనలం గనుపుకొట్టుచున్నంత నేచి యాచార్యుండు కడువడిం దాన యతనిం దాఁకుటయు నమ్మాధవానుజుం డిరువదియేనుకు ప్పెకోల లడరించినం గోపించి గురుండు కనకపుంఖము లగుశితశరముల నైదింటి నేయుడు నయ్యవి సాత్యకిమైమఱువు వ్రచ్చి నొంచె. నొచ్చి సాత్యకి సిడులు చూపినయేనుంగుభంగిం గినిసి యగ్నిసన్నిభంబు లగునేఁబదినారసముల నాచార్యుం బిట్టేయుటయు నబ్భారద్వాజుం డలిగి యనేకబాణము లేసి తోన యొక్క తీవ్రశరంబు నేసిన విషణ్ణుండై యుయుధానుం డితికర్తవ్యతామూఢుండై వెగడుపడినం జూచి నీకొడుకులు నుసైనికులును సంతోషభరభరితులై పలుమాఱులు సింహనాదము లొనరించిరి. అయ్యార్పులు వినియుఁ దదవస్థుం డైనకృష్ణుతమ్మునిం జూచియు ధర్మరాజు నిజసైన్యములకుఁ జేయిపిచి యాచార్యునకుఁ జిక్కి సాత్యకి రాహుగ్రస్తుండైనసోమునివిధమున నేపఱియున్నవాఁడు తడవుసేయక తోడ్పడుఁ డని యెలుంగెత్తి పడం జెప్పి ధృష్టద్యుమ్నుం బిలిచి గురునివలన సాత్యకికి భయం బుపస్థితం బయ్యె. బాలుఁడు పులుఁగుం ద్రాటఁ గట్టి యార్చుపగిదిఁ గుంభసంభవుండు సత్యకసంభవు నాడించుచున్నవాఁ డదె చూడుము. నీవును భీముఁడును దక్కినమేటిమగలును రయమున నెయిది మృత్యువాతం బడినసాత్యకిం గాచుట కర్తవ్యం బని పలికి తానును వారితోడ సాత్యకిం దలకడచి యాచార్యుం బొదువుటయు మహారావం బెసంగె. అట్లు పాండవవీరులు పెక్కండ్రు సాత్యకినిమిత్తమునఁ దన్నతిమి శరజాలముఁ గురిసిన నవ్వుచు గురుం డర్ఘ్యపాద్యాసనాదుల నతిథుల కెట్లట్ల వారలందఱకును బహుళశరాసారమున నాతిథేయసత్కారము నడుపుటయుఁ బట్టపవలింటిభానునిచాడ్పున వెలుంగుచున్నయయ్యాచార్యుం జూడనోడి నిదాఘసమయభానుమంతునిమయూఖంబులం బోనితదీయబాణములం దపించి పంకనిర్మగ్నంబు లగునేనుంగులట్లు పోనీక పొదివినగురుం గ్రేడించి చననేరక ఱిచ్చవడుటయు నాలోన నాబ్రాహ్మణప్రవరుండు ధృష్టద్యుమ్నునకుఁ గూర్చుపాంచాలమహా

రథుల నిరువదియేవురను గేకయరథికులను నూఱుగురనుం బొలియించి నోరు
దెఱచికొన్న మృత్యువుచాడ్పునఁ బరమభీకరాకారుండై యుండ మత్స్యపాంచాల
కేకయసృంజయయోధు లోపినకొలంది పోరుచుండిరి. ఏమిచెప్పుదు నాచార్యునం
పగముల నెచ్చినపాండవయోధులయార్తనాదములు కార్చిచ్చు పొదివినవన్యమృ
గంబులయఱపుల తెఱంగున వినవయ్యె. చూచుఖేచరులు గురుశరాసనవిద్యాచా
తుర్యంబు వేనోళ్లం బొగడిరి.

ధర్మరాజు సాత్యకి నర్జునునకుఁ దోడ్పడఁ బొమ్మనుట.

అట్లు పరమరౌద్రం బయినసంగ్రామంబు సెల్లుచున్నంతఁ గౌంతేయా
గ్రజుండు పాంచజన్యనిస్వనంబుఁ దటాలున నాకర్ణించి పాంచజన్యస్వనం బొక్కం
డే వినంబడుచున్నది. గాండీవజ్యాఘోషంబు వినంబడదు. సైంధవుఁ డున్నదె
సఁ గౌరవయోధులసంతోషసింహనాదంబులు వినంబడుచున్నవి. అర్జునున కె
య్యదియేనియుఁ గీడు మూఁడియుండవలయు నని తనలోనం దలపోసి వ్యాకులి
తచిత్తుండై పలుమాఱులు మోహముఁ జెందుచుఁ గార్యచింతనతాత్పర్యమునం జే
సి యెట్టకేలకు మనం బొక తెఱంగున నిల్పుకొని బాష్పగద్గదకంఠుండై సాత్యకి
కిట్లనియె. శినిపుంగవా, సమరంబున నెయ్యది పరమధర్మం బని పెద్దలు పలుకుదు
రంమల కిదె కాలంబు ప్రాప్తం బయ్యె. ఎంత చింతించినను సర్వయోధులలోను
నీకంటె సుహృత్తముఁడు నాకుఁ గానఁబడఁడు. ఎవఁడు ప్రీతిమై నిత్య మనువర్తించు
నతనినే సమరంబున నియోగించుట యుచిత మని నామతంబు. కేశవుఁ డెట్టు
లట్టుల తత్తుల్యవిక్రముఁడ వగునీవును బాండవులకుఁ బరాయణంబవు. కావున
నెక్కభారము నీపయిం బెట్టెద. నాయభిప్రాయంబు వృథ వుచ్చక నీవు వహిం
పవలయు. భ్రాతృసముఁడును మిత్రుఁడును గురుఁడును నగు నర్జునునకు సంకట
సమయమునఁ దోడ్పాటుఁ గావింపుము. నీవు సత్యవ్రతుండ వనియు శూరవర్యుఁడ
వనియు శత్రుభీకరుండ వనియు నాడి తప్పనివాఁడ వనియు లోకమునఁ బొగడ్త
కెక్కితివి. మిత్రార్థం బోపినకొలంది పోరి తనువు విడిచినవాఁడును నిఖిలమహీ
మండలము నుత్తమభూసురులకు దానము చేసినయతండును సమానపుణ్యు లని
పెద్దలవలన వినంబడు. సకలభూమండలమున దానముఁ జేసినతొల్లింటి మహా
రాజులపుణ్యలోకముల నీ వీకృత్యమునఁ బడయుదువు. కావునఁ గృతాంజలినై
నిన్నుఁ బ్రార్థించెద. నాప్రార్థన నెఱవేర్చిన నీకు భూదానఫలముకంటె నెక్కు
డుఫలము గలుగు. కృష్ణుఁడును నీవునుం గదా మాకై ప్రాణములనైన విడుతు
మని పూనియున్నవారలు. విక్రమవంతుఁడు కీర్తికాముఁడు నగుశూరు నకట్టేఁ
డేకదా తోడ్పడవలయు. ప్రాకృతజనుఁడు నేను తోడ్పడుదు నని మొనసి వచ్చునే?
వచ్చెఁబో వానివలనం బ్రయోజనం బెయ్యది? ఇట్టి సంకటమునఁ గుందుచున్న

విజయునకు నీకంటె లాఁతివాఁడు రక్షకుఁడు నాకుఁ గన్పట్టఁడు. మేము ద్వైతవ
నమున నున్నపుడు సాత్యకి హస్తలాఘవము గలఁడు. చిత్రయుద్ధముల నేర్పరి.
మహాపరాక్రముఁడు మహాప్రాజ్ఞుఁడు మహాస్కంధుఁడు మహాబాహుఁడు మహా
హనుఁడు మహాబలుఁడు మహావీర్యుఁడు మహారథుఁడు సర్వాస్త్రవిదుఁడు నాకెం
తయుఁ గూర్చుశిష్యుఁడు చెలికాఁడు. నేను నతనిం గడుఁ బ్రేమమునఁ జూతును.
కౌరవులతోడ మనకుఁ గయ్య మగునేని నాకుఁ దప్పక తాను బాసటయగును.
రామకృష్ణులును బ్రద్యుమ్నానిరుద్ధులును గదసారణసాంబాదులును నిఖిలయా
దవులతోడ మనకుఁ దోడు వచ్చినను రాకున్నను సాత్యకి మనకుఁ బెద్దయుఁ దోడగు
నని పలుమాఱులు నీపరోక్షమున నీగుణము లర్జునుఁడు జెప్పినవాఁడు. మఱియుఁ
గిరీటి తీర్థయాత్రాపరుఁడై ద్వారక కేతెంచినపుడును గడు భక్తితాత్పర్యమున
మెలఁగితివఁట. కావున నాకును భీమునకును గృష్ణార్జునులకును సమ్మతం బగునాచె
ప్పినపని చేయఁదగు. ఇట్టిసంకటపాటు పడినమాకు భవదీయసత్యదయాశౌర్యస
ఖ్యసౌహార్దశిష్యత్వకులీనత్వంబుల కనురూపంబుగఁ దోడుపడుము. సుయోధ
నుఁడు ద్రోణునిచేతఁ గవచధారణంబుఁ బడసియున్నవాఁడు. అంతకు మున్న
కౌరవమహారథులు పెక్కండ్రుడుక్కి మిగిలి క్రీడిం బొదివిరి. అదె యద్దెస మహా
రావంబు వీతెంచుచున్నది. కావునఁ బరమరయమున నీవు ధనంజయు నెయ్దు
ము. నీకుఁ దెరు వీక వీఁకమై గురుండు పోక తాఁకి పెనంగెనేని భీమసేనప్రము
ఖు లగుమేమందఱు నతని నాఁగుదుము. చక్క చూడుము. సవ్యసాచి తేరుదెస
నిటునటుం బఱచుచతురంగములకోలాహలంబు మిక్కిలి విననయ్యెడి. పర్వకాల
మున సముద్రముపై మహామారుతంబు సోఁకిన నెల్లట్లు కౌరవసైన్యంబుపై స
వ్యసాచి యడరిన నాఘోరనినదం బెసఁగి యుండవలయు. పాంసుపటలంబును
మింటి కెగసి యిందాఁక వ్యాపించుచున్నది. అత్యంతవీరు లగుసింధుసౌవీరయో
ధుల నాఁగక సైంధవుం దెగటార్పఁ గ్రీడికి శక్యంబుగాదు. వారందఱును సైంధ
వునిమిత్తంబు ప్రాణములపై నాశ విడిచి యున్నవారు. అదె చూడుము ధార్త
రాష్ట్రునిసైన్యము శరశక్తిధ్వజనిబిడంబును హయద్విరదస్యందనసంకులంబునై దు
రాసదంబై యున్నది. దుందుభిఘోషంబును సింహనాదంబులను శంఖరవంబు
లను రథనేమిస్వనంబులను గరిబృంహితంబులను వాజిహేషితంబులను వీరయో
ధభుజాస్ఫాలనధ్వానంబులను జెవియొగ్గి వినుము. ముందఱ సైంధవానీకంబును
బిఱిందిదెస ద్రోణానీకంబును గలుగ నట్టనడుమఁ గిరీటి చిక్కియున్నవాఁడు. బ
హుళంబుగావునఁ గౌరవసైన్యము సురేంద్రునైనను నొప్పింపఁజాలును. అపారబ
లమున మునిఁగి కాలు చే యార్పరాకుండఁ బోరవలయుటం జేసి మనయర్జునుండు
సోలి ప్రాణములు విడుచు నని కొందలంబుఁ జెందెద. అతండు సచ్చెనేని

నావంటివానికి బ్రదు కెక్కడిది? నీవు బ్రదికియుండఁగనే నాకు సంకటపడవ లసివచ్చునే; మహాస్త్రవిదుఁడు వివిధచిత్రయుద్ధవిశారదుఁడు దర్శనీయుఁడు నాయ నుంగుఁదమ్ముఁడు నగునర్జునుండు ప్రొద్దు పొడుచుతఱిఁ గౌరవసేనలోనికిఁ జొచ్చిన వాఁడు. ఇప్పటి కపరాహ్ణంబును గడవవచ్చె. ఇంతకుఁ గిరీటి ప్రాణములఁ దా ల్చియుండునే? దేవతలకు నభేద్యం బయినకురుసేనావ్యూహము నిస్సహాయుండై చొచ్చి యింతకుఁ గీడు వొందకుండునే? ఇక్కడ నీబ్రాహ్మణుఁడు మనల నెన్నెన్ని తెఱంగులఁ గాఱించుటయు నీకుఁ బ్రత్యక్షంబకదా. ఇక్కడను నీవుండుట యుచితంబు. అయినను లెస్స పరికించి చూచిన నర్జునపరిత్రాణార్థం బేగుటయ కర్తవ్యంబు. కృష్ణునికై నేను వగవను. సర్వలోకేశ్వరుం డైనయమ్మహానుభా వుఁడు ముల్లోకము లొక్కటియై కూడిముట్టినను నిక్కువంబు గెలువఁగలఁడు. అత్యంతదుర్బలం బయినధార్తరాష్ట్రబలం బద్దేవదేవునకుఁ గీడు గావింపనోపునే? పార్థుం డత్యంతసమర్థుండయ్యుఁ బలువురు పొదివినం జిక్కినవాఁడుగావున నేమ య్యెనో యని చింతించెద. కావున నాయట్టివాఁడు పురికొల్పఁగ నట్టివాని కిట్టి తఱి నెయ్యది చేయవలయు నద్దానిం జేయుము. ప్రద్యుమ్నుఁడును నీవును సమా ను లని లోకవిశ్రుతంబు. నీ వస్త్రమున నారాయణసమానుఁడవు. బలమున సంకర్షణతుల్యుఁడవు. వీరకర్మమున నర్జునసదృశుఁడవు. భీష్మద్రోణులకంటె నీవు వివిధయుద్ధవిశారదుఁడ వని యందఱుం జెప్పుదురు. ఈలోకమున నీ కశక్యం బొక్కండును గలుగదు. కావున నావచనంబు విని నాకును బార్థునకును సంభా వనం బొనరింతువుకాని నిరాకరింపవలదు. ప్రాణములపైఁ బ్రీతి విడిచి వీరశేఖ రుండవై సమరధరణీతలమున విహరింపుము. ఇది నీకుఁ జెప్పనేల? దాశార్హుఁ డు రణమున నొడ లోమునే? అయుద్ధ మనవస్థానము రణపలాయన మనునివి యసజ్జనాచారంబులుగాని దాశార్హులయాచారంబు లగునే? వాసుదేవార్జునులు నీకు గురువులుగావున నింతచెప్పితి. నీగురునకు గురుం డైననావచనంబు నీ కపరి హార్యంబు. నామతంబే కృష్ణార్జునులకును సమ్మతంబు. కావున ధార్తరాష్ట్రబలం బు సొచ్చి యథాన్యాయముగ మహారథులతోడఁ గలిసి నీకుఁ దగినతెఱంగున స వ్యసాచికి సహాయకృత్యంబు సేయు మని ధర్మరాజు ప్రీతిసమేతముగను హృద్య ముగను మధురముగను గాలోచితముగను జిత్రముగను న్యాయ్యముగనుం బలికిన విని సాత్యకి యయ్యజాతవైరి కిట్లనియె.

సాత్యకి ధర్మరాజునకుఁ బ్రతివచనంబు లిచ్చుట.

మహారాజా, సముచితంబు యశస్కరంబు నగుభవద్వచనంబు వింటిని. సంకటసమయములఁ బార్థుంబోలె నన్ను శాసించుట నీకు సముచితంబు. ధనం జయార్థంబు నాకుఁ బ్రాణములును రక్షణీయములు గావు. నీ వానతిచ్చిన నిం

కఁ జేయకుండుదునే? నీనియోగంబున దేవదానవబలంబునైన నాఁగి పోరి గెల్తును. అత్యంతదుర్బలం బయినధార్తరాష్ట్రసైన్యంబు గెలుచుట నా కొకపని గాదు. కుశలినై నేను గుశలవంతుఁ డయినకిరీటియొద్ద కరిగి సైంధవవధానంతరము నీయొద్ద కరుగుదెంచెద. ఐనను వాసుదేవార్జునులవచనంబు నీకు విన్నవింపవలయుఁగదా. అర్జునుఁడు నేఁ డాహవమునకుఁ జనునప్పుడు సర్వసైన్యమధ్యమున వాసుదేవుఁడు వినుచుండ నన్నుఁ బిలిచి యేను జయద్రథుం దెగటార్చి వచ్చునందాఁక నీవు రాజరక్షణంబున జాగరూకుండవై యుండుము. నీ వుండెఁ బ్రద్యుమ్నుఁ డొండె ధర్మజునొద్ద నుండిన డెందమున నమ్మి యేను లాఁతులతోడ్పాటులేక జయద్రథుం దలపడఁ బోయెద. కౌరవులందఱు వినంగ నాచార్యుండు చేసినప్రతిజ్ఞ నీవెఱుంగుదువుగదా. నేను లేమింజేసి యగ్గురుం డగ్గలిక మెఱసి నేఁడు ధర్మరాజును నిగ్రహింప నెంతయేఁ గడంగును. యుధిష్ఠిరుం బట్టఁగ నతండు శక్తుఁ డని చెప్పవలయునే? ద్రోణుఁడు మాయన్నను నిగ్రహింపఁడేని సైంధవుం జంపి నే నతిరయమున మగిడి వచ్చెద. భారద్వాజుం డజాతశత్రుం బట్టెనేని సైంధవవధంబును నాకుఁ బ్రీతిదాయకంబు గాదు. ధర్మసూనుండు పట్టువడెనేని క్రమ్మఱ మా కరణ్యగమనంబు నిశ్చితంబు కావున నప్పటికి మావిజయంబును నిష్ప్రయోజనం బయ్యెడి. కావున నాకుఁ బ్రియమును జయమును యశమును గోరి రాజును రక్షింపుము. భారద్వాజునివలని వెఱపునంజేసి ధర్మరాజును నీ కిల్లడ వెట్టితి ననిపలికి యందులకు గోవిందుఁ డియ్యకొనినం గౌరవానీకంబునకుఁ జనియె. భారద్వాజునెదుర నిలిచి చక్క కయ్యముఁ జేయఁగ నేనును బ్రద్యుమ్నుఁడును జాలుదు మని గాండీవి తలంచు. కావున గురువాక్యంబు మీఱను నిన్ను విడిచి పోవను నామనస్సు గొలుపదు. హస్తలాఘవోజ్జ్వలుం డై నయాచార్యుఁ డభేద్యకవచావృతుండై బాలకుఁడు పులుఁగులంబోలె నీయున్నయోధులనందఱను నాడించును. ప్రద్యుమ్నుఁడు కోదండపాణియై యుండెనేని యతనికి నిన్నప్పగింతును. అతఁ డుండిన నర్జునుఁ డున్నట్లు కాపుగలుగు. ఇపుడు నేనును బోవుదునేని నీకుఁ గావలియై యుండువా రెవ్వరుగలరు? అర్జునున కేమికీడు మూఁడునో యని వెఱవం బని లేదు. మోవరానిమో పెత్తిన నమ్మహారథుఁడు వెగడుపడఁడు. కర్ణాదుల గుమహారథులును సింధుసౌవీరప్రాచ్యదాక్షిణాత్యాదు లగురథికులందఱును గినిసిన కిరీటిలోనిపదునాఱవపాలిటివారు గానేరరు. సురాసురకిన్నరోరగమనుష్యాదులును స్థావరజంగమభూతములు నెక్కమొగిఁ గూడముట్టినను విష్వచ్చుం గెలువరాదు. సత్యపరాక్రము లగుకృష్ణార్జును లున్నచోట లాఁతులకును గీడు మూఁడ నేరదన్న నింక వారికిఁ జేటు వచ్చు నని తలంపవచ్చునే? పార్థునకుఁ గలదివ్యాస్త్రములను నిరుపమానశౌర్యంబును ధనుర్విద్యాచాతుర్యంబును ధైర్యమును

సమరస్థైర్యమును గరుణాకృతజ్ఞతాదిగుణగణంబులనుం దలపోసి యూఱడిల్లుము. సకలధనుర్ధరాచార్యుం డైనద్రోణుఁడు నే నరిగినపదంపడి తనప్రతిజ్ఞ తీర్చువాఁడై నిన్ను నిగ్రహింపఁ గడంగుట నిక్కవంబు. నేను లేనిచోట నెండఱు వచ్చినను ని న్నెన్నియుపాయములనైనను గావఁగలవాఁడు గలిగినంగదా యతనికి నిన్నప్పగించి పోఁదగు, అట్టివానిఁ జేర్కొనుము. అర్జునునొద్దఁ జనుకంటె నీకుఁ గావలియై యుండుట నాకుం జూడ నుచితం బని తోఁచుచున్నది. బుద్ధిమద్వరుండై నీవు నిజబుద్ధిం బర్యాలోచించి యెయ్యది చేసినఁ బెద్దమేలని చెప్పుదు వద్దానిం జేయనున్నవాఁడ. ఉచితప్రకారమున నన్ను శాసింపు మనుటయు ధర్మరాజు సాత్యకికి వెండియు నిట్లనియె. మాధవానుజా, నీచెప్పినదెల్ల నిక్కవంబు. ఐనను నామనస్సు విజయునెడ సంశయగ్రస్తంబై చింతాకులితంబై యున్నది. ఆత్మరక్షణమునకుఁ బరమప్రయత్నముఁ జేసికొనియెద. నీ వర్జునునొద్దకుఁ బొమ్ము. ఆత్మసంరక్షణంబు నర్జునసహాయప్రేషణంబు ననునీరెంటిలో రెండవదియే నాకుం జూడ ముఖ్యం బని తోఁచెడి. కావున నాయనుజ్ఞఁ గొని రయమున నీవు క్రీడికిఁ దోడ్పడం జనుము. నాకు భీమసేనుండు రక్షకుండు గలఁడు. మఱియు ధృష్టద్యుమ్నశిఖండిప్రముఖపాంచాలురును ద్రౌపదేయులును గేకయులేవురును ఘటోత్కచుండును విరాటద్రుపదులును నకులసహదేవులును ధృష్టకేతుకుంతిభోజులునుం గావలి గలరు. ద్రోణుఁడును గృతవర్మయును నిజసైన్యములం గూడిముట్టినను వారల గెలువఁజాలరు. ద్రోణవధార్థము వహ్నికుండమున శరశరాసనకవచకృపాణస్యందనములతోడఁ బొడమినధృష్టద్యుమ్నుఁ డుండఁగ నాచార్యునకు వెఱవం బనిలేదు. నారక్షణమున నమ్మికఁ జెంది సంభ్రమము మాని విష్వచ్చునకుఁ దోడుపడ నరుగు మనుటయు సాత్యకి ధర్మరాజును విడిచి పోయిన నర్జునుం డేమనునో యనుభయంబును బోవకున్న ననికి వెఱచి పోఁడయ్యె నని తెలియనిజనులు తలంచిన నపవాదము వచ్చునో యనువిచారమును మనమునఁ బెనంగొనంగఁ గొంతవడి బహువిధముల విచారించి యొకతెఱంగున నిశ్చయముఁ జేసికొనినవాఁడై ధర్మరాజున కిట్లనియె.

సాత్యకి యర్జునునకుఁ దోడ్పడఁబోవ సమ్మతించుట.

రాజేంద్రా, భవద్రక్షణంబు సమ్యక్కృతం బని తలంతువేని నీకు స్వస్తియగుంగాక. నీయానతిమెయి నర్జునునొద్దకుఁ జనియెద. ముల్లోకములను నాకు ధనంజయునికంటెఁ బ్రియుఁడు లేఁడు. అమ్మహాత్మునకుఁ దోడుపడఁబోవుట కొకఁడు సెప్పం బనిలేదు. నీవు నానతిచ్చెదవఁట. ఇఁక సందియం బెయ్యది. మఱియు నీతదర్థంబు నాకుఁ గర్తవ్యంబుగానియది యొక్కండునుం గన్పట్టదు. భవద్వచనంబు

గురువచనంబుకంటె మాననీయంబై సర్వకాలంబును గర్తవ్యంబు. కృష్ణార్జునులు నీకుఁ బ్రియము సేయుచుండుదురుగదా. వారల కే నెడపక ప్రియము సేయువాఁడను. నీయానతిం దలఁ దాల్చి క్రోధఘూర్ణమానం బగుమహామీనం బర్ణవంబు నుంబోలె నభేద్యం బగుద్రోణానీకంబుఁ జొచ్చి విన్వచ్చునకు వెఱచి కర్ణకృపాశ్వత్థామాదిగుప్తుండై సైంధవుఁ డున్నచోటికిఁ జని యగ్గాండీవపాణికిఁ దోడ య్యెద. అచ్చో టిచ్చటికి యోజనత్రయమాత్రదూరంబై యుండు. నానాశస్త్రసంకులం బయినకౌరవబలార్ణవంబుఁ దిరుగుడుపఱుచునావిక్రమముఁ జూతువు. అదె సహస్రకుంజరానీకంబు చూపట్టుచున్నదిగదా. అది యంజనకనామకంబు. మేఘసన్నిభము లగునమ్మదేభములు యుద్ధలంపటు లగుమ్లేచ్ఛహస్తిపకులు పురికొల్పఁగ నెప్పుడు వెనుదీయక పైపైఁ దొడరు. పరిమార్పకుండిన వానిం గడవరాదు. వారె రుక్మరథనాము లయిన త్రిగర్తరథికులు పెక్కండ్రు దోఁచుచున్నారు. రథచర్యానిపుణులు నానాస్త్రవేదులు ఖడ్గగదాయుద్ధకుశలులు ముష్టియుద్ధచతురులు నియుద్ధచణులు పరస్పరస్పర్ధాసమృద్ధులు నగువారు కర్ణునివచనమువట్టి దుశ్శాసనుతోడ నున్నవారు. వాసుదేవుఁడును వారలవీర్యంబుఁ బ్రశంసించు. కర్ణప్రియంకరులుగావుననే గాండీవితోడఁ గలహించినారు. వా రింతకు డప్పియు నొప్పియు నెఱుంగక నాతదర్థము నిలిచియున్నవారు. వారలం బరిమార్పక క్రీడిం గనఁబోవనైతికాదు. అయ్యవియె దృఢకవచసంవృతంబులు కిరాతసమధిష్ఠితములు నగుసప్తశతమత్తశుండాలములు గనంబడుచున్నవి. తొల్లి దిగ్విజయంబునాఁడు కిరాతరాజు నిజప్రాణరక్షణపరాయణుండై యర్జునునకు సమర్పించిన నగ్గజంబులు నీకు సేవసేయుచుండె. కాలవిపర్యయమునం జేసి యిప్పుడు నీతోడఁ బోరికిఁ గడంగె. హస్తిశిక్షావిదులు వహ్నియోనులు నగునాకిరాతులు దుర్యోధనవశులై మదర్థంబు కృతప్రయత్నులై యున్నవారు. వారల నేనుంగులతోడఁ బిలుకుమార్చెద. అవె భర్మవర్మభూషితంబు లంజనకులోద్భవంబులు సువినీతంబులు కర్కశంబులు నిరంతరమదధారాపరీతగండభాగంబులు లబ్ధలక్షణము లైరావతసమానములు నగుమహానాగములు లోచనగోచరంబు లగుచున్నవి. ఉత్తమపర్వతమునుండి తీవ్రదస్యులు వీనిం దెచ్చిరి. గోయోనులు నరయోనులు నగువివిధమ్లేచ్ఛులు వాని నారోహించియున్నవారు. అదె ధూమవర్ణం బయినకుంజరానీకంబు గన్పట్టుచున్నది. అల్లవారె కాంచనధ్వజు లగుదుర్వారు లనంబడుకాంభోజరథికులు పెక్కండ్రు కన్పట్టుచున్నవారు. వారందఱు శూరులు కృతవిద్యులు ధనుర్వేదపరినిష్ఠితులు పరస్పరహితార్థులు. వీరందఱును ద్రోణకృపాశ్వత్థామకర్ణసైంధవబాహ్లీకసోమదత్తభూరిశ్రవశ్శల్యశలప్రముఖు లగుమహారథులును దనకుఁ గలరని పొంగి దుర్యోధనుఁ డాయోధనముఁ గావించె. ఆసైన్యములనెల్లఁ దృణములఁ గాల్చునగ్నిమాడ్కి రూప

డఁగించి పరవీర్యోపజీవి యగునాధార్తరాష్ట్రాధిగమునిమనంబు గలగుండుపఱిచెద. దుర్యోధనహితార్థు లగుశకయవనమ్లేచ్ఛకాంభోజాదులతోడం బెద్దయుఁ బోరు నాకుఁ గాఁగలయది. నాతేరిపయి నానావిధదివ్యసాధనములం బెట్టింపవలయు. గుఱ్ఱములకు దగయు డప్పియుం దీఱఁదగినఖాణము మేపి నీళులఁ ద్రావించి తడ వితేర్చి మఱిపూన్పవలయు. ఎప్పటికంటె నేనుమడుంగు లెక్కవగా రథసన్నాహం బొనరింపవలయు. అనిన విని ధర్మరాజు తగువారల నప్పనుల నియోగించిన వారును సాత్యకిరథ్యములకు శల్యము లపనయించియు లెస్సకడిగియుఁ దగినఖా ణంబు మేపియు మదదీపకం బగురసవత్పానంబుఁ ద్రావించియుఁ దడవితేర్చియు రుక్మభూషణముల నలంకరించియుఁ దేరికిఁ బూన్చి కనకకేసరోల్లాసభాసురం బైనసింహధ్వజం బెత్తి నానాయుధములం బెట్టి రథము సవిశేషసన్నాహసమం చితంబుఁ గావించుటయు నంతలోన దారుకానుజుండు దానుం గృతస్నానుండై మదవత్పానంబుఁ ద్రావి నెగలెక్కి యుగ్యములపగ్గములం గొని కట్టాయితంబై యింద్రసారథి యగుమాతలిచాడ్పునఁ దేజరిల్లుచు మాధవానుజునకుం బొడ సూపె.

## సాత్యకి యర్జునకుఁ దోడ్పడఁబోవుట.

అంత సాత్యకియుఁ గృతస్నానుండై శుచియై విహితకౌతుకమంగళుండై స్నాతకు లయినబ్రాహ్మణోత్తములకు స్వర్ణనిష్కము లొసంగి యాలింగనపూర్వ కము లగుతదీయాశీర్వాదములం గ్రహించి కైలాతకనామకం బయినయుత్తమా సవంబుఁ ద్రావి మదవిహ్వాలలోహితలోచనుండై ద్విగుణీకృతతేజమునం జేసి జ్వలితజ్వలనుమాడ్కి వెలుంగుచుఁ బరమహర్షమునం బొదలి యుష్ణీషంబును గవచంబును ధరియించి వివిధాలంకరణముల నలంకృతుండై భూసురస్వస్త్యయ ననాదంబుల నాదరించుచు సూతమాగధస్తుతి పఠనరవములఁ జిత్తగించుచుఁ గన్ని య లిచ్చులాజచందనమాల్యాద్యుపచారముల కలరుచు యుధిష్ఠిరుచరణము లకుఁ గృతాంజలియై ప్రణమిల్లి యతండు చేదోయిం గ్రుచ్చి యెత్తి కౌగిటం జేర్చి శిరంబు మూర్కొని విజయవంతుఁడవై విజయునివిజయంబుఁ దెల్పుదు వనిన నతనివచనమునకు నెమ్మనమునం బొంగి తదనుజ్ఞాతుండై రథం బధిరోహిం చుటయు వాయువేగంబు లగునయ్యుత్తమాశ్వములు ప్రహర్షోత్కర్షభరితంబులై జైత్రం బయినయయ్యరదంబు వహించె. అట భీమసేనుఁడును సాత్యకియట్ల ధర్మరాజుచే మానితుండై రథారూఢుండై సాత్యకివెంట వచ్చుచుండ నమ్మాధ వానుజుం డతనిం జూచి పరమానందభరితుండై యిట్లనియె. భీమసేనా, నీవు నేల నాతోడ వచ్చెదవు? నిలిచి రాజునకుఁ గావలియై యుండుము. కాలపక్వం బగుకౌరవానీకంబు నేను భేదించి యర్జునుం జేరఁబోయెద. ఇప్పటికి నింకమీఁ

దటికిని రాజరక్షణంబె మనకుఁ బరమశ్రేయోమూలంబు. నావీర్యము నీవు లెస్స
యెఱుంగుదువుగావున నాకుఁ బ్రియము సేయం దలంపు గలదేని మఱలు మను
టయు వాయుసూనుండు సాత్యకీ, యేను రాజరక్షణమున జాగరూకుండనై
యుండెద. నీవు కార్యసిద్ధ్యర్థము గయమునం జను మనిన విని సాత్యకి భీమునకు
మఱియు నిట్లనియె. కౌంతేయా, నాకువిజయంబు ధ్రువంబు. నాగుణములఁ
దలఁచి నామాట విన్నవాఁడవుగావున నిదియె నాగెల్పునకు నిదర్శనంబు. మఱి
యుం బెక్కుశకునములు నావిజయంబు సూచించుచున్నవి. గాండీవి సైంధవుం
జంపినపదంపడి వడింబేర్చి వచ్చి నిన్నును ధర్మరాజును గౌఁగిలించికొనియెద నని
పలికి భీము ననిచి లేళ్లగమిం జూచుబెబ్బులితెఱంగున నాశినివీరుఁడు మనసైన్యం
బుఁ జూచిన వానిచూపునకే మనమూఁకలు సంచలించె.

అవ్విధమున సాత్యకి కిరీటికిఁ దోడ్పడం జనుటయు ధర్మరా జతనివెంటన
సేనలకుఁ జేయివీచి ద్రోణరథం బాఁగునెడ ధృష్టద్యుమ్నాదు లగుబిరుదుమగలు
రండు పోరుండు కొట్టుఁడు ముట్టుఁడు తఱుముఁడఱుముఁడని యెలుం గేర్పడం బ
లుకుచుఁ గూడముట్టుటయు మనవారు యుయుధానునరదం బడ్డగింపఁ బరమ
కోలాహలం బెసంగఁ గడంగినం గినిసి యయ్యదువీరుండు గండడరి సేనాగ్రంబు
న నేడుగురు మేటివిలుకాండ్రను నానాజనపదేశ్వరులను యమసదనంబున కనిచి
యేనుంగులను గుఱ్ఱములను దదారోహకులను రథరథ్యరథికసారథులను బదాతిగ
ణములను నొక్కొక్కబాణమునఁ బెక్కండ్రను బెక్కుబాణములనొక్కనిం గా నిర్మ
ర్యాదంబుగఁ జక్కాడిన నతనికోల్తల కోహటించి మనమూఁకలు వీఁక దఱిగి గోపా
లుఁడు వెలిచినపశుగణంబులట్లు వెఱచఱచి విచ్చి పఱచె. ఏమిచెప్పుదు నయ్యా
దువీరునివిక్రమంబునం జేసి యాసంగ్రామమున నెక్కడఁ జూచినను విఱిగినతేరు
లును బఱియలైనగొడుగులును గూలినపడగలును నుఱుమైనగిరీటంబులునుదునిసి
నవివిధాలంకరణాలంకృతవీరయోధబాహుదండంబులును దెగినపూర్ణేందువదన
బంధురకుండలలోల్లసితమస్తకంబులును గుప్పగూరలై పడినగజవాజిగాత్రంబులును
బొడిపొడి యైనపదాతికాయఖండంబులునై పరమఘోరంబయ్యె. అత్తెఱంగున
నభంగురప్రతాపదీపితుండై సాత్యకి యౌద్ధత్యమున మెఱసి కురుసేనలం దఱిమి
కొని పోవుచున్నంత నాచార్యుం డేచి యాఁగి మర్మభేదనకర్మఠంబు లగుతీవ్ర
నారాచముల నేనింటిని నిగుడించినం గోపించి యతండు గురునిపై నేడువాఁడి
యమ్ము లడరించె. అందుల కమర్షభరితుండై శరాసనగురుండు గుఱ్ఱముల నాలు
గమ్ములను సారథి నొక్కశరమునను నారథికుని నొక్కమార్గణమునను నొప్పించినం
గినిసి సాత్యకి సింహనాదంబుఁ గావించి యాచార్యునిపైఁ బటుప్రదరములఁ
బదింటిని నడరించి తోన నాఱింటిని నెనిమిదింటిని బదింటిని నొలిం బరఁగించి

యొక్కట సారథిని నాలుగింట గుఱ్ఱములను నొంచి తీవ్రశర మొక్కండు కేతనం బూఁగాడ నేసె. ఏసినం గోపదీపితుండై చాపాచార్యుండు పరమరయమున మిడు తలబారులంబోలెఁ గాండజాలంబులం గుప్పించి సాత్యకితేరు గప్పుటయు నప్పగి దిన యయ్యదువీరుఁడుం జేయుచున్నంత భారద్వాజుం డయ్యా, నీయాచార్యుఁడు నాతోడఁ బోరు మాని కాపురుషునట్లు నన్ను వలగొని క్రేడించి చనియె. నీవు నట్లుగాక పోరికిఁ గడంగుదేని ప్రాణములతోడఁ బోవనేర వనుటయు శినిప్రభుఁడు కార్యసాధనతత్పరుండై బ్రాహ్మణోత్తమా, ధర్మరాజుశాసనమున ధనంజయునొ ద్దకుఁ బోయెదఁ గావున నిచ్చటఁ గాలయాపనంబుఁ జేయంజనదు. నీకు స్వస్తి యగుంగాక. నాగురుం డరిగినతెరువున నేను నరిగెద. ఆచార్యులు నడిచినతెరు వు శిష్యులకు గ్రాహ్యంబుకాదె యని భారద్వాజునకుం జెప్పి యతనిం గ్రేడించి సారథిం జూచి యీబ్రాహ్మణుఁడు నన్నడ్డగింపఁగ సకలప్రయత్నములం జేయును. ఇచ్చట నితనితోడం బెద్దపోరాట వెట్టికొనిన మీఁదికార్యము సాధించుట దుష్క రము. అదె యవంతిసైన్యం బయ్యదియె దాక్షిణాత్యబలం బల్లదె బాహ్లికచ మూసమూహంబు. దానిచేరువన కర్ణునియనీకంబునుం గన్పట్టుచున్నది. ఆబల ములు నొక్కటొక్కటి బెరసికొని యుభేద్యప్రకారమున నిల్చియున్నయవి. వాని మధ్యమునఁ గర్ణునసీకమునకు సమ్ముఖముగ మనతేరు మధ్యమజవమ్మునఁ బోని మ్మనిన నతం డట్ల చేయుటయు మనసైన్యంబుఁ గనుపుకొట్టుచుఁ బాయలువడం జేయుచు నరుగుచుండె. అట్టియెడఁ గుంభసంభవుండు సాత్యకికోల్తలఁ జూచి యతనిం దాఁకువాఁడై వెంటఁ దవిలి వచ్చుచున్నంతఁ గృతవర్మ యాచార్యునకుఁ దలకడచి తాను సాత్యకిం దాఁకిన నమ్మాధవానుజుం డాభోజనాథునిపై నాఱునా రసములఁ బరఁగించి నాలుగమ్ముల గుఱ్ఱములం బిట్టేసి తోడన పదునాఱుతీవ్రాశు గముల నాకృతవర్మఱొమ్మునం గీలించుటయు రోషరూషితుండై హార్దిక్యుండు క్రూరాశీవిషంబునుంబోసియొక్క వెడందవాతియమ్ము సాత్యకిఱొమ్మున నేయుట యు నమ్మార్గణ మ్మతనిమైమఱువు వ్రచ్చి రుధిరార్ద్రంబై నేలంబడియె. అంత నిలువక యాభోజనాథుఁడు సాత్యకికార్ముకంబుఁ దునిమి స్తనాంతరమున దశవి శిఖముల నాటుటయుఁ గోపించి గోవిందునితమ్ముఁడు శక్తి యెత్తి కృతవర్మదక్షి ణభుజము నూనేసి తోన యొండుకోదండంబు సజ్యంబుఁ గావించి గొనయమ్ము మ్రోయించి శతసహస్రశరములఁ బరఁగించి రథముఁ గప్పి యొక్కతీవ్రభల్లము న సారథితలఁ దఱుగుటయు గుఱ్ఱములు తేరీడ్చికొని పఱచె. అందులకు సంభ్ర మముఁ జెందక కృతవర్మ రథచోదనంబుఁ జేయుచు ధనుష్పాణియై యందఱుం బొగడ శత్రువులు దలఁకఁగ ముహూర్తమాత్రము పోరుటయు సాత్యకి యత నిం గ్రేడించి కాంభోజసైన్యముఁ దఱిమె. కృతవర్మయు మఱలి భీముం దలప

డఁ బోవుచున్నంత నాచార్యుం డతనికి సారథి నేర్పఱిచి సేనాముఖరక్షణభార మతనిపయిం బెట్టి తాను సాత్యకి నడ్డగింపఁగఁ జనుచుండఁ బాండవవీరు లయ్యాచార్యుం బోనీక యాఁగిన నాచార్యకృతవర్మనాయకం బైనమనసైన్యమునకు భీమసేనధృష్టద్యుమ్నాది రక్షితం బైనపాండవసైన్యమునకును బోరు ఘోరం బై చెల్లె ననిన విని ధృతరాష్ట్రుఁడు సంజయున కిట్లనియె.

ధృతరాష్ట్రుఁడు సంజయునితోఁ దమవారిదైన్యముఁ జెప్పి వగచుట.

సంజయా, వీరభటపటలసలిలపరిపూరితము వాహనతరంగము గదాశక్తిశరప్రాసాదిసాధనవివిధమీనసంకులము ధ్వజభూషణమణిగణబంధురము ద్రోణగంభీరము హార్దిక్యమహాహ్రదము జలసంధమహాగ్రాహము రాధేయచంద్రోదయోద్ధతము గజగిరిసమంచితము నానాచమూనదీనీరంధ్రమునై మహార్ణవమున కెనవచ్చుమనసైన్యము ధనంజయసాత్యకివిక్రమమున నింకుచుండం బయ్యె. మనసైనికులలో నొక్కఁడేనియు నసంతుష్టుఁడు నసత్కృతుఁడు ననాహూతుఁడు నరక్షితుఁడు నమానితుఁడు నపరీక్షితుఁడు నవిక్రాంతుఁడు నప్రియవచనుఁడు నహితుఁడు నభృతుఁడు నప్రౌఢుఁడు నతరుణుఁడు నగుణుఁడు నసంగ్రామనిపుణుఁడు ననధిగతశస్త్రాస్త్రుఁడు నకృతజ్ఞుఁడు నబలుఁడు నధీరుఁడు నశూరుఁడు నకీర్తిమంతుఁడు నస్ఫూర్తిమంతుఁడు నకులీనుఁడునుం గాన రాఁడు. ఇట్లయ్యుఁ బాండవులం గెలువఁజాలరై రి. అర్జునుఁ డిందఱం గడచి సింధురాజుదెసకుఁ జనియె నేమిగాఁగలదో యని వగచుచుండ సాత్యకియు నందఱ నుక్కడంచి యభేద్యం బగునస్మదీయవ్యూహముఁ జొచ్చెనంటివి. ఇంతకంటె మనకు మఱియొందుదౌర్భాగ్యంబు గలుగునే? కౌరవు లందఱును మృత్యువాతఁ బడినవారలఁగాఁ దలంచెద. వారివిక్రమం బేలొకో నానాఁటఁ దఱుఁగుచున్నది. అర్జునునకుఁ గావలియై పోవుదునని సాత్యకి తఱలిన నప్పాండవునకొండె నాశినివీరునకొండె నించుకేనియు నాఁక గలుగదయ్యె. రక్షించువారికిని రక్షింపఁబడువారికిని నొక్కమార్గంబ యొడఁగూడె. ఇట్టిసంకటసమయంబు గూడినం గౌరవయోధు లేమి చేయం దలంచిరి? దుర్యోధనుఁడు నప్పటి కెయ్యది కర్తవ్యం బని యూహించె? గాండీవియు సాత్యకియు మనసేనలఁ జక్కాడుచుండుటయు వాసుదేవుఁడు పాండవకార్యము లొడంబడి చేయుటయు మనమూఁకలు వారిమొనసైన సలువనేరక పలాయనపరాయణులగుటయు వాగలమునుమునం బడిరేని యందఱు విరథులై యపగతవాహనులై విఫలవిక్రములై చేయునదిలేక తుదిఁ దదీయపటుప్రదరానలమున కాహుతియగుటయు సకలచతురంగబలములు వికలములగుటయు ద్రోణాదు లగుమేటివిలుకాండ్రను సరకుగొనక యర్జునసాత్యకులు గండడరుటయుం జూచి నాకొడుకులు వగవకుందురే? కిరీటిసాత్యకు లంతంతలు విక్రమంబు సేసి రని విన్న నాయుల్లంబు డిల్లంబో

యెడి. శినిప్రభుండు కృతవర్మం గడచిపోయినపదంపడి కౌరవు లేమిచేసిరి? పాంచాలపాండవులు ద్రోణునితోడఁ బోర సమకట్టిరిగదా. పాంచాలురపై నా చార్యునకుఁ బెద్దకాలముగోలె నెంతయుఁ గినుక గల్గియుండు. వారును ద్రో ణునిపై నెడపక పగపాటించినవారలు. వారిసమరం బెట్లుచెల్లె? సింధురాజవ ధోద్యోగి యైనసవ్యసాచి యామీఁద నేమిచేసె నంతయుఁ దేటపఱుపు మని యడిగిన యాంబికేయునకు సూతసూనుం డిట్లనియె.

భరతవర్యా, యీవ్యసనమెల్ల నీయపరాధమునఁ బుట్టినయదిగాని యొం డుగాదు. ప్రాకృతునిరీతిఁ గడచినదానికి వగచినం బ్రయోజనం బెయ్యది? తొ లుతనే మహాప్రాజ్ఞు లగువిదురాదులు నీపైఁ జెలిమి వాటించి పాండవులయెడ ననయము చేయఁదగ దని యెంతచెప్పినప్పుడు పెడచెవిం బెట్టితివి. హితకాము లగుసుహృదులమాటలు విననియతండు నీయట్ల కీడు మూఁడినచో వగచును. అంద ఱు బోధించుటయు నట్లుండె. సకలలోకపూజార్హుం డైనదాశార్హుం డది పనిగా నీయొద్ద కేతెంచి కౌరవులకును బాండవులకును శాంతిఁ గావించువాఁడై యెన్ని విధములం జెప్పిన నప్పరమేశ్వరువచనంబు పట్టక యమ్మహానుభావుమనసు నొప్పిం చితివి. సర్వలోకతత్త్వజ్ఞుం డైనయాజగన్నాథుఁడు నీనిర్గుణత్వంబును గొడుకుల మీఁది పక్షపాతంబును ధర్మమునెడ ద్వైధీభావమును బాండుపుత్రులమీఁది మాత్సర్యమును నంతర్గూఢం బయినకుటిలాభిప్రాయంబును బాండవులం గుఱించి వెలి కగపఱచునార్తప్రలాపములనుం దెలిసి సమరముఁ గావించె. ఆత్మానయ మున మూఁడినకీడును నేల దుర్యోధనుపయిం బెట్టెదవు? మొదలను దుదిని న డుమను నెన్నఁడైనం బదుగురు మెచ్చునట్లుగా నొక్కయుచితకృత్యముఁ జేసి యెఱుంగుదువే? ఇందులకెల్ల నీవే మూలంబు. కావున వగ పుడిగి దేవదానవ సమరసమం బయినకయ్యంపుఁదెఱంగు విను మని సంజయుం డాంబికేయున కిట్లనియె.

## కృతవర్మ పాండవులతోడఁబోరుట.

సత్యవిక్రముం డైనసాత్యకి ద్రోణకృతవర్ములం గడచి చనినపదంపడి భీ మసేనప్రముఖు లగుపాండవమహారథులు మనమూఁకల నఱిమి తఱుముచున్నంతఁ గృతవర్మ యొక్కరుండు తదీయసేనార్ణవమునకుఁ జెలియలికట్టయై నిలిచి చూచు ఖేచరులకు నద్భుతంబుఁ గావించుచుండ భీముఁడు మూఁడువాఁడియమ్ముల నతనిం బిట్టేసి తమవారికిఁ బ్రహర్షముఁగావించువాఁడై చిందము ద్రోయుచుటయుఁ దోన సహదేవుఁ డిరువదింటను ధర్మనందనుఁ డైదింటను నకులుఁడు నూఱిటను ద్రౌపదీపుత్రులు డెబ్బదిమూఁడింటను ఘటోత్కచుఁ డేడింటను ధృష్టద్యుమ్నుఁ డు మూఁడింటను విరాటద్రుపదులు ప్రత్యేక మైదింటను శిఖండి యేసింటనుఁ

దోడన యిరువదింటను దీవ్రసాయకముల నాకృతవర్మను నొప్పించినం గినిసియా
హార్దిక్యుఁడు వారల నందఱను వేఱువేఱ యైదేసి యాశుగముల నొంచి వృకోద
రు నేడింట నొనేసి తదీయకేతన కోదండములఁ దునిమి వడిం బేర్చి తోన దెబ్బ
దివాలమ్ముల ఱొమ్మున నాటుటయు గాఢవిద్ధుండై మారుతాత్మజుండు భూకంప
మునఁ బర్వతం బెట్టులట్టుల రథమధ్యమునం జలించి మూర్ఛిల్లినం జూచి ధర్మ
రాజప్రముఖు లందఱు నాభోజనాథుం జుట్టుముట్టి బహుళశరాసారంబుఁ బరఁగిం
చిరి. అంతలోనం దెలిసి బకాంతకుండు హేమదండ మగుఘోరశక్తిం గృతవ
ర్మతేరిపయిం బడ నెత్తి యేయుడు నది భీమభుజనిర్ముక్తంబై తోలూడ్చినపా
ముపగిదిఁ బరమదారుణంబై యుగవిగమ సమయానల శిఖాసమ ప్రభలు నిగుడఁ
దనపయిం బడ వచ్చుచున్నం జూచి కృతవర్మ శరద్వయమున దాని రెండుతుని
యలు చేయుటయుఁ గనక భూషణం బైనయాశక్తి గగనవిచ్యుతంబై పెన్గొఱ
వితెఱంగున దిక్తటంబులు వెలిఁగించుచు నేలం బడియె. తనశక్తి యట్లు హతం
బగుటకుఁ గోపించి వృకోదరుఁ డొండువిల్లెత్తి కృతవర్మస్తనాంతరమున నైదు
వాఁడితూపులు నాటుటయు నీదుర్మంత్రణంబునం బుట్టినయాసంగ్రామమున నా
హార్దిక్యుఁడు భీమబాణార్దితుండై నెత్తుటం జొత్తిల్లి కుసుమితరక్తాశోకంబు
కరణిం జూడనొప్పి నవ్వుచు బాణత్రయమున భీమాదు లగునద్దెసదొరల నం
దఱను నొనేసె. ఏసినం గినిసి వా రతనిపై వేర్వేఱ మూడేసిసాయకము ల
డరించినం జూచి కృతవర్మ వారలకు మాఱేసి యొక్కక్షురప్రమున శిఖం
డివిల్లు దునుముటయు నతండు వాలుం బలుకయుం గొని యతండేయున
మ్ముల శతచంద్రచిత్రితం బయినతనఖేటమున జడియుచుఁ గృపాణంబు విస
రివేయుటయు నది కృతవర్మనిచాపంబురోవంబును నఱికి యత్తునియలతోడ
గగనంబుఁ బాసినచుక్కరీతిఁ బుడమిం బడియె. అయ్యవసరమునఁ బాండవరథికు
లు రయమున శరజాలం బడరించి తన్ను బిట్టునొంచుటయుఁ గృతవర్మ కోపించి
వేఱుచాపంబుఁ గొని యమ్మహారథుల వేఱువేఱ మూడేసియాశుగముల నొనేసి
శిఖండి నెనిమిదితూపుల నొప్పించిన నప్పాంచాలపుత్రుండు వేఱువిల్లెత్తి కమఠ
నఖముఖంబు లగువిశిఖముల నాహృదికాత్మజునిం బిట్టేయుటయుఁ గోపదీపి
తుండై యాభోజేశ్వరుం డడరిన నాశాంతనవాంతకుండును గుంజరముపయిం
గవియుబెబ్బులిలీల మొఱసి కవిసిన దిగ్గజోపము లగునయ్యిరువురు మహారథులు
యుగాంతసమయభాస్కరమయూఖములం బోనినిజాశుగముల నొక్కళ్లొకళ్లపయి
నడరించుచు నెక్కువతక్కువలు లేక పోరుచున్నంత నేచి కృతవర్మ దెబ్బదిమూ
డువాలమ్ములను దోడన యేఁడువాఁడితూపులనుం గుప్పించుటయు నప్పాంచాలరా
జకుమారుం డెంతయు నొచ్చిమూర్ఛిల్లి తేరిపయిఁ జదికిలం బడుటయు మనవారు

కృతవర్మను బ్రశంసించుచుఁ బరమసంతోషమున నుత్తరీయాంచలముల విదిర్చిరి. తదవస్థుం డైనశిఖండిం జూచి సారథి తేరు దొలఁగించె. పొగలేనియగ్నిపోలె వెలుంగుచున్నకృతవర్మకోల్తలల కోహటించి పాండవవీరులు విముఖులై స్థైర్యం బు దొఱఁగియు శౌర్యము తఱఁగియు ధృతిదూలియు సిగ్గుమాలియు నలుదెసలం బఱచుచున్నంత నయ్యార్తనాదంబులు విని ఆదవ్వులం జూచి సాత్యకి క్రమ్మఱి కృతవర్మను దాఁకి యతనిశరములఁ బ్రతిశరములఁ బొడవడంగించి యతనిపయి నొక్కనిశితభల్లముఁ బరఁగించి శరచతుష్టయమున హయచతుష్టయము బిలుకు మార్చి యొక్కభల్లమున విల్లు దునిమి శాతమార్గణముల సారథినిఁ జక్రరక్షకు లనుం బరిమార్చి యలుగులసోనఁ గురిసి భోజానీకంబుఁ జిక్కువఱచి రథాశ్వగజ పదాతిసంపూర్ణం బైనభవదీయసైన్యంబుఁ గనుంగొని సారథిం బిలిచి ద్రోణానీ కమునకు డాపట నల్లదె రుక్మరథగుప్తం బైనగజసైన్యము గానంబడుచున్నది. అందలివీరులు మేటివిలుకాండ్రు, దుర్యోధనునిపంపునం జేసి ప్రాణములమీఁది యాశ విడిచి నన్ను మార్కొననున్నవారు. భారద్వాజుండు సూచుచుండఁగ నాతిర గర్తయోధులం జక్కపెట్టెద. మెల్లన మనయరదం బచ్చటికిఁ బఱపు మనుటయు సారథి యట్లు చేయఁగఁ గుందేందుధవళంబు లగునయ్యుత్తమరథ్యము లాదిత్యవర్ణ మగునాస్యందనము నగ్గజానీకముచెంగటికిం గొంపోయె. అంత నాశూరులు మదవారణంబులతోడ నతనిం జుట్టుముట్టి తద్గమనవారణంబొనర్చుటయుఁ గిను కవొడమ సాత్యకి వాలంపతుంపరం బరఁగించి యారోహకుల డొల్లించియుఁ గుంభస్థలముల వ్రచ్చియు దంతములఁ దునిమియు ఘంటలఁ బగులనడఁచియుఁ గర్ణ ములఁ గోసియుఁ గుత్తుకలఁ దఱిగియు నెత్తురు లురులించియు భీభత్సంబు చేసిన హతశేషు లగుకొన్నియేనుంగులు మూత్రపురీషము లొనరించి జిట్టునం దిరిగి పఱ చియు వెఱచఱచియుఁ దిరుగుడువడియుఁగలగుండుపడియుఁదొట్రుపడియు నొచ్చి యువిచ్చియు నానాప్రకారంబులయ్యె.

**సాత్యకి జలసంధుం జంపుట.**

అట్టియెడ మాగధుం డైనజలసంధుం డనురాజు కనకకేయూరకుండలకిరీ టసముజ్జ్వలుండును నిష్కకంఠసూత్రభాసురవక్షస్థలుండును దపనీయమాలికా ధరుండును భర్మకార్ముకకరుండును హాటకకవచబంధురుండునునై గజోపరివిమాన మారోహించి గర్వదుర్వారుండై సాత్యకిపయిం దనయేనుఁగుఁ బురికొల్పి బహు ళశిలీముఖములఁ బరఁగించి యొక్కనిశితపీతభల్ల మాయదువర్యునిఱొమ్మున నాటి వేఱొక్కవాలమ్మునఁ జాపమ్ముఁ దునిమి నవ్వుచుఁ దోన నైదువాఁడితూపు లడరిం చినం జలింపక మాధవానుజుండు సంభ్రమమున నొండువి ల్లెత్తి నిలునిలు మని

యదల్చి యమ్మాగధు నురమ్మున నఱువదివాలమ్ములం గ్రుచ్చి శాతక్షురప్రమున విల్లు ముష్టికిఁ ద్రుంచిన నాజలసంధుఁడు ఘోరతోమరము విసరివైచుటయు నది శ్వసనాశనంబువోలె నిశ్శ్వసించుచు వచ్చి శిసివీరునివామభుజముఁ దాఁకి ధరణిం బడియె. అందులకుఁ గినుక వొడమి సాత్యకి ముప్పదియమ్ముల జలసంధుని నొంచె నేయుటయు నాతండు కరవాలమ్మును శరవారణంబును గొని శినిప్రభుప్రదరములఁ బలుకం జడియుచు ఖడ్గము విసరివైచిన నవ్వాలు యదువర్యుని విల్లు నడిమికిఁ ద్రుంచి కొఱవితెఱంగున నేలం బడియు వెలింగె. అంత దనుజాంతకానుజుండు సాలస్కంధప్రతీకాశ మింద్రాశనిస్వనము సర్వగాత్రనిర్భేదనోగ్రము నగునెం డుచాపంబుఁ గొని గొనయమ్ము సారించి రెండువాలమ్ముల నాజలసంధునిభుజములు రెండును నఱికినం బరిఘప్రాంశు లగునాబాహువులు కొండనుండి పడునైదుపడ గలపాములచందమునం బడియె. అంత నిలువక సాత్యకి నవ్వుచు మూఁడవవాఁడి యమ్మునఁ జారుకుండలమండితంబు దంష్ట్రాకరాళంబు నగుతన్మస్తకంబునుం దఱు గుటయుఁ దదీయకబంధము సింధురంబుపయి నెత్తురువఱ్ఱు గావించి నేలం బడియె. తోడన మురారితమ్ముఁడు గజోపరివిమానంబునుం ద్రెల్లించిన నగ్గజంబు సాత్యకి శరార్దితంబై ఘోర మగునార్తనాదము సేయుచు మనమూఁకలన కాల్లం జము రుచు వెఱచి పఱచిన హాహాకారం బెసంగె. జలసంధునిచావు సూచి మనవారు సాహసంబును నుత్సాహంబునుం ద్యజించి సాత్యకియెదుర నిలువనోడి తోఁచి నట్లు పాఱిరి.

అయ్యెడరు చూచి సాత్యకిని నిలువరించువాఁడై యాచార్యుఁడు దొద వ్వున నుండియు రయమున నేతెంచుచున్నంత నీకొడుకులు దుర్మర్షదుస్సహదు ర్ముఖదుశ్శాసనవికర్ణచిత్రసేనులు దుర్యోధనపురస్సరులై యాచార్యుం గూడుకొని సాత్యకిం బొదివి యాచార్యుండు డెబ్బదియేడువాలమ్ములను దుర్మర్షణుఁడు ద్వాద శశరములను దుస్సహుఁడు దశవిశిఖములను వికర్ణుఁడు త్రింశదాశుగంబులను దుర్ముఖుఁడు దశసాయకంబులను దుశ్శాసనుఁ డష్టవిశిఖములను జిత్రసేనుఁ డిషు ద్వయమును దుర్యోధనుఁ డపరిమితశరజాలమును నతనిస్తనాంతరమును సవ్యపా ర్శ్వమునుం బిట్టేసిన నందఱుఁ దన్నొక్కనిం గవియుటకుఁ దలంకక యమ్మహార థుఁడు భారద్వాజుని మూఁడింటను దుస్సహునిఁ దొమ్మిదింటను వికర్ణు నిరువదే నింటను జిత్రసేను నేడింటను దుర్మర్షణుం బంద్రెంటను నప్పటికి సన్నిహితు లగు వివింశతిసత్యవ్రతవిజయుల నెనిమిదింటను దొమ్మిదింటను బదింటను దుశ్శాసనుం బెక్కమ్ములను నొంచి రారాజున కభిముఖుండై యందఱు సూచుచుండఁ బోరికిఁ గడంగిన నతండు నుక్కుమిగిలి తాఁకుటయు నయ్యిద్దఱిపోరు జ్యాకర్షణశరసంధా నమోక్షణాదులం దుల్యరూపం బని యందఱును బొగడఁగఁ బోయి పరస్పరశర

ప్రహారముల రక్తసంసిక్తగాత్రులై సాత్యకియు దుర్యోధనుండును నిజరసార్ద్రిరక్తచందనమహీరుహముచందమునను బసిండిజలపోతం జెలంగుయూపస్తంభము విధమునను బొలిచిరి. అంతఁ గొండొకవడికి మురారితమ్ముఁడేచి నవ్వుచు నవలీలం గురురాజువిల్లు దునిమి తదీయసర్వాంగముల నంపగముల నించినం గోపించి వైరివిజయంబు సైరింపక గాంధారేయుండు హాటకచిత్రం బయినవేఁఱువిల్లెత్తి సాత్యకిపై శరశతంబు నిగుడించిన నమర్షవశుండై యయ్యాదువీరుఁడు బహుళశరజాలముల దుర్యోధనుని నొప్పించె. తమయన్న యలజడిఁబడుటం జూచి తక్కటినీకొడుకులు క్రూరశరనికరముల సాత్యకిం గప్పుటయు నతండు వారల వేఱువేఱ యైదేసియమ్ములఁ బీడించి తోన యేడేసివాఁడితూపుల నొంచి వడిం బేర్చి యెనిమిదియమ్ముల దుర్యోధను నొనేసి నవ్వుచు నరాతిభీకరం బయినతదీయశరాసనముఁ దునిమి మణిమయనాగకేతనము ధరణిపయిం బడఁ గూల్చి శరచతుష్టయమునఁ దురగచతుష్టయమునుం జంపి నిశితక్షురప్రమున సారథితలఁ ద్రెవ్వనేసి మర్మము సింపఁజాలినబహుళశరముల వెండియుఁ గురుమండలపతిపయిం గురియుచుండ నెంతయు నొచ్చి యతండు తమ్ముఁడగుచిత్రసేనునితేరెక్కినం జూచి మనవారు రాహుగ్రస్తుండైనచంద్రునిచందమున సాత్యకిగ్రస్తుండై యేపఱియె దుర్యోధనుం డని హాహాకారములు గావించిరి.

సాత్యకి కృతవర్మ నోడించుట.

ఆకలంకలం బాకర్ణించి కృతవర్మ సాత్యకిం బొదువవలయుఁ బదపద పొమ్మపొమ్మని సారథికిఁ జెప్పి ధనుష్టంకారముఁ గావించుచుఁ బరమరయమున నేతెంచుచున్నం జూచి శినిప్రభుఁడు రథచోదకుం బిలిచి సారథీ, యల్లవాఁడె హార్దిక్యుఁడు నోరు దెఱచికొన్నమృత్యువువోలె రభసోద్రేకియై వచ్చుచున్నవాఁడు. మనతేరు వాని కభిముఖముగాఁ గావింపు మనుచున్నంత నతండెయిద నయ్యిద్దఱును బెబ్బులులరీతి నొకళ్లొకళ్లం దాఁకిరి. అంతఁ గృతవర్మ శైనేయుపై నిరువదియాఱుసాయకము లడరించి తత్సారథిపైఁ బంచాశుగములను రథ్యములపయిం గాండచతుష్టయమునుం బరఁగించి రుక్మపృష్ఠంబై నతనవింటినారి సారించి యంపతుంపరం గురియుటయు శినివీరుఁడు ధనంజయుం జూడ నరుగవలయు ననుతలంపునఁ బరమజవమున నెనుబదియమ్ముల నాకృతవర్మగాత్రమునం గీలించి కంపింపఁజేసి యఱువదిమూఁడింట గుఱ్ఱములను నేడింట సారథిని నొంచి తోడన సువర్ణపుంఖ మగుతీవ్రవిశిఖము నరిఁబోసి బిట్టేయుటయు యమదండసన్నిభం బగు నాపటుప్రదరం బతనికవచముఁ జించి రక్తసిక్తంబై నేలంబడుటయుఁ గృతవర్మ నెత్తుటం జొత్తిల్లి సోలి శరశరాసనముల జాఱ విడిచి యరదమునుండి మోఁకాళులు నేలఁ దాఁకఁగఁ బడియె. మహేంద్రసదృశవిక్రమోజ్జ్వలుఁడు సాగరము

వ్రాలె నక్షోభ్యుఁడు నగుకృతవర్మను నోడించి సాత్యకి యసురసంహారోద్యతుం డై నపురుహూతునిచందమున వీఁకమెఱసి మనమూఁకిలఁజక్కాడుచు నర్జునుం జేరఁ జనియె. కృతవర్మయుఁ గొండొకవడికిఁ దెలిసి యూఱడిల్లి తేరెక్కి ధనుష్పాణియై పాండవయోధులతోడఁ బోరుచుండె.

### సాత్యకి ద్రోణాచార్యుని గెలుచుట.

ఇవ్విధమున శైనేయబలార్దితంబు లయినమనమూఁకలం జూచి యాచార్యుఁడు రయమున నేతెంచి సాత్యకిం దాఁకి బహుళశరవ్రాతములఁ బరఁగించిన బలివాసవులకుఁబోలె నయ్యిద్దఱకుఁ బరమతుములం బై నసమరంబు సెల్లె. అందు ద్రోణుఁడు గండడరి క్రూరపన్నగోపమము లగుమూఁడువాఁడికోలల సాత్యకిఫాలభాగమున నాటుటయు నతండు త్రికూటపర్వతంబుచాడ్పునం జూడనొప్పి ద్రోణకార్ముకనిర్ముక్తంబు లగుమార్గణంబులనెల్ల రెంటరెంటఁ దునుముచుండినం గనుంగొని కుంభసంభవుండు నవ్వుచు నతనిహస్తలాఘవంబు మెచ్చి యాసాత్యకిపయిం ద్రింశద్బాణంబులను దోడన యేఁబదితూపులనుం బరఁగించిన నయ్యాదువీరుఁడు బహుళశరముల నగ్గురునిపై నడరించుచుండె. అయ్యిద్దఱవిండ్లనుండి బలుతూపులు వల్మీకముల వెలువడుక్రూరపన్నగములచందమున నతిరయమున వచ్చుచుండ వారికరలాఘవంబును విలువిద్యనేర్పును జూచుఖేచరులకు మెచ్చుఁ గావించె. అట్టియెడ సాత్యకి కినుక వెడమి యేచి తొమ్మిదియమ్ముల గురునిమేనం గీలించి శరశతమున సారథిని నొప్పించి బలుతూపులఁ గేతనం బూఁగాడ నేసిన సాత్యకిలాఘవముఁ జూచి యాచార్యుండు డెబ్బదింటఁ దత్సారథిని నూనేసి మూడేసి యమ్ములఁ దురగముల నొప్పించి యొక్కవాలమ్మునఁ గేతనముఁ దునిమి వేఱొక్క నిశితభల్లమునఁ గార్ముకంబు నడిమికి నఱకుటయు సాత్యకి యలిగి గదయెత్తి విసరివైచుటయు గురుండు దనపయిం బడవచ్చుచున్నయగ్గదను బలుతూపుల నుగ్గుచేసె. అంత నొండువిల్లు గొని శినిప్రభుండు వాలంపగముల గురుం బిట్టేసి సింహనాదముఁ గావించిన నది సైరింపక శరాసనగురుండు రుక్మదండం బగుఘోరశక్తిని సాత్యకితేరిపయిం బడనేయుటయు నదిసాత్యకిం దాఁకక తే రగిలించి ఘోరస్వనమునఁ బుడమిం బడియె. అట్టియెడ శినిపౌత్రుఁ డాచార్యునిదక్షిణభుజ మొక్కయమ్మునఁ గాఁడోవ నేయుడు ద్రోణుఁడును మాధవానుజుకోదండ మర్ధచంద్రశరమునఁ దునిమి సారథిని శక్తిం దూలనేయుడు సాత్యకిసారథి శక్తివిద్ధుండై మూర్ఛిల్లినం జూచి చలింపక యయ్యాదువీరుఁడు తాన రథచోదనం బొనర్చుచు శరశతం బాచార్యునిమేనం గీలించె. అందుల కలిగి గురుండు తీవ్రశరముల నేనింటిం బిట్టేసిన నవి సాత్యకిమైమఱువు వ్రచ్చి నెత్తురు లురులించినం గాఢవిద్ధుండై శైనేయుఁ డత్యంతక్రుద్ధుండై యొక్కవాలమ్మున ద్రోణసారథిం బరి

మార్చి బలుతూపుల గుఱ్ఱములపై నేయుటయు నవి వివిధమండలగతులఁ జేయుచు సూర్యమండలమువ్రాలె వెలుంగుచున్నతే రీక్షించుకొని సేనాముఖమునకుఁ బఱచుచున్నంత నీకొడుకు లాచార్యుగుఱ్ఱములం బట్టుఁడు నిలువుఁ డని యెలుం గెత్తి డం జెప్పుచుఁ దోన యరిగిన మనమూఁకలు వికలంబు లయ్యె. ఆచార్యుం డక్కడఁ బాంచాలపాండవబలములతాఁకునం జిక్కువడినకౌరవబలంబుఁ జూచి శినిప్రభు పయిం గవియుయత్నము మాని సేనాగ్రరక్షణపరుండై యుగవిగమసమయసూర్యునిచాడ్పునఁ గ్రోధానలసందీపితుండై పాంచాలసైన్యములం గనుపుకొట్టుచుండె అత్తెఱంగున నాచార్యునిఁ గృతవర్మప్రముఖు లగుమహారథులనుం గెలిచి సాత్యకి ప్రహర్షహాసబంధురుండై సారథిం జూచి మనము నిమిత్తమాత్రంబకాని యీ యున్నయోధులు కేశవుక్రోధవీక్షణంబునను గాండీవిశరజాలమునను హతప్రాయులై చేవ చెడి యున్నవా రని పలుకుచు శరాసారంబుఁ గురియుచు మనసైన్యములు పాయలువడం దీర్చుచు విన్వచ్చుపొంతకుఁ బోవుచుండ నామినమునీఁదియాసం బఱచుడేగచాడ్పున నప్రతిహతప్రచారుం డై నయాశినిప్రభుం దలపడి నిలువరింప మనవారు సాలరైరి.

## సాత్యకి సుదర్శనుం డనురాజును జంపుట.

మేఘావరణంబుఁ బాసినభానుమంతునిచాడ్పునఁ దీవ్రపరితాపాతపంబు గాయుచున్నయాశినివీరుని సురేంద్రుపరాక్రముం జూచి రోషభరితుండై సుదర్శనుం డనురాజు కనకకవచధారియు శరాసనపాణియునై రయమున నడ్డగించి శరజాలం బడరించిన నాసాత్యకిసుదర్శనులకు వృత్రవాసవు లెట్టులట్టుల యుభయ సైనికస్తోత్రపాత్రంబైన ఘోరసంగ్రామంబు సెల్లె. అప్పుడు సుదర్శనుం డేచి సాత్యకిపయి నిశితశరములఁ బరఁగించిన నాసాత్వతప్రవరుండు వాని నడుమన తుమురుసేసి ప్రతిశరములఁ బెక్కు లేయుటయు నతండును వానినెల్ల రెండుమూఁడుతునియలు గావించి కోపించి యాకర్ణపూర్ణము లగునగ్నికల్పబాణము లనేకములఁ బ్రయోగించి సాత్యకిగాత్రంబు రక్తసిక్తంబుఁ గావించి నాలుగింట గుఱ్ఱముల నొనేసె. అందులకుఁ గడుం గినిసి శినిప్రభుఁడు మహేంద్రవిక్రమబంధురుండై యాసుదర్శనురథ్యముల నాల్గింటినిం జంపి యార్చిపేర్చి నిశితభల్లమున సారథితల నఱికి యొకవాలమ్మున గుండలమండితంబు పూర్ణేందుసుందరవదనసముల్లసితంబు నగునాసుదర్శనుమస్తకంబుఁ దునిమి బలాసురసంహారముదితుం డైన పురందరునిచందమునఁ దేజరిల్లుచు సకలలోకములకు విస్మయం బాపాదించుచుఁ గానలంబు దరికొనుదవానలంబుచాడ్పున మనసేనల నీఱుసేయుచు నరుగుచుసారథి కిట్లనియె.

దారుకానుజా, రథాశ్వనాగసంకులంబు నానాయుధమర్ధ్యంబు శూరలో కగుప్తంబునై మహార్ణవముం గ్రేణిసేయుద్రోణానీకముఁ గడచితిమి. ఇఁక మిగిలియున్నయనీకంబెల్ల నల్పసలిలంబయిననదిరీతిం జులకన దాఁటవచ్చును. ద్రోణహార్దిక్యులం గెలిచినపదంపడి యర్జునుం జేరితి ననియే తలంచితి. ఎండినపూరిప్రోవుం జూచినదీప్తానలంబువొలె నీకురుసైన్యంబుఁ జూచి నాకుల్లాసంబకాని సంత్రాసం బింతయేనియుఁ దోపదయ్యె. గజవాజిపదాతులపీనుంగులను దుత్తుమురైనతేపలప్రోవులను మిట్టుపల్లం బయినయీతెరువు చూడ గాండీవి చనినత్రోవ యిదియ యని తోఁచెడి. అల్లదె యక్కడ కౌరవసైన్యంబు నలుదెసల విఱిగిపఱచుచున్నది. అదె కెంధూళి మింటిదాఁక నెగయుచున్నది. గాండివజ్యాఘోషమును వీతెంచుచున్నది. కృష్ణసారథి యగుసవ్యసాచి యిచ్చటికిఁ గడుం జేరువన యుండవలయు. శుభనిమిత్తములం జూడ నేఁడు ప్రొద్దు గ్రుంకకమున్న మనగాండీవి సింధురాజుం దెగటార్చు నని తలంచెద. వారె దృఢతనుత్రాణు లగుకాంభోజులును వివిధాయుధపాణు లయినశకకిరాతదరదబర్బరతామ్రలిప్తకు లనుముండార్ధముండాదినానాప్రకారు లయినమ్లేచ్ఛయవనులును దుర్యోధనపురస్సరులై నన్నుఁ బ్రతీక్షించుచున్నవారు. మనయరదము మెల్లన వారి కభిముఖముగఁ బోనిమ్ము. తదీయసైన్యసాగరంబు దాఁటితి నని నిశ్చయింపుము. తత్తఱపడం బనిలే దనినసాత్యకికి సారథి యిట్లనియె. సత్యవిక్రమా, క్రోధసముద్రేకమున జామదగ్న్యరాముఁడును భారద్వాజుఁడును శారద్వంతుండును మద్రేశ్వరుండును నెదుర నిల్చిరేనియు నీప్రాపు గాంచిననాకు సంభ్రమము గలుగనేరదు. శకయవనకిరాతకాంభోజదరద బర్బరమ్లేచ్ఛాదులం బెక్కండ్ర నింతకు మున్న నీవు పిలుకుమార్చుట నే నెఱుంగనే? అప్పు డెల్ల నాకుఁ దత్తఱపాటు గలుగ నీవు చూచితివే? ఇఁక గోష్పదప్రాయ మైనయీసైన్యమునకు సంభ్రమింతునే? ఏత్రోవన ధనంజయుం జేర్చెద? ఎవ్వరిమెడ నీవు కినిసెదవు? ఎవ్వరికి మృత్యు వాసన్నం బయ్యె? ఇపు డెవ్వారల యమపురమున కనుపఁగఁ జిత్తమునం దలపోయుదువు? కాలాంతకయమసముఁడై ననిన్నుఁ జూచి యెవ్వరు పాఱవలయు? వైవస్వతయముఁ డేవారల నిప్పుడు దలఁపునకుఁ దెచ్చియున్నవాఁడో యనిన సూతునకు శినివీరుండు వెండియు నిట్లనియె. వాసవుఁడు దానవులంబోలె నెప్పుడుఁ గాంభోజముండులం జంపఁగఁ దలంచెద. అచ్చటికిఁ దేరు పఱపుము. ముండానీకంబునెల్లం బరిమార్చినం గౌరవసైన్యం... దైన్యంబుఁ జెంది విఱిగి పఱచినం జూచి దుర్యోధనుఁడు వగలం బొగులఁగలఁడు. మఱియు నేను గ్రోధావేగదుర్దాంతుఁడనై యలాతచక్రముంబోలె మండలీకృతకోదండమున సాయకాసారంబుఁ గురియుచు సవ్యసాచి నేర్పినధనుర్విద్యాచాతు

ర్యంబు లెస్స చూపుచున్నం జూచి యామన్సుయోధనుఁ డిద్దఱ నర్జునుంగాఁ దలంచు చుఁ దలఁకుచుండ నేఁడు పాండవులయెడం గలభక్తిస్నేహములం జూపఁగఁ గౌర వులందఱు మదీయవీర్యశౌర్యకృతజ్ఞత్వములం గొనియాడుదు రనిన విని సారథి శరచ్చంద్రచంద్రికాధవళంబు లగురథ్యములఁ దోలి తేరు యవనానీకముఁ దఱి యం జొనుపుటయు యవనులు హస్తలాఘవము మెఱయ సాత్యకిపైఁ బటుశ రాసారముఁ బరఁగించిరి. అంత నయ్యదువీరుఁడు గొనయమ్ము సారించి సాయక జాలంబుఁ గురియించి యామ్లేచ్ఛులతలలు చేతులు గాళులు డొక్కలు ప్రక్కలు కాంస్యకవచంబులునుం దుత్తుమురుసేసి యొక్కొకయమ్మున నేవుర నాలుగుర నె నమండ్రుగురనుగా నిర్మర్యాదముగ నేటాడి నెత్తురుటేఱు పాఱించిన నెక్కడఁ జూచినను ముండమస్తకము లీఁకలు వెఱికినయాండజములచందమున ఘోరంబై యుండ హతశేషు లమ్మహారథునెదుర నిలువనోడి పార్ష్ణికశాఘాతముల వాహన ములఁ దోలుకొనుచు నుత్తమజవమున విఱిగి పఱచిరి. సాత్యకిపరాక్రమమును సిద్ధచారణగంధర్వప్రముఖులు ప్రశంసించిరి.

## సాత్యకి ధార్తరాష్ట్రుల గెలుచుట.

అవ్విధమున ద్రోణానీకమును గృతవర్మసైన్యమునుం గడచి జలసంధుం బరిమార్చి సుదర్శనుం దెగటార్చి మ్లేచ్ఛయవనసైన్యముల జయించి నభోమండల మున నెక్కసూర్యుఁ డుండఁగ భూమి కతండు లేనిం గలకొఱఁత వారింపంబోలె నత్యంతతీవ్రప్రతాపాతపంబు గాయుచు నితండు రెండవసూర్యుం డనుతలంపు స ర్వజనులకుం బుట్టించి మనమూఁకలనడుమ గోగణంబుల లోనియాఁబోతుచాడ్పు నను గరేణుయూధమధ్యమందలిమత్తసింధురముచందముననుం జూడనొప్పి లేళ్ల పయిం గవియుబెబ్బులికరణిఁ గురుబలంబులం గపిసి చించి చెండాడుచుంటం జూచి కృతవర్మమకరముక్తుండై నసాత్యకిద్విరదంబుఁ దడయక పొదివి యడ్డగింపవలయు నని తమలో నెంచి దుర్యోధనదుశ్శాసనచిత్రసేనదుస్సహదుర్ధర్షణక్రథశకునులు పెక్కండ్రు రథికవరులతోడ నతనివెన్నంటి యతివేగమున వచ్చుచున్నంత మా రుతోద్ధూతపర్వకాలసాగరమున కెనవచ్చునక్కోలాహలం బాకర్ణించి సాత్యకి సారథి కిట్లనియె. అదె వెనుకటిదెస ధార్తరాష్ట్రబలము నన్నుఁ బొదువఁగ రథనేమినిస్వనంబునను శంఖారవంబునను సింహనాదమునను సాటోపవచనము లను రోదసీకుహరంబు నించుచు నర్ణవంబుల ఘూర్ణిల్లఁజేయుచు నేతెంచుచు న్నది. పున్నమనాఁ డుప్పొంగినసముద్రమునకు వేలయట్లు లట్టుల యాబలము నకు నేను నిరోధకుఁడనై నిలిచెద. మెల్లన యరదంబుఁ బో నిమ్మని నవ్వుచుఁ జెప్పుచున్నంత నాయోధులు పట్టుము గిట్టుము పొదువుము నిలువరింపుము చూ

డుము చూడు మని పలుకుచు వడిం బేర్చి యయ్యదువీరు నాఁగినం గినిసి య
తండు శరనికరంబుఁ బరఁగించి మున్నూఱుగుఱ్ఱములను నన్నూఱేనుంగులనుం
బరిమార్చి వీరభటులఁ బెక్కండ్రం బొరివుచ్చినం బరమతుములం బయ్యె. ఏమి
చెప్పుదు సాత్యకిబాణ మొక్కటేనియు వృథపోక యొక్కని నిద్దఱిని ముగ్గురిని
నలుగురను నేగురనుం గిట్టి చంపుచుండె. మహార్ణవతుల్యం బయినమనసైన్యంబు
సాత్యకి యనుచెలియలికట్టం గడవనేరక వలిపట్టినయాలగుంపుచందమునఁ దిరు
గుడువడియు వెఱఁగుపడియు ఱిచ్చవడియు నత్యంతవికలం బయ్యె. అర్జునసమ
రంబును సాత్యకిసంగ్రామంబుభంగి నంతభీకరంబు గాదయ్యె. అట్లు భయ మిం
తయు లేక హస్తలాఘవము మెఱయ నర్జునుకంటెఁ బెక్కుమడుంగు లెక్కుడగు
బీరంపుఁబెంపు పొంపిరివోవ సాత్యకి సంగరము సేయుచుండ దుర్యోధనుఁడు
తత్సారథిపై మూడుబాణములను శితశరముల నాలుగింట నాలుగుగుఱ్ఱములను
నొనేయుడు దుశ్శాసనుఁడు షోడశవిశిఖంబులను శకుని పంచవింశతిశరంబులను
జిత్రసేనుఁడు పంచాశుగములను నయ్యదువీరుమేనం గీలించినఁ దోన దుస్సహుఁ
డష్టమహారథునురమ్మునఁ బంచసాయకముల నాటె. వారియమ్ముల సరకుసేయక
మురారితమ్ముఁడు వారలనందఱను వేఱువేఱ మూఁడేసివాలమ్ముల నొప్పించి సాబ
లునివిల్లు దునిమి తోడన దుర్యోధనుస్తనాంతరము మూఁడింటను జిత్రసేనుని
నూఱింటను దుస్సహునిఁ బదింటను దుశ్శాసను నిరువదింటను నెంతయు నొంచె.
అంతలోన నీమఱంది శకుని యొండువిల్లెత్తి సాత్యకి నెనిమిదింటను వెండియు
నేనింటనుం బిట్టేయుటయు దుశ్శాసనుఁడు పదియమ్ములను దుస్సహుఁడు మూడు
శరములను దుర్ముఖుఁడు పండ్రెండుకాండములను దుర్యోధనుఁడు డెబ్బదిమూడు
సాయకంబులను నతనిం బిట్టేసిరి. మఱియు దుర్యోధనుఁడు తోన మూఁడువా
లమ్ములఁ దత్సారథిని నొవ్వనేసె. అందుల కలిగి మాధవానుజుండు వారలనంద
ఱను వేఱువేఱ నైదేసిబాణముల నొప్పించి యొక్కతీవ్రభల్లమున దుర్యోధనసా
రథిం గూల్చిన వాయువేగము లగునయ్యశ్వములు తొలంగి చనుటయు సైనికు
లందఱును విఱిగి నలుదెసలం బాఱిరి. అవ్విధమున సాత్యకి తన్ను మార్కొన్న
వారల నందఱనుం గెలిచి తన్నుసారథిని గుఱ్ఱములనుం గాచికొనుచు మహారథుఁ
డనం బొగడ్త కెక్కి యర్జునునొద్దకుఁ జనుచుండె ననిన విని ధృతరాష్ట్రుఁడు సంజ
యున కిట్లనియె.

## ధృతరాష్ట్రుఁడు చింతించుట.

సంజయా, సాత్యకి మనమూఁకలఁ బిలుకుమార్చి యరుగుచున్నం జూచి
సిగ్గుమాలిననాకొడుకులు పదంపడి యేమిచేసిరి ? సవ్యసాచిసదృశుం డైన యాశి
నివీరునెదురం బడి చావనున్న వారికి ధృతి కలుగనేర్చునే ? యుద్ధపరాజితు లయి

నరాజులు విఱుగుటయకా చనిరే? ఎవ్వరయినను క్షాత్రధర్మంబుఁ దలపోసి క్రి
ష్మఱ నురువడించిరే? నాకొడుకు లందఱు బ్రదికియుండఁగనె సాత్యకి యెట్లు
తనయిచ్చమైఁ జనంజాలె? ఆసాత్యకి యొక్కండు మనవారలఁ బెక్కండ్రఁ ద్రుంచి
యు నొంచియు నొప్పియింతయుఁ దా నెఱుంగక చనియె నని నీవు చెప్పఁగ విన్న
నాకుఁ బరమాశ్చర్యం బయ్యెడి. ఇంకేమి యనం బనిలేదు. నాకొడుకులయెడ
దైవము ప్రతికూల మయ్యె నని తలంచెద. పాండవులయందఱిమాట యట్లుండె.
ఒక్కసాత్యకిని నిలువరించి నిర్జింప నిందఱుఁ జాలరైరి. ద్రోణకృతవర్మాదులం
గెలిచినయయ్యదువీరుఁడు కొదమసింగము పసులంబోలె నాకొడుకులం జూచుఁ
గాని యెండు గలుగునే. అర్జునుండు నిట్టికయ్యము చేయఁడయ్యె ననినయాంబి
కేయునకు సంజయుండు రాజేంద్రా, నీదుర్మంత్రణంబునను దుర్యోధనునపచా
రంబుననుం బుట్టినకీడు వినకుండ నెట్లు దప్పించుకొనవచ్చును? వగ పుడిగి కయ్యం
బుతెఱంగు వినుమని యిట్లనియె.

అంత దుర్యోధనుపంపున నాయవనకాంభోజపారదాదిసైనికులు సాత్యకిం
జంపక క్రమ్మఱ మని ప్రతిజ్ఞలు చేసి రథసహస్రంబును రెండువేలయేనుంగులు
ను నన్నిగుఱ్ఱములునుం దోడరాఁగ దుశ్శాసనపురస్కృతులై పావకంబుపయిం
గవియుమిడుతలట్లు సాత్యకిం దలపడి పటుశరనికరంబుఁ బరఁగించుటయు నయ్యో
కవీరుండు సంభ్రమముఁ జెందక యాసైన్యములనెల్ల రూపడఁగించుటయు విఱి
గినరథావయవములను దునియలైనకేతనములను గూలినయేనుంగులను జచ్చిన
గుఱ్ఱములను నఱవఱలైనమైమఱువుళ్లను బొడిపొడియైనతొడవులను రాలిన
మాల్యకుసుమంబులను దెగినపదాతిగాత్రఖండంబులను గులగులలైననానాహే
తివ్రాతంబులను సంగ్రామభూమండలంబు గ్రహనక్షత్రమండితం బయినశారదన
భోమండలము ననుకరించె. ఏమిచెప్పుదు నాఘోరసంగరంబున నైరావతాంజనప
ద్మసుప్రతీకకులోద్భవంబులైనయుత్తమకుంజరంబులెల్ల మడిసె. అట్లు సాత్యకి
విక్రమించునెడ విఱిగి తొలంగి పాఱినయాశకయవన మ్లేచ్ఛప్రభృతులం జూచి
దుశ్శాసనుండు మీరు పోదివిన నెదవెడుప్రయోజనం బిప్పుడు గానంబడ దని
వారల నారించి పాషాణయుద్ధకుశలు లయినపార్వతీయులం బిలిచి మీరందఱు
నెక్కపెట్ట యిప్పుడు సాత్యకిం బొదువుఁ డశ్మసమరం బెఱుంగనిశినిపౌరుని
మీరు నిర్జింపఁగల రని పురికొల్పుటయు ఖరశతంగణదరదలంపకపుళిందాదు
లగునప్పార్వతీయు లయోహస్తులు శూలహస్తులు గజశిరఃప్రమాణపాషాణహ
స్తులునై సాత్యకిం జుట్టుముట్టి ఘోరశిలావర్షముఁ గురిసిరి. అందుల కలిగి గో
విందుననుజుఁడు క్రూరపన్నగములంబోని తీవ్రాంబకముల నాఱాలనెల్లఁ బొడిపొ
డి గావించి యాపార్వతీయుల నందఱను నెక్కమాత్రలోనఁ బ్రేతరాజపురము

న కనిచినం జూచి దుశ్శాసనుఁ డక్కడ నిలువనోడి ద్రోణానీకమునకుఁ బఱచె. త్రాలు పగులునప్పటిచప్పుడు విని భారద్వాజుఁడు సారథిం జూచి సాత్యకి యేపు మీఱి కురుసైన్యంబు నుగ్గునూచముగఁ జేయుచున్నవాఁ డద్దెస మనయరదముఁ బఱపు మనుటయు నతండు ధనుర్ధరవరేణ్యా, యిక్కడఁ బాంచాలపాండవులు ప్రబలసంరంభంబునఁ బొదివియున్నవారు. మీరు లేకున్న వ్యూహము నిలువఁజాలదు. సాత్యకి యిచ్చటి కత్యంతదూరమున నున్నవాఁడుగాని కుఱంగుట లేదు. ఇచ్చట నుండుటయు నచ్చటికిఁ జనుటయు ననునీ రెంటిలో నెయ్యది పెద్దమేలగు నద్దాని నిర్ణయింపవలయు ననుటయు నాచార్యుండు తన్ను మార్కొనినపాంచాలురం ద్రెగడించి పోవుట యుఱవుగాదు. పోయినం గార్యంబు దప్పు నని యూహించి సేనాగ్రమునన యుండి వారితోడఁ బోరుచుండె.

సాత్యకికి వెఱచి వచ్చినదుశ్శాసనుని ద్రోణుఁడు దూఱుట.

అట్టియెడ దుశ్శాసనుండు సాత్యకియెదుర నిలువనోడి విఱిగి తనయొద్దకు వచ్చినం జూచి యాచార్యుం డతని కిట్లనియె. దుశ్శాసనా, రథములన్నియు విఱిగి పఱచుచున్నవి. రాజునకుఁ గుశలంబకదా. సైంధవుఁడు బ్రదికియున్నవాఁడకదా. రాజుకొడుకు రాజుతమ్ముఁడు యువరాజు నగునీ విట్టు లనికి వెఱచి పఱవందగునే? తొల్లి యాపాపపుజూదమునాఁడు పరమపతివ్రత యగుపాండవధర్మపత్నిని రచ్చకుఁ దెచ్చి యోసీ! దాసీ! నీమగఁడు జూదమున నిన్నోటువడియె. గొడ్డువోయినమగలం బరిత్యజించి స్వైరవృత్తిం గొనుము. ఇఁక దుర్యోధనువ స్త్రముల మోచుటయ నీపని యని పలికిననీ కిపుడు పలాయనముఁ జేయం జనదు. హితు లగుపెద్దలమాటలు వినక పాంచాలపాండవులతోడ వైరమెత్తిన నీ విపు డొకసాత్యకిం జూచి వెఱచి పఱచితివి. భీమార్జునులయునకులసహదేవులయుబారిం బడిన నింక నేమిగాఁగలవాఁడవు. ఆనాఁడు శకునిక్రైతవమునఁ గొనినయడ్డసాళ్లవి యడ్డసాళ్లు గావు. అవియే యిట్లు దారుణాశీవిషోపమంబు లగుశరంబులయ్యె. అప్పు డింత యెఱుంగవైతివి. ద్రౌపదిభంగపాటునకును బాండవులసంకటపాటునకును నీవకదా మూలము. అప్పటినీదర్పమానవీర్యము లిప్పుడెక్కడకుఁ బోయె. ఆశీవిషసదృశులగుపాండవులకుఁ గినుక పుట్టించి యింక నీవు డెక్కడకుఁ బోవంగలవాఁడవు. నీనిమిత్తమున నీభారతసేనకుఁ జేటుకాలము మూఁడె. నిన్నుఁ దమ్మునిఁగాఁ బడసి సుయోధనుఁ డిన్నిపాట్లు పడవలసె. వెఱచి విఱిగిపఱచుచున్నమూఁకల నీవకదా భుజబలంబు పెంపున నిలువరింపవలయు. మరణమునకుఁ దలఁకి రణము విడిచి పోయినం బగవారు నవ్వుచు నుబ్బుదురు. సేనానాయకుండ వగునీవ యిట్లు భీతుండవై పఱచితేని యింక నెవ్వరు కయ్యంపుమొన నిల్చువారలు. పోరికిఁ జాలవేని యిప్పుడైన నన్నతోఁ జెప్పి పాండవులరాజ్యము

వారి కిప్పించి శాంతిఁ గావింపుము. నిర్ముక్తపన్నగకూారంబు లగుసవ్యసాచిగాం డీవనిర్ముక్తబాణంబులును మేను జొరకమున్న వృకోదరుఁడు మిగిలిననీతమ్ముల నైనం జంపకమున్న వాసుదేవయుధిష్ఠిరులక్రోధవీక్షణములు సేనలపై లెస్సప ర్వకమున్న యింతయుం జేయుము. భీష్ముఁడు తొలుతనే బోధించియు నంతనిలు వక తాను శరతల్పగతుండయ్యె మీయన్నను బిలిచి పాండవు లజేయులు వారి తోడికయ్య మింకనైన నుడుగుము. శాంతిం బొందు మని తెలియఁజెప్పెఁగాని మందాత్ముఁడై నయతండు వినఁడయ్యె నేమి చేయవచ్చు. సంధి మీ కొప్పదేని ధృతి దూలక కడంగి యింకఁ బాండవులతోడం బోరక తీఱదు. సాత్యకి యున్న చోటికిఁ బొమ్ము. అక్కడ నీవును లేకుండినఁ గార్యంబు దప్పును. నాచెప్పినదెల్ల మీకకాని లాఁతులకుఁ గాదు. ఆత్మార్థంబ సాత్యకితోడం బోరు మని యాచా ర్యుండు సెప్పినం దుశ్శాసనుండు మాఱుపలుకక వినియు విననియట్లు భావించి బహుళమ్లేచ్ఛచమూగణపరివృతుండై మధ్యమజవమున సాత్యకి యున్నచోటికిఁ జనియె.

ద్రోణుఁడు వీరకేతుచిత్రకేతుప్రముఖు లగుపాంచాలకుమారులం జంపుట.

అంత నాచార్యుండు పాండవపాంచాలమాత్స్యులం దలపడి పేరు సెప్పి శరజాలంబుఁ బరఁగించి తల లేఱుచున్నంత వీరకేతుం డనుపాంచాలకుమారుం డయ్యాచార్యుం బొదివి నిశితశరపంచక మగ్గురునిమేనం గీలించి యొక్కటఁ గేతనం బూఁగాడ నేసి యేడింట సారథిని నొంచిన నయ్యాచార్యున కప్పాంచాలవర్యుం గడ వరాకుండుటయు నందఱు నివ్వెఱఁగందిరి. అట్టియెడఁ బెక్కండ్రుపాంచాలు రతనికిఁ దోడ్పడువారై భారద్వాజుం బొదివి యలుఁగులసోనం గురిసినం గినుకవొడమి కల శభవుండు శరజాలం బడరించి మహామారుతంబు మేఘపటలంబులం బోలె వారలనందఱం దెరలించి సూర్యానలప్రభం బయినయొక్కదివ్యబాణంబు కార్ము కమున నరివ్రాసి యవ్వీరకేతునిపయిం బడనేయుటయు నది వానిమేనుప్రచ్చి నెత్తుటం దోఁగి ధరణీతలంబునం బడియె. వాఁడును దోడన పర్వతశిఖరమునుండి వాతోద్ధూతం బగుమహామహీరుహముభంగి రథమునుండి పడియె. వీరకేతుని చావునకు శోకించుచు వానితమ్ములు చిత్రకేతు సుధన్వ చిత్రవర్మ చిత్రరథు లనువారు నలువు రొక్కపెట్ట భారద్వాజుం దాఁకి సాయకపరంపరలు నిగుడిం చినం గోపించి గురుండు నిశితశరజాలమున వారల వెగడుపఱచి రథముల విఱి చియు సూతులఁ జంపియు గుఱ్ఱములఁ జదిపియు నవ్వుచు నవలీలం బువ్వులుగోయు చాడ్పున నిశితభల్లముల నా నలుగురితలలు దఱిగె. అట్ల ప్రతిహతప్రతాప మునం బేర్చి యాచార్యుండు కనకపృష్ఠంబయిన చారుకార్ముకముఁ ద్రిప్పుచు న్నంత ధృష్టద్యుమ్నుం డప్పాంచాలవీరులచావునకుఁ గన్నీరు నించుచు హాహా

కారం బెసంగ నయ్యాచార్యువరదము నడ్డగించి శరజాలముఁ గప్పుటయు నగ్గురుం డగ్గలిక మెఱసి శరములు గురియుచుండఁ గ్రోధమూర్ఛితుండై పాండవసేనానాయకుండు తొంబదియమ్ములు గురునిఱొమ్మున నాటుటయు గాఢవిద్ధుండై యక్కుంభసంభవుండు సోలి తేరిమీఁదఁ జదికిలంబడియె. తదవస్థుం డైనద్రోణుం జూచి ధృష్టద్యుమ్నుఁడు సంరంభావష్టంభమున వాలుఁ బలుకయుంగొని తేరుడిగ్గి వడింబేర్చి గురుని తేరెక్కి యతనితలఁ దఱుగఁ దలఁచుచున్నంతఁ దెప్పిఱిల్లికొని లేచి యబ్భారద్వాజుండు క్రోధసంరక్తలోచనుండై ధృష్టద్యుమ్నుం జంపఁ దలఁచి డాసినవాని నేయఁజాలిన జేనెఁడేసిబాణములు పెక్కులు పరఁగించుటయు భగ్నపరాక్రముండై యప్పాండవసేనాపతి క్రమ్మఱి తన తేరెక్కి విల్లు చేతం బూని గురునిపై శరాసారం బడరించుటయు గురుండు నతనిపై వాలంపగములఁ గురియుటయు నయ్యిరువురికిఁ ద్రైలోక్యసాధనోద్యోగులైన యింద్రప్రహ్లాదులకుంబోలె ఘోరసమరంబును వివిధమండలగతానురూపంబును నిశితశరజాలసమాచ్ఛాదితదిక్తటంబు నత్యాశ్చర్యంబునై చెల్లె. అంత నాచార్యుం డేచి ధృష్టద్యుమ్నుసారథిమస్తకంబుఁ దునిమిన నది పండినపండు క్రమానుంబోలె నాకబంధముఁ బాసి ధరణింద్రెళ్లుటయు సారథిలేమిం జేసి రథాశ్వము లిచ్ఛమెయిఁ బాఱినం బాంచాలసేనలు విఱిగి పఱచె. ఆచార్యుండు తనయొప్పటిచోట నిలిచి మార్కొన్న వారలం జించి చెండాడుచుండె.

## దుశ్శాసనుఁడు సాత్యకితోఁ బోరి యోడుట.

అంత నక్కడ దుశ్శాసనుండు ద్రోణవచనప్రేరితుండై యఱిగినవాఁడు శరాసారంబుఁ గురియుచు సింహనాదగర్జాసముజ్జృంభితుండై పర్జన్యువ కెనవచ్చుచు నానారథికసమన్వితుండై సాత్యకిం దలపడి యఱువదియమ్ములను షోడశ శరములను నతనిపయిం బడనేసినం జూచి సాత్యకి దుశ్శాసనాదులపయిం గాండజాలం బడరించుటయు దుశ్శాసనసహాయు లగు పెక్కండ్రురథికులు వెఱచిపఱచిరి. వారందఱును బాఱినను దలంకక దుస్ససేనుఁడు దాను సుస్థిరుండై శరజాలమున సాత్యకిం గప్పి నాలుగమ్ముల గుఱ్ఱములను మూఁడుశరముల సారథిని నొనేసి వెండియు నయ్యదువీరునిపై శరశతముఁ బ్రయోగించి యార్చిపేర్చుటయు శినివీరుఁడు కోపించి దుశ్శాసనుని రథరథ్యసూతకేతనములతోడఁ జెలఁదిపురుగు తనపోఁగుల మశకంబునుంబోలె శరజాలమునం గప్పిన సాత్యకిశరచ్ఛన్నుం డైనదుశ్శాసనుం జూచి దుర్యోధనుండు త్రిగర్తరథికులం బురికొల్పుటయు నాసంశప్తకులలో మూఁడువేలరథంబులవారు కడంగి సాత్యకిం జుట్టుముట్టి వాలంపగములఁ బరఁగించిరి. అందుల కలిగి శినిప్రభుఁడు వారలలో నేనూఱురథములవారిం దొలుదొలుతన వధించుటయు హతశేషులు శోణితపరిప్లుతాంగులై పూచినమోదుగులట్లు

చూడ నొప్పుచు రక్షకుం గానక పంకనిర్మగ్నము లగునేనుంగులవిధమున బమ్మ
రించుచు గరుత్మంతునకు వెఱచి లాఁగలోనం జొచ్చుపన్నగంబులచందంబున
భయభ్రాంతులై ద్రోణానీకంబునకుఁ జనిరి. అంతఁ దనకు మాఱుమలయువా
రులేక సాత్యకి ధనంజయునరదమునెద్దకుఁ జనుటయు దుశ్శాసనుండు వెంటఁదవిలి
తొమ్మిదియమ్ము లేసినం జూచి శైనేయుం డతని బాణపంచకమున నొప్పించె.
అందులకు నొవ్వక నవ్వుచు దుశ్శాసనుఁడు మూఁడమ్ములను మఱియు నెనిమిది
వాఁడికోలలను నాశినివీరునిపై నడరించిన నాతండు నవ్వుచు నవలీలం దత్కో
దండంబుఁ దునిమి క్రీడి యున్నదెసకుఁ జనుచుండునంత దుస్సేనుఁడు ఘోరశ
క్తిని సాత్యకిపై నేయుటయు నమ్మహారథుఁడు మఱలి వాఁడితూపుల దానిం దు
మురుసేసె. తనశక్తి ప్రతిహతం బగుట కలిగి యంత నీకొడుకు వేఱుచాపంబు
గొని రోపంబు లరిఁబోసి సాత్యకిపయి నడరించి సింహనాదముఁ గావించినం
గినిసి యదువీరుఁడు బలుతూపులు దుస్సేనునిస్తనాంతరమున నాటి వెగడుపఱి
చి తోన నిశితాగ్రంబు లయినయెనిమిదియమ్ములం బరఁగించిన దుశ్శాసనుండు
నతనిపై నిరువదివాఁడికోల లేసె. ఏసినం గినిసి కృష్ణుతమ్ముఁడు శరత్రయమున
దుస్సేనుస్తనాంతరమునుం గ్రుచ్చి నిశితమార్గణములం గుప్పించి గుఱ్ఱములను
సారథినిం జక్రరక్షకులనుం జంపి యొక్కభల్లమున విల్లు ద్రుంచి యైదింటఁ దల
త్రాణంబు వ్రచ్చి శక్తికేతనముల భల్లద్వయమునం దుమురుసేసిన విరథుఁడు
హతాశ్వుఁడు హతసారథియు ఛిన్నకార్ముకుండును నగుమనదుస్సేనునిఁ ద్రిగర్తేశ్వ
రుండు తనతే రెక్కించుకొని తొలంగించె. తొలంగించినను సాత్యకి ముహూర్త
మాత్రంబు వెంటఁదవిలి యానాఁ డాసభలో వృకోదరుండు నీకొడుకులనెల్లఁ దాఁ
బరిమార్తు నని యాడినబాసం దలపోసి తాఁ జంపనొల్లక మగిడి యర్జునుం జేర
నరిగె ననిన విని యాంబికేయుఁడు సంజయా, యాసేనలో సాత్యకి నడ్డగింప మ
గవాఁ డొక్కఁడును లేఁడయ్యెఁగా? అండఱును ఱిచ్చవడిరే? పెక్కండ్రుమహా
రథు లొక్కని నాఁగఁజాలరై రన్న నింక నేమనంగల దనుటయు సూతసూనుం
డంబికాసూనున కిట్లనియె.

రాజేంద్రా, భవదీయసేనాసముద్యోగంబు యుగాంతసదృశంబై పరమ
తుములం బయ్యెఁగాని కొఱంతవడదు. నిత్యము నాచార్యుండు వన్నించువ్యూ
హములకు సరివచ్చువ్యూహ మింకొక్కటి కలుగ దని నామతంబు. మింటనుండి
చూచుచున్న దేవగంధర్వచారణాదులును వ్యూహసంవిధానముల కిదియే తుది
యనియు జయద్రథురక్షణార్థంబు ద్రోణుఁడు వన్నినవ్యూహమున కెనవచ్చు
వ్యూహ మెక్కడను నింకఁ బన్నఁబడదనియుం బలికిరి. ప్రచండవాతోద్ధూతంబు
లగుసాగరంబులకోలాహలములట్టు లిరువాఁగున వీరయోధులసాహసోత్సాహర

వములు వినంబడియెడి. మనవారు శక్తికొలంది పోరుచున్నవారుగాని యొండుగా
దు. దైవోపహతి మూఁడినప్పు డెవ్వ రేమి చేయఁగలరు. అది యట్లుండె. ధర్మ
జభీమనకులసహదేవధృష్టద్యుమ్నులు ధనంజయసాత్యకులు సింధురాజవధని
ర్వహణార్థం బరిసైన్యంబుఁ జొచ్చినవారు, వారల లాఁతు లాఁగకుండఁగ మన
మందఱము నవ్వీరులకుఁ దోడుపడుట లెస్స, రండు కొట్టుఁడు నడువుఁడు తెఱు
ముఁడు పార్థసాత్యకులకుఁ జేటు కలుగకుండఁ జూచికొనవలయు, వారికిఁ గీడు
మూఁడెనేని మనము గెలుచుట కలుగదని పాండవయోధులు తమసైనికుల నంద
ఱనుం బురికొల్పుటయు వారు ప్రాణములమీఁదియాశ మాని వీరస్వర్గకాంక్షులై
యశస్కాములై నడుచుచున్నంత నాసంరంభంబును సాత్యకి కడుదవ్వు చనుట
యుం జూచి యతం డున్నదెసఁ గవచకాంతులు చూడ్కులు మిఱుమిట్లుగొలుపు
టంజేసి యచ్చట ఘోరసమ్మర్దంబు గావలయు నని యూహించి దుర్యోధనుండు
తాను బాండవసైన్యములఁ దాఁకుటయుఁ గ్రందుకయ్యం బయ్యె ననిన విని
విచిత్రవీర్యసూనుండు సూతసూనుం జూచి పాండవసైన్యము లరిగినం దుర్యో
ధనుండు తాను వెంటఁదగిలి పోరికిఁ గడంగెనే? పెక్కండ్రతోడ నొక్కండ పోరఁ
జాలెనే? ఆతండు చిన్ననాఁటనుండియు గోమునం బెరిఁగి లోకేశ్వరుండై యత్యం
తసుఖములనే యనుభవించినవాఁడు. అందఱం దాఁకి యోర్చి పోరఁజాలెనే?
వానిపోరు తెఱంగుఁ జెప్పు మనుటయు సంజయుండు రాజేంద్రా, దుర్యోధనసం
గ్రామంబు పరమాద్భుతముగఁ జెల్లె. తత్ప్రకారము వినిపించెద నాకర్ణింపు మనియి
ట్లనియె. దుర్యోధనుండు పొదివినం బాండవసైన్యం బేనుఁగుచేతఁ జిక్కినతమ్మితీవ
చాడ్పున నత్యంతవికలంబైనం జూచి భీమసేనాదు లొక్కపెట్ట యుఱుముటయు
రారాజు ధైర్యధురంధరుండై వృకోదరుని శరదశకమునను గవల వేఱువేఱ మూ
డేసియమ్ములను ధర్మరాజును నేడువాఁడికోలలను విరాటద్రుపదుల నాఱుసాయకం
బులను శిఖండిని నాఱుతూపులను ధృష్టద్యుమ్నుని వింశతివిశిఖములను ద్రౌపదీపు
త్రుల మూఁడేసియాశుగంబులను దక్కటియోధులను శరశతమునను నొప్పించె. ఎ
ప్పుడుచూచిన నతనివిల్లు మండలీకృతంబయి యగపడునుగాని యెప్పుడు నారిసారిం
చునో యెప్పు డమ్ము లరిఁబోయునో యెప్పు డేయునో యూహింపరాకుండు. అట్ల
ద్భుతంబావహిల్లం బోరుచున్నంత ధర్మరాజు కోపించి భల్లద్వయమున దుర్యోధను
చాపముఁ ద్రుంచి పదియమ్ములఁ బయింబడ నేసిన నవి మైమఱువుఁ దాఁకి మిట్టి
పడియె. రారాజువిల్లు ద్రుంచుటకుఁ బొంగి పాండవయోధులు వృత్రవధమున
మహర్షులు మహేంద్రునె ట్లట్ల ప్రశంసించిరి. అంత నొండువిల్లు గొని కురుధ
రానాథుండు నిలునిలు మని పాండవాగ్రజు నదల్చుటయుఁ బాండవవీరు లనేకు
లతనికిఁ దలకడచి రారాజుం దాఁకుచున్నంత ద్రోణుఁడు దుర్యోధనునకు మిగిలి

నవారల నందఱను వాతోద్ధూతవారివాహములను గులాచలంబెట్టు లట్టు లడ్డ గించినం బరమఘోరం బయినపోరు సెల్లె. అక్కడ సేనామధ్యమున నర్జునుఁడును సాత్యకియు సేనాముఖమున నాచార్యుండును గోల్తలుసేసిన భూప్రజకు బహుళక్షయం బయ్యె.

ద్రోణుఁడు బృహత్క్షత్రధృష్టకేతుప్రభృతులం జంపుట.

అయ్యపరాహ్ణసమయమున ద్రోణాచార్యుఁడు పాంచాలసోమకసైన్యములపై నడరి నిశితబాణజాలంబుఁ గురియుచు నేఱియేఱి బిరుదుమగల నేట్లాడుచున్నంతఁ గేకయులేవురిలోన జ్యేష్ఠుండును శ్రేష్ఠుండు నగుబృహత్క్షత్రుఁడయ్యాచార్యుపయి శరజాలంబు గంధమాదనపర్వతమున శరధారలు గురియు ప్రావృట్పయోధరముచందమునం గురిసినం గినిసి గురుం డతనిపైఁ బదియేను తూపు లడరించిన నాకేకయపతి తలంకక సంతోషమున నగ్గలించి యగ్గురుశరముల నొక్కొక్కదాని నైదేసియమ్ములం దునిమిన నతనికరలాఘవమునకు మెచ్చి భారద్వాజుండు నగుచు నెనిమిదివాలమ్ములఁ దోన పరఁగించుటయు నాతండు వానిం బ్రతిమార్గణముల మాయించినం జూచి మనసైనికులు పిచ్చలించిరి. అంత ద్రోణుఁడు బ్రహ్మాస్త్రము సముద్దీపితముఁ గావించిన నాబృహత్క్షత్రుండును బ్రహ్మాస్త్రంబ యేసి దానిని శాంతముం జేసి స్వర్ణపుంఖము లగునిశితసాయకముల నఱువదింటిని నాచార్యు మేనం గీలించె. అంత గురుం డలిగి యొక్కవాఁడినారసము బిట్టేయుడు నది యాకేకయేశ్వరుకవచంబు సించి నెత్తురువఱ్ఱు గావించి వల్మీకముఁ జొచ్చుపాముపగిది ధరాతలముం జొచ్చె. అయ్యమ్మునఁ గడు నొచ్చియు నమ్మహారథుఁడు క్రోధవ్యావృత్తలోచనుండై శిలాశితము లగుసప్తతి బాణములం ద్రోణునిపైఁ బరఁగించి యొక్కవాలమ్మునఁ దదీయసారథియాయమ్ము తగులనేసె. ఏసినం గుంభసంభవుం డలిగి సంరంభసముద్దిక్తుండై శరనికరముఁ బరఁగించి యాకేకయరాజును వెగడుపఱిచి తోన నాలుగువాలమ్ములఁ దురంగమ్ములఁ జదిపి యొక్కబాణమున సారథిం దెగటార్చి రెంటఁ గేతనాతపత్రములం ద్రుంచి యొక్కవాఁడినారసమ్ము వానిఱొమ్ముఁ గాఁడిపోవ నేయుటయు విదీర్ణహృదయుండై బృహత్క్షత్రుండు నేలం బడియె.

అట్లు కేకయేశ్వరుం డైనబృహత్క్షత్రుఁడు హతుండయినం జూచి శిశుపాలపుత్రుం డయినధృష్టకేతుండు కేకయుల నేట్లాడుచున్నద్రోణున కభిముఖముగఁ దేరు దోలు మని సారథికిఁ జెప్పి యగ్నిపయిం బడుమిడుతవడువునఁ గడువడి నాచార్యుం దాఁకి యఱువదియమ్ముల రథరథ్యకేతనసహితంబుగా నక్కుంభసంభవుం గప్పి గవిలోనిబెబ్బులి నలిగించురీతి నయ్యాచార్యు నలిగించుటయు భారద్వాజుం డాశిశుపాలతనూజుచాపంబు నొక్కనిశితక్షురప్రమున నడిమికిఁ ద్రుంచె.

అంత నెందుకోదండం బెత్తి ధృష్టకేతుఁడు సాయకాసారంబుఁ బరఁగించిన ద్రో ణుండు శరచతుష్టయమున హయచతుష్టయమును జంపి నవ్వుచు సారథితలఁ దఱిగి యిరువదియేనుబలుతూపుల నెడల నించినం జైద్యుండు రయమునఁ దేరు డిగ్గ నుఱికి యుద్దండగదాదండంబు గురునిపై విసరినఁ జటయు నాచార్యుండు బాణ గణమున దాని నడుమన తుత్తుమురు గావించె. గద వినిహతంబైనం గినుక నేడమి చేదిరాజు శక్తితోమరముల నేయుటయు గురుం డైదేసియమ్ముల నారెంటినిం దునియలు గావించి యొక్కతీక్ష్ణవిశిఖంబు బిట్టేయుటయు నయ్యది యతనిమైమఱు వఱవఱలు గావించి యొమ్ము వ్రచ్చి రుధిరసిక్తంబై పద్మవనముఁ జొచ్చునంచచా ద్భున ధరాతలంబుఁ జొచ్చె. చాపవిహగము మిడుతనుంబోలె నాచార్యుండు చేదిరాజసూనుం గబళించుటయు నతనికొడుకు కోపించి తనపై నడరినం గురుండు బెబ్బులి లేడికొదమనుంబోలె నవ్వుచు వాని నవలీలం బొరివుచ్చె. అట్లు పాండవ సైన్యములకు వినాశముఁ గావించుచున్నద్రోణాచార్యుపయిం గోపించి జరాసం ధసుతుం డైనసహదేవుఁడు తా నడ్డపడి మేఘము భాస్కరుంబోలె బహుళశర జాలమునం గప్పినం దదీయకరలాఘవము మెచ్చుచు నాచార్యుండు సాయకస్తోమం బడరించి యందఱును గనుంగొనుచుండఁగ నాజరాసంధతనూజుం దెగటార్చి తన్నుఁ జేర వచ్చినవారలనెల్లఁ బేరు సెప్పి శరజాలమునం గప్పి యమపురముఁ జేర్చుచుండఁ బాండవసైనికులు వలిపట్టినగోగణములమాడ్కిఁ గనిపించుచు ఱిచ్చవడియున్నంత వారిసైన్యమున హాహాకారం బెసంగె. అప్పుడు కొందఱు చేదిపాంచాలసృంజయకాశికోసలవీరులు ద్రోణుం బొదువుఁడు చంపుఁ డని పలు కుచుఁ గూడముట్టి మధ్యాహ్నతపతాపమునను ద్రోణబాణానలతాపమునను నెంతయు డస్సి యయ్యాచార్యుశరానలంబున మ్రందిపోయిరి. హతశేషులు ద్రోణువిక్రమంబుఁ జూచి యీబ్రాహ్మణుఁడు చరింపరానితపంబు చరించె. క్షత్రి యధర్మం బయినయుద్ధకర్మంబు బ్రాహ్మణధర్మ మగుతపమును లెస్స యాచరిం చినయితనియెదుర నిలువరాదు. బలసత్త్వోత్సాహముల కనురూపముగ నితండు పోరుచున్నాఁడు. తపస్వియుఁ గృతవిద్యుఁడు నగునీభూసురోత్తముఁడు క్రోధవీక్ష ణముననే యందఱం గాల్పఁగలఁ డని తమలోనం బలుకుచు భీమసేనధృష్టద్యు మ్నులం బిలుచుచున్నంత ధృష్టద్యుమ్నపుత్త్రుఁ డయినక్షత్రధర్ముండు తా నాచా ర్యుం దాఁకి క్రోధోద్విగ్నుండై తదీయశరశరాసనములం దునిమె. తునిమినం గినిసి భారద్వాజుండు ధృష్టద్యుమ్నతనూజుం గ్రూరనారాచమునకు బలిచేయుట యు వారిసైన్యములు సంచలించె. అట్టియెడఁ జేకితానుం డనూనదర్పోద్ధతుండై ద్రోణుం దాఁకి తదీయస్తనాంతరము దశవిశిఖముల నొనేసి నాలుగింట సారథిని మఱినాలుగింట గుఱ్ఱములనుం బిట్టేయుటయు నాచార్యుండు వానిదక్షిణభుజమునఁ

బదునాఱువాలమ్ములం గీలించి మఱిపదునాఱమ్ముల సిడముఁ గూల్చి యేడువాఁడి తూపుల సారథిం జక్కాడినం గుఱ్ఱములు గురునంపగముల సైరింపనేరక తేరీడ్చి కొని పఱచె. అవ్విధమునఁ జేకితాను నోడించి చేదిపాంచాలసృంజయసేనలం గను పుకొట్టుచు వీనులదాఁక నఱిసినవెండ్రుకల నెప్పినయెనుబదియేఁడులవాఁడయ్యు నాచార్యుండు షోడశవత్సరబాలునట్లు రణక్రీడ సలుపుచుండ వజ్రహస్తుం డైన దేవేంద్రుం జూచినట్టు లాసైనికులు తోఁచినకెల్లెల్లఁ బాఱిరి. అప్పుడు ద్రుపదుఁ డక్కటా! లుబ్ధుఁడై యీబ్రాహ్మణుఁడు బెబ్బులి క్షుద్రమృగములంబోలె నుత్త మక్షత్రియులం జంపుచున్నవాఁడు. పాపాత్ముం డైనదుర్యోధనుం డీనిమిత్తమున నధోలోకములకుఁ బోవుట తప్పదు. ఆఁబోతుల కెనవచ్చునిందఱురాజులు కుక్క లకును నక్కలకును నాహారంబగుట కాధార్తరాష్ట్రాధముని దుర్బుద్ధియే కదా మూ లం బని పలుకుచుఁ బార్థులం బురస్కరించికొని తా నబ్భారద్వాజుం దలపడియె.

ధర్మరాజు భీముని నర్జునునకుఁ దోడ్పడఁ బొమ్మనుట.

అవ్విధమున ద్రోణుండు పరాక్రమింపఁగఁ దమసైన్యములు క్షణక్షణ మునకు మిక్కిలి తఱుఁగుటం జూచి ధర్మరాజు చింతాదూనమానసుండై పెద్ద యుదవ్వు దమవారలు ద్రోణువెంబడిం బడి వచ్చినకతన సవ్యసాచి తమకుఁ గుఱంగట నుండు నని తలంచి యత్తెత్తి చూచి కృష్ణార్జునులను గపిధ్వజంబును సాత్యకినిం గానకయును గాండివజ్యాఘోషంబు నాలింపకయును వ్యథితచిత్తుండై లోకాపవాదభీరుండుగావునఁ దనలో నిట్లని విచారించె. సాత్యకి నర్జునునకుఁ దోడు పుచ్చితి. అతనిజాడయు నింతకు నగపడదయ్యె. సవ్యసాచికుశలంబుఁ దెలియక చింతిల్లునా కిపుడు సాత్యకికుశలము నెఱుఁగఁబడమింజేసి వగపు ద్విగుణమయ్యె. అర్జునునిజాడను సాత్యకిజాడను రెంటిని నెఱుంగవలయు. క్రీడిజాడఁ దెలియంగోరి శినివీరుం బంపితి. ఇపు డితని నరయఁగ నెవ్వనిఁ బంపుదు. యుయుధానుని నన్వే షించుట మాని యర్జును వెదకింతునేని ధర్మజుండు తమ్మునికుశలం బరయఁగ సాత్యకిం బంచెఁగాని యతనిసేమము విచారింపఁడయ్యె నని జనులు దూఱుదురు గావున లోకాపవాదభీరుండనై శైనేయు నన్వేషింపఁగ వృకోదరుం బంపెద. నాకు గాండీవిసాత్యకు లిరువురు నొక్కరూపకాని యొండుగాదు. అతనిపయిం బెద్దమోపెత్తి పంపిన నాపంపు త్రోఁచిపుచ్చక యతండు సాగరంబుఁ జొచ్చుమ కరంబుమాడ్కిఁ గురుసైన్యంబుఁ జొచ్చె. సాత్యకికిని బెక్కండ్రుకౌరవవీరులకుం బెద్దపోరాట గావలయు. అల్లదె మహారవంబు వీతెంచెడి. కావున నచ్చటికి భీమసేనుం బంపుట సముచితంబు. మహాబలుం డైనయతండు నిజభుజబలమునఁ గౌరవమహారథుల నిర్జించి పోవఁగలఁడు. అతని కసాధ్య మొక్కటేనియుఁ దోఁ పదు. వానిబాహుబలం బాశ్రయించియకదా మేము వనవాసమున నేయలజడిం

బడక సుఖమున నయ్యేండ్లు గడపితిమి. భీముఁడునుం జనెనేని గాండీవికిఁ బెద్దయు బాసటయగు. దివ్యాస్త్రవిశారదు లయినసవ్యసాచిసాత్యకులు కృష్ణునిప్రోపునఁ జేవచెడక సుఖముండఁగలరుగాని నామనంబున విచారంబు తీఱదు. కావున భీముని సాత్యకికిరీటులకుఁ దోడుపడం బనిచెద నని యిట్లు తనలో విచారించి నిశ్చయించి భీమునొద్దకుఁ దేరువోనిమ్మని సారథికిఁ జెప్పి యతనిడాయ నరిగి ప్రాప్తకాలముఁ దలపోయుచుఁ గశ్మలావిష్టుండై భీమున కిట్లనియె. తనకు సహాయు లెవ్వరు లేకున్నను దేవదానవగంధర్వాదుల జయించిన సవ్యసాచిజాడ యిప్పటికి నేమియుం దోఁప దని పలికినధర్మజునకు భీమసేనుఁ డిట్లనియె. రాజేంద్రా, యిట్టికశ్మలము నీయొద్ద మున్నెప్పుడుం జూడనైతి. మఱి వినవైతి. మున్ను దుఃఖాక్రాంతులగుమా కందఱకు నీవ గతివై యుచితవచనంబులఁ దేర్చుచుంటివిగదా. లెమ్ము లెమ్ము. ఏమి చేయవలయు శాసింపుము. నీపనిచినపని యకార్యం బనియొండె నసాధ్యం బనియొండెఁ దలంపక తప్పక చేయుదు. శోక ముడిగి యానతిమ్మనినం గౌంతేయాగ్రజుండు బాష్పపూరితలోచనుండై కృష్ణసర్పమువోలె నిశ్శ్వసించుచు భీమున కిట్లనియె. అన్న భీమసేనా, వాసుదేవపూరితం బగుపాంచజన్యమ్రోఁత వినంబడుచున్నదిగాని దేవదత్తంబుమ్రోఁతయు గాండీవనిర్ఘోషంబును వినంబడదు. ధనంజయుఁడు శత్రునిహతుఁడై నంగోవిందుఁడు దాను బోరుచుండుఁగాఁబోలు. శ్యామసుందరదర్శనీయగాత్రుఁడు వ్యూఢోరస్కుఁడు మహాబాహుఁడు చకోరాక్షుఁడు మత్తమాతంగవిక్రముఁడు శత్రుశోకవర్ధనుఁడు సురలకు సురేంద్రుఁ డెట్టు లట్టుల మనకుఁ బెనుప్రాపు నగుసవ్యసాచి సైంధవవధార్థియై సూర్యోదయావసరమునఁ గురుసైన్యముఁ జొచ్చెఁగాని యింతకుఁ గ్రమ్మఱి రాఁడు. వానిగుఱుతుగ నెద్దియుం గానంబడదు. వాని నన్వేషింపఁగ సాత్యకిం బంపిన నింతకు నతనిజాడయు నగపడదయ్యె. నామనంబు విచారభరాక్రాంతం బయ్యె. ఇప్పుడు మనయర్జునుకంటె ముందుగ సాత్యకి నన్వేషింపవలయు. కావున నీ కుచితంబని తోఁచునేని జ్యేష్ఠభాషిత యగునామాట విని కురుసైన్యంబుఁ జొచ్చి కృష్ణార్జునసాత్యకులకుశలం బెఱింగి తద్వృత్తాంతము సింహనాదమున నా కెఱింగింపు మని దీనవదనుండై ధర్మరాజు వచించె.

## భీముఁ డర్జునునకుఁ దోడ్పడఁ బోవుట.

ధర్మరాజువచనంబు విని భీమసేనుఁడు మహారాజా, తొల్లి బ్రహ్మేశానేంద్రవరుణులకు విజయ మొసంగినదివ్యరథము నధిరోహించినకృష్ణార్జునులకు భయము గలుగదు. ఐనను నీయానతిం దలఁ దాల్చి యరిగి వాసుదేవార్జునసాత్యకులకుశలం బరసి సింహనాదముఁ గావించెద నని యన్నకుఁ జెప్పి ధృష్టద్యుమ్నుం బిలిచి యోమహాభుజా, యాచార్యుండు సర్వోపాయముల ధర్మరాజును బట్టఁ

బూనుట నీ వెఱుంగుదువుగదా. రాజరక్షణముకంటె నక్కడకుఁ బోవుట నాకు సముచితము గాకున్నను ధర్మజునకు మాఱుపలుకఁజాలక వెట్టకేలకు నియ్యకొంటి. కావున సర్వప్రయత్నములను రాజును రక్షింపుము. మనకు సర్వకార్యములకంటె నియ్యదియే ముఖ్య మనిన విని యప్పాంచాలవరుండు వాయునందనా, నీకోర్కి నెఱవేర్చెద. ఇది విచారింపక పొమ్ము. నీసేనాపతి మేనఁ బ్రాణము లుండునంతకు భారద్వాజుండు ధర్మరాజును నిగ్రహింపఁజాలఁ డనిన విని యలరి వృకోదరుండు ధర్మజుని ధృష్టద్యుమ్నున కిల్లడ వెట్టి యక్కొంతేయాగ్రజున కభివాదనం బొనరించి యతండు కౌఁగిటం గ్రుచ్చి శిరంబు మూర్కొని యాశీర్వాదము లొనరించినం గైకొని విప్రులకుఁ బ్రదక్షిణప్రణామము లాచరించి యష్టమంగళములం బరిగ్రహించి రసవంత మయినకైరాతకమధువుఁ ద్రావి ద్విగుణబలుండై భూసురాశీర్వాదనాదములకు మాగధస్తుతివాదరవములకు ననుకూలశీతలమారుతప్రసరణంబునకును నెమ్మనమ్మున నలరుచు నాత్మబుద్ధిప్రసాదముం బరికించి తమకు విజయము సుస్థిరం బని భావించి కటకకుండలకేయూరాదినానాభూషణభూషితుండై యుత్తమకవచంబును మేలితలత్రాణంబునుం దొడిగి సితాసితపీతలోహితవర్ణవిచిత్రం బయినయుష్ణీషంబును గంఠత్రాణంబును ధరియించి మెఱుఁగుతళతళలం దుఱంగలించుకార్ముగులు తెఱంగునం జూడ నొప్పుచుఁ దఱలుచున్నంత మురాంతకుండు పూరించినపాంచజన్యంపుఘోరనినాదం బాకర్ణించి పాండవాగ్రజుండు చూచితే గదాగ్రజుండు సవ్యసాచికిఁ గీడు మూఁడినం జక్రగదాధరుండై తాన కయ్యమునకుఁ గడంగి చిందము ద్రోయించుచున్నవాఁడు. ధనంజయునిమిత్తమునను సాత్యకికారణమునను నామనము కశ్మలపరీతంబయ్యె. నేఁడు కుంతీదేవియు ద్రౌపదీసుభద్రలును బంధుజనులు నేపాపంబు విన్నఁగలరో. ఇంక నీవు తడయక పొమ్మనుటయు జ్యేష్ఠభ్రాతపంపు విని భ్రాతృప్రియంకరుండై నభీమసేనుఁ డప్పటికి దగయు డప్పియుఁ దీఱ విధిప్రకారమున గుఱ్ఱములకుఁ దగు మేపుఁ గావించి విశోకుఁడు తాను నాప్యాయనమధుపానంబు నొనరించి తేరు కట్టాయితంబు చేసి మ్రోలం బొడఁగట్టుటయు నయ్యుత్తమరథం బారోహించి శంఖముఁ బూరించి వింటినారి సారించి కరతలాస్ఫాలనంబుఁ గావించి మనవారి గుండియ లవియించి కురుసైన్యంబుఁ జొచ్చునంతఁ బాంచాలసోమకసైనికులు పెక్కండ్రతనివెంటఁ జనిరి. అట్టియెడ నీకొడుకులు దుశ్శలుఁడు చిత్రసేనుఁడు కుండభేది వివింశతి దుర్ముఖుఁడు దుస్సహుఁడు వికర్ణుఁడు శలుఁడు విందానువిందులు సుముఖుఁడు దీర్ఘబాహుఁడు సుదర్శనుఁడు బృందారకుఁడు సుహస్తుఁడు సుషేణుఁడు దీర్ఘలోచనుఁ డభయుఁడు రౌద్రకర్మ సుశర్మ దుర్విమోచనుఁ డనువారలు బహుళసైన్యసమేతులై భీము నడ్డగించుటయు క్షుద్రమృగములం బొదు

వృకోదమసింగము తెఱంగున వారలం దాఁకి తదీయశరముల మాపడగించుచు న నేకసాయకములఁ బరఁగించిన వారు వెఱచి ద్రోణానీకమునకుఁ బఱచిరి.

భీముఁడు ద్రోణు నతిక్రమించుట.

అంత నావృకోదరుఁడు తనమునుమున నున్నయేనుంగులఁ బీనుంగులఁ గావించుచు వడి నరుగుచున్నంత నాచార్యుండు సాగరంబును వేల యట్టు లట్టు లతని నాఁగి నవ్వుచు లలాటమున నెక్కు_వాఁడితూపు నాటిన వృకోదరుఁడు ఫా లకీలితం బయినయయ్యమ్మున నూర్ధ్వరశ్మి యగుభానుమంతునిరీతిం జూపట్టె. అంత నాచార్యుఁడు గాండీవియట్టులు వీఁడును దన్నుఁ బూజించు నని భావించి భీమసేనా, శత్రుఁ డగునన్ను గెలువక కురుసైన్యముఁ బ్రవేశింప నీ కలవిగా దు. ఇంతకు మున్న నీతమ్ముఁడు సవ్యసాచి నాయనుజ్ఞఁ బడసియే యరిగినవాఁ డనినవిని పవనసూనుండు క్రోధతామ్రేక్షణుండై వెఱపుదక్కి యయ్యా, దేవేంద్రు నకు నజేయుఁడై నయర్జునుఁడు నీయనుమతిఁ గొని రిపువాహినిం జొచ్చుట నాకుం జూడఁ బోలదు. అతం డొకవేళ నీయెడ గౌరవమునఁ దా నట్లుచేసినను నే నర్జు నుఁడఁ గాను. మఱి యరాతిభీకరుఁ డయినభీముఁడను. నీకు శత్రుఁడను. నీవు తండ్రివి గురువు బంధువు ననియు మేము పుత్రులము శిష్యులము ననియు మున్ను నీయెడ భక్తితాత్పర్యమున నంతయుం జెల్లె. ఇప్పు డందులకు విపరీతంబుగ మమ్ము వధింపఁ బూనిననీవు నీచెప్పినట్లు శత్రుండవు. శత్రునకుఁ జేయఁదగినకార్యం బిదె చేసెద, అని యయ్యాచార్యునకుఁ జెప్పి కాలదండోపమం బయినగదాదండంబు గిరగిరం ద్రిప్పి యతని తేరిపయిం బడ నేయుటయు సారథితురంగంబులతోడ ర థం బగ్గదతాఁకున నుగ్గయిన నగ్గురుం డుక్కు_దక్కి డిగ్గ నుఱికె. మఱియుఁ దద్గదా ప్రహారమునంజేసి చండమారుతమునకు ద్రుమాఁకులెట్టులట్టుల బహుళయోధులు గులగులలైరి. భారద్వాజుం డొండుతే రెక్కి_ వ్యూహద్వారమున నిలిచె. అట్టియెడ నీకొడుకులు క్రమ్మఱ దుశ్శాసనపురస్సరులై భీముం దాఁకి పోరుచుండ దుశ్శాస నుండు శక్తి నేయుడు వృకోదరుం డద్భుతం బావహిల్ల దాని నడుమన రెండు తునియలు గావించి వారిమార్గణంబులకు మాఱేయుచు వారల నందఱను వేఱు వేఱ మూఁడేసివాఁడితూపుల నొప్పించినం గినిసి వారలు ప్రావృట్పయోధరములు పర్వతమునుంబోలె వృకోదరుని శరజాలమునం గప్పుటయు నప్పవమానసూనుం డనూనక్రోధోద్ధతుండై నవ్వుచు నవలీల విందానువిందులను సుశర్మసుదర్శనులను యమలోకమునకుఁ బనిచినం జూచి వానియెదుర నిలువనేరక రణముఁ దొలఁగిచ నిరి. వారలం గెలిచి భీముఁడు సింహనాదముఁ గావించి యోధవరులఁ బెక్కండ్రఁ బరిమార్చి ద్రోణానీకంబుఁ దఱిమి యాభారద్వాజుండు గురియునంపసోన సరకు గొనక నీకొడుకుల నొంచుచున్నంత బహుళసైనికులు తత్పేరితులై తలపడు

టయు నవ్వాడముడి సింహనాదం బొనరించి గద యేసి మునుముపెట్టి యాందఱిం జంపుచుండ హతశేషులు వానిగదకు వెఱచి బెబ్బులిం జూచి పఱచులేళ్లచంద మునఁ బఱచిరి. అవ్విధమున వజ్రపాణి యగునింద్రుని తెఱంగున విక్రమించుచు గరుడవేగమునఁ గౌరవసేనలం గడచి యరుగుచున్నంత భారద్వాజుండు భీమున కడ్డపడి పటుప్రదరనికరంబుఁ బరఁగించి పాండవభయంకరముగా నార్చిపేర్చుటయు నయ్యుద్ధకెఱియాలంబు పరమాభీలంబయ్యె. అంతఁ బ్రభంజనాత్మజుండు గురుం డలంతులఁ బోవఁడని తనలో నూహించి తేరు డిగ్గి గదాపాణియై వర్షధార లకుఁ దలవాంచి యరుగునాఁబోతులీల నయ్యాచార్యశరాసారము గొను చుఁ గన్నులు మూసికొని వడి ద్రోణుతేరు డాయనరిగి నొగ పట్టి యీడ్చి తేరు నేలతో విసరివైచుటయుఁ దటాలున భారద్వాజుఁ డారథము డిగ్గనుఱికి యొండు తే రెక్కి యక్కడ నిలువక వ్యూహద్వారమునకుఁ జనియె. ఆరథము సారథిరథ్య ములతోడఁ బొడిపొడి యగుటయు నందఱును భీమునిబలవిక్రమముల కెంతయు నద్భుతం బందిరి. అక్కరణిం దన్ను మార్కొన్నవారల నందఱఁ బెనుగాడ్పు ప్రాఁకులంబోలె మర్దించి కృతవర్మగుప్తం బయినభోజానీకంబును గాంభోజసై న్యంబును మ్లేచ్ఛగణములనుం గెలిచి పరమవేగమునం జని కౌరవవీరులతోడఁ బోరుచున్నసాత్యకిం జూచి యటఁ బటుజవమునఁ బోయి సైంధవరక్షకులతోడం గాలుచేయార్పరాకుండఁ బోరుచున్నసవ్యసాచిం గాంచె.

ధర్మరాజు భీమునిసింహనాదము విని సంతసిల్లుట.

కాంచి భీమసేనుండు ప్రావృట్పయోధరగర్జాసమంబు లగుఘోరనాదం బులఁ గావించుటయు వాసుదేవార్జునులునుం బ్రబలసింహనాదము లొనరించిన నానినాదములు విని ధర్మరాజు గాండీవియు సాత్యకియుఁ గుశలమున్నవా రని యె ఱింగి విగతశోకుండై విజయుండు విజయంబుఁ గొను నని నమ్మి చిఱునగవు నగి తన మనమున నిట్లు చింతించె. భీమసేనా, నీవు చెప్పినట్లు చేసితివి. గురువాక్యం బను ష్ఠించితివి. నీతోఁ బగపెట్టికొన్నవారు గెలువనేరరు. సవ్యసాచిసాత్యకులు కుశ లమున్నవారు. భాగ్యమున వాసుదేవార్జునులయార్పులు వింటిని. ఇంద్రుని జయిం చి ఖాండవవన మగ్నిదేవున కర్పించియు దేవతలకు నజేయు లైనపౌలోమకాలకే యుల వధించియుఁ గౌరవులు విరాటుపసులం బట్టినపుడు నిస్సహాయుండై వారల నందఱ నోడించియు దుర్యోధనాదులు ఘోషయాత్రకు వచ్చి గంధర్వరాజునకుఁ జిక్కిన నామాటకై తా నాగంధర్వపతిం గెలిచి యాధార్తరాష్ట్రుల విడిపించియు మహేశ్వరు నెక్కటెక్కటిబవరమున మెప్పించి పాశుపతాస్త్రంబు సాధించియు దివ్యాస్త్రగ్రామంబు సంపాదించియుఁ బేరువడసినకవ్వడి నాభాగ్యమున సుఖము న్నవాఁడు. అతనిభుజబలంబు నమ్మియకదా మేము విజయము గొన నున్నవారము.

పుత్రశోకసంతాపసంతప్తుండై తాఁ జేసినప్రతిజ్ఞ తప్పక నేఁడు ప్రొద్దు గ్రుంకకయమున్న సైంధవుం దెగటార్చి శత్రులకు ఖేదమును మిత్రులకు మోదమునుం గావించి వచ్చునా యనియెదురుచూచుచున్న వాఁడ. ఇఁక సవ్యసాచి సైంధవుం బరిమార్పఁగలఁడని నాకుఁ బెద్దయునమ్మిక గలుగుచున్నది. అర్జునుండు సైంధవునిం జంపి నిజప్రతిజ్ఞఁ దీర్చినం దుర్యోధనుండు పశ్చాత్తాపంబుఁ జెంది హతశేషులనయినం గాచికొనం దలంచి శాంతిమై మాతో సంధిఁ గావించినఁ బెద్దయుమేలగు నతం డట్లు చేయునొక్కొ యని కరుణావిష్టుండై కౌంతేయాగ్రజుండు చింతించుచున్నంత నిక్కడియక్కడివీరులకుఁ బోరు ఘోరంబై చెల్లె ననినసంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె. సూతపుత్రా, యత్తెఱంగున భీముఁడు తనకు మాఱుమలయువారులేక నిర్వక్రవిక్రమాటోపంబు దీపింపఁజేయుచు మేఘగర్జాసమం బగు సింహనాదముఁ జేయుచుండునంత మనవా రెవ్వరు నాగఁజాలరైరొక్కొ ? దండపాణి యైనయంతకునట్లు గదాపాణియై ఘోరాకారమునం బేర్చువృకోదరునెదుర నెవ్వరును నిలువనేరరు. రథమును రథముననను గుంజరమును గుంజరముననే చంపునవ్వడముడిని మార్కొనఁగ వజ్రపాణి యగుశతక్రతుండును వెఱచు. దవానలంబు విపినంబునుంబోలె వృకోదరుఁడు నాకొడుకులఁ బొదివి గిట్టుచున్న నెవ్వరు నతని మార్కొనరైరొకో ? ఏను భీమునకు వెఱచునట్లు సవ్యసాచికిని వాసుదేవునికిని సాత్యకికిని ధృష్టద్యుమ్నునకు నంత వెఱవ నని నయాంబికేయునకు సంజయుం డిట్లనియె.



కర్ణుఁడు భీమునితోడఁ బోరి యోడుట.

భీమునియార్పు సైరింప కప్పుడు కర్ణుఁ డుదీర్ణక్రోధుండై మారుతపథం బడ్డగించుపాదపముచందమున నమ్మారుతాత్మజు తేరు నడ్డగించి యత్యంతసారవంతం బయినకార్ముకంబునారి మ్రోయించినం బరమావేశావిష్టుం డై నరాధాసుతుం జూచి పవనసుతుండు శిలాశితము లగుశరములు పెక్కు లడరించుటయుఁ జలింపక యాసూర్యసూనుఁడు వానికి మాఱేసి బలుతూపులు వరఁగించుటయు నాకర్ణభీమసంగ్రామంబుఁ జూచి సకలయోధులు భీమసేనునార్పునకుఁ గంపించి వెగడుపడి విండులఁ బాఱవిడిచిరి. వాహనములెల్ల డిల్లఁబోయి మూత్రపురీషములు విసర్జించె. కంకగృధ్రాదులు మింటఁ బర్వుట మున్నగునుత్పాతంబులు దోఁచె. అప్పరమసమ్మర్దమున రాధేయుండు క్రోధవిధేయుండై యేచి భీమునిమేన నిరువదియమ్ములఁ జొనిపి తత్సారథిగాత్రమ్మున నైదుసాయకములు నాటుటయు భీమసేనుఁడు నెప్పక నవ్వుచు నవలీలం గర్ణునిపై నఱువదినాలుగువాలికతూపులఁ బరఁగించినం దపననందనుండు పవననందనుపయిం బాణచతుష్టయంబు బిట్టేసె. ఏసినం గౌంతేయమధ్యముఁడు నడుమత్రోవన వానిం దుమురుసేసి కరలాఘవంబు

నెఱపుటయుఁ గర్ణుఁడు భీమునిపై శరవ్రాతంబుఁ గురిసె. దానఁ బ్రచ్ఛన్నుండై పాండుతనూజుండు మార్తాండతనూజునికోదండంబు ముష్టికిఁ ద్రుంచి తోన పది వాఁడిమమ్ముల నారాధేయుమేనఁ గీలించిన నెందువి ల్లెత్తి వైకర్తనుండు భీమునిపయిం బటుప్రదరపరంపరలు బరఁగించె. అందులకలిగి వృకోదరుండు మూఁడు వాలమ్ములఁ గర్ణునురమ్మున నాటుడు నారాధాతనూజుండు రక్తసంసిక్తసర్వాంగుండై గైరికధాతుపటలపాటలనిర్ఝరీపరీతంబై శిఖరత్రయోల్లాసభాసురం బైనయుత్తుంగపర్వతముమాడ్కిం జూడనెప్పె. అంతఁ గర్ణుఁ డందుల కించించుక చలించియు ధైర్యధురంధరత్వమునఁ బేర్చి భీమునిగాత్రమున నొక్కవాఁడితూపు నాటి తోన శరాసారంబుఁ గురియుటయుఁ బాండునందనుం డలిగి కర్ణునివింటి నాఱిఁ ద్రుంచి యొక్కనిశితభల్లమున సారథిం దెగటార్చి గుఱ్ఱములం బరిమార్చిన నారాధేయుండు చేయునదిలేక హతాశ్వసారథికం బయినతేరు తటాలున డిగ్గి వృషసేనునరదం బెక్కె. పాఱినం బవమానసూనుండు పర్జన్యగర్జితోపమం బయినమహానాదముఁ గావించినం బాండవాగ్రజుం డాలించి పరమామోదభరితుం డయ్యె. పాండవసైనికులును దమతమచిందముల ద్రోయించిరి. అరిసైన్యంబునం బుట్టిననినాదంబు విని మనసైనికు లఱచిరి. అంతఁ గృష్ణార్జునులును బాంచజన్యదేవదత్తంబులం బూరించిరి. సర్వనాదములకంటె భీమునార్పు మిక్కిలి యొక్కడై తోఁచె. అంతఁ గ్రమ్మఱఁ గర్ణభీము లొండొరులం దలపడి మృదుపూర్వముగ నారాధేయుఁడును దృఢపూర్వముగఁ గౌంతేయుఁడునుం బోరుచుండిరి.

### దుర్యోధనుఁడు ద్రోణుం దూఱుట.

అవ్విధమున నర్జునుండు సైంధవవధోద్యోగమునం బేర్చి మనసేనలం గనుపుకొట్టుచుండ సాత్యకివృకోదరులు నతనికిఁ దోడుపడువారై కూడుటయు వారలబాణజాలంబు సైరింపఁజాలక మనమూఁకలు వీఁకతఱఁగి విఱిగి పఱచుచున్నం జూచి దుర్యోధనుండు కార్యంబు దప్పె నని భావించి తా నెక్కరుండ పరమరయమున ద్రోణునిపాలికిఁ జని సంరంభోద్రిక్తరక్తలోచనుండై యిట్లనియె. అర్జునుఁడును భీముఁడును సాత్యకియు సకలసైన్యముల గెలిచి సింధురాజుచేరువం జేరి మనవారల నందఱను నూలిం బెద్దయు నొంచుచున్నవారు. అర్జునునకుఁ దెరువిచ్చుటయకాక సాత్యకివృకోదరులను నెట్టులు వ్యూహముఁ జొరనిచ్చితివి. వారు ని న్నొడించి రన్న సాగరం బింకునట్టు లయ్యెది యసంభావితంబు. భీమార్జునసాత్యకులు ద్రోణుం గెలిచి రని లోకు లాడిన నది నీవీనుల కింపుపెంపు గావించునే? మందభాగ్యుఁ డగునాకుఁ గీడు మూఁడె. కడచిన దెట్టులుం గడచె. ఇఁక దానికి వగచినం బ్రయోజనం బెయ్యది? సింధురాజరక్షణార్థం బిప్పటి కెయ్యది కర్తవ్యం బగు దాని నీమతిం జింతించి నిశ్చయించి చేయు మనిన విని

యాచార్యుం డతని కిట్లనియె. అయ్యా, యేను నాయోపినకొలంది యొడలోమక పెనంగుచున్నాఁడ నింతకంటె నేమి చేయంగలవాఁడను. మనసేనను ముందఱను వెనుకనుం బాండవవీరు లటిమి తఱిమి బిట్టు నొంచుచున్నవారు. ఇక్కడ నేను లేకుండిన నందఱుం గూడి సింధురాజుసమీపమునకు వత్తురు. సైంధవరక్షణంబు మనకు ముఖ్యకృత్యంబు. అతం డర్జునున కొకనికే వెఱచియుండిన నిప్పుడు సాత్యకివృకోదరులుం గూడమట్టిరి. మున్ను నీవు శకునిబుద్ధికై తవమున జూదమునం గెలిచినగెలుపు గెలుపు గాదు. నాఁడు శకుని యేసినయడ్డసాళ్లే నేఁడు ఘోరాకారంబు లైననారాచంబులయి సవ్యసాచిప్రముఖులచేత నేయంబడుచున్నవి. సైంధవుఁ డొడ్డుగా నేఁ డర్జునునకు నీకును జూదంబయ్యె. ఇందు గెలిచిన నీవు నిక్కంబ గెలిచినవాఁడ వగుదువు. కావున నందఱును బ్రాణత్రాణపరాయణత్వంబు మాని పోరుఁడు. జయాజయములు దైవాధీనములు. నీ విక్కడఁ దడవు సేయక యక్కడకుఁ జని సింధురాజరక్షకులకుఁ దోడుపడుము. నే నిక్కడఁ బాంచాలపాండవులతోడఁ బోరుచుండెద ననుటయు దుర్యోధనుండు తన్నుఁ దాన పురికొల్పుకొని రయమున సింధుపతియొద్దకుఁ జనుచుండి మున్ను కృతవర్మచే నివారితులై సేనావ్యూహంబు వెలుపలఁ జనుచు గాండీవగుణక్వణనంబున నర్జునుం డున్నయెడ నుపలక్షించి యఱిముఱిం గురుబలమునఁ బాయలుగావించి యయ్యమరనాథతనూభవుం దఱియఁ జనుచున్నయుధామన్యూత్తమౌజులం గాండీవిచక్రరక్షకులం దాను వారించి పోరికిఁ గడంగినం గోపించి యుధామన్యుండు ముప్పది శరముల దుర్యోధనుమేన నాటి యిరువదియమ్ములఁ దత్సారథిని నాలుగింట గుఱ్ఱములను నొప్పించె. అందులకు రోషపరీతుండై సుయోధనుండు సాయకద్వయమున యుధామన్యు కేతనకోదండములం గూల్చి యొక్కభల్లమున సారథిం బరిమార్చి నాలుగమ్ముల గుఱ్ఱములనాలుగింటెని సమయించుటయు యుధామన్యుఁ డొండుతేరెక్కి యమర్షభరితుండై భవదగ్రనందను స్తనాంతరమున ముప్పదివాలమ్ముల నాటుటయుఁ దోడన యుత్తమౌజుం డతనిపైఁ బటుప్రదరనికరముఁ బరగించి సారథిం జంపుటయు దుర్యోధనుఁ డలిగి యయ్యుత్తమౌజునిగుఱ్ఱములను సారథినిం బొలియించె. హతాశ్వసారథికుండై యుత్తమౌజుండు వేగమున యుధామన్యునరద మెక్కి దుర్యోధనునశ్వములం జంపి విల్లు దునుముటయు గాంధారేయాగ్రజుండు రయమునం దేరు డిగ్గనుఱికి గద గొని వారల నడువం దొడరిన నప్పాంచాలకుమారులు తటాలున రథావతీర్ణులై చనినం గురుక్షితీంద్రుఁడు తదీయరథముఁ దురంగకేతనాదులతోడ నుగ్గు గావించి మద్రపతితేరెక్కె. అంత యుధామన్యూత్తమౌజులు వేఱుతేరు లెక్కి యర్జునునొద్దకుఁ జనిరి. అప్పరమసంకులమున రాధేయుండును వృకోదరుఁడు నొండొరులం దలపడి మత్తద్విరదముల

చండమునం బోరి రనిన ధృతరాష్ట్రుఁడు సంజయున కిట్లనియె. సంజయా, భీమున కోడినకర్ణుండు దాఁ దొలుత నతనిం దాఁకెనో ? కాదేని భీముఁడే కర్ణుని మా ఱుకొనియెనో ? వారిద్దఱపో రెట్టంగిఁ జెల్లె; భీష్మద్రోణులకుఁ బిదప విలుకాం డ్రలోనెల్లఁ గర్ణుఁ డుత్తముఁ డని ధర్మరాజు తలంచితలంచి రేలెల్లఁ గన్ను మూయఁడు. భ్రాతృత్వజ్ఞానమునను గరుణాభరమునను గుంతీవాక్యమునను గర్ణుం డు భీమునిఁ జంపఁ దలంపఁడు. కర్ణుండు పాండవుల నందఱం గెలుచు నని మం దాత్ముఁడై నదుర్యోధనుండు నమ్మియుండును. అమ్మహారథుఁడు దిగ్విజయమున లోకమునెల్ల గెలిచినవాఁడు. కవచకుండలములతోడన జనించినవాఁడు. మావా రికి నమ్మినబం టగునతనిపోరు సవిస్తరముగఁ జెప్పుము. వినం గుతూహలం బయ్యె డి నని యడిగిన విచిత్రవీర్యపుత్రునకు సూతపుత్రుం డిట్లనియె.

కర్ణుఁడు భీమునితోడఁ బోరి పలుమాఱు లోడుట.

అట్లు రాధేయుండు విరథుండై వృషసేనుతే రెక్కి తొలంగిన భీముఁడు కృష్ణార్జునులయొద్దకుఁ జనుచున్నంతఁ గ్రమ్మఱి యతం డతనిం దాఁకి వర్షధారల శైలమునుంబోలె శరాసారమునం గప్పి మందహాససుందరవదనుండై యోభీమ సేనా, శత్రువులతోడిరణము నీకుఁ గలలోనైన నవిభావితంబు. కావుననే య ర్జునుం జేరువాడవై వెన్నిచ్చి యరిగెద విది కుంతీనందనుల కనురూపంబు గాదు. బిఱుదుమానిసివేని నాయెదురఁ జక్కనిలిచి శరము లడరింపు మని పిల్చుటయుఁ గ్రోధదీపితుండై వృకోదరుం డర్ధమండలావృత్తగమనమునఁ దిరిగి నేఁటితోఁ గయ్యము ముగింతునని శరవర్షముఁ గర్ణునిపయిం గురిసె. అయ్యాచార్యున కెనవచ్చుచు రాధేయుండు భీమబాణములఁ బ్రతిబాణముల రూపం బడఁగించి నవ్వుచుఁ బరిహసించి యవమానించుటయుఁ గోపించి బకాంతకుండు సకలయో ధులు చూచుచుండ నేచి వత్సదంతశరనికరంబుఁ గర్ణునిస్తనాంతరమున నాటి తోన డెబ్బదిమూఁడువాఁడియమ్ములం బరఁగించినం గర్ణుండు కనకజాలపరివృ తంబు లయినభీముతురంగముల నాలుగింటిని వేఱువేఱ మైదేసిసాయకమ్ముల నొప్పించి తేరి కెల్ల శరమయ మగుతెరఁ గల్పించి రథధ్వజసారథులతోడ భీము నదృశ్యుం గావించి తోడన యఱువదినాలుగమ్ములఁ గవచము భేదించి మర్మభేద నకర్మఠంబు లగుతీవ్రనారాచములు పెక్కు లేసె. ఏసినం జలింపక వృకోదరుండు నిశితభల్లముల ముప్పదిరెంటి నడరించుటయుఁ గర్ణుఁ డందులకు నెవ్వక యప్ర యత్నమున భీమునిపైఁ బటుకొండజాలంబుఁ బరఁగించె. అవ్విధమునఁ గర్ణుఁడు మృదుపూర్వముగఁ బోరుచుండఁ గీచకాంతకుండు పూర్వవైరముఁ దలపోయుచుఁ బటుజవమున శరవర్షముఁ గురిసినం దత్సాయకములు పేరెలుం గిచ్చుచుఁ బులుఁ గులు గూడు సేరుకై వడిని బావకుం జొచ్చుమిడుతలమాడ్కిని నుద్భటరయ

మునం గర్ణు నావరించిన నాతండు వానినెల్ల రూపడంగించి మఱియుం బెక్కుతూ
పులు నాపవనసూనుపై నడరించె. అడరించినం బిడుగులకుం బురుడింపం దగినక
ర్ణునమ్ములం బహుభల్లములం దునిమి వడముడి వడిం బేర్చి తోడన బలుతూపులు
గురియుచుండం గర్ణుండు మఱియుం గాండజాలంబుం గురిసినం గౌంతేయమధ్య
ముండు సూతసుతశరపూరితసర్వాంగుండై శలములు చుట్టుకొన్న యేదురీతిం
జూపట్టియు రుధిరసిక్తుండై యామనితఱిం బూచినరక్తాశోకమహీరుహముకైవడిం
జూడనొప్పియు నొప్పి గణింపక క్రోధోద్వృత్తలోచనుండై యిరువదేనునారసముల
విషోల్బణపన్నగముల శ్వేతమహీధరమునంబోలెం గర్ణుగాత్రమునం జొనిపి తోడన
యాఱువాలమ్ములను నెనిమిదినిశితశరములను మర్మమ్ములు వ్రచ్చి యొక్కబాణము
నం గార్ముకముం దునిమి నాలుగుతూపుల గుఱ్ఱముల నాలుగింటిం బొరివుచ్చి సారథిం
దెగటార్చి సూర్యమయూఖసన్నిభంబు లగువాఁడినారసములం గొన్నింటి నారా
ధాసుతునురమ్మున నాటుటయు నవి మేఘమండలము భేదించి వసుధకు వచ్చు
తరణికిరణంబులకరణిం గర్ణునిగాత్రంబుం బొడిచి పుడమిం బడుటయు నమ్మహా
రథుండు మూర్ఛిల్లె ననిన విని యాంబికేయుండు సంజయా, దుర్యోధనుఁడు తన
నమ్మినపోటుమానిసి యగురాధేయుండు తదవస్థుండైన నేమనియె. కర్ణుండు మరల
సమరమునకుం గడంగెనే? పదంపడి యేమయ్యె ననియడుగ సంజయుం డతని
కిట్లనియె.

అంత రాధేయుం డొండుతేరెక్కి వాతోద్ధూతసాగరంబుచందంబున
ఘూర్ణిల్లుచు మరల భీమసేనుం దలపడినం జూచి నీకొడుకు లావృకోదరు నగ్ని
లోన వ్రేల్చినవానిగాం దలంచి జ్యాఘోషంబుం గావించియుం గరతలాస్ఫాలనం
బొనరించియుం బొంగుచున్నంత నాహిడింబాంతకుండు కర్ణుం దలపడిన నయ్యిరు
వురును గ్రోధరక్తేక్షణులై యొండొరులం జుఱచుఱం జూచుకొనుచు మహో
రగములచాడ్పున నిశ్శ్వసించుచు బెబ్బులులచందమునను డేగలచాడ్పునను శరభ
ములభంగిని నెక్కువతక్కువలు లేకుండం బోరుచుండునంత వృకోదరుం డేచి నీవు
కొడుకుమతమునం గుంతీదేవితోడం దమ్ము నేవురను లక్కయింటం గాల్పంబూను
టయు, సభలో దుశ్శాసనుండు ద్రోవదిముందల పట్టి యీడ్చి పరిభవించుటయు,
నప్పరమపతివ్రతం జూచి కర్ణుండు నీమగలు గొడ్డుపోయిరి నరకమునం బడిరి
తగినమగని వెదకికొమ్మని దూఱుటయు, నీకొడుకులు దా మడవికిం దఱలునెడం
బలుదెఱంగులం బ్రల్లదంబులు బలుకుటయు మున్నగునెగ్గులనెల్ల మనమునం దల
పోసి కార్ముకజ్యాఘోషంబుం గావించి సూర్యకిరణప్రచారమున కెడ గలుగనట్లు
శరజాలమునం గర్ణునరదముం గప్పె. కప్పిన నవ్వి యవ్విభావసుతనయుండు భీముని
శరములం బ్రతిశరములం దుమురుసేసి తోత్రముల నేనుంగునుం బోలెం దొమ్మిది

వాలమ్ములం బిట్టేసిన నతండు నెవ్వక సూతపుత్రుం దలపడియె. వైకర్తనుండు సరభసముగ వచ్చుచున్నయతని మత్తద్విపంబును మదగజంబువోలె మార్కొని శంఖధ్వానంబుఁ గావించినం దన్నినదమున మూఁకలు ప్రహర్షసంక్షుబ్ధంబుల గుటం జూచి భీముఁడు శరజాలమునఁ గర్ణుం గప్పె. అతండు ప్రతిశరముల వానిం దెరలించి వడముడితేరిగుఱ్ఱములతోఁ దనగుఱ్ఱములఁ దాఁకించి యాసన్నుండై పోరం దొడంగుటయు హాహారవం బెసంగె. అయ్యిద్దఱియశ్వము లొండొంటి తోడం గలిసిన సితాసితనీరదములు గలిసినవిధంబు దోఁచె. అవ్విధమునఁ గర్ణుండు భీమసేనుండు నత్యంతసన్నిహితులై నీమర్మంత్రమునం బుట్టిన యా సంగ్రామమునఁ బరస్పరస్పర్ధ యతిశయిల్ల నెకల్లొకల్లకు మిగిలి సువర్ణపుంఖము లగుశరముల వేనవేలు పరఁగించి నభంబెల్ల మహోచాల్కాజాలసంతతం బగు తెఱంగుఁ గావించి పోగుచుండఁ గృష్ణార్జునులు కర్ణునితోడిపోరు భీమునకు భరం బయ్యెడు నని తలంచుచుండిరి. కర్ణభీములయమ్ములతాఁ కోర్వఁజాలక సైనికు లమ్ముపెట్టుదవ్వు గడచి యొదిఁగి నిలిచి వేడుక చూచుచుండి రనుటయు నాంబి కేయుఁడు సంజయున కిట్లనియె. సూతనందనా, సురాసురాదుల గెలువఁ జాలిన కర్ణుఁడు భీముం జయింపలేకుండుటం జూడ నాకు మిక్కిలి యద్భుతంబయ్యెడి. తుది వారికి జయాజయము లెట్లయ్యెనో? రాధేయుఁడు పాండవులను గృష్ణ సాత్యకులనుం గెలుచునని తలంచి కయ్యముఁ జేసి నాకొడుకు మోసపోయె. నా కొడుకులయనయంబులంజేసి వృథా కౌరవులెల్ల నశించిరి. కర్ణుఁడు పాండవులం గెలువఁజాలఁడు. ఎన్నిమాఱులైనం బాండవులే గెలుచుట యితం డోడుటయుం దప్పదయ్యె. పాండవులు మహేంద్రపాలితులై నసురలకు నజేయులు. ధనేశ్వర ధనతుల్యం బయినపాండవులరాజ్యము వంచనచే నొడిచికొని మందబుద్ధి యగు దుర్యోధనుఁడు వారలఁ దాను గెలిచినట్లు భావించె. ఉత్తుంగగిరిశృంగమునం గలతేనియఁ గొనువాఁడు మీఁదనగుపాటుం గానని తెఱంగున మావారు పాండ వులపరాక్రమముఁ దలపోయక తొలుత నన్యాయమునఁ దద్రాజ్యం బపహ రించి యిప్పుడు చెడిరి. నేను గొడుకులమాటలుపట్టి ధర్మనిరతు లగుపాండు రాజపుత్రులకు నికారముఁ జేసితి. దీర్ఘాలోచనపరుం డైనధర్మనందనుండు సంధిఁ గోరిన మనవా రతఁ డశక్తుఁడని తలంచి వినరైరి. తమకు మేము సేసినయప కారములనెల్లం దలంపునకుఁ దెచ్చుకొని భీముఁడు పోరుచున్నవాఁడు. గతంబు నకు వగవం బనిలేదు. కర్ణభీములయనంతరసమరప్రకారంబుఁ దేటపడం జెప్పు మని యడిగినధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె.

అత్తెఱంగున మరుత్తనూజుండును రవితనూజుండు నొండొరులం దలపడి పోరుచున్నంతఁ గర్ణుఁ డేచి మహావేగములు కనకపుంఖము లగుముప్పదిశితశర

ముల వృకోదరుం బిట్టేసిన నాతం డలిగి మూట నతనివిల్లు దునిమి యొక్కభల్ల
మున సారథిం బరిమార్చినం గోపించి కర్ణుండు భీముం జంపువాఁడై ఘోరశక్తి
నెత్తి విసరివైచి యార్చుటయు నీకొడుకులు ముదమునం బొదలిరి. వడముడి యా
శక్తి నేడాశుగముల నడుమన తునియలు గావించి సూతసూతిప్రాణముల వెదకి
కొనువాఁడై యమదండోపమంబు లయినఘోరనారాచములం బిట్టేయుడు రాధే
యుం డొండువిల్లెత్తి సజ్యంబుఁ గావించి సాయకజాలముఁ బరఁగించినం గినిసి పవ
మానసూనుండు తొమ్మిదియమ్ముల వానిం దుమురుసేసి యార్చిపేర్చుటయుఁ బదం
పడి యయ్యిద్దఱు పెద్దయాఁబోతుల తెఱంగునను గ్రోల్పులులవిధమునను మత్త
మాతంగంబులభంగినిం బరమదారుణముగ నార్చుచుఁ గన్నుల నిప్పుకలు రాలఁ
జూచుచు నవ్వుచు నదలించుచుఁ జిందముల మ్రోయించుచు నెక్కువతక్కువలు
లేక కొండొకవడి పోరిరి. అంత నుక్కుమిగిలి కనలి యనిలనందనుండు రాధానం
దనుచాపంబు ముష్టికి నెఱికి శంఖవర్ణము లగురథ్యములం జంపి సారథిం బుడమిం
బడఁద్రోచి బాణజాలముఁ గురియించుటయు భీమశరసంవృతుండై రాధాసు
తుండు చేయునదిలేక వెగడుపడియె. తదవస్థుం డైనకర్ణుం జూచి దుర్యోధనుఁడు
కోపవేపమానుండై యతనికి బాసటగాఁగ దుర్జయుం బంపుటయు నతండు భీముం
దలపడి యవ్వాడముడిమేన బాణనవకంబును శరసప్తకంబును గీలించి యెనిమిది
యమ్ములఁ దురంగమ్ములను నాఱుతూపుల సూతుని మూడువాఁడికోలలఁ గేతన
మునుం బిట్టేసె. ఏసినం గినిసి భీముఁ డొక్కమాత్రలోన నాదుర్జయునిఁ దత్సా
రథిని యమపురి కనుచుటయుఁ గర్ణుఁ డేడ్చుచు నేలంబడి తన్నుకొనుచున్న నీకొ
డుకును వలగొని యేడ్చుచు నొండుతేరెక్కి పాండవుం దాఁకి శరవ్రాతంబుఁ
బరఁగించి యొక్కవాలమ్ము నతనిఁబొమ్మున నాటె యార్చె. ఆర్చినం గోపించి బ
కాంతకుండు రాధేయునిఁ బదియమ్ముల నొప్పించి తోన యిరువదితూపులు వరఁ
గించుటయుఁ గర్ణుఁడు భీముని స్తనమధ్యమునఁ దొమ్మిదియమ్ములఁ గీలించి యొక్క
సాయకమున ధ్వజము నూఁగాడనేసి తోడన తోత్రముల శుండాలమును గశా
దండములఁ దురంగమునుంబోలె నఱువదివిశిఖముల నడచి యంత నిలువక
క్రోధోద్రిక్తలోచనుండై యింద్రుఁడు వజ్రముంబోలె సకలకాయవిదారణం
బై నశాతమార్గణం బేసిన నది భీమునిమేను వ్రచ్చి నెత్తుటం జొత్తిల్లి నేలంబ
డియె. అందులకుఁ గనలి యనిలతనూభవుండు నాల్గుజేనలనిడుపును నాఱంచు
లును గలయుద్దండగదాదండంబును రాధాసుతు తేరిపయిం బడనేసినం దత్ప్రహా
రమునఁ గర్ణుతురగములు మడిసె. తోడన తడయక వడముడి రెండుక్షురప్ర
ములఁ గేతనముఁ గూల్చి బలుతూపుల సారథిం జంపిన హతాశ్వసారథికంబు
పతితకేతనంబు నగుతేరు డిగ్గి నేల నిలిచి కోదండజ్యాఘోషముఁ గావించి యం

పవెల్లిఁ బరఁగించి భీముబాణముల నాఁగుచుండినం గర్ణునివిక్రమమున కందఱు
విస్మయంబందిరి. అంత దుర్యోధనుఁడు దుర్ముఖునిఁ గర్ణునకుఁ దోడ్పడం బంపు
టయు నతండు భీముని శరజాలమున నావరించుచుండ నాకీచకారి యద్భుతం
బావహిల్లఁ గర్ణునమ్ములకు మాఱేయుచు సుముఖము లగువిశిఖముల నాదుర్ము
ఖుని యమసదనమునకుఁ బనిచె. దుర్ముఖుండు సచ్చిన నతనితే రెక్కి రాధేయుండు
బాష్పపూర్ణలోచనుండై కొండొకవడి వానిపీనుఁగుఁ జూచుచు నట వానికిఁ బ్రద
క్షిణముగఁ బేరు వొనిచ్చి దీర్ఘోష్ణనిశ్శ్వాసములు నిగుడించుచు నేమియుం జే
యఁదోఁపక ఱిచ్చవడి యున్నంత నాసంమున బకవిధ్వంసి చతుర్దశశితశరము లేసి
రాధేయుమేను నెత్తురువఱ్ఱు గావించుచుఁ బుట్టలోనికిఁ జొచ్చుపన్నగములచంద
మునం జొచ్చినం గినిసి యమ్మహారథుఁడు తానుం బదునాలుగునారసము లేసిన
నయ్యవి క్రౌంచబిలంబు నంచ లెట్టులట్టుల వృకోదరుదక్షిణభుజంబుఁ జొచ్చి నే
లం బడియె. కర్ణనారాచవిక్షతగాత్రుండై నెత్తుటం దోఁగి వృకోదరుఁ డస్తమ
యసమయసూర్యబింబము విడంబించి కోపించి శరత్రయమునఁ గర్ణుని సప్తాశుగ
ములఁ దత్సారథిని నొనేయుటయు భీమశరవిద్ధుండై కర్ణుండు విన్నఁబోయి వే
గవంతము లగునుత్తమాశ్వములఁ దోలించి యనికిఁ దొలంగె. భీముఁడు నారి
మ్రోయించుచు సుస్థిరుఁడై నిలిచె ననిన విని యాంబికేయుఁడు సంజయునకు
వెండియు నిట్లనియె.

సంజయా, దైవము ప్రధానము. పౌరుషము నిరర్థకము. కర్ణుఁడు పాండ
వులం గడవఁజాలఁడయ్యె. కర్ణుఁడు బలవంతుఁడు శూరుఁడు ధనుర్ధరవరుఁడు.
అతఁడు నేనుం గలిసిన దేవతలనైనం గెల్తుము. పాండవులను వాసుదేవునిం గె
లుచు టొకపని గాదని దుర్యోధనుండు నాతోఁ బలుమాఱులు చెప్పె. అతఁడు
వృకోదరున కోడినపదంపడి యాదుర్యోధనుఁ డేమనియె? మోహావశుండై య
గ్నిలోన మిడుత నేయునట్లు యుద్ధమర్మము లెఱుంగనిదుర్ముఖుని భీముపాలం
ద్రోచి చంపికొనియెనా? కృపాశ్వత్థామశల్యులందఱు నొక్కమొగిం గూడియు
వృకోదరుం గెలువఁజాలరు. వారును భీమునిబలవీర్యవ్యవసాయము లెఱింగి తొ
లంగి యుండుదురుకాని పయిపయింబడరు. కర్ణుఁ డొక్కండు నిజభుజదర్పమున
నొడియుఁ బోక పెనఁగుచున్నవాఁడు. ద్రోణుం గెలిచి వాహినిం జొచ్చిన భీ
ముని గెలువ నెవ్వరికిం దరంబుగాదు. ఇంద్రునెదుర దానవునిచందమున భీము
నెదుర మనవాఁ డొక్కఁడు నిలువఁజాలఁడు. ప్రేతపురమునకుఁ జనినమనుజుం
డైన మఱలివచ్చుఁగాని భీమునునమునం బడినవాఁడు మగిడి రానేరఁడు. క్రో
ధోద్దీపితుండైనవృకోదరుమునుముఁ జొచ్చినవారలందఱు పావకుం జొచ్చిన మి
డుతలట్టులు మడిసిరి. నాఁ డాసభలో సంరంభియై తాఁ జెప్పినమాటలెల్ల నిపుడు

భీముఁడు చెల్లించుచున్నవాఁడు. కర్ణుఁ డోడినం దుశ్శాసనుండు నాసుయోధనుం
డును దొలంగిరకాని వడముడిం దాఁకరైరి. కర్ణుఁడును దుశ్శాసనుఁడును నేను
ను బాండవుల నిస్సంశయముగ గెల్తుమని యడిబీరములు పలికినయాసుయోధనుఁ
డు కర్ణుఁడు విరథుఁడై వృకోదరుని కోడుటం జూచి వాసుదేవునిమాట వినక
చెడితినని పశ్చాత్తాపంబునం బొగులకుండునే? తనతప్పునఁ దమ్ములును జెలులును
జుట్టలునుం జచ్చుచుండిన నెవ్వానికైన నెట్టులు వగ వొడమకుండును. ప్రాణముల
గాచికొనువాఁడు పాండవులం దాఁకఁడు. బడబాగ్నిఁ జొచ్చియుఁ దప్పించుకొని
బ్రదుకవచ్చుఁగాని భీముబారింబడి ప్రాణములతోడ వచ్చుట కానిపని యని నామ
తంబు. పాండవపాంచాలకేశవసాత్యకులు పోరికి నడుతురేని ప్రాణముల డాఁపక
చక్క నిల్చి పోరుదురు. అక్కటా! నాకొడుకులజీవితంబు పోయెఁగా యని వగ
చుచున్నంత సంజయుండు మహారాజా, యిప్పు డూరక వగచినం బ్రయోజనం
బెయ్యది? ఈచేటునకెల్ల నిక్కువంబుగ నీవే మూలము. కొడుకులమాటవట్టి
పోరు తెచ్చికొంటివి. అప్పుడు హితు లగువా రెంద ఱెంత చెప్పినను రోగికిఁ
బథ్యాహారంబు తలకంటగించుచందమున నీ కది హేయముగాఁ దోఁచె. తాను
దనంతన వలదనిన వినక కాలకూటముఁ దిని యది వికారములు చేయందొడం
గినవు డేడ్చినం బ్రయోజనం బెయ్యది? అప్పుడు చేసినయనయమున కిపుడు
ఫలము పరిపక్వంబయ్యె. వలదనినం బోవునే? ఉత్సాహసాహసశౌర్యములకుఁ
దగినట్టులు పోరుచున్నశూరుల నేల వృథా దూలనాడెదవు. సమరప్రకారంబు
లెస్స వినుమని సంజయుం డతని కిట్లనియె.

### భీముఁడు దుర్మర్షణాదు లగుకురుకుమారులం జంపుట.

అట్లు కర్ణుండు భీమున కోడినం జూడనేరక నీకొడుకులు దుర్మర్షణుండు
దుస్సహుండు దుర్ధరుండు దుర్మదుండు జయుం డనువార లేవురును విచిత్రసన్నా
హులై యెక్కమొగి వృకోదరుం దాఁకి శరజాలంబుఁ బరఁగించి దిశాతటములం
గప్పిన నప్పవనపుత్త్రుఁడు నగుచు వారల మార్కొనుటయు రాధేయుండు వారలం
జూచి రయమున నతనికిఁ దా నడ్డపడి యంపతుంపరం గురియుటయు నీకొడు
కులు కర్ణప్రాపుఁ గాంచి పాండవుపైఁ బటుప్రదరముల నడరించిరి. భీముఁడు
రాధేయునిశరములకు మాఱేయుచు నవ్వుచు నవలీల నయ్యేవురను నిరువదేను
తూపులం బిట్టేసి యమునింటికిఁ బనిచిన నందఱును భయవిస్మయములం బొంది
నీకొడుకులేవు రొక్కపరి పడుటకు శోకించి కర్ణుఁ డుదీర్ణక్రోధుండై భీమునిం
జుఱచుఱం జూచిన నతండును జ్యాఘోషంబుఁ గావించుచుఁ గన్నుల నిప్పులు
రాల నారాధేయుం గనుంగొని క్రోధావిష్టుండయ్యెఁ దనయెదుర నందఱు పడు
టకు బ్రదుకుపయి నిర్వేదంబుఁ గాంచి ఱిచ్చవడియున్నరాధేయునిపైఁ బూర్వ

వైరముఁ దలపోసి వాలంపగముల నిగుడించినం గినిసియు నవ్వుచు నవ్వైకర్తనుం డతనిపై నైదుసాయకములఁ బరఁగించి తోన శిలాశితము లగుకనకపుంఖమార్గణముల డెబ్బదింటి నడరించె. ఆయమ్ముల సరకుగొనక బకాంతకుండు కర్ణుని నూఱువాలమ్ముల నొనేసి తోన శితవిశిఖముల మర్మస్థానములఁ గీలించి యొక్క భల్లమున విల్లు దునిమినం గర్ణుండు వేఱుచాపం బెత్తి భీమసేనుని శరజాలమునం గప్పె. కప్పినం గనలి యనిలతనూభవుండు రాధాతనూభవునిగుఱ్ఱములను సారథినిం బొరివుచ్చి యతండు నవ్వినదానికి మాఱుగాఁ దానును నవ్వి బలుతూపులఁ గార్ముకముఁ ద్రుంచుటయు రాధేయుండు తేరు డిగ్గి గదయెత్తి మరుత్తనయుపయిం బడవైచె. భీముఁడు దానిఁ దోడన నడుమన యందఱు చూచుచుండఁగఁ దునియలుగావించి శరసహస్రం బడరించుటయు రాధేయుండు తనపదాతిత్వంబును నిస్సహాయత్వంబునుం దలంపనిబీరంబునం బొంపిరివోయి తద్బాణముల వారించి బలుతూపుల వృకోదరునిమైమఱు వఱువుల్లు చేసి యిరువదేనుకుప్పెకోలలం బరఁగించుటయు సకలసైనికులును విస్మయం బందిరి. అంతఁ గీచకాంతకుండు కోపాటోపదీపితుండై వాఁడిములుకులు పెక్కులు పరఁగించిన నవి రాధేయుకత్తళంబుఁ జించి దక్షిణభుజం బగిలించి నేలం బడినం దోడన భీముఁడు సాయకాసారముఁ గురిసినం దన్మార్గణప్రచ్ఛన్నుండై భానుసూనుండు మఱల రణవిముఖుండయ్యె.

అట్టియెడ దుర్యోధనునిపంపున నీకొడుకులు చిత్రోపచిత్రచిత్రాక్షచిత్రచారుచిత్రశరాసనచిత్రాయుధచిత్రవర్మనామధేయులు క్రోధవిధేయులై భీముం దాఁకి శిలీముఖస్తోమం బడరించిన నవ్వడముడి వారలనందఱ నొక్కొకవాలమ్మున బిట్టేయుడు వాతోద్ధూతధారుణీరుహంబులట్లు నేలంగూలిరి. భవత్తనయులు పడుటకుఁ గన్నీరు నించుచుఁ గర్ణుఁడు విదురుండు చెప్పినట్ల యగుచున్నదని తనలోఁ జింతించి సవిశేషకల్పితం బయినయొండుతేరెక్కి రయమున బకాంతకుం దాఁకి బలుతూపు లడరించుటయు నప్పవమానసూనుండు ముప్పదియాఱునిశితభల్లముల సూతపుత్రునికత్తళంబుఁ జించిన నతం డతని నేఁబదివాలమ్ముల నొంచిన నయ్యిద్దఱు నెత్తుటం దోఁగి రక్తచందనంబుఁ బూసికొనినవిధమునఁ బొలిచి కత్తళంబులు దుమురగుటం జేసి తో లూడ్చినపాములపగిదిం జూడ నొప్పుచుఁ గ్రోల్పులులచందమునను మత్తమాతంగముల తెఱంగునను బెద్దయాఁబోతులరీతిని గొదమసింగములభంగిని శక్రవైరోచనులచాడ్పునను నెక్కువతక్కువలు లేక వివిధమండలచిత్రగతులఁ జూపుచుఁ దొలఁగుచు మలఁగుచుఁ బాయుచు డాయుచుఁ బలుదెఱంగుల రణక్రీడనంబు సల్పుచున్నంత భీముఁ డేచి జ్యాఘోష ముఱుముగా మండలీకృతకనకకార్ముకప్రభలు మెఱుఁగుతళతళలుగాఁ బ్రావృడంబుదంబు విడంబించుచుఁ గర్ణుం డనుకులశైలమును శరాసారమునం

గప్పి వాసుదేవార్జునులకును సాత్యకికిని యుధామన్యూత్తమౌజులకును బరమ సంతోషంబుఁ బొనరించుటయు నీకొడుకు లవ్వడముడిపీర్యధైర్యభుజబలములం జూచి డిల్లంబోయిరి. ప్రతిగజస్వనంబు సైరింపనిమత్తశుండాలముచందమున రాధేయుఁడు భీమసేనునిధనుర్గుణక్వణనంబునకుఁ గోపించియు నచ్చటఁ బడియున్న నీకొడుకులపీనుంగులం జూచి పరమదుఃఖితుండై వేఁడినిట్టూర్పుగాడ్పుల నిగుడించుచు ముహూర్తమాత్రము మిన్నకుండి పదంపడి క్రోధవశుండై క్రూరాశీవిషంబువోలె రోఁజుచు భీముం దలపడి వింట నమ్ము లరిఁబోయుచు రశ్మిమంతుఁడగుభాస్కరునికరణి నత్తఱిం జూడనొప్పి వృకోదరుపయిం దత్కాండజాలం బడరించిన నవి రాధేయునివిల్లుమొదలు వడముడితేరుదనుక శారులు తీరినయం చలతీరునం జూడనొప్పుచు నిజరయమున గగనము నించుచు నునికికై ప్రమాను చేర వచ్చుపులుఁగులవిధమున నన్నియుఁ దన్నుఁ జేరవచ్చుచుండ నప్పాండవ వీరుండు సరకుసేయకుండుటయుఁ గర్ణుఁడు తొరొన తొమ్మిదియమ్ములఁ బరఁగించె. అందులకుం జలింపక ప్రభంజనాత్మజుండు కర్ణునివింశతివిశిఖములను వెండియుం గాండజాలముననుం గప్పిన భీమసేనుపరాక్రమముఁ జూచి కృపద్రోణిశల్యసైంధవభూరిశ్రవులును వాసుదేవార్జునసాత్యకియుధామన్యూత్తమౌజులును నవ్వాయుసూనుం బొగడి సింహనాదములు గావించుటయుఁ జూచుఖేచరులు పిచ్చలించిరి. అప్పరమతుములనినదము విని సుయోధనుఁడు పురికొల్పఁగ నీకొడుకులు శత్రుంజయుండు శత్రుసహుఁడు చిత్రుఁడు చిత్రాయుధుఁడు దృఢుఁడు చిత్రసేనుఁడు వికర్ణుఁ డనువారేడుగురు వృకోదరునిపై నడరి శరజాలముఁ బరఁగించి యుగాంతసమయమునఁ జంద్రుని సప్తగ్రహములట్లు వేధించినం గోపించి కీచకారాతి యేడువాఁడితూపుల వారల నేడుగురం బిలుకుమార్చి న్యాయబుద్ధింజేసి తమకు హితంబులు పలుకువికర్ణుండు పడుటకు వగచి సింహనాదముఁ గావించుటయు నాలించి యక్కడ ధర్మరాజిది భీముఁడు తనవిజయంబు నాకుఁ దెలుపఁ జేసెనని తలంచి ముదమునం బొదలి యాచార్యునితోడఁ బోరికిఁ గడంగె. దుర్యోధనుండు నాఁడు భీమునిచేఁ దనతమ్ము లనేకులు చచ్చుటకు వగపు గదిరినయుల్లమున నక్కటా! విదురునిహితవచనంబు విననైతి నతం డాడినట్టులే యగుచున్నదని చింతించి కొంతసేపు ప్రమాన్పడియుండె. ఆపాపుజూదంబునాఁడు నీకొడుకులు దుర్యోధనుం డాడరాని ప్రల్లదము లాడె. దుశ్శాసనుఁ డన్నపంపున ద్రోవది ముందలవట్టి యీడ్చి చీర లొలిచి భంగపెట్టె. కర్ణుఁ డుగ్గడింపరానిపరుషోక్తులు వలికె. నీవు వినుచు నంతరంగమునఁ బొంగుచుంటివిగాని యిది తగదని వారింపవైతివి. అప్పు డట్టులు ధర్మాత్ము లయినపాండురాజపుత్రుల నలిగించినం బదుమూఁడేడులు వా రాకోపంబు వెడలఁగ్రక్కఁజాలక లోనం బెట్టికొని యిప్పుడు

మీాపై నం గ్రుక్కు_చున్నవారు. విదురుఁ డెన్ని యేఁ దెఱంగుల వారించియు వాదించియు హితముచెప్పినం జెవియొగ్గి యాకర్ణింపవైతివి. తత్త్వార్థదర్శివయ్యు వృద్ధుఁడవయ్యు నీవు వినకుండిన లాఁతు లేమి చేయఁగలరు. సుహృదులహితంబులు వట్టనివారిగతి దైవం బిట్లు కూర్చును. ఏడ్పు చాలించి తత్ఫలం బిప్పుడు కుడువుము. పుత్రులచావునకు నీవే నిమిత్తం బని నామతంబు. వికర్ణుఁడు సచ్చె. చిత్రసేనుఁడు సమసె. చిత్రాయుధుండు మడిసె. దుర్ముఖుండు పొలిసె. పెక్కు_లేల? భీమునిబారిం బడిరేని నీకొడుకులు ప్రాణములతో వచ్చుట యరిది. నీనిమిత్తమునంజేసి నిత్యంబు నేను నీఘోరకర్మంబుఁ జూచుచున్నవాఁడ ననుటయు నాంబికేయుం డయ్యా, యంతయు నాయనయంబునఁ బుట్టినది యని నేను నిప్పుడు తలంచెద. ఇఁకఁ గార్యం బెయ్యది? నాబుద్ధిం బుట్టినచేటు సవిస్తరముగఁ జెప్పుము. సుస్థిరుండనై యాకర్ణింప నున్నవాఁడ ననిన సంజయుండు ధృతరాష్ట్రున కిట్లనియె.

అవ్విధమునఁ జలంబు నెఱయ బలంబు మెఱయఁ గర్ణభీములు పరస్పరవిజిగీషామనీషం జేసి యితరేతరబాణముల నన్యోన్యమార్గణముల వారించుచుఁ బోరుచుండ నయ్యిరువురు మహారథులవాలంపగములతాఁకోర్వఁజాలక మనసైనికులక్కటా! యిది యేమి దైవంబు పాండవార్థము మనల నొంచుచున్నది. భీమునియమ్ములట్లుండ రాధేయవిశిఖములును వృకోదరప్రతిహతంబులై తిరిగి మనపయిం బడుచున్నవని తమలోనం బలుకుచు ననాథులై దీనులై హతవాహనులై వెఱచి యమ్ముపెట్టుదవ్వు చని తొలంగి వేడుక వెడమి యయ్యతిరథులపోరు సూచుచుండిరి. గజవాజినరగాత్రంబులవెడలుశోణితంబు దుస్తరమహాప్రవాహంబై శూరులకు మోదమును భీతులకు విషాదమునుం గావించె. ఎక్కడఁ జూచినను గూలినకేతనంబులును గులగులలైనరథావయవంబులును విఱిగిననానాహేతివ్రాతంబులును నఱవఱలైనమైమఱుఁగులును బొడిపొడియైనతొడవులును గా లిది చే యిది యని యేర్పఱుపరాకుండ గులగులలైనకరితురగపదాతిగాత్రఖండంబులును బఱియలైనగొడుగులును దునిసినచామరంబులునై సంగ్రామభూమితలంబు గ్రహనక్షత్రాదిసమంచితం బయిననభోమండలమున కెనయై ఘోరాభిరామంబయ్యె. సైన్యమెల్ల మదపుటేనుంగులు గలంచినకమలాకరంబుచందమున వికలంబయ్యె. కర్ణభీములబలవిక్రమములకుఁ జూచుఖేచరులు పిచ్చలించిరి.

### కర్ణుఁడు భీముని నవమానించి నీచోక్తు లాడుట.

అట్టియెడ రాధేయుం డేచి విజయాగ్రజుపై విచిత్రశరజాలంబుఁ బరఁగించిన నందులకు నెవ్వక యవ్వాయుసూనుండు నిశితపీతం బయినయొక్కవాలమ్ము కర్ణునికర్ణంబు నూనేయుటయు నది యతనికుండలమ్ముఁ ద్రుంచుటయు నా

కుండలము నభోమండలమునుండి చుక్క పడునట్లు పడియె. అంత నెండు భల్లముఁ గర్ణుఁడొమ్మున నాటి నవ్వృకోదరుండు వెండియు రయమున నిర్మోకోరగసన్నిభము లయినవిశిఖములఁ బదింటిని లలాటమునం గీలించిన నవ్విరోచనపుత్రుండు నీలోత్పలమాలికం దాల్చిన తెఱంగునం బొల్చి రథకూబరం బూఁతఁగొని వ్రాలి కన్నులు మూసికొని కొండొకవడికిఁ దెలిసి నెత్తుటం జొత్తిల్లినతనమేను జూచి యత్యంతక్రోధసముద్రిక్తుండై భీమసేనుం బొదివి శరశతం బేసె. ఏసినం బవనతనూభవుండు వానికి మాఱేసి వెండియుం గొన్ని తనపై నడరించిన నయ్యమ్ములు సరకుగొనక వైకర్తనుండు తొమ్మిదియమ్ములఁ బాండవునురమ్మునఁ గీలించుటయు నతండును సరభసుండై కడంగిన నయ్యుద్ధులును ఘోరాకారంబులఁ దాల్చి జ్యాఘోషములను గరతలాస్ఫాలనములనుం గావించి కృతప్రతికృతము లొనరించి శరజాలముఁ గురియుచున్నంత బకాంతకుం డేచి నిశితక్షురప్రమున రాధేయునివిల్లు దునిమి పెలుచ నార్చె. అయ్యార్పు నాలించియు సింధుసౌవీరచమూగణంబులు పొలియుటం జూచియుఁ గర్ణుఁ డుదీర్ణుండై రోషించి కన్నుల నిప్పలురాలఁ జూచుచు భారవంతం బత్యంతదృఢంబు నగుశరాసనం బొండు సజ్యంబుగావించి గొనయమ్ము సారించి మధ్యాహ్నమార్తండునివడువున వెలుంగుచు మండలీకృతంబై యగ్నిచక్రోపమం బగునక్కార్ముకమున నెడపక కనకపుంఖశిలీముఖము లరిఁబోసి నిగుడించుటయు నయ్యమ్ములు గగనంబున శ్రేణీకృతంబు లగుక్రౌంచముల తెఱంగునం జూడనొప్పి ప్రావృట్పయోధరంబులు పర్వతంబునుంబోలె వృకోదరుం గప్పుటయు నప్పాండుపుత్రుండు క్రోధోద్రిక్తుండై తన్మార్గణముల సరకుసేయక వింట నమ్ముల సంధించి కర్ణునిపయిం బరఁగించిన నయ్యురంపగములు గగనలక్ష్మికిఁ గట్టినకాంచనమాలికలచాడ్పునం జూడనొప్పె. అవ్విధమున నయ్యుద్ధులశరములు వాయుసంచారంబున కెడలేక గగనంబును దిక్తటంబులనుం గప్పుటయు సూర్యకిరణంబులు ప్రవేశింపరామింజేసి క్రమ్మినకటికచీఁకట్లు పరస్పరశరసంఘర్షమునం బొడముమిడుఁగుఱుల పెల్లునంజేసి యించుక విరియుచుండునంత రాధేయుఁడు తద్బాణములనెల్ల మూఁడుమూఁడుతునియలు గావించినం గోపించి వృకోదరుండు నిలునిలుమని కర్ణు నదల్చి శరజాలంబుఁ బరఁగించిన నయ్యుద్ధులు పరమసంరంభమునం బేర్చి పరస్పరవధకాంక్షులై తను త్రాణచటచటారవంబులును ఘోరసింహనాదంబులును దారుణజ్యాఘోషంబులును రథనేమినిస్వనంబులునుం గావించుచుఁ బోరుటయు యోధులందఱు కయ్యముఁ జాలించి వెఱఁగుపడి చూచుచుండిరి. సిద్ధగంధర్వవిద్యాధరులు మనమ్ములం బ్రశంసించుచు నయ్యుద్ధులుమహారథులపయిం బుష్పవర్షంబుఁ గురిసిరి. అట్టియెడ భీముఁ డేచి సంరంభంబున సాయకాసారముఁ బరఁగించినం గర్ణుండు వానికి మా

చేసి తోన తొమ్మిదివాలమ్ముల భీమునిపైఁ బరఁగించిన నాతండు వానిం దునిమి యారాధేయుని నిలునిలుమని యదల్చి యమదండోపమం బయినఘోరనారాచంబు బిట్టేయుటయు రాధేయుండు నవ్వుచు నవలీలం గాండత్రయమున దానిం ద్రుంచుటయు నర్జునాగ్రజుం డలిగి శరవర్షముఁ గురిసె. కురిసినం గినిసి రాధాతనూజుం డస్త్రమాయం గావించి తదీయశరవర్షము రూపడఁగించి యమ్ములపాదులరెంటిని వింటినారిని శరాసనంబును యుగ్యములపగ్గములనుం ద్రెంచి తోన గుఱ్ఱములం జంపి టెక్కెముఁ గూల్చి బాణపంచకమున సారథిని నొనేయుటయు భీమసారథి యగువిశోకుఁడు తేరు డిగ్గనుఱికి యుధామన్యు తేరిపయికిం జనియె. అంతవృకోదరుఁడు శక్తి నెత్తి విసరివైచుటయుఁ గర్ణుఁడు పదియమ్ములం దాని నడుమన తునియలుగావించిన భీముఁడు పలుకఁ జేతం బూని వాలెత్తికొనం దలంచుచున్నంత రాధానందనుం డంతఁ గడునడి నవ్వాడముడిచేతిపలుకం బలుతూపుల ఖండించుటయు నప్పాండవుండు కరవాలంబు విసరివైచినం గర్ణుచాపంబు దెగియె. అట నవ్వుచు నవ్వైకర్తనుం డొండుకార్ముకం బెత్తి సజ్యముగావించి పటుప్రదరనికరములు పరఁగించుటయు భీమసేనుఁడు వైహాయసగమనమున మీఁది కెగసి క్రూరపన్నగముం బట్టు గరుడునివడువునఁ గర్ణుం బట్టువాఁడై తదీయకేతనం బెక్కినం జూచుఖేచరులు విస్మయం బందిరి. భీముని యుద్యమం బెఱిఁగి కర్ణుఁడు కేతనమునకుఁ గుదురుగా నొనర్చినపీఠంబునడుగున నొదిఁగి డాఁగి వంచనఁ గావించుటయు వృకోదరుఁడు వానినలుదెసలను దేరిపయినిం గానక యయ్యారదంబు క్రింద దూఱెనని తలంచి యతనిం బట్టి గిట్టువాఁడై కేతనదండము డిగ్గనుఱికినం దోన తోఁచి సూతసుతుండు శస్త్రాస్త్రజాలం బడరించుటయు నప్పాండవవీరుండు నిరాయుధుండుగావున వెగడుపడియు వెన్నియ్యక మున్ను బీభత్సునిచేతం జచ్చినయేనుంగులపీనుంగుల నెత్తి యత్తపనతనూజునితేరి కడ్డంబు పడవైచిన నతండు వానిం బలుతునియలు గావించి పెక్కమ్ములు మేనం గీలించిన నొచ్చి యచ్చట మిగిలినధనంజయనిహతద్విపంబుల మీఁది కెత్తి యోషధిశైలము నెత్తినయాంజనేయునిచొప్పున నొప్పి కొండొకవడి వానియమ్ములతాఁకుఁ దప్పించుకొనుచున్నంత నాభానుసూనుండు దానిం దుమురుసేసె. అంత నాబకాంతకుండు దనముందఱం బడియున్నహస్త్యంగములను రథావయవములను నెత్తిన వాని నన్నింటిని నిశితనారాచముల నారాధేయుండు శకలములఁ గావించినం బవనసూనుం డేమియుం జేయనేరక ముష్టిఘాతమున నాసూతనందనుం బరిమార్పఁ గడంగియుఁ గవ్వడిప్రతినం దలపోసి చంపు టుడిగి యూరకుండు నంత నాయంగరాజు వివిధవిశిఖముల నాభీమసేనుని మూర్ఛితుం గావించి కుంతి వచనంబుఁ దనమనంబునం దలపోసి చంపనొల్లక వింటికోపునఁ బొట్ట పొడిచిన

భీముఁ డడిచిపడి వడిపిడికిటం దల గ్రుద్దుటయు నందులకు నొవ్వక నవ్వుచు నవ్వై కర్ణనుండు వాని కిట్లనియె. ఓరితిండిపోత, మూఢ, సంగ్రామకాతర, యింకఁ బో రుడుగుము. భక్ష్యభోజ్యపేయాదిసమవాయములం జేర నర్హుండ వగునీవు పోరి కేల వచ్చితివి? భోజనార్థ మింట వంటలవారలం దన్నుటకు యోగ్యుఁడ వుగాని భండనమున నాయట్టిపోటుమానిసులతోడఁ బోరాడ యోగ్యుండవు గావు. అట్లు కాదేని ఫలమూలాహారుండవై ఘోరకాంతారముల ముని వ్రతంబు నడుపుము. ఇఁక నింటికొండె నడవికొండెఁ బొమ్ము. నీకును గయ్యమునకును బెద్దయు దూరం బని పలికి క్రమ్మఱ నింటికోపునం బొడిచి నవ్వుచు నోరీ పోరిపై నీకుఁ గౌతుకంబు గలదేని నాయట్టివారిబారిం బడక కృష్ణార్జునులయొద్ద కరిగి వా రిప్రాపున నెమ్మదిం బ్రాణములఁ గాచికొను మని యతిదారుణంబుగ నవమానించి పలికిన విని వృకోదరుండు కర్ణుం జుఱచుఱం జూచి యోరీ దురాత్మా, మదించి వృథా దురాలాపంబు లేల పల్కెదవు? ఇంతకు మున్న పలుమాఱులు మీవారం దఱుఁ జూచుచుండ నీ వోడితివికదా. మహేంద్రునకుం గాలభేదమున జయాజ యంబులు గలుగుచుండు నందుల కింత పలుకవలయునే? నన్ను వంచించినట్లు కాదు. బిరుదుమగవాఁడవేని నాతోడ మల్లయుద్ధమునకు రమ్ము. నీపీఁచ మడంచెద ననుటయుఁ గర్ణుఁడు భీమునిమతం బెఱింగి యాసమరమున భీముం గెలువరాదని తలంచి పోటెక్కించుకొనక వానిం గవియు టుడిగె. అట్టియెడఁ గృష్ణునిప్రేరణము న గాండీవి దివ్యబాణజాలంబు లడరించి విల్లు ద్రుంచి తోన యొక్క ఘోరనారా చం బరిఁబోసి నడినేసినం బాముం బట్టవచ్చుపాముగతిం గర్ణునిపయిం బడవచ్చు చున్నయయ్యమ్ము నాచార్యసూనుండు నిశితశరమునం ద్రుంచె. అందుల కలిగి కవ్వడి వడింబేర్చి గురుసుతునిపై నఱువదివాఁడితూపులఁ బరఁగించి నిలునిలుమ ని యదల్చుటయు నయ్యశ్వత్థామ వానియెదుర నిలువనోడి మత్తగజానీకంబుఁ జొచ్చె. భీముఁ డాలోన విశోకుండు కట్టాయితమ్ముసేసి తెచ్చినస్యందనం బెక్కి విన్నంబోయినయాననంబుతోఁ గిరీటికడకుఁ జనియె. సాత్యకియు నద్దెస నరి గె ననిన విని యాంబికేయుండు సంజయా, పూఁటపూఁటను మనయోధులు య శంబుఁ బాసి చచ్చుచున్నవారు. కాలవిపర్యాసం బేమనవచ్చు? ఆఁక లేక యా కిరీటి భీమసాత్యకిసహాయుండై మనబలంబుఁ జొచ్చె. ఇఁక సైంధవుఁడు బ్రదు కు టెక్కడిమాట. అది యట్లుండె. సాత్యకి యొక్కరుండు దర్పమునం బేర్చిన మనమూఁకలెల్ల నేనుంగు గలంచిన కమలాకరంబుచందమున వికలంబు లయ్యెఁ గదా. అతని యనంతరసమరప్రకారం బెట్లని యడుగ సంజయుం డతని కిట్లనియె.

## సాత్యకితోఁ బోరి యలంబుసుఁ డను రాజు చచ్చుట.

అవ్విధమునఁ గర్ణుఁడు భీము నవమానించుటకుఁ గోపించి సాత్యకి మ

హేంద్రవిక్రమమునం బోలిచి పట్టపవలింటిసూర్యునట్టు లుగ్రప్రతాపాతపంబు గాయుచు మనవారిపయిం దలపడిన నెవ్వరు నతనియెదుర నిలువనోడి పఱచు చున్నంత నలంబుసుం డనురాజు కోపించి కనకకవచధరుండును శరశరాసనకరుం డునై యయ్యదువరుం దాఁకి యందఱు వెఱఁగుపడి కనుంగొనుచుండ సాత్యకిపయిం బదియమ్ములు నిగుడించిన శినిప్రభుండు వానిం బ్రతిశరముల రూపడఁగించుటయుఁ దోన యలంబుసుఁడు సాత్యకిమేనం గాండజాలంబుఁ జొనిపి గుఱ్ఱముల నాలుగమ్ముల నొనేయుడుఁ గ్రోధసంరంభవశుండై శినివరుండు నాలుగమ్ముల గుఱ్ఱములనాలుగింటిని నొక్కభల్లమునఁ దత్సారథిని వేఱొక్క వెడందవాతియమ్మునఁ బూర్ణేందుసుందరవదనసముల్లసితంబు కుండలోజ్జ్వలంబు నగునయ్యలంబుసుమస్తకంబుఁ దఱిగి వివిధమండలగతులం దేరు వొనిచ్చుచు మనమూఁకలం గనుపుకొట్టుచుండె. అప్పుడు దుశ్శాసనపురస్సరులై మనవారు పెక్కండ్రుక్కుమిగిలి యాసాత్యకిం దాఁకిన నమ్మహారథుఁడు వారల నందఱం బిలుకుమార్చి మన్ససేనుం బొదివినం జూచి త్రిగర్తరథికులు పెక్కండ్రు వానికిఁ దోడుపడువారై సాత్యకిం దలపడిరి. కృష్ణానుజుండు కోపించి శరజాలంబుఁ బరఁగించి వారిలోనం బ్రధాను లగుపంచశతరథికులం బరిమార్చి నలుదిక్కులందానయైరథశతంబు చుట్టుకొన్నట్లు తోఁచి విక్రమనర్తనంబుఁ గావించుచుండఁ ద్రిగర్తులు వెన్నిచ్చి పఱచిరి. అంత శూరసేనశూరులు కోపించి యయ్యదువర్యుం దాఁకి వానిచేతం బొలియుట యుఁగాళింగు లడ్డపడినం జూచి యొక్కమాత్రలోన సాత్యకి వారలనందఱం బ్రేతరాజపురమున కనిచి జలము దాఁటి స్థలముఁ జేరుతెఱంగున భారతసైన్యంబుఁ గడచి ధనంజయుం జేరుటయు వాసుదేవుఁడు సవ్యసాచి కిట్లనియె. పార్థా, నీకు శిష్యుఁడును జెలికాఁడు నగుసత్యకసూనుండు ద్రోణాచార్యు నతిక్రమించి కృతవర్మ నోడించి జలసంధసుదర్శనప్రముఖులఁ బెక్కండ్రం బరిమార్చి దుర్యోధనాదులం దృణీకరించి యొక్కరుండ భారతసేనాసాగరంబు నిస్తరించి నీయొద్దకు వచ్చినవాఁడు. ఇతనిరాకకు ధర్మరాజుపంపు నిమిత్తంబై యుండవలయు. గోగణమధ్యంబున సింహ మెట్టులట్టుల యితండు కౌరవసేనాగణమునఁ దనబీరముపెంపు పొంపిరివోవ రణరంగమెల్లఁ బీనుంగుపెంట గావించి నెత్తురుటేఱులు దాఁటి వచ్చె ననిన విని జిష్ణుండు కృష్ణున కిట్లనియె. కేశవా, యితనిరాక నాకుఁ బ్రియంబు గాదు. రాజరక్షణార్థంబు మన మచ్చట నితని నిలిపి వచ్చితిమిగదా. ఇపు డితం డిటకు వచ్చిన నతం డెట్లయ్యెనో. ద్రోణునిపాల ధర్మజుని విడిచి యేల వచ్చె? రాజరక్షణంబు సైంధవవధంబును గావింపవలయు. ప్రొద్దు పడమరఁ గ్రుంకుతఱియుం దఱిసె. అంతయు నిట్లుండ నింకొక్కటి నామనమున వగ పుట్టించుచున్నది. భూరిశ్రవుఁడు సాత్యకిం దలపడ నేతెంచుచున్నవాఁడు. సత్యకపుత్త్రుఁ

డింతప్రొద్దు భారతవీరులతోడఁ బెద్దయుఁ బోరుటం జేసి డస్సినవాఁడు. బాణము లును మిక్కిలియుండవు. వాహనములకు దగయు డప్పియుం గలిగియుండు. భూరి శ్రవుఁ డింతకు మున్ను పోరనివాఁడుగావున బడలిక యెఱుంగఁడు. తెచ్చిన య మ్ములన్నియుఁ దూణీరంబులనే యున్నవి. మఱియుం గర్ణకృపాదులు పెక్కం డ్రతనికిఁ దోడుగలరు. మీఁదనేమి కాఁగలదో. సాగరంబు దాఁటినవాఁడు పల్వ లంబునఁ జిక్కుతెఱంగున భారతవీరులఁ బెక్కండ్ర జయించినసాత్యకి భూరిశ్ర వునకుఁ జిక్కియుక్కు దక్కునో. ఇంతయు ధర్మరాజువలనం గలిగె. ఆత్మసం రక్షణంబు దలంపక యతం డితని నేల యిచటికిఁ బుత్తెంచెనో? మాంసముఁ బట్టఁ దమకించుడేగచాడ్పున నాచార్యుండు దన్ను నిగ్రహింపఁబూనుట యాధ ర్మజుండు తా నరయవలదో యని విచారభరాక్రాంతుండై మురాంతకునకు నివాతకవచాంతకుండు వివరించుచుండె.

భూరిశ్రవుఁడు సాత్యకిం దలపడుట.

అట్టియెడ భూరిశ్రవుఁడు సాత్యకిని మార్కొని క్రోధోద్రిక్తుండై యోరీ, శూరమానీ! నాభాగ్యమున నేఁడు నాబారిం బడితివి. ఇంక నెందుఁ బోఁగలవు. చిరాభిలషితం బయినకోర్కి నేఁడు దీర్చికొనియెద. మీఁదు పరికింపక పంపిన ధర్మరాజునకు సిగ్గును జూచుచున్న కేశవార్జునులకు విషాదంబును గురురాజునకు మోదంబునుం గదురఁ దొల్లి లక్ష్మణుఁ డింద్రజిత్తుని వధించినవిధంబున నిన్నుఁ బరిమార్చి యమపురమునకుఁ బనిచి యింతకు మున్ను నీచేఁ జచ్చినరాజులభా ర్యలకు సంతోషంబుఁ గావించెద. సింహముచూడ్కి కగపడ్డక్షుద్రమృగముచం దమున నాకు లోచనగోచరుండవయితి వనుటయు యుయుధానుఁ డోకౌరవ్యా, యేటికి నోరు గలదని వృథాజల్పితం బొనరించెదవు. శారదనీరదగర్జనంబువోలె నీయాత్మప్రశంసనం బప్రయోజకంబు. నాచేతఁ గైదు వున్నంతకు నన్నుం డుచేయ నీ కలవిగాదు. నీతోడిపోరు నాకుం జిరకాలాభిలషితంబు. నిన్నుఁ దెగ టార్పక క్రమ్మఱనని పలుకుటయు నయ్యిద్దఱు పరమసంరంభోద్రేకమునం జేసి క్రో ల్పులులతెఱఁగునను మత్తమాతంగంబులభంగిని మృగేంద్రములచందమునను వీఁక మెఱసి ప్రావృట్పయోధరంబులట్లు శరజాలంబుఁ బరఁగించి పరస్పరశరాసన విదారణంబును నన్యోన్యబాణఖండనంబును నితరేతరకవచభేదనంబును మిథస్తు రంగసంహారంబునుం గావించి నెత్తుటం జొత్తిల్లినసుకుమారగాత్రంబుల నొప్పి విరథులై ఖడ్గఖేటకపాణులై భ్రాంతోద్భ్రాంతావిద్ధాప్లుతవిప్లుతప్లుతసృతసంపాతస ముదీర్ణాదినానాగతులం జూపుచు నేపుమీఱి లాఘవంబు మెఱయ శిక్షాసౌష్ఠవం బునెఱయఁ గృపాణవిహారణంబు సల్పి కొండొకవడికిఁ బలుకలు దుత్తుమురగుడు బాహుయుద్ధమునకుఁ దొడరి యినుపగుదియలం బోనిదృఢభుజదండముల నెం

డొంటం బెనఁగాడుట కుత్తుకలు పట్టుట తలలు డీకొల్పుట కాళ్లం బెనఁగుట దప్పించుట క్రమ్మఱి కలియుట యెత్తి త్రిప్పుట తటాలునం దాఁకుట తాఁకిన నెదురొడ్డుట విసరుట త్రోచుట లేచుట యెగయుట బిగియుట మున్నుగా ముప్పదిరెండు తెఱంగు లయినజెట్టిపోట్లాటలం జాతుర్యంబుఁ జూపుచుండఁ గొంతవడికి సాత్యకిబల మఱినం జూచి దామోదరుండు ధనంజయుం జూచి వీరశేఖరా, సాత్యకి ప్రొద్దువొడిచినదిమొదలుగాఁ బలువురతోడఁ బోరి డస్సినవాఁడుగావున భూరిశ్రవునకుఁ జిక్కి దుర్దశం బొందుచున్నవాఁ డద్దెసం జూడుము. నీవు చూచుచు నూరకునికి పోలదు. శిష్యుం గావు మనుటయు వారిపోరు చూచుచుండు మని యర్జునుఁడు వాసుదేవునకుఁ బ్రతివచనం బిచ్చుచున్నంత నాసోమదత్తతనయుం డేచి సాత్యకిని నేలం బడఁద్రోచి కొదమసింగము మాతంగముంబోలె నీడ్చి ఱొమ్మునం గాలువెట్టి యదిమిపట్టి డాకేల సిగుం బట్టి వలకేల నొఱనుండి కృపాణంబు వెఱికి యతనితలఁ దఱుగఁ జేయి మీఁది కెత్తుచున్నంత హాహాకారంబులు పెలుచనెసంగె. సాత్యకియు నతనిభుజముపయిం దనమస్తకంబుఁ జేర్చి వాలు కుత్తుకపయిం బడకుండఁ బెద్దయుఁ బెనఁగాడుచుండుటయు నయ్యెడరు చూచి సకలసైనికులు హాహాకారం బొనర్చిరి.

#### అర్జునుఁడు కృష్ణుపంపున భూరిశ్రవునిభుజము నఱుకుట.

అయ్యవసరమున వాసుదేవుండు పార్థ, పార్థా, వృష్ణివర్యుం డైనసాత్యకి సోమదత్తసూనునకుఁ జిక్కె. శిష్యునియెడరు మాన్పకుండుట నీకుఁ దగదు. తడవు సేసినం గార్యంబు దప్పు ననుటయు సవ్యసాచి యటు చూచి ముందఱ జయద్రథరక్షకు లఱుముటం జేసి తిరిగి చూడనైనను వలనుగాకున్నది. సాత్యకినిం గావవలయు నింతకు నాసోమదత్తపుత్రుండు సత్యకపుత్రుం దెగఁజూడమిం జేసి మేలయ్యె నని కృష్ణునకుఁ జెప్పి యొక్క వెడందవాఱియమ్ము గాండివమ్మున నరివ్రాసి దృఢాకర్షణంబును శీఘ్రప్రయోగంబునుం గావించి విడిచిన నయ్యమ్ము తత్క్షణంబ మింటినుండి పడుకోఱవి తెఱంగున నాభూరిశ్రవుని బాహుదండముపయిం బడి నడిమికి రెండుగా మణికంకణోల్లసితం బయినయద్దానిం దఱిగె. అవ్విధమునఁ దనభుజము తెగిపడినం గినిసియు వగచియు నేవగించియుఁ గోపగించియు నది క్రీడిపనిగా నెఱింగి తనయత్నంబు విఫలమగుటకు డెందమునం గొందలం బంది గాండీవి కిట్లనియె. కౌంతేయా, యేల యీఘోరకృత్యముఁ జేసితివి? నీదెసయైనం జూడక లాఁతితోడఁ బోరుచున్ననన్నే యుట పాడియే? భూరిశ్రవుం డేమి చేయుచుండ నీచేఁ జచ్చె నని మీయన్న ధర్మజుం డడిగెనేని యేమి చెప్పెదవు? ఈవిద్య నింద్రునివలన నెఱింగితో మహేశ్వరునివలనం దెలిసితో ద్రోణువలనం బడసితో శారద్వతువలన సాధించితో. లోకమునం గలయస్త్రవిదులందఱి

కంటె నస్త్రవిద్యావిశారదుండనియు నసురధర్మజ్ఞుఁడనియుం బేరు వడసిననీ కిదియు చితం బగునే? ధీరు లైనశూరులు ప్రమత్తుని భీతుని విరథుని వ్యసనాక్రాంతుని వేఁడుచున్న వానిని లాఁతితోడఁ బోరుచున్న వానిని నేయు టుడుగుట నీ వెఱుంగవే? ఆర్యున కార్యకర్మంబు కర్తవ్యంబగుఁగాని యనార్యకర్మంబు కర్తవ్యంబగునే? నరుఁడు సతత మెవ్వారితోడఁ జెలిమిచేయు వారిగుణంబులు బట్టుట సహజంబుగా వున నీ వుత్తమకురుకులమునం బుట్టియు వృష్ణికులజాతుం డైనగోవిందునితోడఁ జెలిమిచేయుటంజేసి తద్గుణము లలవడినకతన నిట్టినీచకృత్యములకు వెఱవక తొడఁగితివి. ఇది వాసుదేవునిమతంబగుఁగాని నీకుఁ బుట్టినబుద్ధిగాదు. యదువృష్ణిభోజాంధకులు వ్రాత్యులనియు నీచకర్ములనియుఁ బ్రకృతిగర్హితులనియు సుప్రసిద్ధం బై యుండవారలే నీ కెట్లు ప్రమాణంబై రి యని నిందించినభూరిశ్రవునకుఁ బార్థుం డిట్లనియె. అయ్యా, చెడువానికి బుద్ధియుం జెడు నను పెద్దలమాట నిక్కవంబు. నీ చెప్పినదెల్ల ననర్థకంబు. ఎఱింగియు హృషీకేశుని నన్ను నేల తూలనాడెదవు. సంగ్రామధర్మములను సర్వశాస్త్రముల నెఱింగిననే నెక్కనాఁడేనియు నధర్మంబుఁ జేయను. మఱి నీవు దెలిసియుఁ దెలివి తప్పితివి. క్షత్రియులు భ్రాతృపితృమిత్ర పుత్రసంబంధిబాంధవాదు లగుతమవారలతోడ్పాటునం బెరేఁగి యరాతులతోడఁ బోరునెడఁ దమకుఁ దోడువచ్చినవారికిఁ గీడు మూఁడుచోఁ దాము దప్పించుట సహజము గాకుండునే? సహాయబలమున జిగీషుఁడు గాచుచుండిన సురక్షితులై సహాయులు విజిగీషుం డైనరాజునకుఁ గావలియై పోరితంబు సేయుదురు. అట్లు గానిచో విజయంబుఁ గొను టెట్లు పొసఁగు? ఇది క్షత్రధర్మం బని నీ వెఱుంగవే? క్షాత్రధర్మంబుఁ బట్టి మాకు సహాయుం డైనసాత్యకి నీకుఁ జిక్కినం జూచుచు నే నూరకుండుట ధర్మంబు గాదని వేఱ చెప్పవలయునే? నీ కాపద వచ్చుచున్నం జూచుచుఁ దోడుపడక యూరకున్న మీవారలం దిట్టుము. మఱియు విరథునితోడం బోరరాదంటివి. మీరు పెక్కండ్రు దలపడి పటుప్రదరంబులం బరఁగించిన నేను వానిం ద్రుంచుచు మీవారలం జంచి చెండాడునెడ గుఱ్ఱముల డప్పి తీర్పఁ దేరు డిగ్గియున్నంత మీశూరులు పెక్కండ్రుక్కుమిగిలి యార్చుచుఁ బేర్చుచు నాతోడఁ బోరుట యెఱుంగవే? ఒక్కనితో నెక్కండుగాక పెక్కండ్రు దలపడు టది యెట్లు నీమది కుచితంబని తోఁచె? నేఁడు సూర్యోదయంబు మొదలుగా మీవారలతోడం బోరిపోరి డస్సినసాత్యకిం గెల్చినంతన నీవు బిరుదు మగవాఁడ వగుదువే? నీవార లెవ్వరైన నిట్టులైన నీవు చూచుచు నూరకుం దుదువే? శిష్యుఁడు బాంధవుఁడు నాదక్షిణ భుజంబు మఱియు నాకుఁ బ్రాణ తుల్యుండు నగుసాత్యకిం గావక నిన్ను మీవా రెట్టులట్టుల యూరక చూచు చుండుదునే. వెండియు నాయెదుర నావానిం జంపనీనని యేను జేసిన బాస

మీవారందఱు నెఱుంగుదురు. ధర్మమరయక ధర్మనిరతుల గర్హింపరా దూర
కుండుము. బాలుఁ డగునభిమన్యుఁడు విరథుఁడు విదీర్ణకవచుఁడు నిరాయుధుఁడు
నిస్సహాయుఁడునై యుండఁ బెక్కండ్రు చుట్టుముట్టి చంపించుట ధర్మం బని
తలంచిన మీ కిది యధర్మం బని తోఁచెఁగా యని పలికి యతని నిరుత్తరుం జేసె.

ప్రాయోపవిష్టుం డైనభూరిశ్రవునితల సాత్యకి నఱుకుట.

అంత శాంతుండై భూరిశ్రవుండు డాచేత శరములఁ బఱచికొని ప్రాయో
పవిష్టుండై ప్రాణాయామంబుఁ గావించి బ్రహ్మలోకదీక్షితుండై యుండ నీ
కొడుకు లయ్యూపకేతుం బ్రశంసించుచుఁ గపికేతనుం గర్హించుచుండ నా
గాండీవి యభిమన్యువధప్రకారంబు వివరించి వారలనోరు మూయించె. భూరి
శ్రవుండు తదీయస్తుతివచనములకు సంతసింపక నిస్తాపరుండై యుండ సవ్యసాచి
యతనిం జూచి యోగశీలాగ్రజా, యన్నదమ్ము లట్టుల నీవు నాకుఁ బ్రియుం
డవు. దుర్బుద్ధి యగుదుర్యోధనునిమిత్తమున నీకయ్యంబు గలుగుటంజేసి తన
వాఁడని లాఁతివాఁడని విచారింపక యుగ్రకర్మంబునకుఁ దొడరవలసివచ్చె.
నేనును వాసుదేవుఁడును ననుజ్ఞయిచ్చితిమి. ఔశీనరుఁ డగుశిబియట్లు సంతత
పుణ్యలోకముల కరుగు మనుటయు జనార్దనుం డోసతతాగ్నిహోత్రయాజీ,
మత్తుల్యుండవై గరుడవాహనం బారోహించి బ్రహ్మాదిసురగణప్రార్థ్యమానంబు
లగుమదీయపుణ్యలోకములకు రయమునం జను మనియె. అట్టియెడ సాత్యకి తెప్పి
ఱిల్లుకొని లేచి కృపాణపాణియై వచ్చి యచ్యుతుఁడు నర్జునుఁడును భీమసేనుం
డును యుధామన్యుండు నుత్తమౌజుండును నశ్వత్థామయుఁ గృపాచార్యుండును
గర్ణుండును వృషసేనుండును సైంధవుండును సకలసైనికులును వలదువల దని
యెలుంగెత్తి యొక్కమొగిం జెప్పి వారించినను వినక యతండు భుజముదెగుటంజేసి
తొండము దెగినయేనుఁగు తెఱఁగున నొప్పుచుఁ బరమనిష్ఠం బ్రాణాయామపరుం
డై నయాభూరిశ్రవునిమస్తకంబుఁ గృపాణంబునం దఱిగె. భూరిశ్రవునినిష్ఠకుఁ
జూచుఖేచరులు విస్మయం బందిరి. మనసైనికు లక్కటా! సాత్యకి యర్జునని
హతుండైనభూరిశ్రవునితలఁ దఱిగె నిదియేమి వాఁడిమి నిందనీయం బనువారై
క్రోధ మేపనినైనం జేయించు నిందు సాత్యకితప్పేమి తన్నుఁ దిన్నవాఁ డూర
కుండునే యనువారై విధివిధానం బిట్టులుండిన నేమియు ననంబనిలే దనువా
రునై నానాప్రకారంబులం బల్కుచున్నంత సాత్యకి యందఱం గలయం గనుం
గొని మీరందఱు ధర్మవాదములు పలుకుచు నన్ను వలదువలదని వారించితిరి
గదా. అభిమన్యువధమున మీధర్మములన్నియు నెచ్చటికిఁ బోయె. మఱియుఁ
గయ్యపునేలం ద్రోచి తన్నినవాని మునినైనం జంపుదునని నేను మున్ను చేసిన
ప్రతిన పార్థునిచెలమింజేసి తీర్చికొంటిని. అర్జునుఁడు వానిభుజము నఱికినపదం

పడి విక్రమించితి నన్నం బ్రయోజనంబులేదు. దైవవిధానమునఁ గర్తవ్యములు
దప్పవు. వెండియుం దొల్లి వాల్మీకి యొక్కయవసరంబున

చ. వనితలఁ జంపరా దని ప్లవంగమ పల్కెడు సర్వకాలము
న్మనుజున కాత్మరక్షణఘనవ్యవసాయము నాత్మమానసం
బునఁ దలపోయుచుం బరమమోదమునం బరిపంథివర్గపీ
డనకరకార్యజాతము దృఢంబుగఁ జేతయ యొప్పు నెంతయున్.

అనుపద్యంబుఁ బఠించె నని చెప్పిన నందఱును డెందముల సాత్యకిక్రోధం
బింతయెక్కుడగునే యని ప్రశంసించియు నేమైనను సోమదత్తతనయుమస్తకం
బుఁ గోయందగదని నిందించియు నేమియుం బలుకరైరనిన విని ధృతరాష్ట్రుఁ
డు సంజయా, ద్రోణకృతవర్మాదులం గెలిచి కురుసేనాసాగరంబు నిస్తరించినసా
త్యకి భూరిశ్రవుం గెలువఁజాలమికిఁ గతం బెయ్యది యని యడిగినయంబికానం
దనునకు సూతనందనుం డిట్లనియె.

సంజయుండు ధృతరాష్ట్రునకు సాత్యకిపరాజయకారణంబు చెప్పుట.

బ్రహ్మమానసపుత్రుఁ డయినయత్రికి సోముఁడు నతనికి బుధుఁడు నాబు
ధునకుఁ బురూరవుఁడు నవ్వసుధేశున కాయువు నారాజునకు నహుషుఁడు నాఘు
నునకు యయాతియు నాయయాతికి దేవయానియందు యదుఁ డనుజ్యేష్ఠపుత్రుం
డు జనించె. ఆయదునియన్వయమున దేవమీఢునకు శూరుఁడును వానికి వసు
దేవుఁడును జనించిరి. ఆదేవమీఢునివంశమున శిని యనువాఁడు కార్తవీర్యార్జు
నునకుఁ దుల్యుఁ డనం బొగడికఁ గాంచె. అట్టియెడ దేవకుఁడు తనకూఁతురు దేవ
కికి స్వయంవరంబుఁ జాటించినఁ బెక్కండ్రు భూపతులు గూడుటయు శిని యం
దఱం గెలిచి యాకన్నియను వసుదేవునినిమిత్తము తెచ్చుచుండ సోమదత్తుం
డడ్డపడి పోరుటయు శిని విక్రమించి సోమదత్తుని నేలం బడఁద్రోచి కాలఁ దన్ని
దేవకిం గొనిపోయె. నాఁటంగోలె సోమదత్తుఁడు సరివారిలోఁ దలయెత్తుకొని
తిరుగ సిగ్గుపడి క్రోధపరీతుండై మహాదేవు నుగ్రతపమున నారాధించుటయు
నప్పరమేశ్వరుండు ప్రత్యక్షంబై నీతపమునకు మెచ్చితి వరము వేఁడు మనుట
యు నప్పటికి శినియుఁ దత్పుత్రుఁ డైనసత్యకుఁడును మృతు లగుటంజేసి యాఱి
నికోపంబున శినిమనుమనినైనం బరిభవింతునని తలంచి శినిపౌత్రుం గయ్యము
నఁ గాలఁ దన్నుకుమారుం బ్రసాదింపు మని వేఁడుటయు నీశ్వరుఁ డట్ల యను
గ్రహించుటంజేసి సోమదత్తతనయుం డైనభూరిశ్రవుఁ డీశ్వరవరప్రసాదకారణం
బున శినిమనుమం డైనసాత్యకిని నేలం బడఁద్రోచి యొమ్ముఁ గాలఁ దన్నె నంతి
యకాని సత్యకసూనుం డొకనికిఁ జిక్కువాఁడే? వృష్ణివీరు లందఱు బ్రహ్మగురు

జ్ఞాతిధనంబులకుఁ జెఱుపుచేయరు. ఆపన్నుం గాతురు. ధనవంతులయ్యు వినయ పరులు. పెద్దలమాటమెయి నడతురు. సమర్థులపైఁ గత్తియెత్తుదురు. దీనుల నుద్ధరింతురు. నిత్యదేవతారాధనపరులు శాంతులు దాంతు లుదారులు. తమ్ముఁ బొగడుకొనరు. ఇన్నిసుగుణంబు లొప్పుటం జేసి వారిచక్రం బప్రతిహతంబై తిరుగు. మేరుగిరిని మోచిన మోవవచ్చుఁగాని సముద్రమువిూఁద నీఁదిన నీఁదవచ్చుఁగాని కోపించి వృష్ణివీరులం దలపడి బ్రదికి రారాదు. దేవదానవాదులును వారల గెలువఁజాలరు. ఇఁక మనుష్యులం జెప్పనేల? నీయనయమునవే యిన్నిచేటులు మీవారికిఁ బాటిల్లె ననిన ధృతరాష్ట్రుఁడు భూరిశ్రవుఁడు సచ్చినపదంపడి సంగ్రామం బెత్తెఱంగునం జెల్లె నని యడుగుటయు నతనికి సంజయుం డిట్లనియె. అంత నర్జునుండు సూర్యాస్తమయంబు దఱియవచ్చుట నుపలక్షించి వాసుదేవునకుఁ జెప్పి సత్వరంబుగఁ దేరు సింధురాజుదెసకుఁ దఱిమించి యఱుముటయుఁ గృపాశ్వత్థామశల్యాదులు ధైర్యము వాటించి గాండీవి కడ్డపడినం బోరు ఘోరం బయ్యె.

—కర్ణుఁడు సాత్యకితోఁ బోరి యోడుట.—

అట్టియెడఁ గర్ణసాత్యకులకు దారుణం బై నరణంబు నడిచె. తత్ప్రకారం బుఁ జెప్పెద వినుము. కృష్ణుఁడు త్రికాలవేదిగావున సాత్యకి భూరిశ్రవునిచే విరథుండై దుర్దశం బొందుట యెఱింగి తొలునాఁటిరాత్రి నిజసారథి యగుదారుకునితో నర్జునుప్రతిజ్ఞ నెఱవేర్చునట్లు పలుకులు పలుకునెపమున రేపు మన తేరు కట్టాయితంబు చేసికొని సేనకు వెలుపలఁ బెట్టుకొనియుండి యేను బాంచజన్యము నార్షభస్వరమునం బూరించునపుడు తెచ్చునది యని తెలిపినవాఁడుగావున నప్పు డట్టియాలమున నయ్యుత్తమశంఖముఁ బూరించుటయు నాదారుకుఁడు సైన్యసుగ్రీవమేఘపుష్పవలాహకనామకతురంగయోజితంబును గరుడకేతనవిభ్రాజితంబు నానాయుధసంభృతము నగునాస్యందనంబుఁ దెచ్చి పొడసూపినం దామోదరుండు మెచ్చి శైనేయున కిచ్చుటయు నివ్వచ్చుఁ డచ్చెరు వందినం దత్ప్రకారం బతనికిఁ దెలిపె. అంత సాత్యకి యచ్యుతునరదం బెక్కి యుద్ధసన్నద్ధుండై పార్థునకుఁ దోడుపడం బూని కౌతుకమున నేతెంచినం గర్ణుఁ డుదీర్ణసంరంభుండై యా సత్యకతనూజుని మార్కొనియె. యుధామన్యూత్తమౌజు లతనికి బాసటయై రాధేయుం దలపడిరి. అప్పుడు సవ్యసాచి జనార్దనుం జూచి కర్ణుండు భూరిశ్రవుఁడు సచ్చుట కలిగి సంరంభియై సాత్యకిని మార్కొనియె. మనము రయమునఁ గర్ణుం దాఁకుట లెస్స యనుడు మురాంతకుఁడు వలదు రాధేయుం గెలువ సాత్యకి సమర్థుండు. యుధామన్యూత్తమౌజులు నతనికి బాసటయై నడిచిరి. ఇంక నతనింగురించి చింతింపవలవ దనిచెప్పి తేరు సైంధవునిదెసకుఁ దఱిమె. అట్టియెడఁ గర్ణ

సాత్యకు లిద్దఱు బలమునను జలముననుం బేర్చి కాశ్యపదారుకులసారథ్యచాతు
ర్యము వివిధగతిస్ఫురణమున మెఱయ నత్యద్భుతప్రకారంబునఁ గయ్యము సేయు
చుండ నెల్లవారు నాలంబు మాని వెఱఁగుపడి యొదిఁగి నిలిచి చూచుచుండిరి.
అట్టిసమరంబు సురాసురగంధర్వులయందును గలుగదు. అట్లు పోరిపోరి యాశిని
పౌత్రుండు ఘోరశక్తిం గర్ణునిగాత్రంబునం గీలించి రక్తధారలు పరఁగించి రయం
బున సారథినిం గుఱ్ఱములనుం బరిమార్చి కేతనంబుఁ గూల్చి గొడుగుఁ ద్రుంచి
తేరు నుగ్గుగావించినం దుర్యోధనుండు నతనితమ్ములును జూచుచు ఱిచ్చపడిరి. దు
ర్యోధనుం డతనిం దనతే రెక్కించుకొని తొలంగించె.

అంతఁ జేయూఁగల బిరుదుమగలు దుశ్శాసనాదులు కొందఱు సాత్యకిం
జుట్టుముట్టి శరజాలముఁ బరఁగించుటయు రథగమనస్ఫురణవిచిత్రత్వంబు మెఱయ
నాకృష్ణానుజుండు పటుప్రదరపరంపరలు వరఁగించుటయు వారతని యెదుర నిలు
వనోడి వెగడుపడి తిరిగి పఱచిరి. భీముని ప్రతిజ్ఞం దలపోసి యతండు దుశ్శాస
నాదులం జంపఁ డనిన నాంబికేయుఁడు సంజయా, కృష్ణునిరథమును గుఱ్ఱములు
ను సారథియుఁ దనకుఁ గలుగుటంగాదె సాత్యకి యంతకుఁ జాలె ననవుడు సంజ
యుం డతని కిట్లనియె. అట్టియెడ మున్ను దారుకుండు తేరు దెచ్చుసంరంభము
సూచి వానిపిన్నతమ్ముఁ డది కృష్ణునిపనుపని యెఱుంగనివాఁ డవుటం జేసి కయ్య
మున నెయ్యదియేనియు గజిబిజియయ్యె నని తలంచుచు నొక్కరథవరము నుత్త
మాశ్వములం బూన్చి వివిధాయుధముల నమర్చి సింహకేతనంబు గ్రాలం గోవిం
దస్యందనంబు వచ్చినజాడం దెచ్చిన మెచ్చి సాత్యకి సముచితప్రకారమున నయ్యు
రద మెక్కి విక్రమాటోపంబు సూపుచుండఁ దారుకుండు రథసహితంబుగా న
చ్యుతునికడకుఁ జనియె. నీకొడుకులు కర్ణున కొండుతేరు సవిశేషసన్నాహకల్పితం
బు గావించిన నారాధేయుం డారథోత్తమం బారోహించె ననవుడు విచిత్రవీర్య
పుత్రుండు సూతపుత్రా, వాయుపుత్రుండు విద్వేచ్ఛం గలిసి యేమిచేసె నని
యడుగ సంజయుం డతని కిట్లనియె. అట్లు భీముఁడు కర్ణునిచే నవమానితుండై
చిన్నఁబోయి కిరీటికడ కరిగి రోషరూషితస్వాంతుండై కొంతవడి యేమియుం
బలుకకుండి పదంపడి త న్నాసూతపుత్రుండు పలికినపరుషవాక్యంబు లుగ్గడించి
వానిం దాఁకి నే నెన్నివిధములనైనం బరిమార్తు ననుడు నర్జునుండు వాఁడు నేను
వినఁగ నాడుట నన్నాడుటకాదె నీకుం బని యేమి నీవు చూచుచు నటుండు మని
పలికి రాధేయురథమున కభిముఖుండై యిట్లనియె. ఓరీ కర్ణా, భీము నట్టు లేమి
టికిఁ దిట్టితివి? అతండు పలుమాఱు నిన్ను నిర్జించిన నీవు నిలువలేక పాఱినపుడు
ని న్నెవ్వారైనం దిట్టిరే? రణమున జయంబు ధ్రువంబగునే? ప్రమాదమున నొ
క్కప్పుడు తప్పినంతన నీవింత యడిచిపడవలయునే? ము న్నెన్ని యేమాఱు లాతం

డు నిన్నోడించె. ఇప్పుడు సాత్యకియు నిన్ను గెలిచె. వీరలు నా ప్రతిజ్ఞఁ దల పోసి చంపకున్న నిందాఁక బ్రదికితివి. శూరులకు జయాజయములు గలుగుచున్నను నుత్తము లందులకు లాఁతుల నిందింపరు. తులువవుగావునఁ గులమును గుణమునుం జూపితి వింతియకాని యొండుగాదు. ఈమాటలు మఱవకుండుము. నీమదం బుడిపెద. మఱియు నేను లేనప్పు డధర్మమున నభిమన్యువిల్లు ద్రుంచితివది పౌరుషంబగునే? దానికి మాఱుగా నీవు చూచుచుండ ధర్మప్రకారమున నీకొడుకువృషసేనుతలఁ దఱిగెద. మఱియు నప్పుడు పాపం బనక విరథుఁడు విగతాయుధుఁడు నిస్సహాయుఁడు నగునాసౌభద్రుం బొదివినవారలను నిన్ను నెట్లు చేసెదనో చూతు వనిపల్కి తఱిమి యఱుముటయు మనమూఁక లఱిముఱి నమ్మహారథునిపయిం గవియుడు దారుణం బైనరణంబు సెల్లె. ఆదిత్యుండును మంద మయూఖుం డగుచువచ్చె. అప్పుడు దుర్యోధనుఁడు కర్ణున కిట్లనియె.

దుర్యోధనుఁడు కర్ణ నర్జునుం దలపడఁ బొమ్మనుట.

మహారథప్రవరా, యిది పోరికి ముఖ్యం బైనతఱి. అర్జునుండు సైంధవుం దెగటార్ప వలనుగాకుండ నీవిక్రమంబు నెఱపుము. ఇం కొక్కింతతడ వా గాండీవికిఁ గాలు చే యార్పరాకుండఁ బోరవలయు. ఆదిత్యుండు పడమర సేరఁ బోవుచున్నవాఁడు. సూర్యాస్తమయముదనుక సింధురాజుం గాచికొంటిమేని యర్జునుండు తనప్రతిజ్ఞ నెఱవేఱమింజేసి యగ్నిం జొచ్చి చచ్చును. అతండు లేకుండినం బాండునందనులును వారివారును ముహూర్తమాత్రమేనియు బ్రదుకఁజాలరు. పాండవు లందఱుం బొలిసిరేని నిష్కంటకంబుగ సకలమహీమండలమును మన మేలవచ్చును. దైవోపహతుండై పార్థుండు కార్యాకార్యముల నరయక ప్రతిజ్ఞఁ గావించె. నిక్కముగ వానిప్రతిజ్ఞయే వానివినాశమునకు మూలంబు గాఁగలదు. కృపాచార్యుండు నశ్వత్థామయు శల్యుండును దుశ్శాసనుండును నేనును నీవునుం గావలియైయుండఁ బ్రొద్దు గ్రుంకకమున్న జయద్రథుం బరిమార్ప విజయుండు నకుఁ దరంబగునే? కావున మన మందఱ మొక్కమొగి విజయుంబొదువవలయు. నీవు పెద్దయుఁ గడంకమైఁ గయ్యము సేయవలయు నని క్రోధతామ్రాక్షుండై సత్వరంబుగఁ బలికినదుర్యోధనునకు రాధేయుం డిట్లనియె. కురూత్తమా, యత్యంతశూరుఁడు మహాబలుఁడు దృఢలక్ష్యుఁడు నగుభీమసేనునితో నింతసేపు పోరాడి తద్బాణఘాతమున నంగములు చిల్లులువోవ నెంతయు నొచ్చియు ననికిఁ దొలంగుట శూరధర్మంబుగా దని యుండవలయు నని యున్నవాఁడను. ఒడలేమియు వశంబుగాదు. ఐనం బ్రాణముల డాఁపక పాండవుఁడు సైంధవుం జంపకుండ శక్తికొలఁది పోరాడెద. నాజీవితము భవదర్థంబయగుట నీవెఱుంగుదువుగదా. రాజభక్తియు రాజహితచింతనంబునుంగలవాఁ డెంత

చేయంగలఁ డంత భవత్ప్రియార్థంబు సకలయోధులు మెచ్చఁ జేసెద. నా ప్రాపున నున్న జయద్రథుం గాండీవి తెగఁజూడఁజాలఁడుగాని యట్టుల నిశ్చయ ముగఁ జెప్పరాదు. విజయంబు దైవాధీనం బని పలుకుచున్నంత బీభత్సుండు సాయకాసారంబుఁ దొరఁగించి వీరయోధులతలలు దఱిగియు నేనుంగులఁ గూల్చియుఁ దురంగములఁ జంపియుఁ దదారోహకులఁ ద్రెళ్లించియు సిడముల నఱికియు గొడుగులఁ బఱియలుచేసియుఁ జామరంబులఁ దుమురుసల్పియుఁ గాన నంబుఁ బొదువుకార్చిచ్చురీతి నీసేనం గాల్చుచు రక్తనదీప్రవాహంబుఁ బాఱించి భీమసేనసాత్యకిసహాయుండై యప్పటప్పటికి నేపు చూపుచున్నంత నందుల కోర్వక కర్ణదుర్యోధనవృషసేనమద్రేశ్వరద్రౌణిశారద్వతులు వివిధమార్గముల నంతటఁ దిరుగుచు నోరు దెఱచికొన్నమృత్యువువోలె ఘోరాకారుండైన యగ్గాండీవిని సూర్యాస్తమయమున నెక్కుమొగి మార్కొని శరజాలంబు నడ రించినం గినిసి కిరీటి తన్మార్గణముల రెండు మూఁడెనిమిది శకలములుగఁ ద్రుంచి యందఱనుం బలుతూపుల నొంచుటయుఁ గృపాచార్యుండు పండ్రెంట విప్వ చ్చుని నేడింట నచ్యుతుని నొనేసి సైంధవరక్షణోద్యోగియై రథమార్గం బాఁగి నిలిచె. అట్టియెడ నాగౌతమునకుఁ బెనుప్రాపై తక్కటిమహార థు లందఱునుం గడంగి నిలిచి జ్యాఘోషంబుఁ గావించుచు శరజాలంబులు గు రియుచు నీకొడుకుపంపున సైంధవునకుఁ గావలియైయుండ సవ్యసాచి గాండీవ మహిమంబును దూణీరంబుల బాణంబులు తఱుఁగమియు నిజబాహుబలమున కౌంతయుఁ బెంపుసొంపు సంపాదింపఁ దద స్త్రముల రూపడఁగించి వారల నందొ అను వేఱువేఱ తొమ్మిదేసియమ్ములం బిట్టేసినం గినిసి యతనిపై నాచార్యపుత్రుం డిరువదేనింటిని వృషసేనుఁ డేడింటిని దుర్యోధనుం డిరువదింటిని గర్ణశల్యులు మూఁడుమూఁడింటినిం బరఁగించి సింహనాదములు గావించుచు మౌర్వీఘోషము లొనరించుచుఁ దోడన బహుళవిశిఖజాలం బడరించుచు సూర్యాస్తమయంబుఁ బ్రతీక్షించుచు నందఱుం జుట్టుముట్టి దివ్యాస్త్రజాలం బడరించుటయు నామేటి విల్కాఁడు వారలయస్త్రములఁ బ్రత్యస్త్రముల శాంతములం గావించి సైంధవు దెసకుఁ దఱిమె.

## కర్ణుఁ డర్జునునితో యుద్ధముఁ జేయుట.

అప్పుడు కర్ణుఁడు దా నడ్డపడినం బార్థుండు వానిపై దశవిశిఖముల నే యుటయుఁ దోడన భీమసాత్యకులు మూఁడేసియాశుగంబు లేసిన నాతం డద్భుత ప్రకారమున నాముగ్గురువీరులను నఱువదేసియమ్ములం బిట్టేసె. ఏయుటయుం గోపించి యర్జునుండు శరశతముఁ గర్ణునిమర్మంబులు నొనేయుడు రక్తసం సిక్తగాత్రుండై యలిగి యేఁబదివాఁడితూపుల ఫాల్గునునిపయిం బరఁగించుటయు

నతనిలాఘవమున కలిగి క్రీడి తోడన వానివిల్లు దునిమి స్తనాంతరమున సాయ కనవకంబుఁ గీలించి వానిం జంపువాఁడై యొక్క క్రూరనారాచం బేయుటయు నశ్వత్థామ యర్ధచంద్రసాయకమున దాని నఱికె. అంత నొండువిల్లెత్తి రాధే యుఁడు బహుసహస్రశరముల సవ్యసాచిపయిం గప్పుటయు గాడ్పు మిడుతల నెట్లట్ల నిజసాయకజాలమునఁ దన్మార్గణములం ద్రోచిపుచ్చి మఱియుం బెక్కు వే లమ్ములఁ గర్ణుం గప్పుటయు నాతండు చేతకు మాఱుచేతగా గాండీవి నమితశర ములం గప్పుటయు నమ్మహారథు లిద్దఱు నితరేతరశరసంవృతులై యేను బార్థుం డను రాధేయా, యెందుఁ బోఁగలవు నిలు మని యర్జునుండును నేను గర్ణుండ నర్జునా, యెందుఁ బోఁగలవు నిలు మని రాధేయుండు నొండొరులఁ బరుషవా క్యంబులం బలుకుచు నత్యంతచిత్రంబుగ రణవిహరణంబు సల్పుటం జూచి సిద్ధ చారణగంధర్వాదులు పిచ్చలించిరి. అప్పుడు దుర్యోధనుండు తనవారలం జూచి రాధేయుం డర్జునుం జంపకకాని క్రమ్మఱ నని నాతోఁ బలికి పోరుచున్నవాఁ డందఱు నతనికిఁ దోడుపడవలయు నని పురికొల్పుచున్నంత నివాతకవచాంతకుం డేచి యాకర్ణముక్తము లగునాలుగమ్ములం గర్ణుతురంగముల నాలుగింటిం జంపి బహుళశరముల సారథిం జంపుటయు రాధేయుండు నీకొడుకు సూచుచుండఁగ విరథుండై చేయునదిలేక వెగడుపడినం జూచి యాచార్యపుత్రుం డాతనిం దన తే రెక్కించుకొని యర్జునుతోడం బోరుచున్నంత శల్యుఁడు ముప్పదిశరముల నర్జునుపై నడరించుటయుఁ దోడన శారద్వతుఁడు ధనంజయునిపైఁ బండ్రెంటిని వాసుదేవునిపై నిరువదింటినిం బరఁగించుటయు వాసుదేవార్జునులం బ్రత్యేకంబ సింధురాజు నాలుగమ్ములను వృషసేనుఁ డేడేసియాశుగమ్ములనుం బిట్టేయుటయుఁ గోపించి గాండీవి యశ్వత్థామ నఱువదినాలుగింటను శల్యుని శరశతంబునను సైంధవుం బదింటను వృషసేనుని మూడింటను గృపాచార్యు నిరువదింటను నొప్పించి యార్చి పేర్చుటయు నీసైనికు లతనిప్రతిజ్ఞకు విఘాతంబుఁ గావించు వారై పెనంగుచున్నంతఁ బార్థుఁడు వారుణాస్త్రం బేసి వారలఁ దెరలించె. అంతఁ గొండొకవడికి వారు గ్రమ్మఱ నతనిం జుట్టుముట్టి శరజాలం బడరించు టయు సవ్యసాచి తమపడినవనవాసాయాసాదిక్లేశములం దలంచికొని కినుక పొడమి కనుకవడిం బేర్చి గాండీవమున నరిఁబోసి శస్త్రజాలంబుఁ బరఁగించి నలుదెసలం గప్పి తుములసమరంబు గావించి తనపయిం బడవచ్చినసకలసైన్యములం దెరలించి యుగాంతపర్జన్యనిర్ఘోషంబున కెనవచ్చునట్లుగా గాండీవగుణక్వణనంబుఁ గావించె. వజ్రనిర్ఘాతంబున కెనవచ్చునాగాండీవనిర్ఘోషంబునకు యుగాంతవాతసంక్షుబ్ధ కల్లోలమాలికాభీలం బయినసాగరంబుచందంబున మనబలంబు దిరుగుడుపడి వెఱచి విచ్చిపఱచుటయు శూరవరు లగునమ్మహారథులు పెక్కం డ్రొక్కమొగిం

దన్నుఁ జుట్టుముట్టి వివిధశస్త్రాస్త్రజాలంబు లడరించినం గినుక వొడమి వివ్వచ్చుం డైంద్రాస్త్రంబు సముద్దీపితంబు గావించి యయ్యస్త్రరాజప్రభావమునఁ దోఁచిన యనేకదివ్యమార్గణంబులు భూనభోంతరం బావరించి కౌరవరథికులు పరఁగించు శరపరంపరలనెల్ల దినారంభమున నాదిత్యుఁడు నైశతిమిరంబునుంబోలె రూపడఁగించి నిదాఘభానుమంతుఁడు పల్వలోదకంబు నింకించు తెఱంగున జ్వలితజ్వలనుండు దనలోనం బడినమిడుతలం గాల్చుచాడ్పునను ద్విషద్బలంబుఁ బొడవడంగించి పార్థుండు రూపుగొన్న మృత్యువువోలె ఘోరాకారుండై కిరీటోల్లసితమస్తకంబులను గేయూరభూషితభుజంబులను గుండలమండితకర్ణంబులను నూర్మికావిరాజితాంగుళిస్ఫురితహస్తంబులను దోమరసమేతహస్తిపకభుజంబులను బ్రాసాన్వితహయసాదిబాహుదండములను ఖడ్గఖేటకయుతపదాతిభుజంబులను గార్ముకోపేతరథికబాహువులను బ్రతోదసంయుతసారథిభుజంబులను గజవాజిగాత్రంబులను నఱికి తేరులఁ దుత్తుమురుసేసి యెక్కడఁ జూచిన విఱిగినకాళులును దునిసినచేతులును వ్రేళులును దెగినతలలును దునియలైనయేనుంగులతొండములును బొడిపొడి యైనదంతములును రాలినకుంభమౌక్తికములును శకలంబు లయిన తురంగాంగములును దటాలునఁ బ్రాణములువోక నేలఁబడి విలవిల తన్నుకొనుచున్నప్రాణమాత్రావశిష్టులును బ్రేవులప్రోవులును నెమ్ములఖండమ్ములును గూలినకేతనమ్ములును బఱియలైనగొడుగులును దుమురైనచామరంబులును నఱవఱలైనమైమఱువుల్లునుంగాఁ బరమఘోరంబై వివిధచిత్రమణిగణకిరణప్రసరణంబునం జేసి నవయువతివోలె నభిరామంబై నెగడుసంగ్రామభూమితలంబున మేదోమజ్జలు కర్దమంబుగాఁ గేశజాలంబు శైవలంబుగా శిరోబాహుఖండములు శిలలుగా గజవాజిసంఘాతంబులు ద్వీపంబులుగాఁ దేరులగములు తెప్పలుగా ఛత్రచామరాదిప్రచారంబులు తరంగసంచారంబులుగా వెలితలచీరలు ఫేనపుంజములుగాఁ జిత్రధ్వజప్రాసపరశుప్రముఖసాధనాదిసంకులంబైనశోణితనదీప్రవాహంబుఁ బరఁగించినం బంకనిర్మగ్నంబు లగుకాళులఁ బెఱికికొనంజాలక వెగడుపడి మనమూఁకలు వీఁకదఱిఁగి యర్జునుండు మధ్యాహ్నమార్తండునిపగిదిఁ దీవ్రప్రతాపాతంబుఁ గాయుచు గాండివం బింద్రచాపంబుగాఁ బ్రావృట్పయోధరంబుచాడ్పున నొప్పి శరజాలంబుఁ గురియుచుండ నవ్విచిత్రస్ఫురణంబునకు నివ్వెఱఁగందియు నతనిం గన్నెత్తియైనం జూడఁజాలక యూహింపరానిదుర్దశకు వచ్చెం. ఏమి చెప్పుదు నప్పార్థుపరాక్రమంబు. ఎప్పుడు గొనయమ్ము సారించునో యెప్పు డమ్ములం గ్రహించునో యెప్పుడు గుఱి చూచునో యెప్పు డరిఁబోయునో యెప్పు డేయునోగాని ఱెప్పపాటులో గాండీవమునుండి శరజాలంబు వెడలి నేలయు నింగియు దిక్కులు విదిక్కులు నావరించుచుండె. అట్లు మన

సేనలం గనుపుకొట్టుచు సైంధవుదెసకుఁ జనుచున్నయయ్యర్జునుం దాఁకి కృప ద్రౌణికర్ణశల్యవృషసేనులు శరాసారంబుఁ బరఁగించుటయు నాగాండీవి తదీయ శరములఁ బ్రతిశరముల రూపడఁగించి యేఁబదింట నశ్వత్థామను గృపావశుండై కృపునిఁ దొమ్మిదింటను వృషసేనుని మూఁడింటను శల్యునిఁ బదునాలుగింటను గర్ణుని ముప్పదిరెంటను నొప్పించి బలంబెల్లఁ గబంధసంకులంబు గావించి తెరల్చి సైంధవుం దలపడి యఱువదినాలుగువాఁడితూపు లతనిమేను గాఁడిపోవ నేసి మఱియుఁ జతుష్షష్టిశరములం బరఁగించి సింహనాదంబుఁ గావించె. అందులకు సింధురాజు సిడులు చూపినయేనుంగుభంగిం గనలి యాశీవిషోపమంబు లయిన క్రూరనారాచముల నర్జును తేరిపయిం బడనేసి మూట గోవిందుని నాఱింట సవ్య సాచిని నెనిమిదింట నతనిగుఱ్ఱములను నొకవాఁడితూపునఁ గేతనంబునుం బిట్టె యుటయుఁ గోపించి విప్పచ్చుండు తద్బాణములఁ బ్రతిశరములఁ బొడవడంగించి వడిం బేర్చి సింధురాజుసారథిం గూల్చి సిడము పడంద్రోచిన నవ్వరాహకేతనంబు నేలం గూలె. సూర్యాస్తమయసమయంబు దఱియవచ్చె.

### శ్రీకృష్ణుఁడు మాయాతిమిరంబుఁ గావించుట.

అప్పుడు జనార్దనుం డతిత్వరితంబుగఁ బాండవమధ్యముం బిలిచి కిరీటీ, కర్ణకృపాదు లాఱుగురు సైంధవునకుఁ గాపలియై యున్నవారు. వీరల నందఱం గెలువక కాని సింధురాజుం బరిమార్ప నలనుగాదు. ప్రొద్దు చాల ప్రాలె. ఇఁక నిక్కొంతసే పిట్టులయినం జయద్రథవధంబు నీకు దుష్కరం బయ్యెడి. మదీయ యోగమాయాప్రభావమున సూర్యు నావరించెద. దాని నస్తమయంబుగా నూహించి సైంధవుఁ డాత్మరక్షణమునఁ బ్రమాదంబుఁ జెందు. ఆసందున నీవు వానిం జంపుము. అఖండితవీర్యమునకు నెపము గలిగెనే యని విచారింపవల దని పలికి యోగేశ్వరేశ్వరుం డైనహరి నిజనిరుపమయోగమాయాప్రభావ మునఁ దిమిరము సృజించుటయు నాచీఁకటిం జేసి రవిమండలం బదృశ్యంబయ్యె. మనవారు పార్థునిప్రతిజ్ఞ కొనసాగదుగావున నింక నాతం డనలంబుఁ జొచ్చువాఁ డని యుబ్బుచుండ సైంధవుండు నత్తెత్తి చూచుచున్నంతఁ గృష్ణుఁడు జిష్ణున కిట్ల నియె. పార్థా, వాఁడె సైంధవుఁ డేమఱి తల యెత్తి చూచుచున్నవాఁడు. ఇదియ యుచితసమయం బిప్పుడు వానిమస్తకంబుఁ దఱిగి నిజప్రతిజ్ఞ దీర్పు మనిన నతం డతనిమార్గోనఁ బోవుచున్నంతఁ దద్రక్షకు లగుకర్ణకృపాదు లడ్డంబై శరా సారంబుఁ గురియుటయు సవ్యసాచి సూర్యానలప్రభము లయినఘోరనారాచ ముల గాండివమున నరింబోసి కృపు నిరువదింటను గర్ణు నేఁబదింటను శల్యదుర్యో ధనుల వేఱువేఱ యాఱేసియమ్ములను వృషసేను నెనిమిదింటను నొవ్వనేసి సైంధ వునిపయి నఱువదిశరంబులం బరఁగించె. పరమాభీలజ్వాలల నాక వచ్చుచున్న

యనలునిచాడ్పునం దీవ్రప్రతాపదీపితుం డై నయయ్యర్జునుం జూచి కర్ణాదు లింక సైంధవుం గాచుట యశక్యం బని తమలోఁ దలపోసి తొలంగినం దక్కటిసైనికు లొకళ్లొకళ్లతోడఁ గలియక పఱచిరి. అప్పు డర్జునుండు చేసినభండనమునకు సాటి వచ్చినవో రెప్పుడు నింతకు మున్ను కన్నదియు విన్నదియుం గాదు. ఇంకనుం జూడఁ బోవము. పార్థబాణఘాత మొందనిప్రాణి యొక్కండును గానంబడదయ్యె. ఆసంకులమున నెగసినపరాగపటలముపెల్లునను నప్పటప్పటికిం గప్పుమాయా తిమిరంబుపెంపునను గన్నుగానక విచ్చిపఱచుచుఁ దిరుగుడుపడువారును దొట్రు పడువారును దప్పిపడువారును సిగలు జాఱవైచియుఁ గత్తళంబులు వుచ్చియు నార్తరవంబులు చేయువారు నొకళ్లొకళ్లం బట్టికొని తమతమపాట్లం జెప్పుకొని విలపించువారును బలాయనపరాయణు లగుతమవారలపాదఘట్టనంబునఁ గూలు వారును గూలి లేవలేక పొరలువారును నేనుంగులయుఁ దేరులయు మఱుఁగున డాఁగువారును గజతురంగంబులనుండి తదారోహకులు పడునెడ వారిక్రిందఁ బడి నలుగువారును మొగతిరిగి పాఱునేనుంగులశుండాదండప్రహారములఁ బొడిపొడి యగువారును రావుతులు పాఱుచుఁ గరవాలంబులు విసరివైవ వానియేట్లం దెగు వారును గవ్వడియమ్ములం దిరిగినతమవారియలుఁగులు గ్రుచ్చికొనం జచ్చువారునై యుండఁ దదీయగాత్రనిస్సరద్రుధిరంబు లేఱులై పాఱుటంజేసి ధూళి యడంగు టయుఁ గర్ణాదులు క్రమ్మఱ నడ్డపడిరి. అడ్డపడినం గోపదీపితుండై సవ్యసాచి నిరంతరమండలీకృతగాండీవమునఁ బలుతూపులు సంధించి యెక్కడఁ జూచినను బాణమయముఁ గావించి తోన కర్ణనృపసేనులవిండ్లను ద్రుంచి సారథిం జంపి కృపద్రౌణులవివిధశరములం గడు నొప్పించి యందఱను విముఖులం గావించి సైంధవునిపైఁ దలపడియె.

## అర్జునుఁడు సైంధవునితలఁ దునుముట.

అట్లు సైంధవుం దలపడి యర్జునుం డనలసన్నిభంబు గంధమాల్యార్చి తంబు నగునొక్కశరంబుఁ గొని గాండీవమ్మున సరిఫ్రోసి వజ్రాస్త్రమున నభిమం త్రించి యేయం దలంచుచున్నంత నంతరిక్షమున మహానాదంబు లెసంగె. అట్టియెడ జనార్దనుం డర్జునా, రవి పడమరఁ గ్రుంకఁబోవుచున్నవాఁడు రయ మున వీనితలఁ దునుముము పుడమిం బడవైవవల దందులకుఁ గారణం బెఱిం గించెద ననవుడు సవ్యసాచి యద్దివ్యాస్త్రమున సైంధవుతలఁ దునిమి నేలం

బడకుండఁ బటుబాణములఁ బరఁగించుచుఁ గ్రిందికి మీఁదికి డాపలికి వలపలికిం జెండువిధమున నాడించుచుఁ గృష్ణుంజూచి మహాత్మా, యింక నెంతప్రొద్దు వీనితల నిట్టులు నేలం బడకుండ నాడింపవలయుఁ గృపద్రోణిప్రముఖులు వారె కవియు చున్నవా రని యడిగిన ధనంజయునకు జనార్దనుం డిట్లనియె. తొల్లి సింధు దేశనాథుఁ డైనవృద్ధక్షత్రుండు పెద్దకాలంబు సంతతిం గానక వ్రతచర్యా ప్రభావమున నీజయద్రథుం బడసి యెలమి నున్నంత నెక్కడనొ యశరీర వాణి యీకుమారుఁడు గుణశీలాదుల నుత్తముఁడై క్షత్రధర్మనిష్ఠితుండై తల్లిదండ్రులయన్వయములకు రెంటికి వన్నెపెట్టుఁగాని యేమఱిపాటున రణం బున వీనితల దునుమంబడు నని మేఘగంభీరనిస్వనంబునం బల్కుటయు నాకర్ణించి పుత్రస్నేహాభిపీడితుండై పెద్దయుంబ్రొద్దు చింతించి తపోమహి మసమృద్ధుండుగావున మాజయద్రథుతల నేలం బడవైచినవానితలయుం దోడన నూఱువ్రయ్య లయ్యెడుమని జ్ఞాతిమధ్యమునం బలికి సంప్రాప్తయావనుండును గృతాస్త్రుండు నైనజయద్రథునకుఁ బట్టంబుఁ గట్టి తపోనుష్ఠానార్థంబు వనంబు నకుఁ జనియె. ఆవృద్ధక్షత్రుండును శ్యమంతపంచకబాహ్యదేశమున నున్నవాఁడు. వీనితలను నీవు నేలం బడవైతువేని వానిశాపంబు దప్పదు. కావున సైంధవు నితల తపోనిష్ఠుఁ డయినయావృద్ధక్షత్రునిపయిం బడవైచునది. ఇట్టిదుష్కరకృ త్యంబు సేయఁ బాశుపతాస్త్రంబు దక్క నొండొక్కయస్త్రంబు చాలదు. కా వున నమ్మహాస్త్రంబుఁ బ్రార్థింపు మని గోవిందుండు పలుకుటయు నర్జునుండు సభక్తికంబుగ నయ్యస్త్రరాజము నారాధించి గంధమాల్యార్చితం బైనయొక్క మహాబాణమున నప్పాశుపతాస్త్రం బభిమంత్రించి ప్రయోగించుటయు నమ్మహా సాధనంబు సాయకపరంపరాకారంబై వృక్షాగ్రంబునుండి పక్షి నెత్తికొని చను వేగచాడ్పున సైంధవుమస్తకం బెత్తికొని చని శ్యమంతపంచకంబువెలుపలిచెం గట సంధ్యోపాసనాపరుం డైనయావృద్ధక్షత్రునితొడపయిం గానరాకుండఁ బెట్టు టయు నతండు జపంబు నిర్వర్తించి లేచుతఱిన దానిం జూచి లెస్స విచారింపక తటాలున నేలం ద్రోచుటయు నావృద్ధక్షత్రునిమస్తకంబు నూఱువ్రయ్య లయ్యె. సమస్తభూతములు నందులకుఁ బరమాద్భుతం బందె. వాసుదేవుఁడును బార్థుం బ్రశంసించుచుఁ దనయోగమాయ నుపసంహరించుటయుఁ దోడన సూర్యుండు దోఁచుటయుఁ బదంపడి యందఱు నిది కృష్ణుమాయ యని యెఱింగిరి.

ఇవ్విధమున నర్జునుఁడు నాఁ డేడక్షౌహిణులం బరిమార్చి నీయల్లుఁ డైన జయద్రథుని వధించి నిజప్రతిజ్ఞ దీర్చుటయు నీకొడుకులు శోకాకులచిత్తులై కన్నీరు నించిరి. కృష్ణార్జునులు పాంచజన్య దేవదత్తంబులు బూరించుటయు భీమసేనుండు జయద్రథవధం బన్న కెఱింగించువాఁడై దిక్కులు పిక్కటిల్ల సింహనాదము గావించె. అమ్మహానాదము విని ధర్మరాజు సవ్యసాచి సైంధవుం జంపి ప్రతిజ్ఞాపూర్తిఁ గావించె నని తలంచి పరమానందమునం బొదలి వివిధవాద్యములు మ్రోయించుటయుఁ దత్సైనికులు ధనంజయుండు తీర్ణప్రతిజ్ఞుం డయ్యెనని ముదమునం బొదలుచు నాచార్యునితోడఁ బోరిరి. అర్జునుండు పరమానందభరితుండై తన్ను మార్కొనినవారలనెల్ల నోడించి నిర్వక్రవిక్రమమునం బొల్చియున్నంత సైంధవవధమునకుఁ గోపంబును విషాదంబును మనంబులఁ బెనంగొనంగఁ గృపద్రోణు లయ్యర్జునుం దాఁకి శితశరములఁ బరఁగించుటయు నతండు వారలం జంపఁ దలంపక తదస్త్రములం బ్రత్యస్త్రములం బొడవడంగించి బహుళమార్గణంబు లేయుటయుఁ దత్ప్రహారమునఁ గృపాచార్యుండు మూర్ఛిల్లి తేరిపయిఁ జదికిలఁబడినం జూచి వగచి సారథి తేరు దొలంగించె. అశ్వత్థామయు నోహటించి చనియె. తదవస్థం డైనశారద్వతుం జూచి వగపు గదుర నర్జునుఁడు కేశవున కిట్లనియె. విదురుఁడు సెప్పినట్లు కులక్షయకరుం డై నదుర్యోధనుం బుట్టినపుడే యమలోకమున కనిచిన నీసంగ్రామంబు కలుగకుండుఁగదా. ఆచార్యుఁడు బ్రాహ్మణప్రవరుఁడు నగుకృపుని నే నీదుర్దశం బొందించితి. క్షాత్రధర్మం బింతకష్టంబగునే? విద్యఁ జెప్పి యుపకరించినగురువులకు మేలు చేసినయతండు దేవత్వంబును వారికిఁ గీడు చేసినవాఁడు నరకంబునుం బొందుట నిక్కంబుగదా. మఱియు నీయాచార్యుండు మాకు విద్య చెప్పునప్పుడు దివ్యాస్త్రగ్రామంబు నేర్పుచు గురువుపయిం బ్రయోగింపవల దనియె. నే నతనిమీఁదన యేసితి. న న్నేమని కొందును. మహాత్ముఁ డగునాచార్యున కిదె ప్రణామంబు లని పలుకుచున్నంత నాతండునుం గొండొకవడికిఁ దెలిసి కయ్యముడిగి యరిగె. సహస్రాంశుండును మందరశ్మియై యస్తగిరిశిఖరంబుఁ జొచ్చె. అట్టియెడ జనార్దనుం డర్జునుం గౌఁగిలించుకొని సవ్యసాచీ, భాగ్యవశమునం బ్రతినఁ దీర్చితివి. సైంధవుఁడును వృద్ధక్షత్రుఁడును మడిసిరి. ధార్తరాష్ట్రసైన్యము మార్కొని సురలును గెలువఁజాలరు. నీవిక్రమం బేమనవచ్చు నించుకేనియు వారల సరకుగొనవు. కాలాంతకుఁ డొ

క్కఁడే నీతోఁ బోల్పఁదగినవాఁడు. ఇఁకఁ గర్ణుం జంపెదునాఁ డిట్లు నిన్నుఁ బొగడెద ననుటయు గాండీవి మహాత్మా, యంతయు నీయనుగ్రహమునంగాదె నేను జేయఁజాలితి. నిన్ను నాథుంగాఁ బడసినమాకు విజయం బసాధ్యంబె. అజాతశత్రుండు భవదనుగ్రహమున నిఖిలమహీమండలసామ్రాజ్యంబుఁ బొరయుట తప్పదు. మేము నీదాసుల మనుచున్నంత మురాంతకుండు తేరు రయమునఁ దోలుచు ముస్నర్జునుతోడం బోరి పడినమనసైన్యంబులం జూపుచు నతని నగ్గించుచుఁ బరమానందభరితుండై భీమసాత్యకియుధామన్యూత్తమౌజులు తోడ నేతేరఁ బాండవసైన్యంబుఁ జొచ్చి పాంచజన్యంబుఁ బూరించి ధర్మరాజును డాయనరిగి తాను నర్జునుండును దేరు డిగ్గి యతనికిఁ బ్రణమిల్లి నీతమ్ముఁడు భాగ్యమున జయద్రథుని వధించి చరితప్రతిజ్ఞుండయ్యె ననుడు నతండు తటాలున రథావరోహణంబు సేసి గాఢాదరంబునం గృష్ణార్జునులఁ గౌఁగిలించికొని నాభాగ్యమున మీరు సైంధవు వధించితిరని పలికి కృష్ణునిదెస మొగంబై లోకేశ్వరుం డప్రమేయప్రభావుఁడు దురూహనిజమాయాబలుండు నైననీప్రాపుఁ గాంచినమాకు మేలకాక కీడు పొసఁగనేర్చునే యని పలుదెఱంగులఁ బ్రస్తుతించె. అంత జనార్దనుండు రాజేంద్రా, యంతయు నీసత్యవ్రతమున నైనపనిగాని యొండు గాదు. నీవు క్రోధంబునం జూచితివేని వాఁడు చావక బ్రదుకునే? భీష్మాదులు నీకోపానలంబునంగదా తెగిరి. నీమహిమం బేమనవచ్చు నని కొనియాడుచున్నంత సాత్యకిభీమసేనులును యుధామన్యూత్తమౌజులు నేతెంచి ధర్మజునకుఁ బ్రణమిల్లిన నారాజచంద్రుండు వారలం గ్రుచ్చి కౌఁగిటం జేర్చి తదీయవిక్రమంబు లుగ్గడించి యానందబాష్పపూరితలోచనుండును బులకాంకితగాత్రుండునై కేవలప్రమోదబంధురుండయ్యె. వారిబలంబును బరమానందంబునం దోఁగి కయ్యమునకుఁ గాలు ద్రవ్వుచుండె నని సంజయుండు డాంబికేయునకు సైంధవవధప్రకారం బెఱింగించె నని వైశంపాయనుండు జనమేజయునకుఁ దేటపఱచుటయు నమ్మహీకాంతుండు ప్రమోదతరంగితస్వాంతుం డయ్యె.

మ. కమనీయంబుగఁ దోఁచువైషయికసౌఖ్యంబందు నిర్వేదభా
 వమునం గేవలభక్తియోగపరుఁడై స్వాంతంబునం దన్ను ధ్యా
 నముఁ గావించెడినిర్మలాత్మకున కానందంబు నిత్యంబుఁ గూ
 ర్చుమహాయోగివరేణ్యు వాఙ్మనసదూరుం గొల్తు డెందంబునన్.

ఇది శ్రీకాళహస్తినగరాధినాథ శ్రీమద్దామర కుమారాక్కమహీపాల కరుణాపుర
స్సరబహుమానపాత్ర, సంస్కృతాంధ్రభాషా కవిత్వచమత్కారపరితోషితబు
ధస్తోమ సీతారామకవిలలామ పుత్ర, సకలశాస్త్రనిరంకుశపాండితీధుర్యలక్ష్మీనర
సింహసుధీవర్య సచ్ఛాత్ర, విబుధజనవిధేయ, వేంకటరంగనామధేయవిరచితం
బయినశ్రీమదాంధ్రవచనభారతంబునందు ద్రోణపర్వంబున నర్జునుండు
నిజప్రతిజ్ఞాప్రకారమున సైంధవుని వధించువాఁడై ద్రోణాదుల నతి
క్రమించి కురుసైన్యంబుఁ జొచ్చి పెక్కండ్రఁ గౌరవయోధులం జంపు
చు గుఱ్ఱములడప్పి దీర్పబాణములఁ బుడమి భేదించి కొలను గల్పిం
చి వాసుదేవుఁడు వానిశ్రాంతి దీఱ నీళులఁ ద్రావించినం
గ్రమ్మఱ రథ మధిరోహించి పోరుటయు, ధర్మరాజునను జ్ఞఁ
గొని సాత్యకి పార్థుని నన్వేషించువాఁడై కురుసేనం
జొచ్చి జలసంధసుదక్షిణాదులను భూరిశ్రవుని వధిం
చుటయు, భీముఁడన్న మాటమెయిఁ గ్రీడినన్వే
షింపఁ జని దుర్మర్ష వికర్ణాదు లగుధా
ర్తరాష్ట్రులను బెక్కండ్రరాజులనుం బరి
మార్చుటయు, నర్జునుఁడు కురుసైన్య
మున నేడక్షౌహిణులం దెగటార్చి
సైంధవునివధించుటయునన్నది
ద్వితీయాశ్వాసము.



శ్రీకాళహస్తీశ్వరాయ నమః.

## తృతీయాశ్వాసప్రారంభము.

క. శ్రీరమణీయమహత్త్వో
దారవిరాడ్రూపసముచితావయవీభూ
తోరుధరార్ణవదిక్తటి
నీరోదోముఖపదార్థ, నిగమమహార్థా.

దేవా, ననుఁ గృతార్థుం జేయుము.

సంతతసభక్తికోపసేవితద్వైపాయనుం డైనవైశంపాయనుం డనంతరకథాకర్ణనోదీర్ణకుతుకహృదయుం డైనజనమేజయున కిట్లనియె. సంజయుఁడు ధృతరాష్ట్రునకు వెండియు నిట్లనియె. రాజేంద్రా, సింధురాజు హతుఁడైనపదంపడి నీకొడుకు దుర్యోధనుఁడు శత్రువిజయమున నుత్సాహము దక్కి దైన్యంబు గదిరినమొగంబునం గన్నీరు జాలువాఱఁ గోఱలు వెఱికినపాముపగిది వేఁడినిట్టూర్పులు నిగిడించుచు లోకమునకెల్ల నెగ్గు చేసినవాఁడు గావున నత్యంతచింతాక్రాంతుండై తనమనంబున నక్కటా! భీమార్జునసాత్యకులబలంబునం జేసి నేఁడు నాసైన్యంబు రూపఱియె. అర్జునున కెనవచ్చుయోధుఁడు భూమిలోనం బుట్టఁడు. ద్రోణకర్ణకృపాశ్వత్థామలును రోషరూషితుం డైనవివ్వచ్చునెదుర నిలువఁ జాలరు. అందఱును దృణీకరించి సైంధవుతలఁ దెగ వేయుచుండ నమ్మేటిమగని నాఁగఁగ నెక్కరుఁడును వలంతి గాఁడయ్యె. అన్నివిధములం జూడఁగ నాబలము పాండవులచే నశించు ననితోఁచెడి. దేవేంద్రుఁడు తాన వచ్చినను వివ్వచ్చుబారిం బడిన నాసేనలఁ గావఁ జాలఁడు. కర్ణునిపరాక్రమము నమ్మి యుద్ధోద్యోగినై సంధికి వచ్చినకృష్ణు నాదరింపక సంధి చెఱిచితి. ఆకర్ణుఁడును బలుమాఱు లిప్పు డప్పాండవమధ్యమున కోడినవాఁడు. ఇంక నేమనం గల దని పలుదెఱంగులఁ జింతించి చింతించి యాచార్యునెద్దకుఁ జని యిట్లనియె.

### దుర్యోధనుఁడు ద్రోణుని దూఱుట.

ఆచార్యా, మూర్ధాభిషిక్తు లయినరాజులకుఁ గలిగినయీసమరము చూచుచున్నవాఁడవుగదా. అస్మత్పితామహులుం డైనగాంగేయుండు సేనాముఖమునం బొలిచి కోట్లల సేయుచుండ గాండీవిప్రాపుకలిమిం గండడరి శిఖండి వంచన గొని

యమ్మహానుభావుని నేలం బడఁద్రోచి యది తనపాండిత్యముగఁ దలంచి పాంచాలపరివృతుండై సేనాగ్రమున నిలిచి యున్నవాఁడు. అది యట్లుండె. నీశిష్యుఁడవిజేయుఁడు నగుజయద్రథుని గాండీవి యింతకుమున్న పరిమార్చె. మఱియు నేఁడతఁ డొక్కరుఁడ యేడక్షౌహిణులం దెగటార్చె. నాగెలుపు కోరి యుపకారముఁ జేయఁ గడఁగి రాజ్యమును సుఖమును నైశ్వర్యమును గోరక ప్రాణములఁ గోల్పడిన సుహృదులఋణము నెట్టులు దీర్తును. మిత్రక్షయమునకుఁ గారణభూతుఁడ నగుటం జేసి కాపురుషుఁ డగునాకుఁ బావనత్వంబుఁ గావింప నశ్వమేధసహస్రములును జాలవు. లుబ్ధుఁడు ధర్మవిరుద్ధుఁడు పాపాచారుఁడు నగునాకుఁగా నెందఱో సుహృదులుమడిసిరి. మిత్రద్రోహియుఁ బతితవృత్తుఁడు నగునాకు భూదేవి యేలొకో వివర మియ్యదు. రుధిరరక్తాక్షుఁ డై నయస్మత్పితామహుఁడు రాజమధ్యమున నిందుల కేమనువాఁడో. నాతదర్థంబు ప్రాణముల డాఁపక పోరికిఁ గడంగినజలసంధుఁడు వాఁడె సాత్యకిహతుండై పడియున్నవాఁడు. వారె కాంభోజాలంబుసప్రముఖు లెందఱో పడి మడిసినవారు చూడుము. ఇందఱు నాకుఁగాఁ బోరి చచ్చినపదం పడి నాకు బ్రదుకు కేల? నేనును వారియప్పు తీర్పువాఁడనై యొడలోమక శక్తి కొలఁది పోరాడెద. యమునాతీరమున వారి కందఱకు నివాపాంజలి నిచ్చెద. చచ్చినవారికిఁ బ్రీతిగాఁ బాండవపాంచాలుర నందఱం బరిమార్చెద. అందులకుఁ జాలనేని వారిచేఁ జచ్చి నామిత్రులతోడిలోకంబ నాకుఁ గలిగె నని యూఱడి ల్లెద. కావున నిప్పుడ యేను బోరికిఁ గడంగెద. పాండవులు మాకంటె నీ కెక్కుడు గావున నిన్ను మిక్కిలి యనం బని లేదు. నీ వలుగుదువేని వారిపాలిటిమృత్యువనం దగుదువు. అర్జునుమీఁదిశిష్యవాత్సల్యమునంజేసి యలుకఁ బొందక యుపేక్షించి చూతువు. కర్ణుఁ డొక్కరుఁడు నాగెలుపు గోరి యోపినకొలంది పోరుచున్నవాఁడు. నీయుపేక్షనకాదె నాగెలుపుఁ గోరువారలెల్లఁ బొలిసిరి. సునిశ్చితముగ మిత్రత్వముఁ బరికింపక యట్టివాని మిత్రకృత్యమున నియమించువానికిఁ గీడు మూఁడకుండునే? నాకార్యం బట్టు లయ్యె. పెక్కులు వలుక నేల? జయద్రథుఁడును భూరిశ్రవుఁడును శిబివసాతిశూరసేనాభీషాహులును నాకుఁగా గాండీవిబాణానలమున గ్రుందిరి. వారలం బాసి యేను బ్రదికినమాత్రన ప్రయోజనం బెయ్యది? కావునఁ బగవారితోడ ఘోరసంగరంబు సేయం దలంచెద. పాండుపుత్రులకుఁ గూర్చునాచార్యుఁ డై ననీ వనుజ్ఞ యిమ్మని దుర్యోధనుఁడు పరుషముగఁ గుంభసంభవునితోడం బలికె ననిన విని యాంబికేయుండు సంజయా, సైంధవుండును భూరిశ్రవుండును మడిసినపదంపడి మీామనంబు లెట్లయ్యె? అట్లు పరుషములుపలికినదుర్యోధనున కాచార్యుం డేమనియె నని యడుగుటయు సంజయుఁ డతని కిట్లనియె. సైంధవుఁడును భూరిశ్రవుఁడును హతులయినం జూచి సకలజను

లక్కటా! యిన్ని యెగ్గులకును దుర్యోధనునిదుర్మంత్రంబు మూలం బనిపలుకుచు నీకొడుకు నవమానించిరి.

**ద్రోణుఁడు పాంచాలురఁ జంపక కాని కవచము విడువ నని ప్రతిజ్ఞ చేయుట.**

అంత నాచార్యుండు దుర్యోధనునిదురాలాపంబులు విని విన్నఁబోయిన మనంబుతో ముహూర్తమాత్రంబు చింతించి యెంతయు విషాదంబు గదుర నతని కిట్లనియె. దుర్యోధనా, యేల నన్ను వాగ్బాణముల నిట్లు నొప్పించెదవు. సవ్యసాచిని సంగ్రామంబున గెలువరా దని మున్న చెప్పితిం గదా. కిరీటిప్రాపు కలిమిం జేసి గండడరి శిఖండి సురాసురుల కజేయుం డై నగాంగేయుని నేలం బడఁద్రోచినప్పుడే కురుసైన్యము రూపుమాసె ననితలంచితి. ముల్లోకములందును సర్వశూరోత్తముఁడనం బేరు గాంచినశాంతనవుఁడు పడినపదంపడి తక్కి నవారలం గొని యనికి రాక నిరర్థకంబు. ఆజూదమునాఁడు శకుని యాడినయడ్డసాళ్లే యిప్పుడు శత్రునిర్మూలనప్రక్రమోదగ్రంబు లయినకిరీటిమార్గణంబు లయ్యెఁగాని యొండు గాదు. ఇయ్యర్థంబు విదురుండు దైన్యంబునం జెప్పినను నతని హితునిఁగాఁ దలంపక యవమానించి తదీయవచనములం బెడచెవిం బెట్టి చేటు దెచ్చికొంటివి. ఆప్రకారు లయినసుహృదులు నివేదించుహితవచనముల ననాదరించి స్వమతము నడుపుమూఢుఁడు శీఘ్రమున శోచనీయదశం బొందకుండునే? అనాఁడు మేమందఱము జూచుచుండఁగఁ బరమపతివ్రతాశిరోమణి యైనపాంచాలిని రచ్చకుఁ దెచ్చినపాపం బూరకపోవునే? తత్ఫలంబుఁ గుడువుము. ఇపు డింతతోఁ దీఱకుండినం బరలోకమున బహువిధాయాసము లనుభవింతువు. విషమద్యూతమునఁ బాండవుల గెలిచి వారిరాజ్యము నైశ్వర్యమును నాఁచికొని నారచీరలతో నడవికిఁ బంచితివి. అప్పాపంబు సామాన్యం బగునే? పాండవులు శిష్యు లని యేల పట్టిపాలార్చెదవు. ధర్మాచరణశీలురు పుత్రతుల్యులు నగునమ్మహానుభావులకు ద్రోహము సేయఁగ నేను దక్క నొండొకబ్రాహ్మణాధముఁ డొడంబడునే? ధృతరాష్ట్రునిసమ్మతంబున శకునిదుశ్శాసనసహాయుండవై నీవు పాండవులకుఁ గోపముఁ గల్పించితివి. కర్ణుండు దానిం బెద్ద గావించె. హితవాది యగువిదురునివచనముల నిరాకరించినంతన కార్యంబు దీఱునే? జగజెట్టియినసీవును గర్ణకృపాశ్వత్థామలును బ్రదికియుండఁగ సైంధవునకుఁ జావెట్టులు ఘటిల్లె? ఆసింధురాజు విశేషించి నిన్నును నన్నునుం గదా నమ్మినవాఁడు. అతనికిఁ గావలియై మీ రందఱు నొక్కచోఁ గూడి గాండీవి నాఁగి పోరుచుండఁగ ధృష్టద్యుమ్నాదులు నాపైఁ గవియుడు వారందఱితోడఁ బోరు నా కొక్కనికి భరంబై నను వింటినేర్పున గెలుచుచుంటిని. అందఱు నొక్కకిరీటిని నాఁగఁజాలక సింధురాజుం గోల్పడితిరి. సైంధవుం గావఁగ లావును నేర్పునుం జాలకున్నను నన్ను నోరికి వచ్చినట్లు పాలనాన

నేర్తువు. సైంధవభూరిశ్రవఃప్రముఖు లయినమహారథులును బెక్కండ్రు క్కసె డినపదంపడి యేమి మిగిలియుండు ననితలంతువు. సింధురాజు తెరువున కరుగని కృపుఁడు బ్రదికియుండునేని యతండే యవిజేయుం డనితలంచుచుఁ బ్రస్తుతించెద. నీవును మీదుశ్శాసనాదులును దుష్కరకృత్యముల నొనర్చుచుఁ జూచుచుండఁగ సురాసురాదులకు నవధ్యుఁ డై నగాంగేయుఁడు పడినపుడ యీభూమి మీదిగా దని తలఁచితి. పాండవపాంచాలబలము లివియే నన్నుఁ జుట్టు నఱుముచున్నవి. ఈకూడినపాంచాలురం జంపకకాని కవచంబు విడువను. ధార్తరాష్ట్రా, నీకు హితము సేయం బూని యోపినకొలంది పోరెద. నాకొడుకు నశ్వత్థామం జూచి నామాటగా నిట్టులు పలుకుము. నాబారిం బడి మడియక యొకకొందఱేనియుఁ బాంచాలురు తప్పించికొనిపోవుదురేని నీ వ్రెడ లోమక వారి నఱిమి తఱిమి పోనీక పెనంగునది. పితృగౌరవంబున నిమ్మాట పట్టుము. దమార్జవసత్యానృశం స్యముల నుస్థిరుండ వగుము. ధర్మార్థకామకుశలుండవై ధర్మార్థములకుఁ జేటు పొసంగని తెఱంగున మెలంగుము. ధర్మప్రధానకార్యముల నాచరింపుము. బ్రా హ్మణులకు దక్షిణాదుల సంతర్పణం బొనర్పుము. వారల కెగ్గు సేయరాదు. అగ్ని శిఖోపములు కావున భూసురు లలిగిరేని యెంతపనియైనం జేయఁ జాలుదు రని తెలియం జెప్పుము. నీప్రల్లదములు ములుకులై సోఁకుడుఁ గడు బడలియు నేను విషాదామర్షభరితుండనై యిదె పోరికి నడిచెద. చాలుదువేని నీవు బలఁ గము నిలువరింపుము. సంరంభోద్రిక్తులు గావునఁ గౌరవపాంచాలురు రాత్రి యైనం బోరుదు రని పలికి యాచార్యుండు నక్షత్రతేజోహరణప్రవీణుం డైనభా స్కరునిభంగి దుర్నిరీక్షుండై పాండవపాంచాలురతేజముల హరించుచుఁ గయ్య మున కాయితంబై నడిచె.

## దుర్యోధనకర్ణసంవాదము.

అవ్విధమున నాచార్యుండు పలుకుటయు నమర్షవశుండై దుర్యోధనుండు యుద్ధము కర్తవ్య మని మనమునం దలపోసి కర్ణున కిట్లనియె. రాధేయా, చూ డుము. కృష్ణసహాయుం డై నకిరీటి యభేద్యం బయినయాచార్యకల్పితవ్యూహము భేదించి యయ్యాచార్యుఁడును నీవును నేనును దక్కఁగలయోధవరులును వా రించి పోరుచున్నను సైంధవుని వధించె. ఉత్తము లైనరాజులును బెక్కండ్రు సింహమునకు లాఁతిమెకము లెట్టు లట్టుల వాని కెర యైరి. ద్రోణుఁడు సేనా గ్రమునం బొల్చి నిలువరించిన నెట్టులు క్రీడి లోపలం జొచ్చి రాజుల ననేకులం బొరివుచ్చి సింధురాజుం దెగటార్చి తనపట్టినప్రతిజ్ఞ నెఱవేర్చికొనం జాలెనో యెఱుంగరాదు. ఆచార్యుఁడు సేనాముఖమున నిలిచె నింతియకాని వాని నాఁ గఁగఁ బూనికి సేయఁడు. అర్జునుఁ డాచార్యున కెంతయుం గూర్చుట యంద

అకుం దెల్లంబకదా. దానంజేసియే యక్కుంభసంభవుఁడు భండనము మాని వానికి ద్వార మిచ్చినవాఁడు. తొలుత సైంధవున కభయమిచ్చి పిదపఁ గిరీటికి ద్వార మిచ్చినకతన నాచార్యునకు వారిమీఁదిపక్షపాతంబును నామీఁదియనాదరంబును గలదని తేటతెల్లం బయ్యెఁగదా. సింధురాజు కిరీటికి వెఱచి తనయింటికిఁ బోవ నసుజ్ఞ యడిగినపుడే పొమ్మనిన నిందఱు చావకుండుదురు. ఆచార్యుని యభయదానమ్ము నమ్మి యనార్యుం డైననే నాసింధుపతి యింటికిఁ బోవనీక నిలిపితి. అతనిని బెక్కండ్రురాజులనుం గోల్పడితి. మోసపోయితి. బలమెల్ల నల్పావశేషం బయ్యె. విన్నఁబోయినమనములతో మనమదలిముం జూచుచుం డఁగ వృకోదరునిచేఁ జిత్రసేనాదు లగుతమ్ములు మడిసిరిన దుర్యోధనునకుఁ గర్ణుఁ డిట్లనియె. మహారాజా, యాచార్యునిఁ దూలాడవలదు. ఈబ్రాహ్మణుఁడు ప్రాణముల డాపక తనబలమునకు నుత్సాహమునకుఁ దగిన తెఱంగునఁ బోరుచున్నవాఁడు. ఇతనిం గడచి కవ్వడి మనబలంబుఁ జొచ్చె నని గురునిపై నలుగరాదు. అందు గురునిదోష మించుకేనిటు నాకుఁ దోఁపదు. నేర్పరి జితశ్రముఁడు శూరుఁడు తరుణుఁడు కృతాస్త్రుఁడు మహాపరాక్రముఁడు నగునర్జునుఁ డభేద్యకవచావృతుండై కృష్ణసారథికంబు దివ్యాస్త్రభరితంబు కపికేతనస్ఫూర్తిసముద్దామంబు నగురథోత్తమం బారోహించినసుర్వర మగుగాండీవముఁ జేతఁ గొని శితశరపరంపరలం గురియుచు భుజబలదర్పితుండై యేచి యాచార్యుం గడచుట యతనికిఁ దగు. ముదుకఁడు శీఘ్రియానమున నసమర్థుఁడు బాహువ్యాయామమున నశక్తుఁడు నగునాచార్యుఁడు వా నిలువరింపఁ జాలఁడనుటయు నుపపన్న మగుంగాని యియ్యది యతనియెడదోష మూహింపఁ గారణంబు గానేరదు. అదియునుంగాక దైవము తలంచినలంపుకంటె వేఱునడుచు నని నేను దలంపను. ఎట్లంటేని బహుళప్రయత్నంబున మన మందఱమును గట్టిమొన గట్టి మోపినకొలంది పోరుచున్నను గ్రీడి సైంధవుని వధించె. నాతలంపున కది యొక్కండు నిదర్శనము చాలదె. నికృతిసెడ విక్రమమున నెండె మన మెన్ని చేసినను దైవబలము మనకు లేమింజేసి యాకార్యములు విఫలము లగుచున్నవి. దైవానుగృహీతునికార్యములు ఫలించు ననియు దైవోపహతునియుద్యోగములు సెడుననియు నిశ్చయించి వ్యవసాయవంతుఁ డగుపురుషుఁ డుచితకృత్యములం జేయుచు ఫలము దైవాధీన మనియుడవలయు. పాండవులు దైవానుగృహీతులు గావున మనచేసినజతనము లన్నియు వారియెడ విఫలములే యగుచున్నవి. విషముఁ బెట్టించియు లక్కయింటఁ గ్రాంచియు మాయాద్యూతమున నోడించియు నడవులకుఁ బంపియుఁ బలుదెంగు లగుమాయోపాయములఁ బన్నియు వారికిఁ జేటుఁ గావింపఁ జాలమైతి ని నీకుఁ జెప్పవ

లయునే? వారికి మూడుకీడులనెల్ల దైవము దొలఁగించి ప్రోచుచుండ నెట్లు చెడుదురు? ఐన నింక మారకునికి పౌరుషంబు గాదు గావున దైవముఁ దలంపక పురుషకారం బవలంబించి కయ్యమునకుఁ దొడరుము. ఈసమరమున వారు చేసిన యుత్తమకృత్యములును మనము చేసిననీచకృత్యములును గానఁబడకున్నను వారి గెలుపునకు దైవము గారణంబయి యున్నది. సుకృతదుష్కృతములకుఁ బ్రమాణభూతం బైనదైవపు కర్మకారులు నిద్రవోవుచున్నను దాను మేల్కని తత్తత్ఫలంబుల విభజించి యిచ్చుచుండు. నీకుఁ గూడినసైన్యములు పాండవసైన్యములకంటె నధికములు. పాండవయోధులకంటె నీయోధులు బలవంతులు. అల్పసైనికులకు బహుళసైనికులు లోఁగి రూపడఁగుట దైవకృత్యంబ కాక యొండు గానేర్చునే? దైవబలమునఁ బౌరుషబలము సెడియె నని వేఱ చెప్పవలయునే యని రాధేయుండు గాంధారేయునకుం జెప్పుచున్నంత సమరంబు భీకరంబై చెల్లె. తత్ప్రకారం బవధరింపు మని సంజయుం డాంబికేయునకు వెండియు నిట్లనియె.



### రాత్రియుద్ధారంభము.

అట్టిసంధ్యాసమయమునఁ బాండవసేనలు యుద్ధసన్నాహమున నెప్పటయు మనసైన్యములు గడంకఁ బేర్చి యఱుముటయు నుభయసైన్యంబులందు జీవితాశ మాని రథికుఁడు రథికుని గజారోహుఁడు గజారోహుని హయారోహుఁడు హయారోహుని గాలుమానిసి కాలుమానిసియుం గాఁ దలపడి పోరునెడఁ గౌరవపాంచాలుర పరస్పరకులగోత్రనామధేయముల వివరించుచు సాయకాసారంబుఁ బరఁగించి దద్బాణములు ప్రొద్దు గ్రుంకినపదంపడి పొడిపొడియై మిడుఁగుఱుల తెఱంగునం బడియె. అట్టిసమ్మర్దమున దుర్యోధనుండు సింధురాజు చావున కెంతయు దుఃఖితుండు గావునఁ బ్రబలరోషభరితుండై శరీరముమీఁది యాశ విడిచి రథనేమిఘోషమునఁ బుడమి యద్రువఁ బటురయమునం బేర్చి పాండవబలంబుఁ జొచ్చి శరపరంపరలు నిగుడించినం దద్బాణప్రహారం బోర్వఁ జాలక శత్రుసైనికు పట్టపవలింటిభాస్కరునట్లు తేజరిల్లుభవదగ్రనందనునెదుర నిలువ నోడి నిరుత్సాహులై పఱచిరి. అవ్విధమున నుదగ్రసంరంభమునఁ బేర్చి నదుర్యోధనునికోల్లకు మత్తమాతంగంబుతొండంబునం జిక్కినతమ్మితీవకైవడిని నెండవేఁడిమిఁ గాడ్పువీవనకు నీళ్లు లింకినకొలనిచందమునను సొంపుదప్పిన పాండవసైన్యము జూచి తత్సైన్యమునం జేయుఁగలబిరుదుమగలు పెక్కండ్రొక్కయుమ్మడి జుట్టుముట్టుటయు వారల సరకుగొనక కురుకుమాధ్యక్షుండు భీమసేనుని దశశిఖమ్ములను మాద్రేయద్రౌపదేయుల మూడేసియమ్ములను విరాటద్రుపదుల నానారసమ్ములను శిఖండిని శరశతమ్మునను ధృష్టద్యుమ్నుని సప్తతిప్రదరములనుధర్మరాజును మార్గణసప్తకంబునను సాత్యకిని బంచాశుగంబు

లను జేదికేకయఘటోత్కచాదులఁ బెక్కుతూపులను నెప్పించి యార్చి పేర్చి పె
క్కండ్రుయోధులయు బహుళహయకుంజరంబులయు మేనులు గోసి ప్రళయసమ
యప్రచండరుద్రునిమాడ్కిఁ దేజరిల్లుచు మఱియు వింటఁ బలుతూపుల సంధించి
యడరించుచున్నంత నలిగి పాండవజ్యేష్ఠుండు భల్లద్వయమున నతనివిల్లు మూడు
తునియలై పడ నఱికి తోన పదియమ్ముల నతనిం గాఁడ నేయుటయు నవి వాని
మేను వ్రచ్చి నేల సొచ్చె. అట్టియెడఁ బాండవయోధులు పెక్కండ్రు వృత్రసం
హారోద్యతుం డైనపురుహూతునకు గీర్వాణు లెట్టు లట్టుల పాండవాగ్రజునకు
బాసట యగుటయు సంగరోల్లాసభాసురమానసుండై కౌంతేయాగ్రజుండు సం
రంభమునం బేర్చి యొక్కవాఁడియమ్ము వింట సంధించి బిట్టేయుడు దుర్యోధనుఁ
డు తన్మార్గణమున కెంతయు నొచ్చి తెలివి దప్పి తేరిపయిఁ జదికిలఁ బడుటయుఁ
బాంచాలసైనికులు దుర్యోధనుండు సచ్చె ననియఱచిరి. అయ్యాఱుపుతోడ శరశ
బ్దంబు నుదగ్రంబై పర్వుటయు గురుండు పరమరయమునం జనుదెంచి యజాత
శత్రుం దాఁకుచున్నంత దుర్యోధనుండు మూర్ఛ దేఱి యాచార్యునితోడ్పాటు
నకుఁ బ్రహర్షభరితుండై యొండుకోదండం బెత్తి నిలునిలు మనియదల్చుచుఁ
బాండవాగ్రజుపయిం గవిసె. పాంచాలురు ద్రోణు నాఁగి నారసంబులు నిగు
డించిన నతనికిని వారికిని భీమసంగ్రామంబు సెల్లె నప్పుడు నాంబికేయుండు సం
జయా, శాస్త్రిమర్యాద మీఱి నడుచునాకొడుకునెడ నట్టులు కోపించి యాచా
ర్యుండు పాండవసేనం గవియునప్పు డతని కెవ్వరు చక్రరక్షకులు పార్ష్ణిగ్రాహులు
పురస్సరులునై తోడుపడిరి? మిక్కిలియుక్కునం బేర్చునక్కుంభసంభవు నాఁగఁగ
నెవ్వరు సాలిరి? వలిపట్టినయాలరీతి వారివారు బలమఱి యుండుదు రని నేఁ దలం
చెద. వివిధరథమార్గముల నర్తనంబు చేసినట్టు లప్రతిహతప్రచారుండై యరా
తిసైన్యముల నేర్చుచుఁ బాంచాలురపాలిటిధూమకేతు వనఁ జాలినయయ్యాచా
ర్యుఁడు మృత్యువున కెట్లు వశుం డయ్యెనో యెఱుంగరాదు. తదీయసమరప్ర
కారంబుఁ దేటపడం జెప్పు మనియడిగినవిచిత్రవీర్యపుత్రునకు సూతపుత్రుం
డిట్లనియె.

## ద్రోణయుద్ధము.

సాయాహ్నమున సవ్యసాచి సైంధవుని సమయించి ధర్మరాజునొద్ద కరిగి
యతనికిఁ దద్వృత్తాంతము నివేదించి మగిడి సాత్యకియును దానును ద్రోణుం
దలపడుటయు యుధిష్ఠిరవృకోదరులును వేఱువేఱ సేనలం గొని యయ్యాచా
ర్యుం గవిసినం జూచి నకులసహదేవులును విరాటద్రుపదులును ధృష్టద్యుమ్నకే
కయద్రౌపదేయఘటోత్కచులును మత్స్యసాళ్వపాంచాలసేనాసమేతులై యబ్భా

రద్వాజుం దాఁకిరి. శిఖండి యాఱువేలప్రభద్రకులతోడ నగ్గలిక మెఱసి యగ్గు రుం గవిసె. అట్లు పాండవయోధులు పెక్కండ్రు డాకొని గురుం దాఁకునెడఁ బడమర సంజకెంజాయయు నడంగి ఘోరరూపం బైనరాత్రి యగుటయు భయము సంసూచించుచు నక్కలయు గూబలయు నఱపులు విశేషించి మనసేనల నెసఁగె. అప్పు డయ్యఱపుతోడ భేరీభాంకారంబును మృదంగనిస్వనంబును గజగర్జితంబును దురంగహేషితంబును ఖురనేమినాదంబునుం బెరసి పరమతుములం బగుడుఁ జీఁకటి పెల్లునను రేఁగి యెగసినధరణీరేణుసాంద్రత్వమునను గన్నుగానక సైనికులు ధరాధరసానుమధ్యమున వెదురుటడవులు గాలునప్పు డుప్పతిల్లు చప్పళ్లంబోలునితరేతరపటుప్రదరసంఘట్టనధ్వానంబునకుఁ గళ్వలాక్రాంతులై తమ్ము నెదిరిని నిరూపింపనేరక ఱిచ్చవడియుండునంత నరనాగతురగగాత్రనిర్యద్రుధిరధారల నాపరాగం బడఁగుటయు రాలి పడి పొడవైనపసిఁడికత్తళంబులను మణిభూషణంబులను నానాహేతివ్రాతశకలంబులను సంగ్రామభూమితలం బు నాతిగాఢతిమిరంబై తారాగణసముజ్జ్వలం బైనయుప్పరంబు తెఱంగునఁ దుఱంగలించె. జాంబూనదభూషితము లగుస్యందనములును గుంజరములును విద్యుద్విద్యోతవిలసితంబు లయినమేఘపటలంబుల విడంబించె. దుర్యోధనుండు పూర్వవాతంబుగా రథగుల్మములు మేఘపటలములుగా వాదిత్రఘోషము లుఱుములుగా మణికేతనకార్ముకద్యుతులు మెఱుంగుతళతళలుగా ఖడ్గశక్తిగదాదిసాధనములు పిడుగులుగా ద్రోణపాండవులు పర్జన్యులుగా బెరసి పెచ్చువెరిఁగి భయంకరాకారం బయినసేనానది నారాత్రిం జొచ్చి యిరువాఁగునఁ జేయంగలపోటుమానుసులు భీరులకు సంత్రాసంబును ధీరులకు సముల్లాసంబును గూరఁగ నత్యంతదారుణంబుగ రణంబు సల్పుచున్నంత నాచార్యుండు దోర్దర్పదుర్దాంతుండై యేచి నాగసహస్రములను రథాయుతములను బదాతిప్రయుతములను హయార్బుదములను వధించి తనమునుము బయలుగావించి విక్రమించె ననిన ధృతరాష్ట్రుఁడు సంజయా, యట్లు కుంభసంభవుండు సంరంభోద్రిక్తుండై పాంచాలురం గనుపుకొట్టునెడఁ బార్థుఁడు సూచుచు నూరకుండెనే? దుర్యోధనుఁడు ప్రాప్తకాల మైనకార్య మెయ్యది యొనరించె? అంతటిద్రోణునకుఁ బంచత్వ మెట్లు సంఘటిల్లె? పాండవయోధులు మనవారిం జెండాడునెడ మీమానంబు లెట్టు లయ్యె. మనవారిచావునెవ్వలను వారివారలప్రహర్షోత్కర్షములను నీ వెప్పుడుం జెప్పుదువు. రాత్రికాలమున నట్లు పోరాడఁ బ్రకాశ మెట్లు గలిగె? అంతయుం జెప్పుమనియడుగుటయు సంజయుం డాంబికేయున కిట్లనియె. అత్తెఱంగున గురుండు పాండవవీరులతల లేఱుచు విజృంభించుచున్నంత శిబి యతని మార్కొనుటయు నతం డతనిమేనఁ బదియమ్ములఁ గీలించిన నాశిబి ముప్పదితూపులు చాపాచార్యు

నిపయిం బడ నేసి నవ్వుచు నవలీల నెక్కుడుభల్లమున గురుసారథితలఁ దెగ నేయు టయు నలిగి యగ్గురుం డగ్గలిక మెఱసి తదీయసారథిని గుఱ్ఱములనుం జంపి శిర స్త్రాణముతో నతనిమస్తకంబు డొల్లిపడ నేసె. దుర్యోధనుం డట్టియెడ నొండు సారథిని నియమించి పంచుటయు నాచార్యుండు రిపువధోద్యోగమునం జనియె. కళింగపతికొడుకు తనతండ్రి యగుభానుమంతుని భీమసేనుఁడు సంపుటంజేసి పగ పట్టినవాఁడు గావున నవ్వడముడిం దలపడి పంచాశుగంబులను సప్తవిశిఖముల నుం బరఁగించి మూఁడింట విశోకుని నొప్పించి యొక్కవాఁడితూపునఁ గేతుదండ మూఁగాడ నేసినం గినిసి వృకోదరుండు వానితేరిమీఁదికి లంఘించి పిడికిటం బొడిచిన వానిమేనియెమ్ములు పలుతునియలై పడియె.

—భీముఁడు దుర్మదదుష్కర్ణప్రముఖకురుకుమారులం జంపుట.—

అయ్యెడరు సూచి సైరింపఁ జాలక కర్ణుండు తమ్ములును దాను భీముం జుట్టుముట్టి యాశీవిషములంబోనిక్రూరనారాచముల గుప్పించుటయు వృకోద రుఁడు పరమరయమునం బేర్చి కళింగపతిసుతు తేరు డిగ్గి తటాలున ద్రుమునరద ముమీఁదికి లఘించి వానిం బిడికిటఁ బొడిపొడిగావించి తోడన జయరాతు తే రిపై కుటికి సింహనాదముఁ గావించి కర్ణుండు సూచుచుండఁగ డాఁపలి కేలఁ దన్ని వానిఁ బరిమార్చినం గోపించి రాధాతనూజుండు కాంచనశక్తి నెత్తి విసరి యేయు టయు నవ్వుచు నవ్వడముడి యాశక్తి నెడిసి పట్టుకొని తాను దానిన యారా ధేయుపయిం బడ వైచుటయు శకుని దాని నడుమన తునియలు గావించె. అం తలోనం దనతేరెక్కి భీమసేనుండు మనమూఁకలఁ దఱుముటయు నంతకాకా రుం డై నయతనిఁ దాఁకి నీకొడుకు దుర్మదుండు శరవర్షముఁ గురియించినం గినుక బయల్పడనీక నవ్వుచు నవ్వాయుసూనుండు వానిసారథిని సమయించి గుఱ్ఱము లం జదిపిన నానుర్మదుఁడు దుష్కర్ణునితేరెక్కిన నేకస్యందనారూఢు లయినయ య్యిద్దఱన్నదమ్ములు తారకవధోద్యతు లయినమిత్రావరుణులకరణిం బొల్చి భీము నజిమి పెక్కుతూపు లడరించిన నాతం డలిగి కర్ణకృపద్రోణదుర్యోధనబాహ్లిక సోమదత్తులు సూచుచుండఁ గాళ్లఁదన్నియుఁ బిడికిళ్లఁ బొడిచియు నాదుర్మదదు ష్కర్ణుల యమసదనమునకుఁ బనిచి యార్చి పేర్చినం జూచి రాజు లందఱు రు ద్రుండే భీమునాకారమునఁ జూపట్టి కురుకుమారులతల లేఱుచున్నవాఁ డని పలు కుచు నెక్కనితో నెక్కండు గలియక తోఁచినక్రెల్ల నవిచారులై వెఱచఱచి పఱచిరి. ఇవ్విధమున వృకోదరుఁడు చిత్రవధప్రకారంబు నడిపి తనవిజయ మన్న కెత్తింగించుటయు నారాజచంద్రుండు పరమానందసాంద్రుం డయ్యె. నకులసహ దేవద్రుపద విరాటకేకయాదు లంధకదనుజుం జంపి విజయంబుఁ గొన్నపదంపడి

పశుపతిని సుర లెట్టు లట్టుల యాభీమసేను నగ్గించిరి. అట్టియెడ నాగాఢాంధకారము నఁ గర్ణసహితు లగునీకొడుకులకును పాండవులకును దారుణం బై నరణంబు సెల్లె.

—※సోమదత్త సాత్యకులసంవాదము.※—

అప్పుడు సోమదత్తుఁడు దనకు సన్నిహితుఁ డై నసాత్యకిం జూచి క్రోధ భరభరితుండై యిట్లనియె. సాత్యకీ, తొల్లి మహాత్ము లయినసురలు నియమిం చినక్షత్రధర్మము విడిచి చోరధర్మమున నెట్టులు తవిలితివి. పరాఙ్ముఖుఁడు దీనుఁ డు శస్త్రసన్న్యాసముచేసినవాఁడు యాచించువాఁడు ననువారల రణమునం బ్ర హరింపరా దనుక్షాత్రధర్మమును నీవు నెఱుంగుదువుగదా. వృష్ణులలోపల నీవును బ్రద్యుమ్నుఁడును మహారథులనియు సమరధర్మజ్ఞులనియుం బ్రఖ్యాతి గలదు. ఇట్టినీవు పార్థుఁడు భుజము నఱుకఁగ నస్త్రసన్న్యాస మొనరించి ప్రాయోపవి ష్టుం డై నభూరిశ్రవు నెట్లు చంపితివి. ఇప్పని క్రూరంబును పాతకంబునుం గాకుం డునే? ఆదుష్కర్మమునకు ఫల మిప్పుడు గుడువుము. మూఢా, నేఁడు విక్రమించి నీతలఁ దఱిగెద, వీరమాని యగుని న్నీ రేయి గడవకమున్న పుత్రులయు సుకృ తంబులయు నాన సమయఁ జూచెద. అందులకుఁ జాలనేని నరకంబునం బడియె ద నోరీ! వృష్ణికులపాంసనా!! యని యత్యంతపరుషమునఁ బలికి శంఖము మ్రో యించి యార్చి పేర్చుటయు రోషభీషణమూర్తియై సాత్యకిసోమదత్తున కిట్లనియె. కౌరవేయా, నీ వ్రెక్కఁడవ కా దింక నెందఱు ముట్టినను బోర నేను వెఱచు వాఁడను గాను. సకలసైన్యముఁ గూర్చికొని తఱిమినను నామనమున వ్యథ యించుకేనియుం గలుగదు. అసారంబు లగుప్రల్లదములు వలికినం బెదరను. క్ష త్రధర్మపరినిష్ఠితుం డై ననాతోడఁ బోరఁ దలంపు గలదేని కడంగి మోమోట దక్కి వాఁడితూపులఁ బరఁగింపుము. ఏనును నానేర్చినకొలంది పోరెద. భూరిశ్ర వునిఁ జంపినవిధ మన్యాయ మనితలంతువేని నిన్ను న్యాయప్రకారమునఁ జంపె ద. శలుండును వృషసేనుండును మీ రందఱును జూచుచుండ నామునుమున నిలువఁ జాలక పాఱిరి. ని న్నిదె పుత్రమిత్రబాంధవసహితంబుగాఁ బొరివుచ్చెద. కురుకులోద్భవుఁడవు గావున ధైర్యధుర్యుఁడవై సంగ్రామమున నిలుము. దానద మశౌచాహింసాహ్రీధృతిక్షమ లెవ్వని నెడఁబాయవో మృదంగకేతనాభిరాముఁ డై నయయ్యజాతశత్రుని తేజముననే హతుఁడ వై ననీవు కర్ణసౌబలసహితముగ నతిరయమున వినాశముఁ బొందెదవు. కృష్ణచరణంబులు నిష్టాపూర్తములును సాక్షులుగా నీ వనికిఁ దొలంగిన నెఱుంగనుగాని చక్క నిలుతువేని నిన్నుఁ బుత్రా దిసహితముగఁ దెగటార్చెద ననుటయు నాసాత్యకిసోమదత్తు లిద్దఱు క్రోధసం రక్తలోచనులై యొండొరులం దాఁకుటయు దుర్యోధనుఁడు రథసహస్రమును హయకుంజరాయుతంబును గూర్చుకొని సోమదత్తునికి బాసటయై నిలిచె. నీమ

అంది శకుని యింద్రవిక్రము లయినపుత్త్రులు పౌత్త్రులు తమ్ములు లక్షగుఱ్ఱ ములుం గొలువ నాసోదత్తునకుఁ దోడుపడియె. అట్లు సహాయబలమునం బేర్చి బాహ్లికాత్మజుండు సాత్యకిపయి శరపరంపరలు గురియించుటయు ధృష్టద్యుమ్నుం డు పరమసంరంభోద్రేకసముద్ధురుండై బహుళచమూగణములతోడ శినివీరున కుఁ దోడువచ్చుటయు నాఱెండుసేనలసమ్మర్దము చండవాతోద్ధూతసాగరస్వనంబు నుంబోలి దారుణం బయ్యె. అప్పు డుక్కుమిగిలి సోమదత్తుండు తొమ్మిదియమ్ము ల సాత్యకిపై నేయుటయు నతండు నన్నింట వానిమేను గాఁడ నేసిన నాసోమ దత్తుఁడు మూర్ఛాయత్తుం డగుటయు సారథి తేరు దొలంగించె.

అట్టియెడ గురుండు శినివీరునిపై నలిగి పటురయమునం బేర్చి తలపడు చున్నంత యుధిష్ఠిరప్రముఖు లయినపాండవు లయ్యాదూద్వహునకు బాసట య గుడు నాచార్యునకుఁ బాండవులతోడ బలికి సురలతోడంబోలె భీకరం బయిన సంగరంబు సెల్లె. అంత భారద్వాజుం డేచి పెక్కమ్ముల ధర్మరాజును దశవిశిఖ ముల సాత్యకిని నవమార్గణముల భీమసేనుని శతప్రదరముల శిఖండిని బంచాశు గముల నకులుని నెనిమిదేసితూపుల సహదేవవిరాటులను బదేసియమ్ముల ద్రుప దధృష్టద్యుమ్నులను నైదేసిసాయకముల ద్రౌపదీసూనులను మూఁడేసియలుఁ గుల యుధామన్యూత్తమౌజులను నొంచి పెక్కండ్రుసైనికులఁ బెక్కుబాణముల రూపడంచి యుధిష్ఠిరుం దఱుముటయు నాచార్యునికోల్తలల కోహటించి పాండు రాజపుత్రసేనలు వెఱచి పఱచె. తమమూఁక లట్లు చెదరి పఱచుటం జూచి సం రంభవశుండై సవ్యసాచి తా నతని మాఱ్కొనుటయుఁ బఱచినయనీకంబులు మ ఱలి కూడి యాచార్యుం బొదివినం గినిసి గురుండు మండలీకృతకోదండమునఁ గాండజాలంబు సంధించి గుప్పించుచు మధ్యందినమార్తండునివిధమునం జూడ నొప్పి తనమునుమునఁ బడినవారితలలు రయమున నేఱియేఱి రిపుసేనల నీఱుసే యుచుండ ద్రోణబాణములకు వెఱచి పాండవసైనికులు గాండీవి సూచుచుం డఁగఁ బదిదెసలం బఱచిరి. అవ్విధమున నారాత్రిసమరమున విఱిగినతమయనీ కంబుఁ జూచి యర్జునుఁడు తేరు ద్రోణునెదుర నిలుపు మనుడు నగ్గోవిందుఁడు గోక్షీరకుందేందుసదృశప్రభము లగుతురంగములఁ దోలుచున్నంత వృకోదరుఁ డును దనతేరు ద్రోణానీకముపయిం గవియఁ బఱపు మని సారథి యగువిశోకున కుఁ జెప్పి కవ్వడి వెన్నంటి వచ్చుటయుఁ జేదిమత్స్యపాంచాలకేకయసృంజయక రూశకోసలాదియోధులు వారల వెంబడించుటయు నాభీమార్జును లయ్యనీ కముల సవ్యదక్షిణపార్శ్వములఁ బొలిచి యాచార్యుం దాఁకుటయు నత్తాఁకు పరమతుములం బయ్యె. అప్పు డప్పరమసమ్మర్దముఁ జూచి ధృష్టద్యుమ్న సాత్యకులును భీమార్జునులకుఁ దోడుపడి వచ్చుచుండ భూరిశ్రవునివధమున కలిగి

యశ్వత్థామ తాను సాత్యకిం దలపడినం జూచి ఘటోత్కచుండు మహాఘోరము ఋక్షచర్మపరివృతము గజతుల్యవాహనయోజితము విక్షిప్తపక్షచరణంబు విస్ఫు తాక్షంబు మహామేఘౌఘనిస్వనంబు గృధ్రరాజసముజ్జ్వలలోహితార్ద్రపతాకా భిరామంబు విపులాంత్రమాలాభీలంబుఁ జక్రాష్టకసమాయుక్తంబునై ముప్పది జేనలమధ్యభాగమున నెప్పారుతేరెక్కి శూలముద్గరశైలపాదపధారు లగురాక్ష సు లక్షౌహిణీసంఖ్యాకులు తోడరాఁగ నశ్వత్థామపైఁ గవియుటయు గిరిశృంగస న్నిభుఁడు దంష్ట్రాకరాళవక్త్రుఁడు శంకుకర్ణుఁడు మహాహనుఁ డూర్ధ్వకేశుఁడు వి రూపాక్షుఁడు నోరు దెఱచికొన్నయంతకునివిధమున సర్వభూతభయంకరుఁడు నగు నారాక్షసప్రవరుం జూచి భవత్పుత్రసేన వాతవిక్షోభితావర్తం బయినగంగాత రంగిణివోలెఁ బరమసంక్షుబ్ధం బయ్యె. వానియార్పున కేనుఁగులు మూత్రపురీ షవిసర్జనంబుఁ గావించె. సకలరాజులు డిల్లఁబోయిరి. అట్లు పెద్దయుఁ గడంకఁ బేర్చి సంధ్యాసమయసంవర్ధితబలులైనయాహిడింబానందనుభటులు శూలశక్తి తోమరపట్టసభిండివాలప్రముఖనిఖిలసాధనంబులను బాషాణవర్షంబునుం గురియిం చిన నతిరౌద్రం బయినతదీయయుద్ధమునకుఁ గర్ణుఁడును నీకొడుకులును వెతఁ జెందిరి. అత్యంతమానియు నస్త్రబలశ్లాఘియు నగునశ్వత్థామ యొక్కండించు కేనియుఁ జలింపక యయ్యస్త్రమాయనెల్ల మాయించుటయు నమర్షభరితుండై ఘటోత్కచుండు శరాసార మగ్గురునితనయుపైఁ గురియించిన నయ్యమ్ములు పుట్ట లోనఁ జొరఁబడుభుజగముల తెఱఁగున నతనిమేను సొచ్చి నెత్తురు లురులించి నే లం బడియె. అందుల కెంతయు నలిగి యాచార్యపుత్రుఁడు హస్తలాఘవము మెఱ యఁ దీవ్రప్రతాపము నెఱయ ఘటోత్కచునిపై దశవిశిఖము లేయుటయు దానం గాఢవిద్ధుండై యాహిడింబాసుతుండు క్షురాంతము బాలసూర్యప్రకాశము మణి వజ్రవిభూషితము శతసహస్రారము నగుచక్రవరము నెత్తి యతిరయమున విసరి యశ్వత్థామపై నేసిన నది గురుసుతుశరములఁ దునియలై యభాగ్యునిసంకల్ప మువిధమున నిరర్థకం బయ్యె.

**అంజనపర్వుఁ డశ్వత్థామతో యుద్ధము చేసి చచ్చుట.**

అంత ఘటోత్కచసుతుం డైనయంజనపర్వుం డనువాఁడు మహామారు తంబును గులపర్వతం బెట్టు లట్టుల యయ్యశ్వత్థామ నాఁగి శరవర్షంబుఁ గురియిం చి రాహువు భాస్కరుంబోలెఁ గప్పిన రుద్రోపేంద్రవిక్రముం డైనయయ్యాచా ర్యసూనుఁ డెంతయు నలిగి వానికేతన మొకవాఁడియమ్మునఁ గూల్చి రెంట సార థిం జంపి మూఁటఁ ద్రివేణుకముఁ ద్రుంచి యొక్కభల్లమున విల్లు దునిమి నాలు గింట గుఱ్ఱములఁ జంపి విరథుం జేయుటయు వాఁడు హేమబిందుసముజ్జ్వలం బయినకరవాలం బెత్తిన దానిం దునియలు గావించె. అంత నెంతయు నలిగి

యాహైడింబనందనుండు గద త్రిప్పి విసరి వైచిన దానిం గాండజాలమున ఖం
డించుటయు నంజనపర్వుఁడు మాయఁ గొని యదృశ్యుండై ద్రుమవర్షముఁ గురి
యించిన నాచార్యసూనుం డమ్మాయ నడంచిన నాభీమాత్మజాత్మజుండు తటా
లునఁ దేరిమీఁదఁ దోఁచినం జూచి యశ్వత్థామ యొక్కనిశితశరమున మహే
శ్వరుఁ డంధకాసురుంబోలె నయ్యంజనపర్వుని వధించుటయు నారక్కసుండు నీలాం
జనగిరిప్రతీకాశుండై నేలం బడియె. కొడుకుచావునకు రోషవిషాదభరితుండై
ఘటోత్కచుండు పేర్చినకార్చిచ్చుతెఱంగునఁ బాండవానీకంబు నీఱుసేయుచున్న
యగ్గురుసుతున కిట్లనియె. ద్రోణపుత్రా, నిలునిలుము. ఇఁకఁ బ్రాణములతోఁ
బోవఁ జాలవు. క్రౌంచదారణోద్యతుం డైనస్కందునివిధమునం బేర్చి యేను
నిన్నిదె పొరిగొనియెద ననవుడు గురుతనూజుండు వత్సా, లాఁతులతోడఁ బోరి
నీవిక్రమంబుఁ జూపుము. పుత్రుఁ డగునీవు తండ్రియగునన్ను బాధింపఁ జనదు.
నీయెడ నాకు మిక్కిలి రోషమును బొడమదు. రోషార్దితుం డైనవాఁ డాత్మవ
ధం బైనఁ జేసికొనుఁ గావునఁ గోప ముడిగెద ననిన విని హిడింబాసుతుండు క్రో
ధతామ్రేక్షణుండై యేల న న్నూరక బెదరింపఁ జూచెదవు? ఇందులకెల్ల నేను
వెఱవను. మఱియు నీవు తండ్రి వంటివి. నీ వెక్కడితండ్రివి? నే నెక్కడికుమా
రుండను. కురుకులోద్వహుఁ డైనభీమసేనునకు జనించితిఁ గావునఁ బాండవుల
కుఁ బుత్రుఁడను. రావణునకుఁ దుల్యబలుఁడను. చక్కనిలువుము. పోరుమీఁది
యాస మాన్పెద నని పరుషములు వలికి మదపుటేనుఁగుపయిం గవియుకొదమ
సింగముతెఱంగున నశ్వత్థామపయిం గవిసి యిరుసులంతలుతూపులం బరఁగిం
చిన నాశరాసారమును గురుసుతుం డంతరిక్షమునఁ దునియలు గావించిన నెగసి
నమిడుఁగుఱులపెల్లునం జేసి యాసంధ్యాసమయమున నుప్పరంబు ఖద్యోతవ్రాత
చిత్రితం బైనవిధమునం జూపట్టె. అంత నారాక్షసుండు మాయాబలమున నంత
ర్హితుండై బహుళశిఖరవిస్ఫురితంబు శూలాదిప్రస్రవణంబు నగుపర్వతంబై
ముందఱఁ దోఁచి బహుళశరజాలం బడరించినం జలింపక యాచార్యపుత్రుఁ డిం
చుక నవ్వుచు వజ్రాస్త్రం బేయుటయు నక్కొండ యడంగె. అడంగిన నారక్క
సుం డుక్కు సెడక విద్యుద్విలసితనీలమేఘముచాడ్పునఁ బటుశిలావర్షముఁ గురి
యుటయుఁ బరమాస్త్రవిదుం డైనయయ్యశ్వత్థామ వాయవ్యాస్త్రం బేసి యా
మాయ మాయించి శరపరంపరలు నిగుడించి యనేకుల రూపుమాపుటయు నా
దనుజవరుఁడు సింహశార్దూలసంకాశులు మత్తేభవిక్రములు వికృతాంగులు మహా
భయంకరులు క్రోధోద్వృత్తలోచనులు నగుబహుళసైనికులు గుఱ్ఱము లెక్కియు
నేనుఁగుల నారోహించియుఁ దేరు లధిష్ఠించియుఁ బలుదెఱంగులం గన్పట్టు
చుఁ దోడ రాఁగఁ దత్కాలసముపగతచింతాదంతురుం డైనదుర్యోధను

నకు ద్రౌణి యిట్లనియె. దుర్యోధనా, నీ వూరకచూచుచుండుము. తత్త
ఱపడం బని లేదు. ఈయున్న నీతమ్ములును రాజులును బాసటగాఁగ నీవైరు
లం దెగటార్చెద. నీకుఁ బరాజయము రాదు. నామాటపట్టుము. ఊఱడి
ల్లుము. సేనలఁ బురికొల్పు మనిన విని రాజు గురుపుత్రా, నీ కీనిండుమనంబును
మాపైఁ బ్రీతియుం గలుగుట యద్భుతంబు గా దని యాచార్యపుత్రు
నగ్గించి సౌబలుం జూచి యయ్యా, నీవు లక్షయునఱువదివేలరథములతోడఁ
జని ధనంజయుని మాఱుకొనుము. కర్ణవృషసేన కృపనీలులును దుశ్శాసన
నికుంభకుండభేది పురంజయ దృఢరథపతాకి హేమపుంజక శల్యారుణీంద్రసేనసంజ
యవిజయజయకమలాక్షపరక్రాథజయధర్మసుదర్శనులును నఱువదివేలకాలుమా
నుసులును నిన్ను వెంబడించి వచ్చువారు. ద్రౌణిబాణవిద్ధు లయినపాండుపు
త్రులను నసురులఁ గుమారుఁ డెట్లట్లు విక్రమించి పరిమార్చు మనిన విని పొం
గుచు గాంధారవల్లభుం డట్ల యని చనియె. ఇక్కడ ద్రౌణిభైమసేను
లకు శక్రప్రహ్లాదులకుంబోలెఁ బరమదారుణం బయినరణంబు సెల్లుచుండ నిశా
సమయసంవర్ధితబలుండు గావున హైడింబుం డేచి గౌతమీసుతునురమ్మున విషా
నలతీవ్రము లగుపదియమ్ముల నాటుటయు గాఢవిద్ధుండై యశ్వత్థామ వాతా
హతపాదపంబుచందంబునం జలించె. అంతలో నాఘటోత్కచుం డొక్కబాణ
మున నతనివిల్లు ద్రుంచినం గోపించి యశ్వత్థామ యొండుకోదండం బెత్తి సా
యకాసారంబుఁ బరఁగించి సింహము మదేభంబులంబోలె నారాక్షసానుచరులం
జంచి చెండాడి యుగవిగమసమయపావకువిధమునను త్రిపురములఁ గాల్చిన
శూలపాణిచందమునను భీకరమూర్తియై వెలుంగుచుండ హిడింబాసూనుండు
ద్రోణాత్మజుం బట్టి చంపుఁ డని తనయనుచరులకుఁ జెప్పుటయు వారు నోళ్లు
దెఱచి నాలుకలు సాఁచి కోఱ లగపఱచుచు మిడిగ్రుడ్లు చూపుచు నార్చి
పేర్చుచు గదాముసలఖడ్గభిండివాలపరశుప్రాసాసితోమరశూలముద్గరపట్టసాదినా
నాసాధనములం గుప్పించుచు నాచార్యసూనుం జుట్టుముట్టుటయు మనయోధు
లు వెతఁ జెందిరి. ద్రోణసూనుఁ డందులకుఁ గొంచెమేనియు సంచలింపక
వజ్రకల్పము లగుతీవ్రమార్గణముల వారియాయుధములనెల్ల నడఁగించి దివ్యాస్త్ర
మంత్రితము లగుశితశరనికరముల నాదనుజులఁ బలువురఁ బరిమార్చుటయు హ
తశేషు లతనియెదుర నిలువ నోడి పఱచిరి. అవ్విధమున యుగాంతసమయ
సంవర్తకానలువిధమున వెలుంగుచున్నయశ్వత్థామఁ జూడనైనఁ జాల కందఱు
నెదుఁగుచుండ ఘటోత్కచుఁ డొక్కరుఁడు కన్నుల నిప్పులు రాలం జూచి యఱ
చేతులఁ జఱచి యవుడు గఱచి ద్రౌణిముందఱికిఁ దేరు దోలు మని సారథికిఁ
జెప్పి యుద్దామకేతనాభిరామముగా నయ్యాచార్యసూనుని మాఱ్కొని సింహ

నాదముఁ గావించి యష్టఘంటోజ్జ్వలము మహాఘోరము నగుశివనిర్మితశక్తి నెత్తి విసరి వైచుటయు ద్రోణపుత్రుండు విల్లు తేరిపయిం బెట్టి యాశక్తిని మెల్లగఁ బట్టుకొని దానిన యయ్యసురతేరిపయి నేయుటయు నత్తేరు హయకేతనసారథిసహితంబుగ నుగ్గునూచము గావించి యది వసుధాతలముఁ జొచ్చె. అశ్వత్థామచేసిన యితరదుష్కరకృత్యము నందఱుం బొగడిరి. అట్లు విరథుండై ఘటోత్కచుఁడు తత్కాలసన్నిహితుఁ డైనధృష్టద్యుమ్నుతే రెక్కి యొండువిల్లు గొని ద్రౌణిపయిం బటుప్రదరంబులు వరఁగించినం దోన పాండవసేనానాయకుండును నాశీవిషసంకాశంబు లగుక్రూరనారాచముల నాచార్యసుతునురమ్మునఁ గీలించుటయు నమ్మహారథుఁడును వారిపైఁ బటువిశిఖములఁ బరఁగించుటయు యోధప్రీతిజననకారణం బైనదారుణరణంబు సెల్లె. అట్టియెడ వృకోదరుఁడు వేయిరథములును మున్నూఱేనుంగులును నాఱువేలగుఱ్ఱములును దోడు రాఁగ నచ్చోటికి డాసి ఘటోత్కచధృష్టద్యుమ్నులకు బాసటయై నిలిచినం గురుపుత్రుం డద్భుతం బావహిల్ల నమ్మగురుదొరలతోడఁ బోరుచు నిమేషమాత్రలోన వారును దత్కాలసన్నిహితు లయినధర్మజధనంజయదామోదరనకులసహదేవులునుం జూచుచుండ నేకాక్షౌహిణీక్షయం బాపాదించి గజతురంగమగాత్రఖండములను శాకసాంగశకలములను గొడుగులయుఁ గనకదండంబులయుఁ దునియలను రణాంగణంబు రంజిల్లంజేసి నక్షత్రగ్రహసంకీర్ణం బయినరెండవగగనమండలం బనుబుద్ధిఁ గల్పించి కేతనశకలములు మండూకములుగా భేరీవ్రాతంబులు కచ్ఛపోత్కరంబులుగా గొడుగులు హంసలుగాఁ జామరంబులు నురుఁగులుగా నెత్తురు ద్రావను మాంసము దినను వచ్చినకంకగృధ్రములు మహాగ్రాహములుగా గజగాత్రఖండములు పాషాణములుగాఁ బతాకోజ్జ్వలరథములు భ్రమాఁకులుగా శరములు మీలుగాఁ బ్రాసశక్తులు డుండుభములుగా మజ్జామేదోమాంసము పంకముగాఁ గబంధములు పడవలుగాఁ గేశములు శైవాలములుగా యోధార్తరవము నిర్ఘోషముగా రక్తనదీప్రవాహముఁ బాఱించి యెంతయు నేచి పార్థవృకోదరప్రముఖులపయిం బటుప్రదరములఁ బరఁగించి ద్రుపదతనూజు లగుసురథశత్రుంజయబలానీకజయానీకజయు లనువారల నేవుర వధించి సింహనాదము గావించి పృషధ్రుచంద్రసేనశ్రుతాయుగ్రప్రముఖులఁ గుంతిభోజతనూజులఁ బదుగురఁ బొలియించి యంత నిలువక యమదండప్రతీకాశ మగుఘోరనారాచం బొక్కం డరిఁ బోసి ఘటోత్కచునురమ్ము వ్రయ్యఁగ బిట్టేయుడు నమ్మార్గణమ్మారక్కసునురమ్ము వ్రచ్చి నెత్తురు లురులించి నేలం బడియె. దానం గడు నొచ్చి ఘటోత్కచుండు మూర్ఛిల్లుటయు ధృష్టద్యుమ్నుండు తేరు దొలఁగించినం జూచి పాండవానీకంబులు పరాఙ్ముఖము లగుటయు నశ్వత్థామ

సింహనాదముఁ జేసినం బొంగి మనవార లగ్గురుతనూజు నగ్గించిరి. సంగరరంగంబు రాక్షసాంగసాంద్రం బగుటంజేసి పరమదుర్గమం బయినం జూచి ఖేచరులు నయ్యశ్వత్థామవిక్రమంబుఁ బొగడిరి. అవ్విధమున నశ్వత్థామ ఘటోత్కచానుచరు లగునసురులను ద్రుపదపుత్రులను గుంతిభోజసుతులనుం బరిమార్చి పేర్చుటం జూచి సైరింపక యుధిష్ఠిరభీమసేనులును సాత్యకిధృష్టద్యుమ్నులును సమరోత్సాహమునఁ దలపడుచుండునెడ సోమదత్తుండు రోషాయత్తుండై సాత్యకిం దాఁకి శరవర్షముఁ గురియించిన నాపోరు పరమాద్భుతదర్శనం బయ్యె. అప్పుడు వృకోదరుఁడు సాత్యకికిఁ దోడై పదియమ్ములు సోమదత్తునిమేనం గీలించుటయు నాబాహ్లికాత్మజుం డతనిపై నూఱమ్ములం బఱపె. అంతల కలిగి సాత్యకి పుత్రశోకసంతప్తచిత్తుం డై నయాసోమదత్తునిఁ బదివాఁడితూపుల నొనేసి తోన మే నుచ్చిపోవ శితశక్తిం బ్రయోగించి వెండియు నేడమ్ములఁ బరఁగించె. అంతలో వృకోదరుఁడు ఘోరపరిఘమును సాత్యకి యగ్నిసన్నిభం బయినతీవ్రబాణంబును లొమ్మునం బడ నేయుటయు నొక్కపరి యారెండు తాఁకుటంజేసి మూర్ఛిల్లి సోమదత్తుఁడు తేరిపయిం బడి పెద్దయుంబ్రొద్దునకుఁ దెలిసె.

## భీమసేనునిచే బాహ్లికుఁడు సచ్చుట.

పుత్రునియెడరునకుఁ గోపవిషాదములు మనమునఁ బెనంగొనఁగ బాహ్లికుఁడు వారలఁ దాను దలపడి ప్రావృట్పయోధరముచందమున శరనికరంబుఁ గురియించుడు భీముఁడు తొమ్మిదియమ్ముల నక్కురువృద్ధునిపై నేయుటయు నతండు కోపించి యశనితుల్యం బయినతీవ్రశక్తిని వడముడిలొమ్మున నాటె. నాటిన నించుక చలించి భీమసేనుఁడు కొండొకవడికిఁ దెప్పిఱిల్లికొని గద యెత్తి బలముకొలఁది విసరి బాహ్లికుతలపై నేయుటయుఁ బిడుగుపడినవ్రమాఁకుమాడ్కి నాబాహ్లికుండు నేలం గూలె. అవ్విధమున భీముఁడు బాహ్లికుం జంపుట కలిగి దాశరథితుల్యు లగునీకొడుకులు నాగదత్తుఁడు ధృఢరథుఁడు వీరబాహువు మున్నగువారు పదుండ్రు వడముడిం దాఁకిన నతం డొక్కొక్కయమ్మున నొక్కొకనిఁగా నాపదుగురను క్షణమాత్రలోన చంపుటయు వారు పర్వతాగ్రమునుండి చండవాతమున డొల్లిపడుమహీరుహములవిధమున రథములనుండి నేలం బడిరి. మఱియు నప్పుడు కర్ణపుత్రుం డయినవృషసేనుఁడు మార్కొనినం బవనసూనుండు బాణజాలంబుఁ గురియించి చీకాకుపఱిచి వాని నోడించె. కర్ణునితమ్ముఁడు వృకరథుఁ డనువాఁ డడ్డపడి పోర వచ్చినం జంపె. శకునితమ్ము లేడుగురు దలపడిన వారితలలు దఱిగి తత్కాలసన్నిహితు లైనశతచంద్రవీరగవాక్షశరభప్రభృతులు దాఁకి శరజాలంబు లడరించుటయు వృష్టివేగమున కచలంబువోలెఁ జలింపక మనసేనలం జెండాడుచుండె. అట్టియెడ ధర్మరాజు కోపదీపితుండై యాచార్యుండును నీకొడుకు

లునుజూచుచుండ నంబష్ఠమాలవశూరత్రిగర్తశిబిశూరసేనబాహ్లీకాభిషాహవసా
తియాధేయమద్రకగణములం గనుపుకొట్టుటయు మనమూఁకలలోన యుధిష్ఠిరుం
బట్టుఁడు కొట్టుఁడు పొదువుఁడు నను నులివు మిగిలె. ధర్మరాజుకోర్తలకోహటించి
పఱచుచున్న మామూఁకలం జూచి దుర్యోధనుండు గురుం బురికొల్పుటయు నాథ
నురాచార్యుండు కోపాటోపదీపితుండై వాయవ్యాస్త్రం బేసిన నజాతవైరి దా
నిం దదస్త్రమున నడఁగించె. అంత భారద్వాజుండు పరమామర్షభరితుండై వా
రుణయామ్యాగ్నేయత్వాష్ట్రసావిత్రాస్త్రములఁ గ్రమమునఁ బ్రయోగించుట
యు యుధిష్ఠిరుఁడు వానినెల్లఁ దత్క్షణంబ ప్రత్యస్త్రప్రయోగమునఁ బ్రశాంత
ములఁ గావించె. అందులకుఁ గడుం గోపించి యాచార్యుండు తనపట్టినప్రతిజ్ఞ
దీర్చువాఁడై యైంద్రాస్త్రంబును బ్రాజాపత్యాస్త్రంబునుం బ్రయోగించినం
జలింపక ధర్మనందనుండు తదస్త్రములం దదస్త్రములఁ బ్రతిహతములఁ గావిం
చినం గ్రోధభరితుండై గురుండు యుధిష్ఠిరవధముఁ గోరి బ్రహ్మాస్త్రము సముద్దీ
పితముఁ గావించుటయు నేమి చెప్పుదు లోకమెల్ల గాఢధ్వాంతదంతురం బై నక
తన నేమియుం దెలియరాకుండె. సకలభూతంబులును సంత్రాసంబుఁ జెందె.
అంతఁ గౌంతేయాగ్రజుండు తోడన తానుం బ్రహ్మాస్త్రంబు సముద్దీపితంబుఁ గా
వించిన నయ్యస్త్రములు రెండును బ్రశాంతము లగుటయు సకలసైనికులు ద్రో
ణధర్మరాజులం బొగడిరి. అట్టియెడ నాచార్యుండు ధర్మరాజును గ్రేడించి ద్రుప
దానీకముపయిం గవిసి క్రోధపర్యాకులలోచనుండై వాయవ్యాస్త్రప్రయోగ
ముఁ గావించి పాంచాలురం దఱుముటయుఁ జూచుచున్న భీమార్జునులు రథానీక
ములు గూర్చుకొని సవ్యదక్షిణపక్షములఁ బ్రాపై నిలిచి భారద్వాజుం దాఁకి
శరాసారముఁ గురియించుచున్నంత మత్స్యకేకయపాంచాలసృంజయులు సాత్యకి
సహితంబుగా సవ్యసాచికిఁ దోడుపడుటయుఁ గిరీటియంపతుంపరకుఁ బెద్దయు డస్సి
చీఁకటిపెల్లునను నిద్రాభరమునను గన్ను గానక పోరు మాని విఱిగినమూఁకలం
గూర్పఁగ మనయోధుల కేరికి నలవి గాకుండుటయు దుర్యోధనుండు రాధేయున కిట్ల
నియె. మిత్రవత్సలా, మిత్రులం బ్రోవఁగఁ గాలం బిదె ప్రాప్తం బయ్యె. మత్స్య
కేకయపాంచాలాదు లగుపాండవయోధులకుఁ జిక్కి తెప్పిఱిల్లుకొననేరక దీనదశకు
వచ్చినమనవారలం బ్రోచుట నీపని. పాండవయోధులు గెలుపు గొనుచు నికిం
జేసి యెంతయు సంభ్రమమున మనవారల నేఁచుచున్నవా రనిన విని కర్ణుఁడు దు
ర్యోధనున కిట్లనియె. ఇంద్రుఁడు తాన ప్రోవ వచ్చి నిల్చిన నతనిం గెల్చి పార్థుం
జంపెద. ఇంతయు నిక్కువంబు. ఊఱడిల్లుము. పాండవులలోనెల్ల నర్జునుండు
బలియుఁడు. వానిం దొలుతఁ జంపినఁ దక్కినవారు నీకు వశులై వర్తించుటొండె
ఘునుపటియట్ల యడవులకుఁ జనుటయొండెఁ జేయుదురు. ఇంద్రుఁడు నా కోసం

గినశక్తి గలుగ నర్జునుం జంపుట దుష్కరంబు గాదు. పాంచాలాదిసైనికుల వధించు టొకపని యనియుం దలంపవలదు. ఏను బ్రదికియుండ నీకు వగవ నేల? అందఱను జయించి నిఖిలమహీమండలము నీకుఁ బట్టముఁ గట్టుదు ననినఁ గృపాచార్యుండు కర్ణున కిట్లనియె.

కృపాచార్యుఁడు కర్ణుని నిందించుట.

కర్ణా, లెస్స లెస్స చెప్పితివి. మాటలం గార్యములు నెఱవేఱునేని నీవు నాథుఁడు గలుగుటం జేసి దుర్యోధనుఁడు నాథవంతుఁ డనవచ్చు. ఈదుర్యోధను నెదురఁ బలుదెఱంగులఁ బొగడికొనినం బ్రయోజనంబు గన్పట్టదు. నీవిక్రమము ను దత్ఫలము నింతకుం జూడమైతిమి. పెక్కుమాఱులు పాండవులతోడియని గలిగెఁగదా. అప్పుడెల్ల నీవే వారి కోడుచుంటివి. మీ రందఱు ఘోషయాత్రకుఁ బోయినపుడు గంధర్వులు రాజును బట్టుకొనిపోవునెడ నందఱు నోపినకొలంది పోరుచుండ నీ వెక్కరుండవు తొలంగి పాఱితివి. మఱియు విరాటుపసులం బట్టఁ బోయినతఱి నొక్కయర్జునుండె నిన్నును నీతమ్ములను దక్కఁగలయోధులనుం గెలుచుట నీ వెఱుంగవే? ఒకనాఁడేనియు నర్జును నాఁగఁ జాలనినీవు కృష్ణసహా యులైనపాండవుల నిప్పుడు గెలువఁగ నెట్టు లుత్సహించెదవు. ఏమియుం బలు కక శక్తికొలఁది కయ్యము సేయుము. పలుకక పరాక్రమించుట సత్పురుషవ్రతంబు. శరత్కాలమేఘముచందమునఁ బెద్దయు గర్జిల్లి కార్యమున విఫలత్వంబుఁ జెందుట నీకు సహజంబై యున్నయది. పార్థుని డాసి గాండీవముక్తము లగుత దీయపటుప్రదరములు మేను సోఁకునంతకుఁ బొగడికొందువుగాని వానిబారిం బడినపదంపడియును బొగడికొననేర్తువే? క్షత్రియులు బాహుశూరులనియు బ్రాహ్మణులు వాక్శూరులనియు నర్జునుఁడు కార్ముకశూరుఁడనియుఁ గర్ణుఁడు మనోరథశూరుఁడనియుం బ్రసిద్ధి గలదు. నీవును వినియుండుదువు. ఎక్కెక్కటిబవరమున నీశ్వరుని మెప్పించినయర్జునునిఁ జక్కమాఱుకొందు నని నిలుచు మగవాఁడుం గలుగునే? యనిన విని కర్ణుఁడు సముదీర్ణరోషభరితుండై శారద్వతున కిట్లనియె. ప్రావృట్పయోధరములట్లు గర్జిల్లుట శూరశేఖరులకు సహజం బు. సుసమయమున నుత్తమక్షేత్రమున నాటినబీజమువిధమున నది ఫలవంత మగుంగాని యొండు గాదు. రణాంగణమున శూరులు గర్జించుట దోసముగా దు. ఎయ్యది మోవఁగఁ దాను దనమనమున నిశ్చయించి తన్నుఁ బ్రశంసించి కొను నతని కది నెఱవేఱ దైవముం దోడుపడు. కావున నేను వ్యవసాయవం తుఁడనై నామోవవలసినమో పియ్యది యని మనమునం దలపోసి కడంగి పాం డుసుతులను గృష్ణసాత్యకిసహితంబుగాఁ దెగటార్చి గర్జిల్లెద. దాన నీసొమ్మేమి చెడు. నీచెప్పినట్లు శూరులు శారదతోయములట్లు నిరర్థకముగ గర్జిల్లరు. మఱి

యాత్మసామర్థ్యము నాలోచించి గర్జిల్లుదురు. కృష్ణార్జునులం గెలువ నుత్సహింతుఁ గావున గర్జిల్లితి నిందుఁ ద ప్పేమి? నాగర్జితమునకు ఫలము నీవ యెఱుంగుదువు. పాండవులను గృష్ణసాత్యకిసహితంబుగా వధించి కురుకులమాధ్యక్షున కీభూమండలమునెల్ల నిచ్చెద ననినకర్ణునకుఁ గృపాచార్యుఁడు మఱియు నిట్లనియె. సూతపుత్రా, నీమనంబునం గలకోర్కు లకుఁ దగినతెఱంగుగా వట్టిమాటలఁ బ్రేలెదవు. పాండవులను గృష్ణుని నధిక్షేపింతువు. అది నిరర్థకంబు. దేవదానవగంధర్వోరగయక్షాదుల కజేయులై నకృష్ణార్జును లేవలనం గల రావలన గెలుపు తప్పదు. ధర్మరాజు బ్రాహ్మణప్రియుఁడు సత్యవచనుఁడు శాంతుఁడు పితృదైవతపూజకుఁడు ధర్మనిరతుఁడు ధృతిమంతుఁడు కృతాస్త్రుఁడు కృతజ్ఞుఁడు ననం బేరు గాంచినవాఁడు. అతనితమ్ములు బలియురు సర్వాస్త్రవిదులు గురువృత్తినిరతులు ప్రాజ్ఞులు ధర్మనిత్యులు కీర్తిమంతులు ననం బేరెన్నికఁ గన్నవారు. బంధువులో యింద్రవిక్రములు తాఁ కోర్తురు. కడుం గూర్తురు. ధృష్టద్యుమ్నుఁడు శిఖండి దౌర్ముఖి జనమేజయుఁడు చంద్రసేనుఁడు రుద్రసేనుఁడు కీర్తివర్మ ధ్రువుఁడు ధరుఁడు వసుచంద్రుఁడు దామచంద్రుఁడు సింహచంద్రుఁడు సుతేజసుఁడు ననుపుత్రులతో ద్రుపదుఁడును గజానీకశ్రుతానీకవీరభద్రసుదర్శనశ్రుతధ్వజబలానీకజయానీకజయప్రియవిజయలబ్ధలక్షజయాశ్వరథవాహనచంద్రోదయకామరథనామకు లగుతమ్ములును బుత్రులును గొలువ విరాటుండును నిఖిలాత్మసేనలతోఁడం బెరసి యేతెంచి పాండవుల కెట్టులయినం గెలుపు గూర్తు మనియున్నవారు. మఱియుఁ గవలును ద్రౌపదీసూనులును హిడింబాసూనుండు నెవ్వనిపనికై పోరుదురతనిపని సిద్ధమనియే తలంపవలయు. ముల్లోకములు దేవదానవమనుష్యయక్షరాక్షసభూతప్రేతభుజగాదిగణంబులతోఁ గూడి యొక్కటియై ముట్టినను నస్త్రవీర్యమున నందఱ వధించి గెలుపు వహింపఁ జాలినభీమార్జునులు గలుగ లాఁతులఁ బేర్కొనం బని లేదు. వెండియుఁ బరమధర్మాత్ముండై నధర్మరాజు క్రోధతీవ్రేక్షణమునం జూచెనేని యందఱును నిలువున నీఱగుదురు. అట్టిపాండవులం గెల్తు నని యుత్సహింతువు. ఇదియకదా నీయెప్పటియనయం బనుటయుఁ గర్ణుఁడు నవ్వుచు శారద్వతున కిట్లనియె.

**కర్ణుఁడు కృపాచార్యుని నిందించుట.**

అయ్యా, పాండవులం గుఱించి నీచెప్పినది నిక్కువంబ. నీపేరుకొన్నవాని కంటె మిక్కిలిగుణములు వారియెడం గలవు. ఇంద్రాదులకును వార లవిజేయులు. ఐన నేను వాసవుం డిచ్చినశక్తిచే నర్జునుం జంపుదు. అతండు హతుండైనం దక్కినవారు భూలోకభోగముల ననుభవింప నొల్లక తామ రూపుసెడుదురు. వారందఱును జెడినపదంపడి యయత్నముననే యీమహీమండలంబెల్ల రారాజునకు

వశముగాఁ గలయది. మేలివెరవుల నేకార్యములనైనను సాధింపవచ్చును. ఈ యర్థ మెఱిఁగి యేను గర్జిల్లితి. నీవు ముదుకఁడవు బ్రాహ్మణుఁడవు సంగరమునం బూర్వోపకారముఁ దలఁపనివాఁడవు పార్థులకుఁ గూర్చువాఁడవు గాన నన్ను దూఱెదవు. ఇంత కోర్చితి. ఇట్టు లింకొకతూరి పలుకుదేనియుఁ గురుసేనలకు వెలివు గూరఁ బాండవులఁ బొగడుదేనియు వాలు వెఱికి నాలుకఁ గోయుదు. పాండవసైన్యమున మేటిమగలు గల రంటివి. ఇక్కడఁ జూడుము. దుర్యోధనుఁడును ద్రోణుఁడును శకునియు దుర్ముఖుఁడును జయుఁడును దుశ్శాసనుఁడును వృషసేనుఁడును శల్యుఁడును నీవును నేనును సోమదత్తుఁడు నశ్వత్థామయు మున్నగువారు పెక్కండ్రు గలరు. వీ రందఱు శూరులు కృతాస్త్రులు బలియురు స్వర్గకాములు ధర్మజ్ఞులు యుద్ధకుశలులు సురలనైనం గెలువఁ జాలినవారు. వీ రందఱుండఁగ వారలే గెలుతు రని యెట్లు పలుకవచ్చు? జయము దైవాధీనము. శాంతనవుఁడు శరతల్పగతుఁ డగుటయు నితరదుర్జయు లగువికర్ణచిత్రసేనబాహ్లికజయద్రథభూరిశ్రవోజలసంధసుదక్షిణశలభగదత్తప్రముఖు లగుయోధులు పొలియుటయుం జూడ జయము దైవాధీన మని చెప్పకుండఁ దీఱునే? ఇక్కడివారలే కాదు. అక్కడివారలునుం బెక్కండ్రు నానాఁట మడియుచున్నవారు. ఉభయసేనలును దఱుఁగుచున్నవి. ఇంతమాత్రన వారే జయింతు రనరాదు. కావునఁ దగినంతకడంకఁ జేయుట యుచితంబు. కావున నేను దుర్యోధనహితార్థంబు శక్తికొలఁది పోరెద. జయము దైవాధీన మని పలుకుచున్నంత నశ్వత్థామ రాధేయుఁ డట్లు తూలనాడుటకుఁ గ్రోధసముద్రేకభరితుండై తటాలున వాలు వెఱికి మత్తమాతంగంబుపయిం గవియుకొదమసింగముభంగిని గౌరవేశ్వరుండు సూచుచుండఁగఁ గర్ణునిమీఁది కుఱికి యిట్లనియె. నరాధమా, సత్యము లగుసవ్యసాచిగుణముల నుగ్గడించినయస్మన్మాతులుఁ గృపాచార్యు నేల దూఱెదవు. గర్వోద్రేకమునం జేసి సర్వలోకధనుర్ధరవరుం డై నయతని నించుకేనియుం గణింపవు. నీవు సూచుచుండఁగ నిన్ను గెలిచి జయద్రథుని గాండీవి చంపినపుడు నీవీర్యమును నీయస్త్రములు నెక్కడికిఁ బోయె? పరమేశ్వరుం బవరమున గెలిచిన పార్థుని గెలువఁ జూచెద విది కొనసాగునే? కృష్ణసహితుం డై నగాండీవి నింద్రాదులు గెలువఁ జాల రన్న నింక నీవును నీకూడినరాజులును గెల్తు రని యెట్లుతలంపవచ్చును. ఓరీదుష్బుద్ధీ, చక్క నిలు మిదె నీతలధరం దొరిఁగించెద నని యతనిపయి కుఱువడించుచున్నగురుసుతుం జూచి శూరమాని యైనయీబ్రాహ్మణాధముఁడు నన్నేమి చేయఁగలఁడు విడువు మని కర్ణుఁడు వారించుచుండినను గార్యతత్పరుండు గావున దుర్యోధనుఁడు దాను తటాలున నయ్యశ్వత్థామయొద్ద కరిగి గురుపుత్రా, ప్రసన్నుఁడ వగుము. క్షమియింపుము. మాన మొసఁగుము. సూతపుత్రునిమె

డఁ గినియవలదు. నీయందును రాధేయునందును శారద్వతునందును నాచార్యు నందును మద్రపతియందును గాంధారవల్లభునందును గార్యభార మెత్తియున్న వాఁడను. అల్లవారె పాండవయోధులొండొరులం బురికొల్పుకొనుచు రాధేయు నితోడఁ బోరికి వచ్చుచున్నవా రని పార్థించినం బ్రసన్నుండై ద్రోణపుత్రుండు కర్ణుం జూచియోదుర్మతీ, నీచేసినయపచారంబు సైఁచితి. నీమదంబు ధనంజయుం డుడిగించు ననుటయుఁ గృపుఁడును సౌమ్యస్వభావుఁడు గావున నచిరసంప్రాప్త మార్దవుండై కర్ణున కశ్వత్థామచెప్పినట్లు చెప్పి శాంతుఁ డయ్యె.

అట్టియెడఁ బాండవపాంచాలురు దలపడినం గర్ణుండు కార్ముకధరుండై కురువీరులతోడం గలిసి సురగణపరివృతుం డై నసురేశ్వరుచందమునం జూడ నొప్పుచు సింహనాదసముద్దామంబుగాఁ గవియుటయుఁ బాండవసైనికులు వీఁడె కర్ణుఁ డెక్కడఁ గర్ణుఁడు నిలుము కర్ణ యని యదల్చువారును, మాతోడఁ బోరి బ్రదికి పోవంగలవే యనువారును, నల్పమతి యగునీపాపాత్ముం బట్టి చంపవలయు వీఁడు బ్రదుకకుండిన లోకమునకుఁ జెఱుపు లే దనువారును, నీతండె పాండవుల కత్యంతశత్రుండు వీఁడె యనర్థములకెల్ల మూలము దుర్యోధనమతానువర్తి యగువీనిం జంపనవలయు ననువారునై చుట్టు ముట్టి శరనికరమునం గప్పిన నతం డించుకేనియు భయవ్యథలఁ బొందక బిరుదుమగండై నిలిచి కల్పాంతసాగరము కరణిఁ గొలఁది యిడరాక పైపై నఱుముచున్న పాండవానీకంబుఁ జూచి కోపించి తదీయశరజాలంబు మాయించి తనపటుప్రదరనికరములు వేనవేలు వరఁగించిన నాపోరు సురాసురసమరంబుతెఱఁగునఁ బరమభీకరం బయ్యె. అంత నేచి రాధే యుఁడు హస్తలాఘవంబు సంధిల్ల నద్భుతం బావహిల్ల నందఱను దా నొక్క రుండ నిలువరించి యాత్మనామాంకితము లగుశితశరముల రథహయకేతనాతప త్రాదినికరంబులపై నాటి రణాంగణంబుఁ బీనుంగుపెంటఁ గావించుటయు హతశే షులు శీతార్దితంబు లయినగోగణంబులట్లు వెఱచఱచి ఓఱిగి పఱచిరి. కయ్యం పునేల గజవాజినరగాత్రఖండసాంద్రంబై వైవస్వతపురము ననుకరించె. అప్పుడు దుర్యోధనుఁడు కర్ణువిక్రమమునకు వెఱఁ గంది యశ్వత్థామను బిలిచి చూచితే రాధేయువీర్యము. కర్ణసాయకపతితంబై పాండురాజపుత్రసైన్యంబు కార్తికేయ సముద్ధూతం బగునసురసైన్యంబుతెఱంగునఁ బఱచుచున్నది. ఇయ్యెడరు సూడ లేక కవ్వడి వాఁడె తఱిమికొని వచ్చుచున్నవాఁడు. అతండు కర్ణుం దలపడి యొండొక్కటి సేయకుండునటుల నీతి కావింపు మనుటయు ద్రౌణికృపశల్య హార్దిక్యులు సూతసూనునకుఁ గావలియై నడిచిరి. వివ్వచ్చుఁడు నంతకుఁ బాంచా లగణపరివృతుండై కర్ణుం దలపడియె ననిన విని యాంబికేయుండు సంజయా, పరమసంరంభమునంబేర్చి కాలాంతకున కెనవచ్చువివ్వచ్చుం జూచి రాధేయుం

డేమి చేసె? అతం డెల్లపు డత్యంతస్పర్ధ వెట్టి యతనిం గెలువఁ గోరువాఁడుగదా. కావున నయ్యుద్దఱికయ్యంపుఁదెఱంగు తేటపడం జెప్పు మనియడుగుటయు నతం డతని కిట్లనియె.



## కర్ణార్జునుల యుద్ధము.

అట్లు భండనమునకు సముద్దండతం బేర్చి వచ్చుచున్న వివ్వచ్చుం జూచి సూతసూనుండు సంభ్రమింపక తాఁకిన నమ్మహారథు లిరువు రొకళ్లొకళ్లపైఁ గాండజాలంబుఁ బరఁగించుచుండునంత గండడరి గాండీవి కాండజాలమున మార్తండతనూజుం గప్పుటయు నప్పరమశూరుఁడు మూఁడువాఁడితూపుల నర్జునుపయిం బడ నేసె. ఏసినం దదీయకరలాఘవంబు సైరింపక నిలింపపతిసుతుండు ముప్పది వాఁడికోలల నారాధాసుతునిపై నేసి తోడన సవ్యభుజాగ్రమున నిలుచునటు లొక్కనారసంబు గ్రుచ్చినం దానితాఁకునఁ జేయి వడఁకుటయు విల్లు జాఱి పడియె. అందుల కెంతయు నలిగి కర్ణుఁడు నిమేషమాత్రలో నావిల్లు గొని శరనికరమునఁ గిరీటిం గప్పుటయు నమ్మేటివిలుకాఁ డించుక నగుచు నొక్కమాత్రలో నయ్యాలుఁగులసోన నడఁగించిన నారాధేయుండును బ్రతిబాణముల నేయుటయు నయ్యిద్దఱిసమరంబు కరేణుకాముకంబు లగువన్యమత్తశుండాలముల పోరు తెఱంగున నద్భుతప్రకారం బయ్యె. అతఁ బార్థుం డెంతయు నేచి కర్ణునివిక్రమమునకు నెమ్మనమ్మున నలరుచుఁ బటురయమునం బేర్చి యతనివిల్లు ముష్టికిఁ ద్రుంచి నాల్గు భల్లముల నాల్గుగుఱ్ఱములం జదిపి సారథితల నొక్కవాఁడికోలఁ దఱిగి నాలుగమ్ము లతనిమేనం గీలించిన నారాధేయుండు రయమునం దేరు డిగ్గి గాండీవిబాణవిద్ధుండై జీవితార్థియై కృపుసితే రెక్కె. అట్లు కర్ణుఁడు గాండీవి కోడుటం జూచి మనసైనికులు విచ్చిపఱచినం జూచి రారాజు చేయి వీచి యెలుంగు రాల్పడ నందఱ కిట్లనియె. శూరులారా, పఱవవలదు నిలువుఁడు. ఇదె యేను వచ్చి పార్థునిం బాచాలురనుం జంపెద. యుగాంతరుద్రునివిధమునఁ దేజోదుర్నిరీక్షుండనై యేను గాండీవితోడం బోరునెడ నావిక్రమంబును బాణసంధానప్రయోగవేగంబునుం బాండవులు సూడఁగలరు. మిడుతలబారులంబోలు నాయంపగములం జూచి సైనికులు వెఱఁ గందుదురు. నిశితశరములఁ బార్థుం గెల్తును. అతనివలని వెఱపు విడువుఁడు. సాగరము వేలను దాఁటరానివిధమున నర్జునుఁడు నన్ను మిగులఁజాలఁ డనిపలుకుచుఁ గ్రోధసంరక్తలోచనుండై కిరీటిని దాఁకువాఁడై యరుగుచుండఁ గృపాచార్యుఁ డశ్వత్థామ కిట్లనియె. అత్యంతామర్షభరితుండై దుర్యోధనుండు గాండీవిం దాఁక నరుగుచున్నవాఁడు. వానిం దాఁకుట వీనికి మిడుత యగ్గిఁ దాఁకెడుచందము గాఁగలయది. మనము సూచుచుండ నితండు గాండీవిబాణములకు గోచరుం డగుట యొప్పదు. తో లూడ్చిన పాములం

బోనివివ్వచ్చునమ్ములకు గుఱి కాకమున్న వీని వానితోడియనికిఁ దొలఁగించుట యిపుడు మనకుఁ గర్తవ్యంబు. వానిబారిం బడెనా బ్రమకు టరిది యనవుడు నశ్వత్థామ రయమున దుర్యోధనునొద్ద కరిగి గాంధారేయాగ్రజా, నీమె లెల్ల పుడును గోరునేను బ్రదికియుండఁగ నీకుఁ గవ్వడిం దలపడఁ బని లేదు. పార్థు నెట్లు గెలువ నగు నని తత్తఱపడవలదు. ఏను వాని నాఁగెద ననిపలుకుటయు రారాజు గురుపుత్రున కిట్లనియె. అయ్యా, యాచార్యుఁడు పాండవులఁ గొడుకు లంబోలెఁ బ్రియమునఁ జూచుచున్నవాఁడుగాని నోనేయ నెల్లఁడు. నీవును నా పగవారియెడ నెప్పరికింత చేయుదువు. మదీయభాగ్యముననో ధర్మజునెడ సౌ హార్దంబుననో పాంచాలిమీఁదియనుగ్రహంబుననో భవదీయవిక్రమం బలంతి యయ్యె. అందులకుఁ గతం బేను నిక్కమముగ నెఱుంగఁజాలను. నాతదర్థంబు సుఖకాము లగుసకలబాంధవులును బరాజితులై యిడుములపాలైరి. లుబ్ధుఁడైన నాజీవితం బింకఁ గాల్పనే? ముక్కంటి కెనవచ్చుమేటివిలుకాఁడు దోడు గలిగి యుండియు శత్రునిర్మూలనము వడయనివిధము పొసఁగునేని యావిలుకాఁడు ద్రోణపుత్రునికంటె లాఁతి గాఁ డనితలంపవలయు. ఇంకనైనం బ్రసన్నుండవై నాశత్రుల రూపుమాపుము. దేవదానవులు నీబాణముల కెదుర నిలువ నోడు దురు. లాఁతులం జెప్పవలయునే? పాంచాలసోమకులను దదీయులను బరిమార్పు ము. నీప్రాపుఁ గాంచి మేము తక్కినవారలఁ బరిమార్తుము. ఈపాంచాలసోమ కులు సామాన్యు లనరాదు. వీరె మనమూఁకల దవదహనంబు శుష్కకానన ములఁ బోలె నేర్చుచున్నవారు. కిరీటిపాలిపునుం గలిగెనేని యింక వారలఁ జెప్పి తీఱదు. కావునఁ బాంచాలవధార్థం బయినభవదీయజన్మప్రకారముఁ దలపోసి లోక మెల్ల నపాంచాలముగఁ జేయుము. ఆద్యంతములం దేప్పదైన నిట్టియుత్తమక ర్మముఁ జేయుదేని నీయశము సిద్ధప్రముఖులు కీర్తింతురు. ఇదె పార్థసాయకపీడి తంబై మనసైన్యంబు దైన్యంబుఁ జెంది దిక్కు గానక చెచ్చవడియు వెగడుప డియు విచ్చిపఱచుచున్నది. ఎంతకైనను శక్తుఁడవు గావున నీకుఁ జెప్పెద. నిజదివ్య తేజమునఁ బాండవపాంచాలుర నిగ్రహింపుము. ఇఁకఁ గాలముఁ గడపవలదు. రయ మున నెద్దు మని దుర్యోధనుఁ డెంతయుఁ దఱిమి చెప్పిన నరివధోద్యోగివై ద్రోణపుత్రుఁడు భవత్పుత్రున కిట్లనియె. కురుకులేశ్వరా. నీచెప్పినది నిక్కువంబు. నాకును మాతండ్రికిని బాండవులు ప్రియులు. మేమును వారికిఁ బ్రియులము. అయినను నాప్రీతి యుద్ధంబునఁ దలపోయము. ధైర్యధుర్యులమై ప్రాణము లమీఁదియాస విడిచి శక్తికొలఁది పోరుచున్నవారము. ఏనును గర్ణుఁడును శల్యుఁడును గృపుఁడును హార్దిక్యుఁడును నిమేషములోఁ బాండవసేనల రూప డఁగింపఁ జాలుదుము. పాండవశూరులును నిమేషమాత్రలోఁ గౌరవసేనల

బొడవడఁగింప నేర్తురు. మేమును వారునుం గడిమిమెఱయఁ బోరుటం జేసి యక్కడనిక్కడ నింతకు జయపరాజయములు గలుగవయ్యె. తేజస్సు లాఁతితేజమును బొంది ప్రశాంత మగుతెఱంగున నేము వారలం బొంది శాంతాత్ముల మయ్యెదము. పాండవులు బ్రదికియుండునంతకుఁ దత్సైన్యంబును గెలువ రాదు. సమర్థు లయినవా రాత్మార్థంబు పోరువారు నీసేనలఁ జంప కేల యుడుగుదురు. నీవు లుబ్ధుఁడవు నికృతినిరతుఁడవు సర్వులయెడ మిక్కిలి శంకించువాఁడవు గర్వవంతుఁడవు కుత్సితుఁడవు పాపాత్ముఁడవు పాపపురుషుఁడవు. కావున నిజపాపబుద్ధిచే నితరులను శకింతు వింతియకాని లాఁతుల గుణదోషముల నెఱుంగవు. ఏను నీతదర్థము జీవితనిరపేక్షుఁడనై యెంతయుఁ గడఁగుచుండెద. ఇదె యేను నీకుఁగాఁ గయ్యమునకుఁ జని పాంచాలసోమకకేకయాదుల మార్కొని పోరెద. అస్మద్బాణపీడితులై వారు సింహముపొదివినయాలరీతి విచ్చిపఱతురు. నేఁడు ధర్మరాజు మదీయపరాక్రమమునఁ బాంచాలాదులు తెగిపడుటం జూచి లోకమెల్ల నశ్వత్థామమయ మని భావించి నిర్వేదముఁ బొందువాఁడు. మఱియు నన్ను మార్కొనువారల నెల్ల వధించెద ననిపలికి యాచార్యపుత్రుఁడు భవత్పుత్రులకుఁ బ్రియముసేయువాఁడై కయ్యమునకుఁ గడంగి పాంచాలకేకయులం బిలిచి యందఱుఁ జక్క నిలిచి యస్త్రలాఘవముఁ జూపుచు నెక్కయుమ్మడి నాపైఁ గవియుఁడు మీనేర్పు చూతు ననవుడు వా రెంతయు నుక్కనం గడంగి ప్రావృట్పయోధరములట్లు శరవర్షముఁ గురిసినం గినిసి యతండు పాండవులును ధృష్టద్యుమ్నుఁడును జూచుచుండఁగ వారిలోఁ బదుగురుమేటివిలుకాండ్రఁ బొరివుచ్చి యెంతయుఁ బ్రతాపాతపంబు గాయుచుండ నతనియెదుర నిలువనోడి పాంచాలురు విచ్చిపఱచిరి.

### అశ్వత్థామధృష్టద్యుమ్నులయుద్ధము.

అట్టు లశ్వత్థామశరకోలుతల క్రోహటించి పాంచాలసోమకులు విచ్చిపఱచుటయు ధృష్టద్యుమ్నుఁ డమర్షభరితుండై యందఱకుఁ జేయి వీచి యనేకరథములు తోడ రాఁగ నశ్వత్థామను మాఱుకొని యోయాచార్యపుత్రా, దుర్బుద్ధీ, లాఁతులఁ గొందఱఁ జంపి యేను శూరుఁడఁగదా యని పొంకించికొనవలదు. నాతోడఁ జక్క నిలిచి పోరుము. ఇదె నిన్నుఁ బరిమార్చెద నని పరుషములు పలుకుచు మర్మదాగణకర్మఠంబు లయినతీవ్రమార్గణంబులు పెక్కులు పరఁగించుడు నయ్యమ్ములు బారులుతీఱి తేనెఁ గ్రోలఁగఁ గుసుమితతరునికరముల కరుగు మధుకరముల తెఱఁగునం జూడ నొప్పి యశ్వత్థామగాత్రంబుఁ జొచ్చుటయు నగ్గురుపుత్రుఁడు పాదాహతం బైనపన్నగంబుభంగి నత్యంతరోషరూషితుండై యమ్ముఁ జేతఁ గొని యోధృష్టద్యుమ్నా, ముహూర్తమాత్రము ప్రతీక్షింపుము. నిశితభ

ల్లముల నిన్ను యమపురి కనిచెద ననిపలుకుచుఁ బటుప్రదరనికరముల నాతనిం
గప్పుటయు నప్పాంచాలరాజపుత్రుఁ డయ్యాచార్యపుత్రునకు మఱియు నిట్లనియె.
బ్రాహ్మణా, నాప్రతిజ్ఞను జననప్రకారంబును నీ వెఱుంగవే? ద్రోణుం జంపికదా
నిన్ను నేఁ జంపవలయుఁ గావున ద్రోణుఁడు ప్రాణములతో నుండునంతకు నిన్ను
వధియింపను. ఈరేయి తెలతెలవాఱునంతకు ద్రోణుం బరిమార్చి పదంపడి
నిన్నును యమలోకమునకుఁ బనిచెద నని తలంచియున్న వాఁడను. నీ కెల్లపుడును
గల పార్థులమీఁదిపగను గౌరవులమీఁదిభక్తినిం జూపుము. చిక్కనిలుము. నా
బారిం బడి యింక నెక్కడికిఁ బోవఁ గలవు. నీయట్లపోలె బ్రాహ్మణధర్మముఁ
బరిత్యజించి క్షత్రధర్మరతుఁడై నబ్రాహ్మణు నవశ్యము వధింపవలయు ననిన నత్యం
తకోపావిష్టుండై యశ్వత్థామ క్రూరపన్నగంబుచాడ్పునఁ బెద్దయు రోఁజుచుఁ
గన్నుల నిప్పులు రాలఁ జూచుచుఁ బాంచాలరాజపుత్రునిపయిం బాణజాలంబు
గుప్పించిన నాధృష్టద్యుమ్నుఁ డించుకేనియు నందులకుఁ జలింపక వీర్యదుర్దాం
తుండై సాయకాసారంబులు పరఁగించుటయు నంత నయ్యిద్దఱు పరస్పరవధో
ద్యోగులై నర్తనముఁ గావించుకైవడి మండలీకృతకార్ముకముల నరిఁబోసి కాం
డజాలం బడరించి యద్భుతం బావహిల్ల హస్తలాఘవంబు సంధిల్ల సౌష్ఠవంబు
సెలంగ సర్వభూతసంత్రాసం బెసంగ వన్యమత్తమాతంగంబులభంగిఁ బోరాడినం
జూచుఖేచరులు వ్రుగడిరి. ఉభయసైన్యములందును సింహనాదంబులు శంఖార
వంబులునుం బెరసె. ఏమి చెప్పుదు. వారిశరప్రచారమున మున్నటిచీఁకటి మఱిం
తయెక్కు డగుడు నేమియుం గన్పట్ట దయ్యె. అట్టు లెక్కువతక్కువలు నిరూ
పింపరానివిధమునం బరమతుములంబై వారిసమరంబు సెల్లుచున్నంత నాచా
ర్యపుత్రుం డేచి ధృష్టద్యుమ్నునివిల్లును బడగను గొడుగును జక్రరక్షకులను
సారథిని గుఱ్ఱములనుం గూల్చి నిశితశరనికరముఁ బరఁగించి పాంచాలురం దఱి
మి యాధృష్టద్యుమ్నుండును ధనంజయుండును జూచుచుండ గుఱి దప్పకుండ నొ
క్కొక యమ్మున కొక్కొక్కఁడుగా నందఱితల లేఁచుచున్నంత నింద్రవిక్రముఁ
డైన యాగురుపుత్రునిమునుమున నిలువఁ జాలక హతశేషు లయినపాంచా
లురు పఱచిరి. అవ్విధమున సృంజయపాంచాలురం గనుపుకొట్టి యుగాంతాన
లప్రభలు వెలుంగ సకలభూతభయంకరుండై నిదాఘాపగమజలధరముచంద
మున గర్జిల్లుచుఁ గౌరవులప్రశంసావచనములకు నెమ్మనమున నుప్పొంగుచున్నంత
యుధిష్ఠిరుఁడును భీమసేనుఁడు నయ్యాచార్యపుత్రుని దాఁకుటయు దుర్యోధనుఁడు
భారద్వాజసహాయుండై కవియుటయు ఘోరరణంబు సెల్లె. ఆసంకులసమరమున
యుధిష్ఠిరుఁ డంబష్ఠమాలవవంగశిబిత్రిగర్తగణంబులను భీమసేనుఁ డభీషాహశూ
రసేనసేనలను ధనంజయుండు యౌధేయాద్రిజమద్రకానీకంబులను మృత్యులోక

మున కనిచినం గయ్యంపునేల యపుడు ద్విశృంగపర్వతంబులం బోలినద్విరదము లను నిటునటుం బాఱునురగంబులం బోలుతెగినశుండాదండములను నొప్పి విశీర్ణకనకచిత్రకేతనాతపత్రవ్రాతశకలంబులం జేసి గ్రహనక్షత్రసంకీర్ణం బయినన భోమండలమురీతిం దనరె. అట్టియెడఁ బాంచాలురు ద్రోణుం బట్టుఁడు కొట్టుఁడు పొమ్ముఁడు పోరుఁ డనునెలుం గేర్పడఁ గుంభసంభవుం దాఁకిన నయ్యాచార్యుఁడు వాయవ్యాస్త్రం బేసి మహామారుతంబు మేఘపటలంబులంబోలెఁ దెంలించినం జూచి భీమార్జునులు బహుళరథములం గొని వానికిఁ దాము క్రమమున సవ్యదక్షిణభాగములఁ బ్రాపై నిలిచి గురుం దలపడినం గాంచి పాంచాలసృంజయకేకయులుం దోడుపడిరి. అంత నిర్వక్రవిక్రమాటోపదీపితుండై కిరీటి మనమూఁకల నేట్లాడుటయు నాచార్యుఁడును నీకొడుకును వారిసేనలం గలంచుటయుఁ జీఁకటి పెల్లునను నిద్రాభరమునను నుభయసైనికులు నేమియుం దెలియక టెచ్చపడి విచ్చిపఱచిరి.

### సోమదత్తుఁడు సాత్యకితో యుద్ధము చేసి చచ్చుట.

అయ్యవసరంబున సాత్యకి క్రోధసముద్ధతం బయినతనమనము సోమదత్తునిపై నిగుడ సారథిం జూచి దారుకానుజా, సోమదత్తునియెదుర మనతేరు నిలుపుము. ఆకౌరవాధముం జంపక యేను మఱల ననుటయు నతం డట్లు చేయుడు మనోవాయువేగము లయినయాధవళాశ్వములపటురయమునం జేసి దైత్యవధోద్యతుం డైనపురుహూతునిచందమున నాసోమదత్తునిపయిఁ గవిసి శరజాలముఁ బరఁగించుచున్నంత నక్కురువీరుఁడు నుక్కునం బేర్చి యాశినిప్రభుం దాఁకి యంపతుంపరం గురియుడు బాహ్లికాత్మజుఁడు శైనేయుపయి నఱువదివాఁడితూపులను శైనేయుఁడు బాహ్లికనందనుపైఁ బెక్కమ్ములను నడరించిన నయ్యిద్దఱు దొరలు పరస్పరశరప్రహారమున నెత్తుటం జొత్తిల్లి వసంతసమయమునఁ బూచిన మోదుగులచందమునం జూడ నొప్పి యితరేతరస్పర్ధ యతిశయిల్లఁ గన్నుల నిప్పులు రాల నొండొరులం జూచుచు వివిధరథమండలమార్గములం జరించుచు వానకాలపుమేఘములచాడ్పున ఘోరరూపులై గర్జిల్లుచు శరశకలసాంద్రగాత్రులై యేనులరీతిని, సువర్ణపుంఖమార్గణాంచితాంగులై మునిమాఁపున మిడుఁగుఱుఁబురువులు బెరసినమ్రాఁకులతెఱంగునను, సాయకసంప్రదీపితసర్వాంగులై కొఱవులం గూరినయేనుంగులభంగినిం దనరియున్నంత సోమదత్తుఁడు సాత్యకివి ల్లర్ధచంద్రబాణమునఁ దునిమి తొంన యిరువదేనుతూపులను బదియమ్ములను నేసె. ఏసినం గినిసి శినివరుఁ డొండుకోదండం బెత్తి పంచాశుగముల సోమదత్తుని నొ నేసి యొక్కభల్లమున నగుచు నతనికనకకేతనముఁ గూల్చుటయు నాబాహ్లికతనూజుఁ డందులకుఁ దత్తఱపా టొందక యిరువదేనమ్ముల శైనేయు

పయి నడరించుటయు నాతం డొక్కకుప్పెక్కోల నతనివిల్లు దునిమి కోలలువిఱిగి నపామురీతి వాఁడిమి దప్పినయాకారవునిపయి నూఱుశరము లేసె. అంత నొండు విల్లు గొని సోమదత్తుఁడు సాత్యకిని శరజాలమునఁ గప్పిన నాతండు నతనిపయిం బ్రదరనికరంబుఁ బరఁగించుచుండునంత భీమసేనుఁడు సాత్వతునకుఁ దోడై సోమదత్తునిపయిఁ బదియమ్ము లడరించిన నతండు సంభ్రమింపక శరశతముల నతనిపయిం గుప్పించె. అట్టియెడ సాత్యకి క్రోధోద్దీపితుండై హేమదండ మత్యంత దృఢము నవము నగుపరిఘము సోమదత్తునురమునం బడ నేయుటయు నాబాహ్లికాత్మజుండు నవ్వుచు దాని నడుత్రోవన రెండుఖండములు గావించుటయు నాపరిఘము వజ్రతాడితమహీధరశిఖరముచందమున నేలం బడియె. అంత సాత్యకి కోపాటోపదీపితుండై యొక్కభల్లమున సోమదత్తునివిల్లు దునిమి యేనమ్ములఁ గరత్రాణంబుఁ జించి నాలుగుమార్గణముల గుఱ్ఱములఁ జదిపి యొక్కతీవ్రభల్లమున సారథితలఁ దఱిగి నవ్వుచుఁ దైలధౌతము శిలాశితము జ్వలత్పావకోపమము నగునొక్కబాణం బరిఁ బోసి యేయుటయు నయ్యది వేగచాడ్పున నతిరయమున నతనియురమ్ముపయిం బడినం దత్ప్రహారమున నాసోమదత్తుఁడు విదీర్ణహృదయుండై పడియె.

అట్లు సోమదత్తుఁడు సాత్యకిహతుండైనం జూచి సేనైనికులు బహుళరథపరివృతులై యాసాత్యకిం దఱుముటయుఁ బాండవపాంచాలప్రభద్రకులు ద్రోణానీకముపయిం గవిసినంబోరు ఘోరం బయ్యె. అంత యుధిష్ఠిరుఁడు క్రోధసముద్రేకబంధురుండై ద్రోణసైనికులం దఱిమినం జూచి యయ్యాచార్యుఁడు క్రోధసంరక్తలోచనుండై యేసువాఁడితూపులఁ బాండవాగ్రజుపయిం బరఁగించుటయు నతం డతనిపయి నేనమ్ము లడరించె. అడరించినం గినిసి గురుఁడు యుధిష్ఠిరునికార్ముకకేతనములం ద్రుంచుటయు నమ్మహీవల్లభుండు పటురయమునం బేర్చి యొండుకోదండం బెత్తి శరసహస్రము లడరించి యాచార్యుని రథరథ్యసారథిసహితంబుగాఁ గప్పుటయు నయ్యుంపగములతాఁకునం జేసి భారద్వాజుండు మూర్ఛిల్లి తేరిపయిం జదికిలఁ బడి కొండొకవడికిఁ దెలిసి క్రూరపన్నగంబుచాడ్పున రోఁజుచు వాయవ్యాస్త్రం బేయుడు ధర్మరాజు దానిఁ బ్రత్యస్త్రమున నడఁగించి విల్లు దునిమె. తునిమిన నొండువిల్లు గొని గురుండు శితశరముల నడరింపఁ దొడంగినం గడంగి కౌంతేయాగ్రజుండు దానిం ద్రుంచినం జూచి యచ్యుతుం డజాతవైరి కిట్లనియె. భారతసత్తమా, ద్రోణుఁడు నిన్నుఁ బట్టెఁగఁ బ్రతిజ్ఞ చేయు టెఱుఁగుదుగదా. కావున నతనితోపోరు నీకుఁ దగదు. గురుం ద్రేడించి దుర్యోధనుని మాఱుకొనుము. రాజునకు రాజుతోడికయ్య మొప్పుఁగాని లాఁతులతోడిపోరు పోలదు. దానంజేసి దుర్యోధనాదులతోడఁ బోరుచున్నభీమునకుఁ బ్రాపై నిలు మసిన ధర్మరాజు ము

హూ_ర్తమాత్రము చింతించి ప్రావృట్పయోధరముచాడ్పున గర్జిల్లుచు నీ కెవాధులం గనుపుకోట్టుచు వాయుసూనుఁ డున్న దెసకుఁ జనియె. ద్రోణుఁడును బాంచాలుర పయిం గవిసె. అట్లు ద్రోణకర్ణకృపాదులును భీమసాత్యకిధృష్టద్యుమ్నాదులును బరస్పరస్పర్ధ యెసంగఁ బోరునెడ నెగయుధరణీరేణుజాలంబు తఱితో బెరయుచీఁకటికిఁ దోడుపడం గన్ను గానక నిక్కడియక్కడవీరులు నామగోత్రములను నడియాలములను గంఠస్వనములను నెక్క_తెఱంగున నెఱుఁగుచు నీడంబోక పెనంగుచున్నంత మూఁకలు బెండువడియు ఱిచ్చవడియు విఱిగె ననిన విని ధృతరాష్ట్రుఁడు సంజయా, పాండవు లట్లు విక్రమంబు సూపఁగ మీామనంబు లెట్టులయ్యె. ఆగాధధ్వాంతమునఁ బ్రకాశ మెయ్యదియేనియుఁ గలిగెనే యనియడుగ సంజయుఁ డాంబికేయున కిట్లనియె.

**ఉభయసేనలందును దివిటీలు వేయుట.**

అంత హతశిష్టము లయినసేనలఁ గూర్పఁగఁ బడవాళ్లకు నియమించి యాచార్యుండు దాను ముందఱను మద్రేశ్వరుఁడు పిఱుందను సౌబలాశ్వత్థామలు సవ్యదక్షిణపార్శ్వములను నడుమఁ గురుక్షోణీవల్లభుండును నతనికిఁ గావలిగఁ దక్కఁగలశూరులునుగా నెక్క_మోహరం బమర్చి కయ్యమునకుఁ గడఁగుచుండునంత దుర్యోధనుఁడు సాంత్వవచనములఁ గాలుమానుసులం బిలిచి యీాకటికిచీఁకటి పెల్లునఁ దమ్ము నెదిరి నెఱుంగక విన్నఁబోవుటకంటె మీా రాయుధములనెల్ల నవలం బెట్టి దివ్విటీలు వట్టినం దెప్పరమునకుఁ దప్పి తక్కంగలవారు భండన మొనర్తు రని వారికిఁ దెల్పి యపరిమితంబు లగుకరదీపికాసహస్రంబులు దెప్పించి సుగంధితైలములఁ దడిపించి రథమునకుఁ బదేసియు నేనుఁగున కేడేసియు గుఱ్ఱమునకు రెండేసియు మఱియుఁ బడగలముందఱను గెలంకులను బిఱిందిదెసలను సేనాముఖముననను సముచితనానాస్థానములను లెక్క_కు మిక్కిలిగా దివ్విటీలు పట్టించుటయుఁ బాండవులును దత్ప్రకారంబ చేయుటయుఁ దిమిరము పటాపంచ లయ్యె. కరదీపకాంతులం బ్రభామయం బయినయచ్చోట నాభరణంబులయు నాయుధంబులయుఁ గేతనాతపత్రచామరంబులయుఁ బ్రతిప్రభలు చూడ్కు_లు మిఱుమిట్లుకొల్పుతెఱంగునం జెలంగె. సేనల నెల్లచోట్ల నట్లు వెలుంగుఁ గల్పించుటకు గంధర్వవిద్యాధరాదులు నారదపర్వతులును బిచ్చలించిరి. కరదీపకాంతులం దొడవులతుఱంగలి యెసంగ యోధు లెంతయుఁ జెలంగుటం జూడ మెఱుంగుతళతళల నెఱుంగఁబడుకార్మొగుళ్లగములచందము దోఁచె. అత్తెఱంగునఁ జీఁకట్లు విరియించి ప్రకాశము గావించినఁ గరదీపనికరనిబిడంబై గ్రహనక్షత్రగణభాసురం బయిననభోమండలమున కెనవచ్చునాసంగ్రామరంగంబున విధికల్పితంబు లయినయయ్యుభయసేనావ్యూహములు సురాసురసేనలం బోలి

కయ్యమువిూఁదియుత్సాహంబు నిగుడఁ దలపడునెడ మనయనీకమున నాచా ర్యుండు మధ్యందినమార్తండునివడువునం జూపట్టుచుఁ దఱిమిన నర్జునుప్రా పుఁ గాంచి పాండవపాంచాలయోధులుం గవిసి రనిన నాంబికేయుండు సంజ యా, ధనంజయుండు భండనమునకుఁ గడంగిన మనవారిమనంబు లెట్లయ్యె? దు ర్యోధనుఁ డేమి చేయఁదలంచె? ద్రోణున కెవ్వరు గావలి యైరి? పాంచాలకుల ధూమకేతు వగునయ్యాచార్యుఁ డెట్లు మడిసెనోకాని యూహించి చూచినం గోచరంబు గాదు. మఱియు నీ వెల్లపుడు మావారిచావునెవ్వలను వారివారిప్ర హర్షోత్కర్షములనుం జెప్పెద వది యట్టుల యుండునే యనియడిగిన ధృతరాష్ట్రు నకు సంజయుం డిట్లనియె. దుర్యోధనుఁడు ద్రోణునిమతం బెఱింగి తమ్ములం బిలి చి మీ రందఱు గురునకుఁ బిఱిందిదెసఁ గావలియై యుండుఁడు. హార్దిక్యమద్రే శ్వరులు దక్షిణోత్తరపక్షములం గ్రహించువారు. త్రిగర్తశూరులు ముందు నడు చువారు. ఆచార్యుఁడు బలవంతుఁడు క్షమావంతుఁడు విక్రమవంతుఁడును గావు న నింద్రాదులు వచ్చినను గెలువఁ గలఁడు. ఇఁకఁ బాండవపాంచాలురం జెప్ప నేల? ఐనను ధృష్టద్యుమ్నుఁ డాచార్యుం గెలువఁ జాలినవాఁ డద్దెసఁ గలఁడు. కావున నతం డతనికిఁ జిక్కనితెఱంగుగా మీ రెల్లపుడును గావలియై యుండు నది. గురుని సురక్షితుం గావించితిమేని పాంచాలసృంజయాదుల నందఱను న తండు పరిమార్పఁగలఁడు. పాంచాలాదులు మడిసినపదంపడి యశ్వత్థామ భండన మున ధృష్టద్యుమ్నుం దెగటార్చును. పిమ్మటఁ గర్ణుఁ డర్జునుం జంపును. ఏను భీమ సేనుం బొలియింతును. భీమార్జునులు హతులైనం బాండవయోధులం జంపు టొక్కపని గాదు. జయము మనసొమ్మై యుండు. కావున నన్నిటికి మూలము నాకుంజూడ నాచార్యరక్షణంబ యని తోఁచుచున్న దని నిదేశించుటయు వార లట్టులు సన్నద్ధులయి కడంగినం బాండవులును వారలపయిం గవియుటయు నా రేయి యెన్నఁడుం జూడ వినంబడనిపోరు ఘోరంబయి చెల్లె.

ద్వంద్వయుద్ధము.

అట్టియెడ యుధిష్ఠిరుండు తమవారలం బిలిచి ద్రోణుం బొదువుఁ డనిపం చినం బెద్దయు నార్చుచు వారు గడంగిన మనవారును శక్తికి నుత్సాహమునకు బలమునకుఁ నీడుగా నెదిరించి యొకళ్లొకళ్లం దాఁకిరి. అందుఁ గృతవర్మ యుధిష్ఠి రుం దాఁకె. భూరి సాత్యకిని మార్కొనియె. కర్ణుఁడు సహదేవుని దలపడియె. దుర్యోధనుఁడు భీమసేను నెదిరించె. శకుని నకులునిఁ బ్రతిఘటించె. కృపుఁడు శిఖండిపై నడరె. దుశ్శాసనుఁడు ప్రతివింధ్యుం గవిసె. అశ్వత్థామ ఘటోత్క చుం దఱిమె. వృషసేనుఁడు ద్రుపదు నఱిమె. శల్యుఁడు విరాటుని ముట్టె. చిత్రి

సేనుఁడు నకులపుత్త్రుఁడై సశతానీకుం బొదివె. అలంబుసుఁ డద్దునుపయిం గవి యుదెంచె. ధృష్టద్యుమ్నుఁ డొరులతోడిపో రొల్లక యాచార్యు నాఁగె. తక్కుఁగ లవారు తమకుఁ దమకుఁ బోలినవారి కడ్డంబై నిలిచిరి. గజారోహులు గజారో హుల మార్కొనిరి. ఱెక్కలువచ్చినకొండలచాడ్పునం జూడనొప్పుగుఱ్ఱముల నెక్కి రావుతులు లాఁతిరావుతుల నాక్రమించిరి. కాలుమానుసులును బదాతిగణంబు లవయి నిగిడిరి. అట్లు ద్వంద్వములై ప్రతిఘటించియున్నెడఁ గృతవర్మ సాగర మును వేల యొట్టు లట్టుల ధర్మరాజు నాఁగి శరజాలం బడరించినం గౌంతేయా గ్రజుండు పంచాశుగములను దోన యిరువదివాఁడితూపులను నతనిపయిం బడ నేసి నిలునిలు మనియదలించినం గృతవర్మ కోపించి యొక్కభల్లమున ధర్మజు విల్లు దునిమి సాయకసప్తకంబు మేనం గీలించె. అంత నొండువిలు గొని యజా తశత్రుండు హార్దిక్యుభుజవక్షోభాగముల దశవిశిఖముల నాటుటయు నతండు కో పాటోపవేపమానగాత్రుండై సాయకసప్తకముఁ గౌంతేయాగ్రజునిపయి నడ రించె. అడరించినం గినిసి యతండు హార్దిక్యునికార్ముకమును గరత్రాణమునుం దునిమి శితభల్లపంచకంబు బిట్టేసిన నవి యతనిమైమఱుఁగు వ్రచ్చి వల్మీకముఁ జొచ్చుపన్నగములచందమునఁ బుడమిలోనం జొచ్చె. అంత నాకృతవర్మ ఱెప్ప పాటులోన నొండువి ల్లెత్తి యఱువదియమ్ములను బదితూపులను నాయుధిష్ఠిరుని నొంచినం గోపించి పాండవాగ్రజుండు కోదండము తేరిపయిం బెట్టి క్రూరభుజ గసంకాశం బయినశక్తిం బ్రయోగించుటయు నది యాహార్దిక్యుదక్షిణభుజంబు నొంచి నేలం బడియె. అంతలోనం బాండవజ్యేష్ఠుండు పటురయమునం బేర్చి వి ల్లెత్తి శరజాలము గప్పినం గినిసి కృతవర్మనిమేషార్ధమాత్రలో ధర్మరాజుతేరు ర థ్యసారథిసహితంబుగాఁ గూల్చినం గౌంతేయాగ్రజుండు వాలుఁ బలుకయుం గొని యె. హృదికాత్మజుండు శితభల్లముల దానిం బఱియలువాపుటయు ధర్మరాజు కనకదండ మగుతోమరం బెత్తి విసరి వైచె. వైచుటయుం దోడన కృతవర్మ నవ్వుచు నడుమన దాని రెండుతునియలు గావించి యనేకశరనికరములం గుప్పిం చి ధర్మనందనుమైమఱుఁగుఁ జించిన నతండు విరథుండును విశీర్ణకవచుండునై య నికిఁ దొలంగె.

### సాత్యకి భూరిని జంపుట.

సాత్యకి తనపై నడరినభూరిపయి నైదమ్ము లేసి నెత్తురు లురులించినఁ గౌరవుఁడు పదియమ్ముల శైనేయుపయిం బరఁగించుటయు నయ్యిద్దఱు క్రోధసం రక్తనయనులై కార్ముకగుణక్వణనంబుఁ గావించి యొండొరుల శరనికరమునఁ గప్పుచు నెక్కువతక్కువలు లేక పోరుచుండ ముహూర్తమాత్రలోనం గండడరి సత్యకతనూజుండు నవ్వుచు భూరివిల్లు దునిమి తోన తొమ్మిదియమ్ముల బొమ్మప

యిం గీలించి నిలునిలు మనియదల్చినం గోపించి భూరి యొండువిల్లెత్తి మూఁడు
వాఁడితూపుల సాత్యకిని నొప్పించి నగుచు నిశితభల్లమున నతనివిల్లు దునిమె.
తునిమినం గ్రోధమూర్ఛితుండై శినివీరుండు మహావేగ మగుశక్తి నెత్తి విసరి
వైచుటయుఁ దత్పరిహారమునంజేసి యాకురువీరుఁడు విదీర్ణహృదయుండై యల
ప్రాకం బుడమికిఁ జనుదెంచునంగారకుని తెఱంగున దీప్తరశ్మియై తేరినుండి పడియె.
అట్లు భూరి హతుఁడైనం గోపించి యశ్వత్థామ తాను సాత్యకిని మార్కొని ని
లునిలు మనియదల్చి శరజాలంబుఁ గురియుచున్నంత ఘటోత్కచుండు సింహనా
దముఁ గావించి సాత్యకిం దలకడచి నిలునిలు మోరీ ద్రోణపుత్రా, యిఁకఁ బ్రా
ణములతోడఁ బోవఁ జాలవు. మహిషవధోద్యోగి యగుస్కందునిచందమున
నేను భవద్వధోద్యతుఁడ నైతి. యుద్ధశ్రద్ధ నీకు మాన్పెద ననిపలుకుచు రోష
తామ్రేక్షణుండై గజేంద్రముపయిం గవియుమృగేంద్రముభంగి నశ్వత్థామను
దాఁకి యిరుసులంత లమ్ములఁ బరఁగించి యాచ్ఛాదించుటయు గురుతనూజుండు
తదీయశరవర్షమును నిజశరముల నడుతెరువునం బొడవడఁగించి ఘటోత్కచుని
పయిం గాండజాలంబు గుప్పించె. గురుతనయశరనికరనిబిడసర్వాంగుండై హిడిం
బానందనుం డేదు పెఱిఁగినచందమునం జూడ నొప్పి క్రోధసముద్దీప్తుండై క్షుర
ప్రార్ధచంద్రవికర్ణవరాహకర్ణప్రముఖశరవృష్టి యడరించినం జలింపక యగ్గురుత
నయుం డగ్గలించి మహామేఘపటలంబు విరియించుమారుతంబురీతిని దివ్యాస్త్ర
మంత్రితంబు లగుఘోరశరములం బ్రయోగించి తదీయమార్గణములఁ దెంలిం
చుటయు నవి యొండొంటిం దాఁకి మిట్టిపడి నేలం బడునెడఁ బరస్పరసంఘర్షము
నం బొడమినమిడుఁగుఱుల పెల్లునంజేసి యాకసంబు ఖద్యోతవ్రాతచిత్రితం బైన
విధమునం జూపట్టె. అవ్విధమున నశ్వత్థామఘటోత్కచులు శక్రప్రహ్లాదులట్లు
పోరునెడ భవత్తనయప్రియంకరుండై గురుతనయుం డతనిపయిం గాండజాలం
బుఁ గురియించి దిక్కు లావరించుటయు హిడింబాసుతుండును గోపదీపితుండై
కాలానలసదృశము లగువాఁడితూపులఁ బదింటిని నతనియురమ్మునం గాఁడ నేయు
డు గాఢవిద్ధుండై యశ్వత్థామ వాతవిధూతం బైనపాదపంబుచందమునం గం
పించి మూర్ఛిల్లి కేతుదండ మూఁతగొనుటయు మనవార లతని హతునకా వ
గచి హాహాకార మొనర్చిరి. పాంచాలసృంజయాదులు సముల్లాసమున సింహ
నాదములు గావించిరి. అంతలోనఁ దెలిసి యశ్వత్థామ వామకరమునం గార్ము
కము గ్రహించి వలకేలఁ గర్ణాంతము నారి సారించి యమదండోపమ మగు
ఘోరనారాచ మరిఁ బోసి యేయుటయు నయ్యమ్ము ఱొమ్ము వ్రచ్చి నేలం జొ
చ్చిన ఘటోత్కచుండు మూర్ఛిల్లి తేరిపయిం జదికిలఁబడినం బరమరయమున

సారథి తేరు దొలఁగించె. ఆచార్యపుత్రుఁడు సింహనాదముఁ గావించి నీకొడుకులప్రశంసావచనమ్ములకు నెమ్మనమ్మున నలరుచు మధ్యాహ్నమార్తండునిపగిది వెలింగె.

### దుర్యోధనుఁడు భీమునితోఁ బోరి యోడుట.

దుర్యోధనుఁడు ద్రోణు నాఁగఁ బోవుచున్న భీముని దాను దాఁకి వాలమ్ములడరించినం గోపించి యవ్వడముడి తొమ్మిదియమ్ముల నతని నొంచుటయు నది నెవ్వగాఁ గొనక కురుక్ష్మాధ్యక్షుం డిరువదివిశిఖముల నతనిపైఁ బడ నేసిన నయ్యిద్దఱు పరస్పరశరనికరసంవృతగాత్రులై మొగులుగప్పిన సూర్యచంద్రుల చందమునఁ బొల్చిరి. అంత దుర్యోధనుం డేచి పంచాశుగముల వృకోదరునిపై నడరించి నిలునిలు మనుటయు నప్పవనసూనుండు నిశితశరముల నడరించి వాని విల్లు దునిమి కేతనముఁ గూల్చి తొన తొంబదియంబకంబులం గీలించుటయు భవదగ్రనందనుండు వేఱువిల్లు గొని యందఱు సూచుచుండఁగ వాలమ్ము లనేకము లేసె. ఏసినం గినిసి వృకోదరుఁడు వానిం బ్రతిశరముల నడంగించి యిరువదేనుకుప్పికోలలు తనపై నేయుటయు రారాజు కడుం గనలి యర్ధచంద్రశరమునఁ గార్ముకంబుఁ ద్రుంచి తొన దశవిశిఖములం బరఁగించుటయు భీముఁ డొండువిల్లెత్తి సాయకసప్తకంబు కురుపతిమేనం గీలించినం గాంధారేయాగ్రజుం డక్కోదండంబును నఱికె. అంత భీముఁడు కార్ముకాంతరము గ్రహించినం దుర్యోధనుండు దానిం ద్రుంచె. అట్లు రెండవదియు మూడవదియు నాలవదియు నేనవదియుం ద్రుంచి మఱియు నతం డెత్తినవిండ్ల నెల్ల నొక్కమాత్రలోనం దునుముటయు నవ్వాయుసూనుండు దీప్తకేతుశిఖాకారంబై యగ్నిసమప్రభావిభాసమానంబై గగనలక్ష్మికిఁ బాపట దీర్చుతెఱంగున నొప్పి మృత్యువుతోఁ బుట్టు వనం దగినఘోరశక్తి నేయుటయు నందఱుం జూచుచుండఁగ దుర్యోధనుండు దాని ముత్తునియలు గావించె. అందులకుఁ గడుం గోపించి వడముడి యుద్దండంబైన గదాదండంబు నెత్తి విసరి కురురాజుతేరిపయిం బడ బిట్టేయుటయు నగ్గదతాఁకునం జేసి యయ్యరదము రథ్యసారథిసహితముగ నుగ్గయినం గురుక్షోణీపతి భీమునకు వెఱచి తటాలున నత్తేరు డిగ్గ నుఱికి నందకుతే రెక్కి తొలంగి చనియె. అప్పరమసమ్మర్దమున భీముఁడు దుర్యోధనుని హతునకా వగచి కౌరవుల బెదరించువాఁడై సింహనాదముఁ గావించుటయు మనవారు దుర్యోధనుఁడు సచ్చె నని తలంచి హాహాకారములను నార్తనాదములనుం గావించిరి. ఆనినాదమును భీము నార్పును నాకర్ణించి యజాతశత్రుండును సుయోధనుండు హతుఁ డయ్యె నని తలంచి వృకోదరుఁ డున్నెడకుఁ జనియె. చేదిమత్స్యకేకయపాంచాలసృంజయాదులు ద్రోణునిపయిం దలపడినం బోరు ఘోరం బయ్యె.

## కర్ణుఁడు సహదేవుని వింటికోపునఁ బొడిచి యవమానించుట.

అప్పుడు ద్రోణుం దాఁకఁ జనుచున్న సహదేవునిఁ గర్ణుండు తాను దాఁకిన నాతం డతనిపయిం బదునెనిమిదియమ్ములు వరఁగించినం గినిసి కర్ణుఁడు శరశతం బడరించి విల్లు ద్రుంచిన నమ్మాద్రేయుఁడు రయమున నొండువి ల్లెత్తి యిరువది వాఁడితూపు లవ్వైకర్తనుమేన నాటుడు నంద అద్భుతం బందిరి. అంతఁ గర్ణుండు శితభల్లముల సహదేవుగుఱ్ఱముల సారథిని సమయించుటయు విరథుండై యప్పాం డవానుజుండు వాలుఁ బలుకయుం గొనిన రాధేయుండు వానిం దుముగుసేయు టయు నాతండు గద యెత్తి యేసె. ఏసినం దానిఁ గర్ణుండు త్రుంచినం జూచి సహదేవుఁడు త్వరాన్వితుండై శక్తి నేయుడుఁ గర్ణుండు దానిం దునిమె. తుని మినఁ గడుం గోపించి సహదేవుఁడు తేరు తటాలున డిగ్గి రథచక్ర మెత్తి కర్ణుతేరి పయిం బడ నేయుటయుఁ గాలచక్రమురీతి నుద్యతం బయినయాచక్రమును గ ర్ణుఁడు పెక్కుతూపులం గండ్రికలు గావించుటయు నమ్మాద్రిపిన్నకొడుకు తేరికాఁ డిని నొగను మృతగజవాజిశరీరఖండములనుం జేతి కందినవాని నెత్తియెత్తి యేయు టయు రాధేయుండు వాలమ్ముల వానినెల్లం ద్రుంచిన నాసహదేవుఁ డోడిపఱచె. పఱచినం బోనీక వెన్నుదవిలి కర్ణుండు కుంతివచనముఁ దలపోసి చంప నొల్లక నవ్వుచు నిట్లనియె. మాద్రేయా, విశిష్టరథికులతోడఁ బోరు మాని యింక నీకుఁ దగినవారితోడఁ బోరుచుండుము. నాపలుకులకు మనమున వగవ వలదు. అల్లవాఁడె యర్జునుండు కురువీరులతోడఁ బోరుచున్నవాఁడు. అమ్మేటిమగని యొద్ద కరిగి యతనిప్రాపునం బ్రదుకుము. అది యొల్లవేని నెమ్మది నింటికిఁ బొమ్మని పలుమాఱులు వింటికోపునం బొడిచి తూలనాడి యటఁ బాంచాలురపై నడరె. సహదేవుఁడు శరపీడకంటెఁ గర్ణవాక్శల్యపీడ యెక్కుడగుడు బ్రదిమి పోయు చు లజ్జావమానభరమునంజేసి విన్నఁబోయినమనమ్ముతో నరిగి పాంచాలరాజపు త్రుండైన జనమేజయునితే రెక్కె. మద్రేశ్వరుండు ద్రోణుం దాఁకఁ బోవుచు న్నవిరాటుం దాఁకిన నయ్యిద్దఱికి బలవాసవుల కెట్టు లట్టుల పరమఘోరం బైన సంగ్రామంబు సెల్లె. అట్టియెడ శల్యుండు విరాటునిపయిం బాణశతం బడరిం చిన నమ్మత్స్యేశ్వరుండు దొలుత నతనిపైఁ దొమ్మిదియమ్ము లేసి తోన డెబ్బది మూడువాఁడితూపులను శరశతంబునుం గుప్పించుటయుఁ గోపించి మద్రపతి య తనిగుఱ్ఱముల నాల్గింటినిం జాపి గొడుగును బడగనుం గూల్చుటయు విరథుండై విరాటుండు తేరు డిగ్గి పుడమి నిల్చి నారి సారించి శరాసారంబుఁ బరఁగించుచు న్నంత విరాటుతమ్ముఁడు శతానీకుం డన్నకుఁ దోడుపడ వచ్చుటయు నమ్మద్రరాజు వానిం బరిమార్చె. అంత విరాటుఁడు శతానీకునితే రెక్కి క్రోధారుణితలోచ నుండై శల్యుతేరు శరవ్రాతమునం గప్పుటయు నతం డతనిపై నూఱమ్ములు ప

రఁగించిన నావిరాటుండు గొఱవ్రాయి తేరిపయిం బడినం జూచి సారథి తేరు తొలఁగించె.

అట్లు మత్స్యపతిం గెలిచి తదనీకములం దఱుముశల్యుం దాఁకవచ్చుచున్నవివ్వచ్చుం జూచి యలంబుసుండు తురంగవదనపిశాచయోజితంబు లోహితార్ద్రగృధ్రకేతనాభిరామ మష్టచక్రసముజ్జ్వలము చిత్రపక్షము విస్తృతాక్షము నగు తేరెక్కి తా నాఁగి యిషుగణములం గప్పించుటయు నర్జునుం డాఱువాలమ్ముల వాని నొప్పించి పదింటఁ గేతుదండముఁ గూల్చి మూట సారథిని సమయించి మూటఁ ద్రివేణుకముఁ ద్రుంచి యొక్కవాఁడియమ్మున విల్లు దునిమి నాలుగింట గుఱ్ఱములం జంపి యంతలో నతం డొండువిల్లెత్త గమకించుటయుఁ గాండచతుష్టయమున దానిం దునిమిన నయ్యసుర సురపతిసుతునెదుర నిలువ నోడి ద్రోణునెద్దకుఁ బఱచె. మనమూఁకలు గాండీవియమ్ములకు బలియై పెనుగాలికిఁ గూలు ద్రుమాఁకులచందంబైనం జూడనేరక హతశేషులు వెఱచఱచి పఱచిరి. నకులపుత్రుం డైనశతానీకుని జిత్రసేనుఁడు వారించుటయు నతండు పంచాశుగములను దశవిశిఖములను దన్ను నొంచినం జిత్రసేనుండు తొమ్మిదియమ్ముల నప్పాండుపౌత్రుపై నడరించె. అందుల కలిగి నకులసూనుండు కత్తళంబుఁ జించినం జిత్రసేనుండు నిర్ముక్తనిర్మోకభుజంగంబుపగిదిం జూడ నొప్పుచు నొండువి ల్లెత్తుటయు నకులాత్మజుం డావిల్లు ద్రుంచి కేతనంబుఁ గూల్చె. అంత నొండుకోదండంబుఁ గొని చిత్రసేనుఁడు శరపరంపర లడరించినం గోపించి శతానీకుండు చిత్రసేనుని గుఱ్ఱములను సారథినిం దెగఁజూచుటయు నాతండు తేరు డిగ్గి భూమిస్థితుండై యిరువదేనమ్ముల నకులుని నొప్పించుటయు నాపాండుపుత్రుఁ డర్ధచంద్రశరమున నాచాపము నడిమికి రెండుగా నఱికినం జిత్రసేనుండు కృతవర్మతే రెక్కె. వృషసేనుఁడు ద్రుపదుం దాఁకి శరజాలముఁ బరఁగించిన నప్పాంచాలపతి యారాధాసుతుపై నఱువదివాఁడితూపులుఁ బాహువక్షోభాగములఁ గీలించుటయు నయ్యిద్దఱు శరసంవృతగాత్రులై ముండ్లునిండినయేదులచందమునను నెత్తుటం జొత్తిల్లినమేనుల నొప్పటంజేసి పూచినమోదుగులవిధమునను జూడ నొప్పిరి. అట్టియెడ వృషసేనుఁడు ద్రుపదుం దొమ్మిదియమ్ములను డెబ్బదియలుఁగులను మూఁడుతూపులను నొప్పించి ప్రావృట్పయోధరముమాడ్కి శరసహస్రముఁ బరఁగించినం బాంచాలభూవల్లభుండు కర్ణాత్మజుకార్ముకంబు నడిమికి రెండుగా నిశితభల్లమున నఱికె. అందుల కెంతయు నలిగి కర్ణునికొడుకు వేఱువిల్లు గొని శితభల్ల మొక్కటి పొదినుండి తీసి యరిం బోసి విడుచుటయు నది ద్రుపదునిఱొమ్ము వ్రచ్చి నేలం జొచ్చె. అట్లు వృషసేనశరాఘాతమునం గొఱవ్రాయినద్రుపదునిం జూచి సారథి తేరు దొలఁగించినం దదనీకంబు దిప్పటీలు నేలం బడ వైచి వెఱచి పఱచె.

దీప్రదీపప్రభావిభాసితంబై సంగ్రామభూమితలంబు గ్రహగణసంకీర్ణం బైన
తారాపథంబువిధమునం జూడ నొప్పె. అట్లు పాంచాలురం గెలిచి కర్ణసూనుం
డేకవీరుం డనం జాలి పట్టపగలింటివేఁడివెలుంగుభంగిం దనరుచు యుధిష్ఠిరుం
దాఁకువాఁడై యరిగె. దుశ్శాసనుండు మనమూఁకల నేర్చుచున్నప్రతివింధ్యుం
దలపడిన నయ్యిద్దఱిసమాగమము మొయిలులేనిమింట బుధభార్గవులకూటమి
చాడ్పునం జిత్రరూపంబై తోఁచె. అప్పుడు దుస్ససేనుఁడు ప్రతివింధ్యునిలలాట
మున మూఁడమ్ములు నాటుటయు నాద్రౌపదీసుతాగ్రజుండు శృంగత్రితయభాసు
రం బైనమహీధరంబుపోలె నొప్పుచు దుశ్శాసనుం దొమ్మిదియమ్ములను నేడుతూ
పులను నొంచినం గోపించి నీకొడుకు ప్రతివింధ్యుగుఱ్ఱములం జంపి సారథిం జదిపి
సిడముఁ గూల్చి తేరు తిలప్రమాణశకలములు గావించె. అంత విరథుండయ్యు
నయ్యుధిష్ఠిరాత్మజుండు ధనుష్పాణియై కయ్యంపునేల నిలిచి వివిధమార్గణము లరి
వ్రోసి యడరించుచు నొక్క కుప్పెకోలను దుశ్శాసనశరాసనముఁ దునిమి తోన
పదియమ్ము లతనిమేనం గీలించి విక్రమించుచున్నంతఁ దమ్ములు తోడ్పడుటయు
నాప్రతివింధ్యుఁడు శ్రుతసోమునరద మెక్కి శరనికరం బడరించుటయు మామూఁ
కలు దుస్ససేనునకుఁ దోడుపడుటయుఁ బోరు ఘోరం బయ్యె. శకుని నకులుం
దాఁకి నిలునిలుమని యదల్చుచు వాలమ్ములఁ బరఁగించిన నప్పాండునందనుండును
గాండజాలం బడరించుటయు నయ్యిద్దఱు శరనిబిడగాత్రులై యేదులతెఱంగు
నను బూరుగమ్రాఁకులకై వడిని రక్తసిక్తాంగులై పూచినమోదుగులట్లును ఫల
భరితకల్పపాదపములవిధమునను జూడ నొప్పుచు నత్యంతబద్ధవైరులు గావున నొం
డొరులఁ జుఱచుఱం జూచుచుఁ బోరునెడ నేచి సౌబలుండు నగుచు నొక్కవా
లమ్ము బిట్టేయుటయు దానితాఁకునం గొఱప్రాయి నకులుండు తేరిపయి నొఱఁ
గుడు గాంధారవల్లభుఁ డుల్లంబున సంతసిల్లి నిదాఘాపగమసమయజలదంబుచం
దమున గర్జిల్లె. అంతలోనం దెలిసి మాద్రేయాగ్రజుండు నోరు దెఱచినమృ
త్యువుపగిది భీకరాకారుండై శకునిపై నడరి ఱొమ్మున నఱువదియమ్ములను శర
శతంబునం బరఁగించి విల్లు ముష్టికిఁ ద్రుంచి బోయ డేగంబోలె సిడముఁ బుడ
మిఁ బడం ద్రోచి యొక్కభల్లమ్ము నురమ్మున నాటుటయు నాగాంధారేశుఁడు
మూర్ఛితుండై కామినిం గౌగిలించుకాముకునిరీతిని గేతుయష్టిం బట్టుకొని ప్రా
లుటయు సారథి తేరు దొలఁగించె. పాండవులదెస నార్పులు మిగిలె. నకులుం
డంత ద్రోణానీకముపయిం గవిసె. శిఖండి కృపాచార్యుం దాఁకి నగుచుఁ దొమ్మి
దియమ్ము లేసిన నగ్గౌతముఁ డగ్గలించి పంచాశుగంబులను వింశతివిశిఖములను
నాశిఖండిపై నేయుటయు నంత నయ్యిద్దఱు నుడివోనిచలంబున మెఱసి శరవ
ర్షముఁ గురియించి శంబరవాసవులయట్లు మహాఘోరం బైనపోరు సేయం దొడం

గిన నారాత్రి కాళరాత్రినిభంబై తోఁచె. అట్టియెడ శిఖండి యేచి కృపునిచా పం బర్ధచంద్రబాణమున నఱికి శితశరముల నిగిడించుటయు శారద్వతుండు న ప్పాంచాలరాజపుత్రునిపై నుద్దండశక్తిం బ్రయోగించిన నతండు దశశరముల దానిం దునియలై పుడమిం బడఁజేసిన నగ్గౌతముండు వేఱువిల్లు గొని వాలమ్ము లం గప్పుటయు శిఖండి తేరిమీఁదికి వ్రాలె. వ్రాలినం దడయక కృపుఁడు తోన పెక్కమ్ములు వరఁగించుటయు శిఖండియెడరు సూచి పాంచాలసోమకు లతనికిఁ బ్రాపై కృపుం దాఁకినం జూచి నీకొడుకులు వారలం దలపడినం బోరు ఘోరం బయ్యె. ఏమి చెప్పుదు నప్పుడు దీప్రదీపప్రభలం జేసి యారాత్రి పవలింటికి సాటి యైయుండ నుభయసైనికులు నుక్కునం జేర్చి యార్చుచుఁ బుడమి యద్రువ నరాతులం దఱుమువారై యిటునిటుం బఱచుచు రేఁగినధరణీరేణుపటలంబు పె ల్లున దీపప్రభ లించుక యడంగుటయుఁ దమవాఁడు లాఁతివాఁ డనిభేద మెఱుం గక తండ్రి కొడుకును గొడుకు తండ్రిని మిత్రులు మిత్రులను సంబంధులు సం బంధులనుంగా నిర్మర్యాదంబుగఁ బోరుటయు సంకులసమరం బయ్యె.

అట్టిసంకులసమరమున ధృష్టద్యుమ్నుఁడు కోదండగుణక్వణనంబుఁ గావిం చుచు నాచార్యుం దాఁకుటయుఁ బాంచాలపాండవు లతనికిఁ దోడయినం గురు నకు నీకొడుకులు బాసటయై నడుచుటయు నుభయబలము లన్యోన్యసమ్మర్దమునం జేసి వాతవిఘాతంబులై క్షుబ్ధసత్త్వంబులై యతిభీకరంబులైనసాగరంబులభం గినిఁ జూడ నొప్పె. అప్పుడు గురునిఱొమ్ముపయిం బాంచాలవరుండు పంచశర ముల నిగిడించి యార్చిన నయ్యాచార్యుండు పంచవింశతివిశిఖముల నతనిమేనం గీలించి యొక్కభల్లమ్మున విల్లు దునిమె. తునిమినం గోపదీపితుండై ధృష్టద్యు మ్నుండు సంరంభావష్టంభమునం జేర్చి యవుడుగఱచి యొండువిల్లు గొని కర్ణాం తంబు నారి సారించి గురుం గూల్చుతలంపు గదిరినమనంబుతో ఘోరసాయకం బరివ్రాసి విడుచుటయు నయ్యది దివాకరునట్లు దెసల దీప్తుల నిగిడించుచు నడ రుడుఁ జూచుఖేచరులు భీతచిత్తులై ద్రోణునకు స్వస్తి యయ్యెడు మనిపలికిరి. అయ్యెడ వైకర్తనుం డక్కాండ మాచార్యుం దఱియరాకమున్న తాను బంద్రెం డుగండ్రికలు గావించుటయు నిర్విషం బయినయాశీవిషంబువిధంబున నయ్యమ్ము వమ్మై నేలం బడియె. అంతఁ గర్ణుఁడు ధృష్టద్యుమ్నుపయిం బెక్కుతూపు లడ రించుటయుం దోన యాచార్యుండు నశ్వత్థామయు శకునియు నై దేసియమ్ములను శల్యుఁడు దొమ్మిదిభల్లములను దుశ్శాసనుండు మూఁడుతూపులను దుర్యోధనుం డిరువదికాండములనుం బరఁగించినం జలింపక పాండవసేనానాయకుఁడు గండడరి వారల నందఱను మూఁడేసియమ్ముల నొంచె. అందుల కలిగి యార్చి వారు గ్రమ్మ

ఱఁ బటుప్రదరము లడరించుచున్నంత ద్రుమసేనుఁ డడ్డపడి కర్ణుం బటుబాణ
మున బిట్టేసి వెండియుఁ గాండజాలం బడరించి నిలునిలుమని యదల్చుటయు
నారాధేయుండు క్రోధవిధేయుండై మూఁడువాడితూపుల వానిచలం బుడిపి
యొక్కభల్లమునఁ గనకకుండలోజ్జ్వలం బైనవానిశిరంబుఁ దఱుగుటయు నది
యవృకగఱపు పిడువనికడిమిం బొల్చుచు గాలికి రాలుతాళఫలమురీతిఁ బుడమిం
బడియె. తనతమ్మునిచావునకు విషాదంబును గోపమును మనంబునం బెనంగొనంగ
ధృష్టద్యుమ్నుఁడు కన్నుల నిప్పులు రాలఁ జూచుచు నప్పౌరుషపయిం బెక్కుతూ
పు లడరించుచుఁ జిత్రయోధి యగురాధేయునివిల్లు దునిమె. సింగమునకు లాం
గూలకృంతనం బెట్లట్లు ధనుశ్ఛేదనంబు దనకు రోషమూలం బగుటయుఁ గర్ణుం
డు కార్ముకాంతరము గ్రహించి క్రోధరక్తేక్షణుండై పెద్దయు రోఁజుచు ధృష్టద్యు
మ్నుపయిం బటుప్రదరపరంపరలు నిగిడించినం బరమసంరంభసముద్రిక్తుం డైన
సూతసూనుం జూచి ద్రోణద్రౌణిశల్యశకునిదుర్యోధనదుశ్శాసను లాఱుగురు
రథికు లతనికిఁ దోడై పాండవసేనాపతిం జుట్టుముట్టి యంపసోనం గురియుటయు
సైనికు లక్కటా! ధృష్టద్యుమ్నుఁ డాఱుగురుదొరలకుఁ జిక్కినవాఁ డింకఁ బ్రాణ
ములఁ దప్పించికొనుట యరిది యని తలంచిరి. అంతలో సాత్యకి శరాసారముఁ
బరఁగించుచు ధృష్టద్యుమ్నునకుఁ దోడై వారలం దాఁకుటయు రాధేయుండు
పదియమ్ములు నిగిడించిన శినివీరుఁ డన్నియమ్ము లతనిపయిం బడ నేసి నిలునిలు
మనియదల్చిన నయ్యోద్ధలు వివిధశస్త్రాస్త్రముల నొండొరులపై నేయుచుఁ బ్రత్య
స్త్రముల మాయించుచు బలివాసవులట్లు పోరిరి. అప్పుడు సాత్యకి యేచి వృష
సేనుఁ డొమ్ముఁ గాఁడిపోవంగఁ బటుప్రదరము నేయుటయు గాఢవిద్ధుండై యక్కర్ణ
సూనుండు చేతివిల్లు విడిచి తేరిమీఁద వ్రాలినం జూచి రాధేయుండు సుతుని
హతునకా వగచి పుత్రశోకపీడితుండై సాత్యకిపయిం గాండజాలంబు నిగిడించె.
నిగిడించిన సైరింపక సత్యకసుతుండు కర్ణుఁ బదింటను మూర్ఛదేఱినవృషసేను
నైదింటను నొప్పించి వారివిండ్లను గరత్రాణంబులనుం దుమురుచేయుటయు
వారు వేఱువిండ్లు గొని పోరం దొడంగిరి.

కర్ణదుర్యోధనులు దురాలోచనచేసి సాత్యకిం దాఁకుట.

అట్టిరౌద్రసమరంబున రాధేయుండు గాండీవజ్యాఘోషంబును గిరీటిరథ
నేమినిర్ఘోషంబును నాకర్ణించి దుర్యోధనున కిట్లనియె. అల్లదె గాండీవమౌర్వీ
నాదంబును నర్జునరథనేమినిస్వనంబును వీతెంచుచున్నయది. దానిం జూడఁ బాం
డవమధ్యముండు కౌరవానీకముల నేట్లాడుచందము తోఁచెడి. అల్లవియె మన
యనీకములు వాతోద్ధూతమేఘవ్రాతములరీతి విచ్చి పఱచుచున్నయవి. మఱియు
నమ్మేటిమగం డుండునెడ సింహనాదములును శంఖధ్వానములును భేరీభాంకార

ములును బ్రస్ఫుటంబులై వినవచ్చెడి. నాకుం జూడ గాండీవి తనకార్యము నెఱ
వేర్చికొను నని తోఁచుచున్నది. ఈసాత్యకి మనలోనం జిక్కినవాఁడు. ఇప్పు
డితని విడిపింపక పోదువవలయు. ఆచార్యునితోడఁ బోరుధృష్టద్యుమ్నుని నీస
త్యకాత్మజునిం బొదివి చంపితిమేని గెలుపు మనదియనుట నిక్కువంబు. అల్ల
వాఁడె సవ్యసాచి తనమునుము బట్టబయ లగుడు ద్రోణానీకముం గవియ నున్న
వాఁడు. అతం డిచ్చెడకు రాఁడేని మన మందఱముం గూడి యభిమన్యుం
జంపినవిధమున నీసాత్యకిం జంపు టొప్పును. మనము వీరిం బొదువుట యెఱింగె
నేని క్రీడి తాను వోడగు. అట్లైన మనకు గెలువరాదు. కావున నతం డిచ్చె
డకు రాకుండఁగఁ దగువారల నతనితోడం బోరఁగ నచ్చటికిఁ బంపుము. మనము
మున్న సాత్యకిం బొదువుద మని కర్ణుండు పల్కుటయు దుర్యోధనుండు సంతసంబు
నం బొంగి యదియ కర్జం బని నిశ్చయించి శకునిం బిలిచి మామా, నీవు పదివేల
యేనుంగుల నన్నిరథములనుం గొని ధనంజయుం దాఁకుము. దుశ్శాసనదుర్విష
హసుబాహుదుష్ప్రధర్షణులు నిన్ను వెంబడించి వచ్చువారు. నీవు విక్రమించి
కృష్ణునిం బాండవులనుం బరిమార్పుము. సురేంద్రుపై సురల కెట్లట్లు నీపై జ
యాశ మాకు మిక్కుటంబై యున్నయది. కుమారుఁ డసురులంబోలె నీవు పాం
డవుల నిర్జింపు మనుటయు నీమఱంది యట్లయని బహుళసేనాసమన్వితుండై
యరుగుటయు నక్కడఁ బోరు ఘోరం బయ్యె. అంత నిక్కడ మనవారు పెక్కం
డ్రక్కరణి నుక్కునం గడంగి బహుళచతురంగబలపరివృతులై సాత్యకి నెక్కనిం
జుట్టుముట్టి సింహనాదములు గావించి శరపరంపరలు నిగిడించినం బరవీరమర్దనో
ద్రేకి యగుసాత్యకి వారల కందఱ కన్నిరూపులై మార్కొని కడిందిమగఁటిమిం
బేర్చి యార్చి వారియమ్ములఁ బొడవడఁగించుచు బహుళపటుప్రదరములం బరఁ
గింపుటయుఁ దెగినతలలను దునిసినకేయూరోల్లసితబాహువులను నఱికినయేనుఁ
గుతొండములను ద్విధాభూతము లగుహయకంధరములను బఱియలైనగొడుగు
లను నఱవఱలైనచామరంబులను గూలినసిడములను రాలినతొడవులను సంగ్రా
మభూమితలంబు గ్రహనక్షత్రసముజ్జ్వల మయినగగనమండలంబు ననుకరించె.
ఆర్తరావంబులు నింగి ముట్టె. అట్లు పరమభీకరం బయినయారాత్రిసంగరంబున
సాత్యకికోలుతల కోహటించి విచ్చిపఱచుచున్నమూఁకలం జూచి కురుకులాధ్య
క్షుండు సాత్యకితేరికి సమ్ముఖముగఁ దేరు వోని మ్మని సారథికిఁ జెప్పి యయ్యు
యుధానుం దాఁకుటయు నబ్బిరుదువిలుకాఁడు మాంసశోణితము లానువాఁడి
తూపులఁ బండ్రెంటిని నిగిడించుటయు నంతకుమున్న తదీయశరార్దితుండు గావున
మనదుర్యోధనుఁ డయ్యమ్ములతాఁకునకుఁ బెద్దయు నొచ్చియు నుడివోనిచలం

బుపెల్లునంజేసి పదివాలమ్ము లాశ్శైనేయుపయిం బరఁగించినం బాంచాలయోధు లకు మనవారికి నద్భుతకదనం బయ్యె. అంత శినివీరుఁ డెనుబదివాలికతూపుల గాంధారేయాగ్రజునురమున నాటి తోన గుఱ్ఱములను సారథినిం జంపుటయుం గోపించి నీకొడుకు సాత్యకిపై నేఁబదియమ్ము లేసిన నతండు వాని నకుమన త్రుం చి యొక్క భల్లమ్మున విల్లు నడిమికిఁ దునిమినం గురురాజు విరథుఁడును విధను ష్కుఁడునై కృతవర్మతేరెక్కి తొలంగె. శైనేయుఁడు మనసేనలం దఱిమె.

అక్కడ శకుని బహుళరథవారణపరివృతుండై గాండీవిం దాఁకి దివ్యా స్త్రములఁ బరఁగించిన నమ్మేటివిలుకాఁడు వారల నందఱను గాండీవనిర్ముక్తకాం డజాలమున వెగడుపఱచుటయు రోషతామ్రేక్షణుండై గాంధారక్ష్మాధ్యక్షుఁడు వింశతివిశిఖములను శతశరములను నడరించి యాఁగఁ బూనినం గిరీటి క్రీడా ప్రకారమున నిరువదియమ్ముల శకునిని మూఁడేసియమ్ములఁ దక్కఁగలవారలను నొప్పించి పటుప్రదరజాలంబు నిగిడించుటయుఁ గిరీటకుండలశిరోమణివిలసితంబు లయినమస్తకంబులను గనకకేయూరసముచితభుజములనుం బొంపిరివోయి క య్యంపునేల కుసుమమాలికాభిరామగిరిసానుతటంబుఁబోలి పొలిచె. అట్టు లుగ్ర కర్మసముదగ్రుండై వివ్వచ్చుఁడు పంచాశుగముల శకునిని నొక్కనిశితసాయక మునఁ దత్పుత్రుఁ డగునులూకుని నొప్పించి సింహనాదముఁ గావించి యగ్గలించి యగ్గాంధారపతివిల్లు దునిమి గుఱ్ఱముల నాలుగింటిని సమయించుటయు శకుని యులూకుతేరెక్కె. అవ్విధమునఁ దండ్రియుఁ గొడుకు నేకస్యందనారూఢులై పా ర్థునిపైఁ గాండవర్షముఁ గురియించిన నతండు గినిసి వారియమ్ముల నడఁగించి వేన వేలువాఁడితూపు లేయుటయు నబ్బిరుదుమగనిమునుమున నిలువఁ జాలక మన మూఁకలు మహామారుతమునకుఁ దెరలుమేఘపటలంబునట్లు వెఱచఱచి విచ్చిప ఱచుటయు వాసుదేవధనంజయులు పాంచజన్యదేవదత్తముల నొత్తిరి. ధృష్టద్యు మ్నుఁడు గురుం దలపడి మూఁడమ్ము లేసి యొక్కశరమున నతనివింటినారిఁ ద్రెం చుటయు నక్కుంభసంభవుం డొండుకోదండముఁ గొని సాయకసప్తకమున ధృష్ట ద్యుమ్నునిఁ బంచాశుగముల సారథిని నొప్పించుటయు నప్పాంచాలవరుండు శర జాలమున గురు నాఁగి యసురసంహారోద్యతుండైననాకపతివీఁక మెఱసి ద్రోణ ద్రౌణికర్ణులు సూచుచుండఁ గౌరవానీకంబులఁ దఱిమియు శంఖము మ్రోయిం చిన భీమనకులసహదేవశిఖండిసాత్యకులును దమతమచిందముల నొత్తి సింహనా దములఁ గావించిర.

దుర్యోధనుఁడు ద్రోణకర్ణులతోఁ బరుషములఁ బలుకుట.

అట్లు తనయనీకములు కాందిశీకములయినం గోపావిష్టుండై దుర్యోధ నుండు ద్రోణకర్ణులపాలికిఁ జని యిట్లనియె. సవ్యసాచి సైంధవుం జంపఁగ

గోపించి మీ రీరాత్రి యుద్ధమునకుఁ గడంగియు నామూఁకలఁ బాండవులు గను పుకొట్టుచుండ వారింప శక్తులయ్యు నశక్తులట్లపోలె నూరక చూచుచుండెదరు. మీ కేను బరిత్యాజ్యుఁడ నగుదునేని చెప్పఁగలయది యిప్పు డొక్కటియుం గా నంబడదు. మేము పాండవుల గెల్తు మనిపలికిన మీమాటల నమ్మి యేను వారి తోడఁ బోరు పెట్టికొంటిని. మీ రట్టులు బాస యీకుండిన వారితోడి కయ్యా మేను దలపెట్టియుండను. ఇంకనైనను మీప్రతాపమున కనురూపముగఁ బోరాడి పగఱఁ బరిమార్పుఁ డనుటయు వారు దుర్యోధనునిపరుసనిపలుకు లనుమునికో లలఁ బొడువంబడి త్రొక్కఁబడినపాములపగిదిం గోపించి సాత్యకిప్రముఖయోధ వరులం దలపడుటయుఁ బాండవవీరులునుం దోన మార్కొనిన సౌబలవృషసే నాదు లగుమనవారునుం గూడినం గ్రందుకయ్యం బయ్యె. అప్పుడు సాత్యకిపై ద్రోణుఁడును గర్ణుఁడును దత్పుత్త్రుఁడును బదేసియమ్ములను సౌబలదుర్యోధను లేడే సితూపులనుం బరఁగించి నొంచుచున్నంత సోమకులు గురుం దాఁకిన నతండు చెల రేఁగి చీఁకటులఁ దెరలించువేవెలుంగుతెఱంగునం బాంచాలసోమకుల నేట్లాడుట యు వార లెంతయు నార్తరవంబు లొనరించుచుఁ దండ్రులను గొడుకులను నన్న దమ్ములను మామలను వివిధసంబంధబాంధవులను జీరక ప్రాణత్రాణపరాయణులై పఱచువారును దప్పించుకొనంబోయి తత్తఱపాటునం దెరువు గానక యగ్గురుమును మునన పడువారును దివ్విటీలు పాఱవైచి కృష్ణార్జునులును ధర్మజభీమసేనులును గవలును ధృష్టద్యుమ్నుఁడును జూచుచుండఁగఁ దోఁచునట్లెల్లఁ బాఱువారునై నానాప్రకారులయిరి. పాండవసైన్యములం గరదీపముల నేలవైచుటంజేసి చీఁకటి పెల్లునను రేణుసాంద్రత్వమునను నేమియుం గానరాకుండుటంజేసి కౌరవానీకదీప ప్రకారములనే యించుక యెఱుంగ వల నయ్యె. పాండవసైన్యములు దైన్యముఁ జెంది యట్లు పాఱినం బోనీక వెన్నంటి ద్రోణకర్ణులు సాయకాసారములు నిగిడిం చుచుఁ దఱిమిరి. తదవస్థ లయినపాంచాలాదియోధులం జూచి దీనమానసుండై మాధవుండు కిరీటి కిట్లనియె. చూచితే సవ్యసాచీ, మనయనీకములు వీఁక దఱఁగి ధృష్టద్యుమ్నసాత్యకులం బొదివినద్రోణకర్ణులమునుమున నిలువనేరక పాఱుచు న్నవి. ఎంత యాఁగినను నిలువ వనవుడు గాండీవి పేరెలుం గెత్తి యోయోధులా రా, వెఱచి పఱవవలదు. భయము విడువుఁడు. మేము ద్రోణకర్ణులయుక్కు వ దుఁగఁజేయుదు మని పురికొల్పుచున్నంత నచ్చోటికిఁ దఱియవచ్చినభీముం జూచి గోవిందుఁడు రణశ్లాఘి యైనవృకోదరుఁ డితండె సోమకానీకపరివృతుండై ద్రోణ కర్ణులం దాఁక వచ్చుచున్నవాఁడు. నీవు నితండును బాంచాలురుం గలిసి వారలఁ దాఁకుఁ డని భీమునకు హర్షోత్కర్షముఁ గావించువాఁడై గాండీవికిఁ జెప్పుటయు భీమార్జును లట్లు గురుని రాధేయునిం దలపడినం జూచి పాండవానీకములు క్రమ్మఱి

మనముూఁకలఁ దాఁకుటయు మనవారు చేదివియల దిగవిడిచి రేణుపటలం బునను దిమిరనికరంబునను నప్రకాశబహుళం బైనయాసంగ్రామమేదినీతలం బున స్వయంవరమంటపంబునంబోలె నిజనామసంకీర్తనముఁ గావించుచు జయేచ్ఛ పెల్లునంజేసి నెచ్చియు నీడంబోక పెనంగినం బరమదారుణం బైనయత్తఱిఁ చం ద్రోదయసమృద్ధంబు లగుసంద్రములసమాగమము తెఱంగున నతిభీకరం బయ్యె. ఏమిచెప్పుదు నించుక ప్రకాశము గలచోట్ల నందఱుం బెరసి పోరం దొడంగిన నక్కడియిక్కడివీరులబీరంబు పెంపునంజేసి యుభయసైనికులును వహ్నిశిఖలం బడుమిడుతలట్టులు దోఁచిరి. అంతఁ గర్ణుఁడు ధృష్టద్యుమ్నుం దాఁకి మర్మభేదన కర్మఠంబు లయినదశవిశిఖములు ఱొమ్మున నాటుటయు నప్పాంచాలరాజపుత్రుండు పంచాశుగముల నతని నొంచి నిలునిలుమని యదల్చినం గోపించి కర్ణుఁ డతనిగు ఱ్ఱములను సారథినిం జంపి కార్ముకముఁ ద్రుంచె. అట్లు విరథుఁడును భగ్నచాపుఁ డునై ధృష్టద్యుమ్నుఁడు తటాలున రథావరోహణంబు సేసి కర్ణుఁ డేయుశరముల సరకుగొనక గదాపాణియై కవిసి యారాధేయునిగుఱ్ఱముల నాల్గింటిం గదతాఁ కున నుగ్గుచేసి మఱలి ధనంజయుతేరెక్కి మగుడ నతనిం బొదువఁబోయిన ధర్మ రాజు వారించె. కర్ణుఁడును బాంచాలరాజపుత్రుం గెలిచి సింహనాదమును శంఖా రవమునుం గావించుటయుఁ బాంచాలసోమకయోధు లందుల కోర్వక శస్త్రాస్త్ర పాణులై యతనిం దలపడుచున్నంత సారథి శంఖవర్ణము లయినయితరతురగ ములం దేరికిఁ బూన్చుటయు లబ్ధలక్షుండై యారాధాసుతుండు పాంచాలానీక ములపయిం గవిసి పటుశరముల నిగిడించుచు హయగజరథములనుండి యారో హకుల ద్రొల్లించియుఁ గాళులఁ దఱిగియుఁ జేతుల నఱికియుఁ దలలఁ దునిమి యుఁ దొడలు విఱిచియుఁ గడిందిమగంటిమిం బేర్చి యేర్చుచుండఁ బాంచాల సైనికు లయ్యాదిత్యనందనునెదుర నిలువలేక తత్తఱపడియు వేగిరపడియు వెఱఁ గుపడియు నివ్వెఱపడియు ఱిచ్చవడియుఁ బారి గదలిన నిదె వచ్చెఁ గర్ణుఁ డని తలఁకితలఁకి విచ్చలవిడి విచ్చి పఱచినం గనుంగొని కౌంతేయాగ్రజుండు ధనంజ యున కిట్లనియె.

అర్జునా, చూచితే కర్ణుఁడు రాత్రి కాదిత్యుఁడు లేఁడనుకొఱఁత వారించు తలంపునంబోలె నుద్దీపితప్రతాపాతపంబు గాయుచున్నవాఁడు. వింటివే నీబాంధవు లనాథులట్టు లార్తరవములఁ జేయుచున్నవారు. అబ్బలుమగం డెప్పుడు నారి సారించునో యెప్పుడు శరములు గ్రహించునో యెప్పు డరిఁ బోయునో యె ప్పుడు విడుచునోకాని యించుకేనియు నెడ మగపడకుండెడి. ఇఁకఁ గర్ణవధంబె కర్తవ్యం బని తోఁచెడి. లెస్స యాలోచించి కర్తవ్యము నిశ్చయింపు మనవు డుఁ గిరీటి కృష్ణున కిట్లనియె. మహాత్మా, ధర్మాత్మజుండు కర్ణునివిక్రమమునకు వె

అచినచందము దోఁచుచున్నది. ద్రోణసాయకంబులకు బెండువడినమనవారలఁ గర్ణుఁడు తఱుముచున్నవాఁడు. వారికి నిలుకడ గానంబడదు. కాందిశీకు లయిన రథోదాదుల వెంబడిం జని శితశరములఁ గురియుచు రణక్రీడ సల్పుచున్నయతనిం దాఁకుట దుష్కరంబు. తాఁకిన నతండు క్రొక్కువడ్డపాముపగిది మీఁదికి వచ్చుట నిక్కువంబు. ఇఁక నాలసించినం గార్యంబు దప్పుఁ గావున నేను వానిం బరిమార్చెద. తేసు నడుపు మనినధనంజయునకు దామోదరుం డిట్లనియె. కౌంతేయా, కర్ణుఁడు సురేంద్రునిపోలెఁ గడిమిఁ జూపుచు రణరంగమున విహరించుచున్నవాఁడు. నీవును ఘటోత్కచుఁడును దక్క లాఁతులు వానితోఁ గోర్వఁ జాలరు. ఇంద్రుఁ డొసంగినశక్తి రౌద్రాకారంబై యాకర్ణునొద్ద నున్నయది. దాని నతండు నీపై నేయఁగ డాఁచియున్నవాఁడు. కావున నీ విపు డతని మార్కొనుట నాకుం జూడఁ బోలదు. ఘటోత్కచుఁడు దివ్యాస్త్రములను రాక్షసాసురవివిధమాయలను నెఱింగినవాఁడు గావునఁ గర్ణుం గెలువఁ గలఁ డనుటయుఁ గ్రీడి వానిం బిలిచిన నారక్కసుండు తక్షణంబ యరుదెంచి కృష్ణార్జునుల కెఱఁగి గర్వోద్రిక్తుండు గావునఁ దనకొలంది పరికింపక నన్నుఁ బిలిచినపని యెయ్యది? చెప్పినం జేయుదు ననిన నాహిడింబానందనునకు దేవకీనందనుం డిట్లనియె.

కృష్ణార్జునులు ఘటోత్కచునిఁ గర్ణునితోడఁ బోరు మని పంచుట.

అయ్యా, నే నొక్కటి చెప్పెద వినుము. నీపరాక్రమమున కిది తఱియొడఁగూడె. యుద్ధసాగరమున మునుఁగుచున్నపాండవులకుఁ దెపవు గమ్ము. వివిధాస్త్రములును నానామాయలును నీకుఁ బెక్కులు గలవు. చూచితే యాదెసఁ గర్ణుఁడు పొదివినం బాండవానీకవములు గోపాలుఁడు వెలిచినపశుగణములట్లు పఱచుచున్నవి. ఈపాంచాలురు సింహము పొదివినమెకములట్లపోలె నీనడిరేయి సాయకానలపీడితులై వానిమునుమునఁ గాలు నిలుపలేక బమ్మరించుచున్నవారు. నీవు దక్క నింకొక్కఁ డిపుడు వీని నాఁగువాఁడు గన్పట్టఁడు. తండ్రులయు మామలయుఁ దేజోబలములం బేర్చి యిప్పటి కుచితం బని నీమది కెక్కినకర్జంబుఁ బూనుము. సంకటములు పొసంగినం గడతేర్తు రనికదా లోకమున నందఱును గొడుకులఁ గోరుదురు. ఉభయలోకములఁ దారకుఁడై నయతండే పుత్రుఁ డనంబడు. కయ్యము గూరినతఱి నీకుఁ గలుగుబలుపు లెక్కింపఁ దరముగాదు. పెక్కు లేల? నీకెనవచ్చుయోధుఁడు గలుగఁడు. రేలు రాక్షసులకు మాయాబలం బెక్కుడుగావున నీశక్తి యంతయుం జూపవలయు. మాయాప్రభావమున నీవు రాధేయుం దెగటార్పుము. ధృష్టద్యుమ్నాదులు ద్రోణుం దెగఁజూతు రనుచున్నంత సవ్యసాచియు నయ్యసురం బిలిచి పుత్రా, నీవును భీముఁడును సాత్యకియు నామనసున కెక్కినవారు. వాసుదేవుఁడు సెప్పినపగిదిఁ గర్ణుని మార్కొనుము. సాత్యకిని నీకుఁ దోడ్పడం బం

పెద. తత్సహాయమునం బేర్చి స్కందసహాయుండై యింద్రుఁడు తారకాసురుం
బోలె నీవు రాధేయుం బరిమార్చు మనిన విని హిడింబానందనుండు మహాత్ము
లారా, కర్ణుఁ డొక్కరుఁ డేల? ద్రోణాదు లెందఱు ముట్టినను నేను వారినెల్లం
గెలువఁ జాలుదు. భూమి గలకాలము జనులు కీర్తించునట్లుగా నిదె కర్ణుని మా
ర్కొని కడిందిమగంటిమిం జూపుదు. భీతులు శరణాగతు లని తలంపక రాక్షసధ
ర్మం బవలంబించి చిక్కినవారినెల్ల వధియించెద నని ఘటోత్కచుండు కర్ణుని మా
ర్కొనువాఁడై మీమూఁకలకు వెఱపు పుట్టించువాఁడై చనియె. అట్లు రూపం
బుఁ గొన్నకోపముకై వడి దీప్తాననశిరోరుహుండై వచ్చుచున్నఘటోత్కచునిఁ
గర్ణుఁడు నవ్వుచు మార్కొనుటయు నయ్యిద్దఱికి శక్రప్రహ్లాదసమరసమం బైనసం
గరంబు సెల్లుచున్నంత దుర్యోధనుఁడు దుశ్శాసనుం బిలిచి యీరాక్షసుఁడు
బహుళాసురసేనాపరివృతుండై కర్ణుం దాఁకె. అవ్వీరునకుఁ గీడు మూఁడకుండఁగ
నీవు నీయిచ్చకు వచ్చినంతసైన్యముఁ గొని యతనికిఁ దోడుపడు మనియె.
అయ్యవసరంబున జటాసురసుతుం డైనయలంబుసుఁడు వచ్చి దుర్యోధనుం గాం
చి నృపాలా, యుద్ధదుర్మదు లతిక్షుద్రులు నగుపాండవులు నాతండ్రి యగుజటా
సురుం దొల్లి పరిమార్చుట నామది నాపగ యాఱకున్నయది. నీ వనుజ్ఞ యిత్తు
వేని యొక్కమాత్రలోన వారలం జంపి శత్రుశోణితమాంసముఁ గ్రోల నున్న
వాఁడ ననుటయుఁ బ్రీతమానసుండై సుయోధనుండు వాని కిట్లనియె. ద్రోణక
ర్ణాదులతోడ్పాటునం బెరిఁగి యేను బాండవులఁ జంపఁ జాలుదు. అల్లవాఁడె ఘ
టోత్కచుండు పాండవప్రియకరుండై మాయనీకముల నేర్చుచున్నవాఁడు. కావున
నీవు వానిం బరిమార్చు మనివచించె.

ఘటోత్కచుఁ డలంబుసుఁ డనురాక్షసుం జంపుట.

అట్ల యని యజ్జటాసురసుతుండు భీమసేనసుతుం దాఁకి నానాస్త్రములు
వరఁగించిన నాతండు మహావాతము మేఘజాలంబునుం బోలెఁ దదస్త్రములఁ దె
రలించి యయ్యలంబుసుని రాధేయునిఁ గౌరవసైన్యంబునుం బొదివి శరాసారము
నిగిడించినం గోపించి యలంబుసుఁడు నానాచిహ్నము లగుశరవ్రాతము లడరిం
చి హిడింబాసుతు నొప్పించి పాండవానీకములఁ దఱుముటయు ఘటోత్కచుఁ డ
లిగి కడిమి మెఱయ నలుఁగులు పరఁగించిన మీసైనికులు దివియల దిగవిడిచి
తోఁచినట్లు పాఱిరి. అతనిమాయాబలమున కలిగి యజ్జటాసురాత్మజుండు మదేభము
నంకుశములఁబోలె నాభీమసుతు నలుఁగుల నొప్పించిన నాతండు వానిరథరథ్యసార
థులఁ దిలమాత్రఖండములు గావించి యాయుధములం ద్రుంచి పటుప్రదరములఁ
బరఁగించి భీకరముగ నవ్వి యాదిత్యపుత్రుం బాణజాలసంఛన్నగాత్రుం గావించి
కురుసేనపయి వాలంపసోనలఁ గురియించినం గురుసైనికులు వెగడుపడిరి. అట్లు

విరథుఁడై యలంబుసుఁడు తేరు డిగ్గి రయమున నేతెంచి ఘటోత్కచుం బిడికిటం బొడుచుటయు నారాక్షసేశ్వరుండు భూకంపమునం బర్వతం బెట్టు లట్టు లించుక చలించి క్రోధమూర్ఛితుండై పరిఘసన్నిభం బైనబాహుదండము మీఁది కెత్తి యయ్యలంబుసుం బిట్టడిచి రెండుచేతులం బట్టి నేలం బడం ద్రోచి రాచుచున్నంత నతండు వెరవునం దప్పించికొని లేచి యట్లు హైడింబుం ద్రోచి రాచుటయు నయ్యుద్ధము నొండొరుల మిగులం దలంపు పెంపార మాయాప్రభావమున నింద్రవైరోచనులవిధమునను బావకాంబునిధులచందమునను గరుడతక్షకులతెఱంగునను మేఘమారుతంబులచాడ్పునను వజ్రపర్వతములకై వడిని గజశార్దూలములమాడ్కిని రాహుభాస్కరులరీతినిం దోఁచి మాయాశతముల సృజియించుచుం బరిఘగదాప్రాసాదిప్రహారములను హయగజరథసమరప్రకారమునను నానావిధములం బోరుచుండిరి. అట్టియెడ ఘటోత్కచుం డేచి తటాలున మీఁది కెగసి డేగచాడ్పున నేలకు వ్రాలి యయ్యలంబుసుం బైకెత్తి మయవఘోద్యతుం డయినయచ్యుతు చాడ్పునం గడిమి మెఱసి వెఱచఱచుచున్నయయ్యలంబుసుమస్తకమువెంట్రుకలం బట్టి వాలు వెఱికి కుత్తుకం గోసి వివృతాస్యకేశ మగుతన్మస్తకము దుర్యోధనునెద్దకుం గొంపోయి నగుచు నతనితేరిలోనం బడ నేసి ప్రావృట్పయోధరము చందమున నతిరౌద్రంబుగ గర్జిల్లి యోరాజా, చూచితే యితండే నీచుట్టము నాచేఁ జచ్చినవాఁడు. కర్ణునియవస్థ నిట్లే చూతువు. స్వధర్మము నర్థముం గామముం గోరువాఁడు రాజును బ్రాహ్మణుని స్త్రీని రిక్తహస్తమునం జూడరాదు కావున దీనిం గొని నిన్నుఁ జూడ వచ్చితి. ఏను రాధేయుం బరిమార్చునంతకు సుప్రీతుండవై యుండు మనిపలికి కర్ణుదెసం గాండజాలములు వరఁగించుచుం జనియె ననిన విని యాంబికేయుఁడు సంజయా, యానడిరేయి మార్గానినకర్ణఘటోత్కచులసంగ్రామం బెట్టు లయ్యె? ఆరాక్షసప్రవరురూపంబును దేరును గవచకిరీటములు నాయుధములు నెట్టివి? హయకేతనకోదండములు కింప్రమాణము లని యడిగిన సంజయుం డతని కిట్లనియె.

రాజేంద్రా, వానికన్నులు లోహితములు. మేను నీలము గొప్పదియునై తనరు. నోరు చెవులదాఁక విరివియు నెఱ్ఱఁదనమునుం గలయది. కడు పక్కలించికొనియుండు. వెంట్రుకలు నిట్టవొడిచియుండు. మీసలు పచ్చనివి. చెవులు శంకువులం బోలు. హనువు పెద్దది. కోఱలు తీక్ష్ణములు. నాలుకయును పెదవులును దీర్ఘతామ్రములు. బొమలు వ్రేలుచుండు. నాసిక స్థూలము. కుత్తుక యెఱ్ఱనిది. బాహువులు పొడవు గలవి. తల గొప్పది. వానిగాత్రము తాఁకినం బరుషముగం దోఁచు. పిఱుఁదులు స్థూలములు. నాభి గూఢము. కటకకేయూరాదిభూషణములు చేతులను హారము వక్షమునను గనకకిరీట ముత్తమాంగమునను బాలసూ

ర్యప్రకాశము లగుకుండలములు కర్ణములను గంచుకవచము గాత్రమునను వె లుంగు. ఎనిమిదిచక్రములు బుక్షచర్మావరణంబు నన్నూఱుజేనలమధ్యభాగంబు నుం గలిగి తే రొప్పు. మత్తమాతంగసంకాశములు లోహితలోచనభీకరంబులు విపులసటాభిరామములు కామవర్ణవేగములు నగుగొప్పగుఱ్ఱముల నాతేరికిఁ బూన్చి దీప్తాననకుండలుం డై నవిరూపాక్షుఁ డనురాక్షసుఁడు సారథియై సూర్య మయూఖసన్నిభము లగుపగ్గములఁ జేతం గొని యాదిత్యుముందటియరుణుం బోలె నెగలఁ గూర్చుండు. గగనం బొరయఁజాలినరక్తధ్వజంబుపై లోహిత శీర్షం బయినగ్రద్ద తద్దయు భీకరంబై యుండు. జేనెఁడువెడల్పును బండ్రెండుమూ రలనిడివియుం గలచాపముఁ జేతఁ గొని యాఘటోత్కచుఁ డశనినిర్ఘోషసమం బ యినజ్యాఘోషం బొనరించుచు నిరుసులంతటివాఁడితూపులఁ బగలుం గీటడంచు.

ఘటోత్కచుఁడు కర్ణునిఁ దాఁకుట.

అట్టిసవరణలం బొదలి కయ్యమునకుఁ గట్టాయితంబై ఘటోత్కచుండు రథనేమినిర్ఘోషమునం బుడమి గ్రక్కదల నడిచి సకలభూతములకుఁ గంపము గూర జ్యానాదంబు రోదసిం బర్వఁజేసి మత్తమాతంగముపయిం గవియుమదపు శీనుంగుతెఱంగున రాధేయుని మార్కొనిన నతండు బీరంపుఁబెంపునం బొంపిరి వోయి తలపడిన నయ్యిద్దఱు నరరాక్షసవరులు శక్రశంబరులట్లు లడరి శితశర నికరములం బరఁగించి యొకళ్ళొకళ్ల కంచుకత్త్రములఁ జించియు నేనుఁగులు దంత ములను గ్రోల్పులులు గోళ్లనుంబోలె రథశక్తులను వాలమ్ములను బరస్పరంబుఁ జెక్కియు నెత్తుటం దోఁగి గైరికధాతుపటలరంజితమహీధరములట్లు చూడనొప్పి ప్రాణములఁ బందెము చఱచి పోర నాకయ్యమున వారివిండ్లగొనయమ్ములగ్రమోఁ తకే యెల్లవారును వెఱఁగుపడియు వెడఁగుపడియు దీనదశకు వచ్చిరి. అంతఁ గర్ణుఁడు హైడింబుని గెలువరామికిఁ దనలో విచారించి దివ్యాస్త్రము వింట సంధిం చుటయుఁ దోడన యాతండు రాక్షసమాయం బ్రయోగించి సింహనాదముఁ గావించిన నామాయాప్రభావమునం జేసి శూలముద్గరపర్వతాదులం బూని రాక్షస సైనికులు పెక్కండ్రు వెడలి యయ్యాయుధములు వైచియు శిలావర్షముఁ గురిసి యు రౌద్రబీభత్సముఁ గావించినం జూచి నీకొడుకులును దక్కినయోధులును వెఱచి పఱచిరి. వానియార్పునకే వాహనములు మూత్రపురీషవిసర్జనముఁ గావించె. అట్లు పైపైఁ గ్రమ్మునమ్మాయనెల్లఁ గర్ణుదివ్యాస్త్ర మడంచుటయుఁ దనమాయ రూపుమాయుటకుఁ గోపించి హిడింబాసుతుండు ఘోరశరములఁ గురిసిన నవి కర్ణుమేను వ్రచ్చి నెత్తురు లురులించి నేలం జొచ్చె. అప్పుడు రాధే యుఁడు హస్తలాఘవము మెఱయఁ దీవ్రప్రతాపంబు నెఱయ ఘటోత్కచుం బది వాలమ్ముల నూ నేయుటయు నాతండు వ్యథితుండై సహస్రారము బాలారుణ

ప్రభము మణిరత్నవిభూషితము క్షురాంతము నగుచక్ర మేయుటయు నది కర్ణ బాణభిన్నంబై భాగ్యహీనునిసంకల్పముచందమున నిరర్థకం బయ్యె. అందుల కలిగి ఘటోత్కచుఁడు రాహువు భాస్కరుఁబోలె బాణములఁ గర్ణుం గప్పినం దత్తఱ పడక రుద్రోపేంద్రవిక్రముం డై నయాసూతపుత్రుఁ డతనిం గాండజాలసంవృతుం గావించుటయు రక్కసుండు గద విసరి వైచినం బొడిచేసె. కాలమేఘమువోలె గర్జిల్లుచు నుప్పరంబున కెగసి ద్రుమవర్షముఁ గురిసినం బొడవడఁగించె. తోన రాధేయుఁ డతనిం దేసును శరజాలమున నావరించిన నేమి చెప్పుదు నయ్యసుర మేన రెండుప్రేళులంతేనియుఁ గర్ణబాణభిన్నముగానిచోటు గానరాక యేదు వెరిఁగినచందము గన్పట్టె. రథరథ్యకేతనముల నెయ్యదియుఁ గన్పట్టదయ్యె. అంత నాభీమాత్మజుఁడు కర్ణునస్త్రముఁ బ్రత్యస్త్రమున నుపశాంతముఁ గావించి మాయానిపుణుండు గావున నదృశ్యుండై శరనికరములఁ బరఁగించి వివిధవికృత రూపములం గొని సూతపుత్రుం డేయునస్త్రములనెల్ల గ్రహించి కొండొకవడికి మహాకాయుండై పోరికిఁ దొడరి కర్ణబాణవిదీర్ణుండై హతసత్త్వుండై నిరుత్సా హుండై నేలం బడుటయుఁ గురువీరు లతని హతునకా వగచి యార్చిరి. అ ట్లార్చుచున్నంత నతండు బహురూపధరుండై దిక్కుల నెల్లెడలం దోఁచి క్షణ మాత్రలోన మైనాకపర్వతముచాడ్పున నుత్తుంగశరీరుండై శతమస్తకజఠరుండై యగపడియు మఱియు నెక్కింతసేపులోన నంగుష్ఠమాత్రుండై చూపట్టి సాగర తరంగముభంగి మీఁదుగను నడ్డముగనుం బఱచియు భూతలంబు భేదించి చొ చ్చియు నీళ్ల మునిఁగియుఁ గొండొకసే పదృశ్యుండై తోన తోఁచి తే రెక్కి కర్ణు నెద్ద కరిగి కుండలములు గదల నోసూతపుత్త్రా, నిలు మిం కెక్కడికిఁ బోఁగ లవు పోరుమీఁదియాశ యుడిపెద ననిపలికి తటాలున నభోమండలమున కెగరి పెద్దయు నవ్వి యేనుంగుపయిం గవియుసింగముతెఱంగునం గవిసి యిరుసులంత లమ్ము లేయుటయు నారాధాసుతుండు శరవర్షముఁ గురిసి వానినెల్ల రూపడఁగించె. తనమాయ వమ్మైనం జూచి ఘటోత్కచుండు క్రమ్మఱ నదృశ్యుండై తోడన శూ లాదిసాధనప్రస్రవణంబు బహుశిఖరబంధురంబు నగునంజనపర్వతంబై తోఁచినఁ గలంగక కర్ణుండు వజ్రాస్త్రమున దానిం బొడవడఁగించె. నీలతోయదంబై యశ్మ వర్షముఁ గురిసిన వాయవ్యాస్త్రమునం దెరలించె. సింహశార్దూలసదృశాకారులు మత్తమాతంగవిక్రము లగురాక్షసులు పెక్కండ్రు గుఱ్ఱముల నెక్కియు నేనుఁ గుల నారోహించియుఁ దేరు లధిష్ఠించియుఁ దోడరాఁగ మగుడ రథమునం దోఁచి ఘటోత్కచుండు మరుద్గణపరివృతుం డైనపురుహూతునిచందమున నొప్పి నవ్వుచు నవ్వైకర్తనుపయిం బాణపంచకంబుఁ బరఁగించి భయంకరముగ నార్చి

పేర్చి యొక్కభల్లమునఁ గర్ణుచాపముఁ ద్రుంచె. త్రుంచినం గోపించి రాధే యుండు వేఱుచాపంబుఁ గొని కనకపుంఖము లగునానాశరవ్రాతంబు లడరించి రాక్షసానీకంబు మర్దించినం గొదమసింగము పొదివినయేనుంగులపిండు తెఱంగున నారక్కసు లుక్కసెడియు వెగడుపడియు దీనదశకు వచ్చిరి. అట్లు రాక్షసానీ కంబు రూపుమాపి రాధేయుండు తొల్లి త్రిపురములఁ గాల్చినమహేశ్వరుని యట్లు వెలుంగుచుండఁ గ్రోధోద్దీప్తుం డై నవైవస్వతుం బోలునాఘటోత్కచుండు దక్క లాఁతు లతనిం జూడను వెఱచి యొదిఁగిరి. అయ్యెడరు సూచి యయ్యు సురవరుండు కన్నుల నిప్పులు రాలం జూచుచు నఱచేతులఁ జఱచి యవుడుగ ఱచి గజనిభములు పిశాచవదనములు ఖరరూపములు నగు రథ్యములం బూన్చిన మాయానిర్మితరథం బెక్కి కర్ణునకు సమ్ముఖముగఁ బోనిమ్మని సారథికిఁ జెప్పి య తనిపయి మహాఘోర మష్టచక్రము నగురుద్రనిర్మితశక్తిని వైచుటయు నాసూ తసూనుండు విల్లు తేరిపయిం బెట్టి తటాలున డిగ్గనుఱికి బలమునం దానిఁ బట్టి కొని క్రమ్మఱ నతనితేరిమీఁదన పడున ట్లేయుటయుఁ దటాలున ఘటోత్కచుం డు తేరు డిగ్గె. ఆశక్తి హైడింబునరదమును రథ్యసారథికేతనములతోడ నుగ్గునూ చముఁ గావించి భూతలముఁ జొచ్చినం జూచుఖేచరు లద్భుతాందోళితులై కర్ణు న గ్గించిరి. అట్లొనర్చి యతండు క్రమ్మఱఁ దేరెక్కి యుక్కునం బేర్చి సాయకానీ కంబుఁ బరఁగింపఁ గినిసి యాహిడింబానందనుండు మాయావియై లాఘవంబున మెఱసి తోన గంధర్వనగరాకారుండై వర్షధారలకుఁ బర్వతం బెట్టు లట్టుల శరధారలకు వెగడుపడక యంతలో నదృశ్యుండై ముహూర్తమాత్రలోన బహురూపుండై మాయఁ గావించిన నానాదిక్కులనుండి సింహశార్దూలతరక్షు వులును వహ్నిజిహ్వభుజగములును నయోముఖవిహగములును రక్షఃపిశాచయా తుధానగణములును వెడలి కర్ణుని గ్రమింగఁ జుట్టుకొని యుగ్రవచనముల బెదరిం చినం బెదరక యాసూర్యనందనుండు దివ్యాస్త్రప్రయోగమున నమ్మాయనెల్ల మాయించి వాఁడితూపులం బిట్టేయుడు వానితాఁకునం జేసి యతనిగుఱ్ఱములు విభగ్నములై వికృతాంగములై విదీర్ణపృష్ఠములై నేలం బడుటయు భగ్నమా యాబలుండై హిడింబానందనుండు రాధానందనుం జూచి యిదె యేను నిన్నుఁ బొరిగొనియెద ననిపలుకుచు నంతర్హితుం డయ్యె.

## ఆలాయుధుఁ డను రాక్షసుఁడు దుర్యోధనుం జేర వచ్చుట.

అయ్యవసరంబున బకాసురానుజుం డై నయలాయుధుఁ డనురాక్షసుఁడు భీము నిపయిం దనకుఁ గలపూర్వవైరముఁ దలపోసి రాత్రిసమరము జరుగుట విని మత్తమాతంగము తెఱంగునను ద్రొక్కుడువడినపాముచందమునను గ్రోధోద్రేకభ రితుండై భీమసేనుం జంపఁగఁ దలంపుఁ గొని రాజరాజునొద్దకు వచ్చి యిట్లనియె.

మహారాజా, పాండుపుత్త్రుఁ డైనభీముఁడు నాబాంధవు లగుబకహిడింబకిమ్మీరులఁ జంపుటయు హిడింబకన్నెఱికము చెఱుచుటయు నీ వెఱుంగుదువుగదా. ఇంతకంటె మా కొండొకయవమానంబు గలదె. దానంజేసి యేను బెద్దకాలము గోలె నాతనిం జంపఁ దలఁచి వేచియుండుదు. ఇప్పటికి నిశాసమరంబు సంప్రాప్తమయ్యెఁ గావున బలాధికుండనై యేను వానిని దదీయులను దురాత్ముఁ డైనఘటోత్కచునిం బరిమార్చి రక్తపానమాంసఖాదనములం దనియుదు. నీమూఁక లేమియుం జేయఁ బని లేదు. తొలంగి యూరక చూచునట్లు నియమింపుము. నావిక్రమంబును మదనుచరులవాఁడిమినిం జూతు వనుటయు సంతోషభరితమానసుండై సుయోధనుం డోరాక్షసప్రవరా, వైరాంతముఁ గావింపఁ దలఁచుమా సైనికులు మిన్నక చూచుచుండువారుగారు. నీవును మాకుఁ దోడై విక్రమింపుమనవుడు నయ్యసుర యట్లె యని ఘటోత్కచున కీడువచ్చునాకారంబుఁ దాల్చి యట్టితే రెక్కి తాదృశకార్ముకంబుఁ గొని యట్టివబాణములు వరఁగించుచు గదాముసలముసుంఠముద్గరప్రముఖ నానాసాధనములం బూనినతనబలఁగము తోడ రాఁగఁ బాండవవాహినిం దఱుముచు భీమసేనుం దాఁకుటయు దుర్యోధనప్రముఖు లయిననీకొడుకులును దదీయులును దేప గానక సంద్రమున మునుఁగువారికిఁ దేప గలిగినట్లుగను దమ్ముఁ బునర్జాతులనుగనుం దలంచుచు నెంతయు సంతసంబునం బొదలి యతని నగ్గించిరి. అక్కడ ఘటోత్కచునికోలుతల కోహటించి మనమూఁకలు వీఁక దఱిఁగి పఱచినం గర్ణుఁ డొక్కరుం డుక్కునం బెరసి పోరుచుండఁ బాంచాలురు నవ్వుచుఁ జూచుచుండిరి. ద్రోణాశ్వత్థామకృపాదులును గర్ణుఁడు హైడింబునకుఁ జిక్కె నింకఁ జేయంగలయది లే దనిపలుకుటయు నందఱును గర్ణునిబ్రదిమిమీఁదియాశ విడిచిరి. అట్లు వీర్యస్ఫూర్తి దప్పి పరమార్తిగతుం డైనరాధాసుతుం జూచి భవదగ్రసుతుం డలాయుధుం బిలిచి యల్లవాఁడె రాధేయుండు ఘటోత్కచునితోడఁ బోరుచున్నవాఁడు. చూచితే యద్దెస శూరులనెల్ల నాతఁడు మత్తగజంబు ద్రుమాఁకులంబోలె రూపడఁగించుచున్నవాఁడు. కావున విక్రమించి నీ వాహిడింబాసుతుం జంపుము. ఇయ్యది నీపాలికి వచ్చె. వైకర్తను నతండు వధింపకుండునట్లు మున్నున్న విక్రమింపు మనిన నొడంబడి యయ్యలాయుధుండు ఘటోత్కచుం దలపడుటయు నాతండును గర్ణుం గ్రేడించి యబ్బకానుజుం దాఁకినఁ గరేణుకారణమునఁ గాననమునం బెనంగుకుంజరములట్లు వారు పోరిరి.

## భీమసేనుఁ డలాయుధునితోఁ బోరుట.

, కర్ణుఁడును రాక్షసవిముక్తుండై భీముని మార్గంబునం బోయిన నాతండు వానిదెసం జూడక యలాయుధుండు పొదివినఘటోత్కచుం జూచి యోహో

యీతండు సింగము కవిసినవృషభముచందమున నున్నవాఁ డని తనలోఁ దలంచి శరజాలంబు నిగిడించుచు నలాయుధు తేరికి సమ్ముఖమ్ముగ నాదిత్యవర్ణం బయినత నతేపు వ్రూనిచ్చుటయు వాఁడును హిడింబాసుతుని విడిచి వృకోదరుం దాఁకి యతం డేసినయమ్ములను మాఁజేసి మఱియుఁ దానును దనపరిచరులు నతనిం జుట్టుముట్టి నానాప్రహరణములఁ బ్రయోగించిన నబ్బకమర్దనుండు వారల వేలువేల వైదేసిసాయకముల నొంచినం బెలుచ నఱచుచు వారు దశదిశలం బఱచిరి. తదవస్థు లయినతనయనుచరులం గాంచి యలాయుధుండు కోపించి వడముడిప యిం బటుప్రదరములు మిక్కిలి యేయుటయు నతండు వానిం బొడవడఁగించి మఱియుఁ బెక్కునారసములు నిగిడించినం గొన్నింటి గ్రహించియుఁ గొన్నింటిఁ బ్రతిశరములఁ దునిమియు వివిధప్రకారము లొనరించె. అంత భీమసేనుఁడు వజ్రపాతసదృశం బై నయుద్దండగదాదండము వేగమున వైచుటయు నారాక్షసుండు తనగదచే దానిఁ గొట్టుటయు నది మగుడ భీమునెద్దఁ బడియె. శరవర్షముఁ గురిసినం బ్రతిశరముల నడంచె. మఱియు నతనిపంపునం దదనుచరు లయినరాక్షసులుక్కుమిగిలి యందఱం గీటడంచుటయుఁ బాంచాలసృంజయు లత్యంతపీడితులై నివ్వెఱపడియు ఱిచ్చపడియు నుండునంతఁ బురుషోత్తముఁడు గాండీవి కిట్లనియె. అల్లవాఁడె భీముఁ డలాయుధుబారిం బడి యిడుమఁ గుడుచుచున్నవాఁడు. ఒండు దలంపక నీవు వానికిఁ దోడుపడి ద్రోణానీకముఁ జెండాడుము. నకులసహదేవ సాత్యకులు లాఁతిరాక్షసులం బొదువుదురుగాక. ధృష్టద్యుమ్నశిఖండియుధామన్యూత్తమౌజులును ద్రౌపదీపుత్రులును రాధాపుత్రుని మార్కొందురుగాక. ఇపుడు మిన్నకుండఁ జన దనుటయు నంద ఱయ్యె ప్రకారములఁ బొదువుటయుఁ బోరు ఘోరం బయ్యె. అప్పు డయ్యలాయుధుఁడు కర్ణాంతకృష్టము లగుశరములం బ్రయోగించి భీమసేనుగుఱ్ఱములను సారథిని సోలం జేయుటయు నతండు రథావతీర్ణుండై గదఁ గొనిన నబ్బకానుజుండును గదఁ గొనిన నయ్యిద్దఱు గదావిహరణంబు కొంతసేపు నడిపి యటఁ బిడికిళ్లం బొడిచియుఁ జేతుల కందినరథసాధనంబుల నడిచియు నెత్తుటం దోఁగి ఘోరప్రకారమునం బోరుచున్నంత మురాంతకుండు ఘటోత్కచుం బిలిచి యలాయుధుఁడు భీముం గడు నొంచుచున్నవాఁడు. నీ వింక వానిం బొదివి విక్రమింపుము పదంపడి కర్ణుం జంపుదువుగాని యనవుడు నతండు తన తోడఁ బోరుచున్నకర్ణుం గ్రేడించి యయ్యలాయుధుం దలపడియె. నకులసహదేవసాత్యకు లయ్యలాయుధపరిచరు లగురాక్షసులం దాఁకి వీఁక మెఱసి చెండాడిరి. కిరీటి తక్కినరాజలోకంబుఁ గనుపుకొల్పె. కర్ణుఁడు ధృష్టద్యుమ్నశిఖండిప్రముఖపాంచాలురం బొదివి యేపుచూపుచుండ వృకోదరుఁడు దా నతనిం దాఁకుటయు నంతలోన సాత్యకియుఁ గవలును నలాయుధపరిచరు లగురాక్షసుల నిర

వశేషముగాఁ బిలుకుమార్చి రాధేయుపయిం గవిసినం గ్రందుకయ్యం బయ్యె. పాంచాలురు ద్రోణుం దలపడిరి.

## అలాయుధుఁడు ఘటోత్కచునిచే జచ్చుట.

అవ్విధమునఁ దనపయిం గవిసినఘటోత్కచునిపయి నలాయుధుండు పరిఘం బేసిన నతండు తత్ప్రహారమున నించుక సోలియు శతఘంటాసముజ్జ్వలము దీప్తాగ్నిసంకాశము నగునుద్దండగదాదండము విసరి వైచినం దత్ప్రహారమునం జేసి తేరు రథ్యసారథిసహితంబుగ నుగ్గయిన నతఁడు మాయావియై నింగి కెగసి రుధిరవర్షముఁ గురియుటయుఁ దిమిరసంకులం బైనగగనంబు రక్తకాంతులపెల్లునం జేసి విద్యుద్విలసితం బైనవిధమునం జూడ నొప్పె. మఱియు నమ్మాయాప్రభావమునఁ జటచ్ఛటాశబ్దములతోడం బిడుగులు పడుటయు హిడింబాత్మజుండు మీఁది కెగిరి తనమాయచే వానిమాయను మాయించిన నతండు శిలావర్షముఁ గురిసినం దాని నద్భుతం బావహిల్ల శరవర్షమున నడఁగించె. అంత నయ్యిద్దఱును శూలగదాముసలముద్గరపరశుపరిఘపినాకతోమరప్రాసభిండివాలాదినానాయుధములను శమీపీలుకరీరచంపకేంగుదబదరీకోవిదారపలాశప్లక్షన్యగ్రోధపిప్పలాదివృక్షములను నానాధాతురంజితసముత్తుంగగిరిశృంగములను నొండొరులపయిం బడవైచుచు వాలిసుగ్రీవులట్లపోలె నెంతయుఁ గడిమి మెఱసి పోరిపోరి కొండొకవడి యడిదంబులం బూని యేట్లాడి నెత్తుటం దోఁగియున్నంత భీమనందనుం డేచి యలాయుధుశిఖఁ బట్టి యెత్తి కుండలోజ్జ్వలం బైనమస్తకంబు దఱుగుటయు నబ్బకానుజుండు పెద్దయు నఱచి యసువులు విడిచిన నతనియట్ట నేలం బడియె. అట్టు లలాయుధుఁడు నచ్చుటయుఁ బాంచాలపాండవులు సింహనాదములఁ గావించిరి. భేరీసహస్రములును శంఖాయుతములు నాదిక్కు మొరసె. ఆరేయి వారి కత్యంతవిజయావహం బయ్యె. అప్పుడు ఘటోత్కచుం డలాయుధుతలఁ గొని దుర్యోధనునొద్ద కరిగి కాన్పించిన నతండు పరమోద్విగ్నుండై భగ్నమనోరథుండై యక్కటా, వీఁడు పూర్వవైరమున భీముం జంపుదు నని ప్రతిజ్ఞ చేసి యరిగి తుది వాని కొడుకుచేఁ దాన మడిసె. ఇత్తెఱంగు సూడ భీమసేనుఁడు తనపట్టినప్రతినయంతయుఁ గొనసాగించునొకో యని వెఱపు గదిరెడు ననితలంచి చింతిల్లె. ఘటోత్కచుం డలాయుధుం జంపి యార్చిన నయ్యార్పు మనవారి కత్యంతదారుణం బై హృదయపుటవిదారణం బయ్యె.

## ఘటోత్కచుఁడు కర్ణునితో యుద్ధము చేయుట.

అట్టియెడ రాధేయుఁడు తన్నుఁ గ్రేడించి ఘటోత్కచుం డలాయుధుం గవియుటఁ జూచి తాను బాంచాలురఁ దాఁకి పదిపదియమ్ముల ధృష్టద్యుమ్నశిఖండులను బెక్కునారసమ్ముల యుధామన్యూత్తమౌజులను సాత్యకిని నొవ్వ నేసిన

వారును మండలీకృతచారుకార్ముకులై జ్యాఘోషనేమిఘోషములు గర్జాసమములై నిగుడ నతనిపయిం గవియుటయు నాఘోరసమరంబున వైకర్తనుఁడు నీకొడుకులకు మేలుసేయువాఁడై మహాశైలధీరుండై యించుకేనియుం జలింపక వజ్రప్రహారతుల్యము లగుతోమరాదిపాతముల నరాతుల నొంచుచుఁ గడిందిమగంటిమిం జూపుటయుఁ బడినసారథులును జచ్చినగుఱ్ఱములును గూలినయేనుంగులును విఱిగినతేరులునై పాండవానీకములు చీకాకుపడినం జూచి రోషభీషణమూర్తియై ఘటోత్కచుఁడు సింహనాదము సేసి వివిధబాణజాలము లడరించుచుఁ గర్ణుపయిం గవియుటయు నాఘోరవర్ష్యుండును బరవసంబు సేసి యతని కభిముఖుండై కయ్యమునకుఁ దొడరుటయు నయ్యిద్దఱు మేటిమగలు కర్ణినారాచశిలీముఖవత్సదంతార్ధచంద్రవరాహకర్ణాదినానాబాణముల నిగిడించి యయ్యమ్ములచాలు గగనలక్ష్మికి వివిధకుసుమమాలిక యనుబుద్ధిం గల్పించి యెక్కువతక్కువలు లేక పరమాద్భుతప్రకారమునఁ బోరుచుండ ఘటోత్కచుండు మిగులమి నెఱింగి రాధేయుండు దివ్యాస్త్రము సముద్దీపితముఁ గావించి రథ్యములను సారథినిం జంపిన నతం డంతర్హితుం డయ్యె ననవుడు నాంబికేయుండు సంజయా, యామీఁద మనవారు వానిం దలంచి యేమి చేసి రనిన నతం డతని కిట్లనియె. అవ్విధమున ఘటోత్కచుఁ డంతర్హితుం డగుటయు మనవార లక్కటా! వీఁ డగపడకున్న వాఁ డెవ్వరిపయిం బడునో యనితలఁకుచుండ లఘుచిత్రాస్త్రయోధి యగురాధేయుండు శరగ్రహణసంధానమోక్షణంబు లిట్టు లని యెఱుంగరానిరయమునం బేర్చి యిషుజాలము దెసలనెల్లఁ గప్పి చీఁకట్లు పచరించిన నయ్యసురుఁ డంతరిక్షమున నదృశ్యుండై ఘోరమాయఁ గావించినం దేదీప్యమానంబు లయినయనలశిఖలు గొఱవులు మెఱుములు శక్తిప్రాసపరశుముసలభిండివాలాదినానాసాధనంబులు మహాశిలలు పిడుగులు మున్నుగాఁ బెక్కులు దోఁచినం గర్ణుండు జ్యాఘోషభీషణముగ శరజాలము నిగిడించినం దాన నడంగక యమ్మాయాజాతసాధనములు మహారవముతోఁ బయిం బడుటయు మనయనీకమున క్షాత్రధర్మమునం గొందఱు దక్క లాఁతు లందఱు వెఱచఱచిరి. మఱియు వివిధాయుధపాణులైననానాయాతుధాను లమ్మాయాబలమునం బుట్టి బెట్టు నొంచినం గౌరవభటులు వెగడుపడియుఁ గలగుండుపడియు వెఱఁగుపడియు ఱిచ్చపడియుఁ గలంగియుఁ దొలంగియు నక్కటా! యనికిఁ దొలఁగినం బ్రదుకవచ్చు. ఇట నిలువఁ జనదు. పాండవులతదర్థంబు సుర లిట్టులు మనలం జెండాడుచున్నవా రింతియకాని యొండు గా దని తమలోనం బలుకుచు ఘటోత్కచసాగరంబుఁ గడవ దరి గానక యాక్రందుకయ్యమునఁ దమవారిని లాఁతివారిని నెఱుంగనేరక శూన్యప్రాయములైనసకలదిక్కులం బఱచి యాశస్త్రవృష్టిలోన నిస్సహాయుండై చొచ్చుచున్న

రాధేయుం గనుంగొనియు నతండు తమ్ముఁ బ్రోచు నని నమ్మక గజగాత్రఖండ
ములను హయకాయశకలములను రథావయవభంగములనుం బరమసాంద్రం
బైనయాసంగ్రామరంగమునఁ జేయునది లేక వెల్లఁబోయిరి. అప్పరుసమ్మర్ద
మున వెగడుపడక కడిమి మెఱసి పోరుచున్నదివాకరనందనుబీరంబు సైంధవ
బాహ్లికాదు లగ్గించిరి. అంత హైడింబుఁ డేచి శతఘ్నిం దేరిపయిఁ బడ నేయు
టయు దానితాఁకునం గర్ణరథ్యములు మడిసినఁ దేరు డిగ్గి రాధేయుండు కురు
సైనికులు వెఱచి పఱచుటకు విన్నఁబోయి తనదివ్యాస్త్రజాలము వానిమాయా
ప్రభావమున రూపడంగుట కెంతయుఁ జింతిల్లుచుండె.

కర్ణుఁ డింద్రదత్తం బైనశక్తిచే ఘటోత్కచుని వధించుట.

అయ్యవసరమున నీకొడుకులు దుర్యోధనాదు లారాధేయునొద్ద కరిగి
యోధవర్యా, యీరాక్షసుఁ డలంతులఁ బోవువాఁడు గాఁడు. ఇంద్రుఁ డొసం
గినశక్తిచే వీనిం బరిమార్పుము. భీమార్జును లేమి చేయఁగలరో చూచికొందము.
ఈనడిరేయి నిర్వక్రవిక్రమాతపం బిట్లు గాయుచున్నయీదురాత్ము నిప్పు డొప్ప
రికించినం బాండవులతో నింకఁ బోరుదు మని తలంపరాదు. వీఁ డిప్పుడే యం
దఱం జంపుట నిక్కువంబు. కావున నొండు దలంపక నిలింపపతి యొసంగిన
శక్తిచే నీనరాదుం బరిమార్పు మని యందఱు నొక్కమొగిం జెప్పుటయుఁ గర్ణుండు
ఘటోత్కచునికోలుతల కోహటించి విచ్చి పఱచుచున్నమూఁకలం జూచి యి
ప్పటి కిదియే కర్తవ్యం బని తనలో నిశ్చయించె. తొల్లి యింద్రుఁడు కర్ణునిస
హజకుండలముల గ్రహించి వానికి మాఱుగా నేకవీరుం జంపఁ జాలినశక్తి నిచ్చు
టయు నర్జునవధార్థంబు దాని నతం డేండ్లుపూండ్లుగఁ బూజించి యుంచుటయు
నీకుం దెల్లంబకదా. అట్టియెడఁ గోపాటోపదీపితుండై కర్ణుండు మృత్యువుచెలి
యలుఁ గాలాంతకజిహ్వయు నన ఘోరాకారం బైనదాని నజయ్యం బైనదానిఁ
బాశయుక్తం బైనదాని నాలుకలు దెఱచి నాకుచందమునఁ దోఁచుదాని వైజ
యంతి యనం బరఁగుదాని నమ్మహాశక్తిని వానిపయిం బడునట్లు గుఱి చూచి
విడుచుటయు నాఘటోత్కచుఁడు వెగడుపడి వింధ్యపాదప్రమాణం బైనరూ
పముఁ గొని తొలంగె. ఆశక్తి రాధేయుభుజాంతరమున నున్నం జూచి యం
తరిక్షభూతములు పెలుచ నఱచె. తుములవాతములు విసరె. పిడుగులు వడి
యె. అట్లు కర్ణుఁ డుదీర్ణరోషరూషితుండై విడిచినయాశక్తి రాక్షసమాయ
నెల్ల మ్రింగి యాహిడింబాసుతుఱొమ్ము వ్రచ్చి దాఁటి మీఁది కెగిరి నక్షత్ర
మధ్యంబు సొచ్చె. అత్తెఱంగున ఘటోత్కచుఁడు వివిధశస్త్రాస్త్రములను మాయ
లను గొలఁది యిడరానిబీరంబు పెంపారఁ బోరిపోరి కర్ణశక్తిప్రహారమున భైర
వముగ నఱచి యుష్టతమము లయినప్రాణముల విడిచె. అందు నొక్కవిచి

త్రంబు వినుము. వాఁడు మహాపర్వతాకారుండై పడియెఁ గావున వానికళేబర ముక్రింద నలిగి గులగులలై సమసినయనీకం బొక్క_యక్షౌహిణికిఁ జాలియుండు. చచ్చియు వాఁడు పాండవులకుఁ బ్రియంబుఁ జేసె. అట్లు ఘటోత్క_చుండు చచ్చు టయు మనవా రార్పులను శంఖారవములను భేరీప్రముఖవాద్యనినాదములను రోదసీకుహరంబుఁ బూరటిల్లఁజేయుచుఁ బ్రస్తుతించిన నాకర్ణించుచుఁ గర్ణుండు నీకొడుకుతే రెక్కి నిజసైన్యమునకుఁ జనియె. హైడింబునిచావునకుఁ బాండవులు గన్నీరు నించుచు వగచుచుండఁ బుండరీకాక్షుండు వారికి వ్యథాకరంబుగఁ దాను సింహనాద మొనర్చి యుగ్యములపగ్గముల నొగల ముడిచి పాండవమధ్యముం గౌఁగిట నాదరించి మందమారుతాందోళితం బైనమందారపాదపంబుచందమున న_ర్తనం బొనర్చి వెండియు గాండీవిపీఁ పప్పళించి పలుమాఱులు సింహనాదములు గావించినం గిరీటి వాసుదేవునిహర్షోత్క_ర్షంబునకుఁ గారణ మెఱుంగక నాతిసం తుష్టచిత్తుండై మధుసూదనున కిట్లనియె. మహాత్మా, ఘటోత్క_చుఁడు సచ్చె నని మే మందఱ మెంతయు విషాదమునఁ జింతిల్లుచుండెదము. సేనలు వెఱచి విచ్చి పఱచుచున్నవి. నీవో పరమహర్షమునం బొదలెదవు. ఇయ్యది నాకుఁ జూడ సముద్రము లింకుటయుఁ మేరువు చలించుటయు నెట్టు లట్టుల విస్మయావహం బయ్యెడి. ఇంతకుఁ దగినహేతు వుండవలయుఁ గదా. రహస్యము గాక యది చెప్పఁ దగునేని నాకుఁ దెలుపుమని యడిగినకిరీటికిఁ గృష్ణుం డి ట్లనియె.

—(కృష్ణుఁడు ఘటోత్క_చుచావునకుఁ దాను సంతసించుటకు నిమిత్తం బర్జునుతోఁ జెప్పట)—

ధనంజయా, చి_త్తమున కత్యంతప్రసాదముఁ గావించుపరమసంతోషముఁ జెప్పెద వినుము. కర్ణునిశ_క్తి ఘటోత్క_చునితో ముగియుటంజేసి యిఁక నతనిం గెలువవచ్చు నని తలంపుము. కుమారవిక్రముఁ డై న కర్ణుఁడు శ_క్తిహస్తుఁడై యనిమొన నిల్చునేని యతనియెదుర నిలువరాదు. నీభాగ్యవశమున నతండు కవచకుండలములఁ గోలుపోయె. శ_క్తియు ఘటోత్క_చవధార్థంబై వమ్మయ్యె. మఱియు నతండు సహజకవచకుండలమండితుండై భండనమునకుఁ దొడరు నేని యింద్రయమవరుణకుబేరాదు లగుదిక్పాలురనుం జయించి ముల్లోకము లను దనవశమున నిలిపికొనం జాలును. మన మిద్దఱము చక్రగాండీవపాణు లమై యెదిరించినను వాఁడు మనలం గెలుచు. నీకు హితము చేయువాఁడై వాసవుఁడు మాయచే మెల్లన వానికవచకుండలము లపహరించె. విశేషించి కవచకుండలములఁ గోసి యింద్రున కిచ్చుటంజేసియే యతండు వైక_ర్తనుఁడను పేరం బరఁగె. ఇప్పుడు మంత్రమునకుఁ గట్టువడిన పాముకై వడి నతండు శాం తవిక్రముఁడై యగపడుచున్నవాఁడు. ఆరాధేయుఁడు పురందరునకుఁ గవచ కుండలము లిచ్చి శ_క్తి గ్రహించిననాఁటఁగోలె నీవు తనచేఁ జత్తు వని పెద్దయు

నమ్మినవాఁడు. వృషపదాభిధేయుఁ డైన యతని నిప్పటికిని నీవు దక్క నింకొక్కఁ
డు వధింపఁ జాలఁ డింతయు నిక్కవంబు. బ్రాహ్మణులయెడఁ బ్రీతి సత్యవచనము
తపస్సు నియతవ్రతము శత్రువుల నేనియు దయతోఁ జూచుట యనుగుణములు
గలుగుటంజేసి యారాధేయుఁడు వృషుఁడనం బరఁగె. సమరశౌండుఁ డయిన
యమ్మహాబాహువు విల్లు చేతఁ బూని మత్తమాతంగయూథపములపయిం
గవియుకొదమసింగము తెఱంగున మహారథులపయిం దలపడి మధ్యాహ్నమార్తం
డునివిధమునఁ దీవ్రప్రతాపాతపంబు గాయునేని మనవార లతనిం గన్నెత్తియై
నఁ జూడఁజాలరు. శరత్కాలభాస్కరునట్లు వెలుంగుచుఁ బ్రావృట్పయోధరము
చందమున నెడతెగక శరధారలు గురియునాకర్ణుని సురలును గెలువఁజాలరు.
కవచకుండలశక్తిహీనుఁ డగుటంజేసి మనుష్యమాత్రుఁడై యున్నను రథచక్రము
గ్రుంగిన నతం డేమఱి కృచ్ఛ్రప్రాప్తుఁడై యుండుతఱి వేచి యప్రమత్తుండవై
నీవు వధియింతు వింతియకాని యిప్పటికి నాయుధపాణియై చక్కనిల్చి పోరునెడఁ
జంప వలనుగాదు. నీమేలు గోరియే యేను జరాసంధశిశుపాలైకలవ్యబకహిడిం
బకిమ్మీరప్రముఖుల నుపాయమునం గెలిచితి. అలాయుధహైడింబులు నిప్పుడు
హతులైరి కదా యనవుడు జనార్దనా, యేల వారలఁ జంపవలయుఁ దద్వధప్ర
కారం బెట్లని యడిగినయర్జునున కచ్యుతుండు వెండియు నిట్లనియె. జరాసంధా
దు లిప్పు డుండుదురేని దుర్యోధనుఁడు వారలఁ దనకుఁ దోడుపడుఁ డని యవ
శ్యము గోరును. మనపైఁ బగపాటించినవారు గావున వార లతనికి బాసటయై
నిలిచిరేని సురల కేనియు గెలువఁ దరముగాదు. వారిలో నొక్కఁడొక్కఁడే ముల్లో
కముల గెలువఁజాలు ననఁగ నింక నందఱు నొక్కటియై కూడినం జెప్పఁ గొలఁది
యే! జరాసంధు నొద్ద గద యొక్కటి యుండె. తొల్లి బలరామునిపై నలిగి యతం
డగ్గద వైచిన నది బలభద్రునిస్థూణాకర్ణాస్త్రమునఁ బ్రతిహతంబై యచ్చోట
నున్నజర యనురాక్షసిపయిం బడి దానిం జంపి కొండలు గ్రక్కదలఁ బుడమిఁ
బెకలించి రసాతలంబుఁ జొచ్చె. ఇద్దఱుతల్లులకుఁ జెఱిసగముగాఁ బుట్టినమేని రెండు
భాగముల నాజర యనురాక్షసి సంధించుటకతన నతనికి జరాసంధుఁ డని పేరు
గలిగె. ఆగదఁ గోల్పడుటంజేసి భీముఁడు వానిం జంపఁజాలెను. నిషాదపుత్త్రుఁ
డైనయేకలవ్యుఁడు ద్రోణాచార్యు నాచార్యునిఁగా మనమున భావించి విలువిద్య
లెస్స యలవఱిచికొని రెండవరాముఁ డన నొప్పి దేవదానవాదుల కజేయుఁ డనం
బేర్చి యుండ ద్రోణునకు గురుదక్షిణగా నంగుష్ఠము నిచ్చుటంజేసి వానివిక్రమ
ము వమ్మయ్యె. అది ఘటించునట్లు వెరవు నేన కావించితిని. శిశుపాలుని సకల
రాజసమక్షమున నేన వధించుట నీవు నెఱుంగుదువుగదా. అతండు సురాసురా
దుల కజేయుఁడు. అతండు మున్నగురాక్షసుల వధించుపొంటెఁ గదా యే నవత

రించితి. మఱియు రావణున కెనవచ్చుబకహిడింబకిమ్మీరాదులను భీమసేనుఁడు సంహరించున ట్లుపాయం బొనర్చితి. అలాయుధుని హైడింబునిచేఁ జంపించితి. హైడింబుఁడును గర్ణునిశక్తిచేఁ గూలునట్లు పన్నితి. ఇప్పుడు కర్ణుఁడు వీనిం జంపఁ డేని యిఁక నేన వీనిఁ జంపవలసియుండు. మీకుఁ గయ్యమునఁ దోడ్పడు ననుతలంపుననే యింతకు వాఁడు తెగుతెఱంగుఁ జూడనైతి. బ్రాహ్మణద్వేషియు యజ్ఞవిఘ్నకరుఁడును గాన వానికిని మనకును వైరం బెప్పుడైనం దప్పదు. మఱియు ధర్మవిఘ్నకారులం జంపుటయే నావ్రతంబు. ధర్మసంస్థాపనార్థంబు మదీయావతారం బని నీ వెఱుఁగుదువుగదా. వేదము సత్యము దమము శౌచము ధర్మము హ్రీ శ్రీ ధృతి క్షమ యనునివి యెచ్చట నుండు నే నచ్చట నుండుదు. కర్ణునియెడన ప్రమాదంబు వలదు. అతనిం జంపఁగ నెరవుఁ దఱితోఁ జెప్పెద నప్పుడు పరిమార్పుము. భీమునకును సుయోధనవధప్రకారం బుపదేశించెద నతం డట్లు చేయుఁగాక. అల్లవారె కౌరవులు ద్రోణపురస్సరులై మనమూఁకలఁ దఱుముచున్నవారు. అద్దెసఁ బెద్దయు నులివు నింగి ముట్టె. ఇఁకఁ దడవు సేయరాదు. వారల మార్కొని నీవింటిబలుపు సూపు మనియె ననిన విని యాంబికేయుండు సంజయా, రాధేయుఁ డేకవీరవధమునఁ జరితార్థ మగునాశక్తి నిన్నాళ్లు గాండీవిపై నేయ కేల యొప్పరికించె? అర్జునుఁడు సచ్చినం దక్కినవా రలంతులఁ బోవుదు రనితా నెఱుంగఁడె. అనికిఁ బిలిచిన రా ననుసది లే దని వ్రతంబుఁ బూనిన యాకిరీటిం దానైనఁ బోరికిఁ జీరి యాశక్తిం బ్రయోగింపరాదో. నిక్కువంబు నాకొడుకు బుద్ధిహీనుఁడు నిస్సహాయుండు గావున శత్రువు లొనరించు నెరవుల నెఱుంగఁజాలఁడు. ఇఁక నరాతులం గెలుచు టెట్లు? ఈచఁబోయినచేతులవానిచేతిపండు బలవంతుఁ డపహరించుచందమునఁ గర్ణునిశక్తిని వాసుదేవుఁడు ఘటోత్కచునిఁ గారణముగాఁ గల్పించి నేర్పునం గోలుపుచ్చె. శునకవరాహములు పోట్లాడునెడ నేది సచ్చినను శ్వపాకునకు మేలగుతెఱంగునఁ గర్ణఘటోత్కచులలో నెవ్వండు పడినను బద్మనాభునకు లాభంబకదా. హైడింబుఁడు కర్ణుం జంపిన నతండు లేమింజేసియుఁ గర్ణుఁడు ఘటోత్కచునిపై శక్తి నేసినం బ్రబలసాధనము వమ్మగుటంజేసియుఁ బాండవులకు రెంటిలో నెయ్యదియైనను మేలని తనప్రజ్ఞాబలమున విచారించియేకదా యట్లు పన్నినవాఁడు. అర్జునునిపై శక్తిం బ్రయోగింపవలయు నని యామంద బుద్ధి యెఱుంగకున్నను నీవైనం దెలుపరాదే యని యడిగినధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె.

—(సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ గర్ణుఁ డర్జునుపై శక్తి నేయమికిఁ గారణము చెప్పుట.)—

నరేశ్వరా, కర్ణుశక్తిఁ గోలుపుచ్చవలయు ననుతలంపుననే వాసుదేవుఁడు నాఁడు ఘటోత్కచుఁ గర్ణుతోడిపోరికిఁ బనిచె. కృష్ణుఁడు వారిమేలు గోరువాఁడై

మెలఁగుచుండ నేల యామేలు వారికిఁ గలుగకుండు. కృష్ణసహాయము లేకుండిన మనవారు నాఁడే వారలఁ జంపి యుండనోపుదురు. కృష్ణపాలితుండై పార్థుఁడు పగఱ గెల్చుచున్నవాఁడు. ప్రతిదినము సాయంకాలమునఁ బోరు సాలించి శిబిరమునకుఁ జనినపుడు దుర్యోధనదుశ్శాసనశకునులును నేనును గర్ణుతో నయ్యా, నీవు లాఁతులతోడఁ బోరుట మాని యర్జునుం దలపడి శక్తిప్రయోగమున నవ్వీరుని వధియింపుము. అతండు హతుండైనం బాండవపాంచాలు రేమియుం జేయఁజాలరు. మఱియు నొక్కటి వినుము. అర్జునుం జంపుటయు నంతమేలు గాదు. కృష్ణుఁడు బ్రదికియుండునేని యెట్లులైనం బాండవులలో నొక్కని నేనియు రాజ్యమున నిల్పుఁ గావునఁ గృష్ణు నాశక్తిచేఁ దెగటార్పుము. పాండవులకుఁ గృష్ణుఁడు మూలము, పార్థుఁడు స్కంధము, తక్కినపాండవులు కొమ్మలు, పాంచాలురు పత్రములు పత్రశాఖాస్కంధము లెవ్వి నఱికినను మూల ముండునంతకు బ్రాఁకునకు నేఁగి పొసఁగమిం జేసి మూలభూతుఁడైనజనార్దనుం జంపుట మేలు. పాండుపుత్రులకుఁ గృష్ణుఁడే యాశ్రయము బలము నాథుఁడు పరాయణము మూలము ననుట తెల్లంబు గదా. యాదవపాండవకులములకు సంతోషదాయకుండైన యచ్యుతుండు హతుఁడయ్యెనా భూమియెల్ల మనవశమున నుండుఁ గావున రేపు తప్పక కృష్ణుం బరిమార్పు మని చెప్పిన నట్ల యని యారాధేయుఁ డిందుల కొడంబడి యుండును. మఱునాఁడు పోలకలనికి వచ్చుటయు రాత్రిచింతనం బారాధేయుఁడును మేము నప్రమేయప్రభావుఁడైనహృషీకేశునిమహిమమునం జేసి మఱతుము. కేశవుఁడును గర్ణశక్తి యెట్లు మోఘ మగునో యని విచారించువాఁడు గావున నారాధేయుం దలపడఁ దఱచుగా లాఁతిశూరులఁ బంపుఁగాని యర్జునుం దఱిమికొని రాఁడు. కృష్ణునిపై నేయమికిఁ గారణంబుఁ జెప్పవలయునే? పార్థరక్షణమున కిన్ని వెరవులు పన్నుజగన్నాథుఁ డాత్మరక్షణంబుఁ జేసికొనఁ జాలకుండునే? ముల్లోకములను గోవిందుని గెలుచువాఁడు గలుగఁడు. కర్ణునిశక్తిచే ఘటోత్కచుఁడు సచ్చినపదంపడి సాత్యకి కృష్ణునొద్ద కరిగి మహానుభావా, తనసమ్మినయాశక్తిం గిరీటిపయిఁ గర్ణుఁ డింతకు నేయకుండు టేల యని యడిగిన నద్దేవుఁ డతని కిట్లనియె. దుర్యోధనాదులు ప్రతిదినమును రాత్రి కర్ణునితో రేపు తప్పక యొసులం బొదువక నీవు గాండీవితోడఁ బోరుపెట్టికొని శక్తిప్రయోగమున నతనిం బరిమార్పుము. లాఁతులపై నేయ వల దని యొత్తి చెప్పుదురు. పార్థునిపై నిత్యవైరముఁ బాటించినవాఁడు గావున నతం డందుల కొడంబడి యుండు. ఏనింతదనుకఁ బ్రతిదినము పోరికి వచ్చినపు డయ్యభిప్రాయ మతనికి మనమునం దోఁపనీక కాలముఁ గడపుచుంటిని. ఆశక్తి యిపుడు ఘటోత్కచవధార్థంబై నిరర్థకం బగునంతకు నాకు నిద్రయు మనోహర్షమునుం బుట్టవయ్యె. నేడుగదా గాండీవి

మృత్యువాతఁ బడి తప్పించికొనియె నని నెమ్మది నమ్మియుండెద. తల్లిదండ్రు లన్నదమ్ములు మీరును నాప్రాణములును గాండీవియట్లు నాకు రక్షణీయములు గావు. త్రైలోక్యరాజ్యము వచ్చునేనియుఁ బార్థవినాగతం బగునేని నాకుఁ జిత్తా నందము వొడమదు. ఏకవీరుం జంపునాశక్తిం గోల్పఋపం దలంచియే యేను ఘటోత్కచుం గర్ణుతోడిపోరికిఁ బనిచితి నని గోవిందుఁడు సాత్యకికిఁ జెప్పె. దైవ ము మనవారికిఁ బ్రతికూలంబై వారి కనుకూలంబై యుండఁగ నిందులకు విచా రించినం బ్రయోజనం బెయ్యదియుం గానరాదు. కాకున్నఁ గాలశాత్రిపోలె నత్యం తఘోరం బగునమ్మహాశక్తి యిట్లు వమ్మగునే యనిన విని ధృతరాష్ట్రుఁడు సం జయా, నీచెప్పినట్లు దైవోపహతులగతు లిట్టివే. తృణప్రాయుం డైనఘటోత్క చునితో నమ్మహాశక్తి చరితార్థం బయ్యెఁగదా. ఇంక నేమనం గలను. ఇఁకఁ గర్ణాదులును యమలోకమునకుఁ జనినవారే యని నిశ్చయింపుము. అది యట్లుం డె. అనంతరసమరప్రకారంబుఁ దెల్పు మని యడిగిన నాంబికేయునకు గావల్గణి యిట్లనియె.

కృష్ణుఁడు ఘటోత్కచమరణదుఃఖితుఁ డైనధర్మరాజు నూరార్చుట.

అట్లు కర్ణునిచే ఘటోత్కచుండు హతుఁడై నం బరమహర్షమునం బొ దలి మీవా రాశేయి సేనలం దఱిమికొని కయ్యమునకుఁ గాల్దువ్వుచు నడ రినం బాండవాగ్రజుండు దీనమానసుండై భీముం బిలిచి మహాబాహూ, ధార్తరాష్ట్రసేన లుబ్బునం బొంగి పైపై నలముచున్నవి. ఘటోత్కచుఁడు ప డుటంజేసి నామనంబు విషాదభరితంబై ఱిచ్చవడియె నని చెప్పి తనతేరిపయిం గూర్చుండి కన్నీరు నించుచుఁ బలుమాఱులు వేఁడినిట్టూర్పులు నిగిడించుచుఁ గశ్మలాక్రాంతుండైనం జూచి యమ్మహారాజునకు మాధవుం డిట్లనియె. భరత వర్యా, ప్రాకృతపురుషునిపోలె నీ విట్లు విన్నఁబోవం దగదు. పెద్దయు మోపు మోవవలయుఁ గావున లెమ్ము. పోరికిఁ దొడంగుము. నీ విట్లైన నింక గెల్పున నాకు సందియం బయ్యెడి ననిన ధర్మరాజు పాణియుగమునం గన్నులఁ దుడిచి కొని కృష్ణున కిట్లనియె. మహాత్మా, ధర్మతత్త్వంబు నే నెఱుంగుదుఁ గావునఁ జెప్పెద. చేసినమేలు దలంపనివానికి బ్రహ్మహత్యాపాతకం బగు నని ధర్మవిదులు సెప్పుదురు. ఏ మడవులఁ జరించునపుడు గాండీవి యస్త్రగ్రహణార్థం బరుగుట యెఱింగి యీఘటోత్కచుండు దాను బిన్నవాఁడయ్యుఁ గార్యనిపుణుండై యు చితము నెఱింగి ప్రీతిఁ దలంచి కామ్యకవనమున నున్నమాయొద్ద కేతెంచి మాకుఁ గావలియై యుండె. గంధమాదనమునకు మే మరిగినపుడు మాసంకట ములనెల్లఁ దొలఁగించె. నడుమఁ జాలనిపాంచాలిని మోచికొని వచ్చె. సమరవిశా రదుఁ డయినయీకొండికవాఁడు నాతదర్థంబు దుష్కరకార్యములం జేసె. స్వభా

వమున సహదేవునిపయిం గలప్రీతికంటె వీనియెడఁ బ్రీతి నాకు రెండుమడుంగు
లెక్కుడై యుండు. వేయేల? నాయెడ నత్యంతభక్తియుఁ బరమప్రీతియు నెఱ
పినవాఁడు. దానంజేసి నామనంబు విషాదభరితంబై యూఱటం గాంచదయ్యె.
అవె మనయనీకములు కౌరవులు తోడుపడ ద్రోణకర్ణులు సన్నద్ధులై యురువ
డించి తఱిమిన మత్తమాతంగములు గలంచినకమలాకరములచందమున దీనద
శకు వచ్చె. భీమునిబాహుబలమును ధనంజయునిచిత్రాస్త్రత్వమును సరకుసేయక
కౌరవులు కడిమిమెఱయుచున్నవారు. అల్లవారె ద్రోణకర్ణదుర్యోధనులు ఘటో
త్కచుం జంపి పరమసంతోషమున నార్చుచున్నవారు. జనార్దనా, మేమును నీవును
బ్రదికియుండఁగ ఘటోత్కచుఁ డెట్లు చచ్చెనో యెఱుంగరాదు. దురాత్ములయిన
ధార్తరాష్ట్రులు సౌభద్రుం జంపినపుడు నీవు నర్జునుండును జెంగటలేమియు మమ్ము
సైంధవుఁడు వ్యూహద్వారమున నాఁగుటయు నాచార్యుండు వధోపాయంబుఁ
దెల్పినం గర్ణాదు లిది యకృత్యం బని తలంపక వంచనఁ గొనుటయుఁ గలుగఁ
దలఁచికొనినపుడు మనస్సునకుఁ గొంత యూఱట యయ్యెడి. ఇది యట్టులుం
గాదు. అల్పకారణమున గాండీవి సైంధవుం జంపెఁగాని వధ్యుల నెఱుంగఁడు. అది
నాకుం జూడఁ బోలదు. శత్రువధము న్యాయ్య మగునేనియు నది పాండవులకుఁ
గర్తవ్య మగునేనియు ద్రోణకర్ణులం దొలుతఁ జంపవలయు. భీముఁడు ద్రోణానీ
కముపయిం గవిసెఁ గావున నేను గర్ణుం బరిమార్చువాఁడనై పోరెద నని పలికి
రయమున గొనయమ్ము సారించి శంఖముఁ బూరించి యారాధేయుం దాఁకుటయుఁ
దోన శింఖడి వేయిరథములను మున్నూఱేనుఁగులను నైదువేలగుఱ్ఱములను మూ
డువేలప్రభద్రకులనుం దోడుకొని భేరీభాంకారములు శంఖారవములు నెసంగ
నయ్యజాతశత్రు వెంబడిం జనునెడ వాసుదేవుఁడు పాండవమధ్యముం జూచి ధర్మ
రాజు క్రోధావిష్టుండై కర్ణుం గవియఁ బోయినవాఁడు. నీ వూరకుంట యిప్పుడు
పోల దని పరమరయమునం దేరు వ్రానిచ్చె.

### ఘటోత్కచమరణదుఃఖితుం డైనధర్మరాజునొద్దకు వ్యాసుఁడు వచ్చుట.

అట్టియెడ వేదవ్యాసుఁడు క్రోధవిషాదభరితమానసుండై కర్ణుం దలపడ
నరుగుచున్నధర్మజునొద్దకు వచ్చి యిట్లనియె. యుధిష్ఠిరా, నీభాగ్యమున నర్జునుండు
కర్ణుం దాఁకియు నిన్నాళ్లు బ్రదికి యున్నవాఁడు. ఆరాధేయుఁడు సవ్యసాచిని
జంపువాఁడై యమ్మహాఘోరశక్తిం బరమనియమమునఁ బూజించుచుండె. పర
స్పరస్పర్ధావంతు లయినకర్ణార్జునులు కడంగి పోరికిఁ దొడంగుదురేని దివ్యాస్త్రగ్రా
మంబుఁ జూపునెడఁ గర్ణునియస్త్రములు గాండీవియస్త్రములం బ్రతిహతంబు ల
గుడు నెట్టులైన నతండు తప్పక శక్తిం బ్రయోగించు. దాన మహాఘోరవ్యసనం
బు పొసంగు. ఇఁక నది రాదు గదా యని యుల్లమున నుల్లసిల్లుము. నీభాగ్య

మునసే కర్ణుఁడు ఘటోత్కచునిపై నాశక్తి నేసి క్షీణబలుం డయ్యె. ఇందులకుఁ గోపశోకములఁ జేయవలదు. మఱియు దైవనిర్ణీతకాలమునఁ బ్రాణులకు శుభాశుభము లొడఁగూడుటయు వానిం దప్పింపరామియు నీవు నెఱుంగుదువుగదా. తమ్ములయుఁ దక్కంగలరాజులయుఁ దోడ్పాటునం బేర్చి కౌరవులతోడఁ బోరుము. ఏనవనాఁడు భూమండలము నీవశము గాఁగలయది. ఏమఱక నిత్యంబును సత్యతపోదానక్షమానృశంస్యంబులు సేవింపుము. ధర్మ మేదెసం గలుగు నాదెస జయము సిద్ధం బని పలికి బాదరాయణుం డంతర్ధానంబుఁ జెందె. అంత నజాతశత్రుండు దాను రాధేయునిపైఁ గవియుటఁ జాలించి భీముఁడు మీసేనల నాఁగి పోరుటం జూచి ధృష్టద్యుమ్నుం బిలిచి యిట్లనియె. పాంచాలవర్యా, నీవు ద్రోణవధార్థంబు శరకవచఖడ్గకార్ముకంబులతో నగ్నికుండమునఁ బుట్టినవాఁడవు గావున వెఱపు దక్కి పరమహర్షమునం బొదలి యాచార్యుం దాఁకుము. శిఖండి జనమేజయదార్ముఖప్రముఖులును మాద్రేయద్రౌపదేయకేకయులును ద్రుపదవిరాటసాత్యకులును గాండీవియు బహుళచతురంగబలములతోడ నీవెన్నంటి వచ్చువారనుటయు వారందఱు నెక్కయమ్మడి భారద్వాజుం గవిసిన నగ్గురుండు బెగ్గలింపక యగ్గలించి వారల మార్కొనుటయు ద్రోణప్రాణత్రాణపరుండై దుర్యోధనుండు దానుం దలపడుటయుఁ బ్రగండుకయ్యం బయ్యె.

సైనికులు నిద్రవోవుట.

అట్లు పోరుచుండ నడిరేయి యగుటయు నిద్రాభరమునం జేసియుఁ బెద్దయు డయ్యుటం జేసియు విడుమర గానక యాహవమున నిరుత్సాహులయ్యుఁ దొలఁగుట పాడి గా దనుకులధర్మంబువట్టి వాహనంబులపై నుండియుఁ జేతికైదువులు జాఱినం దెలియనిపరాకునం దవిలి చెచ్చపడియు నొకప్పుడు చలంబు పెంపునం జేసి ముందఱికి ద్రొమ్మి తమ్ము నెదిరి నెఱుంగక తమవారినె వధించుక్షత్రియులును గజహయరథములపయిం గూర్చున్నట్లుండి యొడ లెఱుంగక తూఁగు నారోహకులును నాయుధములను గరదీపములనుం బాఱవైచి సమరక్షోణిం బడి కూరుకుకాలుమానుసులునై యాత్రియామ సహస్రయామంబుగాఁ దలంచుచు నేమియుం జేయఁజాలక చెచ్చపడుటయుఁ జీఁకట్లు మీఁదుమిక్కిలి క్రమ్ముటయుం జూచి సవ్యసాచి కరుణాభరభరితుండై పేరెలుం గెత్తి యిట్లనియె. ఓసూరులారా, మీ రందఱు పెద్దయు డయ్యుటయకాక కూరుకుఁ గానక యలయుచున్నవారు గావునఁ గొంతసే పిచ్చటన సుఖనిద్ర సేసి చంద్రుఁడు వొడిచినపదంపడి లేచి మఱి స్వర్గసాధనోద్యోగమునం బోరుదురుగాక యనుటయుఁ బరమధార్మికుం డైనగాండివివాక్యమునకు మెచ్చి సకలసైనికు లోకర్ణ దుర్యోధనా యని యెలుం గెత్తి వారి కెఱిఁగించి తదనుమతి వడసి కయ్యముఁ జాలించి నిదు

రథపూవఁ దొడంగిరి. సురలును ఋషులును ధనంజయుం బ్రశంసించిరి. అవ్వి ధమున సకలసైనికులు నశ్వపృష్ఠములను రథపీఠములను గజస్కంధములను భూతలంబులను నెమ్మది శయనించి యర్జునుం దలంచి యోమహాత్మా, సకలవే దములును సర్వాస్త్రములును బుద్ధియుఁ బరాక్రమమును సుఖమును సర్వభూతద యయు నీయందే సుస్థిరములై యున్నవి. నీకు సుఖం బయ్యెడి. కోరినయర్థము సమకూఱెడు మని దీవన లిచ్చుచు సుఖనిద్రసేసిరి. అట్లు సకలసైన్యములు గూ రుకుఁ జెందునెడ నయ్యనీకంబు నిష్క్రియంబై చిత్తరువున వ్రాసినవిధమునం జూపట్టె. గజకుంభములపయి నెఱఁగినయారోహకులు రతిపరవశులై తరుణులగ బ్బిగుబ్బలపయిం బరుండుకాముకులతెఱంగునం జెలంగిరి. అట్లు సుఖనిద్రసల్పునెడ రాత్రి ముహూర్తత్రయావశేషంబై యుండునంత

క. కౌరవపాండవశూరు లు, దారత ననిఁ బోరి యలయఁ దనవా రవుటన్
వారిపయి నమృతధారలు, గూరిమిఁ జిలుక నన< దోఁచెఁ గుముదాప్తుఁడొగిన్.

క. ఇరు లనుమదశుండాలని, కరముల విదళించి రుచిరకరకేసరపిం
జరమై యుదయాచలకే, సరి పొల్పుగ నమరపతిదిశాదరి వెడలెన్.

చ. వలపులతేనివింటి కెనవచ్చుతుఱంగలి చెంగలింప నిం
పలరునప్రౌఢమోవియరుణాంశులచాలుపయిం బరంగుకో
మలతర మైనలేనగవుమాడ్కి మనోహరుఁడై యొసంగి చు
క్కలదొరకైరవాళికి వికాసముఁ గూర్చె నృపాలశేఖరా.

అట్లు పాటలవర్ణంబునం దనరి చందురుండు మహేంద్రదిశాతటం బలం కరించి విరహిణీగండపాండిమం జెలంగి సకలజనలోచనముల కమందానందంబుఁ గావించుచుఁ దనధవళకిరణంబు లెల్లదెసలం బఱపి చీఁకట్లు నెఱయనీక రూపు మాపుటయు భువనంబెల్లఁ దేజోమయంబై తనర్చె.

## దుర్యోధనుఁడు ద్రోణుని దూఱుట.

అంతఁ గౌరవపాండవబలములు మేలుకాంచి కయ్యమునకుఁ దొడంగె. అట్టియెడ దుర్యోధనుఁడు భారద్వాజునకు వీర్యసంధుక్షణంబును సంతోషంబును గావించువాఁడై యిట్లనియె. డస్సి విశ్రమించుచున్నశత్రువులపై సైరణ తగదు. నీవు ప్రియము సేయవలయు ననుతలంపున నూరకుండినం బాండవు లింతకు బల వత్తరులైరి. ఏము సర్వవిధములఁ దేజోబలవిహీనుల మైతిమి. నీవు పాలించు చుండుటంజేసి వారు నానాఁటఁ బెంపుఁ గాంచుచున్నవారు. బ్రహ్మాస్త్రప్రము ఖంబు లయినయత్యంతఘోరదివ్యాస్త్రములు పెక్కులు విశేషించి నీకుఁ గలవు. పాండవులు నేమును గాదు లోకమునం గలవిలుకాం డ్రందఱును నీకు సాటి

గారు. సర్వాస్త్రవిదుఁడైననీవు దివ్యాస్త్రజాలముఁ బరఁగించి సురాసురగంధ
ర్వాదులతోడ సకలలోకములను నీఱుసేయం జాలినవాఁడవు. ఇట్టివాఁడవయ్యు
నీకు వెఱచినపాండవులను శిష్యవాత్సల్యముననో నాయభాగ్యముననో సైరింతు
వని నీకొడుకు పలుకుటయు నాచార్యుఁ డప్పలుకుల కెంతయుం గనలి యిట్ల
నియె. దుర్యోధనా, వృద్ధుఁడనయ్యు నెడలోమక శక్తికొలఁది పోరుచున్నవాఁ
డను. నీ కెక్కినప్రీతిగా నింక నే నస్త్రముల నెఱుఁగనిక్షుద్రులపై దివ్యాస్త్రము
లేయవలయు. ఇప్పని క్షుద్రంబు గాకుండునే? నీవట్లు తలంతువు గావున నది
మేలయ్యె మఱి కీడయ్యె నని విచారింపక చేయుదు. పాంచాలురనెల్లఁ జంపక
కాని కత్తళంబు పుచ్చ నని ప్రతిన చేసితి నందులకుఁ దప్పను. అర్జునుఁ డాహవ
మున బడలినకతన నోర్వవచ్చుననియు శిష్యుఁ డని పాటించి యే నతనియెడ
నెప్పరికింతు ననియుం దలంతువు. వానివిక్రమంబు వినుము. దేవదానవగంధర్వ
యక్షరాక్షసాదు లేరు నతనిం గెలువఁజాలరు. ఇంద్రుఁడు తాన వచ్చి యడ్డపడిన
నతండు ఖాండవంబుఁ గాల్చుటయు ఘోషయాత్రకుఁ బోయి చిత్రసేనాదు లగు
గంధర్వులకుఁ జిక్కినమిమ్ము విడిపించుటయు సురలకు నజేయు లైన పౌలోమకా
లకేయులను హిరణ్యపురవాసులను వధించుటయు నెక్కటిబవరమునఁ బరమేశ్వరు
మెప్పించుటయు నీ వెఱుఁగుదువుగదా యనుటయు సుయోధనుండుకోపభరితుండై
యాచార్యా, నీ వర్జునుం గెలువఁజాలవేని సైన్యమునఁ గొంత గొని తక్కఁగల
వారలఁ బరిమార్పుము. ఏనును గర్ణశకునిదుశ్శాసనులు నాగాండీవిం దాఁకి తెగ
టార్తు మనుటయు నవ్వెంగలిపలుకులకు నవ్వుచు గురుం డట్ల యగుంగాక నీకు
మేలయ్యెడు మని యతనిమతంబ యనువర్తించి మఱియు నిట్లనియె. జ్వలితా
గ్నిపోలెఁ దేజరిల్లుచు నజయ్యుఁ డక్షయ్యుఁ డనం బేరు వడసినగాండీవి నెవ్వండు
వధియింపఁ గలవాఁడు? ఇంద్రయమవరుణకుబేరులును గంధర్వోరగరాక్షసాదు
లును వానిం గెలువనేరరు. మూఢులు నీయట్టు లడిబీరపుఁబల్కులు వల్కుదురు.
అనిమొన నర్జునుం దాఁకి యెవ్వఁడు గీడు వొరయక మగిడి యింటికిఁ బోవఁజా
లునో నే నెఱుంగను. నీవు పాపనిశ్చయుఁడవు స్వభావనిష్ఠురుఁడవు సర్వశంకివి
గావున నీమేలు గోరినయుత్తముల నిట్లు పలుకఁ దలఁతువు. పోరు గోరుదువు
గావున నీవ యరిగి కిరీటిం దలపడుము. ఏల నిరపరాధు లయినయీరాజుల నంద
ఱను జంపించెదవు. ఈవైరమునకు మూలం బైననీవే యమ్మేటివిలుకాని మాఱు
కొనుము. వీఁడె నీమామ ప్రాజ్ఞుఁడు క్షాత్రధర్మపరుఁ డున్నవాఁడు. దుర్ద్యూత
మాడునిప్పాపాచారుఁడు గాండీవిపైఁ గవియుఁగాక. జూదరి కుటిలుఁడు నికృతి
పరుఁడు శఠుఁడు నగునితండే పాండవుల భండనమున గెలువఁగలఁడు. తొలుత
నీవు కర్ణునితోడ మీతండ్రియొద్ద కరిగి యేనును గర్ణుఁడును దుశ్శాసనుఁడును

పాండవులం జంపుదు మని పలికితివిగదా. ఆప్రతిజ్ఞలనెల్ల నిపుడు సత్యములు
గావింపుము. అల్లవాఁడె మీ కోర్వరానిశత్రువు ముందఱఁ దఱిమికొని వచ్చు
చున్నవాఁడు. క్షత్రధర్మముఁ బరిశీలింపుము. గెలుపుకంటె ననిమొనం జచ్చుట
నీకు మేలు. ఇచ్చితివి. కుడిచితివి. చదివితివి. ఐశ్వర్యముఁ బొందితివి. కృతకృ
త్యుఁడవైతివి. అనృణుఁడవైతివి. వెఱపుడిగి గాండీవిని మార్కొను మని
పలికి యాచార్యుఁడు పాంచాలురపయిం గవిసె.

క. అంత ననూరుఁడు వెన్నెల, కాఁతుల నల్లన నడంచి గగనతలం బం
తంతన కెంపెనయ వివ, స్వంతునకు న్మున్న ప్రాగ్దిశం బొడతెంచెన్.

ఆసమయంబున దుర్యోధనాదులును పాండవులపయిం గవిసిరి. అప్పుడు
గోవిందుఁ డర్జునుం జూచి వారె కురువీరులు రెండుమెయిలం గండు మిగిలి యడ
రుచున్నవారు. ద్రోణాదుల డాఁపలించి తక్కినవారలకు వలపలికెలనఁ దఱుమ
వలయు ననిన సవ్యసాచి యందుల కియ్యకొనుటయు నట్టియెడ భీముఁ డో య
ర్జునా, క్షత్రియాంగన యదర్థము పుత్రుం గను నందులకుఁ గాలము ప్రాప్తం
బయ్యె. ఇప్పు డూరకునికి పోలదు. సత్యధర్మయశోవీర్యముల నానృణ్యముఁ
బొందు మనియె. అట్లు సవ్యసాచి జనార్దనభీమసేనచోదితుండై కర్ణద్రోణులం
గడచి తఱిమి యఱుముటయు రాజులపాలిటిదవానలం బైనయాగాండీవి నాఁగఁ
జాలక యందఱు వెగడుపడిరి. అట్టియెడ దుర్యోధనకర్ణశకును లాగాండీవిం
దాఁకి శరవ్రాతంబుఁ బరఁగించుటయు నుత్తమాస్త్రవిదుఁడై నయప్పాండవమధ్య
ముఁడు తనయస్త్రముల వారియస్త్రములు రూపుమాపి యందఱను వేఱువేఱ పదే
సియమ్ముల నొంచి సేనలం గలయం జొచ్చి శరజాలంబు నిగిడించినం బరాగం బెగసి
కటికిచీఁకట్లు పచరించినం బృథివ్యంతరిక్షములును దిక్కులును మనవారలును వారి
వారలునుం గానరానివిధం బయిన విరథు లయినరథికులును రావుతులు నొకళ్లొ
కళ్లతలలను భుజములనుం బట్టికొని పోరాడి మడిసిరి. అప్పు డాచార్యుఁడు విధూ
మపావకునివిధమునం దేజరిల్లుచు నించుక యుత్తరమున నొదిఁగి పగఱఁ బోరికిఁ
జీరుటయు నమ్మేటివిలుకానిఁ జూచి పాంచాలయోధులు నివ్వెఱపడువారును వడఁ
కువారును విన్నఁబోవువారును బూనికి తఱుఁగువారును గింకిరిపడువారును వెఱఁ
గుపడువారును జేతులఁ బిసికికొనువారును నవుడుగఱచువారును గైదువుల విడి
చువారును నురువడించువారునునై యుండ నయ్యెడకు సూడలేక పాంచాలవీ
రులు కొంద ఱయ్యాచార్యునిపయిం గవిసిరి.

ద్రోణుఁడు విరాట్ద్రుపదులం జంపుట.

అట్టియెడ విరాట్ద్రుపదులును ద్రుపదపౌత్రులు ముగ్గురును జేదిమత్స్యకే
పాంచాలాదిపరివృతులై యాచార్యుం దాఁకుటయు నతండు మూఁడువాఁడితూ

పుల ద్రుపదపౌత్రుల మువ్వురం జంపి చేదిమత్స్యములఁ బెక్కండ్రం జంపుట యుఁ గోపభరితులై విరాటద్రుపదులు శరవర్షముఁ గురిసిరి. అందులకుఁ గోపించి గురుండు శరజాలములఁ దత్కాండములఁ ద్రుంచి భల్లద్వయమున వారివిండ్లు రెండు నఱికినం గోపించి విరాటుఁడు పదితోమరములను దశవిశిఖములను ద్రుప దుఁడు క్రూరభుజగసన్నిభ మగుఘోరశక్తిని నేయుటయు నగ్గురుం డగ్గలిక మెఱసి వారితోమరవిశిఖశక్తులం దెగనేసి తోన రెండుభల్లముల నయ్యిద్దఱతలలు దఱిగె. అట్లు విరాటద్రుపదులును ద్రుపదపౌత్రులు ముగ్గురును జేదిమత్స్య కేకయసృం జయపాంచాలయోధులు పెక్కండ్రును హతులైనం గ్రోధశోకవ్యాకులుండై ధృష్టద్యుమ్నుండు ద్రోణుం జంప నైతినేని యిష్టాపూర్తాదిధర్మములకుఁ దప్పుదు నని ప్రతిజ్ఞచేసి బహువిధపాంచాలపరివృతుండై భారద్వాజుం దాఁకుటయు దుర్యో ధనుఁడును గర్ణుఁడును శకునియు గురునకుఁ గావలియై నడిచినం బోరు ఘోరం బైన నాచార్యుం గెలుచుట దుష్కరం బగుడు భీముఁడు గనలి ధృష్టద్యుమ్నున కిట్లనియె. అయ్యా, నీవు ద్రుపదునికులమునం బుట్టి సర్వాస్త్రముల నేర్చి యుత్త మక్షత్రియుఁ డనునెన్నికఁ గాంచి యెదుర నున్నశత్రుం జూచుచు నూరకుండె దవు. తండ్రియుఁ గొడుకులును జచ్చినం జూచి యేమగండు మగఁటిమిఁ బాటిం పకుండును? నీవు శపథంబులు వలికియు నూరకుండెదవు. అల్ల యతండె యాచా ర్యుండు శరశరాసనము లింధనములుగా నిజతేజమున క్షత్రియుల నీఱుసేయుచు న్నవాఁడు. అతండు పాండవానీకముల నిశ్శేషముగఁ ద్రుంపక మున్న నే నరిగి మార్కొనియెద. నాపరాక్రమంబుఁ జూడుఁ డని పలుకుచుఁ గ్రోధసముద్రేక బంధురుండై శరపరంపరలఁ బరఁగించుచు మనయనీకములఁ దఱుము చఱిమినం బాంచాలరాజసూనుండును ద్రోణుం దాఁకినం బరమతుములం బైనసమరంబు సెల్లె. ఏమి చెప్పుదు నిట్టిపో రెన్నఁడును జూడను విననుం బడదయ్యె. సైని కులు తొలంగువారును గలంగువారును లాఁతులకుఁ జిక్కి చచ్చువడువారును వెన్ని చ్చి పఱచువారును బఱచినం బోనీక మగఁటిమిం బేర్చి పొదువువారునై బహు ప్రకారు లైరి. అయ్యవసరంబున

చ. కలువలతోఁ జకోరకనికాయమనోరథము ల్గుదుంగఁ ద
మ్ములగమితోడఁ జక్కవలమోములు నెమ్మిఁ జెలంగ లోకము
ల్దెలివి వహింప నెల్లెడ లలిం దనజేవులువింతకాంతుల
వెలయఁగఁ జేయుచుం బొడమె వేఁడివెలుంగు సురేంద్రదిక్తటిన్.

అట్లు సూర్యోదయం బగుటయు నుభయసైనికులు కృతసంధ్యోపాసనులై తొల్లింటియట్ల రథికులు రావుతులను, రావుతులు హస్తిపకులను, గాలుమానిసు లేనుంగులవారలను, నేనుంగులవారు రవుతులను, రావుతులు రౌతులను, గాలు

మానుసులు కాలుమానుసులను, రథికులు రథికులను, నేనుఁగు లేనుంగులనుంగాఁ దోఁచినట్లెల్లఁ దమకుఁ దమకుఁ బోలినవారలఁ దలపడి శంఖభేరీప్రముఖవాదిత్ర నినదంబును గజబృంహితంబును హయహేషితంబును రథనేమిధ్వానంబును శస్త్ర సంపాతరవంబును బదాతిపాదఘట్టనస్వనంబును నింగి ముట్టి పర్వఁగ రేయింటిబడలికయు నెండవేఁడిమియు నాఁకలియు నీరువట్టునుం బెరయ ఱిచ్చవడియు మగఁటిమిం గోలుపుచ్చక యలజడి కోర్చి క్షాత్రధర్మంబువట్టి పోరికిఁ దొడంగి నిద్రాంధత్వమునంజేసి యగపడువారలం బట్టి తమవారు లాతివా రని విచారింపక వలువలు మీఁది కెత్తి శక్తికొలఁది యుదికినవిధంబుగాఁ జేతికరవాలములఁ దెగనఱికియుఁ దోమరాదులఁ బొడిచియు వాలమ్ముల నిగిడించియు దారుణరణంబు సేసినం బ్రబలరవం బెసంగఁ గూలునేనుంగులును బడుగుఱ్ఱములును విఱుగుతేరులును దునియలగుకాలుమానుసులునై కయ్యంపునేల ఘోరం బయ్యె. ఒండొంటం బెరసికొన్న యోధకళేబరములప్రోవులను నంతటం బాఱునెత్తురుటేఱులను రథచక్రములు గ్రుంగినం బెఱుకఁజాలక యెట్టకేలకు గుఱ్ఱము లీడ్చుచుండె. ఆసంకులసమరమున ద్రోణార్జును లిద్దఱు దక్క లాఁతు లందఱును వెగడుపడిరి. అట్లుద్రోణార్జునుల బారిం బడి పాండవకౌరవసైన్యములు దైన్యంబుఁ జెంది తోఁచినట్లు విచ్చి పఱచినం బరాగం బెగసి నింగిదాఁక నెఱయుటయు ద్రోణకర్ణకృపద్రౌణిదుర్యోధన దుశ్శాసనాదు లగుమనవారును ధర్మజభీమార్జుననకులసహదేవసాత్యకిధృష్టద్యుమ్నప్రముఖు లగువారివారును నదృశ్యులగుటయు నిరువాఁగునం జేయంగలమగలు మిఱ్ఱుపల్లములనుం గానక కడచినరేయి క్రమ్మఱి వచ్చెఁ గాఁబోలు నని తలఁచుచుఁ దడవి తడవి చేతికిఁ జిక్కినవారలం బట్టి మోఁదుచున్నంత స్రవద్రుధిరధారల నాపరాగంబ డంగిన నెత్తుటం జొత్తిల్లినమేనుల నొప్పి వీరానీకములు పారిజాతవనముల తెఱంగునం జూపట్టె. ఆసంకులసమరమున దుర్యోధనదుశ్శాసనులు నకులసహదేవుల మార్కొనిరి. రాధేయుఁడు వృకోదరుం దలపడియె. అర్జునుఁ డాచార్యునిఁ దాఁకె. అట్లు వారు సూర్యప్రకాశము లయినయుత్తమరథముల నారోహించి శారదాంబుదము లట్టులు చూడనొప్పి కడిందిమగంటిమిం బేర్చి వివిధశస్త్రాస్త్రములఁ బరఁగించి మత్తమాతంగముల తెఱంగునఁ బోట్లాడఁ దొడంగిన నించుకేనియు భేదమగపడనివిధంబుగాఁ దునిసినచేతులును విఱిగినకాళులును దెగినతలలును నుగ్గయినతేరులును డొల్లినయారోహకులును బొలిసినయేనుంగులును మడిసినగుఱ్ఱములును గూలినఱెక్కములును నఱవఱలైనమైమఱుఁగులును బఱియలైనచామరంబులును దునియలైనగొడుగులును ద్రెస్సినసుగంధిమాల్యములును బొడియైనతొడవులును దుత్తుమురైననానాహేతివ్రాతంబులును బెరసి రణక్షోణీతలంబు తారాగ్రహగణచిత్రితం బయిననభోమండలమురీతిం జూడనొప్పె.

అట్టియెడ నకులుఁడు దనపై నడరినమహోగ్రధనుని వలపలించి యార్చి శర శతంబుఁ గురిసినం గోపించి భవత్పుత్రుండు పాండుపుత్రుని డాపలించి వాల మ్ములఁ బరఁగించుటయుఁ జిత్రమార్గవిసృష్టైనయానకులుఁ డతని నాఁగి పోరుడు నతండును గండడరి మనవారలు పిచ్చలింప నతని వెగడుపఱచినం గనలి యమ్మా ద్రిపిన్నకొడుకు పరమలాఘవంబు మెఱయ నతనిసారథితల బొమిడికముతోడ నేలం బడ నఱికె. గుఱ్ఱము లిచ్చమెయి నడుచుటంజేసి సారథిపా టెఱింగి దుశ్శా సనుండు ధైర్యధుర్యుండై తానే రథచోదనంబుఁ గావించుచుఁ జిత్రలాఘవసౌష్ఠ వంబులు పొంపిరివోవఁ బోరుటయు నందఱు నతనిం బ్రశంసించిరి. అట్టియెడ సహదేవుఁడు హయములపయిం బటుకాండజాలములు నిగిడించిన నెంతయు నొచ్చి యవ్వియవి తోఁచినట్లు పఱచుటయు దుస్ససేనుఁడు వాని నిలువరింపను సహదేవునమ్ములకు మాఱేమను వెరవు గానక తెప్పగమునఁ బడుచున్నంతఁ గర్ణుఁ డతనిఁ దలకడచి యడపుటయు నడుమిడి తా నా రాధేయుల దలపడి యాకర్ణ పూర్ణముక్తము లయినమూఁడుభల్లముల నతనిభుజవక్షోభాగముల నాటుటయు నారాధాతనూజుండు క్రోధోన్నద్ధపాముపగిదిఁ గినిసి తోడనడరి నిశితశరనికర ములం గుప్పించుచు నాహవముఖ్యము లయినయయ్యిద్దఱపోరు క్రొవ్వాఁడియాఁబో తులపోరు తెఱంగునఁ బరమభీకరం బయ్యె. అట్లు పోరునెడం గొంతివడికిఁ బెక్క మ్ములు తునియలై వమ్మయినం గినిసి భీమసేనుఁడు గద యెత్తి కర్ణుతేరి నడి చినం గర్ణుండు దానును గదఁగొని యగ్గద నుగ్గుచేయుటయు వృకోదరుండొండు గద యెత్తి గర్ణునిగదను వ్రయ్యలు గావించినం దాని రాధేయుండు శితశర ములం గురియించి మరల్చుటయు నది రయమున మఱలి భీముతేరిపయిం బడు టయు దానితాఁకు పెల్లునంజేసి సిడము నేలం బడుటయు సారథి సోలుటయుఁ బొసంగినం గోపించి వాయుసూనుండు కర్ణునిమేన నెనిమిదివాలమ్ములం గీలించి నగుచు నవలీల నతనికేతనముఁ గూల్చియు విల్లు దునిమియు శరావాపంబు వ్ర య్యలు గావించియు దారుణప్రకారంబు నడిపె. అంపల కలిగి కర్ణుఁడు వేఱు విల్లు గొని ఋక్షవర్ణము లయినభీముగుఱ్ఱములను బార్ష్ణిసారథులనుం జంపుటయు విరథుండై యావృకోదరుం డుత్తుంగగిరిశృంగమునకు దాఁటుకొదమసింగము తె ఱంగున నకులుతేరిమీఁదికి దాఁటుకొనియె.


ద్రోణార్జునుల ద్వంద్వయుద్ధము

అట్టియెడ నాచార్యుఁడును నర్జునుఁడు నొండొరులం దాఁకి యనువడియు నరిఁబోయుటయు గుఱి యరయుటయు విడుచుటయు వీరికిఁ దక్క లాఁతుల కిట్టు లొప్పునే యని చూచుఖేచరులు పొగడుచుండమునం బొదలి పిచిత్రరథగిమన

స్ఫూర్తి మెఱసి యామిషలోలుపంబు లయినడేగలచాడ్పున నత్యంతస్పర్ధమై నడరి యాగురుశిష్యు లిరువు రించుకేనియు నెక్కువ తక్కువ లెత్తి చూపరానితీరునం బెనంగుచుఁ బరస్పరశరములకు మాఱేయుచున్నంత నాచార్యుఁడు వీఁడలంతులఁ బోవఁ డని యూహించి యైంద్రరౌద్రత్వాష్ట్రవాయవ్యవారుణాదిదివ్యాస్త్రము లేయుటయు ధనంజయుండు ప్రతిదివ్యాస్త్రముల వాని కెల్ల శాంతి గావించుటయు భారద్వాజుం డద్దిరా యర్జునునివింటినేర్పింత యొప్పునే చూడఁ జూడ వీఁడు నాకు మిగిలినవాఁ డని తోఁచెడి నని ప్రేమానుబంధబంధురచిత్తంబునం దదుత్కర్షమున కెంతయు నుబ్బుచుఁ బోక పెనంగుచుండె. అప్పు డంతరిక్షగతు లయినదేవగంధర్వసిద్ధర్షిప్రముఖు లందఱు గుమిగూడి తమలో నిట్టియుద్ధ మెన్నఁడును జూడము, మఱి వినుము. అత్యాశ్చర్యం బయ్యెడి. అర్జును మిగుల ద్రోణుఁడును ద్రోణుని మిగుల నర్జునుఁడునుం దక్క లాఁతులు నేరరు. ఇది యేల? వీరితారతమ్యంబు తెలుంగను జెఱవారు వలంతులు గారు. రుద్రుండు క్రీడార్థంబు తాన రెండురూపముల గ్రహించి పోరునేని వీరికి సాటి చెప్ప వచ్చుఁగాని యితరుల వీరికి దీటనరాదు. ఆచార్యునెడ జ్ఞానము పరిపూర్ణమై యున్న నర్జును నెడ జ్ఞానయోగములు రెండునుం బరిపూర్ణంబులై యున్నవి. మఱియు శౌర్య మొక్కండు ద్రోణునెడ నిష్ఠితంబై యున్న దన్న గాండీవియెడ శౌర్యబలములు రెండును నిష్ఠితంబులై యున్నవి. ఎవ్వరును వీరికిఁ జేటుఁ గావింపఁజాలరు. ఇచ్చ పుట్టదుగాని పుట్టెనేని యీబిరుదుమగ లిరువురు దేవగణసహితంబుగా ముల్లోకముల నొక్కమాత్రలోన నీఱుసేయఁజాలుదు రనిప్రకాశముగను బ్రచ్ఛన్నముగనుం బలికిరి. అంత నాచార్యుండు బ్రహ్మాస్త్రము సముద్దీపితము గావించిన నంతర్హితభూతములు తపించె. పుడమి వడఁకె. కొండ లూఁగాడె. బ్రాఁకులు విఱిగె. అర్ణవములు ఘూర్ణిల్లె. విషమవాతంబు వీచె. కౌరవపాండవయోధులు నివ్వెఱఁ జెందిరి. అంతఁ బార్థుఁడు తత్తఱపడక తానుం బ్రహ్మాస్త్రము సముద్దీపితముఁ గావించి గురునిబ్రహ్మాస్త్రము శాంతముఁ గావించుటయు నందఱుఁ దెలివిఁ గాంచిరి. అట్టు లాగురుశిష్యులపోరు విరామమును విశేషమునుం బొరయనితె తెలుంగున నెసంగుచుండఁ దక్కినవారును దమకుఁ దమకుఁ బోలినవారిపయి నడరి శరాసారమున మిన్నుఁ గప్పుటయుఁ బరమతుములం బై నసమ్మర్దంబు సెల్లె.

అట్టిపరమసమ్మర్దమున దుశ్శాసనుఁడు ద్రోణసక్తుం డై నధృష్టద్యుమ్నుం దాఁకిన నప్పాంచాలపుత్రుఁడు భవత్పుత్రునరదము రథ్యసారథికేతనసహితంబుగ శరజాలమునం గప్పిన నతనియెదుర నిలువ నోడి నీకొడుకు వెగడుపడి పఱచినం బాండవసేనానాయకుండు కుంభసంభవుం దలపడువాఁడై శరనికరంబుఁ గుప్పించుచుఁ జనుచున్నంత హార్దిక్యుండును దుశ్శాసనసోదరులు మువ్వురు నతనిం దాఁకుట

యుఁ గవలు ధృష్టద్యుమ్ను నకుఁ దోడుపడినం బోరు ఘోరం బయ్యె. అట్లు త్తమ కులసంజనితు లుత్తమచరితులు శుద్ధచిత్తులు నగువారు క్షాత్రధర్మమున స్వర్గము సాధించువారై విషలిప్తములు జిహ్మగములు దుర్గంధనిందితములుఁ గర్ణనాలీకాదిభరితములునుం గానియుత్తమశరముల నేయుచు ధర్మప్రకారముఁ దప్పక కీర్తికాములై పోరు నెడఁ గవలు వేఱువేఱ యొక్కొక్కఁడు నిద్దఱనిద్దఱఁగా నన్నలువురుదారలఁ దలపడి యాఁగుటయు ధృష్టద్యుమ్నుఁ డాచార్యుం దలపడఁ జనియె.

సాత్యకిదుర్యోధనులు తమబాల్యచరిత్రలఁ జెప్పికొని పోరికిఁ గడఁగుట.

అప్పుడు దుర్యోధనుఁడు తా నప్పాంచాలవరు నాఁగుటయు సాత్యకి యక్కురురాజు మార్కొనిన నయ్యిద్దఱు బాల్యవృత్తములఁ దలపోసి నవ్వుచుఁ బేర్చుచున్నంత సుయోధనుం డాత్మవృత్తము నిందించుకొనుచుఁ గూరిమిచెలి యగు సాత్యకి కిట్లనియె. చెలీ, క్రోధలోభమోహామర్షములను క్షాత్రధర్మమును బలమునుం గాల్పనే? మన మిరువురము నొకళ్లొకళ్లఁ దాఁకుచున్నాము. నీవు నాకుఁ బ్రాణములకంటెఁ బ్రియుఁడవు. నేనును నీకు నట్టివాఁడనకదా. మనబాల్యచరిత్రంబులెల్ల నిప్పుడు తలంపునకు వచ్చుచున్నవి. అవియెల్ల నిప్పు డడంగిపోయె. యుద్ధము మనకుఁ గర్తవ్య మయ్యె నింక నే మనం గల దనిన సాత్యకి యిట్లనియె. రాజపుత్రా, యిది సభయు నాచార్యునిల్లునుం గాదు. చిన్ననాఁటిచెయ్వులు దలఁచుకొనినం బ్రయోజనం బెయ్యది యనిన భవన్నందనుం డాసత్యకనందనునకు మఱియు నిట్లనియె. శినిపుంగవా, మనబాల్యక్రీడ లెక్కడ? ఇప్పటియీపో రెక్కడ? కాల మేరికి నతిక్రమింప నలవి గాదు. ధనలోభమునం జేసి యిదియుం గృత్య మయ్యె ననిన గాంధారేయునకు శైనేయుం డయ్యా, యేమి చేయవచ్చు? కట్టిఁడిక్షత్రవృత్తం బిట్టిది. గురువులనైనం బోర మార్కొనవలయు. నీ కొక్కటి సెప్పెద. నాకుఁ గూర్తువేని రయమున నన్నుఁ దెగటార్పుము. నీవలనం బుణ్యలోకప్రాప్తుఁడ నగుదు. నీకుఁ గలశక్తిబలముల వేగ నాపయిం జూపుము. మిత్రులకు మూఁడుకీడు పెద్దకాలంబు చూడ నోప నని ప్రీతినిరపేక్షము గను జీవితనిరాశముగనుం బలికి తాఁకి శరనికరము లడరించినం గురుక్షోణీవల్లభుండును దోడ నడరుటయు నక్కురుమాధవశూరులకుఁ బరమభీకరం బైనదురంబు సెల్లె. అప్పుడు దుర్యోధనుండు సాత్యకిపై నెనిమిదియమ్ము లేయుటయు నాతండు రయమునం బేర్చి యెనుబదిశరము లడరించినం గోపించి నగుచు నీకొడుకు ముప్పదివాఁడియమ్ము లాసత్యకసుతుమేనం గీలించి యొక్కకోలం గార్ముకంబు ఖండించె. సాత్యకి తోన హస్తలాఘవంబు మెఱయ నొండువిల్లెత్తి శరపరంపరలు పరఁగించిన వానిం దునిమి దుర్యోధనుం డద్దారమేన డెబ్బదిమూఁడుకాండములం జొనిపి మఱియుం బెక్కమ్ము లేయుచున్నంత శైనేయుండు విల్లు దునిమి

వాలమ్ములవానఁ గురిసె. అందులకు వెగడువడి దుర్యోధనుండు తొలంగి కొండొ కవడి కూఁజిల్లి క్షాత్రధర్మము వట్టి క్రమ్మఱి యాశినివీరుం దలపడి పటువిశిఖని కరములు పరఁగించిన నయ్యదువీరుండు ననర్గళముగ మార్గణాసారంబు లడరించు టయు నయ్యస్త్రములపరస్పరసంఘర్షమునం బొడమినయులివు కొఱడవి కాలునప్పటి చప్పుడునకు దీటయి యెసంగె. అట్లు సాత్యకిదుర్యోధనశరవ్రాతపరీతంబై రోదోం తరం బగమ్యంబై యున్నెడ నప్పటప్పటికి సాత్యకి గండుమిగులుట యూహించి రాధేయుండు దుర్యోధనుని దెప్పరంబునకుఁ దప్పించువాఁడై యేతెంచునెడ వృ కోదరుఁడు దాను గర్ణు మార్కొని వాలంపగములఁ బరఁగించుటయుఁ గోపించి కర్ణుండు నగుచు వాఁడితూపు లడరించి విల్లుఁదునిమియు సారథిని నొంచియుం గన లించినం దీవ్రక్రోధదీపితుండై భీమసేనుఁడు గద గొని తేరు డిగ్గి విల్లు దునియను సిడము గూలను సారథి సావను రథచక్రము విఱుగనుం బిట్టు మోఁదుటయు భగ్న చక్ర మగురథమునం గూర్చుండియు రాధాసుతుం డించుకేనియుం జలింపక పటు ప్రదరములఁ బరఁగించుచుండె. భగ్నచక్ర మగుకర్ణునరదము రథ్యము లీడ్వఁగ నేకచక్రం బగుసూర్యరథము సప్తతురంగము లీడ్వఁ బొల్చుతెఱంగునం జూడ నొప్పె.

ధర్మజుఁడు ద్రోణునిపైఁ దమసేనలఁ బురికొల్పుట.

అప్పుడు ధర్మరాజు మత్స్యపాంచాలభూపులకుఁ జేయి వీచి యోవీరు లారా, మనకుఁ బ్రాణములు తలయు ననం జెప్పఁ దగినబిరుదుమగలు ధార్తరా ష్ట్రులతోఁ బెద్దయుఁ బెనంగుచుండ మీరు దోడుపడక మూఢులయట్టు లిట్టు లొప్పరికించి చూడం బోలునే? క్షాత్రధర్మముఁ దలపోసి జయించిన భూరియజ్ఞా చరణంబుల దెగటారిన నుత్తమలోకగమనంబునుం బొసంగు నని నిశ్చయించి కడిందిమగంటిమిం బేర్చి పోరుఁ డనుటయు వారు రెండుమొత్తములై కొందఱు ద్రోణుని దాఁకను గొందఱు భీమునకుఁ దోడుపడను నడిచిరి. ద్రోణునిపరాక్ర మం బప్పటప్పటికెక్కుడగుటయు భీముఁడును నకులసహదేవులు నోయర్జునా, వేవేగ ద్రోణు నెదుర్కొనుము. అతనిబారిం బడినవీవారలం దప్పింపు మని యెలుంగు రాల్పడం బలికిరి. అట్లు పాంచాలురపయిం గవిసి యాచార్యుండు దివ్యాస్త్ర గ్రామంబు సముద్దీపితంబుఁ గావించి పాంచాలసేనలం గనుపుకొట్టుటయుఁ బాం డవసైనికులు నివ్వెఱపడి యక్కటా! వేసవిం బేర్చినకార్చిచ్చు శుష్కతృణపుంజ ముల నెట్టు లట్టుల ద్రోణుండు మనల నీఱుసేయఁ గడఁగినవాఁడు. అర్జునుఁడు నితని నాఁగఁ జాలఁడు. ఇఁక లాఁతులఁ జెప్పనేల యని తమలోఁ బలుకుచు జిచ్చ వడియున్నంత మురాంతకుఁడు ధనంజయున కిట్లనియె. ఈద్రోణునిఁ జేత విల్లు గలయంతకుఁ బోర నింద్రుఁడును గెలువఁ జాలఁడు. ఆయుధసన్న్యాసము చేసినం

గాని యితని గెలువరాదు. కావున ధర్మ మరయక యుపాయమున గెలుచు
ట యిప్పటికి మేలు. కాకున్న నొక్కమాత్రలోన నీసేనలనెల్ల నితండు రూపడఁ
గించుట నిక్కువంబు. అశ్వత్థామ హతుఁడైన నితండు పో రుడుగు ననితోఁచెడి.
కావున నొక్కండు వాఁడు హతుఁ డయ్యె నని యెఱింగించుట మేలివెర వను
టయుఁ బార్థుఁ డంకుల కియ్యకోనఁడయ్యె. తక్కినయందఱు నిదియ మే లనిరి.
ధర్మరా జనృతభయంబును జయాశయు మనమునఁ బెనఁగొనుటంజేసి యెట్టకేల
కు సమ్మతించె.

భీముఁడశ్వత్థామ నచ్చెనని ద్రోణునకుఁ దెలుపుట.

అంత భీమసేనుఁడు మాలవేశ్వరుఁడైనయింద్రవర్మునియేనుంగు నశ్వత్థా
మయనుదానిం గదచే నడిచి యది నెపంబుగా నాచార్యునొద్దకుఁ జని యశ్వత్థా
మ నచ్చె నని యెలుంగెత్తి పడం బలుకుటయుఁ గర్ణకఠోరం బయినయప్పలుకు విని
గురుఁడు సలిలమగ్నం బయినసైకతంబుపోలె శిథిలస్వాంతుఁడై కొంతవడి చిం
తించి పదంపడి కొడుకుపరాక్రమంబుఁ దలపోసి యతనియవధ్యత్వం బెఱింగి యూ
ఱడిల్లి తనకు మృత్యువుగాఁ బుట్టినధృష్టద్యుమ్నుం బరిమార్పఁగ నెంచి శరసహ
స్రములు పరఁగించినం బాంచాలవీరు లిరువదివేలరథికు లయ్యాచార్యుం జుట్టు
ముట్టి కాండజాలంబుఁ బరఁగించిన నమ్మహారథప్రవరుండు తదీయశరజాలసంఛ
న్నుండై ప్రావృట్పయోధరములు గప్పినభాస్కరునిభంగి నొప్పె. అందులకుఁ గ
డుం గోపించి కుంభసంభవుండు బ్రహ్మాస్త్రము సముద్దీపితముఁ గావించి తదీయ
మార్గణగణములఁ బొడిచేసి పాంచాలురతలలు దఱిగియుఁ జేతుల నఱికియు నే
నుంగులఁ గూల్చియు గుఱ్ఱములఁ బడఁద్రోచియు రౌద్రబీభత్సంబు నొసరించి
యిర్వురువదివేవురం బరిమార్చి వసుధానుశిరంబు రణాంగణమునకుఁ బలి చేసి
మఱియుఁ బంచశతమత్స్యయోధులను నాలువేలసృంజయులను బదివేలయేనుం
గులను నన్నిగుఱ్ఱములనుం బొరివుచ్చి విధూమపావకునిచందమున వెలుంగుచు
న్నంత నత్రికశ్యపవిశ్వామిత్రవసిష్ఠజమదగ్నిగౌతమభరద్వాజప్రముఖు లగుమహ
ర్షులును సికతపృశ్నివాలఖిల్యాదులును నక్కుంభసంభవునెమరం బొడసూపి యి
ట్లనిరి. అయ్యా, యధర్మమున నింతకుఁ గయ్య మొనర్చితివి. దేహత్యాగము
సేయ నీ కిది సమయము. ఇయ్యది బోధింప వచ్చినమమ్ముఁ జూచి యిఁక నాయు
ధము లవలఁ బెట్టుము. ఇంతకంటెఁ గ్రూరకర్మ మింకనైనం జేయఁ దగదు.
వేదవేదాంగము లెఱింగి సత్యధర్మము లవలంబించి బ్రాహ్మణోత్తముఁ డనం బే
రు గాంచిననీకు విశేషించి యీక్రూరకృత్యము పోలదు. కైదువుల విడిచి
నిర్మోహుండవై శాశ్వతమార్గము పట్టుము. మనుజలోకము వసింప నీకాలము
నిండె. అస్త్రము లెఱుఁగనిప్రాకృతులం బ్రహ్మాస్త్రమునఁ గాల్చితివి. ఇట్టిపాపకృ

త్యము నింకనైనం ద్యజించుట మేలుగాదె యనిపలుకుటయు నమ్మునులవచనం బులను భీమవాక్యంబును నాకర్ణించి యెదుర నున్నధృష్టద్యుమ్నుం జూచి విన్నం బోయి కొండొకవడి విచారించి ధర్మరాజు త్రైలోక్యరాజ్యము వచ్చునేనియు నసత్యము పలుకఁడని పెద్దయు నమ్మిక బాల్యముమొదలుగాఁ దనకుఁ గలిమిం జేసి యతనివలన నశ్వత్థామచావుఁబ్రదుకుల నెఱుంగువాఁడనై కౌంతేయాగ్రజా, యశ్వ త్థామ సచ్చెనే మఱి బ్రదికెనే యని యడుగుచున్నంత గోవిందుఁడు పాండవు లకు మూలధ్వంసముఁ గావింపఁ దలంచుద్రోణుచిత్తంబుఁ దెలిసి వ్యథితచిత్తుండై యజాతశత్రున కిట్లనియె.

## ధర్మజుఁడు ద్రోణునితో నశ్వత్థామ సచ్చెనని యేనుఁగు నెపమునఁ జెప్పుట.

మహారాజా, ద్రోణుఁ డింక నర్ధదిన మిట్టులు క్రోధసముద్దీప్తుండై య ని సేయునేని నీసైన్య మంతయు నొక్కమాత్రలోన నశించు. సత్యముఁ జెప్పితి. కావున మమ్ముఁ గావుము. ఇప్పుడు సత్యముకంటె ననృతము మేలు. ప్రాణాపా యంబులతఱిని గామినులయెడను వివాహమునను గోబ్రాహ్మణసంరక్షణమునను ననృతంబు పాతకంబు గా దని ధర్మవిదులు పల్కుదురు. కాన ననృతంబైనం జెప్పఁ దగు ననుచున్నంత భీముఁ డిట్లనియె. ఏను శత్రుసేనలఁ జెండాడుతఱి మా లవేశ్వరుం డైనయింద్రవర్మునియేనుఁగు నశ్వత్థామయను దానిం జంపితి. ఆనెప మునవే నేను ద్రోణునొద్ద కరిగి యశ్వత్థామ సచ్చె సమరము సాలింపు మనిపలి కితి. ఆచార్యుండు నామాట నమ్మక ని న్నడిగినవాఁడు. గోవిందవచనముల స మ్మానించి యశ్వత్థామ సచ్చె నని నీవు గుఱుఁన కెఱిగింపుము. ముల్లోకముల స త్యవచనుఁడవనుప్రసిద్ధి కలిమింజేసి నీవు సెప్పిన నతండు నమ్మి కయ్య ముడుగు ననిపలికిన నప్పలుకులు వినియు మాధవువచనంబుఁ దలంచియు నది యట్లు భా వ్యం బవుటంజేసియు నెట్టకేలకు నియ్యకొని ధర్మనందనుఁ డనృతభయంబును జయాశయు మనంబునం బెనంగొనంగ నశ్వత్థామ సచ్చె నని పేరులుం గెత్తి వర్ణా నుపూర్వి యేర్పడం జెప్పి పదంపడి తిన్ననియెలుంగుతోఁ గుంజర మనిపలికె. పలికినంతన భూమిమీఁదఁ జతురంగుళసమున్నతం బైన ద్రోణునరదము విజయలో పము సూచించుచుఁ బుడమిఁ దాఁకె. యుధిష్ఠిరువలన నమ్మాట విని యాచార్యుండు పుత్రశోకసంతప్తచిత్తుండై జీవితముమీఁద నాశ విడిచి ఋషివచనమునఁ బాం డవులకుఁ ద న్నపరాధముఁ జేసినవానింగాఁ దలంచియు నెదుర నున్నధృష్టద్యు మ్నుం గనుంగొనియు విన్ననై యెప్పటియట్లు పోరు సేయ నోపఁడయ్యె. అట్టి యెడ ద్రోణవినాశార్థం బగ్నికుండమున శరశరాసనాదులతోడఁ బుట్టినధృష్టద్యు మ్నుఁడు చారుకార్ముకంబున జ్వలితజ్వలనోపమం బయినక్రూరనారాచం బరిఁ బోయుటయు మండలీకృతకోదండమధ్యగతం బైనయయ్యమ్ము శరత్కాలమునఁ

పరివేషమధ్యగతం బైనభానుబింబము ననుకరించె. అమ్మార్గణంబుఁ జూచి సైని
కులు గురున కంతకాలము దఱిసె నని తలంచిరి. భారద్వాజుండు తన కది శరీ
రాపాయంబుఁ గావించు నని యూహించి దాని వారింపఁ గడంగినం దివ్యాస్త్ర
ములు దోఁపకుండె. అట్లు నాలుగుపవళ్లు నొక్కరాత్రి మఱియు నొక్కపవలింటి
మూడుపాళ్లు ఘోరసంగ్రామం బొనర్ప శరక్షయంబుఁ బొంది కుంభసంభవుండు
పుత్రశోకభరమునం జేసియు దివ్యాస్త్రములు దోఁపమిం జేసియు ఋషివాక్యముల
నరయుటం జేసియు సమర ముడుగం దలంచియు సహజతేజఃపరిపూర్ణుండు గావున
నూరకుండ నొల్లక యాంగిరసం బైనయొండువిల్లు గొని బ్రహ్మదండనిభము లగు
ఘోరశరము లఱిం బోసి ధృష్టద్యుమ్నుపయిం బడ నేసి తదీయశరముల శతశ
కలములఁ గావించి సిడముఁ గూల్చి విల్లు దునిమి సారథిని నేలం ద్రోచి గండ
డరె. అంపలకు నవ్వుచు ధృష్టద్యుమ్నుఁడు వేఱువిల్లు గొని యొక్కవాలమ్ము
గురునురమ్మున నాటిన నమ్మహారథప్రవరుండు విల్లును దునిమి తోన యతండెత్తి
నవిండ్లనెల్లను గదాఖడ్గములు దక్కఁ దక్కినసాధనములను నొక్కమాత్రలోన న
ఱికి ప్రాణాపాయకరణఘోరం బులైనతొమ్మిదివాఁడితూపుల నతని మేనం గీలించి
బ్రహ్మాస్త్రము సముద్దీపితముఁ గావించుచు నిజరథాశ్వములఁ దదీయరథాశ్వముల
తోడం గలియఁ దేరు నొగనొగఁ దాఁకఁ బరఁగించుటయు శోణవర్ణము లయిన
ద్రోణాశ్వములు పారావతవర్ణము లయినధృష్టద్యుమ్నతురంగంబులతోడఁ గలి
యునప్పటికాంతి క్రొమ్మెఱుంగుతళతళలతోడ మేఘములు బెరయునప్పటి తుఱఁ
గలి ననుకరించె. అట్లు గురుం డగ్గలించి ధృష్టద్యుమ్నుపై నడరి యతనితేరు
చక్రబంధాదులతోడ విఱిగి కూలునట్లు గావించినం బరమాపత్ప్రాప్తుండై య
ప్పాంచాలవరుండు గద యెత్తుటయు ద్రోణవధమునకుఁ గాలము ప్రాప్త మయ్యె
నని తనలో నూహించి శతచంద్రచిత్రితంబును భానుప్రతిమాసముల్లసితంబునగు
పలుకయు ఖడ్గమునుం గొని తనతేరినొగమీఁదుగా నతనితేరినొగమీఁదికి లం
ఘించి శోణాశ్వములపశ్చార్ధమునను నొగనడుమనను నొగసంధించుపట్టునను దిరు
గుచు గురునురము భేదింప నుంకించుటయు నెర గొన నడరుడేగయట్టులు కడం
గినయప్పాంచాలవరు నాఁగుట కుంభసంభవునకు దుష్కరం బయ్యె. అట్టియెడ
నేచి గురుండు శక్తి నెత్తి మోఁది ధృష్టద్యుమ్నురథ్యములఁ గూల్చి తనతేరువా
నితేరికిఁ దప్పించుటయు విరథుండై ధృష్టద్యుమ్నుండు కడుం గోపించి హిరణ్యక
శిపువధమునాఁటినరసింహునట్లు ఘోరాకారమునం బేర్చి వాలును బలుకయుం
గొని పాముం బట్టుగరుడునిచాడ్పున గురునిపయిం గడంగి భ్రాంత ముద్భ్రాంత
మావిద్ధ మాప్లుతము ప్రసృతము సృతము పరివృత్తము నివృత్తము సంపాతము
సముదీర్ణము భారతము కౌశికము సాత్వతము మున్నగు ననేకవింశతిఖడ్గమార్గముల

నత్యన్మృతప్రకారమునఁ జరించుటయు గురుండు నైశితస్తికము లనుబాణములు వేనవేలు పరఁగించి యతనివాలును బలుకనుం బొడిచేసె. ఆనైశితస్తికశరములు జేనెఁడేసిపొడవు గలిగి మిక్కిలి డాసినవారిపై నేయఁ దగినయవి. అవి ద్రోణకృపద్రౌణికర్ణాజ్ఞాసనప్రద్యుమ్నాభిమన్యుసాత్యకులకుఁగాని లాఁతులకు లేవు. అట్లాచార్యుండు ధృష్టద్యుమ్నుకరవాలశరవారణముల నణఁకి యొక్కతీవ్రభల్లము వింట సంధించి యతనియసువులఁ గొనువాఁడై యేయుటయుఁ గర్ణదుర్యోధనులు సూచుచుండఁగ సాత్యకి పదియమ్ముల నాభల్లమును ద్రుంచి ద్రుపదపుత్రుం దప్పించి తనపై నడరినద్రోణకృపకర్ణులం దాఁకి వివిధరథమార్గముల విచిత్రప్రకారమునఁ దిరుగుచు విక్రమక్రీడ సల్పుచుండఁ జూచువా రందఱు నతనిం బ్రశంసించిరి. అప్పు డర్జునుడు గోవిందుం జూచి చూచితే నాను దేవా, మనసాత్యకి యాచార్యప్రముఖు లగు మహారథులఁ దాఁకి విక్రమవిహారంబు సల్పుచు నాకును మాయన్నదమ్ములకు నెంతయు నానందముఁ గావించుచున్నవాఁడు. వృష్ణికులకీర్తివర్ధనుం డై నయీశూరవర్యుపరాక్రమమునకుఁ జూచుఖేచరులు విస్మితులై యగ్గించుచున్నవా రనిపలుకుచున్నంత సాత్యకికోల్తలసైరింపక యలిగి కృపకర్ణపురస్సరులై దుర్యోధనాదు లగుభవత్పుత్రు లాశైనేయుపై నడరుటయు ధర్మజుఁడును భీముఁడును గవలును దనకుఁ దోడుపడినం బేర్చి యాకౌనిప్రభుఁడు శరవర్షముఁ గురియించియుఁ దదీయదివ్యాస్త్రజాలముల నిజాస్త్రముల శాంతములఁ గావించియు లయసమయరుద్రుమాడ్కి రౌద్రమునం బెంపెసంగి గండడరినంబోరుఘోరం బయ్యె. ఏమి చెప్పుదు నెక్కడఁ జూచినం దెగినచేతులును దునిసిన తలలును విఱిగినవిండ్లును బొడియైనగొడుగులును నఱవఱలైనచామరంబులును గూలినతేరులును బడినయేనుంగులును మడిసినగుఱ్ఱములును సమసినసాదులును రాసులై బెరసియుండఁ గయ్యపునేల పరమఘోరంబై యొప్పె.

అట్టిపరమసంకులమున ధర్మరాజు తమమహారథులం బిలిచి మీ రందఱు ద్రోణుం దఱుముఁడు. ఇతండె ధృష్టద్యుమ్నుఁడు ద్రోణవధార్థంబు శక్తికొలఁది కడఁగుచున్నవాఁడు. మీరు తోడుపడునది యనుటయు ధర్మరాజునానతిం జేసి యందఱును భారద్వాజుం జంపువారై యడరిన నప్పరమశూరుండు మరణనిశ్చయుండై వారల నందఱం దలపడియె. అప్పుడు భూమి సంచలించె. విషమవాతములు వీచె. భానుమండలమునుండి కొఱవులు పడియె. ద్రోణశస్త్రములు జ్వలించె. తేరులు మీఁదుమిక్కిలి మొరసె. గుఱ్ఱములు కన్నీరు విడిచె. భారద్వాజుండు తేజంబు దఱిఁగినవిధమునఁ జూపట్టె. మఱియు నతనివామనయనబాహువు లదరె. ఇట్లు దోఁచినయుత్పాతముల నరసియు నెదుర ధృష్టద్యుమ్నుం జూచియు విన్నఁబోయి స్వర్గగమన మింకఁ గర్తవ్య మని యూహించి సుయుద్ధ

మునఁ బ్రాణత్యాగముఁ జేయ నిశ్చయించి పాంచాలసేనల నిండిననలుదెసలం
గలయం గాంచి భారద్వాజుండు వింశతిసాహస్రక్షత్రియులను లక్షకాల్బలంబునుం
బరిమార్చి విధూమపావకునియట్లు వెలుంగుచు క్షత్రియులవినాశార్థము బ్రహ్మా
స్త్రముఁ బ్రదీపితంబుఁ గావించునెడ విరథుఁ డై నధృష్టద్యుమ్నుం దనతేరిపయిం
గూర్చుండఁ బెట్టికొని భీముఁ డిట్లనియె. నీకంటె నితరుఁ డాచార్యుతోడఁ బోర
నుత్సహింపఁడు. వడిం బేర్చుము. ద్రోణవధము నీతలపై నెత్తినభార మనిన నతం
డువిల్లు గొని శరజాల మడరించి బ్రహ్మాస్త్రము శాంతముఁ గావించి మఱియుం
దద స్త్రములనెల్ల నిజాస్త్రముల నడఁగించుచు శిబివసాతిబాహ్లికకౌరవాదియోధు
లం బిలుకుమార్చుచు ఖరకిరణములం దరణి యెట్లు లట్లులు శితశరముల దిక్త
టములం గప్పినం గోపించి ద్రోణుండు విల్లు దునిమి శితశిలీముఖముల మర్మము
లు గాఁడ నేసినం ధృష్టద్యుమ్నుండు సోలె.

## ద్రోణుఁ డస్త్రసన్న్యాసముఁ జేయుట.

అప్పుడు భీముఁడు కోపదీపితుండై యాచార్యుని తేరు డాయ నరిగి మెల్లన
నిట్లనియె. నిజధర్మములకుఁ దనివి పొందని బ్రహ్మబంధువులు పోరు సేయకేని
క్షత్రియులు క్షయముఁ బొందక సుఖింతురు. సర్వభూతములయెడ నహింస ధర్మ
విస్తర మని పెద్దలు సెప్పుదురు. అట్టిధర్మమునకు బ్రాహ్మణుఁడు మూలము. నీ
వు బ్రహ్మవిదుఁ డైన బ్రాహ్మణుఁడవయ్యుఁ బుత్రదారధనాసక్తిఁ జేసి యజ్ఞానమున
శ్వపాకునట్లు నిర్దయుండవు నిర్వివేకుఁడవునై నానాజనులం జంపెదవు. ఒక్కకొడు
కునకుఁగా స్వకర్మస్థు లయినవారలఁ బెక్కండ్రను నీవు వికర్మస్థుండవై వధించు
చు నెట్లు సిగ్గుపడవూ యెఱుంగరాదు. ఎవనికై శస్త్రముఁ గొని బ్రదుకఁ దలం
చెదవూ యతఁడు పడియె. ధర్మజుఁడును నీకయ్యర్థము నెఱింగించె. ఇంక శంకిం
పం బని లే దనుటయు భీమునివచనము విని ద్రోణుఁడు విల్లు విడిచి సర్వాస్త్ర
ములఁ ద్యజించువాఁడై యోకర్ణా, కృపా, దుర్యోధనా, సంగ్రామమునఁ గడం
గుఁ డే నిదె పలుమాఱులు సెప్పెద. పాండవులవలన రక్షణం బవుత. నేను శ
స్త్రము విడిచితి ననిపలికి యశ్వత్థామను దలఁచికొని యాక్రోశించి నిర్విణ్ణచి
త్తుండై నిర్వికారధైర్యధుర్యుండై రథముపయిం గూర్చుండి సర్వభూతములకు
నభయం బిచ్చి యోగధారణాపరుండై యుండ ధృష్టద్యుమ్నుఁడు రథము డిగ్గి
కృపాణపాణియై ద్రోణుపయిం గవిసినం ధృష్టద్యుమ్నవశగతుం డైనయాచా
ర్యుం జూచి యందఱు హాహాకారంబులు గావించి నిందించిరి. అంతకుమున్న
ద్రోణాచార్యుండు సాంఖ్యయోగపరుండై ముఖ మించుక మీఁది కెత్తి యు
రము కొంచెము ముందు వంగులునట్లు గావించి నిమీలితాక్షుండై సమాధి
యోగం బవలంబించి యేకాక్షరప్రణవగమ్యుఁడు పురాణపురుషుఁడు పరముఁ

డక్షురుఁడు నగుపరమాత్ముం జిత్తమున ధ్యానించి జ్యోతిర్భూతుండై యమ్మేను విడిచి సజ్జనులకును సాధింప నలవిగానిదివంబునకుఁ జనియె. భారద్వాజుతేజం బమ్మేను విడిచి రవిమండలము సొర నెగయునెడ నిద్దఱు సూర్యు లనుబుద్ధి మాకుఁ బొడమె. అంతరిక్షంబెల్ల జ్యోతిర్మయంబై కన్పట్టె. మఱి నిమిషము లోనం దత్తేజ మదృశ్య మయ్యె. సురలప్రహర్షనినదం బెంతయు నెసంగె. అట్లు ద్రోణుఁడు బ్రహ్మలోకమునకుఁ జనునెడ నారీతిని వ్యాసమునికారుణ్యమున నేనును ధనంజయుండును గృపాచార్యుండును వాసుదేవుఁడును ధర్మరాజు నను నేవురు దక్కఁ దక్కినమానవు లెఱుంగరు.

ధృష్టద్యుమ్నుఁడు మృతుఁడైనద్రోణునికంఠముఁ దునుముట.

అట్లు గురుం డాకర్ణపలితుఁడు శతవృద్ధుఁడు నయ్యుఁ బదునాఱేండ్లప్రాయపువానియట్లు సమరవిహారంబు సలిపి తుది యోగనిష్ఠంజేసి జ్యోతిర్భూతుండై బ్రహ్మలోకంబున కరుగ నక్షత్రపథంబు సొచ్చినపదంపడి ధృష్టద్యుమ్నుండు కరవాలముఁ జేతఁ గొని యడరి యర్జునుండు ద్రుపదపుత్రా, గురుం జంపవలదు వలదని వెంటఁ దవులుచున్నను సకలజనులు నిషేధించుచున్నను వినక తేరిమీఁదికి లంఘించి డాపలికేల గురునిసిగఁ బట్టికొని కృపాణమునఁ దలఁ దఱిగి తదీయరక్తసిక్తలోహితగాత్రుండై తేరినుండి మొండెము నేలం బడఁ ద్రోచి మనవారిముందఱఁ దలఁ బడ వైచె. అట్లు ద్రోణుఁడు హతుఁడైనం జూచి మనవారు పూనికి తఱఁగియు నివ్వెఱపడియు ఱిచ్చపడియుఁ బరాజయమునకు విన్నఁబోయియు ధైర్యము దూలియు నార్తరావము లొనర్చియు విచ్చిపఱచిరి. పాండవయోధులు గెలుపు గాంచుటంజేసి కీర్తి వహించి శంఖారవములను భేరీభాంకారములను సింహనాదములనుం గావించిరి. భీమసేనుఁడు ధృష్టద్యుమ్నుం గౌఁగిలించుకొని పాపాత్ముఁడై నరాధేయుఁడును దుర్యోధనుండునుం జచ్చినపదంపడి యిట్లే నిన్నుఁ గౌఁగిలించుకొని యలరుదు ననిపలికె. అట్టు లాచార్యుండు హతుఁడైనం గౌరవవీరులు శోకపరాయణులై కన్నీరు నించియు నుదీర్ఘులై నయరాతులం జూచి కంపించియు లేటమొగంబు వెట్టియు వెగడుపడియు ఱిచ్చపడియు నుత్సాహము దఱిఁగియు వెఱచఱచియు నలుదెసలం జూచియు హిరణ్యాక్షవధానంతరమసురు లెట్టు లట్టులు నివ్వెఱపడియు డగ్గుత్తిక వెట్టియు నాఁకలియు నీరువట్టును రేయింటియలజడియు నెండవేఁడిమియుఁ గైదువులపోట్లనొప్పియు ముప్పిరిగొనఁ జెయ్వులుదక్కియు నుక్కుసెడియు నక్కటా! భారద్వాజునిపాటు సముద్రము లింకుట. మేరువు చలించుట యింద్రుఁ డోడుట యెట్ల ట్లసంభావితంబయ్యె నెట్లొకో పొసంగె. ఎట్లోర్వవచ్చు నింక నే మనం గలదు మన కెయ్యది కర్తవ్యం బనిపలుకువారును సంబంధిబాంధవుల పడిం బిలుచువారును నిలునిలు మిదె నేను వచ్చితి నని తమవారలఁ జీరువారును

వివిధభూషణభూషితంబు లయినతేరుల డిగి వడిం బేర్చువారును జవనాశ్వము
లెక్కి కాళ్ళుల నదల్చువారును ముడి వీడినసిగల సవరించికొనం దోఁపక తత్తఱ
పడువారును నింక నేమియు లే దనువారును మైమఱుఁగులు వాఱవైచువారునై
సైనికులు పాఱుచుఁ దన్నుఁ బరివేష్టించినం దుర్యోధనుండు తా నప్పు డచ్చట
నిలువ నోపక శకునికర్ణశల్యకృపకృతవర్మోలూకదుశ్శాసనవృషసేనసుశర్మసహి
తుండై సకలసైన్యయుతంబుగా మొగతిరిగి యనికిఁ దొలంగి కలంగి వెఱచి
పఱచె.

కృపుఁడు ద్రోణవధ మశ్వత్థామకుఁ జెప్పుట.

అంత నొండుకడ శిఖండిప్రముఖులతోడం బోరి పాండవసేనలం దిరుగుడు
పఱిచి యెట్టకేలకు డెప్పరంబునకుఁ దప్పి యశ్వత్థామ కలంగిపఱచుచున్నకురుసే
నలం జూచి దుర్యోధనుం దఱియ నేతెంచి రాజేంద్రా, పఱచుచున్నసేనల నిలు
వరింపక నీవును గర్ణాదులును లేటమొగంబు వెట్టితిరి. ఏకయ్యమునను మనసేన
లిట్లు కలఁగఁబాఱవు. ఇప్పు డింతకుఁ గతం బెయ్యది? ఏమహారథప్రవరుఁడు
పడిన నీయెడరు వాటిల్లె? మీసైనికుల కందఱకును సేమంబకదా యనియడుగ
దుర్యోధనుఁడు ఘోర మగునయ్యప్రియవచనంబుఁ జెప్పనేరక యవిసినకలంబు
చందమున శోకసాగరమున మునిఁగి వికలుండై బాష్పపూరితలోచనుండై డగ్గు
త్తిక వెట్టి శారద్వతుం జూచి యశ్వత్థామ కుత్తరంబు సెప్పు మనుటయు నాకృ
పాచార్యుండు పరమార్తిగతుండై మన మొకతెఱంగున నిల్పికొని యశ్వత్థా
మ కిట్లనియె. అయ్యా, మేము భూలోకవిఖ్యాతుఁ డైన ద్రోణాచార్యుని ముం
దిడికొని పాంచాలురఁ బోరికిఁ జీరుటయుఁ బరమసమ్మర్ద మయినం గినిసి మీతం
డ్రి బ్రహ్మాస్త్రమున మత్స్యకేకయపాంచాలాదియోధుల లెక్కకు మిక్కిలియగు
వారలం బొరివుచ్చి శతవృద్ధుండయ్యుఁ బదునాఱేఁడుల ప్రాయపువానియట్లు ర
ణక్రీడ సల్పి దివ్యాస్త్రజాలములఁ బరఁగించుచు నరాతిసైన్యమధ్యమునఁ బట్టప
వలింటిభాస్కరునిభంగి దుర్నిరీక్షతేజోవిస్ఫూర్తి మెఱయం బాండవులు నిరు
త్సాహులయి తిచ్చపడుటయు గోవిందుఁడు కైదువు చేత నున్నంతకు ద్రోణుం
గెలువరాదు. అశ్వత్థామ సచ్చె ననిచెప్పినంగాని యతఁడు కైదువు విడువఁ డని
పాండవజయార్థియై కపటోపాయంబు బోధించిన నర్జునుఁ డందుల కియ్యకొన
కున్నను ధర్మరా జెట్టకేల కియ్యకొనుటం జేసియుఁ దక్కినవా రందఱు నిదియే క
ర్తవ్య మనిమెచ్చుటం జేసియు భీముఁడు సిగ్గుమాలి నీతండ్రియొద్ద కరిగి యశ్వ
త్థామ సచ్చె ననిన నది నమ్మక యాచార్యుండు సత్యవచనుఁడు పరమధార్మికుఁ
డు నని పెద్దయు నతని నమ్మినవాఁడు గావున ధర్మజా, యిది యెట్లనియడుగ న
క్కౌంతేయాగ్రజుం డసత్యభయమును జయాశయు మనమునఁ బెనఁగొన మాల

వేశ్వరుం డై నయింద్రవర్మనియేనుఁ గశ్వత్థామయనునది భీమునిచేఁ జచ్చిన నది నెపముగాఁ గొని యశ్వత్థామ సచ్చె నని యెలుం గెత్తి వర్ణానుపూర్వి యేర్పడం బలికి పిమ్మట మెల్లన కుంజర మనిపలికిన నది వినక భవజ్జనకుండు పుత్రశోకవ్యా కులచిత్తుండై యస్త్రి సన్న్యాసంబుఁ గావించి ప్రాయోపవిష్టుండై పరమనిష్ఠా గరిష్ఠుండై ప్రాణములఁ ద్యజించె. అప్పుడు ధృష్టద్యుమ్నుఁడు తేరు డిగ్గి కృపా ణపాణియై గురుతేరిమీఁదికి లంఘించి రథావతీర్ణుఁడై యర్జునుండు వలదువలదుర గురుం జంపరాదు ప్రాణములతోడఁ బట్టికొను మనివారించుచు వెంటఁ దవులు చున్నంతన గురునికేశబంధము డాకేలం బట్టి తలఁ దఱిగి యట్ట నేలం బడఁ ద్రోచి తల మనసైనికులముందఱఁ బడ వైచె. ఇయ్యెడరు మూఁడుటంజేసి సేన లెల్లు వికలంబు లయ్యె నని కృపాచార్యుండు ద్రోణవధప్రకారముఁ జెప్పిన నాకర్ణించి యశ్వత్థామ పాదాహతం బైనపన్నగంబుచాడ్పునఁ గ్రోధవిస్ఫురి తుండై శుష్కేంధనముల నేయి వోయ భగ్గన దరికొనుచిచ్చుచందమునఁ దేజో దుర్నిరీక్షుండై యఱచేతులఁ జఱచియు నవుడు గఱచియుఁ బండ్లు గొఱికియు నిట్టూర్పులు నిగుడించియుఁ గన్నుల నిప్పులు రాలం జూచుచుండె ననిన ధృతరా ష్ట్రుఁడు సంజయా, ధృష్టద్యుమ్నుఁ డధర్మమున శతవృద్ధుఁ డై నతనతండ్రిని వధించె ననిన విని యశ్వత్థామ యేమనియె. ఐంద్రవారుణాగ్నేయమానవబ్రాహ్మనారా యణాద్యస్త్రంబులును బరశురామునివలన ద్రోణుఁడు వడసినయుత్తమాస్త్రము లును నతనికిఁ గలవు. తనకంటెఁ బుత్రుఁ డధికుఁడుగా నుండవలయు ననుకోర్కి యెల్లవారికిఁ గలిమి సహజంబ కావున ద్రోణుఁ డతనికి దివ్యాస్త్రగ్రామంబు నే ర్పె. మఱియు నయ్యాచార్యపుత్రుండు పోర నింద్రునకు వీర్యమునఁ గార్తవీర్యు నకు బుద్ధిని బృహస్పతికి ధైర్యమున మేరువునకుఁ దేజమున నగ్నికి గాంభీర్యమున సముద్రమునకుఁ గ్రోధమునఁ గ్రూరసర్పమునకు సాటివచ్చువాఁడు. వెండియు నతఁడు మేటివిలుకాఁడు. తాఁ కోర్చువాఁడు. వేదవ్రతస్నాతుఁడు. శ్రీరామున కె నవచ్చువాఁడు. అతఁడు రథస్థుండై పటురయమున నరాతులం దాఁకునెడఁ బుడ మి కంపించు. ద్రోణునకు ధృష్టద్యుమ్నుఁ డెట్టు లట్టుల యప్పాంచాలపుత్రునకుఁ దాను దండ్రితపోబలమున మృత్యువై పుట్టినవాఁడు. అట్టివాఁడు తండ్రి యధ ర్మమున మృతుఁ డయ్యె నని విని యూరకుండునే? పదంపడి యేమి చేసె నని యడిగిన నాంబికేయునకు సంజయుం డిట్లనియె.

### అశ్వత్థామ క్రోధమునఁ బ్రతిజ్ఞ చేయుట.

కపటమునఁ దనతండ్రి హతుఁ డగుట విని యశ్వత్థామ రోషభరితుండై కాలాంతకునివిధమున ఘోరాకారుండై శోకావేగమునఁ బైపయిం గ్రమ్మకన్నీ రు సారెకుఁ దుడిచికొని నిశ్శ్వసించి దుర్యోధనున కిట్లనియె. క్షుద్రులు మా

తండ్రిని సన్న్యస్తశస్త్రుని హతునిం గావించిరి. ధర్మపుత్రుఁ డింతయన్యాయము
నకును గ్రూరమునకు నొడంబడియె. అతని ధర్మధ్వజంబెల్ల నేఁడు తెలిసె. స
మరప్రవృత్తులకు జయపరాజయములు గలుగుట సహజంబు. సమరమున న్యా
యవధముఁ బొందిన సుఖకరం బగు నని పెద్దలు వాక్రుత్తురు. మాతండ్రి వీర్య
ము దఱుఁగక పూనికి మెఱసి పోరి మేను సాలించి యుత్తమపదమునకుఁ జనియె.
అందులకు వగవం బని లేదుగాని ధర్మప్రవృత్తుఁ డైనయమ్మహాత్ముఁడు సకలసై
నికులు సూచుచుండ సిగఁ బట్టికొనఁబడియె నన్న నామర్మములు దూలుచున్నవి.
ఏను బ్రదికియుండ నాతండ్రికి నిట్లు గావలసెఁగా. పుత్రవంతులు పుత్రుల
వలన నియ్యదియె కోరవలయునెక్కా. కామముననొండెఁ గ్రోధముననొండె న
జ్ఞానముననొండె ద్వేషముననొండె బాల్యదోషముననొండె నధార్మికు లిట్టియకృ
త్యములు చేసి పరిభవింతురు. పాంచాలపుత్రునిపనికంటె నధార్మికకృత్య మొం
డు గలుగునే? నన్నవమానించి నీచకృత్యము చేసిన ధృష్టద్యుమ్నుఁడు స్వజనసహి
తముగఁ దత్ఫలముఁ గుడుచువాఁడు. అనార్యుఁడు మిథ్యావాది కపటపరుఁడు నగు
నప్పాండవరాగ్రజునినెత్తురు నేల ద్రావఁ గలదు. అంతకుఁ జాలనేని యిష్టాపూర్తా
దిధర్మములకుఁ దప్పినవాఁడ నగుదు. ఏను బాంచాలుర నందఱనుం జంపకకాని
మేనఁ బ్రాణముల ధరియింపను. సర్వోపాయములం దద్వధమునకుఁ గడంగుదు.
పాపకారి యగుధృష్టద్యుమ్ను నెట్టులైనం జంపుదు. ఈలోకమునను బరలోకము
నను మేలు గాంచఁ గోరియకదా గృహస్థులు పుత్రులఁ బడయఁ గోరుదురు. శి
ష్యుఁడు పుత్రుఁడు గిరిసన్నిభుండు నగునేను జీవించియుండ నాతండ్రి దురవస్థం
బొందె. అక్కటా! నన్నుఁ గొడుకుఁగాఁ బడసి ద్రోణుఁ డొక్కనీచునిచే సిగఁ బ
ట్టికొనఁబడియె. నాదివ్యాస్త్రములును భుజబలమునుం గాల్పనే? ఇంకనైనం
గడిందిమగంటిమిం బేర్చి పరలోకగతుం డైనజనకునకుఋణముఁ దీర్తును. ఆత్మస్తవం
బార్యునకుఁ గర్తవ్యముగాకుండినను బితృవధకోపంబునంజేసి చెప్పెద వినుము.
యుగాంతరుద్రునిమాడ్కి రౌద్రమునం జెలంగి యేను విక్రమించునెడఁ బాండ
వులును జనార్దనుండును నావిక్రమంబుఁ జూతురుగాక. రథస్థుం డైననన్ను దేవ
దానవగంధర్వోరగరాక్షసు లేరును గెలువఁ జాలరు. నాకంటెను ధనంజయుని
కంటెను నుత్తమాస్త్రవిదుఁ డొండొకఁడు గన్పట్టఁడు. రవి రశ్మిజాలంబు సారిం
చుచందమున నేను దివ్యాస్త్రజాలముల నెడతెగక పఱఁగించెద. మదీయశరము
లు దెసలెల్లం గప్పి పాండవసైనికులను మహామారుతము మ్రాఁకులంబోలెఁ
గూలఁ ద్రోచుట నీవ యెఱుంగుదువు. మఱియు నాయొద్ద నుత్తమాస్త్రం బొం
డు గలదు. దాని నర్జునుండును వాసుదేవుఁడును భీముఁడును గవలును ధర్మరా
జును సాత్యకియు దురాత్ముఁ డయినయాధృష్టద్యుమ్నుఁడును శిఖండియు నెఱుం

గరు. తొల్లి నాతండ్రి వివిధోపహారముల నారాయణు నారాధించిన నద్దేవ
దేవుఁ డయ్యస్త్రరాజం బనుగ్రహించి యీయస్త్రముకలిమిం జేసి సమరమున నీ
కెనవచ్చువాఁడు గలుగఁడు. తోఁచినచోట్లనెల్లఁ బ్రయోగింపరాదు. శత్రుం జం
పక యిది మఱలదు. వీరు వధ్యులు వీ రవధ్యు లనువిభాగంబు లేక యెవ్వారి
నైనను వధియించును. వాహనములు డిగుటయుఁ గైదువులు విడుచుటయు శర
ణుసొచ్చుటయు దీనికిఁ బ్రతివిధానంబులు. ఎట్టికవచములనైన నిది భేదించు నని
పలికి యంతర్హితుండై దివంబునకుఁ జనియె. అన్నారాయణాస్త్రము నాతండ్రి
నా కొసంగె. ఇంద్రుఁ డసురులంబోలె దానఁ బాండవపాంచాలమత్స్యకేకయా
దియోధులఁ బిలుకుమార్చెద. పాండవులపరాక్రమంబు నాముందఱ నిష్ప్రయో
జనంబు. పాపాచారుఁ డైనయప్పాంచాలాధముఁడు నామొన నిలిచి బ్రదికి పోవఁ
జాలఁ డనుటయు మనయోధులు శంఖములఁ బూరించియు భేరుల మ్రోయిం
చియు సింహనాదములఁ గావించియుఁ గయ్యమునకుఁ దొడరుటయు నానినాదం
బును దురంగఖురఖురనిస్వనంబును రథనేమిధ్వానంబునుం బెరసి దిక్తటంబులు
పూరటిల్లం జేసె ననిన నాంబికేయుండు సంజయా, యిట్లు మనవార లశ్వత్థామ
వీర్యమునం జేసి క్రమ్మఱి కయ్యమునకుఁ గడంగినం బాండవు లేమి యాలోచిం
చి రనియడుగ నమ్మానవపతికి సూతసుతుం డిట్లనియె.

### అర్జునుఁ డశ్వత్థామసంరంభము ధర్మజునకుఁ జెప్పుట.

అప్పు డశ్వత్థామసంరంభమునం బుట్టినతుములనినదం బాకర్ణించి ధర్మ
రాజు ధనంజయున కిట్లనియె. అర్జునా, ధృష్టద్యుమ్నునిచే నాచార్యుఁ డింద్రు
నిచే వృత్రుఁ డెట్టు లట్టుల హతుఁడైనం గౌరవులు జయాశ విడిచి యాత్మత్రా
ణతత్పరులై యొకళ్లొకళ్లతోడం జెప్పక తోఁచినట్లు లప్పుడు పఱచిరిగదా. ఇప్పు
డద్దెసం జెవిఁ బెట్టిన సంరంభసముద్రిక్తము లగుపటుసింహనాదములును శంఖా
రవములును హయహేషితంబును గరిబృంహితంబును రథనేమినిస్వనంబునుం
బెరసి వజ్రధరునిభైరవారావముచందమునఁ బరమభీకరంబై ముల్లోకములను
వెగడుపఱుపఁ జాలినతెఱంగున వినంబడుచున్నది. ద్రోణుఁడు దెగినపిదపఁ
గౌరవులకు మేలు సేయ నింద్రుఁ డనికి నడుచుఁగాఁబోలు. విఱిగి పఱచినకురు
సైన్యములఁ గ్రమ్మఱ నెవ్వఁడు గూర్చుకొని వచ్చునోయని యడుగ నతని కర్జునుఁ
డిట్లనియె. రాజేంద్రా, సన్న్యస్తశస్త్రుం డైనగురుఁడు హతుఁడైనం గౌరవులకుఁ
బ్రాపై యెవ్వఁ డేఁక ననికి నడుచు నని సంశయింపవలయునే? ధైర్యధుర్యుండై
యుగ్రకర్మమునకుఁ దొడరునట్టియశ్వత్థామదక్క నెండొకరుఁ డందులకుఁ
జాలునే? అతనిభుజవీర్యము నాశ్రయించి కౌరవులు కడిమి మెఱసి చిందము
లొత్తుచున్నవారు. అతండు పుట్టినపు డాచార్యుండు వేయిమొదవు లుత్తమబ్రా

ష్ఠాణుల కొసంగుటయు మఱియు నవ్వీరుఁడు జనించినతోడన యుచ్చైశ్శ్రవంబు మాడ్కి మహారవంబు చేసిన నశరీరవాణి యశ్వత్థామ యనుపేరు పెట్టుటయు ముల్లోకములు కంపించుటయు నీవును విందువుగదా. తనతండ్రి యనాథునట్ల పోలె ధృష్టద్యుమ్నునిచే సిగఁ బట్టి యీడ్వఁబడియె నని విని యబ్బిరుదుమగండు సైరించునే? ధర్మజ్ఞుఁడవయ్యు నీవు రాజ్యలోభమునం జేసి కపటోపాయమున గురుం జంపించితివి. వాలివధమున శ్రీరామున కెట్టు లట్టుల యిమ్మెడ నీకుఁ బెద్దకాల మపకీర్తి ముల్లోకముల నెఱయుట తప్పదు. నీవు సర్వధర్మోపపన్నుఁడ వనియుఁ బ్రియశిష్యుఁడవనియు సత్యవచనుఁడవనియు నమ్మి యున్నరూ పెఱుంగ ని న్నడిగిన నీవు ధర్మముఁ బరికింపక కుంజరవ్యాజమున నశ్వత్థామ మడిసె నని పలికితివి. నీమాట నమ్మి యయ్యాచార్యుఁడు పుత్రశోకవ్యాకులత్వమున నస్త్రముల విడిచి యహంతామమతావిరహితుండై మేను సాలించె. నీమాట విన్నప్పు డమ్మ హాత్ముఁ డెట్టులు వగం గుందుటయుఁ దదీయముఖవికారమున నెఱింగితివిగదా. ఓపుదురేని నీవును నీయమాత్యులును ధృష్టద్యుమ్నుం గాచికొనుఁడు. ఆచార్య పుత్రునిబారిం బడినపాంచాలకుమారుం గాచుట మన కెంతయు నశక్యంబు. సర్వభూతములయెడ సౌహార్దము నెఱపునమానుషచరిత్రుఁ దనతండ్రిం బరిభవిం చినమనలం గాల్పక శారద్వతీసుతుం డూరకుండునే? నేను వలదువల దనివారిం చినను వినక నిజధర్మము విడిచి శిష్యుఁడు గురుని వధియించె. మన కిప్పటికిఁ బెక్కేఁడులు గడచె. ఇఁకఁ గలయాయుఃపరిమాణ మించుకయకాని యధికము గాదు. ఇంతకాలము పరమధార్మికు లనువిఖ్యాతిం బ్రదికి యిపు డీవికారములకుఁ బాత్రత్వ మొందితిమి. ప్రేమాతిశయమునను ధర్మమునను దండ్రికి సాటివచ్చు గురుఁడు రాజ్యకారణమున వధింపఁబడియె. అమ్మహానుభావునియెడ గౌరవమైనం దలంపక కీడు చేసితివి. భీష్మద్రోణులయెడఁ గలుగుగౌరవముననకాదె ధృతరా ష్ట్రుఁడు రాజ్యమెల్లను గొడుకులను వారి కప్పగించి సత్కరించె. పలుదెఱంగుల వారు ద న్నాదరించుచున్నను నయ్యాచార్యుఁడు పుత్రునికంటె నెక్కుడుగా నన్నుఁ బ్రేమమునఁ జూచును. అస్త్రసన్న్యాసము సల్పకుండునేని యగ్గురుం గెలువ సురేంద్రుఁడు నోపఁడు. లఘువృత్తులమై మనము గురునకు ద్రోహముఁ జేసి తిమి. ఇంతకంటెఁ బాతకము క్రూరము నగుకర్మమొండు గలుగునే? నామీఁది భక్తిం జేసి యర్జునుండు తండ్రుల నన్నదమ్ములఁ గొడుకులను భార్యలను బ్రాణముల నైనను విడుచు నని నమ్మి యందఱకుం జెప్పుచుండినయాచార్యునకు మీరు గీడు రో యునెడ నే నుపేక్షించితి. అప్పాపమునఁ దలక్రిందై నరకమునఁ బడుదుఁగాఁబోలు. బ్రాహ్మణుఁడు వృద్ధుఁ డాచార్యుఁడు సన్న్యస్తశస్త్రుఁడు మహనీయుఁడు నగుద్రో ణుని రాజ్యార్థము చంపించి బ్రదుకుటకంటెఁ జావుమే లని యర్జునుఁడు దీనాన

నుండై పలికిన నచ్చటివారు ప్రియాప్రియములు పలుకక మిన్నకుండిరి.

భీముఁ డర్జునునకు సమాధానము చెప్పుట.

అట్టియెడ భీముఁడు ధనంజయుం దూఱువాఁడై యిట్లనియె. అర్జునా, దండముఁ బరిత్యజించి వ్రతనిష్ఠం బూని యరణ్యగతుఁ డైనమునియట్లు ధర్మములు పల్కెదవు. క్షతత్రాణమునను స్త్రీసాధులయెడ క్షమవలనను క్షత్రియుఁడు సార్థకనామధేయుండై క్షితిని గీర్తిని సంపదనుం బొందును. నీ వుత్తమక్షత్రియకులమునం బుట్టి సకలసుగుణములఁ జాలియుఁ దెలియనివానియట్టులు పల్కెద విది పోలదు. పరాక్రమమున నింద్రుఁడుదక్క లాఁతులు నీకు సాటి గారు. సాగరము వేలనుబోలె నీవు ధర్మము నతిక్రమింపవు. అమర్షము స్మరింపక పదుమూఁడేఁడులు ధర్మముఁ బ్రతిపాలించుచుండిన నిన్నుఁ గొనియాడనివారు గలుగుదురే? భాగ్యమున నీబుద్ధి స్వధర్మమునఁ బరినిష్ఠితంబై యుండు. ధర్మప్రవృత్తుండై నధర్మరాజురాజ్య మధర్మమున నపహరించుటయు ద్రౌపదిని సభకు రప్పించి భంగపెట్టుటయు నారచీరలతోడ మనల నడవులకుఁ బనుచుటయు మున్నగునమర్షస్థానములనెల్ల ధర్మతాత్పర్యమున నోర్చితివి. ఇప్పుడు నయ్యధర్మము హరించుటకై యధర్మపరు లయినక్షుద్రులఁ దెగటార్పఁగ మనము గడంగుటయు శక్తికొలఁది నేను బోరి శాత్రవులఁ జంపుదు నని నీయిచ్చినబాసయుఁ దలంపునకుఁ దెచ్చికొనుము. ఇప్పు డేల మ మ్మిట్లు తూలనాడెదవు? వ్రణమున నుప్పు పెట్టినట్లు భయగ్రస్తము లగుమామనముల నిట్లు పొడువ నీకుఁ జనునే? ధార్మికవరుఁడవయ్యు నధర్మ మించుక పరికింపవైతివి. ప్రశస్యులను నప్రశస్యులను నరయవైతివి. సకలలోకనాథుఁ డైనవాసుదేవుఁ డుండఁగ నశ్వత్థామను బొగడఁ దగునే? గురుతనయుఁ డజ్జగన్నాథునకుఁ బదునాఱవపాలేనియుఁ గానేర్చునే? తనదోషములఁ దాన యుగ్గడించుచు నేల సిగ్గుపడవు. ఏ నలిగినం బుడమిఁ బగిలింతు. కొండల విసరివైతు. గద యెత్తికొని నే ననికి నడిచిన సురాసురాదులనైనం దఱుముదు. ఇట్టియన్న నీకుఁ గలఁ డనియెఱుంగు దేని ద్రోణపుత్రు నంత పొగడవు. నీ వెల్ల వేని యూరకుండుము. నరసింహుఁడు హిరణ్యకశిపుంబోలె నే నొక్కండన యాచార్యపుత్రుం దెగటార్చెద నని పలుకుచున్నంత ధృష్టద్యుమ్నుఁడు పార్థున కిట్లనియె.

బ్రాహ్మణులకు యజనయాజనాధ్యయనాధ్యాపనదానప్రతిగ్రహంబు లెట్టు లట్టుల క్షత్రియులకు శత్రువధంబు విహితకర్మంబు. స్వధర్మము విడిచి క్షత్రధర్మము వట్టి పోరికిఁ దొడంగినద్రోణుం జంపినందుల కేల నన్ను దూఱెదవు? మఱియు నతండు శస్త్రాస్త్రముల నెఱుంగనిప్రాకృతులం బ్రహ్మాస్త్రమునఁ జంపుచుండిన నూరకుండవచ్చునే? అతని కది క్షుద్రంబుగాదె? నిజధర్మముఁ ద్యజిం

చుటయకాక సమరధర్మమైనం బరికింపక మాయావి వైనయాబ్రాహ్మణబ్రువుం
జంపిన నాత ప్పెయ్యది? అందుల కలిగి ద్రోణపుత్రుం డార్చిన మన కేమి కొఱంత
వచ్చు. అతం డడిబీరమునఁ గౌరవులఁ బురికొల్పికొని క్రమ్మఱి వచ్చి వారిఁ గాచి
కొనఁ జాలక చంపించికొనిన మనకు మేల యగు. మఱియు నీవు ధార్మికుఁడవ
య్యు నన్ను గురుఘాతి యని తూలనాడెదవు. ఏను దద్వధార్థంబ యగ్నికుండము
నఁ బొడముటం జేసి నా కది పాతకంబు గాదు. ధర్మధ్వజుం డై నయమ్మాయా
విని మాయోపాయమునఁ జావవలయుఁగాని యొండు గాదు. కార్యాకార్యము
లెఱుంగక పోరుటం జేసి యతండు బ్రాహ్మణుఁడనియు క్షత్రియుఁడనియుం జెప్ప
వలను గాదు. క్రూరశత్రుం డైన ద్రోణునికంఠము విక్రమించి నేను దునిమినం
బొగడక దూఱుట నీకుఁ దగు ననితోఁచెనే? వెండియు నతం డెల్లపుడు మావా
రలనే యేఱియేఱి చంపుటం జేసి నాకుఁ గోపం బెక్కు డగుడుఁ దలఁ దఱిగియుఁ
దనివిఁ బొందనయ్యెద. నీవు జయద్రథుతల నెట్ల ట్లాతనితల నిషాదదేశమునం
బడ వైవమికి నామనం బెరియుచున్నది. నీతలంచుచందమున శత్రువధం బె క్షత్రి
యుల కధర్మంబయిన నింక ధర్మం బెయ్యది? పోరఁ జంపుటయుఁ జచ్చుటయుం
గదా క్షత్రియకులోద్భవున కెత్తినధర్మము. గురుం జంపు టన్యాయ మంటివి.
పోర గురులని తండ్రులని చెలులని చుట్టలని రాజులు చూతురే? పితృసఖుం డై
నభగదత్తునిఁ బితామహుఁ డైనభీష్ముని నీవు దెగఁజూడవే? అట్లే యేనును బగ
తుం బరిమార్చిన నేల ధర్మ మరయవు. ఇంక నిట్లు నన్ను దూఱవలదు. తనకుఁ
దాన పరుండి నిజగాత్రమున సోపానములు గల్పించు నేనుఁగు తెఱంగున భవదీ
యక్రూరవచనములనెల్లను ద్రౌపదికిని దత్పుత్రులకునుంగా నోర్చితి. ఆచార్యు
నకును మాకును వైరంబు కులక్రమాగతం బని సకలలోకములును మీరును
నెఱుంగుదురు. అజాతశత్రుఁ డసత్యవాది గాఁడు. నేను నధార్మికుఁడను గాను.
శిష్యద్రోహి యగుగురుఁడు దెగటారె. పోరికి నడిచి జయింపు మనియె ననిన
విని యాంబికేయుండు సకలవేదములు సాంగముగ నేర్చి లోకోత్తరుఁ డనం బేరు
గాంచినగురు నాధృష్టద్యుమ్నుఁడు చంపి యట్లు పలికిన నందఱును విని యూర
కుండిరే? తెలియఁ జెప్పు మని సంజయు నడిగిన నతం డతని కిట్లనియె.

### ధృష్టద్యుమ్నసాత్యకు లొండొరుల నిందించికొనుట.

అట్లు ధృష్టద్యుమ్నుండు పలికిన విని యర్జునుం డతని దెసం గ్రోధరూక్ష
కుటిలంబుగఁ గటాక్షించి కన్నీరు జాలువాఱ నిట్టూర్పు నిగిడించి యెంతయు నిం
దించిన యుధిష్ఠిరభీమసేననకులసహదేవవాసుదేవులు లజ్జితులై ఖిన్నులుండుటయు
సాత్యకి నీచములు వలుకుచున్న యిన్నరాధముని వధించువాఁ డెవ్వఁడును గలు
గఁడయ్యెఁగా యనిపలుకుచు నాధృష్టద్యుమ్నున కిట్లనియె. నీపాపకర్మమున కీపాండ

వులు శ్వపాకుని బ్రాహ్మణు లెట్టు లట్టులు నిన్ను నిందించుచున్నవారు. పాప
మొనర్చి సాధువులనిందకుఁ బాత్రుఁడవయ్యు యుద్ధధరణి నిట్లు పలుక నీకు సిగ్గు
లేదె? నీనాలుకయుఁ దలయు వ్రయ్యలు గావయ్యె. గురు నధర్మమున వధించు
టయకాక మఱి దూఱెదవు. నరకమునం బడియెదవు. నిన్ను నీవ పొగడికొందు
వుగాని పాండవయదువృష్ణిభోజాంధకు లెంతయుం దూలనాడుదురు. నీవు వధ్యుఁ
డవు. నీవు లేకుండినం గొఱంత లేదు. నీవు సచ్చుటయ మేలు. నీవు దక్క లాఁ
తి యెట్టిపురుషాధముఁడైనను ధర్మపరుఁడై నగురుని సిగఁ బట్టి యీడ్చునే? కుల
పాంసనుఁడై ననీవు పుట్టుటకతనఁ గులమున ముందఱ నేడ్వురు వెనుక నేడ్వురు
కీర్తికిఁ బాసి యధోగతు లగుదురు. మఱియు నర్జునుతో నీవు భీష్ముని వధింపవే
యనిపలికితి. అప్పనియు నీసోదరుఁ డగుశిఖండియే యొనరించినవాఁడు. ఇట్టిపాప
ములకుఁ బాంచాలురు దక్క లాఁతు లొడంబడుదురే? నీతండ్రి భీష్మవధార్థంబు
వానిం గని పెంచినవాఁడు. పాంచాలురు ధర్మభ్రష్టులు క్షుద్రులు మిత్రద్రో
హులు గురుద్రోహులు ననుట దెల్లం బయ్యె. ఇంక నిట్లు ప్రేలుదేని వజ్రక
ల్పం బయినగదాదండమునఁ దలఁ బగుల నడిచెద. బ్రహ్మఘాతకుఁడై ననిన్నుఁ
జూచి జనులు ప్రాయశ్చిత్తార్థము తోన సూర్యుం గాంతురు. ఓరీదుర్వృత్తా,
నాగురునియెదుర నతనిగురుని వధించి తోఁచినట్లు ప్రేలుచు సిగ్గుపడవు. నిలుని
లుము. నాగదయేటు సైరింపుము. భవద్గదాప్రహారముల నెన్నియైన నే నోర్చెద
ననుటయు ధృష్టద్యుమ్నుఁడు క్రోధభరితుండయ్యు నగుచు సాత్యకి కిట్లనియె. సా
త్యకీ, విందురు సైరింతు రని యనార్యుఁడు సాధువుల నధిక్షేపించు. లోకప్రశ
స్తం బయినక్షమను బాపాత్ముఁడు పడయఁ జాలఁడు. పాపాత్ముఁడు క్షమావంతుం
జూచి యితని నే గెలిచితి నని తనలోఁ దలంచు. దానం జేసి క్షుద్రసమాచా
రుఁడు నీచాత్ముఁడు పాపనిశ్చయుఁడు నగునిన్నుఁ గాలిగోరుమొదలు తలవెండ్రు
కలదాఁకఁ దిట్టినం దోషంబు లేదు. ఇతరుఁడు భుజము నఱుకఁగఁ బ్రాయోప
విష్టుం డైనభూరిశ్రవుని నెందఱు వారించినను వినక తలఁ దఱుగుటకంటెఁ బా
పంబు గలుగునే? వ్యూహ మమర్చి దివ్యాస్త్రము లడరించి యస్త్రములఁ జాలిం
చినద్రోణుని నేను వధించినం గ్రూరం బెయ్యదియో యెఱుంగరాదు. నిన్న భూ
రిశ్రవుఁడు నిన్ను నేలఁ బడఁ ద్రోచి కాలఁ దన్ని మీఁది కెక్కినపుడు నీమగఁటి
మెక్కడఁ బోయె. పో రుడిగి మరణకృతనిశ్చయుఁడై నపుడేకదా యాసోమద
త్తతనయుం జంపిననీవును లాఁతులగుణదోషములఁ బరిశీలించునంతవాఁడవే? పా
ర్థనిర్జితుం జంపిననీకు మగఁటిమి యెక్కడిది? చండాలునట్లు నీచకృత్యము నిన్నఁ
జేసి నేఁడు న న్నన నీ కెట్లు నోరు గలిగె? ఓరీవృష్ణికులాధమా, సకలపాపంబు
లకు నీవు కర్తవు నివాసంబవు. ఇంక నిట్లు క్రిందుమీఁదుగఁ బలుకవలదు. మొఱ

కుందనమునఁ బలుకు దేని శితశరముల యమపురికిఁ బంపెద. మూర్ఖా, కేవలధ ర్మమునసే కార్యములు దీఱవు. కౌరవులయధర్మచేష్టితములం జెప్పెద వినుము. యుధిష్ఠిరునిరాజ్యమును సర్వస్వమును హరించిరి. సభలో ద్రౌపదిని భంగపెట్టిరి. పాండవులను ద్రౌపదీసహితంబుగా నడవులకుఁ బంపిరి. లాఁతులకుఁ దోడుపడ వచ్చుచున్నమద్రరాజును గపటమునం దామ గ్రహించిరి. పలువురు చుట్టుము ట్టి తగ దనక సౌభద్రుం జంపిరి. ఇక్కడను భీష్మవధం బధర్మకృత్యంబ. నీవు భూరిశ్రవు నధర్మమున వధించితివి. ఇట్లు వీరును వారును ధర్మజ్ఞులయ్యు జయా ర్థులై యించుక యధర్మము నెనర్చిరిగాని యొండు గాదు. ధర్మాధర్మములు దుర్వి జ్ఞేయంబులు. అంతయు నెఱుంగుదు నని పలుకవలదు. కౌరవులతోడఁ బోరి చా వక గెలువు మని బహువిధములం దూఱిన నప్పలుకులకుఁ బదాహతపన్నగం బుకైవడిఁ గ్రోధదీపితుండై సత్యకసుతుండు విల్లవలఁ బెట్టి గద గొని రయ మున రథావతీర్ణుండై నిన్ను మాటలం గాదు ప్రేటుల శిక్షించెద ననిపలుకుచు ధృష్టద్యుమ్నుపయిం గవియునవసరంబున వాసుదేవుఁడు పనుప భీమసేనుఁడు తోడన తేరు డిగ్గి రయమునం బఱచి యెయిది సాత్యకిభుజములం బట్టి యాఱ డుగులకొలంది వెంటఁ జని బలమున నిలువం బట్టె. అట్టియెడ సహదేవుఁడు వే గ యరదము డిగి మధురసాంత్వనవచనముల నిట్లనియె, సాత్యకీ, యంధకవృష్ణి పాంచాలురకుఁ గడిచినమిత్రులు మాకును మాకంటెఁ గూర్చుసుహృదు లంధక వృష్ణిపాంచాలురకునుఁ బాండవయాదవులకు మిగిలినసఖులు పాంచాలురకును స ముద్రవేలావలయితం బైనభూమండలమున వెదకినను లేమి నీకు నేఁ దెలుపవ లయునే? సర్వధర్మవిదుఁడైననీవు మిత్రధర్మముఁ దలపోసి ధృష్టద్యుమ్నుమీఁ దికోపము డిగ్గఁ ద్రావి శాంతిఁ బొందుము. పార్షతునితప్పు నీవును నీతప్పు నప్పా ర్షతుండును సైరించుట కర్తవ్యంబు. శాంతికిఁ గడచినశ్రేయ మొండొక్కటిగన్న ట్టదని సహదేవుఁడు శైనేయునకు శాంతివచనము లెఱింగించుచుండ నప్పాంచాల రాజకుమారుండు భీముని కిట్లనియె. అయ్యా, శైనేయుని విడువుము విడువుము. వాయువు ధరాధరంబునుంబోలె న న్నితండు దాఁకుఁగాక. శితశరముల నితని సంరంభము సమరశ్రద్ధను జీవితంబును హరించెద. వారె కౌరవవీరులు తఱిమి కొనివచ్చుచున్నవారు. పెద్దయుఁ గార్య మాసన్న మయ్యె నింకఁ దడవు సేయ రాదు. అంతలో నితనిం బొరివుత్తును. కాదేని గాండీవి వారల మార్కొని పోరు వాఁడు. ఇంతలో నితనిం జక్కఁబెట్టి నేనుం బదపడి కౌరవులపయి నడరుదు. ఈదురాత్ముఁడు నన్ను ధనంజయచ్ఛిన్నబాహుఁ డగుభూరిశ్రవునిఁగాఁ దలఁచిన వాఁడు. విడువుము. నేను వీనినెండె వీఁడు నన్నెండె వధించుట కార్యం బనిపల్కి న రోషరూషితుండై శైనేయుండు భీమునిభుజమధ్యమునం జిక్కి రానేరక యి

టునటుం గదలుచుఁ గ్రూరపన్నగంబుచాడ్పున రోఁజుచున్నంత వాసు దేవుఁడును ధర్మరాజును బరమరయమునం జని యత్యంతప్రయత్నమున నయ్యిద్దఱకు సమాధానంబుఁ గావించిన శాంతులై సాత్యకిధృష్టద్యుమ్నులు మనవారితోడఁ బోరికిఁ గడంగిరి.

## అశ్వత్థామ నారాయణాస్త్రిముఁ బ్రియోగించుట.

అంత నశ్వత్థామ యుగవిగమసమయరుద్రుమాడ్కి రౌద్రమున మెఱసి నీకొడుకునకు నిజప్రతిజ్ఞనుఁ గ్రమ్మఱఁ దెల్పి యేను బాండవపాంచాలాదులఁ దఱిమి వధించెద సేనల మఱల్పు మనిన సుయోధనుం డట్ల చేయుటయు నయ్యాచార్యసూనుఁడు సింహనాదబంధురముగ నడరిన శంఖారవములు భేరీభాంకారములు నెసంగుటయు నానినాదంబు సాగరంబుఁ ద్రచ్చునప్పటియులివున కెనయై దిశాతటములు బీఁటలువాఱించె. అట్లు కౌరవులు క్రమ్మఱఁ గయ్యమునకు నడిచినం బాండవులును ద్రోణవధమున జయముఁ గొన్నవారు గావునఁ బరమసంరంభమునం బొదలి తాఁకిరి. అప్పు డశ్వత్థామ ధ్వజద్రుమము శస్త్రశిఖరము హతనాగమహాశిలము హయకింపురుషాకీర్ణము శరాసనలతావృతము బకక్రవ్యాదసంక్షుబ్ధము భూతపక్షిగణాకులము నగు దేహపర్వతగణమును నిశితశరముల నించి యనృతవాది యైనయారాజు సూడఁ దదీయులం దెగటార్చెద నని క్రోధరూక్షముగఁ బలికి తోడన యాచమించి శుచియై నియతచిత్తుండై పాండవపాంచాలురపయి మహాఘోరం బైనయన్నారాయణాస్త్రముఁ బ్రయోగించె. ప్రయోగించినంతన విషమవాతము విసరె. ధరణి కంపించె. సముద్రములు కలంగె. సాగరగామిను లగుమహానదు లెదురెక్కె. గిరిశిఖరములు వ్రయ్య లయ్యె. మృగములు పాండవుల కపసవ్యములై తిరిగె. చీఁకట్లు గ్రమ్మె. సూర్యుఁడు తేజముఁ దఱిఁగె. క్రవ్యాదభూతము లుబ్బునం బొంగె. దేవదానవాదులు సాధ్వసంబుఁ జెందిరి. రాజు లందఱు వెఱచి ఱిచ్చవడిరి. అట్లు లమ్మహనీయాస్త్రం బేసినం బన్నగాకారంబు లయిన దీప్తాగ్రమార్గణంబులును గదాచక్రప్రముఖము లగునానాసాధనములు నుం బొడమి నేలయు నింగియుం గప్పి తరణికిరణంబులట్టు లంతట నెఱయ విన్నఁ బోయియుఁ బాండవులు క్షాత్రధర్మముఁ బట్టి పోరికిఁ దొడంగిన నయ్యస్త్రరాజమంతంతకు నెంతయుఁ బెరిఁగినం గార్చిచ్చు పొదివినకాననంబు చందంబునఁ దనసేనలు నీఱగుచుండ ధర్మరాజు భయార్దితుండై దిక్కు దోఁపక సేనలు పఱచుటయు నర్జునుండు మధ్యస్థుఁడై యునికియుం జూచి యిట్లనియె. ధృష్టద్యుమ్నా, నీవు పాంచాలసేనలతో నెటకైనం బొఱుము. సాత్యకీ, నీవును వృష్ణ్యంధకపరివృతుండవై యరుగుము. తక్కినవారలును దమకుఁ దమకుఁ బోలినతెఱంగునఁ బోవచ్చును. ధర్మాత్ముఁ డైనవాసు దేవుఁడు తన కుచిత మగుదానిం జేయువాఁడు.

లోకములకు హిత ముపదేశింప నేర్చినయమ్మహాత్ముఁ డాత్మహిత మెఱుఁగఁడె? సర్వసైన్యములకుఁ దెలియం జెప్పెద నింక సంగ్రామంబు వలదు. నేను దమ్ముల తోడ ననలంబు సొచ్చెద. భీకరదుస్తరం బైనభీష్మద్రోణార్ణవంబు నిస్తరించి గోష్పదమాత్రం బైనద్రౌణిసలిలమున మునిఁగెద. దుర్యోధనుఁడు తనకోర్కిని బడయుఁగాక. సాధువృత్తుఁ డైనయాచార్యునిఁ జంపించితి. అతండకదా యుద్ధతత్త్వముల లెస్స యెఱుంగనిబాలుని సౌభద్రుని సమర్థు లగుపెక్కండ్రముందఱఁ ద్రోచి చంపించెఁగాని కావఁడయ్యె. పాంచాలి యాసభలోఁ దనదాస్యముఁ దొలఁగించికొనఁగ ధర్మసందేహమునఁ బ్రశ్నము చేసినఁ దాను గొడుకు నేమియుం బలుకక యొప్పరికించిరి. దుర్యోధనుఁడు పెఱవారు డయ్యెఁగ నర్జునుఁ దాను జంపఁగడంగిన సైంధవరక్షాపరుండై యభేద్యకవచంబు నొసంగె. నాగెలుపునకుఁ గడఁగుపాంచాలవీరుల సత్యజిత్ప్రముఖుల దివ్యాస్త్రములఁ దెగఁజూచె. ధార్తరాష్ట్రు లధర్మమున మ మ్మడవులకుఁ బంపునెడ నూరకుండెఁగాని వలదని వారింపఁడయ్యె. ఇట్లు మాయెడ సౌహార్దముల నెఱపె. అట్టిగురుఁడు హతుఁ డయ్యె. కావున నేను నావారలు నస్త్రిమరణముఁ బొందుదు మనుచున్నంత నారాయణుండు రయమునఁ జేతులు మీఁదికెత్తి సేనల వారించుచు నిట్లనియె.

అందఱును శీఘ్రముగఁ గైదువుల విడువుఁడు. వాహనంబుల డిగుఁడు. ఇది యీయస్త్రిమునకుఁ బ్రతివిధానంబు. నిరాయుధులు భూమిగతులు నగువారల నిది వధింపదు. పోరుచునే యుండెన నియ్యస్త్రిరాజ మంతకంతకుఁ బెచ్చువెరిఁగి నిశ్శేషముగ నీఱుసేయకమానదు. అట్లయినం గౌరవులు బలవత్తరు లగుదురు. మనస్సుననైనం దీని నెదిరింపరాదు. ఎదిరించినం బాతాళమునకుఁ బోయినను వదలక వధించు నని మురారి సెప్పినం గైదువుల నిడువ సైనికులు దలంచుచున్నంత భీముఁడు వారి కిట్లనియె. ఆయుధములు విడువవలదు. వాహనములు డిగవలదు. తీవ్రాశుగములను సముదగ్రగదాదండమునను విక్రమించి యేను ద్రౌణియస్త్రిము రూపుమాపెద. సూర్యునకు సరివచ్చువెలుఁగు గలుగనియట్లు నాకు సరివచ్చువిక్రమవంతుఁడు గలుగఁడు. హిమవత్పర్వతమునైనం గూల్పఁజాలిన యేనుంగుతొండములం బోలునాబాహుదండములం జూడుఁడు. నాగాయుతబలుం డైననేను సురేంద్రుఁడు సురలలో నెట్టు లట్టుల మనుష్యులలో విఖ్యాతుఁడను. నాభుజవీర్యముఁ జూడుఁడు. నారాయణాస్త్రం బెదిరింపఁ దగదేని యశ్వత్థామనుఁ దాఁకి పోరుదు. అర్జున, యర్జునా, గాండివం బవలఁ బెట్టవలదు. చంద్రునకుఁ గళంక మెట్టు లట్టుల యది నీయశస్సునకుఁ గొఱంతఁ గావించు ననుటయుఁ బార్థుఁ డతని కిట్లనియె. నారాయణాస్త్రిమునెడను గోవులయెడను బ్రాహ్మణులయెడను గాండివం బెత్త నని నావ్రతం బనవుడు భీముఁడు

సూర్యప్రభ మగురథమున నతిరయమునం జని యయ్యశ్వత్థామను దాఁకి శరజాలము నిగుడించుటయు నయ్యాచార్యపుత్త్రుండు నవ్వి యన్నారాయణాస్త్రంబును మిక్కిలి నిగిడింపఁజేసినం గాడ్పు తోడ్పడం బెరుఁగుచిచ్చుకై వడి నయ్యస్త్రము ప్రబలంబై బంగారుమిడుఁగుఱుల తెఱంగునఁ బొలుచుమములుకుల నొప్పువాఁడితూపులగములై తోఁచి భీము నాక్రమించుటయు దినాంతమున ఖద్యోతగణపరివృతం బగు మహీరుహంబుచందమున దర్శనీయుం డై నభీముం జూచి యమ్మహాస్త్రము నకు వెఱచి పాండవసైనికులు వాసుదేవవచనప్రకారంబున వాహనంబులు డిగికై దువులు నేలం బెట్టుటయు నాఘోరసాధనంబు తేజోదుర్ధర్షంబై భీముం జుట్టుముట్టిన నందఱును సాధ్వసావిష్టులై హాహాకారము లొనర్చిరి. అట్లు పరమాస్త్రసంవృతుం డై నభీముపయిం దేజగ్రప్రతిఘాతార్థంబు గాండీవి వారుణాస్త్రం బేసె.

నారాయణాస్త్రపీడితుఁ డగుభీముని గృష్ణార్జునులు రథము డిగ్గఁజేయుట.

అంత మఱియు నంతంతకుం బెరిఁగి నారాయణాస్త్రంబు ఘోరజ్వాలాభీలంబై బహుళసాయకాకారంబై భీము నావరించిన నతండు సూర్యమండలముఁ జొచ్చినయగ్నికై వడిని నగ్నిలోనం బడినసూర్యునివిధమునను లయసమయరుద్రునాస్యముఁ జొచ్చునగ్నిచందమునను నొప్పి రథహయసూతకేతనసహితముగా నప్పరమాస్త్రమునఁ బరీతుండై యుండ ద్రోణికి మాఱుమలయువారు లేమియు యుధిష్ఠిరప్రముఖులు విముఖు లగుటయుం జూచి కృష్ణార్జునులు నిరాయుధులై తటాలున రథావతీర్ణులై రయమునం బఱచి వారుణాస్త్రప్రయోగమునను నిజమహిమమునను బెద్దయుఁ గాలనిభీమునరదము డాయం జని నారాయణాస్త్రశాంత్యర్థము సర్వాయుధములతోడ నావృకోదరుని నేలకు డిగు మని యొడ్చుచుండ నతండు రాక బిగిసిన నత్యంతదుర్జయం బై నయయ్యస్త్రము ఘోరాకారమై పెరుఁగుటయు జనార్దనుఁడు భీమున కిట్లనియె, భీమసేనా, యిది యేమి మే మెంత వారించినను గయ్యు ముడుగవు. పోర గెలువ నగునేని మే మిట్లు లూరకుండుదుమే? మే మందఱమును దేరులు డిగ్గి నిరాయుధులమై యుండ నీ వేల డిగ ననియెదవు? ఇంకనై నను డిగు మనిపలుకుచుఁ గ్రూరపన్నగంబుచాడ్పున రోఁజుచున్నయా భీముని బలంబుకొలఁది పట్టి నేల కీడ్చి యాయుధము లవలం బెట్టించిన నప్పరమాస్త్రము ప్రశాంత మయ్యె. దుస్సహం బై నయయ్యస్త్రతేజము శాంతిఁ బొందినం దెసలు ప్రసన్నంబు లయ్యె. లలితమారుతములు వీచె. మృగపక్షులు ప్రశాంతము లయ్యె. వాహనము లుల్లసిల్లె. యోధులు సంతసిల్లిరి. చీఁకటు లడంగె. భీముఁడు బాలసూర్యునిమాడ్కిఁ దేజరిల్లె. అవ్విధమున నయ్యస్త్రరాజము శాంతిఁ బొందినం బాండవయోధు లాయోధనమునకు సన్నద్ధులైనం జూచి దుర్యోధనుఁ డశ్వత్థామం బిలిచి చూచితే యరాతులు క్రమ్మఱఁ బోరికిఁ గట్టాయితంబై యున్న

వాఁడు. ఇం కొకతూఁపి యమ్మహాస్త్రము ప్రయోగింపు మనుడు నాచార్యపుత్త్రుఁ డతిదీనముగ నిశ్శ్వసించి యయ్యా, యియ్యస్త్రము సకృత్ప్రయోగార్హంబ కాని రెండుమాఱులు ప్రయోగింపరాదు. ప్రయోగించినం బ్రయోక్తనే వధించు నని యయ్యస్త్ర మిచ్చునప్పుడు నారాయణుండు మాతండ్రికిఁ దెల్పినవాఁడు. సమర మున నోడుటయుఁ జచ్చుటయు నొక్కరూప కావునఁ బరాజితు లయినమనశా త్రవులు మృతోపము లని యూఱడిల్లు మనిన దుర్యోధనుఁడు మఱియు నతనిం జూచి గురుపుత్త్రా, యిది యిట్లగు నేని యితరదివ్యాస్త్రముల నాగురుఘాతకుల వధియింపుము. త్ర్యంబకునందును నీయందును దివ్యాస్త్రములు పెక్కులు గలవు. నీ వలిగిన దేవేంద్రుఁడైనఁ దప్పించికొని పోవఁ జాలఁ డనియె ననిన ధృతరాష్ట్రుఁ డు సంజయా, యట్లు దుర్యోధనచోదితుండై యశ్వత్థామ యాయితంబై యున్న పాండవుల నేమి చేసె నని యడుగ సంజయుం డతని కిట్లనియె.

### అశ్వత్థామ పాండవవీరులపై నడరుట.

అట్లు నారాయణాస్త్రము కృష్ణునియుపాయమున శాంత మగుటయుఁ బి తృవధశోకక్రోధభరితుండై యశ్వత్థామ సింహలాంగూలకేతనాభిరామముగా ధృష్టద్యుమ్నునిపయిం గవిసి యిరువదియేను కుప్పెకోల లడరించినం గినిసి య ప్పాంచాలవరుండు జ్వలత్పావకప్రకాశుం డై నయ్యాద్రోణనందనుపై నఱువది బాణములనుఁ దత్సారథిపై నిరువదిశరములను గుఱ్ఱములపై నాలుగుతూపుల ను నేసి నొంచి యార్చి పేర్చి శరవర్షముఁ గురిసినం గ్రోధసముద్దీప్తుండై యా చార్యపుత్త్రుండు బలుతూపు లతనిపై నేసి రెండుభల్లములఁ గేతనకార్ముకములఁ దునిమి మఱియుం గాండజాలమునఁ దదీయరథరథ్యములను దుమురుసేసి సార థిని నొంచి తదనుచరులం గాండగణపరీతులం గావించినం బాంచాలసైనికులు ద్రౌణిశరపీడితులై దైన్యమును దత్తఱపాటును గదురఁ విఱిగిపఱచిరి. అప్పుడు సాత్యకియు నయ్యశ్వత్థామను దాఁకి యెనిమిదిశరములను నిరువదితూపులను న తనిపై నేసి నాలుగింట గుఱ్ఱములను నొక్కతీవ్రాశుగమున సారథిని నొప్పించి కేత నకోదండములం దునిమి పటుశరాసారమునఁ దేరు నుగ్గుచేసినం జెయ్వులు దక్కి యశ్వత్థామ సోలుటయుఁ గృపకర్ణకృతవర్మదుర్యోధనదుశ్శాసనవృషసేను ల య్యాచార్యసుతుం దలకడచి సాత్యకిం దాఁకి క్రమమున మూఁడమ్ములను నేఁబదితూ పులను దశవిశిఖంబులను వింశతిశరములను సాయకశతంబును సప్తమార్గణంబు లనుం గుప్పించిన నయ్యదువీరుం డందఱ కన్నిరూపులై పటుప్రదరనికరములఁ బరఁ గించి వెగటుపఱచె. అప్పటికి మూర్ఛదేఱి యశ్వత్థామ చింతాశోకవ్యాకులుండై సారెకు నిట్టూర్పులు నిగిడించి యొండుతేరెక్కి సాత్యకిపై శరశతము లడరించిన నమ్మాధవానుజుం డగ్గలిక మెఱయ నగ్గురునందనుపై నడరి త్రీవాశుగములఁ గురిసి

క్రమ్మఱ విరథుం గావించి వెగడుపఱచుటయు సాత్యకివిక్రమంబుఁ జూచి పాండ
వయోధులు సింహనాదములను శంఖారవములను నొనరించిరి. అట్లు సాత్యకి గం
డడరి వృషసేనపై నిరులఁ ద్రిసహస్రమహారథులనుఁ గృపునిపదివేలయేనుంగులను
సౌబలునియేఁబదివేలగుఱ్ఱములనుం జంపి నిర్వక్రవిక్రమాటోపమున దీపించుట
యుం గోపించి యాచార్యసూనుం డొండొకతే రెక్కి సాత్యకిం జంపఁగ నెంచి
వాఁడితూపుల నిగిడించి తదీయబాణవిద్ధుఁడై నగుచు నాసాత్యకి కిట్లనియె. శై
నేయా, గురుఘాతకుఁ డైనయప్పాంచాలునిమీఁద నీకుఁ గలయనుగ్రహ మే
నెఱుంగుదు. ఏను ముట్టినవాని నీవు గావఁ జాలవు. తపస్సత్యములయాన నేను
బాంచాలుర నందఱఁ జంపక శాంతిఁ బొందను. వృష్ణులును బాండవులును దమ
బల మంతయుం జూపినను నేను బాంచాలురఁ జంప కుడుగ ననిపలికి యింద్రుఁ
డు వృత్రుపయింబోలె సూర్యరశ్మినిభము పరమతీవ్రము నగునొక్క శితశరము
బిట్టేసినం దద్బాణ మతనిమైమఱుఁగు వ్రచ్చి నేలం జొచ్చె. అట్లు సాత్యకి విదీ
ర్ణకవచుండై నెత్తుటం జొత్తిల్లి మూర్ఛిల్లి తేరిపయి నొఱఁగఁబడుటయు సారథి
తేరు దొలఁగించె. అంత నశ్వత్థామ క్రమ్మఱ ధృష్టద్యుమ్నునిపయి నడిరి తదీయ
భ్రూమధ్యమున శితశరము నాటుటయుఁ దొలుతనే నొచ్చినవాఁడు గావున నతం
డయ్యమ్ముతాఁకునఁ బెద్దయు నొచ్చి కేతనదండ మూఁత గొనుటయుఁ గుంజరమ
ర్దితం బయినకొదమసింగముతెఱంగున నసంభావితదైన్యప్రాప్తుం డైనయప్పాం
చాలవరుం జూచి పాండవవీరులు భీమార్జునులు పౌరవబృహత్క్షత్రుండు చేదియు
వరాజు మాలవసుదర్శనుం డనునేవురుదొర లిరువదియడుగులకొలందిదవ్వున నిలి
చి యగ్గురుతనయుం దాఁకి వేఱువేఱ యైదేసియమ్ము లేసిన నతం డన్నితూపుల
నమ్మార్గణముల ఖండించి యేడమ్ములఁ బౌరవుని మూఁడుశరముల మాలవుని నొ
క్కభల్లమునం బార్థుని నాఱువిశిఖముల వృకోదరుని నొంచుటయు నంత నిలు
వక చేదియువరాజు వింశతివిశిఖములను బార్థుఁ డెనిమిదితూపులను దక్కినవారు
మూఁడేసియమ్ములను నతనిపైఁ బరఁగించిరి. అందుల కలిగి యాచార్యనందనుం
డాఱుతూపుల గాండీవిని దశవిశిఖముల వాసుదేవునిఁ బంచాశుగముల భీముని
నాలుగమ్ములఁ జేదియువరాజును రెండేసికాండముల మాలవపౌరవులను బాణష
ట్కమున వృకోదరుసారథిని నొప్పించి రెంట నవ్వాడముడిసిడమును విల్లునుం దుని
మి కిరీటిపై శరాసారముఁ బరఁగించి యార్చి పేర్చి దిక్తటములనెల్ల నిజఘోర
నారాచముల నించి యప్పటికి డాసినమాలవసుదర్శనుబాహుదండములను మస్తక
మును శరత్రయమునఁ దఱిగి రథశక్తి యెత్తి మోఁది పౌరవుతేరు తిలమాత్రశక
లములు గావించి తోన వానిభుజములను దలను నఱికి చేదియువరాజును రథ్య
సారథిసహితంబుగా మృత్యుపురమున కనిచె. అందులకుఁ దీవ్రక్రోధభరితుండై

వృకోదరుఁడు శరపరంపరలు పరఁగించి యాద్రోణతనూజుం గప్పిన నతం డయ్యా
మ్ములసోనను దనయమ్ముల రూపడఁగించి వాఁడితూపుల నొంచినం గోపించి వడ
ముడి యొక్కక్షురప్రమునం ద్రోణికార్ముకము ఖండించె. అంత నొండువి ల్లెత్తి
యయ్యాచార్యసూనుండు శరాసారముఁ గురియుటయు వృకోదరుఁడు నాత్మనా
మాంకితము లయినతీవ్రమార్గణముల లెక్కకు మిక్కుటంబుగఁ బరఁగించి మేఘ
పటలములు భాస్కరుంబోలె నాద్రోణతనయుం గప్పిన నయ్యిద్దఱు ప్రావృట్ప
యోధరములట్లు శరవర్షబంధురులై యొప్పినం బరమాద్భుతం బయ్యె. అప్పుడు
భీమసేనుఁ డేపు మీఱి యమదండసమము లగుక్రూరనారాచములఁ బదింటి
నేయుటయు నయ్యవి జత్రుదేశముఁ జొచ్చి నెత్తురు లురులించి నేలం జొచ్చు
టయు నశ్వత్థామ మూర్ఛిల్లి కేతనదండ మూఁత గొని నిమీలితలోచనుండై
ముహూర్తమాత్రమునకుఁ దెలిసి పరమక్రోధభరితుండై యాశీవిషసంకాశము
లగుతీవ్రమార్గణముల నూఱింటిని నాకర్ణపూర్ణములఁ గావించి విడిచె. విడిచినం
దత్పరాక్రమ మగ్గించి వృకోదరుఁ డేనువాఁడితూపు లతనిపై నేసిన నయ్యాచా
ర్యసుతుండును ధనుర్గుణక్వణనంబుఁ గావించి శరత్కాలమధ్యాహ్నమార్తాండుని
విధమునఁ దేజోదుస్సహుండై యలాతచక్రమువోలె మండలీకృత మగుకోదం
డమునఁ బెక్కమ్ము లరిఁ బోసి శరగ్రహణసంధానమోక్షణంబు లిట్టు లని యూ
హింపరానిరయమునఁ గురియుటయుఁ దన్మార్గణములు భీమసేనుతేరు గప్పి మిడుత
లబారులట్లు మి న్నావరించె. అంత వృకోదరుఁడు బలవీర్యప్రభావము లత్యద్భు
తంబులై యఖిలజనస్తుతిపాత్రంబులై తనర శక్రచాపప్రతిమం బైననిజకార్ము
కముగొనయమ్ము సారించి ప్రావృట్పయోధరముచందమున శరాసారం బడరించి
గాలి సొరనైన నెడము గలుగనితెఱంగున నేలయు నింగియుం గప్పిన నాచార్య
తనయుండు బలుతూపుల నిగిడించినం గనలి భీముఁడు వానినెల్ల మూఁడేసితుని
యలుగా ఖండించి ద్రోణపుత్రా, నిలునిలు మనియదల్చె. అదల్చినం గినుక
గదుర నగ్గురునందనుం డగ్గలించి యాబాణవర్షమును దివ్యాస్త్రమాయచే మా
యించి భీమునివిల్లు దునిమి తోన శరజాలము నిగిడించుటయు నవ్వాయుసూ
నుండు భగ్నకార్ముకుండు గావున రథశక్తి నతనిపయిం బడ నేసిన దానిం గురు
సుతుండు లాఘవమున నఱికె. అంతలో నొండువిల్లు గొని బకాంతకుండు నగు
చుఁ బటుప్రదరనికరము లడరించుటయు ద్రోణి యొక్కతీవ్రాశుగము భీమసార
థిలలాటమున నాటుటయు నతండు గాఢవిద్ధుండై సోలినం గుఱ్ఱములు తే రీడ్చి
కొని తొలఁగం బాఱుటయు నశ్వత్థామ శంఖముఁ బూరించి కాందిశీకంబు లయి
నపాండవానీకములం దఱిమె. అట్లు విఱిగి పఱచుచున్నతమమూఁకలం జూచి
గాండివి మత్స్యపాంచాలాదులం బురికొల్పికొని కపికేతనస్ఫూర్తిసముద్దామం

బుగా సింహలాంగూలకేతనాభిరాముఁ డగునయ్యశ్వత్థామను దాఁకి గురుపుత్రా, నీశక్తిని వీర్యమును జ్ఞానమునుఁ బౌరుషమును ధార్తరాష్ట్రులమీఁదిప్రీతిని మామీఁదిద్వేషమునుఁ దేజమునుం జూపుము. ద్రోణుం జంపినయప్పాంచాలవరుఁడే నీమద మడఁగించు. కాలానలసన్నిభుఁ డైనయాధృష్టద్యుమ్నుని వాసుదేవసారథికిఁ డగునన్నును మార్కొనుము. యుద్ధసముద్ధతుం డైననీదర్పము రూపుమాపెద ననియె ననిన విని యాంబికేయుండు సంజయా, గురుసుతుఁడు బలవంతుఁడనియు మాననీయుఁడనియు నర్జునున కతనిపయిఁ బ్రీతి మిక్కుటంబై యుండు. అతఁడు నర్జునుం బరమప్రీతిం జూచు. అర్జునుఁ డెన్నఁడు నింతకు నతని నిట్టులన్నవాఁడు గాఁడుగదా. ఇప్పు డేల యిట్లు పరుషములు పలికెనో యనియడుగ నృపాలా, పౌరవబృహత్క్షత్రుఁడును జేదియువరాజును మాలవసుదర్శనుఁడును హతులగుటయు ధృష్టద్యుమ్నసాత్యకిభీమసేనులు పరాజితు లవుటయు యుధిష్ఠిరువచనముల మర్మములు నొచ్చుటయుం గారణములుగా నంతర్భేదము పుట్టి దుఃఖముఁ దలంచి యెన్నఁడును రానికోపము వచ్చుటయు మాన్యుఁ డైన యాచార్యతనయు నట్టు లనియె ననిచెప్పి సంజయుఁ డమ్మానవేశ్వరునకు వెండియు నిట్లనియె.

## అశ్వత్థామ యాగ్నేయాస్త్రంబుఁ బ్రయోగించుట.

అవ్విధమునఁ బార్థుఁడు పరుషములు పలికిన నతనిపయిఁ గృష్ణునిపయిం గోపంబు గదుర నశ్వత్థామ యాచమించి శుచియై నియతచిత్తుండై సురలకు ననివార్యం బయినయాగ్నేయాస్త్రము గ్రహించి దృశ్యాదృశ్యము లగుశత్రుసైన్యములఁ గాల్పు మనియభిమంత్రించి ప్రయోగించిన నగ్నిజ్వాలాభీలంబై పరమతుములంబై శరజాల మంతరిక్షమునం బుట్టి పార్థుపయి నడరె. కొఱవులు పడియె. కటికిచీఁకట్లు గ్రమ్ముటంజేసి దిక్కులు దృష్టిగోచరములు గాకుండె. రక్షఃపిశాచగణము లార్చె. విపరీతవాతములు విసరె. సూర్యుఁడు తేజోహీనుండయ్యె. ఎల్లదెసలం గాకులు భయంకరముగ నఱచె. నెత్తురువాన గురిసె. పక్షులు పశువులు గోవులు మునులును బరమప్రయత్నమునను శాంతిఁ బొందరైరి. రసాతలగతము లగుపన్నగములును గోఁజుచుండె. జలజంతువులును దపించె. ముల్లోకములును బరమసంతాపదీనము లయ్యె. గరుడానిలవేగమున సకలదిక్కులనుండి బాణవర్షము గురిసె. అయ్యస్త్రజ్వాలలం బడి పెలుచ నఱచి నేలం గూలునేనుంగులును మఱియుగుఱ్ఱములును నీఱగుతేరులును రూపడంగు కాలుమానుసులునై పాండవసైన్యములు కార్చిచ్చు పొదివినకాననంబువిధంబున నూహింపరానిదుర్దశకు వచ్చె. తదస్త్రప్రభావమున నిమేషమాత్రలోన నశ్వత్థామ యేకాక్షౌహిణీక్షయం బొనరించి యుగవిగమసమయసంవర్తకానలునితె

అంగున వెలుంగుచుండ మనవారు ప్రహర్షోత్కర్షముఁ బొంది సింహనాదముఁ గావించిరి. ఏమి చెప్పుదు నట్టియస్త్రము చూడను వినను బడదయ్యె. అప్పు డర్జునుం డలిగి సర్వాస్త్రప్రతిఘాతార్థము బ్రహ్మదేవుఁడు నిర్మించినయుత్తమాస్త్రం బేసి గురుసుతునియాగ్నేయాస్త్రము నడఁగించిన ముహూర్తమాత్రలోన నాచీఁకట్లు విరిసె. దిక్కులు ప్రసన్నంబు లయ్యె. లలితమారుతములు వీచె. అట్టియెడఁ బాండవసైనికు లెలమి నున్నవాసుదేవార్జునులం జూచి యాగ్నేయాస్త్రమునఁ గీడు వొరయమి కెంతయు సంతసంబునం బొదలి శంఖము లొత్తి భేరుల మ్రోయించి సింహనాదము చేసినం గృష్ణార్జునులు పాంచజన్యదేవదత్తంబు లొత్తిరి. అంత నశ్వత్థామ కృష్ణార్జునులు రథరథ్యకేతనాదిసహితంబుగ నేకీడుం బొరయక యెలమి మిగులుటకుఁ జింతించి దీర్ఘోష్ణనిశ్శ్వాసములు నిగిడించి విన్నఁబోయినయుల్లముతో విల్లు తేరిపయిం బెట్టి యివియన్నియుం గాల్పనే యని పలుకుచు రయమునఁ దేరు డిగ్గి యనికిఁ దొలఁగి చనియె.

వ్యాసుఁ డశ్వత్థామకుఁ బొడసూపి కృష్ణార్జునమహిమముఁ జెప్పుట.

అత్తెఱంగున నశ్వత్థామ చనువాఁడు నీలనీరదప్రకాశుఁడు సరస్వత్యావాసభూతుఁడు నగువేదవ్యాసుం గాంచి పాదాభివందనం బాచరించి దైన్యము గదురఁ దిన్ననియెలుంగున మునీంద్రా, యిది యేమిమాయయొ యెఱుంగ రాదు. నాయాగ్నేయాస్త్రము వృథ యయ్యె. నాయపచారంబు గలదే? ఇట్లు తలక్రిందు గాఁ గతం బేమి? లోకములకుఁ బరాభవము గలుగునొక్కొ. కృష్ణార్జును లయ్యస్త్రరాజమునఁ జావక బ్రదికియున్నవారు. కాల మేఱికిం గడవఁ దరంబు గాదు. సురాసురగంధర్వప్రముఖు లెవ్వరును నీయస్త్ర మడఁగింపఁ జాలరు. ఇట్టిమహనీయాస్త్రం బేకతము గలుగ మనుష్యు లయినకృష్ణార్జునులం జంపక శాంత మయ్యెఁ దెలియఁ జెప్పు మనియడుగుటయు నప్పరాశర్యుం డయ్యా,నీయడిగినదానికి సముత్తరముఁ జెప్పెద సమాహితచిత్తుండవై యాకర్ణింపు మనియిట్లనియె. తొల్లి దేవకార్యార్థము పూర్వులకుఁ బూర్వుఁడై ధర్మునకు జనించిననారాయణుండు హిమవంతమున నూర్ధ్వబాహుఁడై యనలాదిత్యరుచిరుచిరుండై వాయుభక్షుఁడై యఱువదియాఱువేలయేఁడులు తీవ్రతప మనుష్ఠించి నిజతపస్తేజమున రోదోంతరము నించి బ్రహ్మభూతుండై యొక్కనాఁడు విశ్వకారణంబు విశ్వేశ్వరుఁడు సర్వదేవేశ్వరుఁ డణువులకంటె నణుతరుఁడు మహత్తులకంటె మహత్తరుఁడు తిగ్మమన్యుఁడు దివ్యచాపతూణహిరణ్యవర్మధరుఁడు వజ్రపినాకశూలగదాఖడ్గపరశ్వథదండముసలహస్తుండు వ్యాఘ్రచర్మపరిధానుఁడు జటాకలాపసముజ్జ్వలుఁడు శుభాంగదుఁడు నాగయజ్ఞోపవీతధరుఁడు భూతగణపరివృతుఁడు సర్వతపోనిధానము జలదిగాకాశక్షితిసూర్యచంద్రవాగగ్నులను జగమును

నిజమూర్తులఁ గొల్చువాఁడు భిన్నవృత్తుల కగోచరుఁ డవ్యాకృతయోని బ్రహ్మద్వే షిహారుఁడు క్షీణపాపు లైనసాధుబ్రాహ్మణులకు మనోమార్గమునం గన్పట్టువాఁడు సంతతతపోనిష్ఠాగరిష్ఠుఁ డక్షమాలాపరిక్షిప్తుఁడు పరమజ్యోతిర్నిధియు నగుపరమే శ్వరుం గాంచి వాఙ్మనోబుద్ధిదేహములఁ బరమసంతోషభరితుండై సాష్టాంగ దండప్రణామముఁ గావించి యిట్లని స్తుతియించె. ఆదిదేవా, భువనరక్షకు లగు భూతకృత్తు లందఱును సురాసురనాగరక్షఃపిశాచయక్షగంధర్వాదులును నీవలన నుద్భవిల్లిరి. ఇంద్రయమవరుణకుబేరపితృత్వష్టృసోమాదులకార్యములు భవద ధీనములు. పంచభూతములు పంచతన్మాత్రలు కాలము వేదము బ్రహ్మ బ్రాహ్మ ణులు స్థావరజంగమాత్మకం బయినసకలప్రపంచంబును నీవలనం బుట్టి సలిలము కంటె బిందువులు వేఱుగానివిధమునఁ దుది నీలో నైక్యముఁ బొందు. ఇట్లు భూతోత్పత్తిప్రళయములఁ దెలిసినయతండు నీసాయుజ్యము వడయు. వాగ్విటప ములు * సప్తరక్షకములు నగుపిప్పలముల నాశ్రయించి పురధారణసమర్థము లగుపది నిజకార్యముల నిర్వహింప మానసవిహంగములు రెండు మెలంగుచుండు. తన సృజించినవానికిఁ బరుండవై యాత్మస్వరూపుఁడవై నిజబోధఘనుఁడవైన నిన్ను భజియించెద. నీవలన నభిమతవరములఁ బడయఁ గోరి స్తుతియించితి. మాయఁ గావింపక యనుగ్రహింపు మని నారాయణుండు ప్రస్తుతించినం జిత్త గించి పరమేశ్వరుఁడు కరుణామయదృష్టి నాదరించి నారాయణా, మదీయప్రసా దమున నీవు మనుష్యాదులలో జనించియు నప్రమేయబలుండవై వెలుంగుదువు. దేవదానవగంధర్వాదు లేరును నిన్నుఁ బోర గెలువఁ జాలరు. శస్త్రమునకు వజ్ర మునకు నగ్నికి వాయువునకు నార్ద్రమునకు శుష్కమునకుఁ జరమునకు స్థావరము నకు నిన్ను నొంప శక్తి చాలదు. ఏను మార్కొన్నను గెల్తువు. పెక్కు లేల యని వరం బొసంగె. మహాదేవలబ్ధవరుఁ డైనయానారాయణునితపోమహిమమున నే నరుఁ డనుముని తత్తుల్యమహిముఁడు జనించె. అప్పరమమునులే యీకృష్ణార్జున రూపములఁ గన్పట్టుచున్నవారు. మఱియు వారు లోకయాత్రావిధానార్థంబు ప్రతియుగమునం బొడముదురు. నీవును బూర్వజన్మమున రుద్రునివలనం బొడమి సర్వము శివమయం బనితలంచి పార్థివం బయిన యీశ్వరవిగ్రహముఁ గల్పించి జపహోమోపహారాదుల నారాధించిన సంతుష్టుండై యంతకాంతకుండు నీకుం బుష్కలంబు లయినవరములఁ బ్రసాదించె. జన్మకర్మతపోయోగములు నీకుఁ బ్రశస్యంబులైనను బ్రతిమార్చనపరుం డైననీకంటె లింగార్చనపరు లైనకృష్ణా ర్జునులను మహేశ్వరుఁ డధికప్రీతి నాదరించుటంజేసి వారు భవదస్త్రమున మడి

* సప్తరక్షకములు మహదహంకారపంచతన్మాత్రలు. పిప్పల మశ్వత్థము. అనఁగా సంసా రవృక్షము, పురము శరీరము. పది దశేంద్రియములు, మానసవిహంగములు రెండు జీవేశ్వరులు,

య రైరని వేదవ్యాసుండు సెప్పిన నప్పలుకులు విని ద్రోణపుత్రుండు తనమన
మున వాసుదేవుని బహూకరించి శర్వునకు నమస్కారంబుఁ గావించి ధ్యానించి
రోమాంచకంచుకితగాత్రుండై సాత్యవతేయునకుఁ బ్రణామం బాచరించి యనుజ్ఞఁ
బడసి సూర్యాస్తమయసమయంబు దఱియుటంజేసి సేనలఁ దివియ నియోగించినం
బాండవులును దమసేనలఁ దివియించి నిజశిబిరములకుఁ జనిరి. అవ్విధమున వేద
విదుఁడు బ్రాహ్మణోత్తముఁడు నగుద్రోణాచార్యుఁ డైదునాళ్లుసమరము చేసి
పాండవసేనాక్షయం బాపాదించి బ్రహ్మలోకమునకుఁ జనియె ననిన ధృతరాష్ట్రుఁడు
మీఁదివృత్తాంత మెట్లని యడుగ నాతనికి సంజయుం డిట్లనియె.

### వ్యాసుఁ డర్జునునకుఁ బరమేశ్వరమహిమంబుఁ జెప్పుట.

అంత నర్జునుఁడు తనకు విజయావహం బయినయొక్కవిచిత్రంబున కలరు
చు యదృచ్ఛాగతుం డైనవేదవ్యాసమునీంద్రునకు సాష్టాంగదండప్రణామము
లాచరించి కేల్దోయి మొగిచి మునీంద్రా, నిత్యమును నేను సంగ్రామమున శా
త్రవులం జంపుతఱిఁ బావకప్రభావిభాసమానుఁడు శూలపాణియు నగునొక్కమ
హాపురుషుం జూచుచుండుదు. తదీయశూలమునం బెక్కుశూలము లుద్భవిల్లి
నామునుమునం బొడుచుచుఁ బోవఁగ వెంట నేను వారలం జంపుదు. అట్లు కాఁగ
సకలసైన్యముల నేను వధించితి నని యందఱు తలంతురు. అమ్మహాపురుషుఁ
డెవ్వఁడో యెఱింగింపు మనియడిగినం గృష్ణద్వైపాయనుండు ధనంజయున కిట్ల
నియె. పార్థా, సర్వలోకేశ్వరుండు వరదుఁడు శంకరుఁడు నగుపరమేశ్వరుం గనుఁ
గొంటివి. జగత్ప్రధానుఁడు జగదీశ్వరుఁడు జగద్గతి విశ్వమూర్తి విశ్వఫలప్రదాత
శంభుఁడు భూతభవ్యభవన్నాయకుఁడు స్వయంభువు సర్వశ్రేష్ఠుఁడు వరిష్ఠుఁడు పర
మేష్ఠి దుర్జయుఁడు జన్మమరణజరారహితుఁడు జ్ఞానాత్ముఁడు జ్ఞానగమ్యుఁడు జ్ఞాన
శ్రేష్ఠుఁడు దుర్విజ్ఞేయప్రభావుఁడు భక్తవరదానదక్షుఁడు నగునప్పరమేశ్వరు శర
ణు పొందుము. అమ్మహాత్ముఁడే వివిధనిజపార్షదగణపూజ్యమానుఁడై నీమీఁదియ
నుగ్రహమునంజేసి రణమున నీకు ముందు నడుచుచు నీశాత్రవులం జంపుచున్న
వాఁడు. అట్లు కాదేని కౌరవులం గెలుచుట నీకు దుష్కరంబు. కర్ణకృపద్రౌణి
గుప్తం బయినకురుసేనను మార్కొన నీశ్వరునకుఁగాని లాఁతివానికి శక్యంబె?
అద్దేవదేవునిగంధము సోఁకినం బగవారు విసంజ్ఞులై హతప్రాయు లగుదురు. సుర
లును స్వర్గముఁ గోరుమానవులు నయ్యుమాపతి నారాధించి యైహికాముష్మిక
సుఖములఁ బొందుదురు. కౌంతేయా, శాంతుఁడు రుద్రుఁడు శితికంఠుఁడు కనిష్ఠుఁ
డు సువర్చసుఁడు కపర్ది కరాళుఁడు హర్యక్షవరదుఁడు హరికేశుఁడు హరినేత్రుఁడు
దేవదేవుఁడు వరదుఁడు భాస్కరుఁడు సుతీర్థుఁడు సహస్రాక్షుఁడు సహస్రశీర్షుఁడు
సహస్రబాహువు సహస్రచరణుఁడు ప్రజాపతి భూతపతి వృషపతి మాతృపతి

గణపతి గోపతి యజ్ఞపతి యప్పతి దేవపతి వృక్షపతి పర్జన్యపతి దిక్పతి వనస్పతి పతి నరపతి వృషావర్తుఁడు వృషనాభుఁడు వృషధ్వజుఁడు వృషదర్పుఁడు వృషశృంగుఁడు వృషర్షభుఁడు వృషాంకుఁడు వృషభోదారుఁడు వృషభుఁడు వృషభేక్షణుఁడు ధనుర్ధరుఁడు ప్రియధన్వుఁడు ధన్వి ధన్వంతరుఁడు ధనుస్సు ధన్వాచార్యుఁడు బహుధన్వి సుధన్వి యనేకగుణవిశిష్టుఁడు నగు నప్పరమపురుషునకు నమస్కారములు గావింపుము. అమ్మహాదేవునిదివ్యకర్మములు విన్నంత నాప్రజ్ఞకుఁ దోఁచినంత చెప్పెద వినుము. దక్షుఁడు యాగదీక్షితుఁడై యపరాధము సేసినం గోపించి నిర్దయుఁడై యామహేశ్వరుండు ధనుర్గుణక్వణనంబుఁ గావించిన సురలు వ్యాకులులైరి. అర్ణవములు ఘూర్ణిల్లె. భూమి కంపించె. పర్వతములు పగిలె. దిక్కులు దిగ్గజములు సమ్మోహముఁ జెందె. సూర్యాదులు నిస్తేజస్కులగుటయు సకలలోకములం జీఁకట్లు గ్రమ్మె. పురోడాశభక్షణవ్యగ్రుండైన పూషునిదంతములు విఱుగ నడిచె. అంత మహర్షులు నమరులును వెఱచి ప్రణమిల్లి ప్రస్తుతించి యజ్ఞభాగములఁ గల్పించి ప్రార్థించినం బ్రసన్నుండై యాత్రిలోచనుఁడు క్రమ్మఱ నతనియజ్ఞము నెఱవేఱ ననుగ్రహించె. త్రిపురసంహారము మున్నగునమ్మహాదేవుని యద్భుతచరిత్రములు పెక్కులు గలవు. దక్షయజ్ఞవినాశనుండైనయతండే రుద్రుఁడు శివుఁ డగ్ని సర్వస్వరూపుఁడు సర్వవిదుఁ డింద్రుఁడు వాయు వశ్వినులు మెఱుఁగులు భవుఁడు పర్జన్యుఁడు మహాదేవుఁడు చంద్రుఁ డీశ్వరుఁడు సూర్యుఁడు వరుణుఁడు కాలుఁ డంతకుఁడు మృత్యువు యముఁ డహోరాత్రములు మాసపక్షఋతువులు సంధ్యలు సంవత్సరములు ధాత విధాత యనంబడు. విశ్వకర్మకారి యగునవ్విశ్వాత్ముఁడే యశరీరుఁడయ్యు సర్వదేవశరీరముల ధరించు. అమ్మహాత్మునే సకలసురులేకవిధమునను శతవిధములను సహస్రవిధములను బహువిధములనుం బ్రస్తుతింతురు. వేదవిదు లగుబ్రాహ్మణులు ఘోరయనియు శివయనియు రెండుమూర్తులు మఱియుం బెక్కుమూర్తులు నయ్యష్టమూర్తికిఁ గలవండ్రు. అం దగ్నివిష్ణుభాస్కరులు ఘోరమూర్తియనియు సలిలజ్యోతిశ్చంద్రులు శివమూర్తియనియు వ్యవహరింతురు. శ్రుతిస్మృతీతిహాసపురాణాగమ వేదాంగములును బరమగుహ్యంబులును నద్దేవుఁడేకాని యొండు గాదు. అప్పరమపురుషునిభవ్యగుణములఁ జెప్పఁగ వర్షసహస్రమైనం జాలదు. అతండు సుప్రీతుఁడైన నిఖిలపాపముల హరించి యాయురారోగ్యధనైశ్వర్యాదిసకలకామముల నొసంగు. లోకముల నెల్లెడల వ్యాపించి యైశ్వర్యఘనుఁడై నెగడుటం జేసి యతం డీశ్వరపదవాచ్యుం డయ్యె. మహాభూతముల కీశ్వరుఁడై బహురూపముల విశ్వవ్యాప్తికలిమిం జేసి మహేశ్వరుఁడునాఁ బరఁగె. సముద్రమునం గలబడబాముఖమునఁ దోయమయం బయినహవిస్సు ద్రాగుచుండు. శ్మశానవాసి యగునతనినే జనులు పూజిం

తురు. అద్దేవదేవునినామధేయములకుఁ గొన్నింటికి యథార్థనిర్వచనంబుఁ జేసెద నాకర్ణింపుము. వేదములయం దయ్యాది శతరుద్రీయంబనియు ననంతరుద్రీయం బనియుఁ బరఁగు. దివ్యమానుషకామముల కతండు ప్రభుఁడు. సురలకుఁ బ్రథముఁడై న యాప్రమథపతిని బ్రాహ్మణులును మునులును జ్యేష్ఠుం డనిపల్కుదురు. సర్వవిధములఁ బశువులఁ బాలించి తదధిపతియై క్రీడించుటంజేసి యతండు పశుపతిపదవాచ్యుం డయ్యె. బ్రహ్మచర్యమునం దదీయదివ్యలింగము యథాస్థితంబై లోకముల మహత్త్వముఁ గాంచుటంజేసి మహేశ్వరుఁ డనంబరఁగె. ఊర్ధ్వసమాస్థితం బై నశివలింగమును దేవర్షిగంధర్వులు పూజింతురు. లింగార్చనమున శంకరుఁడు సుప్రీతుఁ డగు. చరాచరాత్మక మంతయుఁ దనరూపములు గావున బహురూపుఁ డనంబడియె. ఏకాక్షుఁడై యొండె సర్వతోఽక్షిమయుండై యొండె నిజతేజమున సర్వము వెలిఁగించుటంజేసి సర్వుఁడునాఁ బరఁగె. ధూమ్రజటాధరుండు గావున ధూర్జటి యయ్యె. విశ్వదేవాధారుఁడుగావున విశ్వరూపుఁ డయ్యె. సర్వకర్మములందు సర్వార్థములకును వృద్ధి గావించియెల్లవారికి శివముఁ గోరుటంజేసి శివపదాభిధేయుఁ డయ్యె. భూమ్యంతరిక్షజలములు మూడింటిని భజించుటంబట్టి త్ర్యంబకుఁ డనం బరఁగె. మహత్తునకును బ్రాణోత్పత్తికిని బూర్వమే స్థితలింగుఁ డవుటంజేసి స్థాణుఁ డయ్యె. సూర్యచంద్రరోచులు కేశములై తనరుటంజేసి వ్యోమకేశుఁ డయ్యె. వృష మనఁగ ధర్మము, కపియన శ్రేష్ఠుండు, ధర్మశ్రేష్ఠుండుగాన వృషాకపి యయ్యె. బ్రహ్మేంద్రయమవరుణకుబేరుల నిగ్రహించుటకతన హరుఁ డయ్యె. రెండునేత్రములు మూసికొని ఫాలభాగమున వేఱొక్కకన్ను కల్పించుటం జేసి త్ర్యక్షుఁ డయ్యె. శరీరములయెడ విషమస్థుండై ప్రాణులయెడ సముఁడై తనరుఁ గావున వాయుప్రాణాపానవాచ్యుఁ డయ్యె. మఱియు ననేక నామంబులకుఁ బ్రవృత్తినిమిత్తంబులు గలవు. అమ్మహాదేవుఁడే ప్రసన్నుఁడై నీముందఱ శత్రువుల వధించుచుఁ జనుచున్నవాఁడు. సైంధవవధార్థము నీవు ప్రతిజ్ఞ చేసినపుడు శ్రీకృష్ణుఁడు స్వప్నమున నీకుఁ గైలాసశిఖరమున నమ్మహేశ్వరుం జూపించె. అద్దేవదేవుఁడు ప్రసాదించినపరమాస్త్రములంగాదె నీవు దానవుల వధియించితివి. ధన్యము యశస్యమాయుష్యము పుణ్యము వేదతుల్యము సర్వార్థసాధకము సర్వకిల్బిషనాశనము సర్వదుఃఖప్రశమనము నగుశతరుద్రీయము నీకుఁ జెప్పితి. చతుర్విధం బయిన యీస్తోత్రముఁ బఠించిననరుఁడు సకలశత్రువులం జయించి రుద్రలోకమునఁ బూజితుం డగు. మహేశ్వరభక్తుఁ డఖిలకామముల సాధించు. సుస్థిరుఁడవై పోరుము. నీకుఁ బరాజయము గలుగదు. జనార్దనుఁడు హితమంత్రియు రక్షకుఁడునై సర్వకార్యములు నిర్వహింప విచారం బేల యని యర్జునున కెఱింగించి బాదరాయణమునీంద్రుఁ డరిగె. పాండవయాదవవిజయబోధకం బయినయీప్రబంధము

విని బ్రాహ్మణులు యజ్ఞఫలమును క్షత్రియులు విజయమును దక్కినవారు కోరి నయర్థములనుం బొందుదు రని యాంబికేయునకు సంజయుం డెఱింగించె నని

క. అనఘుఁడు వైశంపాయన, మునివర్యుఁడు ద్రోణపర్వమును వివరింపన్
జనమేజయనరపాలుఁడు, విని పరమానందవార్ధివీచులఁ దోఁగెన్.

శా. వస్తుగ్రాహములయ్యు నేత్రములు దీవ్యద్వహ్ని చంద్రార్కతే
జస్తోమంబులు లేక రిత్త లగునోజన్ వారితేజంబు లే
నిస్తుల్యద్యుతిభాసమానువెలుఁ గెంతే లేక దీపింపవౌ
వ్యస్తావ్యస్తవిభాసకుం దలఁతు నయ్యాత్మప్రకాశు న్మదిన్.

ఇది శ్రీకాళహస్తినగరాధినాథ శ్రీమద్దామరకుమారాక్కమహీపాల కరుణా
పురస్సరబహుమానపాత్ర, సంస్కృతాంధ్రభాషాకవిత్వచమత్కారపరి
తోషితబుధస్తోమ సీతారామకవిలలామ పుత్ర, సకలశాస్త్రనిరంకు
శపాండితీధుర్య లక్ష్మీనృసింహసుధీవర్య సచ్ఛాత్ర, విబుధజనవిధేయ
వేంకటరంగనామధేయ విరచితం బైన శ్రీమదాంధ్రవచనభారతం
బునందు ద్రోణపర్వంబున సైంధవవధదుఃఖితుం డయినదు
ర్యోధనునకుఁ బ్రియంబుగా ద్రోణుఁడు పాంచాలురఁ జం
పక కాని కత్తళంబుపుచ్చ నని ప్రతిజ్ఞ చేసి రాత్రియుద్ధము
నకుఁ దొడరుటయుఁ, గర్ణునిశక్తిచే ఘటోత్కచుఁడు
మడియుటయు, విరాటద్రుపదవధయు, ద్రోణవ
ధయు, నశ్వత్థామనారాయణాస్త్రప్రయోగంబు
ను, దచ్ఛాంతియు, నాగ్నేయాస్త్రప్రయోగ
మును, నయ్యస్త్ర మర్జునాస్త్రమున నడఁగు
టకు నిర్వేదంబుఁ జెందినద్రౌణికి వ్యాసుఁ
డు నరనారాయణమహిమంబుఁ జెప్పు
టయు, వేదవ్యాసుఁ డర్జును
నకు రుద్రమహిమము బో
ధించుటయు నన్నది
తృతీయాశ్వాసము.



శ్రీకాళహస్తీశ్వరాయ నమః

# కర్ణపర్వము.

## ప్రథమాశ్వాసము.

క. శ్రీనిష్పాదనమేదుర
నానాయజ్ఞక్రియోపనతసుస్థిరచే
తోనిర్మలత్వలబ్ధ
జ్ఞానైకావేద్య, శ్రుతివచఃప్రతిపాద్యా.

దేవా, ననుఁ గృతార్థుం జేయుము.

సంతతసభక్తికోపసేవితద్వైపాయనుం డైనవైశంపాయనుం డనంతరక థాకర్ణనోదీర్ణకుతుహృదయుం డైనజనమేజయునకిట్లనియె. ద్రోణవధానంతరము దుర్యోధనుఁడు హితులతోడఁ గార్యచింతాపరుండై జూదము పాంచాలీపరిభ వంబు మున్నుగాఁ బాండవులకుఁ దా మొనర్చినయెగ్గులం దలంచి కార్య మొక తెఱంగున నిశ్చయించి కర్ణుని సర్వసేనాధిపతిం గావించి యారేయి వేయేఁడులై తోఁప నెట్టకేలకుఁ గడపినం బ్రభాతం బగుడుఁ గర్ణుండు దినద్వయంబు పోరి యర్జుననిహతుఁ డయ్యె ననిన జనమేజయుండు మునీంద్రా, భీష్మద్రోణులు పడు టకే పరమార్తిప్రాప్తుఁ డైనయాధృతరాష్ట్రుఁడు దుర్యోధనహితార్థి యగుకర్ణుఁ డును దెగియె నని విని యెట్లు మేనఁ బ్రాణముల ధరించె? ఆరాధేయుఁడ తన కొడుకునకు విజయ మొసఁగు నని పెద్దయు నమ్మియుండెఁగదా. అనంతరవృ త్తాంత మెట్లని యడుగ నమ్మునివరేణ్యుఁ డానరవరేణ్యున కిట్లనియె.

రాజేంద్రా, కర్ణుఁడు హతుఁడైనపదంపడి సంజయుఁడు దీనాననుఁడై వాయువేగము లగుగుఱ్ఱములం బూన్చినతేరెక్కి రయమునఁ గరిపురమున కరిగి నిరుత్సవం బయినధృతరాష్ట్రమందిరముఁ బ్రవేశించి యావృద్ధభూపతిపాదముల కెఱఁగి కటకటా! యనుచు నతని కిట్లనియె. మహారాజా, సంజయుఁడను నేను వచ్చితి. నిజదోషముల మూఁడినకీడునకు వగవక సుఖ ముండుదువే? భీష్మద్రో

ణులును వాసుదేవుఁడును రామనారదకణ్వాదిమహామునులును విదురుఁడునుం జెప్పినహితముల నాదరింపక చేటు దెచ్చికొంటి ననినం బెద్దయు నిట్టూర్పు నిగిడించి యాంబికేయుండు సూతపుత్రా, దివ్యాస్త్రవిదులు త్రైలోక్యవిఖ్యాతులు నగుభీష్మద్రోణులు పడినపదంపడి యర్జునుండు సంశప్తకబలములఁ జెండాడినపిదప నశ్వత్థామనారాయణాస్త్రము శాంతమయినయనంతరము మనమూఁకలు వీఁక దఱిఁగి విఱిగి పఱచిన నటమీఁదిసమరప్రకారం బెట్టు లయ్యె ననియడుగుటయు సంజయుండు నరేంద్రా, నీయనయమునం బుట్టినకౌరవులకీడునకు వగచినం బ్రయోజనంబు లేదు. దైవవశమున నగువానిం దప్పింప నేరికి నలవి గాదు. కాలప్రాప్తములకు బుధుఁడు వికారములఁ బొరయఁడు. కావున సుస్థిరుండవై విను మనియిట్లనియె. ద్రోణుఁడు హతుఁడైనపదంపడి నీకొడుకు మనంబు తల్లడిల్ల నాననంబు పల్లటిల్ల విడిదలకుం జని పెద్దయుంబ్రొద్దు చింతాక్రాంతుండై పలుకకుండి కొండొకవడికి హితులతోడ నాలోచించి జయాజయంబులకు వగచినం బ్రయోజనంబు లేదు గావునఁ గడఁక దలిర్పం బోరుట క్షాత్రధర్మం బని నిశ్చయించి సింగముఁ జూచినక్షుద్రమృగంబట్టు లర్జునుఁడు తాన మఱలు తెఱఁగుగా నేపుఁ జూపఁ జాలినకడిందిమగంటిమియు, నాగాయుతప్రాణుం డైనభీముని దుర్దశకుఁ బాత్రంబు గావించినభుజవీర్యంబును, దివ్యాస్త్రవిదుఁడు మాయావియు నగుఘటోత్కచుం దెగటార్చినయస్త్రసంపదయుం గలుగఁ బెంపెసంగుకర్ణుఁడును వీర్యదుర్దాంతుం డైనయాచార్యపుత్రుండు నింద్రోపేంద్రులట్లు విక్రమింతు రనియూహించి యగ్గురునందనుమతంబున సమరసముదీర్ణుం డైనకర్ణుని సర్వసేనాధిపత్యమున నభిషేకించి యమ్మేటిమగండు కార్యభారంబు నిర్వహింపఁ గయ్యమునకుఁ గడంగిన నాతండు రెన్నాళ్లుపాంచాలాదియోధుల లెక్కకు మిక్కిలిగా వధించి యర్జునుచేఁ దెగియె ననిన విని ధృతరాష్ట్రుఁడు శోకమునకుఁ దుద గనలేక దుర్యోధను హతునకా వగచి విహ్వలుండై తెలివిఁదప్పి నేలం బడుటయు స్త్రీజనములు నాక్రందనముఁ గావించి నిస్సంజ్ఞలై ధరణిం బడినం జూచి సంజయుఁడును దత్కాలసమాగతుం డైనవిదురుఁడును దానును బెద్దయుం బ్రొద్దు శిశిరోపచారము లొనరించిన నందఱు లేచి కూర్చుండుటయుఁ బ్రజ్ఞాచక్షుండు దీర్ఘోష్ణనిశ్శ్వాసములు నిగిడించి నిజచిత్తమునఁ గొడుకులను దనబుద్ధిని సౌబలునినీతిని నిందించి పాండునందుల మెచ్చి యెట్టకేలకు ధైర్యమున మనం బొకతెఱంగున నిల్పికొని సంజయా, దుర్యోధనుఁడు బ్రదికియున్నవాఁడె యని యడుగుటయు నతండు నృపాలా, దుర్యోధనుఁడు బ్రదికియున్నవాఁడు. కర్ణుఁడును నతనికొడుకులును బాంధవులును మడిసిరి. మఱియు భీముఁడు దుశ్శాసనుం జంపి కోపమున వానినెత్తురు ద్రావె ననిన నయ్యంబికానందనుండు నాయనయమున

మనవారు పెక్కండ్రు దెగిరిగా యనుశోకము పెల్లునఁ గొందలం బందునామనం
బున కూజటగా మనబలమునను బాండవబలమునను దెగినవారలఁ బేర్కొను
మని యడుగ సంజయుం డతని కిట్లనియె.

సంజయుఁడు ధృతరాష్ట్రున కుభయసేనలఁ దెగినవారలఁ జెప్పుట.

భీష్మద్రోణులును గర్ణుఁడును వివింశతియు వికర్ణుండును నవంతిపతు లగు
విందానువిందులును జయద్రథుఁడును లక్ష్మణకుమారుఁడును దుశ్శాసనతనయుఁ
డును భగదత్తుఁడును భూరిశ్రవుఁడు నంబష్ఠపతి యగుశ్రుతాయువును దుశ్శాస
నుఁడును సుదక్షిణుఁడును గోసలేశ్వరుం డైనబృహద్బలుండును జిత్రసేనుఁడును
శల్యపుత్రుఁ డైనరుక్మరథుఁడును గర్ణపుత్రుఁ డైనవృషసేనుఁడును వృద్ధక్షత్రుం
డును భగదత్తపుత్రుండును బాహ్లికుఁడును జయత్సేనుఁడును దుర్ముఖుఁడును దు
స్సహుఁడును దుర్మర్షణుఁడును దుర్విషహుఁడును దుర్జయుఁడును గళింగవృషకు
లును వృషవర్మ్మఁడును బౌరవుఁడును శిబివసాతిశూరసేనాభిషాహకాళింగులును
సంశప్తకులును నీమఱందు లయినవృషకాచలులును నుగ్రకర్మ్మఁడును నోఘవం
తుఁడును బృహంతుఁడును క్షేమధూర్తియు జలసంధుఁడును రాక్షసేశ్వరుం డైన
యలంబుసుఁడును గైకేయులును మాలవమద్రకద్రావిడయౌధేయలలిత్థక్షుద్రకో
శీనరమావేల్లకతుండికేరసావిత్రీపుత్రకప్రాచ్యోదీచ్యప్రతీచ్యదాక్షిణాత్యప్రముఖు
లగుపెక్కండ్రును మనబలంబునను గుంతినారాయణబాలభద్రశూరులును బాం
చాలవరుండు కిరీటితుల్యుఁడు నగుసత్యజితుండును విరాటద్రుపదులును సౌభద్రుఁ
డు నంబష్ఠపతిపుత్రుండును బృహంతుఁడును మణిమంతుఁడును దండధారుఁడును
నంశుమంతుఁడును సాముద్రచిత్రసేనుఁడును నీలుఁడును వ్యాఘ్రదత్తుఁడును జిత్రా
యుధుఁడును గైకేయుఁడును జనమేజయుఁడును బార్వతీయుఁడును రోచమానుఁ
డును బురుజిత్తుఁడును గుంతిభోజుండును నభభువును గాశిరాజును నమితౌజుఁడును
మిత్రవర్మ్మఁడును క్షత్రధర్మ్మఁడును క్షత్రదేవుఁడును జిత్రుఁడును జిత్రవర్మ్మఁడును
వార్ధక్షేమియు సేనాబిందుఁడును దత్పుత్రుండును ధృష్టకేతుండును సత్యధృతియు
శైశుపాలి యగుసుకేతుఁడును మదిరాక్షుఁడును సూర్యదత్తుఁడును శ్రేణిమంతుఁ
డును మాగధుఁడును శంఖుఁడును నుత్తరుఁడును వసుదానుఁడును మున్నగువారు
వారిబలంబునను నిట్టిట్టివారిచేతఁ దెగి రనినిరూపించిన నాకర్ణించి వైచిత్రవీర్యుం
డు వినఁగ మనబలమునఁ బ్రధానులు పడిరి హతశేషు లెందఱో యెఱింగింపు
మనుటయుఁ గృపకృతవర్మాశ్వత్థామశల్యకేకయప్రముఖులును దుర్యోధనాదులగు
నీకొడుకులు కొందఱును బ్రదికియున్నవా రని సంజయుండు దెల్పిన నయ్యాంబికే
యుండు మనబలము హతప్రధానంబై కించిచ్ఛేషం బయ్యె. దీనిం గోని యెట్లు
జయింపవచ్చునో యని శోకవ్యాకులితేంద్రియుండై వ్యామోహగ్రస్తచిత్తుండై

సంజయూ, పరమాప్రియంబైనవచనము విని మనము వగఁ జెందె. పిమ్మటఁ జెప్పుదువుగాని కొంతవడి యూరకుండు మనియె ననిన జనమేజయుండు పదంపడి యేమినడిచె నని వైశంపాయను నడుగ నమ్ముని యమ్మనుజపతి కిట్లనియె. ఇంద్రుఁడోడుటయు మేరువు చలించుటయు మిన్ను పడుటయు సూర్యుఁడు నేలకు వ్రాలుటయు సముద్రము లింకుటయుఁ బుణ్యపాపములు నిష్ఫలము లగుటయు నెట్టులట్టుల నమ్మరానికర్ణవధము విని ధృతరాష్ట్రుఁడు నిపుణప్రకారమునఁ జింతించి కర్ణుఁడే పడిన నింక నేమియు లే దనినిశ్చయించి శోకానలదహ్యమానుండై దీనాననుండై దీర్ఘోష్ణనిశ్శ్వాసములు నిగిడించి సంజయుదెసమొగంబై కర్ణుం దలఁచుకొని యిట్లని విలపించె.

## కర్ణునిమరణమునకు ధృతరాష్ట్రుఁడు విలపించుట.

గోగణములలోనియాఁబోతుచందమునఁ గౌరవబలంబున మేటిమగండు మత్తమాతంగవిక్రముఁడు సింహసంహననుఁడు నగుకర్ణుఁడు పడెనే? ఇంద్రుఁడు తాన వచ్చి మార్కొన్నను బిఱుతివియక కడంగుదొర యగునవ్వీరుని మార్వీ ఘోషము విన్నమాత్రన సకలసైన్యము లనికిఁ దొలఁగక నిలువఁ జాలునే? అతనివీర్యంబు నమ్మికదా దుర్యోధనుఁడు పాండవులతోడ వైర మెత్తినవాఁడు. శార్ఙ్గగాండీవపాణులైనకృష్ణార్జునుల నేను విక్రమించి జయింతు నని లోభమోహితుఁడై రాజ్యకాముకుఁడైననాకొడుక కెప్పుడుం జెప్పుచుండె. దుర్యోధనునకుఁ బెంపుఁ గావింపఁ గాంభోజావంతికేకయ గాంధారమద్రమత్స్యత్రిగర్తతంగణశకపాంచాలవిదేహ కులిందకాశికోసలసింహాంగవంగనిషాదపుండ్రచీనకవత్సకళింగతరలాశ్మకాదులం గెలిచి కప్పముఁ గొనివచ్చె. సురలలో నింద్రుఁ డశ్వములలో నుచ్చైశ్శ్రివము రాజులలోఁ గుబేరుఁడు నెట్టులట్లు ధనుర్ధరులలో నుత్తముఁడై వృషుఁ డనం బరఁగినకర్ణుఁడు పాండవులచే నిర్జితుఁ డయ్యె. యాదవుల దెసఁ గృష్ణుఁడు గలిగినట్లు మనదెస నవ్వీరుఁడు గలుగుటంగాదె జరాసంధుఁడు సకలరాజుల ముట్టడించియు మనలతోఁ బగ పాటింపక చెలిమి సేయుచుండె. అట్టిబిరుదుమగండు మృతుఁ డయ్యె నని విని నే నవిసినకలంబుచందంబున శోకసాగరమున మునిఁగి దరిఁ జేరనయ్యెద. నాగుండె వజ్రముకంటె దృఢతరంబుగాఁబోలు సంబంధిమిత్రబాంధవులచేటు వినియు వ్రయ్యలు గాకున్నది. ఇఁకఁ గష్టము లోర్చి బ్రదుకఁ జాలను. విషము మ్రింగియైన నగ్నిం జొచ్చియైనఁ బర్వతాగ్రమునుండి పడియైనఁ బ్రాణములఁ ద్యజించెద ననవుడు సంజయుండు మహారాజా, శ్రీయును గులమును యశస్సును దపస్సును శ్రుతమును బరిపూర్ణములై యునికిం జేసి యందఱు నిన్ను రెండవయయాతినిఁగాఁ దలంతురు. ఇట్టి నీకు ధైర్యము విడిచి

వగవం దగునే యనిన ధృతరాష్ట్రుఁడు వెండియు నిట్లనియె. దైవమే ప్రధానము. నిష్ప్రయోజనం బైనపౌరుషంబు గాల్పనే. కాకున్న లోకవిశ్రుతశౌర్యుం డైన రాధేయుండు పడునే? కర్ణనిధనంబు ధనంజయవిజయంబును విన్న నామనంబున నమ్మిక పుట్టదయ్యె. కష్టములఁ గుడుచుపొంటె బ్రహ్మదేవుఁడు నాకుఁ జిరాయువు గావించెఁగాఁబోలు. సుహృజ్జనవిరహితుఁ డైననాబ్రదు కేల? ఇట్టిదుర్దశం బొంది సర్వజనశోచనీయుండనై దీనముగ నెన్నాళ్ళు లింక బ్రదుకవలయునొ? తొల్లి సర్వలోకములు సత్కరింప బ్రదికి యిపు డీనీచపుబ్రదుకు బ్రదుకవలసె. వజ్ర పాతమునం గూలినయుత్తుంగగిరిశృంగము తెఱంగునను మత్తశుండాలప్రహారమున మడిసినమదద్విరదంబుచందంబునను నర్జుననిహతుండై యావీరశేఖరుండు కయ్యంపునేలం బడియెఁగదా. భీష్మద్రోణకర్ణులు పడినపదంపడియును దుర్యోధనుఁడు గెలుపున కాసపడుట కుంటివాని తెరువునడుపును దరిద్రునిమనోరథమును బిపాసార్తునికి బిందువు నె ట్లట్లు సఫలంబు గానేరదు. మన మొక్కటి దలఁచిన వేఱొక్కటి యగుచున్నది. దైవము బలవంతము. కాల మనుల్లంఘ్యము. దుశ్శాసనుఁడు పౌరుష మేది దీనుఁడై పఱచునెడం బట్టి చంపఁబడియెనే? యుధిష్ఠిరుం డెల్లపుడు పోరు వలదని బోధించినను మూఢుఁడు గావున దుర్యోధనుఁడు రోగి పథ్యాహారంబునుఁబోలె గ్రహింపఁడయ్యె. మఱియు భీష్ముఁడు శరతల్పగతుండై యర్జునునిచేఁ బాతాళసలిలంబుఁ దెప్పించి త్రావి దుర్యోధనుం బిలిచి యయ్యా, యింకనైనం బోరు మాని శాంతిఁ బొంది పాండవులపాలు వారి కిచ్చి నీపాలు నీ ననుభవింపుము. ఈపగ నాతోఁ దెగుఁగాక యని బోధింప నప్పలుకులను జెవిం బెట్టక చేటు దెచ్చికొనియె. క్రీడాపరవశు లగుకొండికలీఁక లూడ్చి పాఱవైచినపులుఁగుచందమునఁ బాండవులు మదీయపుత్రమిత్రబాంధవుల వధియించినం బరమసంకటప్రాప్తుఁడనై యే నెక్కడ కేగుదు? సంజయా, భీష్మద్రోణుల బాండవులు కపటోపాయమునం గెలిచిరనియు న్యాయయుద్ధమున వారలం గెలువఁగ నింద్రుఁడును నోపఁడనియు నీవ మున్న చెప్పితివిగదా, కర్ణవధమున నట్టిది యెయ్యదియేనియుం గలిగెనే? ఆరాధేయుఁడు తనసహజకుండలములు శక్తికి మాఱుగా నింద్రున కిచ్చి దానిని హైడింబుపై నేసి మోసపోయినను సర్పముఖశరంబును జామదగ్న్యు నాశ్రయించి పడసినబ్రాహ్మాదిదివ్యాస్త్రములు నేమయ్యె? ద్రోణప్రముఖులు విముఖులై చెయ్వులు దక్కి యూరకున్నెడఁ గుమారకంఠీరవుం డైనయభిమన్యునివిల్లు దునిమియు నాగాయుతబలుం డైనవృకోదరుని విరథుం గావించి పరిహసించియు వాఁడినారసముల సహదేవుని వెగడుపఱచి ధర్మచింతాపరుండై కరుణించి చంప నొల్లక యవమానించియు రాక్షసేంద్రుఁ డైనఘటోత్కచుని వధించియు నిన్నినాళ్లు గాండీవి తనతోడఁ బోరికి రాక యొదుఁగుతెఱంగున

నే డైఱమెఱసియుఁ బొగడ్త కెక్కినకర్జునుతోడి ద్వంద్వయుద్ధమున రథ
భంగ మయ్యెనే? విల్లు విఱిగెనే? మఱి యస్త్రములు దోఁపకుండెనే? ఏమికారణం
బు గలుగ నబ్బిరుదుమగండు పడియె? వీనిలో నొక్కటియేనియుఁ బొసఁగకుం
డిన వానికిఁ జా వెక్కడిది? అర్జునుం జంపునంతకుఁ బాదములు గడుగ నని య
తండు ప్రతిజ్ఞ చేసెంగదా. వానికి వెఱచి ధర్మరాజు వనమునఁ బదుమూఁడేఁడు
లు కన్నుల నిద్రఁ గానక వగం గుందె. వీర్యవద్వరిష్ఠుం డైనవానిబీరమ్ము నమ్మి నా
కొడుకు పాండవప్రియపత్ని యగుపాంచాలిని సభకుఁ దెచ్చె. పాండవులె విను
చుండఁ గర్ణుఁడు దా నప్పరమపతివ్రతం జూచి యోదాసునిపెండ్లమా, నీమగలు
గొడ్డువోయిరి, మఱియొకమగనిం బొందు మని పరుసములు వలుకఁడే? భీష్మ
ద్రోణులు కౌంతేయులం బక్షపాతమున వధింపకుండిన నేను వారలఁ జక్కాడి
రాజ్యమెల్ల నీకిత్తును, గాండివము నక్షయతూణీరంబులు నేమి సేయం గలవని
దుర్యోధనునకుఁ బలుమాఱులు సెప్పఁడే? బాహుదర్పమునం జేసి యాతండు కృ
ష్ణార్జునుల నొకచీరికిం గొనఁడు. ఇంద్రాదులు వచ్చినను వాఁడు సావఁ డని నేను
దలంచియుంటిని. కవచముఁ దొడిగి నారి సారించెనేని యేమగండు వానియె
దుర నిలువఁ జాలును? చంద్రార్కులు తేజోహీనులైన నగుఁగాని రణధీరుఁ డై
నయారాధేయునకు వధము గలుగ దని నమ్మియుంటిని. దుర్యోధనుఁడు దుశ్శా
సనాదు లగుమూర్ఖులమతం బవలంబించి వాసుదేవుఁడు సంధి సేయ వచ్చినం బ్ర
త్యాఖ్యానంబుఁ జేసె. అది ఫలవంతము గాకుండునే? సుహృదులు వలదువల దని
వారించినను వినక యనయము నభిమానము దుర్బుద్ధియు నింద్రియవశత్వంబును
దన్నుఁ ద్రిప్పికొలుపఁగ దుర్ద్యూతాదులం బాండుపుత్రుల కెగ్గుఁ గావించినదు
ర్యోధనుఁడు తననమ్మినబంటు లగుకర్ణదుశ్శాసనదుర్మర్షణాదులు తెగినం జూచి
కాందిశీకంబు లయినయనీకంబుల నిలువరింపనోపక యేమనియె? శకునియు మ
హారథవరుఁ డైనకృతవర్మయు బ్రహ్మక్షత్రవైశ్యులకు ధనుర్వేదాదుల నేర్పి పొ
గడికఁ గన్నయశ్వత్థామయు ధనుర్వేదాచార్యుఁ డైనకృపుఁడును మద్రేశ్వరుం
డైనశల్యుఁడును దక్కినరాజులు నేమి పలికిరి? కర్ణుఁడు పోరునెడ శల్యుఁ డతనికి
సారథి యయ్యెనే? మఱియు నారాధేయునకు ముందఱను బిఱుందను నిరుగెలం
కులను నెవ్వా రెవ్వరు గావలియై నడిచిరి? పాండవు లెబ్బంగి నతని మార్కొనిరి.
వానిసర్పముఖశరం బెట్లు గాడీవిం జంపక వ్యర్థ మయ్యె? భీష్మద్రోణులు పడిన
పుడే యనాథ మైనమనసైన్య మిపుడు కర్ణుఁడును బడుటం జేసి హతోత్సాహం
బని వేఱ చెప్పవలయునే? ద్రోణుఁడు మృతుఁ డైనం గర్ణుని మనవా రెట్లు లనికిఁ
బురికొల్పిరి? అనంతరవృత్తాంతము దేటపఱుపు మనియడిగిన ధృతరాష్ట్రునకు
సంజయుం డిట్లనియె.

—— దుర్యోధనుఁడు కర్ణుని సర్వసేనాధిపత్యమున నభిషేకించుట. ——

ద్రోణవధానంతరము తత్సుతుండు వితథప్రయత్నుం డై నపదంపడి దుర్యోధనుండు విఱిగి పఱచుచున్నమూఁకల మఱల్చి పోరికిఁ గడంగి విజయముఁ గొని పరమామోదమునం బొదలుపాండవులతోడఁ జక్క పెనఁగలేకున్నను బౌరుషము పట్టి వెన్నియ్యక పోరుచు సంధ్యాసమయమున సేనలఁ దివియించి శిబిరమునకుఁ జనుదెంచి హితులును దాను నుత్తమాసనములం గూర్చుండి మీఁదికార్యం బెయ్యది యని విచారించుచున్నంత సమరతాత్పర్యము సూచించుసకలరాజులయాకారచేష్టితములఁ గనుంగొని కురుకుమాధ్యక్షునివదనమునం జూడ్కి నిల్పి మేధావియు వాక్యవిదుఁడు నగునాచార్యతనయుం డిట్లనియె. ప్రీతి యుపాయము సామర్థ్యము నీతి యనునాలుగు కార్య సాధకము లని పండితులు పలుకుదురు. అవి గలిగినం దైవంబు తోడయి వచ్చును. ఇవినాలుగును గలవారు పెక్కండ్రు మనకుఁ గలిగియుండియు గెలుపున కాసపడక యూరకుండఁ జనదు. అందఱిలోనను సర్వగుణశ్రేష్ఠుం డయినకర్ణుని సర్వసేనాధిపత్యంబున నభిషేకించి మనము తత్పురస్సరులమై పగఱ భంజింతము. ఈరాధేయుఁ డతిబలుఁడు శూరుఁడు కృతాస్త్రుఁడు యుద్ధదుర్మదుఁడు వైవస్వతునిపోలె దుర్ధర్షుఁడునుం గావున శాత్రవులం గెలువఁ గలఁడు. ఇయ్యర్థము మనస్సున నిల్పి యూఱడిల్లు మని యశ్వత్థామ సెప్పిన నాకర్ణించి దుర్యోధనుండు ప్రీతచేతస్కుండై కర్ణుండు పాండవుల వధించి తన్ను గెల్పించు ననియాశ చేసి యూఱడిల్లి ప్రీతిసత్కారమధురంబుగా నాత్మహితప్రకారమున రాధేయున కిట్లనియె. కర్ణా, నీవీర్యమును నామీఁదఁ గలసౌహార్దమును నే నెఱుంగుదు నైన నొక్కటి సెప్పెద నీ కింపగు తెఱంగునం జేయుము. నీవు ప్రాజ్ఞతముఁడవు నాకుఁ బరమగతివి. అతిరథప్రవరు లైనభీష్మద్రోణులు క్రమమున నాకు సేనాపతులై పోరి మడిసిరి. వృద్ధులు నర్జునపక్షపాతులు నగువారికంటె నీవు నా కెక్కుడుప్రీతిఁ గావింతువు. భవద్వచనము పట్టియే యేను వారల నాదరించితి. నీ వనికిఁ దొలఁగినం బదినాళ్లు పితామహుఁడు పాండవులఁ గాచెఁగాని చంపఁడయ్యె. అర్జునుఁడు శిఖండిని ముం దిడికొని త్రోచిన నతండు శరతల్పగతుం డై నపదంపడి నీవు సెప్పఁగ ద్రోణుని సర్వసేనాధిపతిం జేసితి. ఆతండును శిష్యవాత్సల్యమునం జేసి వారిం జెఱుపక ధృష్టద్యుమ్నునిచేఁ దెగియె. ఇకఁ నీకు మిగిలినశూరుఁ డొక్కరుఁడును గన్పట్టఁడు. తొలుతను నడుమను వెనుకను నీవె నన్ను గెలిపింతు వని నమ్మిననాకార్యంబు నెఱవేఱఁగ సర్వసేనాధిపత్యంబున నిన్ను నీవ యభిషేకించికొని సురసేనల నడుపుకార్తికేయుని తెఱంగునం గురుసేనల నడిపి యింద్రుఁడు దానవుల నెట్లు లట్టుల శత్రువుల వధియింపుము. నిన్ను మొగ్గరమునం జూచి పాండవపాంచాలయోధులు విష్ణునిఁ గనుఁ

గొన్న దానవులయట్లు పఱతురు. కటికిచీఁకట్లకు సూర్యోదయంబుపోలె నీప్రతాపంబు వైరులకు సమూలధ్వంసకారణం బయ్యెడి. నిన్నుఁ జూచి సవ్యసాచి యనిమొన నిలువఁజాలఁ డని కర్ణునిపై జయాశ గదురఁ బలికినం దుర్యోధనువచనంబు విని రాధేయుండు గాంధారేయా, పాండవులను జనార్దనసహితంబుగ నేను గెల్చెద. నీకు సేనాపతి నయ్యెద. సంశయింపవలదు. ఇందు సుస్థిరుఁడవు గమ్ము. పాండవుల నిర్జితులఁగా దలంపు మనిపలికె. అప్పలుకు లాకర్ణించి దుర్యోధనుండు దేవగణపరివృతుం డైనసురేంద్రునివిధమున సకలరాజలోకపరివృతుండై లేచి శాతకుంభకుంభముల దివ్యమంత్రాభిమంత్రితము లైనయుత్తమపుణ్యసలిలములఁ దెప్పించి పుణ్యగంధౌషధీప్రముఖము లగుసకలసంభారముల నాయిత్తపఱిచి దుకూలసంవృతం బైనయౌదుంబరపీఠమున నయ్యంగరాజును సుఖాసీనుం గావించి బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు ప్రస్తుతింప నభిషేకించినం బరవీరనిర్మథనకర్మకుఁ డైనకర్ణుండు మంగళాభిషిక్తుండై గోహిరణ్యవస్త్రవాహనాదిపదార్థముల బ్రాహ్మణాదులకు దానత్యాగరూపమున నొసంగి గోవిందసహితు లగు పాండవుల గెలువు మనినభూసురులయాశీర్వాదములం గ్రహించి వందిజనస్తుతివచనములం జిత్తగించి మాగధసంగీతమ్మునకు నెమ్మనమ్మున నలరి రెండవమార్తండుఁ డనం దేజరిల్లుచుండఁ గాంచి నీకొడుకు దన్నుఁ గృతార్థునిఁగ భావించె. కర్ణుఁడును బ్రభాతం బగుడు సకలసైన్యములును గయ్యంపునేలకు నడువఁ బడవాళ్లం బనిచె ననిన విని యాంబికేయుండు సంజయా, దుర్యోధనుఁ డట్లు భాతృస్నేహము నెఱయం బల్కిన సేనాపతిత్వపదవిభాసితుండై రాధేయుఁడు సూర్యోదయానంతర మేమి చేసె నని యడుగ నతం డతని కిట్లనియె.


కర్ణుఁడు యుద్ధమునకు వెడలుట.

అవ్విధమునఁ గర్ణుఁడు సర్వసేనాధిపతియై మఱునాఁడు ప్రభాతమున సకలసైన్యముల ననికి నడువఁ బడవాళ్లకుఁ జెప్పినం గజరథతురగములకు సవరణలు గావించునెడఁ బొడమినససంభ్రమస్వనంబును యోధజనపరస్పరాహ్వాననినదంబును గాలుమానుసు లిటునటుం బఱచునెడం దదీయచరణఘట్టనసముత్థితరవంబును శంఖభేరీప్రముఖవాద్యశబ్దంబును బరమతుములంబై నింగి ముట్టి పరఁగునెడ ధవళతురంగయోజితంబును శ్వేతకేతనసముద్ధామహస్తికక్ష్యాభిరామంబును విమలార్కప్రకాశకార్ముకనికరబంధురంబును బాణపూర్ణతూణగణభరితంబును శక్తిశూలతోమరప్రముఖనానాసాధనసంభృతంబు నగునుత్తమస్యందనం బారోహించి కర్ణుండు శంఖము పూరించి కనకసముజ్జ్వలం బగుకోదండము గ్రహియించి నారి సారించుచు సేనాముఖమున నిల్చుటయు నుదితార్కప్రకాశుం డైనయా రాధేయుం జూచి మనవారు భీష్మద్రోణులును దక్కినవారును లే రనుకొఱంత

యించుకేనియుం దలంపక యుల్లాసంపుఁబెంపునం బొంపిరివోయి శంఖారవము
లను సింహనాదములనుం గావించుటయుఁ గర్ణుండు సేనల మకరవ్యూహవిధాన
మునఁ బన్నె. అందుఁ దాను దుండమునను గన్నుల శకునియుఁ దత్సుతుండును
శిరస్సున నశ్వత్థామయుఁ గంధరంబున దుశ్శాసనప్రముఖు లగుభవత్పుత్రులును
నడుమ బహుళబలపరివృతుండై రారాజును ముందటివామదక్షిణపాదములం
గ్రమంబున నారాయణగోపాలపరివృతుండై కృతవర్ముఁడును త్రిగర్తదాక్షిణా
త్యపరివేష్టితుండై కృపాచార్యుండును వెనుకటిసవ్యాపసవ్యచరణంబులను వరుస
మద్రసేనలతో శల్యుండును రథసహస్రదంతిశతత్రయములతో సుషేణుండును
బుచ్ఛంబున మహాసేనలతోఁ జిత్రుఁడును జిత్రసేనుఁడునుంగా నమరిన నావ్యూహ
ము భీకరసన్నాహమై యొసంగె. అంతకుమున్న సకలసేనాసమేతుండై యేతెంచి
నధర్మరాజు మనమొగ్గరం బర్జునునకుఁ జూపి సవ్యసాచీ, యల్పావశిష్టం బై ఫల్గుసా
రం బైనకౌరవసైన్యమును గర్ణుఁడు నేర్పునఁ బన్ని మోహరించి యనికిఁ గడంగి
నవాఁడు. నీకు విజయంబు ధ్రువంబు. కర్ణుం గెలిచి పదుమూఁడేఁడులంగోలె నా
మనమున నాటియున్నశల్యము నపనయింపుము. నీకు రుచించుమొగ్గరం బమర్పు
మనిన నన్నమాటం గొని యర్జునుండు నిజసైన్యముల నర్ధచంద్రవ్యూహవిధాన
మున సమర్చె. అందు ధనంజయుండు దనచక్రరక్షకు లయినయుధామన్యూత్త
మౌజులతోడఁ దానును ధర్మరాజును మధ్యంబునను గవలు ధర్మజునకుఁ గావలి
యై పిఱుందను వామదక్షిణశృంగముల భీమసేనధృష్టద్యుమ్నులును సాత్యకిప్ర
ముఖు లైనదక్కినవారు నయ్యైచోటులను నుత్సాహమునకుఁ గడంకకు నీడుగా
నిలువ నమ్మోహరంబు సముత్సాహదోహలం బై తనరె. కర్ణకల్పితవ్యూహముఁ
జూచి పాండవులు మడిసిరని దుర్యోధనుండును గాండీవికల్పిత మైనమొగ్గరంబుఁ
గాంచి కర్ణునితోడ ధార్తరాష్ట్రులు సమసిరని ధర్మనందనుఁడును దలంచిరి. అట్టు
లుభయసైన్యంబులు సురాసురసైన్యములమాడ్కిం జూడ నొప్పి పరమసంరం
భమునం బేర్చి పోరునెడఁ గాంతిసౌరభములం జేసి పూర్ణచంద్రార్కపద్మములం
గేరునికృత్తవదనంబులను గరుడప్రహారపతితపంచాస్యపన్నగములవిన్నువున నొ
ప్పువిచ్ఛిన్నబాహుదండములను భండనభూమి పొలిచె. గజవాజిస్యందనములనుం
డి యరాతిశరప్రహారమునఁ గూలునారోహకులు పుణ్యక్షయం బైన విమానము
లనుండి పడుస్వర్గవాసులరీతిం జూడ నొప్పిరి. చతురంగములు తమతమజాతిం దల
పడి మడియుటయు రథికు లేనుంగులను నేనుఁగులు రథికులను రావుతులు కాలు
మానుసులను గాలుమానుసులు రవుతులను రథాశ్వపాదాతము లేనుంగులను
రథాశ్వగజములు కాలుమానుసులను రథపత్తిద్విపములు గుఱ్ఱములను భటద్వి
పములు రథములనుంగా నిర్మర్యాదంబుగఁ బెనంగి పాణిపాదప్రహారమునను శ

స్త్రసంపాతమునను నడరినం బరమఘోరసంగ్రామంబు సెల్లుచున్నంత ధృష్టద్యు మ్న శిఖండిసాత్యకిద్రౌపదేయప్రముఖులు వివిధవేషభూషితబహుళ సైన్యపరివృ తులై మనవారలం దఱుమునెడ వృకోదరుండు వరకిరీటభాసురుండై వరగత్నవి భూషితంబై తారాగణసముజ్జ్వలం బైనశారదనభోమండలము ననుకరించునా యసకవచంబుఁ దొడిగి విధివత్కల్పితం బైనమదవేదండ మెక్కి యుదయగిరిశిఖ రాధిరూఢుం డైనభాస్కరుం ద్రేణి సేయుచుఁ జేదిపాంచాలకేకయకరూశకోసలా దినానానీకములు పరివేష్టింప మనమూఁకలం దఱిమి చారుభీషణతోమరకరుండై నిర్వక్రవిక్రమాటోపమునం జేసి శరత్కాలమధ్యాహ్నమార్తండునిపగిది వెలింగె.

క్షేమధూర్తి యనురాజు భీమునితో యుద్ధము చేసి చచ్చుట.

అట్టియెడఁ గులూతదేశనాథుఁ డైనక్షేమధూర్తి యనురాజు తాను ను త్తుంగమాతంగ మెక్కి యవ్వాయుసూనుపయిం దనయేనుఁగుఁ గొల్పిన నది కొండ కొండనుం దాఁకువిధమున మార్కొనుటయు నయ్యిద్దఱు పరస్పరతోమరప్రహా రముల నన్యోన్యవర్మభేదనముఁ గావించుచు విచిత్రమండలప్రకారములఁ జరించు చు నితరేతర కోదండముల ఖండించుచు క్ష్వేళితాస్ఫోటితరవములును బాణశబ్ద ములును దుల్యములై మెసంగఁ బ్రావృట్పయోధరములకరణి శక్తితోమరవర్షం బుఁ గురియుచున్నంత క్షేమధూర్తి యేచి భీమునివక్షమున నొక్కతోమరంబుఁ గీలించి తోన యాఱుతోమరమ్ములం బరఁగించినం దదీయతోమరస్యూతశరీరుండై వృకోదరుండు మేఘజాలపరివృతుం డైనదివాకరునిభంగిం జూడ నొప్పి యాదిత్య వర్ణం బైనయొక్కతోమరము రయమున నతనిపయిం బడ వైచె. అంతఁ గులూ తపతి పదియమ్ముల నాతోమరంబు దునియలు గావించి యఱువదివాలమ్ముల భీమ సేనుమేనం గీలించినం గోపించి యమ్మారుతనందనుండు విల్లు గొని గర్జితంబుఁ ద్రేణిసేయుగుణక్వణనంబుఁ గావించి వానియేనుఁగుపయిం బటుప్రదరము లడ రించినం జిల్లునం దిరిగి వానిగజ మెంత నిల్పినను నిలువక వాతోద్ధూతవారిదంబు చందంబునం బఱచె. తోడన భీమువారణంబు దానివెంటఁ దవులుటయుఁ దీవ్రప్ర తాపదీపితుండై యక్కులూతపతి యెట్టకేలకు వేదండముఁ ద్రిప్పి నిలువం బెట్టి భీము సామజంబుపయిం గాండజాలంబు నిగిడించి యొక్కభల్లమున వడముడివిల్లు ద్రుంచి వాఁడినారసములు గుప్పించుటయు నయ్యేనుఁగు నేలం గూలె. అగ్గజముపాటున కు మున్న యగ్గలించి భీముఁడు నేలకు డిగ్గి గద యెత్తి వానియేనుఁగుం గూల్చి యాయుధపాణియై తన్ను మార్కొనవచ్చుచున్న యాక్షేమధూర్తినిం గదకు బలి చేసిన నయ్యేనుఁగుచెంగటం బడినయక్కులూతపతి వజ్రతాడితపతితపర్వతప్రాం తమునం గొదమసింగము చంపినమత్తమాతంగముకీతిం జూడ నొప్పె. అట్లు తమ రాజు మడిసినం గులూతయోధులు పెక్కండ్రొక్క మొగి వడముడిం దలపడితదీ

యగదాఘాతమునం దెగటార్చిరి. అప్పుడు కర్ణుండు పాండవానీకంబుఁ జొచ్చి కరి
ఘటల మార్కొని క్రూరనారాచములు నిగిడించినం దద్గజములు పెలుచ నఱ
చునవియుఁ బఱచునవియుఁ గలంగునవియుఁ దూలంగునవియుఁ దిరుగుడువడునవి
యుఁ జిడిముడిపడునవియు నెచ్చునవియుఁ జచ్చునవియునై నం బోరు ఘోరం
బయ్యె. అయ్యెడరు సూడలేక నకులుం డారాధేయుని మార్కొనియె. మఱియు
భీముఁ డశ్వత్థామను సాత్యకి కేకయపతు లగువిందానువిందులను శ్రుతవర్ముఁడు
చిత్రసేనుఁ డనురాజును బ్రతివింధ్యుఁడు చిత్రుఁ డనునృపాలుని దుర్యోధనుఁడు ధ
ర్మరాజును ధనంజయుఁడు సంశప్తకులను ధృష్టద్యుమ్నుఁడు కృపాచార్యుని శిఖం
డి కృతవర్మని శ్రుతకీర్తి శల్యుని సహదేవుఁడు దుశ్శాసనుం దాఁకిరి.

కేకయపతు లగువిందానువిందులు సాత్యకిచేఁ జచ్చుట.

కేకయేశ్వరు లగువిందానువిందులు సాత్యకిం దలపడి పటుప్రదరములు
వరఁగించిన నతండును బ్రతిశరము లడరించుటయు భిన్నకవచులై యయ్యన్నదమ్ము
లిద్దఱు గడిమి మెఱసి శైనేయుతేరు వాలమ్ములం గప్పినం గోపించి శినిప్రభుఁడు
వారివిండ్లు దునిమి శాతసాయకములఁ బరఁగించె. అందుల కలిగి విందానువిందు
లు వేఱువిండ్లు గొని లాఘవసౌష్ఠవములు మెఱయఁ గనకపుంఖకాంతులు దెసల
నెఱయ శరజాలంబు నిగిడించి బాణాంధకారముఁ బచరించి సాత్యకివిల్లు ద్రుం
చినం గదనదుర్మదుం డైనయయ్యదువీరుఁడు కడు నలిగి యొండువి ల్లెత్తి సజ్యం
బుఁ గావించి యొక్కనిశితక్షురప్రమున ననువిందునితలఁ దఱిగె. కుండలోల్లసితం
బైనతమ్మునితల శంబరుమస్తకంబుమాడ్కి నేలం బడి కేకయానీకంబునకు శోకం
బొనరించినం జూడనేరక విందుఁడు కార్ముకాంతరముఁ గొని స్వర్ణపుంఖములు శిలా
శితములు నగుషష్టిశరముల సాత్యకిమేనం గీలించి యార్చి నిలునిలు మనియదల్చి
యనేకసహస్రమార్గణముల ననర్గళప్రసారముగఁ బరఁగించుటయు శినివీరుఁడు
తదీయపటుప్రదరవిక్షతగాత్రుండై నెత్తుటం జొత్తిల్లి పూచినమోదుగుచాడ్పు
నం జూడ నొప్పి కినుక నెదవినయలంతినగవు మొగమునకు సముల్లాససాహసంబు
పెంపు సమకూర్పఁగ నక్కేకయపతిపయి నిరువదేనువాలమ్ములఁ బరఁగించిన
నతండును గడంక నడరె. అవ్విధమున సాత్యకియు విందుఁడునుం బొలివోనిక
డిమి దీపింప నాటోపంబున నేచి యొండొరులవిండ్లఁ దునిమి యొకళ్లొకళ్లగుఱ్ఱ
ముల సమయించి యితరేతరసారథులం దెగటార్చి విరథులై వాలును బలుకయుఁ
గొని శక్రజంభులవిధమున నసియుద్ధమునకుఁ దొడరి వివిధమండలప్రచారములఁ
జరించుచు నొండొరులపలుకలఁ బఱియలువాపి పరస్పరవధమునం బెద్దయుఁ గడం
గుచున్నంత సాత్యకి గండడరి నేర్పునం జేతితాఁకు దప్పించికొని నిజకరవాలమున
రెండుఖండములుగా నఱుకుటయు నావిందుఁడు వజ్రతాడితం బయినమహీధర

మురీతిం గూలె. అవ్విధమున సాత్యకి కేకయపతు లగువిందానువిందుల నిరువు రను వధియించి యుధామన్యునరదం బెక్కి యంతలో విధివత్కల్పితసమానీతం బైనయొండురథ మధిరోహించి కేకయానీకంబుఁ దఱిమిన నతనిముసుమునం గాల్నిలుపనేరక వారు విఱిగి పఱచిరి.

శ్రుతకర్ముఁ డభిసారపతి యగుచిత్రసేనుం దాఁకి యేఁబదితూపు లడరించిన నతండు పంచాశుగముల శ్రుతకర్మను నొంనేసె. ఏసినం గినిసి యావృకోదరతనయుండు నిశితనారాచమున మర్మముఁ గాఁడ నేసి యాచిత్రసేనుని మూర్ఛితుం జేసె. అట్టియెడ శ్రుతకీర్తి వానిఫాలభాగమునం దొంబదియంబకములఁ గీలించె. అంతలో నం దెలిసి యయ్యభిసారపతి శ్రుతకీర్తికార్ముకము ఖండించి యేడువాఁడితూపులు గాత్రమునం గీలించిన నొండువిల్లెత్తి యర్జునాత్మజుండు శరజాలము వానిమేనం గ్రుచ్చి చిత్రప్రకారముఁ గావించినం జిత్రమాల్యధరుం డైనయాచిత్రసేనుఁడు తదీయ శరనికరము దనమేనికిఁ దొడవుగాఁ గఁ బొలిచి శ్రుతకర్మయురమ్ము గాఁడ దొడ్డనారసంబు నేసి నిలునిలు మనియదల్చినం దదీయనారాచప్రహారమున నెత్తుటం దోఁగి గైరికరంజితం బయినమహీధరముమాడ్కిని గుసుమితాశోకపాదపముకై వడినిం బొలిచి కోపదీపితుండై భైమసేని యాచిత్రసేనునిచాపంబుఁ దునిమి మున్నాఱువాలమ్ముల మేను గప్పి యొక్కనిశితభల్లమున మస్తకంబుఁ దఱుగుటయు వానితల బొమిడికముతోడ యదృచ్ఛాచ్యుతం బైనచంద్రబింబము ననుకరించి నేలం బడినం జూచి కోపించి తత్సైనికులు మార్కొనుటయు యుగాంతకాల ప్రేతపతిరీతి రోషరూక్షుండై శ్రుతకర్ముఁడు వారలఁ బొదివి వాలంపగములఁ గురిసినం గార్చిచ్చుపొదివినయేనుంగులభంగి నిరుత్సాహులై నలుదెసలం బఱచిరి. ప్రతివింధ్యుఁడు చిత్రుం దలపడి యైదమ్ము లేసి మూఁట సారథిని నొంచి యొక్కశరమునఁ గేతన మూఁగాడ నేసినం గినిసి యాతండు ప్రతివింధ్యునిబాహూరుదేశముల భల్లనవకంబుఁ బరఁగించినం గోపించి యప్పాండుపౌత్రుం డావిల్లు దునిమి యైదమ్ములు గాత్రమునం జొనుపుటయు నాచిత్రుండు స్వర్ణఘంటోజ్జ్వలంబు వహ్నిశిఖవోలె దురాధర్షము నగుశక్తి నేయుటయు యుధిష్ఠిరపుత్రుండు నగుచు దాని నడుమన రెండుతునియలు గావించిన నది లయకాలంపుఁబిడుగువడువున భీకరంబై నేలం బడియె. అంతఁ జిత్రుండు గద యెత్తి ప్రేసినం బ్రతివింధ్యుగుఱ్ఱములు మడిసె. సారథి సమసె. తేరు నుగ్గయ్యె. అంతలోన రథావతీర్ణుండై ధర్మరాజాత్మజుండు పసిండికామఁ బొలుచుశక్తి నేసినం జిత్రుం డొడిచి పట్టికొని దానిం బ్రగ్మఱఁ బ్రతివింధ్యుపయిం బడ నేయుటయు నది యప్పాంచాలీతనూజుదక్షిణభుజము నొంచి నేలం బడియె. అంతఁ గడుం గోపించి ప్రతివింధ్యుఁడు చిత్రుం జంపఁ దలంపు గదిరినమనంబుతో హేమభూషితం బైనతో

మరం బేయుడు నది వానిమైమఱుఁగుఁ జించి యొమ్ము వ్రచ్చి వల్మీకప్రవేశసము ద్దామం బైనపాముపగిది నేలం జొచ్చె. అట్లు చిత్రుఁడు తోమరతాడితుండై పరిఘాకారంబు లైనవిపులపీవరభుజములం జాఁచి నేలం బడి చచ్చినం జూచి మన వార లాప్రతివింధ్యుం దలపడె మేఘజాలములు భాస్కరుంబోలె శరనికరము లం గప్పిన నప్పాంచాలీనందనుండు వజ్రపాణి యగుపురందరుచందమునం దేజరి ల్లుచుఁ బటుప్రదరనికరముఁ గురిసినం జీకాకుపడి మనమూఁకలు పెనుగాలికిఁ దూలుమేఘములట్లు పటాపంచ లయ్యె.

## అశ్వత్థామభీమసేనులయుద్ధము.

అప్పు డశ్వత్థామ భీముని మార్కొని యొక్కశాతసాయకం బేసి తో డన లాఘవము మెఱయఁ దొంబదియంబకముల మర్మస్థానంబులం గీలించినం బవమానతనూజుండు తదీయశరస్యూతాంగుఁడై రశ్మిజాలపరీతభాస్కరునిభంగి వెలుంగుచు శరసహస్రము గురుతనయుపయిం బరఁగించి సింహనాద మొనరిం చుటయు నాశారద్వతీసుతుం డయ్యమ్ముల ఖండించి యప్పాండవునిఫాలభాగం బున నొక్కదొడ్డనారసంబు గ్రుచ్చినం దాన నతండు శృంగసముల్లసితం బగుఖ డ్గమృగము తెఱంగునఁ జూడ నొప్పి నగుచు ద్రౌణిలలాటమున నారాచత్రయము నాటుటయు నాతండు ప్రావృట్కాలంబున వర్షసంసిక్త మగుత్రిశృంగశిఖరికరణిం బొలిచె. అట్లు లయ్యిద్దఱు బ్రాహ్మణక్షత్రియులు ప్రకటబలోత్కటులై యొం డొరులపయిం గాండజాలం బడరించుచు మహామారుతంబును బహుళప్రవాహం బును బర్వతమునుం గదలింపలేనితెఱంగున నెంత కడంగియు నొకిళ్లొకళ్లం గం పింపఁ జేయఁజాలక యుక్కునం బేర్చి తీవ్రప్రతాపాతపము గాయుచు నిద్దఱుసూ ర్యులుదోఁచి రనుబుద్ధిం జూపఱకుఁ బుట్టించి శరములు కోఱలుగా మండలీకృతకో దండములు భీకరవక్త్రములుగాఁ గ్రొల్వులులవీక మెఱసి యితరేతరశరసంవృతు లై మేఘజాలసంవృతచంద్రాదిత్యులకరణిఁ దనరి ముహూర్తమాత్రమున నన్యో న్యబాణనికరముల ఖండించి యంబుదనిర్ముక్తు లయినకుజబుధులలీలం గ్రాలి పర మదారుణం బైనరణంబు సేయుచున్నంత ద్రోణసూనుండు వృకోదరుని వలపలిం చి యుగ్రశరశతంబు గుప్పించుటయు శత్రునివిజయలక్షణము సైరింపక బకాంతకుఁ డు దాను నతని వలపలించి వాలంపగములం గురిసె. అంత నప్పురుషసింహు లిద్దఱు వివిధమండలమార్గములఁ జరించుచు నన్యోన్యరథభంగమును నితరేతర వధమునుం జేయఁ దొడఁగి యంతకాలంపుగ్రహయుద్ధముచాడ్పునం బరమఘో రప్రకారమున దివ్యాస్త్రము లేయుచు శాంతములు గావించుచు నంతరిక్షం బం తయు శరజాలమయంబుగా నొనర్చిన నవ్వీరవరులశరములమిథస్సంప్రహారము నంజేసి మిడుఁగుఱులతోడ నగ్ని వెడమి యిరువాఁగును నీఱుసేయుచుండ నభో

మండలగతులై నసిద్ధు లద్దిగా నెన్నియేఁ గయ్యములు సూచితిమిగాని యవి దీనఁ బదునాఱవపాలైనం బొందఁ జాలవు. ఈబ్రాహ్మణక్షత్రియులజ్ఞానమును శౌర్యమును ధైర్యమును బలమును పరాక్రమమును నస్త్రవేదిత్వమును లాఘవమును సౌష్ఠవమును నింతయొప్పునే? ఇద్దఱురుద్రు లిద్దఱుసూర్యు లిద్దఱుయములనం బరమఘోరాకారమునం బొల్చుచున్నవారు. ఓద్రోణపుత్రా, యోభీమసేనా, యిది యెంతయు లెస్స పరమాద్భుతం బని ప్రశంసించిరి. అట్టియెడ నశ్వత్థామభీమసేనులు క్రోధసంరంభభరితులై యవుడుగఱచి కన్నుల నిప్పులు రాల నొండొరులం జూచి శస్త్రకాంతులు విద్యుత్ప్రకాశములుగా శరములు ధారలుగా మేఘములరీతిం దోఁచి యన్యోన్యధ్వజసారథితురంగములం బ్రేసి పటుకాండముల నొండొరులగాత్రమ్ములు గాఁడించి యిద్దఱును మూర్ఛిల్లి తేరులపయి నొఱఁగం బడుటయు నాదఱు సూచుచుండ సారథులు రథముల రెంటినిం దొలఁగించి రనిన విని ధృతరాష్ట్రుఁడు సంజయా, సంశప్తకులకును సవ్యసాచికినిం బోరెట్టు లయ్యె? మఱియు నశ్వత్థామయుఁ దక్కినరాజులు నగ్గాండీవిని మార్కొనిరే యని యడుగఁ దత్ప్రకారంబుఁ దెలియం జెప్పెద నాకర్ణింపు మని సంజయుం డతని కిట్లనియె.

## అర్జునుఁడు సంశప్తకులపైఁ గవియుట.

విజయుం డట్లు సంశప్తకబలంబుఁ జొత్తెంచి మహావాతంబు సాగరంబునుంబోలెఁ గలంచి మనోహరలోచనభ్రూరదనశోభితంబులై నిండుచందురుం దొరయువీరవరులమస్తకంబుల నిశాతనారాచంబులం దఱిగి కాడలు లేనితామరలంబోలె రణాంగణంబునం బఱపియుఁ జందనాగరుభూషితంబులై నవృత్తాయతపీనబాహుదండములఁ బంచాస్యపన్నగసంకాశంబులఁ దలత్రాయుధములతోఁగూడ నఱికియు రథ్యములఁ బొలియించియు నొగలనుండి సారథులఁ ద్రెళ్లించియు సిడములఁ గూల్చియు విండ్ల నమ్ములనుం దునిమియు మణిగణవిరాజమానహస్తములఁ దెగ నేసియుఁ జతురంగబలముల సమయించియుఁ గోలుమసఁగి యొసంగుచున్నంత మనవారలు కామమోహితధేనువులపై కుఱుక అంకె వేయుచు నుంకించునాఁబోతులమాడ్కి మదావిష్టులై చెలరేఁగి కుపితుండై తమ్ము నెదిరించునప్పార్థుం దాఁకి వృషభములు కొమ్ముల నెట్టు లట్టులు నిశితశరంబుల నొనేయుటయు నాసంగరంబు రక్కసులతోడి పురందరుసమరంబుపగిది శోభిల్లె. అట్టియెడ నర్జునుండు నిజాస్త్రములం దదస్త్రముల వారించి పెక్కుతూపు లడరించి యారథికులరథములత్రివేణుకములను జక్రములను నిరుసులను గప్పలను నొగలనుం దుమురుసేసియు సారథులం జంపియు రథ్యముల సమయించియుఁ గళ్లెములం ద్రెంచియుఁ బగ్గముల నుగ్గుచేసియుఁ దూణీరములఁ దునిమియుఁ గేతన

ములం గూల్చియుఁ గాలుమానుసుల ఖండించియు నేనుంగుల మర్దించియుఁ దు
రంగముల వధియించియు మహామారుతము మేఘజాలముంబోలె మనమూఁకలఁ
దెరలించి వేవురుమహారథుల కెనవచ్చుతెఱంగున విక్రమక్రీడ సల్పుటయు సిద్ధదేవ
ర్షిచారణులు ప్రస్తుతించిరి. కేశవార్జునులపైఁ గుసుమవర్షంబు గురిసె. దేవదుందు
భులు మ్రోసె. చంద్రునికాంతత్వంబును వహ్నివెలుంగును వాయువుబలమును
సూర్యునితేజంబునుం గలిగి పెంపెసంగుచు నేకరథస్థితు లైనయాకేశవార్జునులు
బ్రహ్మేశానులట్లు లజయ్యులు సర్వభూతు లైనవీరె నరనారాయణులని యశరీరవా
ణిపలికె. అయ్యద్భుతంబుఁ గనియు వినియు నశ్వత్థామ కృష్ణార్జునుల నెదిరించి య
రిగి శత్రువిధ్వంసనోదగ్రశరసంపాతుఁ డై నగాండీవిని బాణసహితం బయినపాణి
చేఁ బిలిచి నవ్వుచు నోవీరవర్యా, నన్ను యోగ్యుఁ డగునతిథినిఁ గాఁ దలంతువేని
యిపుడు సర్వవిధములను నాకు యుద్ధాతిథ్య మిమ్మని పలికినం బహూకరించి యర్జు
నుండు సంశప్తకవధంబును ద్రోణితోడిపోరు నను రెండుకార్యము లిపుడు నాకు
ఘటిల్లె నెయ్యది కర్తవ్యం బని మాధవు నడిగి యశ్వత్థామకు సంగరాతిథ్య మిచ్చు
టయు ముఖ్య మని యతనివలనం దెలిసి నిశ్చయించినం బుండరీకాక్షుండు జైత్ర
విధిసమాహూతుఁ డగునింద్రుని వాయుదేవుఁ డెట్టు లట్టుల యర్జుననరదము ద్రో
ణికి సమ్ముఖము గావించి సమరైకతానమానసుం డైనయయ్యాచార్యనందనున
కిట్లనియె. అశ్వత్థామా, చక్క నిలిచి ప్రహరింపుము. తాఁకు సైరింపుము. ఏలి
నవానిసొమ్ము దిన్నఋణముఁ దీర్పఁగ నుపజీవుల కిదియే ముఖ్యకాలము. విప్రుల
వివాదము సూక్ష్మంబైనను క్షాత్రజయాజయములు స్థూలములు. మోహమున
నేసత్కారము గాండీవివలనం బడయఁ గోరితివి దానిని సుస్థిరుండవై పొందుమని
గోవిందుఁడు సెప్పినం గురుపుత్రుం డట్లయని యమ్మురారిపై నఱువదితూపులను
గాండీవిపయిం బాణత్రయమునుం బరఁగించె. అందుల కలిగి యర్జునుఁడు మూ
డమ్ముల విల్లు దునిమినం ద్రోణతనయుండు ఘోరం బైనయొండువి ల్లెత్తి నిమే
షమాత్రలోన సజ్యముఁ గావించి మున్నూఱుతూపుల వాసుదేవుని వేయిశర
ముల నర్జునుని నొంచి యవ్వీరునకుఁ గాలు చే యార్పరాకుండఁగ శరసహస్రము
లయుతములు ప్రయుతము లర్బుదములు నడరించె. ఏమి చెప్పుదు నప్పు డాబ్రా
హ్మణునితూణమునను శరాసనమునను నల్లెత్రాటను భుజములను గరములను వక్ష
మునను నోటను నాసికమునను గన్నులను వీనులను శిరస్సునను రోమకూపము
లను రథధ్వజములను శరపరంపరలు నిగిడినవిధంబు దోఁచె. అట్లు మాధవపాం
డవులం గాండజాలసంవృతులం గావించి యాచార్యతనయుండు ముదమునం బొ
దలి సింహనాదము చేసినం గర్జితోపమం బైనయయ్యులివు విని పాండవమధ్య
ముఁ డచ్యుతున కిట్లనియె. మాధవా, చూచితే గురుతనయునిదౌర్జన్యము తన

యమ్ములం గప్పినమనల హతులఁగాఁ దలఁచినవాఁడు, మదీయశిక్షాబలములసొం పేర్పడం బేర్చి వానిసంకల్పంబు వమ్ము గావించెద ననిచెప్పి ద్రౌణిసాయకముల నన్నింటిని వేయువేల మూఁడేసితునియలుగా ఖండించి యుదితాదిత్యుండు తుహినపటలింబోలె విరియించి యగ్గురుతనయు నగ్గలిక యుడిపి క్రమ్మఱి సంశప్తకుల పయిం గవిసి గాండీవముక్తంబు లయిననానాశితశరములఁ గ్రోశమాత్రము కొలందిదవ్వు ననుం బడునట్లు బిట్టేసినం బరశుదారితము లైనపాదపములరీతిం బొల్చు వేదండశుండాదండములును వజ్రప్రహారమునం గూలుశైలములఁ గ్రేణిసేయు నేనుంగులును విశకలితంబు లయిన గంధర్వనగరోపమస్యందనంబులును గడికండ లయినఘోటకగాత్రంబులును దుమురైనపాదాతంబులునై రౌద్రబీభత్సం బయినయాహవక్షోణీతలంబునఁ బ్రళయమార్తండునిభంగి వెలుంగుచు ఖరశరకిరణంబుల సంశప్తకమహార్ణవం బింకించుచు వీఁక మెఱసి క్రమ్మఱ ద్రోణసూనుం దలపడి వజ్రసన్నిభము లగుదొడ్డనారసము లేయుటయు నతండును భండనోత్సాహమునం గడంగిన నపాత్రీయుల విడిచి యుత్తమశ్రోత్రియుం గ్రహించునన్నదాతవిధమున సంశప్తకులం గ్రేడించి యశ్వత్థామపైఁ గవియుటయు నయ్యిద్దఱిపోరు తారకాసురవధమున శుక్రాంగిరససంగరంబు తెఱంగునఁ బరమభీకరం బయ్యె. అంత నర్జునుండు ద్రోణిభ్రూమధ్యమున నొక్కవాఁడినారసంబు నాటిన నతం డూర్ధ్వరశ్మి యగురవివిధమున నొప్పి శరశతములఁ గృష్ణార్జునులపై నిగిడించిన నయ్యాదవపాండవులు నిజమయూఖజాలవిలసితులై లయసమయసూర్యు లిద్దఱు తోఁచి రనం జూపట్టిరి. అట్టియెడ సవ్యసాచి గోవిందునిపై నన్నియమ్ములు పరఁగించుట కలిగి యంతట నిగుడునట్లుగా నొక్కఘోరాస్త్రి మేసి వజ్రాగ్నియమదండకల్పము లయినతీవ్రమార్గణముల నయ్యాచార్యసుతుపయి నడరించినం గోపించి యతండు మృత్యువునైనను నొంపఁ జాలినవాలంపగములఁ గేశవగాండీవులపయి నేసె. అంతలకుఁ గడుం గనలి పాండవమధ్యముండు వానికాండముల ఖండించి వానికి రెండుమడుంగు లగువాఁడితూపుల నగ్గురుపుత్రుని రథరథ్యసూతకేతనసహితంబుగాఁ గప్పి క్రమ్మఱ సంశప్తకులపై నడరి వారివిండుల ఖండించియు నమ్ములఁ దునిమియుఁ దూణములఁ దుమురుసేసియు మౌర్వీగుణములఁ ద్రుంచియుఁ గరములఁ నఱికియు బాహువులఁ దఱిగియుఁ గైదువులఁ బొడిచేసియు గొడుగులఁ బఱియలువాపియుఁ గేతనములఁ గూల్చియుఁ దురగములఁ జంపియు రథావయవముల శకలములఁ గావించియు మాల్యములఁ ద్రెంచియుఁ దొడవుల రాల్చియుఁ గుంజరములఁ దెగటార్చియుఁ గాలుమానునులఁ బరిమార్చియుఁ బద్మార్కపూర్ణేందునిభాననములు కిరీటమాల్యాభరణోజ్జ్వలములు నగుశూరమస్తకముల ధరణిం దొరిఁగించియు నాభీలప్రకారం

బొనర్చినం జూచి యంగవంగకళింగనిషాదవీరులు పెక్కం డ్రుక్కనం బేర్చి తాఁకి న వారల నందఱను బూర్వమృతులకుఁ దోడుగాఁ బ్రేతరాజనివేశనమునకుఁ బని చిన హతశేషము లగునసీకములు కాందిశీకము లగుడు గురుతనయునిపై నడరి రవిరశ్మిప్రకాశంబు లయిననిశితమార్గణములఁ బెనుగాడ్పు మేఘజాలముల నంశు మంతు నెట్టు లట్టుల కప్పినం గోపించి యశ్వత్థామ నిజాశుగముల నయ్యమ్ములం ద్రుంచి ప్రావృట్పయోధరము చంద్రాదిత్యులంబోలెఁ గృష్ణార్జునుల శితశరముల నావరించి సింహనాదముఁ గావించె. అయ్యర్జున కలిగి కిరీటి శరగ్రహణసంధా నమోక్షణంబు లూహింపరానిరయమునం బేర్చి పటుశరాసారంబుఁ గురిసి చీఁక ట్లు పచరించి చతురంగబలాంగముల నిజాశుగములం జొనిపి నొంచినం గినిసి ద్రోణి కృష్ణార్జునులమేనులు గాఁడ దొడ్డనారసంబు లేడేసి యేసి రక్తసిక్తాం గులం గావించినం జూపఱు సంపూర్ణవిద్యుఁ డైనయశ్వత్థామశరములఁ గేశవ పాండవులు సమసి రనితలంచిరి. అట్టియెడఁ బంకజాక్షుండు సవ్యసాచిం జూచి యయ్యా,యిప్పు డిట్టు లేమఱుపడం జనునే? తడయక యీయోధవరుం బరి మార్పుము. ఇం కొక్కింతసె పొప్పరికించినం బ్రతీకారసాధ్యంబుకానిరోగంబు తెఱంగున నితండు పెంపెసఁగినం గార్యంబు దప్పు ననవుడుఁ గిరీటి యట్లయని యప్రమాదబంధురుండై క్రోధధురంధరుండై గాండీవముక్తము లగుపటుప్రదర ముల నగ్గురుతనయుని కమ్మగంద మ్మలందినబాహువులను వక్షఃప్రదేశమును మస్తకమును నూరువులనుం గాఁడ నేసి పగ్గములఁ ద్రెంచి రథ్యముల నొవ్వ నేయు టయు నవి వాయువేగమునం దేరీడ్చికొని పఱచె. అర్జునబాణముల నొచ్చిన వాఁడు గావున నశ్వత్థామ క్రమ్మఱ నమ్మరుత్పతిసుతుం దాఁకఁ దలంపక నిరుత్సా హుండై యూఱడిల్లి మెల్లన రాధేయుబలముఁ దఱియం జనియె.

అర్జునుఁడు దండధారదండుల వధించుట.

అవ్విధమున మంత్రౌషధక్రియాప్రయోగముల దేహమునుండి వ్యాధినిఁ దొలఁగించువిధమున రథ్యము లశ్వత్థామను రణాంగణమునుండి తొలఁగించుటయు సవ్యసాచి గర్జితోపమం బయినరథనేమిస్వనంబు నిగుడఁ గపికేతనస్ఫూర్తి సము ద్దామంబుగా సంశప్తకులఁ దలపడ నరుగుచున్నంత జనార్దనుండు దండధారుని కోల్తల కోహటించుపాండవబలములయార్తరవం బాకర్ణించి యర్జునుం జూచి శిక్షాబలముల నేమిటను భగదత్తునకుఁ దక్కువగానిమగధేశ్వరుం డైనదండధా రుఁడు మనమూఁకలపైఁ దనయేనుఁగుం గొలిపి వీఁకి మెఱయుచున్నచందంబు తోఁచుచున్నది. తొలుత వానిం దెగటార్చి పిదప సంశప్తకులపై నడరుట మే లని నేఁ దలంతు ననిపలికి వానికి సమ్ముఖమ్ముగఁ దేరు పఱపె. అక్కడ నంకుశగ్రి హణనిపుణుఁడు సమరసన్నాహమునం గేతుగ్రహంబుమాడ్కి దుస్సహుఁడు నగు

దండధారుఁడు పిఱుగున కెనవచ్చుఘీంకారమునం బగఱగుండియ లవియింపఁ జా
లినదాని విధివత్కల్పితంబైనదాని సురగజముం బురుడించుదానిఁ దనయేనుంగు
నెక్కి శరజాలం బడరించియు నేనుఁగుం గొలిపియుఁ జతురంగబలములఁ దుత్తు
మురుసేయుచుండం గాంచి బీభత్సుండు గాండీవజ్యాఘోషభీషణంబుగను శంఖ
భేరీమృదంగనినాదబంధురంబుగనుం గవిసిన నమ్మగధేశ్వరుండు కిరీటిపైఁ బంద్రెం
డుతూపులను జనార్దనుపైఁ బదునాఱమ్ములను గుఱ్ఱములపై మూఁడేసిశరములను
నేసి యార్చి పేర్చి నవ్వె. అందుల కలిగి వివ్వచ్చుఁడు నిశితభల్లముల వానియ
ల్లెను విల్లునుం ద్రుంచి కేతనంబుఁ గూల్చి మావంతులను దోడవచ్చుగజరక్షకు
లను సమయించుటయు నద్దండధారుఁడు సముద్దండుఁడై వాతజవమగుతనమత్త
గజమున వెగడుపఱుపం గమకించి కృష్ణార్జునులపై బహుళతోమరంబు లేయు
చు నేనుంగును మిక్కిలి పురికొలిపె. అట్టియెడ సవ్యసాచి కరికరాకారము లగు
నమ్మగధపతిభుజములను బూర్ణచంద్రసిభాననం బైనమస్తకంబును క్షురప్రత్ర
యమునఁ దఱిగి యేనుంగుపై శరశతంబు గుప్పించిన నయ్యేనుఁగు కనకభూషి
తము లగుపార్థబాణములను గాంచనవర్మంబునను నభిరామం బైనగాత్రంబునం
జేసి రేయి దవదహనజ్వలితౌషధిద్రుమం బైనపర్వతంబుమాడ్కిఁ దేజరిల్లె కిరీటి
శరవేదనార్తంబై ప్రబలఘీంకారం బొనర్చి తిరుగుడువడియుఁ జిడిముడిపడియు
నిటునటుం బఱచియుం గొండొకవడికి వజ్రాహతం బైనపర్వతంబు మాడ్కి
దండధారునియట్టితోడ నేలం గూలె. అట్లు హేమాద్రిశిఖరసంకాశం బైనయే
నుంగుతోడ దండధారుఁడు పీనుం గగుటకు శోకక్రోధములు మనంబునం బెనం
గొనంగ వానితమ్ముఁడు దండుఁడు సముద్దండతం బేర్చి వేఱొక్కమదవేదండ మె
క్కి తాఁకి వైదేసితోమరముల జనార్దనుని ధనంజయునిం బిట్టేయుటయు వివ్వ
చ్చుఁడు తోడన శుభాంగదములు చందనానులిప్తములు నగువాని బాహువులు
నఱికి గిరిశిఖరమునుండి డొల్లిపడుమహోరగముల తెఱంగున గజకుంభమునుండి
ద్రెళ్లించి యర్ధచంద్రశరమున మస్తకంబుఁ గోయుటయు నది రుధిరార్ద్రంబై సా
యంవేళ నస్తగిరిం బడుభానుబింబమురీతిం జూపట్టె. అంత సూర్యకిరణప్రకాశము
లయినయాశుగముల శారదాభ్రసన్నిభం బయినయయ్యేనుఁగుం గాఁడ నేయుడు
నది వజ్రాహతం బగుహిమవద్గిరిశిఖరముకరణిం గూలె. అట్టియెడఁ దదీయులు
పెక్కండ్రు బహుళసైన్యగజములతోఁ గ్రీడిం జుట్టుముట్టిన నబ్బిరుదుమగం డా
శుండాలముల నగ్గజద్వయంబునకుఁ దోడుగా యమపురమున కనిచి తనమునుము
న నున్నవారలం గనుపుకొట్టుటయుఁ బాండవసైనికులు సురేంద్రుంబోలె నప్పా
ర్థుం బరివేష్టించి యోశత్రుసూదనా, మాభాగ్యమున శత్రువుల వధియించి మమ్ముఁ
గాచితివి. నీవు తలపడకుందువేని దండధారునకు మేము వశులైన నిప్పుడు మే

మెట్టు లట్టులు మసపగవా రుల్లసిల్లుదురు. నీకరుణకలిమింజేసి సుఖించితి మని ప్రశంసించిన నాకర్ణించుచు సవ్యసాచి వక్రాతివక్రగమనప్రచండుం డై నయంగార కునిరీతిం బొల్చుచుఁ గ్రమ్మఱ సంశప్తకులపై నడరె.

అట్లు లడరి చతురంగబలములఁ దిరుగుడువఱచియు బడలుపఱచియు మఱలించియుఁ దెరలించియు రథ్యసూతకేతనవ్రాతంబుల రూపడంచియుఁ జాపమార్గణములఁ ద్రుంచియుఁ గైదువులతోడ రథికులచేతులఁ దఱిగియు భుజములనఱికియు భల్లార్ధచంద్రాదినానాశరముల మస్తకంబులఁ గోసియు బీభత్సంబు సేసినం గినిసి సంశప్తకులు పెక్కండ్రు కామమోహితధేనువులపై కఱుక నుంకించునాఁబోతు ప్రతివృషభంబునుంబోలె నయ్యర్జును దాఁకి శరాసారంబు నిగిడించిన వారికతనితోడిపోరు దనుజులకు సురేంద్రునితోడికయ్యమువిధమునం బరమఘోరం బయ్యె. అప్పు డుగ్రాయుధసుతుండు క్రూరభుజగములం బోనిశాతబాణముల మూడింటిని గ్రీడిపయి నేయుటయు నాతండు వానితలఁ గోసినం గోపించి తదీయులు మారుతప్రేరితంబు లయినవారిదములు నిదాఘాంతమున హిమవంతంబునుంబోలె నయ్యాఖండలనందనుం దలపడి శరాసారముఁ గుఱియుటయు విజయుండు నిజాస్త్రములం దదస్త్రముల వారించి పెక్కుతూపు లడరించిన వహ్నివాయువర్షములంజేసి సొంపుసెడినధనవంతులగృహములరీతిం జూపట్టువిశకలితాంగంబు లైన నుత్తమస్యందనంబులును బిడుగు వడినం గూలినగిరిశిఖరసదనములమాడ్కి సంభిన్నవర్మంబు లై మడిసినయేనుంగులును నారోహకులతోడ ధరణిం ద్రెల్లి నాలుకలను ద్రేవులను వెడలంబెట్టి రుధిరార్ద్రింబై యత్యంతదీనదశకు వచ్చినతురంగంబులును దిరుగుడువడియుఁ జిడిముడిపడియు బడలువడియు నాక్రందనంబుతోడం బడుకాలుమానుసులునై కయ్యంపునేల ఘోరం బయ్యె. అట్లు విశిష్టాభిజనశ్రుతులు పుణ్యకారులు నగునుత్తమరాజులకు స్వర్గప్రాప్తి గూర విక్రమించునక్కిరీటికోల్తల సైరింపక మనవారు పెక్కండ్రొక్కుమ్మొగి మార్కొనుటయు శస్త్రవ్రాతసంకులం బై నయచ్చతురంగబలమహార్ణవంబును శస్త్రాస్త్రసేతువునం దాఁటుచున్నయన్నరుం జూచి నారాయణుండు పార్థా, యేల యీమూఁకలతోడఁ గ్రీడించెదవు? సంశప్తకబలములం దెగటార్చి కర్ణవధమునం ద్వరపడు మనిన నట్లయని యాబిరుదుమగండు దైత్యగణముపయిం గవియుసురేశ్వరునివీఁక మెఱసి యాసంశప్తకబలములం దలపడి శరగ్రహణసంధానమోక్షణముల నిరూపింపరానిపరమరయమునం బేర్చి యొక్కమాత్రలోన నమ్మూఁకలం గనుపుకొట్టుటయు నత్యంతాశ్చర్యము నొంది గోవిందుఁడు కమలాకరముఁ జొచ్చుహంసలరీతి ధవళాశ్వములు జవమున మనసైన్యంబుఁ జొచ్చుచు నరుగుచుండ భండనక్షోణిం జూచి గాండీవి కిట్లనియె. పరమరౌద్రం బై నక్షత్రియక్షయము దుర్యోధననిమి

_త్తమున నగుచున్నది. విఱిగినకనకపృష్ఠచాపములను దైలధౌతములై తోలూడ్చినపాములపగిదిం జూడ నెప్పవిచ్చిన్న హేమపుంఖశరములను దుములైన గదాఖడ్గచర్మశక్తిశూలభిండివాలపరశుముసలప్రముఖంబు లగునానాసాధనంబులను జచ్చియుఁ జేతికైదువుల విడువక బ్రదికినయట్లు లొప్పమృతనరగాత్రంబులను గదాఘాతముననుముసలప్రహారముననుశరసంపాతముననుగజవాజిరథసంక్షోభంబులను గాలు చేయి ప్రక్క డొక్క యని యేర్పఱుపరానితీరునం జూపట్టుపదాతికాయఖండములను జందనలిప్తములు కేయూరాదిభూషితములు కరికరాకారములు నగునికృత్తబాహుదండములను గులగులలై కూలినతేరులను నెత్తుటం జొత్తిల్లినపరేతహయకళేబరంబులను నుత్తుంగగిరిశృంగాకృతిం బొల్చి నాలుకలు వెడలించి చచ్చినయేనుఁగులయంగంబులను గజయోధులయట్టలను నేనుంగులజూళ్లచింపులను ఘంటలగండ్రికలను వైదూర్యంపుఁ గామలయంకుశములశకలములను నెగలతునియలను మైమఱుఁగులయఱవఱలను జామరాతపత్రములపఱియలను దొడవులపొళ్లను సంగ్రామరంగంబు రౌద్రబీభత్సంబై గ్రహనక్షత్రప్రకాశములైనకుండలములఁ దనరి శ్మశ్రువిలసితంబులై సకళంకపూర్ణచంద్రబింబములం దొరయువీరశేఖరులవదనములం జేసి వికచకుముదోత్పలపద్మరుచిరంబైనకొలనురీతిని రుచిరవదనముల విలసిల్లి తారాగణవిచిత్రంబై నిర్మలేందురుచిరుచిరంబైన నభోమండలముకైవడిని నభిరామంబై కన్పట్టుచున్నది. ఇట్లు చేయఁగ నీకును సురేంద్రునకునుం దగుఁగాని లాఁతుల కలవియే యని కృష్ణుఁ డర్జుననకు సమరభూమిం జూపుచుం జనుచుఁ బాండ్యరాజుకోల్తలకోహటించు కురుసైనికులయాక్రందనరవం బాకర్ణించి రయమున నరద మచ్చటికిఁ బఱపె. అక్కడఁ బాండ్యుఁడు లయకాలరుద్రునిమాడ్కి రౌద్రంబునం బొంపిరివోయి మనమూఁకలఁ గనుపుకొట్టెననిన విని యాంబికేయుండు సంజయా, పాండ్యుఁడు లోకవిశ్రుతవీరుఁ డనిచెప్పితివిగాని వానివిక్రమంబు సవిస్తరంబుగ నింతకుఁ జెప్పవైతివి. విన గుతూహలం బయ్యెడి. అతనివిక్రమశిక్షాప్రభావవీర్యప్రమాణదర్పములం దెలియం జెప్పుమనియడుగ సంజయుఁ డతని కిట్లనియె.

పాండ్యుఁ డశ్వత్థామతో యుద్ధము చేసి చచ్చుట.

సమాప్తవిద్యులై యతిరథోత్తము లనం బేరు వడసినభీష్మద్రోణాదులును దనకు సాటి గారనియు వాసుదేవార్జునులకుఁ దాను దక్కువ గాఁడనియుం దలంచునప్పాండ్యమలయధ్వజుండు కాలాంతకునిరీతి ఘోరాకారమునం బొల్చి కర్ణుం దలపడి శరపరంపరలు పరఁగించి తదీయచతురంగబలముం గుమ్మరిసారెరీతిం దిరుగుడువఱిచి వాయువు వారిదపటలమునుంబోలెఁ దెరలించియు నేనుంగుల మావంతులతోడను బరిగోలలవారితోడను వజ్రమున నింద్రుఁడు కొండలంబోలె

వాఁడితూపులఁ గాల్చియు గుఱ్ఱముల రావుతులతోడం ద్రెళ్లించియుఁ దేరులను నుగ్గుచేసియుఁ గాలుమానుసుల వధించియు మఱియుం దనపై నడరినపుళిందఖగబాహ్లీకనిషాదాంధ్రకుంతలభోజదాక్షిణాత్యయోధుల నాయోధనభూమికి బలి చేసియుఁ గోలుమసంగుచున్నంత నాచార్యసూనుండు సంభ్రమింపక యసంభ్రాతుఁడై నయప్పాండ్యు మార్కొని ధైర్యధుర్యుండై స్మితపూర్వమధురముగ నిట్లనియె. ఓరాజవర్యా, విశిష్టకులజనితా, శ్రుతసంపన్నా, వజ్రసంహననా, ప్రఖ్యాతబలపరాక్రమా, మహనీయచాపముఁ జేతులం బూని పిడికిట నాయతమౌర్వీగుణం బాకర్షించి గర్జితోపమం బైనఘోషం బొనరించెదవు. రయమునం బేర్చి యరాతులపై శరవర్షముఁ గురియునిన్ను మార్కొన నేను దక్క లాఁతివాఁ డోపండు. నిస్సహాయుఁడవై వెఱవక ధైర్యధుర్యుండవై నీవు కొదమసింగము క్షుద్రమృగములంబోలెఁ జతురంగబలములఁ దెగటార్చుచున్నవాఁడవు. రథఘోషమున భూమ్యంతరిక్షములం బ్రతిధ్వని నిగిడించి గర్వితోల్లాసభాసురం బైనకార్ముగులుతెఱంగునం జూపట్టెదవు. అంధకాసురుఁడు త్ర్యంబకునితోడంబోలెఁ గ్రూరనారాచము లడరించి నాతో నెక్కొనితోడం బోరు మనిన నప్పాండ్యభూవల్లభుం డట్ల యగుంగాక ప్రహరింపు మని యశ్వత్థామకుఁ జెప్పి తదీయశరవిద్ధుండై యొక్కకర్ణినారాచమున ద్రోణతనయుని నొ నేసిన నాతండు నవ్వుచు మర్మభేదనసముదగ్రము లగ్నిశిఖాసంకాశములు నగునమ్ములఁ గొన్నింటిని నిగిడించి తోడన మఱియుం గొన్నివాలమ్ముల దశమగమనమునం బరఁగించె. వానిం దునిమి పాండ్యుఁడు తొమ్మిదియమ్ము లశ్వత్థామమేనం గీలించి బాణచతుష్టయమున నతనిరథ్యములం బరిమార్చి యల్లెఁ ద్రుంచి విల్లు దున్మిన నాతం డొండువి ల్లెత్తి తత్క్షణంబ సజ్యంబు గావించుచున్నంత సేవకజనులు వేఱుగుఱ్ఱముల నాల్గింటిని గురుతనయునరదమునకుఁ బూన్చిరి. అంత నగ్గురుసుతుం డగ్గలించి శరసహస్రంబులు పరఁగించి దిక్కులు నాకసంబును శరమయంబులు గావించినం బాండ్యుఁడు వానిబాణము లక్షయము లవుటఁ దెలిసియుఁ బరమప్రయత్నమున నన్నింటికి మాఱేసి తునిమి చక్రరక్షకులపై శితశరముల నిగిడించె. అతనికరలాఘవము మెచ్చుచు నశ్వత్థామ మండలీకృతకోదండుఁడై పర్జన్యుఁడు సలిలధారలంబోలె నెనిమిదియెడ్లు వహించునెనిమిదిబండ్ల నిండినయమ్ము లాపవలింటియష్టమభాగమున శాత్రవులపయి నిగిడించినం గ్రోధభరితుండై కాలాంతకునిరీతిం దేజరిల్లునగ్గురునందనుం జూచి పాండ్యభటులు సోలుటయు నమ్మలయధ్వజుండు వాయవ్యాస్త్రమున నాబాణవర్ష మడఁగించి యార్చె. అయ్యార్పు సైరింపక ద్రోణసుతుండు మలయపర్వతసంకాశం బైనవానికేతువును జందనాగరులిప్తం బయినదానిం గూల్చి నాలుగమ్ముల హయచతుష్ట

యమును సమయించి యొక్కబాణంబున సారథిం బరిమార్చి గర్జితోపమమహోర్వీ
ఘోష మగుచాప మర్ధచంద్రశరమున నఱికి రథము తిలప్రమాణశకలములు
గావించి సర్వాయుధములనుం ద్రుంచియుఁ దనకుఁ జిక్కనయప్పాండ్యభూవల్లభుని
రణేచ్ఛం జేసి చంప నొల్లఁడయ్యె. అట్టియెడఁ గర్ణుఁడు గజానీకముపయిం దలప
డి పటుప్రదరనికరములఁ బరఁగించి క్రోలుమసంగుచుండె. అంత నప్పాండ్యుఁడు
విరథుండై మత్తశుండాలం బెక్కి పటురయమున నయ్యేనుఁగుం గొలిపి బలాతి
శయమునను నస్త్రజాలమునను బరమప్రయత్నమునను దీవ్రక్రోధముననుం బే
ర్చి తరణికిరణప్రకాశం బైనయొక్కతోమరంబు గురుసుతునిశిరము గుఱి చేసి
యేసి సమసితివి సమసితి వని పెలుచ నార్చినం దత్తోమరాభిహతంబై యంకు
శమాల్యమౌక్తికభాసురం బైనయశ్వత్థామయుష్ణీషము వజ్రాహత మగుగిరిశృం
గము తెఱంగున ధరణిం బడియె. కాలఁ ద్రొక్కినపాముకైవడిఁ దీవ్రక్రోధదీపి
తుండై యాచార్యసూనుండు యమదండసన్నిభము లయినపదునాలుగమ్ము ల
రిం బోసి యయ్యేనుఁగునాలుగుకాళ్లను నాలుగుతూపులను దొండము నొక్కయ
మ్మునను నారాజుభుజముల మార్గణద్వయమునను శిరంబు నొక్కశరమునను దద
నుచరుల నాఱుగురం బాణషట్కమునను బిట్టేయుటయు నాయతవృత్తములు
చందనలిప్తములు సువర్ణముక్తామణివజ్రభూషణములు నగుతద్బాహువులు గరు
డనిహతము లగుపాములరీతిని రోషతామ్రవిశాలలోచనము పూర్ణేందునిభానన
ము నగుశిరస్సు కుండలద్వయమధ్యమునం దనరి విశాఖాద్వయమధ్యగతం బైన
చంద్రబింబముచాడ్పునను బొల్పారె యేనుంగుతోడ నేలం బడుటయు నాఱుతునియ
లైనయేనుంగును నాల్గుశకలము లయినపాండ్యరాజునుం గూడి దశశకలంబులై
యింద్రుఁడు కులిశమున దశదైవతం బయినహవిస్సు విభాగించినవిధంబున
నొప్పె. అట్లు పాండ్యనాథుఁడైనమలయధ్వజుండు బహుళగజవాజినరగణముల
వధియించి స్వధం బొంది సలిలప్రహారమునఁ బ్రశాంతుఁ డగుపితృప్రియుం డైన
యగ్నిమాడ్కి నుపశాంతుఁడయ్యె. బలివిజయంబునాఁడు సురగణపరివృతుండైన
యింద్రుఁడు హరింబోలె సంపూర్ణవిద్యాప్రభావమునఁ బాండ్యవధము నిర్వర్తించి
కృతార్థుం డైనయాచార్యపుత్రుని సుయోధనుఁడు సుహృద్వృతుండై ప్రశం
సించె ననిన విని ధృతరాష్ట్రుఁడు సంజయా, పాండ్యవధానంతర మేకవీరుఁ డై
నకర్ణుఁడు రిపుసేనలం దఱుమఁగ సంపూర్ణవిద్యుఁడు శంకరానుజ్ఞాతుఁడు నగున
ర్జునుం డేమి చేసె? అతనివలనం గాదె మనకు మీఁదుమిక్కిలి వెఱ పయ్యెడిఁ
గావున సవ్యసాచియనంతరవర్తనంబుఁ దెలియఁ జెప్పుమని యడుగ గావల్గణి వై
చిత్రవీర్యున కిట్లనియె.

సంకులయుద్ధము.

పాండ్యుఁడు హతుఁ డై నపదంపడి కృష్ణుఁడు తమమూఁకలు కర్ణాశ్వత్థామవీర్యమున వీఁక దఱుఁగుట మున్నగువృత్తాంతముల నర్జునున కెఱింగించి పరమరయమునం దేరు దోలుటయుఁ గర్ణప్రముఖు లై నమనవారును భీమసేనపురస్సరులై నవారివారునుం దలపడుటయు వీరయోధసింహనాదమును జ్యాఘోషంబును రథనేమినిస్వనంబును గదాకుంతపరశుప్రముఖనానాయుధసంపాతరవంబును గుంజరబృంహితంబును దురంగహేషితంబును దిక్తటంబుల నత్యంతభీకరం బై యెసంగ నప్పోరు ఘోరం బయ్యె. ఏమి చెప్పుదు నాదారుణరవంబున కే పెక్కండ్రుక్కు సెడిరి. అట్టియెడఁ గర్ణుఁ డుదీర్ణకోపదీపితుం డై కడిమి మెఱసి క్రమమున నేవురను బదుగురను మఱియు నేవురనుం బాంచాలరథికుల రథ్యసూతకేతనములతోడం గూల్చుటయుఁ బాండవసైనికులు పెక్కండ్రు చుట్టుముట్టి శరజాలం బఱరించిన సైరింపక యబ్బిరుదుమగండు కమలాకరముఁ గలంచుమత్తమాతంగంబు తెఱంగున నమ్మూఁకలం గలంచి క్షుద్రమృగములపయిం గవియుకోదమసింగమువీఁక మెఱసి పన్నగములపై నడరుగరుడునియేపునం దనరి కశాఘాతములఁ దురంగములంబోలె శరజాలముల మర్దించియుఁ దలలు దఱిగియు మైమఱుఁగు లఱవఱలు చేసియుం బలుదెఱంగుల బీభత్సంబుఁ గావించినం బాండవానీకములు వెఱచఱచి పఱచె. అప్పుడు సాత్యకిధృష్టద్యుమ్నులును నకులసహదేవులును ద్రౌపదేయులును మనసేనలపై నడరుటయు నస్మదీయయోధులును మార్కొనుటయు నుభయసైనికులుం గడంగి యొండొరులం బిలిచియు నార్చియుఁ దాఁకు తప్పించుకొన నెగసి తొలంగియు బలుకైదువుల నడిచియుఁ గడిమి వాటించి తలపడియు నెత్తురులు గ్రక్కుచు నేలం గూలిరి. చతురంగబలములును బరస్పరసంపాతమున మడిసె. కూలినసిడములును దెగినతలలును దునియలై నగొడుగులును వినికృత్తబాహువులును విచ్ఛిన్నగజశుండాదండములును విశీర్ణరథావయవంబులును విదీర్ణతురంగాంగంబులును నై సమరభూమి రౌద్రంబయ్యెఁ బరమసుందరము లగురాజులమొగములం జేసి యభిరామం బయ్యె.

అయ్యవసరంబున దుర్యోధనుండు పనుప నంగవంగపుండ్రమాగధతామ్రలిప్తకమేఖలకోసలమద్రదశార్ణనిషధప్రాచ్యదాక్షిణాత్యప్రముఖులయిన గజయోధులు ధృష్టద్యుమ్నునిపై నడరి వారిదములు సలిలధారల నెట్టట్టు శరతోమరవర్షముఁ గురియుచుఁ బ్రక్కపోట్లను నంకుశములయేట్లను నేనుఁగులం గొల్పుటయు నప్పాంచాలవరుండు కడిందిమగంటిమిం బేర్చి పర్వతోపమంబు లగునయ్యేనుంగుల నొక్కొక్కదానిం బదింట నాఱింట నెనిమిదింటనుం బిట్టేసి నొంచుచున్నంత ద్విరదనికరపరివృతుం డై జలదపటలపరివృతుం డై నతరణికరణిం జూపట్టునాధృష్ట

ద్యుమ్నునకుఁ దోడ్పడువారై నకులసహదేవులును ద్రౌపదేయులును బ్రభద్రక వీరులును సాత్యకిశిఖండిచేకితానులును నగ్గజానీకంబుఁ దాఁకి పటుబాణజాలంబు నిగిడించినం గోపించి యామ్లేచ్ఛులు పురికొల్పిన నమ్మదవేదండములు పాండ వబలమున నరతురగస్యందనముల నేలం బెట్టి కాళ్లం జమరియుఁ గొమ్ములఁ బొడి చియు బీభత్సంబు సేయుచు భీకరాకారంబులై పైపై నడరె. అంత సాత్యకి తన యెదుర నున్నయంగునిమాతంగమును దీవ్రనారాచమునం గూల్చి యయ్యేనుఁ గుమీఁదనుండి నేలకు లంఘింప నుంకించునయ్యంగునియురము వాఁడినారసమున వ్రయ్యలు గావించుటయుఁ బుంద్రునిశుండాలము నడకొండచాడ్పున నుదగ్రా కృతియై యడరె. సహదేవుఁడు నారాచత్రయమున దానిం బడ నేసిన నంగప తిసుతుండు వారణముతోడ నడరిన నకులుఁడు తమ్మునిం దలకడచి తాను మా ర్కొని వానిపయి యమదండములంబోనిమూడునారసములను గజముపై దొడ్డ నారసముల నూఱింటిని నేయుటయు నతండు రవిరశ్మిప్రతీకాశము లగుతోమర ముల నూటయెనిమిదింటి నేసె. నకులుఁడు వానినెల్ల మూఁడేసితునియలు గా వించి యర్ధచంద్రశరమున వానితలఁ దఱిగె. అట్లు గజశిక్షావిశారదుం డైన యంగపుత్రుఁ డీల్గిన నగ్గజయోధు లగ్గలికంబు దలిర్ప నకులుం జుట్టుముట్టి శర తోమరవర్షముఁ గురియుటయుఁ దత్పరివృతుండై జలధరనికరపరివృతుం డైన యాదిత్యునిరీతిం జూపట్టునన్నకులుం గాంచి పాండవపాంచాలసోమకవీరు లడరి శరపరంపరలు పరఁగించి కుంభముల వ్రచ్చియు మర్మముల నొంచియు గజానీ కంబుఁ జీకాకుపఱచుచున్నంత సహదేవుఁడు ధనుష్టంకారం బొనర్చి యఱువది నాలుగువాలమ్ముల నెనిమిదియుత్తమకుంజరములను మావంతులతోడం బొలి యించె. అంత నకులుఁడు నేపు మీఱఁ గడంగినం బాంచాలప్రభద్రకసైన్య ములు తోడ్పడ శిఖండిసాత్యకిద్రౌపదేయులును దలపడుటయుఁ దదీయశరప్రహా రమునంజేసి యగ్గజములు వజ్రాభిహతశైలములచాడ్పునం గూలె. అట్లు కరిఘ టలం గూల్చి భిన్నకూల మగుప్రవాహమురీతిం జూడ నొప్పుమననేనం గలంచి వారు కర్ణునిమీఁది కడరిరి.

**దుశ్శాసనుఁడు సహదేవునితోఁ బోరి మూర్ఛిల్లుట.**

అప్పుడు దుశ్శాసనుఁడు సంతోషమునఁ దమవార లార్పులు వస్త్రవిధూన నంబులునుం గావింప సహదేవుని మార్కొని యొమ్మున మూఁడమ్ము లేయుటయు నాతం డొక్కనారసమ్మును డెబ్బదికాండములను నేసి మూట సూతుని నొంచిన నతండు విల్లు దునిమి డెబ్బదిమూఁడుసాయకముల నాతనిబాహువులను వక్షము ననుం గీలించె. అందుల కలిగి యమ్మాద్రేయుండు ఖడ్గ మెత్తి రయమున వన దుస్సనేనుతేరిపయిం బడ నేసిన నది మౌర్వీగుణముతోడ నీకొడుకువిల్లు దునిమి

యంతరిక్షవిచ్యుతం బయినసర్పమువిధమున నేలం బడియె. అంత నొండుకోదండ మెత్తి సహదేవుఁడు నిశితశర మరిఁ బోసి విడుచుటయు యమదండోపమం బయి నయాసాయకమును శితకరవాలమున దుశ్శాసనుఁడు రెండుగాఁ దునిమి యొండు వింటఁ గృపాణతుల్యం బయినయొక్కవాల మ్మరిఁబోసి సహదేవునిపై నేయుట యు నప్పాండవానుజుండు నవ్వుచు నవలీలం దాని శాతమార్గణముల ఖండించినం దుస్ససేనుఁ డఱువదినాల్గుపటుప్రదరము లతనితేరిపయిం బడ నేసె. ఏసినం గినిసి మాద్రేయుండు వానినెల్ల నైదేసియమ్ముల నొక్కొకదానింగాఁ దుమురు చేసి పెక్కుతూపుల నీకొడుకుపయి నడరించుటయు నాతండు మూడుమూడు మార్గణముల నొక్కొకదానింగా నన్నింటినిఁ దునుమాడి ధరణీతలంబు బ్రద్దల గునట్లు భీషణనాదం బొనర్చి తోన యతనిపై బలుతూపులను సారథిపైఁ దొ మ్మిదియమ్ములనుం బ్రయోగించె. అంతఁ గోపాటోపదీపితుండై సహదేవుఁడు లెస్స నారి సారించి మృత్యుసన్నిభం బైనయొక్కఘోరశరం బరివ్రోసి యేసిన నది దుశ్శాసనుమైమఱుఁగు వ్రచ్చి పన్నగము వల్మీకముంబోలె ధరాతలంబుఁ జొచ్చె. అయ్యమ్ముతాఁకున దుశ్శాసనుఁడు మూర్ఛిల్లుటయు సారథి సహదేవుశ రముల సైరింప నోపక తేరు దొలఁగించె. అట్లు దుశ్శాసను నోడించి సహదే వుఁడు దుర్యోధనబలంబుపై నడరి కడిందిమగంటిమిం బేర్చినం బలుమానిసి కోపమునం గాల రాచుచీమలబారులచందమున మనమూఁకలు చెప్పరానిదీన దశకు వచ్చె.

కర్ణుఁడు నకులుని వింటికోపున నీడ్చి యవమానించుట.

అట్టియెడఁ గర్ణుఁడు కోపదీపితుండై నిజసేనలం దఱుముచున్ననకులుం దాఁకుటయు నాతండు నవ్వుచు నతని కిట్లనియె. పెద్దకాలంబునకు దైవము న న్ను సౌమ్యదృష్టిం జూచె. పాపాత్మా, చక్షుర్విషయగతుండైనన్ను రణమునం జూడుము. ఎల్లయనర్థములకును గలహమునకును నీవకదా మూలము. నీదోష మునంజేసి కౌరవు లొండొరులం దలపడి నశించిరి. నిన్ను నేడు పోరం దెగటా ర్చి కృతకృత్యుండనై తాపంబు వాయుదు ననినం గర్ణుండు రాజపుత్రునకు విశే షించి ధనుర్ధరునకును నీవచనం బనురూపంబు. నన్నుఁ బ్రహరింపుము. నీపౌరు షముఁ జూతము. శూరుఁడవేని కయ్యమునం గార్యము చేసి పదంపడి తోఁచి నమాటలం జెప్పికొనుము. చెప్పక శక్తికొలఁది పోరుటయకదా శూరధర్మంబు. నీకుఁ గలశక్తియెల్ల నేర్పడ నాతోడం బోరుము. నీమదం బుడిపెద నని నకులు నకు మాఱు సెప్పి డెబ్బదిమూడుశిలీముఖము లతనిపయిం బరఁగించె. అందుల కలిగి నకులుఁడు క్రూరసర్పములంబోనియెనుబదియమ్ముల సూతసూనుని నొా నే సిన నాతండు విల్లు ద్రుంచి కనకపుంఖము లగుశితశిలీముఖముల ముప్పదింటి

నప్పాండురాజసూనుమేను గాఁడం బెక్కేయుటయు నయ్యావి పుడమిఁ బగిల్చి నీరు సొచ్చుపన్నగములచందమున యతనిక త్తళంబు భేదించి నెత్తుటం దోఁగె. అది నొప్పిగాఁ గొనక నకులుఁడు హేమపృష్ఠ మగునొండుచాప మెత్తి యిరువదింటఁ గర్ణుని మూటఁ దత్సారథిని నొవ్వ నేసి యెంతయుఁ గినుక గదుర నిశితక్షురప్ర మున విల్లు దునుమాడి మున్నూఱువాలమ్ముల నవ్వుచు నవలీల నారాధేయునిపై నేసి వెగడుపఱచినం జూచుఖేచరులును నిరువాఁగునం గలరథికులును నివ్వెఱఁ గందిరి. అంత నొండువిల్లు గొని వైకర్తనుం డైదమ్ముల నకులునిజత్రుదేశము నం గీలించుటయుఁ దద్బాణపంచకవిద్ధగాత్రుండై యమ్మాద్రిపుత్రుండు నిజరశ్మి మాలాపరీతుం డై నయాదిత్యునిపోలెఁ దేజరిల్లుచు నేఁడువాఁడితూపుల నాకర్ణు ని నొంచి మఱల వానివింటికోపుఁ దునిమె. తునుముటయు నంగరాజు వేగవత్త రం బయినయొండుకోదండముఁ గొని శరజాలమునం దిక్కులు గప్పినం బాండు రాజసూనుండు వానినెల్లం దునిమి లెక్కకు మిక్కిలిగా నిజశరస్తోమం బడరించినం గగనతలంబు బాణమయంబై మిడుఁగుఱుఁబుర్వులు పర్విననవిధంబునను మిడు తలగములు గప్పినచొప్పునను గొంచలబారు లావరించినతీరునను దర్శనీయం బగు డు సూర్యకిరణప్రచారమున కించుకేనియు నెడము గలుగమింజేసి ఖేచరం బైన భూత మొక్కటియుఁ బుడమికి రా వలను గలుగకుండె. అప్పుడు కర్ణనకులు లిద్దఱు కాలసూర్యు లనం బొల్చిరి. కర్ణునిబాణములఁ బాండవసైనికులును నకు లునియమ్ముల మనసైనికులుం బెద్దయు నొచ్చి వాతవిధూతంబు లైనవారిదంబు లవిధంబునఁ దెరలి నలుదెసలం బఱచి బాణపాతదూరము తొలంగి యయ్యిద్ద ఱిపోరు చూచుచుండిరి. అట్టియెడ దివ్యాస్త్రప్రయోగకౌశలంబు నెఱపుచుఁ గర్ణనకులులు పరస్పరశరనికరముల నొండొరులం గప్పి మేఘజాలప్రచ్ఛన్ను లై నసూర్యచంద్రులచందమున నొప్పుచున్నంతఁ గర్ణుం డేచి క్రోధభరితుండై ఘో రాకారమునం బేర్చి శరపరంపరలు పరఁగించిన నవి యాదిత్యున కంబుదశ్రేణి యెట్టులట్టుల తనకు నొవ్వు గావింపకుండుటంజేసి నకులుండు గండడరుటయు రాధే యుండు రోషరూపితుండయ్యు గాంభీర్యభరమునం బొడమినయలంతినగవు నెమ్మొ గమ్మునం దుఱంగలింప వాలంపగములం గురియించి నభోమండలము శరమయ ముఁ గావించి నకులునిసారథినిం జంపి విల్లు ద్రుంచి నాల్గువాఁడితూపుల గుఱ్ఱ ముల నాల్గింటిం జదిపి తేరు తిలమాత్రశకలములు గావించి కేతనముం గూల్చి చక్రరక్షకులం బరిమార్చి గదఁ దునిమి ఖడ్గమును ఖండించి పలుకం బఱియలు వాపి సాధనజాలంబెల్ల విశకలితంబు గావించి మైమఱుఁ గఱువుల్లో చేయుటయు నకులుఁడు విరథుఁడై తేరు డిగ్గి పరిఘముఁ జేతం బూని కవిసినం గర్ణుండు నిశి తసాయకముల దానిం దునిమి కృతాస్త్రుఁడు బలియుఁడునయ్యు వ్యాయుధుండై

నం జంప నొల్లక నొప్పించుటయు వ్యాకులితచేతస్కుండై యప్పాండురాజపుత్త్రుఁ
డనికిఁ దొలంగి పఱచె. పఱచినం బోనీక వెన్నడించి రాధాసుతుండు సారెకు న
గుచు సజ్యమగుచాపము నానకులునికంధరమునఁ దగిల్చి కంఠాసక్తమహాకార్ము
కుండై పరివేషమధ్యగతుండైనచంద్రునిచందమునను నింద్రచాపరుచిరంబైన
నీలనీరదంబుతెఱంగునను నొప్పునన్నకులున కిట్లనియె. పాండవా, రిత్తపలుకులు
పలికితివి. ఏదీ చూతము. నాయెట్ల కోర్చి ప్రహర్షోత్కర్షభరితుండై యిప్పు
డీతూరి యట్లు నుడువుము. ఇఁకనైనం దెలిసికొని బలవంతులైనకౌరవవీరుల
తోడిపోరు మాని నీకుఁ దగినవారల మార్కొనుము. ఇట్టు లయ్యెఁగా యని
సిగ్గుపడం బని లేదు. ఊరక యింటి కేగుము. అది సమ్మతంబు గాదేని కృష్ణార్జు
నులయొద్ద కరుగు మని చెప్పి వధప్రాప్తుండైనయతనిం గుంతీవచనస్మరణంబు
నం జేసి తెగటార్పక కర్ణుఁడు విడిచిపెట్టుటయు నమ్మాద్రేయుండు వ్రీడాభరమున
విన్ననైనయాననంబుతోఁ జని యుధిష్ఠిరునరదం బెక్కి కుంభనిక్షిప్తపన్నగముచం
దమున నిట్టూర్పు నిగిడించుచుండ మధ్యాహ్నం బయ్యె.

అట్లు నకులుం బరిభవించి యరిభయంకరుండై కర్ణుండు వెలిమావులవె
లుంగును గేతనహస్తికక్ష్యాప్రకారంబును నంతటం బర్వఁగఁ బాంచాలబలము
పయిం గవిసి యమ్మధ్యాహ్నమునఁ దమవారికిఁ జంద్రునట్టు లాహ్లాదకుండై సా
యకనికరంబుఁ బరఁగించినం దునియలైనజూళ్లచింపులు జీరాడ గంటలు మ్రోఁత
మెసంగ నెరగలిగొనినయట్టులు శస్త్రితాపంబు వెతఁబెట్టఁగ నిటు నటుం బఱ
చుచుఁ బెలుచ నఱచుచుఁ గుంభస్థలములు పగిలియుఁ దొండములు దెగియుఁ
దోఁకలు దునిసియు నెత్తుటం జొత్తిల్లి గైరికధాతురంజితనిర్ఝరీపరీతగిరులకరణిం
బొలిచి ఛిన్నాంబుదములట్లు పటాపంచలై నేలం గూలు నేనుంగులును విదీర్ణకవ
చంబులై విచ్ఛిన్నవాలబంధంబులై విగతవివిధభూషణంబులై విస్రస్తచామరం
బులై విధ్వస్తసాదికంబులై విశీర్ణఖలీనంబులై విరహితకుథంబులై విభిన్నతూ
ణీరంబులై తిరుగుడువడియు బెండువడియు మడియుగుఱ్ఱములును జక్రము విఱుగ
సిడములు దునియ నొగలు దెగఁ గప్పలు పడ సారథులు సమయఁగ ఘోటకం
బులు విటతాటంబులుగాఁగ నుగ్గుగు తేరులును దలలు చేతులు కాళ్లు తొడలును
ఖండములుగాఁగ నిది యియ్యంగమని యేర్పఱుప రానివిధమునం జదియుకాలు
మానుసులును విరథులయ్యు నుడివోనిబీరంబునం బోరి యగ్నిం బడుమిడుతల
వడువునఁ దెగటారురథికులునై ఘోరప్రకారంబైనం బ్రళయసమయవీతిహో
త్రునిచాడ్పున వెలుంగునయ్యంగరాజుమునుమునఁ గాలు నిలుప నేరక హతశే
షు లయినపాంచాలురు విచ్చిపఱచినం బోనీక వెన్నడించి యారాధేయుండు తఱి
మి మధ్యాహ్నమార్తండుఁడు భూతలముంబోలె నమ్మూఁకల నేచుచుండె. అప్పు

డు మనసేనలం దఱుముచున్న యుయుత్సుని మార్కొని యులూకుఁడు నిలునిలు మని యదల్చిన నాతండు వజ్రనిభ మగుశాతసాయకమున నతనిం బిట్టేసినం గోపించి యాశకునిసుతుండు యుయుత్సునివి ల్లొక్కకుప్పెకోలం దునిమె. తునిమిన నెండువి ల్లెత్తి యుయుత్సుఁడు గన్నుఁగవం గెంపు గదుర నఱువదింట నాసౌబలనందను నొనేసి మూట సారథిని నొంచుటయు నాతం డతనిపయి వింశతి విశిఖముల నడరించి కేతనదండము నఱికె. అందుల కలిగి యుయుత్సుఁ డులూకునురమ్ముఁ బంచాశుగములఁ గాఁడ నేయుడు నగ్గాంధారకుమారుం డగ్గలించి నిశితభల్లమున యుయుత్సుసారథితలఁ దఱిగి నాలుగువాలమ్ముల గుఱ్ఱముల నాలుగింటిని సమయించి యేడువాఁడితూపు లతనిమేనం జొనుపుటయు నయ్యుయుత్సుండు తొలంగి చనియె. ఉలూకుఁడును యుయుత్సుం గెలిచి పాండవసృంజయసైన్యములపయిం గవిసె. నీకొడుకు శ్రుతకర్ముఁడు నకులపుత్రుం డైన శతానీకుం దాఁకి నిమేషార్ధమాత్రలో నతనిసారథిం జంపి గుఱ్ఱములఁ దెగటార్చుటయుం గనలి శతానీకుఁడు హతాశ్వసారథికం బైన తేరు డిగక గద యెత్తి యేసినం దద్గదాఘాతమునం జేసి రథ్యసూతసహితంబుగా నతని తేరు నుగ్గయ్యె. అట్లు భవత్సూనుండును నకులసూనుండును విరథులై క్రమంబున వివింశతిప్రతివింధ్యుల తేరు లెక్కిరి. శకుని సుతసోముం దాఁకి నిశితశరముల నిగిడించిన నందులకుదా నతండు ప్రవాహమునకుఁ బర్వత మెట్టులట్టుల కంపింపక తనతండ్రుల కత్యంతశత్రుం డైనయతనిం గాండజాలమునం గప్పిన నాసౌబలుండు కదనవైచిత్రి యొనర నస్త్రలాఘవం బమర జనోల్లాసంబు దనర నతనియమ్ములగముల నిజశరములం బొనుఁగుపఱిచి మూఁడమ్ముల నాసుతసోముని నొనేసి తోన సారథిని గుఱ్ఱములను బడగను దిలప్రమాణశకలములు గావించినం జనులు హాహాకారంబు లొనర్చిరి. అట్లు విరథుండయ్యు భీమసేనసూనుం డుడుగనికలితనమునం జేర్చి భూమిస్థితుండై సాయకపరంపరలు నిగిడ్చి నీమఱంది తేరు గప్పుటయు నాతండు మిడుతలబారులం బోనితదీయశరశ్రేణులం గీటడంచుచుఁ బెనంగుచుండ భూతలగతుండై యుడివోనిబీరమునం బోరునప్పాండురాజపౌత్రుం జూచి యంతరిక్షగతు లైనసిద్ధు లగ్గించిరి. అంత శకుని యాతనిశరశరాసారములం దుమురుసేయుటయు నాభీమసేననందనుండు గజదంతముష్టివిలసితంబు వైదూర్యోత్పలవర్ణంబు నగుఖడ్గముఁ గొని యార్చి పేర్చి భ్రాంతోద్భ్రాంతావిద్ధాప్లుతవిప్లుతప్రసృతసృతసంపాతసము దీర్ణప్రముఖము లగుచతుర్దశమార్గములం జరించుచు నీమఱంది యడరించువాలంపగములఁ గరవాలమునం జదుపుచు గరుడరయమున మెఱసి లాఘవమున మండలావర్తగతులం జూపుచున్నంత నీమఱంది విక్రమించి దాని రెండుఖండములు గావించిన నాఱడుగులకొలంది యొదిగి యావృకోదరా

త్మజుండు తనచేత నున్నయాఖడ్గపుఁదునియ నెత్తి విసరి వైచుటయు నది శకుని చేతివిల్లు నారితోడ నఱికి నేలం బడియె. అంత సుతసోముఁడు శ్రుతకీర్తితే రెక్కె. సౌబలుం డంత నొండుకోదండముఁ గొని పాండవానీకముపై నడరి దైత్య సేనాసమ్మర్దనాభీలుం డైనయాఖండలునివడువునం గండుమీఱి యమ్మూఁకలఁ జీకాకుపఱిచె.

## ధృష్టద్యుమ్నుఁడు కృపునిఁ దాఁకి యోడిపోవుట.

కృపాచార్యుఁడు శరభము సింహమునుబోలె ధృష్టద్యుమ్నుని మార్కొని యాఁగిన నాశారద్వతుం గడవనేరక యప్పాంచాలవరుండు బెగ్గడిల్లి యొక్కడుగైనం గదలనేరకున్నంత సర్వభూతములు నతని హతునకా వగచె. ఉభయసైనికులు విన్ననై ద్రోణవధమునం బేర్చినకోపమునంజేసి దివ్యాస్త్రవిదుం డైనశారద్వతుఁ డీసేనాపతిపయిం గవియ కుడుగునే? ఈగౌతమునివలన ధృష్టద్యుమ్నునకుఁ గీడు వొరయకుండునే? ఈసేనయంతయు నీమహాభయము దప్పించుకొనునే? అంతకాకారమునం బొల్చునీబ్రాహ్మణుఁడు మన మందఱమును గూడి ముట్టినను దెగటార్పఁ గలఁడు. ద్రోణు తెరువు పట్టఁగలఁడు. ఇయ్యాచార్యుఁడు శీఘ్రహస్తుఁడు విజయవంతుఁడు వీర్యదుర్దాంతుఁడు క్రోధభరితుండు నైనవిధంబును ధృష్టద్యుమ్నుఁ డిప్పుడు సమరవిముఖుఁ డగుతెఱంగునుం గన్పట్టుచున్న దని తమలోఁ బల్కుచున్నంతఁ గృపుఁ డమర్షమున నిశ్శ్వసించి పటుప్రదరనికరమున ధృష్టద్యుమ్నునిసర్వమర్మములం గాఁడ నేయుటయు నప్పాండవసేనానాయకుండు చెయ్వులు దక్కి మిన్నకుండె. అప్పుడు సారథి యోపార్షతా, నీకుఁ గుశలంబె? యుద్ధమున నిట్టివ్యసనము గలుగ నింతకు మున్నెన్నఁడుం జూడనైతి. దైవయోగంబునం గాఁబోలుఁ గృపునమ్ములు నీమర్మములు భేదించుచున్నవి. నీవిక్రమంబుఁ గీడ్పఱచినయీబ్రాహ్మణుఁ డవధ్యుఁ డనితోఁచెడి. తేరు మరల్చుట యిప్పటికిఁ గార్యం బనిన విని ధృష్టద్యుమ్నుఁడు మెల్లన సారథి కిట్లనియె. నామనస్సు మోహగ్రస్తం బయ్యె. మేనం జెమ్మటయుఁ గంతమున గగుర్పాటును గ్రమ్ముటం జూడఁగఁ నీబ్రాహ్మణు నిపుడు వర్జించి భీమార్జునులలో నొక్కనిం జేరఁబోవుట క్షేమంకర మని పలుకుటయు సారథి మనవారితోడఁ బోరుచున్నభీమునొద్ద కతిరయమునం దేరు గడపె. అవ్విధమున ధృష్టద్యుమ్నుఁడు దొలఁగంబాఱినం గృపాచార్యుండు శంఖముఁ బూరించి శరశతములఁ గురియుచు మహేంద్రుఁడు నముచింబోలె నతని వెన్నడించి చనియె. కృతవర్మఁడు నగుచు భీష్మమృత్యువగుశిఖండి నాఁగిన నాతం డైదునిశితభల్లముల నతనిజత్రుదేశము నొనేయుటయు నాహార్దిక్యుఁడు షష్టిబాణంబుల నప్పాంచాలునిపై నడరించి యొక్కతూపున విల్లు దునిమె. అంత శిఖండి యొండుకోదండ మెత్తి నిలునిలుమని యత

ని నదలించి తొంబదిమెఱుఁగుటమ్ములఁ బరఁగించిన నవి యాతనిమైమఱుఁగుఁ దాఁకి మిట్టిపడుటయు నవి వితథంబులవుట కలిగి యొక్కకుప్పెకోలం గాద్మకము ఖండించి శృంగభంగముఁ బొందినవృషభముచాడ్పున విచ్ఛిన్నధన్వుఁ డైనయ తనిభుజవక్షోభాగముల నెనుబదిమార్గణములం గీలించె. శిఖండికాండజాలవిద్ధుం డై కృతవర్ముఁడు కుంభద్వారము జలముఁబోలె నెత్తురు గ్రక్కి రక్తసిక్తగా త్రుండై వర్షార్ద్రిం బైనగైరికపర్వతంబుచాడ్పునం జూడనొప్పి వేఱువిల్లు గొని సజ్యంబు గావించి శిఖండిమూఁపునఁ దూపులగముల నాటుటయు నాతండు స్కం ధగతవిటపనికరబంధురం బైనపాదపంబుకైవడిం బొలిచె. అత్తెఱంగున నాశి ఖండికృతవర్ములు పరస్పరప్రహారమునఁ బెద్దయు నొచ్చి నెత్తుటఁ దోఁగి కొమ్ము లం బొడిచికొన్నయాఁబోతులరీతిం దనరి యితరేతరవధమునం గడంగి యన్యో న్యస్యందనముల వివిధమండలగతులం ద్రిప్పుచున్నంతఁ గృతవర్ముఁ డేచి కాంచ నపుంఖము లగుసప్తతివిశిఖముల నాశిఖండి నొవ్వనేసి కడువడిం బేర్చి జీవితాం తకరం బైనయొక్కతీవ్రశరం బరిఁబోసి యేసినం దానితాఁకు పెల్లునంజేసి యప్పాం చాలవరుఁడు మూర్ఛిల్లి కేతనదండ మూఁతగొనుటయు సారథి తేరు దొలఁగించె. హార్దిక్యుఁ డట్లు శిఖండిని బరాజితుం గావించి పాండవసేనలం జిక్కుపఱచె.

## అర్జునుఁడు సంశప్తకులఁ బెక్కండ్రం జంపుట.

అట్టియెడ గాండీవి మహామారుతము దూదిరాసులంబోలె మనమూఁ కలఁ దెరలించి తనమునుము బయలు గావించినం గోపించి త్రిగర్తేశ్వరుం డైన సుశర్మ సత్యసేనచంద్రదేవమిత్రదేవశత్రుంజయసౌశ్రుతిచిత్రసేనమిత్రవర్మ సుశర్మకసుధర్మసువర్మ లనుతమ్ములును త్రిగర్తశిబికౌరవసాల్వసంశప్తకనారాయ ణగోపాలబలంబులును నానాశస్త్రవిశారదు లైనకొడుకులును దోడుపడ నాకవ్వ డిం దాఁకి శరవ్రాతంబులు పరఁగించుటయు నమ్మేటివిల్కాఁడు కినుక గదుర శర పరంపరలు నిగిడించినం దత్సైనికులు సాగరంబుఁ జొచ్చుమహాప్రవాహముల చందమున నడంగియు గరుడుం గాంచినపాములట్లు మడంగియు నగ్గిలోనం బడు మిడుతలవడువున రూపడంగియు దుర్దశం జెందిరి. అందుల కలిగి సత్యసేనుఁడు మూడమ్ములను మిత్రదేవుఁ డఱువదిమూడుతూపులను జంద్రదేవుఁ డేడుశరము లను మిత్రవర్మ త్రిసప్తతిసాయకములను సౌశ్రుతి శిలీముఖసప్తకంబును శత్రుం జయుఁడు వింశతివిశిఖములను సుశర్మ ప్రదరనవకంబునుం బరఁగించి నొంచినం గిరీటి యేడింట సౌశ్రుతిని మూడింట సత్యసేనుని నిరువదింట శత్రుంజయుని నెనిమదింటఁ జంద్రదేవుని నూఱింట మిత్రదేవుని మూడిట శ్రుతసేనుని దొమ్మి దింట మిత్రవర్ముని నెనిమిదింట సుశర్మను నొవ్వనేసి తోన పటుబాణజాలము లడరించి శత్రుంజయుతలఁ దఱిగి చంద్రదేవుని యమపురంబున కనిచి తక్కిన

వారిపై నైదేసియమ్ము లేసి యాఁగినం గినిసి సత్యసేనుఁడు కృష్ణునిపైఁ దోమరం
జేసి యార్చె. హేమదండ మగునయ్యాయసతోమరము మాధవువామభుజము
నొంచి నేలం బడుటయు దానితాఁకునంజేసి హృషీకేశునిచేతిమునికోలయుఁ బగ్గ
ములును జాఱిపడినం దీవ్రక్రోధదీపితుండై పార్థుండు తేరు రయమునం బఱపు
ము దురాత్ముం డైనసత్యసేనుం జంపవలయు నని మాధవునకుఁ జెప్పిన నాతండు
పగ్గములఁ జేతంబట్టి యొండుమునికోలం గొని తేరు గడపె. అంత విపాచ్చుఁడు
నిశితభల్లములఁ గుండలోల్లసితం బైనయాసత్యసేనునిమస్తకంబుఁ దఱిగి మిత్ర
వర్మునిపై నడరి వత్సదంతశరమునఁ దత్సారథిం దునిమి క్రోధావేగదుర్దాంతుం
డై శతసహస్రసాయకములం గుప్పించి సంశప్తకులఁ బెక్కండ్రం బొరివుచ్చి రజ
తపుంఖ మగునొకక్షురప్రమున మిత్రసేనునిమస్తకంబుఁ గోసి సుశర్మ జత్రుదేశ
మునం బలుతూపులు గీలించుటయు సంశప్తకు లందఱును జుట్టుముట్టి యార్చు
చుం బేర్చుచు శరపరంపరలు పరఁగించిరి. పరఁగించినం గినిసి క్రీడి యైంద్రా
స్త్రము సముద్దీపితముఁ గావించినం బెక్కుతూపులు వెడలి యంతటం బడు
టయుఁ గూలుకేతనంబులును విఱుగువిండ్లును సర్వాంగములతోడ నుగ్గునూచ
మగుతేరులును ఱెక్కలు దెగినకొండలచాడ్పునం బడునేనుంగులును మడియుగుఱ్ఱ
ములును దెగటారుకాలుమానిసులును దునియ లగుగదాశక్తిప్రముఖనానాసా
ధనంబులును బొడిపొడి యగుపలుదెఱంగులతొడవులును దెగియుఁ గుండలోల్లా
సముఁ బూర్ణేందుకాంతత్వమును నయనచారుత్వమునుం దఱుఁగక యుదారతా
రకోత్కరములకరణిం జూడ నొప్పురథికమస్తకంబులును జినిగినచందనార్ద్రవస్త్రం
బులును దుమురైనఛత్రచామరవాలవ్యజనంబులునై యాయోధనస్థానంబు
ఘోరంబై గంధర్వనగరంబురీతి నభిరామంబై యుండ హతశేషు లైనసంశ
ప్తకు లగమ్యరూపంబై రుధిరనదీప్రవాహసాంద్రం బైనయక్కయ్యంపునేలం
బ్రుంగుడుపడినచక్రంబులఁ బెఱుకఁ జాలక రథ్యములు భ్రమ్మరించుచుండ లేట
మొగంబువెట్టి పాఱుటయు వాసుదేవునినేర్పున శ్వేతాశ్వములు దనరథము నె
చ్చోటనైన నప్రతిహతరయమునఁ గొనిపోవుటంజేసి యొల్లెడలం దిరిగి గాండీవి
కాండజాలంబుల నిగిడించుచు సంశప్తకగణములం గెలిచి విధూమపావకునిచా
డ్పునం దేజరిల్లె.


దుర్యోధనుఁడు ధర్మరాజుతోఁ బోరి విరథుఁడగుట.

అయ్యవసరంబున దుర్యోధనుఁడు శరవర్షసముదగ్రుం డైనధర్మరాజును
దాఁకిన నాతండు పటుబాణములం బరఁగించి నిలునిలుమని యదల్చుటయు నీ
కొడుకు తొమ్మిదియమ్ముల నతనిని నొక్కభల్లమున సారథిని నొానేసె. అందుల
కలిగి యప్పాండవాగ్రజుండు పదుమూఁడుమెఱుఁగుటమ్ముల దుర్యోధనుమేనం గీ

లించి నాలుగుశరముల గుఱ్ఱములం బొలియించి యైదవతూపున సారథిమస్తకం
బుఁ దఱిగి యాఱవయాశుగమునఁ గేతనముఁ గూల్చి యేడవశరమున విల్లు
ద్రుంచి యెనిమిదవసాయకమున ఖడ్గము ఖండించి మఱియు నైదువాలమ్ములు
నీకొడుకుగాత్రంబునం జొనుపుటయు నాతండు నొచ్చి తేరు డిగి నేలపయి నిలి
చినం గృచ్ఛ్రగతుం డై నయతనికిఁ దోడై కర్ణద్రోణకృపాదు లేతెంచుటయుఁ
బాండవయోధులు యుధిష్ఠిరునకు బాసటమై కూడిరి. అంతఁ దూర్యసహస్ర
ములు మ్రోయఁ గిలకిలారవము లెసంగఁ బాంచాలురును గౌరవులు నొండొరు
లం దలపడినం జతురంగబలములు తమతమజాతిని మార్కొని ద్వంద్వములై
లాఘవసౌష్ఠవవైచిత్ర్యములు మెఱయఁ బరస్పరస్పర్ధాతిరేకమునం బోరఁ దొడం
గిన నాసంగ్రామము ముహూర్తమాత్రం బభిరామం బయ్యె. అట నున్మత్తుల
పోలిక నిర్మర్యాదంబుగఁ బెనంగుటయు నేనుంగులఁ దలపడి వాఁడితూపు లేయు
రథికులును, గుఱ్ఱములపై నడరి యుగ్రప్రకారంబు సల్పు హయారోహులయేట్లకు
నొచ్చి యిటునటుం బఱచుచు సాదిసహితము లయినయశ్వములను బాదాతంబు
లను దొండముల మీఁది కెగయించి క్రమ్మఱం బట్టికొని కొమ్ములం బొడిచియుఁ
గాళ్లఁ జమిరియుఁ దొడవులఁ బొడిచేసియుఁ గాలుమానిసులు కుంభదంతమధ్యము
దంతవేష్టము మున్నగునాయంపుఁజోట్లఁ బ్రాసతోమరాదులం బొడిచిన జిఱ్ఱనం
దిరిగి యార్తనాదంబులు సేయుచుఁ బ్రతిగజములం దాఁకి పోరి తత్ప్రహారమునను
రథికబాణవ్రాతసంపాతంబునను సాదులకైదువులపోట్లను గాలుమానిసులయే
ట్లనుం బలమఱి వజ్రాహతపర్వతములచాడ్పున నేలంగూలు నేనుంగులును, నేనుం
గులకొమ్ములపోటులను దొండములవ్రేటులను గజారోహులతోమరములయేటు
లనుం బెద్దయు నొచ్చి చచ్చుగుఱ్ఱములును, గుఱ్ఱపురావుతులు చుట్టుముట్టి కృపా
ణాదిసాధనము లడరించుటలను మదవేదండశుండాదండప్రహారములను బదాతిజ
నాయోధసంపాతమునను గేతనములు వ్రాలఁగ సర్వావయవములు వ్రీలఁగ నిఱిగి
నుఱుమగు తేరులును, దేహులయు నేనుంగులయు గుఱ్ఱములయుఁ బెనుసందడిం
బడియు సాదులకైదువులపోట్లను రథికులతూపులయేట్లను హస్త్యారోహులతో
మరములవ్రేటులను నొచ్చువారును నొచ్చియు నీడంబోక ప్రతియోధుల మా
ర్కొని సిగలఁ బట్టి యీడ్చియుఁ బిడికిళ్లఁ బొడిచియు భుజముల నడిచియు నేలఁ
ద్రోచియుఁ గాల ఱొమ్ముఁ దన్నియు శస్త్రముల గాత్రములం గ్రుచ్చియుఁ జిత్ర
వధంబు లొనర్చువారును దమవాఁడు లాఁతివాఁ డని చూడక చిడిముడిపాటునం
బేర్చి యలజడి కోర్చి యలంగకయుఁ గలంగకయుఁ గడంగి పోరి రూపడంగువా
రును నగుకాలుమానిసులునై సంగ్రామభూమి కబంధనికరనీరంధ్రంబై పర
మదారుణంబై నెత్తుటం దోఁగినశస్త్రికవచములు కెంజాయ యద్దినయంబుశ

ములవిధములం దనర నభిరామంబై యుండ రాజులు శరాతురులై తొలం
గుట క్షాత్రధర్మంబు గా దనుతలంపున వట్టిబీరంబు వట్టి పోరుచుండ నెత్తురుటే
రులు ప్రవహించె. అట్లు కర్ణుండు పాంచాలురను ధనంజయుండు త్రిగర్తులను
భీముఁడు కౌరవులగజానీకములను గీర్తికాములై కనుపుకొట్టుచుండునంత నప
రాహ్ణం బయ్యె ననిన ధృతరాష్ట్రుఁడు సూతనందనా, నీవు సెప్పఁగ సైరింపరా
నియతితీవ్రదుఃఖములను బుత్రక్షయంబును వింటిని. అది తలంచికొనిన నింకఁ
గౌరవులు లేరనియె నిశ్చయము తోఁచుచున్నది. దుర్యోధనుఁడు ధర్మరాజుచే
విరథుండై పదంపడి యేమిచేసె నయ్యపరాహ్ణసంగ్రామం బెట్టులు చెల్లె నేర్పడం
జెప్పు మని యడిగిన నాంబికేయునకు సంజయుం డిట్లనియె.

దుర్యోధనుఁడు ధర్మరాజుతోఁ బోరి మూర్ఛిల్లుట.

అట్లు విరథుండై దుర్యోధనుండు క్రూరభుజగమువిధమునఁ గ్రోధసము
ద్దీప్తుండై యొండుతేరెక్కి శ్వేతచ్ఛత్రభాసురం బైనధర్మరాజుచక్కటికిఁ దేరు
నడుపుము పోదపోదమని సారథికిఁ జెప్పిన నతం డట్ల చేయుటయు ధర్మజుండు
మత్తశుండాలముపగిదిఁ గ్రోధసముద్ధురుండై మనతేరు సుయోధనునకు సమ్ము
ఖము గావింపుమనినం దత్సారథియు నట్ల చేసె. అవ్విధమున ధర్మరాజసుయో
ధనులు పరమసంరంభమునను గదనమర్మదమునను బేర్చి యొండొరులపైఁ
గాండజాలం బడరించుచుండ భవన్నందనుండు నిశితభల్లమునం బాండవాగ్రజుని
కోదండము ఖండించుటయు నయ్యవమానంబు సైరింపక క్రోధతామ్రేక్షణుండై
యాతం డొండుకార్ముకంబుఁ గొని దుర్యోధనుధ్వజమును విల్లునుం ద్రుంచె.
త్రుంచినం గినిసి గాంధారేయుండు చాపాంతరమున రోపము లరింబోసి యేసినం
గౌంతేయుండును దోడ నడరిన నాఁబోతులరీతినిఁ గొదమసింగములభంగిని
నయ్యిద్దఱు పరస్పరవధోద్యోగులై సింహనాదంబు లొనరించుచు నారులు సారిం
చుచు శంఖము లొత్తుచుం గరతలాస్ఫాలనంబులు గావించుచు శస్త్రములఁ గురి
యుచు నితరేతరాంతరముల వెదకుచు నన్యోన్యశరప్రహారమున నెత్తుటం జొత్తి
ల్లి పూచినమోదుగులచాడ్పున నొప్పుచున్నంతఁ గౌంతేయాగ్రజుం డేచి వజ్రవే
గములు దురాధర్షములు నగుమూఁడువాలమ్ములతనిఱొమ్మునం గీలించె. అందుల
కలిగి గాంధారేయజ్యేష్ఠుండు యుధిష్ఠిరునిపై నైదుమెఱుఁగుటమ్ము లేసి సర్వవి
ధ్వంసనసమర్థంబై పెన్గొఱవిం బోలుశక్తి నేయుటయు ధర్మరాజు శాతసాయక
పంచకమునం దాని ముత్తునియలు గావించినం గాంచనదండం బైనయమ్మహాసా
ధనంబు ప్రతిహతంబై ధరణిం బడియె. శక్తివిఘాతమునకుఁ గోపించి నీకొడుకు
పాండురాజనందనుపై భల్లనవకంబుఁ బరఁగించుటయు దానం గడు నొచ్చి య
య్యజాతశత్రుండు క్రోధపరాక్రమసమగ్రుండై యొక్కవాఁడియమ్మరిఁబోసి

వేసిన నది దుర్యోధనుం బెద్దయు వ్యామోహితుం గావించి నేలం బడియె. అది నెవ్వగాఁ గొనక భవన్నందనుండు కలహమునకుఁ దుదిఁ గావించువాఁడై గద యెత్తి వేయ నుంకించుచున్నంత దండపాణి యగునంతకునాకారమునం బొల్చునతనిమీఁదం బాండవాగ్రజుండు తీవ్రశక్తిం బడవైచె. మండుచున్నకొ అవితెఱఁగునఁ బరమతీవ్రం బైనయాశక్తితాఁకునంజేసి దుర్యోధనుండు లోమ్మున మర్మము వ్రీలఁగ వ్రాలి మూర్ఛిల్లుటయు భీముఁ డోరాజేంద్రా, దుర్యోధనుఁడు నీకు వధ్యుఁడు గాఁడు. నాప్రతిజ్ఞ నెఱుంగుదుగదే యని తలఁపించిన విని ధర్మజుం డొండు సేయక విడిచె. అప్పుడు రయమునం గృతవర్మ వ్యసనార్ణవ నిర్మగ్నుం డైనదుర్యోధనున కెడ సొచ్చుటయు భీముఁడు గదాపాణియై యాహా ర్దిక్యునిఁ దలపడియె. అట్టియెడఁ గర్ణుం బురస్కరించికొని మనవారు చతురంగ బలసమేతులై యడరి పరశుపరిఘముసలశక్తితోమరప్రముఖంబు లగునానాసాధనముల నిగిడించి పాండవసేనలం గనుపుకొట్టి యోధవరులతలలఁ దఱిగి రణాంగణమును లయసమయయమరాష్ట్రమునకు దీటు గావించి నీకొడుకులు తోడుపడ సాత్యకిం దలపడునెడ నర్ణవంబులు ఘూర్ణిల్లువిధమునం బరమతుములం బైనని స్వనం బెసంగె. అట్లు మహేంద్రవిక్రముఁ డైనశినివీరుని మార్గణంని రవికిరణ సన్నిభము లగుమెఱుఁగుటమ్ములం బరఁగించి తదీయరథమును రథ్యసారథిసహితంబుగ నావరించుటయు నమ్మహారథవరుఁడు గండడరి శితశరపరంపరలు నిగిడించిన నతనిమునుమునఁ గాల్లు నిలుపనోపక బలములు విచ్చి పఱచుటయు నీవారు కర్ణునెద్దకుఁ జనుచున్నంత ధృష్టద్యుమ్నప్రముఖులు వెన్నడించి తఱిమినం గౌరవానీకంబు చిందఱవందఱ లయ్యె.

అయ్యవసరంబునఁ గృష్ణార్జునులు కృతమాధ్యాహ్నికులై శివపూజ యొనర్చి యరివధకృతనిశ్చయులై జలదనినదసదృశనేమిఘోషంబు దెసలం బర్వఁగఁ గేతనకపిస్ఫూర్తి వెలుంగ వెలిమావులతుఱంగలి చెంగలింపఁ దేరిమీఁదఁ దోఁచి మనవారికి సంత్రాసంబును దమవారికి సముల్లాసంబునుం గావించుచు నరుగుదెంచిరి. అంత నర్జునుండు గాండీవగుణక్వణనం బొనర్చి వాలంపగముల నెల్ల దెసలం బరఁగించి మహామారుతము వారిదములంబోలెఁ దేరులఁ దెరల్చియు నేనుఁగుల నారోహకులతోడఁ గూల్చియు గుఱ్ఱముల రౌతులతోడఁ బరిమార్చియుఁ గాలుమానుసులం దెగటార్చియు ఘోరపరికారంబు సల్పుచున్నంత దుర్యోధనుండు మూర్ఛదేఱి తా నయ్యర్జునుం దాఁకి నిశితప్రదరములు పఱచుటయుం గోపించి యెనిమిదితూపు లేసి యతనిధనుస్సును సారథినిగుఱ్ఱములను బడగను గొడుగునుం గూల్చి ప్రాణహరణోదగ్రం బయినయొక్కశాతసాయకంబు గాండీవంబున నరిఁబొసి దుర్యోధనుపై నేయ నుంకించుచున్నంత నా

చార్యనందనుండు దాని నేడుతునియలు గావించె. దానం గినిసి కిరీటి యశ్వ త్థామవిల్లు ద్రుంచి గుఱ్ఱములం జంపి యప్పటికిం గూడంబడినకృపకృతవర్మదు శ్శాసనులపై నడరి కృపునిచాపముం దునిమి హార్దిక్యునివిల్లును గుఱ్ఱములను గేతనంబునుం గూల్చి దుశ్శాసనునిశరాసనంబు ఖండించి కర్ణుపయిం గవిసె. ఆరాధేయుండును దనతోడం బోరుచున్నసాత్యకిం ద్రెగేడించి కడువడిం బేర్చి కవ్వ డిపయి నడరి యమ్మగనిం గాండత్రయమునను దామోదరుని వింశతివిశిఖము లను నొనేసి డయ్యుక కోపదీపితుం డై నవాసవునివీఁక మెఱసి సాయకజాలంబు నిగిడించుచున్నంత సాత్యకి దా నడ్డపడి తొంబదివాఁడితూపులను శరశతమునుం బరఁగించి నొంచె. అట్టియెడ ధృష్టద్యుమ్నశిఖండులును యుధామన్యూత్తమా జులును నకులసహదేవులును ద్రౌపదేయులును జేకితానుండును జేదికరూశమ త్స్యకేకయప్రభద్రకవీరులును ధర్మరాజపురస్కృతులై బహుళచతురంగబలము లతోడ నడరి పరుషములు పలుకుచుం గర్ణునిపై నానాశస్త్రగణములు నిగిడిం చిన నాబలుమగండు వాలమ్ముల వానిం గీటడంచి తదీయచతురంగబలములం గూల్చి ద్రుమాఁకులం ద్రోచుమహామారుతంబుచందంబున దర్శనీయుండై యుం డం గర్ణునస్త్రతేజమునకు వెఱచి పాండవసైనికులు శస్త్రాస్త్రముల విడిచియు యం త్రములం బాఱవైచియు నెంతయు నొచ్చినయొడళ్లతో లేటమొగంబు వెట్టిరి. అంత నర్జునుండు నవ్వుచు నవలీలం గర్ణునస్త్రములం దనయస్త్రముల నడఁగించి ముసలసన్నిభములు పరిఘుసంకాశములు శతఘ్నీతుల్యములు వజ్రతీవ్రములు నగుబలుతూపు లడరించి దిక్తటంబులను రోదోంతరంబునుం గప్పిన నొప్పిం జెంది మనమూఁకలు వీఁక దఱిఁగి కన్నులు మూసియుం దిరుగుడువడియు జెచ్చవడియు వెఱచియుం బెలుచ నఱచియుం బఱచె. అప్పటికి గభస్తిమాలి యస్తగిరిశిఖరాంతర్హితుం డగుటయు నప్పటప్పటికిం బెచ్చువెరుఁగుచీఁకటిపెల్లు నను సైనికచరణఘట్టనసముత్థితం బైనధరణీపరాగంబునను గీడును మేలునుం గానంబడకుండుటయు రాత్రియుద్ధమున కోహటించి సమరము సాలించి మన వారు దీనాననంబులతో శిబిరములకుం జనుటయుం బాండవులును వివిధవాద్య ములును సింహనాదములునుం జెలంగ సేనలం దివియించి మనవారిం బరిహసిం చుచుం గృష్ణార్జునులం బ్రశంసించుచుం బాండవులకు దీవన లిచ్చుచుం బరమో ల్లాసమున నిజశిబిరముల కరిగిరి. ఆయోధనభూమి రక్షఃపిశాచకులసంకులంబై రుద్రవిహారస్థానంబుకై వడిం బరమఘోరంబై కన్పట్టె ననినవిని ధృతరాష్ట్రుం డు సంజయా, ధనంజయుండు తనయిచ్చమెయి మనవారలం బరిమార్చె. ఆయుధపాణియై యతం డడరిన నంతకుఁడును దప్పించికొని పోవంజాలఁడు. అప్పా ర్థుం డొక్కరుండకదా యాదవులం గెలిచి సుభద్రను దెచ్చె. ఖాండవ మాహు

తిచేసి యగ్నికిఁ దృప్తిఁ గావించె. మాయాకిరాతుఁడై నశంకరునిఁ గయ్యమున మెప్పించె. నివాతకవచుల వధియించె. ఘోషయాత్రకుఁ బోయి గంధర్వులకుఁ జిక్కినదుర్యోధనాదుల రక్షించె. దిగ్విజయమున సకలరాజుల జయించి కప్పము గ్రహించె. అట్టిమేటివిల్కానితోడఁ బోరుటం జేసి మనవారలు ప్రశంసనీయులుగాని నిందనీయులు గారు. పదంపడి దుర్యోధనుఁ డేమిచేసె? తెలియం జెప్పు మని యడుగుటయు సంజయుఁడు వైచిత్రవీర్యున కిట్లనియె.

కర్ణుని రెండవనాఁటియుద్ధము.

అవ్విధమున మనవారు గాండీవికోల్తలఁ గోపాటించి దీనాననులై కోఁటలు లేనిపదాహతపన్నగములపగిదిఁ గోపవశులయ్యు నేమియుం జేయఁజాలక రేయి యగుడు శిబిరమునకుఁ జని యందఱును గూడి కార్యమంత్రణముఁ జేయుచున్నంతఁ గర్ణుఁడు క్రూరసర్పముచాడ్పున నిశ్శ్వసించుచు దుర్యోధనకరంబుఁ దనకరమున నల్లనం దెమల్చుచు రాజేంద్రా, యర్జునుండు పూనికియు దిట్టయు నేర్పును దాలిమియుం గలాఁడు. మఱియుఁ దఱితో నతని కచ్యుతుండు హితము బోధించుచుండు. అయ్యధోక్షజుని వెరవునంగాదె నాయొద్ద నున్నయింద్రశక్తి కడతేఱె. అయినను నాయలవును వెరవును మెఱయ వానితలంపులెల్లం బోకార్చెద ననుటయు ముదితహృదయుండై సుయోధనుం డందఱను నిజనివాసములకుఁ బోవం బనిచి సముచితప్రకారమున నారేయి గడపె. ప్రభాతం బగుటయు మనవారు కయ్యంపువేడుక గడలుకొనినయుల్లంబులతో రణాంగణమునకు నడిచి యచట నంతకుమున్న ధర్మరాజు సకలసైన్యసమేతంబుగ నేతెంచి బృహస్పతిభార్గవమతంబున దుర్జయంబైనమొగ్గరముఁ దీర్చియున్నం జూచి యుద్ధబలవీర్యముల నింద్రమరుద్గణకార్తవీర్యులం దొరయుదొరయుఁ గిరీటి మార్కొనం జాలినబెట్టిదుండు నాపద్బాంధవుండు నగురాధేయుండు తడయుటకు విచారించుచుఁ దద్గతమానసులై యుండిరనిన నాంబికేయుండు సంజయా, పదంపడి దుర్యోధనుం డేమి చేసె? శీతార్తులు భాస్కరోదయము నెట్టు లట్టులు కర్ణునిరాకఁ గోరుమనవారి కతండు పాఱిపై పోరెనే? పాండవు లతనితో నెట్టులు పోరిరి? కర్ణుఁ డొక్కరుఁడే పాండవులం గృష్ణపాంచాలసృంజయాదిసహితంబుగాఁ బరిమార్చుననియు వీర్యమున నతండింద్రోపేంద్రుల కెనవచ్చుననియు వానిశస్త్రాస్త్రము లత్యంతదారుణంబులనియు నమ్మినమనదుర్యోధనుండు ధర్మరాజున కోడుటం జూచి కర్ణుండు సైరించెనే? అక్కటక్కటా! పెద్దయు దుఃఖము వాటిల్లె. కర్ణుఁడు భండనమునం బాండవుల నిస్తరింపఁ జాలఁడయ్యె నింక నే మనం గలదు. నాఁటిపాపపుజూదంపునిష్ఠ నేఁటికిఁ బరమఘోరంబై ఫలించె. దుర్యోధనకృతము లగుఘోరదుఃఖములనొర్చుచున్నవాఁడ. సౌబలునినీతి యీతెఱంగునఁ బరిణామంబు వహించె. దినదినము నాకొడుకుల

చావునెవ్వల నీవు చెప్పఁగ విని యక్కటా! కయ్యమునం బాండవుల నాఁగుమ
గం డొక్కఁడును లేఁడుగదా యని వగం గుందుదు. పాండుపుత్రులు స్త్రీమధ్య
మునుంబోలె మనయనీకంబుఁ జొచ్చి విక్రమింతు రేమి చేయవచ్చు. దైవంబు
బలవత్తరం బనిపలికిన ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె. ధర్మమూర్తీ మీ
కగపడుపూర్వకృతముల నాలోచింపుము. కడచినకార్యమునకు వగచినం బ్రయో
జనంబు లేదుగాని పెన్వగ వొడమి వగచువానిం గీడ్పఱచు నింతయు నిక్కువం
బు. పాండవులతోడిపోరు వలదని హితవాదు లెందఱు చెప్పినను నీవు దీర్ఘాలో
చనంబు సల్పక ప్రాప్తాప్రాప్తముల నరయక కేవలమోహమునఁ దద్వచనములం
గొనవైతివి. పాండవులకు మీరు చేసినఘోరపాపకృత్యము లూరక పోవునే? తన్ని
మిత్తముననే యీస్వజననాశము వాటిల్లె. కార్యము మిగిలె నిఁక వగవవలదు.
దారుణరణప్రకారం బాకర్ణింపు మని సంజయుం డానృపాలున కిట్లనియె.

అంత నారాత్రి వేగుటయు మఱునాఁడు సకలసైనికులు సమరభూమికి
నడుచునప్పుడు కర్ణుఁడు తనతేరు దుర్యోధనునరదము డాయం జననిచ్చి యాభూ
పాలున కిట్లనియె. జనేశ్వరా, నేఁడు గాండీవిని నేను మార్కొని విక్రమించెద.
నాచే నతఁడొండె నతనిచే నేనొండెఁ బొలియుట తప్పదు. ఇన్నాళ్లు నాకు నత
నికిం గార్యములు పెక్కై యునికిం జేసి లెస్స మార్కొలు పొసఁగకుండినం జెల్లె.
హతప్రవీరం బైనయీసైన్యమును నేను మోహరించియుండఁగ నింద్రశక్తి లేదని
తాలిమి వాటించి నన్నతండు మార్కొనుట తప్పదు. నాకు నతనికిం గలయం
తరంబు వివరించెద నాకర్ణింపుము. ఆయుధవీర్యమునను శౌర్యమునను దివ్యాస్త్ర
సముల్లాసంబునను గార్యసాహసంబునను లాఘవంబునను సౌష్ఠవమునను దూర
పాతనంబునను నిమిత్తవేదనంబునను విక్రమమునను నలవునను వెరవునను బల
మునను జలమునను నర్జునుఁడు నాకు సమానుఁడు గాఁడు. తొల్లి విశ్వకర్మ యిం
ద్రునకుఁ బ్రియంకరుండై విజయనామకం బయినధనుర్వరం బొనర్చిన నతండు
జ్యాఘోషమాత్రమున వెగడుపఱుపఁ జాలినయక్కోదండముననే రాక్షసగణ
ములం జయించె. దానిం బ్రీతిపురస్సరముగఁ బురందరుండు పరశురామున కొ
సంగ నతం డిరువదియొక్కమాఱులు క్షత్రియక్షయంబు దానిచే నొనర్చె. అ
య్యది యాభార్గవరామునియనుగ్రహమున నేను బడసితి. తత్ప్రభావముల నాజా
మదగ్న్యుఁడు నాకు వివరించినవాఁడు. గాండివముకంటె విశిష్టం బయినయప్పర
మకార్ముకముఁ జేతం బూని యనికి నడిచి కడిందిమగఁటిమిం బేర్చి యర్జునుం
బరిమార్చి తద్బాంధవులం దెగటార్చి సకలమహీమండలముఁ బుత్రపౌత్రప్రతిష్ఠి
తంబై యుండునట్లు నీవశముఁ గావించెద. సత్యధర్మానురక్తుం డైనయాత్మవం
తునకు సిద్ధి యెట్టు లట్టుల నాకుఁ గార్యసిద్ధి సిద్ధంబు. విశేషించి నీకుఁ బ్రియ

ముఁ జేయఁగడంగినం జెప్పవలయునే? పాదపము దవానలముంబోలె న న్నతం డోర్వ నోపఁడు. ఎల్లదెఱంగులను నేను గాండీవికిఁ దుల్యుఁడను గాను గాని యున్నదానిం జెప్పక తీరదు కావునం జెప్పెద. అతనివింటినారి యత్యంత సారవంతంబు. అమ్ములపొదు లక్షయ్యములు. అగ్నిదత్త మగురథ మభేద్యము. మనోజవము లగువెలిమావు లవధ్యములు. కేతనమున వానరుఁడు భయవిస్మయ కరుండై దుష్ప్రతీక్షుండై యుండు. ఇట్టిసాధనములు లేమిం గొఱఁత యయ్యెడి. వీనినెల్ల విచారింపం బని లేదు. గార్ధ్రపత్రనారాచస్తోమసంభృతము లైనయనే కశకటములును నుత్తమతురంగయోజితము లైనదివ్యరథములు పెక్కులును నా వెంట వచ్చునట్లు నియమించికొని యాకొదువ వారించుకొనవచ్చుఁగాని యత నికి గోవిందుఁడు సారథియై తఱితో సేలు సేయుచుండు నట్టిసారథి నాకు లేఁ డనుకొఱఁత యనివార్యంబై యున్నది. ఆలోపమును లేకుండునేని యర్జునుం జయింప నోపుదును. అందుల కొక్కయుపాయంబు సెప్పెద. కృష్ణతుల్యుఁడై నశల్యుఁడు మనదెసఁ గలఁడు. అతండు నాకు రథచోదకుం డగునేని విజయంబు నీకు ధ్రువంబు. మఱియు నశ్వహృదయవిజ్ఞానమున నమ్మద్రేశ్వరుఁడు దామోద రుకంటె నధికుఁడు. పార్థున కధికుఁ డై ననేను రథికుఁడై నం గృష్ణున కధికుఁ డైన శల్యుఁడు సారథియగుట యెంతయు సముచితంబు. పెక్కు లేల? మద్రరాజు సారథి యగునేని దేవదానవాదులు నన్ను మార్కొని నిలువనోపరు. మనుష్య మాత్రు లగుపాండవులం జెప్ప నేల? కాలాతిక్రమణంబు గాకుండ నాకోరినయీ వరంబు నెఱవేర్ప నిన్నుఁ బ్రార్థించెద ననుటయు దుర్యోధనుండు రాధేయునివ చనములకుఁ బరమసంతోషభరితుండై యభినందించి యయ్యా, నీకోరినట్టు లెల్ల ను సమకూర్తు నని నిఖలసాధనసంభృతము లైనయరదములు పెక్కులును గార్ధ్ర పత్రనారాచపూరితశకటము లనేకములును నీవెంట నేతెంచునట్లు నియమించెద. మే మందఱము నీకుఁ దోడయి పిఱుంద నడిచెద మని కర్ణునకుఁ జెప్పి శల్యునొద్ద కరిగి ప్రణయము నెఱయ వినయము మెఱయ నిట్లనియె.

దుర్యోధనుఁడు కర్ణునకు సారథి గమ్మని శల్యునిఁ బ్రార్థించుట.

మద్రేశ్వరా, సత్యవ్రతంబును మహాభాగత్వంబును రణశౌర్యంబును బర సైన్యభీకరవీర్యంబును నీకు సహజంబులు గావున సప్రణయంబుగను సప్రశ్రయం బుగను సప్రణామంబుగనుం గర్ణుఁడు సెప్పుచుండ నాకర్ణించితివిగదా. ఈయున్న రాజు లందఱు వినంగ ని న్నీవరంబుఁ గోరెద. పార్థవినాశార్థంబు నస్మద్ధితార్థం బును నీవు కర్ణునకు సారథ్యంబు సేయ నర్హుఁడవు. నీవు సారథి గాఁగ రాధేయుఁడు నాపగతురం బరిమార్చును. ఇందులకుఁ జాలినవాఁడు నీవుదక్క నితరుఁడు లేఁడు. త్రిపురవధమున బ్రహ్మదేవుఁడు మహేశ్వరుని నిపుడు కృష్ణుఁ డర్జును నెట్టు లట్టుల

నీవు కర్ణుం గావవలయు. ఈసమరము భీష్ముఁడు ద్రోణుఁడు కృపుఁడు కర్ణుఁడు నీవు కృతవర్మ శకుని యశ్వత్థామ నేను ననుతొమ్మండ్రు గలుగ నవధావిభక్తం బయ్యె. అందు భీష్మద్రోణులు వృద్ధులయ్యు నాహితముఁ గోరి యోపినకొలంది పోరిపోరి వైరులకపటోపాయమునఁ బడుటం జేసియు మఱియుం బెక్కండ్రురాజులు శక్తిబలోత్సాహముల కనుగుణముగా దుష్కరము లగుకార్యములు చేసి ప్రాణములఁ ద్యజించి స్వర్గగతు లవుటం జేసియు మనకుఁ బెద్దయుఁ గార్యంబు సమకూఱె. అల్పసైన్యులయ్యుఁ బాండవు లామేటిశూరు లున్నపుడే పెక్కండ్ర వధించిరి. బలవంతులు మహాత్ములు సత్యవిక్రములు నగునప్పాండవులు హతప్రాయం బైనమనసైన్యము నెక్కడ్రవేల్మిడిం జంపుదు రని చెప్పవలయునే? కార్యభారమెల్ల నీమీఁదను రాధేయునిమీఁదను నిల్చియున్నది. అర్జును మార్కొనఁగ మనము కర్ణుం జాలించితిమి. అతనికి నీవు సారథివైన నెంతయు నొప్పును. కృష్ణుఁడు సారథి గాఁగ మున్నపటికంటె నిప్పు డాపార్థుబీరంబు భీకరంబై కన్పట్టుచున్నది. వాసుదేవుఁడు రథచోదకుఁడై తనకు రక్షకుఁడుగాఁగ నతం డేమేమి చేసె నవిమెల్ల నీకుఁ బ్రత్యక్షంబులు గావున నేను విస్తరించి చెప్ప నేల? వాఁ డగపడెనేని మనమూఁకలెల్ల వీఁక దఱిఁగి చీకాకుపడి పఱచెడి. కర్ణుఁడును నీవును రథికసారథులై మీయిద్దఱిపాళ్లనుం బూర్తి చేయుఁడు. బాలసూర్యసమప్రభు లగుమి మ్మిద్దఱిం జూచి పాంచాలాదు లనూరుఁడును సూర్యుఁడుం బొడమినపదంపడి కటికిచీఁకటులెట్టు లట్టుల పొడవడంగుదురు. రాధేయుండు రథికశ్రేష్ఠుండు. నీవు సారథివరిష్ఠుండవు. మీయిద్దఱికూడిక యతీతంబు నాగామియుం గాదు గావున నెంతయుఁ బెంపుఁ గాంచు. నీవు సారథి యగుటం జేసి రాధాసుతుండు దేవగణసమన్వితుం డైనమహేంద్రునకు నప్రధృష్యుండై భండనంబున గండడగు. ఇఁకఁ బాండవు లతని కొండు సేయ నోపుదు రన వచ్చునే? నావచనంబు శంకింపక యంగీకరింపు మనినం గటకటంపడి మద్రేశ్వరుండు శిఖాత్రితయభీకరంబుగ బొమముడి ఘటియించి సారెకుఁ జేతులు విదిర్చుచుఁ గులబలవిద్యాధనగర్వమునం జేసి కెంపుపెంపారినకన్నుఁగవఁ ద్రిప్పుచు నిట్లనియె. గాంధారేయా, నన్ను నిక్కంబ యవమానించితివి. మఱియు శంకించితివి. కర్ణుఁడు నాకంటె నధికుఁ డనిభావించి శ్లాఘించి వానికి సారథికృత్యము సేయుమంటివి. ఏను సమరమున రాధేయుని నాకుఁ దుల్యుఁగా నెన్నను. నా కెయ్యదియేనియుఁ బెద్దభాగంబుఁ జూపుము. వారలం జంపి కృతకృత్యుండ నగుదు. ఇంత యేల? ఏ నెక్కండన కడంగి యందఱనుం బరిమార్చెద. సంగ్రామరంగమున శాత్రవుల నీఱు సేయునావీర్యంబుఁ జూడుము. నాయట్టిపురుషుఁడు తనకుఁ దగినయభిమానము మనమున నునిచికొని ప్రవర్తించుఁగాని యొండు గాదు కావున నన్ను శంకింపఁ జనదు. పోర

నన్నవమానించుట నీకుఁ దగదు. వజ్రసంహననములు నాయతపీవరములు నగునా బాహువులను విచిత్రకోదండమును క్రూరపన్నగములంబోనియమ్ములను వాయు వేగము లగుతురంగములం బూన్చినయుత్తమస్యందనమును హేమపట్టభూషితం బైనసముద్దండగదాదండమునుం జూడుము. ఏ నలిగినం బుడమిఁ బగిలింతును. కొండలు వ్రయ్యలు గావింతును. సముద్రముల నింకింతును. ఇట్టిన న్నెఱుంగక నీచుఁ డగుకర్ణునకు సారథ్యము సేయుమంటివి. అనుచితకార్యములందు నన్ను నియోగించుట నీకుఁ దగునే? ఉత్తముఁడనై యధమునకు నెట్టులు పరిచర్య సేయ నొడంబడుదు. కూరిమిపెంపునంజేసి వచ్చి వశగతుం డైనయుత్తముని నీచునకుఁ బరిచర్య సేయుమనుట యెంతయుఁదలక్రిందుగనుం బాపంబుగనుం గాకుండునే? బ్రహ్మదేవునిముఖమున బ్రాహ్మణులును భుజముల క్షత్రియులును నూరువుల వైశ్యులును బాదముల శూద్రులునుం బుట్టి రని వేదంబులు పలుకు. ఆచాతుర్వర్ణ్యసాంకర్యముకతనఁ బ్రతిలోమానులోమంబు లైనసం కరజాతులు పెక్కులు గలిగె. లోకయాత్రవిధానార్థంబు బ్రాహ్మణులకు యా జనాధ్యాపనపరిశుద్ధప్రతిగ్రహంబులను క్షత్రియులకు దుష్టశిక్షణశిష్టరక్షణంబు లను వైశ్యులకుఁ గృషిగోరక్షావాణిజ్యంబులను నియమించి శూద్రులకు బ్రహ్మ క్షత్రవైశ్యపరిచర్యయు సంకరజాతులకు నయ్యైసాంకర్యమున కనుగుణముగా ను త్తమవర్ణజాతులసేవయు వృత్తిగా ధర్మశాస్త్రాచార్యులు విధించిరి. అందు సూ తకులజాతులు బ్రాహ్మణక్షత్రియులకుఁ బరిచారకు లని శిష్టసమ్మతంబు గల దుగాని క్షత్రియుఁడు సూతునకుఁ బరిచర్య సేయుట ధర్మబోధితము గాదు. ఇంతేల? వారిమాట వినుటయు రాజకులీనునకు గర్హితంబు. ధర్మనిర్ణయం బిట్టు లుండ మూర్ధాభిషిక్తుఁడను రాజర్షికులజాతుఁడను మహారథుఁ డనం బేర్కొనఁబడినవాఁడను వందిజనస్తుత్యుండను నగునేను సూతపుత్రునకు సంగ్రా మమున సారథ్యము సేయుట కుత్సహింపను. ఇంతయవమానముఁ బొంది మీకుఁ దోడై పాండవులతోడఁ బోరుటయు నా కనభిమతము గావున నింక నిచట నుండఁ జనను. మాదేశమునకుఁ బోయెద ననిపలికి యమర్షభరితుండై రాజమధ్యమున లేచి వెడలుచున్నంత నీకొడుకు ప్రణయబహుమానముల నమ్మద్రరాజును నిల్పి కార్యము నెఱవేఱుతెఱఁగున సాంత్వనమధురముగ నతని కిట్లనియె. మద్రేశ్వరా, నీచెప్పినదెల్ల నిక్కనంబు. ఐన నాయభిప్రాయము బొందు గలదు. దాని నాకర్ణిం పుము. నీకంటెఁ గర్ణుఁడు నేనును నధికులము గాము. నిన్ను శంకింపను. మద్రే శ్వరుఁడు ఋతముగాని దానిం జేయఁడని యెఱుంగుదు. మీపూర్వులు ఋతవా దులుగావున నేతత్కులజాతుం డైననీ కార్తాయని యనుపేరును శత్రులకు శల్య భూతుఁ డగుటకతన శల్యుండనునామంబును వాసికెక్కె. నాకార్యము నెఱవేఱు

తెఱంగు విచారించి నీవు చెప్పినట్లు చేయుము. ధర్మవిదుఁడై ననీకు లాఁతులు చెప్పవలయునే? కర్ణుఁడు గాండీవికంటె వీర్యాదిగుణముల నధికుఁడనియు నీవు శౌరికంటె నశ్వజ్ఞానమునను బలమునను నధికుఁడనియు నెల్లవారును జెప్పుదురు. అర్జునునకుఁ గృష్ణుఁడు సారథ్యము చేయుటంజేసి నీవు రాధేయునకు రథచోదకుఁడవైనం బగతుర గెలువవచ్చు ననుతలంపున నిన్నుఁ బ్రార్థించితిఁగాని నిన్నవమానింపఁ దలఁచినవాఁడఁగా ననిన విని శల్యుఁడు సుయోధనా, సకలరాజసమక్షమున నన్ను జనార్దనుకంటె నధికుఁ డనిపేర్కొనినకతన నీయెడఁ బరమప్రీతుఁడనైతి. నీకోరినతీరున సవ్యసాచితోడఁ బోరురాధేయునకు సారథి నయ్యెద. నాకుఁ గర్ణునకు నొక్కసమయంబు వలయు. తఱితోఁ దోఁచినట్లు లేను మాటల విడిచెదనందుల కతండు సైరింపవలయు ననుటయు సుయోధనుండు వల్లెయని శల్యుమతముఁ గర్ణున కెఱింగించి యతని నొడంబఱిచి మఱియు నమ్మద్రరాజునకుఁ బ్రీతి పుట్టించువాఁడై యిట్లనియె.

దుర్యోధనుఁడు శల్యునకుఁద్రిపురసంహారముఁ జెప్పుట.

మద్రరాజా, తొల్లి మార్కండేయమునీంద్రుఁడు మాతండ్రియొద్ద కేతెంచి నేను వినఁగ నొక్కయుపాఖ్యానంబుఁ జెప్పె. దానిం దేటపఱిచెద నాకర్ణింపుము. అది వింటివేని విచారముఁ దొఱంగుదువు. తొల్లి దేవదానవసమరమునఁ దారకాసురుఁడు హతుఁడైనపదంపడి దైత్యులోడి పాఱినం దారకపుత్రులైన తారకాక్షుఁడు కమలాక్షుఁడు విద్యున్మాలి యనువారు ముగ్వురు పరమనియమమున నిరాహారులై శరీరములఁ గృశింపఁజేయుచుఁ దీవ్రతప మొనర్చినం బ్రీతుండై బ్రహ్మదేవుఁడు వరముఁ గోరికొనుఁ డనుటయు వారు సర్వభూతావధ్యత్వము వేఁడినం బరమేష్ఠి యమరత్వం బసంభావితంబు గావున నొండొక్కటి యడుగుఁ డనిన వారు తమలో నాలోచించి వనజభవునకుఁ బ్రణామముఁ గావించి దేవా, యది యట్లగునేని భవత్ప్రసాదమున నభేద్యములు కామగమనములు నగుమూఁడుపురములఁ బడసి సకలలోకములందు విహరించునట్లును వర్షసహస్రమున కమ్మూఁడుపురములును గలిసి యేకీభూతము లగునట్లును నప్పు డొక్కయమ్మున నమ్మూఁటినిఁ బడఁ ద్రోయఁ జాలినయతఁడు మాకు మృత్యు వగు నట్లును వరం బిమ్మనినం బితామహుం డట్ల యగుంగాక యనుటయు నత్తారకపుత్రులు లబ్ధవరులై ప్రీతచేతస్కులై లెస్స యాలోచించి దైత్యదానవపూజితుం డైన మయుం బ్రార్థించి క్రమమున సర్వావయవములు పసిండియు వెండియు నినుమునుంగా మూఁడుపురముల నతండు నలుదెసలను శతయోజనాయామంబులఁగను బ్రాసాదాట్టాలకాదిభాసురంబులఁగను రుచిరప్రాకారపరివృతంబులఁగనుం గల్పించిన దివంబున నుండుకాంచనపురంబునకుఁ దారకాక్షుండును నంతరిక్షస్థితం బగు

రాజతనగరంబునకుఁ గమలాక్షుఁడును భూమిష్ఠం బగునాయసపట్టణంబునకు విద్యు న్మాలియు నధిపతులై యప్రమేయప్రభావమునఁ దేజరిల్లి యీలోకంబునకు మేమ తక్కఁ బ్రభుఁ డెవ్వఁ డని మదించి ముల్లోకములఁ బీడించుచుండఁ దొలుత సుర లచే నిరాకృతులును మాంసాశనతృప్తులు ననేకకోటిసంఖ్యాకులు నగుదానవు లెంతయు నైశ్వర్యముఁ గోరుచు నాత్రిపురదుర్గ మాశ్రయించి నిర్భయులై యుండిరి. మయుఁడు వారు కోరినకోర్కు లనెల్లఁ దఱితో నెఱఁగూర్చుచుండె. తారకాక్షునికొడుకు హరి యనువాఁ డప్పుడు తీవ్రతపస్సునం బరమేష్ఠి నారా ధించి చచ్చినవారల బ్రదికింపఁ జాలిననేళులం బరిపూర్ణం బైనబావి యాత్రిపు రములఁ గలుగునట్లు వరముఁ బడయుటయు నాత్రిపురవాసులకు మరణభయము లేమిం జేసి యఖర్వగర్వదుర్దాంతులై లోభమోహాభిభూతులై సురలం దఱిమి వారియుద్యానములను ఋషులపుణ్యాశ్రమములను రమ్యజనపదములనుం జెఱు చుచుండ నాఖండలుండు విరించివరమునం జేసి యభేద్యము లయినయప్పురముల భేదింపఁ జాలక వెఱచి సురలును దానును నవ్విరించియొద్దకుఁ జని యయ్యసురు లొనర్చువిప్రకారములఁ బ్రణామపురస్సరంబుగ నివేదించి తద్వధోపాయ మడి గినం గనకగర్భుండు సురల కిట్లనియె. మీకుఁ గీడు సేయునద్దానవులు నాకును నెగ్గు చేయుచున్నవారు. సర్వభూతసముఁ డగునేనును వారల వధింపవలయు ననియె తలంచెద. అధార్మికుల వధించుటయే కదా నాపూనినవ్రతంబు. అన్నగరములు మూఁడు నేకీభవించినయప్పు డొక్క యమ్మున వధ్యమ్ము లగు. అందులకుఁ జంద్రచూ డుఁడు దక్క లాఁతు లేరును వలంతులు గారు గావున నద్దేవుని శరణు సొచ్చుట కర్త వ్యం బనిపలికి కమలభవుఁ డింద్రాదులతోడ మహేశ్వరుసన్నిధి కరిగె. అరిగి తపో నియమగరిష్ఠులు నిత్యబ్రహ్మనిష్ఠులు నగుమునులకు గమ్యుఁడు వివిధతపోబలాత్మ యోగవిదుఁడు సాంఖ్యాభిజ్ఞుఁడు వశీకృతాత్ముఁ డభయదుఁడు సర్వాత్ముఁడు మహా త్ముఁడు జగద్వ్యాపకుఁడు భగవంతుఁ డకల్మషుఁ డసదృశుఁడు నగునయ్యుమా పతిం గాంచి బహువిధములఁ బ్రస్తుతించి యేకరూపుఁ డైనయమ్మహేశ్వరుని న నేకరూపభాసమానుంగాఁ గల్పించి యారూపములం దాత్మాపరోక్షం బూహించి యద్వైతంబు నిశ్చయించి యందులకు నివ్వెఱఁ గందుచు ఫాలభాగంబులు ధర ణీతలంబున ఘటియించి సాష్టాంగదండప్రణామము లొనరించి స్వస్తివాదముల నారాధించుటయు శంకరుఁడు పరమప్రీతచేతస్కుండై మీరాకకుఁ గతం బెయ్యది యని మందహాసరోచిరుదంచితవదనారవిందుఁడై యొత్తి యడుగుటయు స్వస్థచి త్తులై యమరు లిట్లని విన్నవించిరి. దేవా, యనిర్వచనీయమహామహుఁ డప్రమే యనాముఁ డనిర్దేశ్యస్వరూపుఁ డఖిలపతియు నగునీకుఁ బ్రణామిల్లెదము. మనో వాక్కాయకర్మముల నిన్ను శరణుసొచ్చినమమ్ము రక్షింపు మని వేఁడిన నవ్వేఁడికో

లాలించి స్వాగతంబున నభినందించి వెఱపు దొఱంగి చెప్పఁ డేమి చేయుదు న నిన నయ్యభయదానమునకుఁ బ్రహృష్టుండై బ్రహ్మ యిట్లనిమె. మహేశ్వరా, నీయనుగ్రహమున బ్రహ్మపదంబు నొంది నేను దెలియక తారకాసురసుతులకు వర మిచ్చుటంజేసి వారు మదోద్రిక్తులై ముల్లోకముల నేఁచుచున్నవారు. అతి క్రాంతమర్యాదు లైనవారల వధింపఁగ నీవు దక్క నితరు లోపరు కావునఁ గరు ణించి వారలం బరిమార్చి శరణాగతు లైనమ మ్మనుగ్రహింపు మనుటయు మృ త్యుంజయుం డయ్యా, మీశత్రువులం జంపుట నా కిష్టంబయ్యెనను బలియు లైనవారల వధించుట నా కొక్కని కశక్యంబు. అస్మత్తేజోర్థమున సురలే వారలఁ దెగటార్పఁ దగు ననిన విని సురలు దేవదేవా, మాకంటె ద్విగుణబలు లగున ద్దానవుల వధింపను భవదీయతేజము భరియింపను మే మోపము కావున మా యందటితేజమునం దర్ధముఁ గొని నీవ వారలఁ బరిమార్పు మనినం దద్బలమునం బొల్చి శంకరుం డందఱికంటె బలియుండై మహాదేవుఁ డనం బరఁగి నాకుఁ దగిన తేరు గల్పింపు మనుటయు నమరులు త్రైలోక్యమూర్తులచే రథముఁ గల్పింపఁ దగు నని యది విశ్వకర్మకుఁ దెల్పుటయు నాతండు సకలభూమండలము తేరుగా మందర మిరుసుగా నక్షత్రరేఖ యీషాదండముగాఁ గృతయుగము కాఁడిగా వాసుకి నె గగా నుదయాస్తమయపర్వతములు బండికన్నులుగా వింధ్యహిమవంతములు తదవయవంబులుగా సప్తర్షిమండలము రథపరిష్కారముగా గంగాదినదు లహో రాత్రములు కలాకాష్ఠాదులును రథోపస్కారములుగా గ్రహము లనుకర్షంబుగా ధర్మార్థకామత్రయంబు త్రివేణుకంబుగా సూర్యచంద్రులు చక్రములుగా ధృతరా ష్ట్రప్రముఖు లయినపదుగురు నాగపతులు యోక్త్రములుగా దివంబు యుగం బుగా సంవర్తకబలాహకములు యుగచర్మములుగాఁ గర్కోటకధనంజయాదు లగునాగనాథులు వాలబంధనంబులుగా దిగాదులును సంధ్యాధృతిమేధాస్థితిసన్న తులును గుహూరాకాసినీవాల్యనుమతులును యోక్త్రాంగములుగా నింద్రయమవ రుణకుబేరులు హయప్రతిపాలకులుగాఁ జతుర్వేదములు గుఱ్ఱములుగా మన స్సధి ష్ఠానంబుగా సర్వస్వతి రథ్యగా వషట్కారము మునికోలగా గాయత్రి శిరోబం ధనంబుగా మైనాకంబు కేతనంబుగాఁ గాలచక్రంబు చర్మగా విద్యుద్విలసితంబు లైనవివిధమేఘములు వివిధపతాకలుగాఁ దొల్లి యజ్ఞసమయమునఁ గల్పించిన తేరికంటె నానాసన్నాహబంధురంబుగాఁ గల్పించినం జూచి సురలు పిచ్చలించిరి. అట్టిరథవరంబుఁ గాంచి యీశ్వరుండు వృషభకేతనము విలసిల్ల బ్రహ్మదండకా లదండరుద్రదండములును జ్వరమును బరిస్కందత్వముఁ బూనఁగ నథర్వాంగిర సులు చక్రరక్షకులుగాఁగఁ ద్రయీతిహాసపురాణములు సకలవిద్యలును బ్రణ వంబును బార్శ్వమునను ముఖమునను మెఱయఁ గాలరాత్రినాఁబడునాత్మచ్ఛాయ

యల్లెత్రాడై క్రాల నొప్పు కాలమయశరాసనంబున విష్ణుసోమాగ్ని ప్రజ్వలితం బగుబాణముఁ గొని చూచి సారథి యెవ్వండు నాకంటె నధికు నెక్కని నందు లకు నియమింపవలయు ననిన సురలు బ్రహ్మపాలి కరిగి వివిధసన్నాహబంధురం బై నస్యందనమున కలరి చంద్రశేఖరుఁడు తనకంటె నధికుఁడగుసారథిని గోరుచు న్నాఁడు. అక్కార్యము నీవు పూనవలయు. మాకార్యములు నెఱవేర్తు నని నీయి చ్చినబాస ఫలవంతముఁ గావింపవలయు. ధరాతలంబు తేరఁట. వేదములు గుఱ్ఱ ములఁట. రథికుఁ డీశ్వరుఁడఁట. సారథ్యమునకు నీ వొడంబడినం గదా యెంతయు నొప్పు. సురారులు తెగటారుదు రని ప్రార్థించినం బరమేష్ఠి నిర్జరులారా, మీకా ర్యంబు నెఱవేఱఁగ శర్వునకు సారథి నగుదు నని యొడంబడియె. ఒడంబడి బ్ర హ్మ నెగ లెక్కి వ్రాలినగుఱ్ఱములం దడవి తేర్చి ప్రగ్గములు మునికోలయుం గ్ర హించి స్థాణు నారోహింపఁ బ్రార్థించుటయు బ్రహ్మసారథికంబు వేదతురంగంబు నగుధరారథంబును గంధర్వగానంబు లప్సరోనృత్యంబులు ఋషిగణస్వస్తివచనం బులు సకలస్తోత్రంబులు వివిధవాద్యంబులునుం బొంపిరివోవ నారోహించి సక లలోకముల కభయం బిచ్చి బ్రహ్మదేవునిసారథ్యచాతుర్యంబునను రథ్యములపటు గయమునం జేసియు నతిత్వరితగతిం దేరు త్రిపురాభిముఖంబై యరుగుచుండ శం భుఁడు నిజబలము నిరూపించుచు నెమ్మనమున నలరుచుండె. అట్టియెడఁ గేతనవృ షభము పెలుచ నంకె వేయుటయు నందులకే కొందఱు త్రిపురవాసులు మూ ర్ఛిల్లిరి. అంత నంతకాంతకుండు త్రిపురము లేకీభవించినతఱి చూచి చాపంబు సజ్యంబు గావించి విష్ణుసోమాగ్నిమయం బైనయాబాణవరం బరిఁ బోసి విడు చుటయు సిద్ధులయు సురలయుఁ బరమర్షులయు జయజయవచనంబులును బ్రస్తు తివాక్యంబులును నిగిడె. సకలలోకస్తవనీయం బైనయమ్మార్గణంబు తాఁకునంజే సి యాత్రిపురములు నీఱయి పశ్చిమసముద్రమునం బడియె. ఖండపరశుండు కోదండమున నమ్ము సంధించునెడ మహానాదం బొనర్చి సంప్రమర్దవిహ్వలంబు లైనరథ్యముల స్తనములను గోసి వృషభముఖురముల విదళించె. నాఁటఁగోలె లోకమున గుఱ్ఱములకు స్తనములు లేమియు గోఖురములు రెండురెండై యుండు టయుం గలిగె. అప్పుడు మహేశ్వరునిక్రోధానలంబు లోకములం గాల్పం దొ డంగినం ద్రిపురాంతకుఁడు ప్రశాంతుఁడై దాని వారించినం గీర్వాణులును లోక ములును బ్రసాదంబుఁ జెందుటయు సురప్రముఖు లద్దేవదేవునిఁ బ్రస్తుతించిరి.

అంతఁ గొండొకవడి కుమాదేవి చూడ వచ్చినఁ ద్రిపురాంతకుఁడు పం చముఖబాలరూపము ధరించి యద్దేవితొడపయిం గూర్చుండ నింద్రుఁడు వచ్చి యుమాదేవియంకగతుం డైనయప్పంచముఖకుమారుం గాంచి నవ్వి వజ్రాయు ధమునం బ్రహరింప భుజము మీఁది కెత్తుటయు నాభుజ మల్లె స్తంభితం బయ్యె.

అంత నింద్రుఁడు సురగణపరివృతుండై పితామహుపాలి కరిగి ప్రణమిల్లి దేవా, పార్వతీదేవితోడఁపై నెక్కయద్భుతభూత ముండఁగ మేము ప్రణమిల్లక యనాదరించుటంజేసి యీయవస్థ వాటిల్లె. అతం డెవ్వఁ డనియడుగ నయ్యంభోరుహసంభవుండు శంభుని ధ్యానించి యబ్బాలుం బరమేశ్వరుఁగ నెఱింగి వారల కిట్లనియె. చరాచరజగన్నాథుఁ డైనశివుఁడే పార్వతికిఁ బ్రియము సేయం గోరి విలాసార్థంబు బాలరూపధరుండై యద్దేవికుఱు వెక్కినవాఁడు. మీ రెఱుంగక యపచారము చేసితిరి నాతోడ రండు. అద్దేవదేవుం బ్రసాదింత మనిపలికి పరమేష్ఠి యింద్రాదిసురగణపరివృతుండై శంకరుపాలి కరుదెంచి నమస్కరించి దేవా, నీవే యజ్ఞంబవు. భువనంబులకు గతివి. పరాయణంబవు. భవుఁడవు. మహాదేవుఁడవు. పరమధామంబవు. పరమపదంబవు. చరాచరస్వరూపం బయినజగ మంతయు నీచే వ్యాప్తం బయ్యె. క్రోధము మాని శక్రునియెడఁ బ్రసాదింపవే యని వేఁడినం బద్మజునివచనంబులకుఁ బ్రీతుండై మహేశ్వరుండు ప్రసాదాభిముఖుండై యట్టహాస మొనర్చినం గీర్వాణులు రుద్రుని రుద్రాణినిం బ్రస్తుతించుటయు నింద్రునిభుజము తొల్లింటియట్లు ప్రకృతిస్థంబయ్యె. అంతఁ గృతకాములై సురలు మహాదేవియనుజ్ఞఁ గొని నిజనివాసంబులకుఁ జనిరి. అట్లు దేవకార్యార్థంబు బ్రహ్మదేవుఁడు రుద్రునకు సారథ్యం బొనరించె. నీవు నట్లే కర్ణునకు సారథి వగుము. రాధేయుండు శంభుతుల్యుఁడు, నీవు బ్రహ్మ కెనవత్తువు. కర్ణుఁ డర్జునున కెక్కు డగురీతి నీవుం గృష్ణున కధికుండవు. నీవు రథముఁ గడపినం గర్ణుండు పాండవేయులం బరిమార్చుట నిక్కువంబు. రాజ్యాశయు జీవితాభిలాషంబును విజయంబును గర్ణసారథ్యకారణంబున నీపై నిలిచె. ఇంకేల? కర్ణుండును మే మందఱమును భవదధీనులము.

మద్రేశ్వరా, మఱియు నెక్కయితిహాసంబుఁ జెప్పెద నాకర్ణింపుము. దానిం దొల్లి ధర్మవిదుఁ డనుబ్రాహ్మణుఁడు మాతండ్రికిఁ దెలుపుచుండఁగ నేను వింటిని. హేతుకార్యార్థసహితం బైనయీయితిహాసం బాకర్ణించి యొండు విచారింపక చేయుము. భార్గవకులజాతుం డైనజమదగ్నికిఁ దేజోగుణవిలసితుం డైనరాముఁ డనుకుమారుఁడు వొడమి యస్త్రసంపాదనతాత్పర్యమునఁ దీవ్రతపమునఁ బరమేశ్వరు నారాధించిన నతనిభక్తిశాంతులకు మెచ్చి శంకరుఁడు తన్మనోగతం బెఱింగి భార్గవా, నీతపమునకు మెచ్చితి నీయభిలషితంబుఁ దెలిసితిఁగాని యిప్పు డపరిశుద్ధాత్ముఁ డైననీ కస్త్రము లొసఁగఁ దగదు. అపాత్రు లపరిశుద్ధు లసమర్థులు నగువారల నయ్యస్త్రములు దహించుఁ గావునఁ బూతుఁడవైనపదంపడి యిత్తు ననుటయు రాముఁడు దేవా, యది యట్టు ల యగునేని యేను బాత్రభూతుఁడ నని నీకుఁ దోఁచినపు డిత్తువుగాని యందాఁక శుశ్రూష చేయు

చుండుదు నని విన్నవించి దమనియమస్ఫురితుండై తపస్సునను హోమమంత్ర పురస్కృతంబు లైనపూజోపహారాదులను బహువత్సరములు శర్వు నారాధించినం బ్రసన్నుండై పన్నగాభరణుం డీరాముఁడు నాకుఁ బరమభక్తుఁడు దృఢవ్రతుఁ డని ప్రీతిబహుళంబుగా దేవపితృగణసమక్షమునఁ బార్వతికిఁ దెలిపె. అట్టియెడ దర్పమోహపరీతు లైనదైత్యులయుపద్రవములఁ బడలేక సురలు దేవా, వారల వధించి మమ్ము రక్షింపు మని యీశ్వరుం బ్రార్థించుటయు నుమాపతి యట్ల యని యమరులకుఁ దెల్పి భార్గవరాముం బిలిచి యయ్యా, లోకహితార్థంబును మత్ప్రియార్థంబును దేవశత్రువులఁ బరిమార్పు మనిన రాముఁ డిట్లనియె. దేవా, కృతాస్త్రులు యుద్ధదుర్మదులు సురలకు నజేయులు నగుదానవుల నకృతాస్త్రుఁడ నశక్తుఁడ నగునే నెట్టులు వధింప నోపుదు నని విన్నవించుటయు శంకరుఁ డోభార్గవా, యిందులకు సందియ మొందం బని లేదు. నాయనుజ్ఞాప్రభావమున బలియుండవై నీవు దానవులఁ దెగటార్ప నోపుదువు. ఒండు విచారింపక యరుగు మనినఁ బరశురాముఁడు మహాప్రసాదం బని యంగీకరించి కృతస్వస్త్యయనుండై చని దనుజులఁ బోరికిం జీరి వజ్రాశనిస్పర్శము లగుతదీయ శరప్రహారముల కోర్చి వారలనెల్లను వధియించి యుమాపతిసన్నిధి కేతెంచిన నద్దేవదేవుఁడు కరస్పర్శమున నతని నిర్వ్రణుం గావించి ప్రీతచేతస్కుండై దానవాస్త్రముల సైరించినకతన నీకు మానుషకర్మంబు వదలె, నీకోరినమహాస్త్రముల నిచ్చెద నని చెప్పి యుత్తమాస్త్రములను నభిమతవరములనుం బ్రసాదించుటయు నమ్మహేశ్వరునకు సాష్టాంగదండప్రణామము లాచరించి వీడ్కొని రాముఁడు నిజావాసంబునకుఁ జనియె నని యాధర్మవిదుఁడు చెప్పఁగ వింటిని. ఆపరశురాముఁడు సుప్రీతచేతస్కుండై కర్ణునకు ధనుర్వేదము నేర్పి దివ్యాస్త్రగ్రామంబు నొసంగె. కర్ణుఁ డుత్తమక్షత్రియకులమున జనించినదేవకుమారుఁడుగాని సూతసుతుఁడు గాఁడు. ఏకారణముననో సూతకులమునఁ బెరుఁగుటం జేసి యతనికాపేరు కలిగె. నీచకులజాతునకు భార్గవరాముఁడు దివ్యాస్త్రముల నొసంగి ధనుర్వేదంబు నేర్పునే? కర్ణునితల్లి యుత్తమక్షత్రియకులాంగన గాదేని సహజకవచకుండలమండితుఁ డాజానుదీర్ఘబాహుఁ డాదిత్యప్రకాశుఁడు విశాలవక్షుఁడు పరమశూరుఁడు నగునమ్మహానుభావుని సూతవనిత గననేర్చునే? లేడికడుపునఁ గ్రోల్పులి పుట్టునే? రామశిష్యుఁడు తీవ్రప్రతాపదీపితుఁడు వృషపదవాచ్యుఁడు నగు కర్ణుఁడు సర్వవిధములం బ్రాకృతుఁడు గాఁడని నానిశ్చయము. సర్వలోకపితామహుఁ డైనబ్రహ్మదేవుఁడు సురలు వేఁడికొనఁగ రుద్రునకు సారథి యైనవిధమున రథికుకంటె సారథి యధికుఁడగుట మేలని చిత్తమునం దలపోసి నీవు నావేఁడికో లియ్యకొని కర్ణునకు సారథి వగుమనిన దుర్యోధనునకు శల్యుఁ డిట్లనియె.

సుయోధనా, నీనిరూపించినయుపాఖ్యానములు నేనును వినియున్నవాఁడను. త్రికాలవేది యగుకృష్ణుఁ డిదియెల్ల నెఱింగియే పార్థునకు సారథి యయ్యె. కర్ణుఁడు విక్రమించి గాండీవిని వధియించినను వాసుదేవుఁడు శంఖచక్రగదాపాణియై తానైనం గయ్యమునకుఁ దొడరి మనసేనల నీఱుసేయ కుడుగఁడు. కోపదీపితుం డైనకృష్ణునియెదుర నిలుచుమగఁడు గలుగునే యనుటయు నీకొడుకు శల్యున కిట్లనియె. మద్రేశ్వరా, సర్వశస్త్రభృద్వరిష్ఠుఁడు సర్వాస్త్రపారగుఁడు నగుకర్ణు నవమానింప వలదు. భీషణం బైనతదీయజ్యాఘోషణంబు విన్నంతన పాండవసేనలు పలుదెసలఁ బఱచుచున్నవి. మాయాశతములు పన్నుచున్నఘటోత్కచుని వధించుటయు బీభత్సుఁ డిన్నినాళ్లు భీతుఁడై యనికిఁ దొడరని తెఱంగునఁ గడిందిమగంటిమిం బేర్చుటయు భీముని వింటికొప్పునం బొడిచి యోరీ తిండిపోతా యని తిట్టుటయుఁ గవలం గెలిచియు నెయ్యదేనియు నొక్కకారణంబున వధింపక విడుచుటయు సాత్యకిని విరథుం గావించుటయు ధృష్టద్యుమ్నాదులఁ బెక్కుమాఱుల నిర్జించుటయు నున్నగుకర్ణునివీర్యకృత్యములు నీకుఁ బ్రత్యక్షములుకదా. వజ్రపాణి యగుసురేంద్రుఁడు నతనిం గెలువఁ జాలఁడు. ఇఁకఁ బాండవులం జెప్పనేల? నీవు సర్వాస్త్రవిదుఁడవు. సర్వవిద్యాపారగుఁడవు. బాహువీర్యమున నీకుఁ దుల్యుఁడు పృథివిలోఁ గలుగఁడు. శాత్రవులకు శల్యభూతుఁడగుటం గాదె నీకు శల్యుఁ డనుపేరు సార్థకం బయ్యె. నీబలముకంటెఁ గృష్ణునిబల మధిక మగునే? అర్జునుఁడు హతుఁ డైనపదంపడి కృష్ణుఁడు పాండవార్థ మేతెఱంగుమగంటిమిం జూపు నంతటిబీరమ్ము వాటించి నీవుకర్ణున కపాయము గలుగకుండఁ జూచికొమ్ము. వాసుదేవుఁడు మనమూఁకల నాఁగజాలుట నీవు వారిమూఁకలఁ జంపకుడుగుట యనునివి పొసఁగునవి కావు. నీవు గలిగినకతన నేను సోదరులయుఁ బెక్కురాజులయు ఋణముఁ దీర్ప నున్నవాఁడనని పలికిన దుర్యోధనునకు శల్యుఁ డిట్లనియె.

శల్యుఁడు కర్ణునకు సారథిగా నొడంబడుట.

గాంధారేయా, సకలసైన్యమధ్యమున నన్నుఁ గృష్ణునికంటె బలాధికునిఁగాఁ గొనియాడినకతన నీయెడ సుప్రీతుఁడనైతిని. అర్జునుతోడిపోరికిఁ గడఁగిన రాధేయున కిదె సారథి నయ్యెద. నీహితముఁ గోరి యే నెన్నిపరుషములు పలికినను గర్ణుఁడు కినియక సైరణసేయవలయు ననుసమయ మింతకుమున్న యొఱింగించితిఁ గదా. అది యట్ల కావలయు ననిన విని సంతుష్టచిత్తుండై భవత్తనయుండు కర్ణున కయ్యర్థముఁ బ్రమ్మఱఁ దెల్పి కౌఁగిటం జేర్చి యాదరించి రాధేయా, మహేంద్రుఁడు దానవులం బోలె నీవు విక్రమించి పాండవుల నిర్జింపు మనవుడుఁ గర్ణుఁడు ముదమునం బొదలి రాజేంద్రా, శల్యుమాటలచందంబుఁ జూచిన నతండు మిక్కిలి సంతసింపనివిధంబు దోఁచుచున్నది. మధురవచనములఁ బ్ర

మ్మఱి యతనిం దేర్పవేయని దుర్యోధనునకుఁ జెప్పుటయు నతండు మేఘగం
భీరనినదంబున శల్యున కిట్లనియె. మద్రపతీ, కర్ణుఁడు పాండవులను నర్జును
జంపఁగఁ బూనికయ్యమునకు నడువ నున్నవాఁడు. నీ వతనికి సారథ్యంబు సేయ
వలయు. భవత్ప్రసాదముఁ బడయఁ గోరి చెప్పినయర్థమే పలుమాఱు చెప్పు
చున్నవాఁడను. కృష్ణుఁడు పార్థున కెట్టు లట్టుల నీవు కర్ణునకు సర్వవిధములం గా
వలి గావలయు ననుటయు శల్యుఁడు సంప్రమోదసుందరాననుండై దుర్యోధనుని
గాఢాదరంబునఁ గౌఁగిటం జేర్చి యయ్యా, నీతలఁ పిట్టిదయేని తప్పక నీకుఁ బ్రి
యంబు సేయుదు. నీనియమించిన కార్యమును సర్వవిధములఁ బూని మోవ రా
నిమోపైన నెత్తికొనియెద. హితముఁ గోరి యేను బ్రియమునొండె నప్రియము
నొండెఁ బలుకుదు. అందులకు నైకర్తనుఁడును నీవును నోర్వవలయు. ఈసమయ
ము మఱవఁజన దనుచున్నంతఁ గర్ణుఁడును శల్యుదెస మొగంబై మద్రరాజా,
శర్వునకు బ్రహ్మయుఁ బార్థునకుఁ గృష్ణుఁడు నెట్టు లట్టుల నీవు నాకు సారథివై హి
తము సేయఁ గోరుచుండవలయు నని ప్రార్థించినం బ్రీతుండై మద్రరాజు కర్ణున
కిట్లనియె. ఆత్మనిందయు నాత్మస్తుతియుఁ బరనిందయుఁ బరస్తుతియు ననునాలు
గార్యగర్హితంబులైనను నీనమ్మికపొంటెఁ జెప్పెద. అప్రమాదప్రయోగజ్ఞాన
విద్యాచికిత్సితంబులం దేను మాతలికి సమానుఁడను. ఇంద్రునకుఁ సారథ్య
ముఁ జేయ నేర్తును. ఇట్టినేను నీకు సారథి నగుదు నని యొడంబడితిఁ గావున
నింకఁ జింత దక్కి పోరు మనుచున్నంత దుర్యోధనుఁడు కర్ణున కిట్లనియె. కర్ణా,
కృష్ణునికంటె విశిష్టుఁడై నయీమద్రేశ్వరుఁడు మహేంద్రునకు మాతలియెట్లట్లు
నీకు సారథ్యముఁ జేయ నియ్యకొనియె. నీవు రథికుఁడుగా మద్రరాజు సారథిగా
నున్నతి నెక్కినరథంబు పాండవులం బరాభవించు నని చెప్పవలయునే? కావునఁ
గర్ణుఁడు జయించుట నిక్కం బని నిరూపించి దుర్యోధనుండు శల్యునిఁ గర్ణసార
థ్యమున కియ్యకొల్పినం గర్ణుండు ముదితహృదయుండై తనసారథిం బిలిచి నీవు
రయమునం దే రాయితంబు చేసి తెమ్మనుటయు వాఁడు గంధర్వనగరప్రతీకా
శం బగునరదమును విధివత్కల్పితంబుఁ గావించి దీవించి యిచ్చుటయు వేదవిదుఁ
డైనపురోహితుఁడు జైత్రమంత్రముల నభిమంత్రించినం గర్ణుండు ప్రదక్షిణంబు
గావించి భాస్కరోపాస్తి యొనరించి శల్యుం దే రెక్కు మని ప్రార్థించుటయు నమ్మ
ద్రరాజు గిరిశిఖరమునకు లంఘించుసింహమువిధమున నొగ లెక్కుటయు శల్యారూ
ఢం బయినయారథవరమును గర్ణుఁడు దా నధిరోహించె. అట్లురథారూఢు లైన
కర్ణశల్యులు గగనమండలమున వెలుంగుసూర్యాగ్నులవిధమున నొప్పి వందిజనస్తో
త్రములకుఁ బాత్రీభూతులై యజ్ఞవేదియందు ఋత్విక్సదస్యులస్తోత్రములకుఁ బా
త్రులైనయింద్రాగ్నులతెఱంగునం దేజరిల్లిరి. అప్పుడు దుర్యోధనుఁడు పరివేష

మధ్యగతుం డై నమధ్యందినమార్తండునిపగిది రథమధ్యమున నెప్పారు రాధేయుం గాంచి యంగరాజా, సంగరమున గాంగేయభారద్వాజు లొనరింపనిమహా రకృత్యములఁ జేయుము. రెండవవజ్రధరుండునాఁ బొగడ్త కెక్కి నీవు భీమార్జునులను గవలను వధింపుము. ధర్మరాజుం బట్టికొనుము. నీకు విజయం బయ్యెడు మనుచున్నంత భేరీసహస్రములును మార్యాయుతములును బహుళవాద్యములును నెక్కమొగి మొరసె. ఆనినాదమునకు నెమ్మనమ్మున నలరుచుఁ గర్ణుండు శల్యుం జూచి తేరు వొనిమ్ము. భీమార్జునులను గవలను ధర్మరాజును వధింపవలయు. నాభుజవీర్యము నేఁడు సవ్యసాచి సూచుఁగాక. పాండవవినాశార్థంబును దుర్యోధన విజయార్థంబును నేను గంకపత్రమార్గణగణంబులం గుప్పించెద ననిన శల్యుం డతని కిట్లనియె.

శల్యుఁడు కర్ణునుత్సాహమునకు విఘ్నకరము లగువాక్యములఁ జెప్పుట.

సూతపుత్రా, సర్వాస్త్రవిదులు సత్యవిక్రములు మహాధనుర్ధరులు మహాబలులు మహాభాగు లనివర్తనశీలు రజయ్యులు నగుపాండవుల నేల యవమానించెదవు ? వారు సునాసీరునకై నను బోరవెఱపు పుట్టింపఁ జాలుదురు. పిడుగుపాటున కెనవచ్చుగాండివగుణక్వణనంబు చెవి సోఁకుటయు భీముఁడు కరిఘటలం గూల్చుటయు ధర్మజమాద్రేయులు శరపరంపరలు పరఁగించి మొయిళులు గప్పినచొప్పున నుప్పరవీథిం గప్పుటయుం జూచిన నిట్టు లనవు. వారలనే కాదు శీఘ్రాస్త్రప్రయోగసంధాననై పుణంబులఁ బొగడ్తకెక్కినరాజుల నేరిని నిట్టులు తిరస్కరింపరా దనవుడుఁ గర్ణుఁ డాపలుకులు వినియు విననియట్లు భావించి పదపద పొమ్ముపొ మ్మనుచున్నంత రాధేయునిరణోత్సాహంబుఁ జూచి కౌరవులు పరమామోదభరితచిత్తులై సింహనాదము లొనర్చిరి. శంఖభేరీప్రముఖవాద్రితనిస్వనం బెసంగె. అట్లు రాధేయుఁడు రణరభసుఁడై తఱలునెడ భూకంపమును నిర్నిమిత్తకఠోరారవంబును సప్తగ్రహంబులు సూర్యమండలముఁ బాసి వెడలు తెఱఁగునఁ జూపట్టుటయుఁ గొఱవులు పడుటయు దిగ్దాహంబును నశనిపాతంబును దారుణపవనప్రచారంబును మృగపక్షిగణములు సేనల కపసవ్యముగఁ దిరుగుటయు గుఱ్ఱములు ద్రాలుటయు నస్థివర్షంబును శస్త్రములు మండుటయు ధ్వజములు వడఁకాడుటయు వాహనములు కన్నీరు విడుచుటయు మున్నగునుత్పాతములు కౌరవులవినాశము సూచించుచుఁ దోఁచినం జూచియు మనవారు దైవమోహితులు గావున వాని సరకుగొనక జయజయశబ్దంబులు వలుకుచుఁ బాండవుల నిర్జితులఁ గాఁ దలఁచి కయ్యమునకుఁ గాలు ద్రవ్వుచుండఁ గర్ణుఁడు జ్వలితజ్వలనుమాడ్కి నుదితార్కునికై వడినిం జూడ నొప్పుచు భీష్మద్రోణులపరాక్రమాతిశయంబుఁ దలఁచి పార్థునిబీరంపుఁబెంపుఁ దలపోసి మానదర్పములు మనముఁ ద్రిప్పికొలు

పఁగఁ గ్రోధదీపితుండై పెద్దయు నిశ్శ్వసించుచు శల్యునిఁ గౌరవులనుం జూచుచు నిట్లనియె. రథస్థుఁడనై యాయుధముఁ జేతఁ బూని యుండుదునేని నేను వజ్రపాణి యగుమహేంద్రునకును వెఱవను. భీష్మప్రముఖులపాటు చూచినంతన యస్థిరత్వంబు వదలె. ఇంద్రోపేంద్రవిక్రములు పరప్రమాథు లవధ్యకల్పులు నగుభీష్మద్రోణులు పడిరనుటం జేసియు నాకు వెఱపు గలుగదు. మహాస్త్రవిదుఁడైన యగ్గురుఁడు తమపక్షంపురాజులు పెక్కండ్రు హతులైనం జూచియు నేకతంబున నరాతుల మూలధ్వంసంబు గావింపఁడయ్యెనో యెఱుంగరాదు. శిక్షయుఁ బ్రసాదమును ధైర్యమును బలమును మహాస్త్రసంపత్తియు సన్నతియుం గలిగి యేకవీరుఁ డన విఖ్యాతిఁ గాంచినద్రోణుం దలఁచికొని చెప్పెద. ఇఁక నేను దక్కనింకొక్కరుఁడు గాండీవిని మార్కొని చక్క నిల్చి పోరువాఁడు గన్పట్టఁడు. విద్యాబలమున నెంత చింతించినను గర్మదైవయోగములకంటె నొండొక్కటి ధ్రువముగా దని నిశ్చయింపక తీఱదు. గురుఁడు పడినపుడే యింక నెవ్వరు పాండవులతోడిభండనమునకు నడుతు రని సంశయింపఁ దగినయవస్థ వాటిల్లె. అస్త్రములును బలమునుఁ బరాక్రమంబునుఁ గార్యనీతియుఁ బరమాయుధంబులును మనుజునకు సుఖముఁ గావింపఁజాల వనునర్థము సూర్యాగ్నితేజుఁ డింద్రోపేంద్రవిక్రముఁడు గురుశుక్రనయుఁడు నగునబ్భారద్వాజుండు పడినపదంపడియు నిశ్చయింపకుండుట యవివేకంబు గాకుండునే. బాలురు నాఁడువాండ్రును విలపించుచుండ ధార్తరాష్ట్రునిపౌరుషము పరాభూతమైయుండఁగ నిట్టితఱి నాకుఁ గర్తవ్యం బెయ్యదియుం లేని మద్రనాథా, శాత్రవుల నుక్కడంచుటకంటె నొం డెయ్యదియుం గాదు. కావునఁ బాండవులు వాసుదేవసాత్యకిధృష్టద్యుమ్నాదిసమన్వితులై పాంచాలాదిసేనలతో మోహరించి యున్నచక్కటికి మన తేరు నడుపుము. ఓపుదునేని వారలం గెలిచి దుర్యోధనునకు రాజ్య మిచ్చెద, అంతకుఁ జాలనేని వారిచేఁ దెగి ద్రోణపథంబు పట్టెద. ఎట్టులైన మేల యగు. ఇంతియ కాని శూరమధ్యమున ననికి నడువక వెఱపు గదుర నొదిఁగియుండు టనుమాట నాయెడం బుట్టదు. మిత్రద్రోహంబు నే నోర్వను. ప్రాజ్ఞునకును మూఢునకును మృత్యువు సన్నిహితంబైనయప్పు డొక్కరూపకాఁ జావక తీఱదు. విధివిధాన మేరికి ననుల్లంఘ్యము. దుర్యోధనుఁడు నాకు నెచ్చెలియై యెన్నియేఁదెఱంగుల మన్ననలు గావించి మనిచె. అందులకుఁ బ్రీతిగా నతనికార్యము నెఱవేఱునిమిత్తమునఁ బ్రియతమములగుప్రాణములను భోగములనుం ద్యజింపఁ గడంగితి. వ్యాఘ్రచర్మంపుఁగప్పును నఱపులేనియిరుసును బసిండిత్రికోశమును వెండిత్రివేణుకంబును గలిగి యుత్తమతురంగయోజితం బగునీరథమును సమున్నతకేతనంబులను విచిత్రకార్ముకంబులను నుద్దండగదాదండములను నుగ్రరూపము లయినసాయకంబులను దివ్యఖడ్గ

మును మహాస్వనం బైనయుత్తమశంఖమును భార్గవరాముఁడు కరుణించి నాకొ
సంగె. ఇట్టిసాధనములు కలిమిం జేసి మృత్యువు తాన వచ్చి ప్రోచినను నర్జునుని
వధియించెద. అంతకుఁ జాలనేని భీష్మద్రోణులతెరువు పట్టెద. పెక్కులేల? ఇం
ద్రయమవరుణకుబేరులు నిజాయుధములతో నిజపార్షదులతో నేతెంచినను బాం
డవమధ్యముని వారలను జయింతునని పలుకుటయు రణరభసవికత్థనోదగ్రుఁ
డై నయక్కర్ణునిపలుకులు విని శల్యుఁడు కలకల నవ్వి తద్వచనంబుల నిరాకరించు
వాఁడై యిట్లనియె.

శల్యుఁడు కర్ణుని దూఱుచు నర్జునుం బొగడుట.

కర్ణా, యిఁకఁ జాలుఁజాలు. అతిరభసమునఁ బెక్కులు ప్రేలితివి. నరవరుఁ
డైనధనంజయుఁ డెక్కడ? పురుషాధముఁ డైననీ వెక్కడ? అమరరాజరక్షితం
బైనత్రిదివముమాడ్కి నుపేంద్రపాలితం బైనయదుపురమును సుభద్రాహరణా
ర్థము గెలువను మృగవధకలహనిమిత్తమున నీశ్వరేశ్వరుం గయ్యమున మార్కొని
పోరను మహేంద్రవిక్రముఁ డైనయగ్గాండీవి దక్క నెండొక్కఁడు నేర్చునే? అతం
డద్దపడినయింద్రాదులం గెలిచి ఖాండవ మగ్ని దేవున కర్పించె. ఘోషయాత్రకు
దుర్యోధనాదు లరిగి చిత్రసేనాదులకుఁ జిక్కినపుడు వారలం గెలిచి వీరలం దప్పిం
చె. అప్పుడు నీవకదా యందఱికంటె ముందు పఱచినవాఁడవు. మఱచితేని తలం
పునకుఁ దెచ్చికొమ్ము. విరాటుపసులం బట్టఁబోయినపు డతఁ డొక్కరుండే భీష్మద్రో
ణకృపాశ్వత్థామలను నిన్నును నీవారలనుం గెలుచుట యెఱుంగవే? అప్పుడెల్ల
లేనిబీరంబు నేఁ డెక్కడనుండి వచ్చె. ఇప్పుడు వెఱచి పఱచినం జెప్పఁజాలఁగాని
యడిబీరమున మార్కొందువేని చావు తప్ప దని యత్యంతనిష్ఠురంబుగఁ బలికినఁ
గటకటంబడి రాధాసుతుండు శల్యా, యీమాట లిపు డేల? వాఁడు నన్ను గె
ల్చినపు డందువుగాని యూరక తేరు పోనిమ్మనుటయు నతం డట్లు చేసినం గర్ణుం
డు పాండవానీకంబు డాయం జనుచు నుదితాదిత్యుం గ్రేణిసేయుతీవ్రతేజమున
సంప్రదీపితుండై మనవారల నొక్కొకనిం బిల్చుచు నయ్యా, నా కర్జునుం జూపు
వాని కమితధనంబును, వలసినరత్నపూర్ణశకటంబులనుఁ, గోరినకాంస్యదోహనగో
శతంబును, శతగ్రామములను, నంజనప్రభకేశముల నొప్పునశ్వతరులం బూన్చిన
శ్వేతస్యందనమును, నభిలషించినకనకగజములనాఱింటిని, గీతవాద్యవిద్యల నేర్చిన
యుత్తమాభరణభూషితసీమంతినుల నూఱుగురును, నూఱేనుంగులను, నూఱూళ్ల
ను, నూఱుతేరులను, బసిండితొడవులఁ గై సేసిననూఱుమేలిగుఱ్ఱములను, సువర్ణ
శృంగములు సవత్సములు నగునన్నూఱుధేనువులను, మఱియుం బ్రార్థించిన మ
ణికనభూషితంబు లైనయేనూఱుత్తమహయములను, సుదంతము లగుమేలియేనుఁ
గులఁ బదునెనిమిదింటిని, నుత్తమాలంకారభాసురంబును గాంభోజతురంగయో

జితంబు లైనకాంచనస్యందనంబును, వెండియు వేఁడిన స్వర్ణభూషణభూషితంబులు సాధుశిక్షితంబు లపరాంతదేశసముత్పన్నములు నగునాఱునూఱేనుంగులను, నింకనుం గాంక్షించిన జలతృణకాష్ఠధనసమృద్ధము లైనపదునాలుగునైశ్యగ్రామములను, నిర్భయములు సుసంపన్నములు రాజభోజ్యములు నగునుత్తమగ్రామంబులఁ బదునాలుగింటిని, నిష్కకంధర లభినవయౌవనాభిరామలు నగుమాగధదాసుల నూఱుగురను, నింకను వరించిన సకలవరములను, నాకుఁ గలధనములనుఁ, గృష్ణార్జునుల వధించి తదీయద్రవిణంబును నిత్తును. ఇంతేల? కృష్ణార్జును లున్నచోటు చెప్పినవారి కభిమతంబు లొసంగెద నని పలుతెఱంగులం బలుకుచు సుస్వరం బైనయుత్తమశంఖముఁ బూరించినం గర్ణునివచనములకు దుర్యోధనుఁడు పరమానందసాంద్రుం డయ్యె. అట్టియెడ శంఖభేరీమృదంగాదివాద్యములమ్రోఁతయు వీరయోధులసింహనాదంబునుఁ గుంజరబృంహితంబును నెసంగె. అట్లు లుభయసైన్యములు సంగరోత్సాహబంధురంబులై యుండునెడఁ గర్ణునివికత్థనంబులఁ బరిహసించుచు శల్యుం డిట్లనియె. సూతపుత్రా, వీరికి వారికిఁ బెక్కుధనము లొసంగ నేల? ఇం కొక్కింతసేపున కర్జునుం జూతువు. బాల్యదోషమునఁ గుబేరునియట్టు లపరిమితార్థము లొసంగుదు నని యంతయత్నంబు వలదు. అప్రయత్నంబుననే ధనంజయుం గాంచఁగలవు. అపాత్రదానమున కేల పూనెదవు? మోహమున నందలిదోషము తెలియంగ వైతివి. నీవు వీరికి వారికి నియ్యఁ దలఁచినవిత్తంబున ననేకాధ్వరంబులు చేసిన నెంతయేఁ బుణ్యము లభించు. మోహమునం గృష్ణార్జునులఁ బరిమార్పఁ గోరెద వది తుది నిరర్థకంబ యగుంగాని కొనసాగనేరదు. ఎన్నఁడైన నెచ్చటనైనను నక్క సింహముల వధించె నని వింటిమే? కోరరానిదానిం గోరెదవు. హానివృద్ధు లెఱుంగక యగ్నిలోనం బడుచున్ననిన్ను వారింపఁ దగినసుహృదు లెవ్వరును నీకు లేరైరి. కార్యాకార్యము లెఱుంగవైతివి. నిక్కంబు నీకుఁ గాలము దీఱెఁ గాఁబోలు. జీవితేచ్ఛ గలవాఁ డెవ్వఁడేనియు నీయట్టులు చెవులఁ బెట్టరానిబహ్వాబద్ధములు వల్కునే? కుత్తుకం బెనుగుండు కట్టుకొని సముద్రము నీఁదఁ బూనుటయు గిరిశిఖరమునుండి పడుటయు నెట్టుల లట్టులు నీచికీర్షితము శ్రేయోవిఘాతకంబు. ఒంటిమై గాండీవిని మార్కొనుట మాని యందఱితోడ్పాటునం బేర్చి యావీరవర్యుం దలపడుము. ధార్తరాష్ట్రునిహితముఁ గోరి యిట్టులు పలికెదఁగాని నీపయిం గోపమునం గాదు. జీవింప నాశ గలదేని నామాట నమ్ము మనుటయుఁ గర్ణుఁ డిట్లనియె. ఏను నిజబాహువీర్యమునం జేసి యర్జునుతోడఁబోరి కుత్సహించెద. నీవు నిక్కంబ మిత్రునిరీతి నగపడుశత్రుఁడవై నన్ను వెఱపింపఁ జూతువు. ఇది కొనసాగునది కాదు. ఈయభిప్రాయము నాకు మఱలింపఁగ వజ్రధరుం డైనయాఖండలుండును నోపఁడు. ఇఁక మనుష్యమా

త్రుం జెప్పనేల యనుటయు శల్యుం డతనికిం గోపంబుం దీపింపఁజేయువాఁడై మఱి యు నిట్లనియె. కర్ణా, యిప్పు డిట్టులు పలుకుదువుగాని యర్జునునిగాండీవము క్తంబు లైనతీవ్రనారాచములు మనమూఁకల నీఱుసేసి నీమేను వ్రచ్చునపు డిట్లు పలుకవు. పదంపడి పశ్చాత్తాపమునఁ గుందుదువు. బాలుఁడు తల్లికుఱు వెక్కి మోహమునఁ జందమామనుఁ బట్టికొనఁగ నుత్సహించుచందమున రథస్థుఁడవై గాండీవినిఁ బోరికిఁ జీరుదువు. అది యెట్లు నీకు సఫలం బగు? వాఁడిమి మెఱయు త్రిశూలంబుపయిం గాత్రంబు వెట్టినవిధంబునఁ జేటు గావింప కుడుగునే? క్షుది మృగము క్రుద్ధసింహమును గయ్యమునకుఁ బిల్చువిధమునను, గుందేలు మత్తమా తంగముఁ దాఁకుచందముననను, బిలమున నున్నకృష్ణసర్పమునుఁ గట్టియచేఁ బొడుచు వడువుననుఁ, బన్నగము గరుడుం దలపడుకై వడినిఁ, జంద్రోదయసమయప్రవృద్ధం బైనమహోదధి నీఁది దాఁటఁ దలంచుచాడ్పునను, దుందుభి కెనవచ్చుమెడయు వాఁడికొమ్ములునుం గలుగువృషభమును గ్రేపు ముట్టుతీరునను, గర్జితభీషణం బైన మహామేఘమును జూచి కప్ప మాఱఱచు తెఱఁగునను, నింటికుక్క క్రోల్పులిం జూచి మొఱఁగుమాడ్కి నీవు సవ్యసాచినిఁ బోరికిఁ జీరఁ దలంతువు. చూడకము న్నింతలు పల్కుట చెల్లెఁగాని సూర్యచంద్రులట్లు తేజరిల్లుకృష్ణార్జునుల నేకరథస్థు లఁ జూచినపిమ్మటను భీషణగాండీవజ్యాఘోషంబు విన్నపదంపడియు నిట్టులు పలు కవు. పలుకుదేని క్రోల్పులినిం గాంచి యఱచునక్కపోతురీతి నగుదువు. నీవు న క్కవు. సవ్యసాచి సింహము. ఆఖుమార్జారములు శునకశార్దూలములు సృగాల సింహములు శశకకుంజరము లనృతసత్యములు విషామృతము లెట్టు లట్టులు నీ వును బార్థుఁడును నాత్మకర్మములంజేసి లోకమునఁ బ్రఖ్యాతిఁ గాంచుట నిక్క వం బని యధిక్షేపించిన నెంతయుం గోపించి కర్ణుఁడు శల్యున కిట్లనియె.

కర్ణుఁడు కోపించి శల్యుని నిందించుట.

శల్యా, గుణవంతులగుణములను గుణవంతుల యెఱుంగుదురుగాని గుణ హీను లెఱుంగనేరరు. నీవు గుణహీనుఁడవుగాన నాగుణముల నెఱుంగవు. నాగు ణములన కాదు కృష్ణార్జునులగుణములను నస్త్రవైభవంబును గోపాటోపంబును వీర్యంబును మఱియుం బెక్కువిశేషములను నీ వే మెఱుంగుదువు. ఏను వారిబల వీర్యములను నాబలపరాక్రమములను లెస్స తెలిసి యతనితోడిపోరికిఁ గడంగితి. పెద్దకాలంబుగోలె నత్యంతనియమమునఁ బూజితం బైనసర్పముఖశరంబు పరమ తీవ్రం బైనయది నాదొనలో నున్నయది. అది మేరుగిరినైనం బగిలింపఁ జాలిన యది. కృష్ణార్జునులలో నెక్కనిపయిం దక్క లాఁతులపై దాని నేయను. ఇంత యు సత్యంబు. అదికలుగుటంజేసి యేను వారల మార్కొనియెద. నా కది య నురూపంబు. యాదవపాండవులలక్ష్మీవిజయములు కృష్ణార్జునులపై సుప్రతిష్ఠితం

బులై యున్నవి. ప్రాటఁ గూర్చినయుత్తమమణులయట్టు లేకరథారూఢు లైన యామేనత్తమేనమామకొడుకుల నేను మార్కొనియెద. ఆవాసుదేవధనంజయుల చక్రగాండీవములును గరుడకపికేతనంబులును బిఱికిపోతులకు భీకరములుగాని నాకుఁ బ్రీతికరంబులు. నీవు భయగ్రస్తుండవుగావున శౌర్యము దూలి యిట్టులు ప్రేలెదవు. వేఱునిమిత్తంబు గలదే? కుదేశజనితా, తొలుత నేను వాసుదేవార్జునుల వధించి పదంపడి నిన్నుం బొరివుచ్చెద. ఓరిదుర్బుద్ధీ, క్షుద్రా, క్షత్రియకులపాంసనా, సుహృదుఁడవయ్యు శత్రుఁడవైన న్నేల యిట్లు వెఱపింపఁ జూచెదవు. వారల నేను వధించుటయొండె వారు నన్ను వధించుటయొండెఁ గలుగు నిందులకు నేను వెఱవను. వేవురు వాసుదేవులు పదివేవురు ధనంజయులైన నాకేమి. నాబలము నే నెఱుంగుదు. నే నెక్కండనే యందఱను దెగఁజూచెద. స్త్రీలును బాలురును వృద్ధులును గ్రీడాగతులగుజనులును జదివినచదువులట్లు విస్పష్టముగా మీదేశము గుఱించి కొన్నిగాథలఁ బల్కుదురు. అవి రాజసన్నిధిం జెప్పఁగ వింటిని. వానిం జెప్పెద విని సైరింపుము. తగినయుత్తరము సెప్పనేర్తువేని చెప్పుము. మద్రదేశజనితుఁడు మిత్రునికిం గీడు రోయు. రిత్త కలహించు. క్షుద్రవాక్యుఁ డగుమద్రకునితోడి సంగతి తగదు. మఱియు మద్రకులు దురాత్ము లనృతవచనులు కుటిలభాషితులు చచ్చుదాఁకఁ జెడునడవడిం బ్రవర్తింతురు. తండ్రి కొడుకు తల్లి యత్త మామ నేనమామ యల్లుఁడు కూఁతురు భ్రాత మనుమఁ డన్యబాంధవులు మిత్రు లభ్యాగతులు దాసులు దాసిక లని విచారింపక యిచ్ఛమెయిం గూఢముగనుఁ బ్రకాశముగను స్త్రీపురుషులు రమించుట మద్రదేశమున సహజంబు. మత్స్యాశనాసక్తు లయినయయ్యశిష్టులు గోమాంసముఁ దిని కల్లు ద్రావి యాడుచుఁ బాడుచుండుదురు. కామప్రవర్తను లగుమద్రకులకు ధర్మ మనునది శూన్యంబు. అట్టిపాపాచారులతోడఁ బగయుఁ జెలిమియుం జేయరాదు. మద్రకు లెప్పుడును మలినులు. మద్రకులయందు సాంకర్యంబును గాంధారకులయందు శౌచంబును నియతములు. రాజయాజకయాజ్యంబున నిచ్చినహవిస్సు నష్ట మగువిధంబునను శూద్రసంస్కారం బొనర్చువిప్రుఁడు పరాభవము నొందుచందమునను బ్రహ్మద్వేషులు సెడుకైవడిని మద్రకులతోడ సాంగత్యము చేయువాఁడు పతితుం డగు. వృశ్చికదష్టుఁడై విషవేగహతుఁడైనవానికి సముచితభేషజమునను నాథర్వణమంత్రమునను శాంతినిఁ గావించుచాడ్పున మద్రకున కెల్లపుడునుం బ్రతివిధానం బొనర్పవలయు నని విప్రులవలన వినంబడు. అట్టిదుర్గుణంబు లన్నియు నీయెడ సుస్థిరంబులై నెలకొనియున్నవి. మఱియు నొక్కటి వినుము. మీదేశమునందు స్త్రీలు కల్లు ద్రావి యొడలుమఱచి సురతపరవశలై వస్త్రముల విడిచి యాడుదురు. మఱియు నిల్చుండి యొంటెలరీతి మూత్రపురీషవిసర్జనంబుఁ గావింతురు.

మద్రవనితలు సువీరకాసక్తలై నితంబస్పర్శనోపభోగనిరతలై పతిపుత్రపరిత్యా
గంబునకేనియు నియ్యకొందుముగాని ప్రియసువీరకపరిత్యాగంబుఁ జేయ నోప
మనిపలుకుదురు. అట్లు మద్యపాననిరతలు నష్టశౌచలు శిష్టస్మాత్రలు నిర్లజ్జలు
నగువారికిఁ బుట్టిననీ వేమిధర్మము నెఱుంగుదువు. ఇంకనుం బెక్కుదుర్గుణములకు
నివాసం బైనమద్రదేశమున జనించినవారలఁ గాలిగోరుమొదలుగాఁ దలవెండ్రు
కతుదిదనుక దూఱవలయు. ఆదుర్గుణముల నన్నిటినిం జెప్పఁగ నేనకా దెవ్వరును
వలంతులు గారు. మద్రకులు సింధుసౌవీరులు పాపదేశోద్భవు లైనమ్లేచ్ఛులును
ధర్మము నెఱుంగ రని లోకవిశ్రుతంబు. సమరమున నాయుధముచేఁ బొలియుట
క్షత్రియులకు ముఖ్యధర్మం బని నీ వెఱుంగవు. నాయట్టివీరున కంతకంటె ధర్మ
మొండు గలదే? మఱియు ధీమంతుఁ డగుదుర్యోధనునకుఁ గూర్చుచెలికాఁ డగు
నాకుఁ దదర్థంబు ప్రాణములను సకలధనములనుం ద్యజించుట కార్యంబు. నీవు
పాపదేశమునం జనించినపాపాత్ముఁడవు గావునఁ బాండవులకు లోఁగి వారికి మేలు
గావింపఁ బూని శత్రుండవై నాకుఁ జేటు చేయఁ బూనితివి. నాస్తికులు ధర్మజ్ఞుం
బోలె నీయట్టివారు నూఱుగురైనను నన్ను సమరమున విముఖుం జేయఁ జాలరు.
వేసవిం బడలినజింకవలె నీవు నోరెండునట్లు విలపించినం బ్రయోజనంబు లేదు.
క్షత్రవృత్తవ్యవస్థితుం డైననన్ను వెఱపింప నీ కలవిగాదు. ఆహవమున వెనుదీ
యక మగఁటిమిం బేర్చి పోరి మేను దొఱంగువారి కేపుణ్యముం గలుగు నని తొల్లి
భార్గవరాముఁడు బోధించె నద్దానిం దలంపునకుఁ దెచ్చికొనియెద. మిత్రత్రా
ణార్థంబును శత్రువధార్థంబును గడంగి రాజర్షి యగుపురూరవసునిమతమున
వలంబించినన న్నీయభిప్రాయమునుండి త్రిప్పఁగ నీముల్లోకములం దేవును నేర
రని నామతంబు. ఇంత యెఱింగి మిన్నకుండుము. వెఱపునం బెక్కులు ప్రేలనేల?
మిత్రప్రతీక్షణంబును ధృతరాష్ట్రమతచింతనంబును నపవాదశాంతియు ననుమూ
డుకారణములం జేసి నిన్నుఁ గ్రవ్యాదగణములకు బలిసేయ కున్నవాఁడ. పలుకు
దేని వజ్రతుల్యం బయినయుద్దండగదాదండమునఁ దల వగుల వ్రేయుదు. కృష్ణా
ర్జునులు కర్ణుం జంపుటయుఁ గర్ణుఁడు వారలం జంపుటయు నిచట నందఱు విందురు
మఱి కందురని పలికి యిఁకఁ బెక్కు లేల తడవు సేయం జనదు పొదపొద పొ
మ్మిపొ మ్మనుటయు యుద్ధసంప్రమోదబంధురుం డైనయారాధేయువచనంబు విని
శల్యుఁడు నిదర్శనంబుఁ జూపువాఁడై మఱియు నిట్లనియె.

శల్యుఁడు కర్ణునకు హంసకాకీయోపాఖ్యానంబుఁ జెప్పుట.

కులపాంసనా, నిరంతరయజ్ఞపరులు సమరమున వెనుదీయని మేటిశూరులు
మూర్ధాభిషిక్తులు నగుమహారాజులకులమునం బుట్టి వివిధధర్మపరాయణుం డై
నన న్నేల యిట్టు లుచితానుచితముల నెఱుంగక పలికితివి. కల్లు ద్రావి యొడలు

మఱచితివి కాఁబోలు. ప్రమాదపరవశుండ వైననీకు సుహృద్భావమున నుచితప్ర
తివిధానంబుఁ జేసెద. నాయందుఁ ద ప్పొకింత యేనియుం గానంబడదు. నిరపరా
ధుఁ డగునాతల యేల పగుల నడిచెదవు? ఎఱుకగలవారు హితాహితముల నవ
శ్యము బోధింతురు. విశేషించి సారథి రథికుఁ డగురాజునకు హితంబుఁ గోరునేని
సమవిషమప్రకారంబులను రథికులబలాబలములను నలజడిని గుజ్జుములబడలికను
నాయుధపరిజ్ఞానమును మృగపక్షులరుతములను భారాతిభారములను శల్యప్రతీ
కారమును శస్త్రాస్త్రప్రయోగమును నిమిత్తములను లెస్స యరసి తఱితో నెఱింగిం
చు. అందుల కలిగినం దీఱునే? ఇందుల కొక్క యితిహాసంబుఁ జెప్పెద నాకర్ణింపు
ము. సముద్రమధ్యమున నొక్కద్వీపమునఁ బ్రభూతధనధాన్యసంపన్నుఁడు యో
గశీలుఁడు దాననిరతుఁడు శాంతుఁడు స్వకర్మాచరణపరాయణుఁడు శౌచనియతుఁడు
బహుపుత్రుఁడు ప్రియాపత్యుఁడు సర్వభూతదయావిశిష్టుఁడు నగు నొక్క వైశ్యుఁడు
ధర్మప్రధానుఁ డైనయొక్క రాజు పరిపాలించుటం జేసి నిర్భయం బైనయొక్క రాష్ట్ర
మున వసించుచుండె. అతనికొడుకులు బాలురై యుండ నొక్క కాకి యక్కడఁ జేరి
యాబాలురు లీలార్థం బెంగిళు లైనమాంసాన్నదధిక్షీరపాయసమధుఘృతములం
బెట్టిన నయ్యుచ్ఛిష్టమునం బెరిఁగి బలిసి పొగరెక్కి యేపులుఁగులును దనకుఁ బురు
డుగావని తలంచియుండ నొక్కనాఁ డక్కడికడలిగట్టునకు మానససరోనివాసంబు
లైనరాయంచలు వచ్చుటయు నాకోమటిచిఱుతవాండ్రా కాకిం బిలిచి నీ వన్ని
పక్షులకు మేటివిగదా యనుటయు నయ్యల్పబుద్ధులపలుకులకు మోసపోయి య
క్కాకంబు మూర్ఖత్వమదంబుల నళ్లె తనకొలంది యెఱుంగక నమ్మి యుప్పరంబున
కెగసి యాయంచలపిండులో దూరపతనమున నుత్కృష్టం బయినయొక్క రాజ
మరాళంబునుఁ దనతోడ నెగయుటకును బాఱుటకును సవతుగా రమ్మని పిలిచిన
నాయంచలు నవ్వి దానిం జూచి మేము మానససరోవరంబు నెలవుగాఁ గొనురా
జహంసలము. దూరపాతమునఁ బక్షులన్నియు మమ్ముఁ గొనియాడుట నీవు నెఱుం
గుదువు. నీవు కాకంబవయ్యు జాతిని శక్తికొలఁదిని నెఱుంగక యోదుర్మతీ, మాలో
నుత్తమం బగురాజమరాళంబును బిల్చితి వెట్టు లెగయుదువో యని యడుగు
టయుఁ గాకి యారాయంచలవాక్యముఁ గుత్సించుచు జాతిలాఘవమునం జేసి తన్నుఁ
బలుమాఱు పొగడికొనుచు నిట్లనియె. ఏను నూటొక్కగతులు గలిగి యొక్కొ
క్కగమనంబున యోజనశతంబు పోవఁ జాలినదానను. పొడవుగా మీఁది కెగ
యుట, యెగసి నిలుచుట, నిలిచి పఱచుట, చక్క నేలకు జోడుపట్టి దిగుట, వలసి
నంత దవ్వు చనుట, వడి నడరుట, వక్రముగాఁ దిరుగుట, వలయముగాఁ దిరుగుట,
తెక్కలు గదలింపక మెల్లన చనుట, తోఁచినచోట్ల వ్రాలుచు లేచుట, యడ్డము
గఁ దిరుగుట, యెగయునట్లు తోఁప వ్రాలుట, మున్నగువివిధప్రకారముల మీఱుఁ

జూపుదు. పదంపడి నాబలంబు మీ రెఱుంగుదురు. మీలో దేనితోడనైనం జోడుగట్టి యెగసి చన నాయితమై యున్నదానను. మదీయగతిప్రకారము లెఱింగి మీరు నాతోడఁ బందెము గట్టవల దనుటయు నొక్కరాజమరాళంబు నవ్వి దాని కిట్లనియె. నీవు నూటొక్కగతుల నెఱింగినట్లు పల్కెదవు. అవి యెవ్వియో మే మెఱుంగము. లోకమున నన్నివిహంగము లేగమనం బెఱుంగు నద్దానిన మేము నెఱుఁగుదుము. దానన యేను వచ్చెద. నీవు నీశతగమనంబులనుం జూపు మను చున్నంతఁ దక్కినయంచలు నవ్వుచు నక్కటా! గతిశతంబుఁ దెలిసినకాకితోడ నేకగ మనముఁ దెలిసిన యంచ స్పర్ధ పెట్టికొనియె నింక నెట్లని మేలము లాడుచున్న యెడ నారాజహంసమును గాకంబును బరస్పరస్పర్ధ పెంపెసంగ నింగికి నెగసి చనుచు న్నంత జాతిలాఘవనిమిత్తమున నత్యంతగర్విత మయినయావాయసంబు వివిధచి త్రగతులం జూపుటయు గట్టున నున్నకాకులు హంస యోడె నని మనంబులం దలపోసి మాఁకులకొమ్మలపై దూఁకియు నెగరియు ఱెక్కల విదిర్చియుఁ గాకా యని పెలుచ నఱచియుఁ దమదానియుత్కర్షమునకు సమ్మోదమ్ముఁ జెందుచుండె. స్వభావగంభీర మగుటం జేసి రాజమరాళ మొకప్పు డెక్కువ మఱియొకప్పుడు త క్కువయుం గాక యొక్కతీరున మృదుగమనమునం జనుచుండఁ గాకి రయమునం జనుచు హంస యోడె నని హేళనముసేయుటయు నమ్మరాళంబు పశ్చిమాభిము ఖంబై సాగరంబుమీఁద మింటి కెగసి రయమునం జనియె. చనుటయు వాయ సంబును దోడం జనుచుఁ బరమరయమునం బోవు నయ్యంచ నెద్దుకొన నేరకయుఁ బెద్దయు డయ్యుటం జేసి వ్రాలి దప్పి తీర్చికొనఁగ దీవులను మాఁకులనుం గానక బహుళజలజంతుసంతానసంభృతంబు నత్యంతగంభీరంబు నగుసాగరంబుఁ జూ చుచు వెఱపు గదురుటం జేసియుఁ జేయునదిలేక బమ్మరించి యక్కటా! యెక్కడ వ్రాలుదు నెట్లు దప్పి తీర్చికొందు నేది దిక్కు గతి యెయ్యది యని విచారించుచు దీనదశకు వచ్చినం జూచి రాజమరాళంబు తా నతిక్రమించి పోయినం దానికిఁ జేటు వాటిల్లు నని తలంచి కరుణించి దానిమదము లెస్స యడంచుట మేలని యూహించి పెద్దయు నెడఁబాయక చేరువ నరుగుచుండె. అట్లరుగుచుండి యా రాజమరాళము సాధుభావమునం జేసి దీనదశకు వచ్చినకాకము నుద్ధరింపఁ దలఁచి యోవాయసమా, సారెకు ఱెక్కలు ముక్కునుం దడుపుచు నేల యరిగెదు? నీనే ర్చినగతులలో నిది యెయ్యది యెఱింగింపఁ దగునేని తెలియం జెప్పు మని నవ్వి రారమ్ము రక్షించెద ననుటయు నాధ్వాంక్షము పెద్దయు డయ్యుటం జేసి యెగరి పఱవనేరక సారెకు ఱెక్కలు ముక్కునుం దడియఁ గడలిపయిం బడి యెట్టకేలకు లేచుచు నత్యంతదీనంబై యోరాజహంసమా, మేము కాకాయని యఱచి పఱచు కాకులము. నాప్రాణములు భవదధీనములు. కరుణించి గట్టుఁ జేర్పవేయని

ప్రార్థించుచుఁ గడు బడలుటం జేసి యొక్కయడుగైనను బఱవనోపక పక్షములు తుండమును జలముఁ దాఁకఁగ సాగరంబుపయిం గ్రమ్మఱఁబడుటయు నట్లు దురవస్థా ప్రాప్తం బైనయవ్వాయసంబునకు రాజహంస యిట్లనియె. కాకమా, యేను నూటొక్కగతులు గలదాన నని పలికినప్రశంసావచనంబులఁ దలంపునకుఁ దెచ్చికొమ్ము. నాకంటెఁ బెక్కుమడుంగు లెక్కువ యగునీ వెట్లు బడలి కడలిలోనం బడితి వనిన నది చెప్పరానిదీనదశం బ్రాపించుటం జేసి ప్రాణరక్షణపరాయణం బైమద ముడిగి మీఁద నున్నరాజహంసముఁ జూచి తత్ప్రసాదంబు వడయఁ గోరి యోరాజహంసమా, యెంగిళ్లు గుడిచి యడిచిపడి గరుడునకుఁ బురుడు వత్తు నని తలంచి నాకొలంది యెఱుంగక నాతోడికాకులను లాఁతిపులుఁగులనుం దిరస్కరించితి. ఇఁక నాప్రాణములు నీయధీనములు. కరుణార్ద్రచిత్తమున నన్ను గట్టుఁ జేర్చి పుణ్యమునం బొమ్ము. కీడు వెరయక యేను నిజదేశంబుఁ జేరుదునేని యిఁక నెన్నఁడు నేరి నవమానింపను. ఆపదం బాపి కాపాడు మని విలాపబహుళంబుగా దైన్యంబు గదురఁ బ్రార్థించి కాకాయని యఱచుచుండ నుత్తమజాతిసహజకరుణాభరితం బైనయారాజమరాళంబు రయమునఁ గాళ్లనక్కాకంబు బిగియం బట్టి మెల్లన వీఁపెక్కించుకొని మఱలి పరమజవమునం జని తొలుతఁ దాము పందెము చఱచి తఱలినచోటి కరిగి యవ్వాయసంబును డించి యూఱడించి నిజదేశంబునకుఁ జనియె.

ఆకోమటులయింట నెంగిళులం గుడిచి పొగరెక్కినయక్కాకంబుకరణి నీవు దుర్యోధనునగర నుచ్ఛిష్టమునం బెరిఁగి యుత్తమమధ్యమాధమవిభాగంబుఁ గానక యెల్లవారల నవమానించెదవు. అట్లుకాక జగజెట్టి వగు దేని విరాటుపసులం బట్టి నప్పు డప్పాండవమధ్యముండు తనవిలువిద్యపెం పేర్పడం జూపునెడ భీష్మద్రోణద్రౌణిశారద్వతులును దక్కినకౌరవులు పెక్కండ్రును బెనుప్రాపై యుండ సురక్షితుండ వై యేల యాసవ్యసాచిం దెగఁజూడ వైతివి? అప్పుడు నీయనుఁగుఁదమ్ముఁ డమ్మేటిమగనిచేఁ జచ్చిన నావిపాదంబున నైనం గోపంబుఁ దెచ్చికొనక సింహమును జూచిననక్కపోతురీతిం బఱచితివిగదా. అట్లే ద్వైతవనమునం గంధర్వులు ఘోషయాత్రపోయినదుర్యోధనాదులం బట్టినప్పుడు నీవకదా యందఱికంటె ముందు పఱచినవాఁడవు. పార్థునకు నీకును సామ్యం బెట్టు లగు? మఱియు రాజమధ్యమునఁ బరశురాముఁడు మున్నగుమహామునులును సర్వజ్ఞు లయినభీష్మద్రోణులును గృష్ణార్జును లజేయు లవధ్యు లని వివరించుట వినవే? సర్వభూతములకంటె బ్రాహ్మణుఁ డెట్టు లట్టుల నీకంటె సవ్యసాచి యధికుఁడు. ఆవాయసంబు మరాళము నాశ్రయించినవిధమున నీవు వాసుదేవార్జునుల నాశ్రయించి బ్రదుకుము. మహానుభావు లైనవాసుదేవధనంజయులఁ జూచునందాఁక నే యిట్లు పలుకుదువుగాని పదంపడి

పలుక నీకు నోరు గలుగునే? పార్థుఁడు శరపరంపరలు పరఁగించి నీమదం బడఁగిం చినపుడు నీకు నమ్మేటివిలుకానికిం గలయంతరంబు నెఱుంగుదువు. దేవదానవమ నుష్యాదులలో నెంతయుఁ బ్రఖ్యాతిఁ గాంచినశౌరికిరీటులం గేవలమూర్ఖత్వమున నవమానింపవలదు. సూర్యచంద్రులట్లు విమలతేజోమహితు లైనవారియెదుర నీవు మిడుఁగుఱుఁబురువుచాడ్పునం గన్పట్టుదువు. ఇంతయు నెఱింగి యింక మాఱు పలుకక యూరకుండు మనిన నమ్మద్రరాజు పలికినపరుషవచనములకుఁ గటకటం బడి కర్ణుఁ డిట్లనియె.

కర్ణుఁడు తనకుఁ గలశాపముల శల్యునితోఁ జెప్పుట.

శల్యా, వాసుదేవార్జునులబలవీర్యములు నస్త్రసంపదయు నీవు దెలియవు గాని యేను లెస్స యెఱుంగుదు. ఎఱింగియే యేను వెఱపు మాని వారల మార్కొనఁ గడంగెద. ఐనను జామదగ్న్యశాపమును బ్రాహ్మణశాపమును నామ నస్సునకు సంతాపంబుఁ గలుగఁజేయుచున్నవి. తత్ప్రకారంబుఁ జెప్పెద వినుము. తొల్లి యేను బ్రాహ్మణవేషమునఁ బరశురామునొద్ద కరిగి శుశ్రూషాబలమున నమ్మునిప్రసాదంబు వడసి దివ్యాస్త్రములనెల్ల నేర్చికొనియుండ నొక్కనాఁ డప్ప రశురాముఁడు నాతొడపైఁ దల యుంచి నిద్రించి యుండుతఱి మహేంద్రుఁ డర్జునునకు హితముఁ జేయఁ గోరి నావిద్యకు విఘ్నముఁ గావించువాఁడై తాను వికృతం బైనకీటరూపంబుఁ దాల్చి నాతొడఁ దొల్చుటయు నెత్తురు జాలై స్రవించె. గురునినిద్రకు భంగ మగునన్నుతలంపునంజేసి యేను దాని సైరించి చలింపకుండుటయుఁ గొండొకవడికి గురుండు మేల్కాంచి రక్తధారాపరీతం బైన నాతొడం జూచి యింత సైరించి ధైర్యమున నుండుటం జూడ నీవు బ్రాహ్మణుం డవు గా వెవ్వండ వని యడుగుటయు నసత్యంబునకు వెఱచి యేను సూతకుల జాతుండ నని యున్నరూపు నివేదించుటయు మదీయకపటంబునకుఁ గటకటం బడి యప్పరశురాముఁడు కపటమున నాయొద్ద మెలఁగితివి కావున నీకు దివ్యా స్త్రము లాపత్కాలమునఁ దోఁపకుండుటయు మృత్యువాసన్నం బైనం దోఁచుట యుం గలిగెడుమని శపియించె. బ్రాహ్మణశాపం బెట్లం టేని వినుము. అస్త్ర ములు సాధించి యేను లెస్సయలవాటునకై యరణ్యమున కరిగి పింట నమ్ములు సంధించి యేయుచుండ నొక్కవాఁడితూపు ప్రమాదమున నొక్కబ్రాహ్మణుని హోమధేనువువత్సముఁ దాఁకిన నది తెగుటయు నాబ్రాహ్మణుండు కోపించి మదీయహోమధేనువత్సంబు వధియించితివి గావున నీవు పరమస్పర్ధ మెసంగఁ బోరునపుడు నీరథచక్రంబు నేలఁ గ్రుంగెడుమని శపించె. అందులకు వెఱచి యేను భూసురోత్తమా, నాయజ్ఞానము సైరించి శాపము మరల్పుము. వేయి మొదవులను నాఱునూఱుబలీవర్దంబులను నేడునూఱుమత్తగజంబులను దాసీదా

సశతములను శ్వేతవత్సము లగుకృష్ణధేనువులఁ బదునాలుగువేలను నపరిమితధనమును సమర్పించెద నని ప్రార్థించిన నవ్విప్రుండు నామాట తప్పనేరదు. నే నెన్నఁడు ననృతముఁ బలికినవాఁడను గాను. పలుకుదునేని భ్రూణహత్యాపాపంబునకుఁ బాత్రంబగుదుఁ గావున ధర్మరక్షాపరుండ నైననా కనృతంబుఁ జెప్పరాదు. నాశాపము నీకుఁ బ్రాయశ్చిత్తమై పరలోకబాధకంబు గాకుండు నని పలికె.

ఆశాపములు రెండును నాకు విషాదకరంబులై యున్నవి. ఇప్పుడు సర్వాస్త్రములు దోఁచుచున్నవి. కావున నేను బాండవసైన్యసాగరంబునకు వేలయై నిలిచి క్రూరుఁడు శూరుఁడు రౌద్రుఁడు సత్యప్రతిజ్ఞుఁడు ధనుర్ధరవరిష్ఠుఁడు శత్రుభీకరుఁడు నగు నర్జును నోర్చెద. దెసలెల్ల నిజప్రతాపాతపంబున వెలిఁగించుచున్న యర్జునాదిత్యునకు వారివాహంబై యాచ్ఛాదనంబుఁ గావింతు. ఇంద్రాదులం గెలిచి ఖాండవవన మగ్నికి సమర్పించియు నెక్కటిబవరమునఁ బరమేశ్వరుని మెప్పించియు లోకదుష్కరకృత్యములు పెక్కులు చేసియుఁ బెద్దయుఁ బొగడ్త కెక్కినయక్కిరీటిం దాఁకఁగ నేను దక్క నొం డొక్కఁడు వలంతి యగునే? అతని పౌరుషమునకు మెచ్చి యే నింత పొగడితి. నీవు మూర్ఖుఁడవు మూఢుఁడవుం గావున వెఱచియొండె నాకప్రియంబుఁ దలంచియొండె నాతో నిన్నిపరుషములు పల్కెదవు. నీయట్టివారల నూఱుగురనైనను నే నెక్కప్రేల్మిడిలో నుక్కడంపఁ జాలుదు. అయినం గాలయోగమునం జేసి నీచేయునెగ్గులెల్ల సైరించెద. పాపాత్మా, పాండవప్రియార్థంబు నీవు కుటిలుఁడవై పెక్కులు ప్రేలుచు మిత్రద్రోహమున కొడంబడితివి. మైత్రంబు సాప్తపదీనం బనుట యెఱుంగవైతివి. దుర్యోధనుఁడు పోరికిఁ గడంగె. ఇంక నీతో నిట్టిమాటలు పలుకుచుండుట యుఱవుగాదు. అక్కురుక్షమాధ్యక్షునికాంక్షితంబు నెఱవేర్పఁ గడంగిననాకు నీయట్లు మైత్రి యరయక వృథాకాలయాపనంబు సేయం బోలదు. స్నేహమునను సంతోషమునను ప్రీణనమునను సంత్రాణమునను ప్రక్షేపణమునను మిత్రపదము సార్థకంబు. హింసనమునను శిక్షణమునను నిరసనమునను నవసాదనమునను శత్రుపదం బన్వర్థకంబు. మిత్రశత్రుపదార్థము లిట్టు లని నీ వెఱుంగకున్నను నేను దుర్యోధనార్థమును భవత్ప్రియార్థమును యశోర్థము నాత్మార్థము నీశ్వరార్థమునుం గడంగి వాసుదేవార్జునుల మార్కొనియెద. మదగజము వన్యమత్తశుండాలముం దాఁకుతెఱంగున నేను గాండీవిం దలపడి బ్రాహ్మమానుపాదు లగుదివ్యాస్త్రముల నడరించునెడ నాప్రభావము నీవ చూతువు. వజ్రహస్తుఁడై వాసవుఁడును దండహస్తుఁడై యముఁడును బాశహస్తుఁడై వరుణుఁడును గదాహస్తుఁడై కుబేరుఁడును వచ్చినను నేను గెల్తును. ఇంక నెవ్వరేమేసాధనములు గొనివచ్చినను నేను వెఱచువాఁడఁగాను. పార్థుఁడన్నను జనార్దనుఁడన్నను నా కించుకే

నియు వెఱపు పుట్టదని పలికి శల్యుఁ డెయ్యదియేనియు నుత్తరము సెప్పఁ దొడంగిన వారించి కర్ణుండు మఱియు నిట్లనియె. నీవు నిదర్శనముఁ జెప్పెదు నని పూని నన్నుఁ గాకంబుగను నర్జునుని రాజహంసముగనుం బలికితివి. ఇట్టిమాటల నన్ను వెఱపింప నీకుఁ దరము గాదు. ఇంద్రాదులు వచ్చినను నేను వెఱవ నన్న నింకఁ గృష్ణార్జునులకు వెఱతునే? ఇంక నెవ్వఁడైనను నీమాటలకు వెఱచువాఁడు గలుగునేని వాని వెఱపింపుము. పరుషభాషణము నీచునకు బలము గావున నాగుణము లరయక నీ విట్లు ప్రేలెదవు. కర్ణుఁడు విక్రమార్థంబును యశస్సంపాదనార్థంబును భువిఁ బుట్టినవాఁడ కాని భయార్థంబు పుట్టినవాఁడు గాఁ డని యెఱుంగుము. సఖ్యమైత్రసౌహార్దములు మూఁడు కారణములు లెస్సగఁ గలిమిం జేసియు రాజరాజగు దుర్యోధనునికార్యము నెఱవేర్పఁ బూనుటం జేసియు నీపలుకుప్రియాప్రియంబులు సైరింతు నని తొలుదొల్తన యొడంబడుటం జేసియు నీ బ్రదుకు దక్కె. వేవురుశల్యులు లేకున్నను నేనొక్కండన రాజకార్యము నెఱవేర్పఁ జాలుదు. అయినను మిత్రద్రోహము నీ వెఱుఁగకున్నను నా కరయమి పాడిగా దని యూరకుండినం జెల్లె ననుటయు శల్యుఁడు రాధేయా, యీప్రలాపము లెల్ల నన్నట్టు గాదు, పగతుర ననిలో గెల్చినం గదా యప్పుడు నీబీరమెల్లఁ దేటయగు. వేవురు కర్ణులు లేకుండినను నేను శత్రువులం బరిమార్పఁ జాలుదు ననుటయు రాధేయుండు పరమక్రోధదుర్దాంతుండై యమ్మద్రపతికి వెండియు నిట్లనియె.

## కర్ణుఁడు శల్యుని బహువిధములఁ దూలనాడుట.

మద్రరాజా, ధృతరాష్ట్రమహీపతిసన్నిధానమున నొక్కనాఁడు వివిధదేశాటనలంపటుండైన యొక్కవిప్రుఁడు వచ్చి నానాదేశచరిత్రములం జెప్పుచు బాహ్లీకదేశములం గుఱించి చెప్పినతెఱంగు వినిపించెద వినుము. గంగాయమునాసరస్వతీసింధుకురుక్షేత్రహిమాలయములబహిష్కారమునకుఁ బాత్రంబులై ధర్మబాహ్యము లైనబాహ్లీకదేశములం బరిత్యజింపవలయు. గోవర్ధనం బనువటంబును సుభద్రం బనుస్థానమును నచటఁ గలరాజకులద్వార మనుదానిం బాల్యంబుగో లెఁ దలపోయుదు. అత్యంతగూఢ మగునొక్కకార్యము గలుగ నే నాబాహ్లీకదేశములందు వసించి తదీయసమాచారము లెస్స యెఱుంగుదు. శాకల మనునగరము నాపగ యనునేఱునుం గలుగుజర్తికము లనుబాహ్లీకదేశముల నుండువారివృత్త మత్యంతగర్హితంబు. అచ్చటిస్త్రీలు బొరుగులను బెల్లమునను జేసినసురఁ ద్రావియు గోమాంసమును లశునములతోడఁ దినియు శీలము విడిచి యేకాంతస్థానములు గానిరచ్చపట్టులం జేరి కైపెక్కి యోమగనిఁ గూల్చినదాన, యోస్వామిని వధించినదాన, యని యొండొరులం బిల్చుచుఁ గిలకిలారవంబులఁ

జేయుచుఁ బెలుచ నఱచుచు వస్త్రముల నిరసించి యాడుచుఁ బాడుచు మైథు
నాసక్తిం జేసి యుక్తాయుక్తముల నరయక యిచ్ఛమెయిం దిరుగుదురు. మఱియు
బాహీకదుష్టులలో నెక్కండు కురుజాంగలమునకేతెంచి నాతిహృష్టమానసుండై
సూక్ష్మకంబళధారిణియు గౌరవర్ణయు బృహతియు నగునాబాహీకనితంబిని బాహీ
కుఁడై ననస్నుఁ దలంచుచుఁ బగున్నది కాఁబోలు. శతద్రుకను నిరావతినిం దాఁటి
స్వదేశమున కరిగి స్థూలశంఖమండితలు మనశ్శిలాసముజ్జ్వలాపాంగవిలసితలు గౌ
రవర్ణలు కంబళాజినాచ్ఛాదనలు మృదంగానకశంఖనిస్వనలు ప్రియదర్శనలు నగునా
స్త్రీలతోఁ గూడి సుఖమార్గము లగుశమీపీలువనములందు నపూపములను సక్తుపిం
డములనుం దిని గాడిదలను నొంటెయలను నశ్వతరములను నెక్కి తిరుగుచుఁ దెరువు
లు గాచి పథికులం దన్ని వస్త్రముల నాఁచికొనం జను నని పలుకుచుండె. బాహీ
కు లనఁగ నిట్లు వ్రాత్యులు దురాత్ములు. మఱియుఁ గృష్ణచతుర్దశినాఁ డొక్క
రాక్షసి శాకలపురమున రేయి దుందుభి మ్రోయించి కల్లు ద్రావి గోమాంస
మును గొఱియలను బలాండుఖండములనుం దిని యచ్చటియువిదలతోడ నెల్లపుడు
విహరించు నెంతయు నొప్పు నని పలుకుచుండు. వరాహమాంసమును గుక్కుటామి
షంబును గోపిశితంబును నుష్ట్రిపలలంబును గాడిదయెఱచిని గొఱియలనంజుడునుం
దిననివారిజన్మము నిరర్థకం బని బాహీకులు సురాపానమత్తులై పల్కుదు రని యా
విప్రుఁడు నుడివె. మఱియు నొండొకభూసురునివలన వినినదానిం జెప్పెద వినుము.
శతద్రువు విపాశ యిరావతి చంద్రభాగ వితస్త సింధువు ననునాఱునదులకును
హిమవంతంబునకును బాహ్యంబులై పీలువనబహుళంబులైనబాహీకదేశము
లారట్టము లనంబడు. నష్టధర్మము లగునాదేశములకుఁ బోవరాదు. ఆవ్రాత్యు
లయన్నమును దేవతలు పితరులు బ్రాహ్మణులును గ్రహింపరు. కాష్ఠపాత్రలం
దును మృణ్మయపాత్రలందును గుక్క తాఁకినవానియందును గల్లుతోడ గొఱి
యలపాఁడిని నుష్ట్రిపయస్సును గాడిదపాలును దధ్వికారము లగుపేయభోజ్యము
లను నుంచికొని మెసవునప్పాపాచారులు పుత్రసాంకర్యమునకును వెఱవ రని పలికె.
వెండియు నొక్కవిప్రుఁడు వినిపించినదానిం జెప్పెద నవధరింపుము. జనుఁడు యుగం
ధరంబునఁ బయస్సు ద్రావియు నచ్యుతస్థలమున నుపవసించియు భూతిలయంబున
స్నాన మొనర్చియు నెట్టులు స్వర్గమున కేగు. బాహీకవిశేషము లగునారట్టములం
దు రెన్నాళ్లేనియు వసింపరాదు. విపాశానదియందు బహికబహీకంబు లనురెం
డుపిశాచము లుండె. బాహీకములు వానివలనం గలిగినవిగాని బ్రహ్మసృష్టంబులు
గావు. బాహీకకారస్కరమాహిషకకాలింగకేరళకర్కోటకవీరకదుర్ధర్మదేశముల
ను దీర్ఘయాత్ర సేయునపుడును ద్యజించుట యుఱ వని యింటంట నొక్కొక్క రేయి
శయించుచు ఱోలు మొలకుఁ జుట్టుకొనినరాక్షసి యొక్కర్తు పలికె. బ్రాహ్మణాధమ

లకు నివాసం బగునారట్టదేశములును బాహీకజలమును బ్రజాపతికాలముగోలెను న్నయవి యని యాద్విజుఁడు వచించె. వేదవేద్యయజ్ఞయజనశూన్యులై నయాబ్రా త్యులయన్నము దేవతలు గ్రహింప రని మున్న యెఱింగించితిఁగదా. ప్రస్థలమద్ర గాంధారారట్టఖశవసాతిసింధుసౌవీరము లత్యంతనిందితంబులని యందఱకుం దెల్లం బు. అట్టిమరాచారులసుకృతదుష్కృతముల నాఱవపాలు గ్రహించునీవు ధర్మ మే మెఱుఁగుదువు. శల్యా, మాయింటి కొక్కబ్రాహ్మణుం డతిథియై వచ్చి య స్మదీయాచారంబు మెచ్చి ప్రస్తావవశమునం గొంత చెప్పె. దాని నీకుఁ దె టపఱిచెద నేకాగ్రచిత్తుండవై యాకర్ణింపుము. ఆబ్రాహ్మణుండు నాయిచ్చిన యాతిథ్యముగ్రహించి కూర్చుండి యయ్యా, యేను బెక్కుదినములు హిమా లయశిఖరంబున నొంటిమై నుండి పదంపడి నానాదేశములం దిరుగుచు బా హీకదేశముల కరిగి చూచితి. అచ్చట బ్రాహ్మణుఁడై పుట్టినవాఁడు పిదప క్షత్రి యుఁడై జనించు. వైశ్యశూద్రులు మంగలులై పుట్టుదురు. మఱల బ్రాహ్మ ణుఁడై దాసుఁ డగు. గాంధారమద్రకబాహీకులు వ్యభిచారదోషము గణిం పరు. ఇట్టిధర్మసంకర మచ్చటఁ గలదుగాని తక్కినదేశములం దెక్కడనుం గన్న ట్ట దనియె. మఱియు నొండొక్కభూసురుండు కథాప్రస్తావమున నారట్టదేశద స్యువు లొక్కసాధ్విని నిగ్రహించికొనిపోయి శీలముఁ జెఱుపం బూనుటయు నప్పతివ్రత కినుక గదుర నోపాపాత్ములారా, బంధుమతియుఁ బతివ్రతయు బాల యు నగున న్నిట్టులు నిర్బంధించి ధర్మముఁ జెఱుపం బూనితిరి గావున మీదేశ మునం గులస్త్రీలు వ్యభిచారనిరత లగుదురు. ఈపాపము మిమ్మెప్పుడుం బాయదు. మీకులములందు ద్రవ్యభాగులు భాగినేయు లగుదురుగాని పుత్రులు గానే రరు. ధర్మసాంకర్యము గల్గెడు మనిశపించె. కావున బాహీకారట్టమద్రులు దు రాత్ములు. కురుపాంచాలసాళ్వమత్స్యనైమిశకోసలకాశిపౌండ్రకలింగమగధచేది దేశవాసులు ధర్మనిరతు లనివచించె. ఆబాహీకాదులసుకృతదుష్కృతముల ష ష్ఠాంశముఁ గొనునీకు ధర్మంబు శూన్యంబు. మఱియు వారివలన నీవు గ్రహించిన యంశము దుష్కృతంబకాని సుకృతంబు గలుగునే? ధర్మముఁ దెలిసి లెస్స పా లించి సుకృతముఁ జేయించినంగదా నీ కందునుం బాలు గలుగు. సుకృతమే శూన్యంబైనం దుష్కృతం బొకండే గ్రహించితివి. పితామహుఁడు సర్వదేశ ముల నెఱయుధర్మమున కలరి బాహీకదేశములం గలయధర్మమును దూలనాడె. మఱియుఁ గల్మాషపాదసరస్సున మునుఁగుచుండి యొక్కరాక్షసుండు భిక్షాటనము క్షత్రియునిమలము, వ్రతానాచరణము బ్రాహ్మణునిమలము, బాహీకదేశములు భూమిమలము, మద్రస్త్రీలు స్త్రీలమల మనిచెప్పి మునుఁగుటయు నొక్కరా జా నిశాచరుని లేవ నెత్తి మలముల లెస్స నిరూపింపు మనియడిగిన నతండు మ్లే

చ్ఛులు మనుష్యులమల మాష్ట్రికులు మ్లేచ్ఛులమలము షండు లౌష్ట్రికులమల
ము రాజయాజకులు షండులమలము రాజయాజకయాజ్యులయు మద్రకులయు
మలమెల్ల నీవు విడువమింజేసి నీకుఁ గలిగె నని రక్షోపసృష్టులు విషవీర్యహతు
లు నగువారికి సిద్ధవచనోత్తరం బైనరాక్షసభేషజంబు చెప్పె. పాంచాలురు బ్ర
హ్మనిష్ఠులు. కౌరవులు ధర్మపరులు. మత్స్యులు సత్యనిరతులు. శూరసేనులు య
జ్ఞాసక్తులు. ప్రాచ్యులు దాసులు. దాక్షిణాత్యులు బాహీకులును స్తేనులు. సు
రాష్ట్రులు సంకరులు. కృతఘ్నత్వము పరధనాపహరణము మద్యపానము గురు
దారగమనము వాక్పారుష్యము గోవధము రాత్రు లిల్లు విడిచి సంచరించుట
పరవస్త్రోపభోగము ననునివి ధర్మముగా గ్రహించువారి కధర్మములుం గలుగు
నే? పాంచాలురు మొదలుగాఁ గురునైమిశమత్స్యాదులు ధర్మము నెఱుంగు
దురు. ఉదీచ్యాంగకమాగధాదులు ధర్మోపజీవులు. వైశ్వానరప్రముఖు లైననిర్జ
రులు తూర్పును, యముఁడును బితృదేవతలును దక్షిణంబును, వరుణుఁడు సుర
రక్షకుఁడై పడమరను, బ్రాహ్మణసమన్వితుం డై సోముఁ డుత్తరంబును, రక్షఃపిశా
చగణములు హిమవత్పర్వతంబును, గుహ్యకులు గంధమాదనగిరిని, ధ్రువుఁ డైన
జనార్దనుఁడు సర్వభూతములనుం బాలించుచున్నవారు. మాగధు లింగితమునను
గోసలులు చూడ్కులను గురుపాంచాలు రర్ధోక్తంబులను నెఱుంగుదురు. సాళ్వు
లు సంపూర్ణానుశాసనులు. పార్వతీయులును శిబులును విషములు. శూరయ
వనులు సర్వజ్ఞులు. మ్లేచ్ఛులు స్వసంజ్ఞానియతులు. తక్కినవారు చెప్పనిదానిం
జేయరు. బాహీకమద్రకులు ప్రతిబద్ధులు. ఇంకనీ కుత్తరముఁ జెప్ప నోరు గలు
గునే? ఊరకుండుము. కేశవార్జునులం జంపుటకుముందే నిన్ను వధింపఁ బూన
కుండఁ జూచికొమ్మనిన శల్యుఁ డిట్లనియె.

కర్ణా, దీనపరిత్యాగమును నిజదారసుతవిక్రయమును నంగదేశమున సహ
జములు. అట్టిదేశమునకు నీవునాథుఁడవు. రథాతిరథులం గణించునపుడు భీష్ముఁడు
ని న్నేమనియె? దానిం దలంచికొని కోప ముడుగుము. అన్నిదేశములందును
బ్రాహ్మణులును క్షత్రియులును వైశ్యులును శూద్రులును బతివ్రతలును స్వధ
ర్మపరాయణులై దుష్టనిగ్రహంబును శిష్టానుగ్రహంబునుం జేయునుత్తమరాజు
లునుం గలరు. దేశసామాన్యమున గుణములఁగాని దోషములఁగాని చెప్పరాదు.
నరుఁడు పరదోషముల నుగ్గడింప నేర్చుఁగాని యాత్మదోషముల నెఱుంగఁడు. ఎఱిఁగి
యుమోహవివశుఁ డగు ననుచున్నంత దుర్యోధనుఁడు రయమునం జేరవచ్చిసఖ్యము
నఁ గర్ణుని నంజలిఘటనంబున శల్యునిం బ్రార్థించుటయు నిద్దఱు నిరుత్తరులై యూ
రకుండిరి. అప్పుడు రాధేయుఁడు పదపద పొమ్ముపొమ్మని శల్యునికిఁ జెప్పి రథనేమి
ఘోషమునను సింహనాదమునను వాదిత్రరవమునను బుడమి యద్రువ నడిచి

యసురసేనపై నురువడించునాఖండలునిచాడ్పునం బేర్చి ధృష్టద్యుమ్నాభిరక్షితం బైనపాండవానీకంబుఁ దలపడి కోలుమసంగి ధర్మరాజును వలపలించె ననిన ధృతరాష్ట్రుఁడు సంజయా, సురమనులకు నజేయులు భీమసేనధృష్టద్యుమ్నపాలితులు నగుపాండవసైనికులను రాధేయుం డెట్లు మనమూఁకల మొగ్గరించి తలపడియె? అతనికి సవ్యదక్షిణపక్షంబుల నెవ్వరు గావలియై నిలిచిరి? పాండవులు నే తెఱంగున మోహరం బమర్చిరి? అర్జునుం డెచ్చట నిలిచె? ఎట్లు కర్ణుఁడు యుధిష్ఠిరుని మార్కొనం జాలె? ధనంజయుపొంపున నున్నవారి మార్కొనఁగ నెవ్వఁడు సమర్థుఁడు? ఖాండవదహనాదికంబు లైనదుష్కరకృత్యములు పెక్కులు చేసినయర్జునుఁ డాఁకఁ గర్ణుండు దక్కఁ దక్కినవా రెవ్వరును నోపరు. భండనం బెట్లు చెల్లె? తేటపడం జెప్పు మని యడుగుటయు నతనికి సంజయుం డిట్లనియె.



కౌరవపాండవులు మోహరంబుఁ దీర్చుట.

నరేంద్రా, మనవారలయు వారలయు వ్యూహములం జెప్పెద నాకర్ణింపుము. కృపకృతవర్మమాగధులు దక్షిణపక్షంబును శకునియు నులూకుండును గుఱ్ఱపురావుతులు తోడుపడఁ దత్ప్రపక్షంబును సంశప్తకులు వామపక్షంబును గాంభోజశకయవనానీకములు తత్ప్రపక్షంబునుం గొని నిలువ నడుమ సేనాముఖంబునఁ గర్ణుండు పుత్రబాంధవపరివృతుండై సూర్యానలప్రకాశంబునఁ బొలిచి నిలిచె. ఉత్తమదంతావళం బారోహించి దుశ్శాసనుండు బహుళచమూగణపరివృతుండై పృష్ఠభాగమున కమరె. చిత్రసన్నాహులు లైనసోదరులును మద్రకేకయులును గావలిగాఁగ సురగణపరిపాలితుం డైనసురేంద్రుం బ్రేణిసేయుచు దుర్యోధనుం డతనిపిఱుంద నిలిచె. అశ్వత్థామ తక్కిన కురువీరులును, ప్రబావృట్పయోధరములట్లు మదధారాపరీతంబులై యాయుధపతాకాభిరామములు సాహోహములునై తరునికరరుచిరంబు లైననడగొండలచాడ్పునం జూడ నొప్పునేనుంగులునుం దనకు బాసట గాఁగఁ గురురాజు వెనుకటిదెసకుఁ జాలియుండె. వివిధాయుధపాణు లైనకాలుమానుసులును గజవాజిగణంబులును దగుచోట్ల కమరుటయు నావ్యూహము బంధురసన్నాహమై బృహస్పతి తీర్చినది వస్పతిసైన్యంబుమాడ్కి విక్రమనర్తనాభిరామంబై యరాతిభీకరంబై కయ్యమునకుఁ గాలుద్రవ్వుచుండె. పాండవజ్యేష్ఠుండు దానిం జూచి సేనాగ్రంబునం బొల్చురాధేయుం గనుంగొని యర్జునుం బిలిచి యిట్లనియె. అర్జునా, చూచితే కర్ణుఁడు పన్నినవ్యూహము పక్షములను ప్రపక్షములను నెంతయు నొప్పారుచున్నది. దీనిని భేదించువిధమున మనయనీకములం బన్నింపు మనుటయు సవ్యసాచి యన్నకుఁ గేలుమోడ్పు ఘటియించి నీచెప్పినయది నిక్కువంబ యట్ల చేయుదు నని నివేదించుటయు యుధిష్ఠిరుఁడు ధనంజయా, నీవు కర్ణుని భీముఁడు దుర్యో

ధనుని నకులుఁడు వృషసేనుని సహదేవుఁడు సౌబలుని శతానీకుఁడు దుశ్శాసనుని శైనేయుండు హార్దిక్యునిఁ బాండ్యపుత్రుఁడు ద్రోణపుత్రుని ద్రౌపదేయశిఖండులు ధార్తరాష్ట్రులను నేను శారద్వతునిఁ దక్కినవారలు దక్కినవారలం దలపడుట యొప్పు ననవుడుఁ దత్ప్రకారంబున సేనలఁ బన్నించి గాండీవి సురలలోఁ బ్రథమజాతుఁడై బ్రాహ్మణుఁ డనంబరఁగినయగ్ని దేవునివలనఁ బడసినదియు బ్రహ్మేశానేంద్రవరుణులకు విజయప్రదము నగుదివ్యరథమును శ్రీకృష్ణసారథ్యసముల్లసితంబైనదాని నారోహించి వెలిమావులవెలుంగును గేతనకపిస్ఫూర్తియు నభిరామంబై తనర సేనాముఖమునఁ బొలిచినం జూచి శల్యుండు కర్ణున కిట్లనియె.

శల్యుఁ డపుడు తోఁచినయుత్పాతంబులఁ గర్ణునకుఁ జెప్పుట.

రాధేయా, కనుంగొను మల్లదె శ్వేతాశ్వయోజితంబు కృష్ణసారథ్యవిభ్రాజితంబు నగుగాండీవిరథము కర్మపరిపాక మెట్టు లట్టుల సకలసైన్యములకును దుర్వారంబై యేతెంచుచున్నయది. నీవు వారల వీరల నడుగుచుండినపాండవమధ్యముండు వాఁడె శత్రువిధ్వంసనోదగ్రుండై చనుదెంచుచున్నవాఁడు. మేఘస్వనంబుఁ బోలుతుములనినదంబు విననయ్యెడి. నిక్కంబ యాతేరిలో నున్నవారు వాసుదేవార్జునులు. అదె ధూళి యెగసి గగనముఁ గప్పుచున్నది. రథనేమిఘాతమునం గాఁబోలుఁ బుడమి గడగడవడఁకుచున్నది. నీసేనల కెదురై చండవాతము వీచుచున్నది. క్రవ్యాదమృగగణములు భైరవారావము లొనరించుచున్నవి. మేఘసంకాశ మయినయత్యంతఘోరకబంధము భానుబింబము నావరించియున్నది. వివిధమృగములు సూర్యునిదెస మోర లెత్తి యఱచుచున్నవి. కంకగృధ్రాదులు వేనవేలు పిండులు గట్టి మనమూఁకల కభిముఖములై ఘోరాకారమునం గన్పట్టుచు నాక్రందనముఁ జేయుచున్నవి. చామరశిఖాకలాపభాసురములగుభవదీయశరములు జ్వలించుచున్నవి. ధ్వజము వడఁకాడుచున్నది. మింట గరుడపక్షు లెట్లట్లు రథ్యములు మీఁదుమిక్కిలి యెగరుచుఁ గంపించుచున్నది. ఈ నిమిత్తములం బరీక్షింపఁగఁ బెక్కండ్రు రాజులు రణక్షోణీతలంబునఁ బడుదు రని తోఁచెడి. శంఖశబ్దమును మృదంగానకనిస్వనంబును బాణసంపాతరవంబును జ్యాఘోషంబును దలత్రనాదంబును రథపరిష్కారవస్త్రమర్మరధ్వానంబును మేఘమండలమందలిమెఱుంగు లట్టులు వెలుంగురథధ్వజములకణకణనినదంబునుం బెరసి యాదెస జయసూచకంబులై యున్నవి. పాంచాలురతేరులు సురలవిమానములట్టు లభిగామంబులై చూపట్టుచున్నవి. గాండీవికేతనకపిప్రభలును మురారిచక్రగదాశార్ఙ్గశంఖకౌస్తుభరోచులును జూడ్కులు మిఱుమిట్లుగొల్పెడి. అల్లవాఁడె పుండరీకాక్షుండు నేర్పున రథచోదనము నొనరింప నిలింపరాజసూనుండు గాండీవజ్యా

ఘోషంబు నిగిడించి శితశరనికరములఁ బరఁగించి యుద్ధదుర్మదు లగుక్షత్రియు
లసంపూర్ణచంద్రాభిరామవదనసముజ్జ్వలమస్తకంబులను బరిఘాకారములు పుణ్య
గంధానులేపనము లాయుధసమేతములు నగుబాహువులనుం గూల్చుచున్నవాఁడు.
ఏమి చెప్పుదు నమ్మేటిమగండు గండడరిన నద్దెసం గ్రుడ్లు మీఁదికిని నాలు
కలు వెలికిని రాఁగ కౌతులతోడం బడి మడియుగుఱ్ఱములును విచ్ఛిన్నభిన్నం
బులై కూలిన నడగొండలంబోనిమత్తవేదండములును బుణ్యక్షయంబైనం బడుగం
ధర్వనగరంబులం బోలుస్యందనంబులును మత్తయూధపంబు గలఁచినమృగగణ
ములట్లు చిందఱవందఱలై కనంబడుచున్నవి. అల్లవారె సంశప్తకులు కడిందిమ
గంటిమిం బేర్చి మార్కొనిన నదృశ్యుండై నారి సారించుచు నర్జునుండు శరా
సారముఁ బరఁగించుచంద మగపడుచున్నది. ఏకరథస్థితులైనకృష్ణార్జునులఁ బురు
షశార్దూలురం జూడుము. కృష్ణుఁడు సారథిగాఁగ గాండీవము విల్లుగాఁగ రణదు
ర్దముఁడైనసవ్యసాచిం బరిమార్చితేని నీవు మా కందఱకు నెడయండ వగుదు
వనినం గర్ణుండు రోషపరీతుండై మద్రరాజా, సంశప్తకులకు గాండీవి చిక్కి మేఘ
జాలప్రచ్ఛన్నుం డైనయాదిత్యునివిధమునఁ దేజు దఱఁగినవాఁడు. ఇదియే య
ర్జునున కవసాన మనియెఱుంగు మనుటయు శల్యుఁ డతనికి వెండియు నిట్లనియె.
ఉదకమున వరుణుని నింధనముల నగ్నిని వధింతు మన్నవిధమునను వాయువును
జేతఁ బట్టుదు మన్నచందమునను సాగరమును దావుదుమన్న తెఱంగునను సంశ
ప్తకు లర్జునుం గెలుతు రనుట దుష్కరంబు. ఇంద్రాదినిర్జరులును వానిం గెలువ
నోపరు. నీకు సంతోషమేని వట్టిమాటలం జెప్పికొని తృప్తిఁ బొందుము. వివ్వ
చ్చుం గెలువరాదు. ఒండుకోర్కిఁ జేయుము. భూమిని భుజముల నెత్తువాఁడును
దలంపుమాత్రన సకలలోకక్షయంబుఁ జేయువాఁడును త్రిదివమునుండి సురలఁ
గ్రిందికిఁ ద్రోచువాఁడునుం గలుగునేని యర్జునుం గెలుచువాఁడు గలుగుఁగాఁ
బోలు. అల్లవాఁడె భీమసేనుఁడు ధీరగుణమున మేరుగిరికిఁ బోల్పఁ దగినవాఁడు
సంరంభామర్షములం బేర్చి నిత్యవైరము స్మరించుచు జయముఁ గోరి పోరికి వచ్చి
నవాఁడు. ఇతండె ధర్మరాజు తనయుధిష్ఠిరనామము సార్థకంబుగాఁగ రణమున
నితరదుష్కరకృత్యములఁ జేయుచున్నవాఁడు. వీరె యశ్వినుల కెనవచ్చునకుల
సహదేవులు సమరశౌండులై కడంగిరి. వీరె ద్రౌపదీనందను లేవురునైదుకొండల
మాడ్కి నిశ్చలులై గండడరి భండనమునకుఁ గట్టాయితంబై యున్నవారు. ధృష్ట
ద్యుమ్నాదు లగుద్రుపదసూనులు పరమతేజోవీర్యస్ఫారులై మగఁటిమిఁ బూని
పోరి కాయిత్తపడియున్నవారు. ఇతండె యింద్రపరాక్రముఁడైనసాత్యకి కాలాం
తకునివిధమునఁ గోపదీపితుండై వాఁడి మెఱయుచున్నవాఁ డని చెప్పుచున్నంత
నుభయసైన్యములు నొండొంటిం దలపడుటయు నత్తాఁకు గంగాయమునాసంగ

మంబురీతి దర్శనీయం బయ్యె నని యాంబికేయునకు సంజయుఁ డెఱిఁగించె నని వైశంపాయనుండు వివరించుటయు జనమేజయభూవల్లభుండు సాంద్రసముల్లాసంబునం బొదలె.

మ. జగమం దెల్లెడ నింద్రియార్థపరిసంసర్గస్ఫురద్బోధనో
పగతిం బొల్చుపదార్థసంచయములం బ్రత్యేక మూహించి చ
క్కగఁ గా దియ్యది యిద్ది గా దిదియునుం గాదంచు సర్వంబుఁ ద్రో
య గణింపంగ నశక్యుఁడై మిగులుసర్వాతీతు నెంతు స్మరిన్.

ఇది శ్రీకాళహస్తినగరాధినాథ శ్రీమద్దామరకుమారాక్కమహీపాల కరుణా
పురస్సరబహుమానపాత్ర, సంస్కృతాంధ్రభాషాకవిత్వచమత్కార
పరితోషితబుధస్తోమ సీతారామకవిలలామ పుత్ర, సకలశాస్త్రి
నిరంకుశపాండితీధుర్య లక్ష్మీనరసింహసుధీవర్య సచ్ఛాత్ర, విబు
ధజనవిధేయ, వేంకటరంగనామధేయ విరచితంబైన శ్రీమ
దాంధ్రవచనభారతంబునందుఁ గర్ణపర్వంబునఁ గర్ణు
నిప్రథమదినయుద్ధమును, పాండ్యాదివధయును,
దుర్యోధనుఁడు శల్యునిఁ గర్ణునకు సారథిగా
నియమించుటయుఁ, ద్రిపురసంహారకథ
నంబును, కర్ణశల్యసంవాదంబును,
హంసకాకీయోపాఖ్యానంబు
ను, కర్ణునిద్వితీయదినయు
ద్ధారంభము నన్నది
ప్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

శ్రీకాళహస్తీశ్వరాయ నమః.

## ద్వితీయాశ్వాసప్రారంభము.

క. శ్రీప్రతిపాదకనైజమ
హాప్రకృతికృతప్రపంచకానుప్రవిశ
త్త్వాప్రథితప్రాణికృతివి
ధాప్రేరణ, విబుధగమ్యతత్త్వస్ఫురణా.

దేవా, ననుఁ గృతార్థుం జేయుము.

సంతతసభక్తికోపసేవితద్వైపాయనుం డైనవైశంపాయనుం డనంతరక థాకర్ణనోదీర్ణకుతుకహృదయుం డైనజనమేజయున కిట్లనియె. అంత ధృతరాష్ట్రుఁడు సంజయుం జూచి సూతనందనా, యవ్విధమున నిరువాఁగునుం గయ్యమునకుఁ గాలుద్రవ్వుచుండునెడ సంశప్తకులకును సవ్యసాచికినిఁ, గర్ణునకును గాంతేయయోధులకును నెట్టులు పోరు సెల్లె? వచనకుశలుండ వైనసీవు వివరింపఁగ నాశూరశేఖరులపరాక్రమ మెంత వినినం దనివోవదు. ఎంతయుఁ గుతూహలం బయ్యెడి. తేటపడ నెఱింగింపు మనుటయు నమ్మనుజనాథునకు సంజయుం డిట్లనియె.

నరేంద్రా, నీకొడుకునవినీతిం బుట్టినయాసంగ్రామమున మనమోహరంబుఁ జూచి సవ్యసాచి యన్నయానతిమెయిం బ్రతివ్యూహ మమర్చుటయు నందు ధృష్టద్యుమ్నుఁడు చంద్రాదిత్యతేజోవిరాజితుండై వేఱురూపు గొన్నకాలునితీరునం జూపట్టుచుఁ బారావతవర్ణతురంగమములతుఱంగలి వెలుంగ నగ్రభాగమున ద్రౌపదీనందనపరివృతుండై తారానికరపరీతుం డైనచంద్రునిచందమునం బొల్చుచుండఁ బాండవమధ్యముండు దాను గాండీవజ్యాఘోషంబు భీషణంబుగ నిగిడించుచు నప్పాంచాలవరుం దలకడచి మనసేనలఁ దాఁక నుంకించుచున్నంత సంశప్తకవీరులు బహుళచతురంగబలసమన్వితులై యేతెంచి యావివ్వచ్చునిఁ బోరికిం జీరుటయు నమ్మేటిమగండు క్షాత్రధర్మము డెందమునం దలంచి వారలం దలపడుటయుఁ బరమతుములం బయ్యె. అట్టితుముల మవ్వీరశేఖరుండే

తొల్లి నివాతకవచులతోడఁ గడిందిమగంటిమిం బేర్చి పోరునప్పుడును గలిగినట్లు వినమైతిమి. అట్లు నిర్వక్రవిక్రమాటోపదీపితుం డైనసవ్యసాచి కోలుముసంగి తేరుల విఱిచియు గుఱ్ఱములఁ జదిపియుఁ బడగలఁ గూల్చియు నేనుంగులఁ బీనుంగులఁ గావించియుఁ గాలుమానునులఁ జెండాడియు నమ్ములఁ దుమురుసేసియు విండ్లఁ దునిమియుఁ జిందములఁ బగులనడిచియుఁ జక్రముల విదళించియుఁ బర శ్వథములఁ బఱియలువాపియు బలుకైదువులఁ బొడిచేసియు నాయుధోల్లసితభు జాదండముల నఱికియుఁ దలలఁ దఱిగియు నాసంశప్తకసైన్యంబు దైన్యంబు నొందించినం గోపించి పెక్కండ్రువారు చుట్టుముట్టి యాజగజెట్టి తమకుఁ జిక్కె నని తలంచి యార్చి పేర్చినం గినుక వ్రేడమి కవ్వడి కాలాంతకరుద్రునిచందమున రౌద్రంబున మెఱసి దక్షిణమునను నుత్తరమునను బశ్చిమమునను నిచ్చమెయి రథము వివిధమండలప్రచారముల మురారి పఱప నెచ్చటం జూచినఁ దానకా నగపడి యందఱ కన్నిరూపులై యేట్లాడుటయు నయ్యాలంబు పరమాభీలం బయ్యె. ఒండుకడఁ గృపకృతవర్మశకునులు పాంచాలచేదిసృంజయులతోడం బెనంగిన నదియుం బరమబీభత్సం బయ్యె. సేనాముఖమున సాత్యకిప్రముఖులం దలపడి పోరాడుకర్ణునకు దుర్యోధనుండు తమ్ములును దానును బ్రాపై నిల్చిన నారాధేయుం డుక్కునం బేర్చి వారలం బటుప్రదరనికరములం దెరలించి యుధి ష్ఠిరుదెసకు నడిచిన నాసమరంబు దేవదానవసంగరంబుమాడ్కి భీకరం బయ్యె ననవుడు ధృతరాష్ట్రుండు సంజయా, కర్ణుఁడు తక్కినవారలం గడచి ధర్మరాజు దెసకు నడిచె నంటివిగదా? తొలుత నెవ్వరెవ్వరు తాఁకినం గెల్చి మఱి ధర్మజు నిదెస కరిగెఁ దెలియం జెప్పు మనియడుగ నతనికి సంజయుం డిట్లనియె.

## కర్ణుఁడు పాంచాలకుమారులఁ బెక్కండ్రం జంపుట.

ధృష్టద్యుమ్నప్రముఖు లైనపాండవులం జూచి కర్ణుండు పాంచాలురపై నడచుటయు వారు రాజహంసలు మహార్ణవముంబోలె శంఖభేరీప్రముఖవాద్య రవం బెసంగఁ గడంగిన నప్పటిబాణపాతరవమును గరితురగరథనిస్స్వనమును సింహనాదములను విని జనులు కొండలు పగిలెడినో వనములు భగ్నము లయ్యె డినో యర్ణవములు ఘూర్ణిల్లెడినో మిన్ను వ్రాలెడినో గ్రహగణములు చలిం చెడినో యనితలఁచి వెతఁ జెందిరి. అల్పసత్త్వము లగుభూతము లాఘోర నాదమునకే క్రందిపోయె. అప్పుడు కర్ణుఁ డుదీర్ణరోషభరితుండై దైత్యసేనల మార్కొనుసురపతివీఁక మెఱసి పాండవానీకంబుఁ జొచ్చి కలంచి డెబ్బదియేడు గురు ప్రభద్రకవీరులను నిరువదియైదుగురఁ బాంచాలశూరులను ననేకచేదియో ధులనుం బరిమార్చినం బాంచాలు రలిగి పటుప్రదరనికరములఁ బరఁగించుచు నతనిం జుట్టుముట్టుటయు నవ్వైకర్తనుండు ప్రతాపదుర్దముఁడై భానుదేవుఁడు చిత్ర

సేనుఁడు సేనాబిందుఁడు తపనుఁడు శూరసేనుఁ డనుపాంచాలకుమారుల నేవురనె క్కపెట్ట జమునిప్రోలి కనిచినం బరమాభీలం బగుడు హాహాకారంబు లెసంగఁ బాంచాలరథికులు పదుగురు వీఁకఁ దాఁకిన వారలం గీటడంచె. అంతఁ గర్ణచక్రర క్షకు లయినతత్పుత్రులు సుషేణసత్యసేనులును బృష్ఠగోపుఁ డై నయతనిజ్యేష్ఠపు త్రుఁడు వృషసేనుఁడును బాణములమీఁదియాశ విడిచి పోరికిఁగడంగుటయు ధృష్ట ద్యుమ్నసాత్యకులును ద్రౌపదీనందనులును వృకోదరుఁడును శిఖండిజనమేజయులు ను జేదిమత్స్యకేకయపాంచాలప్రభద్రకవీరు లనేకులును వారల నందఱను దలపడి వివిధశరపరంపరలు నిగిడించి యాఁగుటయు సుషేణుఁడు భీముని కార్ముకముఁ దు నిమి యేడువాఁడినారసములు ఱొమ్మునం గీలించి యార్చె. అందుల కలిగి బకాం తకుండు పరమదృఢ మగునొండువిల్లు గొని సజ్యము గావించి సుషేణునివిల్లు దు నిమి పదియమ్ములతనిమేన నాటి డెబ్బదిమూఁడుశితశరములు కర్ణునంగములు దూల నేసి తత్సుతుం డై నభానుసేనునిఁ బదితూపుల నశ్వసూతాయుధధ్వజములతోడ ఖండించుటయు నాభానుసేనునిమస్తకము కామ ద్రుంచినకమలముభంగి నేలం బడియె. అట్లు భానుసేనుం బరిమార్చి పరమరౌద్రమునం బేర్చి ప్రభంజనాత్మ జుండు మనవారిపై నడరి కృపకృతవర్మలవిండ్లు దునిమి దుశ్శాసనుని మూఁడిం టను శకుని నాఱింటను నొప్పించి యులూకపతత్రులకు రథభంగము నొనర్చి సుషే ణునిమీఁది కడరి యోరీ యిదె తెగటారితి వని నిశితసాయకము వింట నరిఁ బోసి యేసినం గర్ణుండు దాని మూఁడమ్ముల ఖండించె. అంతఁ గోపదీపితుండై భీ ముఁడు శాతపర్వశోభితం బయినవేఱొక్కబాణ మేయుటయు రాధేయుండు దా నిం ద్రుంచి పుత్రరక్షణతత్పరుండై డెబ్బదిమూఁడుక్రూరనారాచములు గుప్పించె. అట్టియెడ సుషేణుం డొండువిల్లు గొని నకులునిబాహూరుభాగముల నైదమ్ము లేయుటయు నాతం డిరువదిపటుప్రదరములు వానిమేను గాఁడ నేసి కర్ణునకు వెఱపు గదుర నార్చినం గినిసి సుషేణుఁడు పదితూపుల నతనిచాపంబుఁ దును ముటయు నమ్మాద్రీనందనుండు క్రోధమూర్ఛితుండై తొమ్మిదివాలమ్ము లాసుషే ణునిమేన నాటి సారథిం బలుతూపుల నొంచి మఱియు మూఁడురోపములు వాని మేనం గీలించి మూఁడుభల్లముల విల్లు దునుముటయుఁ గ్రోధదీపితుండై యాకర్ణ నందనుండు నకులు నఱువదింటను సహదేవుని నేడింటను నొప్పించుటయు వారి పోరు దేవదానవసమరంబుచందంబున ఘోరం బయ్యె.

సాత్యకి వృషసేనుం దాఁకి మూఁడింటఁ దత్సారథిం జంపి యొక్కశాతభల్ల మున విల్లు ఖండించి యేడింట రథ్యములం జదిపి యొక్కశరమునఁ గేతనంబుఁ గూల్చి మూఁడువాఁడియమ్ములు ఱొమ్ముఁ గాఁడ నేయుడు నాకర్ణనందనాగ్రజుండు సోలి యించుకసేపు తేరిపై నొఱగి కొండొకవడికిఁ దెలిసి లేచి విరథుఁడు గావున

వాలును బలకయునుం గొని తేరు డిగ్గి యడరుటయు శినివీరుఁడు వరాహకర్ణము
లగుశితశరములఁ బదింట నాకృపాణశరవారణముల నఱికినం దీనదశాప్రాప్తుం
డై నయావృషసేనుని దుశ్శాసనుఁడు తన తేరెక్కించికొని యనికిఁ దొలఁగించె. అంతఁ
గొండొకవడికి వృషసేనుఁడు సకలసన్నాహబంధురం బైనయొండొకస్యందనం బెక్కి
యేతెంచి యేచి డెబ్బదిమూఁడింట ద్రౌపదేయులను నైదింట సాత్యకిని నలు
వదినాలుగింట భీమసేనుని నేనింట సహదేవుని ముప్పదింట నకులుని నేడింట
శతానీకునిఁ బదింట శిఖండిని నూఱింట ధర్మరాజును నొనేసి మఱియు మా
ర్కొన్నవారల నందఱను దొడ్డనారసంబుల నొప్పించుచుఁ దండ్రికిఁ బృష్ఠభాగ
మునం గావలియై నిలిచె. అప్పుడు శైనేయుఁడు దుశ్శాసనుం దాఁకి తొమ్మిది
వాలమ్ముల సారథిని గుఱ్ఱములను సమయించి తేరు ఖండించి వానిఫాలభాగమున
శరత్రయముఁ గీలుకొల్పుటయు నాతండు విధివత్కల్పితం బైనయొండుతే రెక్కి
కర్ణునకు బలంబు పెంపు గావించువాఁడై పాండవులతోడఁ బోరె. అయ్యవసరం
బున ధృష్టద్యుమ్నుండు పదింటను ద్రౌపదేయులు డెబ్బదిమూఁడింటను సా
త్యకి యేడింటను భీముఁ డిరువదినాలుగింటను సహదేవుఁ డేడింటను శిఖండి
పదింటను ధర్మరాజు నూఱింటను దక్కినవారు పెక్కుతూపులను రాధేయుని
నొప్పించుటయు నామేటిమగండు శరగ్రహణసంధానప్రయోగము లిట్టు లని
యూహింపరానిపరమరయమునం బేర్చి యందఱనుం బదేసియమ్ముల నొంచిన
నెక్కడఁ జూడ్కి సారించినం గర్ణుబాణములకా నగపడుటం జేసి సంగ్రామమేది
నీతలంబు సంధ్యారాగారుణవారిదపటలచటులం బైననభోమండలమురీతిం గన్ప
ట్టుటయుఁ గర్ణునివిలువిద్య నేర్పింతయొప్పనే యని యందఱు పరమాద్భుతము
నొందిరి. పెక్కు లేల? రాధేయుండు తన్ను మార్కొని యెవ్వ రెన్నిశరము
లేసిన ;వారిపై నంతకు మూఁడుమడుంగు లెక్కుడుగ వాలంపగములం బరఁగించి
శతములుగను సహస్రములుగను బలుతూపులు నిగిడించి బహుళచతురంగబల
ములం బరిమార్చి కరిఘటలం దెరలించి చేదివీరుల ముప్పదుండ్రను దెగటార్చి
యేత్తెఱ మెఱసి యుధిష్ఠిరునిదెస కడరుటయు శిఖండిసాత్యకిధృష్టద్యుమ్నప్ర
ముఖు లైనపాండవవీరు లప్పాండవాగ్రజుం దలకడచి శరనికరంబులఁ బరఁగిం
చుచుఁ గర్ణుం దాఁకుటయు నిరువాఁగునను వివిధవాద్యములును సింహనాదము
లును నెసఁగె. అట్లు రాధేయుండు రణరభసుండై పాండవాగ్రజునకుఁ బ్రాపై
నిలిచినమూఁకలం ద్వాఁకి వీఁక మెఱసి బలుతూపులవాన గురిసి వారికైదువులం
బొడిచేసి తలలు దఱిగియు బాహువులఁ గోసియుఁ దొడల నఱికియు ఘోరప్ర
కారంబుఁ గావించినం దక్కినవారు వెఱచఱచి పఱచుటయు సాత్యకి పురికొల్పినం
ద్రావిడనిషాదులు పెక్కండ్రడరుటయు నిపుణవనపాలకుఁడు తాళఫలంబుల

రాల్చుపోల్కి వారితలలు ధరణిం దొరఁగించి కాలాంతకునివిధమున ఘోరాకారుండై యేచినం గోపించి పాండవపాంచాలవీరులు వ్యాధిని మంత్రౌషధక్రియ లెట్టు లట్టు లయ్యేకవీరు నాఁగుటయు నాతండు గండడరి యత్యుల్బణ మయిన వ్యాధి మంత్రౌషధక్రియలంబోలె వారలం గడచుటయుఁ బాండవపాంచాలకేకయులలోనం జేయంగలమగలు దలపడినం బ్రహ్మవిదులను మృత్యు వెట్టు లట్టుల కర్ణుండు వారిం గడవనేరఁ డయ్యె.

కర్ణుఁడు ధర్మరాజు నోడించి తూలనాడుట.

అయ్యవసరమున యుధిష్ఠిరుఁడు క్రోధసంరక్తలోచనుండై సమీపగతుం డయ్యుఁ బాంచాలాదులం గడవనేరకున్నకర్ణుం జూచి కర్ణకర్ణా, వ్యర్థదర్శనా, సూతసుతా, నామాట వినుము. ఎల్లపుడును గవ్వడితోడ స్పర్థ సేయుచు ధార్తరాష్ట్రునిదుర్మతంబుఁ గొని మాతోఁ బగపాటించి సాధింతువుగదా. నీబలమును వీర్యమును మామీఁదిపగను నిప్పుడు చూపుము. నేఁటితో నీకు యుద్ధాసక్తం గోల్పఱిచెద ననిపలికి సువర్ణపుంఖము లాయసములు నగుపదిశిలీముఖము లేయుటయు రాధేయుండు నగుచుఁ బదివత్సదంతము లతనిపయిం బడ నేసె. అందులకు నేయి వోయ భగ్గనం దరికొనునగ్గిచాడ్పునఁ గ్రోధప్రజ్వలితుండై లయసమయసంవర్తకువిధమున రౌద్రమునం బేర్చిన నతనియాకారంబుఁ జూడనేరక మన సైనికులు వెఱచి పఱచిరి. అట్లు కోపాటోపభీషణుండై పాండవాగ్రజుండు మౌర్వీగుణక్వణనంబుఁ గావించి కొండలనైనం బగిలింపఁ జాలినయొక్కశాతసాయకంబు యమదండమునకుఁ బురుడువచ్చుదాని వింట నరిం బోసి సూతపుత్రవధతాత్పర్యమున నేయుటయు నాసాయకము వజ్రాశనిసమస్వనంబై రయమునం జని కర్ణునివామపార్శ్వముఁ జొచ్చినం గడు నొచ్చి యతండు మూర్ఛితుండై విల్లు దిగవిడిచి తేరిపై నొఱఁగం బడుటయు నునయనీకంబున హాహాకారంబు లెసంగె. తదవస్థుం డైనరాధేయుం జూచి పాండవసైనికులు సింహనాదములను గిలకిలారవటులనుం గావించిరి. అంతఁ గొండొకవడికి మూర్ఛ దేఱి రాధాసుతుండు ధర్మనందనుం గీటడంపఁ దలంచి క్రూరపరాక్రముండై విజయనామకం బయిన తనవింటినారి సారించి పాండవాగ్రజుపై వాలమ్ములం బరఁగించి చంద్రునిచెంగటి పునర్వసునక్షత్రములకరణిం బొల్చుతదీయచక్రరక్షకులఁ జంద్రదేవదండధారులనుపాంచాలకుమారుల నిశితక్షురప్రములం దెగటార్చె. అందులకుఁ గడుం గోపించి ధర్మాత్మజుండు శితశరగణములఁ గర్ణుని, మూఁడేసియమ్ముల సుషేణసత్యసేనులను,డెబ్బదియంబకముల శల్యునిఁ,గ్రమ్మఱఁ బదిస ప్తతిసాయకముల రాధేయుని,మూఁడుమూఁడువాఁడితూపులఁ దద్రక్షకులను నొప్పించుటయు నవ్వైయవైకర్తనుండు జ్యాఘోషంబు నిగిడించి యుధిష్ఠిరువిల్లు భల్లమునం దునిమి

యఱువదివాలమ్ము లతనిమేనం గీలుకొల్పి యార్చినం బాండవజ్యేష్ఠునకుఁ దోడు పడ సాత్యకియుఁ జేకితానుండును యుయుత్సుఁడును బాండ్యుఁడును ధృష్టద్యు మ్నుఁడును శిఖండియు జనమేజయుండును ద్రౌపదేయులును శిశుపాలపుత్రుం డును ప్రభద్రకరూశమత్స్యకేకయకాశికోసలవీరులునుం గర్ణుం దలపడి యతని పయిని వృషసేనునిమీఁదను వరాహకర్ణనాళీకవత్సదంతవిపాఠక్షురప్రచటకా ముఖంబు లగునానాశిలీముఖములం గుప్పించుటయుఁ గర్ణుఁ డుదీర్ణరోషభరి తుండై బ్రహ్మాస్త్రము సముద్దీపితముఁ గావించి యమ్ములు మంటలు బీరము వే డిమియుం గాఁ బావకప్రభుండై పాండవానీకముల నీఱుసేయుచు నలంతినగవు నెమ్మొగమ్మునఁ దుఱంగలింపఁ గౌంతేయాగ్రజుకార్ముకము ఖండించి యొక్కనిమే షములోనఁ దొంబదియమ్ములు వింట నరిఁ బోసి యేసి యయ్యాజాతశత్రునిమై మఱు వఱువుల్లుచేసినం గనకచిత్రం బైనయాతనికత్తళంబు వాతవిధూతం బైన నిద్యుద్విలసితమేఘపటలంబు సూర్యమండలముఁ బాయుతెఱంగున నప్పాండవ జ్యేష్ఠునిగాత్రము వాసి యంబుదజాలబంధురం బైనరాత్రినభోమండలముచా డ్పునం జూపట్టె. అట్లు విదీర్ణకవచుండై కౌంతేయాగ్రజుండు నెత్తుటం జొత్తిల్లి నమేన నొప్పుచు రౌద్రాభిరాముఁడై సర్వాయస మగుశక్తినిఁ గర్ణునిమీఁదఁ బడ నేయుటయు జ్వలితజ్వలనజ్వాలాభీలం బైనయప్పరమసాధనంబును మార్గణ సప్తకమున రాధేయుండు తునియలు గావించి నేలం గలిపినం గినిసి ధర్మరాజు రోషభీషణత్వంబు నెఱయ బాహుబలము మెఱయఁ దోమరచతుష్టయంబుఁ గర్ణునురమ్ముఁ గాఁడ నేసె. దాన శోణితసిక్తగాత్రుండై రాధాపుత్రుండు త్రొ క్కువడ్డపాముపగిదిఁ గ్రోధవిస్ఫురితుండై పెద్దయు గోఁజుచు నొక్కనిశితభల్ల మునఁ గేతనముఁ గూల్చి మూఁడింట ధర్మరాజును నొప్పించి పెక్కుతూపుల నమ్ముల పొదులను దేరును దిలమాత్రశకలములు గావించి సారథిం దెగటార్చిన నీలవాల ములు సర్వాంగావదాతములు నగునుత్తమహయములు రథపీఠము నీడ్చికొని పోవ నతిదీనుండై లేటమొగంబు వెట్టి ధర్మరాజు సఱచె. పఱచినం బోనీక వెన్నడించి కర్ణుఁ డాత్మపావనత్వంబుఁ గావించుకొనువాఁడై వజ్రచ్ఛత్రాంకుశమత్స్యకూ ర్మధ్వజపద్మలక్షణోపపన్నం బగుపాణితలంబునఁ బరమపావనుం డైనయయ్యజా తశత్రునియంసదేశంబు స్పృశించి పట్టుకొన నుంకించి కుంతీదేవివచనము స్మరించి విడుచుచున్నంత శల్యుండు కర్ణా, ధర్మజుం బట్టుకొనవలదు. పట్టుకొంటివేని యప్పరమధార్మికునికోపము నిన్ను నీఱుసేయకమాన దనుటయుఁ బకపక నవ్వి యప్పాండవాగ్రజుం దూలనాడువాఁడై యిట్లనియె. ధర్మనందనా, యుత్తమ క్షత్రకులమునం బుట్టి ధర్మవ్యవస్థితుండవయ్యు నీవు ప్రాణరక్షణతాత్పర్యమున సమరమున నెట్లు పరాఙ్ముఖుఁడవైతివి? నీవు వేదాధ్యయనయజ్ఞానుష్ఠానాదు

లగుబ్రాహ్మణధర్మముల నెఱింగినవాఁడవకాని క్షాత్రధర్మ మెఱుంగ వని నేఁ దలంచెద. పో రింక నుడుగుము. పోరుదేనియుఁ గొలఁది చూడక నీకు మిగిలిన శూరుల మార్కొనవలదు. మార్కో లట్టు లుండె. వారికి విప్రియంబులుం బలుకవలదువల దనిచెప్పి యతనిని విడిచి వజ్రహస్తుం డై నయాఖండలుండు దానవసేనంబోలెఁ దదీయసైన్యము మార్కొని గండడరె. ధర్మరాజు సిగ్గుపెం పునను గోపంబుపెల్లునను విన్నఁబోయినమనంబుతోఁ దొలంగుటయుఁ జేదిపాం చాలురును సాత్యకిమాద్రేయద్రౌపదేయులును నతనివెంట నరిగిరి.

సంకులయుద్ధము.

అవ్విధమున యుధిష్ఠిరానీకము పరాఙ్ముఖం బైనం జూచి కర్ణుం డేచి యెంతయు ముదంబునం బొదలి భేరీమృదంగనినదంబును జ్యాఘోషంబును ధార్తరాష్ట్రులసింహనాదంబునుం బెరసి దిక్తటంబులఁ బూరటిల్లం జేయ వెన్న డించి తదనీకంబులఁ జీకాకుపఱచుటయుఁ గర్ణునికోల్తల కోహటించి సాహసో త్సాహములం దొఱంగి దీనదశకు వచ్చిననిజసైన్యంబు నక్కౌంతేయాగ్రజుండు శ్రుతకీర్తిరథస్థుండై కనుంగొని తమవారలం బురికొల్పుటయు భీమసేనపురస్స రులై వారు మనవారలం దలపడినఁ గడంగుఁడు తొడంగుఁడు ముట్టుఁడు కొట్టుఁ డు తలపడుఁ డనునులివు పరమతుములంబై పర్వె. అట్టు లిరువాఁగున నంద ఱును మగంటిమి వాటించి కోల్తల చేసి యుక్కుమిగిలి పోరుటయు మింట నభ్ర చ్ఛాయచాడ్పున శరవర్షము సాంద్ర మయ్యె. కూలినకేతనములును జచ్చినగు ఱ్ఱములును మడిసినసారథులును బఱియలైనగొడుగులునై యిది యిట్టి దని యేర్పఱుపరానివిధమున విశకలితంబు లైనతేరులును, వర్మాలంకారములు విచ్ఛి న్నవిదీర్ణవిభిన్నవిపర్యస్తంబులై యారోహకులతోఁడం గూలి వజ్రాహతము లగు నుత్తుంగగిరిశృంగములకరణిం జూడనొప్పునేనుంగులును, రావుతులతోఁడం బడి మడిసి వికృతాకారంబు లైనగుఱ్ఱములును,గాలు చేయి డొక్క ప్రక్క తల మొల యని నిరూపింప వలనుగానివిధమునఁ దుత్తుమురై నపదాతిగాత్రఖండములును, విశాలాయతతామ్రలోచనములను బద్మేందుసుందరవదనములను గుండలమండిత శ్రోత్రములను నభిరామము లగునికృత్తయోధవీరమస్తకంబులును నంతట నెఱి య సంగ్రామరంగంబు రౌద్రబీభత్సంబై హాహానాదమేదురంబై తనర గగన మండలంబును నాయుధనిహతు లగువారల నాకలోకమునకుఁ గొనిపోవఁగఁ దల్లో కవాసులు తెచ్చినవిమానములసంఘర్షమునను వీరస్వర్గప్రాప్తుల నాదరింప వచ్చి నయచ్చరలగానమునను సాంద్రాభిరామంబై కన్పట్టుటయు నత్యంతాశ్చర్యంబుఁ జెంది యాయుధనిహతులకు స్వర్గలోకసుఖము సిద్ధ మని నిశ్చయించి హతశేషు లయినవీరులు తమతమచతురంగబలములతోఁడం గడంగి యొడ లోమక పోరి

పోరి నెగసినపరాగంబు పెల్లునంజేసి చీఁకట్లు గ్రమ్మినం దమ్మును లొఁతులను నర యనేరక చిక్కినవారలం దలపడి తలలు పట్టుకొనియుఁ బండ్లఁ గొఱికియు గోళ్ల గిల్లియుఁ బిడికిళ్లఁ బొడిచియుఁ గైదువుల నడిచియు వివిధదారుణప్రకారములం బెనంగి నరతురగద్విరదస్యందనములు శకలంబులు గావించి నెత్తురుటేఱు పాఱించి యు నప్పటికి నుడివోనిచలమునం బేర్చి యారుధిరమున మునింగియుఁ ద్రావియు గంధస్పర్శరసరూపములు తన్మయంబులకా నొనర్చి ఘోరశబ్దంబుఁ గావించినం బరమాభీలం బగుడు నిరువాఁగున బహుళసైన్యములు తెగుటంజేసి యాపోరు విషాదపర్యవసానం బగుటయు భీమసేనసాత్యకిప్రముఖు లగుపాండవవీరులు శూరత్వంబునం బేర్చి తమవారికి బాసటమై నిల్చి కడందిమగంటిమి మెఱయఁ బటుప్రదరనికరములు పరఁగించి కైదువులపొళ్లను గత్తళములరాసులను గొడుగులప్రోవులను నరవాజిగజగాత్రఖండములనుం బచరించిన నస్మదనీకంబు కొదమసింగములు పొదివినగజకులంబుమాడ్కిఁ జెప్పరానిదీనదశకు వచ్చె.

## కర్ణుఁడు భీముం దాఁకి మూర్ఛితుఁడగుట.

అవ్విధమునఁ బాండవవీరులకొత్తలకోహటించి పఱచుచున్నమనయనీకములు దుర్యోధనుం డెంతవారించినను విచ్చుటం జూచి శకునిప్రముఖులు వృకోదరు నాఁగఁ దమకించుచున్నంత రాధేయుండు బలవీర్యదర్పవిధేయుండై భీము నరదమునకు సమ్ముఖముగా మనతేరు దోలుమని శల్యునకుఁ జెప్పిన నమ్మద్రేశ్వరుఁ డట్లు చేయుటం జూచి భీమసేనుఁడు క్రోధసమన్వితుండై కర్ణవధము మనమున నూహించి సాత్యకిధృష్టద్యుమ్నులం బిలిచి మీరు పరమసంశయగ్రస్తుండై యె ట్టకేలకు విముక్తుండైనధర్మరాజునకుఁ గావలియైయుండుఁడు. ఏను దుర్యోధను నక్కినప్రీతిగాఁ గర్ణుం దలపడి వాని కంతముఁ గావించి మఱియరుగుదెం చెద. మాయన్నను మీ కిల్లడవెట్టితి ననిపలికి కర్ణున కభిముఖుండై దిక్తటంబులు బీఁటలువాఱ సింహనాదం బొనర్చుటయుఁ గయ్యంపువేడుక గడలుకొనిన మనముతోఁ బటురయమునఁ జనుదెంచునావృకోదరుంజూచి శల్యుండు కర్ణు నుద్దేశించి రాధేయా, చూచితే భీమసేనుఁడు పెద్దకాలంబుగోలె డెందమునఁ బాదుకొనినక్రోధమునెల్ల నేఁడు నీపయి విడువఁగ వచ్చుచున్నవిధము దోఁచుచున్నది. అభిమన్యుఁడును ఘటోత్కచుఁడును మడిసినప్పుడు నిట్టిఘోరత్వమున వీనియాకారంబు గానంబడదు. యుగాంతానలప్రభం బైనయిట్టిరౌద్రరూపంబుఁ బూనినయీజగజెట్టి ముల్లోకముల నోర్వఁ గలఁ డనుటయుఁ గర్ణుండు నగుచు నమ్మద్రపతి కిట్లనియె. మద్రేశ్వరా, భీమసేనుం గుఱించి నీనిరూపించినదెల్ల నిక్కంబ. ఈతండు శూరుఁడు వీరుఁడు కోపనుఁడు శరీరనిరపేక్షుఁడు బలాధికుఁడు. అజ్ఞాతవాసమున నీతఁడు విరాటనగరమునందుఁ బాంచాలీనిమిత్తము

కేవలబాహుబలమునంజేసి రహస్యప్రకారమునఁ గీచకుని వానితమ్ముల నుపకీచకుల నందఱను నొక్కమాత్రలోనఁ బొలియించుట యందఱును విన్నదియకదా. అలి గెనేని యితండు కింకరపరివృతుండై దండపాణియై యముఁడు తాన వచ్చినను బోరికిఁ గడంగుఁగాని పిఱుతివియఁడు. అర్జునునిఁ గయ్యమున వధించుటయొండె నాతనిచే నేను హతుఁడగుటయొండె నెఱవేఱవలయు నని నాకుఁ బెద్దకాలంబు గోలెఁ గోర్కి గలదు. ఇప్పుడు భీముం దాఁకి వధించినను విరథుం జేసినను బేర లుక గదుర సవ్యసాచి తాను రయమున నన్ను మార్కొనుట తప్పదు. అప్పుడు నాకోర్కి యీడేఱు. తేరు వ్రోని మ్మనుటయు శల్యుఁడు కర్ణా, భీమునిఁ దాఁకి యతని గెలిచి పదంపడి యర్జునుం దలపడి కోర్కి కొనసాగించుకొ మ్మనిపలికి తేరు వఱపుటయుఁ దన కెదురై వచ్చుచున్నకర్ణుం జూచి వృకోదరుఁడు రయ మున నేతెంచుటయు నయ్యిద్దఱిసమాగమమున నుభయసేనలందును దూర్యనినా దంబు లెసంగె. అంత భీముఁడు కర్ణునిపయిం బటుప్రదరము లడరించుటయుఁ గోపించి కర్ణుఁడు భీముని స్తనమధ్యమున దొడ్డనారసంబు నాటి శరవర్షముఁ గురి సినం గినిసి తొమ్మిదియమ్ములు భీముఁ డతనిపై నేయుటయు నాతం డాతనివిల్లు నడిమికిఁ ద్రుంచి స్తనాంతరమున వాఁడినారసంబు గ్రుచ్చె. ధనుర్భంగమున కలిగి పవనతనూభవుఁ డొండువి ల్లెత్తి శితశరములం గర్ణుని మర్మస్థానములు గాఁడ నేసి రోదసీకుహరం బవియునట్లు పెలుచ నార్చుటయుఁ గర్ణుఁడు కొఱవులఁ గుంజ రముంబోలెఁ బంచవింశతివిశిఖముల భీముని నొంచె. కర్ణసాయకభిన్నాంగుఁడై కీచకాంతకుఁడు సంరంభామర్షతామ్రాక్షుండై యేచి కొండలను భేదింపఁ జాలిన యొక్కశాతసాయకంబు వింట నరిఁ బోసి యేయుటయు వజ్రాశనిసమస్వనం బైనయయ్యమ్ముతాఁకునంజేసి రాధేయుండు వజ్రాహతం బైనధరాధరముకరణిం గంపించి మూర్ఛితుండై తేరిపయి నొఱగఁ బడుటయు శల్యుఁడు తేరు దొలఁ గించె. అట్లు కర్ణుఁడు మూర్ఛితుం డగుటయు ననాథము లగుమనసైన్యములప యి నడరి వృకోదరుఁడు సురపతి దనుజచమూగణంబులంబోలెఁ దఱిమె ననిన విని యాంబికేయుండు సంజయా, భీముఁ డత్యంతదుష్కరకార్య మొనర్చెఁ. కర్ణుఁ డొక్కరుఁడే పాండవపాంచాలాదులనెల్లఁ బరిమార్ప నోపు నని దుర్యోధనుఁడు నాకుఁ బలుమాఱు చెప్పినవాఁడు. తననమ్మినబిరుదుమగఁడు భీమున కోడినపదం పడి దుర్యోధనుం డేమి చేసె ననియడుగ నతనికి సంజయుం డిట్లనియె.

భీముఁడు శ్రుతవర్మాదు లగుకురుకుమారులం జంపుట.

రాధేయుఁ డట్లు రణవిముఖుఁ డయినం జూచి దుర్యోధనుఁడు భీమసేన భయ మనునగాధసముద్రమున మునిఁగిన రాధేయుని రక్షింపుఁ డని తమ్ములకుఁ జెప్పుటయు శ్రుతవర్మాదు లగుభవత్సుతు లమ్మరుత్సుతుపైఁ గవిసి శరసందోహ

మడరించుటయుఁ గోపమునం బేర్చి యాహిడింబాంతకుండు వారికిఁ దోడుపడ
వచ్చినయేఁబండ్రురథికులం దెగటార్చి కుండలశిరస్త్రాణోజ్జ్వలం బైనవివిత్సునిమ
స్తకము నొక్కభల్లమునఁ దెగనేసి మహావాతము ద్రుమాఁకుల నె ట్లట్లు వికటుని
సమునిం గూల్చి క్రాథుం జమునిప్రోలి కనిచిన హాహాకారముతో మనమూఁ
కలు కలంగుటయు నంత నందోపనందకు లడరిన వారలఁ బ్రేతరాజుసదనము
నకుఁ బనిచినం జూచి హతశేషు లగునీకొడుకు లవ్వడముడియెదుర నిలువనోడి
విన్నఁబోయినయాననంబులతో విచ్చిపఱచిరి. అంతకు మూర్ఛదేఱి కర్ణుఁడు నీ
కొడుకు లాఱుగు రప్పు డొక్కట్రేల్మిడిం దెగుటకుఁ బరమవిషాదభరితుండై మద్ర
రాజునేర్పునను హంసవర్ణము లగునుత్తమాశ్వములపరమవేగమునను భీమసేనుం
దలపడుటయు నయ్యిద్దఱిసమాగమముఁ జూచి యందఱు నింకఁ గయ్య మెట్టు
లగునో యనితలంచిరి. అయ్యవసరమున వృకోదరుఁడు నీకొడుకులు సూచు
చుండఁ గర్ణునిఁ బటుకాండపటలమునఁ గప్పుటయు నాతండు కనలి తొమ్మిదిభల్ల
ముల నాతనిమర్మములు వ్రయ్య నేసినం బరమార్దితుండై యవ్వాయుసూనుండు
సాయకసప్తకమున రాధేయుని నొప్పించె. అందుల కెంతయు నలిగి క్రూరసర్ప
ముచాడ్పునఁ బెద్దయు రోఁజుచు రాధేయుండు శరవర్షమున భీముం గప్పుటయు
నప్పాండుపుత్రుండు శరవ్రాతమున నాతని నాచ్ఛాదించి సింహనాద మొనరిం
చుటయుఁ గినిసి కర్ణుఁడు పదికంకపత్రశరముల భీముమేను గాఁడ నేసి యొక్కని
శితభల్లమునఁ దత్కార్ముకముఁ ద్రుంచె. అంత భీముఁడు హేమపట్టభూషితం బై
నమృత్యుదండముంబోనిఘోరపరిఘముఁ గొని కర్ణనిధనాకాంక్షియై యార్చుచు
నేసినం గ్రూరశరమున నంగరాజు దానిం దుమురుసేయుటయు భీముఁడు విల్లు
గొని శరజాలంబు నిగిడించుటయు నయ్యిద్దఱిపోగు సింహములపోట్లాటచాడ్పునఁ
బరమభీకరం బయ్యె. అప్పుడు కర్ణుం డేచి మూడమ్ముల వృకోదరుని నొంచినం
గోపించి యాతం డొక్కదారుణనారాచ మరివ్రోసి విడుచుటయు నది కర్ణునిపై
మఱుఁగు వచ్చి వల్మీకప్రవేశతీవ్రం బయినపన్నగముచాడ్పున ధరణిం జొచ్చె.
తత్ప్రహారమునం గడు నొచ్చి రాధేయుఁడు భూమికంపమునఁ బర్వత మెట్టు లట్టుల
కంపించి రోషప్రస్ఫురితుండై యిరువదేనుదొడ్డనారసములు వడముడియొడలం
గీలుకొల్పి యొక్కతూపున సిడముఁ గూల్చి నిశితభల్లమున సారథిం దునుమాడి
యొక్కవాఁడికోలఁ గార్ముకముఁ ద్రుంచి నగుటయు. వృకోదరుఁడు లేనినవ్వు దె
చ్చుకొని గదాపాణియై తేరు డిగి నాఁగటికోలలంబోనిదంతముల నొప్పుమదవే
దండముల నేడునూఱింటిని సమయించె. భూమిష్ఠుఁడయ్యుఁ గిమ్మీరవైరి యిం
ద్రుఁడు వజ్రమున గిరులంబోలె నాకరుల నారోహకకేతనములతోడం గదచే
నడిచినం జిడిముడిపడుచు శకుని బహుళచతురంగములఁ బురికొల్పుటయు గండ

డరి యప్పాండునందనుం డేఁబదిరెండేనుఁగులను నూఱుతేరులనుం బెక్కండ్రఁ గాలుమానుసులను వధియించి గదపండువు సేయుచుఁ దీవ్రప్రతాపాతపంబు గాయుటయు మనమూఁకలు వహ్నిలోఁ బడినచర్మముమాడ్కి ముడుసువడినం జూచి పెక్కండ్రు వెఱచఱచి పఱచిరి.

అవ్విధమున నంతకంతకుం బేర్చుభీమునివిక్రమముఁ జూచి చర్మవర్మవిభాసితులై నయేనూఱురథికులవారిని మూడువేలగుఱ్ఱపురావుతులను శకుని పనిచినం బకాంతకుండు నిజసముద్దండగదాదండమునకు వారల నందఱ బలి చేసిన నప్పు డగ్గదతాఁకునం బొడమినయులివు వ:దగజముల ఱాల ఉవ్వునప్పటియులివున కెనయై భీకరం బయ్యె. అట్లు వారల నందఱం బరిమార్చి తనకు మాఱుమలయువారు లేమిం జేసి కోలుమసంగి వృకోదరుండు రథాంతర మారోహించి రాధేయునిపై నడరుటయు నయ్యభంగపరాక్రముఁడు నంతకుమున్న ధర్మరాజును మార్కొని శరజాలంబుఁ గురిసి సారథిం దెగటార్చి యుండుటయుఁ దీవ్రక్రోధభరితుండై యాకిమ్మీరవైరి మార్గణగణంబుల నడరించి కర్ణుతేరు గప్పి రోదసీకుహరంబు శరమయముఁ గావించె. భీముఁ డట్లు తనపై నడరినం గినిసి యంగరాజు క్రమ్మఱి యతనిమీఁదికిఁ గవిసి వాలంపగములం బరఁగించుచుండ సాత్యకి తాను భీమునిఁ దలకడచి కర్ణుం దాఁకిన నతండును మార్కొనుటయు నయ్యిద్దఱుదారలశరసంపాతంబునం జేసి గగనమండలము నీరంధ్ర మగుటయుఁ జీఁకట్లు గ్రమ్ముటం జేసి సూర్యకిరణప్రచారము చొప్పడనికారణంబున దిక్కులు విదిక్కులు నదృశ్యము లగుటయు మనవారలును వారివారలునుం గన్పట్టకున్నంత నయ్యిద్దఱు మేటిమగలు సూర్యప్రభము లగుదివ్యబాణము లడరించి యించుకవెలుంగుఁ గావించినం గృపకృతవర్మాశ్వత్థామలు కర్ణునికిఁ దోడ్పడినం బాండవవీరులు పైపై నడరుదు నిరువాఁగునుం బెరసి కడిందిమగంటిమి వాటించి చలము డింపక పితృమాతృనామములను గులగోత్రములను నడియాలములనుం జెప్పికొనుచు సింహనాదబంధురంబుగాఁ గోల్తల చేసి యొండొంటం దలపడి పోక పెనంగుటయు మధ్యాహ్నం బయ్యె. అట్టిమధ్యాహ్నసమయమున మహానదీసంగమముమాడ్కి నత్యంతఘోరప్రకారంబై సైన్యద్వయము సాగరద్వితయముచాడ్పున నెంతయు ఘూర్ణిల్లుచుండ వీరి కెల్లరకుం గాలావసానం బయ్యె నని యేను దలంచితి. అవ్విధమున నిరువాఁగునుఁ బెరసి చతురంగములు తమతమజాతిం దలపడి పోరుటయు నితరేతరపిషాణప్రహారములను రథికబాణసంపాతములను రావుతులచేతికైదువులపోట్లను గాలుమానుసులయీఁటెలవ్రేట్లను మర్మములు దూల జిఱ్ఱనం దిరుగుచుఁ బ్రబలఘీంకారము లొనర్చుచుఁ దిరుగుడువడి వజ్రాహతము లయిన గిరిశిఖరములకరణిం గూలునేనుంగులును, వేదండశుండాదండప్రహారముననను

మహారథులవాలమ్ములతాఁకునను బదాతిప్రాసప్రహారమునను గడు నొచ్చి బమ్మరిం
చియుఁ దిరుగుడువడియుఁ దెరలియు వ్రాలియు వ్రీలియు నానాప్రకారంబులై
నఘోటకంబులును, గజప్రహారమునను సాదిసమ్మర్దమునను రథికశరసంపాతము
నను గేతనరథ్యసారథిసహితంబుగాఁ గూలి వికలంబులైనయరదంబులును, మహా
రథులవాఁడితూపులతాఁకునను రథసమ్మర్దమునను గుంజరఘోటకసంక్షోభము
ననుఁ గాలుసేతులు విఱుగ దీనదశాప్రాప్తులై వెఱచఱచి పఱచుచుఁ గోత్రనా
మములఁ గీర్తించుచుఁ దండ్రులఁ దాతలఁ గొడుకుల బాంధవులనుం జీరుచుఁ
బంచాస్యపన్నగములంబోనిభుజదండములు దెగి పడఁ బుడమిం బడి పొరలియుఁ
దెరలియుఁ గలంగియుఁ దొలంగియు వివిధబాధలం బడి మడియుకాలుమానుసు
లునై యత్యంతబీభత్సంబైనసంగ్రామభూమీతలంబున నెగసినపాంసుపటలంబు
నరతురగద్విరదగాత్రనిస్సరద్రుధిరప్రవాహమున నడంగుటయుఁ గ్రుంగినరథచ
క్రముల నీడువలేక రథ్యములీడిగిలంబడుటయు మనరథికులు ఱిచ్చపడియుండ సా
త్యకిప్రముఖులైనపాండవవీరులు గండడరి మనమూఁకలఁ జెండాడుటయు రక్త
పానమాంసఖాదనలోలుపంబు లయినక్రవ్యాదభూతగణములకు సాంద్రానంద
మొదవె.

అర్జునుఁడు సంశప్తకులం దలపడి విజృంభించుట.

ఇవ్విధమున నిక్కడఁ బరమఘోరంబైనపోరు సెల్లుచున్నంత నక్కడ
సంశప్తకనారాయణగోపాలురం దలపడి కవ్వడి పటుపరాక్రమముఁ జేయుచుండ
గాండీవజ్యాఘోషణంబు భీషణంబై వినంబడియె. తత్ప్రకారంబు సెప్పెద వినుమని
సంజయుఁడు ధృతరాష్ట్రునకు వెండియు నిట్లనియె. సంశప్తకులు సవ్యసాచిని మా
ర్కొని కాండజాలముఁ గురియుటయు నుక్కునం బేర్చి సుశర్మ పార్థుగాత్రమున
దశవిశిఖములను జనార్దనుదక్షిణభుజమున శరత్రయమునుం గీలించి యొక్కభల్ల
ముఁ గేతుదండముపై నేయుడు నందలికపి ఘోరారావము సేయుటయు నయ్యా
లివునకు సంశప్తకసైన్యము దైన్యముఁ జెంది వెఱచి ఱిచ్చపడి నానాకుసుమరం
జిత మగుచైత్రరథవనమువిధమున నొప్పుచున్నంతఁ గొండొకవడికిఁ దెలిసి సంశ
ప్తకులు జలధరములు పర్వతముంబోలె శరపరంపరలు గురిసి కప్పుచు సవ్యసాచి
తేరు నిగ్రహించి యార్చినం బేర్చి కొందఱు వాసుదేవార్జునులఁ బట్టికొనం గడం
గుటయుఁ బుండరీకాక్షుండు మత్తమాతంగము హస్తిపకులను శుండాదండమున
నెట్టు లట్టుల భుజముల విదిర్చి నేలం గూల్చుచున్నంతఁ గ్రోధసంరంభసముద్రి
క్తుండై పాండవమధ్యముం డోమహాత్మా, దారుణకర్మమునకుఁ దొడరినసంశప్త
కులం జూడుము. ఇట్టులు తేరు నిగ్రహించినం గండడరి పోరఁగ నేను దక్క
నొండొక్కమగండు వలంతి గాఁ డని జనార్దనునకుఁ జెప్పి దేవదత్తం బొత్తుటయు

మురాంతకుఁడు పాంచజన్యముఁ బూరించె. దిక్తటముల నవియింపఁ జాలినయా ఘోరనాదము విని సంశప్తకులు వెఱచి పఱచుటయు విష్వక్సేనుండు మహేంద్రుఁడు తారకాసురసంగరమున దైత్యుల నెట్లట్లు నాగాస్త్రంబున వారలకాళ్లం గట్టుటయు వా రడుగు వెట్టఁజాలక యుడిపోనిచలంబు పెల్లునం జేసి నానాయుధముల నడరించిరి. అందుల కల్గి ఫాల్గునుం డాపాదబద్ధులను శరానీకంబునఁ బిలుకుమార్చుచున్నంతఁ బరమామర్షభరితుండై సుశర్మ గారుడాస్త్రముఁ బ్రయోగించినం గరుడములు పెక్కులు దానం బొడమి పాముల మ్రింగఁ దొడంగిన నాభుజగములు వారికాళ్ళుల విడిచి పఱచె. అట్లు నాగాస్త్రవినిర్ముక్తులై సంశప్తకులు వివిధశస్త్రముల నిగిడించుటయు నర్జునుండు నిజశరములఁ దదస్త్రముల నడఁగించి వారల నొక్కట్రేవ్మోడిలోన నుక్కడంచుచున్నంత నెంతయుం గనలి సుశర్మ యొక్కవాఁడియమ్ము గాండీవిఱొమ్మునం గ్రుచ్చి మఱియు మూఁడమ్ముల బిట్టేయుటయు నయ్యర్జునుండు సోలి తేరిపయిం జదికిలఁబడుటయు వారు పార్థుఁడు తెగియెఁ దెగియె నని యఱచి సింహనాదములు గావించిరి. శంఖభేరీమృదంగాదివాదిత్రనిస్స్వనంబును బెలుచ నడరె. అంతఁ గొండొకవడికిఁ దెలిసి సవ్యసాచి కోపవిస్ఫురితుండై యైంద్రాస్త్రము సముద్దీపితముఁ గావించిన నది ఘోరాకారమునం బేర్చి బహుళబాణజాలమయంబై దెసలెల్ల నెఱసి యేట్లాడుటయుదానం బదివేవురు తెగుటయు హతశేషులైనసంశప్తకులును నారాయణగోపాలురును వెఱచఱచి చిచ్చువడి యమ్మేటిమగనిం దాఁక నోపినమగఁ డొక్కఁ డేనియు నగపడమిం జేసి దీనదశకు వచ్చినం బొగలేనియగ్నిహోత్రునిచాడ్పునఁ దేజఃప్రజ్వలితుం డైనయవీరవర్యునిపై నలిగి పదివేవురురథికులును మూఁడువేల యేనుఁగులవారును ధనంజయుం జంపుదు మతనిచేఁ జత్తు మింతియకాని యొండు లేదని కృతనిశ్చయులై యడరినం గడిందిమగంటిమిం బేర్చి విష్వక్సేనుఁడు కవియుటయుఁ బోరు ఘోరం బయ్యె.

ఇక్కడఁ గృపకృతవర్మకర్ణాశ్వత్థామసౌబలోలూకులును దుర్యోధనదుశ్శాసనాదు లగుభవత్పుత్రులును బాండవభయార్దితంబై సాగరమధ్యమున నవిసినకలంబుమాడ్కి వికలం బైననిజసైన్యముఁ జూచి భీరులకు సంత్రాసంబును శూరులకు సముల్లాసంబునుం గూర నడరి మిడుతలబారులట్టులు మింట శరజాలముఁ బరఁగించినం గినిసి శిఖండి కృపునిపైఁ గవిసి శరవర్షముఁ గురిసిన నమ్మహాస్త్రవిదుఁడు తదీయబాణజాలము నడఁగించి కోపించి శిఖండిపై దశవిశిఖము లేయుటయు నప్పాంచాలరాజపుత్రుండు సాయకసప్తకముఁ బరఁగించుటయు నాతండతనిగుఱ్ఱముల నమయించి సారథిం బరిమార్చి తేరు నుగ్గు గావించె. అట్లు విరథుండై శిఖండి వాలును బలకయుం గొని తటాలున రథము డిగ్గి యాత్రబాహ్మ

ణునిపైఁ గవిసిన నాశారద్వతుండు శరవర్షమున నతనిం గప్పుటయు నప్పాంచా
లవరుండు ఱాలు దేలినవిధమున నిశ్చేష్టితుం డయ్యె. తదవస్థుం డైనశిఖండినిఁ
గాంచి యగ్గలించి యగ్గౌతముం దలపడి రయమున ధృష్టద్యుమ్నుఁడును యుధి
ష్ఠిరుఁడును ద్రౌపదీనందనులును నకులసహదేవులును భీమసేనుఁడును గరూశకేక
యసృంజయులును నరుగుదెంచుచున్నంతఁ గృతవర్మ ధృష్టద్యుమ్నుని నశ్వత్థామ
యుధిష్ఠిరద్రౌపదేయులను దుర్యోధనుండు కవలను గర్ణుఁడు భీమసేనకరూశకేక
యసృంజయాదులను మార్కొని నిలువరించుటయుఁ గృపుఁడు తనకు మాఱు
మలయువారు లేమింజేసి బహుళశిలీముఖముల నిగిడించినం గృపాణంబున శిఖండి
వానినెల్లఁ దుమురుసేయుటయు నలిగి కృపుఁడు పలకం జిదుపఱులు గావించు
టయు నప్పటికి నుడివోనిక్షాత్రమునం బేర్చి యప్పాంచాలవరుండు కృపాణపాణి
యై కృపాచార్యునిమీఁదికిఁ గవియుటయుఁ జిత్రకేతుపుత్త్రుం డైనసుకేతుండు
శిఖండిని దలకడచి కృపునిఁ దాను దాఁకిన నాతెఱఁగు గని శిఖండి తొలంగి
చనియె.

## కృపాచార్యుఁడు సుకేతుఁ డనుపాంచాలకుమారుం జంపుట.

అట్లు సుకేతుఁ డగ్గలిక మెఱయం గృపాచార్యుం దలపడి తొమ్మిదివాల
మ్ము లేసి తోన డెబ్బదితూపులను మూఁడువిశిఖములను నేసి విల్లు నడిమికిఁ ద్రుంచి
సూతునిమర్మములు వ్రయ్య బలుతూపులు నిగిడించుటయు నాభూసురోత్తముఁ
డధికరోషరూషితుండై యొండుకోదండం బెత్తి ముప్పదివాఁడితూపుల సుకేతుని
మర్మముల నాటుటయు నప్పాంచాలకుమారుండు భూకంపమునఁ బర్వత మెట్టు
లట్టులు ప్రచలితసర్వాంగుఁడై సోలుటయు నప్పుడే కృపుఁ డొక్కక్షురప్రమున
శిరస్త్రాణసముల్లసితం బైనవానిమస్తకముఁ దఱిఁగిన నాశిరంబు డేగగొనినమాం
సఖండముచాడ్పున నేలం బడుటయుఁ దోన యట్టయుం దేరినుండి పడినం జూచి
యచ్చటిపాండవసైనికులు వెఱచి పఱచిరి. ధృష్టద్యుమ్నుఁడు కృతవర్మను
దాఁకి నిలునిలుమని యదల్చుటయుఁ దోన యతఁడు నడరిన వారిపోరు మాంస
కాంక్షులైనడేగలపోట్లాటచాడ్పునఁ గొండొకవడి యనుక్షణసమేధమానపరస్ప
రస్పర్థానుబంధబంధురంబై యుండునంత ధృష్టద్యుమ్నుఁ డేత్తెఱ మెఱసి తొమ్మి
దియమ్ము లతనిఱొమ్మునం గీలించుటయు దృఢాభిహతుండుగావునఁ గృతవర్మ
యెంతయుం గోపించి యప్పార్షతుతేరు రథ్యసారథిసహితంబుగా శరాసారమునం
గప్పుటయు నంబుదపటలప్రచ్ఛన్నుఁ డైనభాస్కరునిభంగినిఁ జూడ నొప్పుచు
ధృష్టద్యుమ్నుఁడు గడుం గనలి కడిందిమగంటిమిం బేర్చి శస్త్రాస్త్రవర్షముఁ గురి
యుటయు హార్దిక్యుఁడు మార్గణపరంపరలఁ బరఁగించుటయుఁ గోపాటోపదీపితుం
డై పాండవసేనానాయకుండు నిశితసాయకమున నతనిసారథితలఁ దెగనేసినం

గౌరవులు సింహనాదమేదురముగా నడరుటయు దారుణం బై నరణంబు సెల్లె. అశ్వత్థామ సాత్యకిరక్షితుఁ డై నయుధిష్ఠిరుని ద్రౌపదేయులనుం దాఁకి లాఘవము మెఱయ వివిధమార్గకౌశలము నెఱయ దివ్యాస్త్రజాల మడరించి రోదసీకుహరంబుఁ గప్పిన నాచార్యపుత్రశరప్రచ్ఛన్నంబై నభోమండలము పసిఁడిజాలరులనెప్పారునేలుకట్లం బొల్చుపోల్కిం దేజరిల్లుటయు బాణజాలనీరంధ్రతం జేసి మేఘచ్ఛాయచాడ్పునం జూడ నొప్పె. అవ్విధమున శరాసారము సాంద్రమగుటయు గగనచరభూత మొక్కటేనియు నేలకు డిగ నించుకేనియు నెడము లేకుండుటయు నత్యంతాశ్చర్యం బయ్యె. ద్రోణనందనునిపరాక్రమమున కెంతయు నివ్వెఱఁగుపడుచు ధర్మరాజసాత్యకులును ద్రౌపదీనందనులును బాంచాలవీరులును నెంతయుం గడంగి మృత్యుభయము మాని యాభూసురసూనుం దలపడి సాత్యకి యిరువదియేడింటను మఱియు నేడింటను ధర్మరాజు డెబ్బదిమూఁడింటను బ్రతివింధ్యశ్రుతకీర్తిశతానీకులు వేఱువేఱ యేడింటను శ్రుతకర్మ మూఁడింటను శ్రుతసోముఁడు తొమ్మిదింటను దక్కినవారు పెక్కమ్ములను నొంచినం గోపించి యాశారద్వతీసుతుండు క్రూరపన్నగము చందమునఁ బెద్దయు రోఁజుచు సాత్యకి నిరువదేనింటను శ్రుతకీర్తిశతానీకులఁ బ్రత్యేకంబ తొమ్మిదింటను ధర్మరాజశ్రుతసోముల వేఱువేఱ నైదింటను శ్రుతకర్మ నెనిమిదింటను బ్రతివింధ్యుని మూఁడింటను దక్కినవారల నందఱనుఁ బ్రత్యేకంబ రెండింటను నొప్పించి శ్రుతకీర్తివిల్లు దునిమె. అంత నొండువిల్లు గొని యాతండు ద్రౌణిపయిం బటుప్రదరముల మూఁడింటిని మఱియుం బలుతూపులను నడరించినం గోపించి భారద్వాజనందనుం డక్కుమారుపయిం గాండజాలంబు నిగిడించి ధర్మరాజువిల్లు దునిమి నగుచు శరత్రయము బిట్టేయుటయు యుధిష్ఠిరుఁ డొండుకోదండ మెత్తి ద్రౌణిబాహువక్షఃప్రదేశముల డెబ్బదితూపు లడరించె. అప్పుడు సాత్యకి యలిగి యర్ధచంద్రమార్గణమునం గలశసంభవసంభవుకార్ముకంబు ఖండించినం గినిసి యాతండు శక్తిప్రహారమున సాత్యకిసారథిం గూల్చి కార్ముకాంతరముఁ గొని శరజాలము నిగిడించుటయు గుఱ్ఱములు సాత్యకితే రీడ్చికొని పఱచె. అట్టియెడ యుధిష్ఠిరాదు లయ్యాశ్వత్థామపై నడరుటయు నబ్బలుముగండు పటుశరాసారములఁ గురియించి వేసవిం బేర్చినకార్చిచ్చు శుష్కతృణపుంజముల నెట్టు లట్టుల నీఱుసేయుటయుఁ దిమినామక మగుమహామత్స్యము కలంచిననదీముఖముచాడ్పున వికలం బయిననిజానీకంబుఁ జూచి ధర్మరా జతనివిక్రమంబునకు వెఱచి తమవారెల్ల నతనిచేఁ దెగుదు రని యూహించి రోషావేగభరితుండై రయమున నతనిపై నడరి యోపురుషవర్యా, నీకుఁ బ్రీతియుఁ గృతజ్ఞతయు లేనట్లు తోఁచెడి. కాదేని నన్నె వధింపఁ గడంగుదువె. తపోదానాధ్యయనాదులు బ్రాహ్మణధర్మం బనియు యుద్ధము

క్షత్రియధర్మం బనియు ధర్మశాస్త్రాచార్యులు విధించియుండ నాధర్మమునెల్ల విడిచి నీవు బ్రాహ్మణబ్రువుండవై యిట్టిఘోరకృత్యమునకుఁ దొడంగితివికదా. ఐనం గానిమ్ము. నీ వేమి చేయంగలవు ? కౌరవు లందఱు చూచుచుండ నిన్ను గెల్తుము. నీచేనయినది చేయుమనుటయు నాభారద్వాజనందనుం డలంతినవ్వు నెమ్మొగమ్మున నంకురింప యుక్తమును దత్త్వమునుం బర్యాలోచించి యేమియు నుత్తరం బీక కాలాంతకునిపగిది రోషభరితుండై పటుశరాసారముఁ బరఁగించు టయు నతనిమునుమున నిలువఁజాలక ధర్మరాజు వానిం గ్రేడించి మనమూఁ కలపై నడరె.

కర్ణుఁడు కరూశకేకయసృంజయపాంచాలాదిపరివృతుం డైనభీమసేనుం దాఁకి శరాసారముఁ బరఁగించి యప్పాండవవరుండు సూచుచుండ వారల వధిం చుటయు భీముఁడు వానిం గ్రేడించి కౌరవసైన్యముపై నడరి కోత్తల సేయు టయు నర్జునుఁడు సంశప్తకులపైఁ గవిసి యవక్రవిక్రమాటోపంబు దీపింప నేట్లాడుటయుఁ బ్రదేతాగ్నితుల్యు లైనయమ్ముగురుదొరలవీర్యమునం జేసి నీదుర్మం త్రమునం బుట్టినయాకయ్యమున నక్కడ నిక్కడను బెక్కండ్రురాజులు తెగిరి. దుర్యోధనుఁడు నకులునిపై నడరి తొమ్మిదియమ్ము లతనియంగములను బలుతూ పులు తురంగగాత్రములను నూనేసి యొక్కకుప్పెకోల సహదేవునిసిడముఁ గూ ల్చినం గోపించి నకులుఁడు సాయకసప్తకమును సహదేవుఁ డాశుగపంచకమునుం బరఁగించినం గోపదీపితుండై దుర్యోధనుఁడు వారల వేఱువేఱ మైదేసియమ్ముల నొప్పించి భల్లద్వయమునఁ దదీయకార్ముకద్వితయముఁ దునిమి డెబ్బదిమూఁడు వాఁడితూపు లేయుటయు వారు శక్రచాపతుల్యము లైనవిండ్లఁ గొని దేవకుమా రులరీతిఁ బొల్చుచు మహామేఘములు పర్వతముంబోలె దుర్యోధనుం గాండజాల మునఁ గప్పుటయుఁ బ్రత్యగ్రసముదగ్రతాసామగ్రిం బేర్చి భవత్తనయాగ్రజుండు మండలీకృతకోదండమునఁ గాండజాలం బరిఁబోసి నిగిడించి యెక్కడఁ జూచినం దనబాణములకా నొనర్చినం జూచి మాద్రేయులు కోపభరితులై కాలాంతకుని రీతి ఘోరాకారవిస్ఫూర్తి మెఱయుటయు దుర్యోధనుబారిం బడి కవలు మృత్యు వాతఁ బడినరీతియగుదురని తలంచి ధృష్టద్యుమ్నుఁడు వారలం దలకడచి తాను సుయోధనుం దాఁకి శరనికరం బడరించుటయుఁ బరమక్రోధభరితుండయ్యు స్మేర వదనుండై దుర్యోధనుం డఱువదియేనమ్ముల నతనిపయిం గీలించి శరశరాసనక రావాపముల నిశితక్షురప్రములఁ దునిమినం బరమసంరంభావష్టంభసముల్లసితుం డై ధృష్టద్యుమ్నుఁడు కన్నుఁగవఁ గెంపు గదుర నొండువి ల్లెత్తి శ్వసత్పన్నగ ములం బోనిపంచనారాచము లడరించిన నవి కాంచనమయం బైనసుయోధనకవ చము వ్రచ్చిన నెత్తుటఁ జొత్తిల్లి యక్కురుక్షమాధ్యక్షుండు కుసుమితాశోకభూ

రుహముచాడ్పునఁ దనరె. దాన నెంతయు నెచ్చి పేర్చినకోపమున రారాజు ధృష్ట
ద్యుమ్ను విల్లు దునిమి పరమరయమునం బేర్చి దశవిశిఖములఁ దదీయభూమిమధ్య
మున నాటిన నవి విరిసినతమ్మిపూవుపయిం గాలిలు తేంట్లచాడ్పునఁ దేజరిల్లె. అంతఁ
గార్ముకాంతరం బెత్తి వడిం బేర్చి షోడశభల్లముల దుర్యోధనుగుఱ్ఱములం జంపి
మైదింట సారథినిఁ దునుమాడి యొక్కభల్లమున విల్లు నునిమి రథకేతనాతపత్త్రి
శక్తిగదాఖడ్గములఁ ద్రుంచినం దపనీయాంగదవిచిత్ర మగుమణిమయనాగకేతన
మునేలం గూలుటయుఁ జూచుచున్నరాజులు బిచ్చవడుటయు సోదరులు కావలి
యై చనుదెంచుచున్నంత దండధారుఁడు తనతే రెక్కించుకొని యతనిం దొలఁ
గించె. అప్పుడు కర్ణుఁడు సాత్యకిని గెల్చి ధృష్టద్యుమ్నునిపైఁ గవిసిన నాశై
నేయుం డుడివోనిచలంబునం బేర్చి పతిహస్తింబృష్ఠభాగమునఁ గొమ్ములఁ బొడుచు
మత్తద్విపముచందమున నారాధేయుని వెన్నడించి వాలంపగములఁ బరఁగిం
చిన నలుక గదుర నిక్కడియక్కడియోధులు చలంబు పెల్లునంజేసి గండడరి పిలు
తివియక మిథస్సంప్రహారమునకుఁ దొడరుటయు నామధ్యాహ్నమునఁ బాంచా
లురు త్వరితగతిం దనరి విజిగీషామనీషంజేసి పులుఁగులు మాఱి నెట్టు లట్టుల
యారాధేయుం జుట్టుముట్టిరి. అందులకుఁ గడుం గినిసి వైకర్తనుండు నిశితశర
ప్రహారసముదగ్రు లయినవారల నందఱను మాఱుకొని వ్యాఘ్రకేతుఁడు సుశర్మ
చిత్రుఁ డుగ్రాయుధుఁడు జయుఁడు శుక్లుఁడు రోచమానుఁడు సింహసేనుఁ డనునె
నమండ్రను నెనిమిదివాలమ్ముల నొప్పించి మఱియుం బలుతూపులఁ బెక్కండ్ర
నొనేసి జిష్ణుఁడు జిష్ణుకర్ముఁడు దేవాపి భద్రుఁడు దండుఁడు చిత్రుఁడు చిత్రా
యుధుఁడు హరి సింహకేతుఁడు రోచమానుఁడు శలభుఁడు ననుచేదివీరుల వధి
యించి తదీయశరనికరపరిపీడితగాత్రుఁడు గావున నెత్తుటఁ జొత్తిల్లి రౌద్రాకారవి
స్ఫూర్తి మెఱసి కరిఘటలపైఁ గవిసి వాలంపగములఁ బరమరయమునఁ బరఁగించి
యన్యోన్యుఁగులఁ జాఁపకట్టువడం జేసి క్రూరసింహము మృగగణముల వధియించు
విధమునను దవానలము శుష్కకాననముల దహించు తెఱంగునను దనమును
బయలు సేయుటయు మనవారు భీష్మద్రోణులపోరు నిట్టిది కాదని పలికియు
వెఱఁగుపడియు నుల్లసిల్లిరి. పెక్కు లేల? రాధేయునికంటె కగపడిన పాంచా
లాదియోధులలో నెక్కఁడేనియు బ్రదికిపోవఁ జాలఁడయ్యె. అప్పుడు తమవార
లట్లు పెక్కండ్రు మడియుటకుఁ జింతాభరమున నడరి ధర్మరాజును ధృష్టద్యు
మ్నుఁడును ద్రౌపదేయులును మాద్రేయులును శిఖండియు జనమేజయుఁడును
సాత్యకియు బహుళపాంచాలప్రభద్రకసైన్యములతోడ నారాధేయునిపైఁ దల
పడిన నబ్బలుమగండు గండడరి గరుత్మంతుఁడు పన్నగములంబోలె వారలఁ బలు
దెఱంగుల నొప్పించిన నాయుద్ధము దేవదానవసమరముచందమున ఘోరరూపం

బయ్యె. అట్లు గాఢధ్వాంతపటలవిధ్వంసనోదగ్రుం డైనమార్తాండునిపగిదిఁ బర మతేజోవిస్ఫురితుం డై కర్ణుఁడు పాండవానీకముల నేలకుఁ గోలకుఁ దెచ్చుచున్నంత బకాంతకుఁ డతనిం దాఁకి యమదండోపమశరనికరములు నిగిడించి బాహ్లీక కేకయమాత్స్యవాసాత్యమద్రసైంధవానీకములం గనుపుకొట్టుచు బహుళచతు రంగబలములఁ బరిమార్చినం గయ్యంపునేల యెక్కడఁ జూచినను రథావయవ ఖండములను గజవాజినరగాత్రశకలములను నగమ్యంబై రుధిరనదీప్రవాహసాం ద్రంబై కన్పట్టుటయు మనబలము కృతవ్రణంబు గావున నిరుత్సాహంబై యత్యం తదీనంబై నిశ్చేష్టితంబై నిష్ప్రభంబై శరదర్ణవముమాడ్కిం జూడ నొప్పె.

అట్లు కర్ణుఁడు పాండవానీకంబును భీముఁడు కౌరవబలంబును నేలకుం గోలకుఁ దెచ్చుచుండ సంశప్తకబలంబుఁ జెండాడుచున్నసవ్యసాచి యచ్యుతున కిట్లనియె. జనార్దనా, యిదె సృంజయసైన్యమెల్ల విఱిగి పఱచుచున్నది. వీరె సంశప్తకులు నావాఁడితూపుల నాఁగఁ జాలక సింహశబ్దము విన్నమృగములట్టుల పఱచుచున్నవారు. కేతనహస్తికక్ష్యావిస్ఫూర్తి దనరఁ గర్ణుఁడు రాజమధ్యమున వీర్యదుర్దాంతుఁడై తిరుగుచుండ వాని నందఱును గెలువ నోపరు. అమ్మేటిమగని విక్రమాటోపంబు నీ వెఱుంగుదువుగదా. వానిం ద్రెగడించి యవ్వీరుండు మన మూఁకలఁ దెరలించునెడకుఁ దేరు వఱపుట మేలని నామతంబు. నీ వేమి తలం తువో యనియడిగినం గృష్ణుండు నవ్వుచు నర్జునా, కౌరవులం బిలుకుమార్పు మనిపలికి శ్వేతవాహనములఁ దోలుటయు మేఘస్తనితనిర్హ్రాదిం బెసంగ నా స్యందనము చలత్పతాకాభిరామంబై యంతరిక్షగతం బగువిమానంబుచాడ్పునఁ బరమరయమున మనబలంబుఁ జొచ్చుటయు యజ్ఞపరులు విధియుతంబుగఁ బిలువ యాగశాలకు వచ్చినయశ్వినులచందమున రణాధ్వరవేదికిఁ జనుదెంచి వాసుదేవార్జు నులు త్రొక్కవడ్డపాములపగిదిఁ బరమకోపాటోపదీపితులై యుండఁ బాశపాణి యగునంతకుమాడ్కి ఘోరాకారవిస్ఫురితుం డైనగాండీవపాణిం జూచి దుర్యోధ నుండు గ్రమ్మఱ సంశప్తకగణములఁ బురికొల్పుటయు వారు వేయితేరులు మున్నూ ఱేనుఁగులు పదునాలుగువేలగుఱ్ఱములు రెండులక్షలకాల్బలంబునుం గొని కిరీ టిపై నడిరి శరవర్షముఁ గురియుటయుఁ బరబలార్దనుం డైనయమ్మేటివిలుకాఁడు రౌద్రమునం బేర్చి కనకపుంఖములు విద్యుత్ప్రభములు నగునానాశిలీముఖములం బరఁగించుటయు నంతరిక్షమెల్ల గాండీవనిర్ముక్తకాండజాలపరీతంబై భుజగనికర నిబిడం బైనరీతిం గన్పట్టె. అర్జునుఁ డమ్ముల సంధించునెడం బొడముఘోరనినా దంబు విని యందఱును భూమ్యాకాశములును దిక్కులును బర్వతంబులును బగి లెడినో యనితలంచిరి. అవ్విధమునఁ గోలుమసంగి ధనంజయుండు పదివేవురు సంశప్తకవీరుల వధియించి కాంభోజానీకంబుఁ జొచ్చి తలలు దఱిగియు భుజముల

నఱికియుఁ గ్రైదువులు పొడిచేసియుఁ బ్రతికూలవాతము విఱిచినబహువిటప
పాదపములమాడ్కిఁ దత్సైనికులం జెండాడుచున్నంతఁ గండడరి కాంభోజసుద
క్షిణానుజుండు కిరీటిపై శరాసారంబుఁ గురిసె. అందుల కలిగి వివ్వచ్చుఁ డర్ధచం
ద్రశరద్వయమునఁ దదీయభుజద్వయమును నిశితక్షురప్రమునఁ బూర్ణేందువదనస
ముల్లసితం బయినశిరమునుం దఱుగుటయు వజ్రాభిహతం బైనమనశ్శిలాగిరిశిఖ
రముకైవడి నక్కాంభోజనాథానుజుండు నేలంబడుటయుఁ దదీయసైనికులుపెక్కం
డ్రు బహుళచతురంగబలములతోఁ బాండవమధ్యముం దలపడిన నబ్బలుమగండు
కోపదీపితుండై తదీయసైన్యము నుగ్గు గావించి మొన చించి ఘోరప్రకా
రము చేసినం జూచి ద్రోణసుతుండు పరమభీషణంబుగ జ్యాఘోషణంబు నిగి
డించుచు భాస్కరుఁడు నిజమయూఖములంబోలె నెల్లెడలఁ బటుప్రదరపరంపరలఁ
బరఁగించుచుఁ గ్రోధవివృత్తాక్షుండై యంతకాలమునఁ గ్రోధసముద్ధురుం డైన
దండపాణిమాడ్కి రౌద్రవిస్ఫురితుండై తీవ్రప్రతాపాతపంబు గాయుటయు నతని
మునుమునఁ గాలు నిలువనేరక పాండవానీకంబు విచ్చిపఱచె. అంత నయ్యశ్వ
త్థామ యెంతయు నేచి శరపరంపరలం గృష్ణార్జునులఁ గప్పి ఱిచ్చపఱచుటయు
సిద్ధచారణాదులు గుంపులుగూడి లోకములకు మే లయ్యెడు మని పలుకుచుండిరి.
ఏమి చెప్పుదు నాసంగ్రామమున నశ్వత్థామపరాక్రమ మేకయ్యమునను నెవ్వరి
యెడనుం జూడమైతిమి. అతండు జలదమధ్యవిద్యుల్లతాసమం బైనగోనయమ్ము
సారించునెడం బొడమినయులివును దదీయదారుణసింహనాదమును వినఁజాలక
పెక్కండ్రు వెఱచఱచి పఱచిరి. అత్యంతక్షిప్రకారియు దృఢహస్తుఁడు నగున
య్యర్జునుండును నతని విక్రమంబు సూచి ఱిచ్చవడి తనపరాక్రమము విహత
మయ్యె నని మనమునఁ దలంచుచుండె. అట్టిదారుణరణమున ద్రోణసూనుప
రాక్రమ మంతంత కగ్గలం బగుటయు సవ్యసాచి విక్రమము తఱుఁగుటయుం
జూచి రోషరూషితుండై కన్నుల నిప్పులు రాల నయ్యాచార్యనందనుం జూచి
కిరీటిం బలుమాఱు గాంచి జనార్దనుండు ప్రేమబంధురముగ నిట్లనియె. అర్జునా,
గురుపుత్రుఁడు నేఁడు నిన్ను మిగులుచున్నతెఱంగు గన్పట్టుచున్నది. నాకుం
జూడ నిది యెంతయు నాశ్చర్యకరం బయ్యెడి. భుజబలవీర్యములు నీకుఁ దొల్లిం
టియట్ల యున్నట్లు తోఁచునే? గురుపుత్రుఁడని సమ్మానించుటనేమొ యతండు
గండడరుచున్నవాఁడు. ఉపేక్షింపవలదు. ఉపేక్ష కిది తఱి గాదని దామోద
రుండు పలికిన నేచి సవ్యసాచి పరమరయమునఁ జతుర్దశభల్లప్రయోగమున గు
రుసుతకార్ముకకేతనాతపత్రశక్తిగదల ఖండించి నిశితవత్సదంతములు పెక్కులు
జత్రుదేశమునం గీలించుటయు నశ్వత్థామ మూర్ఛిల్లి కేతుదండ మూఁతగొ
నుటం జూచి సారథి తేరు తొలంగించె. అంత నివాతకవచాంతకుఁడు నీకొడుకు

సూచుచుండ మనమూఁకలపై నడరి పటుప్రదరనికరములఁ బరఁగించి యనీకముల నెల్ల నేలకుఁ దెచ్చె. అవ్విధమున నీదుర్మంత్రమునఁ బుట్టినయాకయ్యమున సవ్యసాచి సంశప్తకులను వృకోదరుఁడు కౌరవులను రాధేయుఁడు పాంచాలురనుం బిలుకుమార్పుటయు నెక్కడఁ జూచిన ఘోరకబంధమయంబై సంగ్రామరంగము చూపట్టె. యుధిష్ఠిరుఁడును రాధేయాదులయమ్ములతాఁకునంజేసి తీవ్రవేదనాభరితుండై క్రోశమాత్రము తొలఁగి చూచుచుండె.

అశ్వత్థామ ప్రతిజ్ఞ చేయుట.

అప్పుడు దుర్యోధనుఁడు కర్ణునిఁ దఱియ నరిగి సైన్యమధ్యమున నిల్చి యోరాజులారా, యపావృతస్వర్గద్వారము మనకు యదృచ్ఛాసంప్రాప్తం బయ్యె. సుఖవంతులైనక్షత్రియు లిట్టిరణముఁ బడయుదురు. తమకుఁ దమకుఁ బోలినవీరులతోడఁ బోరుట యిప్పుడుత్తమక్షత్రియుల కభిమతంబు కావునఁ బోరఁ బాండవుల గెలిచి స్ఫీతరాజ్యముఁ బడయుటయొండెఁ గడిందిమగంటిమిం బేర్చి యోపినకొలంది పోరిపోరి తుది వారిచేఁ దెగి వీరలోకము సాధించుటయొండె నిప్పుడు సమకూఱుట తప్ప దనుటయు దుర్యోధనువచనము విని రాజులు పరమప్రహర్షభరితులై సింహనాదము లొనర్చిరి. వివిధవాద్యరవము పెల్లెసంగె. అంతలోన మూర్ఛదేఱి యశ్వత్థామ మనవారికిఁ బ్రమోదంబుఁ గావించువాఁడై యిట్లనియె. సన్న్యస్తశస్త్రుఁడైనమాతండ్రిని సకలరాజసమక్షమున ధృష్టద్యుమ్నుఁడు వధించె ననురోషముననను మిత్రకార్యనిర్వహణము కర్తవ్య మనుతలంపుననను నోరాజులారా, నే నొక్కసత్యప్రతిజ్ఞం గావించెద. పాంచాలాధముఁడైనయా ధృష్టద్యుమ్నుం జంపకకాని యేను గత్తళంబు పుచ్చను. ఇందులకుఁ దప్పుదు నేని స్వర్గగతికిం దప్పుదు. భీమార్జునులును మఱియుం బెక్కండ్రుమేటిశూరులు నడ్డపడి వత్తురేనియు వారల నందఱనుం బరిమార్తు నని ప్రతిజ్ఞ చేసినం బరమోల్లాసభాసురులై కురుసైనికులు కుంతీనందనసేనపై నడరుటయుఁ దత్సైనికులు మనవారిపై నిగుడుటయు నత్తాఁకు యుగాంతకాలజనక్షయకల్పంబై పరమదారుణం బయ్యె. వేడుకఁ జూడ మింట సురప్రముఖులు పొడగట్టిరి. అచ్చరలు దివ్యగంధకుసుమమాల్యముల నవ్వీరులపయిం జల్లుటయు రణాంగణంబు తారాగణసముజ్జ్వలం బైనగగనమురీతిం జూడ నొప్పె. మఱియు జ్యాఘోషనేమిస్వనంబులు ఖేచరులసాధువాదవాద్యరవముల్లతోడం బెరసి దిక్తటంబుల నిండె.

కృష్ణుఁ డర్జునునకు సమరభూమి వర్ణించి చెప్పుట.

అట్లు ద్రోణసూనునిఁ దక్కినశూరుల నోడించి క్రీడి నిర్వక్రవిక్రమాటోపదీపితుం డై కర్ణుం జూచుచు వాసుదేవుదెస మొగంబై మహాత్మా, చూచితే మనయనీకములు పఱచుచున్నవి. కర్ణుఁ డుదీర్ణరోషభరితుండై మహారథుల నేఱిమేఱి

చంపుచున్నవాఁడు. ధర్మనందనుఁ డిపు డెక్కడ నున్నవాఁడో. తదీయకేత
నంబునుం గన్పట్టదయ్యె. ఈపవలింటఁ దృతీయాంశ మింక మిగిలియున్నది. ఇప్పుడు
ధార్తరాష్ట్రులలో నెక్కరుఁడును నన్నుఁ బోరికిఁ జేరఁడు. కావున మత్ప్రియా
ర్థంబు యుధిష్ఠిరుఁ డున్నెడకుఁ దేరు వఱపుము. అనుజసహితంబుగ నమ్మహాను
భావుఁడు కుశలమునికిఁ దెలిసి మఱి వచ్చి పోరెద ననవుడు గోవిందుఁడు మనసేన
లపై సృంజయసహితంబుగా నడరి పోరుచున్నధర్మరాజునొద్ద కరదముఁ బఱ
పుచు సవ్యసాచి కిట్లనియె. పార్థా, దుర్యోధననిమిత్తమున నత్యంతరౌద్రం బైన
క్షత్రియక్షయము పొసఁగె. చూచితే విఱిగినవిండ్లును, రాలినశూరశేఖరులమేలి
తొడవులును, నిర్ముక్తపన్నగములం బోని తైలధౌతకలధౌతపుంఖనారాచములును,
గజదంతముష్టివిలసితములు కనకచిత్రములు నగుకృపాణములును, రుక్మగర్భము
లగుశరవారణములును, సువర్ణవికృతప్రాసములును, గనకభూషణశక్తులును,
జాంబూనదపట్టబద్ధవిపులగదలును, గాత్రస్వరదండపట్టసములును, నిర్జీవులయ్యుఁ
జేతికైదువులు విడువక వీర్యస్ఫూర్తి తఱుఁగమింజేసి సజీవులట్టు లగపడుసముత్సా
హవిలాసంబునం బొంపిరివోవ గదాముసలాదిప్రహారమునను గజవాజిరథసం
క్షోభంబునను నలినలి యైనసాంగదచందనలిప్తభుజదండములును వేదండశుండా
దండములం బోనియూరువులును గుండలకిరీటోజ్జ్వలమస్తకములును శాంతజ్వాలా
నలసమంబు లై నవిచ్ఛిన్నగాత్రశిరోధరము లగుకబంధములునుం బెరయఁ జూడ
నొప్పువీరయోధకళేబరంబులును, బహుధాభగ్నంబు లై నరథములును, నానాఖం
డము లై నరథావయవములును, నాలుకలు వెడలఁ బెట్టి నేలం గూలి పర్వతో
పమానప్రాప్తంబు లై నమాతంగములును, నిశితశరాహతములై నిష్క్రీర్ణాంత్ర
ములై పడినతురంగములును, గూలినకింకిణీసముల్లసితకేతనములును, జిందఱవంద
ఱలై నవారణకుథములును, బగిలినగంటలును, ద్రెస్సినమణిహారములును, దునిసిన
మాల్యములును,బఱియలై నగొడుగులును,నఱవఱలై నచామరములునై రణాంగ
ణము ఘోరాభిరామంబై యున్నది. మఱియు వీరరథికులశరప్రహారమున కోర్వఁ
జాలక తమతమచుట్టలం బిలుచుచు నిటునటుం బఱవఁబోయి రక్తప్రవాహకర్దమ
మునం గ్రుంగినకాళ్లుల నెట్టకేల కాకర్షించుచుఁ బ్రాణతాణతత్పరత్వమునం బఱ
చువారును, గడిందిమగంటిమిం గోలుపుచ్చ నొప్పనిమనస్సుతోఁ గ్రమ్మఱి పోరి కా
యిత్తపడి నడుచువారును, నీరువట్టు పెల్లునం జేసి నీళ్లుల వెదకఁబోయి తెరువున నిత
రేతరసమ్మర్దమున నొండొండె శరప్రహారమున నొండెఁ బడి మడియువారును, ద్రావఁ
బోయిననీళ్లుల విడిచి యొండొరుల నాక్రోశించుచుఁ బాఱువారును, ద్రావియుఁ
దాఁపుచును బడిచచ్చువారును, మనమున రోషము గదుర నొండు సేయ నోపక
యున్నను నవుడుగఱచి బొమముడివెట్టి కుటిలప్రకారమునఁ జూచువారునై కాలు

మానుసులు బహువిధముల దీనదశకు వచ్చి రని వనజోదరుండు సమరక్షోణీత లంబునం గలవిశేషములనెల్ల విస్పష్టమునకుఁ జూపుచు నరుగుచున్నంత నప్పాండవమధ్యముండు రయమునం దేరు వ్రా నిమ్మనుటయు నట్ల చేసి మురాంతకుండు యుధిష్ఠిరుసన్నిధికి డాయ నరిగి కిరీటి కిట్లనియె. పార్థా, ధర్మరాజును దక్కినమన వారలనుం జూడుము. అల్లవాఁడె జ్వలితజ్వలనప్రకాశుఁడైనకర్ణుఁడు మనవారి మీఁది కడరుటయు ధృష్టద్యుమ్నప్రముఖులైనమనవారలును దోడఁ గవిసి కోల్తల సేసినం బ్రభగ్నంబైనమోహరంబును రాధేయుఁ డెట్టకేలకు సమకూర్చుచున్నవాఁడు. ఆరాధేయునకుఁ దోడుగా వీఁడె యశ్వత్థామ యంతకవేగము శక్రపరాక్రమమును దనర నడరుటయుఁ బాంచాలవరుఁడు వానిం దలపడ నుంకించుచున్నవాఁడు. సృంజయయోధులు పెక్కండ్రు మడిసి రని సంగ్రామవృత్తము సర్వము నెఱింగించుచున్నంత సింహనాదవిస్ఫూర్తి మెఱయ నుభయసేనలునుం దలపడియె. నీదుర్మంత్రమునం బుట్టినయాకయ్యమున యుధిష్ఠిరప్రముఖులై పాండవయోధులును రాధేయపురోగములై కౌరవవీరులును దలపడుటయుఁ బోరు ఘోరంబై సెల్లె. అప్పుడు ధృష్టద్యుమ్నుఁడు పెక్కండ్రుయోధవరులు తోడుపడఁ గర్ణుం దాఁకిన నతండు ప్రవాహమునకుఁ బర్వత మెట్టు లట్టుల నిశ్చలుండై నిలిచినం జూచి పాంచాలవరుండు నిశితశర మొక్కటి యతనిమేనం గీలించి నిలునిలు మని యదల్చుటయు నాతండు విజయనామకంబైనధనుర్వరముఁ గొని నిశితభల్ల మరిఁ బోసియేసి యప్పార్షతునివిల్లు దునిమి క్రూరపన్నగములం బోనితొమ్మిదియమ్ములం గుప్పించుటయు నవి యతనిమైమఱుఁగు వ్రచ్చి రక్తసంసిక్తములై యింద్రగోపకీటకములచాడ్పునఁ జూడ నొప్పె. అంత ధృష్టద్యుమ్నుఁ డొండువి ల్లెత్తి డెబ్బదిమూఁడువాఁడినారసములఁ గర్ణునిమీఁద నేయుటయు నాతండు నతనిపై శరనికరం బడరించినం గినిసి పార్షతుఁడు వాలమ్ముల రాధేయుని పయిం బడ నేసె. అందుల కలిగి కర్ణుఁడు మృత్యుసంకాశ మగునొక్కక్రూర శరం బేయుటయు శైనేయుండు దాని నడుమన త్రుంచె. అట్లు తనయమ్ము వమ్మగుట కలిగి కర్ణుఁడు సాత్యకిపై నడరి శరవర్షముఁ గురిసి క్రూరనారాచముల నేడింటిని గాత్రమునఁ గీలించుటయు శినివీరుఁడును శరజాలము నడరించుటయుఁ జూడను వినను దారుణంబును సర్వభూతాశ్చర్యభీకరంబు నగుపోరు సెల్లె.

### అశ్వత్థామధృష్టద్యుమ్నులయుద్ధము.

అయ్యవసరమున నశ్వత్థామ ధృష్టద్యుమ్నుని మార్కొని యోరీ బ్రహ్మఘ్నా, నిలునిలు మింకఁ బ్రాణములతోడఁ దప్పించికొనిపోవ నేర్తువే యనిపలికి పరమరయమున నిశితశరనికరములఁ గప్పుటయు నత్యంతయత్నసాంద్రుఁడైన యతనిం దనకు మృత్యువుగాఁ దలంచి నాతిహృష్టచిత్తుండై కొండొకవడికిఁ

దాను శస్త్రిమున వధ్యుఁడు గామిం దలపోసి కడిమి మెఱసి యతనిం దాఁకుటయు నయ్యాచార్యసూనుండు క్రోధభరమునఁ బెద్దయు రోఁజుచు నతనిం దఱియ నరిగి యోపాంచాలాధమా, ద్రోణవధరూపం బయినభవత్పాపమునకుఁ బ్రతివిధానముగా నిదె నిన్ను యమసదనమునకుఁ బంపెద. పార్థుఁడు కావలియైయున్నను నీవు రణక్షోణీతలముఁ దొఱఁగి పఱచిననుం జెప్పఁజాలఁగాని యట్టులు గాక నిలుతువేని నామాట తప్ప దనుటయు ధృష్టద్యుమ్నుఁ డోబ్రాహ్మణబ్రువా, పరమ ప్రయత్నవిస్ఫురితుం డై నమీతండ్రిని జక్కఁబెట్టిననిశితకృపాణంబె నీకుఁ బ్రత్యుత్తరము నొసంగు. మీతండ్రిని నేను వధించితి నని యెఱిఁగిననీవు నాచేఁ బడక తప్పించికొననేర్తువే యని పలికి నిశితసాయకంబు ద్రోణసుతుగాత్రమున నాటిన నాతండు శరపరంపరలు పరఁగించుటయు నెక్కడఁ జూచినం బాణముల తక్క నొండు గన్పట్ట దయ్యె. సకలరాజులును శరప్రచ్ఛన్నమూర్తులం బొల్చిరి. అంత నప్పాంచాలవరుఁడు ద్రోణసుతుపై శరనికరములు నిగిడించుటయు సాత్యకి యుధామన్యుద్రౌపదేయు లప్పాండుసూనుసేనాపతికి బాసటయై వచ్చినం గర్ణుండు తాను వారల నాఁగె. అఁగుటయు నిస్సహాయశూరత్వమునం బేర్చి ధృష్టద్యుమ్నుఁడు ద్రౌణికార్ముకముఁ దునుముటయు నాతం డొండుకోదండముఁ గొని యాశీవిషసన్నిభము లయినక్రూరశరములు పెక్కు లడరించి నిమేషమాత్రలోన నప్పార్షతుధనుశ్శక్తిగదాధ్వజముల ఖండించియు గుఱ్ఱములఁ జంపియు సారథిని సమయించియు రథము శకలములు గావించియుఁ జీకాకుపఱిచిన విచ్ఛిన్నకార్ముకుఁడు విరథుఁడునై ధృష్టద్యుమ్నుఁడు శతచంద్రచిత్రితము భానుప్రతిమాసముల్లసితము నగుఖడ్గము గ్రహించుటయు నశ్వత్థామ యుతండు తేరు డిగ్గకమున్న యద్భుతం బావహిల్ల దానిం దునిమె. అట్లు విరథుఁడు విగతసాధనుఁడు నగునాధృష్టద్యుమ్నునిపై బహుళశరజాలము లడరించుటయు నెంతయుం గడంగియు నతనిం బరిమార్పనేరక కొంతవడి యాలోచించి తటాలున విల్లవలఁ బెట్టి పాముం బట్ట నుంకించుగరుడునిచాడ్పున రయమున మెఱసి ధృష్టద్యుమ్నుం బట్టికొనఁగఁ దేరు డిగి యేతెంచుచున్నంత మురాంతకుఁడు సవ్యసాచి కిట్లనియె. అర్జునా, యల్లవాఁడె యశ్వత్థామ పరమరయమునఁ దేరు డిగ్గి ధృష్టద్యుమ్నుం బట్టికొన వచ్చుచున్నాఁడు. ద్రౌణికిఁ జిక్కి మృత్యువక్త్రికుహరగతుం డైనరీతి దుర్దశాప్రాప్తుఁ డైననీసేనానాయకుం గాచికొను మనిపలికి చంద్రధవళము లయిన యుత్తమతథ్యములఁ బఱపుటయు నవి మింటి కెగయుచందమునఁ బరమరయమున నేతెంచుటయు రథస్థు లైనవాసుదేవధనంజయులం జూచి ధృష్టద్యుమ్నవధ త్వరితుండై యశ్వత్థామ యతనిం బట్టికొని యీడ్చుచుండునంత నర్జునుండు గాండీవజ్యాఘోషంబుఁ గావించి శాతసాయకముల నయ్యాచార్యనందనుగాత్రంబుఁ

గాఁడ నేయుటయుఁ దత్ప్రహారమున నెంతయు నొచ్చి యాతం డప్పాంచాలవ రుని విడిచి తేరిమీఁది కరిగి విల్లు గొని సాయకానీకములఁ బరఁగించె. అట్టి యెడ సహదేవుఁడు ధృష్టద్యుమ్నునిం దనతేరెక్కించుకొని చనియె. అర్జునుఁడు నంత ద్రోణిపయిం బటుకాండజాలములు నిగిడించుటయు నాతం డాతనిబాహు వక్షోభాగముల నిశితసాయకముల నాటె. అందుల కెంతయుఁ గోపించి పార్థుఁడు మృత్యుసమం బైనయొకదొడ్డనారసంబు ద్రోణసూనునాస్యమునం బడ నేయు టయు నాతండు తత్ప్రహారమున మూర్ఛిల్లి తేరిపై నొఱగం బడుటయుఁ దద వస్థుఁడై నయాబ్రాహ్మణుం జూచి సారథి రయమునఁ దేరు దొలఁగించె. అప్పుడు పాంచాలురు సింహనాదములు శంఖధ్మానములునుం గావించిరి. అయ్యెడరు సూ డలేక కర్ణుఁడు గాండీవిపై నడరుటయు నప్పాండవమధ్యముఁ డతనిఁ గాండజాల ప్రహారమున వెగడుపఱిచి వాసుదేవుం జూచి సంశప్తకానీకమునకుఁ దేరు వోని మ్మనుటయు నట్లు చేయుచు నారాయణుఁడు నరున కిట్లనియె.

—వాసుదేవుఁ డర్జునునకు సమరప్రకారంబుఁ జెప్పుట.—

పార్థా, వీరె దుర్యోధనాదు లగుధార్తరాష్ట్రవీరులు ధర్మరాజును బట్టికొ నఁగ బహుళసేనలతోడఁ బఱచుచున్నవారు. భీమసాత్యకు లమృతగ్రహణ వ్యగ్రు లైనదైత్యుల నింద్రాగ్ను లెట్టు లట్టుల యుత్తమరత్నము గ్రహింపఁ దొడరుయాచకులరీతి ధర్మరాజును గ్రహింపఁ జూచుచున్నయాధార్తరాష్ట్రుల నాఁగుచున్నవారు. ఆఁగుచుండినను వారు పెక్కండ్రు గావున నుక్కుమిగిలి వడిం బేర్చి యార్చియుఁ జిందముల మ్రోయించియు గొనయమ్ములు సారించియుఁ బ్రా వృట్కాలంబునఁ బ్రవాహంబు సాగరంబునుంబోలె నతనిం జుట్టు ముట్టుచున్న వారు. దుర్యోధనవశగతుం డైనయజాతశత్రుని మృత్యువాతఁ బడినవానిఁగను నగ్నిలోఁ ద్రెళ్ళినవానిఁగనుం దలంపవలయు. ఈధార్తరాష్ట్రానీకమునం బడునేని యింద్రుఁడైనం దప్పించికొనఁజాలఁ డనితోఁచెడి. కోపదీపితు లైనద్రోణికర్ణదు ర్యోధనులబాణవేగము పర్వతములనైనను బగిలింపఁ జాలును. ఇంక నందఱు సైరింతు రనిపలుకవచ్చునే? బలవంతుఁడు లాఘవోపేతుఁడు కృతాస్త్రుఁడు సమ ర్థుఁడు యుద్ధవిశారదుఁడు నయ్యు ధర్మరాజు కర్ణునకు విముఖుఁ డయ్యె. కర్ణుఁ డొక్కరుఁడే ధర్మరాజును వెగడుపఱుపఁ జాలునన్న ధార్తరాష్ట్రాదులు పెక్కం డ్రతనికిఁ దోడుపడినం జెప్పవలయునే? భరతసత్తముఁ డైనయజాతశత్రుఁ డుప వాసకృశుఁడు బ్రహ్మబలపరినిష్ఠితుఁడుగాని క్షాత్రబలవ్యవస్థితుఁడు గాఁడు. ఇట్టి వాఁ డగుటంజేసి కర్ణుబారిం బడి పరమసంశయప్రాప్తుఁ డయ్యె. ధార్తరాష్ట్రుల సింహనాదములను శంఖారవములను విని వృకోదరుఁడు సైరించియునికిం జూడ మనధర్మరాజుజీవితంబున సంశయంబు గదిరెడి.కర్ణుఁడు స్థూణాకర్ణేంద్రజాలాదులఁ

ప్రయోగించి యతనిం గప్పుచుండఁ బాంచాలాదులు త్వరాన్వితులై పాతాళని
ర్మగ్ను నుద్ధరించువిధమున ధర్మరాజుఁ గావం గడఁగుచున్నవారు. అజాతశత్రు
కేతనంబు గన్పట్టదు. భీమసేననకులసహదేవసాత్యకిశిఖండిధృష్టద్యుమ్నాదులు
చూచుచుండఁ గర్ణుఁడు గూల్చెఁ గాఁబోలు. అల్లవాఁడె రాధేయుండు బలదర్పవి
ధేయుండై యేపు మీఱి కమలాకరంబుఁ గలంచుమదవేదండముచాడ్పున మన
యనీకములఁ గలంచుటయు మనచతురంగబలములు వెఱచఱచి పఱచుచున్నవి.
పఱచినం బోనీక కర్ణుండు కేతనహస్తికక్ష్యాభిరామముగా వెన్నడించి ధనుర్గుణ
క్వణనంబుఁ గావించుచుఁ బాండురచ్ఛత్రంబు మీఁద వెలుంగఁ బూర్ణచంద్రోద
యస్ఫూర్తిసముల్లసితంబైనయుదయాచలముఁ గ్రేణిసేయుచుఁ గౌరవయోధులం
బిలిచి పేరెలుంగెత్తి పాంచాలసృంజయాదుల విడువవలదు. పట్టిపోనీక పొదు
వవలయు. ఒక్కఁడేనియుఁ దప్పించికొనియె ననుమాట పుట్టకుండ బీరమునం గడఁ
గుఁ డనిపలుకుచు భీమునిమీఁది కడరుచు మనమూఁకలపైఁ బటుశరాసారముఁ
గురియుచు దనుజహననోదగ్రుం డైనయాఖండలునివీఁక మెఱసి యిటునటుం
జూచుచున్నవాఁడు. ఈచూపు చూడ నిన్నుఁ దలపడ నేతెంచుచందము దోఁచు
చున్నది. నీపై నడర నుంకించుచున్నయతని నగ్నిలోనం బడుమిడుతగా వగచి
గాంధారేయాగ్రజుండు వానికిఁ గావలియై తాను బహుళయోధులతోడ నరుగు
దెంచుచున్నవాఁడు. కీర్తిని రాజ్యము నుత్తమసౌఖ్యమునుం బడయఁ గోరిననీ
వీసమరమున వాని వెగడుపఱిచితేని దుర్యోధనుఁడు ధర్మజునెడఁ గర్ణుఁ డపరా
ధియగుటయుఁ దనకుఁ గర్తవ్యశేషము లేమియుం బరికించి నోరు మూసికొను
వాఁడు గావున నుత్తమమతిం దలపోసి ప్రాప్తకాల మొనర్పుము. ఇవె యేనూ
ఱుతేరు లైదువేలయేనుంగులు పదివేలగుఱ్ఱములు ప్రయుతపదాతిగణములును
బరస్పరసహాయమునం బేర్చి కర్ణునకుఁ గావలియై నిన్ను మార్కొన నచ్చునట్లున్నది
యనిపలికి తత్సమన్వితుండై రాధేయుఁ డప్పుడు పాంచాలానీకముమీఁది కడ
రుటం జూచి సవ్యసాచికి జనార్దనుఁడు మఱియు నిట్లనియె. అల్లవాఁడె కర్ణుఁడు
పాంచాలురపయిం గవియఁ బోవుచున్నవాఁడు. ధర్మరాజున కింక నెలమి వాటిల్లు.
భీమసేనుఁడు సాత్యకిసమన్వితుండై పాంచాలురం గావఁగ వానిమీఁది కడరు
టయు నయ్యుద్ధతిశరప్రహారవేదనం జేసి ధార్తరాష్ట్రయోధులు లేటమొగంబు
వెట్టి పఱచుచున్నవారు. ఎక్కడఁ జూచినం గౌరవానీకమునఁ గూలుసిడములు
పఱియలైనగొడుగులు మడిసినగుఱ్ఱములు తెగినయేనుఁగులు విఱిగినతేరులు సమసి
నకాలుమానుసులునై బీభత్సముగఁ గనంబడుచున్నది. భీమసాత్యకిసహాయమునం
బేర్చి పాంచాలు రుక్కుమిగిలి కౌరవానీకముల నేలకుఁ గోలకుఁ దెచ్చుచున్నవారు.
ఇప్పుడే ధృష్టద్యుమ్నాదులును గవియుటం జేసి శాత్రవబలంబు వికలంబై కన్పట్టు

చున్నది. ఆహవదుస్సహుఁడై నభీమసేనునికోల్తల కోహటించి హతశేషులు ప
ఱచుటయు నయ్యెడఁగు సూడలేక నైషాదియేనుంగు నెక్కి తోమరపాణియై దం
డహస్తుండైనయంతకునిపగిది ఘోరాకృతివిస్ఫురితుండై బహుళగజానీకము
తోడఁ గవిసినం బకాంతకుఁడు వానిభుజముల నఱికి తలఁ దఱుగ నల్లవాఁడౌ
యానిషాదపతిసుతుఁడేనుంగుతోడఁ బీనుంగై పడుటయు గజయోధులు పెక్కం
డ్రొక్కయుమ్మడి మార్కొనినం గిమ్మీరవైరి పదిపదియమ్ముల నొక్కొక్కనింగా
నందఱ నేనుఁగులతోడం బొరివుచ్చుచున్నవాఁడు. మహేంద్రవిక్రముఁడైనవృ
కోదరుఁ డలుగుటంజేసి ధార్తరాష్ట్రునియక్షౌహిణులు మూఁడు దీనదశకు వచ్చె
నని యచ్యుతుం డెఱింగించిన విని కిరీటి యాదెస నబ్బలుమగండు గలఁడని తా
ను సంశప్తకులపై నడరి శరాసారముఁ గురిసి యనేకులఁ బొరివుచ్చుటయు హ
తశేషులతనిమునుమునఁ గాలు నిలుప నోపక వెఱచఱచి పఱచి రనిన విని
యాంబికేయుఁడు సంజయా, యట్లు యుధిష్ఠిరభీమార్జునులు విక్రమించినం బరమ
దైన్యంబై మనసైన్యంబు పలాయనపరాయణంబై నపదంపడి నిరానందులైన
కౌరవు లేమి చేసి రనియడుగ నతనికి సంజయుఁ డిట్లనియె.


ద్వంద్వయుద్ధము.

అట్లు భీమసేనునికోల్తల కోహటించి పఱచినమనసైన్యంబుఁ జూచి
కర్ణుఁడు క్రోధరక్తేక్షణుండై వారలం బురికొల్పి తా నబ్బలుమగనిం దాఁకి శరని
కరముఁ బరఁగించుటయు సాత్యకిశిఖండిధృష్టద్యుమ్నులును యుధిష్ఠిరార్జుననకుల
సహదేవద్రౌపదేయులును యుధామన్యూత్తమౌజులును జనమేజయాదు లగు
పాంచాలవరులును సకలప్రభద్రకులునుం గవియుటయు దుర్యోధనదుశ్శాసనాదు
లగుభవన్నందనులును గృపాశ్వత్థామకృతవర్మలును వృషసేనసౌబలోలూకులును
మున్నుగా మనవారును దోడన యడరుటయుఁ బోరు ఘోరం బయ్యె. అందు
శిఖండి భీమునిఁ దలకడచి కర్ణునిఁ దాఁకుటయు నవ్విాయుసూనుఁడు దుర్యోధనా
దుల మార్కొనియె. ధృష్టద్యుమ్నుఁడు దుశ్శాసనుని నకులుఁడు వృషసేనుని
ధర్మరాజు చిత్రసేనుని సహదేవుఁ డులూకుని సాత్యకి శకునిని ద్రౌపదేయులు
కౌరవులను సవ్యసాచి యాచార్యసుతుని యుధామన్యుండు కృపాచార్యుని నుత్త
మౌజుండు కృతవర్మనిం దలపడిరి. శిఖండి కర్ణునిపై నడరి పటుకాండజాలము
నిగిడించుటయు నాతండు రోషరూషితుండై యవుడు గఱచి శరత్రయము
భ్రూమధ్యమున నాటుటయు శిఖరత్రయభాసురంబైనకైలాసశైలమురీతిం
జూపట్టుచు నప్పాంచాలవరుఁడు తొంబదియంబకముల రాధేయుమీఁదఁ బడ
వైచె. అందుల కెంతయుం గినిసి యయ్యంగనాథుఁ డతనిగుఱ్ఱములం జదిపి
సారథినిఁ బరిమార్చి యొక్కకుప్పెకోలం గేతనముఁ గూల్చుటయు విరథుఁడై

శిఖండి నేలకు డిగి శక్తి నేసినం గర్ణుండు సాయకజాలమున దానిం దునిమి తొమ్మిది వాలమ్ములు గాత్రమ్మునఁ గీలుకొల్పుటయు నెంతయు విన్నఁబోయి శిఖండి తొలఁగుటయు రాధేయుండు దూదిప్రోవును వాయు వెట్టు లట్టుల పాండవానీకములఁ జెరలించుచుండె. ధృష్టద్యుమ్నుఁడు దుశ్శాసనుం దాఁకి తదీయశరార్దితుండై కోపించి శరత్రయము వాని స్తనాంతరమున నాటుటయు నాతండు రుక్మపుంఖభల్లమున వామభుజము నొవ నేసినం బరమక్రోధభరితుండై యప్పాండవసేనానాయకుండు రయమున నెక్కు తీవ్రశరము వింటఁ దొడిగి విడుచుటయు దుస్ససేనుఁడు మూడమ్ముల దానిం దునియలు గావించి సప్తదశభల్లములఁ దదీయబాహువక్షోదేశములం గీలించె. అందులకుఁ గడుం గినిసి యొకవాఁడికుప్పెకోల న్విల్లు దునుముటయు జను లాక్రందనముఁ గావించుచున్నంత నవ్వుచు నొండువిల్లు గొని దుశ్శాసనుఁడు శరవ్రాతమున ధృష్టద్యుమ్నుం గప్పిన నతనియద్భుతవిక్రమమునకుఁ జూచుఖేచరులు మెచ్చిరి. అట్లు దుశ్శాసననిరుద్ధుఁడై ధృష్టద్యుమ్నుఁడు సింహము పొదివినమత్తశుండాలముమాడ్కి ఱెచ్చవడుటయుఁ బాంచాలసైనికులు పెక్కండ్రొక్కుమొగి మనదుస్ససేనుని మార్కొనినం బరమాభీలం బైనయాలంబు సెల్లె. నకులుఁడు వృషసేనుం దలపడిన నాతండు పితృసమీపస్థితుండై మూడు వాలమ్ము లేయుటయు నప్పాండునందనుండు నగుచు దొడ్డనారస మాతనిఱొమ్ముఁ గాఁడ నేయుడుఁ గడు నెవ్వను గోపమునుం గదుర నాకర్ణనందనుండు వింశతి విశిఖములఁ బ్రయోగింప నమ్మాద్రేయుఁడు పంచాశుగము లడరించుటయు నయ్యుద్ధఱు నొకళ్లొకళ్లపై శరసహస్రములు గురిసి కప్పుచున్నంత మూఁకలు వీఁక దఱిఁగి విఱిగి పఱచె. అట్లు పఱచుచున్నమూఁకలం గూర్చికొని కర్ణుఁడు తాను మార్కొన వచ్చుటయు నతనిం గ్రేడించి నకులుఁడు కౌరవులమీఁది కడరుటయు వృషసేనుఁడును వాని విడిచి తొల్లింటియట్ల తండ్రికిఁ జక్రరక్షకుఁడై నిలిచె. సహదేవుఁ డులూకుని మార్కొని వానిగుఱ్ఱములను సారథినిం బరిమార్చుటయు నాశకునినందనుఁడు రయమునఁ దేరు డిగి త్రిగర్తానీకమునకుఁ బఱచె. సాత్యకి శకునిం దలపడి వింశతిశరములఁ దదంగములం జొనిపి నవ్వుచు నవలీల నెక్కుభల్లమునఁ గేతనముఁ గూల్చినం గోపించి యగ్గాంధారపతి యగ్గలిక మెఱసి శైనేయుమైమఱుఁగుఁ జించి కాంచనధ్వజము నేలం బడఁ ద్రోచె. అందులకుఁ బరమరోషరూషితుండై సత్యకాత్మజుండు నిశితబాణముల వానిమేను గాఁడ నేసి మూఁడింట సారథిం బరిమార్చి బలుతూపుల రథ్యములం దెగటార్చుటయు శకుని తేరు డిగ్గి యులూకునితేరి మీఁది కుఱికి తొలంగి చనియె. అంత సాత్యకి తనకు మాఱుమలయువారు లేమిం జేసి యప్రతిహతప్రతాపదీపితుండై సాయకాసారముఁ గురిసి యెక్కడఁ జూచినం దనవాలమ్ములకా నెనర్చుటయు మనమూఁకలు వాని

మునుమున నిలువనేరక విచ్చి పఱచె. భీమసేనుఁడు దుర్యోధనుం దాఁకి ముహూర్తమాత్రలోన వానిగుఱ్ఱములఁ ఖిలుకుమార్చియు సారథినిఁ బరిమార్చియుఁ గేతనము గూల్చియుఁ దేరు భగ్నముఁ గావించియు నంతంతకుఁ దీవ్రప్రతాపాతపంబు గాయుచున్నంత మనవారికి సంత్రాసమును వారివారికి సముల్లాసమునుం గూర భవదగ్రనందనుండు తొలంగి చనుటయుఁ గౌరవులు లావృకోదరుం జంపఁ దలంపు గదురఁ దాఁకి వానియమ్ముల సైరింపనోపక ప్రాణత్రాణపరాయణులై పఱచిరి. యుధామన్యుఁడు కృపాచార్యునివిల్లు దునుముటయు నాశారద్వతుఁ డొండువిల్లెత్తి యుధామన్యుసారథిని సమయించి కేతనాతపత్రములం గూల్చుటయు నప్పాంచాలకుమారుఁడు తొలంగి చనియె. ఉత్తమౌజుఁడు కృతవర్మను దలపడి ప్రావృడ్బలాహకము సలిలధారలఁ బర్వతము నెట్లట్లు శరనికరమున నాతనిం గప్పి యదృష్టపూర్వప్రకారమున ఘోరావహము సేయుచున్నంత హార్దిక్యుఁ డేచి యొక్కవాలమ్ము ఱొమ్మున నాటుటయు నయ్యుత్తమౌజుఁడు సోలి తేరిలో నొఱఁగి నంజూచి సారథి తేరు దొలఁగించె.

అట్టియెడ శకునిదుశ్శాసనులు బహుళగజానీకపరివృతులై భీమసేనునిఁ దలపడి పెక్కుకుప్పెకోల లడరించినం గోపించి కీచకాంతకుండు దివ్యాస్త్రము సంప్రదీపితముఁ గావించిన నెక్కడఁ జూచినను భీమునివాఁడితూపులకా నావరించుటయు నయ్యేనుంగులు తత్సాయకప్రహారమున నత్యంతగాఢవేదనాప్రాప్తంబులై కుంభములు వగులఁ దొండములు దునియ నెత్తుటం దోఁగి గైరికధాతుపటలపరీతభూధరములట్టులు చూడ నొప్పుచు జిఱ్ఱునం దిరిగి ప్రబలఘీంకారము నొనర్చి నెత్తురు గ్రక్కుచుఁ బుణ్యక్షయమైనం బడువ్యోమయానములరీతి నేలఁ గూలునవియుఁ దన్మార్గణప్రహారముఁ దప్పించికొనఁ దలంచి దిక్కు దోఁపక యిటునటుం బాఱుచుఁ దమవారలఁ ద్రొక్కునవియు నాశోత్రుపాటున నేమేనియు సోఁకినను వాయుసూనునమ్ములే యనుతలంపున వెఱచఱచునవియు వృకోదరుని వింటినారిమ్రోఁత కులికి మూత్రపురీషముల విసర్జించునవియునై పలువెఱంగుల దీనదశకు వచ్చె. అట్టు లగ్గజానీకము నుగ్గాడుచు భీముఁ డగ్గలిక మెఱయుచున్నంత నర్జునుఁడు నొండుకడఁ గురుసేనాధ్వంసముఁ గావించుటయుఁ గోపవిషాదభరితుండై కురుక్షమాధ్యక్షుఁడు బహుళసేనలతోడఁ దాను ధర్మరాజును మార్కొని డెబ్బదిమూడుకుప్పెకోలలఁ బరగించుటయు నజాతశత్రుండును ముప్పదిభల్లముల నీకొడుకుమేన నాటె. అయ్యవసరమునఁ గౌరవులు ధర్మరాజును బట్టికొనఁ దలంచి యఱిముఱిపడుచున్నంతఁ దదీయదుష్టభావ మూహించి భీమసేననకులసహదేవ ధృష్టద్యుమ్నులు రాజరక్షణపరులై యొక్కయక్షౌహిణితోడఁ దోడుపడినం జూచి రాధేయుఁడు దాను వారల నందఱను మార్కొని శరనికరముఁ బరగించుచు

నాఁగె. అప్పుడు సహదేవుఁడు రయమునం జేర్చి దుర్యోధనగాత్రమున నిరువది వాలమ్ములఁ గీలించుటయు రుధిరపరీతుండై యామహీనాథుఁడు మదధారాపరివృతం బయినమాతంగముభంగిం జూడ నొప్పుచున్నంత నంగరాజు క్రోధభరితుండై పాండవపాంచాలబలములం గనుపుకొట్టువాఁడై పటుపత్రిదరనికరములు నిగిడించుటయుఁ బాండవబలము విచ్చి పఱచె. అందుల కలిగి ధర్మనందనుఁడు శరవర్షముఁ గురియుటయు నయ్యిద్దఱియమ్ములు మింట నొండొంటి నొరసికొనినం జిచ్చు పొడముటయుఁ బరమఘోరం బయ్యె. అట్లు పరమాస్త్రవిదుఁడై నకర్ణుఁడు సముదీర్ణక్రోధావేగదుర్దాంతుండై రక్తచందనానులిప్తములు మణికనకభూషణభూషితములు నగుబాహుదండముల విదిర్చి ధనుర్గుణక్వణనంబు గావించి పటుకాండజాలము నిగిడించి ధర్మరాజును నొప్పించుటయు నప్పాండవాగ్రజుండు పరమకోపసంప్రదీపితుండై యేఁబదివాలమ్ములఁ గర్ణునిగాత్రమునఁ గీలించుటయు హాహాకారం బెసంగె. అవ్విధమున రాధేయుని నొప్పించి దానం దనియక కోపాటోపమునం జేసి కన్నుల నిప్పులు రాలఁ జూచుచు భల్లకంకపత్రనారాచాదినానాసాయకముల నిగిడించుటయు మనమూఁకలు చిందఱవందఱ లయ్యె. ఏమి చెప్పుదు నత్యంతధర్మనిష్ఠుఁడై నయుధిష్ఠిరుఁ డేదెసఁ గ్రూరవీక్షణంబు సారించె నాదెస మూఁక లెల్ల నుక్కడవేల్మిడిలోనం బొడవడఁగుచుండె. అందులకుఁ బరమక్రోధభరితుండై రాధాసుతుం డవుడుగఱచి నారాచార్ధచంద్రవత్సాదినానాశరము లేయుటయు ధర్మాత్మజుండును ధైర్యధుర్యుండై యలంతినగవు నెమ్మొగమ్మునకు సాహసముత్సాహసముల్లాసములకును వన్నె గావింపఁ గంకపత్రము లగు శితశరములఁ బెక్కు లేసె. ఏసినం గినిసి కర్ణుఁడు నిశితభల్లత్రయము ఱొమ్మున నాటుటయు నెంతయు నొచ్చి ధర్మరాజు తేరిపయిం జదికిలఁబడి యొండుకడకుఁ దేరు వోని మ్మని సారథికిఁ దెల్పుటయు దుర్యోధనాదులు ముదమునం బొదలి ధర్మరాజును బట్టుఁడని యెలుం గేర్పడం జెప్పుచుఁ జుట్టు ముట్టుచున్నంతఁ గేకయవీరులు పెక్కండ్రు పాంచాలబలపరివృతులై వారల నాఁగుటయుఁ బరమతుములం బయినపోరు సెల్లుచున్నంత భీమసేనదుర్యోధను లొండొరులఁ దలపడిరి.

ధర్మరాజు కర్ణున కోడి శిబిరమునకుఁ జనుట.

అవ్విధమున నడరిన కేకయపాంచాలుర నందఱనుం గెలిచి కర్ణుఁడు వాలంపగములతాఁకున నెంతయు నొచ్చి కవలు చక్రరక్షకులుగా శిబిరమునకుఁ జననుంకించుచున్నయజాతశత్రుం జూచి దుర్యోధనునకు హితముఁ గావించువాఁడై తా నయ్యుధిష్ఠిరుం దాఁకి మూడువాలమ్ము లతనిమేనం గీలించిన నప్పాండవజ్యేష్ఠుండును రాధేయునురమ్మున మూడమ్ములను సారథియంగమున శరత్రయమును దురంగగాత్రముల సాయకచతుష్టయమునుం గీలుకొల్పుటయు మాద్రేయులును

గడంగి వేఱువేఱ వానిపై సాయకాసారముఁ గురిసిరి. అందులకుఁ గోపసంప్ర దీపితుండై రాధాతనూజుండు రెండుభల్లములఁ గవల నెప్పించి సర్వాంగావదాతములు నీలవాలములు నగుధర్మరాజుగుఱ్ఱములం బరిమార్చి యొండుభల్లమునం బొమిడికముఁ బుడమిం బడ నేసి నవ్వుచు నకులునిగుఱ్ఱములం దెగటార్చి కాఁడి నఱికి విల్లు దునిమిన నయ్యన్నదమ్ము లిద్దఱును విరథులు గావున సహదేవునితే రెక్కిరి. అప్పుడు శల్యుఁడు కర్ణునిసంరంభమునకు వెఱచి పాండవులమీఁదికరుణంజేసి కర్ణుదెస మొగంబై యంగరాజా, సవ్యసాచితోడఁ బోరుట మాని యిప్పు డేల యిట్టులు ధర్మరాజుతోడికయ్యమునకుఁ గడంగెదవు. క్షీణశస్త్రాస్త్రుఁడు విశీర్ణకవచుఁడు శ్రాంతసారథికుఁడు నగుయుధిష్ఠిరునిపై నిట్లు కోలుమసంగినం గిరీటి ని న్నుల్లసమాడకుండునే యని తెల్పినను నమ్మద్రపతివచనము నంగీకరింపక కర్ణుఁడు పెండియుఁ గాండజాలము ధర్మజమాద్రేయులమీఁద నేసి వెగడుపఱచుచున్నంత మద్రరాజు కలకల నవ్వి యుధిష్ఠిరవధోద్యోగి వైనయయ్యంగపతికి వెండియు నిట్లనియె. దుర్యోధనుం డెద్దానిం గోరి యిన్నాళులు నిన్ను సమ్మానించె నయ్యది యీడేఱఁగఁ గడిందిమగంటిమిం బేర్చి గాండీవిని వధియింపుము. ఊరక ధర్మజునిఁ బరిమార్చినం బ్రయోజనం బెయ్యది? అల్లదె పాంచజన్య దేవదత్తారవం బును మేఘస్తనితసంకాశం బయినగాండీవజ్యాఘోషంబును దారుణప్రకారం బున వినంబడుచున్నది. అల్లతండె సవ్యసాచి యుధామన్యూత్తమౌజులు పార్ష్ణిగ్రాహులుగా సాత్యకిధృష్టద్యుమ్నులు సవ్యదక్షిణచక్రరక్షకులుగాఁ బేర్కొనం బేర్చి కౌరవానీకమెల్ల నెక్కుముద్దగాఁ గబళించుచున్నవాఁడు. మఱియు నతండే భీమసేనుఁడు దుర్యోధనుం దాఁకి దారుణరణంబు సేయుచున్నవాఁడు. అవ్వడ ముడికడంక నాకుం జూడ రారాజుం దెగఁ జూచుచందముగఁ దోఁచుచున్నది. ఇప్పుడు బకాంతకునిబారిం బడినదుర్యోధనుఁడు పరమసంశయగతుం డయ్యె. రయమున నవ్వాయుసూనుని మార్కొని రాజును రక్షింపుము. ధర్మరాజును మాద్రీనందనులనుం బట్టి పోనీక పోరాడుచు వేడుకఁ జూడ నిది తఱి గాదని తెలుపుటయు భీమసేనగ్రస్తుం డైనభవదగ్రనందను దెసం జూడ్కి సారించి కర్ణుఁడు రాజత్రాణతాత్పర్యమునం జేసి ధర్మజమాద్రేయులను విడిచి మద్రరాజుసారథ్యంపు నేర్పునను రథ్యములపటుజవముననుం బరమవేగమున భీమునిమీఁది కడరె. కర్ణుఁ డట్లు చనుటయు నజాతశత్రుండు వ్రీడావిహ్వలుండై కర్ణబాణప్రపీడితుండై మోహరమున నిలువ నోపక కవలతోడఁ దాను దేరెక్కి శిబిరమున కరిగి నిపుణప్రకారమున నపనీతశల్యుఁడయ్యు హృదయశల్యబాధితుండై శయనంబుఁ బ్రాపించి కర్ణామలతోడ నెక్కటిబవరము సేయుచున్నభీమసేనునకుఁ దోడుపడఁ

బొం డని నకులసహదేవులకుఁ జెప్పుటయు వార లన్నమాటమెయి వేఱుతేరు లెక్కి మొగ్గరమునకుఁ జనిరి.

అశ్వత్థామ యర్జునుతోడఁ బోరి యోడుట.

అయ్యవసరమున నశ్వత్థామ బహుళరథికపరివృతుండై యర్జునుం దాఁకిన నబ్బలుమగండు వేల సాగరము నెట్టు లట్టుల యారథికసందోహము నాఁగినం గోపించి యాచార్యనందనుండు వాసుదేవార్జునుల శరజాలమునం గప్పుటయుఁ జూచుచుఁ గౌరవు లందఱు వెఱఁగుపడిరి. అప్పు డర్జునుఁడు నగుచు దివ్యాస్త్ర మేసినం గురుసుతుండు దానిం బ్రత్యస్త్రమునఁ బ్రశాంతముఁ గావించి మఱియు నతం డెన్నియస్త్రము లేసిన నన్నింటినిం దాను వారించుచు నూరు దెలిచినయుం తకునివిధమున ఘోరాకృతియై శరచయమున దిక్కులు విదిక్కులునుం గప్పి వాసు దేవునిదక్షిణభుజమున శరత్రయముఁ గీలించె. అందుల కలిగి సవ్యసాచి యాచా ర్యసుతునకుఁ దోడుపడ వచ్చినయారథికుల రథ్యసారథిసహితంబుగా వధియించి రక్తనదీప్రవాహంబుఁ బరఁగించుటయుఁ గోపసంప్రదీపితుండై యశ్వత్థామ నిజ కనకధనుర్గుణక్వణనంబుఁ గావించుచుఁ బరమరయమున నేతెంచి నిశితశరములఁ బాండవమధ్యమునిపైఁ గురిసి యొక్కవాఁడితూపు ఱొమ్మునఁ గాఁడ నేసె. దానం గడు నొచ్చి విష్వచ్చుఁడు సాయకజాలమున గురుసుతుం గప్పి తదీయకార్ముకముఁ ద్రుంచుటయు నాభారద్వాజనందనుఁడు వజ్రసమం బైనఘోరపరిఘ మెత్తి యేసె. ఏసినం జలింపక నిలింపరాజనందనుండు నవ్వుచుఁ గులిశమున గిరిశిఖర ముంబోలె దానిం బలుతూపుల ఖండించినం బరిమకోద్రవిస్ఫురితుండై యాశా రద్వతీసుతుండు శరవర్షముఁ గురియుచు నింద్రజాలముఁ గావించినం గాండీవ మున మహేంద్రసృష్ట మగుదివ్యాస్త్రము సంధించి బీభత్సుఁడు వానియింద్రజా లమెల్ల రూపడఁగించి యతనితేరు శరాచ్ఛాదితముఁ గావించె. అట్లు పార్థశరా భిభూతుఁడై యశ్వత్థామ సంరంభామర్షసముద్ధురుండై తదీయశరవర్షమున మునిం గియు గండడరి తనపేరు సెప్పి నూటింటఁ గృష్ణుని మున్నూఱుకుప్పికోలలఁ గ్రీడిని నొంచుటయుం గోపించి యక్కౌంతేయుఁడు సాయకశతమునం గురుసుతునిమర్మ ములు వ్రచ్చి యశ్వసూతధనుర్జ్యాగుణములపై శరనికర మడరించి యొక్కభల్ల మున సారథిని సమయించుటయు ధృతి దూలక గురునందనుండు తాన రథచో దన మొనరించుచుఁ గిరీటితోడఁ బోర పెనంగుటయు సకలజనులును బరమా ద్భుతము నొందిరి. అప్పుడు ప్రహాసభాసురవదనుండై సవ్యసాచి రయమునఁ బగ్గములం ద్రెంచి తురంగాంగములం గ్రూరశరము లేయుటయు నెంతయు నొచ్చి యయ్యశ్వములు విడివడి పఱచుటయు మనయనీకమున ఘోరనాదం బెసంగె.

పాండవులు గెల్చుకొన్నవారు గావున నుల్లాసమునం బేర్చి యార్చి కోల్తల సేయుటయుఁ గర్ణశకునులును దుర్యోధనాదు లగుభవన్నందనులు నెంత వారించినను వినక మనసైన్యము దైన్యముఁ జెంది పలాయనపరాయణం బగుటయు శాత్రవయోధులు సింహనాదము లొనర్చుటయు రోషవిషాదభరితుండై కురు క్షోణీవల్లభుండు కర్ణుని కిట్లనియె. మహారథోత్తమా, చూచితే మనసేనలు పాండవ పాంచాలభయార్దితములై యొగ్గరమున నిలువఁ జాలక పెలుచ నఱచుచుఁ బఱచుచున్నవి. వేవురుయోధు లిప్పుడు నీపై నడర వచ్చుచున్నవారు. ఇప్పటి కుచిత మగుదానిం జూడక యూరకుండఁ జనునే యనుటయు దుర్యోధనువచనము నాకర్ణించి కర్ణుఁడు నవ్వుచు శల్యుం జూచి మద్రపతీ, నాభుజవీర్యము నస్త్ర విద్యాచాతుర్యము నింకఁ జూతువు. పాండవపాంచాలుర నెల్ల నొక్కవ్రేల్మిడిలోన నుక్కడంతును. రయమునం దేరు వఱపు మనిపలికి విజయనామకం బైననిజకార్ముకవరము సజ్యముఁ గావించి సత్యశపథముల యోధుల నందఱ నిలువరించి యోహార మమర్చి పేర్చి భార్గవాస్త్రము నభిమంత్రించి సంధించుటయు నమ్మహనీయాస్త్రమున సహస్రాయుతప్రయుతార్బుదకోటిసంఖ్యాకము లగునానాశరములు పుట్టి పాండవసైన్యముఁ గప్పి చీఁకట్లు పచరించుటయుఁ బాండవపాంచాలసైన్యమునం గూలునేనుంగులును విఱుగుతేరులును సమయుగుఱ్ఱములును మడియు కాలుమానిసులునై బీభత్సం బయిన నెల్లెడల హాహాకారరవంబు పెలుచ నెసంగె. అట్లు భార్గవాస్త్రము సంప్రదీపితముఁ గావించి రాధేయుఁడు విధూమపావకునిచాడ్పునం దేజరిల్లుచు నంతంతకు నప్రతిహతప్రతాపంబుఁ జూపుచుఁ దిర్యగ్జంతుజాలమునకు వెఱపుఁ బుట్టించుటయుఁ బ్రేతరాజపురప్రాయం బైన యాసమరక్షోణీతలమునం బాంచాలవీరులు దిక్కు దోఁపక వాసుదేవార్జునులం బిల్చుచు నాక్రందనముఁ గావించుచుండు నంత నయ్యార్తనాదం బాకర్ణించి యర్జునుఁడు జనార్దనున కిట్లనియె. మహాత్మా, చూచితే భార్గవాస్త్రవిజృంభణము. ఇయ్యస్త్రరాజమునకుఁ బ్రతివిధానము గానంబడదు. కర్ణుఁ డంతకంతకు సంరంభసముద్రగుండై కాలాంతకునిరీతిఁ బరమఘోరత్వమున నడరి నన్ను మార్కొనం గాఁబోలు నీదెసఁ జూడ్కి సారించుచున్నవాఁడు. ఇప్పుడు వీని మార్కొనుట యెంతయు నశక్యంబు. బ్రదికియుండిన జయపరాజయములం బడయవచ్చుఁ గాని సమసినం బ్రయోజనం బెయ్యది యనుటయు శ్రీకృష్ణుఁడు తత్కాలసముచితముగ నిట్లనియె. అర్జునా, ధర్మరాజు కర్ణుబాణములం గడు నొచ్చి తొలంగినవాఁడు. ఇప్పు డతనిం గాంచి యూరార్చి మఱి యరుదెంచి కర్ణుం బరిమార్తు వని గోవిందుఁడు కర్ణుతోడిపోరికి ముందుగా సేదదేఱుట లగ్గని తన మనంబునఁ దలపోసి కిరీటికిఁ దెలిపి తేరు దోలుటయుఁ గదనభూమి నెచ్చటను

నజాతశత్రుం గానక యరుగుచు భీమసేనుని డాయం జని యన్నయెచ్చట నున్నవాఁ డతనివృత్తాంత మెట్టు లనియడుగుటయు భీముఁ డయ్యా, ధర్మరాజు కర్ణబాణపీడితుండై భండనమేదినిం బాసి తొలంగె. ఇంతకు నతనిజీవితం బెట్టు లోకాని యే నెఱుంగ నని పలికినం గిరీటి వృకోదరున కిట్లనియె. కర్ణబాణ విద్ధగాత్రుండై శిబిరమునకుఁ జనినధర్మరాజునొద్దకుఁ బోయి నీ వమ్మహాను భావునికుశల మరసి రమ్ము. ఆచార్యునివాలంపగముల కెంతయు జయప్రతీక్షంజేసి తొలఁగక నిలిచినయాతఁ డిప్పు డరుగుటం జూడఁ గర్ణునమ్ములతాఁకునం బరమ తీవ్రవేదనాభరితుం డయ్యె నని తోఁచెడి. నీవు వచ్చునంతకు నే నిచ్చట నిల్చి పగతురు మిగిలి రాకుండఁ జూచికొనియెద ననుటయు భీముఁడు కిరీటీ, నీవ పోయి రమ్ము. నే నిప్పు డరుగుదునేని శాత్రవులు నన్నుఁ గాందిశీకునిఁ గాఁ దలంతు రనిన వెండియు గాండీవి యల్లవారె సంశప్తకులు నాతోడిపోరికి వచ్చుచున్న వారు. వారల విడిచి పోక నాకుఁ బోల దనినం బకాంతకుం డీకురుయోధులను నాసంశప్తకులనుం దాఁకి యేను వీఁక మెఱసి పోరుదు నీవ పోయి రాజుకుశల మరసి రమ్మని యొత్తి చెప్పుటయుఁ గొండొకవడి యాలోచించి సవ్యసాచి గో విందుం బిలిచి రణరంగము వర్జించి తేరు శిబిరమునకుఁ దోలు మని పలికినం బుండరీకాక్షుండు భీముం జూచి యోశూరవర్యా, యే నెక్కరుండన యెల్లవా రల నాఁగుదు మీరు పొం డనిపలుక నీకుఁ దగుఁగాని లాఁతుల కలవియే జయముఁ గొను మనియగ్గించి యతని వీడ్కొని శిబిరమునకు సమ్ముఖముగఁ దేరు వఱపె.

కృష్ణార్జునులు శిబిరమునకుఁ జని ధర్మరాజుం జూచుట.

అవ్విధమున వాసుదేవధనంజయులు సమరముఖమున భీమసేనుని నిలిపి యతిరయమున శిబిరమునకుఁ జని యచ్చట నేకాంతమున శయ్యాతలమున నొంటి మెయిం బరున్నధర్మనందనుం జూచి యతనియొలమినునికికి నెమ్మనమ్ముల నలరుచు నశ్వినులు వాసవున కెట్టు లట్టు ల య్యజాతశత్రునకుఁ బాదప్రణామములు గావించిన నక్కౌంతేయాగ్రజుండు తనమనమునఁ గర్ణుని హతునకా వగచి జంభ వధానంతర మింద్రోపేంద్రుల నాదరించుబృహస్పతిచందమున వారల నాదరించి సంప్రీతచేతస్కుండై స్వాగతం బడిగి యభినందించి మందహాసరోచిరుదంచితవ దనారవిందుఁడై హర్షగద్గదమధురవాక్యముల నచ్యుతార్జునుల కిట్లనియె. సమర క్రూరుఁడు సకలసంగ్రామవిశారదుఁడు ధార్తరాష్ట్రసుఖకరుఁడు వృషసేనసుషేణ రక్షితుఁడు భార్గవసంప్రసాదలబ్ధదివ్యాస్త్రదుర్జయుఁడు సర్వలోకవిశ్రుతుఁడు మహా రథవర్యుఁడు సేనాముఖధురంధరుండు పరబలార్దనుఁడు దుర్యోధనహితాచరణ తత్పరుఁ డస్మదీయదుఃఖసముద్యతుఁడు దేవగణదుర్జయుఁడు వైశ్వానరతేజుఁడు వా యుబలుఁడు పరమగంభీరుఁడు సుహృదానందవర్ధనుఁడు నగుకర్ణుని వధించి యేకీడుం

బోరయక వచ్చినమిమ్ముఁ జూడఁగ నాడెందము పరమానందసాంద్రం బయ్యె. ఏమి చెప్పుదు వాఁడు ఘోర నంతకాకారమునం బొల్చి మనవారల నీఱుసేయుచుండె. వాఁడు నాపై నడరి సాత్యకిధృష్టద్యుమ్నశిఖండిద్రౌపదేయమాద్రేయాదులు నూచుచుండఁ గేతనంబుఁ గూల్చియు గుఱ్ఱముల సమయించియు నెల్లవారల నోడించియు నేపు సూపె. మఱియుం బెక్కుమాఱులు నన్ను గెలిచి పలుకరానిప్రల్లదములం బలికె. వానివిక్రమము నోర్వక యెన్నఁడో తెగటారవలసియున్నను భీమసేనునిబలప్రభావమునం జేసి బ్రదిమికి భంగము పొసంగ దయ్యె. పెక్కు లేల ? వానియేపు సైరింపఁ జాలను. పదుమూఁడేఁడులు వానికి వెఱచి శేలు నిద్రయుఁ బవల్లు సుఖమునుం గానక యుంటిని. ఏవిధమునం గర్ణుఁడు తెగునని సర్వావస్థలందును దలంచుచుండిననా కెక్కడఁ జూచినను వాఁడకాఁ గన్పట్టుటయు జగమెల్లఁ గర్ణమయంబై చూపట్టె. వీర్యదుర్దాంతుఁ డైనయారాధేయుఁడు కరుణించి ప్రాణములతోడ విడువం బ్రదికిననాకు రాజ్యమునను జీవితమునను బ్రయోజనం బెయ్యది ? భీష్మద్రోణులవలనను బడనిపాటు రాధేయునివలన నేఁడు పడితి. అర్జునా, శక్రతుల్యబలుఁడు యమసమపరాక్రముఁడు భార్గవసమానాస్త్రుఁడు మహారథవరుఁడు సకలసంగ్రామవిశారదుఁడు ధనుర్ధరవరేణ్యుఁడు ధార్తరాష్ట్రమానితుఁడు నగుకర్ణుని నీ వెట్లులు వధించితివి ? తత్ప్రకారంబు నాకుఁ దేటపడం జెప్పుము. వాఁడకదా నీకు మృత్యువని నమ్మి యాదుర్యోధనుఁడు మన్నన నాదరింప నుల్లాసంబునం బొంపిరి వోయి యాసూతనందనుండు తాను నినుఁ జంపఁ జాలుదు ననితలంచి యత్యంతస్పర్ధమై నిన్ను వెదకువాఁడై సేనాముఖమున నిటునటుం జూడ్కి సారించుచు నర్జునుం జూపి నాకుఁ బ్రియంబు బాపాదించినవాని కపరిమితధనంబును బెక్కేనుంగులను బహుళతురంగముల ననేకరథములను భూరిగ్రామముల నిత్తు ననిపలికె నని వింటిమి. సింహము మృగముతలఁ ద్రుంచుకై వడి నీవు వానిమస్తకముఁ దఱుగ నిపుడు దుర్యోధను భుజములు విఱిగిన ట్లయ్యెఁగదా. అర్జునుం జంపకకాని పాదధావనము సేయనని ప్రతిన వట్టినరాధేయుఁడు దాని నెఱవేర్చికొనం జాలక మడిసెనే ? ఆనాఁడా సభలోఁ బాంచాలిం జూచి యోసిదాసీ, దుర్బలులు హీనసత్త్వలు గొడ్డువోయిన వారు నగుపాండవుల విడిచి నీకుఁ బోలినయుత్తముని వేఱొక్కని భర్తృభావమున వరింపు మని పలికినపరుషములెల్లఁ దలంపునకుఁ దెచ్చికొని విషాదభరితుండై నేఁడు భవదీయగాండివజ్వాలలం బడి ద్రుందిపోయెనే ? బలుతూపులు నొప్పింపఁగ నీదురాత్ముఁడు తెగుఁగాక యని నాతలఁచినతలఁపు సఫలముఁ గావించితివే ? కుండలోల్లసితం బైనకర్ణునిమస్తకము రణక్షోణిం బడియుండఁ జూచి యాదుర్యోధనుఁడు నిరాశ్రయుఁడై తనమనమున నైన నిన్నుఁ బొగడకుండునే ?

సర్వలోకపూజితుం డైనశాంతనవుఁడు రథాతిరథసంఖ్యానంపుఁదఱిఁ దన్నర్ధరథుఁ డనిపలికె నని యమ్మహానుభావు నాక్షేపించినయారాధాసుతుండు నేఁడైనం దనబలవీర్యముల నెఱుఁగకుండునే? పాపాత్ముఁ డైనయాకర్ణుఁడు హతుఁ డయ్యె ననువచనామృతమునఁ గోపదీపితంబై నామనం బేర్చుచున్నవిషాదానలంబుఁ జల్లార్పవే? శ్రవణసుభగం బయినయమ్మాట వీనులార విని వృత్రవధానంతరము మహేంద్రుఁ డెట్టులట్టుల పరమముదమునం బొదలుదు ననిన ధర్మనందనువచనోపన్యాసము విని యర్జునుఁ డయ్యజాతవైరి కిట్లనియె.

మహారాజా, యేను సంశప్తకులతోడఁ బోరునెడఁ గురుసేనాముఖస్థితుం డైనగురుసూనుఁడు నాపై నడరి క్రూరపన్నగములంబోనివాలమ్ములం గుప్పించుటయు నే నంతకుఁ బంచశతత్రిగర్తవీరులం బరిమార్చి యగ్గలించి యగ్గురుతనయుని మార్కొనిన నతండు సింగముపయిం గవియుమదపుటేనుంగుభంగి నామీఁదఁ గవిసి శరనికరము నిగిడించి విషానలసంకాశము లగుతీవ్రాశుగముల నన్నును జనార్దనుని నొప్పింపఁ జూచె. అశ్వత్థామ యట్లు నాపై నడరునప్పు డేసినయమ్ములెనిమిదియెడ్లు మోవఁ జాలినయెనమన్నూఱుబండ్లు నిండియుండె. నే నయ్యమ్ముల నెల్ల గాండీవముక్తదివ్యాశుగచయమున మహామారుతము మేఘపటలముంబోలెఁ దెరలించిన నాతం డెప్పు డమ్ములఁ గొనునో యెప్పు డరిం బోయునో యెప్పుడు విడుచునో డాఁకేలనో వలకేలనో యని యూహింపరానిరయమునం బేర్చి మండలీకృతకోదండుఁడై మదీయశరముల మాయించుచు నేపు మీఱి మైదేసియమ్ముల నన్నును వాసుదేవుని నొవ్వ నేయుటయు నేను నిమేషమాత్రలోన వజ్రకల్పము లగుముప్పదివాలమ్ములం గీలించిన నేదు వెఱఁగినట్లు చూడ నొప్పి యయ్యాచార్యసూనుండు నెత్తుటం జొత్తిల్లి ఱిచ్చవడి నాచేఁ దెగినవీరులం జూచుచు నామునుమున నిలువనేరక కర్ణానీకమునకు నడిచె. అట్టు లశ్వత్థామ పఱచినం గాందిశీకము లగుకౌరవానీకములం జూచి రాధేయుఁడు రథికవరులేఁబండ్రుతోడు పడ నన్నుఁ దాఁకుటయు నే నయ్యేఁబండ్రనుం బరిమార్చి కర్ణుం గ్రేడించి రయమున నిన్నుఁ జూచిపోవఁగ వచ్చితి. సింహముఁ జూచినగోవులట్లు పాంచాలురును మృత్యువాతఁ బడినయట్లు ప్రభద్రకులును నెంతయు వెఱచియు క్షాత్త్రధర్మంబు వట్టి పోక పెనఁగుచుండ నారాధేయుండు వారల సప్తశతవీరుల వధించి యించుకేనియు డయ్యక క్రుయ్యక యంతకంతకుఁ గడిమి మెఱయుచున్నవాఁడు. అఖండవిక్రమస్ఫురితుం డైనయబ్బలియునియంపగములకు నీ వెట్టులైతివో యని చింతించి నీయెలమి నరసి చనఁగ వచ్చితి. అక్కడ నిప్పు డక్కర్ణుని మార్కొని యుక్కడరి పోరుమగఁ డొక్కరుఁడేనియుఁ గానంబడఁడు. సాత్యకిధృష్టద్యుమ్నులు చక్రరక్షకులుగా యుధామన్యూత్తమౌజులు పృష్ఠరక్షకులుగా నేపు మీఱి యేను

వానిం బరిమార్చెద. నాపోరు చూతువు రమ్ము. స్వర్గలోకదీక్షితులై ప్రభద్రకవీరులు వానితోడఁ బోకపెనంగుచున్నవారు. పుత్రమిత్రగణసహితంబుగా నేఁడు వానిం దెగటార్చెద. అందులకుఁ జాలనేని సద్గతికిఁ దప్పుదును. సమరభారమెల్ల నిప్పుడు భీమునిమీఁద నున్నయది. పెక్కండ్రు చుట్టు ముట్టి యాజగజెట్టికిఁ గీడు రోయుచున్నవారు గావున నింక నిక్కడఁ దడవు సేయం జనదు. వీడ్కొలుపు మనిన నర్జునువాక్యము లాకర్ణించి ధర్మరాజు కర్ణుఁ డింకను బ్రదికియున్నవాఁ డనివెఱఁగి తదీయశరసంతాపవేదనాదూనగాత్రుండై క్రోధావేగవిస్ఫురితుండై యతిపరుషముగఁ బార్థున కిట్లనియె.

ధర్మరాజు కర్ణుఁడు బ్రదికియునికి విని యర్జునుం గినిసి దూఱుట.

అర్జునా, సేనలు గలఁగఁబాఱఁ జూచి ధృతి దూలి మానము నేలఁ గలిపి యశము నడఁగించి కర్ణునకు వెఱచి భీము నొక్కని రణమునకుఁ జాలించి తొలంగి వచ్చితివే? నీనిమిత్తమునం దిరస్కారము ప్రాప్తం బయ్యె. కుంతీదేవిగర్భమునఁ బుట్టి యిట్టులు సేయఁ దగదు. ద్వైతవనమునం గర్ణుని నేఁ జంపుదు నని బాస యిచ్చి యిప్పుడు వెఱచి తొలంగి రాఁగ నీ కెట్టులు మనసు వచ్చె. నాఁ డట్లు పలుకకుండినం దగినయట్లు వర్తించి యేను ధార్తరాష్ట్రులతోడఁ బగ పెట్టికొనకుండుదు. అట్టు లప్పుడు బీరములు వలికి యిప్పు డీకయ్యంపునేలకుఁ దెచ్చి సరివారు నగ నిట్లు చేసితివి. దీన నీకుఁ గలిగెడుప్రయోజనం బెయ్యదియో యెఱుంగరాదు. నీవలన నత్యంతశ్రేయములు వడయఁ గోరియుండ నీ విట్టులు పండ్లులేని పూచినమ్రానిమాడ్కి నిష్ఫలుండ వగుట యెఱుంగక మోసపోయితి. మాంసము గప్పినగాలమురీతిని నన్నమునం బొదివినవిషముచందమునను రాజ్యవ్యాజభరిత మైనచేటు చూపితివి. సుక్షేత్రమున విత్తినయతండు ఫలముంబోలె నీపదుమూఁడేఁడులు నీవలన మేలు గాంచఁగల మనునడియాసచే ని న్నాశ్రయింపఁగ మమ్ము నంపఱ నొక్కతేప నిరయమ్మునఁ ద్రోచితివి. నీవు పుట్టినయేడవనాఁ డోకుంతీదేవీ, మహేంద్రపరాక్రముఁడైనయీకుమారుఁడు ఖాండవదహనవ్యాజ  న సురలం జయించు. మద్రకళింగకేకయాదినానారాజులనుం గెలుచు. మహారణమునం గౌరవులం బరిమార్చు. ఇతనికంటె నుత్తముఁ డగుధానుష్కుఁ డొండొకండు గలుగఁడు. వీని నెవ్వరును గెలువఁ జాలరు. సమాప్తసర్వవిద్యుఁడై యీకుమారుఁడు మదిం దలంచునేని సకలభూతలమును దనవశమున నిల్పికొనఁ జాలును. కాంతిచేఁ జంద్రునకును వేగమున వాయువునకును స్థిరత్వమున మేరుగిరికిని క్షమాగుణమునఁ బృథివికినిఁ దేజమున సూర్యునకును ధనసంపత్తిం గుబేరునకును శౌర్యమున నింద్రునకును బలమున నుపేంద్రునకును నీకుమారుఁడు సాటివచ్చు. తమవారల గెలిపింపను బగవారల వధియింపను జాలినయీకుమారుఁడె కులసంతతి

కర్త యగు నని శతశృంగపర్వతమునం దాపసోత్తము లందఱు వినుచుండ నశరీరవాణి యెఱింగించె. అదియు బొంకయ్యె. సురలు ననత్యవాదు లగుదు రొక్కొ? నీ విట్టు రాధేయునకు వెఱచుట యింతకు మున్నెన్నఁడు నెఱుంగనైతి. ఎఱింగియుండిన నీకయ్యమే రాకయుండును. విశ్వకర్మ నిర్మించినయుత్తమరథ మును గపిధ్వజంబును గాంచనభూషితం బైనకృపాణంబును దాళమాత్రం బైన యీగాండివంబును గృష్ణసారథ్యమహిమమునుం గలిగియు నీ విట్లు పిఱికివైతి వింక నే మనం గలదు. రాజ్యహీనులు సుఖభ్రష్టులు నగుమమ్ము వృథా రణమునఁ బుత్రమిత్రబాంధవవిహీనులం గావించితివి. నీనిమిత్తమున ఘోరదుఃఖాక్రాంతులై మేము పడరానియిడుమలఁ బడుచుండ నందఱుం జూచి యిఁక నపహసింతురు. పృథాదేవిగర్భ మేల సొచ్చితివి? సొచ్చితేనియుఁ బిండమై యుండినపుడే పాత మొందిన మేలై యుండు. ఇఁకనైన నిన్ను నమ్మి చెడరాదు. కర్ణుం జంపఁ జాలవేని గాండివము గోవిందున కొసంగి నీవు రథచోదనంబు సేయుము. నీకంటె నధికుఁ డగుటం జేసి యచ్యుతుండు వృత్రవధోద్యతుం డైనయాఖండలునివీక మెఱసి గాండివముక్తము లగుతీవ్రశరముల రాధేయుం దెగటార్చును. పోర వెన్నిచ్చి పాఱుట నీకు క్షాత్రధర్మంబై తోఁచెనే? గాండివమును బాహువీర్యమును బాణగణములును హనుమత్కేతనంబును నగ్నిదత్తదివ్యరథంబును నీనిమిత్తమున నిందాపాత్రము లయ్యె నని ధర్మరా జత్యంతపరుషప్రకారమునఁ బలికె.

### అర్జునుఁడు ధర్మజుమాటల కలిగి యతనిం జంప ఖడ్గముఁ గొనుట.

ధర్మరాజుదారుణవచనములు విని యర్జునుఁడు పరమక్రోధసంరంభసంభరితుండై ఖడ్గ మొఱనుండి తీయుటయు సకలప్రాణిచిత్తజ్ఞుం డైన నారాయణుం డతనికోప ముపలక్షించి పార్థా, యిదియేమి ఖడ్గముఁ గొనియెదవు? వధ్యకోటి యిక్కడఁ గానంబడదు. వధ్యు లైనధార్తరాష్ట్రుల నక్కడ వృకోదరుఁ డాఁగి పోరుచున్నవాఁడు. అజాతశత్రునికుశల మరయుంగదా యిటకు వచ్చితిమి. ఇమ్మహానుభావుఁడు కుశలియై యున్నవాఁడు. సంతోషమున కవసరం బైనయిప్పు డేల యిట్లు మోహకార్యమునకుఁ దొడరెదవు. చిత్తవిభ్రమంబు గదిరెనే? నీచేయఁ దలఁచినపని యెయ్యది యని యడిగినం గిరీటి ధర్మరాజుదెసం జూడ్కి సారించుచుఁ గ్రోధఘూర్ణమానమానసుండై పదాహతమగుపన్నగము చందమునఁ బెద్దయు రోఁజుచు వనజోదరున కిట్లనియె. గాండివ మొరుల కిమ్మని యెవ్వండు పలుకు వానితలఁ దెగ వేయుదు నని యేను రహస్యముగ నామనంబునఁ బ్రతిజ్ఞ చేసియుండుదు. ఇప్పు డీరాజు నీవు వినఁగ నమ్మాట పలికెం గావున ధార్మికుఁడై నను బ్రతిజ్ఞాపాలనపరుండనై యితనిమస్తకంబుఁ గోయం దలంచి వాలు పెఱికితి. ఉత్తీర్ణప్రతిజ్ఞుఁడనై సత్యముఁ బాలించి యసత్యభీతిం బాయుదు

ననియున్నవాఁడ. నీ వేమి చెప్పెదవు. విదితవేదితవ్యసాకల్యుఁ డై ననీవు నిరూపించిన తెఱంగునం జేయుదు ననిన విని యచ్యుతుఁడు మనమునం గుత్సించుచుఁ బార్థున కిట్లనియె. ఇట్లు సంరంభవశుఁ డై ననిన్నుఁ జూచి వృద్ధోపసేవనము నీకుఁ జాలదని తలంచెద. ధర్మవిభాగవినిశ్చయజ్ఞుఁ డై నపండితుఁడు నీయట్లు సంరంభి గాఁడు. కార్యాకార్యముల నిరూపించి యెఱుంగనియతండు పురుషాధముఁ డనం బడు. ధర్మసంక్షేపవిస్తరసూక్ష్మముల నెఱింగిన పెద్దలనిశ్చయము నీ వెఱుంగవు. కార్యాకార్యవినిశ్చయజ్ఞానహీనుఁ డై నవాఁడు నీయట్లపోలె నవశుఁడై పాపమునకుఁ బాత్రం బగు. శ్రుతసంపత్తి లేకుండినం గార్యాకార్యము లెఱుంగరాదు. అదియు నీకు లే దని నిశ్చయించెద. ధర్మసూక్ష్మముల నెఱుంగు దేని సత్యధర్మపాలనము కర్తవ్య మని తెలిసిననీ వహింస పరమధర్మ మని యింతవట్టు తెలియకుండుదు వే? సత్యమునకేనియుఁ దప్పనచ్చుఁ గాని యహింసావ్రతమునకుఁ దప్పరా దని నామతంబు. జ్యేష్ఠభ్రాతృశ్రేష్ఠుఁడు రాజు ధార్మికుఁడు మహానుభావుఁడు నగుధర్మరాజును జంపఁగఁ బ్రాకృతునియట్లు వివేకవికలుండ వై పూనితివి. పోరుడిగినవానిని, లేటమొగంబు వెట్టి పఱచువానిని, శరణాగతునిఁ, గేలుమోడ్పు ఘటియించినవానిని, నేమఱినవానిని, నాయుధాదిసాధనవిహీనుని శత్రుని నైనం జంపరా దనుధర్మము నీ వెఱుంగవే? ధర్మతత్త్వం బిట్టు లుండ గురుఁ డై నయన్నను వధింపఁ బూనుట యొప్పునే? బాల్యమున నెఱుక లేక యొక్క వ్రతముఁ బూనినం దాని నెఱవేర్పనవలయు ననుట వివేకం బగునే? భీష్ముఁడును ధర్మరాజును విదురుఁడును గుంతీదేవియును గరుణించి బోధించు తెఱంగున నేను నీకు ధర్మసూక్ష్మముఁ దెలిపెద వినుము. సత్య మొక్కండే యనుష్ఠేయ మనునియమము తగదు. సమయాసమయముల నెఱింగి సత్యాసత్యంబులం బ్రయోగింపవలయు. కొన్నియవసరంబుల సత్యంబు పాతకం బగు. కొన్నివేళల ననృతంబు ప్రశస్తంబై పుణ్యకారణం బగు. వివాహకాలము, రతిసంప్రయోగము, ప్రాణాపాయము, సర్వధనవినాశము, బ్రాహ్మణకార్యము, ననునేనింటఁ బలికినబొంకు పాతకంబు గాదని పెద్దలు పలుకుదురు. ఇట్లు సత్యానృతములు నిశ్చయించి కాలోచితముగ వినియోగించుమహాత్ముఁడు సద్గతిం బ్రాపించు. కృతప్రజ్ఞుఁడునుం గొన్నియెడల దారుణకర్మ మాచరించి బలాకుఁ డంధవధమున నెట్లట్లు పుణ్యప్రాప్తుఁ డగు. ధర్మపరుఁడయ్యు మూఢుఁడు కొన్నియెడల ధర్మసూక్ష్మం బెఱుంగక యెగ్గు చేసి సరిత్సముద్రసంగమమునఁ గౌశికుఁ డెట్టు లట్టుల మహాపాపప్రాప్తుఁ డగు. ఇం దాశ్చర్య మెయ్యది యనవుడుఁ గిరీటి మాధవా, బలాకకౌశికచరిత్రములఁ దెల్పవే యనియడుగ నయ్యర్జునున కచ్యుతుం డిట్లనియె.

కృష్ణుఁ డర్జునునకు బలాకకౌశికచరిత్రములఁ జెప్పుట.

తొల్లి బలాకుఁ డనునొక్కవ్యాధుఁడు ధర్మపరుఁడై కామమునంగాక కుటుంబభరణార్థము మృగముల వధియించి తల్లిదండ్రులను నాశ్రితులనుం బోషించుచు స్వధర్మనిరతుఁడై యసూయావిరహితుఁడై సత్యవచనుండై యుండి యొక్కనాఁడు మృగముల నెక్కడనుం గానక కానలం ద్రిమ్మరుచు నొక్కసరోవరమున నీళులఁ ద్రావుచున్న యొక్కయంధమృగమును ఘ్రాణేంద్రియమున నయనేంద్రియవ్యాపారము నిర్వహించుదానిం జూచి నిష్కారణంబ వధియించె. వధియించినంతన గగనతలమునం బుష్పవర్షము గురిసె. అప్సరోనృత్యమును గంధర్వగానమునుం దనరె. ఆబోయను నాకలోకమునకుఁ గొని పోవ విమానము వచ్చె. అయ్యంధమృగము సర్వభూతములకు వినాశము గలుగ బ్రహ్మదేవునిఁ దీవ్రతపమున నారాధించుచుండఁ గినిసి విధి దాని నంధముఁ గావించె. అట్లు భూతవిధ్వంసమునకుఁ గడంగుచున్న యప్పాపమృగమును వధించుటంజేసి హింసాపరుండయ్యు నాబోయ నాకలోకప్రాప్తుఁ డయ్యె. కౌశికునిచరిత్రం బవధరింపుము. తొల్లి సరిత్సముద్రసంగమమునం గ్రామమునకు నాతిదూరదేశమునం దొక్కపుణ్యాశ్రమమునఁ గౌశికుఁ డన నొక్కబ్రాహ్మణుఁడు వసించువాఁడు సత్యమే పలుకుదు నని పూని సత్యవాది యనఁగ లోకమునఁ బ్రఖ్యాతి వహించి యుండ నచ్చోటికిఁ గొందఱు జనులు చోరభీతులై యేతెంచి యాచేరువ నున్నపొదఁ దూఱి డాఁగుటయు నాక్రముచ్చులు వచ్చి యింతకుమున్న యేతెంచినవారలెట కేగి రనియడిగినం గౌశికుఁడు సత్యవచననియమమునంజేసి వారు డాఁగిన చోటు చూపుటయు నాతెక్కలికాండ్రు వారల వధించి తదీయధనముఁ గొని యరిగిరి. అయ్యధర్మమున నాకౌశికుఁడు పాపభాగి యయ్యె నని యితిహాసంబులు ప్రవర్తిల్లు. కావున ధర్మసూక్ష్మము వృద్ధోపసేవనమునంగాని లెస్స యెఱుంగఁబడదు. కేవలశుష్కతర్కమున నిర్ణయింతు మనరాదు. ధర్మప్రవచనం బంతయు భూతప్రభవార్థ మేర్పడినయదియకాని యొండు గాదు. కావున నహింసానుగృహీత మగునదియె ధర్మ మనం బరఁగు. భూతధారణక్షమం బగుటంజేసి ధర్మమునకు ధర్మనామము విశ్రుతం బయ్యె. ధర్మము సంగ్రహించువార లెప్పుడెయ్యది వచించిన భూతద్రోహము దొడరునో యని చింతించి సత్యము పలుకుటయు బొంకుటయు నూరకుండుటయు సమయోచితంబుగా నడుపుదురు. సత్యమే పలుకమింజేసి వా రసత్యదోషమునకుఁ బాత్రభూతు లగుదురనుట యవివేకంబు. చోరాదులకుఁ జిక్కి ప్రాణములఁ గోల్పడునెడ నెన్నియే శపథములైనం జేసి తప్పించికొనినపిదప నాశపథముల నెఱవేర్పవలయు నని తలంపఁ బని లేదు. పాపాత్ము లగుకొందఱకు ధన మిత్తు నని సమయోచితముగా నొడంబడవలసి

యుండు. అట్టు లాడంబడితిమిగా యని యియ్యరాదు. పాపాచారుల కిచ్చిన సద్దానము దాతను బీడించుఁ గావున నాచోట నీకుండుట మేలు. ఇట్టినిమిత్తములు ప్రాణాపాయాదికములు పొసంగినపు డనృతంబు దోషాపాదకంబు గాదు. ఇంతయు వింటివికదా. ఇఁక ధర్మరాజు వధ్యుఁ డవుం గాఁ డని నీవ నిశ్చయింపు మనుటయు సవ్యసాచి దామోదరునకు మఱియు నిట్లనియె. మహాత్మా, మహాప్రాజ్ఞుఁడు మహామతి యగునీవు మాకు హితముగ బోధించితివి. నీవు మాకుఁ దల్లివి తండ్రివి పరమగతివి పరాయణంబవు. ముల్లోకములందును నీకుఁ దెలియని యర్థంబు లేదు. సర్వధర్మములు నీ వెఱుంగుదువు. ధర్మరాజును వధింపరాదు. గాండివము లాఁతుల కిమ్మనినవానిం జంపుట నాకును, దిండిపోత యని పిల్చిన వానిం బరాభవించుట భీమసేనునకును వ్రత మని నీ వెఱుందువుగదా. ఆవ్రతముఁ దలపోసి ధర్మజుని వధించితినేని నే నెక్కనిమేషమేనియు మేనఁ బ్రాణములఁ దాల్చియుండ నోపను. కావున నాకుఁ బ్రతిజ్ఞాభంగమును ధర్మరాజునకును నాకునుం జేటును గలుగకుండఁగను నెక్కయుపాయంబుఁ దెల్పి యనుగ్రహింపవే యని వేఁడినవివ్వచ్చున కచ్యుతుం డిట్లనియె. అర్జునా, ధర్మరాజు కర్ణుని శాతసాయకములతాఁకునఁ బెద్దయు డయ్యుటంజేసి కోపవిషాదములు మనమునఁ బెనఁగొనినకతన నిన్నుఁ దూలనాడె నిది ప్రాభవముగాని కోపము గాదు. మఱియు నీరహస్యవ్రతము నితఁ డే మెఱుంగు. కర్ణుఁడు హతుఁడైనం గౌరవులందఱు హతు లనుబుద్ధింజేసి యీకయ్యంపుజూదమునం గర్ణవధము పందెముగా భావించి యాదురాత్ముఁ డింతకు బ్రదికియున్న వాఁ డని తెలిసి చింతాక్రాంతచిత్తుండై యీతఁ డిట్టులు ప్రల్లదము లాడెఁగాని యొండు గాదు. కావున ధర్మపుత్రుఁడు వధ్యుఁడు గాఁడు. నీకుం బ్రతిజ్ఞాభంగము గాకుండవలయుంగదా. ఇందుల కొక్కయుపాయంబుఁ జెప్పెద నాకర్ణింపుము. మానసార్హుఁ డగునుత్తమపూరుషుఁ డెల్లకాలము సమ్మానితుఁడై యెయ్యదియేనియు నిమిత్తమున నవమానప్రాప్తుఁ డగునేని బ్రదికియు మృతుఁ డనంబడు నని యథర్వాంగిరసశ్రుతి నిరూపించె. నీవును భీముఁడును గవలును జిన్ననాఁటఁగోలె నెంతయు భక్తియుక్తి సమ్మానం బొనర్పఁ దనరునీధర్మాత్మజుం బరుషవచనముల నీ విట్టివాఁడ వని పెలుచ నవమానించితేని యితండు మృతప్రాయుఁ డగుం గావున నీకుఁ బ్రతిజ్ఞాభంగము దప్పును. శస్త్రవధముఁ బరిత్యజించి వాగ్వధముఁ గావించి ధర్మరాజుజీవితంబు రక్షించి నీవును బ్రదుకుము. పదంపడి పాదప్రణామమునను సాంత్వవచనములను నిమ్మహారాజును శాంతి వేఁడు మిట్టులైనం గార్యంబు దప్పదు. పిమ్మట శాంతచిత్తుం డైనయీయన్నయనుగ్రహంబు వడసి కర్ణుం జంపుము వని వచించె.

శ్రీకృష్ణునిపంపున నర్జునుఁడు ధర్మరాజును నిందించుట.

అత్తెఱంగునం గమలనాభుఁడు బోధింపఁ దద్వచనముఁ గొనియాడి యర్జునుఁ డెన్నఁడేనియుం బలుకనిప్రల్లదముల నన్న కిట్లనియె. నృపాలా, ధైర్యధుర్యుండై బలవిక్రమదుర్దముఁడై యరాతిభీషణంబుగఁ గార్ముకజ్యాఘోషణంబు నిగిడించి మహామేఘము సలిలధారల నెట్టు లట్టుల శరాసారముఁ బరఁగించి యేనుంగులఁ బీనుంగులఁ గావించియుఁ దురంగముల వధించియుఁ దేరుల ఖండించియుఁ గాలుమానుసులఁ జెండాడియు మహారథుల బడలుపఱిచియు వేడుక పుట్టి యుద్దండగదాదండముఁ జేతం బూని దండధరునివీఁక మెఱసి మృగగణములపైఁ గవియుక్రూరపంచాననముచాడ్పున గండడరి యంగవంగకళింగనిషాదకాంభోజానీకంబులఁ గాలఁ బెట్టి కేలఁ జమరియు నార్చి పేర్చి నిర్వక్రవిక్రమాటోపమున దీపించు భీమసేనుఁడు నన్నాక్షేపించినం జెల్లుఁగాని క్షాత్రధర్మ మగు బాహుబలము విడిచి యనికిఁ గ్రోశమాత్రదూరమున నిల్చి విప్రధర్మ మగువాగ్బలము బలముగాఁ గొని యిట్టులు ప్రల్లదము లాడ నీకుఁ దగదు. నాబల మెట్టి దగుటయు నీ వెఱుంగుదువుగదా. దారపుత్రజీవితాదుల నీకుఁ బ్రియము సేయం బూనిననన్ను నీ విట్టులు దూఱుదువుగాని నీవలన నించుకేనియు సుఖ మెఱుఁగను. నీ కెక్కినప్రీతిగాఁ బెక్కండ్ర మహారథుల వధియించితి. ద్రౌపదీతల్పమునం గూర్చుండి యిట్లు పల్కినం జెల్లదు. మఱియు భవత్ప్రియార్థము పితామహుఁడు నిజవధప్రకార మెఱిఁగింపఁగ నేను శిఖండిని ముందిడికొని పోరి యతనిఁ బుడమిం ద్రోయించితి. వెండియు నప్పుడప్పుడు తగునవసరముల నే మేమి చేసితి నదియెల్ల మఱచితివే? జూదము సర్వనింద్య మని సహదేవుఁడు మీఁదు మిక్కిలి బోధించినను నీవు తనకుఁ దాన యాడి యోడి కష్టప్రాప్తుఁడవై మమ్మును గడు నిడుమలం బఱచి యాత్మదోషమునఁ దొడరినకీడు దొలఁగించికొనం జాలక ప్రాణములమీఁదియాసయుం దలంపక పోరుచున్నమమ్ముఁ దూలనాడెద వింత కంటెఁ గష్టము గలుగునే? నాచేతం గూలినక్షత్రియానీకంబు దెసం జూడుము. నీనిమిత్తమునం బుట్టినకలహమునం జేసి ప్రాచ్యదాక్షిణాత్యప్రతీచ్యోదీచ్యరాజులు పెక్కండ్రు మడిసిరి. రాజ్యనాశమునకు మూలము నీవ. ఇఁకనైన నల్పభాగ్యత్వమునం జేసి మాకుఁ గినుక గదురఁ దూలనాడుట మాను మని యిట్లు ధనంజయుండు వాసుదేవునిమతమున నిజప్రతిజ్ఞాభంగముఁ దప్పించికొనువాఁడై పరుషాక్షరములు పలికి ధర్మభీరుఁడు గావున విహ్వలుండై పరమధార్మికుఁ డైనయన్నను నిందించినం బాతకము మూఁడె ననితలపోసి పశ్చాత్తాపసంతప్తచిత్తుండై వేఁడి నిట్టూర్పులు నిగిడించి తనజీవితంబు రోసి యొఱనుండి రయమున వాలు పెఱుకుచున్నంత మురాంతకుఁ డోయర్జునా, యిది యేమిపని? క్రమ్మఱం గృపా

ణంబుఁ గొనిమెద వని యడుగుటయుఁ బార్థుఁడు మహాత్మా, యగ్రజుం దూల నాడినందులకుఁ బ్రాయశ్చిత్తంబుగాఁ దల గోసికొన నిశ్చయించితి ననుటయు నాసంరంభ ముడిపి నారాయణుఁ డన్నరునకు వెండియు నిట్లనియె.

అర్జునా, ధర్మరాజును ద్వంకారయుక్తముగ నిందించినమాత్రన యిట్లు జీవితమున రోసితివి. ధర్మస్వరూపుఁ డైనయమ్మహారాజును గృపాణంబున నఱికితేని యేమి గాఁగలవాఁడవు.ధర్మసూక్ష్మంబు దురవగాహంబు వృద్ధోపసేవనంబునఁగాని యుక్తివాదమున నిర్ణయింప నలవి గాదు. ధర్మాధర్మస్వరూపంబు విచారింపక నీ వాత్మహత్యకుఁ దొడఁ రెదవు. దాన భ్రాతృవధపాతకము రాక తక్కదు. ఆపాపమునకుఁ బాత్రభూతుఁడు గాకుండఁగను నీతలంచినభాతృనిందా ప్రాయశ్చిత్తనిశ్చయమునకు భంగము వొసఁగకుండఁగను నొక్కయుపాయంబు సెప్పెద. ఆత్మస్తుతి మరణతుల్యము గావున నీధర్మరాజు వినంగ నిన్నుఁ బొగడికొను మని బోధించుటయు నట్ల యని ధనంజయుండు సజ్య మగుగాండివముఁ జేతం బూని రాజేంద్రా, విను మని ధర్మరాజున కెఱింగించి యిట్లనియె. పినాకపాణి యగు రుద్రుఁడు దక్క నొండొకవిల్కాఁడు నాకు సరివచ్చువాఁడు గన్పట్టఁడు. అమ్మహాదేవుననుమతింజేసి యేను క్షణమాత్రలో నీచరాచరాత్మకం బయినజగమంతయుఁ బరిమార్పఁ జాలుదు. ఏను దిగ్విజయంబునఁదఱి రాజులనెల్ల గెలిచి ధనకనకరాసులం దెచ్చి యిచ్చిన నీవు రాజసూయాధ్వరంబు విధివిహితప్రకారమున నాచరించితివి. ఇంద్రప్రస్థమున నీవు నిండోలగముండెడునాసభయు నేను బాహుబలమున సాధించినదియకదా. అక్షయతూణసముల్లసితుండనై యేను గాండీవము గ్రహించి నారి సారించి వాలమ్ములఁ బరఁగింతునేని నాయెదుర నిల్చు మగఁ డొక్కఁడునుం గలుగఁడు. ఉదీచ్యులు మడిసిరి. ప్రతీచ్యులు సమసిరి. ప్రాచ్యులు తెగిరి. దాక్షిణాత్యులు వొలిసిరి. సంశప్తకానీకంబు కించిదవశేషముగ సర్వము తెగటాఱె. దేవసైన్యసంకాశ మగుభారతసైన్య మల్లదె నాచేఁ దెగి రణక్షోణిం బడియున్నది. అద్దెసం జూడుము. లోకమునం గలదివ్యాస్త్రవిదుల నందఱను నుత్తమాస్త్రప్రభావమున నేను నీఱుసేయఁ జాలుదు. కృష్ణా, జయప్రద మగుస్యందనోత్తమ మారోహించి రాధేయుం బరిమార్పఁగఁ బోవుదము రమ్ము. కర్ణునిచావు విని నేఁ డీధర్మరాజు సుఖనిద్ర సేయుఁగాక. రాధయొంటెఁ గుంతియొండె నేఁడు పుత్రశోకముఁ గుడుచుట తప్పదు. కర్ణుని గాండివనిర్ముక్తకాండజాలమున కెర సేయకకాని కత్తళము పుచ్చ నింతయు సత్యం బనిపలికి సవ్యసాచి యాత్మస్తవంబున లజ్జితుండై తల వాంచి గాండీవాదిసాధనముల నవలం బెట్టి ధర్మరాజునకుఁ గేలుమోడ్పు ఘటియించి మహారాజా, ప్రసన్నుఁడవు గమ్ము. భవదీయచిత్తశాంతిఁ గోరెద. నీపాదములకుఁ బ్రణమిల్లెద. నామీఁది

కోపము విడువుము. ఇదె యేనరిగి భీమునకు సంగ్రామభారము కొలంతగావించి యారాధేయుం జంపెద. నాజీవితము భవత్ప్రియార్థంబకాని యొండుగాదని పలుమాఱు పలుకుచుఁ బ్రణామముఁ గావించుటయు ధర్మరాజు తదీయపరుషవచనములకు ఖేదపరీతచిత్తుండై పాన్పునుండి లేచి సవ్యసాచి కిట్లనియె. యర్జునా, నాచేసినయసాధుకృత్యముననే మీ కీవ్యసనము మూఁడె. కులాంతకుఁ డధమపురుషుఁడు పాపాత్ముఁడు వ్యసనాన్వితుఁడు మూఢబుద్ధి యలసుఁడు భీరుఁడు వృథావమాని పరుషుఁడు నగునామస్తకంబు ఛేదింపుము. పరుషములకేనియు నోర్చి నాకుఁ బ్రియంబు నీ వేల చేయవలయు? ఇదే నేను వనమునకుఁ బోయెద. మద్విహీనుఁడవై నీవు సుఖింపుము. నాపరుషము లింక నీకు వినం బనిలేదు. భీతచిత్తుండైననేను రాజ్యార్హుండఁ గాను. ధైర్యధుర్యుండైన భీమసేనునకుఁ బట్టాభిషేక మొనర్పు టుచితంబు. నేనిచ్చట బ్రదికియుండఁగ భీముని రాజ్యాధిపతిం జేయరాదు కావున నా కరణ్యగమనంబు సముచితం బనిబలుకుచు ధర్మరాజు కానకేగఁ దలఁచుచున్నంత మురాంతకుఁ డయ్యజాతశత్రునికాళ్లు పట్టికొని రాజేంద్రా, సవ్యసాచి తన్ను గాండీవ మొరుల కిమ్మని పలికినవానిని జంపుట ప్రతిజ్ఞాకృత్యంబు గావున నీ వట్లు పలుకుటంజేసి ధర్మద్వైధము సంభవించుటయు గురునిఁ దిరస్కరించుట వధ మగు ననిబోధించినకతన నితండు నిన్నిట్టులు దూలనాడెఁగాని యొండుగాదు. ఇంతయు నీ వెఱుంగుదువుగదా. శరణాగతులైనమాయిద్దఱియపచారముల సైరించి కోప ముడిగి ప్రసన్నుఁడ వగుము. నేఁడు రాధేయుని నెత్తురు భూమి ద్రాగఁగలదు. ఆసూతసుతుఁడు హతుఁ డయ్యె నని తలంపు మింతయు నిక్కువంబు. నీ వెవ్వరిపై నలుగుదు వారు బ్రదుకఁగలరె యని పలుదెఱంగులం బ్రార్థించె.

ధర్మరాజు శ్రీకృష్ణునివచనములఁ బ్రసన్నుఁ డగుట.

అవ్విధమున మధుమథనుండు ప్రార్థించిన నాకర్ణించి ధర్మరాజు చరణానతుండైనయయ్యచ్యుతుని ససంభ్రమముగ లేవనెత్తి కృతాంజలియై మహాత్మా, నీనిరూపించిన దంతయు నిక్కువంబు. బుద్ధిప్రమాదమున నలిగితి. సైరణసేయుము. నీవు హితుఁడవై యనునయించి యున్నయర్థము బోధించుటంజేసి యజ్ఞానమోహితులమగు మే మిద్దఱమును ఘోరవ్యసనార్ణవము నిస్తరించితిమి. నీవు గలుగ నాథవంతులైనమాకు భవదీయబుద్ధియే యెల్లప్పుడు సంకటసముద్రములం గడవ నావ యయ్యెడి ననినం బ్రీతిబంధురం బయినయజాతవైరివచనం బాకర్ణించి యగ్రజుం దూలనాడుట పాతకం బని భావించి విన్నఁబోయినమొగంబు వాంచియున్నయన్నరునకు నారాయణుండు నవ్వుచు నిట్లనియె. కుంతీనందనా, ధర్మరాజును నీ విట్టివాఁడ వని పలికినందులకే యిట్లు వగఁ గుందెదు నీవు వాఁడి కర

వాలమునఁ దలఁ దఱిగితివేని యెట్టు లగుదువో. ధర్మసూక్ష్మము దుర్గమంబు. ధర్మ
భీరుత్వకారణముననే ధర్మాధర్మస్వరూపంబు లెస్స యరయక పూనినట్టులు చేసితే
ని భ్రాతృవధపాతకమున ఘోరనరకమునం బడుదువుగదా. అందులకెల్లఁ దప్పితివి
మే లయ్యె. ధార్మికవరేణ్యుఁడైన ధర్మరాజుప్రసాదముఁ బడయుటకంటె నొండు
కర్తవ్య మిప్పుడు లేదని నామతంబు. ఇమ్మహాత్ముఁడు ప్రసన్నచిత్తుండై దీవించు
నేని నీకుఁ గర్ణవధంబు సుకరం బని తేటపఱిచినం బార్థుఁడు లజ్జావనతవదనుండై
యగ్రజుచరణములపయిం బడి యోమహానుభావా, కరుణించి ప్రసాదింపుము.
ధర్మకామమునం జేసి నారాయణు ననుమతంబున నేఁ బలికినపరుషముల సైరింపవే
యని వేమాఱు విన్నవించుచుఁ గన్నీరు నించుచున్న యనుంగుఁదమ్ముని ధనంజయుని
లేవనెత్తి బాష్పపూరితలోచనుండై ధర్మరాజు స్నేహబంధురముగ నతనిం గౌఁ
గిటం జేర్చిన నయ్యన్నదమ్ములిద్దఱు పెద్దయుం బ్రొద్దు కడు నేడ్చి తత్కాలసన్నిహి
తసేవకులు జలముఁ దేర ముఖప్రక్షాళనముఁ గావించికొని యొండొరులపయిం
బ్రేమానుబంధబంధురము లగుచూడ్కులు సారించుచుండిరి. అట్టియెడ ధర్మాత్మజుం
డు పరమసంప్రీతచేతస్కుండై ధనంజయా, యెల్లవారును గనుంగొనుచుండఁ
గర్ణుఁడు నామైమఱు వఱువుల్లుగావించియు సిడముఁ గూల్చియు విల్లు దునిమియు
గుఱ్ఱములఁ జదిపియు సాధనగణమునెల్ల వికలముఁ గావించియు బలుతూపుల
నొంచినం బ్రాణముల రోసి యేను విషాదసమాక్రాంతుఁడ నైతి. నేఁ డారాధే
యునిఁ దెగఁజూడవేని ప్రాణముల విడిచెద. వాఁడు బ్రదికెనేని నాజీవితమునం
బ్రయోజనం బెయ్యది యనిన విని యర్జునుఁ డగ్రజున కిట్లనియె. నీయానను భీమ
నకులసహదేవులయానను సత్యంబునానను నేఁడు కర్ణుం జంపువాఁడను. అందులకుఁ
జాలనేని వానిచే హతుఁడ నగుదు నింతయు నిక్కువం బనిచెప్పి మాధవుదెస
మొగంబై మహాత్మా, నేఁడు నాచేఁ గర్ణుఁడు హతుఁడు గావలయు నని నీచిత్త
మునఁ దలపోయుదేని వాఁడు సచ్చినవాఁ డని నమ్మెద ననవుడు గోవిందుఁ డయ్యా,
నీకోర్కి నెఱవేఱక తప్పదు. నీచేఁ గర్ణుఁడు నేఁడు తెగు ననిపలికి దామోదరుండు
ధర్మరాజును జూచి మహారాజా, యర్జును నూఱార్చి కర్ణుని వధింపఁగఁ బంపుము.
నీవు రాధేయుశరముల నొచ్చితి వనిమేము నీకుశల మరయ వచ్చితిమి. భాగ్యవ
శమున నీవు వానికిఁ జిక్కక తప్పించికొని యెలమి నుండెదవు. విజయము సేకూఱ
విజయునకు దీవన లిమ్మని పలికె. వాసుదేవవచనము విని పాండవాగ్రజుం డన్న
యర్జునా, రారమ్ము నన్నుఁ గౌఁగిలించికొనుము. నీపలికినపలుకులు వక్తవ్యము
లగుటంజేసి యే నోర్చితి. ఏను బెక్కులుకాఱు లఱచినందులకుఁ గినియవలదు.
అనుజ్ఞ యిచ్చితి ననికిఁ జని కర్ణుం గెలువు మనుటయు సవ్యసాచి ఫాలతలంబు
చరణకమలంబులు సోఁకఁగ నగ్రజునకు సాష్టాంగదండప్రణామం బాచరించి

కాళులం బట్టికొనుటయు ధర్మరాజు తనకెంతయుం గూర్చుకూరిమితమ్ముం డగున య్యర్జును లేవనెత్తి బిగియారుకౌఁగిటం గదియించి మూర్ధఘ్రాణం బొనరించి ధనంజయా, నీ వత్యంతసమ్మాన మొనర్చితి వుల్లసిల్లితి. విజయమహిమంబు నీకు శాశ్వతం బయ్యెడు మనిదీవించె. అంతఁ బ్రమోదమానమానసుండై కిరీటి మహారాజా, నేఁడు రాధేయునిఁ బుత్రమిత్రగణసహితంబుగాఁ బరిమార్చెద. ని న్నింత పఱిచినయప్పాపాచారునకుఁ దత్ఫలంబు గుడువక తీఱదు. కర్ణుని వధియించి పరమానందముఁ గావించువాఁడనై నీదర్శనమున కరుదెంచెద. ఆదురాత్ముం దెగటార్పక కయ్యు ముడుగను నీపాదములాన యని పలికి తదీయచరణములఁ దాఁకుటయు యుధిష్ఠిరుండు మోదవికస్వరుండై యన్నా, క్షీణశోకం బగునీస్మితజీవితంబును రిపుక్షయజయంబును నీ కయ్యెడు. దేవతలు సమయసముచితబుద్ధిం బ్రసాదింతురు. నాకోర్కులెల్ల నీడేఱెడు. రయమునం బోయి పురందరుఁడు వృత్రుం బోలె రాధేయుం బరిమార్చు మని పలికె.

అర్జునుఁడు ధర్మరాజునను జ్ఞఁ గొని రణక్షోణికిఁ జనుట.

ధర్మరాజుచిత్తము ప్రసన్న మగుటకుఁ బ్రహర్షోత్కర్షభరితుండై పార్థుఁడు సూతసుతవధోద్యతుండై యచ్యుతుం జూచి మనయరదము సవిశేషసన్నాహబంధురము గావింపఁ బంపు మనుటయు వనజోదరుండు దారుకుం బిలిచి యట్లు వచించుటయు నతండు గుఱ్ఱముల శల్యము లపనయించి కడిగి పానీయపానఖాద్యఖాదనంబులు నిర్వర్తించి పూనిచి సకలసాధనములం జేరిచి కపికేతనాభిరామం బైన యాదివ్యరథమును గొని వచ్చి విన్నవించునకుఁ బొడసూపుటయు నమ్మహారథుఁడు ధర్మరాజును వీడ్కొని తదీయమంగళాశీర్వచనములం గ్రహించి భూసురులస్వస్తివచనమ్ములకు నెమ్మనమ్మున నలరుచు సవిశేషకల్పితమంగళసన్నాహ మగునాదివ్యరథమును వాసుదేవసారథికం బగుదాని నారోహించె. అట్లు సవ్యసాచి రథారోహణంబు చేసి ధర్మనందనాశీర్వాదమంగళప్రాప్తుండై రణక్షోణీతలమునకుఁ జనునెడ సకలజనులును గాండీవిచేఁ గర్ణుని హతునిఁ గాఁ దలంచిరి. మఱియు నట్టియెడ దిక్కులెల్ల నిర్మలములై కన్పట్టె. చాషశతపత్రక్రౌంచాదివిహగము లప్పార్థుని వలగొనియె. కంకగృధ్రబకశ్యేనవాయసాదు లాసవ్యసాచిని వేగిరపెట్టుచు మాంసాశననిమిత్తమునంజేసి సంతసంబునం బెల్లఱచుచు ముందు పఱచె. వెండియు గాండీవికి గెలుపు సమకూఱుట సూచించునిమిత్తములు పెక్కులు దోఁచుటయు నప్పుడు చింతాభరమునంజేసి కిరీటిమేను సెమర్చుటం జూచి మధుసూదనుఁ డతని కిట్లనియె.

కృష్ణుఁ డర్జునునితోఁ గర్ణవధమున కుత్సహింపు మని చెప్పుట.

గాండీవీ, భండనమున నీవు గెలిచినశూరుల నెండొకమానవుఁడు గెలువఁ

జాలఁడు. భీష్మద్రోణభగదత్తులను నవంతినాథు లగువిందానువిందులను గాంభోజ సుదక్షిణుని శ్రుతాయురచ్యుతాయువులను మఱియుం బెక్కండ్రుశూరులనుం దాఁకి యేకీడును గానక యెలమి నుండఁగ నీకుఁ దక్క నింకొక్కని కలవియే? నీకుఁ గలదివ్యాస్త్రసామగ్రియు లాఘవమును బలమును సమరమున నసమ్మోహమును విజ్ఞాననైపుణమును లక్ష్యవేధపాతయోగములును నన్యుల కలవడవు. నీ వలుగు దేని చరాచరాత్మకం బగుసకలప్రపంచమును దేవదానవగంధర్వాదులతోడ రూపడఁగింపఁ జాలుదువు. భూమండలమున విల్లు పట్టినరాజు లందఱును నీకు సరి గారు. బ్రహ్మదేవుఁడు ప్రజల సృజించినయట్టులు గాండివంబును నిజయోగమహిమముననే సృజించె. అయ్యది నీకు సాధనమై తనర నీవిక్రమమున కెన్నఁడేనియు నెచ్చటనేనియుఁ బ్రతిహతి గలుగనేర్చునే? ఐనను హితముచెప్పకునికి తగదు. కావునఁ గొన్నిమాటలు చెప్పెద వినుము. కర్ణుఁడు సామాన్యుఁ డని యతని నవమానింపరాదు. బలవీర్యముననుదివ్యాస్త్రప్రభావమునను జిత్రయుద్ధచాతుర్యమునను దేశకాలపరిజ్ఞానమునను సాహసముత్సాహంబునను నతఁ డలంతులఁ బోయెడువాఁడు కాఁడు. తేజమున నగ్నికిని వేగమున వాయువునకును గ్రోధమున నంతకునకును సమానుఁడు. అష్టారత్నిమాత్రశరీరంబును నాజానులంబమానబాహులును విశాలవక్షస్థ్సలంబును మున్నగునుత్తమలక్షణముల నొప్పి యత్యంతాభిమానమును ధార్తరాష్ట్రహితచింతనతాత్పర్యమును మీకుఁ జేటు సేయఁ దలంపునుం గలయారాధేయుఁడు దుర్జయుఁ డని తలంపవలయు. పెక్కేల? నీకు సమానుఁ డధికుఁ డగుంగాని తక్కువ గాఁ డని యెఱుంగుము. అట్టి శూరశేఖరుని సురపతిప్రముఖులును నిర్జింప నోపరు. వాఁడు నీకుఁ దక్క లాఁతుల కవధ్యుఁ డగుట నిక్కువంబు. దురాత్ముఁడు పాపాచారుఁడు స్వప్రయోజనము లేకున్నను నిరర్థముగ మీతోఁ గలహించునృశంసుఁడు నగునారాధకొడుకుం బరిమార్చి ధర్మరాజునకుఁ బ్రియం బొనర్పుము. ఆదురాత్ముఁ డెల్లపుడును మిమ్ముఁ జులకనాడుచుండు. మఱియు నీతో నత్యంతస్పర్ధకలిమిం జేసి యాతండు మీవారితోఁ బగపాటించియుండుఁ గావున మీవారిపై నాతఁడు గినియుటకు నీవె మూలంబు గావున నింకను నొప్పరికించిచూచు టనుచితంబు. ఏ ననుజ్ఞ యిచ్చితి. ఖడ్గము నాలుకగా మండలీకృతకోదండము నోరుగా నమ్ములు కోఱలుగాఁ గ్రోల్పులి కెనవచ్చునాకర్ణుని మదవేదండము మాఱుకొనుసింహముమాడ్కిం దాఁకి విక్రమించి వధింపుము. కౌరవపాండవసైన్యములు పోరికిఁ దొడంగి నేఁటికిఁ బదునేఁడునాళు లయ్యె. ఉభయసేనలును హతప్రాయములై కించిచ్ఛేషములై యున్నయవి. ఈచేదిమత్స్యకరూశపాంచాలసృంజయాదులు నీవు తమకుఁ గావలి గల వను పెనునమ్మికచేఁ గయ్యమునకుఁ గాలుద్రవ్వి శత్రువిధ్వంసంబుఁ గావించిరి. సురాసురగంధర్వాదిసహితంబు

గా మూడులోకములనుం గెలువఁ జాలిననీకుఁ గురుబలంబు గెలుచుట దుష్కరం బగునే? సకలపార్థివులును వీర్యసముద్రగుం డైననిన్నుఁ గన్నెత్తి చూడనైన వెఱతురు. నీప్రాపుకలిమి మనవారి కెంతమేలైనం జేయ నోపెఁ. కాదేని శిఖండి ధృష్టద్యుమ్నులు భీష్మద్రోణులం గూల్పఁ జాలుదురే? శక్రతుల్యపరాక్రము లగు భీష్మద్రోణు లజేయు లనుట యందఱకుం దెల్లంబుగదా. భీష్మద్రోణకర్ణకృపాశ్వత్థామభూరిశ్రవఃకృతవర్మసైంధవప్రముఖులం గెలువ నీకుఁ జెల్లుఁగాని లాతులు వారల మార్కొననేనియు నోపరు. ధార్తరాష్ట్రులకుఁ దోడుపడినయక్షౌహిణీపతు లిట్టివా రని నిరూపింపవచ్చునే? వారివిక్రమం బెల్ల నీచెంగట సూర్యునిముం దఱి దీపములచంద మయ్యె. నేఁటికేడునాళ్లపుడు సౌభద్రుఁడు జయత్సేనుని వధించె. శాంతనవుఁడును భారద్వాజుఁడు నెంతేనియు నేపు చూపి కోలుమసంగినను నీముం గల నదియెల్ల వమ్మయ్యె. నీపటుపరాక్రమమునంగాదె యల్లనాఁడు కురుపితామహుఁడు శరతల్పగతుఁ డయ్యె. ఆచార్యుఁడు ధృష్టద్యుమ్ననికృత్తకంధరుండై పడియె. నీవపుడు పైపై నడరుచున్నవీరుల నాఁగకుండుదేని వారలం గూల్ప నప్పాంచాలకుమారుల కలవియే? నీసల్పినసైంధవవధప్రకారము సెప్పఁ గొలఁదియే. అందుల కందఱును నివ్వెఱఁ గందిరి. ఆపవలింటనే బహుళాక్షౌహిణులు నీచేఁ దెగియె. భీష్మద్రోణులు పడుటం జేసి సూర్యచంద్రహీన మగుగగనమండపముమాడ్కిఁ గురుసైన్యము సొంపుదప్పె. ఇఁకఁ గర్ణకృపాశ్వత్థామకృతవర్మశల్యు లేవు రుత్తమశూరు లున్నవారు. వీరలం దెగటార్చి దైత్యదానవుల వధించి యుపేంద్రుఁ డింద్రుని నాకలోకాధిపత్యాభిషిక్తుఁ జేసినవిధంబున ధర్మరాజును నిఖిలమహీరాజ్యాభిషిక్తుం గావింపుము. గురుతనయప్రేమమున నశ్వత్థామను, నాచార్యగౌరవమునఁ గృపుని, మాతృబాంధవప్రణయమునఁ గృతవర్మను, మాతులభావమున శల్యునిం బరిమార్ప నెడంబడక కరుణింతువేనియు నత్యంతక్షుద్రుఁడు పాపమతియు నగురాధేయుని గాండీవనిర్ముక్తశరములకు బలి సేయుము. కర్ణుం బరిమార్చితేని నీ కెయ్యదియు దోషము గలుగదు. నడురేయి మిమ్ముఁ గుంతీసహితంబుగా లక్కయింటఁ గాల్పఁ బూనుటయు దుర్ద్యూతమున ధర్మరాజు నోడించుటయు మున్నగుమిూవ్యసనములకెల్లను, సంధికిఁ బోయినపుడు నన్నుఁ బట్టఁగ దుర్యోధనుండు గడంగుటకును వాఁడే మూలము. కర్ణుఁడు పాండవులం గెలుచు నని యాగాంధారీనందనుండు పెద్దయు నమ్మినవాఁడు గావున నీపరాక్రమ మంతయు నెఱింగియుఁ గయ్యమునకుఁ గాలుద్రవ్వె. ఆరాధేయుఁడును వానికిఁ బ్రోత్సాహముఁ గావించువాఁడై ''యేను బాండవులను వాసుదేవునిం బరిమార్తు'' నని పలుకుచుండు. అభిమన్యుఁడు ఘోరమూర్తియై కౌరవానీకంబుఁ గనుపుకొట్టుచు మార్కొన్నమేటివిలుకాండ్రనందఱను నోడించుచుండ నారాధేయుఁ డక్క

మారకంఠీరవునెదుర నిలువఁ జాలక తదీయశరవిద్ధగాత్రుండై లేటమొగంబు వెట్టి జయజీవితములయెడ నిరాశుఁడై విన్నఁబోయి యాచార్యవచనముపట్టి వంచనమై వెనుకటిదెస కరిగి కార్ముకంబుఁ దునించుటయు నిరాయుధుఁడై యుబ్బాలుఁ డాదొరలకుఁ జిక్కి యుక్కు దక్కి మడిసెఁ గావునఁ దద్వధమునకు నాపాపాత్ముఁడే మూలము. మఱియు నానీచుఁ డానాఁ డాసభకుఁ బాంచాలిని రప్పించి యోపృథుశ్రోణీ, ధార్తరాష్ట్రునకు దాసి వైతివి. నీమగలు జూదమున నోడి గొడ్డువోయిరి. వేఱొక్కని నీపైఁ గూర్మి గలవాని వరింపు మనిపలుకఁడే? ఇవ్విధమున యుష్మదీయదుఃఖావమానముల కెల్ల నిదానం బైనకర్ణుని సమయింపక కరుణింపఁ జనునే? గాండీవనిర్ముక్తపటుప్రదరములు నేఁడు మేను వ్రయ్యఁగ నెత్తుటం జొత్తిల్లి యాతండు తనబలముకొలఁది యరసి భీష్మద్రోణాదులు బోధించినహితవచనములఁ దలంపునకుఁ దెచ్చికొని వేదండకక్ష్యాభిరామం బగుకేతనము శాతభల్లనిహతంబై నేలం గూలినపదంపడి తేరినుండి పడుటయుఁ దదీయులు హాహాకారములు గావించుచుఁ గనుఁగొనఁగ శల్యుఁడు దీనాననుండై వెఱచి మ్రోడైనతేరు దోలుకొని పోవలయు. దుర్యోధనుఁడు రాజ్యమునందును జీవితమునయందును నాస విడిచి కుందవలయు. అల్లవారె పాంచాలురు రాధేయశరపీడితు లగుడు సాత్యకిధృష్టద్యుమ్నశిఖండులును నకులసహదేవులును దుర్ముఖజనమేజయసుధర్మశతానీకులు నుక్కుమిగిలి యక్కర్ణుం దలపడి పటుప్రదరనికరములు పరఁగింపఁ గోపించి యాతండు మఱియుం బలుతూపుగము లడరించినం గయ్యంపునేల నిలువ నేరక యప్పాంచాలురు వెఱచఱచి పఱచుచున్నవారు. భీష్మద్రోణులు విక్రమించునప్పుడు వెఱవక యొడళ్ళు లోమక జయకాంక్షులై పైపై నడరుపాంచాలశూరుల నేఁడు కర్ణుఁ డెంతయు వెగడుపఱుచుచున్నవాఁడు. ఇంత కెన్నఁడు నతనికి వెఱవనివీరు లిప్పు డిట్లు లగుచున్నారు. భార్గవాస్త్రము బహుళజ్వాలాజాలాభీలంబై యిట్టులు మనవారల నొంపను జంపనుం బూనుటయుఁ గర్ణార్ణవమగ్ను లయినవారికి నీ విపుడు నావమై యుద్ధరింపకుండినం గార్యంబు దప్పు. అల్లవియె రాధేయకార్ముకనిర్ముక్తము లగుతీవ్రనారాచములు భ్రమరపఙ్క్తులు కుసుమితపాదపముల నెట్టు లట్టుల పాంచాలసృంజయానీకములం జొచ్చుచున్నవి. నీ విం కొక్కింతతడ వుప్పరికించి చూచుచుండుదేని యప్రతీకార మగురోగము శరీరమునుంబోలెఁ గర్ణుఁడు మనయనీకము రూపడఁగించుట నిక్కువంబు. రాధేయుని మార్కొని చెడక గెలుపుతో మఱలి చనుదెంచుమగఁడు నీవుదక్క నెండొక్కరుఁడు మనలోఁ గలుగఁడు. కావున నీవు నిజప్రతిజ్ఞం దలపోసి కర్ణుం దెగటార్చి కీర్తిఁ గనుమని కేశవుఁడు కిరీటి కుత్సాహంబుఁ గల్పించువాఁడై తేటపడ నెఱింగించె.

**అర్జునుఁడు కృష్ణునివచనముల నుత్సాహియై పలుకుట.**

అవ్విధమున మధుసూదనుఁడు నిరూపింపఁగ ధనంజయుఁడు సాహసోత్సాహసంభ్రమసముల్లాసభాసురుండై విగళితచింతావికారుండై ప్రహర్షోత్కర్షవికస్వరుండై గాండివజ్యాఘోషము నిగిడించి కర్ణవధము డెందమునం దలపోసి గోవిందున కిట్లనియె. మహానుభావా, నీవు నాథుఁడగుటంజేసి నాకు విజయము సుస్థిరము. నీయనుగ్రహముఁ బడసినవారు సెడుదురే? నీతోడ్పాటునం బేర్చి యేను మూడుజగములనైన నెక్కవేల్మిడిలోనం గెలువఁజాలుదు నన్నుఁ గర్ణుం బరిమార్చుట దుష్కరం బగునే? ఇంద్రుఁడు వజ్రము నెట్టు లట్టు లాదురాత్ముఁడుగ్ర మగుభార్గవాస్త్రము సంప్రదీపితముఁ గావించి తనకు మాఱుమలయువాఁడు లేమింజేసి ధైర్యధుర్యుండై యెక్కడఁ జూచినం దానకా సంగరాంగణమునఁ గలయం దిరుగుచుండఁ గనుఁగొంటిని. ఇఁక మార్కొనియెద. నేఁటిపోరు పుడమి గలుగునందాఁక సవ్యసాచి కర్ణుని వధించె నని యెల్లవారును నన్నుఁ బొగడువిధమునఁ బ్రఖ్యాతిఁ గాంచఁగలదు. గాండీవనిర్ముక్తము లగుమదీయశాతసాయకములు నేఁడు రాధేయుం బరిమార్చుట నిక్కువంబు. రాజ్యార్హుఁడు గానిదుర్యోధనుని నిఖిలమహీరాజ్యమునఁ బట్టాభిషిక్తుం జేసినధృతరాష్ట్రుఁడు నేఁడు కర్ణవధవిహ్వలుండై తనబుద్ధిని నిందించికొని రాజ్యమునెడను సౌఖ్యమునెడను వైభవమునెడను సుతజీవితమునెడను నిరాశుఁ డగు. దుర్యోధనుఁడు తననమ్మినమేటిబంటు పొలియుటంజేసి సంధికి వచ్చినకృష్ణునిమాటలను విదురాదు లగుహితవాదులవచనములనుం జెడచెవిఁ బెట్టుటంజేసి చెడితిఁగా యని యాత్మప్రజ్ఞను నేఁడు నిందించికొను. శకుని మదీయశాతశరముల నక్షసాళ్లుగను గాండీవమును జూదంపుఁబలకగను రథమును ద్యూతమంటపముగనుం దలంపపలయు. నేఁడు కౌంతేయాగ్రజుండు వంత మాని సుఖనిద్రఁ బొందువాఁడు. కర్ణునిజీవితంబుఁ గొనఁ జాలినతీవ్రాశుగము గాండివంబున నరిఁ బోసి లక్ష్యశుద్ధిపాటవము నెఱయఁ జలము మెఱయ నేఁ డేసెద. అర్జునుం జంపకకాని పాదధావనం బొనర్ప నని యాదురాత్ముండు పూనినప్రతిజ్ఞ విఫలంబై నేఁడు పరిసమాప్తి నొందఁ గలదు. "పాంచాలీ, నీకు మగలు లేరు. పాండవులోడి దుర్యోధనునకు వరవుడంబు సేయువారైరి. నీవు తగిన మగనిఁ గోరికొ" మ్మని పలికినయాదుష్టశీలునిపలుకుల నేఁడు మద్బాణము లసత్యములఁ గావించు. నేఁడు గాండీవముక్తము లగువాఁడితూపులు మేను వ్రచ్చి నెత్తురు లురులించినప్పు డప్పాపాత్ముఁడు పాండవుల కెగ్గుచేసి చెడితిఁగా యని పశ్చాత్తాపమునఁ గొందలం బందు. ఏను రాధేయునిఁ బుత్రమిత్రబాంధవగణసహితంబుగాఁ బిలుకుమార్చినం గౌరవులు సింహముఁ గన్నమృగములకై వడి నన్నుఁ జూచి నలుదెసలం బాఱుదురు. నేఁడు దుర్యోధనుఁడు రాధాతనూజునకును

నాకునుఁ గలధనుర్విద్యాకౌశలంబు లెస్స యెఱుంగువాఁడు. నేఁడు కర్ణునిగాత్రముల నానాశిలీముఖముల వ్రచ్చి భూమికిఁ దద్రుధిరం బొసంగి కంకగృధ్రాదులకుఁ దృప్తి యొనరించి యప్పాపాచారుఁడు కపటమునం జంపినయభిమన్యునకు సముల్లాసంబుఁ గావించెద. పదుమూఁడేఁడులు మనంబులో నడఁచికొనినయమర్షమెల్ల నేఁడు వెడలించి దురాత్ములగుధార్తరాష్ట్రులు తత్ఫలముఁ గుడువం జేసెద. పురందరుఁడు శంబరు నెట్టు లట్టుల యేను నేఁడు రాధేయుని వధియింపఁగ మిత్రకార్యనిర్వహణధూర్వహు లయినపాంచాలసోమకాదులు కార్యము నెఱవేఱె నని యుల్లముల నుల్లసిల్లుదురుగాక. సుతబంధుసహితముగ నేఁడు నేను గర్ణుం బరిమార్పఁగ భీమసేననకులసహదేవులును సాత్యకిధృష్టద్యుమ్నశిఖండిప్రముఖులును నెంతయే నానందమునం దేలుదురు. అజాతశత్రుఁ డెంతయు సంతసమున నన్నుసన్మానించు. ఆమహర్షులనిచేఁ దెగినవారిఋణము నేఁడు దీర్చెద. నేఁడు భూమండలమునఁ గర్ణవిహీన మొండె గాండీవివిహీనమొండెఁ గావలయుఁగాని కర్ణగాండీవు లిద్దఱు గల రనుమాట పుట్టదు. ఔచిత్యరీతిగా నిట్టులు పలికితిఁగాని కర్ణుఁడు నన్ను వధింప నోపఁడు. కౌరవానీకమునుం గవిసి కర్ణుని గాండీవి వధించుట నేఁడు నీకన్నులారఁ జూడుము. ఆత్మస్తవము సముచితము గాదని యూరకుండెదఁగాని నాప్రభావము చెప్పఁ గొలఁదియె. ధనుర్వేదమున నాకు సాటివచ్చువాఁ డెవ్వఁడును గలుగఁడు. విక్రమక్రోధశాంతిగుణముల నా కెనవచ్చువాఁడు గలిగినం జెప్పుము. నిశితబాణగణములు జ్వాలాకలాపములుగాఁగ నగ్నితీరున వెలుఁగుగాండీవముఁ జేతఁ బూని యేననికి నడుతునేని సురాసురాదుల నందఱను బాహువీర్యమున నిర్జింప నోపుదు. లోకోత్తరము లగురథధ్వజకార్ముకాదిసాధనసమగ్రుండనైన నన్ను నిర్జింప నేవారికిం దరంబుగా దని పలికి కిరీటి క్రోధారుణితలోచనుండై భీమునకు విడుమరఁ గల్పించి కర్ణవధమునకుఁ గడంగువాఁడై రయమున రాధేయు దెసకుఁ దేరు పఱపు మని జనార్దనునకుఁ జెప్పె ననిన విని యాంబికేయుండు సంజయా, యత్తెఱంగునఁ గ్రోధసముద్దీపితుండై గాండీవి యరిగినపదంపడి యద్వైరవీరునకును రాధేయునకును నెవ్విధమునఁ బోరు సెల్లె ననియడుగ నమ్మనుజేశ్వరునకు సంజయుం డిట్లనియె.

అట్లు వాసుదేవార్జునులు సల్లాపంబు సేయుచు సింహనాదవాదిత్రఘోషబంధురంబుగా మనయనీకముఁ దఱియం జేరుటయు సవ్యసాచి గాండివగుణక్వణనంబుఁ గావించి పరమరయమునఁ దీవ్రనారాచపరంపర లరిం బోసి యేసి బహుళచతురంగబలములఁ గనుపుకొట్టుచుండె. అంతకు మున్న యిరువాఁగునఁ జేయంగలదొర లగుకర్ణకృపాశ్వత్థామదుర్యోధనచిత్రసేనసుషేణవృషసేనకృతవర్మశకునులును ధృష్టద్యుమ్నశిఖండిశ్రుతశ్రవస్సాత్యకియుధామన్యూత్తమౌజ

శ్శతానీకనకులసహదేవులును గ్రమంబున నెండోరులను, సంశప్తకసహితుండై
దుశ్శాసనుఁడు భీమసేనునిం దలపడినం బోరు ఘోరం బయ్యె. అం దుత్తమౌజు
నిచే సుషేణుఁ డీల్గుటయుఁ గర్ణుఁడు పుత్రమరణశోకాతురుండై కినుక గదిరి యప్పాం
చాలవరుని కేతనస్యందనముల నుగ్గుగావించుటయు నాతండు కృపాణపాణియై యడ
రి కృపాచార్యురథ్యముల సమయించి శిఖండితే రెక్కె. అట్లు విరథుఁ డైనశారద్వతు
పై నేయరా దనుతలంపున శిఖండి యూరకుండుటయు ద్రోణతనయుఁ డయ్యా
చార్యునిఁ దనతే రెక్కించుకొని తొలఁగి చనియె. భీమసేనుఁడు నిదాఘసూర్యుని
మాడ్కి దారుణతేజోవిస్ఫురితుండై మెఱుఁగుటమ్ములం బరఁగించి తనపై నడరిన
దుశ్శాసనాదులయేపు రూపడఁగించి ధార్తరాష్ట్రులమీఁదికిఁ దేరు వఱపు మని
సారథికిఁ దెల్పిన నతం డట్లు చేయుటయు బహుళచతురంగబలపరివృతులై కురు
వీరులు పెక్కం డ్రొక్కమొగి యతనిం దాఁకి శరపరంపర లడరించుటయు నవ్వ
డముడి యడిచిపాటు గదురఁ గడుం గనలి తనసునిశితవిశిఖమ్ముల వారివాలమ్ముల
నెక్కొక్కదానిని రెండుమూడుతునియలుగా ఖండించి గండడరి కోదండపాండి
త్యము నెఱయ నాబలుమగలఁ దెగఁజూచినం గినిసి వారు మఱియుం బలువురు
తోడ్పడ నతనియరదముఁ జుట్టు ముట్టి పండులఁ గొనవచ్చుపులుఁగుల తెఱంగున
నవ్వాయుసూనుతే రెక్కఁ దొడంగుటయుఁ గోపాటోపదీపితుండై యాపవనసూ
నుఁడు యుగవిగమసమయదండధరునికై వడిఁ బరమఘోరాకారవిస్ఫురితుఁడై
తేజోదుర్నిరీక్షుఁడై పరమరయమునం బేర్చి పటుప్రదరనికరములు వరఁగించు
టయు బెట్టిదుం డైనయాజగజెట్టియెదురఁ గా ల్నిలుపనేరక మనమూఁకలు వీఁక
దఱిఁగి పెనుగాలికి విఱుగుమొగుళులట్లు తెరలి పఱచె.

**భీముఁ డర్జునురాకఁ గోరి విశోకునితో విచారించుట.**

అందులకుఁ బరమసంతోషభరితుఁడై వృకోదరుఁడు సారథి యగువిశోకుం
బిలిచి మనముందఱ నున్న తేరులలో నేవైన మనవారివి కలవేమో చూచికొనుము.
సమరవ్యసని యగునా కిప్పు డెద్దియుం దోఁపదు. ప్రమాదముననైన నావాల
మ్ములు వానిమీఁదఁ బడునేని కార్యంబు దప్పు. కర్ణునివాఁడితూపులతాఁకున నెంత
యు నొచ్చి ధర్మరాజు శిబిరమునకుఁ జనియెఁగదా. అతఁ డింతకు బ్రదికియుండునే?
అమ్మహాత్మునికుశల మరయం బోయినయర్జునుఁడు నింతకు రాఁడయ్యె. కారణం
బెయ్యదియో యెఱుంగరాదు. ఆదుఃఖము నామనం బలఁచుచున్నది. ఎయ్యది
యెట్టులైన నిప్పుడు పోర మార్కొన్నవారలఁ గ్రేడించి పోక క్షాత్రధర్మంబు
గాదు గావునఁ జలమునం బోరెద. బాణము లింక నేజాతిలో నెన్ని మిగిలి
యున్నవో చూచి చెప్పు మనుటయు నతనికి విశోకుఁ డిట్లనియె. వీరవర్యా, పది
వేలమార్గణము లన్ని క్షురప్రము లన్ని భల్లములు రెండువేలనారసములు మూడు

వేలప్రదరములు నున్నయవి. మఱియు నాతెఱ్ఱు మోచితెచ్చినయాయుధపూర్ణశకటం బల్లె యున్నది. ఇతరసాధనములుండె లేకుండె నీభుజబలమునకుఁ బరమధనమగుసముద్దండగదాదండము గలదు. కావున నాయుధక్షయమునకు విచారింపనేల యనుటయు భీముఁడు మఱియు నతని కిట్లనియె. విశోకా, భీమసేనప్రయుక్తము లగునిశితబాణములు గప్పఁగ నాహవక్షోణీతలంబు నష్టసూర్యప్రభంబై మృత్యులోకమురీతి వెఱపు పుట్టించు. నేఁడు బాలురు మొదలుగా సకలజనులును భీమసేనుఁడు సకలకౌరవుల నిర్జించె ననియొండెఁ గౌరవు లందఱు నొక్కమొగి చుట్టు ముట్టి భీముని గెల్చి రనియొండెఁ జెప్పుదురు. అఘటనఘటనాసమర్థు లగు సురలు నాగెలుపు సాధింతురుగాక. శత్రునిర్మూలనప్రక్రమోదగ్రవిక్రముఁడైన ధనంజయుఁడు ఋత్విగాహూతుఁడై యధ్వరవేది కేతెంచుపురుహూతునివిధమున నేఁ గోరఁగ నిట కిపుడు వచ్చుఁగాక. అదె యద్దెసఁ గౌరవసైన్య మేను దఱుమ కున్నను విఱిగి పఱచుచున్నది. చూడుము. అద్దెసఁ గిరీటి గదిసియుండుఁగాఁ బోలు. వనదాహమునకుఁ బెదరి పఱచు నేనుంగులభంగిఁ గౌరవులు సిడములు పడ వాహనములు గూలఁ దమవారలం ద్రొక్కుచు వెఱచఱచి యఱిముఱిపఱచుచున్నవా రనిన భీమునకు విశోకుఁడు వెండియు నిట్లనియె. భీమసేనా, యల్లదె యత్యంతభీషణంబై గాండివజ్యాఘోషంబు నిగుడుచున్నది. నీకు వినంబడలేదె. మనకోర్కులు కొనలుసాగె నల్లవాఁడె క్రీడి కరిఘటలం గూల్చుచు మనల డాయ నేతెంచుచున్న వాఁడు. వాఁడె కేతనవానరుఁడు నిజదేహప్రభాపటలంబులు రోదసీకుహరంబున నత్యంతభీకరంబులై పర్వఁగ ఘోరారవము సేయుచున్న వాఁడు. అయ్యార్పు వినఁగ నాకును వెఱపు గదిరెడి. అల్లదె యర్జునకిరీటంబు సూర్యప్రభాభిభాసమాన మగునుత్తమమణిరోచులు దనరఁ దేజరిల్లుచున్నది. అదె శారదనీరదావదాతం బయిన దేవదత్తంబు మిక్కిలి యొప్పారుచుఁ గనంబడుచున్నది. అల్లతండె పుండరీకాక్షుండు మహనీయకౌస్తుభపరిభాశోభమానవక్షస్స్థలుండై యుగ్యముల పగ్గములఁ బూని నొగలఁ గానంబడుచున్నవాఁడు. అల్లదె యమ్మహానుభావుని కెలన సూర్యమండలసంకాశ మగుసుదర్శనమును జంద్రబింబసన్నిభ మగుపాంచజన్యమును లోచనగోచరము లగుచున్నవి. శ్వేతహయయోజితము కృష్ణసారథ్యవిభాజితము నగునయ్యుత్తమస్యందనమునం గూర్చుండి యాఖండలనందనుండు గాండివనిర్ముక్తకాండజాలమున నద్దెస నన్నూఱు తేరులను నేడునూఱేనుంగులను బహుళతురగపదాతివర్గంబునుం గూల్చి చిత్రగ్రహమురీతిం బ్రబలదేజోదర్శనీయుండై నిన్నుఁ జేర నేతెంచుచున్న వాఁడు. సంపూర్ణమనోరథుఁడవైతివి. నీమార్తురు తెగటాఱిరి. బలమును నాయువును నీకుఁ బెంపెసఁగుత మని పలికినం బరమముదమునం బొదలి భీమసేనుఁడు విశోకా, ప్రియముఁ దెలిపినదాని కుల్లసిల్లితి.

ఉత్తమగ్రామములఁ బదునాలుగింటిని దాసికల నూఱుగురను రథముల నిరువదిం
టిని నీకిచ్చెద నని చెప్పి మనమూఁకలపై నడిరి విక్రమక్రీడ సలుపుచు సింహ
నాదముఁ గావించె.

వృకోదరునిసింహనాదమును రథఘోషమును విని యర్జునుండు భీమునొ
ద్దకుఁ దేరువఱుపు మని జనార్దనునకుఁ జెప్పుటయు నాతం డట్లు చేయ జంభవధో
ద్యతుం డైనపురుహూతునివిధమునం జూడ నొప్పి బీభత్సుఁడు రణోత్సాహ
మునం గవియఁగఁ గురువీరులు పెక్కండ్రు తురంగఖురఖురనిస్స్వనభీషణ హేషా
రవంబునను ఘంటారవోపబృంహిత దంతిబృంహితంబునను రథచక్రనేమినినద
మునను బదాతిగణక్ష్వేళితంబునను దిక్తటములు బీఁటలువాఱించుచు నడరినం
బోరు ఘోరం బయ్యె. అప్పుడుకిరీటి దేవకార్యార్థము దానవుమీఁద గవి
యువిష్ణునివీఁక మెఱసి క్షురార్ధచంద్రభల్లాదినానాసాధనములం గుప్పించి వీరయో
ధులతలలు దఱిగియు భుజముల నఱికియుఁ జతురంగబలములఁ జెండాడియుఁ గేత
నచ్ఛత్రచామరాదుల ఖండించియు మహామకరము గలఁచుసాగరముచందమున
మనయనీకముఁ గలఁచి క్షాత్రనిరతులై పైపై నడరినశూరుల నందఱనుం గెలిచి
రథవారణవాజిసహస్రముల యమపురమునకుఁ బనిచి నన్నూఱుగురుమహార
థులం బరిమార్చి మహామారుతము మేఘబృందము నట్టు లట్టుల తెరలించు
టయు మహాప్రవాహము కొండఁ దాఁకి బహుధావిదీర్ణ మగువిధమున నార్తనా
దము చేసి మనసేనలు వెఱచఱచి విచ్చి పఱచినం గవ్వడి పన్నగనిగ్రహసంరంభి
యగుగరుడునికైవడిఁ బరమరయమునం బేర్చి కర్ణునరదమునకు సమ్ముఖముగ నడచె.
కిరీటిరథఘోషమును విని భీముఁడు పరమసంప్రీతచేతస్కుఁడై వీతభయుఁడై
వాయువేగవీర్యము లడరఁ గురుసేనపై నడరి పాణిలాఘవము మెఱయఁ జలము
నెఱయఁ బటుప్రదరనికరములు నిగిడించుటయు నంతకప్రతిమఘోరాకారుఁడైన
యతనిమునుమునఁ గాలు నిలుప నోపక నీయోధులు కొండఁదాఁకినమోడలట్లు
పోలె వికలులై పఱచిరి. అప్పుడు దుర్యోధనుఁడు నిజయోధులకుఁ జేయి వీచియో
శూరులారా, యందఱు నొక్కమొగి భీముం బొదివి సమయింపుడు వీఁడుగూలి
నం బాండవు లందఱుహతు లగుదు రని యెలుంగేర్పడం జెప్పుటయు మనవారు
బహుళగజవాజిరథపదాతినితరపరివృతులై యాజగజెట్టిం జుట్టు ముట్టిన నబ్బలు
మగండు తన్నందఱు నఱుముట కించుకేనియుసంచలింపక నక్షత్రగణపరివృతుం
డైననిశాకరునికరణిఁ జూడ నొప్పుచు సవ్యసాచికి సమాన మగుతీవ్రప్రతాప
మునం బేర్చి శరజాలము లడరించి లక్షగజములను రెండులక్షలునిన్నూఱుకాల్బ
లంబులను నైదువేలగుఱ్ఱములను నూఱుతేరులనుం బరిమార్చి హస్తిగ్రాహసమా
కులము నరమీనసాంద్రము కేశశైవాలజాలము సంఛిన్నభుజభుజగము మజ్జాపం

కము మస్తకపాషాణము కార్ముకకాశప్రకాశము గదాపరిఘఫేనిలము యోధవే
త్రచిత్రము రథావర్తము నగురక్తనదీప్రవాహముఁ బఱవం జేసి నిపుణమత్స్యము
వలెఁ దప్పించికొనినకై వడి నయ్యనీకసాగరంబు నిస్తరించి తనపై నిగిడినవారల
నందఱను జమునిం బోలి కనిచి యేరికిం దేఱిచూడరాక వెలుంగుచుండె.

శకుని భీమునితోఁ బోరి విరథుఁ డగుట.

అప్పుడు దుర్యోధనుఁడు శకునియొద్ద కరిగి మామా, చూచితే భీమసేను
నిపటుపరాక్రమవిలాసంబు. నీవు తాఁకి శితశరముల నతనిం జక్కఁబెట్టు మనిన
భాగినేయువచనంబు విని యగ్గాంధారపతి యగ్గలించి యబ్బలుమగనిం దలపడి
వాఁడినారసము లతనినామపార్శ్వము నెవ్వ నేయుటయు నయ్యవి మైమఱుఁగు
వ్రచ్చినం గోపించి కీచకాంతకుఁడు కార్ముకగుణక్వణనంబుఁ గావించి యొక్క శాత
సాయకం బరివ్రాసి విడుచుటయుఁ గృతహస్తుండై నశకుని దాని నేడుతునియలై
నేలం బడ ఖండించినం గోపించి బకారి నవ్వచు శాతభల్లమున నాసౌబలుని
విల్లు దునిమె. అంత నెంకువిల్లుగొని నీమఱఁది షోడశభల్లము లరిం బోసి నాలు
గింట సారథిని నైదింట భీముని నెవ్వ నేసి రెంటఁ గేతన మూఁగాడ నేసి యొ
క్కదానం గార్ముకముఁ దునిమి నాలుగింట గుఱ్ఱముల నొప్పించినం గినిసి కిమ్మీర
వైరి శక్తి యెత్తి శకునితేరిపయిం బడ నేయుటయు నాతండు దానిన గ్రహించి
క్రమ్మఱ వృకోదరునిమీఁద నేయఁగ నయ్యది యవ్వాయునందనువామభుజము
నొప్పించి గగనవిచ్యుతం బైన విద్యుద్వల్లికవిధమున నేలం బడుటయు మనవారు
పెలుచ నార్చిరి. అయ్యార్పు విని కోపదీపితుండై పవననందనుండు వేఱుకోదం
డముఁ గొని సజ్యముఁ గావించి ముహూర్తమాత్రలోన శరనికరమునం గాంధా
రరాజుతేరు గప్పి వానిగుఱ్ఱములను సూతునిం దెగటార్చి విల్లు దునుముటయు
నాతండు విరథుఁడై నేలకు డిగి క్రోధరక్తేక్షణుండై ధనుర్గుణక్వణనం బొనర్చిబహు
ళశిలీముఖముల నక్కొంతేయుపై నడరించె. అడరించినం జలింపక యాతండు కడుం
గనలి నిట్టూర్పు నిగిడించి విల్లు ఖండించి తీవ్రాశుగములం దద్గాత్రిముఁ గాఁడ నే
యుడు నగ్గాంధారరాజు సోలి ప్రాణావశేషుండై పడుటయుఁ దదవస్థుం డైనమా
మను సుయోధనుండు దనతే రెక్కించుకొని తొలంగి చనుటయు భీమసేనభ
యార్దితులై మనవారు పోరు మాని యచ్చోటఁ గాలూఁద నోపక లేటమొ
గంబు వెట్టి పఱచి కర్ణునిమాటునకుఁ జనుటయు నవిసినకలంబులోనిజనులకుఁ
బెనుదీవియపోలె నాశౌర్యభూషణుఁడు వారలకుఁ బ్రాపై పోలిచె ననిన విని వై
చిత్రవీర్యుఁడు సంజయా, భీమునికోల్తల కోహటించి మనమూఁక లట్లు విచ్చిప
ఱచి తనప్రాపుఁ గాంచఁగ నారాధేయుఁ డే మనిమె? కృపద్రోణిహార్దిక్యప్ర
భృతు లగుమనయోధులును దుర్యోధనదుశ్శాసనాదు లగునాకుమారులు నే

మనిరి ? భీమసేనునిపరాక్రమము వినఁగవినఁగ నా కెంతయు నాశ్చర్యంబయ్యెడి. అట్లు ప్రభగ్న మగుమనస్సైన్యముఁ జూచి కర్ణుఁ డేమి చేసె? మనవా రందఱు నతండు తమ్ముఁ గాచి గెలిపించు నని నమ్మియుండిరి. తక్కినశూరులు నేమి యొనర్చిరి? తేటపడ నెఱింగింపు మనియడుగుటయు నాక్షమావల్లభునకు సంజయుం డిట్లనియె.

కర్ణుఁడు పాండవయోధులపై నడరి కోలుమసంగుట.

అవ్విధమున నయ్యపరాహ్ణసమయమున భీమునికోల్తల కోహటించి పఱచుచున్నకురుసేనం జూచి పాంచాలసైన్యముపై మనతేరు పఱపు మని శల్యునకుఁ జెప్పిన నమ్మద్రపతి మేఘస్తనితసంకాశ మగునేమినిర్ఘోషం బెసంగ నతండు కోరినచోట్ల కెల్ల నతిరయమునం దేరు దోలుటయు నారాధేయుండు బలదర్పక్రోధవిధేయుండై చేదిపాంచాలకరూశానీకముల నేలకుఁ గోలకుఁ దెచ్చుటయు భీమసేనశిఖండిధృష్టద్యుమ్నసాత్యకిమాద్రేయద్రౌపదేయు లయ్యంగరాజుపై నడరి భీముఁడు తదీయజత్రుదేశమునఁ దొంబదిసునిశితాంబకములను శిఖండిసాత్యకులు ప్రత్యేకంబ వింశతికాండములను ధృష్టద్యుమ్నసహదేవులు వేఱువేఱ మార్గణసప్తకంబును నకులుఁడు సాయకశతంబును ద్రౌపదీసూనులు చతుష్షష్టిశిలీముఖములను నవ్వీరునిసర్వాంగములం గీలించుటయు నతండు నవ్వుచు నారి సారించి వారల నందఱను వేఱువేఱ మైదేసియమ్ముల నొంచి యట సాత్యకికేతనకార్ముకములం ద్రుంచి శరనికరము గాత్రమునం గీలుకొల్పి భీముని బలుతూపుల నొనేసి యొక్కభల్లమున సహదేవుకేతనంబుఁ గూల్చి మూడింటఁ దత్సారథిఁ బొమ్మఁ గాఁడ నేసి ద్రౌపదీనందనుల విరథులం గావించుటయు నిమేషమాత్రలో నతం డిట్టు లేపు సూపుట యత్యంతాద్భుతం బయ్యె. అట్లు తనపై నడరినశూరులం గ్రూరనారాచముల వెగడుపఱిచి చేదిమత్స్యపాంచాలానీకములపయిం గవిసి ప్రహాసభాసురవదనుండై సిద్ధచారణగంధర్వాదు లబ్బురం బంది పొగడఁగఁ గడిందిమగంటిమిం బేర్చి వేసవిం బేర్చికార్చిచ్చు శుష్కతృణపుంజముల నెట్టులట్టుల నీఱుసేయం దొడంగుటయుఁ బాండవయోధులు లేటమొగంబు వెట్టి యార్తనాదము లొనరించుచుఁ బఱచువారును నుడివ్రానిచలమునం దనరి విధూమపావకప్రతిమానతేజోవిభ్రాజితుం డై నయ్యాశూరశేఖరుం దాఁకి కొండఁ దాఁకినవఱదలట్టులు విచ్చిపోవువారును లోకోత్తరుఁ డై నరథికుఁడు కర్ణుఁడే యనితలంచి వెఱపు గదుర నెదుఁగువారు నగుటయు నబ్బలుమగండు నీకొడుకులప్రశంసావచనములకు నెమ్మనమ్మున నలరుచు నరాతిసైనికులకుండలోల్లసితమస్తకములను గేయూరాదిభూషితభుజాదండములను నఱికియుఁ గజతురగపదాతిగణములఁ జెండాడియు రథావయవములఁ దుమురు సేసియుఁ గయ్యంపునేల మిఱ్ఱుపల్లము గావించి శరజా

లము నిగిడించి చీఁకట్లు వచరించి నెత్తురుటేఱు పాఱించి సింహము మృగగణ ముల నెట్టు లట్టుల యప్పాంచాలాద్యనీకములం దఱుముటయు వారు కన్నుఁ గా నక రుధిరకర్దమమునఁ గ్రుంగినకాళులు వెలికిఁ గొననేరక వెఱపు పెల్లున నెట్ట కేలకు సంభ్రమమునఁ బఱచుచుఁ దమవారలనే పొడుచుటయు గోతియలలోఁ జొరఁ బడినతోఁడేలుకై వడిఁ గోలుమసంగినయయ్యంగపతివిక్రమమునకు సంతసిల్లి మన వారు సింహనాదముఁ గావించి వివిధవాదిత్రముల మ్రోయించిరి. అందుల కలిగి పాంచాలురు చలంబు పెల్లునంజేసి యడరినం గర్ణుండు వారల నిరువదియేవురుశూ రులం బరిమార్చి రథమధ్యములను వాజిపృష్ఠములను గజస్కంధములను శూన్య ములఁగావించి మధ్యాహ్నమార్తండునియట్లు వెలుఁగుటయు నప్పటికిం బిఱుతివి యక పాంచాలశూరు లావీరునిపై నడరుటయు దుర్యోధనదుశ్శాసనకృపద్రోణి కృతవర్మశాబలులును గర్ణపుత్రులును నతనికి బాసట యగుడు భీమసేనదృష్టద్యు మ్నశిఖండిద్రౌపదేయులు దమవారికిఁ దోడ్పడుటయుఁ బోరు ఘోరంబయ్యె.

అత్తెఱంగున రెండు తెఱంగులమూఁకలు నిరువాఁగునఁ జేయంగలమేటి శూరులవిక్రమమునఁ దెగటారుటయు నొండుకడ గాండీవి గండడరి పటుకాండ జాలముల నిగిడించి మనుష్యమస్తకపాషాణము గజవాజిగాత్రకృతతీరము శూ రాస్థిశర్కరానిబిడంబు ఛత్రహంసప్లవోపేతము నగురక్తనదీప్రవాహముఁ బా ఱించి యత్తఱి కర్ణునియుదీర్ణవిక్రమాటోపంబు సూచి వాసుదేవున కిట్లనియె. కృష్ణా, యల్లదె సూతసుతునికేతనంబు కన్పట్టుచున్నది. వానికి వెఱచి పాంచా లురు పఱచుటయు భీమసేనాదు లాఁగి పోరుచున్నవారు. అల్లతండె దుర్యోధ నుండు కృపకృతవర్మాశ్వత్థామగుప్తుండై కర్ణునికోల్తల కోహటించినపాండవులఁ దఱుముచున్నవాఁడు. అతండె సారథికర్మనిపుణుండై నమద్రరాజు నేర్పునఁదద్ర థంబుఁ జిత్రగతులం దోలుచున్నవాఁడు. ఇత్తఱి మనతేరు వానికి సమ్ముఖముగా నించు టుచితం బనితలంచెద. కర్ణుం బరిమార్పక కానిమగుడను. ఇంక నెక్కింత తడవు మన మొండుకడ నుండుదుమేని యాతండు పాంచాలుర నిశ్శేషముగ వధించు ననుటయు జనార్దనుండు పాండవయోధవీరులతల్లడంబు మాన్పుచు నుల్లా సంబుఁ గావించుచు వజ్రనిర్ఘోషతుల్యం బగునేమినిస్స్వనం బెసంగ మనయనీకం బునడుమ నయ్యుత్తమస్యందనంబుఁ దోలె.

శల్యకర్ణ లర్జునశౌర్య ముగ్గడించి యగ్గించుట.

అంతఁ గపికేతనం బుపలక్షించి శల్యుఁడు కర్ణున కిట్లనియె. అల్లవాఁడె యర్జునుఁడు గాండీవపాణియై శ్వేతాశ్వయోజితంబు కృష్ణసారథ్యవిభ్రాజితంబు నగురథోత్తమమునఁ దోచుచున్నవాఁడు. శత్రునిర్మూలనోదగ్రుండై నయమ్మహా రథుని నీపయిం గవియుదేర నరుదెంచువానిం దాఁకి తెగటార్చితేని మనకు మే

లయ్యెడి. అతండు తనపై నడరువారల నందఱం గ్రేడించి వడిం బేర్చి యేతెం చుటయు ఘోరాకారవిస్ఫూర్తి మెఱయుటయుం జూడ నిన్నే తలపడఁ జను దెంచునందము తోఁచుచున్నది. ధర్మరాజును విరథుం గావించి యలజడిం బెట్టుటయు సాత్యకిశిఖండిధృష్టద్యుమ్నులను ద్రౌపదీనందనులను నకులసహదేవులను యుధామన్యూత్తమౌజులను నోడించుటయు బకాంతకుఁ డొక్కరుఁడు నీతోఁ బోర పెనంగి నెచ్చుటయు నెఱింగి క్రోధతామ్రేక్షణుండై యఱిముఱివడుచు నిన్నుఱుమఁ దా నొక్కరుండె వచ్చుచున్నవాఁడు. నీకంటె లాఁతితోడం బోరు నెడ నాతఁ డింతకీనుకఁ జూపఁ డనితలంచెద. కోపాటోపదీపితుం డై నయయ్యేక వీరుని మార్గోని వేల సాగరము నెట్టు లట్టుల యాఁగ నీవు దక్క నొండొక్క విలుకాఁ డోపఁడు. కృష్ణుల మార్గోని సాధించుట యందఱకునుసుకరం బగునే? దుర్యోధనహితాచరణము నీతలమీఁద నున్నమోపు గావునఁ గడిమి మెఱసి కడంగుము. భీష్మద్రోణకృపద్రౌణులకు సమానుఁ డగునీవు నాలుకలు వెడలించినక్రూరభుజగంబునకును అంకె వేయుచున్నయాఁబోతునకును వనస్థిత మగుశార్దూలమునకునుఁ దుల్యుఁ డగుసవ్యసాచిని మార్కొని నిలువరింపుము. అబ్బలు మగనికి వెఱచి వీరె ధార్తరాష్ట్రులు విచ్చి పఱచి నీమాటున కొదుఁగుచున్న వారు. వైదేహాంబష్ఠకాంభోజగాంధారాదుల నత్యంతదుర్జయుల నేధీరత్వమునం జయించి సుయోధనునకు రాజ్యవిభవము పెంపుఁ గావించితి వాధీరత్వమున నడరి వాసుదేవార్జునులం గెలిచి నీప్రాపు వేఁడినకౌరవులం గాపాడు మనుటయుఁ గర్ణుఁడు మద్రనాథా, ప్రకృతిస్థుం డై ననీపయిం బ్రీతి నా కెక్కు డగుచున్నది.ధనంజయునకు వెఱవం బని లేదు. మదీయబాహుబలమును గోదండపాండిత్యమునుం జూడుము. ఏ నొక్కండన పాండవసైన్యమునెల్లను గృష్ణార్జునులను వధియించెద. అప్పాండవయాదవవీరులఁ బరిమార్పక క్రమ్మఱను వారలం జంపియొండె వారిచేఁ దెగియొండెఁ గృతార్థుఁడ నగుదు ననుటయు శల్యుఁ డోవీరవర్యా, లోకమునం గలమహారథు లందఱు గాండీవిం గెలువరా దనిపలుకుదురు. కృష్ణాభిగుప్తుఁ డై నయమ్మేటిమగని గెలువ నుత్సహించుట సాధారణముగాఁ దలఁపఁ బోల దనుటయుఁ గర్ణుఁడు శల్యునకు వెండియు నిట్లనియె. మద్రపతీ, మనము విన్నంతకు సవ్యసాచికి సరివచ్చువిలుకాఁడు గలుగునట్టులు తోఁపదు. గాండివగ్రహణము నను జ్యాకర్షణమునను గాయలు గాచినయతనిహస్తములు సెమర్చుటయుఁ గద లుటయుం బొరయవు. కైదువు పట్టునెడ దృఢత్వంబును నేర్పును రయమును వానికిఁ గలుగునట్లు లాఁతులకుఁ గలుగవు. పెక్కమ్ములనేనియు నొక్కయమ్ముగాఁ గొని వింట నరిం బోసి క్రోశమాత్రదూరమునం బడునట్లు బిట్టేయఁ జాలినయ తని కెనవచ్చుయోధుఁడు గలుగునే? అతండు కృష్ణసహాయుండై యడ్డపడినయిం

ద్రాదులం గెలిచి ఖాండవ మగ్నికి సమర్పించి తృప్తుఁడైనయద్దేవునివలనఁ దాను గాండీవంబు నక్షయ్యతూణీరంబులను దివ్యరథమును గృష్ణుఁడు చక్రమునుం బడయుట వినమే. మఱియు నాసవ్యసాచి లోకపాలుర మెప్పించి వారివలన దివ్యాస్త్రముల సాధించి సురలకు నజేయు లగుకాలకేయులను వధించి యుత్తమకిరీట దేవదత్తములఁ గొనుటయుఁ బోరఁ బరమేశ్వరునకు మెప్పు గావించి యమ్మహాదేవునివలనఁ బాశుపతాస్త్రము సంపాదించుటయు సుప్రసిద్ధములుగావె. విరాటు పసులం బట్టఁ బోయినపుడు మ మ్మందఱను దా నొక్కరుండ యోడించి వస్త్రములం గ్రహించికొని యరుగుట మాకే ప్రత్యక్షంబు గాదె. మహావీర్యుఁడైన ధనంజయునకు మిగిలినధనుర్ధరుఁడు లోకమునం గలుగఁడు. అనంతవీర్యుఁడైన నారాయణుఁ డిపు డతనికి సహాయుఁడఁట. ఇఁక నతనివిక్రమంబు సెప్పఁ గొలఁదియె. సర్వజనులును గూడి యేఁడులుపూఁడులు నిరూపించిన నమ్మహానుభావుని గుణములు నిరూపింప నశక్యములు. సర్వవిధముల లోకోత్తరు లగుకృష్ణార్జును లేకరథస్థులై యుండఁ జూచిన నాకునువెఱపు గదిరెడి. ఐన నేను దక్క నొండొకఁ డాగాండీవపాణిని మార్కొనఁ జాలఁడు. ఏ నతనిం జంపుటయొండె నన్నతండు చంపుటయొండె నేఁడు గాఁగలయది. అతండే విక్రమించి నన్నుఁ దెగటార్చునేని యీపోరు నాతో ముగియుఁగాక. పెద్దకాలంబుగోలె నామనంబునంగల కోరిక నేఁ డద్భుతంబుగ నెఱవేఱఁ గల దని శల్యునకుఁ జెప్పి మేఘగర్జితోపమానం బైనసింహనాదం బొనర్చి నీకొడుకునెద్దకుఁ జని యమ్మహీవల్లభునిచే నభినందితుండై కృపకృతవర్మసౌబలాశ్వత్థామలనుఁ దనతమ్మునిఁ దక్కినసైనికులనుం గలయఁ జూచి రారాజుమొగమునం జూడ్కి నిలిపి మీరందఱును గూడికొని కృష్ణార్జునుల నాఁగి తఱిమి శరపరంపరలఁ బరఁగించి నాకు సుఖవధ్యు లగునట్టుగాఁ బెద్దయు నలయింపుఁ డని తేటపడం జెప్పె.

—అర్జునుఁడు తనపై నడరినకృపాదిమహారథులం గెలుచుట.—

వారు రాధేయుపంపు సేయువారై బహుళసేనాసముదయసమన్వితులై స్పర్ధాతిశయంబున నానాసాధనములం గుప్పించుచు నప్పాండవమధ్యముపై నడరుటయు నాతండు పైపయిం బొంగివచ్చునేఱులనీరెల్లఁ దనలో నిమిడించికొనుసాగరంబుచందంబున వారలనెల్లఁ దనకు మిగులనీక యడంచి శరగ్రహణసంధాన మోక్షణము లిట్టు లనినిరూపింప నలవిగానితెఱంగునం బేర్చి వాలంపగముల నిగిడించి నరవాజికుంజరగణములం గూల్చి మండలీకృతగాండివమధ్యదర్శనీయనిజమూర్తియై యుగవిగమసమయమార్తండునికరణిం దేజరిల్లుచుండ మనవారు కంటిగొంట్లు సూర్యు నెట్టు లట్టుల యతనిం జూడనేరక వెనుకటిదెస కొదుఁగుచున్నంత నస్మదనీకంబునఁ జేయంగలమహారథు లుక్కుమిగిలి పెక్కుతూపు లడ

రించినం గండడరి యయ్యాఖండలనందనుండు గాండీవనిర్ముక్తపటుకాండజాలముఁ బరఁగించి తదీయసాయకజాలముఁ దునిమి వేసవిం బేర్చినకార్చిచ్చు కాననముం బోలె మనసేనల నీఱుసేయుచున్నంతఁ గోపదీపితులై కృపకృతవర్మదుర్యోధన ద్రోణనందనులు పేరుక్కనం బేర్చి ప్రావృట్పయోధరము సలిలధారల ధరాధరము నెట్లట్ల శరపరంపరలం గప్పుటయు నమ్మహారథవరుండు తదీయశరములనన్నింటిని నొక్కమాత్రలోనఁ బొనుపడం జేసి మూడేసిశాతసాయకముల వారిఱొమ్ములు గాఁడిపోవ నేయుటయు నశ్వత్థామ యలిగి దశవిశిఖముల ధనంజయుని శరత్రయమున వాసుదేవుని మార్గణచతుష్టయమున హయచతుష్టయమును నొప్పించి దొడ్డనారసములఁ గేతనకపివయిం గుప్పించె. అంతుల కల్గి ఫాల్గునుండుమూడింట నయ్యాచార్యనందనుని నొంచి యొక్కక్షురమునఁ దత్సారథితల దఱిగి నాలుగు వాలమ్ముల గుఱ్ఱములం జదిపి మూడింటఁ గేతనంబుఁ గూల్చి విల్లు ద్రుంచుటయు నాభూసురవరుండు గినిసి కనకహారవిభ్రాజితము తక్షకభోగిభోగసమానాకారంబు నగునొండుకార్ముకముఁ గొని సజ్యముఁ గావించి నిశితసాయకములం గృష్ణార్జునులమీఁదం గుప్పించుచున్నంతఁ గృపకృతవర్మదుర్యోధనులు వానిందలకడచి యాదిత్యుం గప్పువారిదములకరణిం బాండవశ్రేష్ఠుని నావరించి శరజాలం బడరించుటయు నబ్బలుమగండు బలిమీఁదఁ గవియుదెంచుసురపతివీఁక మెఱసి యగ్గౌతమునివిల్లు దునిమి కేతనంబుఁ గూల్చి సారథిని నొప్పించి శరజాలమునఁ దద్రథంబుఁ గప్పి తొలుత శాంతవునిపై నురువడించుతెఱంగున నేవు సూపి యయ్యాచార్యుని వెగడుపఱచి దుర్యోధనుకార్ముకంబు ఖండించి పడగ నేలఁ బడం ద్రోచి కృతవర్మరథ్యములం గీటడఁగించి సిడముఁ ద్రుంచినం గౌరవానీకముసేతుబంధము దెగినప్రవాహము మాడ్కి విదీర్ణంబై పఱచె. అట్లు తన్నుమార్కొన్న వారలం గెలిచి యాఖండలనందనుండు వారల డాఁపలించి యతిత్వరితగతిం బోవుచున్నంతఁ గౌరవవీరు లడ్డపడుటయు శిఖండిసాత్యకినకులసహదేవులు పెలుచ నార్చుచు వారలం దలపడి కాండజాలముఁ బరఁగించి నలుదెసలం గప్పి కటిఁకి చీకట్లు పచరించి కోలుమసంగుటయు నాపోరు దేవదానవసంగ్రామసంకాశంబై చూడ నొప్పె.

అర్జునుఁడు భీముని డాయ నరిగి ధర్మజుకుశలంబుఁ జెప్పుట.

అవ్విధమునం జని కిరీటి కురుబలార్ణవనిర్మగ్నుం డైనభీమసేను నుద్ధరించువాఁడై కర్ణానీకంబుపయికి గవిసి సూర్యకిరణప్రచారం బించుకేనియుఁ గలుగని తెఱంగుగా శరజాలమునం గగనతలంబుఁ గప్పి పక్షిసంచారమునకేనియు నెడ గలుగనివిధముఁ బొనరించి కన్ను గానక మనవారు తమవారలనేపొడుచునట్లు లొనరించి భల్లక్షురప్రసారాచాదివివిధబాణములం గాండీవమున నరిఁ బోసి

విడిచి నరగాత్రఖండములనుఁ దురంగాంగశకలములనుఁ గుంజరావయవభంగములను రథావయవములతునియలను గైదువులపొళ్లను మైమఱుఁగులతుమ్మల్లను ఛత్రచామరములయవఱలను గావించి సంగ్రామమేదినీతలంబు పీనుంగుపెంట గావించి మేఘస్తనితసంకాశము నగుగాండీవజ్యాఘోషంబుఁగావించిన నతనిమునుమున నిలువఁజాలక మనయనీకంబు ప్రతికూలవిధూత మగునావచాడ్పున వికలంబై కార్చిచ్చుపొదివినకాననంబుచందమున రూపుసెడియు దవానలప్రస్తమగు మృగగణముభంగి వెఱచఱచియు నలినులియై పొసఁగుపడుటయు హతశేషులు భీముని విడిచి వెన్నిచ్చి పఱచిరి. అంత వివ్వచ్చుఁడు భీమసేనుని డాయ నరిగి క్రొండొకవడి యతనితోడం గార్యచింతనం బొనరించి ధర్మరాజు విగతశల్యుఁడై యెలమి నున్నవాఁడు. ఇఁక నేను గర్ణుం బరిమార్పఁ గడంగెద ననుజ్ఞ యిమ్మనియతని వీడుకొని కర్ణునిమీఁదికిఁ గవియుదెంచె. అంత నీకొడుకులు దుశ్శాసనునకంటెఁ జిఱుతవాండ్రు పదుండ్రు కోపాటోపదీపితులై యుక్కు మిగిలి యుక్కిరీటిం దాఁకి కొఱవులఁ గుంజరము నెట్టు లట్టుల యతనిం బాణజాలముల నొప్పింపఁ జూచుటయు నాసవ్యసాచి వారల సరకుసేయక వలపలించి పోవుటంజూచి వారు గాండీవి తమకుఁ బరాఙ్ముఖుఁ డయ్యె నని తలంచి వెన్నడించి తఱుముటయుఁ గోపించి యమ్మహారథుఁడు తదీయకేతనకార్ముకముల ఖండించి రథ్యములం గూల్చి సారథులఁ దెగటార్చి రోషసంరంభమునఁ గన్నులఁ గెంపునఁ నవుదుగఁ ఱపునుంగదురఁ దనరు నాపదుగురితలలను గమలోజ్వలంబులగువానిని శితభల్లదశకమునం దఱిగి యరిగె. అప్పుడు సంశప్తకులు నవతిరథికులు రయమున నాగాండీవిందాఁకుటయు నబ్బలుమగండు వారలపయి నిశితశరనికరముల గుప్పించుటయు నాసంశప్తకులు గతాసులై పుణ్యావసానంబైనం ద్రిదివమునుండి పడువిమానములమాడ్కి రథములనుండి డొల్లిరి. అట్టియెడ నీకొడుకులు పెక్కండ్రు కురువీరులు ననేకచతురంగబలములును దోడుపడ వెఱపుదక్కి మిక్కుటం బగునుక్కునం బేర్చి ధనంజయుని మార్కొని యంతరిక్షంబెల్ల శరజాలమయంబుఁ గావించుటయు నయ్యాఖండలనందనుండు గాండీవనిర్ముక్తపటుకాండజాలంబునఁ దద్బాణములనెల్ల సూర్యుఁడు నిజకిరణముల గాఢధ్వాంతంబునుంబోలె విరియించి వెగడుపఱచినం దోడన మ్లేచ్ఛులు వేయిమున్నూఱుమత్తశుండాలములతోడ నతనిం జుట్టుముట్టి కర్ణినాళీకనారాచతోమరముసలభిండివాలాది సాధనగణంబులం బరఁగించి నొంచుటయు నర్జునుండు భల్లార్ధచంద్రప్రముఖశిలీముఖనికరంబుల నామ్లేచ్ఛులనుఁ దద్గజంబులను ధ్వజాదులను గనుపుగొట్టుటయు హతారోహకము లగునయ్యేనుంగులు పీనుంగులై వజ్రాభిహతంబు లైనగిరులమాడ్కిం జూడనొప్పె. ఏమి చెప్పుదు నప్పుడప్పార్థుండు కోలుమసంగునెడ గాండీవజ్యాఘోషము చెవుల బీఁటలువాఱం

చుటయుఁ జతురంగముల ఘోరారవంబు వీతెంచె. అత్తెఱంగున నేనుంగులెల్లం గూలుటం జూచి రావుతులఁ ద్రోచి పరువు లిడుగుఱ్ఱములను సారథులయత్నము నకుఁ జిక్కక పాఱురథ్యములును రథికసారథివిహీనంబులై మ్రోడుపడిన తేరులును తమవాహనములు మడియుటం జేసి దిక్కు గానక యిటునటుం బ్రమరిపాఱునారోహకులు నగుటయు నత్యంతరౌద్రం బయ్యె. అవ్విధమునధనంజయుండు నిజభుజప రాక్రమాటోపమునం బేర్చి తనకు మాఱుమలయువారు లేక మనమూఁకలఁ జీకాకు పఱుచునెడ భీమసేనుఁడు తనమునుమునఁ బెక్కండ్రు తెగుటయు హతశేషుల సరకు గొనక యర్జునునకు బాసటయై నడుచుటయు బహుళగజానీకంబు లతని కడ్డప డియె. అడ్డపడినం గోపించి యాహిడింబాంతకుండు కాళరాత్రియట్టు లత్యుగ్రం బైనతనగదాదండముఁ గొని సాగరప్రవేశతీవ్రం బగుమహామకరంబుచందంబున నగ్గలించి యగ్గజానీకంబు సొచ్చి యంత నడ్డపడిననానాచతురంగంబులను నమ్మా తంగంబులనుం గతిఖండములు గావించె. అట్లుబహుళసహస్రసేనలం బిలుకుమా ర్చుచుఁ బేర్చుచున్నయామహాబలనందనుని గదాపాణిఁ జూచి హతశేషులు దండ ధరుఁ డైనకాలుఁడ కాని వీఁడు సామాన్యుఁడుగాఁడని తలఁచి వెఱచి యుత్సాహం బు దఱిఁగియు సాహసంబు దొఱఁగియుఁబోఁడిమి నెడలియు వాఁడిమి సడలియు దైన్యంబు వాటించి లేటమొగంబు వెట్టియున్నంత నర్జునుండు గాండీవగుణక్వాణ నభీషణుండై వారలం దాఁకి పటుప్రదరనికరములం బరఁగించుటయుఁ దస్మార్గణ స్యూతగాత్రులై వారు కేసరవ్రాతభాసురంబు లగుకదంబకదంబకముల కరణిం జూడ నొప్పిరి. అక్కరణిం గాండీవి పటుపరాక్రమక్రమమునం బేర్చుటయు నతని యమ్ములతాఁకు సైరింపనేరమిం జేసి మనమూఁకల హాహాకారంబులు నార్తనాద ములునుం బెలుచ నెసఁగె. సైన్యమంతయుఁగొఱవి ద్రిప్పినచందానం దిరుగుడు పడియె. ఒకయేనుంగేనియు నొకగుఱ్ఱమేనియు నొక్కరథికుఁడేనియు నొక్కసారథి యేనియు నొకయారోహకుఁడేనియు నొకకాలుమానిసియేనియు నాధనంజయుబా ణములకు నెవ్వని తెఱంగును నెత్తుటం జొత్తిల్లనివిధంబును దైన్యంబు వాటింప నిరీతియుం గన్పట్టదయ్యె. పెక్కు లేల రక్తసిక్తమై బలఁగమంతయుఁ బూచిన మోదుగుతోఁపుచాడ్పునం బొలిచె. అప్రతిహతం బైనసవ్యసాచి పరాక్రమంబు నకు వెఱచి కౌరవులు కర్ణునిజీవితంబునెడ నిరాశులై విఱిగి పఱచుటయు గాండీవి భీమసేనాదు లగుతమవారలకుఁ బ్రహర్షోత్కర్షముఁ గావించువాఁడై శరనికర ములం గుప్పించుచు వెన్నడించి తఱిమినం దిక్కుదోఁపక నీకొడుకులు మున్నుగాఁ గలుగుకురువీరులు కర్మనిష్ఠాపరులై నజనులు మృత్యువునకు వెఱచి ధర్మము నాశ్ర యించుచందమున నర్జునునకు వెఱచి యోకర్ణా కర్ణాయనుచు నారాధేయునిమఱుఁ గుఁ జొచ్చుటయు నమ్మహారథప్రవరుం డగాధంబైనయర్జునునిశరసాగరంబున ము

నుంగు నక్కొరవులకుఁ దాను బెనుదీవియై జూపట్టి యుద్ధరించువాఁడై విఱిగి పఱచుచున్న మూఁకలకుఁ జేయి వీచి యేనుగలుగ మీకు వెఱవను బఱవనుం బని లేదని యెలుం గేర్పడం జెప్పి యూఱార్చి బరవసంబు వాటించి సవ్యసాచినెడ నాలసింపరాదని యూహించి నారిసారించి పాంచాలబలంబుపయిం గవిసె.

## కర్ణుఁడు పాంచాలాదులపయిం గవియుట.

అట్లు కర్ణుండు పాంచాలబలంబుపయిం గవిసి జనమేజయుగుఱ్ఱములను సారథినిం దెగటార్చి యతనికిఁ దోడుపడ నేతెంచినశతానీకసుతసోములవిండ్లు దునిమి ధృష్టద్యుమ్నునిమేన నాఱుతూపుల నిగిడించి గుఱ్ఱములం గీటడంచి సాత్యకిరథ్యములం బరిమార్చి కేకయపతిపుత్రుం డైనవిశోకుం బిలుకుమార్చుటయు నక్కేకయేశ్వరుండు పుత్రశోకద్విగుణితరోషవిస్ఫురితుండై కర్ణుకొడు కగు ప్రసేనునిపయిం గాండజాలములు నిగుడించుటయు నారాధాసుతుఁడు పరమరయమున వానిపై నడరి యర్ధచంద్రశరత్రయమున శిరోబాహువికర్తనంబు గావించుటయు నక్కేకయపతి గొడ్డంట నఱికినమ్రానుమాడ్కిం గూలె. అప్పుడు ప్రసేనుఁడు హతాశ్వుఁడై నసాత్యకిమీఁది కడరి నిశితశరములఁ గురియుటయు నాశైనేయుండు క్రోధధురంధరుండై బలుతూపుల వానిం బరిమార్చినం గోపించి పుత్రమరణశోకార్దితుండై రాధేయుండు శైనేయాహతుఁడై తి వనిపల్కుచు నొక్కతీవ్రబాణం బరిఁ బోసి యేయుటయు శిఖండి దాని మూఁటఁ దునిమి మఱిమూఁటఁ గర్ణుని నొవ్వ నేసె. అందుల కలిగి యాదిత్యసూనుండు శిఖండికేతనకార్ముకముల క్షురద్వయమునం ద్రుంచి తద్గాత్రమ్మున శరషట్కంబుఁ గీలించి ధృష్టద్యుమ్నతనయుతలఁ గోసి సుతసోముపయిం బ్రదరనికరము లడరించుచున్నం తవాసుదేవుఁడు పార్థా! వాఁడె కర్ణుఁ డద్దెసఁ బాంచాలబలవిధ్వంసంబుఁ జేయుచున్నవాఁడు నీ వరిగినంగాని యిప్పుడు వారికిఁ బ్రాణరక్షణంబు సమకూఱ దనుటయు విచ్చువ్చుఁడు నగుచు గాండీవజ్యాఘోషంబు నిగిడించి కర్ణునిమీఁది కడరుటయు భీమసేనుఁడు నతనికిఁ దోడై నడుచుటయుఁ బరమతుములం బయ్యె. అట్టియెడ నుత్తమౌజుండును యుధామన్యుండును జనమేజయుండును శిఖండియు దృష్టద్యుమ్నుఁడును బార్థులవెంట నడిచి చటులసింహనాదభీషణుం డైనకర్ణునిఁ దాఁకిన నతండుమహీమండలంబు సంక్షోభింపఁ బటుమౌర్వీఘోషంబుఁ గావించి మండలీకృతకోదండమధ్యదర్శనీయుండై పరివేషాంతరగతుం డైనయాదిత్యుం గ్రేణిసేయుచుఁ బంచ్రెండేంట శిఖండిని నాలేంట నుత్తమౌజుని మూఁడుమూఁడింట యుధామన్యుజనమేజయ దృష్టద్యుమ్నులను నొప్పించిన నయ్యేవురుపాంచాలవరులును గూడ ముట్టియుఁ బంచేంద్రియార్థంబులు జితాత్ముఁ డగుయోగివరుంబోలె నారాధేయుం గలంపఁ జాలక కలం బవియఁగ మున్నీట మునుఁగుచున్న బేహా

రులచందమున దిక్కేది నెగడుపడినయమ్మాతులులం జూచి ద్రౌపదీనందనులు శరవర్షప్రస్ఫీతులై యేతెంచి వారల నుద్ధరించిరి. అంతకు సాత్యకి తేరి కుత్తమాశ్వములం బూన్పించి కట్టాయితంబై వచ్చి కర్ణుందలపడి యయోమయంబు లగుపటుశిలీముఖముల నారథికప్రముఖుని నొప్పించి దుర్యోధనుపై నెనిమిదివాలమ్ము లడరించుటయుఁ గృపాచార్యుఁడును గృతవర్మయు నప్పటికిఁ దో డగుటయు నాకర్ణకృపకృతవర్మదుర్యోధనులు నలువురునుం గూడి తనపై నడరినం జూచి దిక్పాలకచతుష్టయంబుతోడం బోరుదైత్యపతివిధంబునకుఁ జాలినవాఁడై శిని వీరుఁడు మధ్యాహ్నమార్తండునిమాడ్కి దుర్దమతేజోవిభ్రాజితుండై శరాసారంబుఁ గురియుచున్నంతఁ బాంచాలవీరులు పలువురుమరుద్గణంబులు మహేంద్రుంబోలెఁ దన్నుం బరివేష్టించి నిల్చుటయు నయ్యిరువాఁగునఁ జేయంగలమేటిదొరలకొదవినయప్పటిపోరు దేవదానవసంగ్రామసమంబై పరమభీమం బయ్యె.

భీముఁడు దుశ్శాసనుని వధించి వాని నెత్తురు ద్రాగుట.

అయ్యవసరంబున దుశ్శాసనుండు వెఱపు దక్కి మిక్కుటం బగునుక్కుసం బేర్చి శరవర్షబంధురుండై భీమునిమీఁది కడరుటయు నత్యంతరోషావేశమునం జేసి యొండొరులప్రాణములు పన్నిదంబు చఱచినయయ్యిద్దరిపోరు శక్రశంబర సంగ్రామంబురీతి నత్యంతభీకరం బయ్యె. కరేణుకాంక్షం జేసి మదనాసక్తంబు లైనవన్యమత్తశుండాలంబులపగిదిఁ బరస్పరస్పర్ధాసముజ్జ్వలు లగునయ్యిరువురు శూరు లితరేతరజిఘాంసామనీషం బోరునెడ వృకోదరుం డేచి వడిం బేర్చి క్షురద్వయమున దుశ్శాసనుకేతనకార్ముకములం ద్రుంచి ఫాలభాగమున నొక్కవాలమ్ము నాటి సారథితలఁ దఱుగుటయు నీకొడుకు వేఱువి ల్లెత్తి వృకోదరుపైఁ బంద్రెండుతూపులు గీలించి సారథికృత్యంబు తాన కావించికొనుచు శరవర్షంబుఁ గురిసి సూర్యప్రకాశం బగునొక్కవాఁడియమ్ము వింట సంధించి భీముగాత్రంబుఁ గాఁడిపోవ బిట్టేయుటయు గాఢవిద్ధుండై యప్పాండునందనుండు మూర్ఛిల్లి చేతులు సాచి తేరిపయిం బడి కొండొకసేపునకుఁ దెలిసి లేచి యార్చి పేర్చినం బెగ్గడిల్లక యగ్గలించి దుస్ససేనుఁడు భీమసేనువిల్లు ఖండించి యఱువదితూపులఁ దత్సారథిని నొంచి తొమ్మిదివాలమ్ములు తద్గాత్రమునం జొనిపి మఱియుం బెక్కుతూపు లడరించుటయుఁ జూపఱు ప్రశంసించిరి. అందుల కలిగి పవననందనుండు శక్తిం బ్రయోగించుటయుఁ బెనుగొఱవిమాడ్కి నెంతయు మండుచు మీఁదఁ బడవచ్చుచున్నయాశక్తిం దశవిశిఖముల ఖండించి దుశ్శాసనుండు తత్కాలకృతప్రశంసావచనములకు నెమ్మనమ్మున నలరుచు నత్యంతదారుణం బగుమార్గణం బొకండు భీముగాత్రంబునం గ్రుచ్చుటయు రోషప్రజ్వలితుండై వృకోదరుండు కన్నుల నిప్పులు రాల దుశ్శాసనుం జూచి యోవీరా! నీచేఁ బెద్దయు నొచ్చితినని యుబ్బ వల

డు. ఇదె నాగదతాఁకు పై రింపు మీారణమధ్యమునఁ బ్రతిజ్ఞాతప్రకారమున నీనె
త్తురు ద్రావుదు ననిపలికి గద యెత్తి వేయ నుంకించుచున్నంత దుశ్శాసనుండు
భీముపయిం బడ శక్తి నేయుటయు నబ్బకాంతకుండు దానికి మాఱుగా గద నే
సిన నది యాశక్తిం ద్రుంచి దుశ్శాసనుమస్తకంబుపయిం బడుటయు మదపరీతం
బైనమాతంగంబుమాడ్కి శోణితపరీతుండై యొప్పుభవత్తనయుం డగ్గద యెత్తి
పవనతనయుపై నేసె. దానిం దప్పించుకొని వృకోదరుఁ డొండుగద యెత్తి పది
విండ్లకొలందిదవ్వున నున్నదుస్ససేనుపయిం బడ బిట్టేయుటయుఁ దద్గదాప్రహా
రమున దుశ్శాసనుండు నేలం బడియె. గుఱ్ఱములు మడిసె. సారథి సమసె. తేరు
నుగ్గునూచ మయ్యె. మైమఱు వఱువుల్లుగా నేలం బడి తన్నికొనుచున్నదుశ్శాస
నుం జూచి పాండవపాంచాలురు ప్రహర్షసంభరితులై సింహనాదములు గావిం
చిరి. అంత భీముఁడును దిక్తటంబులు బీఁటలువాఱును దమవారు సముల్లాసభా
సురత్వంబుఁ బొరయును మనవారు సోలి వ్రాలనుం బటుసింహనాదంబులు గావిం
చి రయమునం దేరుడిగ్గి పాంచాలిని ముందల పట్టి యీడ్చి సభకుఁ దెచ్చుట ము
న్నుగా నతండు తమకుఁ జేసినయెగ్గులన్నియుం దలంపునకుఁ దెచ్చికొని నేయి
వ్రాయఁగ భగ్గనం దరికొనునగ్నిచందమునఁ గ్రోధప్రజ్వలితుండై దుశ్శాసను డా
య నరిగి కర్ణకృపాశ్వత్థామకృతవర్మదుర్యోధనులం జూచి పాపాచారుఁ డైనదు
శ్శాసను నిదె నేను జంపుచున్నవాఁడను శక్తి గలిగినం గాచికొనుఁ డనిపలికి
గజముమీఁది కుఱుకుసింహముచాడ్పునఁ గృపాణపాణియై నేలం బడి తన్నికొను
చున్నయాదుశ్శాసనుమెడపయిం గా లూది తన్ని పట్టి కరవాలంబు ఝుళిపించి
ఱొమ్ము వ్రచ్చి కదుష్ణం బైనరుధిరంబు దోసిటం గొని యాస్వాదించి దానిచవికి
మెప్పు గదిరినచిత్తమ్ముతో నిటునటుం జూచుచు జననీస్తన్యంబును మధుదధిఘృ
తంబులును నానావిధము లగుపానీయములును దీనిరుచిం బడయఁ జాలవు. దు
శ్శాసనరుధిరంబుకంటె రుచిమంతం బగుపదార్థంబు నాకుఁ గన్పట్ట దనిపలుకుచు
మృతుం డగుదుశ్శాసనుకళేబరంబుఁ జూచి క్రోధపరీతుం డయ్యు లేనినవ్వు దె
చ్చికొని యోరీదుశ్శాసనా! కటకటా యేమి చేయుదు. మృత్యువు నీకుఁ దప్ప
దయ్యె ననిపలుకుచుఁ బలుమాఱు నెత్తు రాస్వాదించుచున్నంత నాతనిం జూచి
మనవారు వీఁడు రాక్షసుండుగాని మనుష్యుఁడు గాఁడని పలుకుచు భీమాకారుం
డైనయాభీముం జూడ నోడి కన్నులు మూసికొని పఱచిరి. అప్పుడు కర్ణునితమ్ముఁ
డగుచిత్రసేనుని యుధామన్యుండు తాఁకి సప్తాశుగంబు లడరించుటయు మఱలి
యక్కర్ణానుజుండు మూఁడింట వానిని నాటింటఁ దత్సారథిని నొంచినం గోపించి
యప్పాంచాలవరుం డా కర్ణపూర్ణముక్తం బైనయొక్కమార్గణంబున వానితలఁ
దఱిగె. తనతమ్ముఁ డట్లు హతుఁ డైనం గినిసి కర్ణుండు పాండవానీకముపయిం గవి

యుటయు నఱులుఁ డాఁగె. భీముఁ డట్లు దుశ్శాసనుం బరిమార్చి దోసిలి నిండ నెత్తురు గ్రహించి యందఱు వినంగ నిట్లనియె. ఓపురుషాధమా! దుశ్శాసనా! యిదె నీనెత్తురు ద్రావెద. ఏదీ మఱలఁ బసులని యార్వుము. మున్ను మమ్ము లఁ బసులని యార్చి యాడినవారిం జూచి మేము గ్రమ్మఱఁ బసులనియార్చియా డుదుము. ప్రమాణకోటిలో నిద్రించునెడఁ ద్రోయుటయు విషముఁ బెట్టుటయు బాములఁ గఱపించుటయు లక్కయిల్లు గాల్పించుటయు దుర్ద్యూతమున రాజ్య మునాఁచికొనుటయు నడువులకు వెడలఁ గొట్టుటయు, ద్రౌపది నాసభకు ముందల పట్టి యీడ్చి తెచ్చి చీర లొలిచి భంగపెట్టుటయు నస్మదీయసర్వధనం బు హరించుటయు నజ్ఞాతవాసమున శ్రమపఱచుటయు మున్నగు మాకు మూఁ డినకీడులకెల్ల నీవును శకునికర్ణదుర్యోధనులునుగదా మూలంబు. మీవలన నె న్నఁడును సుఖము లనుమాట యెఱుఁగక దుఃఖమునే కుడిచితిమి. మీయన్న దమ్ములును ధృతరాష్ట్రుఁడును దురాత్ము లగుటంజేసి యిట్లు ఘటిల్లె ననిపలికి జయ ప్రాప్తుండు గావునఁ బరమానందమునం దేలుచు దుశ్శాసనునెత్తుటం బొత్తిల్లిన మేను దనసాహసోల్లాసమునకుఁ బెంపుఁ గావింప నలరుచుఁ గేశవార్జునులదెస మొగంబై దుశ్శాసనుం జంపి రక్తపానంబు సేయుదు నన్నప్రతిజ్ఞ దీర్చితి. ఇఁక దుర్యోధనుతొడలు విఱుగ నడిచి కాలఁ దలఁ దన్నుదు నన్నప్రతిన యొక్కండు దీర్పవలయు. అదియుం జేసి తీర్ణప్రతిజ్ఞుఁడనై శాంతిఁ బొందుదు నని సకలకౌ రవసమక్షమునం బలికి వృత్రవధప్రీతుం డైనపురుహూతునిరీతిం బరమప్రీతుండై సింహనాదంబుఁ గావించె.

భీముఁడు నిషంగిమొదలగుధార్తరాష్ట్రులఁ బదుగురఁ జంపుట.

అవ్విధమున దుశ్శాసనుఁడు హతుఁడైనం గోపవిషాదభరితులై నీకొడు కులు నిషంగి, కవచి, పాశి, దండధారుఁడు, ధనుర్గ్రాహుఁ, డలోలుపుఁడు, సహుఁ డు, షండుఁడు, వాతవేగుఁడు, సువర్చసుఁ డనువారలు పదుం డ్రొక్కపెట్ట వడ ముడిం జుట్టు ముట్టుటయు నాతండు నిశితభల్లముల నాపదుగురను జమునిప్రోలి కనుచుటయుఁ గర్ణుఁడు సూచుచుండఁ బాండవభయార్దితంబై మనయనీకంబు కాందిశీకం బయ్యె. కర్ణుండును వెఱపు గదిరినచిత్తముతో నుత్సాహము దఱిఁగి యున్నకుండె. అప్పుడు పరేంగితవిదుఁ డైనమద్రదేశ్వరుండు తదవస్థుఁ డైనకర్ణునిఁ బరమవిక్రమోల్లాసభాసురు లగుపాండవులనుం జూచి యిఁక నూరకున్నఁ గార్యం బు దప్పు నని తలపోసి రాధేయున కిట్లనియె. అంగపతీ వెత మానుము నీయట్టి శూరున కిట్టిదిపోలునే! అల్లవారె మనదెసరాజులెల్ల భీమసేనభయార్దితులై పఱ చుచున్నవారు. దుశ్శాసనురుధిరంబు భీముఁడు ద్రావఁగ శోకోపహతుఁడై నిర్వే దప్రాప్తుండై దుర్యోధనుఁ డెయ్యదియుఁ దోఁపనితెఱంగున నున్నవాఁడు. హత

శేషు లగుసోదరులును కృపప్రభృతులును చెయ్వులు దకిఱ యతనిం బరివేష్టించి యున్నవారు. అర్జును పురస్సరులై పాండవులు జయప్రాప్తులు గావునఁ బరమోత్సాహమునం జేసి నిన్నె మార్కొనఁగ వచ్చుచున్నవారు. కావునఁ బౌరుషంబు వాటించి క్షత్రధర్మముఁ బరికించి ధనంజయుని మార్కొనుము. దుర్యోధనుఁడు నీమీఁద నిడినభార మంతయు శక్తిబలములం గొఱంతలేనితెఱంగుగా మోవవలయుఁ గదా. జయమైనం బరమయశంబును బరాజయమైన వీరస్వర్గంబును లభించు నెయ్యదియైనను మేల యని నిశ్చయించి కిరీటితోడి పోరికిఁ దొడరుము. నీవిట్లులు మోహప్రాప్తుఁడై నం జూచి వృషసేనుఁడు తాన పాండవులమీఁది కడరె నని పలికిన నమ్మద్రపతివచనములు విని రాధేయుండు యుద్ధ మింకఁ గర్తవ్యము కాని యూరక చింతించినం బ్రయోజనంబు లే దని నిశ్చయించి యుండె.


నకులుఁడు వృషసేనుతోడం బోరి యోడుట.

అంత వృషసేనుఁడు గదాపాణి యైనభీమసేనుఁ దాఁక నడుచుటయు నకులుఁ డతనిం దలకడచి జంభాసురవధోద్యతుం డైనపురుహూతునిపోఁక మెఱసి యాకర్ణాత్మజుపయి నడరి శరనికరముఁ బరగించి సిడముఁ గూల్చియుఁ గత్తళంబుఁ బఱియలువాపియు విల్లు దునిమియు వెగడుపఱచిన నావృషసేనుఁడు వేఱువిల్లెత్తి మృతుఁ డైనదుశ్శాసనునకుఁ బ్రియముగా దివ్యాస్త్రముల నకులుపయిం బడ నేసె. అందుల కలిగి నకులుఁడు మహోల్కాసంకాశము లగుదివ్యాస్త్రములు పెకిఱ లేయుటయు వృషసేనుఁడు శరాభిఘాతముననుఁ దివ్యాస్త్రప్రభావముననుం బొడమినకోపమున నాజ్యాహుతులం బ్రజ్వరిల్లువైశ్వానరుకరణిం బరమతేజోభరితుండై యుత్తమాస్త్రము లేసి నకులుతేరిగుఱ్ఱముల నాలుగింటం బరిమార్చిన నమ్మాద్రేయుండు హతాశ్వం బైనతేరు తటాలున డిగ్గి వాలును బలకయుం గొని యతనియస్త్రములఁ బలకం జదియ మోఁదుచు వివిధచిత్రగతుల నంతరిక్షమునం దిరుగుచు రథహయకుంజరవిసరంబులం గనుపుగొట్టుటయునవి యశ్వమేధశామిత్రంబునఁ బశువులతెఱంగునం దెగుచుండె. అట్లు నకులుండు ద్విసాహస్రయోధులం దనకృపాణమున కెర యిచ్చి కొత్తలల చేసినం గోపించి కర్ణాత్మజుండు సాయకాసారంబుల నొంచుటయు నాతండు వడముడితోడ్పాటునం బేర్చి యనీకంబులం జెండాడుటయుఁ గోపదీపితుండై కర్ణనందనుండు ఱెక్కలు సాచి యామిషార్థంబు వ్రాలు డేగచాడ్పున దురూహతీవ్రప్రచారుం డైనయానకులునిపయిం బదునెనిమిదివాలమ్ములు నిగిడించి మఱియు శరవర్షంబుఁ గురిసె. కురిసినం దాని సరకుగొనక నకులుండు వివిధవిచిత్రగతులం జరించుచుఁ దన్మార్గణగణములనెల్ల వమ్ముసేయుచున్నంత వృషసేనుఁడు నేర్పునం బేర్చి తీవ్రాశుగములఁ ధారాసహస్రచిత్రం బైనయతనికేడెముఁ బలుతునియలుగా ఖండించి తోడన క్రూరభుజంగం

బుంబోనికరవాలంబు శరషట్కమునం దునిమి నిశితదీప్తాశుగములఁ బెక్కింటి న
తనిమేనం గీలించుటయుఁ దదీయశరపీడితుండై యశ్వత్థామదీసుతుండు ధనంజయుం
డు సూచుచుండ గిరిశిఖరమునకు లంఘించుసింహముచందమున భీమసేను తేరిమీఁ
దికి లంఘించె. అ క్లేకరథస్థు లైనయయ్యన్నదమ్ములపై వృషసేనుండు శరవర్ష
ముఁ గురియుటయుఁ గురువీరులును బెక్కండ్రు వానికిఁ దోడై తూపులగములఁ
బరగించుచున్నంత భీముఁ డర్జునుం జూచి చూచితే సవ్యసాచీ వీఁడె కర్ణనంద
నుండు నకులుం బొదివి యెంతయు నేఁచుచున్నవాఁడు. ఇక నీవు మార్కొనమి
పోల దనుటయు నకులుఁడును దదనురూపంబు లగునాలాపంబుల నివేదించు
టయు గాండీవి కపికేతనస్ఫూర్తి మెఱయ నాతనిం దలపడ నడరుటయు ధృష్ట
ద్యుమ్నుఁడును శిఖండియు యుధామన్యుండు నుత్తమౌజుండును జనమేజయుండు
ను సాత్యకియును ద్రౌపదీనందను లేవురును దోడ నడరినం గని కృపకృతవ
ర్మద్రోణిసుయోధనులును శకునిపుత్రాదులును వారల నాఁగుటయు నీలమేఘస
వర్ణంబు లైనమదమాతంగముల నారోహించి కులిందవీరులు పెక్కండ్రు వార
లం దలపడినం బోరు ఘోరం బయ్యె. అప్పుడు కులిందపుత్రుం డొక్కరుఁడు తీవ్ర
మార్గణములఁ గృపునిరథ్యసారథిసహితంబుగా నొంచుటయు నాశారద్వతుం డలి
గి బలుతూపు లడరించుటయు నాకులిందపుత్రుఁ డేనుంగుతోడం బడియె. అంతఁ
దదనుజుండు నిశితతోమరంబులఁ బరఁగించి యార్చినం గినిసి శకుని వానితలఁ
దఱుగుటయు మనవారు శంఖారవంబులును సింహనాదములను గావించిరి.అయ్యా
ర్పు సైరింపక పాండవవీరులు నానాసాధనంబులఁ బరఁగించుచు నడరినం బరమ
తుములం బైనసమరంబు సెల్లుటయు నక్కడ నకులనందనుం డైనశతానీకుఁడు
నిక్కడఁ గృతవర్మాశ్వత్థామలును గోలుమసంగిన నిరువాఁగునను బలుమూఁకలు
తెగియె. అట్టియెడఁ గులిందపతితమ్ముఁ డొండొకండు దుర్యోధనుపై నడరి బలు
తూపులం గుప్పించుటయు నామహీనాథుఁడు శాతసాయకముల వానియేనుఁగుం
బరిమార్చిన నాతఁ డొండుమదగజంబుఁ గొల్పుటయు నది క్రాథురథంబు విఱి
చిన నాతండు తీవ్రశరం బేయుటయు నయ్యేనుంగు వజ్రాహతం బయినధరణీధ
రంబుకరణిం గూలె. అంతఁ బర్వతేశ్వరుండు హస్తిగతుండై క్రాథపతిని రథర
థ్యసారథిసహితంబుగా సునిశితతోమరంబుల కెరఁ జేయుటయు వృకుఁడు పం
డ్రెండుతూపుల వాని నొంచిన నాతండు తనయేనుఁగుం గొల్చి తదీయరథంబు నుగ్గు
గావించుటయు దేవావృధుఁడువాని నేనుంగుతోడఁ దెగటార్చినం గోపించి సహదే
వసూనుండు వాలమ్ముల వానిం జక్కబెట్టె. కులిందపుత్రుఁ డొకండు శకునిపైఁ ద
నయేనుఁగుం గొల్పుటయు నాతండు వానితలం దఱుగుటయు మనవారు పరమ
ముదమునం బొదలి యార్చి చిందములం బూరించి కోలుమసంగినం బోరు ఘో

రం బయ్యె. అప్పుడొండొకకులిందునకు శతానీకునకుం బోరు తుములంబై పర స్పరసేనావిధ్వంసనోదగ్రంబై చెల్లుచుండఁగ నన్నకులాత్మజుండు క్షురమునం దదీయమస్తకచ్ఛేదంబుఁ గావించుటయు వృషసేనుఁడు వానిపై మూఁడును భీమునిపై మూఁడును నకులునిపై నేడును జనార్దనుపైఁ బండ్రెండునువాలమ్ములఁ బరఁగించుటయు మనవార లతనిశౌర్య మగ్గించిరి. ధనంజయుపరాక్రమం బెఱింగినయుత్తములు కట్టా యితం డగ్నిలోఁ ద్రేల్వంబడినవాఁడయ్యె నని తలంచి చింతించిరి.

అర్జునుఁడు వృషసేనుని వధించుట.

అట్టు లప్రతిహతప్రతాపదీపితుం డైనవృషసేనుని విరథుఁ డైననకులుని గాఢవిద్ధుం డైనగోవిందునిం జూచి సవ్యసాచియక్కర్ణనందనుపైఁ గవియుచున్నంత నాతండు నిర్భయుండై మహేంద్రుని మార్కొనునముచిచాడ్పున నయ్యాఖండలనందనునుం దలపడి శరజాలం బడరించి యార్చి పేర్చి మఱియుం గిరీటిసవ్యబాహుమూలమున నుగ్రబాణములం గీలించి కృష్ణునిఁ దొమ్మిదింటను దోడన క్రీడిం బదింటను నొప్పించుటయు నప్పాండవమధ్యముండు రోషభీషణుండై వృషసేనువధంబు కర్తవ్యం బనినిశ్చయించి శిఖాత్రితయవికటచటులభ్రుకుటీఘటితలలాటుండై కన్నుఁగవం గెంపు గదురఁ జూచి తీవ్రవిశిఖములంబయిం బడ నేసి దుర్యోధనాశ్వత్థామాదులఁ గలయం గనుంగొని కర్ణుం బిలిచి యలతినగవు నెమ్మొగంబున విక్రమసాహసోల్లాసంబుఁ గాన్పింప నిట్లనియె. కర్ణా, నీవు సూచుచుండ నిదె నీకొడుకుం బరిమార్చెద. కలకాలము జనులు కర్ణుఁ డర్జునుడు లేనితఱి నతనికొడుకును వధించెననియు నర్జునుఁడు కర్ణునియెదుర వానికొడుకుం బరిమార్చెననియుఁ గథలుగాఁ బలుకుదురు. శక్తి కలదేని కాచికొనుము.తొలుత నీవృషసేనుం దెగటార్చి పదంపడి నిన్నుం బొలియింతు. దుర్యోధనాశ్రయజాతదర్పుఁ డగునీవే యీకలహములకెల్ల మూలంబు. పాపాచారుఁ డైనయీదుర్యోధనుని భీమసేనుఁడు తెగఁ జూచువాఁ డింతయు నిక్కువం బనిపలికి గాండీవజ్యాఘోషంబు నిగిడించి వాలమ్ముల నరిం బోసి వృషసేనుమర్మములు దూల నేసి తోడన విల్లు నఱికి భుజద్వయంబును మస్తకంబునుం దఱుగుటయు నావృషసేనుకబంధంబు గిరిశిఖరంబునుండి డొల్లిపడుపుష్పితపాదపంబుమాడ్కిఁ దేరినుండి నేలం బడియె. అంతఁ బుత్రమరణశోకమునం బెరిఁగినక్రోధమునం బేర్చి రాధేయుఁడు చెలియలికట్ట దాఁటివచ్చు సాగరంబుచాడ్పున ఘూర్ణిల్లుచు నర్జునుపయిం గవియ నెత్తేంచుచున్నంత సురలకేనియు నుఱుపరాని తదీయసంరంభముఁ జూచి మురాంతకుం డానివాతకవచాంతకునకిట్లనియె. పార్థా, యల్లతండె కర్ణుండు పుత్రవధశోకసముదీర్ణరోషసంభరితుం డై నీపయిం గవియు దెంచుచున్నవాఁడు. అవ్వీరుతోడిపోరుకదా నీకుఁ జిరకాలకాంక్షితంబు. ఇఁక సుస్థిరుండవై పటుపరాక్రమంబుఁ జూపుము. అల్లదె యతని

యుత్తమస్యందనంబు శ్వేతతురంగయోజితంబై యభిరామకింకిణీజాలవిరాజితంబై యంతరిక్షచరం బగువిమానంబుకై వడిం జూడ నొప్పుచున్నది. అదె కేతన హస్తికక్ష్య సహస్రాక్షధనుర్మండలముమాడ్కి నాకసము నెరయుచందమునం జూపట్టుచున్నది. అల్లవియె కర్ణచాపనిర్ముక్తంబు లగుపటుకాండజాలములు ప్రావృట్పయోధరపటలనిర్యద్ధారాసారంబులకరణిం గన్పట్టుచున్నవి. అతండె మద్రేశ్వరుండు సారథికృత్యనై పుణ్యంబుఁ జూపుచున్నవాఁడు. అల్లవియె శంఖారవంబులును భేరీభాంకారంబులును సింహనాదంబులును వీతెంచుచున్నవి. అదె కర్ణచాపమౌర్వీగుణక్వణనంబు సకలశబ్దముల మిగిలితానెండు వినంబడుచున్నది. అల్లవారె పాంచాలురు సింహముఁ గన్నమృగములట్టులు తోఁచినట్లు పఱచుచున్నవారు. దేవదానవగంధర్వాదిసహితంబుగా ముల్లోకములను నీరుసేయం జాలిన యారాధేయుని మార్కొని వానితూపులతాఁకు సైరింప నీవు దక్క నొండొక్క విలుకాఁడు లేఁడు. భీముఁ డుగ్రుఁడు త్రిలోచనుఁడు కపర్దియు నగుశంకరుని లాఁతులకుఁ గన్నెత్తి చూడనైన నలవిగానిదేవు నెక్కటెక్కటిబవరంబున మెప్పించి యారాధించి తత్ప్రసాదంబు వడసిననీకుఁ గర్ణుం బరిమార్పఁ జెల్లుఁగాని లాఁతులకుఁ దలంపనైన నలవియె? పురందరుండు నముచింబోలెనీవు కర్ణుం దెగటార్చి గెల్పు గొమ్మని గోవిందుఁడు ప్రహాసభాసురవదనారవిందుఁడై పలుకుటయుఁ గిరీటి యిట్లనియె. మధుసూదనా, సర్వలోకగురుఁడై ననీవు సంతోషభరితుండవై గెలువు మన్నంతన నాకు విజయంబు ధ్రువం బయ్యె, తేరు వోనిమ్ము నేఁ డర్జునుఁడు కర్ణుం జంపక మఱలఁడు, మదీయశరముల శకలీభూతుఁ డగుకర్ణునెండెఁ గర్ణశరనిహతుఁ డగునన్నెండెఁ జూతువుగాని మే మిరువురము గల మనుమాట యింకఁ బుట్టదు. ఇపు డాసన్నం బైనయుద్ధముఁ బుడమి కలకాల మందఱునుఁ గథలుగాఁ జెప్పికొనం గలరు. ఇఁకఁ దడవు సేయరాదు రయమునం దేరు పఱుపు మనినం బద్మనాభుఁ డతనికి జయాశీర్వాదము లొనర్చితేరు కర్ణునికి సమ్ముఖముగాఁ దోలుటయుఁ గర్ణుఁడును బుత్రమరణశోకమునం బైపయిం గ్రమ్ముకన్నీరు దుడిచికొనుచుఁ గోపాటోపదీపితుండై సవ్యసాచినిఁ బోరికిఁ జీరి తలపడియె. అవ్విధమున నమ్మేటిఘోటు లిద్దఱు నుత్తమకవచసముజ్జ్వలులును వివిధసాధనసంభరితులును ఛత్రచామరాదిరాజోపచారభాసురులును సింహనాదబంధురులును శంఖధ్మానసముద్రగులును జ్యాఘోషభీషణులును దలాస్ఫాలనసముల్లాసులునునై గోవృషభముల విధమునను మత్తమాతంగముల తెఱంగునను గ్రోల్పులులభంగిని సింహములకైవడినిఁ గాలసర్పములవిధమునను బరస్పరజయకాంక్షం జేసి చూడ నొప్పుచు యుగవిగమసమయసమరసముద్యతమహాగ్రహములచందమునను నింద్రదవై రోచనులరీతిని నితరేతరస్పర్ధ మెసంగఁ దలపడి యిద్దఱు సూర్యులును నిద్దఱు శ్రీరాము

లును నిద్దఱు నారాయణులు ననుబుద్ధిం గల్పించి పుడమి కెఱఁగి వచ్చినసూర్య చంద్రుల తెఱఁగునం బోల్చుచుండ నిరువాఁగున నందఱును గర్ణార్జునులద్వంద్వ యుద్ధంబుఁ జూడ నాశ గదిరినమనంబులతోఁ దమలో నొకళ్లొకళ్లతోడిపోరు మాని చేష్టలు దక్కి వెఱఁగంది చూచుచు శంఖభేరీప్రముఖవాదిత్రరవములను సింహనాదములను భుజాస్ఫాలనములను జేలాంచలవిధూననంబులనుఁగావించి య మ్మేటిమగలకుఁ బ్రహర్షంబుఁ గావించిరి. ఆశూరశేఖరులం జూచి ఖేచరులు పిచ్చ లించిరి. ఆసమరమున మనవారు కర్ణునిఁ బాండవు లర్జునునిం బన్నిదంబుసఱచిన చందంబు తోఁచె. దేవదానవగంధర్వపిశాచోరగరాక్షసాదులును సకలభూతంబు లును దమకుఁ దమకుఁ దోఁచినతెఱంగునఁ గర్ణార్జునపక్షములలో నొక్కదానిం గ్రహించి రెట్లంటేని. దివంబును నసురులును యాతుధానులును గుహ్యకులును క్షుద్రసర్పంబులును నాదిత్యులును వైశ్యశూద్రసూతులును సంకరజాతులును భూతప్రేతపిశాచక్రవ్యాదగణంబులును మృగములును నండజములును యాదో గణంబులును శ్వసృగాలంబులును గర్ణపక్షంబు గ్రహించుటయు ధనంజయువిజ యంబుఁ గోరుచు గిరిసముద్రాదిసహితంబుగా భూమియుమునులును జారణులు ను సిద్ధులును వైనతేయులును నుత్తమఖగంబులును రత్నములును నిధులును నాఖ్యానపంచమంబు లగుచతుర్వేదములును నుపవేదంబులును నుపనిషత్తులును దద్రహస్యసంగ్రహములును వాసుకిచిత్రసేనతక్షకమణికైరావతప్రముఖంబు ల గునుత్తమసర్పంబులును సారభేయములును సింహమృగవాలమృగమాంగల్యమృగ ములును వసువులును మరుత్తులును సాధ్యులును రుద్రులును విశ్వదేవులు నశ్వి నులును నగ్నియునింద్రుఁడును సోముఁడును బవనుఁడును యముఁడును గుబేరుఁ డును వరుణుఁడునుసురలును బితరులును దశదిక్కులును బ్రాహ్మణక్షత్రియులును యజ్ఞములునుదక్షిణలును దేవర్షులును బ్రహ్మర్షులును రాజర్షులును దుంబురుప్రము ఖులును బ్రాధేయమానేయప్రముఖగంధర్వాప్సరోగణంబులును రథద్విరదతుర గపదాతిగణంబులు నర్జునుపక్షంబు గ్రహించినం బరమాద్భుతం బయ్యె. బ్రహ్మ రుద్రాదులుబ్రహ్మర్షులు బ్రజాపతులుమున్నగువారితోడ దివ్యవిమానారూఢులై కర్ణార్జునులసమరంబుఁ జూడ వేడుకపడి యంతరిక్షమునం బొలిచిరి. అప్పుడు మహేంద్రుఁడర్జునుఁడు కర్ణుం గెల్చుఁగాక యనుటయు సూర్యుఁడు కర్ణుఁ డ ర్జునుం గెలుచుఁగాక యనవుడు నింద్రుఁడు మదీయతనయుఁ డగునర్జునుఁడు కర్ణుంబరిమార్చుఁగాకయనియు సూర్యుఁడు మదీయతనయుఁ డగుకర్ణుఁ డర్జునుం దెగటార్చుఁగాక యనియు స్వస్వశుభాశంసులై వివాదం బొనర్చినం దేవదా నవాదులు తమకుఁ దమకుఁ బోలినతెఱంగునం బక్షద్వయంబు గ్రహించు టయు సకలభూతసహితంబుగా ముల్లోకములు కంపించె. అట్టియెడ సురలు

బ్రహ్మకుఁ బ్రణమిల్లి దేవా కర్ణార్జునులలో నెవ్వరు గెలుతురు. ఈ వివాదము నం జేసి జగమెల్ల సంశయప్రాప్తం బయ్యె. కావున నొక తెఱంగున నిశ్చయింపుము. వీరిరువురకును జయంబు సమానరూపంబైనం బోలదో? యని నివేదించుచున్నంత నింద్రుఁడు పరమేష్ఠి కెఱఁగి కృష్ణులకు విజయంబు ధ్రువం బని మున్ను వచించితివిగదా దేవా, యిప్పు డవ్వచనంబు సత్యంబుగా ననుగ్రహింపవే యనివేఁడుటయు బ్రహ్మేశానులాఖండలున కిట్లనిరి. పురందరా, ఖాండవదహనమున దహనునకుఁ దృప్తిఁ దావించినయర్జునునకు విజయంబు నిక్కువంబు. మఱియు నతండు స్వర్గమునకుఁ జనుదెంచి నీకు సాహాయ్యం బొనరించె. దానవపక్షప్రాప్తుం డైనకర్ణునకుఁ బరాజయంబును దేవపక్షప్రాప్తుం డైనయర్జునునకు విజయంబునుం గూర్చుట సమంజసంబు. ఇతరకార్యములకంటె నాత్మకార్యము ముఖ్యము గావున మనము దేవకార్యము నెఱవేఱుట ముఖ్యముగాఁ జూచికొనవలయు. అదియునుంగాక బవరంబున మహాదేవుని మెప్పించినయుత్తమవీరునకు జయము కాక పరాజయముగలుగనేర్చునే. జగత్ప్రభుం డైననారాయణుండు తాను సారథియై యతనికార్యము నిర్వహింపఁ బూనియుండఁ బరాజయం బెట్లు కలుగు? అతనిధర్మంబె యతనిం గెలిపించును. వివిధధనుర్విద్యల లెస్స నేర్చినయప్పార్థునకు దేవకార్యనిర్వహణధూర్వహునకు జయంబు నిశ్చితంబు. పాండవులు వనవాసాద్యాయాసంబుఁ గుడిచి సుఖము లెఱుంగనివారు గావున నింకనైన సుఖింపవలయుటం జేసి యు నర్జునవిజయం బాశాస్యంబు. ధర్మప్రవాదంబున నర్జునునకు గెల్పు గలుగవలసియున్నం దద్విపర్యాసంబుగాఁ గోరుట మనకుఁ దగదు. వెండి యుఁగృష్ణులు సర్వనియంత లనియమ్యులు పురాణమునులు జగదీశ్వరులు నిరుపములు నగునారాయణు లనుట యందఱకుం దెల్లంబకదా. వారికి గెలుపుగాక యోటముగలుగునె? కర్ణుఁడు పెద్దకాలంబు సుఖము లనుభవించినకారణంబునను దానవపక్షప్రాప్తుఁ డైననిమిత్తంబునను బరాజయంబు నొంది భీష్మద్రోణతుల్యుఁడై వసులోకమునొండె మరుల్లోకమునొండెఁ బ్రాపించుఁగాక యనుటయు సహస్రాక్షుఁడు సర్వభూతముల నామంత్రణంబుఁ గావించి బ్రహ్మేశానులవచనంబుమీరెల్ల వింటిరికదా. ఇది లోకహితంబు. కావున మీ రందఱు సంతాసంబు వాసి నిర్వృతిం జెందుఁ డనుటయు నింద్రవచనంబుఁ బ్రశంసించి పరమాద్భుతంబు నొంది పుష్పవర్షంబుఁ గురియుటయు వివిధవాద్యముల మ్రోయించుట మున్నగువానిం జేయుటయు నుల్లాసభాసురులై దేవదానవగంధర్వాదులు కర్ణార్జునులద్వంద్వయుద్ధంబుఁ జూడ వేడుకపడియుండిరి. అంతనిక్కడ నిరువాఁగున శంఖారవంబులును భేరీభాంకారములును సింహనాదములును భుజాస్ఫాలనంబులు నెసంగఁ గర్ణార్జునులు పోరి కాయత్తపడుటయు నాపోరు భీరుజనసంత్రాసకరంబై

నెగడె. అయ్యిరువురి కేతనంబులు యుగవిగమసమయసముద్ధతు లగు రాహుకేతు వులమాడ్కిం జూడనొప్పె. ఇంద్రధనుస్సగ్రప్రకాశంబై తేజోదుర్నిరీక్ష్యంబైనకర్ణు కేతనహస్తికక్ష్యనుజూచి సవ్యసాచికేతనకపి సమరతాత్పర్యమున నోరు దెఱచిన యంతకునియట్లు దంష్ట్రాకరాళవక్త్రకుహరంబై తేజోదుర్నిరీక్ష్యంబై స్వస్థానం బుననుండి లేచి వడిం బేర్చి యాహస్తికక్ష్యమీఁదికి నిగిడి గరుడి పన్నగంబునుం బోలె నఖదంష్ట్రావిదళనంబుఁ గావించిన నాహస్తికక్ష్యయు రోషభీషణంబై తోడ నడరుటయు నక్కేతనంబులు రెంటికి నిందొలుత ఘోరంబైనపోరు సెల్లె. రథ్యములు పరస్పరస్పర్థాతిశయమునం జేసి యితరేతరంబుల నాక్రోశించుచు హేషారవంబులఁ గావించె. కృష్ణుఁడును మద్రపతియు నొండొరులఁ జూఱచుఱం జూచుచుండ న చ్యుతుండు సక్రోధవీక్షణంబున శల్యుం గెలిచె. అయ్యవసరంబునఁ గర్ణుఁడు శల్యుం బిలిచి యర్జునుఁడొకవేళ నన్ను వధియించెనేని యెట్లయ్యెడునోయనిన యతనికా తండు పదంపడియే నెక్కరుండన విక్రమించి కృష్ణార్జునులం దెగఁ జూతు ననిపలికె. అర్జునుఁడు నివ్విధమున దామోదరు నడిగిన నమ్మహానుభావుఁడు పార్థా, యిది యె క్కడి మాట సూర్యుఁడు స్వస్థానచ్యుతిం జొరసెనేనియు మహోదధి యింకెనేని యు నగ్గి చల్లనయ్యెనేనియుఁ గర్ణుండు నిన్ను వధింప నోపఁడు. అంత పొసఁగిననాఁడు నేను బాహుబలమునం గర్ణుని శల్యునిం దెగటార్తు ననిపలికిన విని చిఱునగవు మొ గమున నంకురింపఁ బాండవమధ్యముండు పుండరీకాక్షున కిట్లనియె. జనార్దనా, కర్ణశల్యు లిద్దఱును నాకుఁ జాలరు. రథరథ్య కేతనసహితంబుగా నేఁడునేను వనగజము పాదపమునుంబోలెఁ గర్ణుని శరనికరముల శకలంబులు గావించెద నీవు చూతువు నేఁడు రాధేయభార్యలు విధవలుఁగాఁగలరు వారు స్వప్నముల ననిష్టములం గనిరట. నాకోపం బప్పటికిఁ గాని చల్లాఱదు. దీర్ఘాలోచనశూన్యుం డై నయమ్మూఢుఁడానాఁడు సభలోఁ బాంచాలిం బరిహసించినపలుకులు నామ నంబు నింతకు నెరియించుచున్నది. కర్ణుఁడు పడినపదంపడి నేఁడభాగ్యవశంబున విజయంబు సేకూఱె ననుమాటలు నీవ వినంగలవు. సుభద్రనుఁ గుంతీదేవిని యా జ్ఞసేనిని ధర్మరాజును నీవు మధురవచనముల నూఱడింతు వని యిట్లు కృష్ణార్జు నులు సల్లాపంబు సేయుచున్నంత నిరువాఁగునం గలసకలజనులకు సమరదర్శన గతు లగు దేవదానవాదులవిమానంబులును గంధర్వగానంబులును నప్సరోనృత్య ములును లోచనగోచరంబులై పరమాద్భుతాపాదకంబులై యుండునెడఁ గర్ణా ర్జునులు కడంగి నిజసేనలం బొడమునాత్మీయప్రశంసావచనంబులకును శంఖభేరీ ప్రముఖవాదిత్రనిస్వనంబునకును సింహనాదములకును భుజాస్ఫాలనరవంబులకు నుప్పొంగి చంద్రాదిత్యులకరణి నిరుపమానతేజోవిరాజితులై ముందు మిఁగుల రా దనుతలంపున బరవసంబు వాటింపనియాయోధులకుఁ బ్రాపై నిల్చి మార్కొ

ఘోషంబు నిగిడించి శరనికరంబుఁ గురియించి బహుళచతురంగములం గూల్చు చున్నంత నివాతకవచాంతకుకోల్తల కోహటించి మనమూఁక లుత్సాహము ద ఱిఁగి సింహముఁ గన్నమృగములయట్టు లోడుఁగుటయుఁ గృపకృతవర్మసౌబల దుర్యోధనులు కర్ణునకుఁ దోడ్పడి వాసుదేవధనంజయులపై బలుతూపులు నిగి డించినం గోపించి కిరీటి వారల శాతశాయకగుణంబుల నొప్పించి వారివిండ్లను నమ్ములపొదులను ధ్వజములను గుఱ్ఱములను రథములను బాధితంబులఁ గావించి సారథుల నొవ్వ నేసి పండ్రెండువాఁడితూపులు కర్ణుమేనం జొనిపె. అంత దు ర్యోధనుండు పురికొల్పఁగ యోధవీరులు పెక్కండ్రడరి పటుప్రదరనికరములఁ బర గించుటయు నమ్మహారథప్రవరుండు నవ్వుచు నొక్కమాత్రలోన వారందఱితలలు నఱికినం గగనమున సాధువాదంబులును బుష్పవర్షంబులు నెసంగుటయు నిరువా గున నెల్లవారును బరమాశ్చర్యంబుఁ జెందిరి. కర్ణదుర్యోధను లిద్దఱు నాశ్చర్యం బును వ్యథనుం జెందక యేకనిశ్చయులై యుండిరి.

## అశ్వత్థామ దుర్యోధనునకు హిత ముపదేశించుట.

అప్పు డశ్వత్థామ దుర్యోధను డాయ నరిగి తనకరమున నతనికరముఁ దెమల్చి సాంత్వపూర్వంబుగా నిట్లనియె. దుర్యోధనా, యింకనైనఁ బ్రసన్నుఁ డవై శాంతిఁ బొందుము. నింద్యమగువిరోధముఁ ద్యజింపుము. బ్రహ్మసముఁడు మహాస్త్రవిదుఁడు నగునాచార్యుఁడు నట్టివాఁ డగుభీష్ముఁడును దివ్యాస్త్రవేదు లత్యంతశూరులు నగుపెక్కండ్రురాజులును నర్జునుం గెలువఁ జాలక తామ పడిరి. ఇఁకఁ గర్ణుఁడు గెలిపించు ననుతలంపు మానుము. అవధ్యు లగునన్నును మా మామనుం గొని గెల్తు నని నమ్మవలదు. ఇప్పడైనం జెప్పిన ధనంజయుండు విని యుపశమించును. జనార్దనునకును వైరంబు సమ్మతంబుగాదు. సర్వభూతహితుఁ డైనయజాతశత్రునకు రణం బెప్పుడు నభిమతంబు గాదు. భీమసేననకులసహదే వులును నామాట పట్టుదురు గావునఁ బో రుడుగుదురు. ఇంతటనైనను సంధి చేసినం బ్రజలు సుఖింతురు. హతశేషులైనను యుద్ధముఁ జాలించి సంతోష మున నిజనివాసములకుఁ జనుదురుగాక, నామాట వినవేని నీవును నిహతుండవై పదంపడి పశ్చాత్తాపంబుఁ బొందుదు వింతయు నిక్కవంబు. ఇంద్రయమవరుణ కుబేరధాతృప్రముఖులకు దుష్కరం బైనకార్యము సవ్యసాచి సేయుచుండఁ గన్ను లారఁ గనుఁగొంటివిగదా, ఇఁకఁ బెక్కులేల. అర్జునుం గెలువ నేరికినిఁ దరంబు గాదు. నీవు శమము వాటించి కుంతీనందనులతోడిసంధి సేయ నొడంబడుదేని కర్ణుని వారింపుము. నేనైనను వారించెద. మైత్రంబు సహజసామగృహీత ధనా ర్జిత ప్రతాపోపనతంబు లన నాలుగు తెఱంగులం గన్పట్టు సహజబాంధవు లగు పాండవులతో నీ విపుడు శాంతితాత్పర్యమున మంచిమాట లాడి రాజ్యార్థం బొ

సంగి యిందులకు సమ్మతింపనిచోఁ బ్రతాపమున శిక్షింతు మనిన నానాలుగు తె
లుంగులును పాండవులయెడ సుప్రయుక్తంబులై చూపట్టుఁ గావున దృఢమై
త్రంబున నింకఁ గలకాలంబు సుఖింపవచ్చు. ఇందుల కియ్యకొందువేని నీ వాత్మ
హితంబును లోకహితంబునుం జేసినవాఁడవై విమలకీర్తిఁ బాత్రం బగుదు
వనిన విని దుర్యోధనుఁడు కొండొకవడి చింతించి నిట్టూర్పు నిగిడించి సౌమనస్య
దూరుండై యశ్వత్థామనుఁ జూచి యాచార్యపుత్రా, సఖ్యభావమున నీజెప్పిన
దెల్ల నిక్కంబ. అయినను నావిన్నపం బించుక యాలింపు మనియిట్లనియె. వృ
కోదరుండు దుశ్శాసనుంబరిమార్చి క్రోల్పులి రొప్పినతెఱంగుగాఁ బేరెలుం గ్రత్తి
పలికినపలుకు నామనంబున నాటుకొనియున్నది. అది నీకుం బరోక్షంబు గాదు
గదా. ఇఁకఁ శాంతి యేతెఱంగునం గలుగు? మహామారుతము మేరుగిరిం జెనక
నోపనివిధంబున ధనంజయుండు కర్ణుం జెనకనేరఁడు. పాండవులు నాచేసినయెగ్గు
లెల్లఁ దలపోసి పగ పాటింతురుగాని యొక్కనాఁడేనియు నవి మఱచి శాంతిఁ
బొందుదురే. సమరసుస్థిరుఁడై నరాధేయునిఁ గయ్య ముడుగు మనిచెప్పఁగ నీకుఁ
దగునే. అదియునుంగాక కిరీటి యిప్పు డెంతయు డస్సియున్నవాఁడు అంగపతి
యింతకు నించుకేనియు డప్పి గాననివాఁడు గావున నెంతయు నేచి యతని వధిం
పఁజాలు నింక నీమాటవలనం బ్రయోజనంబు లేదు. ఆలసింపరా దని యశ్వత్థా
మకుఁ జెప్పి దుర్యోధనుఁడు నిజసైనికులకుఁ జేయి వీచి సవ్యసాచిం బొదువుఁడు
కొట్టుఁడు ముట్టుఁడు తఱుముఁడుఱుముఁ డని యెలుంగేర్పడం జెప్పుటయు మనయో
ధులు గడంగినం గర్ణార్జును లొండొరుల మిగులు నుత్సాహంబునను వాశితార్థం
బు పైపయిం గవియుహిమవత్కాంతారసంచారిమదేభంబులం బురుడించుసా
హసంబునను గొండ కొండను మేఘము మేఘమునుం దాఁకుపేఁకనుం బొంపిరి
వోయి బరవసంబునం బేర్చి యార్చి ధనుర్జ్యాఘోషభీషణత్వంబును గరతలా
స్ఫాలనాభీలత్వంబునుం బెంపెసంగ వృత్రపురందరులకరణిం బొల్చి తలపడుట
యు నత్తొలితాఁకు పరమదారుణం బయ్యె. అప్పుడు పాంచాలసోమకాదులు ధనం
జయుని డాయ నరిగి యోవీరశేఖరా, కడిందిమగంటిమిం బేర్చి కర్ణుం బరిమా
ర్చి ధార్తరాష్ట్రుని రాజ్యాశంబుఁ గోలుపుచ్చి మమ్మలరింపుము తడయంజనదనియె
లుం గేర్పడం జెప్పుటయుఁ గురువీరులు రాధేయుం దఱియ నరిగి యోశూరవర్యా,
యవక్రవిక్రమాటోపదీపితుండై యర్జునుం దెగటార్చి పాండవులంగ్రమ్మఱనడవు
లకుఁ బంపి మా కుల్లాసంబుఁ గావింపు మని పేరెలుం గెత్తియొత్తి చెప్పిరి.

### కర్ణార్జును లొండొరులమీఁద దివ్యబాణము లేయుట.

అయ్యవసరంబునఁ దొలుతఁ గర్ణుఁడు దశవిశిఖముల నర్జునుం బిట్టేయు
టయు నాతం డాతని కక్షాంతరంబున నన్నివాలమ్ములం బరఁగించిన నంత నయ్యి

రుపుకు నెకళ్ళొకళ్ల మేనులు శాతసాయకనికరములఁ గీలించుచున్నంత సవ్యసాచి యేచి గాండీవంబు గొనయమ్ము సారించి నారాచనాళీకవరాహకర్ణక్షురార్ధచంద్రాంజలకాదినానామార్గణములం గుప్పించుటయు నవి దినాంతంబునం గూఁటి కరుగుపక్షినివహంబులపగిదిఁ గర్ణురథంబుఁ జొచ్చుటయు నారాధేయుండు వాని నన్నింటినిం బ్రతిశరములఁ బొడవడఁగించె. అంత నింద్రనందనుం డాగ్నేయాస్త్రము సముద్దీపితంబుఁ గావించినం గురుయోధులు కాలినపుట్టంబులను మండిన యాయుధములనుం బెంపు సెడి జెయ్వులు దక్కియుండ నయ్యస్త్రంబు భూమ్యంతరిక్షంబులను దిక్కులను నిండి కౌరవానీకంబుఁ గాల్పం దొడంగిన వెదురుటడవి కాలునప్పటిచప్పు డెసంగినం జూచి కర్ణుండు వారుణాస్త్రప్రయోగమున నయ్యస్త్రముఁ బ్రశాంతముఁ గావించె. కావించినం గిరీటి పర్జన్యాస్త్రం బేయుడు మేఘపటలంబు లంతటం గప్పి చీఁకట్లు పచరించిన దివాకరసుతుండు వాయవ్యాస్త్రమున నమ్మేఘజాలంబు విరియించినం గినిసి విప్వచ్చుఁ డైంద్రాస్త్రము సమ్యగభిమంత్రితంబుఁ గావించి గాండీవంబున నరిం బోసి యేయుటయు నమ్మహానీయాస్త్రప్రభావమునంజేసి గాండీవమునుండి క్షురప్రాంజలికార్ధచంద్రనాళీకనారాచవరాహకర్ణాదినానాసాధనంబులు వెడమి కర్ణుగాత్రంబును హయశరీరంబులను మద్రపతియంగములను గేతనకార్ముకయుగచంద్రాదులను విదళించి గరుడభీతములగుపన్నగములు బిలమువలనంబోలె భూతలంబుఁ జొచ్చుటయు విజయశరన్యాతకాయుండై రాధేయుండు నెత్తుటం జొత్తిల్లి రోషఘూర్ణమానరక్తలోచనుండై సముదగ్రఘోషం బైనయుత్తమకోదండము నారి సారించి యభిమంత్రణపురస్సరంబుగా భార్గవాస్త్రంబు సంధించి యేసె. ఏసిన నయ్యస్త్రరాజంబు ధనంజయునైంద్రాస్త్రంబుఁ బ్రతిహతంబుఁ గావించి పాంచాలసోమకులపై నిగిడి విధ్వంసంబుఁ గావింపఁ దొడంగుటయు వారు నొచ్చియు నీడంబోక చలంబు పెల్లునం జేసి సైరణ గొని బరవసంబు వాటించి మార్గణగణంబులఁ గర్ణునిపై నడరించుటయు నతం డలిగి వెండియుఁ గాండజాలంబుఁ బరఁగించినం దత్ప్రహారంబుననుభార్గవాస్త్రప్రభావంబుననుం బెక్కండ్రు పాంచాలురు సమయుట మేఘావరణంబుఁ బాసినభానుమంతునిచందమునం దేజరిల్లునయ్యంగరాజుం గనుంగొని మనవారలుబ్బుచుఁ గృష్ణార్జునులు కర్ణుచేఁ దెగుదు రనియూహించి సింహనాదము లొనర్చిరి. అవ్విధమున నర్జునునైంద్రాస్త్రము కర్ణుభార్గవాస్త్రమునఁ బ్రతిహతం బగుటయుఁ బాంచాలవీరులు పెక్కండ్రు వొలియుటయుఁ గురుసైనికు లుబ్బున నార్చుటయుం జూచి వాయుసూనుండు క్రోధారుణితలోచనుండై కరతలాస్ఫాలనంబుఁ గావించి పెద్దయు నిట్టూర్పులు నిగుడించి సత్యసంధుఁ డై నయర్జునున కిట్లనియె. వీరశేఖరా! ధర్మబాహ్యుఁడు పాపాచారుఁడు నగుకర్ణుఁడు నీయెదురఁ బాం

చాలురఁ బెక్కండ్ర నెట్టు తెగటార్చె. మల్లి పౌలోమకాలకేయులకును మహా దేవునకును గెలువరానినిన్ను దశవిశిఖముల నొప్పింప నీతం డెట్టు లోపె. నీయే సినబాణంబు లీతండు పొనుపడంజేయుటఁ జూడ నా కెంతయు నాశ్చర్యం బయ్యెడి. ఆనాఁ డాసభలో నీదురాత్ముఁడు ద్రౌపదిం జూచి యోదాసీ, నీపతులు గొడ్డు వోయి రనిపలికినప్రల్లదంబులను మఱియు నీయుక్కివుఁ డొనరించినయొగ్గు లన్ని యుఁ దలంపునకుఁ దెచ్చికొని తడవు సేయక విక్రమించి యీదుష్టచిత్తుం దెగఁ జూడుము. ఏల యొప్పరికించి చూచెదవు ఉపేక్ష కిది యదను గాదు. ఖాండవ ముఁ బావకున కర్పించునప్పు డింద్రాదుల గెలిచినధైర్యంబున సాహసించి వీనిం బరిమార్పుము. ఏనును సముద్దండగదాదండమున వీనితల పగుల నడిచెద నను చున్నంత మురాంతకుఁ డిట్లనియె. కిరీటీ, కర్ణుఁడు నీయస్త్రములనెల్ల నిజాస్త్ర ములఁ బ్రతిహతములఁ గావించుచున్నవాఁడు. ఇది యేమి చిత్తమోహంబో మఱి ప్రమాదంబో. ఇంతకుఁ గౌరవులు పొంగి యార్చుచున్నవారు. ప్రతియుగ మునను దంభోద్భవాదు లగుదుష్టరాక్షసులవిధ్వంసనంబుఁ గావించుచక్రాయుధం బిచ్చెద. దీనిం బ్రయోగించియైన వీనిం బరిమార్పుము. కుహనాకిరాతుఁ డైన పరమేశ్వరుం బోర మెప్పించినప్పటిధృతిఁ గొని యీదురాచారుం బిలుకుమార్చి యఖిలమహీమండలము నజాతశత్రునకు సమర్పించి శాశ్వతయశంబుఁ బడయు మని తెల్పుటయు భీమసేనజనార్దనులవచనంబు లాకర్ణించి సవ్యసాచి కర్ణవధనిమి త్తం బైనతనరాకం దలపోసి వాసుదేవున కిట్లనియె. మహాత్మా, లోకక్షేమార్థం బే నిపుడు బ్రహ్మాస్త్రంబుఁ బ్రాదుర్భూతము గావించెద నీ వనుజ్ఞ యిమ్ము బ్ర హ్మరుద్రాదినిర్జరులును వేదవిదు లగునుత్తమబ్రాహ్మణులు నాన తిత్తురుగాక యనిపలికి పరమేష్ఠికిఁ బ్రణమిల్లి చిత్తసమాధానపూర్వకముగా బ్రహ్మాస్త్రము నభిమంత్రించి గాండీవమున సంధించి యేయుటయు రాధేయుఁడు తోడనతాను ను బ్రహ్మాస్త్రముఁ బ్రయోగించి యర్జునప్రయుక్తం బగునయ్యస్త్రముఁ బ్రశాంతముఁ గావించె. అప్పుడు వృకోదరుండు సవ్యసాచీభవదీయ బ్రహ్మాస్త్రము రాధేయు బ్రహ్మాస్త్రమునం బ్రతిహతం బయ్యెఁ గావున నొండొకయుత్తమాస్త్రం బేసి భార్గవాస్త్రంబే పుడిపినం బోలు నని తెలుపుటయుఁ దత్ప్రభావమున భార్గవాస్త్రము శాంత మయ్యె. మఱియు నర్జునుం డేసినయుత్తమాస్త్రమునం బెక్కు లస్త్రములు దోఁచి మనయనీకంబెల్ల నావరించి చీఁకట్లు పచరించుటయు నాసందున నర్జునుండు గాండివజ్యాఘోషంబు నిగిడించి నానాసాధనంబులం గు ప్పించుటయుఁ దెగినతలలును దునిసినచేతులును నలిగినకాళులును పిఱిగినతొడ లును బ్రచ్చినబొమ్మలునై సైనికులు నేలం బడుటం జూచి కొందఱు వెఱచఱచి కూలినం గౌరవసేనకుఁ బాటిల్లినదురవస్థం జూచి కనలి కర్ణుండు కిరీటిపై శరధా

రలం గురిసి మఱియు నతనినిఁ గృష్ణుని వృకోదరుని మూఁడేసివాలమ్ముల నొంచి యార్చె. ఆర్చినం గోపించి ధనంజయుండు కర్ణశరవిద్ధగాత్రు లగువసుదేవపవమానపుత్రులం జూచి యింక నాలసింపరా దనియూహించి పదునెనిమిదివాఁడితూపులం గర్ణుగాత్రంబునఁ జొనిపి యొక్కవాలమ్మునఁ గేతుదండ మూఁగాడ నేసి శరచతుష్టయమున శల్యుం బీడించి మఱియు మార్గణత్రయమున రాధేయుమేను గ్రుచ్చి దశవిశిఖముల సభాపతినాముఁడగురాజకుమారు నొక్కని రథరథ్యసారథికేతనకార్ముకసహితంబుగా ఖండించి వెండియు మూఁడెనిమిదిరెండునాలుగుపదివాఁడితూపులం గర్ణుని నొప్పించి దుర్యోధనచోదితులై యప్పటికిఁ దనపయిం గవిసినచతుశ్శతయోధులను నష్టశతరథములను వేవురుగుఱ్ఱపురావుతులను నెనిమిదివేలపదాతిగణంబులను బిలుకుమార్చి క్రమ్మఱి కర్ణుతేరు శరజాలనికరసూత్యతంబై యదృశ్యం బగువిధం బొనర్చి కురువీరులం గనుపుకొట్టుటయుఁ గౌరవులు సవ్యసాచిమునుమునం గాలు నిలుప నోపక యోడి యోకర్ణా, యేమి చేయుచున్నవాఁడవు. ఇంకొకింతసేపు మిన్నకుండినం గురుబలంబు నిరవశేషం బగు.ఇంకనైన వడిం బేర్చి సాహసించి శాతసాయకముల సవ్యసాచిం బరిమార్పు మనుటయు రాధేయుండు క్రోధవిధేయుండై కవియుటయు నప్పు డయ్యిరువురువీరులకుం బోరు ఘోరంబై చెల్లె. అట్టియెడ ధర్మనందనుఁ డష్టాంగసంభృతం బయినవైద్యశాస్త్రమున విశారదులై యశ్వినుల కెనవచ్చునిపుణచికిత్సకులు మంత్రౌషధిప్రయోగప్రకారములం జికిత్స చేయవిగతశల్యుండై యేతెంచి సర్వభూతములకు ముదం బావహించి కర్ణార్జునులపోరు సూచి క్రమ్మఱి శిబిరమునకుఁజనియె. అట్లుకర్ణార్జునులు ఘోరప్రకారంబునం బోరునెడఁ గర్ణుఁ డుక్కుమిగిలి శాతసాయకంబున గాండివంపునారిం ద్రెంచి తోడన నూఱుకుప్పెకోలలు కిరీటిమేనం గ్రుచ్చి యఱువదివాలమ్ములఁ బుండరీకనేత్రుగాత్రంబుఁ గాఁడ నేసి మఱియు నెనిమిదింట నర్జును నొప్పించి పెక్కువాలమ్ముల వడముడియంగములం గీలించి కృష్ణధనంజయులుపై వెండియుం గాండజాలం బడరించి పాంచాలాదుల శరజాలసంఛన్నులం గావించి వెగడుపఱుచుటయు వారు సింహముఁ గన్నగ్రామసింహములయట్లులై వెఱచఱచి విచ్చి పఱచుటయు మనవారు కర్ణునకుఁ గృష్ణార్జునులు చిక్కి రనితలంచి యార్పులు నింగి ముట్ట శంఖారావములం గావించిరి. అంతకు ధనంజయుండు గాండివంబుననారి సవరించి చక్క సారించి ద్విగుణితరోషావేశభీషణుండై కర్ణశల్యులపయినిఁ దద్రథంబుపయినిఁ గౌరవులమీఁదనుం గోటానఁగోటులు వాఁడితూపులం బరఁగించి బాణాంధకారంబుఁ బచరించుటయుఁ బక్షిసంచారమున కేనియు నెడ గలుగ దయ్యె. అర్జునుపరాక్రమము మెచ్చి గగనస్థితంబు లగుభూతగణములు వీవఁగ సురభిమారుతంబు వీచి సవ్యసాచిచిత్తం బల

రించె. అట్లు ధనంజయుం డంపచీఁకటిం గావించి శల్యునిమీఁద దశవిశిఖములను సంగపతియంగమునఁ బంద్రెండుకాండములను నేడువాఁడితూపులనుం గీలించిన రక్తసిక్తగాత్రుండై యాదిత్యపుత్రుండు రౌద్రముహూర్తమున శ్మశానమధ్యమున విహరించురుద్రునిరీతి రౌద్రం బెలర్ప నిశితసాయకత్రయంబుఁ గిరీటియంగమునను శాతసర్పశరపంచకంబుఁ బాంచజన్యధరుశరీరముననుం జొనిపిన నవి శౌరిమేను వ్రయ్య నోపక కత్తళంబు వ్రచ్చి మిట్టిపడినం గాండీవి వాని వేఱువేఱుదశభల్లముల శకలత్రయముఁగా ఖండించి శుష్కతృణపుంజము దరికొనుదవానలంబుచాడ్పున సుప్రజ్వలితుండై యాకర్ణపూర్ణము క్తంబులైనతీవ్రబాణములం గర్ణుమర్మములు గాఁడ నేసె. ఏసినం జలింపక యతండు ధైర్యధుర్యుండై నిల్చుటయుఁ గోపాటోపదీపితుండై యాఖండలనందనుండు దివ్యాస్త్రం బొకండు సముద్దీపితంబుఁ గావించి శరనికరంబులు వేనవేలు గా నడరించి దిక్కులం గప్పి సూర్యకిరణప్రచారం బడ్డగించి నీహారజాలసంవృతం బైననభముమాడ్కి రాధేయరథంబుఁ బ్రచ్ఛన్నంబుఁ గావించి యతనిచక్రరక్షకులనుఁ బృష్ఠరక్షకులనుఁ బార్శ్వరక్షకులను మఱియు దుర్యోధనానుమతు లగుద్విసహస్రయోధులనుం బిలుకుమార్చుటయు హతశిష్టులు శరక్షతు లగుతనయులను జనకులం జూడక శూన్యప్రాయంబులైనదెసలం బరికించి యింక నిల్చుట కార్యంబు గాదని నిశ్చయించి తోఁచినట్లు పఱచి బాణపాతమాత్రంబున నిల్చి యంతంతఁ జేర్చుచున్న ధనంజయాస్త్రముఁ జూచి ముందరికి రా వెఱచియున్నంతఁ గర్ణుఁడు మౌర్వీగుణనంబు నొనరించి రామునివలనం బడసినయాథర్వణాస్త్రం బొకండు తోడన తాను సంప్రదీపితంబు గావించి గాండివియస్త్రంబుఁ బొనుపడం జేసె. చేసినం గినిసి కిరీటి తానొక్కదివ్యాస్త్రంబుఁ బ్రయోగించి దానికి శాంతిఁ గావించుటయు నంత నయ్యిద్దఱును శరగ్రహణసంధానప్రయోగము లిట్టు లనియూహింపరానిరయమునం జేర్చి పరస్పరవిజిగీషామనీషం జేసి శరపరంపరలు పరఁగించుటయు నెక్కడఁ జూచినం గర్ణార్జునులబాణంబులకాని వేఱొండు గన్పట్టదయ్యె. అట్టిబాణాంధకారమున వివిధవిచిత్రమార్గములం జరించుచు నయ్యిద్దఱుశూరులు నిజకృతాస్త్రిత్వం బుప్రస్ఫుటంబుగా నిపుణప్రకారంబునఁ బోరునెడ నొక్కపరి వీర్యాస్త్రమాయాబలపౌరుషములఁ గర్ణుఁ డెక్కుడైన వేఱొక్కపరి సవ్యసాచి మిగులుచుండె. నిరుపమానం బైనవారిసమరచాతుర్యంబుఁ జూచి యంతరిక్షస్థితభూతగణంబు లిద్దఱితారతమ్యంబు దురూహం బగుటం జేసి తుల్యప్రకారమున నిరువురం బ్రశంసించిరి.

సర్పముఖశరమున నర్జునుకిరీటంబు భూమిఁబడుట.

అట్టియెడ నశ్వసేనాభిధానుం డైననాగకుమారుఁడు ఖాండవదహనసమయమునం దప్పించికొన్నవాఁడు రసాతలంబునుండి భూమి కేతెంచి కర్ణార్జునులక

య్యముఁ జూచి యర్జునుతోఁడిపగఁ దీర్చుకొనువాఁడై యందుల కిదియుచితకాల మని తలపోసి మాయాబలమున నదృశ్యుండై కర్ణతూణీరంబు సొచ్చియుండె. అవ్విధమునఁ గర్ణార్జును లెక్కువతక్కువలు లేక పోరుచు నితరేతరశరప్రహారమున నెంతయు నెచ్చియు నీడంబోక పెనంగుచు బాణాంధకారపటలంబుఁ బచరించిన నప్పుడు సూర్యపురందరులయానతిం జేసి సురాదులు శిశిరోపచారముల శ్రమ మపనయించుచుండఁ గర్ణుండు గాండీవి తన్ను మిగులుటం జూచి కొండొకవడి విచారించియర్జునార్థంబు పెద్దకాలంబుగోలె గంధపుష్పాదుల నర్చితంబై తూణీర మున సుప్రతిష్ఠితంబై యున్న సర్పముఖశరంబు గ్రహించి మౌర్వీగుణక్వణనం బుఁ గావించి నియతచిత్తమున నభిమంత్రించి యాకర్ణపూర్ణంబుగా మౌర్వి నలవ రించి సవ్యసాచిశిరము గ్రహింప నేయునవసరంబున నయ్యశ్వసేనాభిధాననాగకు మారుఁ డాశరము యోగబలమునం జొచ్చె. దానిం గర్ణుఁ డెఱుంగఁడయ్యె. అప్పుడు దిక్కులుప్రజ్వరిల్లుట కొఱవులు పడుట మున్నగునుత్పాతంబులు దోఁచుటయు హాహారవము లెసంగె. అశ్వసేనుఁ డాశరముఁ జొచ్చుట సురేంద్రుఁడు సుర జ్యేష్ఠుం జూచి దేవా! సవ్యసాచి బ్రదుకునటుల ప్రసాదింపవే యనిప్రార్థించు టయుఁ బరమేష్ఠి యింద్రుం బిలిచి యర్జుననకు భయంబు గలుగదు జయము ధ్రువంబు. వెత మాను మనిపలికినం బురందరుండు సంప్రహృష్టమానసుండయ్యె. అప్పుడు మద్రరాజు కర్ణునిశరసంధానము లక్ష్యశుద్ధిమంతము గా దనియూ హించి యంగపతీ, యిప్పటిగుఱి కంఠముఁ దునుమునట్లు తోఁపఁదు సమీచీన ప్రకారంబున గుఱి చూచి మఱి సంధించు మనుటయుఁ గోధారుణితలోచనుం డై రాధేయుం డోమద్రేశ్వరా, కర్ణుఁ డొక్కశరము రెండుమారులు తొడుగఁడు నాయట్టివారు కుటిలయుద్ధమున గొల్ల రని చెప్పి యర్జునా, తెగితి వనిపలు కుచు వర్షగణాభిపూజితం బై నయాసర్పముఖశరమును విజయార్థియై విజయుపయిం బ్రయోగించె. ప్రయోగించినంతన యంతకహుతాశభాస్కరాకారంబై భూన భోంతరం బావరించి వచ్చుచున్నంత సర్వేశ్వరుం డై నపుండరీకాక్షుఁడు రయ మునం బేర్చి పాదమున నెగ ద్రొక్కుటయుఁ దేరు పంచాంగుళమాత్రము ధర ణిలోనం గ్రుంగిన రథ్యములు మోఁకాళ్లు నేలకు మోపి నిలిచె. గోవిందునిత త్కాలోచిత దుష్కరకార్యమునకు మెచ్చి సురలు కుసుమవర్షముఁ గురిసి ప్రస్తుతించి యార్చిరి. అట్లు మధుసూదనుం డొనర్చినయుపాయమునంజేసి సర్ప ముఖశరము ధనంజయుతలఁ దాఁక నోపక కిరీటముపయిం బడి దానిని డొల్లి పడంజేసె. సురపతి తపముసేయఁ బ్రసన్నుఁడై పరమేష్ఠి తాను నిర్మింప సూర్య చంద్రానలప్రకాశమునం బొల్చుదాని సువర్ణముక్తామణివజ్రభూషితంబై నదాని సకలలోకవిఖ్యాతంబై నదాని నింద్రుఁడు తన కజేయు లగుపౌలోమకాలకేయుల

వధింపఁగ వారలం గెలుచుటం జేసి యతండు మెచ్చి యొసంగ నర్జునుండు వడ
సినదాని దిక్పాలురకేని మర్దింప నశక్యంబైనదాని నక్కిరీటము నత్యంతకీర్తిశో
భాకరంబైనదాని నాసర్పముఖశరంబు హరించి నేలం ద్రోచి విషానలంబున నిర్ద
హించుటయుఁ బుష్పితపాదపంబు గూలఁగ సొంపు దప్పినయున్నతగిరిశిఖరంబు
మాడ్కిఁ జెలు వేదియున్నతనయుత్తమాంగమున కర్జునుఁడు శ్వేతోష్ణీషంబుఁ
జుట్టి సద్యస్సముదితసంపూర్ణచంద్రమండలాభిరామం బగునుదయమహీధరంబుఁ
గ్రేణిసేయుచుండె. అట్టియెడ నాసర్పం బట్లు కిరీటికిరీటంబు నిర్దహించి నిజరూప
మునఁ గర్ణునకుఁ బొడసూపి యయ్యా, నీవు లక్ష్యశుద్ధి పరికింపక యేయుటం
జేసి యర్జునుశిరంబుఁ గొన వలను గాదయ్యె. ఇం కొకతూరి నన్నుఁ బ్రయో
గింపుము. ఖాండవదహనమున మాతల్లిని వధించి నా కెగ్గు చేసినయర్జునుం
జంపి పగ దీర్చుకొనియెద. ఇంద్రుఁడు తాన యడ్డపడినను నేను గ్రీడిం బరి
మార్తు నని తనవృత్తాంతము సవిస్తరముగాఁ దేటపఱచిన నెఱింగి కర్ణుం డా
గోకర్ణముఁ బిలిచి యశ్వసేనా, కర్ణుఁ డొక్కశరము పలుమాఱులు తొడుగు
వాఁడును బరబలసహాయమున గెలువఁ బూనువాఁడునుం గాఁడు కావున నీయి
చ్చకు వచ్చినయెడ కరుగుమనుటయు నాపన్నగంబు తనపలుకు కర్ణుఁ డాదరింప
మికిఁ జింతించి యాఱనిపగ పెల్లునం జేసి తాన సవ్యసాచిం జంపఁ బూని యేతెం
చుచున్నంత మురాంతకుండు పార్థా, కృతవైర మగునీభుజంగమును మున్ను
తెగటార్పు మనుటయు విజయుఁడు మహాత్మా, యిది యెక్కడిపాము. నాయొద్ద
కేల వచ్చుచున్నది. నన్ను మార్కొలు దీనికిగరుడుఁ దలపడినట్టులగు ననుటయు
వనజోదరుండు విజయున కిట్లనియె. అయ్యా, యిది తొల్లి నీవు ఖాండవం
బేర్చునప్పుడు తల్లిమేనిమఱుఁగున నడఁగి యుండ నీవు తల్లిం దునుముటయుఁ
దప్పించుకొని చని నాఁటంగోలె నీపయిం బగఁ బాటించి యేండ్లుపూండ్లు కాచి
యున్నయశ్వసేనాభిధానభుజంగంబు గగనచ్యుతం బగుకొఱవితెఱఁగున ఘోర
రూపమై యేతెంచుదీనిం ద్రుంచుట కార్యం బనవుడుఁ గిరీటి యాఱువాఁడితూ
పుల నప్పాము ఖండించినం బురుషోత్తముండు నొగలు డిగి తేరెత్తి యెప్పటి
యట్లు భూమిపయిం బెట్టి క్రమ్మఱ నారోహించుటయు రథ్యములును యథాపూ
ర్వంబుగ నిల్చుటయు నారథోత్తమంబు సవిశేషసన్నాహంబై పొలిచె. ఆసందు
నం గర్ణుండు తిర్యగవేక్షణోదగ్రుండై శిలాశితము లగుదశవిశిఖముల నర్జును
పయిం బరఁగించిన నాతండు పంద్రెండువరాహకర్ణమార్గణములం గర్ణుపయి
నిగిడించి యాశీవిషప్రభం బగునొక్కదొడ్డనారసం బాకర్ణపూర్ణముక్తంబుఁ గా
వించి విడుచుటయుఁ దత్ప్రహారమున విదీర్ణాంగుఁడై యంగరాజు నెత్తుటం జొత్తిల్లి
దండతాడితం బైనమహోరగముచందమునం గ్రోధవిషముఁ గ్రక్కుచుఁ బం

ద్రెండువాలమ్ములఁ బుండరీకాక్షుని నవతిశరముల నర్జునుని నొప్పించి వెండొక్క ఘోరశరము నమ్మహారథునంగముఁ గాఁడిపోవ నేసి యార్చి పేర్చియట్టహాసం బొనర్చె. అది సైఁపక పాండవమధ్యముండు మర్మభేదనకర్మఠములగుతీవ్రమార్గణముల నక్కర్ణునిపై నడరించి వెండియు యమదండసన్నిభము లగుతొంబది యంబకంబులం బరఁగించి యయ్యాదిత్యతనయుకవచంబు డుల్చి కుండలములం దునిమి యుష్ణీషంబు భేదించె. విగతోష్ణీషుఁడు వినికృత్తకుండలుఁడు విదారితకవచుఁడునై సొంపుదప్పియు బెగ్గడిల్లక సహజశౌర్యధుర్యత్వమున నగ్గలించి కడంగినం గినిసి కిరీటి నాల్గువాలమ్ములు మేనంజొనుపుటయుఁ దత్ప్రహారమున రాధేయుండు పిత్తకఫవాతజ్వరముల రోగి యెట్టు లట్టుల పరమవ్యథాసంభరితుండయ్యు సంచలింపక వర్మనిర్ముక్తగాత్రంబున వెడలురక్తధారలుత్తుంగగిరిశృంగమునకు గైరికధాతుపటల పాటలనిర్ఝరుల చందమునం దనరఁ గోపాటోపప్రదీపితుం డై నయారాధాతనూజుమేన మఱియుం దీవ్రశరములు పెక్కులు వడిం బేర్చి నిగిడించి స్కందుఁడు క్రౌంచగిరింబోలెఁ దదీయస్తనాంతరము వ్రచ్చుటయుఁ బెద్దయు సోలి యాతండు శిథిలముష్టిబంధుఁడై శరశరాసనముల దిగవిడిచి తేరిపయిం జదికిలఁ బడుటయు నర్జునుం డుత్తమపురుషవ్రతంబుఁ బూని యతని నేయ నొల్లక యూరకుండె. అప్పుడు జనార్దనుండు సంభ్రమసమేతుండై పార్థా, యిదియేమి ప్రమాదంబు శాత్రవులు దుర్బలులైనను వ్యసనములు మూఁడినపు డొండు విచారింపక వధించుట ధర్మంబు యశస్కరంబు. ఏకవీరుఁడు సహజశత్రుఁడు నగురాధేయు నిట్టిచో నొప్పరికించి చూడఁదగునె. ఇంక నొక్కింతసే పిట్టుల మిన్నకున్న నాతం డేచి నీపయిం గడంగుఁ గావున నింద్రుఁడు నముచింబోలె రయమున నీవు వీనిం బరిమార్పు మనుటయు వనజనాభువచనముఁ బ్రశంసించి బలినిషూదనోదగ్రుం డై నవృత్రారివీఁకం బేర్చి బహుశవత్సదంతములం గర్ణురథముఁ గప్పుటయుఁ గిరీటిశరప్రచ్ఛన్నుం బైనయాస్యందనము పుష్పితాశోకపలాశాదికాననినిబిడం బైనమహీధరంబువిధమునను సవ్యసాచిశరన్యూతగాత్రుం డై నరాధాపుత్రుండు కర్ణికారపాదపసాలసీరంధ్రం బైనయుత్తుంగగిరిశృంగము తెఱంగునం జూపట్టుటయు నంద అద్భుతం బందిరి. అంతఁ గొండొకవడికిఁ గర్ణుఁ డస్తమయసమయభానుమంతునకు దీటై కన్పట్టుచుఁ దెలిసి కోపప్రస్ఫురితుండై ధైర్యంబు వాటించి కుపితాహికల్పంబు లగునానాబాణంబుల గుప్పించి పార్థశరములం ద్రుంచి దశవిశిఖములఁ గృష్ణుని నాఱువాలమ్ముల నర్జునునిం గాఁడ నేయుటయు నర్జునుఁడు రౌద్రాస్త్రం బేయఁ దలంచియుండె.

---

-కర్ణునిరథచక్రము భూమిలోఁ గ్రుంగుట.-

అట్టియెడఁ గాలుఁ డదృశ్యుండై బ్రాహ్మణశాపమునం గర్ణురథచక్రము పుడమిం గ్రుంగును జమదగ్న్యుఁడు ప్రసాదించినయుత్తమాస్త్రం బింక నతనికిఁ దోఁపదు. కర్ణునకు మరణకాలం బాసన్న మయ్యె నని యందఱు వినంగఁ బలికె. అప్పుడు రాధేయుఁడు భార్గవాస్త్రముఁ దలంచిన నది ప్రతిభాసింపదయ్యె. అంతలోఁ గర్ణుతేరిడాఁపలిచక్రము భూమిలో నించుక గ్రుంగె. అంతఁ గర్ణుఁడు బ్రాహ్మణశాపమున రథచక్రము గ్రుంగఁబడుటయు భార్గవుశాపమున నమ్మహనీయాస్త్రము దోఁపమియు సర్పముఖశరము విఫలం బగుటయు విషాదవశుండై చేతులు విదిర్చుచు ధర్మము ధర్మప్రధానులఁ బాలించు నని ధర్మవిదులు పలుకువలుకు బొం కయ్యె. శక్తికిని బలమునకును శ్రుతసంపత్తికి నీడుగ ధర్మ మాచరించు నే నిట్టులు చిక్కుపడితి నని ధర్మంబును దూఱుచు గుఱ్ఱములు దడపడ సారథి కలంగఁ దాను సవ్యసాచిశరసంపాతమునఁ బెద్దయు నొచ్చి శిథిలకృత్యుండయ్యు మగఁటిమిఁ బాటించి కృష్ణుకరతలమున శరత్రయముం గీలించి సప్తాశుగములఁ గవ్వడిపై నేసి మఱియు వజ్రసంకాశములు పావకప్రభములు నగుసప్తదశశిలీముఖముల నయ్యతిరథోత్తముపై నిగిడించి మర్మములు వ్రచ్చి కంపితాంగుఁ గావించి యాసంకున బ్రహ్మాస్త్రం బభిమంత్రించి యేసె. ఏసిన నర్జునుం డైంద్రాస్త్రి మేయుటయు నది తదీయబ్రహ్మాస్త్రమునఁ బ్రతిహతం బగుడు యదువల్లభుండు పార్థా! నీయస్త్రము కర్ణునస్త్రమునఁ బ్రతిహతం బయ్యె నిది యేమి యన వుడుఁ గిరీటి తానును బ్రహ్మాస్త్రము సముద్దీపితంబుఁ గావించి తదీయాస్త్రంబు శాంతముఁ గావించి పెక్కమ్ములు నిగిడించె.

అందుల కలిగి రాధేయుండు పెక్కుతూపు లడరించి గాండివమౌర్వి ద్రెంచుటయు సవ్యసాచి యొండునారిం జేర్చి సవరించిన దానిం ద్రెంచె. త్రెంచిన నొండొకండు సంఘటితంబు గావించిన దానిం దునిమె. ఇట్లు జ్యాశతంబుఁ ద్రెంచినం గోపించి ధనంజయుఁ డొక్కదృఢమౌర్విం జేర్చి సమ్యగభిమంత్రణంబు గావించి యాతుగపరంపరలు పరఁగించునెడఁ గర్ణుఁడు పరమరయసంప్రతీపితంబు లగుమార్గసంధానంబు లెఱుంగఁ డయ్యె. అర్జునునేర్పుఁ జూచుఖేచరులకు విస్మయదాయకం బయ్యె. అట్లు కర్ణుం గడవనేరక కిరీటి పోరుటం జూచి గోవిందుఁడు కాలయాపనంబు మాని దివ్యాస్త్రముఁ బ్రయోగింపుమనుటయు సవ్యసాచి యొక్కమార్గణము గాండివమున సంధించి రౌద్రమంత్రమున నభిమంత్రించుచున్నంత మున్ను కొంచెము గ్రుంగఁబడినకర్ణురథచక్రము మఱింతయెక్కుడు దిగంబడిన నేటునకు వలను గామిం జేసి యయ్యంగరాజు తటాలునం దేరు డిగి భుజద్వయమునం బట్టి చక్ర మెత్తఁ దొడఁగినం బ్రాహ్మణశాపప్రభావమున నాచ

క్రమము. మీఁదికి లేవదయ్యె. మఱి సకలమహీమండలము చతురంగుళమాత్రము లేచె. అవ్విధమునఁ దనరథచక్రము గ్రుంగినం గర్ణుండు వికలసాధనుఁడై సంరంభ సముద్రిక్తుం డై నయర్జునుం జూచి కన్నీరు జాలువాఱ నిట్లనియె. ఓధనుర్ధరవర్యా, దైవకారణమున నాతేరిడాఁపలికల్లు పుడమి దిగఁబడియె. దీని నుద్ధరించి మఱివ చ్చునంతకు నేయు టుడుగుము. సిగ జాఱువిడిచినవానిని విముఖుని బ్రాహ్మణుని నంజలిబంధము ఘటించినవానిని శరణాగతుని న్యస్తశస్త్రుని బాణహీనుని విభ్రి ష్టకవచుని భగ్నాయుధుని సాధువ్రతస్థితు లైనశూరు లేయ నెల్లరు. నీవు శూ రుఁడవు మహాకులీనుఁడవు యుద్ధధర్మవిదుఁడవు దివ్యాస్త్రవేదివి మహాత్ముఁడవు వేదాంతనిష్ఠుండవు. కావున రథస్థుఁడవై భూమిష్ఠుఁడు వికలుఁడు నగున న్నేయ నొడంబడవని యింత చెప్పితిఁగాని నీకును వాసుదేవునకును వెఱచి కాదు. మా తృగురుబ్రాహ్మణభూములవలన నాకుఁ బరాభవంబు గలిగె నింతియకాని యిందు నీచేసిన దేమియు లేదు. ధార్మికుఁడవు గావున ధర్మపథంబు పట్టుము. హీనస మాచారము విడువు మనుటయు జనార్దనుఁడతని కిట్లనియె.


శ్రీకృష్ణుఁడు కర్ణ నధిక్షేపించుట.

కర్ణా, భాగ్యమున నీ కిప్పుడు ధర్మవిచారతాత్పర్యంబు నొడమెనే. నీచులు తఱచుగఁ గీడులు మూఁడినపుడు దైవమును నిందింతురుగాని తమచేసినదుష్కృత ము లెఱుంగరు. భీమసేనుని గంగమడువునఁ ద్రోయించినపుడును, విషాన్నంబుఁ బెట్టించినపుడును, గుంతీసహితముగాఁ బాండవులను వారణావతంబున లక్కయిం టఁ గాల్పించినపుడును, నక్షవిద్య యెఱుఁగనిధర్మరాజును నిర్బంధించి యాడించి శకునికైతవమున నోడించినపుడును, నేకవస్త్రయు రజస్వలయుఁ బతివ్రతాశిరో మణియు నగుపాంచాలిని రచ్చకుఁ దెచ్చినపుడును,దురాత్ముఁ డైనదుశ్శాసనుఁ డ ధర్మం బనివిచారింపక యాసాధ్వి చీర లొలిచినపుడును, ద్రౌపదీ! నీపతులు గో డ్డువోయిరి. వేఱొక్కమగని వరించికొను మని ప్రల్లదంబు లాడినపుడును, పాం చాలీసహితంబుగాఁ బాండురాజునందనులఁ బరమధర్మాత్ముల నడవులకుఁ బంపినపు డును,వనవాసాజ్ఞాతవాసాద్యాయాసములం గుడిచి యాపద నిస్తరించి లోకక్షేమ ముఁగోరి రాజ్యార్థంబుఁ బడయ సంధి సేయ నిరాకరించినపుడును,బాలుఁడై నయభి మన్యునిఁ బలువురు చుట్టుముట్టి పొదివి వధించునపుడు, నీధర్మమును నీనీతియు నెక్కడకిఁ బోయె. ధర్మముఁ జేసియుండిన నది ఫలవంతంబు గాకమానదు. ఇప్పు డూరక వలికినం బ్రయోజనం బెయ్యది. నలుఁడు తనరాజ్యముఁ బుష్కరునిచే నోడి పదంపడి విక్రమంబున వానిం గెలిచి సాధించినవిధమునఁ బాండవులును ధార్తరాష్ట్రులఁ బుత్రమిత్రబాంధవసహితంబుగాఁ బరిమార్చి సామ్రాజ్యంబు సాధించువారు. ఇందుఁద ప్పెయ్యది యనుటయు రాధేయుం డేమియుం బలుకక

లజ్జావనతవదనుండై క్రోధావేగమున నవుడుగఱచి శరాసనంబుఁ జేతం గొని పోరికిఁ గడంగుటయు గోవిందుఁడు కిరీటీ, దివ్యాస్త్రమున నిష్పాపాచారుం బరి మార్పుము. కాలయాపనంబు వల దనుటయుఁ గోపాటోపదీపితుం డై నగాండీ వినిర్ముక్తంబులఁ గరాళజ్వాలికామాలికలు వెడలుటయు నత్యద్భుతం బయ్యె. అప్పుడు కర్ణుఁడు బ్రహ్మాస్త్రమంత్రితం బై నయొక్క శరము సవ్యసాచిపై నేసి రథము నుద్ధరింపఁ గడఁగుచున్నంతఁ బార్థుఁడు తానును బ్రహ్మాస్త్రముఁ బ్రయో గించి తద స్త్రము శాంతముఁ గావించి తోడన శరవర్షమున నారాధేయుం గప్పి పావకాస్త్రం బేయుటయు నది మండుచు నిగిడినం జూచి కర్ణుండు వారుణాస్త్ర మున దానిం జల్లార్చి మేఘాస్త్రం బేసి చీఁకట్లు పచరించినం గిరీటి వాయవ్యా స్త్రప్రయోగంబున నామేఘజాలంబు విరియించి ప్రకాశంబుఁ గావించె. అందు ల కలిగి కర్ణుఁడు జ్వలత్పావకోపమం బయినయొక్క తీవ్రశరముఁ బాండవమధ్యమ వధార్థంబు వింట నరిం బోయుటయుఁ బర్వతసమేతంబుగా ధాత్రీతలంబు కంపించె. కఠినవాతంబు వీచె. దిక్కులెల్ల రజోధూసరంబు లయ్యె. దివంబున సురలు హాహా కారంబు లొనర్చిరి. పాండవులును బరమవిషాదభరితు లై రి. అట్లు కర్ణుండు విం టఁ దొడిగి యేసినయావాలమ్ము వల్మీకప్రవేశకర్మఠం బయినయురగమువిధమునఁ గిరీటిభుజాంతరముఁ జొచ్చుటయు గాఢవిద్ధుండై ధనంజయుండు క్షితికంపమున గిరి యెట్టు లట్టుల చేతిగాండివము జాఱ సోలుటయు నది సమయంబుగాఁ గొని కర్ణుం డు క్రమ్మఱ రథచక్ర ముద్ధరింపఁ బూని బ్రాహ్మణశాపం బమోఘ మగుటంజేసి యించుకేనియు నెత్త నోపక వితథప్రయత్నుం డయ్యె. అంతఁ దెలిసి యర్జు నుండు యమదండకల్ప మత్యంతభీకరము నగుప్రాంజలికనామకబాణముఁ గొని వింట సంధించుచున్నంత మురాంతకుఁడు కిరీటీ, వీఁడు తే రెక్కకమున్న తలఁ దెగ నేయు మనుటయుఁ దద్వచన మభినందించి పురందరనందనుం డాశరము గాండివమున సంధించి కేతనహస్తికక్ష్యపయిం బడ నేయుడు సువర్ణముక్తామణి విచిత్రము జ్ఞానప్రకర్షోత్తమశిల్పివినిర్మితము జయాస్పదము సూర్యచంద్రానలప్ర కాశపరిస్ఫుటము నగునాధ్వజహస్తికక్ష్య మనవారలయశోదర్పకార్యజాతహృద యములతోడఁ బడుటయు హాహారవంబు నింగి ముట్టె. ధ్వజపతనముఁ జూచి యందఱును సూతపుత్రుజయంబున నిరాశు లై రి.

—అర్జునుఁడు కర్ణునికంఠముఁ దునుముట.—

అంతఁ బరమరయమునం బేర్చి పార్థుండు సూర్యానలప్రకాశంబు పక్షప క్ష్మవిభాసురం బరత్నిమాత్రవిస్తారంబు వజ్రసంకాశంబు వ్యాత్తకాలానలప్రతీ కాశంబు వేగదీపితంబు పినాకసుదర్శనసన్నిభంబు మర్మభేదనసముదగ్రంబు నగు నంజలికనామకబాణము గాండివమున సంధించి దివ్యాస్త్రమంత్రమున నభిమం

త్రించుటయుఁ జరాచరాత్మకం బయినప్రపంచము చలించె. ఋషులు జగములకు స్వస్తి యయ్యెడు మనివచించిరి. అట్టు లయ్యాశుగంబు దివ్యమంత్రాభిమంత్రితము గావించి యర్జునుండు తపమును గురుసమారాధనంబును సుహృత్కార్యనిర్వహణంబును నేను జేసినవాఁడ నేని యీసత్యమున నీశరంబు కర్ణుని వధించి నాకు విజయంబు సమకూర్చుఁగాక యనిపలికి యేయుటయు నమ్మహాసాయకంబు భూనభోంతరమునం బలుమంటలు గ్రమ్మఁగఁ బరమరయమునం జని కర్ణునికంఠముఁ దునిమె. అవ్విధమున నయ్యపరాహ్ణమున మహేంద్రుఁడు వజ్రాయుధమున వృత్రుశిరమునుంబోలె నర్జునుఁ డంజలికంబునఁ గర్ణుమస్తకంబుఁ దునుముటయు వజ్రాహతం బైనగిరిశిఖరంబుకరణి నయ్యుత్తమాంగము సూర్యుఁ డస్తాద్రిం బడువడువున నేలం బడుటయుఁ దోడన యట్టియు గూలె. కూలినంతన యాదేహమున నుండుదివ్యతేజ మొకండు వెడలి రవిమండలంబుఁ జొచ్చుటయు నిరువాఁగున నందఱును దత్ప్రకారముఁ జూచి యెంతయు నద్భుతం బందిరి. అర్జునకాలమునఁ గర్ణసూర్యుఁడు పాండవసేనం దపింపఁజేసి తుదిన స్తమించె. అటఁ గృష్ణార్జునులు పాంచజన్యదేవదత్తము లొత్తుటయుఁ గర్ణవధమునకుఁ బొంగి యాదిక్కుసైనికులు తూర్యముల మ్రోయించియు శంఖములఁ బూరించియు సింహనాదము లొనరించియు వస్త్రముల విదిర్చియు నెండొరులం గౌఁగిలించికొని నర్తనంబుఁ గావించి గాండీవికి సముల్లాసంబు పెంపు గావించిరి. కౌరవులు భయార్దితులై నలుదెసలం బఱచుటయు నిర్భరప్రమోదవికస్వరుండై వృకోదరుండు రోదసీకుహరం బవియ సింహనాదముఁ గావించి భుజాస్ఫాలనం బొనర్చి నృత్యంబు సల్పె. బ్రాహ్మణశాపము కర్ణమరణాంత మగుటం గాఁబోలుఁ దదీయరథచక్రము యథాపూర్వముగ లేచి ధరణీతలమున నిలుచుటయు శల్యుఁడు విచ్ఛిన్నకేతనంబై మ్రోడుపడినయాస్యందనముఁ దోలుకొని యరిగి యశ్రుపూర్ణలోచనుండు నిశ్వాసదీనాననుండు నార్తరూపుఁడు నగుదుర్యోధనునొద్ద కరిగి పయిపయిం గ్రమ్ముబాష్పముల నడంచికొని మహారాజా ! కర్ణభాస్కరుఁడు పాండవసేనలపయి నద్భుతనిజప్రతాపాతపంబు గాసి దైవమున నస్తమించె. ఎన్నియేఁబోరులు చూచితిమి గాని కర్ణార్జునసంగ్రామంబున కెనవచ్చుకయ్య మెక్కడ నింతకుఁ జూడమైతిమి. మఱి వినమైతిమి. దైవబలంబుకలిమిం జేసి పార్థుఁడు నిజప్రతిజ్ఞ దీర్చుకొనియె. ఇంద్రయమవరుణకుబేరాదుల కెనవచ్చువీరులు పెక్కండ్రు నీకార్యార్థంబు జీవితాశను రాజ్యభోగములనుం దొఱంగి వీర్యమునను శౌర్యమునను ధైర్యముననుం జేర్చి యోపినకొలంది పోరి దైవవిపర్యాసంబునం జేసి తుదిఁ దెగిరి. ఇది విధికృతంబు. ఇందులకు వగచినం బ్రయోజనంబు లేదని యూరార్చె ననిన విని యాంబికేయుండు సంజయా, కర్ణవధానంతరము కౌరవులవర్తనం బెట్టి దనియ

డుగ నతం డతని కిట్లనియె. కర్ణుండు వడినపడంపడి కౌరవులు పాంచజన్య దేవదత్తా రవములను సింహనాదములను నాకర్ణించి వెఱచి సముద్రమధ్యంబునఁ గలం బవి య వికలు లగుబేహారులచందమునను సింగములు పొదివిన లేళ్లగముల తెఱంగు నను గొమ్ములు విఱిగినయాఁబోతులరీతినిఁ గోఱలు వెఱికినపాములపగిదినిఁ జె య్వులు దక్కి వాఁడిమి నెడలి పోఁడిమి సడలి జాఱుచున్నమైమఱువుల్లి సవరిం చికొననైనం దోఁపని నివ్వెఱపాటున నిటునటుం జూచుచుఁ బార్థుఁడు తాఁ కునోవడముడి యడరునో యని కలగుండుపడియుఁ దిఱుగుడుపడియు నప్ప టి కొదవిన గుఱ్ఱములను నేనుఁగులను దేరులను నెక్కియు నెక్కకయు వ్యా కులత స్కరసంకీర్ణం బైన గాఢకాంతారమున సాఁతుఁ బాసినపాంథులవిధమునవి ఱిగి పఱచుచున్నంత దుర్యోధనుండు నిజసారథిం బిలిచి మనమూఁకలయవస్థం జూచితే ధనంజయుని భీమసేనుని గోవిందుని నే నిప్పుడు తెగటార్చి కర్ణునప్పు తీర్తును మనయరదంబు వారియొద్దకుఁ బోని మ్మనుటయు నాతం డట్లు చేసినం బంచవింశతిసహస్రపాదాతంబులును బెకురుతురంగంబులు ననేకకుంజరంబులు బహుళస్యందనంబులును నతనికిఁ దోడ్పడి చనుటయు భీమసేనధృష్టద్యుమ్నులు కాలుమానుసులం దాఁకిరి. అప్పుడు భీముఁడు భూమిష్ఠు లగుకాలుమానుసులఁ దాను రథస్థుండై మార్కొనుట ధర్మము గా దనుతలంపునంబోలె తేరు డిగ్గి గదావిహారంబు సల్పి ధృష్టద్యుమ్నుఁడును దాను నాపంచవింశతిసాహస్రపదాతి వర్గమునుం బరిమార్చె. ధనంజయుండు దాను రథికులపై నడరి లోకవిఖ్యాతం బైనగాండివంబున శరపరంపరలు సంధించి యేసి వారల నందఱం బిలుకుమార్చె. మాద్రేయులును సాత్యకియు శకునిని మార్కొని యతనిరావుతుల నందఱనుం బొదివి వధియించిరి. శిఖండిద్రౌపదేయాదులును వాఁడిమిం బేర్చి చిక్కినవారలం బొలియించిరి. అవ్విధమునఁ బాండవులకు వెఱచి మనసైనికులు వెన్నిచ్చి పఱు చుటయు దుర్యోధనుం డెలుం గెత్తి యోశూరులారా, యెచ్చటి కేగెదరు. పఱ చినను డాఁగినంతను గాలప్రాప్తం బైనమృత్యువు దప్పునే, కృష్ణార్జును లెంతయు డస్సినవారు. తదీయానీకం బల్పావశేషంబై యున్నది. ఏ నిప్పుడు కడంగి వార లం బరిమార్చెద. విజయము మనకు ధ్రువంబు. పాఱి తప్పించికొందు మన్నం బాండవులు వెన్నడంచి రానేరరే? కావునఁ గాలప్రాప్తములకు వగవం బని లే దనితలంచి పోరికి రండు. సంగ్రామమున వీరధర్మమున మృత్యువు గల్గెనేని యదిసు ఖంబ కాని యొండు గాదు. క్షత్రియుల కింతకంటె ముఖ్యధర్మ మెద్దియుఁ గానంబడ దు. కులపరంపరాప్రాప్తం బైనధర్మముఁ ద్యజింపవలదు. మగఁటిమి వాటించి పోరఁ జక్క నిల్చి గెలుపు నొండె వీరస్వర్గము నొండె సాధింపుఁ డని యెంత యొత్తిచెప్పి నను వారు గాఢవిక్షతులు గావున నచటఁ గాల్నిలుప నేరక కులధర్మంబుఁ

దలంపక పఱచిరి. తదవస్థం బైనసైన్యంబుఁ జూచి శల్యుఁడు దుర్యోధనున కిట్లని యె. నరేంద్రా, చూచితే రణాంగణంబు వజ్రవిదారితగిరి శృంగములభంగిం జూడ నొప్పుగజకళేబరంబులను దురంగగాత్రములను గుప్పగూరలై పడినతేరుల ను నిది యీయంగ మని యేఱుపఱుపరానితీరునం బడినశరీరఖండములను మేలి తొడవులపొళ్లను గైదువులతుళ్లను ఛత్రచామరకేతనాదిశకలంబులను శోణితప్ర వాహమునను గర్ణార్జునులబాహువీర్యమునం జేసి యభిరామబీభత్సంబై కన్పట్టు చున్నది. గాండివనిర్ముక్తశరస్యూతగాత్రుండై యతండె సూతపుత్రుండు పడి చచ్చి సొంపు దఱుఁగక బ్రతికియున్నవిధమున రణక్షోణి వెలిఁగించుచున్నవాఁడు. అడిగినవానికి లే దనుమాట యెఱుంగనిదయాపరుఁడు బ్రాహ్మణున కేసొమ్మైన నీఁ దగు నను నిశ్చయము గలయుదారుఁడు సుందరీప్రియుఁడు మహారథుఁడు నగు కర్ణుఁడు పుత్రసహితంబుగాఁ దెగియె. కర్ణపావకుఁ డర్జునమేఘమునం జల్లార్పఁబ డియె. ఈరౌద్రముహూర్తమున ధరణి రక్తాంబరధారిణియు సర్వగమ్యయు నగు సీమంతినివిధమునం జూపట్టుచున్నది. ఇంక నేఁటికిఁ గయ్యంబు సాలించుట యుచి తంబు. సూర్యాస్తమయసమయంబు సన్నిహితం బయ్యె ననిచెప్పె. అట్టియెడ నాదిత్యుఁ డస్తమించుటయుఁ సవ్యసాచియస్త్రముల కర్ణుఁడు నిహతుఁ డవుటం జేసి కరుణాభరమున నతనిం జూడ నోపక మఱుఁగుపడుట సముచితం బను తలంపునంబోలె భాస్కరుఁ డస్తగిరికందరాంతరమున మఱుఁగుపడియె ననియు నిజనందనుఁ డైనకర్ణుకళేబరముఁ గరముల నంటుటం జేసి స్నానం బొనర్చుట విధివిహితం బనుభావంబునఁ బశ్చిమసాగరమునం బడియె ననియు నుత్ప్రే క్షించిఖేచరులు కృష్ణార్జునుల నగ్గించి నిజనివాసములకుఁ జనిరి. అప్పుడు కర్ణవధ ప్రమోదంబునఁ గృష్ణార్జునులు వృత్రవధానంతర మింద్రోపేంద్రులట్లు ప్రమోద వికస్వరులై పాంచజన్యదేవదత్తములొత్తుటయు భీమసేనాదులు తనుతమశంఖము లం బూరించుటయుఁ గలగుండుపడి శల్యానుమతుండై దుర్యోధనుండు సేనలు దివియించి నారాయణగోపాలబలావశేషపరీతుఁ డైనకృతవర్మయు గాంధారస హస్రపరివృతుం డైనసౌబలుండును నాగానీకపరివేష్టితు లైనకృపద్రోణులును సంశప్తకావశిష్టబలసమన్వితుం డైనసుశర్మయు హతశేషు లైనకురుకుమారులు విచ్ఛిన్నకేతనంబై మోడువడినకర్ణురథమునం గూర్చున్నశల్యుఁడునుం దోడరాఁ గ నర్జునుం బ్రశంసించువారును గర్ణు నగ్గించువారును విధివిధానం బనుల్లంఘ్యం బనువారును నింక మనకుఁ బ్రాణములమీఁదను భార్యలమీఁదనుఁ బుత్రుల మీఁదను రాజ్యంబుమీఁదను నాశ నిరుపయోగం బనిపలుకువారును నింక నే మగవాఁడు పాండవులతోడిపోరికిఁ గడంగు ననువారును గర్ణుఁడు పడినప్పు డేఁబులు పాఱకుండుటయు బుధగ్రహంబు తిర్యగ్వర్ణంబై జ్వలనతేజమున మెఱయుటయు

బృహస్పతి రోహిణిం బీడించుటయుఁ బరుషవాతంబులు వీచుటయు మిన్ను పగి లినట్లు తోఁచుటయుఁ బుడమి దారుణనాదంబు వెడమ్రుటయు దెసలు మండు టయు నర్ణవంబులు ఘూర్ణిల్లుటయుఁ గొఱవులు పడుటయు మున్నగునుత్పాతం బులు దోఁచె నింక నేమి కాఁగలదో యనువారు నగురాజులును బరివేష్టిం ప హాకర్ణ హాకర్ణ యనిపలుకుచుఁ గన్నీరు నించుచు శిబిరమున కరిగి య చ్చటను నిలువ నోడి పలాయనపరాయణు లగుసైనికుల నెట్టకేలకు సముచిత ప్రకారంబున నూరార్చి యెల్లవారల నెక్కఁచో విడియించి తానును శోకామ ర్షసమన్వితుండై చింతించుచుండె.

కృష్ణార్జునులు ధర్మజునకుఁ గర్ణవధంబుఁ దెల్పఁ జనుట.

అంతఁ గృష్ణుఁడు సవ్యసాచిని గాఢాలింగనమున నాదరించి ప్రహృష్టమా నసుండై కౌంతేయా! మహేంద్రుఁడు వృత్రుని వధించినట్లు నీవు కర్ణుం బరిమా ర్చితివి. వృత్రకర్ణవధంబు తుల్యరూపంబుగా జను లికమీఁద వ్యవహరింతురు. పరమయశస్కరంబును లోకప్రథితంబు నగునీపరాక్రమంబు నిరూపించి కర్ణవ ధంబుఁ దెలపఱిచి ధర్మనందను సంప్రీతిచేతస్కుం గావించుట యిప్పటికిఁ గర్త వ్యంబు దాన నీ వనృణుఁడ వగుదువు. నీవును రాధేయుఁడును బోరునెడఁ జూడ వచ్చియు నజాతశత్రుఁ డంతకుమున్ను గాఢవిద్ధుఁ డవుటంజేసి యచ్చట నిలువ నోపక క్రమ్మఱి శిబిరమునకుఁ జనియె. అమ్మహారాజునొద్దకుఁ బోవుదము రమ్మని పలికి ధృష్టద్యుమ్నయుధామన్యులను మాద్రేయులను భీమసేనసాత్యకులనుం బి లిచి మేము ధర్మరాజునకుఁ గర్ణవధప్రకారం బెఱిఁగింపఁ నరుగుచున్నారము. అ రాతులు పైకొనకుండఁ గొంతవడి మీరు చూచికొని మఱి శిబిరమున కరుగు డెం డనిపలికి వారల వీడ్కొల్పి శిబిరమునకు రయమునం జని ధర్మరాజునెలవున కరిగి యచ్చటఁ గాంచనపర్యంకతలమునం బరున్నధర్మరాజుచరణములకుఁ దాను నర్జునుఁడును నెఱఁగినం జూచి యజాతశత్రుండు వారలయాకారంబు వీక్షించి కర్ణు నిహతునకాఁ దలంచి సాదరానుబంధముగ నాకృష్ణుల బిగియారుకౌఁ గిట నాదరించి యానందబాష్పపరీతలోచనుండై యున్నంత మందరధరుండు మందహాసరోచిరుదంచితవదనారవిందుఁడై యమ్మహీపాలునకుఁ గేలుమోడ్పుఘ టియించి యిట్లనియె. రాజేంద్రా భాగ్యమునం గాండీవియు వృకోదరుఁడును నీవును గవలును నెలమి నున్నవారు. వీరక్షయాపాదకంబైనయీసంగ్రామమున నేకీడునుంబొరయమి మే లయ్యె. కర్ణుని గాండీవివధించె. ఆనాఁ డాసభలోఁ బాం చాలిం బరిహసించినపాపాత్ముఁడు రాధేయుఁ డర్జునబాణవిద్ధుండై తెగి పడినవాఁ డు. అనంతరకర్తవ్యముఁ జూడుము. నిష్కంటకం బైన యఖిలమహీమండలము నకు రాజై మ మ్మెల్ల నేలుము. సకలభోగముల ననుభవింపు మని పంకజా

క్షుండు తెల్పినం బరమానందభరితుండై ధర్మరాజు దేవకీనందనా! నీవు నాథుఁడై యుండ మా కీమేలు గలుగుటచిత్రంబు గాదు. నీవు సారథి వైనకతన నర్జునుండు కర్ణునిం దెగటార్చె ననిపలికి యద్దేవుదక్షిణకరంబుఁ దనవలపలికేలఁ బట్టికొని మహానుభావా, యర్జునుఁడును నీవును బురాణమునులైననరనారాయణులని కృష్ణద్వైపాయనుండు పెక్కుమాఱులు నా కెఱింగించినవాఁడు. భవదీయప్రసాదమునంజేసి గాండీవి యవక్రవిక్రమాటోపంబున దీపించె. నీవు గలుగ మాకు జయంబకాక పరాజయంబు గలుగునే. నీబుద్ధిప్రభావమున నేభీష్మద్రోణాదులును బడిరి. ధరణీపతితం బైనకర్ణుకళేబరముఁ జూచిన నామనంబున కెంతయు నూఱట గల్గు ననిపలికి యమ్మహాత్ముననుమతిఁ బడసి నీలవాలములు సర్వాంగావదాతములు నగునుత్తమతురంగములం బూన్చినస్యందనం బారోహించి కృష్ణార్జును లేకరథస్థులై తోడ రాఁగ గంధతైలావసిక్తంబు లగుకరదీపికానికరంబులు వెలుంగఁ గయ్యంపునేలకుఁ జని గాండీవనిర్ముక్తపటుప్రదరనికరవిచ్ఛిన్నవర్ముఁడు విశకలితగాత్రుఁడు నగునాసూతపుత్రుకళేబరంబు పలుమాఱులు చూచి సంజాతప్రత్యయుండై వాసుదేవార్జునుల నెంతయుఁ బ్రశంసించి జనార్దనా, నేఁడు నీపొత్తునం గీడు వైరయక తమ్ములతోడ నెలఁమి గని భూమండలమునకెల్ల రాజైతిని. అతిమాని యగురాధేయునిచావు విని ధార్తరాష్ట్రుఁడుజీవితమునను రాజ్యమునను నిరాశుఁడై యుండుఁగదా. నీయనుగ్రహమునం గృతార్థుల మైతిమి. గాండీవి విజయంబుఁ బడసె. ఈపదుమూడేఁడులును గన్నులఁ గూర్కుఁగానక చింతించుచుండిననేను నేఁడు సుఖనిద్ర సేసెద ననిపలికి తనలో నెంతయు నుప్పొంగియుండ భీమసేననకులసహదేవులును సాత్యకిధృష్టద్యుమ్నశిఖండిప్రముఖులును సముచితాలాపముల నయ్యజాతశత్రునకు బ్రహర్షోత్కర్షముఁ గావించి శౌరికిరీటులం బొగడుచు వారును దాము నెలమిఁ జెలఁగుమానసంబులతో శిబిరములకుఁ జనిరి. అంబికానందనా, నీదుర్మంత్రమునజేసి యిన్నిచేటులు పుట్టె. వగచినం బ్రయోజనంబు లేదని యూరార్చి కర్ణవధప్రకారంబు సంజయుఁ డాంబికేయున కెఱింగించె. సూర్యచంద్రాగ్నులు యజ్ఞనిర్వర్తకులు యజ్ఞము విష్ణుస్వరూపంబు. ఈకర్ణయుద్ధయజ్ఞంబు కృష్ణార్జునులు నిర్వహించిరి. జనులు పరమపావనం బైనయీసంహితనుఁ బఠించినను విన్నను నసూయాదిదోషదూరులై ధనధాన్యప్రముఖంబు లగునైహికసుఖములం గుడిచి విష్ణుదేవునిప్రసాదమున నుత్తమలోకములం బడయుదురు. మఱియు బ్రాహ్మణులు వేదప్రాప్తిని క్షత్రియులు బలజయములను వైశ్యులు ధనసమృద్ధిని శూద్రు లారోగ్యమునుం గాంతురు. విష్ణుమహిమప్రతిపాదకంబు వేదవ్యాసప్రణీతంబు నగునీప్రబంధంబు పరమపుణ్యంబు.

క. అని యిటు వైశంపాయన
మునినాథుఁడు కర్ణపర్వమును వివరింపన్
విని జనమేజయభూవరుఁ
డనుపమసమ్మోదపూరితాత్ముం డయ్యెన్.

మ. ఘనలీలామహిమంబునం దనరి లోకవ్రాతసర్గక్రమం
బు నొనర్పంగ హిరణ్యగర్భుఁ దొలుతం బుట్టించి సద్ధర్మన
ర్తనితాంతస్థితి వాని కేర్పడఁగ నామ్నాయంబులన్ వత్సని
త్వనిరూఢిం దగ నిచ్చి మీఁఱుజగదధ్యక్షుం దలంతు న్మదిన్.

ఇది శ్రీకాళహస్తినగరాధినాథ శ్రీమద్దారకుమారాక్కమహీపాల కరుణాపురస్సరబహుమానపాత్ర సంస్కృతాంధ్రభాషాకవిత్వచమత్కారపరితోషితబుధస్తోమ సీతారామకవిలలామ పుత్ర సకలశాస్త్రనిరంకుశపాండితీధుర్య లక్ష్మీనరసింహసుధీవర్య సచ్ఛాత్రవిబుధజనవిధేయ వేంకటరంగనామధేయవిరచితంబైన శ్రీమదాంధ్రవచనభారతంబునందుఁ గర్ణపర్వంబునఁ గర్ణుఁడు రెండవనాఁటియుద్ధమున విక్రమించి ధర్మరాజు నోడించుటయు నాతండు సిగ్గటి యందఱు విలుకాండ్రు చూచుచుండఁ దొలఁగి చనుటయు, ధర్మరాజార్జునులపరస్పరక్రోధంబును, వాసుదేవుఁ డూఱడింప శాంతు లగుటయు, ప్రసన్నుఁడై నయన్నయనుమతిఁ గొని కిరీటికర్ణవధోద్యోగియై యనికిఁ జనుటయు, భీముఁడు దుశ్శాసనుఁబొమ్ము వ్రచ్చి నెత్తురు ద్రావి వాని వధించి తన ప్రతిజ్ఞ దీర్చుటయుఁ, గర్ణార్జునులు శౌర్యధుర్యులై నేర్పేర్పడఁ ద్వంద్వయుద్ధముఁ జేయుటయు, నర్జునుఁడు కర్ణుని వధించుటయు నన్నది

ద్వితీయాశ్వాసము.

కర్ణపర్వము
సమాప్తము.



శ్రీకాళహస్తీశ్వరాయనమః.

# శ ల్య ప ర్వ ము.

## ప్రథమాశ్వాసము.

క॥ శ్రీ సంభరణ ప్రవణా
భ్యాస దృఢీకృత మనస్సమాధి కలిత నా
నాసవ ఫల ప్రదాయీ
వ్యాసవచో రుచిరతల్ప కాంతరశాయీ॥



దేవా, ననుఁ గృతార్థుం జేయుము.

సంతత సభక్తికోపసేవిత ద్వైపాయనుం డైనవైశంపాయనుం డనంతర కథాకర్ణనోదీర్ణకుతుకహృదయుండై జనమేజయుండు మునీంద్రా, కర్ణుఁడు హతుఁ డైనపదంపడి కొంచెపుమూఁకలం గూర్చికొని దుర్యోధనుం డేమి చేసె? పూర్వులచరిత్ర మెంతవిన్నను దనవి పుట్టదయ్యెఁ గావున సవిస్తరంబుగాఁ దేటపడ నెఱింగింపు మని యడుగ నిట్లనియె. నరేంద్రా, కర్ణుఁడు హతుఁ డైనపదంపడి దుర్యోధనుండు శోకార్ణవమగ్నుండై యన్నింట నిర్వేదంబు నొంది హతశేషు లగునృపులు పరివేష్టింప హా కర్ణ! హా కర్ణ! యని యెలుంగెత్తి శోకించుచు నెట్టకేలకు శిబిరమునకుఁ జని సుహృదు లగురాజులు శాస్త్రనిశ్చితంబు లగుహేతువు లుపన్యసించి తేర్పఁగఁ బెద్దయుం బ్రొద్దునకుఁ గొండొక యూఱడిల్లి దైవంబు బలవంతం బనియు భవితవ్యము దప్పదనియుఁ దలఁచి సంగ్రామంబు కర్తవ్యం బని నిశ్చయించి శల్యుని సేనాపతిం జేసిన మఱునాఁడు వఱువాత నమ్మద్రరాజు హతశేషసైన్యంబుఁ గూర్చికొని యనికిఁ జని మోహరించి యోపినకొలంది పోరి మధ్యాహ్నమున ధర్మరాజుచేత నిహతుఁడగుటయు శకునిప్రముఖు లందఱుం దెగుటయు దుర్యోధనుఁడు దా నొక్కరుఁడ మిగులుటం జేసి యరాతులకు వెఱచి యొక్కమడుఁగున డాఁగి యధిక్షేపపరుషముగఁ బాండవు లనికిఁ బిల్చిన నరుదెంచి గదాయుద్ధమునభీమసేనుచేతం బడియె. అంతఁ గౌరవులలో శేషించినకృపకృతవర్మాశ్వత్థామలు ముువ్వురారాత్రి సంరంభమునం బాండవస్కంధావారముఁజొచ్చి నిద్రాపరవశు లగుపాంచాలమత్స్యాదుల నందఱునుం బరిమార్చిరి. అంత నమ్మఱునాఁడు పూర్వాహ్ణమున సంజయుం డూర్ధ్వబాహుఁడై బాష్పపూర్ణలోచనుండై హానాథ! హాకురువరేణ్య! హాధృతరాష్ట్రనందనా! నీవు సావఁగ నే మంద

యమును జెడితిమి. అకటకటా! కాలగతియిట్లు విషమం బగునే? శక్రతుల్యవి క్రము లగునెల్లవారును బాండవులచేత నిహతు లగుదురే యని పలవించుచు శిబిరమునుండి హస్తిపురమున కేతెంచుటయుఁ గరిపురంబున నున్నబాలురు స్త్రీలు వృద్ధులు మున్నుగా నెల్లవారు నార్తనాదములు చేసియు దిక్కు దోఁపక నలుదెసలం బాఱియుఁ జెయ్వులు దక్కి ఱిచ్చపడియుఁ గలగుండుపడియు వెడంగుపడియు నానాప్రకారంబుల దైన్యంబుఁ జెందుటయుఁ బురం బెల్ల రోదనబహుళం బయ్యె. అట్టియెడ సంజయుఁడు నగరి కరిగి లోపలికొలువుకూటంబున గాంధారియుఁ గోడండ్రును సుహృదులును జ్ఞాతులును హితులును విదురుఁడునుం గొలువఁ గర్ణనిధనంబుఁ దలఁచి చింతిల్లుచున్నధృతరాష్ట్రునెద్ద కరిగి దీనాననుండై బాష్పగద్గదకంఠుఁడై నరేంద్రా! సంజయుండను. వచ్చితి. మద్రపతి యగుశల్యుఁడు తెగియె. శకుని పడిసె. ఉలూకుఁడు సచ్చె. సంశప్తకు లందఱును సమసిరి. కాంభోజశకయవనమ్లేచ్ఛపార్వతీయులు పొలిసిరి. ప్రాచ్యదాక్షిణాత్యప్రతీచ్యోదీచ్యు లగుసకలరాజులును దెగటారిరి. భీముని వాక్యంబు దప్పక దుర్యోధనుఁడు తదీయగదాఘాతంబునఁ దొడలు విఱిగి రేణురూషితుండై నేలంబడియె. ధృష్టద్యుమ్నుఁడును శిఖండియు యుధామన్యుఁడు నుత్తమౌజుఁడును మున్నగు ద్రుపదకుమారులును సకలపాంచాలసోమకప్రభద్రకచేదిప్రముఖసైనికులును నీల్గిరి. నీమనుమ లగుప్రతివింధ్యాదులు ద్రౌపదీపుత్రు లేవురు నిహతులైరి. చతురంగబలంబు లెల్ల నశించె. కౌరవులయుఁ బాండవులయు శిబిరంబులు పాడయ్యె. కాలవశంబున క్షత్రియకులంబు తఱుచుగ స్త్రీజనశేషం బయ్యె. మనవారిలోఁ గృపకృతవర్మాశ్వత్థామలు ముగురును వారిలోఁ బాండవు లేవురును గృష్ణసాత్యకులన నేడ్వురను మిగిలిరి. ఇక్కడివాఁడై యక్కడఁ జేరినయుయుత్సుఁడును బ్రదికినవాఁడు. తక్కఁగలపదునెకండేడక్షౌహిణులును దుర్యోధననిమిత్తమునఁ బాసుంగుపడియె నని పలవించుచుఁ జెప్పినఁ గ్రూరతరము లగునాపలుకులు విని యాంబికేయుఁడు మూర్ఛిల్లి నేలం బడుటయు విదురుఁడును శోకావేగమున నొఱఁగె. గాంధారి మున్నగుకురుస్త్రీలు నవ్వాఁడిపలుకులు విని నేలం బడి చెయ్వులు దక్కి చిత్రపురూపులచందం బైరి. కొండొకవడికిఁ దెలిసి లేచి విచిత్రవీర్యసూనుఁ డత్యంతశోకవివశుండై నలుదెసలు గలయం జూచి విదురుం బిలిచి పుత్రహీనుండై ననాకు నీవే గతి యని పలికి పైపయిం గ్రమ్మువిషాదభరమున విసంజ్ఞుఁడై పడుటయు సంజయుఁడును గాంధారి మున్నగువారలును దదవస్థుం డైనవృద్ధమహీపతింగని యేడ్చుచున్నంత శీతలసలిలసేచనంబునను శిశిరవ్యజనవీజనంబుననుం బెద్దయుం బ్రొద్దునకు మూర్ఛదేఱి కుంభనిక్షిప్త మగుభుజంగముచందమున రోఁజుచు విదురుం బిలిచి స్త్రీల నెల్ల నంతఃపురమునకుఁ బం

పుము. సుహృదులును దమతమనివాసంబులకుఁ బోవుదురుగాక. నామనంబు నాకువశము గాకున్న దనుటయు నతండు తత్ప్రకారంబు నడిపి రోదనవశుం డైన సంజయు నూరార్చి మధురవచనముల నాంబికేయునకు వినిపించుచుండె.

## ధృతరాష్ట్రుఁడు దుఃఖించుట.

అంతఁ బట్టరానిశోకావేగమునంజేసి ధృతరాష్ట్రుఁడు పొగయట్లపోలె వేఁడినిట్టూర్పు నిగిడించి చేతులఁ బలుమాఱు విదిర్చి సంజయుదెస మొగంబై గావల్గణీ! పాండవు లేకీడునుం బొరయక మెలమి నున్నవారలకదా? కొడుకు లందఱుఁ జచ్చి రని వినియు నాగుండె పగులదయ్యె. దీని విధాత ఱాతఁ జేసెనొక్కొ? కొడుకులు పుట్టినపిమ్మటఁ జీఁకువాఁడ నగుటంజేసి వారిరూపరేఖావిలాసములఁ జూడ భాగ్యము లేకున్నను దదీయబాల్యక్రీడలను యౌవనచరిత్రములను విని ప్రేమస్నేహబంధురముగ నాకర్ణించి యుల్లసిల్లుచుండిననా కిట్టు లిప్పుడు తల్లడిల్లవలసె. ఈజన్మమునకు సౌఖ్యం బెక్కడిది యని పలికి దుర్యోధనుం దలంచికొని హాపుత్రా! రాజేంద్రా! నిన్నుఁ గానక యే నేగతిఁ బోవుదు? పెక్కండ్రు రాజులతోడ్పాటునం బెంపుఁ గాంచి యెట్టు లల్పరాజ్యపతియట్టులు సమరక్షోణీతలంబునం బడితివి? సుహృద్బాంధవులకు గతియైననీవు వృద్ధుఁడు నంధుఁడు నగునన్ను విడిచి యెట కేగితివి? నాపయిం గలప్రేమసమ్మానంబు లెచ్చోటికిఁ బోయె? అపరాజితుఁ డగునీ విప్పు డెట్టులు పరాజయముఁ బొందితివి? సమయముల దగ్గఱఁ జేరి తండ్రీ! యనియు మహారాజా! యనియు లోకనాథా! యనియుం బిలుచుచు స్నేహసుభగంబుగాఁ గంఠాలింగనంబుఁ జేసి తగిన తెఱంగున నన్ను శాసింపుమని యింక నెవ్వఁడు నాతోఁ బలుకువాఁడు? పుత్రకా! తొల్లి నీమహీమండలం బెల్ల నాసొమ్ముకాని పాండవుల సొమ్ము గానేరదు. భీష్మద్రోణకృపాశ్వత్థామశకునిశలశల్యబాహ్లీకసోమదత్తభూరిశ్రవోభగదత్తజయద్రథ కృతవర్మవిందానువిందకాంభోజ బృహద్బలమాగధకేకయ ప్రముఖులును శకయవనమ్లేచ్ఛ పార్వతీయాదులగునానావీరులును నలంబుసప్రముఖరాక్షసులును దుశ్శాసనాదు లగునన్నుమించినతమ్ములునుఁ గలరు. పాండవులం గెల్చుట దుష్కరంబు గాదు. అదియునుంగాక కర్ణుఁ డొక్కరుండె యసమానకోదండపాండిత్యమున నన్ను గెలుపించును. మును నిరూపించినశూరులలో నొక్కొక్కరుఁడే పాండవపాంచాలురం బరిమార్పఁ గలండు. ఇందఱుఁ గూడినం గొఱంత యెయ్యది? వాసుదేవుఁడు వారిమేలు గోరువాఁడయ్యు ననిఁ గైదువు గొని పోరికి రాఁడు గావున నతనికి వెఱవం బనిలే దని నీవు సెప్పఁగ శక్తిం బరికించి నీవు జయింతు వని నమ్మియుంటిని. అది యెల్ల విపరీతంబయ్యె. కాల మే మన వచ్చు? సింహము నక్కచేఁ బడినట్టులు

భీష్ముఁడు శిఖండిచేఁ బడియె. సర్వాస్త్రవిదుం డైనభారద్వాజుఁడు నిమిత్తమాత్ర మున మృతుఁ డయ్యె. భూరిశ్రవస్సోమదత్తబాహ్లికజయద్రథప్రముఖులు ప్రబలపరాక్రములు మడిసిరి. నీనమ్మినమేటివిలుకాఁడు కర్ణుఁడు సమసె. బలదుర్విదగ్ధుం డైనసౌబలుండు తెగియె. సంశప్తకులు నారాయణగోపాలురు శకయవనమ్లేచ్ఛాదులును బొలిసిరి. నీతమ్ములును బుత్రులును బౌత్రులును నీల్గిరి. ఇంతకంటె దౌర్భాగ్యంబు గలుగునే? శుభములకు భాగ్యవంతుఁడు భాజనంబుగాని వివిధభాగ్యవిరహితుం డైననే నెట్టులగుదు? నిజప్రతిజ్ఞ నెఱవేర్చి యుల్లాసభాసురుం డైన భీమసేనునిమెలుంగు వినుచు నేగతి గృహమున నుండనోపుదు? ఱెక్కలు విఱిగిన పక్షియట్టులు కొడుకులను మనుమలనుం గోల్పడి దీనదశాప్రాప్తుం డైననా కింక వనగమనంబు కర్తవ్యంబు. అంతకంటె నెందుమేలు గనపట్ట దని బహుప్రకారములఁ బెద్దయుం బ్రొద్దు పేరెలుంగెత్తి యేడ్చి దీర్ఘోష్ణనిశ్వాసములు నిగుడించి శోకసంతప్తచిత్తుండై క్రమ్మఱ సంజయుం బిలిచి సూతసుతా! మనవారలు గాంగేయుఁడు పడినపదంపడి భారద్వాజుని నయ్యాచార్యుఁడు మృతుఁడై నపిదపఁ గర్ణుని సేనాధిపతిపదంబున నభిషేకించిరి కదా? మనవారెవ్వని సేనాపతిం జేసినను వారు తొలుత నాతనిం జంపుచున్నవారు. తొలుతనే విదురుఁడు మహాప్రాజ్ఞుఁడు గావున సూక్ష్మబుద్ధి నాలోచించి దుర్యోధనాపరాధమునఁ గులక్షయమును బ్రజాక్షయమునుం బొసఁగు నని తెల్పినను దైవోపహతిం జేసి మూఢబుద్ధినై యమ్మాట విననైతి. దాన నింతలు పుట్టె. తనకుఁ దెలియకున్న నెఱింగినవారు పరిశీలించి చెప్పిన వినకునికికంటె మూఢత్వంబు గలదె. నాయనయంబు నాకు ఫలించె. లాతులం దూఱఁ బనిలేదు. రాధేయవధానంతర మెవ్వఁడు మనసైన్యమునకు నాయకుఁ డయ్యె? అప్పటికి బ్రతికినవారలలో శల్యుం డందులకుఁదగినవాఁడు గాన నాతం డాపదంబుఁ బొందియుండనోపు. వాసుదేవార్జునుల మార్కొనునమ్మద్రపతి కెవ్వరు వలపలను డాపలను వెనుకనుం బ్రాపై నిల్చిరి? అనంతరసమరవర్తనం బెట్టులు చెల్లె? ధృష్టద్యుమ్నశిఖండిప్రముఖులును ద్రౌపదేయులు నెట్లు తెగిరి? పాండవు లేవురును వాసుదేవసాత్యకులును గృపకృతవర్మాశ్వత్థామలు నెట్లుబ్రతికిరి? తేటపడ నెఱింగింపు మని యడుగ సంజయుం డమ్మానవపతి కిట్లనియె. కర్ణవధానంతరము పార్థునిసింహనాదమునకు వెఱచి మనమూఁక లతనిమునుమునఁగాలు నిలుపనేరక పఱచుటయు దుర్యోధనుఁ డెట్టకేలకు బరవసంబు వాటించి పురికొలుపుటయు భీమసేనధృష్టద్యుమ్నధనంజయనకులసహదేవసాత్యకిప్రముఖుల కోర్తలకు హతశేషము లగుసైన్యంబులు వెన్నిచ్చి పఱచుటయు శల్యమతంబున నాసాయాహ్నమున సేనలఁ దివియించి దుర్యోధనుఁడు శిబిరమున కరిగి చింతాక్రాంతుఁడై యునికియు నెఱింగించితివిగదా?

## కృపుఁడు దుర్యోధనునకు హిత ముపదేశించుట.

అయ్యవసరంబునఁ గృపాచార్యుఁడు బహుప్రజాక్షయంబునకు వగచి కృపావిష్టుండై దుర్యోధనునొద్దకుఁ జని మహారాజా! నే నొక్క హితముఁ జెప్పెద. నీకుం బోలు నని తోఁచునేని యట్ల చేయు మని యిట్లనియె. క్షత్రియునకుయుద్ధముకంటె ధర్మమొండు గన్పట్టదు. తండ్రి, కొడుకు, కన్న, తమ్ముఁడు, బాంధవుఁ, డని విచారింపక వధించుటయు సమరమున వెనుదీయమియు నుత్తమక్షత్రియుల కుచితధర్మంబు. ఐనను భీష్మద్రోణకర్ణజయద్రథులును దుశ్శాసనాదు లగుతమ్ములు ను లక్ష్మణకుమారుఁడును మృతిఁబొందుటంజేసి యెవ్వరికై రాజ్యలాభంబు గోరం బడునట్టి వారు లేమికతనం బెక్కండ్రురాజులం జంపించి కృపణవృత్తి కేల యొడం బడవలయు నని తోఁచెడి. కృష్ణసహాయుఁ డై నపార్థుఁడు మనక కాదు సురాసురాదులకు నజేయుండు. ఇంద్రకేతుసన్నిభం బై నవానిసిడంబుమీఁదికపిం జూచినంతన మనయనీకంబు సంచలించుచున్నది. భీమసేనునిసింహనాదంబును బాంచజన్యదేవదత్తరవంబును గాండివగుణఘోషంబును విన్న మనవారు గుండియలు వీలి వ్రాలుచున్నవారు. విద్యుత్ప్రకాశం బలాతచక్రప్రతిమంబు నగునాగాండివంబు చూడ్కులకుమిఱుమిట్లుగొల్పుచు వెలుంగుచున్నది. చంద్రవర్ణము లగునాతనిరథ్యములు గాడ్పు వీవ నంబుదంబు లెట్టులట్టుల జనార్దనుండు తఱుమ మిన్నుఁ బ్రాఁకు వీఁకం బెరసి మనవారికి నివ్వెఱ పుట్టించుచున్నవి. ఇవియెల్లఁ గలుగఁ దీవ్రప్రతాపదీపితుండై ధనంజయుండు కమలాకరముఁ గలంచుమత్తకుంజరముమాడ్కి మనసైన్యంబుఁ గలఁచుచున్నవాఁడు. చతుర్దంతదంతీంద్రంబుకరణిఁ జూడ నొప్పు నప్పార్థుం జూచి మనమూఁకలు సింహముఁ గన్నలేళ్లగములతీరున విచ్చి పఱచుచున్నవి. ఇవి యెల్ల నీకుఁ బ్రత్యక్షంబకదా? పోరికిఁ దొడఁగి యిప్పటికిఁ బదునేడునాళ్లు గడచె. నానాఁట మనకు బలక్షయంబ కాక ప్రయోజన మించుకేని యుఁ గలుగదయ్యె. కర్ణుఁడును ద్రోణుఁడును నేనును నీవును గృతవర్మయు నశ్వత్థామయు దుశ్శాసనుఁడును బెద్దయుఁ బూన్కిమై జయద్రథుం గావఁగడంగియున్న నమ్మహారథప్రవరుఁ డందఱనుఁ గెలిచి యాసింధుపతిం జంపె. అమ్మేటివిలుకానిం గెలువ మనలో నేమగఁడును వలంతి గాఁడు. అందఱు నున్నపుడే వానివిక్రమంబు చెప్పఁ గొలఁదిగాక యుండె. ప్రధానులు మడిసినయీతఱి మాతంగభగ్న పాదపంబై తీరపాతవ్యాకులంబై శుష్కతోయం బై ననదిఁ బురుడింపఁ దగినమనకొంచెపుసైన్యంబును బేర్చినకార్చిచ్చు కాననంబునుంబోలె నొక్కమాత్రలో నాతండు నీఱుసేయ కుడుగునే? మఱియు సాత్యకిభీమసేనులవేగంబు కొండలఁ బగిలింపను సాగరంబు నింకింపనుం జాలును. భీముఁడు సభలో నాడినమాట లెల్ల సత్యములుగాఁ జేయక మానఁడు. పాండవులకు మీరు చేసినయెగ్గులెల్ల నిప్పటికి ఫలవం

తంబు లయ్యె. ఇంక నేమనంగలను? ఇప్పుడైన నీ వాత్మరక్షణమున గడంగుట మేలు. ఆత్మహాని వాటిల్లిన నేమి చేసినం బ్రయోజనం బెయ్యది? సర్వంబు నాత్మార్థం బనుట యెఱుంగవే? సర్వశుభములకు భాజనం బైన యాత్మకుఁ గీడు మూడెనేని భిన్నభాజనంబున సలిలం బెట్టులట్టులు సకలశుభములు దొలంగి పోవును. తాను బలహీనుఁడైనచో సంధియు బలవంతుఁడైనతఱి యుద్ధమును గర్తవ్యం బని బృహస్పతి నీతిప్రకారంబు నిరూపించుట నీకును విదితంబకదా? కావున నిప్పుడు నీవు నిజబలశక్తులం బరిశీలించి పాండవులతోడిసంధి చేయుట శ్రేయస్కరంబు. కాలోచితంబుగ శ్రేయస్సుల నాచరింపని రాజచిరంబ రాజ్యభ్రష్టుం డగు. ప్రణామపూర్వకంబుగా ధర్మరాజును బ్రార్థించి రాజ్యము సాధించుట మేలు కాని మూఢత్వమునం బరాభవముఁ బొందుట మేలు కాదు. కరుణాపరుం డైనయజాతశత్రుండు ధృతరాష్ట్రువచనంబును వాసుదేవవాక్యంబును విని నీకు రాజ్య మొసంగును. హృషీకేశవచనంబు భీమార్జుననకులసహదేవులును దొలంగరు. ధృతరాష్ట్రునివచనంబు దామోదరుఁ డతిక్రమింపఁడు. కావున నీయర్థము నాంబికేయున కెఱింగించి మధుసూదనునకుఁ జెప్పించి తత్ప్రసాదమున సుఖించుట మేలు. ఇదియెల్ల నీమేలు గోరి చెప్పితిఁ గాని కృపణత్వమునను బ్రాణత్రాణపరత్వముననుం గా దింతయు నిక్కువంబు. పథ్యం బగునామాట యిపుడు వినవేని భీమగదాఘాతపతితుండవై నామాటఁ దలఁచికొని పశ్చాత్తాపమునం గుందుదు వని పలికి వృద్ధుఁడగుశారద్వతుఁడు దీర్ఘోష్ణనిశ్వాసములు నిగిడించి యూరకుండె.

## దుర్యోధనుఁడు కృపునకుఁ బ్రతివచనంబు లిచ్చుట.

కృపాచార్యవచనంబు విని దుర్యోధనుండు పెద్దయుం బ్రొద్దు వేఁడినిట్టూర్పులు నిగిడించి ముహూర్తమాత్రంబు చింతించి యాశారద్వతున కిట్లనియె. ఆచార్యా! సుహృదుఁడు బోధింపఁ దగినవిధంబు వినిపించితివి. మఱియు సమరమున నెడలోమక యతిరథోత్తము లగు పాండవుల మార్కొని తదర్థంబు పరాక్రమించితివి. నీకు నాయెడం గలప్రేమానుబంధంబు విస్పష్టమయ్యె. నీనిరూపించినవిధంబు సముచితహేతుసమన్వితం బయ్యును ముమూర్షున కౌషధమట్లపోలె నాకు రుచింప దయ్యె. ఎట్లంటేని? ధర్మరాజునకు మే మెన్ని యేనెగ్గులు చేసితిమి. అన్నియు నట్లుండె. అక్షద్యూతమున రాజ్యము నాఁచికొని కానలకుఁ బంపితిమి. ఆయిడుమ లెల్లఁ గుడిచి వచ్చి వారు సంధికై గోవిందుం బంపిన నిరాకరించితిమి. సభామధ్యమునం బాంచాలినిఁ జెప్పరాని తెఱంగున భంగపఱిచితిమి. రాజ్యహరణముకంటె నది వారి కత్యంతచింతాకరంబు. అతం డెట్లు మమ్ము నమ్మును? మఱియుఁ గృష్ణుఁ డిపుడు సంధి కియ్యకొను నంటివిగదా? అందులకుం జెప్పెద

వినుము. కృష్ణార్జునులకు శరీరభేద మొక్కండ కాని మఱి యేభేదమునుం గనం బడదు. తనమేనల్లుం డగుసౌభద్రుని బాలుని మన మందఱమును జిక్కించికొని చంపినందుల కాకోప మతని కింతకుం జల్లాఱునే? అతండు మే లెన్నండైనం గోరు నే? మహాబలుం డై నభీమసేనుండు పరమకోపనుండు. వాండు తనప్రతిజ్ఞకొనసాగం జూచునుగాని సంధి యొల్లండు. యమతుల్యు లయినకవలు మాతో నిరంతరవై రంబు వాటించినవారు. ధృష్టద్యుమ్నశిఖండులు తమసోదరిని మేము భంగపఱి చితి మన్నకోపమున నెల్లకాలము మాకుం గీడు రోయుచుందురుగాని యొండు గాదు. సంగ్రామతాత్పర్యంబు వారికి మాన్పం దరంబు గాదు. మఱియు ద్రౌప ది భర్తృకార్యసిద్ధ్యర్థంబును నస్మద్వినాశార్థంబును స్థండిలశయనవ్రతంబు సుభ ద్ర పరిచర్య సేయం జేయుచున్న దంట. వార లెయ్యది మఱచినను నభిమన్యు వధంబు మఱవరు గావున సంధి పొసంగ నేరదు. వారలయియ్యకో లట్లుండె. నాకే యది యసమ్మతం బెట్టు లంటేని వినుము. ఇంతకాలము భాస్కరునిపోలెం దీవ్రతేజోవిస్ఫురితుండనై సకలరాజులతలలపై నుండి యుధిష్ఠిరునకు దాస్యంబు చేసి యతనిమాటమెయి నడుచుచుం దత్ప్రసాదమున రాజ్యభోగము లనుభవింప నామనను గొలుపదు. కృపణజీవనంబు నా కెంతయు నసమ్మతంబు. నీవు హితము బోధించితివి కాని సంధి కిది కాలము గాదని నామతంబు. యుద్ధమే కర్తవ్యంబు. బహుళయజ్ఞము లొనరించితి. బ్రాహ్మణులకు దక్షిణ లిచ్చితి. కోర్కు లెల్లం బడ సితి. వేదములం జదివితి. శత్రువులతలలపై నిలిచితి. భృత్యుల భరించితి. దీను ల నుద్ధరించితి. పరరాష్ట్రముల జయించితి. స్వరాష్ట్రము లెస్స పాలించితి. వివి ధభోగముల ననుభవించితి. ధర్మార్థకామములు సముచితప్రకారమున సేవించి పితరులఋణంబుం దీర్చితి. క్షత్రధర్మంబుం గ్రమమున ననుష్ఠించితి. రాజ్యసుఖ ములు స్థిరములు గావు. కీర్తి యొక్కండు సాధనీయంబు. అదియిప్పుడు యుద్ధ మునం దక్క నొండొక్కదానివలనం గలుగదు. రాజ్యభారముం బుత్రులపై నునిచి వృద్ధత్వమున వనస్థుండై యచట శరీరముం ద్యజించుటయు సమరమున వె నుదీయక యోపినకొలంది పోరి యాయుద్ధమునం దెగుటయుం బ్రశస్యంబు నుత్త మలోకసాధకంబు నగుంగాని ముసలియై రోగియై మంచానం బడి బాంధవు లేడ్చు చుండ విడిచి పోవ నొల్లక వనరుచుం జచ్చు టుచితంబుగాదు. అట్టివాం డధమ పురుషుం డనంబడు. కావున నేను ధర్మయుద్ధమున నింద్రలోకముం బ్రాపించి యప్సరోగణమానితుండనై సుఖించెద. పితామహుండు నాచార్యుండును గర్ణుం డును దుశ్శాసనుండును జయద్రథుండును మున్నగువారు నాతదర్థము ప్రాణములం ద్యజించి యాలోకంబకదా యధిగమింతురు. వారిఋణముం దీర్పనైనం బోరుట నా కొప్పుంగాని రాజ్యంబుం గాంక్షించుట యొప్పదు. అదియునుంగాక పుత్రు

లను మిత్రులను దమ్ములను బాంధవులనుం జంపించి యిప్పుడు నేను బ్రాణత్రాణపరుండనై తినేని లోకము నన్ను నిందించుఁగాని మఱి మెచ్చునే? సర్వవిహీనుండై ననాకుఁ బాండవులఁ బ్రార్థించి రాజ్యమడుగనేల యనుటయు రాజు లందఱు నమ్మహీపాలువచనం బభినందించి పరాజయశోక ముడిగి పరాక్రమనిష్ఠులై యుద్ధమే కర్తవ్య మని నిశ్చయించి బలవిహీనులై యారేయి యచ్చటనుండినం గెల్పుగొన్న పాండవులేమేనియుఁ జేయుదు రని తలంచి యచ్చటికి యోజనద్వయ దూరం బైనహిమవత్ప్రస్థంబున కరిగి సరస్వతీనదిం గృతస్నానులై తజ్జలములఁ ద్రావి కృతాహారులై కార్యచింతనతాత్పర్యంబున శల్యకృపాశ్వత్థామ కృతవర్మశకునులును గర్ణపుత్రులలో బ్రదికియున్న సుషేణారిష్టసేన ధృతసేనచిత్రసేనజయత్సేనులును దమలోఁ గొండొక విచారించి భవదగ్రనందనుం జూచి మహారాజా, యిప్పటివారిలో నొక్కని సేనానాయకుంగా నియమించి వేగినం బోరికి నడుచుట లెస్స యని నివేదించుటయు దుర్యోధనుండు సర్వయుద్ధవిశారదుఁడును, సర్వలక్షణోపేతబలవచ్ఛరీరుండును, జవబలతేజోబుద్ధికాంతులం గరుడపవనతపనశుక్రచంద్రుల కెనవచ్చువాఁడును, వేదవేదాంగధనుర్వేదాదివిదుండును రుద్రవరప్రభావమున నయోనిజున కయోనిజయందు జనించినవాఁడును, రిపునిషూదనోదగ్రతీవ్రప్రతాపాటోపదీపితుండును, నగునశ్వత్థామకడ కరిగి గురుపుత్రా! నీవు మాకు గురుసముఁడవు. ఇప్పు డెవ్వని సేనాపతిం జేయు టుచితం బని యడుగ నగ్గురునందనుం డతని నభినందించి మహారాజా! కులబలవీర్యశౌర్యధైర్యతేజోయశశ్శ్రీసమంచితుఁడు నఖిలగుణసంపన్నుఁడగుశల్యుని సేనాధిపతిం జేయఁదగు. తనకు మేనల్లు రగుపాండవులం ద్యజించి ప్రేమాతిశయంబున నీతోఁడఁ గలిసినయమ్మద్రపతి సురసేనలం గుమారుఁ డెట్టులట్టుల నడిపించి నిన్ను గెలిపించు ననవుడు నందఱు నందుల కియ్యకొని శల్యుం బరివేష్టించి జయజయశబ్దములం బలికిరి.

## దుర్యోధనుఁడు శల్యుని సేనాపతిం జేయుట.

అయ్యవసరంబున దుర్యోధనుండు ప్రాంజలియై శల్యునొద్దకుఁ జని మిత్రవత్సలా! మిత్రామిత్రభేదముఁ బరీక్షింపఁదగినకాలము ప్రాప్తమయ్యె. భీష్మద్రోణతుల్యుఁ డగునీవు సేనానాయకుండవై నాకార్యంబు నిర్వహింపుము. పాండవపాంచాలాదులు సేనాముఖమున నిన్నుఁ జూచి నిరుత్సాహులగుదురు. సేనాపతిత్వంబున కియ్యకొని నీవు స్కందుఁడు సురలంబోలె మమ్మురక్షింపుము. మే మందఱమును భవదీయనిదేశప్రకారమున నడుతు మని తెల్పుటయు మద్రరాజు ప్రమోదవికస్వరుండై కురుక్షోణీపతీ! నాప్రాణములును రాజ్యమును ధనమును భవత్ప్రియార్థంబకాని యొండుగాదు. నీనియమించినట్లు చేసెద నని యొడంబడియె. అంత దుర్యోధనుం డు తమాసనమున నమ్మద్రనాయకు నాసీనుం జేసి శాస్త్రోక్త

విధానంబున శంఖభేరీపణవాదివివిధవాదిత్రరవంబును వీరయోధసింహనాదమును మాగధస్తుతిపాఠనినదంబును వైతాళికజయజయశబ్దంబును రోదసీకుహరంబుఁ బూరింప రాజులును దానును బుణ్యసలిలముల నభిషేకించుటయు నభినవసేనాధిపతిపదవిభాసితుండై యమ్మద్రేశ్వరుండు నిర్భరానందకందళితస్వాంతుండై భవదగ్రనందనునకిట్లనియె. రాజేంద్రా! యేను బాంచాలురను జేదిమత్స్యాదియోధులను బాండవులను వాసుదేవసాత్యకులను ద్రౌపదేయులను వధియించెద. అంతకుఁ జాలనేని వారిచే నిహతుఁడనై వీరస్వర్గం బధిగమించెద. నాపరాక్రమంబును ధనుర్విద్యాకౌశలంబును భుజవీర్యంబును దివ్యాస్త్రసంపన్నత్వంబును నందఱు నింక నెఱుంగఁగలరు. సిద్ధచారణాదులు పిచ్చలించు విధమునం బేర్చెద. భీష్మద్రోణకర్ణులకంటె నీతండు వాఁడిమిగలం డని పాండవులు వెఱచఱచి భండనంబుడుగునట్లు చేసెద. తేపు చూడు మరాతిబలములఁ జించి పాఱఁ ద్రోలుదు. సురాసురాదు లందఱు నెక్కఁగట్టిమెన గట్టి మార్కొన్ననుం గెల్వఁజాలిననాకుఁ బాండవులం గెల్చుట దుష్కరంబు గాదు. లోకవిఖ్యాతబలశాలు లగుకృష్ణార్జునులును నాకుఁ దుల్యులుగారు. వారికి భేదింపరాని తెఱంగున మోహరంబు దీర్చెద. భవత్ప్రియార్థం బెంతయైనం జేయుదు ననుటయు దుర్యోధనుండు సంతసిల్లి కర్ణవధశోక మంత దలంపక యూఱడిల్లె. తక్కినవారు నమ్మద్రరాజును దీవించుచు జయాశ గదిరినమనంబుల నుల్లాసంబు పల్లవింప నెలమిఁ జెలఁగి రాజుననుమతి నిజనివాసంబుల కరిగి నిద్రించిరి. దుర్యోధనశల్యులు నుచితస్థానంబుల శయనించిరి. అక్కడ ధర్మరాజు తమవారల నందఱనుం గూర్చుకొని కొలువుండి కర్ణవధదుర్గతులైన కౌరవులవర్తనం బెఱుంగఁగోరి వేగులవారిం బంచి తదాగమనంబు వార్చియున్నంత వారలేతెంచి మనవారివర్తనంబుఁ దెల్పుటయు శల్యాభిషేకసమయమునం దా విన్నయచ్చటివాదిత్రరవమున కనురూపంబుగఁ దా నిశ్చయించి యందఱు వినంగ వాసుదేవా, సుయోధనుండు శల్యుని సేనాపతిం జేసెనఁట. ఇంతకు మున్న విన్నయలివు తదభిషేకసమయంబునఁ బొడమినయదియ. ఇఁక మనకుఁ గార్యం బెయ్యది యని యడుగుటయు నమ్మనుజనాథునకు దామోదరుండిట్లనియె. నరేంద్రా, శల్యుని నెఱుంగుదు. అతండు వీర్యసహితుఁడు శౌర్యమహితుఁడు తేజోవంతుఁడు వేగవంతుఁడు చిత్రయుద్ధవిశారదుఁడు. భీష్మద్రోణకర్ణుల కధికుఁడు సమానుఁ డగుంగాని తక్కువగాఁడు. లయసమయరుద్రుమాడ్కి రౌద్రమునం బేర్చి యాతండు భండనాంగణంబునం గ్రీడించునెడ మార్కొని వారింప భీమార్జునులకును గవలకును సాత్యకిధృష్టద్యుమ్నశిఖండులకును దరంబుగాదు. సింహశార్దూలపరాక్రముఁడగునమ్మద్రరాజును మహేంద్రుఁడు శంబరుంబోలె నీవు పరిమార్పనోపుదువు. అతఁడు దెగినం గౌరవ

బలమంతయుఁ దెగినదియ యనియూహింపుము. మేనమామ యని దయసేయక క్షాత్రధర్మపరినిష్ఠితుం డైననీకుఁ దద్వధంబు కర్తవ్యంబు. కర్ణపాతాళసంభవం బగు భీష్మద్రోణార్ణవము నిస్తరించి శల్యగోష్పదమున మునుఁగకుండఁ జూచికొనుము. నీతపోబలంబును క్షాత్రవీర్యంబును రేపు చూపవలయు ననుటయు ధర్మరాజు మహాత్మా, శల్యుఁడు దొలుతనే నీవు నాకుఁబెట్టినపాలుగదా. నీచెప్పినట్లు చేసెద నని జనార్దనుని వీడుకొల్పి తక్కినవారల నిజనివాసములకుఁ బోవం బనిచి కర్ణనిధనమునఁ దాను నారాత్రిసుఖనిద్రసలిపె. ఏను నారేయి వచ్చి నీకుఁ గర్ణవధప్రకారముఁ జెప్పి మఱునాఁటివేకువం గ్రమ్మఱఁబోయితి నని చెప్పి సంజయుఁడు వెండియు నిట్లనియె.

## కౌరవసైన్యము యుద్ధమునకు సన్నద్ధ మగుట.

అంత నావేకువ దుర్యోధనుండు పోరికి సమకట్టి మూఁకలనెల్ల నడువఁ బడవాళ్లకుఁ బనిచిన నందఱును గడువడిం బలుదెఱంగు లగుసవరణలు గల్పించి పాండవులతోడ నెక్కండు పెనంగరాదు. మఱియుఁ బోరువానికిఁ జూచినవాఁ డెల్లఁ దోడ్పడవలయు నిందులకుఁ దప్పినం బంచవిధపాతకంబులకు నుపపాతకంబులకుం బాత్రుండగునని తమలో సంకేతంబుఁ జేసికొని వివిధవాద్యరవంబును సింహనాదంబును జెలంగఁ గృపకృతవర్మద్రౌణిసౌబలప్రముఖులై మనవారు సర్వసేనానాయకుం డైన శల్యుని మతంబున నడిచి సంగరోత్సాహమునం బేర్చి యున్నంత నమ్మద్రేశ్వరుండు సేనల సర్వతోభద్రవ్యూహమునం బన్నించి యందుఁ దాను ముంగలివై వలపట శకయవనానీకములతోడఁ గృపాచార్యుని డాపటఁ ద్రిగర్తసైన్యంబుతోడఁ గృతవర్మను గాంభోజగాంధారబలములతోడ వెనుకటిదెస ద్రౌణిసౌబలులను బహుళచమూగణంబులు ననుజులునుం బరివేష్టింప మధ్యంబున రారాజును నిల్పిన నాసైన్యము చంద్రోదయసమయసముద్ధూతం బైనయర్ణవంబుచందమున ఘూర్ణిల్లుచుండె. అంతకుమున్న పాండవులు మూఁడుమోహరములుగా నమరి మనవారలఁ దలపడిరి. అందు సాత్యకిశిఖండిధృష్టద్యుమ్నులు శల్యానీకంబుపై నిగిడిరి. ధర్మరాజు నిజసేనాపరివృతుండై యమ్మద్రపతిని మార్కొనియె. ధనంజయుండు కృతవర్మను సంశప్తకులనుం దాఁకె. భీమసేనుండు సోమకసహాయుండై కృపాచార్యునిపయిం గవిసె. మాద్రేయులు సౌబలోలూకులపై నడరిరి. ద్రౌపదేయప్రముఖులు తమకుఁ దమకుఁ బోలినవారలపయిం గవియుదెంచిరనినవిని యాంబికేయుండు సంజయా, యప్పటికి మనబలమునను వారిబలంబునను మిగిలినమూఁకలకొలంది యెఱింగింపు మని యడుగ నతం డతనికిట్లనియె. పదునొకండువేలరథములును బదివేలనేడునూఱేనుంగులును రెండులక్షలగుఱ్ఱములును మూఁడుకోట్లకాలుమానిసులును మనబలమునను నాఱువేలతేరులును నన్నియే

నుంగులును బదివేలగుఱ్ఱములును గోటికాలుబలంబునువారిసైన్యంబునను శేషిం
చియుండె నింక సమరప్రకారం బాకర్ణింపు మని వెండియు నిట్లనియె.

### పదునెనిమిదవనాఁటి యుద్ధము.

అవ్విధమున నిరువాఁగునఁ జేయంగలదండిమగలు నాసూర్యోదయ సమ
యమునం దలపడుటయుఁ జతురంగంబులు తమతమజాతిని మార్కొనుటయు రథి
కులేనుంగులను నేనుంగులు తురంగములను దురంగములు కాలుబలంబును గాలు
బలంబు రథికులను రథికులు గుఱ్ఱములను గుఱ్ఱములు గజములను గజములు కాల్బ
లంబును గాల్బలంబు కుంజరంబులను గుంజరంబులు రథికులను రథికులు పాదా
తంబును బాదాతంబు హయములను హయములు రథికులనుంగా నిర్మర్యాదంబు
గఁ బెనంగిన నొక్కనికిఁ జిక్కి పెక్కండ్రు డుక్కుసెడి మడియురూపును బలువుర
కుఁ జిక్కి యొక్కండు ద్రుంచురూపునుం బెరసిన నాసందడికయ్యమునఁ గుంభ
ము లవియఁ దొండములు దునియఁ గొమ్ములు వ్రీల వ్రాలి వాలిఘాతము లగు
నంబుదములరీతిని వజ్రాహతము లగుపర్వతములవిధముననుం జూడ నొప్పునేనుం
గులును నిపుణవనపాలకుండు నేర్పునం గోయఁగ రాలుతాళఫలంబులట్లు కైదువుల
పోట్లం దునిసిపడి పుండరీకసంకాశంబు లగుకిరీటకుండలోల్లసితరథిక మస్తకంబు
లును గృపాణకృత్తంబులై పడి మదవేదండశుండాదండములకుఁ బోల్పందగినకే
యూరాదిభూషితశూరజనబాహుదండములును విగతసాదికంబులై లాలాజలంబుఁ
గ్రక్కి తెగటారినగుఱ్ఱములును గాలు చేయి ప్రక్క డొక్క యని యేటుపటు
పరానితెఱఁగునఁ బలుతునియలై పడినపదాతిగాత్రఖండములును గైదువులతుము
ళ్లును దొడవులపొళ్లును మైమఱువుల్లయఱువుల్లును గొడుగులపటియలును జామరం
బులతునియలును గేతనశకలంబులునై సంగ్రామరంగంబు రౌద్రాభిరామం
బయ్యె. హతశేషంబు లగు గజవాజిగణంబుల బృంహితహేషితధ్వాన
మునను రథనేమినిస్వనంబునను గాండిశీకపాదాతదీనారవంబునను వీరయోధ
సింహనాదమునను శంఖభేరీప్రభృతివాద్యధ్వానంబునను మార్వోఘోషంబు
నను మిన్ను దూఁటుకట్టె. శూరరథికులకవచకాంతులు చూపులకు మిఱు
మిట్లుగొల్పె. తురగఖరఖురవిఘట్టనలాంఛితంబై ధరిత్రి విలాసిజననఖక్ష
తాంకిత యగుమగువతెఱఁగునం జూపట్టె. గజవాజినరకబంధసంఘాతంబులు
పర్వతప్రాయంబులై తోఁచె. భుజములు నక్రములుగా విండ్లు సుళ్లు
గా నేనుంగులు కొండలుగా గుఱ్ఱములు శిలలుగా గొడుగులు హంసలుగా గదలు
దోనెలుగా నెమ్ములతునియ లిసుకగా ధ్వజములు ద్రాఁకులుగా మేదోమజ్జ లతి
కర్దమంబుగా నెత్తురుటేఱు పాఱె. అవ్విధమున నార్తనాదబహుళంబు నిర్మ
ర్యాదంబు పరమభీకరంబునుంగా ఘోరం బైనపోరు సెల్లుచున్నంత భీమార్జు

నులు మనసేనలం జీకాకుపఱిచి సింహనాద మొనరించి పౌండ్రదేవదత్తంబు లొత్తుటయు నాదారుణనిస్వనంబు విని యుబ్బునం బొంగి యార్చి పేర్చి ధృష్టద్యు మ్న శిఖండులు మాద్రేయులును ధర్మరాజుం బురస్కరించికొని శల్యుం దలంపడి పోరి మనమూఁకలం బొదివి పోనీక నిలునిలుమని యదల్చుచు వెన్నడించి తఱుముచుఁ గోల్తలచేయుటయు నొటఱి మనవారు ప్రాణత్రాణపరాయణులై పుత్రులను భ్రాతలనుఁ బితామహులను మాతులులను భాగినేయులనుం జేరక విచ్చి పఱచిరి. అట్లు విఱిగి పఱచిన మనబలంబుఁ జూచి మద్రరాజు కోపించి సారథిం జూచి యల్లవాఁడె పాండవాగ్రజుండు శ్వేతాతపత్రవిభాసురుండై తేరిపయి నున్నవాఁడు. అతనిచక్కటికిఁ బోనిమ్ము. నేఁడు చూతువుగదా నాబలంబు. పార్థులు నాయెదుర నిలువఁ జాల రనుటయు నతం డట్ల చేసిన నుప్పొంగుసముద్రమునకు వేలయుఁబోలెఁ బైపయిం గవియుదెంచుపాండవ సేనా సాగరంబునకు శల్యుఁడు దా నడ్డమై నిలిచినంజూచి విఱిగినమనవారు కూడుకొని క్రమ్మఱ మోహరించినం బోరు ఘోరం బయ్యె.

నకులుఁడు కర్ణపుత్రు లగుచిత్రసేనాదులఁ జంపుట.

అప్పుడు నకులుఁడు కర్ణపుత్రుఁ డగుచిత్రసేనుం దలపడి శరపరంపరలు పరఁగించుటయు నాతండును బాణమయవృష్టిసముదగ్రుండై యడరినం బరస్పరవధోద్యతులు కృతాస్త్రులు రథచర్యావిశారదులు నగునయ్యిరువురికయ్యంబు ముహూర్తమాత్రంబు విస్మయావహంబై యుండె. అంతఁ గొండొకవడికిఁ గర్ణసూనుం డేచి నిశితపీతభల్లమున నకులునిచాపంబు ముష్టికిఁ ద్రుంచి కేతనముఁ గూల్చి గుఱ్ఱములం జదిపి సారథిని సమయించి శిలాశితము లగుమూఁడువాలమ్ములు లలాటమ్మున నాటుటయు నమ్మాద్రేయుండు త్రిశృంగాద్రివడువునం జూపట్టి క్రోధసముద్రిక్తుండై శిఖరమునుండి సానుభాగముమీఁదికి లంఘించుకేసరి తెఱంగునఁ జర్మకృపాణపాణియై నేలకు డిగి యాతం డేయుసాయకాసారమ్ముఁ బలకచే జడియుచు వివిధచిత్రగతులం దిరుగుచుండి తటాలున వారితేరిపై కుఱికి కరవాలంబు ఝళిపించి చూడ్కులకు మిఱుమిట్లుగొలిపి తోడన కుండలకిరీటోల్లసితం బయినశిరంబుఁ దఱుగుటయు నాచిత్రసేనుఁడు విచ్ఛిన్నమస్తకుండై ధరం దొరిగినం దత్సైన్యంబునఁ బ్రశంసావచనంబులును సింహనాదములు నెసంగె. నిజభ్రాత యట్లుహతుఁడగుటకు శోకరోషదూషితులై తత్సోదరు లగుసుషేణసత్యసేనులు కుంజరవధోద్యతంబు లగుశార్దూలములపగిది నన్నకులునిపై నడరి ప్రావృట్పయోధరములట్లు శరవర్షముఁ గురియుటయు నంతకు సవిశేషసన్నాహసమంచితంబై నిపుణసూతానీతంబై నయొండుతేరెక్కి వేఱువిల్లు గొని క్రోధసంభరితుండై యంతకాకారంబునం బొల్చి వారియమ్ముల వారించి నకులుండు ప్ర

హాసభాసురవదనుండై శరచతుష్టయమున సత్యసేనునరదంపుగుఱ్ఱములం జంపి యొక్క_దొడ్డనారసంబున విల్లు ఖండించుటయు నారాధేయసుతుండు వేఱుతే రెక్కి_ సుషేణుఁడును దాను నమ్మాద్రేయుం దఱుమఁ దొడంగిరి.

అందులకు సంభ్రమింపక నకులుఁడు రెండేసినిశితకాండముల వారల నొంచుటయు సుషేణుఁ డొక్క_క్షురప్రమున నకులుని విల్లు దునిమె. తునిమినం గోపదీపితుండై యప్పాండునందనుఁ డొండుకోదండ మెత్తి యైదువాలమ్ముల సుషేణుగాత్రంబుఁ గాడిపోవ నేసి యొక్క_శరమునఁ గేతుదండము నఱికి సత్యసే నునివిల్లునుఁ గరత్రాణంబునుఁ జిదురుపలు గావించుటయు మనదెసజను లార్చిరి. దాని కలిగి సత్యసేనుండు కార్ముకాంతరముఁ గొని నకులుని బాణజాలసంఛన్నుం జేయుటయు నమ్మాద్రేయుండు సంరంభసముద్దీప్తుండై తదీయశరముల వారిం చుచు నయ్యన్నదమ్ముల నిద్దఱను రెండేసియమ్ముల నొప్పించిన వారు వేఱువేఱ యాతనిపయి నానాశరముల నడరించి బలుతూపుల సారథి నొప్పించిరి. అంత లోన సత్యసేనుండు శరద్వయంబున నకులు తేరికాఁడిని ధనుస్సునుం దునుముట యుఁ గోపించి పాండురాజనందనుండు స్వర్ణదండ మకుంఠాగ్రము తైలధావన నిర్మలము నాలుకలు తెఱచి నాకనున్నయాశీవిషమునకుఁ దుల్యంబు నగుశక్తి బిట్టేయుటయుఁ దత్ప్రహారమున నాసత్యసేనుండు గుండియ లవిసి గతాసుండై నేలం బడియె. సహోదరుపాటునకు వందురి క్రోధమూర్ఛితుండై సుషేణుఁడు నకులునిపై శరనికరం బడరించి శరచతుష్టయమునఁ దురగముల నాలుగింటం జదిపి పంచాశుగములఁ గేతుయష్టిం గూల్చి నారాచత్రితయమున సారథిం జంపి యార్చె. విరథుం డైననకులునిఁ జూచి ద్రౌపదీనందనుం డైనసుతసోముఁడు పితృపరిత్రాణతత్పరుండై యాసుషేణుం దలపడుటయు సన్నిహితుఁ డైనసుత సోమునరద మెక్కి_ నకులుఁడు గిరిశృంగస్థితం బైన కేసరిచాడ్పునం బొల్చి యొండు విల్లు గొని యతనిపై శరజాలముఁ బరఁగించె. అట్లయ్యిద్దఱు పరస్పరసంహార మునం గడంగుచున్నంత సుషేణుండు గండుమిగిలి పాండవుపైఁ గాండత్రయం బును దత్సూనుబాహువక్షోభాగంబుల వింశతివిశిఖములనుంగీలించుటయుఁ గోప దీపితుండై నకులుఁడు శరజాలమున దిక్కు_ లావరించి యర్ధచంద్రబాణమున వానితలఁ దఱిగె. అవ్విధమునఁ గర్ణసూనుఁ డైనసుషేణుఁడు నకులనిహతుఁ డగుటయు మనసైన్యంబు వెఱచఱచి పఱచిన మద్రపతి నిర్భయుండై వారల నిలువరించి సింహనాద మొనర్చి ధనుర్గుణక్వణనంబుఁ గావించుటయు మనవారు సేనాపతిప్రాపు గాంచి బరవసంబు చేసి కడంగుటయు సాత్యకిభీమసేననకులసహ దేవులు యుధిష్ఠిరపురస్సరులై సింహనాదజ్యాఘోషబాణశబ్దబంధురంబుగాఁ బేర్చి తాఁకుటయు నప్పోరు దేవదానవసమరసమంబయ్యె. అట్టిమెడం గపికేత

నుండు సంశప్తకులం గెలిచి తలపడుటయు ధృష్టద్యుమ్నప్రముఖులును దోడ్పడు టయుఁ దదీయశరసంపాతమున వెగడుపడి మనయనీకంబు కలంగియుఁ దొలంగియు జిచ్చపడియు వర్షకాలప్రవాహములట్లు వ్యాకులం బయ్యె.

## సంకుల యుద్ధము.

అట్లు పరమదారుణం బై నరణంబు సెల్లుచుండఁ బూర్వాహ్ణం బగుటయుఁ బాండవులపటుపరాక్రమమునం జేసి కార్చిచ్చు పొదివినమృగకులంబుచందంబునఁ బోడిమి దప్పి రొంపిలోన బ్రుంగినమొదవుచాడ్పున వికలం బై నమనసేన నుద్ధరించువాఁడై మద్రపతి మార్వీగుణక్వణనంబుఁ గావించి కాంతేయానీకముపయిం గవియుచున్నంత భూమి కంపించుట రవిమండల మాక్రమించి కొఱవులు పడుట మృగమహిషపక్షిగణములు డాపలించి తిరుగుట శుక్రాంగారకులు బుధసహితంబుగాఁ బాండవులకు వెనుకను మనవారికి ముందఱనుం దోఁచుట కైదువులు మండుట కాకోలూకములు కేతనములందు వ్రాలుట మున్నగునుత్పాతంబులు దోఁచె. అందులకుఁ దలంకక శల్యుఁడు మనవారికిఁ బ్రహర్షోత్కర్షముఁ గావించువాఁడై పాండవవీరులం దలపడి ధర్మజభీమసేనులపై శరవర్షముఁ గురిసి మాద్రేయద్రౌపదేయశై నేయధృష్టద్యుమ్నశిఖండులం బ్రత్యేకంబ పదేసియమ్ముల నొంచి ప్రావృడ్వారిదంబు తెఱంగునఁ బ్రభద్రకసోమకానీకంబుపయిం బాణాసారముఁ గురియుటయు భ్రమరవ్రాతముల తెఱంగునను శలభనికరములకరణిని విద్యుత్ప్రచారములవిధమునను సంక్షోభితములై ఘోరాకారములై శల్యసాయకములు పైపయిం బడుటయుఁ బాండవానీకంబు దిరుగుడుపడియు వెఱచఱచియు విచ్చిపఱచుచున్నంత నెంతయు నుబ్బి లయసమయాంతకువిధమున నుగ్రరూపుఁడై యాతండు బాణవర్షబంధురుండై పాండవాగ్రజు నొంచి తటిమి యంకుశప్రహారవిషణ్ణం బగుకుంజరముభంగి విషాదప్రాప్తుఁ డై నయయ్యజాతవైరిపయిం గ్రూరనారాచ మొక్కండు బిట్టేయుడు నది యతనికంకటము వ్రచ్చి నేలం బడియె. అందుల కలిగి వృకోదరుఁడు సప్తశిలీముఖముల శల్యుని నొవ్వనేయుటయుం దోడన యాతనిపై సహదేవుఁడు పంచాశుగములను నకులుఁడు దశవిశిఖములను ద్రౌపదేయులు బలుతూపులను నడరించి కృపకృతవర్మసౌబలోలూకాశ్వత్థామలును నీకొడుకులును శల్యునికిఁ బ్రాపై నిలిచిరి. కృతవర్మ భీమునిపై శిలీముఖత్రయము పరగించుచు నిగిడె. కృపుఁడు ధృష్టద్యుమ్నునిపై నడరె. శకుని ద్రౌపదీసుతుల మార్కొనియె. అశ్వత్థామ కవలపయిం గవిసె. ఒండుకడ దుర్యోధనుఁడు కృష్ణసహాయుఁడై ధనంజయునిం దలపడియె. అట్లు ద్వంద్వములై పోరునెడ హార్దిక్యుఁడు బుజువర్ణము లగుభీమరథ్యములం గీటడంచుటయు నాతండు గదాపాణియై మనబలంబుపై నడరె. అంత నమ్మద్రపతి సహ

దేవుం డాఁకి యతనిగుఱ్ఱములను సమయించుడు నాతం డలిగి కృపాణపాణియై నేలకు లంఘించి యమ్మద్రపతికొడుకుం బరిమార్చి యొండు తేరిమీఁదికిఁ జనియె. కృపుఁడు ధృష్టద్యుమ్నుం దలపడిన నయ్యిరువురు నొండొరుల మీఁదుకడఁకం బేర్చి మెక్కువతక్కువలు లేక పోరిరి. శకుని ద్రౌపదేయులపై వేఱువేఱ పదేసి యమ్ము లేసిన వారలు బలుతూపుల నిగిడించుటయు వారిపోరాతనికి భరం బయ్యె. ఆచార్యపుత్రుండు నకులుతోడం బోరుచు నంతకు సవిశేషసన్నాహ సముపనీతం బైన తేరెక్కి యరుదెంచినవృకోదరుగుఱ్ఱముల సమయించుటయు నాతండు గదాపాణియై రథంబు డిగ్గి కృతవర్మరథ్యములం దెగటార్చిన నాతండు తొలంగి చనియె. పుత్రశోకక్రోధభరితుండై శల్యుఁడు సోమకానీకంబుఁ బొరి వుచ్చుచు యుధిష్ఠిరుపై నడరి శితశరనికరములఁ బరఁగించుటయుఁ గినుకఁ గదుర నవుడుగఁ బఱచి వృకోదరుఁడు యమదండప్రతీకాశంబు కాలరాత్రిసంకాశంబు నానా సేనాంతకరంబు ప్రజ్వలితోల్కాసమంబు పటుఘంటాశతసమంచితంబు కైలాస మునం గుబేరుఁ బోరికిఁ జీరినకడిమికిఁ బోలినసాధనంబు ద్రౌపదీప్రియార్థంబు సౌగంధికములఁ దేరఁబోయినతఱి నచ్చటియక్షరాక్షసగుహ్యకామలం గడతేర్చిన యుదగ్రాయుధంబు వజ్రమణికీలితంబు హేమపట్టవిభాసితంబు వ్యాళీతుల్యంబు నగుతనయెనిమిదియంచులగదాదండముఁ గొని శల్యుతేరిగుఱ్ఱముల నాలుగింటినిం గీటడఁగించిన నమ్మద్రరాజు కోపించి నిశితతోమరం బతనియురమున నాఁటుటయు దాన విదీర్ణకవచుఁడయ్యు నత్తాఁకు సరకుసేయక యద్దానిన కొని క్రమ్మఱ శల్యు సారథిపయిం బిట్టేయుటయు నాతండు తత్ప్రహారమున గుండియలు వ్రీలి నెత్తురు గ్రక్కుచు నేలం బడి గతాసుఁ డయ్యె. భీముఁ డొనర్చినకృతప్రతీకారమున కద్భుత మంది శల్యుఁడు తొలంగుటయును వాయుసూనుండు మనమూఁకలప యింగవిసి యప్రతిహతప్రకారమునం గదావిహారము సల్పుచుండె.

## శల్య భీమసేనుల గదాయుద్ధము.

వృకోదరుం డట్లు గదాపాణియై దండపాణి యగుకాలువిధమునఁ జూడను ప్పచుఁ జూచుఖేచరులు పిచ్చలింపఁగ మనయనీకంబుఁ గనుపుకొట్టుటయు శల్యుఁ డును దనసారథి హతుఁడైనం దటాలున గదాపాణియై తేరు డిగ్గి కొండవోలె నచలుండై నిల్చి కాలానలు తెఱంగున దీపించి పాశహస్తుఁ డగునంతకువిధము నను శృంగసహితం బగుకైలాసముకైవడిని వజ్రపాణి యగువాసవునివడువు నను సముత్క్షిప్తశుండాదండం బైనమదవేదండము తెఱంగుననుం బొల్పుచు వృకో దరు మార్కొనుటయు శంఖభేరీప్రభృతివాదిత్రరవంబును సింహనాదంబును శూరజనప్రమోదసంపాదకంబై నిగిడె. ఇరువాఁగునం గలుగునుత్తమశూరు లందఱును గదాయుద్ధమున భీముని మార్కొన మద్రేశ్వరుండు బలభద్రుండును

గాని లాఁతు లోపరనియు మద్రపతిగదావేగంబు సైరింప వృకోదరుఁడు దక్కఁ దక్కనవారు సాలరనియుం బొగడిరి. అంత నవ్వీరు లిరువురు నుడివ్రోవనిచలంబునను బలంబుననుం బేర్చి వివిధమండలావర్తగతులం దిరుగుచుఁ బరస్పరప్రహారముల నితరేతరగదాదండముల జడియుచు మిడుఁగుఱు లెగయించుచుఁ గఠోరవిషాణములం బోట్లాడుమదపుటేనుంగుఁలభంగిఁ దనరి యొండొరులమేటులపెల్లున నెత్తుటం జొత్తిల్లి పూచినమోదుగులచందమున నొప్పుచు నేచిన రోషమున సందు నరయుచు డాఁపలను వలపలను నశనిసంపాతరవసంకాశం బయినఘోరనాదం బెసంగ నడుచుచు నెక్కువతక్కువలు నిరూపింపరాని తెఱంగునం బెనంగుచు నేర్పు వాటించి ప్రేంకణంబున నెనిమిదియడుగులకొలందిచోటం దిరుగుచు నన్యోన్యవిజిగీషామనీషం జేసి యిద్దఱు నొకపరి యితరేతరగదాదండముల నొండొరులం బెల్లడుచుటయు నయ్యిరువురు నెంతయు మర్మతాడితులై సోలి నేలకు వ్రాలుటయు హాహారవంబులు పెలుచ నెసంగినం గృపాచార్యుండు శల్యునిఁ దనతేరెక్కించికొని తొలంగించె. భీముఁడు బలియుఁడు గావునఁ గొండొకవడికిఁ దెప్పిరిల్లి లేచి క్రమ్మఱ శల్యుం బిలుచుటయు దుర్యోధనాదులు వాదిత్రరవముఖరితహరిదంతరులై యార్చి పేర్చి యవ్వడముడిం దాఁకిరి. అప్పుడు దుర్యోధనుఁడు చేకితానుం దాఁకి ప్రాసమున నడచిన నాతండు తత్ప్రహారమున రక్తసిక్తుండై సోలి నేలంబడి గతాసుఁ డగుటయుం గోపించి పాండవవీరు లడరినం జూచి దుర్యోధనుండు దాన ధృష్టద్యుమ్నుని మార్కొని కృపకృతవర్మసాబలసహితంబుగా శల్యుని ధర్మరాజునుఁ దలపడ నియమించి త్రిసాహస్రత్రిగర్తయోధులను ద్రోణసూనునాయకులను బీభత్సునిపైఁ గవియఁబనుచుటయు నితరేతరవధోద్యోగసంభరితంబు పరస్పరప్రీతివర్ధనంబు నగుఘోరసంగ్రామంబు సెల్లె. ఆక్రందుకయ్యమున ధరణీరేణుజాలం బెగసి చీఁకట్లు పచరించిన నేమియుఁ గనఁబడకున్న నెలుంగుగుఱుతున నీడంబోక పెనంగుచున్నంత గజవాజినరగాత్రనిర్యద్రుధిరధారల నాపరాగం బడంగుటయు నిరువాఁగున నొక్కఁడేనియుఁ బరాఙ్ముఖుఁడు గాక స్వామికార్యసిద్ధిఁ గోరి యొడలోమక బ్రహ్మలోకదీక్షితులై పొదువుఁడు నొంచుఁడు కొట్టుఁడు ముట్టుఁడని యెలుంగు రాల్పడం బలుకుచు నుడివ్రోవని కడిమి మెఱసి సకలయోధులుం బోరిరి. అప్పుడు శల్యుఁడు ధర్మరాజుపయిం బటుప్రదరనికరములఁ బరగించుటయు నప్పాండవాగ్రజుండు నవ్వుచుఁ బదునాలుగువాఁడినారసములు శల్యుమేనం గీలించిన నాతండు సంరంభసముద్రిక్తుండై యనేకకంకపత్రము లడరించి యొక్కవాలమ్ము తద్గాత్రమునం గీలుకొల్పె. అందుల కెంతయుం గనలి ధర్మనందనుండు నిశితవిశిఖముల నమ్మద్రేశ్వరు నొప్పించి తదీయచక్రరక్షు లగుచంద్రసేనద్రుమసేనులపయిం గవిసి

చంద్రసేను డెబ్బదింటను దత్సారథినిఁ దొమ్మిదింటను నొప్పించి యిఱువదివాఁడి తూపుల ద్రుమసేనుం దెగటార్చినం గోపించి మద్రవిభుండు పంచవింశతిచేది యోధుల వధించి సాత్యకి నిరువదేనుతూపులను భీమసేను నేడమ్ములను మాద్రీపుత్రుల శరశతమునను నొంచె. నొంచినం గోపించి కౌంతేయాగ్రజుండు క్రూర భుజగోపమము లగునిశితశరముల శల్యు మేన నాటి యొక్కభల్లమునఁ గేతుదండ ముఁ గూల్చినం బఱితధ్వజుండై శల్యుఁ డెంతయుం గినిసి సాత్యకిభీమసేనమాద్రేయులఁ బ్రత్యేకంబ యైదేసివాలమ్ముల నొప్పించి ధర్మజునురమున బాణవర్షముఁ గురిసి నొంచి దెసలెల్ల శరములు గావించె. ఇంద్రునికిఁ జిక్కినజంభునట్లు హతవిక్రముఁడై యున్నధర్మరాజుం గాంచి సాత్యకి భీమసేను లొక్కపెట్ట యమ్మద్రపతిం దాఁకుటయు నాతండు వారిం దఱితోడ నీడంబోక పెనంగినం జూచు ఖేచరులకు విస్మయం బొదవె. అయ్యవసరమున వృకోదరుఁడు శల్యభూషితుఁడై నశల్యునిపయి నొక్కవాలమ్మును సప్తాశుగంబులనుఁ బరఁగించుటయు శైనేయుఁడు శరశతం బడరించి యార్చిన నకులుఁ డైదింటను సహదేవుఁడైదింటను మఱియు నైదింటను నొప్పించుటయు నలిగి యాతండు మార్వీఘోషంబుఁ గావించి యిరువదేనింట సాత్యకిని డెబ్బదిమూఁడింట భీమసేనుని నేడింట నకులుని నొప్పించి యొక్కతీవ్రభల్లముఁ గీలించె. సహదేవుఁ డొండువి ల్లెక్కుపెట్టి పంచాశుగముల నమ్మాతులు నొప్పించి యొక్కవాలమ్మును మఱియు మూఁడువాఁడితూపులునుఁ దత్సారథిపై నేయుటయు నయ్యెడ వడముడి డెబ్బదిబలుతూపులును సత్యకసుతుండు శరనవకంబును నజాతశత్రుఁ డఱువదివాలమ్ములను నతనిమేనం గీలించుటయు నక్కురుసేనానాయకుండు తదీయశరవ్రాతసంపాతమున రక్తసంసిక్తదేహుఁడయ్యు నవ్వేళ వారు వేఱువేఱ యైదేసియమ్ముల నొంచి తీవ్రభల్లమునం గౌంతేయాగ్రజుచాపంబు నఱికె. నఱికిన నొండుకోదండము గొని ధర్మరాజు రథరథ్యసారథిసహితంబుగా నామద్రనాయకుని బాణజాలసంవృతుం గావించిన నలిగి యాతండు పదివాలమ్ముల యుధిష్ఠిరుని నొప్పించె. అందులకుఁ గోపించి సాత్యకి శరజాలము నాతనిపయి నడరించుటయు శల్యుఁడు క్షురప్రమున నతనివిల్లు నఱికి భీమసేనాదుల మూఁడుమూఁడుకాండముల నొప్పించుటయు నలిగి సత్యవిక్రముఁడై నసత్యకసుతుఁడు తోమరం బేయుడుఁ దోడన భీమనకులసహదేవధర్మరాజులు క్రమంబున నారాచశక్తిగదాశతఘ్నులం బరఁగించుటయుఁ గృతహస్తుఁడుగావున శల్యుఁడు వాని నాల్గింటిని నడుత్రోవన కడిఖండమ్ములు గావించి సింహనాదంబుఁ జేసె. శత్రునివిజయంబు సైరింపక సాత్యకి క్రోధసంభరితుండై రెండింట నమ్మద్రపతిని మూఁడింటఁ దత్సారథిని నొప్పించిన నాతం డలిగి యంకుశముల నేనుఁగులంబోలె వారలఁ బదేసికాండములఁ బీడించి యాఁగుటయు వార లతని

యెదుర నిలిచి పోరనోటఁయుటయుఁ గురురాజు పాండవపాంచాలుర శల్యునిచేఁ దెగినవారలఁగాఁ దలంచి యుబ్బిన నందుల కలిగి వృకోదరుండు ప్రాణరక్షణ తాత్పర్యంబు మాని మద్రపతిం దలపడుటయు నకులసహదేవసాత్యకు లప్పవన సుతునకుఁ దోడయి శల్యునిపయిం గాండజాలం బడరించిన నాతండు సరకుగొ నక వారల నందఱను మార్కొని పెనంగుచుండె. అట్టియెడ ధర్మరాజు మద్ర రాజుచక్రరక్షకు నొక్కక్షురప్రమున కెరచేసి యుడివోవనికడిమి మెఱసి మనబ లంబుఁ గనుపుకొట్టుచు శల్యుం జూచి మాధవువచనం బెబ్బంగి సత్యంబుగాఁగల దో? నాబలమునెల్ల నీతండు గీటడంగింప కుడుగునే యని తనమనమునఁ దలపో యుచున్నంత నమ్మద్రేశ్వరుండు నలిరేఁగి మిడుతలబారులతీరున నవిచ్ఛిన్నం బుగా శరవ్రాతంబు నిగిడించి మహామారుతంబు మేఘపటలమునుంబోలె వారి బలంబుఁ దెరల్చుచు బాణాంధకారంబుఁ గావించిన నెంతకడంగియుఁ బాండవ వీరు లతనిం గడవ నేరకున్నంత నాశల్యుపరాక్రమంబుఁ జూచి దేవదానవగంధ ర్వాదులు విస్మయాక్రాంతులై యగ్గించిరి.

అర్జునుఁడు త్రిగర్తసైన్యంబు గీటడంచుట.

అంత నొండుకెలన సవ్యసాచి త్రిగర్తపరివృతుండై నయశ్వత్థామను మాఱుకొని యాతనిపై మూఁడువాఁడితూపు లడరించి రెండేసియమ్ములఁ దక్కినవా రిపై నేయుటయు వా రందులకు నెవ్వక ద్రోణిపురస్సరులై శరవర్షముఁ గురిసి కృష్ణార్జునుల నొప్పించి యప్పాండవమధ్యమురథంబును రథాంగములను నొగ లనుఁ గాఁడిని శరమయంబు గావించిన వివిధశరనికరపరీతంబై యాస్యందనో త్తమంబు మహోల్కాశతసంప్రదీప్తం బగువిమానంబుకై వడిం జూడనొప్పె. ఏమి చెప్పుదు. తత్ప్రకారం బెన్నండును జూచియు వినియు నెఱుంగము. సవ్యసాచి క్రోధోద్ధతశరజ్వాలికాభీలుండై గాండీవఘోషవాతసంప్రవర్ధితుండై తనధనంజయనామంబు సార్థకంబుగాఁగఁ బ్రళయకాలపావకుపగిదిం దేజరిల్లుచు సైన్యేంధనముఁ గాల్పఁదొడఁగుటయుఁ బార్థనామాంకితము లగుశరములతాఁకు నంజేసి కూలునేనుంగులును విఱుగు తేరులును మడియుగుఱ్ఱములును సమయుకా ల్బలంబును డొల్లిపడురథికమస్తకంబులును బొడిపొడి యగుకైదువులును బఱి యలగుగొడుగులును జిదుర్పలగురథావయవంబులును నఱవఱలగుమైమఱుఁగు లును దుమురగుతొడవులునై సంగ్రామభూమితలంబు మాంసశోణితకర్దమంబై యగమ్యంబై రుద్రవిహారస్థానంబు మాడ్కిఁ బరమఘోరంబై యొప్పె. అట్లు కడిందిమగంటిమిం బేర్చి విప్పచ్చుఁడు ద్విసాహస్రత్రిగర్తయోధులఁ బిలుకు మార్చి లయసమయమునఁ జరాచరంబులు నీఱుసేసి ధూమరహితుండై వెలుం గువైశ్వానరుని తెఱఁగున నిరుపమానతేజోవిభ్రాజితుండై యుండ నాచార్యసుతుం

డతనిం దాఁకిన నప్పాండురాజనందనుఁడుం దలపడుటయు నితరేతరస్పర్ధాసముద్రి క్తులగు నయ్యిరువురిపోరు ప్రావృట్పయోదవృష్టిసమశరసంపాతబంధురంబై శృంగసముజ్జ్వలమహోత్కలహతుల్యంబై వివిధశస్త్రాస్త్రప్రచారనిష్ఠురంబై యొప్పె. అప్పుడు గురుసుతుం డేచి సవ్యసాచిపయిఁ బంద్రెండునిశితకాండములను హృషీకేశునిపయి దశవిశిఖములనుం బరఁగించినం బ్రహసభాసురవదనుండై విష్వ చ్చుఁడు గురుసుతసమ్మానతాత్పర్యమున ముహూర్తమాత్రము బిట్టేయ నెల్లక యూరకుండి మృదుపూర్వంబుగాఁ గడంగి యంత నగ్గలిక మెఱసి యగ్గురుసుతు నితేరు రథ్యసారథిసహితంబుగా భంజించుటయు హతాశ్వమగురథముననె యుండి భారద్వాజనందనుం డించుక నగుచు నర్జునుపై హేమపట్టమండితం బైనము సలం బేసె. ఏసినం గిరీటి దాని నేడుతునియలు గావించినం గినిసి ద్రౌణి నగేంద్రశిఖరోపమం బైనపరిఘ మేయుటయుఁ గవ్వడి సాయకపంచకమున దానిని ఖడించి మనదెసరాజులమనంబులు తల్లడిల్ల నేలఁబడం ద్రోచి భల్లత్రయమున నయ్యాచార్యసుతు నడిచిన నాతండు గాఢవిద్ధుండై క్రీడిం గ్రేడించి యరిగె.

**అశ్వత్థామ సురథుఁ డనుపాంచాలకుమారుం జంపుట.**

అవ్విధమునఁ గ్రీడిం గ్రేడించి యరిగి యశ్వత్థామ సురథుఁ డనుపాంచా లకుమారునిపై నడరి శరపరంపరలు పరఁగించిన నాతండు రథనేమినిస్వనంబు ధనుర్గుణక్వణనంబునుం గావించుచు మాఱుకొని జ్వలనాశీవిషనిభము లగుశర వ్రాతములం బరఁగించుటయు దండాహతం బైనకృష్ణసర్పముపగిదిఁ గోపదీపి తుండై యాచార్యసుతుండు లలాటతటఘటితవికటత్రిశిఖభ్రుకుటిబంధురుండై నారి సారించి దొడ్డనారసం బరిఁబోసి యేసిన నాసురథుఁడు విదీర్ణవక్షుండై వజ్రాహతం బైనగిరిశృంగముభంగి ధరిత్రిం దొరుఁగుటయుఁ దదీయస్యందనం బధిరోహించి హతశేషు లగుసంశప్తకులు పరివేష్టింపఁ ద్రివిష్టపపతిసుతుం దాఁకి వీఁక మెఱయుటయుఁ గిరీటియుఁ గోపాటోపదీపితుండై యడరుటయు దేవదానవ సమరసమం బైనదారుణరణంబు సెల్లుచున్నంత మధ్యాహ్నం బయ్యె. దుర్యో ధనుఁడు ధృష్టద్యుమ్నునిఁ దాఁకి శరవర్షంబుఁ గురిసి మఱియుఁ బంచాశుగము లడరించినొంచిననప్పాంచాలవరుండు డెబ్బదిబలుతూపుల నాతని నొవ్వనేయు టయు నన్ననెవ్వు వెలిసి నీకొడుకులు బహుళసేనాపరివృతులై యతనిం జుట్టుముట్టిన నాతండు సరకుసేయక తనయస్త్రలాఘవంబుఁ జూపుచు నాహవ క్రీడసలిపె. ప్రభద్రకులతోడఁ బెనఁగుచున్నకృపహార్దిక్యులపై నడరి శిఖండి పటుకాండజాలములఁ బరఁగించిన వారును గడంగుటయుఁ బరమభీకరం బైనసమ రంబు సెల్లె. శల్యుఁడు పాండురాజనందనులను సత్యకసుతునిం దలపడి బరవ సంబు వాటించి కోల్తలచేసిన నందఱు నప్పు డాతనిం గడవ నేరకున్నంత నకు

లుఁడు ధర్మనందనునెవ్వ గని మేనమామపయిం బటుకాండజాలం బడరించి దరహాసభాసురుండై దశవిశిఖములఁ దదీయస్తనాంతరమునం గీలించుటయు నమ్మద్రపతి గాఢపీడితుండై నతపర్వము లగుమూడుతూపుల నాతని నెంచె. అప్పుడు ధర్మజభీమసేనసహదేవసాత్యకులు రథనేమినిస్వనమున దెసలు పూరటిల్లఁ జేయుచుఁ బుడమిఁ జలింపఁజేయుచు నమ్మద్రరాజుపయిం గవిసిన నాబిరుదుమగండు యుధిష్ఠిరసహదేవుల మూడుమూడువాఁడితూపులను భీము నైదువాలమ్ములను సాత్యకిని నిశితశరశతమునను నెప్పించి క్రమ్మఱ నిగిడిననకులునిచాపము క్షురప్రమునఁ దునిమె. ఒండువిల్లు గొని నకులుండు మద్రరాజురథము శరజాలసంవృతముఁ గావించుటయు యుధిష్ఠిరుఁడును సహదేవుఁడును బదేసివాలమ్ములతనియురమున నాటినం బవనతనయుండు మష్టిశిలీముఖములను సత్యకాత్మజుఁడు దశవిశిఖములనుఁ బరఁగించిరి. అంతల కలిగి మద్రరాజు తొమ్మిదివాలమ్ములును డెబ్బదికాండములను సాత్యకిపై నేసి యతనిచాపంబు ముష్టిఁ ద్రుంచి గుఱ్ఱముల నాలుగింటిని సమయించి శరశతం బమ్మాధవానుజుమేనం జొనిపి కవలను యుధిష్ఠిరభీమసేనులనుం బ్రత్యేకంబ పదిపదియమ్ముల నెంచుటయు నతనిపరాక్రమం బద్భుతప్రకారం బయ్యె. అత్యంతపీడితులైనపాండవులం గాంచి శల్యుపయిం గోపించి సాత్యకి సవిశేషకల్పితం బైనయొండుతేరెక్కి మత్తమాతంగముపయిం గవియుమదేభముచందమున నమ్మద్రపతిపయి నడరి చూప ఘోరుశక్రశంబరరణోపమంబని పిచ్చలింపఁ బేర్చి దశవిశిఖముల నతనిపైఁ బరఁగించి నిలునిలుమని యదల్చుటయు నమ్మద్రరాజు గాఢవిద్ధుండై సాత్యకిపయి శాతసాయకాసారంబు నిగిడించినం బాండవులు మాతులజిఘాంసామసీమంజేసి యడరి యంతరిక్షమెల్ల బాణమయంబు గావించుట మేఘచ్ఛాయపోలె శరచ్ఛాయ నిబిడంబై నెగడినం బరమసమ్మర్దం బయ్యె. అందఱు తనపై నిగిడినను జలింపక యుడివోవనిచలంబున నడరి శల్యుండు శక్రపరాక్రముండై చూచు ఖేచరులగ్గింప నప్రతిహతప్రచారుండై కోల్తల చేయుటయు నొహటించి పాండవానీకంబు భీముఁడు వారించినను నిలువక వెఱచఱచి పఱచె. ధనంజయుఁ డొండుకడఁ గృపకృతవర్మల మార్కొని పోరుచుండుటంజేసి యెయిది తఱుమ నయితి గాదయ్యె. అట్టియెడ శకుని సహదేవుం దలపడిన నాతని కాతనితోడిపోరు భరం బయ్యె. శిఖండి యప్పటికిఁ దఱిసినయాచార్యసుతుం బొదివె. ద్రౌపదేయులు సన్నిహితరాజలోకంబు మార్కొనిరి. భీముఁడు గదాపాణియై దుర్యోధనునిమీఁదఁ గవిసె. నకులుడు లాఁతితోడికయ్యము దన కొదవుటయు మద్రపతివిక్రమంబుఁ జూచుచుండె. యుధిష్ఠిరుండు సేనాపరివృతుండై శల్యుని మార్కొనిన నాతండు చంద్రునిఁ బీడించుశనైశ్చరునిపగిది నయ్యజాతశత్రునిఁ

శరసంపాతమునఁ బీడించుచు దుర్యోధనుఁ గ్రేడించి వచ్చినవృకోదరుపయి శరజాలంబుఁ గురిసి యెక్కుడఁ జూచినం దానకానగపడి లాఘవంబును గృతాస్త్రిత్వంబును నేర్పడం బోరుటయుఁ బాండవసైనికు లత్యంతభీతులై శల్యునిముసమునఁ గాలు నిలుపనోపక ధర్మరాజు వారించుచున్న నామాటలం బెడచెవిఁ బెట్టి యుత్సాహం బెడలి సాహసంబు సడలి కయ్యముడిగి విఱిగి పఱచిరి.

అవ్విధమున దీనదశకు వచ్చిననిజసైన్యంబుఁ జూచి ధర్మరాజు క్రోధవశుండై పౌరుషంబు వాటించి శల్యుంజంపవలయు నాతనిచేఁ జావవలయు నింతియకాని యొండు గాదని నిశ్చయించి తమ్ములను వాసుదేవునిఁ దక్కినరాజలోకంబునుఁ బిలిచి యిట్లనియె. భీష్మద్రోణకర్ణప్రముఖు లగువీరులను మీరందఱు భాగప్రకారమునఁ బౌరుషము వాటించి వధించి కృతార్థుల రైతిరి. నాపాలికిఁ బెట్టినశల్యుఁ డొక్కరుఁడు మిగిలి యున్నవాఁడు. ఆతని నేఁడు వధింప నేను బూనుచున్నవాఁడను. మద్రపతిని నేను వధించుటయొండె నతనిచేఁ జెగుటయొండెఁ గాఁగలయది. మీ కందఱకు మేలయ్యెడి. ఇంతయు నిక్కువంబు నకులసహదేవులు నాకుఁ జక్రరక్షకులయి నడువవలయు. సాత్యకిధృష్టద్యుమ్నులు దక్షిణోత్తరపక్షములను ధనంజయుండు వెనుకటిదెసను భీమసేనుఁడు పూర్వభాగమునను నాకుఁ గావలియై నడువవలయు. వెండియు నానాసాధనములు నా తేరిపయిం బెట్టింపవలయు. ఇట్టులైన నేనధికుఁడనై మాతులుఁ డగుమద్రరాజునుఁ బరిమార్పఁజాలుదు ననుటయుఁ బాంచాలసోమకమత్స్యచేదిప్రభృతివీరు లమ్మనుజనాథుప్రతిజ్ఞ విని ప్రహర్షసంభరితులై శంఖభేరీప్రముఖవాదిత్రముల మ్రోయించి దిక్కులు పిక్కటిల్ల సింహనాదములు గావించిరి. అంత యుధిష్ఠిరుఁడు కరిఘంటానాదంబును దూర్యరవంబును శంఖధ్వానమును దిక్తటంబులఁ బూరింప బహుళసేనాసమన్వితుండై శల్యునిపయిం గవియుటయు సమరశ్లాఘి యైనయమ్మద్రనాయకుఁ డతనిం దలపడి శరవర్షంబుఁ గురియుటయుఁ దోడన దుర్యోధనుండును నక్కౌంతేయాగ్రజుని మార్కొని ద్రోణోపదిష్టము లగువివిధప్రకారములం జూపుచు లాఘవసౌష్ఠవచిత్రత్వములు మెఱయఁ బోరుచున్నంత భీమసేనుఁ డక్కురుక్షమాధ్యక్షుపయిం గవిసిన నయ్యిద్దఱు నామిషలోలుపంబు లగుబెబ్బులులపగిదిం బోరిరి. సాత్యకిధృష్టద్యుమ్నులును మాద్రేయులును గాంధారరాజప్రముఖులం దాఁకినఁ బరమతుములంబైన సమరంబు సెల్లె. దుర్యోధనుఁడు వృకోదరునిఁ దాఁకి శితశరమునఁ గింగిణీజాలభాసురంబైనకేతనంబుఁ గూల్చి యొండువాలమ్మున విల్లు దునిమినం గోపించి కీచకారాతి నీతనయునురమున శక్తి నేయుటయు నాతండు మూర్ఛిల్లి తేరిపయి నొఱఁగఁబడియె. అట్లు నీపెద్దకొడుకు సోలుటయు నొండువిల్లుగొని వృకోదరుఁడు వాఁడి

కుప్పకోల యొక్కండు వేగంబ యరింబోసి తత్సారథితలఁ దఱుగుటయు గుఱ్ఱ
ములు తేరీడ్చుకొని పఱచిన మనబలమున హాహాకార మెసఁగె. అప్పు డశ్వ
త్థామయుఁ గృపుఁడును హార్దిక్యుఁడును భవదగ్రసుతుపరిత్రాణార్థంబు గవియు
దెంచినం జూచి సవ్యసాచి గాండీవజ్యాఘోషభీషణంబుగ వారిపై నడరె.

### ధర్మరాజు శల్యుని విరథుం జేయుట.

అయ్యవసరమున యుధిష్ఠిరుఁడు పరమసంరంభసముద్రేకబంధురుండై
యడరి మృదుపూర్వంబుగను దారుణోత్తరంబుగనుం దనరి వివృత్తనేత్రుండై
కోపవేపమానుండై నిశితభల్లనికరములఁ బరఁగించుచు నెక్కడఁ జూచినం దాన
కా నగపడుచు మద్రపతిమునుమును బయలు గావించి యట నెల్లచోట్లం దిరు
గుచు గజతురగస్యందనపాదాతవ్రాతంబుల ధరం దొరఁగించి లయకాలరుద్రుని
మాడ్కి రౌద్ర మెలర్పఁ గొలుమసంగి యట శల్యునిపయిం దలపడి పటుప్రద
రనికరములఁ బరఁగించి మామా నిలునిలుమని యదల్చిన నాతండును వాలంప
గములఁ గురియుచు నడరిన నయ్యిరువురు పరస్పరశరక్షతగాత్రులై నెత్తుటం
జొత్తిల్లి పూచినబూరుగులతీరునంజూడ నొప్పుచున్నంతఁ దుల్యప్రకారం బైనయ
మ్మద్రరాజధర్మరాజులపోరు సూచి జనులుధర్మజుఁడు శల్యుం జంపి సామ్రాజ్యము
సాధించునో శల్యుఁడు ధర్మరాజును వధించి దుర్యోధనునకుఁ బట్టంబుఁ గట్టునో
యని పలుకుచు జయము నిశ్చయింపఁ జాలరైరి. అప్పుడు సర్వంబును ధర్మ
జునకుఁ బ్రదక్షిణం బయ్యె. అంత శల్యుఁడు యుధిష్ఠిరునిపయి శరశతంబుఁ
బ్రయోగించి విల్లు ద్రుంచుటయుం గోపించి పాండవాగ్రజుం డొండుకోదండము
గొని మున్నూఱువాలమ్ములు శల్యుపయిం గీలించి యొక్కక్షురమునఁ గార్ముకము
ఖండించి గుఱ్ఱముల నాల్గింటినిం బరిమార్చి నిశితాగ్రము లగురెండమ్ములఁ
బార్ష్ణిసారథుల సమయించి యొక్కభల్లమున నతనికేతనంబుఁ గూల్చుటయు నశ్వ
త్థామ రయమునం జనుదెంచి యమ్మద్రరాజునుఁ దనయరద మెక్కించికొని
తొలఁగించుటయు నంబుదపటలంబుఁ దెరలించుమారుతంబుచందమునను బహు
గణములం జెండాడురుద్రునికైవడినిం గొలుమసంగినయప్పాండవాగ్రజునెదురఁ
గాలు నిలుపనోపక ప్రాణరక్షణతాత్పర్యమునమనసేన విచ్చి పఱచె. అంత సవిశేష
సన్నాహకల్పితోపనీతం బైనయొండుతేరెక్కి మద్రరాజు ధర్మరాజునుఁ దాఁకి
సింహనాదంబొనర్చి పేర్చి యతనిపై వాలంపసోనఁగురిసి సాత్యకినిఁ బదితూపు
లను భీమసేనసహదేవులను వేఱువేఱ మూఁడుమూఁడుసాయకంబులను నొప్పించి
కొఱవుల నేనుఁగుల నెట్టులట్టుల తక్కినవారలం బలుతూపులఁ బీడించి బహుళ
చతురంగములఁ బరిమార్చి కేతనజాలములఁ గూల్చి రణయజ్ఞవేదికి దర్భాస్తర
ణంపుసొంపు గావించి యంతకాకారమునం బొల్చుటయు భీమసేనసైనేయమా

ద్రేయయుధిష్ఠిరులు పాంచాలసోమకానీక పరివేష్టితులై యడరి యమ్మద్రపతి పయిం బటుప్రదరనికరములఁ బరఁగించిరి. అప్పుడు వారితోడ్పాటునం గసిమసంగి ధర్మరాజు మద్రరాజుస్తనాంతరమున శరత్రయము నాటుటయుఁ బాండవవీరులకోలుతల సూచి దుర్యోధనుడు పాండవశరార్దితుం డై నశల్యునికిఁ దోడ్పడఁ బెక్కండ్రువీరులఁ బంపుటయుఁ దత్సహాయుండై యమ్మద్రనాథుఁడు ధర్మనందనుపయిం గాండసప్తకంబుఁ గీలించిన నక్కౌంతేయజ్యేష్ఠుండు శౌర్యగరిష్ఠుండై శరనవకం బేసిన నంత నయ్యిద్దఱు మహేంద్రవజ్రనిర్ఘాతసంకాశం బైన జ్యాఘోషం బెసంగ సంజాతదర్పభరమునం జేసి యామిషలోలుపంబు లగుక్రోల్పులులతెఱంగున నెక్కువతక్కువలు లేక పోరుచున్నంత శల్యుం డేచి సూర్యానలప్రభం బైనయొక్కమెఱుంగుటమ్ము ధర్మజునురమ్మున నాటె. నాటిన నెవ్వక కోపించి పాండవాగ్రజుండు తీవ్రాఘాతం బైనయొక్కశరమున మద్రపతిం బిట్టేయుటయు నాతండు మూర్ఛితుండై కొండొకవడికిఁ దెలిసి క్రోధారుణితలోచనుండై శరశతంబు పృథాసూనునిపై నేయుటయు నయ్యజాతశత్రుఁడు తొమ్మిదివాలమ్ము లతనియురమ్మున నాటి యాఱువాఁడితూపులం గత్తళంబుఁ జించె. అందుల కలిగియు లేనిసంతోషంబుఁ దెచ్చికొని శల్యుఁడు ధనుర్గుణక్వణనంబుఁ గావించి శరద్వయమున ధర్మరాజువిల్లు దునుముటయు నయ్యుధిష్ఠిరుండు వినూతనంబు పరమఘోరంబు నగుకార్ముకాంతరం బెత్తి మహేంద్రుఁడు నముచిం బోలె శల్యుం బెక్కమ్ముల నొప్పించె. నొప్పించినం గినిసి శల్యుఁడు విశిఖనవకంబున ధర్మజభీమసేనులమైమఱువుఁ బ్రఱువుల్లు గావించి సూర్యాగ్నిప్రకాశం బైనయొక్కక్షురమున నజాతవైరిచాపంబు ఖండించుటయు నంతలో శారద్వతుండు శరషట్కమున సారథిం దునిమె. అట్టియెడ ధర్మరాజు తాన రథచోదనంబుఁ జేయఁ దొడఁగుచున్నంతఁ గడువడిం బేర్చి శల్యుఁడు శరచతుష్టయమున హయచతుష్టయమునుం జంపె. అట్లు ధర్మరాజు హతసారథియు విగతరథ్యుఁడున యినం గోపించి భీమసేనుఁడు తీవ్రశరమున నమ్మద్రేశుకార్ముకముఁ ద్రుంచి వాలమ్ములు రెండతనిమేనం గీలించి యొండుబాణమున సారథితల నఱికి గుఱ్ఱముల నాల్గింటినిఁ బరిమార్చి శితశర మతనిపై నడరించుటయుఁ దోడన కవలును బలుతూపులు నిగిడించిన నాతండు సోలుటయు భీముఁ డవ్వీరునిమైమఱువు వఱువుల్లు గావించె. అంత నక్షత్రసహస్రచిత్రితం బైనపలకను వాలునుం గొని స్యందన మెఱంగి నకులునితేరికాఁడి నఱికి ధర్మరాజుమీఁద నిగిడించి యంతకాకారమునం బొల్చునమ్మద్రనాయకుపై ధృష్టద్యుమ్నశిఖండిద్రౌపదేయశైనేయులు కవిసిరి. అప్పుడు భీముఁడు సాయకనవకమున నతనికేడెము ఖండించి నిశితభల్లములం గృపాణము ముష్టికిఁ ద్రుంచుటయుఁ బాండవసైన్యమున సంతోషవిశే

షమునం జేసి సింహనాదములును శంఖారవములు నెసంగె. మనమూఁకలెల్ల విచ్చి పఱచె. పఱచినం గినిసి మద్రరాజు మనమునం బేర్చినకోపమునం జేసి ద్విగుణితం బైనకడిమి మెఱసి మృగములమీఁది కరుగుసింగము తెఱంగునఁ బాండవజ్యేష్ఠునిమీఁది కడరె.

### ధర్మరాజు శక్తిఁ బ్రయోగించి శల్యుని వధిచుట.

అంత ధర్మనందనుండు పరమసంరంభసముద్రేకబంధురుండై ప్రజ్వలితజ్వాలనుపగిదిఁ దేజోదుర్నిరీక్షుండై శల్యుఁడు తనపాలుగాఁ దమలో నేర్పఱుచు జనార్దనువచనంబుఁ దలపోసి తద్వధంబు కర్తవ్యం బని నిశ్చయించి కన్నుల నిప్పులు రాలఁ జూచె. పరమపావనుఁ డైనయాధర్మనందనుకోపానలమునం గ్రాఁగియమ్మద్రపతి భ్రమందిపోవమి నాకుం జూడఁ జిత్రంబయ్యె. అట్టు లుగ్రకోపనసమగ్రుండై ధర్మరాజు హతాశ్వం బైనయారథముమీఁదనయుండి హేమదండమువుమణిదీపితముకాలరాత్రితుల్యము యమధాత్రీసదృశంబు బ్రహ్మదండసంకాశం బధర్వాంగిరసకృత్యాసమానంబు సంవర్తకాలప్రకాశం బమోఘము భూమ్యంతరిక్షాదిస్థితభూతజాలంబు సంహరింప నీశా నార్థము త్వష్టృనిర్మితంబు ఘంటాజాలసముజ్వలంబు గంధపుష్పనైవేద్యాదిసమ్యగర్చితంబు బ్రహ్మద్విదంతకరంబు నగునుత్తమశక్తిం గొని ఘోరమంత్రములఁ బ్రయత్నపురస్సరముగ సభిమంత్రించి నిజపీనాయతబాహుదండము సాఁచి విసరివేయుటయు నాజ్యధారాసేకజ్వలితం బైనవహ్నిశిఖవోలె వెలుంగుచుఁ బయింబడినయాశక్తితాఁకునం జేసి శల్యుండు శిథిలసంధిబంధనుండై విదీర్ణహృదయుండై నాసికానేత్రశ్రోత్రవక్త్రకుహరంబుల నెత్తురు గ్రక్కి స్కందహతం బైనక్రౌంచగిరిచాడ్పునం జూడనొప్పి మైమఱు వఱవఱలుగా నేలం బోరగిలఁబడి బాహువులు సాఁచి పెద్దకాల మనుభవించినభూకాంతను బ్రేమానుబంధమున నిండుకౌఁగిట బిగియించినరీతిం గన్పట్టె. అట్లు ధర్మానుబంధబంధురముగ ధర్మనందనశక్తిప్రయోగనిహతుండై శల్యుఁడు యజ్ఞవేదీమధ్యమున హోమాంతమున శాంతుఁ డైనవైశ్వానరుకరణి రణక్షోణిం జూడనొప్పి విగతాసుఁడయ్యుఁ జెన్ను గొంచెమేనియుఁ దఱఁగినతెఱఁగునఁ దోఁపమి చిత్రం బయ్యె. అవ్విధమున శల్యుని వధియించి ధర్మరాజు పన్నగవిధ్వంసనోదగ్రుం డైనసుపర్ణునిచీఁక మెఱసి మనమూఁకలం జీకాకుపఱచుచున్నంత శల్యానుజుం డగ్రజునకుఁ బ్రీతిఁ గావించుతలంపున ధర్మరాజు పయిం దలపడి పటుమార్గణము లడరించుటయుఁ గౌంతేయాగ్రజుండు రయమునం బేర్చి యాఱువాలమ్ము లతనిపై నేసి క్షురద్వయమునఁ గార్ముకకేతనములం ద్రుంచి యొక్కనిశితభల్లమునఁ దలఁ దఱుగుటయుఁ గుండలప్రభావిభాసమానం బైనతన్మస్తకంబు పుణ్యక్షయం బగుడు నాకలోకమునుండి పడువిమానము

పగిది రక్తసంసిక్తంబై ధరిత్రిం బడుటయుఁ గౌరవసైనికులు హాహాకారము లొనరించుచు విఱిగిపఱచుటయు వారల వెన్నడించి తఱిమి సాత్యకి సాయకాసారం బడరించుటయుఁ గృతవర్మ యమ్మాధవానుజుం దలపడిన నావృష్ణివీరు లిరువురు నుడివోనిచలంబునను బలంబునను మెఱసి రవికిరణప్రభము లైనయాశుగములఁ బరఁగించి యంతరిక్షమెల్ల నిజశరమయము గావించిరి. అంత హార్దిక్యుం డేచి సత్యకసుతుపయి దశవిశిఖములఁ బరఁగించి మూఁడువాఁడియమ్ముల గుఱ్ఱముల నొనేసి యొక్కతూపున విల్లు దునుముటయుఁ బరమవేగమున నొండువిల్లెత్తి సత్యకనందనుండు పదివాలమ్ము లాహృదికనందనునురమున నాటి నిశితభల్లముల రథయుగేషాదండముల ఖండించి రథ్యములం దెగటార్చి పార్ష్ణిసారథులం బరిమార్చుటయు విరథుఁడై నయాకృతవర్మునిఁ గృపాచార్యుఁడు తనతేరెక్కించుకొని తొలఁగించె.

అవ్విధమున మద్రరాజు హతుఁడగుటయుఁ గృతవర్మ విరథుఁడగుటయు మనబలమెల్లఁ బరాఙ్ముఖం బగుటయుఁ దత్కాలసముత్థితరేణుజాలమునంజేసి యేమియుఁ గానఁబడకుండినం గొండొకవడికి రక్తప్రవాహసాంద్రత్వమునంజేసి యాధూళి యడంగె. అప్పుడు చూచి యాదుర్యోధనుండు తా నొక్కరుండ పాండవుల నాఁగువాఁడై ధృష్టద్యుమ్నప్రముఖులం దలపడ నుంకించుచున్నంతఁ గృతవర్మ యొండుతే రెక్కి క్రమ్మఱి వచ్చుటయు యుధిష్ఠిరుండు శరచతుష్టయమునఁ గృతవర్మగుఱ్ఱములం జంపి కృపునిపై శరపటృంబు నిగిడించె. అప్పు డశ్వత్థామ కృతవర్మను నిజరథ మెక్కించికొని తొలఁగించుటయుఁ గృపయుధిష్ఠిరులకుఁ బోరు ఘోరం బయ్యె. యుధిష్ఠిరుఁడు విక్రమించి యింద్రుఁడు వృత్రుంబోలె శల్యుం బరిమార్చుటకుఁ జూచుఖేచరు లగ్గించిరి. పాండవసైన్యంబున శంఖారవములును సింహనాదములును ధర్మనందనప్రశంసావచనంబులును నింగిముట్టె. అట్టియెడ మద్రసైనికులు సప్తశతరథములవారు బలము తొలంగి పోవుటయు దుర్యోధనుండు పర్వతనిభం బైనమదేభ మారోహించి శ్వేతాతపత్రభాసురుండై చామరవీజనసముల్లసితుండై తాను వారలం బేరెలుంగెత్తి పిలిచి పాఱిపోవల దిది క్షాత్రంబు గాదనుటయు బరవసంబుచేసి వారు ధర్మరాజుపయి ధనుర్గుణక్వణనపరిపూరితరోదసీకుహరంబుగాఁ గవియుటయు నర్జునుండు గాండివంపునారి సారించుచుఁ దలపడినం జూచి వృకోదరుండును గవలును సాత్యకియు ద్రౌపదేయులును ధృష్టద్యుమ్నశిఖండులును బాంచాలసోమకానీకపరివృతులై యుధిష్ఠిరునకు బాసటయై యడరి సాగరంబుఁ గలఁచుమహామకరప్రకరములచందమునను బాదపసంఘాతంబు భంజించునుదగ్రమారుతమువిధమునను గోలుమసంగినం బురోవాతవిధూననంబున సంక్షోభించుగంగాప్రవాహంబుకై

వడిం బాండవసైన్యంబుఁ గలంగ మద్రవీరు లెక్కడ యుధిష్ఠిరుఁ డెక్కడ నత
నితమ్ములని పలుకుచుఁ గవియుటయు ధృష్టద్యుమ్నశైనేయద్రౌపదేయశిఖండిసా
త్యకులు వారల నాఁగి తేరులు భంజించియుఁ గేతనములం గూల్చియు వాహన
ములం జంపియు బీభత్సంబుఁ జేసినం గురువల్లభుం డెంత చెప్పినను వినక మద్ర
సైనికులు పఱచుటం జూచి శకుని దుర్యోధనున కిట్లనియె. మహారాజా, మన
యెదురఁ బాండవులు మద్రసైన్యము మర్దించుచుండ నేల చూచుచు నూరకున్న
వాఁడవు. పోరెడువారి కెవ్వరేనియుఁ దోడుపడవలయు నని నేఁడు మనము
చేసికొనినసమయమున కిది విరుద్ధము గాకుండునే? పరులు మనవారలఁ జంపు
చుండ నూరకునికి నీకుఁ బోలునే యనవుడు దుర్యోధనుఁడు నావచనము విననీ
యీమద్రకులకుఁ దోడుపడ నేల యని యూరకున్నవాఁడ నని పలికినం గాంధా
రరాజు భవత్తనయునకు మఱియు నిట్లనియె. రణమున సైనికులు భర్తృశా
సనంబు సేయరని వారి నుపేక్షించుట విజిగీషుం డైనరాజునకుఁ బోలదు. ఒప్పరి
కించి చూడ నిది తఱియే? మనమందఱమును బహుళసేనాసమన్వితులమై మ
ద్రకులకుఁ దోడుపడవలయు. క్రోధము విడువుము. కయ్యమునఁ దమలోనిట్లు
భేదము పొసఁగినం గార్యంబు నెఱవేఱునే యనుటయు శకునివచనం బగ్గించి
యగ్గలించి దుర్యోధనుండు సైనికులం బురికొల్పి బరవసంబు వాటించి కొట్టుఁడు
ముట్టుఁడు పొదువుఁడు నఱుకుఁడను నులివులు మిగులఁ బాండవులపయిఁ దలపడు
టయు వారును మధ్యమగుల్మాస్థితులై శరాసారపురస్సరంబుగ నడరినం బోరు
ఘోరం బగుటయు విఱిగిన తేరులను గూలినసిడములను మడిసిన యేనుఁగులను
సమసినగుఱ్ఱములను జచ్చినకాలుబలంబునను బుణ్యక్షయం బగుడు స్వర్గచ్యుత
పుణ్యాకారులరీతిం దేరులనుండి పడువీరరథికులయొడళ్లప్రోవులను గబంధసంఘా
తంబునను హస్తాహస్తిసమరవిశారదు లగుజగజెట్లకళేబరంబులను నత్యంతసాం
ద్రంబై కయ్యంపునేల పీనుంగుపెంటయై యత్యంతబీభత్సంబై కన్పట్టె. అవ్వి
ధమున విజయవంతు లగుపాండవులకోల్తల కోహటించి మద్రకానీకంబు విఱిగి
పఱచుటయు దుర్యోధనునకుఁ గూర్పవలను గాదయ్యె.

మద్రరాజు హతుఁడగుటయు భవత్తనయులును దక్కినమనవారును
నిరుత్సాహులై విముఖులై సాగరమధ్యమునం గలం బవియ దిక్కుదోఁపక
గట్టు సేరనేరక తల్లడించుబేహారులవిధమునను సింహార్దితము లగుమృగగణముల
తెఱంగునను గొమ్ములు విఱిగినయాఁబోతులరీతిని శీర్ణవిషాణంబు లైనదంతావ
ళంబులవిధమునను దైన్యంబుఁ జెంది భీష్మద్రోణకర్ణులు పడినప్పటికంటె నెక్కు
డుశోకభయములు గదిరినమనంబులతో జయమునెడ నిరాశులై యుండ మన
దెసయోధు లందఱును బాండవులకు వెఱచి పఱచుటయుఁ దదీయసైనికులు

హార్ద్వఘోషములను సింహనాదములను శంఖారవములనుం గావించుచు నేఁడు గదా ధర్మరాజు సత్యధైర్యుఁడు హతామిత్రుఁడు నయ్యె. దుర్యోధనుఁడు రాజ్యలక్ష్మీరహితుం డయ్యె. ఇఁక మిగిలినదుర్యోధనుపాటును విని ధృతరాష్ట్రుఁడు వనటం గుందుచు నేలంబడి పొరలుచుఁ గౌంతేయసామర్థ్యంబును దనదుర్బుద్ధిని విదురవచనంబును బాండవులకుఁ దాఁ బెట్టినయాయాసములను గృష్ణునిమహిమంబును నర్జునదివ్యాస్త్రబాహుబలవీర్యంబులను భీమసేనుబలంబును దలంచును. దుశ్శాసనవధమున భీమసేనుఁడు చేసినపని సేయ లాఁతివాని కలవియగునే? కవలు గాంధారులం బరిమార్ప నంతయుఁ దెల్లం బగు. ధనంజయుఁడు పోరువాఁడైనం గొంత గల్గునే? సాత్యకిధృష్టద్యుమ్నశిఖండిమాద్రేయద్రౌపదేయు లసదులే? జగన్నాథుఁడైనవాసుదేవుఁడు సర్వకార్యములు నిర్వహింపఁ బూనియుండఁ బాండవులకు విజయంబు సిద్ధం బని సందేహింప నేల? భీష్మద్రోణకర్ణశల్యాదులఁ దెగటార్చినపాండవులకు సాటి వచ్చుశూరులు లోకమునఁ గలుగుదురే? సత్యధర్మనిరతుం డైనధర్మనందనున కేమిటం గీడు గలుగదని యిట్లు బహువిధములఁ దమలోఁ బలుకుచున్నంత నివాతకవచాంతకుండును గిమ్మీరవైరియు మున్నగుపాండవవీరులు భండనోత్సాహమునం గడంగిరి. సాత్యకియు మాద్రేయులును శకునిపై నడరిరి. వడముడికి వెఱచి విఱిగి పఱచుచున్ననిజసైనికులం జూచి లేనిమందహాసము మొగమునఁ దళుకొత్తఁగ దుర్యోధనుఁడు తనసారథిం బిలిచి ధనుష్పాణి యైననన్ను మిగిలి కిరీటి చననేరఁడు. సైన్యములపిఱుంద మనతేరు వోనిమ్ము. వేల సముద్రము నెట్టులట్టుల యప్పాండవమధ్యముని నిలువరించెద. అల్లదె ధనంజయపరాక్రమమునం జేసి మన మూఁకలు గలంగినం బరాగం బెగసి మిన్ను ముట్టుచున్నది. తదీయఘోరక్ష్వేళారవములును వినంబడుచున్నవి. ఏను మార్కొని వారల నాఁగిన నస్మదనీకంబు క్రమ్మఱఁ బోరికి సమకట్టి నడుచునని నతం డట్లు చేయుటయుఁ దథావిధుం డైనకురుమహీవల్లభుం జూచి మనవార లేకవింశతిసాహస్రయోధులు దారకీర్తిం గోరుచు నడరినం బవనతనయుండును ధృష్టద్యుమ్నుండునుం దలపడుటయుఁ బరమసమ్మర్దం బయ్యె. అవ్విధమునఁ బ్రబలబలపరివృతులై చుట్టుముట్టి నీకొడుకులు క్ష్వేళితాస్ఫోటితపూర్వకంబుగ నెండుకథ మాని బరవసంబు చేసి నానాసాధనజాలంబు లడరించినం గొంచెమేనియుఁ జలింపక యవ్వాయుసూనుండు మైనాకగిరిచాడ్పున నచలుండై రథము డిగి గదాపాణియై యడరి కడిందిమగంటిమిం బేర్చి యెక్కుడుచలంబునం బొంపిరివోయి గదపండువు సేయుటయు నయ్యేకవింశతిసహస్రయోధులు రక్తసిక్తగాత్రులై నేలంబడి చండవాతభగ్నము లగుకుసుమితకర్ణికారమహీరుహములమాడ్కిం జూడ నొప్పిరి.

అవ్విధమున నయ్యిరువదియొకండువేలకాల్బలంబు తెగుటయు యుధిష్ఠిరపురస్సరులై పాండవవీరులు పెక్కండ్రు నీకొడుకుపై నడరుటయు నావీరుఁడుఁ వేలసాగరము నెట్టు లట్టుల తా నెక్కరుండ వారలనందఱ నాఁగుట యత్యంతాద్భుతం బయ్యె. అప్పుడు దుర్యోధనుఁడు విఱిగిపఱచుచున్నమనవారలం బిలిచి యిట్లనియె. శూరులారా, యెచ్చటి కేగెదరు. పఱచి కొండలను గుహలను డాఁగినంతమాత్రన కాలప్రాప్తం బైనమృత్యువు దప్పించికొనఁగ నేరికి వశంబు? కృష్ణార్జును లెంతయు డస్సియున్నవారు. తదనీక మల్పావశేషంబై యున్నది. ఏ నిప్పుడు కడంగి వారలఁ బరిమార్చెద. విజయంబు మనకు ధ్రువంబు. పాఱితప్పించికొందమన్నం బాండవులు వెన్నడించి రానేరరే? కావునఁ గాలప్రాప్తంబునకు వగవం బనిలే దని నిశ్చయించి పోరికిఁ గడంగుఁడు. వీరధర్మమున సంగ్రామతలంబునందు మృత్యువు గలిగనేని యది సుఖకరంబుగాని యొండుగాదు. క్షత్రియకులోత్పన్నున కింతకంటె ముఖ్యధర్మ మెద్దియుం గన్పట్టదు. కులపరంపరాప్రాప్తంబైనధర్మముఁ ద్యజింపవలదు. మగఁటిమి వాటించి పోరఁ జక్కనిల్చి గెలుపొండె వీరస్వర్గమొండె సాధింపుఁ డని తెలుపుటయుఁ దద్వచనం బభినందించి కురువీరులు వ్యూఢానీకులై నిగిడినం గాండివగుణఘోషభీషణంబుగా సవ్యసాచి యడరినం బోరు ఘోరం బయ్యె. సాత్యకిమాద్రేయులు గాంధారరాజుపయిం గవిసిరి.

దృష్టద్యుమ్నసాత్యకులు గజసహితంబుగ సాల్వుం జంపుట.

అట్టియెడ మ్లేచ్ఛగణేశ్వరుం డైనసాల్వుఁడు రోషసంరంభసముద్రేకబంధురుండై యైరావతసమం బైనయత్యుత్తమమత్తగజం బారోహించి నిశాంతమున నుదయగిరిశిఖరాధిరూఢుం డైనభాస్కరుండ్రు గేణిసేయుచుఁ బాండవానీకంబుపయిం గవిసి యయ్యేనుంగును బలువిధముల సేనలోనం గొలిపి నిశితశరాసారంబుఁ బరఁగించుటయు నైరావతారూఢుం డైనమహేంద్రునిమునుమున దానవు లెట్టులట్టుల కౌంతేయసేనాసంతానంబు వెఱచఱచి విఱిగి నలుదెసలం బఱచుటయు మనబలంబున నార్పులును శంఖారవంబులును నింగి ముట్టె. శత్రువిజయలక్షణం బైనతత్ప్రికారంబు సైరింపక పాండవసేనానాయకుం డైనధృష్టద్యుమ్నుఁడు జంభుఁ డింద్రాధిష్ఠితం బైనయైరావతముంబోలె నమ్మత్తకరిం దాఁకి పావకప్రభము లగుమూఁడునారసములు దానిమేనం గీలించి మఱియు దొడ్డనారసము లైదింటినిఁ గుంభస్థలంబున నాటుటయుఁ దత్ప్రహారమున నొచ్చి యయ్యేనుంగు జిఱ్ఱనం దిరిగి నిజబలంబు మర్దించుచుఁ జనియె. చనుటయు సాల్వుం డలిగి తోత్త్రాంకుశప్రహారంబుల నమ్మదవారణంబుఁ ద్రిప్పి ధృష్టద్యుమ్ను తేరిపయిం గొల్పుటయు నప్పాంచాలరాజకుమారుండు దానియురవడిం జూచి తటాలున గదాపాణియై తేరు డిగ్గుటయు నగ్గజం బగ్గలించి రథ్యసారథిసహి

తంబుగా నారథంబుఁ దొండమున నెత్తి నేలతో విసరి వ్రేసి నుగ్గుచేసి ధృష్టద్యు
మ్నునిపై నిగుడుచున్నంత బకాంతకుండును శిఖండియు యుయుధానుండును
దోడన యడరి యక్కుంజరంబుపై శాతసాయకనికరములఁ బరఁగించి నిలువరిం
చుటయుం గోపించి సాల్వుఁడు మెఱుంగుటమ్ములు వేనవేలు నిగిడించుటయుం
బాండవసైనికులు పెక్కండ్రు పఱచినం బరమాద్భుతం బయ్యె. అందుబలకు
హాహారవంబులు సేయుచుఁ బాంచాలమత్స్యసృంజయవీరులు పెక్కండ్రొక్క
మొగి నక్కరిం దాఁకి యాఁగుటయు ధృష్టద్యుమ్నుఁడు రయమున గదాదండ
మున నమ్మదవేదండము నడచుటయు నది విదీర్ణకుంభంబై నెత్తురు గ్రక్కుచు
క్షితికంపమున నద్రి యొట్టులట్టు లూఁగాడి నేలంబడుటయుఁ దోడన సాత్యకి శి
తభల్లమున నాసాల్వరాజుతలఁ దఱుగుటయు మనయనీకంబు సాల్వునిపాటు
చూచి వెఱచఱచి పెనుగాలికిఁ బ్రమాఁకు లెట్టు లట్టులు ప్రభగ్నంబయ్యె.

అవ్విధమున మనయనీకంబు విఱిగినం గినిసి కృతవర్మ తాను ముంగలియై
నడిచి విఱిగినవారలం బురికొల్పిన సింహనాదపురస్సరంబుగ నిరువాఁగునుం బోరి
కడరుటయు సాత్యకి వారలం దాఁకి సాయకసప్తకంబున క్షేమకీర్తిం బ్రభేతపురమున
కనిచి కృతవర్మపై నిగుడుటయు నయ్యిద్దఱు మేటిశూరులు సకలజనులకు నద్భు
తం బావహిల్లఁ దలపడి శలభవ్రజములట్టులు శరాసారములఁ బరఁగించి రోదసీమ
ధ్యంబు బాణమయంబుఁ గావించి యుడివోవనిమగఁటిమిం బోరునెడ హృదికా
త్మజుం డేచి సత్యకాత్మజుహయచతుష్టయమును నిశితశరచతుష్టయమున కెర సేయు
టయు నమ్మేటిమగండు సిడులు చూపినయేనుంగు తెఱంగునం గినిసి యెనిమిదివాల
మ్ములాతనిమేనం గీలుకొలిపె. అంతఁ గృతవర్మ యాకర్ణపూర్ణవిముక్తంబు లైన
శితపృషత్కముల మూఁడింట సాత్యకిని నొవ్వ నేసి యొక్కవాలమ్మునఁ జాపమ్ము
ద్రుంచుటయు నాశినిపుంగవుం డొండువిల్లు గొని దశవిశిఖముల నాకృతవర్మని
గుఱ్ఱములను సారథిని సిడమునుం గూల్చిన నాతండు క్రోధదుర్దాంతుండై శూ
ల మెత్తి యేయుటయు సాత్యకి దానిం దీవ్రశరముల ఖండించి నిశితభల్లమున
నాతనియురమ్మున నాటుడు నాకృతవర్మ విరథుండై నేలకు దిగుటయు మనవారు
వెఱపు గదిరినమనంబులతో బమ్మరించుచున్నంతఁ గృపుఁ డతనిఁ దనతేరెక్కిం
చుకొని తొలఁగించె. అట్లు కృతవర్మ విరథుఁ డగుటయు విచ్చి మనసైన్యంబు
పాఱుటం జేసి యెగసినధూళి రక్తసేచనంబున నడంగినం గని రారాజు తా నొక్క
రుండ పాండవబలంబుపయిం గవిసి ధృష్టద్యుమ్నశిఖండిద్రౌపదేయులను బాం
చాలసోమకసృంజయ కేకయానీకంబులను మాఱుకొని నిలువరించి యజ్ఞవేదిమ
ధ్యంబున మంత్రపూతుఁ డైనవైశ్వానరుఁ డెట్టు లట్టుల నిరుపమానతేజోవి భ్రా
జితుండై చూపట్టుచున్నయెడఁ గృతవర్మ యొండుతేరెక్కి తోడుపడియె.

## దుర్యోధనుఁడు పాండవానీకంబుపయిం గవిసి విజృంభించుట.

అవ్విధమున దుర్యోధనుఁడు పాండవబలముపయిం గవిసి బరవసంబుచేసి
కడిందిమగంటిమిం బేర్చి గుణంబు సారించి రేణుజాలంబులరీతి లెక్కయిడ నయి
తిగాని తెఱంగున బాణజాలంబు నిగిడించినఁ జతురంగముల నెక్కఁడేనియు దు
ర్యోధనువాలమ్ముల విక్షతిం బొందని విధంబు గన్పట్టదయ్యె. అప్పు డుభయబల
ములను రారాజునకు సాటివచ్చుమేటివిలుకాఁ డొక్కఁడు నున్నట్లు నాకుఁదోఁ
పదయ్యె. పాండవుల కందఱకు నతనిం గడవరామి యచ్యుతంబయ్యె. అట్లు
కోత్తలచేసి కురుక్షమాధ్యక్షుండు శరశతమున యుధిష్ఠిరుని సప్తతిసాయకముల
భీమసేనుని నలువదినాలుగుతూపుల నకులుని సహదేవద్రౌపదేయధృష్టద్యుమ్ను
లం బ్రత్యేకంబ యేడేసివాఁడియమ్ములను మార్గణత్రయంబున సాత్యకిని నొప్పిం
చి శితభల్లమున సహదేవువిల్లు దునుముటయు నప్పాండవానుజుఁ డొండు
విలుగొని దశవిశిఖముల దుర్యోధనుపయిం బరఁగించుటయు నకులుఁడు తొమ్మి
దివాలమ్ము లతనిమేనఁగీలుకొల్పియార్చె. అట్టియెడఁ దోడన సాత్యకి యొక్క
తీవ్రశరమును ద్రౌపదీసూనులు త్రిసప్తతిసాయకములను యుధిష్ఠిరుఁడు పంచా
శుగములను భీముఁ డశీతిశిలీముఖములను నిగిడించిన నాతఁ డించుకేనియుఁ జలిం
పక లాఘవసౌష్ఠవములు మెఱయ వీరోద్రేకంబు నెఱయ నెంతయుం బేర్చి త
న్మార్గణంబులకు మాఱేయుచున్నంత మనదెసఁ జేయంగలవీరులు వారలపై నడ
రుటయుఁ బ్రావృట్కాలమునందలిసముద్రసంక్షోభముమాడ్కిఁ బరమఘోరం
బైనసమ్మర్దంబు సెల్లె. అప్పుడు ద్రోణసుతుండు భీముం దాఁకిన నయ్యిరువురు
నత్యంతక్రౌర్యం బెసంగ శౌర్యంబు సెలంగఁ గృతప్రతికృతస్పర్ధాస్ఫురణ మెఱసి
పెనఁగినం బరమదారుణం బయ్యె. శకుని యుధిష్ఠిరుపై నడరి గుఱ్ఱముల నా
ల్గింటిని సమయించి తదనీకంబు గలంగ నార్చినం బాండవానుజుం డాతని నిజర
థారూఢుం గావించి తొలఁగించిన నాధర్మనందనుండు వేఱుతేరెక్కి క్రమ్మఱ
సౌబలుం దలపడి తొమ్మిదియు నైదును వాలమ్ము లాతని పయింగీలుకొల్పి సింహ
నాదంబు నొనర్చిన నాధర్మరాజగాంధారరాజులపోరు చూచుఖేచరులకు విస్మయ
దాయకంబై ఘోరరూపం బయ్యె. శకునిసుతుం డైనయులూకుఁడు నకులు
నిఁ దాఁకి శరవర్షము గురిసిన నాతండు నట్టు లడరుటయుఁ దుములం బైనసమరం
బు సెల్లె. సాత్యకికృతవర్మ లొండొరులం దలపడిన నాపోరు శక్రబలిసంగ్రా
మంబుపగిది నతిభీమంబయ్యె. దుర్యోధనుఁడు ధృష్టద్యుమ్నునిపై నడరి విల్లు
ద్రుంచి శితశరముల నిగిడించిన నప్పాంచాలవరుఁ డొండు కోదండముఁ గొని క
డంగుటయు వన్యమదేభములపోట్లాటవడువున నయ్యిద్దఱికయ్యము రౌద్రం

బయ్యె. కృపుఁడు ద్రౌపదీనందనులపైఁ గవిసిన వారు నింద్రియములు మూ
ర్ఖుంబోలె నతనినొంచుటయు నయ్యాలంబు పరమాభీలం బయ్యె. మఱియు ని
క్కడ నక్కడఁ జేయంగలబిరుదుమగలు దమకుఁ దమకుఁ బోలినవారల ద్వంద్వ
ములై తలపడుటయుఁ జతురంగములు తమతమజాతిం దాఁకుటయు నాపరమస
మ్మర్దమునంజేసి ధూళి యెగసి నింగి ముట్టి దివాకరపథంబుఁ గప్పుటయు నేమి
యుఁ గానంబడమింజేసి పరమసంకులత్వంబునం జిత్రత్వంబును ఘోరత్వంబునుం
బెంపెసంగఁ దమవాఁడు లాఁతివాఁ డని భేదం బరయక పెనంగుచున్నంత రక్తసే
చనవలన నాపరాగం బడంగుటయుఁ దొల్లింటియట్లు ద్వంద్వములై కయ్యము
నకుఁ గడంగిన నామధ్యాహ్నంబునఁ బరమసంపాతమునంజేసి వర్మవిదారణంబు
నను శిరఃపతనంబునను గపాలభేదనంబుననుం బొడమినయులివు వెదురుటడవి
కాలునప్పటిచప్పుడున కినయై నెగడె. అట్లు పరమఘోరంబుగా నుభయబలం
బులును విముఖత్వంబుఁ గానక స్వర్గదీక్షఁ బూనిన మనంబులతో నితరేతరస్పర్ధ
పొంపిరివోవఁగ రేణుసాంద్రత్వపిహిత దర్శనప్రకారంబు చొప్పడినను నడియా
లంబును నామగోత్రంబులను నిరూపించి పోరునెడ యుధిష్ఠిరుఁడు సక్రోధుండై
మూఁడుమెఱుంగుటమ్ములఁ గృపాచార్యునినొప్పించి నారాచచతుష్టయమునం గృత
వర్మతురగములం జెండాడిన నశ్వత్థామ యాహార్దిక్యుఁ దొలఁగించె. శారద్వ
తుఁ డంత నెనిమిదివాలమ్ములు ధర్మసుతుపై నడరించిన నయ్యజాతశత్రుండును
గడంగుటయు నత్యంతదారుణం బైనరణంబు సెల్లుచుండునంత భవదగ్రనందను
పంపున సప్తశతరథికులాయుధిష్ఠిరుం జుట్టుముట్టి మేఘములు దివాకరుంబోలె
నావరించి శరజాలంబడరించుటయు శిఖండిప్రముఖులు కేతుకింకిణీ నిక్వాణంబులు
కరతలాస్ఫాలనంబులును సింహనాదంబులును మౌర్వీఘోషంబులును నిగుడ
నడరి యాసప్తశతరథికులఁ బొరివుచ్చిన నెన్నండు జూడను విననుంబడనివిధం
బున నిర్మర్యాదం బైనయాయోధనంబు పొసఁగుటయు వారిబలంబున సింహ
నాదములును దూర్యరవంబులును నెసంగె. ఉల్కాపాతంబు విష్వగ్వాత ప్రసర
ణంబు మున్నగునుత్పాతంబులు మనబలంబునం దోఁచె. అంపులకుఁ దలంకక
బరవసంబు చేసి మనదెసయోధులు పరమపావనం బైన యీకురుక్షేత్రంబున స్వ
ర్గకాంక్షులై యాహవమునకుఁ గడఁగినం గాంధారరాజు వారలం బిలిచి మీ
రందఱు ముందటిదెసఁ బాండవుల నఱుముఁడు. ఏను గాంధారమద్రక పరివృ
తుండనై పిఱిందిదెసం దఱిమెదనని పాండవులకోలుతలకోహటించిన మనబలం
బుఁ బురికొల్పి తనపదివేలగుఱ్ఱపుదడములతోడ నడరె. అపుడు ధర్మరాజు సహ
దేవుం బిలిచి యల్లవాఁడె సౌబలుఁ డస్మదనీకజఘనం బాక్రమించుచున్నవాఁడు.
నీవును ద్రౌపదీసుతు లేవురును గూడుకొని యేడునూఱేనుంగులను నైదువేలగుఱ్ఱ

ములను మూడువేలకాల్బలంబునుం గొని యాగాంధారపతిం దాఁకి విక్రమింపు మనిన నాతండు వారలతోడ నాసాబలుందలపడియె.

శకుని గుఱ్ఱపుదళముతోఁ బాండవులపై నడచుట.

అట్లు తలపడినం బాండవబలమునందలిగుఱ్ఱపురావుతులు గాంధారపతియ శ్వారోహులనెంతయు నుక్కున జ్యోతిర్గణములొండొంటిం దాఁకిన విధమున నడరి ప్రాసతోమరప్రముఖనానాసాధనములనడిచియుఁ బల్యాణములనుండి నేలఁ బడం ద్రోచియు సిగలఁబట్టి యీడ్చియు నుడివ్రోవనిచలమున మెయి మెయి దాఁకఁ బెనంగియు జెట్టిజోదులట్లు పోట్లాడియుఁ బిడికిళ్లఁ బొడిచియు నితరేతర విజిగీషా మనీషం జేసి డయ్యుటసరకుగొనక మీఁదుమిక్కిలి యడరి యుక్కునం బేర్చి యార్చి యెగసిన ధూళి పెల్లునం గ్రమ్మినచిమ్మచీఁకట్లు నిజగాత్రనిస్సరద్రుధిరప్ర వాహమున నాపరాగం బడంగుటయు విరిసినం దెలిసి క్రమ్మఱఁ బొదివి యొదవి నకినుక నెంతయుఁబోరిన నాపరమసమ్మర్దమున సౌబలునిరావుతులు చతుస్సహస్ర సంఖ్యాకులు పొలియుటయు మిగిలినయాఱువేలగుఱ్ఱపుదడములతోడ నడరిన నం తకుమున్న పెనఁకువ పెల్లునం జేసి పెద్దయు డస్సినపాండవులరావుతు లత్యంతసన్ని హితం బైనయాఘోరసంగ్రామమున జీవితాశ విడిచి కడిమి మెఱసి యెక్కటి కయ్యమునకు సమకట్టి రథగజయుద్ధమిచ్చటన శక్యంబు కావునఁ దేరులు దేరు లను నేనుఁగు లేనుఁగులనుం దలపడుటయొప్పు. నిజానీకనిష్ఠితుం డై నసౌబ లుండు మఱలసంగ్రామమునకు రాక తక్కఁ డనుటయు ద్రౌపదేయులుబహుళ కరిఘటలతోడ ధృష్టద్యుమ్నానీకమునకుఁ జనిరి. అప్పు డెగసినధూళిపట లంబు మేఘజాలసన్నిభం బై తోఁచె. అట్టియెడ సహదేవుఁడు యుధిష్ఠిరు నెద్ద కరిగె. వారలట్లు చనుటయు శకుని పార్శ్వభాగమున నరిగి ధృష్టద్యుమ్నానీక ముపయిం దలపడుటయు నప్పాంచాలవరులు మగఁటిమిం బేర్చి నిగుడుటయు మాంసలోలుపంబు లగుడేగలరీతి నహంపూర్వికం బొంపిరివోయి కొడుకులు తం డ్రు లన్నదమ్ములు మామ లని విచారింపక కోపంబు రూపంబుఁగొన్న కై వ డిఁ దనరి నిపుణవనపాలకుఁడు తాళఫలములఁబోలె శాతకృపాణములఁ దలలు దఱుగఁబడునప్పటియులివును బల్యాణములనుండి యీడ్చి నేలఁ ద్రోచునెడఁ బొడమినరవమును గైదువు లొండొంటిం దాఁకి విఱుగునప్పటిచప్పుడును నరతు రగాస్థికపాలములు పగులునెడ నిగుడుఘోరస్వనంబును నెక్కటిమై నింగి యా క్రమించుభంగిఁ బెలుచ నెసంగుటం జేసియు నుగ్రం బైనవిస్రగంధం బుదగ్రం బై క్రమ్ముటం జేసియు నాఁకలియు నీరువట్టును బెల్లలయించుటం జేసియు నెండవేడి మి సైఁప నశక్యంబవుటం జేసియు బలుగాయముల మంటలు ప్రబ్బుటం జేసియుఁ గొలఁదికి మీఱి నెత్తురువఱ్ఱె పాఱుటం జేసియు విచేతనులై పొనుపడినహతశేషులు

రుధిరాభీలంబు కబంధబహుళంబు కంకగృధ్రాదిప్రమోదావహంబు నగున య్యాహవరంగమునఁ దల యొక్కకేలఁ బునుక వేఱొక్కకేలనుంగాఁగొని పిశాచములతీరునఁ బరమబీభత్సంబుగా విక్రమక్రీడసలుపునెడ సౌబలుఁ డల్పావశిష్టు లగుతనరావుతులతోడఁ బాండవబలంబుపై నీడంబోక కవిసె. కవియుడు వారు పెక్కండ్రొక్కమొగి నాగాంధారరాజుం జుట్టుముట్టి నానాస్త్రములనిగిడించిన నుభయబలంపుసాదు లొండొరులపై నిగిడినం బరమాభీలం బైనయాలంబు సెల్లె. అట్లు పాండవులు కోలుమసంగినం బెక్కండ్రుగుఱ్ఱపు రౌతులు తెగుటయు మిగిలినసప్తశతసాదులతోడఁ దొలంగి శకుని యచ్చటనున్న రాజులఁ గలయం గనుంగొని దుర్యోధనుఁ డెక్కడ నున్నవాఁడని యడుగ వార లల్లతండె గాంధారేయాగ్రజుండు పూర్ణచంద్రోపమం బైనశ్వేతాతపత్రంబు వెలుంగ బహుళరథికపరివృతుండై యాసంకులరవం బెసంగెడుచోట నున్నవాఁడు. అచ్చటి కేగితేని యతనిం జూడవచ్చు ననుటయు నాసుబలసూనుఁడు రథానీకపరివృతుం డై నసీపెద్దకొడుకునొద్దకుఁ జని నీవారికి సంతోషంబుఁ గావించువాఁడై తన్నుఁ గృతార్థుఁగా మది నెంచికొని కురువల్లభున కిట్లనియె. అశ్వానీకమెల్ల నేను గెల్చితి. నీవురథికులఁ దెగటార్పుము. యుధిష్ఠిరుఁడు తనప్రాణములు గలుగునంతకు రణక్షోణి విడుచునట్లు నాకుఁ దోఁపదు. పాండవపాలితం బైనయారథానీకంబుఁ దలపడి మనము తదీయచతురంగములఁ బరిమార్పఁ గడంగుద మనుటయు మనయోధులు దుర్యోధనచోదితులై సింహనాదములును జ్యాఘోషములును నిగుడఁ బాండవానీకంబుఁ దాఁకిరి.

## కృష్ణార్జునులు దుర్యోధనుమూర్ఖత్వము గుఱించి సంభాషించుట.

అయ్యవసరమున నర్జునుఁడు జనార్దనుం జూచి శకుని దుర్యోధను లెంతయు నుత్సాహమునఁ గవియుచున్న వారు మనతేరద్దెసకుఁ బోనిమ్ము. నిశితశరపరంపరలు పరఁగించి యేను శాత్రవబలంబెల్లఁ గడతేర్చెద నని పలికి మఱియు నిట్లనియె. మధుసూదనా, చూచితే సముద్రకల్పం బైనకురుసైన్యము మనలఁ దలపడి గోష్పదప్రాయమయ్యె. దైవంబు వారికిట్లు విపరీతం బగునే? భీష్ముఁడు శరతల్పగతుం డైనపదంపడి సంధి చేసినం బెద్దమేలయ్యెడి. ఆపితామహుఁడు నప్పు డదియె బోధించె. దుర్యోధనుఁడు మూఢుఁడు గావున బుద్ధి లేక యందుల కియ్యకొనఁ డయ్యె. ధనుర్ధరవరేణ్యుఁడు దివ్యాస్త్రవిదుఁడు మహానుభావుఁడు నగు శాంతనవుఁడు పడినపదంపడి పోరికి నడువ వారి కేకారణంబు గల్గెనొ యెఱుంగరాదు. అది యట్లుండె. ద్రోణుఁడు మున్నుగాఁగలవారు గలరని కయ్యమునకుఁ గాలుద్రవ్వె నని యూహించినను బిమ్మట భగదత్తభూ

రిశ్రవోజయద్రథప్రముఖు లైనమహావీరులును నయ్యాచార్యుఁడును దనన మ్మిన మేటిబిరు దగురాధేయుఁడును దత్పుత్రుఁడును దుశ్శాసనుఁడును దెగినపిదపనుం బోరికి సమకట్టి నడువ నావెంగలికిఁ జెల్లె. అదియు నట్లుండె. నేఁడు మద్రపతియు సాళ్వుఁడును దెగటారినవెనుక నైన వాని కార్యంబు శమింపదయ్యె. భీమసేనుడు బహుళాక్షౌహిణీపతులఁ బరిమార్చినయనంతరం బైనను శాంతిఁ గొనమికి వానిలోభమోహములు కారణము లగుంగాని యొండు గాదు. రాజకులీనుఁడు విశేషించి కురువంశజనితుఁ డగువాఁ డిట్టివ్యర్థవైరముఁ బాటింప సుయోధనుఁడు దక్క నొండొక్కరుఁ డోడంబడఁడు. హితాహితంబు లరయు ప్రాజ్ఞుఁడు గుణమునను బలమునను శౌర్యమునను దనకు నెదిరికినిం గలవిశేషంబు విచారింపక పోరికి నడుచునే? పెక్కు లేల? సర్వలోకాభిగమ్యుఁ డైననీవు కులక్షేమంబుఁ గోరి శాంతిఁ గావింపఁ బనివడి యరిగి యుపన్యసించినవిధంబు వినియా వెంబరవిత్తు నేమనం గలదు. భీష్మద్రోణవిదురులు శాంతిప్రకారం బెంతయొత్తి తెలిపినను గ్రహింపని యమ్మూఢునియవివేకరోగమున కేమందు పట్టును? మొఱకుఁదనమునంగాదె యాతండు హితవాదు లైన తల్లిదండ్రులమాటలు నిరాకరించె. జనార్దనా, వాఁడు కులక్షయకరుండనుట విస్పష్టం బయ్యె. వానిచేష్టయు నీతియు నాతెఱంగుననె కానంబడుచున్నది. ఇన్నిపాట్లు పడవలసినయాదురాత్ముఁడు మాకు మంచిగ రాజ్యమునం బాలిచ్చునే? నీవు సంధికిఁ బోయినపుడు విదురుఁడు మహాత్మా, పాపాత్ముఁ డైనదుర్యోధనుఁడు ప్రాణాలం గలుగునంతకు రాజ్యభాగంబుఁ బాండవుల కిచ్చువాఁడు గాఁడని తెలిపె ననియుఁ బాపరహితు లయినమీయెడ నాదురాత్ముఁ డనుచితప్రవర్తనుఁడు గావున యుద్ధము దక్క నొండువెరవు లేదనియు భార్గవాదులవచనంబు నిరాకరించె ననియు వానికి వినాశకాల మాసన్నమయ్యె ననియు నయ్యుక్కివుఁడు పుట్టినపుడే సిద్ధవచను లగుపెద్ద లనేకులు వీనినిమిత్తమున బహుళక్షత్రియక్షయం బగునని పలికి రనియుఁ దెలిపితివిగదా. అది యెల్ల నిపుడు వ్యవసాయమున విస్పష్టంబయ్యె. అక్కటా! దుర్యోధనునిమిత్తమున ననేకరాజులకు నాశంబయ్యె. తనశిబిరమెల్ల శూన్యప్రాయమైన నిప్పటికేనియు నప్పాపాచారుఁడు పోరు టుడుగఁడు. విదురవాక్యంబును నీదురాత్ముని చేష్టితంబునుం బరికించిన నీకయ్యము వానితో ముగియుఁగాని యొండొక్క తెఱంగు నాకుఁ జూడఁ దోఁపదు. ఇఁక మనకుఁ బెక్కు లేల? తేరు రయమునఁ దోలుము. నిశితశరనికరంబులు పరఁగించి తదనీకమెల్ల రూపడఁగించెద. అజాతశత్రుఁ డైన ధర్మరాజునకు సర్వవిధముల క్షేమముఁ గావించెద ననుటయుఁ గిరీటివచనం బభినందించి గోవిందుఁడు ఖడ్గశరఘోరంబు శక్తికంటకసంకులంబు గదాపరిఘపదవీసమంచితంబు రథనాగమహాద్రుమంబు హయపదాతిలతాసంకీర్ణంబు నగునస్మ

దీయసేనాకాననంబున శ్వేతతురంగయోజితంబు కపికేతనవిభ్రాజితంబు నగునా
రథోత్తమము రయమునం బఱపె.

## అర్జునుఁడు కోలుమసఁగి కురుబలముఁ జెండాడుట.

అట్లు కవిసి కవ్వడి వడి నడరి గాండీవంపునారి సారించి వారిధారల ఘనా
ఘనం బెట్టు లట్టుల వజ్రసమస్పర్శం బులగుశాతసాయకము లడరించిన దిక్కులు
విదిక్కు లని భేద మేర్పడనికరణి సర్వంబు నిజనామాంకితశరమయంబుఁ గావించి
బహుళచతురంగములం బరిమార్చి వేసవితఱిం బేర్చి కాననం బేర్చుకార్చిచ్చుప
గిదిం దీపించి వజ్రపాణి యగుసుత్రామునిచందమునఁ దేజరిల్లుచు నప్పటికినిఁ
జలంబు డింపక కడిందిమగంటిమిం జెలంగి చేయంగలమన దెసమేటిశూరు లొక్కు
మ్మడి నిగిడిన నాదండిమగండు గండుమిగిలి గాండీవనిర్ముక్త పటుకాండజాలంబుఁ
బరఁగించి యొక్కొక్కతూపున కొక్కొక్కనిఁగాఁ బొరివుచ్చి మనవారికడంకలు
వమ్ముగావించినం బ్రాణత్రాణపరాయణత్వమునంజేసి తండ్రుల నన్నదమ్ములను
బాంధవులనుం జీరక విచ్చి పఱచువారును రథ్యసారథులు మడియుటంజేసియు
రథావయవములు విఱుగుటంజేసియు విరథులై విన్వచ్చునంపగములకు నొచ్చియు
నీడంబోక చలంబుపెల్లున నెక్కటిబవరంబునకు సమకట్టి యాజెట్టిజోదుమును
మునఁ గాలు నిలుపనోపక పాఱుట క్షాత్రంబుగా దనుతలంపునం గడంగి వట్టి
బీరంబునం దొడరి చెయ్వులు దక్కి వ్రాలి సోలి నిట్టూర్పులు నిగుడ్చువారును
నారీతి మూర్ఛిల్లియు లాఁతివారు తమతేరులపై నిడికొని యనికిఁ దొలఁగించినం
గొండొకవడికిఁ దేఱి మగఁటిమి వాటించి మగిడివచ్చి విన్వచ్చుం దాఁకి యోపిన
కొలఁది పోరువారును దొలంగియు దుర్యోధనుపంపునంజేసి సాంపరాయికంబు
కర్తవ్యంబ యని నిశ్చయించి నీళులు ద్రావి కొండొకవడి యూఱడిల్లి వాహన
ములకు శల్యము లపనయించి ఖాణంబు మేపి యెల్లయు సమకూర్చుకొని మేలి
కత్తళంబులఁదొడి యన్నదమ్ములను దండ్రులనుఁ గొడుకులను శిబిరమున నిల్పి
యనల్పపరాక్రమాటోపంబున ననికి నడుచువారునై మనదెసయోధు లాయో
ధనదుర్దముం డైనయగ్గాండీవిం దాఁకి యతనికోల్తల కోహటించి క్రేడించి కొం
దఱు ధృష్టద్యుమ్నానీకంబుపయిం గవిసిన నప్పాంచాలవరుండు శిఖండియు నకు
లసుతుఁ డైనశతానీకుఁడునుఁ దనకుఁ దోడుగా వారలపై నడరె. అప్పుడు దు
ర్యోధనుఁడు ధృష్టద్యుమ్నుపై నడరి నారాచార్ధనారాచవత్సదంతాది నానాప్రద
రములం గుప్పించి గుఱ్ఱముల నాల్గింటినిఁ బరిమార్చి బాహువక్షోమధ్యంబు నొం
చినం బరిగోలలఁ బొడువంబడిన మదపుటేనుంగుతెఱంగునం గోపదీపితుండై
యప్పాంచాలవరుండు దుర్యోధనునిగుఱ్ఱముల నాలుగింటిని శరచతుష్టయమున
కెరచేసి యొక్కశాతసాయకమున సారథితలఁ దఱుగుటయు భవదీయజ్యేష్ఠపు

త్రుండు విరథుండై గుఱ్ఱ మెక్కి సౌబలానీకంబునకుఁ బఱచుటయుఁ దేరులగ ములు విఱిగి పాఱె, అట్టియెడ మూఁడువేలయేనుంగులు పాండవుల నేవురం దల పడి పోనీక పొదివిన నంబుదజాలపరివృత పంచగ్రహములవిధమున వారు చూడ నొప్పిరి. అప్పుడు కృష్ణసారథి యైన జిష్ణుండు రోచిష్ణుండై గాండివంబుగొనయ మ్ము నిగుడించి వాలమ్ముల నరిఁబోసి యేసి యొక్కొకతూపునఁ బెక్కేనుఁగులఁ గూల్చుచుఁ గోలుమసంగునెడ వడముడి గదాపాణియై చిచ్చునకుఁ దోడు గాడ్పు వచ్చుగతి నగ్గలికమెఱసి యగ్గజానీకంబుపయిం దలపడి యేదిక్కు సూచినం దా నకా నగపడి పెల్లడరిన గుంభములు పగిలియుఁ దొండములు తెగియు డొక్క లవిసియుఁ బ్రక్కలు చెదరియుఁ గొమ్ములు విఱిగియు జిఱ్ఱనందిరిగి పెలుచ నఱ చుచు ఱెక్కలునఱికినకొండలట్లు కూలుటయు మనసైనిక లచ్చట నిలువనోపక పఱచినం బోనీక పొదివి యెదవినకినుకం గడంగి యుధిష్ఠిరుండును గవలును నిశితశరనికరములఁ బరఁగించుచుండ ధృష్టద్యుమ్నుఁడు రారాజు నోడించి మన మూఁకలఁ జెండాడువాఁడునుం దోడుపడిన నక్కుంజరానీకంబునకుఁ జెప్ప నలవి గానిసేఁగి పొసఁగె. అప్పుడు కృపాశ్వత్థామకృతవర్మలు రథానీకమున రాజుం గా నక యాతని వాతునకా వగచి విన్ననై నమొగములఁ దనరి కుఱంగట మెలంగు వీరులం గాంచి దుర్యోధనుఁ డెక్కడ నున్నవాఁడని యడుగుటయు వారు సౌబ బలానీకంబునకుఁ జని యె నని కొందఱును దుర్యోధనుతో నిప్పు డేమిపని బ్ర దికియుండినం జూచికొందము కూడుకొని కయ్యము సేయుండు. ఆతం డిప్పరు సున నేమి చేయంగలవాఁడని పాండవులవాలంపగములతాఁకున నెంతయు నొచ్చిన వారు గావునఁ బ్రస్ఫుటంబుగఁ దెలుపనోపక యించుకచెప్పి వీరెపాండునందనులు గజానీకంబు రూపడగించి కవియుదెంచుచున్నవారు. కావున మీరు మాకిపుడు తోడ్పడుట యెంతయు నొప్పు ననుటయు నశ్వత్థామ కొండొకవడి వారితోడం బోరి రాజదర్శనతత్పరు లై నకృతవర్మకృపాచార్యులతోడ సౌబలానీకంబునకుఁ జనియె.

సాత్యకి సంజయునిఁ బట్టుకొనుట.

అవ్విధమున నారథికత్రయ మొండువలని కరుగుటయు దిక్కులేనియ మ్మూఁక భండనోద్దండు లై నపాండవులచేరింబడి జీవితంబుపై నాశ మాని కైదు వులు విడిచి విన్నఁబోయి ఱిచ్చబడియుండ నంగద్వయసహిత బలపరివృతుండనై యే నయ్యనీకంబునఁ జేయంగలవీరులు నలువురు తోడ్పడఁ గడిమిమెఱసి శారద్వ తుండు నిలిచినచో నిలిచి పాంచాలబలంబుపయిం గవిసి క్షణమాత్రంబున నర్జున శరహతి నలయుటం జేసి యింకఁ గయ్యము తగదని తొలంగి ధృష్టద్యుమ్నుమును మునంబడి యాతనితోడం గొండొకవడి పోరి యటశ్రాంతవాహనుం డై నయప్పాం చాలవరు నుజ్జగించి యనికిఁ దొలఁగి ధృష్టద్యుమ్నుఁ దప్పించికొంటిఁగా యని పఱ

చుచు ముందఱఁ జతుశ్శతరథపరివృతుండై యేతెంచుసాత్యకి కగపడి దుష్కృత
కారి నరకమునుంబోలెఁ జేయునదిలేక తదనీకంబుఁ జొచ్చి చిచ్చఱపిడుగున కైన
వచ్చునాశినివీరుతోడం గొండొకపోరి తదీయశరప్రహారమున మూర్ఛిల్లుటయు
నమ్మాధవానుజుండు నన్నుఁ బట్టికొనియె.

భీముఁడు దుర్మర్షణప్రముఖకురుకుమారులం జంపుట.

అవ్విధమున భీమసేనుఁడు గదాపాణియై దండహస్తుఁడైనయంతకునాకా
రమునం బొల్చి యగ్గలించి యగ్గజానీకంబు నుగ్గుసేయుచున్నంత దుర్యోధను
నచ్చోటఁ గానక యాతనితమ్ములు దుర్మర్షణుఁడు శ్రుతాంతుఁడు జైత్రుఁడు భూ
రిబలుఁడు రవి జయత్సేనుఁడు సుజాతుఁడు దుర్విషహుఁ డరిహుఁడు దుర్విమో
చనుఁడు దుష్ప్రధర్షుఁడు శ్రుతర్వుఁ డనువారలు సంరంభవశులై యావృకోదరుం
జుట్టుముట్టి శరపరంపరలు పరఁగించిన నబ్బకాంతకుండు తేరెక్కి శాతసాయకం
బుల వారిమర్మములు వ్రచ్చి యొక్కక్షురప్రమున దుర్మర్షణుమస్తకంబు నఱికి
నిశితభల్లమున శ్రుతాంతుని వధియించి నవ్వుచు నవలీలగా నెక్కుడొడ్డ నారసం
బున జయత్సేనుం గూల్చుటయు శ్రుతర్వుఁడు కోపదీపితుండై శరశతంబు
భీమునిపయిం బరఁగించె. అందుల కలిగి కిమ్మీరవైరి విషానలసంకాశము లగు
మూడువాఁడితూపుల జైత్రభూరిబలులఁ దెగటార్చుటయు వారు ముగురు
నెత్తుటం జొత్తిల్లినమేనుల నొప్పి మొదలు నఱుకఁ గూలినపూచినమోదుగు
లట్టులు తేరులనుండి నేలం బడిరి. అవ్విధమున వడముడి యమ్మువ్వరం బరి
మార్చి నిశితభల్లమున దుర్విరోచనుని మృత్యుపురమున కనిచి దుష్ప్రధర్షుని సు
జాతుని రెండేసియమ్ములఁ బిలుకుమార్చి శాతభల్లమున దుర్విషహుం దెగటా
ర్చుటయు సోదరు లందఱును దెగుటకుఁ గోపించి శ్రుతర్వుఁడు భీమునిపైఁ దల
పడి కనకభూషితం బైనచాపంబున బలుతూపు లరిం బోసి యతనివిల్లు దునిమి
యిరువదివాలమ్ములు పరఁగించె. ఒండుకోదండము గొని భీమసేనుఁడు శరప్రక
రము నిగిడించి నిలునిలు మనియదల్చి శరాసారంబుఁ బరఁగించుటయు నయ్యి
ద్దఱకును జంభవాసవులకుఁ దొల్లి యె ట్లట్ల దారుణం బైనరణంబు సెల్లె. అట్టి
క్రందుకయ్యంబున నయ్యిరువురువీరు లురువడిం బఱపువారలంపగములఁ
గప్పి దెసలగపడక చీఁకట్లు గ్రమ్మి యున్నంత శ్రుతర్వుఁ డలిగి బలుతూపులు
వింట నరిఁబోసి భీమసేనుబాహువక్షోదేశములం గాఁడ నేయుడు దానఁ గడుం
గనలి పర్వకాలంపుసాగరంబు తెఱంగునఁ బరమసంక్షోభం బెనసి తదీయరథ్య
చతుష్టయమును సారథినిం బరేతపురంబున కనిచి విరథుం డైనయక్కురుకుమా
రునిపై నిశితవిశిఖములఁ బరఁగించి పాణిలాఘవంబుఁ జూపుచున్నంత నాతం
డలిగి వాలుఁ బలకయుం గొన నుంకించుచుండె. అంతలోన వడిం బేర్చి వడము

డి యొక్కక్షురప్రమున వానితలఁ దఱుగ నాశ్రుతర్వుఁడు నేల వ్రాయఁగఁ దేరి నుండి డొల్లిబడియె. పడుటయు మనసైనికులు భయమోహితులై యక్కీచకారాతిని మార్కొనం గడంగుటయు హతశేష మగునాబలార్ణవమునుండి వెలువడివచ్చునాసైనికులం దలపడి భీముఁడు దనుజవధోదగ్రుం డైనసహస్రాక్షుని వీక మెఱసి కడిమి దీపించి పంచశతరథికులను సప్తశతకుంజరానీకంబును నష్టశతఘోటకంబులను లక్షపాదాతంబునుం బిలుకుమార్చి తన్నుఁ గృతార్థుఁగను దనజన్మము సఫలముగనుఁ నెమ్మదిం దలపోసి చేతిచప్పుళ్లనే మనవారలఁ బాఱఁ ద్రోలుచున్నంత నాజగజెట్టికి మాఱుమలయువారు లేమింజేసి మనమూఁక వానిం గన్నెత్తియైనం జూడనేరక విహ్వలంబై హతభూయిష్ఠంబై యత్యంత కృపణంబై కించిచ్ఛేషం బయ్యె.

అట్టియెడ హతశేషం బైనగుఱ్ఱపుదడములనడుమ దుర్ధర్షద్వితీయుం డైనదుర్యోధనుం జూచి వసుదేవనందనుఁడు వాసవనందనున కిట్లనియె. శత్రువులు హతప్రాయులైరి. జ్ఞాతు లొక్కచోఁ గూడిరి. ఇతండె సాత్యకి సంజయునిఁ బట్టుకొని వచ్చినవాఁడు. ధార్తరాష్ట్రయోధులలోఁ బెద్దయుఁ బోరాడి నకులసహదేవులు డస్సియున్నవారు. కృపకృతవర్మాశ్వత్థామలు దుర్యోధను విడిచి యొండుకడ కరిగియున్నవారు. అతండె ధృష్టద్యుమ్నుఁడు ప్రభద్రకపరివృతుండై దుర్యోధనబలము వధించి వెలుఁగుచున్నవాఁడు. అల్లవాఁడె దుర్యోధనుఁడు వాజిమధ్యమున శ్వేతాతపత్రవిభాసురుండై మన కెదురై మోహరం బమర్చి మనదెసఁ బలుమాఱు చూచుచున్నవాఁడు. వాలంపగముల వానిం బరిమార్చి కృతకృత్యుఁడ వగుము. గజానీకంబు సమయుటయు నీవు డాయుటయుం జూచి య్యాదుర్యోధనసైనికులు పాఱిపోకమున్న ధృష్టద్యుమ్ను నిటకు రమ్మనిచెప్పిపంపుము. పరిశ్రాంతబలుఁ డైనయప్పాచారుఁడు తప్పించుకొనిపోవఁ జాలఁడు. సంగ్రామమున నీతండు భవద్బలంబు రూపుమాపి పాండుసుతుల జయించితి ననితలఁచి యుప్పొంగియున్నవాఁడు. స్వబలంబు నీచే దెగినం జూచి యాత్మవధార్థంబు పోరికిఁ దప్పక వచ్చువాఁ డనిచెప్పిన గోవిందున కర్జునుఁడిట్లనియె. మధుసూదనా, ధృతరాష్ట్రసుతుల నందఱను భీముఁడుఁ వధించె. ఇఁక మిగిలి యున్నయీయిద్దఱును బ్రదుకువారు గారు మఱి సమయువారలే. భీష్మద్రోణకర్ణశల్యసైంధవాదు లగుచేయంగల దొరలు తెగిరి. సౌబలుహయము లేనూఱును నిన్నూరుతేరులును నూఱెనుంగులును మూడువేల కాల్బలంబునుగృపకృతవర్మాశ్వత్థామలును ద్రిగర్తేశ్వరుఁ డైనసుశర్ముఁడును శకున్యులూకులును నిప్పటికిఁ గలరు. లెక్కించి చూచిన దుర్యోధనుబలఁగ మింతయై యున్నది. కాలస్థితిం బరికించిన వీరలేనియుఁ దప్పించికొనఁ జాల రనితోఁచెడి. తనసేనయెల్ల

నిహతం బగుడు నిప్పుడు దుర్యోధనుం డుండు తెఱఁగుఁ జూడుము. నేఁడు పాండ వాగ్రజుం డై నయజాతశత్రుఁడు హతామిత్రుఁడై వెలయువాఁడు. అనికిఁ దొలఁ గి పోయినం జెప్పఁ జాలనుగాని పోరికిఁ గడఁగుదురేని వారివార లమానుషు లయినను నాచే నిహతు లగుట నిక్కువంబు. నేఁడు శకునిం జంపి కౌంతేయాగ్ర జుదీర్ఘప్రజాగరంబుఁ దీర్చువాఁడను. నిసర్గదురాచారుఁ డై నసౌబలుఁ డద్యూ తమున నాఁచికొనినరత్నములఁ గ్రమ్మఱఁ దెచ్చువాఁడను. నేఁడు కరిపురస్త్రీలు తమపతులు పుత్రులు మున్నగువారు పాండవులచే హతులై రని యెఱుఁగు వారు. నేటితో సర్వకర్మంబు సమాప్తము గాఁగలదు. నేఁడు దుర్యోధనుం డనికి వెఱచి తొలఁగఁడేని ప్రాణములను రాజ్యశ్రీనిం గోల్పడువాఁడు. వాసు దేవా, పరమమూర్ఖుఁ డై నదుర్యోధనుని హతునకాఁ దలంచుము. ఈయున్న వాజిబృందమెల్ల మదీయగాండీవమౌర్వీఘోషమైన సైరింపఁ జాలునే? యని కిరీటి చెప్పిన విని వనజనాభుఁడు దుర్యోధనుబలంబుపయిం దేరు పఱపుటయు భీమసేనసహదేవులును దుర్యోధనజిఘాంస గూరినమనంబుల బహుళసింహనాద ము లొనరించుచు మనమూఁకపయిం గవిసిరి. పాండువు లట్లు లొక్కుమ్మడి మువ్వురు దలపడుటం జూచి సౌబలుండు సుశర్మసుదర్శనాదిపరివృతుండై వార లపయి నడరుటయు సుదర్శనుఁడు భీమసేనుని సుశర్మ శకునులు పార్థుని దుర్యో ధనుఁడు హయపృష్ఠగతుండై సహదేవుని మార్కొనిరి. అట్లు మార్కొన్నంత దుర్యోధనుం డేచి ప్రాసమున సహదేవునిఁ దలమీఁద నడుచుటయు నాతండు మూర్ఛపోయి తేరిపయిం జదికిలఁ బడి కొండొకప్రొద్దునకుఁ దెలిసి రక్తసంప్లుత సర్వాంగుండై యాశీవిషమట్లు పెద్దయ రోఁజుచు నిశితవిశిఖముల దుర్యోధను పయిం బరఁగించుటయు నాపోరు ఘోరం బయ్యె.

## అర్జునుఁడు త్రిగర్తేశ్వరుఁ డైనసుశర్మను వధించుట.

అర్జునుఁడును దనపై నడరినసుశర్మశకునులపై నలిగి శరాసారంబుఁ గురి సి త్రిగర్తానీకంబుపైఁ గవిసి యవ్వీరులఁ దేరులనుండి డొల్లించియు గుఱ్ఱముల నుండి త్రోయించియుఁ బలువిధముల జీకాకుపఱచుటయు నాత్రిగర్తయోధు లుక్కునం బేర్చి వాసుదేవార్జునులపై శరవర్షంబుఁ గురిసిరి. అందుల కలిగి యర్జునుఁడు సత్యకర్మునిపై నడరి రథేషం గూల్చి యొక్కక్షురప్రమునఁ దప్త కుండలభూషితం బై నవానిమస్తకంబుఁ దఱిగె. ఆఁకొన్నసింహముమృగము నెట్టు లట్టుల సవ్యసాచి యవ్విధమున సత్యకర్ముం బరిమార్చి శరత్రయంబు సుశర్మ పై నిగిడించి త్రిగర్తవీరులపయిం బటుకాండజాలం బడరించుచుఁ గ్రోధ విషంబుఁ గ్రక్కుచు శరశత మాసుశర్మునిపై నేసి యంత నిలువక యంతంత కెంతయుం బెఱుఁగుకోపావేశంబునం జేసి పేర్చినశౌర్యంబున యమదండోపమం

బై నయొక్కవాలమ్ము గాండీవమ్మున నరిం బోసి నవ్వుచు నేయుటయు సుశర్ముఁడు దాన విదీర్ణహృదయుండై మనవారలకు ఖేదమును బాండవులకుఁ బరమామోదమునుం గావించుచు గతాసుఁడై నేలం బడియె. అవ్విధమున సవ్యసాచి సంశప్తకేశ్వరుం డైనసుశర్మునుఁ దెగటార్చి హతశేషు లగుతత్పుత్రుల నేడుగుర నెనమండ్రుగురన్ను ముప్పదుండ్రనుం దీవ్రసాయకముల యమనికేతనంబున కనిచి తదీయానుచరులం బొరివుచ్చి నిర్వక్రవిక్రమోల్లాసంబున మెఱయుచుండునంత భీమసేనుఁడును బ్రహర్షోత్కర్షవికస్వరుండై నవ్వుచు నొక్కకుప్పెకోలచే సుదర్శనుతలఁ దఱిగి తదీయానుచరులం బరిమార్చుటయు హతశేషులు వెఱచు టుడిగి యుడివోనివీఁకం బేర్చి శరనికరం బడరించిన నుభయబలంబును సమ్మర్దవ్యాకులంబయ్యె.

సహదేవుఁడుఁ శకునృులూకులఁ జంపుట.

అట్టిసంకులసమరంబున శకుని సహదేవుని మార్కొని శరజాలం బడరించుటయు. నులూకుఁడు భీముం దలపడి దశవిశిఖములం బరఁగించి తోడన సహదేవునిపైఁ దొంబదియంబకములం గీలించుటయు నప్పాండవేయు లిరువురు పెద్దయు నలిగి గండడరి శరాసారంబుఁ బరఁగించి చీఁకట్లు గావించి నిర్వక్రవిక్రమాటోపంబుఁ దీపింపఁ జేయుటయు నెచ్చటఁ జూచినను గూలినగుఱ్ఱములును గేడెము తెగ ఖడ్గములు దునియ నీఁటెలు విఱుగఁ జెయ్వులు దక్కియుక్కటి నేలం బడి మడిసియు నెక్కుడుకడిమింజేసి యవుడుగఱపు విడువనికుండలోల్లసితసారసకేసరప్రకాశముఖముల నొప్పుచున్నవీరసాదిమస్తకంబులును హస్తిహస్తోపమానంబు లగువిచ్ఛిన్నయోధబాహుదండములును దటాలున గళములు దఱుగఁ గొంతవడి యెగరిపడుకబంధములునై సంగ్రామక్షోణీతలంబు క్రవ్యాదగణతర్పణావహంబై నెగడె. అట్లు పాండవులకడిమిపెంపునంజేసి మనయనీకంబు హతప్రాయంబై యల్పావశిష్టంబై యుండునంత గాంధారపతి ప్రాసమున సహదేవుశిరం బడుచుటయు నాతండు మూర్ఛితుండై తేరిపయిఁ జదికిలం బడినం జూచి భీమసేనుఁ డభియాతివిక్రమలక్షణంబు సైరింపక తా నొక్కరుండ సర్వసైన్యముల నాఁగి లెక్కకు మిక్కుటంబుగ బలుతూపు లడరించి మనమూఁకలం గలంచి సింహనాదంబు సేసె. అయ్యార్పునకు బెదరి సౌబలానుచరులు విఱిగి పఱచుటయు దుర్యోధనుఁడు వారల నందఱఁ గలయఁ జూచి పేరెలుంగెత్తి యోధర్షభులారా! మఱలుఁడు పోరుఁడు పఱచిపోవ నేల. సంగ్రామంబున వెన్నుసూపక మగఁటిమి వాటించి చక్క నిలిచి పోరిమెన్నటికేనియు సాహాయం బైనకాయంబుఁ దొఱఁగువాఁ డీలోకమున విమలయశశ్శ్రీసముల్లసితుండై పరలోకమున నత్యంతసౌఖ్యములం గుడుచు నని చెప్పుటయు వారు కృ

తోత్సాహులై సాహసించి పాండవులపై నడరుటయు నప్పటియులివు సా
గరంబులు గలంగునప్పటినిస్వనంబు ననుకరించె. క్రమ్మఱి పోరికి వచ్చుచున్న
యాసౌబలానుచరులం జూచి పాండవసైనికు లేపునం దలపడిరి. అంతలోనం
దెలిసి సహదేవుఁడు శకునిం బదింటను నతనిగుఱ్ఱముల మూఁడింటను నొవ్వ నేసి
నవ్వుచు నవలీల నతనివిల్లు ద్రుంచుటయు యుద్ధదుర్మదుండై నయాసౌబలుఁ
డొండువి ల్లెత్తి యఱువదియమ్ముల నకులుని నేడుతూపుల భీమసేనుని నేయుటయు
నాక్షణంబ యులూకుండు తండ్రికిఁ దోడ్పడువాఁడై భీముని సాయకసప్తకంబు
నను సహదేవుని సప్తతిశరములను నడిచినం గినిసి వృకోదరుండు వానిం దొమ్మి
దివాలమ్ములను శకుని నఱువదినాలుగుతూపులను దత్పార్శ్వరక్షకుల మూఁడేసి
బాణములను నొవ్వ నేసె. అందుల కలిగి వారలు తటిద్విలసితంబు లయినయం
బుధరములు వారిధారల ధరణీధరము నెట్టు లట్టుల సాయకవర్షమున సహదేవుం
గప్పుటయు నాతం డలిగి యయ్యంపతుంపర నడఁగించి యొక్కతీవ్రభల్లమున
నులూకునితలఁ దునుముటయు నాశకునిపుత్త్రుండు రక్తసంసిక్తగాత్రుండై పాం
డునందనుల కానందముఁ గావించుచుఁ దేరినుండి నేలం బడియె. అట్లు తనపు
త్త్రుండు హతుండైనం జూచి శకుని బాష్పపూరితలోచనుండై కొండొకవడి ని
శ్వసించి డగ్గుత్తిక వెట్టి విదురువచనంబుఁ దలపోయుచు ముహూర్తమాత్రంబు
వగలం బొగిలి యటఁ గడిమి మెఱసి సహదేవుం దాఁకి మూఁడువాలమ్ములు ప
రఁగించిన నప్పాండవకనిష్ఠుండు ప్రతాపగరిష్ఠుండై వానితూపులు నడుమన తుని
యలు గావించి విల్లు ద్రుంచుటయు నాగాంధారేశ్వరుండు వాలు వెఱికి సహదే
వుపయిం బడ నేసె. ఏసిన నబ్బలుమగండు గండుమీఱి నవ్వుచు దాని రెండు
ఖండములు చేసిన నాసౌబలుండు గద యెత్తి విసరి వ్రేయుటయు నదియు సహ
దేవునిశరమ్ముల వమ్మై నేలం బడిన నెంతయు నలిగి కాళరాత్రిపోలె నతిఘోరం
బయినశక్తిం బ్రయోగించె. మాద్రేయుం డందులకుఁ జలింపక నవ్వుచు వాఁ
డితూపుల దానిని ముత్తునియలుగా నఱికిన నది గగనమునుండి యశనివ్రాలె
ధరణిం బడుటయు నట్లు శక్తి వినిహతం బగుడు నాసౌబలుండును దత్సైనికులు
నింక నేమి గలదని వెఱచఱచి విచ్చిపఱచిరి. జయశ్రీసముల్లసితు లవుటంజేసి
పాండవులు పరమామోదంబున నార్చిరి. ధార్తరాష్ట్రు లందఱును బరాఙ్ముఖు
లైరి. అప్పుడు సహదేవుఁడు తురంగబలగుప్తుండై తొలఁగి చనుచున్నయాశకు
నిం జూచి తొలుత సమరోద్యోగసమయంబున నతనిం దనపాలికిఁ బెట్టుటఁ దల
పోసి యగ్గలించి యగ్గాంధారపతిం దలపడి వి ల్లెక్కుపెట్టి జ్యాఘోషంబు నిగి
డించి క్రోధంబున మెఱసి తోత్రముల మత్తమాతంగమునుంబోలె గృధ్రప
త్రోల్లసితము లగుతీవ్రశరముల నెంతయు నొవ్వ నేసి యాతులువ మున్ను మ

దించి తమతోఁ బలికినపలుకులెల్ల వానికిఁ దలపించువాఁడై యిట్లనియె. దుర్మ
తీ, క్షత్రధర్మమున సుస్థిరుండనై పోరుము. పురుషుఁడ వగుము. ఆనాఁ డాసభ
లోఁ బాపపుజూద మాడుచు నుబ్బినందులకుఁ బ్రతిఫల మిదె నేఁడు చూడుము.
అప్పుడు మమ్ముఁ జూచి నవ్వినదురాత్ము లందఱును మడిసిరి. కులమునకుఁ గొఱ
వి యైనదుర్యోధనుండును వానికి మేనమామ యగునీవు నిప్పటికి మిగిలియున్న
వారలు. పరిపక్వ మగుఫలమును నిపుణవనపాలకుండు పాదపమునుండి తుంటకట్టి
యచే నడిచి రాల్చువిధమున నొక్కక్షురమున నీతలఁ దఱుగుదు ననిపలికి క్రోధా
వేగదుర్దాంతుఁడై సహదేవుఁ డాతని దశవిశిఖముల నొవ్వ నేసి నాలుగమ్ముల
హయచతుష్టయముం జంపి కాండత్రయమునఁ గేతనాతపత్రకోదండములం
ద్రుంచి యార్చి పేర్చి శరాసారంబుఁ బరఁగించె. అందుల కలిగి శకుని రథము
డిగ్గి ప్రాసముఁ గొని సహదేవుం బొడువ నడిం బేర్చి వచ్చుచున్నంత నమ్మాద్రే
యుండు భల్లత్రయమున నతనిప్రాసమును భుజద్వయమును నఱికి తోడన సువ
ర్ణపుంఖ మగునొక్కతీవ్రభల్లమునఁ దన్మస్తకంబుఁ దఱిగె. అట్లు కౌరవులయన
యమునకు మూల మగుశకుని సహదేవనికృత్తమస్తకుండై రక్తసిక్తగాత్రుండై
ధరణీతలమునఁ బడినం జూచి నీయోధులు సాధ్వసవినష్టశౌర్యులై గాండీవఘో
షసమాహతులై వాడినమొగమ్ములతోఁ బఱచిరి. పాండవులు శకునివధమున
కెంతయు సంతోషమునం బొదలి చిందములఁ మ్రోయించి యోవీరవర్యా. దు
రాత్ముఁ డైనశకునిం బుత్రసహితంబుగ భాగ్యమునఁ బరిమార్పఁ గంటి వని య
మ్మాద్రీనందనావరజుం బ్రస్తుతించిరి.

అవ్విధమున సహదేవుఁడు శకునినిఁ దత్పుత్త్రునిం బరిమార్చుటయుఁ గో
పించి గాంధారయోధులు జీవితాపేక్ష మాని పాండవులం జుట్టుముట్టుటయు స
హదేవజయార్థులై భీమార్జునులు వారల మార్కొని నిశితభల్లములఁ బరఁగించి
పెక్కండ్రం దెగటార్చుటయు బీభత్సుబారిం బడినహతశేషులం జూచి దుర్యో
ధనుం డోవీరులారా, పాంచాలపాండవబలముల నిరవశేషముగఁ బిలుకుమార్పక
కాని మఱలవల దనిచెప్పి పురికొల్పుటయు వా రమ్మహీపతియానతి యాఁదలఁ
దాల్చి కడిందిమగఁటిమిం బేర్చి క్రూరపన్నగోపమము లైననారాచములఁ గురి
యుచు నడరినం బాండవవీరులు నుక్కునం గడంగి తలపడుటయు నెగసినధరణీ
రేణుపటలంబు పెల్లునం జేసి కటికిచీఁకట్లు గ్రమ్మినం గ్రందుకయ్యం బయ్యె. అట్టి
సంకులసమరమున మనయనీకంబు పాండవులబారిం బడి రక్షకరహితంబై ము
హూర్తమాత్రలోన నిశ్శేషం బయ్యె. ఇవ్విధమున నీకొడుకుపక్షమునం జేరినయే
కాదశాక్షౌహిణులు నిరవశేషముగఁ బాండవపాంచాలవిక్రమంబున నిహతము
లగుటయు నలుదెసలును నిజసైన్యశూన్యం బై నరణరంగమునఁ గృతార్థులు ప

రమప్రమోదభరితులు నగుపాండవవీరులనుం జూచియు దదీయజ్యాఘోషబాణరవ సింహనాదముల వినియు దుర్యోధనుండు కశ్మలపరీతుండై తొలఁగి పోవం దలంపు గొనియె ననవుడు ధృతరాష్ట్రుఁడు సంజయా, యస్మదీయానీకంబు నిహతంబై నపదంపడి పాండవబల మెంతమిఁగిలియుండె. మందమతియు నస్మత్తనయుండు నగుదుర్యోధనుం డనంతర మేమి చేసెఁ దెలియంజెప్పు మనియడుగ నతండు మహారాజా, రెండువేలరథములు నేడునూఱేనుంగులు నైదువేలగుఱ్ఱములు పదివేల కాల్బలంబును బాండవబలంబున మిఁగిలియుండె. ఇయ్యనీకంబుఁ గొని పాంచాలవరుం డైనధృష్టద్యుమ్నుఁడు రణక్షోణీతలమున మోహరించియుండె ననిచెప్పి ధృతరాష్ట్రునకు సంజయుండు వెండియు నిట్లనియె.

దుర్యోధనుఁడు పాదచారియై తొలఁగిపోవుట.

అవ్విధమున నేకాదశచమూనాయకుం డయినదుర్యోధనుఁడు తనసైన్యమునఁ దనకుఁ దోడ్పడువాని నెవ్వనిం గానక స్వబలసంక్షయమునకును శాత్రవులయేపునకును వగచి హత మైనతనగుఱ్ఱమును విడిచి యొక్కమడుఁగున డాఁగువాఁడై గదఁ గొని యొక్కరుండ పాదచారియై భయాకులుండై ప్రాఙ్ముఖంబునం బఱచె. అట్లు కొంచెముద వ్వరిగి నిజజనక్షయంబునకు దురపిల్లుచు విదురుండు మహాప్రాజ్ఞుఁడు గావునఁ దొలుతనే యీసమరంబున మాకుఁ గీడు మూఁడు ననివచించిననాఁ డని యతనివాక్యముఁ దలంపునకుఁ దెచ్చికొని చింతిల్లుచుండె. ధృష్టద్యుమ్నపురోగములై పాండవయోధులు హతశేషు లైననీసైనికులపై నడరి విక్రమంబు చూపిరి. శ్వేతహయం బైనరథమునం బొలిచి సవ్యసాచి మీవారలం బొదివి గాండీవంబున నందఱం బొరివుచ్చి వెలుంగుచుండె. ఇట్లు భవదీయసైన్యంబున నందఱును మడియుటయుఁ గృపకృతవర్మాశ్వత్థామలు ముయ్యరును దుర్యోధనుండును దక్క మఱియెవ్వరును బ్రదుకరైరి.

వ్యాసవచనమున సాత్యకి సంజయుని విడిపించుట.

అప్పుడు ధృష్టద్యుమ్నుఁడు సాత్యకిగృహీతుం డైననన్నుఁ జూపి యాశినిపుంగవున కిట్లనియె. వీనిఁ బట్టికొన నేల? వీఁడు బ్రదికిన నె గ్గేమి? విడుపు మనవుడు నాతండు నిశితఖడ్గం బెత్తి వేయఁ బూనుటయు నప్పుడు కృష్ణద్వైపాయనమునీంద్రుఁడు సన్నిధిచేసి సాత్యకీ, సంజయునిఁ బ్రాణములతో విడువుము. చంపవలదని నిర్దేశించుటయు నమ్మునీంద్రునకుఁ గృతాంజలియై యాసత్యకాత్మజుం డట్లయని నన్ను విడిచి సంజయా, బ్రదికితి మేలయ్యెడు నీయిచ్చకు వచ్చినట్లు పొమ్మని వీడుకొల్పిన నేనును న్యస్తకవచుఁడును నిరాయుధుఁడునునై నెత్తుటఁ దోఁగినమేనితో నాసాయాహ్నమున నగరమున కరుదెంచువాఁడనై దుర్యోధనుండు పఱతెంచినతెరువు వట్టి క్రోశమాత్రము చని యచ్చట నత్యంతవిక్షతుండై

డస్సియున్న భవదగ్రనందనుం గాంచితి.

### దుర్యోధనుఁడు ద్వైపాయనహ్రదమున డాఁగుట.

అమ్మహేశ్వరుండు కన్నుఁగవ నశ్రుకణంబు లురుల నన్నుఁ గనుంగొన నెల్లక యోరమొగంబు వెట్టికొని యెట్టకేలకుఁ గనుంగొనుటయు దైన్యప్రాప్తుండై శోకించుచు నేకాకియై యున్నయన్నరేశ్వరుఁ బల్కరింప నెలుంగు రాక కొండొకవడి యూరకుండి యేను సాత్యకిచేఁ బట్టువడుట మున్నుగా వేదవ్యాసప్రసాదంబున విడుపు గాంచుట తుదిగా నెల్లయుం దెలియఁ జెప్పితి. చెప్పిన నతండు ముహూర్తమాత్రంబు చింతించి తెలివిఁ బొంది తమ్ములను సర్వసైన్యంబులను నడుగుటయు బ్రత్యక్షదృష్టసర్వార్థుం డై నయేను మహారాజా, తమ్ము లందఱుం బొలిసిరి. సేనయెల్లయుం దెగియె. కృపకృతవర్మాశ్వత్థామలు మువ్వురు రథికులే బ్రదికియున్నవారు. ప్రస్థానకాలంబునఁ గృష్ణద్వైపాయనుండు నియ్యర్థంబే వచించినవాఁడని నివేదించిన నమ్మేదినీశ్వరుండు పెద్దయుంబ్రొద్దు నిట్టూర్పులు నిగిడించి నిజకరతలంబున నామేను నివిరి సంజయా, నీవు దక్క నొండొక్కరుఁ డీసమరంబున బ్రదుకరుగదా. ఇక్కడ నాకుఁ దోడ్పడు రెండవమానిసిం గాననయ్యెద. పాండుపుత్త్రులు సహాయసంపన్నులై యెసంగుచున్నవారు. ప్రజ్ఞాచక్షుం డైనధృతరాష్ట్రమహీశ్వరుం గాంచి నీకొడుకు దుర్యోధనుం డట్టిమిత్రులను బుత్త్రులను దమ్ములనుం గోల్పడి తా నొక్కండ పోటులం బడి పెద్దయుడస్సి మహాసంగ్రామమునఁ దప్పి మడుఁగుఁ జొచ్చిదాటెనవాఁడు. పాండవులు రాజ్యమెల్లయు నాఁచికొనినపదంపడి నాయట్టివాఁడు బ్రదికియుండనేర్చునే యని నా మాటగా నివేదింపు మనిపలికి యచ్చట నున్నదైవ్వపాయనం బనుహ్రదంబుఁ బ్రవేశించి తనమాయాబలంబున నీళులు తన్ను సోఁకకుండఁగ సంస్తంభనంబుఁ గావించె.

అవ్విధమున దుర్యోధనుండు ద్వైపాయనహ్రదంబుఁ జొచ్చుటయు మిక్కిలి డయ్యుటంజేసి వడిం బఱవ నోపనిరథ్యము లెట్టకేల కీడ్చుకొనివచ్చుతేరులపయిం గూర్చుండి యాతెరువు పట్టి యొక్కచోటికిఁ జనుచున్నకృపకృతవర్మాశ్వత్థామలు నన్నుఁ జూచి త్వరితగతి రథ్యములం బఱపికొని నన్నుఁ దఱియంజను దెంచి సంజయా, భాగ్యమునం బ్రతికితివి. దుర్యోధనుండు ప్రాణములం గలఁడే యని నీకొడుకు నడుగుటయు నేను రాజరాజుకుశలస్థితిని నాతండు నాతోఁ బల్కిన తెఱంగును మడుంగుఁ జొచ్చుటయుం దేటపఱచుటయు గురుతనయుండు వినియు నమ్మడుగుఁ గనుంగొనియు నక్కటా! దుర్యోధనుండు మేము బ్రదికియున్నవార మని యెఱుంగఁడొక్కొ. మేము మువ్వురమును విక్రమించి యరాతులఁ బోర మార్కొనఁ జాలుదుమని యిట్లు పలుదెఱంగుల నచ్చట సంభాషణంబులు

పెద్దయుం బ్రొద్దు చెల్లుచుండ నాచెంగటఁ బాండవులు తఱిమికొని రాకం గనుం గొని యచ్చట నప్పు డునికి యుఱవు కా దనితలంచి నన్నుఁ గృపునితో రెక్కించి కొని సేనానివేశంబున కరుగుదెంచిరి.

అక్కడ సూర్యాస్తమయసమయంబున భవత్తనయక్షయం బెఱింగి శిబిర రక్షకులు మిక్కిలి వెఱచుటయు రాజభార్యలును దద్వృత్తాంతముఁ దెలిసి గోళ్ల గిచ్చికొనియుఁ దలలఁ గొట్టికొనియుఁ గేశములఁ ద్రెంచికొనియు నురస్తాడ నంబుఁ గావించికొనియుఁ గన్నుల బాష్పజలంబులు జాలువాఱ డగ్గుత్తిక వెట్టి హాహారవం బెసంగఁ బేరెలుం గెత్తి యేడ్చుచుండఁ దద్రక్షకు లగువేత్రవ్యాస హస్తులైనద్వారాధ్యక్షులును వృద్ధకంచుకులును దుర్యోధనామాత్యులును బాష్పపూర్ణనేత్రులై యత్యంతసుకుమారులగునయ్యంతఃపురాంగనలం దగినవా హనముల నెక్కించి పురమునకుఁ దోడ్కొనిపోయిరి. సూర్యునకేనియుఁ గానం బడనియయ్యుత్తమాంగనలనప్పు డందఱకుం జూడనయ్యె. భీమసేనునకు వెఱచి గోపాలురు మున్నుగా నందఱు నున్నచోట్ల విడిచి పఱచిరి. ఏమి చెప్పుదు నప్పు డెల్లవారికిని బాండవులవలని వెఱపు పెల్లయియుండె.

## యుయుత్సుండు కురుస్త్రీలతోడఁ గరిపురమునకుఁ బోవుట.

ఆసమ్మర్దమున యుయుత్సుండు శోకసమ్మూఢచిత్తుండై ప్రాప్తకాలముఁ దలపోసి యేకాదశాక్షౌహిణీనాయకుం డైనదుర్యోధనుం డీమహారణంబునఁ బాండవులచే నిర్జితుం డయ్యె. అతనితమ్ము లందఱును బొలిసిరి. భీష్మద్రోణప్ర ముఖు లగుకౌరవవరులెల్లఁ బడిరి. ఏనొక్కండనే భాగ్యయోగమునం జేసి బ్రదికి తిని. శిబిరములెల్ల వెఱచఱచి విచ్చిపఱచె. అంతఃపురాంగన లనాథలై తేజోహీ నలై దుఃఖార్తలై భయవ్యాకులలోచనలై చెదరినలేళ్లచందమున నిటునటునెల్లదె సలం జూచుచు విభ్రాంతలై పెద్దయు నేడ్చుచున్నవారలు. హతశేషులై నదుర్యో ధనామాత్యులు రాజభార్యలం దోడ్కొని నగరమునకుఁ జనుచున్నవారు. యుధి ష్ఠిరభీమసేనుల వీడుకొని యేనును వారితోడఁ బురమునకుఁ జనుట యిప్పటికి నాకుం జూడఁ గర్తవ్యం బనితలంచి యప్పాండవాగ్రజులపాలికిఁజనియయ్యర్థంబు విన్నవించిన నయ్యజాతశత్రుండు వీడ్కొల్పుటయు రథారూఢుండై రయమున నరి గి సూర్యాస్తమయసమయంబున రాజభార్యలతోడఁ బరమదుఃఖాక్రాంతుండై హస్తిపురంబుఁ జొచ్చె. చొచ్చి యచ్చటఁ దొలుత ధృతరాష్ట్రునొద్దనుండి శోకా భిహతుండై వచ్చుచున్నవిదురు నెమరం గనిన నాతండు పుత్త్రికా, కురుక్షయ మున నీవు భాగ్యమునఁ దప్పి బ్రదికితివి. రారాజు లేక నీ వొక్కండవే రాఁ గతం బెయ్యది యనియడుగ నతం డతని కిట్లనియె. శకుని పుత్త్రదాయాదిబాంధవుల తోడ హతుఁడై నపదంపడి దుర్యోధనుండు హతశేషపరీవారుండై తనగుల్మమును

విడిచి ప్రాఙ్ముఖుండై వెఱచి పఱచుటయు రాజకళత్రములం దోడ్కొని దుర్యో ధనామాత్యులు పురమునకు వచ్చుచుండ నేనును ధర్మరాజును వాసుదేవుని వీడ్కొని యంతఃపురాంగనలతోడ నీపురమున కరుగుదెంచితి నని యుయుత్సుఁడు తెల్పిన విని విదురుఁ డతనిం గొనియాడి పుత్త్రా!, కాలోచితకృత్యంబు దయా మతినై లెస్స చేసితివి వీరలోకభీకరం బైనయాఘోరసంగ్రామంబున భాగ్య మునఁ దప్పించికొని బ్రదికి వచ్చిననిన్నుఁ జూచి సూర్యుం జూచినప్రజలయట్లు సంతసిల్లెద. పలుదెఱంగుల హితము బోధించినను వినక దైవోపహతుండై దీ ర్ఘాలోచనంబు సల్పనియాచీఁకురాజునకు నీవొక్కఁడవేనియు నూఁతకఱ్ఱగ నుండె దవు. నేఁ డిచ్చట విశ్రమించి యెల్లి మరి యుధిష్ఠిరునొద్దకుఁ బొమ్మని బాష్ప పూరితలోచనుండై చెప్పి నిరానందంబు గతశ్రీకంబు హాహాకారనీరంధ్రంబు శూన్యరూపంబు నగు రాజభవనముఁ జొచ్చి విదురుఁడు తాను సకలధర్మజ్ఞుఁడయ్యు మనంబున విహ్వలత్వంబు గదుర నిశ్వసించుచుండె. యుయుత్సుండును నిజభ వనంబు సొత్తెంచి స్వకీయులు ప్రశంసించుచుండినను నవ్వాక్యంబులు తన కప్ప డింపుగామింజేసి భారతులవినాశంబే చింతిల్లుచు నారాత్రి యెట్టకేలకుఁ గడపె న నిన ధృతరాష్ట్రుఁడుఁ సంజయా, పాండుపుత్త్రులు మదీయసైన్యములనెల్లఁ బరి మార్చినపదంపడి హతశేషు లైనకృపకృతవర్మాశ్వత్థామ లేమి చేసిరి. మందా త్ముఁ డైనదుర్యోధనుఁ డేమి యొనర్చె ననియడుగ సంజయుఁ డతని కిట్లనియె.

అత్తెఱంగున దుర్యోధనామాత్యులు రాజభార్యలం దోడ్కొని పుర మున కరిగినపదంపడి కృపాదు లగుముప్వురు రథికులును నచ్చట నుండ మనసు గొలుపమింజేసి యాసాయాహ్నమున రాజదర్శనకాంక్షులై ద్వైపాయనహ్రదం బునొద్దకుఁ జనుదెంచిరి. ధర్మనందనుండును భాతృసమన్వితంబుగ సంతుష్టుండై దుర్యోధనుని వెదకుచు నతని నెచ్చటనుం గానక విచారించుచుండె.

## కృపాదులు ద్వైపాయనహ్రదమున నున్నదుర్యోధనుతో సంభాషించుట.

అట్టియెడఁ గృపకృతవర్మాశ్వత్థామలు ద్వైపాయనహ్రదమున డాఁగియు న్నదుర్యోధనుం జేరవచ్చిరి. తత్ప్రకారం బెఱింగించితిఁగదా. అట్లు వా రచ్చోటు సేరి రాజేంద్రా, లెమ్ము. మాతోడం గలిసి యుధిష్ఠిరుఁ బోరికిఁ బిలువుము. ఓపిన కొలఁది పోరి వారలం గెలిచి రాజ్యభోగములఁ బడయుటయొండె వారిచేఁ జచ్చి స్వర్గసౌఖ్య మనుభవించుటయొండెఁ గర్తవ్యంబుకాని యిట్టు లుండఁ దగదు. వారిబలము హతప్రాయం బగుటంజేసియు హతశేషులును మిక్కిలి డయ్యుటం జేసియు రణమున మాఁప్రాపుఁ గాంచిననీ యురువడి సైరింపఁ జాల రనుటయు దుర్యోధనుండు వీరులారా! యిట్టిపాండవకౌరవసంగ్రామసమ్మర్దమున భాగ్యబల మునంజేసి తప్పి బ్రదికినమిమ్ముఁ జూచెద. మన మందఱము మిక్కిలి డస్సియున్న

వారము. వారిబల ముదీర్ణంబై కన్పట్టుచున్నది కావున నిప్పుడు పోరుట సమీ
చీనంబు గాదని తోఁచెడి. ఈగొప్పమనస్సును మాయెడ నత్యంతభక్తియు మీ
కుఁగలిమి నిసర్గజంబకాని యద్భుతంబు కాదు. అయినను నిది పరాక్రమము
నకుఁ గాలంబు గాదు. కావున నీయొక్కరేయి విశ్రమించి బడలికలు వాసి తొ
ల్లి మీతోడ్పాటునం బేర్చి పాండవులతోడం బోరుదునని యున్నవాఁడ ననిన
దుర్యోధనున కాచార్యపుత్త్రుం డిట్లనియె. రాజేంద్రా, లెమ్ము శుభంబు నీ
కయ్యెడి. మనము నైరులం గెల్వఁగలము. సత్యదానజపయేష్టాపూర్తములయాన
నేను సోమకులం జంపుదు. నేఁటిరేయి తెల్లవాఱునంతకు శాత్రవులం బరిమార్ప
నేని యేను సజ్జనోచితం బయినసమరప్రీతిం బొందను పెక్కులేల? పాంచాలుర
నందఱను దెగటార్పక కాని యేను గత్తళంబు పుచ్చ నింతవట్టు సత్య మని వా
రలు తమలోఁ బల్కుచున్నంత వ్యాధులు గొందఱు మాంసభారపరిశ్రాంతులై
డబ్బాటు పానీయార్థం బమ్మడుఁగునకుఁ జనుదెంచిరి. వారు ప్రతిదినంబు భీముని
తదర్థంబు పరమభక్తిమై మాంసభారములం దెచ్చుచుండుదురు. వా రచ్చట మ
నవారల రహస్సల్లాపంబులు విని కంఠధ్వనివలనను వాక్యసందర్భములవలనను
నామడుఁగున డాఁగియున్నదుర్యోధను నూహించి తెలిసికొని సమరమునెడ మన
సులేనిదుర్యోధను నాచార్యపుత్త్రాదులు యుద్ధార్థంబు నిర్బంధించుట యెఱింగి
యాబోయ లంతకుమున్ను పాండునందనుండు దుర్యోధనుని వెదకి తెల్పఁగ నియో
గింపఁబడినవారు గావున మనవారిసంభాషణము విన్నతోడన యయ్యర్థంబుఁ ద
లంపునకుఁ దెచ్చికొని దుర్యోధనుం డీమడుఁగునందు డాఁగియునికి ధర్మరాజున
కెఱింగించితిమేని యతండు ప్రీతుండై మనకు బహుళధనముల నొసంగు. ముం
దుగా నీయుదంతము భీమసేనునకు నివేదించిన నమ్మహాబలుండు పరమప్రమోద
భరితుండై వలసినయర్థము నిచ్చును. శుష్కమగునీమాంసముఁ గొనిపోయినం
బ్రయోజనం బెయ్యది యని తమలో నూహించి యప్పటికిఁ గొనివచ్చినయప్పల
లంపుమోఁపులం గొని యతిరయమున శిబిరమునకుఁ జనిరి. అక్కడఁ బాండవు
లును దుర్యోధనాన్వేషణార్థంబు నానాదిక్కులఁ జారులం బంపియు నతనియునికి
తెలియమిం జేసి చింతిల్లుచుండ నావ్యాధులు ఘణిహారులు వారించినను సరకుగొ
నక త్రోచికొని భీమసేనునివాసంబునకుఁ జని భవత్తనయుండు ద్వైపాయనహ్ర
దంబున డాఁగి తనమాయాబలమున సలిలస్తంభనంబుఁ జేసికొనియుండుట ము
న్నుగా సమస్తంబు సవిస్తరంబుగఁ దేటపడం జెప్పుటయు వృకోదరుండు ప్ర
మోదవికస్వరుండై వారలకు బహ్వర్థంబు పసదనముగా నొసంగి తత్క్షణంబ య
న్నయొద్ద కరిగి యావృత్తాంతమెల్ల నివేదించుటయు ధర్మనందనుం డంపులకుఁ
దమ్ములును దానును బరమానందమునం దనరి జనార్దనపురోగములై మాయా

బలమున సలిలస్తంభనముఁ జేసి దుర్యోధనుండు డాఁగియున్న శీతలవిమలజలపూ రితంబైన రెండవసముద్రంబునా నొప్పారు ద్వైపాయనహ్రదమునకుఁ జనుదెంచిరి. అప్పుడు దుర్యోధనవధార్థులై ధృష్టద్యుమ్నుఁడును శిఖండియు నుత్తమౌజుఁడును యుధామన్యుఁడును సాత్యకియుఁ బెక్కండ్రుపాంచాలవీరులును బహుళమాతంగతురంగపదాతిగణంబులును హర్షోత్కర్షంబు పెంపెసంగ ధరణీతలంబు గ్రక్కదలఁ బాంసుజాలంబు మింటికెగయ సింహనాదంబులును భుజాస్ఫాలనరవంబులును శంఖభేరీప్రముఖవాదిత్రనిస్స్వనంబులును రథనేమినిర్ఘోషంబును హయహేషితంబును గరిబృంహితంబును రోదసీకుహరంబుఁ బూరటింప వెంటఁ దవిలి వచ్చిరి. మేఘగర్జాసమం బయినయయ్యులివు విని కృపద్రోణికృతవర్మ లల్లవారె పాండవులు సేనాసమన్వితంబుగ వచ్చుచున్నవారలు. మే మిప్పుడిచ్చోట నుండరాదు కావునఁ దొలఁగిపోయి మగిడి వత్తు మనుజ్ఞ యిమ్మని రారాజునామంత్రణంబు చేసి వారు దవ్వ్వ చని యొక్కవటవిటపితలంబునం గుఱ్ఱములఁ దేరుల విడిచి తేరులు డిగ్గి కూర్చుండి భండనం బెట్లు కాఁగలయది పాండవులెట్లు కౌరవేశ్వరప్రతిపత్తిం గాంచఁగల రాతం డెట్లు కాఁగలవాఁ డనివిచారించుచుఁ జింతాక్రాంతులై యుండిరి. అట్లు వారల వీడుకొల్పి భవదగ్రనందనుండు మాయాబలంబునఁ దొల్లింటియట్ల జలస్తంభనంబుఁ గావించికొనియుండె.

## పాండవులు ద్వైపాయనహ్రదంబుఁ జేరవచ్చుట.

అట్లు కృపాదిరథికత్రయంబు సనినపదంపడి పాండవులు భవత్తనయసంస్తంభితసలిలంబై యున్న ద్వైపాయనహ్రదంబుఁ జేరుటయుఁ బాండవాగ్రజుండు గదాగ్రజుం జూచి వాసుదేవా. చూచితే దుర్యోధనుండు తనమాయాబలమున జలస్తంభనంబుఁ జేసి యిందు డాఁగినవాఁడు. వీనికి మనుష్యులవలనిభయము గానంబడదు. వంచనాపరుఁ డైనయీదురాత్ముఁ డెట్లు వంచన చేసినను నింద్రుఁడు తాన వచ్చి తోడ్పడినను నీతండు నన్నుఁ దప్పించికొని బ్రదుకఁ జాలఁడు. సమరమున వీనిం జంపుట నిక్కవం బనుటయు మాధవుఁడు ధర్మరాజున కిట్లనియె. భరతపుంగవా, మాయావి యగునీదుర్మార్గుని మాయచేతన వధింపవలయు నిది సత్యంబు. అట్టియుపాయమున వీనిపని చక్కఁజేయవలయు. ఉపాయమునంగదా తొల్లి యింద్రుఁడు దైత్యదానవుల వధించె. వృత్రుని సంహరించె. ఉపాయమునంగాదె బలి బంధనంబుఁ బడసె. హిరణ్యాక్షహిరణ్యకశిపులు నుపాయముననేకదా నిహతులైరి. శ్రీరాముఁడు రావణుని సబలముగ నుపాయమునంగదా తెగటార్చె. తారకవిప్రచిత్తిప్రముఖులను నే నుపాయముననకదా తెగఁజూచితి. సుందోపసుందులు వాతాపీల్వలులు మఱియుం బెక్కండ్రును నుపాయంబుననేకదా నిహతులైరి. క్రియాభ్యుపాయములనే యింద్రుఁడు త్రిదివ మేలుచున్నవాఁడు

కావున నీవును దగినక్రియాభ్యుపాయములం బన్ని మాయాశీలుం డై నదుర్యో ధనుం దెగటార్పుము. తగిన వెరవు చూచికొ మ్మనుటయు ధర్మనందనుండు జల స్థితుండై నకీసుతుని నిర్దేశించి నవ్వుచు నిట్లనియె.

ధర్మరాజు దాఁగినదుర్యోధనునిఁ దూలనాడుట.

సుయోధనా, యిది యేమిప్రయత్నంబు. సమరమున సకలక్షత్రియుల ను స్వకులమునుం గోల్పోయి యాత్మజీవితంబుఁ గోరి యిమ్మడుఁగున డాఁగితివి. లెమ్ము. మాతోడఁ బోరు సమకట్టుము. మున్ను నీ కుండిన యాదర్పమును మానము నెక్కడకుఁ బోయె. వెఱచి జలస్తంభనంబుఁ జేసికొని యుండెదవు. ని న్నందఱు శూరుఁ డందురు. నీశౌర్యమ్ము వ మ్మయ్యె. క్షత్రియుండవు. విశేషించి యుత్తమం బై నకురుకులమున జనించినవాఁడవు. కులమును జన్మమునుం దలపో యుము. ఉత్తమకులసంజనితుం డై ననీ కీవెఱ పెట్టులు కలిగె. ఇప్పుడు పో రుడు గుట ధర్మంబు గాదు. దురమున వెఱచి పఱచుట పెద్దలమతంబును బరలోక శ్రేయంబునుం గాదు. కొడుకులు తమ్ములు తండ్రులు తాతలు మామలు బంధు వులు సంబంధులు మిత్రులు మున్నగువారలనెల్లఁ బోరఁ జంపించి యెట్లు నీయొడ లోమికొనఁ గోరి యిమ్మడుఁగున డాఁగితివి. శూరుఁడ ననితలంచు కొనువాఁడవ కాని నిక్కంబ నీవు శూరుఁడవు కావు దుర్బుద్ధీ, యెల్లవారును వినంగ శూరుఁడ నని యెట్లు తన్నుఁ దాన పొగడికొనుచుంటివి. శూరు లెట్టియిడుమలు దొడరినను బోరఁ బాఱుదురే. ఏధైర్యంబు గలుగ నీవు రణరంగంబుఁ దొఱంగి పఱచితివి నీవ చెప్పుము. ఇప్పుడై న వెఱపు విడిచి లేచి పోరికి రమ్ము. కర్ణశకు నుల నాశ్రయించి వారు గెలిపింతు రనినమ్మి నీకొలంది యెఱుంగక సమ్మో హమున నడిబీరములు పలుకుచుండి వారెల్లరుఁ దెగినపదంపడి యిట్టు లిడు మలం బడితివి. ఆపౌరుష మెక్కడకుఁ బోయె. ఆమాన మేచోట నడఁగె. ఆపరాక్రమ మే మయ్యె. ఆయాగ్గప్ప లెచ్చట డాఁగె. ఆయస్త్రచాతుర్య మేయూరికిఁ బోయె. వెఱచి యిప్పుడు మడుఁగునఁ బడియుండెదవు. క్షత్రధ ర్మంబుఁ దలపోసి లేచి వచ్చి యోపినకొలంది పోరి మమ్ము గెలిచి మహీమండ లం బేలుము. అందులకుఁ జాలవేని మాచేత హతుఁడ వగుము. క్షత్రియుల కిది బ్రహ్మనిర్మితం బై నయుత్తమధర్మంబు. రాజవై తేని యిట్లు చేయు మను టయు సలిలస్థితుండై దుర్యోధనుండు ధర్మరాజున కిట్లనియె.

దుర్యోధనుఁడు ధర్మరాజున కుత్తరం బిచ్చుట.

మహారాజా, ప్రాణవంతులు వెఱతు రనుట చిత్రము గాదు. ఏను బ్రా ణభయముననొండె విషాదముననొండె నీమడుఁగుఁ జేరినవాఁడఁగాను. మఱి విర థుఁడను నిరాయుధుఁడను నిస్సహాయుఁడను నత్యంతశ్రాంతుఁడను నవుటం జేసి

కొంతతడవు విశ్రమింపఁ దలంచి యిం దుండెద. నీవును మీవారును విశ్ర మించుఁడు. నేను నింతలో నేద దేఱి లేచి వచ్చి మీతోడం బోరుదు ననవుడు ధర్మనందనుండు సుయోధనా, మే మిందాఁక విశ్రమించి నిన్ను వెదకుచున్నవా రము. నీవును బెన్డయుం బ్రొద్దు విశ్రమం బొందితివి. ఇంక లేచి పోరి మమ్ము నిర్జించి పూర్ణరాజ్యం బనుభవింపుము. అంతకుఁ జాలవేని మాచే నిహతుండవై వీరలోకంబుఁ బడయు మనినపాండవాగ్రజునకు ధార్తరాష్ట్రాగ్రజుం డిట్లనియె. కురునందనా, యెవ్వరికొఱకు నేను రాజ్యముఁ గోరుదు నట్టినాతమ్ము లందఱు నిహ తులైరి. క్షీణరత్నము హతక్షత్రియంబు నగుభూమిని విధవ యగువనితంబోలె నేను భోగింప నొల్లను. ఇప్పుడు నేను సర్వపాంచాలురయుఁ బాండవులయు నుత్సాహంబుఁద్రుంచి నిన్ను గెలువఁ గోరియుండెదఁగాని భీష్మద్రోణకర్ణులు పడిన పదంపడి యుద్ధమునం గార్యంబు నాకుఁగన్పడదు. అసహాయుండైనరా జెవ్వఁ డు పుడమి నేలఁ దలంచును? అట్టిపుత్త్రులను మిత్రులనుఁ దమ్ములనుఁ దండ్రు లనుం గోల్పడి రాజ్యము మీరు హరించుచుండ నాయట్టివాఁడు జీవింప నేర్చు నే? ఇప్పుడు రాజ్య మనుభవింపఁగ నాకు మనసు గొలుపదు. ఈభూమండలం బెల్ల నీ కిచ్చితి. ఏ నింకమీఁద నడవులకుఁ జని యందుఁ గృష్ణాజినములఁ గట్టి తపంబు సల్పెద. స్వజనరహితుండైననాకు జీవితంబుమీఁద నాసక్తియును లేదు. బాంధవవిహీనము దురంగమాతంగరహితము రత్నకనకవర్జితము నగు నట్టిపృథివీతలంబు నీవ యథాసుఖం బేలికొనుము. పొమ్మని సలిలస్థితుండై పల్కు చున్నదుర్యోధనునకు యుధిష్ఠిరుండు వెండియు నిట్లనియె.

తాత, యిట్టు లార్తప్రలాపంబులు నీరిలో నుండి పలుకవలదు. శకుని వాసితంబుపోలె నిది నామది కెక్కదు. సుయోధనా, నీవు పుడమి నొసఁగఁ జా లుదువేనియు నీయిచ్చుపుడమి నేలఁగ నామనంబు గొల్పదు. అధర్మమున నేను భూమిని గ్రహింపను. క్షత్రియునకుఁ బ్రతిగ్రహము ధర్మము గాదుకదా. నిన్ను రణమున గెల్చి వసుంధర నేలుదును. మఱియు నీవు భూమి నొసంగ నిప్పు డీశ్వ రుండవు గావు. ధర్మముఁ దలంచి శాంతిని గులక్షేమమును గోరి వాసుదేవుఁడు మీయొద్దకుఁ జనుదెంచి కొంచెముభూమియైన నిమ్మని తెఱంగుపఱచిన నప్పు డ మ్మహాత్మువచనంబుఁ గొనక వాఁడిసూదిమొన మోఁపినంతేనియుఁ బుడమి యే నీ నని తెగఁబాఱి పల్కిననీ విప్పు డెట్లులు సకలమహీమండలం బియ్యఁ దలంచె దవు. ఇది యేమి చిత్తవిభ్రమంబు. పగవార లెత్తివచ్చినప్పు డేభూమిపాలుండు రాజ్య మియ్యఁ దలంపు గొనును. ఎట్టిమూఢుఁడైననుఁ బగతునకు రాజ్య మొ సఁగ నుత్సహించునే? కేవలమూర్ఖత్వమునంజేసి మూఢుఁడవై నీవు కార్యాకా ర్యముల నెఱుంగవైతివి. వెండియు భూమండలం బిత్తువేనియు నీవు ప్రాణములఁ దప్పించికొని పోవ నేరవు. యుద్ధసన్నద్ధుఁడవై మొనకొలంది పోరి మమ్ము గెల్చి

రాజ్య మేలుము. కాదేని మాచేఁ జచ్చి యుత్తమలోకములం బ్రాపింపుము. నీవును నేనును బ్రదికియుండఁగ సర్వభూతములకును విజయమునెడ సందేహంబు గదిరెడి. నీప్రాణములు నాచేతిలో నున్నయవి. నీబ్రదుకు నాకును సమ్మతంబుకాని నీవు బ్రదికింపఁదగవు. లక్కయింటఁ గాల్పించియుఁ బాములఁ గఱపించియు విషముఁ బెట్టించియు నీళులఁ ద్రోయించియు రాజ్యము నాఁచికొనియుఁ బలుతెఱంగులఁ బ్రల్లదము లాడియు ద్రౌపదిముందల వట్టి యీడ్పించి భంగపెట్టియుఁ బలుతెఱంగుల మమ్ముఁగాఱించుటలు గారణంబులుగా నీ బ్రదిమి యెంతయుందగదు. లేలెమ్ము పోరికి రమ్ము. దురమ్మున మే లగు నని యిట్లు జయయుక్తముగ బహువిధముల నావీరులు పలుకుచుండిరనిన విని ధృతరాష్ట్రుఁడు సంజయా: పాండవజ్యేష్ఠుఁ డిట్లు బెదరించిన సహజరోషుం డయిననాకొడుకు గాఁమీఁదట నెట్లయ్యె. ఇట్టిసంతర్జనంబు వాఁడెన్నఁడును విన్నవాఁడు గాఁడుగదా. రాజభావమున నతండు సర్వలోకమాన్యుండై యుండె. సూర్యునిఛాయ యెట్లట్ల నిజాతపత్రచ్ఛాయ యెడఁబాయకయె యుండె. అభిమానము కారణంబుగా ఖేదార్థంబై తర్జనంబు వానిచే నెట్లు సైరింపఁబడియె. మ్లేచ్ఛాటవికాది సమన్వితంబుగా సమస్త పృథివీజనులును వానిప్రసాదమునం జేసికదా ప్రాణముల ధరించియుండఁ గలిగె. అట్టిపరంతపుఁడు స్వకీయభృత్యజనవిరహితుండై నిర్జనస్థానంబున విశేషించి పాండుపుత్రులు చుట్టుముట్టి యత్యంతకఠినవచనములఁ బలుమాఱు లట్టులు సంతర్జనంబు సేయఁగ వారల కతం డేమి యుత్తరం బిచ్చెఁ దెలియం జెప్పు మనియడుగుటయు నావిచిత్రవీర్యతనయునకు సూతతనయుం డిట్లనియె. రాజేంద్రా, భ్రాతృసమన్వితుండై యుధిష్ఠిరుం డట్టులు బెదిరించుటయు భవదగ్రసుతుండు నీరిలోన యుండి కఠోరము లగునప్పలుకులు విని విషమస్థుండు గావునఁ బలుమాఱులు వేఁడి నిట్టూర్పులు నిగిడించి సలిలనిర్గతుండై మాటికిఁ జేతులు విదిర్చి యుద్ధమునెడ మనసు పెట్టి ధర్మరాజున కిట్లనియె.

ధర్మనందనా, మీరు మిత్రబలంబును రథవాహనాది సకలసహాయమునుం గలిగియున్నవారలు. నేను విరథుఁడను హతవాహనుఁడను నిరాయుధుఁడను సర్వవిధసహాయరహితుఁడను బదాతినినై యున్నవాఁడను. మీ రందఱు నెక్కయుమ్మడిన కవియుదెంచిన నే నెట్లు మార్కొందును. ఒక్కరొకరుండు తాఁకిన సరకుగొనక పోరుదు. పలువు రొక్కని నఱుముట పాడి యగునె? విశేషించి యేనుగత్తళంబు లేకయు డస్సియు నాపదలం గుందియు వాహనసైనికులతోడ్పాటు లేకయు నింత చెప్పితిఁగాని నీకును వృకోదరునకు నర్జుననకుఁ గవలకు మురారికి సాత్యకికిఁ బాంచాలురకునుఁ దక్కు గలసైనికులకును వెఱచి కాదు. ఏనొక్కరుండనయ్యుఁ గినుక గదిరి తలపడితినేని మి మ్మందఱను నాఁగుదును. సజ్జనులకీర్తి ధర్మమూలంబు కావున ధర్మమునుఁ గీర్తినిం బాలింప నిట్లు

చెప్పితి. సంవత్సరంబు ఋతువులంబోలె మి మ్మెల్ల నే నొక్కండన యాక్రమిం
తును. నిశావసానంబున భానుమంతుఁడు నక్షత్రములంబోలె మిమ్ముఁ దేజోవిహీ
నులం జేయుదుఁ జక్క నిలువుఁడు. నిన్నును మీవారల నెల్లరనుం బరిమార్చి
యేను నాతదర్థంబు పోరఁ బ్రాణములం గోల్పడిన భీష్మద్రోణకర్ణబాహ్లీక భూరి
శ్రవస్సోమదత్త భగదత్తసైంధవశల్యశకుని ప్రముఖులఋణముఁ దీర్చెద నని
పల్కి యూరకున్నంతఁ గౌంతేయాగ్రజుండు సుయోధనా, భాగ్యవశంబున క్షత్ర
ధర్మంబుఁ దెలిసితివి. నీబుద్ధి యుద్ధార్థం బయ్యె. శూరుఁడవైతివి. మ మ్మందఱను
మార్కొందు నంటి వంతియ చాలు నొక్కొక్కనితోడ నీయిచ్చకు వచ్చినకై
దువుకొని కవియుము. లాఁతు లందఱు వేడుకఁజూచుచుండెదరు. మఱియు
నిం కొక్కొక్కవరం బొసంగెద. మాలో నొక్కని వధించి రాజ్యమెల్ల నేలుము. అత
నిచేఁ జచ్చి వీరస్వర్గంబు సాధింపు మనుటయు దుర్యోధనుండు వెండియుఁ బాం
డవజ్యేష్ఠున కిట్లనియె. ఒక్కండు నాతోఁ బెనంగునేని శూరునిం బంపుము. నీ
సమ్మతంబున నీపోరికి గదాదండంబుఁ గొనియెద. ఉత్సాహంబు గలవాఁడు గ
దాపాణియై నాతోడఁ బెనంగుఁగాక. విచిత్రము లగునానారథయుద్ధములు పె
క్కు లింతకుమున్ను చెల్లినయవి. ఇదియొక్క గదాయుద్ధ మద్భుతంబుగ నగుఁగా
క. అస్త్రములయు యుద్ధములయుఁ బర్యాయంబు శూరులు సమ్మతింతురుగ
దా. గదారణంబున నిన్ను నీ తమ్ములను బాంచాల సృంజయాదు లగునీవారల
నందఱను నేను నిర్జించెద. నిర్జరేంద్రుండు తాన వచ్చినను నాకు సంభ్రమం
బింతయు లే దనవుడు యుధిష్ఠిరుండు గాంధారీనందనా, లేలెమ్ము నన్ను మార్కొ
నుము. పురుషుఁడవై సమాహితుఁడవై పోరికిఁ గడంగుము. ఇంద్రుఁడు ప్రాపై
వచ్చినను నీవు బ్రదుకుట గలుగ దనిన విని సుయోధనుం డట్లు పరుషవచనప్ర

## దుర్యోధనుండు మడుగు వెడలివచ్చుట.

తోదపీడితుండై నీరిలోన యుండి బిలముననుండి రోఁజుకాలసర్పంబుపగిదిఁ బెద్ద
యు నిశ్వసించుచుఁ గశాతాడనసంధుక్షితం బైనయుత్తమాశ్వంబు చందమున
సువర్ణపరిష్కృతంబు శైక్యాయసమయంబు మహాభారవంతం బద్రిసారంబు న
గుగదాదండ మంసపీఠమున నమర్చికొని తోయస్తంభనం బుడిపికొని జలంబువె
డలి మధ్యాహ్నమార్తండుని తెఱంగున వెలుంగుచున్నతనిం గనుంగొని యం
దఱు శిఖరసముజ్జ్వలం బైనమహీధరంబువిధమునను శూలపాణియగురుద్రుని
భంగిని దండపాణి యగునంతకునిరీతినిం దలంచిరి. అట్లు తోయస్తంభనంబు భే
దించికొని వచ్చిన దుర్యోధనుం గాంచి పాంచాలురును బాండవులును జేతులఁ
జప్పట్లు చేయుటయు నతం డయ్యది యపహాసంబుగాఁ దలంచి కన్నులు ద్రిప్పి
బొమలు మూడుమొనలుగ ముడి పెట్టి యవుడు గఱచి పాండవులారా, మీరు
ను బాంచాలురు నీయపహాసమునకుఁ బ్రతిఫలంబుగా నాచేఁ జచ్చి యమసదనం

బునకుఁ బోయెద రని మేఘగర్జాసమం బయినయెలుం గేర్పడ నాఁబోతురీతి నార్చుచుఁ బెన్నెత్తుటం జొత్తిల్లినతనమేను రక్తధాతుపరీతం బైనపర్వతంబుచాడ్పున నెప్పుచుండ నంసపీఠంబున నమర్చినగదాదండంబు కినుక పూనిన వైవస్వతునిచేతిదండము ననుకరించుచుండఁ బాండవజ్యేష్ఠున కిట్లనియె. మీలో నెక్కఁడొక్కఁడు నాతోఁదలపడవలయు. ఒక్కరునితోడం బెక్కండ్రు పెనంగుట ధర్మవగునె ? విశేషించి నేను వికవచుండనుఁ బెద్దయు డస్సినవాఁడను నీళులఁ దడిసినవాఁడను నెంతయు నెత్తుటఁ దోఁగినవాఁడను హతవాహనసైనికుఁడను గదా. మీరందఱును నాతోఁ బెనంగుట యవశ్యకర్తవ్యంబు కాని యుక్తాయుక్తముల నీవెఱుంగుదువు కావునం జెప్పితిననిన దుర్యోధనునకు ధర్మరాజిట్లనియె. క్షత్రధర్మ మత్యంతక్రూరంబు. అందు దయయు నపేక్షయు నించుకేనియుఁ గానరాదు. బాలుని నసహాయుని విరథుని నభిమన్యు నెకరునిఁగాదె మీ రందఱు పలువురు చుట్టు ముట్టి చంపితిరి. అప్పు డీబుద్ధి నీ కేల కలుగ దయ్యె. మీరెల్ల వారును ధర్మవిదులును శూరులును జీవితనిరాశులునుగారె. ఎల్లవారును దమకు సంకటములు దొడరినప్పుడు ధర్మమును విమర్శింతురు. పదమున నున్నయప్పుడు పరలోకద్వారంబుఁ గాన రని యెత్తి చెప్పి యతని నిరుత్తరుం జేసి యిది నీకు నిదర్శనంబుగా మీచేసినది చూపితింగాని యొండుగాదు. న్యాయమునఁ బోరాడువారి కింద్రలోకంబు సిద్ధంబు గావునఁ బాడి తప్పక నడుతుము. అట్లే యొక్కండు నీతోడం బెనంగువాఁడు. ఇవె కవచాదిసాధనంబులు గలవు. నీవలసినవానిం గ్రహియింపుము. తలఁ గట్టికొని కట్టాయితుండ వగుము. మఱియు నీ కెయ్యది లేకుండు వానినెల్ల నడిగి పుచ్చుకొనుము. వెండియు నెం డొక్కవరం బొసంగెద. పాండవు లేవురిలోపల నీ వెవ్వనిం గోరికొనియెద వాతనితోడం బెనంగి గెల్చితివేని రాజ్యమెల్ల నేలికొనుము. అంతకుఁ జాలవేని యాతనిచేఁ జచ్చి స్వర్గలోకంబుఁ బడయుము. ప్రాణదానం బొక్కటి దక్క నెయ్యది యేనియుం గోరికొను మిచ్చెద ననిన విని దుర్యోధనుండు పసిండికత్తళంబు పుచ్చికొని తొడిగి విచిత్రజాంబూనదశిరస్త్రాణంబు గ్రహించి ధరించి మేరుమహీధరంబు చాడ్పునం జూడ నొప్పారుచు గదాపాణియై కదనరంగంబున నిల్చి పాండవాగ్రజా, మీలో నెక్కండు గదఁ గొని నన్నుమార్కొనవలయు. కవలలో నెక్కఁడొండె నర్జునుఁడొండె భీముఁడొండె నీవొండె రాఁదగు. నే నీగదాదండమున మిమ్ము నిర్జించి పగ యడఁగించెద. గదాయుద్ధమున నాకు సాటి వచ్చుజగజెట్టి లేఁ డని నామతంబు. మి మ్మందఱను గదచే నడిచెద. న్యాయసరణిం గదాయుద్ధమున మీరు నాతోడం బెనంగఁ జాలరు. ఇట్లు గర్వోద్ధతంబుగాఁ బల్కఁ జనదు కాని యీక్షణంబ నామాట సత్యంబు మిథ్యయనునది తెల్లం బయ్యెడి. నన్నుఁ దాఁకువాఁడు గదఁ గొని వచ్చుఁ గాక యని శౌర్యభరితుండై దుర్యోధనుండు పెద్దయెలుంగునఁ బల్కుచుం

డ వాసుదేవుఁడు కినిసి యతండు వినకుండఁగ ధర్మరాజున కిట్లనియె.

### శ్రీకృష్ణుఁడు ధర్మరాజుతోఁ గార్యవచనములు దెల్పుట.

యుధిష్ఠిరా, వీఁడు నిన్ను నర్జునుని నకులుని సహదేవునిం బిలుచునేని
యే మయ్యెడి. ఏల యిట్లు మాలో నొక్కని నిర్జించి రాజ్య మేలు మని తెగఁ
బల్కితివి. గదాపాణి యగువీనిం బోర మార్కొని గెలువ మీరు చాలరు. ఇ
తండు భీమసేనవధతాత్పర్యమునఁ బదుమూఁడేఁడు లయోమయపురుషునందు
గదాయుద్ధచాతుర్యం బలవరించికొన్నవాఁడు. కరుణాభరంబున సాహసించితివి.
వృకోదరుఁ డొక్కరుఁడ తక్క లాఁతు లెవ్వరును గదాయుద్ధమున వీనిం దాఁకఁ
జాలరు. అతండు నం దంతగ శ్రమపడినవాఁడు గాఁడు. మున్ను శకునితో
నెట్టు లట్టు లిప్పుడు విషమద్యూతంబుఁ దొడఁగితివి. భీముఁడు బలవంతుఁడు. సు
యోధనుఁడు నేర్పరి. బలియుఁడు నేర్పరి యనునీయిరువురిలో నేర్పరియే విశేషిం
చును. విషమస్థుం డైనపగతుని బుద్ధిపూర్వకంబుగ సమస్థుంజేసి మమ్ము విష
మములం ద్రోచి యిడుమలం బఱిచితివి. శాత్రవుల నెల్లవారిం జయించి జీవి
తసంశయదశాప్రాప్తుం డైనయొక్కనిచేఁ దనకు వచ్చినరాజ్య మెల్లఁ బోఁగొట్టి
కొన నెవ్వఁడు దలంచును. గదాహస్తుం డైనదుర్యోధనుని దురంబునఁ దాఁకి
గెల్చువాని నే నెఱుంగను. అమరులుం జాలరు. నీవును బార్థుండును గవలు నా
తనిం గెల్వఁ జాలరు. భీమసేనుండు గెల్చు నోడు ననునర్థంబున సందియం బయ్యె
డి. న్యాయయుద్ధమున నితనిం గెల్చుట దుష్కరంబు. ఇప్పు డిట్టివరము లిచ్చు
వారలును గలుగుదురే? పాండురాజును గుంతీదేవియుఁ గన్నసంతానంబునకు రా
జ్యభోగములఁ గుడుచుభాగ్యంబు లేదుకాఁబోలు. మరి యత్యంతవనవాసంబును
భైక్షజీవనంబును సల్పఁగ విధాత నిర్మించియుండునొక్కొ యనిన మురారికి వృ
కోదరుం డిట్లనియె. మధుసూదనా, విషాదంబు వలదు. తీర్పరానిపగ నేఁడు నేను
దీర్చెద. దుర్యోధనుని నేను రణంబున వధియించెద. సంశయంబు లేదు. ధర్మ
రాజునకు విజయము ధ్రువంబై కన్పట్టుచున్నది. దుర్యోధను గదకంటె మదీయ
గద యధ్యర్ధగుణగురుతరంబు. వ్యథ విడువుము. నేను వీనితో గదాయుద్ధ మొ
నరింప నుత్సహించెద. మీ రందఱు వేడుకఁ జూచుచుండుఁడు. సురగణసమన్వి
తంబుగా ముల్లోకములు నానాసాధనములం గొని యెత్తి వచ్చినను నేను మా
ర్కొని గెలువఁ జాలుదును. ఇంక సుయోధనుం గెల్చుట చెప్పవలయునే యనిన
వృకోదరుం గొనియాడి వనజోదరుండు సంతుష్టుండై యిట్లనియె.

### శ్రీకృష్ణుఁడు భీము నగ్గించి దుర్యోధనునితోడిగదాయుద్ధమునకుఁ బనుచుట.

బకాంతకా, నీప్రాపుఁ గని ధర్మరాజు నిహతశాత్రవుండై నిజరాజ్యలక్ష్మీ
వైభవంబుఁ బడసినవాఁ డింతయు నిస్సంశయంబు. ధృతరాష్ట్రపుత్రుఁడును గా
ళింగమాగధప్రాచ్యగాంధారప్రముఖు లగునానారాజులును రాజపుత్రులును నీ

చే బొలిసిరి. బహుళదంతావళసమూహంబులఁ గూల్చితివి. ఇప్పు డీదుర్యోధ నుం జంపి యుపేంద్రుఁ డింద్రునకుంబోలె సర్వపృథివీమండలంబు ధర్మరాజునకొ సంగుము. పాపాత్ముఁ డై నదుర్యోధనుఁడు నిన్ను మార్కొని తాఁ జెడుటనిక్కువంబు. నీవు వీనితొడలు విఱుగ నడిచి ప్రతిజ్ఞఁ దీర్పుము. అతండు నేర్పరియుబలియుఁడు సమరనిపుణుఁడును గావున మేలిపూనికితోఁ బెనంగవలయునని యగ్గించి పురికొల్పుటయు సాత్యకియు నట్ల యమ్మహాబలనందను నభినందించె. ధర్మరాజ ప్రముఖు లగుపాండవులును బాంచాలురును భీమసేనువచనంబుఁ గొనియా డిరి. అట్టియెడ భీమసేనుండు భానుమంతుని తెఱంగున వెలుంగుచు సృంజ యపరివృతుండై యున్నధర్మసుతున కిట్లనియె. మహారాజా, నే నీదుర్యోధ నుం దాఁకి పోర నుత్సహించెద. ఇప్పాపాత్ముండు నన్ను గెలువఁ జాలఁడు. అర్జునుండు ఖాండవంబున నగ్నింబోలె నామది నెంతయు నెలకొనియున్న క్రోధంబు నేఁడు వీనిపయిం దిగవిడిచెద. ఉద్దండ మగుగదాదండమున నిప్పా పాత్ముని వధియించి భవదీయహృదయశల్యంబు నేఁడు వాపెద. నేఁడు సుఖయిం పుము. అనఘా, కీర్తిమయమాల్యంబు నీకు సమర్పించెద. నేఁడు సుయోధనుం డు ప్రాణములను సంపదను రాజ్యమును విడుచువాఁడు. నేఁడు ధృతరాష్ట్రుఁడు తనకొడుకు నాచే బడుట విని శకునిబుద్ధికల్పితం బయినయశుభకర్మముఁ ద లంపునకుఁ దెచ్చికొను ననిపలికి గదాపాణియై సుత్రాముఁడు వృత్రుంబోలె దు ర్యోధనునిఁ బోరికిఁ జీరిన నాతం డెంతయు వీర్యవంతుండు గావున నయ్యాహ్వానం బునకుఁ గినుక గదుర మత్తమాతంగంబు గంధగజంబునుంబోలె నమ్మహాబలనం దను నెదిర్చి సమకట్టుటయు గదాదండమండితుండై శిఖరసముజ్జ్వలం బైనకై లాసభూధరంబుకరణి నొప్పుచు యూథముఁ బాసినమత్తసింధురంబుభంగి నేకా కియై యున్నయన్నరేశ్వరుంగాంచి కౌంతేయులు సంతసించిరి. నిస్సహాయుండ య్యు నీకొడుకు సంభ్రమము భయము గ్లాని వ్యథయు నించుకేనియు లేక సిం హము చందమున ధైర్యధుర్యుండై పొలిచె. అప్పుడు భీమసేనుఁడతని కిట్లనియె. దుర్యోధనా, నీవును నీతండ్రియగు ధృతరాష్ట్రుఁడును మాకుఁ జేసిన పాపకర్మము లనెల్ల దలంచికొనుము. వారణావతంబున లక్కయింటఁ గాల్పించుటయు సభామ ధ్యమున రజస్వల యగుపాంచాలిని భంగపెట్టుటయు శకునికైతవమున ధర్మరా జును జూదమున నోడించుటయు మున్నగునవి యింకను నిరపరాధులగు మా కేమేమి చేసితిరి వానికెల్లఫలము నేఁడు చూడుము. కురుపితామహుఁ డగుగాంగే యుఁడు నీకై శరతల్పమునఁ బడియున్నవాఁడు. ప్రతాపవంతు లగుద్రోణకర్ణ శల్యులుహతులైరి. పగకెల్ల మూలం బైనశకుని చచ్చె. నీతమ్ములు కొడుకులు యుద్ధమునఁ బరాఙ్ముఖులుగాని పలువురు రాజులునుం బొలిసిరి. ద్రౌపదీక్లేశ కారి యగు ప్రాతికామియు నిహతుం డయ్యె. కులనాశకుఁడ వధమపురుషుఁడ

వగుసీ వ్రెక్కరుండవే యింక మిగిలియుండెదవు. నీగర్వమెల్లను రాజ్యకాంక్షను
బాండవులయెడ నీయొనర్చిన దుష్కృతంబును రూపుమాపి మదీయగదాదండ
మున నిన్నడిచెద నిది నిస్సంశయం బనిపల్కిన విని దుర్యోధనుండు వృకోదరా,
యీప్రశంసనంబునఁ బ్రయోజనం బెయ్యది. చక్క నిల్చి పోరుము. నీయుద్ధా
సక్తి నేఁ డపనయించెద. పాపాత్మా, హిమవచ్ఛిఖరాకారమగు గదాదండముఁ
గొని యుద్ధవ్యవస్థితుండనైయున్న నన్నుఁ జూడవెక్కొ. గదాపాణి నైననన్ను న్యా
యయుద్ధమున నింద్రుఁడైనను మార్కొనఁ జాలఁడు. నిర్జలం బైనశారదనీరదం
బట్లు వ్యర్థముగఁ బెక్కుమాఱు లఱవవలదు. నీకుఁ గలబలమెల్లఁ బోరఁ జూపు
మనిచెప్పిన విని పాండవులును బాంచాలురును దద్వచనంబుఁ బ్రస్తుతించి చేతి
చప్పుళ్ల మదేభంబునుంబోలె నతనికి ముదంబుఁ బుట్టించిరి. అప్పుడు జయార్థు
లగుపాండవులకు శుభసూచకంబుగాఁ గరిబృంహితములును దురగహేషితము
లును శస్త్రాస్త్రదీపనంబునుం గనుపట్టె.

### భీమదుర్యోధనులగదాయుద్ధముఁ జూడ బలరాముఁడువచ్చుట.

అట్టియెడ నీవృత్తాంతముఁ దెలిసి బలభద్రుండు భీమదుర్యోధను లిద్దఱు
ను దనకు శిష్యులు గావున వారిపోరు సూడ వేడుక గడలుకొనినమనంబుతో న
చ్చోటికి వచ్చుటయుఁ బాండవులు వాసుదేవసమన్వితులై పరమముదం బెరసి
యందఱును బ్రత్యుత్థానం బొనర్చిరి. అప్పుడు పాండవాగ్రజుం డాకృష్ణాగ్రజుం
గాఢ పరిరంభణంబున నాదరించె. వాసుదేవార్జును లభివాదనంబు సల్పి పర
మామోదమునఁ గౌఁగిలించికొనిరి. కవలును ద్రౌపదేయులును నాహలాయుధు
నకు దండనమస్కారంబుఁ జేసి కొల్చియుండిరి. భీమసేనదుర్యోధనులు గదాపా
ణులై పూజించిరి. సాత్యకియుం బ్రణమిల్లె. ఇట్లు సముచితప్రకారంబున నంద
ఱును బరిష్వంగప్రణామము లాచరించి స్వాగతానుయోగంబును గుశలసంప్ర
శ్నంబును నడిపి విధియుతంబుగఁ బూజించుటయు నాబలభద్రుండు యుధిష్ఠిరు
నాలింగనంబుఁ జేసికొనియు వాసుదేవసాత్యకులను నిండుఁగౌఁగిటం గ్రుచ్చి శిరం
బులు మూర్కొనియుఁ దక్కినవారల సాదరానుగ్రహవీక్షణంబున మన్నించియు
మఱియు నచ్చట నున్నరాజలోకంబుఁ గనుంగొని వయోవిద్యానురూపంబుగఁ
గరుణాభరంబునఁ గుశలప్రశ్నంబు నడిపియు నమ్మహారథులమధ్యంబునఁ నీలవస
నధరుండైన యాశ్వేతగాత్రుం డుపవిష్టుండై తారాగణపరివృతుం డైనమృగలాం
ఛనుకరణిం దనరుచుండ ధర్మనందనుండు మహాత్మా, భవత్ప్రియశిష్యు లగు నీయ
న్నదమ్ములగదారణముఁ గనుంగొను మని తెలుపఁగ నాసమరంబు తుములంబై
చెల్లె నని సంజయుండు ధృతరాష్ట్రునకుఁ దేటపఱుచుటయు జనమేజయుండు వై
శంపాయనుం జూచి మునీంద్రా, బలభద్రుండు తొలుత యుద్ధోద్యోగ సమయం
బుననే యేను పాండవధార్తరాష్ట్రుల కేరికిం బోరఁ దోడ్పాటొనర్చ నిచ్ఛకు వచ్చి

నట్లు తీర్థయాత్రకుఁ బోవుదు నని దామోదరు నామంత్రణంబు చేసి యప్పుడే యరిగెఁగదా. అతనియాత్రాక్రమంబు నాగమనంబును భీమదుర్యోధనులగదాయుద్ధ మెట్లు ప్రవర్తిల్లెఁదత్ప్రకారంబును వివరించి చెప్పవే యనియడుగ నాభూవల్లభునకు మునివల్లభుం డిట్లనియె.

— బలరామతీర్థయాత్రాకథనము. —

పాండవు లుపప్లావ్యమున నున్నతఱి సర్వహితార్థంబు కౌరవపాండవులకు సంధి సేయఁగ నజాతశత్రుండు పనుప వనజోదరుండు కరినగరంబునకుఁ జని ధృతరాష్ట్రసభలోఁ బలుదెఱంగుల హితవచనము లుపన్యసించినను నారది గొనక నిరాకరించు టెల్లయు మున్న వివరించితిఁగదా, అవ్విధమున సంధి యొనరమి వాసుదేవుండు వచ్చి పాండవుల కెఱింగించి దండయాత్రాసంవిధానం బొనర్చుటయు బలవిభాగసమయమున రాముఁడు పాండవులట్లు ధార్తరాష్ట్రులును మనకు సంబంధులు గావున వారికినిఁ దోడ్పా టొనర్పు మని తమ్మునితోఁ జెప్పిన నమ్మురారి సమ్మతింపమికిఁ గినిసి రోహిణీసుతుండు సరస్వతీతీర్థముల సేవించువాఁడై చనియె. కృతవర్మ బహుళయాదవపరివృతుండై మైత్రనక్షత్రమున దుర్యోధనుం జేరె. కృష్ణసాత్యకులు పాండవులం జేరిరి. అట్లు హలధరుండు తీర్థయాత్ర సేయువాఁడై బహుళసువర్ణరజతరాసులను ధేనుగణములను వస్త్రసముదాయములను గజవాజిరథప్రభృతినానావాహనంబులను మఱియు వలసినసమస్తవస్తుసంభారములను సర్వోపకరణములనుం గొనితేర భృత్యజనుల నియోగించి యగ్నులం గ్రహించికొన యాజకులకుఁ జెప్పి పలువురుఋత్విజులను బెక్కండ్రద్విజముఖ్యులను సుహృదులనుం దోడ్కొని బడలికంగొన్నవారల కశక్తులకును బాలురకును వాహనంబు లొసంగి సపరివారముగఁ బరమామోదమునఁ దఱలి తత్తత్తీర్థంబుల సేవించి యచ్చట గోహిరణ్యమణిముక్తాకరితురగదాసజనప్రముఖము లగునానాదానంబుల బ్రాహ్మణోత్తములఁ బరితృప్తులం జేసి మఱియు నేబ్రాహ్మణు లేభోజ్యముల నేభక్ష్యముల నేపానీయములం గోరుదురు వారి కయ్యైపదార్థంబులు గుడువం బెట్టించి తనిపి వెండియు నాఁకొన్నవారలకును సమస్తజనులకును భక్ష్యరాసు లన్నపర్వతంబులు పానీయకుంభము లానను నుత్తమాంబరములఁ గట్టను మేలితొడవులు తొడుగను నొసంగి సర్వలోకసుఖావహంబుగను నిరుపమానప్రకారముగను దీర్ఘయాత్ర నత్యంతనిష్ఠమై నడుపుచుఁ గ్రమమునఁ గురుక్షేత్రమునకుఁ జనుదెంచె ననిన విని జనమేజయుండు వైశంపాయనుం జూచి మునివరేణ్యా, సారస్వతతీర్థములగుణోత్కర్షంబును సంకర్షణుం డెట్టు్లంగఁ దీర్థయాత్ర సలిపెఁ దత్క్రమంబును విన వేడుకయ్యెడి. కరుణించి తేటపఱుపవే యనియడుగ నమ్మునిచంద్రుఁ డానరేంద్రు నభినందించి తీర్థమాహా

త్మ్యం బడిగి లెస్స చేసితివి తత్క్రమంబుఁ దెలియం జెప్పుము ననిపలికి యిట్లనియె. అట్లు రేవతీరమణుండు తీర్థయాత్ర వెడలి తొలుత సరస్వతీసముద్రసంగమస్థానం బైన ప్రభాసతీర్థమున కరిగి యందుఁ గృతావగాహనుండై యనేకదానంబుల నాచరించె. తొల్లి చంద్రుఁడు క్షయరోగపీడితుండై యాతీర్థమున మజ్జనంబుఁ గావించి శాపంబు నిస్తరించి యయ్యఱువు దెవులు దొలంగి యెప్పటియట్లు తేజఃప్రభాసితుం డయ్యె ననవుడుఁ బరీక్షిదాత్మజుండు మహాత్మా, చంద్రుఁ డేకతంబున యక్ష్మప్రాప్తుఁ డయ్యె, ఆశాప మెయ్యది. ఆతీర్థమునఁ గృతమజ్జనుండై యే కారణంబున రోగవర్జితుం డయ్యె వివరించి చెప్పవే యని యడిగిన నమ్మనుజేశ్వరున కమ్మునీశ్వరుం డిట్లనియె.

## ప్రభాస తీర్థప్రభావ వర్ణనము.

తొల్లి దక్షప్రజాపతి నక్షత్రయోగనిరత లగుతనకూఁతుల నశ్విన్యాదుల నిరువదియేడుగురను సోమున కిచ్చి పెండిలి సేయుటయు వార లందఱిలో రోహిణి రూపసౌభాగ్యమున నెక్కుడయినకతన నతం డద్దానిం బరమప్రీతి నాదరించి రమించుచుండఁ దక్కినయిరువదియాఱుగురు నలిగి తండ్రిపాలికిఁ జని యాతెఱంగెఱింగించి పతియొల్లనిజీవనంబు నిష్ఫలంబు గావున మేము నీయొద్దన యాహారంబు విడిచి తపశ్చర్య సల్పుదు మని నివేదించిన నాప్రజాపతి నిశాపతిం బిలిచి భార్యలందఱను సముఁడవై వర్తింపుము. తప్పిన నధర్మంబు వచ్చు నని యతనికిఁ జెప్పి కూఁతులం బిలిచి మీరు మీపతికడకుఁ జనుఁడు. అతండు నాపంపున నింక మిమ్మెల్ల నొక్కరీతిం జూచువాఁడని చెప్పిపుచ్చుటయు నశ్విన్యాదులు చంద్రునొద్దకుఁ జనిరి. దక్షుఁడట్లు తెలియం జెప్పిన నాశశలాంఛనుం డట్లు చేయక తొల్లింటియట్ల రోహిణి నాదరించుచుఁ దక్కినవారల నుపేక్షించినం గ్రమ్మఱ వారు తండ్రిపాలికిఁ జనుదెంచి మాపతి మమ్ము మన్నింపఁడు. నీమాట పట్టఁడు కావున నింక నచ్చటి కేగ మాకు మనస్సు గొలుపదు. నీసన్నిధి నుండి నీకుఁ బరిచర్యఁ గావింతు మనిన నాప్రజేశ్వరుండు క్రమ్మఱ నోషధీశ్వరుం బిలిచి నింకనైన భార్యల నందఱను నొక్కరూపకాఁ జూడుము. కాకున్న శపియింతు నని చెప్పి తనయలం బనిచిన నాతం డప్పటికిని రోహిణిపై మోహమునం జేసి వారల నిరాకరించె. అందుల కెంతయుం గినిసి యశ్విన్యాదు లిఱువదియార్వురు మగిడి జనకునొద్దకుఁ జని యతనికి దండప్రణామంబు లాచరించి తండ్రీ, చంద్రుఁడు మమ్ముఁ బ్రీతిమెయి మన్నింపఁడు. నీ వచనంబుఁ గొనఁడు. నీవు శరణం బని యాశ్రయించితిమి. అతండు మమ్ముఁ బరిగ్రహించువిధము గావించి ప్రోవవే యని వేఁడికొనుటయు నాదక్షుండు క్రోధసంధుక్షితుండై నిశాధ్యక్షునిపయి యక్ష్మం బ్రయోగించె. నాఁటఁగోలెఁ గుముదనాథుఁ డఱుఁదెవులు తన్నేఁపఁగ నానాఁటం గృశించు

చు నయ్యామయంబుఁ దొలఁగించికొనం గడంగి నానాభంగు లైనయిష్టు లొన
రించియు శాపక్షయంబుఁ గాంచనేరక కళాక్షయంబుఁ జెందుచుండె. ఓషధీశుఁడ
ట్లు క్షయప్రాప్తుం డగుటయు నోషధులును క్షయించుటు నన్నముఁ గానక ప్రా
ణిజాలంబును క్షయించుచుండె. అది యెఱింగి సురలు సోముపాలికిఁ జనుదెంచి
నీరూపంబు మున్నటియట్లు ప్రకాశింపనితెఱం గేమి యేల యింతభయంబు
దొడరెఁ దెలియఁ జెప్పితేని ప్రతివిధానం బొనర్తు మనిపల్కినం జంద్రుండు ద
క్షశాపస్వరూపంబు నిరూపించిన విని వారు తత్క్షణంబు దక్షప్రజాపతియొద్ద కరిగి
మహాత్మా, ప్రసాదించి చంద్రునకు నీయిచ్చినశాపంబు మఱల్పుము. అతం డెం
తయుఁ గృశించి కించిదవశేషుండై యున్నవాఁడు. అతండు పూర్ణక్షయంబుఁ
జెందెనేని యోషధులు నశించు. దాన నన్నంబు లేక ప్రాణివర్గంబు క్షయించు.
జంతుసంతానంబు నశించినపదంపడి మనయునికిం బ్రయోజనం బెయ్యది కావు
న నింతయు దివ్యచిత్తమునం దలపోసి యనుగ్రహింపు మని వేఁడికొనిరి. అవ్వేఁ
డికో లాకర్ణించి దక్షుండు నావచనం బమోఘంబు. క్రమ్మఱింప నశక్యంబు - అ
యిన నొక్కయుపాయంబు సెప్పెద. చంద్రుఁ డిఁకమీఁద నేనియు భార్యలందఱ
కు నేకరీతిం బ్రియం బొనర్తు నని యొడంబడి పశ్చిమసముద్రంబున సరస్వతీనది
సంగమించుపుణ్యతీర్థంబునఁ గృతమజ్జనుండై దేవదేవు నారాధించునేని మఱల
వృద్ధిం గాంచును. ప్రత్యమావాస్యయందు నందు నిందుఁడు కృతస్నానుండై దిన
క్రమంబునఁ బదియేనుదినంబులు కళావృద్ధి నెనయు. ఇట్లుప్రతిమాసమున నా
తం డొక్కపక్షమున క్షయము నొక్కపక్షమున వృద్ధినిం గాంచఁ గలఁ డింతయు
సత్యంబని శాపమోక్షణంబు దక్షుఁడు సెప్పుటయు బృందారకు లాచందముఁ
జంద్రున కెఱింగించిరి. అటఁ దత్ప్రకారంబున సోముఁ డమావాస్యనాఁ డాపవిత్ర
తీర్థమున నవగాహంబు సేసి లలితప్రభావిభాసితుండై లోకములనెల్ల వెలిఁగించు
టయు సురలు సోమునిఁ దోడ్కొని దక్షుసన్నిధికిఁ జనిన నాప్రజాపతి గీర్వా
ణుల వీడుకొల్పి ప్రీతి నెఱయ నిశాకరుం బిలిచి వత్సా, విప్రులను వనితలనుం ది
రస్కరింపవలదు. నిజనివాసమునకుఁ జనుము. అప్రమత్తుఁడవై నాశాసనంబు న
డుపు మనిపనిచిన నాసుధాంశుఁ డమ్మహాత్ము నామంత్రణంబు చేసి నిజస్థానంబు
న కరిగె. చంద్రుఁడు కళావృద్ధిఁగాంచుటంజేసి యోషధులు యథాపూర్వస్థితిం
బరిపక్వము లగుట నన్నంబు బహుళంబై ప్రాణివర్గంబుతనిసి తొల్లింటియట్లు
తనరె. ఆతీర్థరాజము చంద్రునకుఁ బ్రభాసముఁ గలిగించినకతనఁ బ్రభాసం బనఁ
బరఁగె. అట్టిప్రభాసతీర్థంబునందుఁ జంద్రుఁ డిప్పటికిఁ గృష్ణపక్షమునఁ గళాక్ష
య మగుడుఁ బ్రత్యమావాస్యయందును నవగాహనంబుఁ జేసి యాప్యాయనం
బు గాంచు నిదిప్రభాసతీర్థమహిమంబు. అట్లు బలరాముఁడు ప్రభాసతీర్థమున

స్నానదానాదిసత్క్రియాకలాపంబు నిర్వర్తించి యటఁ జమసోద్భేదంబునఁ కరిగి యాతీర్థంబునఁ గృతమజ్జనుండై విశిష్టదానంబుల విప్రవరుల కొసంగి యొక్కరే యక్కడ వసియించి యంతటఁ ద్వరితగతిం దఱలి యుదపానతీర్థంబునకుఁ జనియె. అచ్చట భూమియు నోషధులు నత్యంతస్నిగ్ధతం దనరుటంజేసి సిద్ధులు నష్టమైనసరస్వతి నచ్చటం గాంతురు. మహాఫలప్రాప్తి కయ్యది ముఖ్యస్థానంబు. అందుఁ గృతస్నానుండై బహుళదానములం బ్రాహ్మణుల నారాధించె. అందుఁ ద్రితుఁ డనుతాపసుఁడు నూతఁ బడి యందు సోమపానంబుఁ జేసె. మఱియు నతండు తనయెడ వంచనఁ గావించినభ్రాతల శపియించె ననిన జనమేజయుండు తత్ప్రకారంబు సవిస్తరంబుగఁ జెప్పు మనియడుగ వైశంపాయనుం డాతని కిట్లనియె.

## ఏకతద్వితత్రితులనుమునులచరిత్రము.

పూర్వయుగమున గౌతముఁ డనునొక్కముని కేకతుఁడు ద్వితుఁడు త్రితుఁ డన ముగ్గురు కొడుకు లుద్భవిల్లి యత్యంతతపోనిరతులు బ్రహ్మవాదులు ప్రజాపతిసములు ప్రజావంతులునై యుండ వారితపోదమనియమంబులకు మెచ్చుఁ జెంది తండ్రి వారిచేయునుపచారముల కలరుచుఁ బెద్దకాలమునకు స్వర్గతుం డగుటయు నతనియాజ్యరాజు లాకుమారుల నతనింబోలెఁ బూజించుచుండిరి. అందుఁ ద్రితుఁ డందఱికంటె శ్రేష్ఠుఁడై నకతన రాజులును మునులు నతనిఁ బెద్దయుఁ బూజించుచుండిరి. అంత నొక్కనాఁ డేకతద్వితులు సోమపానాపేక్షులై ధనార్థంబు చింతించి త్రితుం దోడ్కొని తమయాజ్యులయొద్ద కరిగి పశుగణముల సంపాదించి సోమయాగముచేయుద మని తమలో నిశ్చయించి యయ్యన్నదమ్ములు ముప్వురు దఱలి యాజకత్వంబున ననేకపశువుల నార్జించి ముందఱ త్రితుండును బిఱుంద నేకతద్వితులునుగా నప్పశుగణంబులఁ దోలుకొని తూర్పుదెసం జనుచుండిరి. అంత వెనుక వచ్చుచున్న యేకతద్వితులు త్రితుఁడు యజ్ఞకుశలుఁడు వేదపరినిష్ఠితుండును గావున నెప్పుడైనం బెక్కుపసుల నార్జింపఁగలఁడు గావున వాని వంచించి యీపసుల మనము గొనిపోవుదమని తమలో నూహించి యరుగుచుండ నొక్కరాత్రి సరస్వతీనదీతీరమున నొక్కనూయిచెంగటఁ దోఁడేలు కానవచ్చిన వెఱచి తొలఁగువాఁడై యాత్రితుఁడునూఁతం బడియె. అగాధ మత్యంతఘోర మఖిలభూతభీకరము నగునాకూపంబునఁ బడి యాతం డార్తనాదంబుఁ జేసిన విని యేకతద్వితు లతనిఁగూపపతితుంగా వగచి వృకభయమునను లోభమునను నతని విడిచి పసులం దోలుకొని చనిరి. లతాతృణనిబిడ మగునానూయిలోనం బడి యాత్రితుండు నరకమునం బడినపాపియట్లు కాఁ దన్నుఁ దలంచికొని యీక గట్టు సేర వలను గాదు కావున నిందే శరీరత్యాగంబు సంభవిం

చునెక్కొ యని మృత్యుభీతుండై యింతకు సోమపానంబు సేయనైతి. ఇచ్చో టన సోమము సేయం బనినిశ్చయించి యచ్చట నెక్కటీఁగ ప్రేలుచుండినం జూచి దాని సోమముగను ఱాల శర్కరలనుగను సంకల్పించి యల్లేయజ్ఞోపకర ణముల న్నింటిలోఁ గొన్నింటిని బ్రతినిధులను గొన్నింటిని మనఃకల్పితంబులను సాధించి యగ్నిసంకల్పంబు గావించి ఋగ్యజుస్సామముల మనమునం జింతించి యార్త్విజ్యంబునకుఁ దాన చాలి హోతయై యింద్రాదులకు హవిర్భాగంబు లిచ్చి సోమాభిషవం బొనర్చి మహానాదంబు సేయుటయు నాధ్వని దివంబుఁ జొ చ్చిన నది యాకులితం బయ్యె. అప్పు డానినాదంబు విని బృహస్పతి త్రితయజ్ఞ మున కిప్పుడ పోవలయు. అతం డలిగిన నిర్జరగణంబు వేఱ సృజించు నని సురల కుఁ జెప్పుటయు వారు వెంటన త్రితయజ్ఞస్థాన మగునయ్యుదపానంబుఁ జేరం జ నుదెంచి యజ్ఞదీక్షితుండై పరమతేజోవిలసితుండై యున్నయమ్మునిం గాంచి హవిర్భాగార్థులమై వచ్చితి మనవుడు నతండు వారలకుఁ దనకూపపతనం బెఱిం గించి మంత్రపూతము లగుపురోడాశభాగముల నొసంగె. ఒసంగినం గ్రహించి బృందారకులు ముదం బంది వరములు వేఁడు మనిన నతండు న న్నీకూపమునుం డి యుద్ధరించి రక్షింపుఁడు. మఱియు నీయుదపానమున నాచమించిన సోమపాన ఫలంబు గలుగ ననుగ్రహింపుఁ డనినివేదించుచుండునంత నరస్వతీనది యానూతం జొచ్చి తరంగసంగతి నెగయించి మీఁదికిఁ దెచ్చుటయు భూభాగంబుఁ జేరి త్రి తుండు విబుధులఁ బూజించిన వా రతని కవ్వరంబులు ప్రసాదించి దివమున కుఁ జనుటయుఁ ద్రితుఁడు నిజనివాసమున కరిగె. అరిగి తన్ను వంచించినభ్రా తలం గినిసి తోడేళ్ళుగాఁగ వారికి శాపం బిచ్చిన నతనిసత్యవచనంబునం జేసి య య్యేకతద్వితు లిరువురు తత్క్షణంబ యదృశ్యులైరి.

అయ్యుదపానతీర్థంబున బలరాముఁడు స్నానదానబ్రాహ్మణపూజనంబు లు నిర్వర్తించి యటవినశనంబునకుఁ జనియె. అందు శూద్రాభీరుల కలిగి సర స్వతీనది యదృశ్యయగుటంజేసి యాతీర్థంబు వినశనమునాఁ బడియె. అచ్చట నుపస్పర్శం బొనర్చి ముసలాయుధుండు సుభూమికంబున కరిగె. దేవగంధర్వాప్స రోగణములకు విహారభూమి యైనకతన నాతీర్థంబు సుభూమికాఖ్యం బరఁగె. ప్ర తిమాసంబును దేవగంధర్వాదు లచ్చటికి వచ్చి క్రీడింతురు. అందు గంధర్వాదు లగీతవాదిత్రనిస్వనంబు వినియుఁ దదీయచ్ఛాయలఁ గాంచియు విస్మితుండై బ లభద్రుండు యథావిధిదానాదులం జేసి యటఁ దఱలి విశ్వావసుప్రముఖగంధ ర్వాలతపస్స్థానంబు గీతవాద్యరమణీయము నగు గంధర్వతీర్థమునకుఁ జని యజా విగోసువర్ణప్రముఖనానాదానముల బ్రాహ్మణులఁ బరితృప్తులం జేసి తదభినంది తుండై గర్గస్రోతంబునకుఁ జనియె. అందు గర్గుఁడు కాలజ్ఞానలక్షణంబును జ్యో

త్రివిభాగంబును శుభాశుభోత్పాతప్రకారంబును దపోమహిమంబున నెఱుంగు టం జేసి యాతీర్థంబు గర్గస్రోతస్సమాఖ్యఁ దనరె. మహామునులు పెక్కండ్రు కాలజ్ఞానార్థం బందు గర్గు నుపాసించిరి. అందు స్నానదానాదులు సలిపి హలధ రుండు శంఖతీర్థంబునకుఁ బోయి మేరువువోలె నత్యున్నతం బై ఋషిసంఘసేవి తం బయినమహాశంఖముఁ గనుంగొని సరస్వతీతటసంజాతం బైనమహీరుహో త్తమంబుఁ గాంచె. యక్షవిద్యాధరరాక్షసాదులును సిద్ధులు నదృశ్యు లై యచ్చ టఁ జరించుచు వ్రతనియమములతో నశనము విసర్జించి త త్తత్కాలములఁ దద్వ నస్పతిఫలముల భుజియింతురు. ఆవనస్పతిమహిమమునం బ్రఖ్యాతం బై నయ ప్పావనతీర్థంబునందుఁ గృతమజ్జనుం డై నీలాంబరుండు బహుళధేనువులను నపరి మితధనములను ధరణీసురుల నారాధించి యచ్చటితపోధనులమెప్పు వడసి ద్వై తవనమునకుం బోయి యచ్చటపావనజలమునఁ గృతమజ్జనుం డై నానావేషధరు లగుమునులం బూజించి పుష్కలదానముల విప్రులం దనిపి సరస్వతీదక్షిణతట మునం దతిదూరమున నున్ననాగతీర్థమునకుఁ బోయె. అందు సురలును జతుర్ద శసహస్రఋషిగణంబులును వాసుకిం బన్నగరాజ్యమున నభిషేకించిరి. వాసుకి స్థానం బై నయచ్చోట సర్పభయంబుగలుగదు. అందును వివిధదానముల విప్రసంత ర్పణంబుఁ గావించి యయ్యేకకుండలుండు తూర్పునం జని యచ్చటఁగలనానాతీ ర్థములం జూచి యచ్చటఋషులు వివరించినచందమున నాతీర్థముల నాప్లుతుం డై యుపవాసనియమములను సర్వదానములను దీర్ఘవాసులగు మునులకుఁ బ్రణామ ములనుం గావించుచు నరిగి నై మిశారణ్యమునివరులప్రత్యవేక్షణార్థంబు సరస్వ తీనది ప్రాఙ్ముఖంబుగ మఱలినపుణ్యస్థానమునకుఁ జని విస్మితుం డయ్యె ననిన విని జనమేజయుండు మునీంద్రా, సరస్వతి యేమి కారణమున ప్రాఙ్ముఖముగఁ బ్రతి నివృ త్త యయ్యె ననియడుగ వై శంపాయనుం డతని కిట్లనియె.

తొల్లి కృతయుగంబున నై మిశారణ్యవాసు లగుమునులు పద్రెండేండ్లు సత్రయాగంబుసల్పిన నందులకుఁ బెక్కండ్రుఋషులు తీర్థకారణమున నరుగుదెం చుటయు ఋషిబాహుళ్యమునంజేసి సరస్వతీదక్షిణతీరమున స్యమంతపంచకము దాఁకఁ దీర్థంబులు నగరప్రాయములై న నందు వాలఖిల్యు లశ్మకుట్టులు దంతో లూఖలులు వాయుభక్షులు పర్ణభక్షులు జలాహారులు స్థండిలశాయులు నగునేక మునివరులు స్వాధ్యాయఘోషముల రోదసీకుహరంబునించుచు హోమపరులై యుండి యందుఁ గొంచెమేనియు నవకాశంబుఁగానరై రి. మఱియు జనబాహు ళ్యమునంజేసి స్నానాదులకు ని ర్మలసలిలంబు చొప్పడనికతన ని ర్మలార్థంబు యజ్ఞోపవీతములవ్రేల్చి వివిధక్రియలొనర్చి మునులు చింతాక్రాంతులై యుండ వారలమొడం బ్రసాదించి సరస్వతీనది వారికందఱకుఁ జాలునట్లు జలప్రవాహంబుఁ

గల్పింపనెంచి ప్రాఙ్ముఖంబుగఁ బ్రతినివృత్తయయి యచ్చటి కుంజములెల్లఁ బాఱె నాకుంజంబు నైమిశీయకుంజ మనఁ బేర్కొనంబడు. ఆచరిత్రకు విస్మితుండై లాంగలి విధివదవగాహనంబు సలిపి బహుళధనకనకములను నానాభక్ష్యములను భూసురులందనిపి వారిమెప్పువడసి వివిధతరునికరపరివృతంబు కదళీవనకాంతంబు వాలఖిల్యాదిమునివరనివాసంబు నిరంతర స్వాధ్యాయ ఘోషభూషితంబు మృగయూథశతసంకులం బహింసాధర్మతత్పరమనుజసేవితంబు నగుసప్తసారస్వత తీర్థమునకుఁ బోయె.

అందు మంకణకుం డనుముని తపస్సుచేసి సిద్ధుండయ్యెననిన జనమేజయుండు సప్తసారస్వతస్వరూపంబును మంకణకమునికులము నధ్యయనమును దపోనియమను సిద్ధిప్రకారంబును వివరింపు మనియడుగ నతనికి వైశంపాయనుం డిట్లనియె.

మంకణమహామునిమాహాత్మ్యవర్ణనము.

సరస్వతీనది సుప్రభయుఁ గాంచనాక్షియు విశాలయు మనోరమయు నోఘవతియు సురేణువును విమలోదయు ననునేడుప్రవాహములం బఱఁగు. అందు బ్రహ్మదేవుఁడు పుష్కరములందు యజ్ఞముఁజేయుచు దేవతలు మున్నగువారువచ్చి యందలి సర్వార్థసమృద్ధికి నప్సరోనృత్తంబునకును గంధర్వగానంబునకును విస్మయంబందుచుండ ఋషులు సరస్వతీనదీవిరహితంబై నయచ్చోటఁ జేయఁబడు నీయజ్ఞ మత్యంతగుణవంతంబు గాదనుటయుఁ బితామహుఁడు సరస్వతిందలంచిన నమ్మహానది యచ్చటఁ బొడసూపి లోకేశ్వరుని సమ్మానించిన సందఱుం బ్రశంసించిరి. అది సుప్రభ యనం బరఁగు. నైమిశక్షేత్రంబునఁ బెక్కండ్రుమహామునులు వేదార్థముల విచారించుచు బహువర్షములు సత్రయాగము లొనర్చుచు సహాయార్థంబు స్మరించిన సరస్వతీనది కాంచనాక్షి యన నచ్చోటఁగానుపించె. గయుఁడు గయదేశముల మఖము లొనరించుచుఁ బిల్చిన నచ్చటికి విచ్చేసిన సరస్వతి విశాలయనం బేరువడసె. ఉత్తరకోసలవిషయముల నుద్దాలకుండధ్వరంబుసల్పుచు మనమున ధ్యానించుటయు మనోరమాభిధానంబుతో నమ్మహానది యాదేశము నధిగమించె. పరమపావనంబైన కురుక్షేత్రమునఁ గురుఁడు మఖవిధానపరుం డగుటయు వసిష్ఠుఁ డాహ్వానంబుఁ జేసిన నచ్చోటికి సన్నిహితమైన సరస్వతీనది యోఘవతీ సమాఖ్యఁ బొందనరె. గంగాద్వారమున దక్షుండు క్రతుదీక్షితుండై యపేక్షించిన నచ్చట నమ్మహానది సురేణువనం బ్రవహించె. మఱియు హిమాలయంబున హిరణ్యగర్భుండు మఱియొకపరి సత్రదీక్షితుండై పిల్చిన నచ్చోటికి విమలోద యనుపేరుతో సరస్వతీనది సన్నిధిచేసె. ఇవ్విధంబున నేడు

ప్రవాహములైన సరస్వతీనది యాచోట నేకీభవించుటంజేసి యాతీర్థంబు సప్త సారస్వతంబు నాఁ బ్రథితం బయ్యె. ఇంక మంకణక చరిత్రంబు వినుము.

కౌమారబ్రహ్మచారి యగునామంకణకుం డొక్కనాఁడు సరస్వతీనదీ మధ్యమున మజ్జనంబుఁ జేయుచు నచ్చోట దిగంబరయై జలక మాడుచున్న యొక్కసుందరిం జూచి రేతఃస్ఖలనం బగుడు నది పృథ్వ్యాకుండఁ గలశమునం గ్రహించి తెచ్చుటయు నారేతంబు సప్తధావిభక్తం బైన నాసప్తఖండముల వాయువేగుఁడు వాయుబలుఁడు వాయుహాఁడు వాయుమండులుఁడు వాయు జ్వాలుఁడు వాయురేణుఁడు వాయుచక్రుఁడు ననునేడ్వురుఋషు లుద్భవిల్లి సప్తమ రుద్గణంబులకు జనకులై రి. మఱియు లోకత్రయవిశ్రుతం బయినయామంకణక మునియద్భుతచరిత్రంబు వినుము.

ఆమునివరుం డొక్కనాఁడు తనవ్రేలు దర్భకొన గీచుకొని శాకరసము స్రవించిన దానిం జూచి యతండు పరమసంతోషభరితుండై నృత్యంబుఁ జేయుటయు నమ్మునితపోమహిమమోహితం బై చరాచరాత్మకం బయినసకలప్రపంచము నర్తనంబుఁ గావించె. అయ్యెడ రు చూచి బ్రహ్మాదులు లోకహితార్థంబు శంకరు వేఁడిన నద్దేవదేవుం డమ్మునికడకుఁ జను దెంచి బ్రాహ్మణా, యేల నృత్యంబుఁ జేసెదవు ధర్మ పథముననుండి తపోనియమంబులు సల్పుచుండు నీ కెక్కడు హర్షస్థానం బెయ్యది యనియడుగ నాతండు బ్రాహ్మణోత్తమా, చూచితే నావ్రేల శాకరసము స్రవించెడి. దీనికి సంతుష్టుఁడనై నృత్యంబొనర్తు ననిచెప్పుటయు నప్పరమేశ్వరుండు రాగమోహితుండైన యవ్విప్రుం జూచి నవ్వుచు నింపులకు విస్మయం బేనొందను నన్నుఁ గనుంగొనుమని పలికి యంగుళ్యగ్రమునఁ దన బొట్టనవ్రే లడిచిన నాగీత నుండి యత్యంతధవళం బైన భస్మము స్రవించె. దానిం గాంచి లజ్జితుండై మంకణకుండు మహేశ్వరుపాదములకుం బ్రణమిల్లి యమ్మహానుభావుని మహాదేవునిఁ గనెఱింగి విస్మితుండై దేవా, నీవు రుద్రుండవే కాని యొరుఁడవు కావు. దేవదానవులకు సకలలోకములకు నీవే గతివి. ఈజగ మెల్లయు నీచేత సృజియింపఁబడి యుగాంతమున నీలోనన ప్రవేశించునని మనీషులు సెప్పుదురు. నిన్నెఱుంగ సురలకేనియు శక్యంబు గాదన్న నింక నాకొలంది చెప్పనేల. జగమునం గల సకలభావములును నీయందుఁ గన్పట్టుచున్నవి. వరదుం డగునిన్ను బ్రహ్మాదు లుపాసింతురు. సర్వంబు నీవ. కర్తయుఁ గారయితవు నీవ. నీప్రసాదమునం గాదె సురలు భయంబుదక్కి మోదించుచున్నవా రని యిట్లు ప్రస్తుతించి వినమ్రుండై దేవా. గర్వాదిరూపం బైనమదీయచాపలము మన్నించి నాతపం బక్షరముఁ గాఁగ బ్రసాదింపవే యని ప్రార్థించినఁ దత్ప్రార్థనం బాలించి పరమేశ్వరుండు సంప్రీతచేతస్కుండై యమ్మునిం జూచి విప్రా. మత్ప్రసాదమున నీతపంబు సహస్రధా వృద్ధిఁ గాంచుఁ గాక.

నీతోడ నీయాశ్రమంబుననే యుండును. ఈ సప్తసారస్వతతీర్థంబున నన్నర్చించు వాని కీలోకమునను బరలోకమునను దుర్లభంబుగానంబడదు. మఱియు నతండు సారస్వతలోకంబునధిగమించు నని యనుగ్రహించె. సుకన్యయందు వాయుదేవు నకు జనించినయామంకణకు చరిత్రంబియ్యది. అచ్చోట హలాయుధుం డొక్క రాత్రి యుపవసించి నియమపరుండై బ్రాహ్మణులకు నానార్థంబు లొసంగి మంక ణకునెడఁ బ్రీతినావహించి యచ్చట మునుల పూజలంగైకొని యౌశనసతీర్థంబు నకుఁ జనియె. తొల్లి శుక్రుఁ డచ్చటఁ దపంబుసల్పి నీతివిజ్ఞానంబుఁబడసి దైత్య దానవవిగ్రహంబుఁ జింతించె. దాన నాతీర్థం బౌశనసం బనఁబరఁగు. మఱియు నచ్చట మహోదరుఁ డనుముని నిజజంఘాలగ్నం బైనరాక్షసకపాలముఁ బాయుటంజేసి కపాలమోచనంబు ననంబడియె ననినఁ దత్ప్రకారం బెట్లనియడి గిన జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె.

తొల్లి రఘురాముఁడు దండకారణ్యమున సంచరించునెడ జనస్థానమునం బెక్కండ్రురాక్షసులం దెగటార్చిన నందొక్కరక్కసునితల వాఁడితూపునఁ దును మంబడి యయ్యడవిలోఁబడియుండి యక్కాంతారదేశమున డబ్బాటు చరించుచు న్నమహోదరుఁ డనుముని పిక్కలోనందగిలి యెముకనంటిన దానికినొచ్చి యా తండు తీర్థాయతనములకుఁ జననశక్తుండై యెట్టు లీకపాలంబు వుచ్చునగునని చిం తించి చీముగాఱుచు దుర్గంధనిందితం బైనకాలితో నత్యంతవేదనార్తుండయ్యుఁ బెక్కునదులు సముద్రములు నానాతీర్థములనుం జరించి యెందునునప్పునుకవిడ మికి మిక్కిలివగచి సర్వపాపప్రశమనమౌశనసనామధేయంబు నగుసరస్వతీతీర్థ మున మజ్జనంబుఁగావించిన నీబాధతొలఁగునని మునులుకొందఱు చెప్పిన నామ హోదరుఁ డమ్మాటపట్టి యాసిద్ధిక్షేత్రమునకుఁజని స్నానార్థం బాతీర్థంబుఁజొ చ్చుటయు నాకపాలము నీళులంబడి యదృశ్యంబయ్యె. మహోదరుండును రాక్షసకపాలముక్తుండై విగతకల్మషుండై పరమపావనుండై కృతార్థుండై ప్రీతచి త్తుండై నిజాశ్రమమునకుఁజని మునులకందఱకుంజెప్పిన వారాతీర్థంబున కప్పుడు కపాలమోచనంబన నామమిడిరి. అమ్మహోదరుండు క్రమ్మఱి యాతీర్థమునకుఁ జనుదెంచి పయఃపానంబుఁజేసి సిద్ధుండయ్యె. మాధవాగ్రజుం డందు బ్రాహ్మణు లకు నానాదానములొసంగి పూజించి యటఁ దఱలి పృథూదకంబునకుఁజనియె. తపోనిరతుఁ డగురుషంగుఁ డనువృద్ధబ్రాహ్మణుఁ డచ్చోట దేహత్యాగముసేయఁ దలఁచి పుత్త్రులకుఁదెల్ప వారిచే నచ్చోటుచేర్పంబడి విధియుతముగ మజ్జనాదు లొనరించి తీర్థగుణంబులలెస్సయెఱింగి సరస్వత్యుత్తర తీరమునందలి పృథూదక తీర్థంబున జపపరుండై తనువువిడుచునాతం డెల్లివచ్చుమరణంబునకుఁ గొందలం బందఁ డనిపుత్త్రులకుబోధించి మేనుదొఱంగి సిద్ధుండయ్యె. మఱియు నాతీర్థమున నార్ష్టిషేణుఁడు సిద్ధుండయ్యె. వెండియు సింధుద్వీపుఁడును దేవాపియు విశ్వామి

త్రుఁడు నచ్చోటఁ బ్రాహ్మణ్యంబుఁ బడసిరనిన నవ్విధంబువివరింపుమనియడిగిన జనమేజయునకు వైశంపాయనుండిట్లనియె.

తొల్లి కృతయుగమున నార్షిషేణుఁడనువిప్రుఁడు పెద్దకాలము గురుకుల వాసంబొనర్చి వేదాధ్యయనంబుఁ జేసియుఁ దనవిద్యలు సమాప్తినొందమికి నిర్వేదంబుఁబొంది యచ్చటఁ దీవ్రతపము సల్పి సమాప్తవిద్యుండై వేదప్రతిభావిలసితుండై సిద్ధుండై యీతీర్థరాజమున మజ్జనంబొనర్చినపుణ్యాత్ముఁడు నేఁడుమొదలుగా వాజిమేధఫలంబుఁ బడయును, మఱియు నిచ్చట వ్యాళభయంబుగలుగదు. వెండియు నీచోటఁ గావించుసత్కర్మ మల్పకాలమునసిద్ధించునని యిట్లుమూఁడు వరములొసంగి యాతండు త్రిదివమునకరిగె. సింధుద్వీపుఁడును దేవాపియునుఁ దపోవిశేషమహిమంబున బ్రాహ్మణ్యంబుఁ బ్రాపించిరి. గాధియనురాజు తొల్లి తనకొడుకువిశ్వామిత్రుఁడు రాజ్యభారము వహింపఁజాలినయోగ్యతందనరుటఁ జూచి యతనికిఁ బట్టాభిషేకంబుసల్పి ప్రజలనెల్లఁ గొడుకునకర్పించి దేహన్యాసంబుఁజేసి త్రిదివంబునకుఁజనియె. పదంపడి విశ్వామిత్రుండు రాజ్యమేలుచు రాక్షసవధార్థంబు చతురంగబలసమన్వితుండై దండయాత్ర వెడలి పెనుదవ్వుచని వసిష్ఠాశ్రమంబుపొంతవిడిసిన నతనిసైనికు లయ్యాశ్రమవనంబునకు భంగముఁజేయుటంజూచి యాబ్రహ్మర్షివర్యుండు తనహోమధేనువుంబిలిచి శబరసైన్యంబుసృజించిపంపుమనిన నమ్మునిపంపునంజేసి యక్కామధేనువు ఘోరాకారులైన వీరులఁ బల్వుర సృజియించుటయు వారు తత్క్షణంబ విశ్వామిత్రుసైనికులంబొదివి పొరివుచ్చుటయుఁ గొండఱుతప్పించుకొనివచ్చి తదర్థముఁదనకెఱిగించిన నాకర్ణించి గాధినందనుండు నిఖిలశక్తులకంటె బ్రాహ్మణ్యశక్తియెక్కుడనియెంచి పృథూదకంబున నియమోపవాసములశరీరముఁగృశింపఁజేయుచుఁ గ్రమమునఁ బర్ణభక్షుఁడు జలభక్షుఁడు వాయుభక్షుఁడునై తీవ్రతపంబునిష్ఠమైననుష్ఠించిన నమరు లందులకువిఘ్నములుపెక్కులుగావించిరి మఱియుఁ బలువిధముల నియమపరుండై తుది బ్రాహ్మణ్యంబుసాధించె. అచ్చట రాముఁడు స్నానదానములనిర్వర్తించి దాల్భ్యబకు నాశ్రమంబునకుఁబోయె. తొల్లి నైమిశంబున విశ్వజిద్యాగాంతమున ద్వాదశవార్షికసత్రయాగంబు సేయంబూని ఋషులు పాంచాలమునకుఁజని బలాన్వితములు రోగరహితంబులు నగునేకవింశతివత్సతరంబులడుగుటయు బకుఁడు తనయొద్దనున్నకోడెలంగొనిపొండు నేను మఱల యాచించి తెచ్చుకొనియెదననిపలికి తనయొద్దనున్నకోడెల వారికొసంగి తాను ధృతరాష్ట్రుఁడనురాజు నొద్దకుఁజని వత్సతరంబులర్థించుటయు నానృపాలుండు వివేకవికలుండై యదృచ్ఛామృతములగు గోవులంజూపి యిష్టమగునేని వీనింగొనిపొమ్మనిచెప్పిన నాదాల్భ్యబకుం డక్కటా వీఁడిక్కరణి నీసభలో నృశంసంబుఁబల్కునే యనిముహూర్తమాత్రంబుచింతించి రోషావిష్టుండై యాధృతరాష్ట్రునకుఁ గడురోసి సరస్వతీన

దికిఁజనుదెంచి త త్తటమున నియమపరుండై పావకుఁబ్రజ్వలితుం జేసి చచ్చినయా పసులమాంసములంగోసి వ్రేల్చె. ఆక్రూరకర్మమునం జేసి ధృతరాష్ట్రురాష్ట్రంబు నాఁటంగోలె గొడ్డలిగొనినఱికినవనంబుచందంబునఁ బ్రక్షీణంబగుచుండ నయ్యె డరుచూచి యమ్మనుజేశ్వరుండు విప్రసహితుండై యయ్యాపదతొలంగఁ బెక్కు యత్నములొనర్చియుఁ బ్రయోజనంబుఁగానఁడయ్యె. అంతులకుఁ గడుంగొంద లంబంది యానరేంద్రుండు ప్రాశ్నికులంబిలిచి యిదియేమి యనర్థంబనియడిగి దాల్భ్యబకుం డొనర్చునభిచారకృత్యమునఁ దదనర్థంబుమూఁడుట తెలిసి సరస్వ తీతీరమునం దభిచారహోమతత్పరుండై యున్నయమ్మునికడకుఁ దాను తత్క్షణం బయలుగుదెంచి యమ్మహానుభావునకు దండప్రణామంబాచరించి ప్రాంజలియై మహాత్మా ప్రసాదింపుము నాతప్పుసైరింపుము దీనుఁడు లుబ్ధుఁడు మూర్ఖతానిమి త్తమునవివేకవికలుఁడు నగునాకునీవేగతి వనిశోకవ్యాకులితుండై ప్రార్థించిన నవ్వేఁడికోలాలించి కరుణించి బకుఁడాసంరంభముడిపి ధృతరాష్ట్రురాష్ట్రమున కాపన్మోక్షణార్థంబు హోమమమాచరించి కీడుదొలఁగించి యానరేశ్వరునివలన బహుళపశువులం గ్రహించి నైమిశంబునకుఁజనియె. ధృతరాష్ట్రుండును నిర్మ లోదారచేతస్కుండై మునిప్రభావ సముపలబ్ధ మహాసమృద్ధి విలసితం బైనని జనగరంబునకరిగె. ఆతీర్థంబుననే తొల్లి బృహస్పతి యసురులకుఁజేటును సురలకు మేలునుం గలుగ మాంసముల నిష్టిఁజేసినం దత్ప్రభావమునంజేసి సుర లసురులని ర్జించిరి. తాలధ్వజుం డచ్చటస్నానదానాదిక్రియాకలాపంబులనుష్ఠించి యట యాయాతంబునకుఁబోయె. అందు దొల్లిఁ యయాతి యజ్ఞమొనర్ప నెవ్వరెచ్చట నుండియెయ్యర్థంబులుదలంచినను సరస్వతీనది వారికి గృహశయనాన్నపానప్ర ముఖము లగునానాపదార్థంబులు సంతరించి యచ్చట నొసంగిన నందులకు దేవగం ధర్వాదులద్భుతంబంది యయాతిప్రభావమునకుమెచ్చి యతనికిఁ బరమాశీర్వాద ములుసల్పిరి. అట్టులొకవిస్మయావహప్రకారంబుగ యయాతి యచ్చటనధ్వరం బులుసలిపి యూర్ధ్వలోకమునధిగమించె. అందు బలభద్రుండు నానాదానముల విప్రులందనిపి యయాతియనుభావంబును బ్రశంసించుచు వసిష్ఠాపవాహంబున కరిగె ననినవిని జనమేజయుండు మునీంద్రా వసిష్ఠాపవాహన మేల యానది యొన రించె. పుణ్యతీర్థమహిమంబు లెంతవిన్నను జిత్తంబు తనివోవ దనియడుగ వైశంపాయనుం డతనికిట్లనియె.

### వసిష్ఠాపవాహమహిమానువర్ణనము.

తొల్లి స్థాణుండుఘోరప్రకారమునఁ బరమతపంబుసల్పియు నధ్వరములు పెక్కులొనరించియు సరస్వతింబూజించియు స్థాపించినతీర్థము స్థాణుతీర్థమనంబ రఁగు. అందే కుమారస్వామి దేవసేనానీత్వంబున నభిషిక్తుండయ్యె. అట్టిస్థాణుతీర్థ మున వసిష్ఠాశ్రమమును దానికిఁ బూర్వపార్శ్వమున విశ్వామిత్రాశ్రమంబును

దనరు. అయ్యాశ్రమములందు వసిష్ఠవిశ్వామిత్రు లత్యంతస్పర్ధాసమన్వితులై తపముసల్పుచుండిరి. అంతనొక్కనాఁడు విశ్వామిత్రుఁడు వసిష్ఠుని తేజోవిభవము నకుఁజింతిల్లి యీసరస్వతీనది తపోనిరతుఁడైన వసిష్ఠు నిచ్చోటికిఁగొనిరాఁగలదు. అప్పుడు నేనమ్మునిని వధింపఁగలవాఁడ నిందుసందియంబు లేదని తనలోనం దలంచి నిశ్చయించి క్రోధసంరక్తలోచనుండై సరస్వతిందలంచుటయు నది యందులకు దల్లడంబందియు విశ్వామిత్రుకోపమునకు వెఱచియుఁ గంపముగదుర ననాథయట్లు వగలంబొగులుచుఁ గృతాంజలియై విశ్వామిత్రుంగొలిచి యెయ్యదిచేయంగల దానఁజెప్పుమనియడుగ నాగాధిసూనుండు క్రోధభరితుండై త్వరితంబ వసిష్ఠు నిటకుఁదోడ్తెమ్మాతని నేఁడు వధియింపంగలవాఁడ నని నిర్దేశించిన నత్తటిని భయ వ్యాకులితయై వాయువిధూతంబైనలత యెట్టులట్టుల యొంతయుఁగంపించినం జూచి యమ్మునీంద్రుఁడు విచారింపక తత్క్షణంబ వసిష్ఠుంగొని తెచ్చునదియని యాదే శించె నప్పలుకువిని యతనిపాపపుఁదలంపు దెలిసి వసిష్ఠునిప్రభావమునిరుపమానం బనియెఱింగినదికావున నైశంబ యమ్మైత్రావరుణినెద్దకుఁజనుదెంచి యిరువురు మునులశాపములకు వెఱచుచుఁ గొంతవడిచింతించి యెట్టకేలకు గాధిసూనునిర్దేశం బెఱింగించుటయుఁ గృశయు వివర్ణయు చింతాసమన్విత యగునాసరస్వతింబిలిచి వసిష్ఠుండు విచారింపక నన్నువిశ్వామిత్రునెద్దకుఁగొనిపొమ్ము, తప్పిన నతండునిన్ను శపించుఁగావున నాత్మరక్షణంబుఁజేసికొనుమనిపలికె. పరమకృపాపరుఁడైన యమ్ము నివచనంబువిని సరస్వతి నాయెడంగరుణించినయీమహాత్మునకవశ్యంబు హిత ముఁగావింపవలయు నెట్లుచేసిన మేలయ్యెడి ననితనలో విచారించి కొండొకవడికిఁ ద నతటమునన మ్మునివరుండు తపంబనుష్ఠించుచు గాధిజుంగుఱించి వేల్చుచుండ నది యదనుగాఁగొని యన్నది కూలాపకర్షణంబుఁజేసి యాగట్టుతోన కొనిపోవునెడ నమ్మిత్రావరుణతనయుండు సరస్వతీ, పితామహసరస్సునుండి ప్రవహించిననీవు నిజదివ్యసలిలముల జగమునెల్ల వ్యాపించితివి. నీవ యాకాశగతవై మేఘము లందుఁ బయోనిక్షేపంబు సేయుదువు. జలములెల్ల నీవేయని యేము దలం తుము. పుష్టి ద్యుతి కీర్తి సిద్ధి బుద్ధ్యుమావాణీస్వాహలు నీవ. ఈభువన మంతయు భవదధీనంబు. నీవే సర్వభూతములందును జతుర్విధములవర్తింతు వనిప్రస్తుతించె. అట్లు ప్రస్తుతింగొనుచు సరస్వతి యతిరయంబున నమ్మునిని విశ్వామిత్రాశ్రమమునకుఁదెచ్చి నివేదించుటయు నక్కౌశికుండు సరస్వతీసమానీ తుండైన వసిష్ఠుంజూచి క్రోధసంభరితుండై యతనిం బ్రహరింపఁ బ్రహరణ మువెదకుచున్నంత బ్రహ్మహత్యకు వెఱచి యుత్తరంగిణి యుత్తటిఁదూర్పునం బ్ర వహించి వసిష్ఠుందోలంగించి యిద్దఱుమునులవచనములు నడిపినట్లుతలంచియుండె. అవ్విధమున వసిష్ఠుందొలఁగంగొనిపోవుటకెంతయుంగనలి కౌశికుండు సరస్వతీ, నన్నుం గన్నుఁబ్రామినగారణంబున నీవు నెతురు పాఱంగలదానవని శపియించె.

ఆశాపమునం జేసి యొక్కవత్సరంబు సరస్వతి నెత్తురుపాఱె. అందులకు ఋషులు ను దేవగంధర్వాదులును నత్యంతదుఃఖితులైరి. అవ్విధమున నాతీర్థంబు వసిష్ఠాప వాహంబయ్యె. అట్లు సరస్వతి యచ్చోట శోణితవాహినియగుటయు రాక్షసులు పలువురచ్చటికివచ్చి యానెత్తురుద్రావుచుఁ దృప్తిఁజెంది యొండుచింతమాని యా డుచుఁ బాడుచు నవ్వుచు సుఖించుచుండిరి. అంత నొక్కనాఁడు తపోధనులుగొంద ఱు తీర్థయాత్రాపరులై యచ్చటికివచ్చి రక్షోగణంబులు పరివేష్టించి త్రావంబ డునారక్తప్రవాహంబుఁగాంచి సరస్వతీపరిత్రాణపరులై యప్పరమనదింబిలిచి యిదియేమినీమడుగిట్టులుకాఁగతం బెయ్యదియనియడిగి తత్ప్రకారంబంతయుఁదెలి సికొని ప్రతివిధానంబున నీకు శాపమోక్షణంబుఁ గావింతుమని యానదికిం జెప్పినా నాతపోనియమోపవాసకష్టవ్రతములఁ బశుపతినారాధించినం దత్ప్రసాదంబునను నమ్మునులమహానుభావంబునను శాపంబుఁ బాసి తొల్లింటియట్ల నిర్మలపవిత్రసలిల యయ్యె. అప్పుడందుండు రాక్షసులు తమకుఁద్రావ నెత్తురులేమిం జేసి యాఁకటఁదూ లుచు నమ్మునులకుఁ గేలుమోడ్పులుఘటియించి మహాత్ములారా, మేము పెద్దయు నాఁకటఁదూలెదము. శాశ్వతధర్మముఁదొలఁగుటం జేసి యిట్టులయ్యె. యిదిమాయి ప్పటియిచ్ఛాప్రవర్తనంబుగాదు. తొల్లింటి పాపకర్మ మిప్పుడిట్టులనుభవింపవలసె. మీప్రసాదమున దుష్కృతముఁబాయుమనునియున్న వారము. పాపవృద్ధికారణం బున బ్రహ్మరాక్షసులమైతిమి. యోషిత్పాపంబునను యోనిదోషమునను బ్రహ్మ ద్వేషమునను నాచార్యబుత్విగ్గురువృద్ధజనతిరస్కారంబునను రాక్షసత్వంబుగ లుగుంగదా. అట్లుబహుళపాపంబుల నిట్టులయినమమ్మును సకలలోకములను ద రింపఁజేయ మీరుచాలుదు రనిననారాక్షసులకుఁ దుమ్మినదియుఁ, బురుగులువడి నదియు, నెంగిలిదగిలినదియు, వెండ్రుకలుగలిగినదియు, మిక్కిలికదలించిచల్లార్పం బడినదియు, నేడ్పుగూరినదియు, నగునన్నంబు వారికాహారంబుగానియమించిరి. ఆకా రణమున విద్వాంసుఁడట్టిదుష్టాన్నముఁ బరిహరింపవలయు. అవ్విధమున నప్పర మమునులు నదికిఁబావనత్వంబుఁగావించి రాక్షసులకు మోక్షంబుఁగావింపఁదలఁపు గొని యమ్మహాతరంగిణింబ్రస్తుతించిన వారలమతంబు దెలిసి యాసరిద్వర బ్రహ్మ హత్యఁదొలఁగింప నరుణానదియోపుననితానెఱింగినదికావున దానిం దనలోఁగలి పికొని యందుస్నానముఁజేయుండనిచెప్పిన రాక్షసులు కృతమజ్జనులై రాక్షసత్వం బువిడిచి త్రిదివంబునకుఁజనిరి. అరుణానది బ్రహ్మవధపాతకంబుహరించునని తెలిసి శక్రుఁడందుఁ గృతస్నానుండై తత్కల్మషంబుఁబాసె ననిన జనమేజయుండు ము నీంద్రా, సురేంద్రున కెట్లుబ్రహ్మహత్యవాటిల్లె నెట్లు ముక్తుండయ్యె ననియడుగ వైశంపాయనుండిట్లనియె.

తొల్లి నముచి వాసవునకు వెఱచి సూర్యరశ్మిసమావిష్టుండైన నింద్రుఁ డ తనితోఁజెలిమివాటించి యార్ద్రమునను శుష్కమునను రాత్రియుఁ బగలును

నిన్ను వధియింపనని యతనికిసమయంబుఁ జేసి నీహారఫేనఖండమున నతని తలదు
నిమె. తునుముటయు నామస్తకం బోమిత్రఘాతీ, యనియఱచుచు వెన్నడించిన
నెందునుం దానికివిడుపుగాంచక కాంచనగర్భునొద్దకుఁజని యయ్యర్థమునివేదించు
టయు నద్దేవదేవుండు కరుణించి యరుణాసంగమస్థానంబుపరమపావనంబు, తదరు
ణాసంగమనంబు నిగూఢంబై యుండుఁబాపభయాపహం బై నయాతీర్థమునఁ గృత
స్నానుండవై నానాదానములొనర్చి యిష్టిచేసితేని యీపాపంబువాయంగలవాఁడ
వనిపల్కినం దత్ప్రకారంబాచరించి యాఖండలుండు బ్రహ్మవధపాతకవిముక్తుండై
సమగ్రానందుండై త్రిదివంబునకుఁజనియె. నముచిమస్తకంబు నందుమునిఁగి య
క్షయలోకములంబడసె. నీలాంబరుం డావసిష్ఠాపవాహతీర్థంబున స్నానాదులా
చరించి యటఁదఱలి సోమతీర్థంబునకరిగె. అందుఁజంద్రుం డత్రిమహాముని హో
తృత్వంబునిర్వహింప రాజసూయంబొనర్చె. అయ్యజ్ఞము సమాప్తమయినపదం
పడి దేవదానవులకు ఘోరసంగ్రామంబుసెల్లినం గుమారుండు తారకాసురుం
బరిమార్చె. అందే కుమారస్వామి దేవసేనానీపదంబునభిషిక్తుండై ప్లక్షవృక్ష
తలంబున నివాసంబుఁగొనియెననిన జనమేజయుండు మునివరేణ్యా, యెప్పుడెచ్చట
నేవిధానమున నెవ్వరు కుమారునభిషేకించిరి. స్కందునకును దైత్యులకును నా
యోధనంబెట్లుచెల్లెఁ దత్ప్రకారంబువివరింపు మెంతయుఁగుతూహలం బయ్యెడిన
నియడిగినం గురువంశసంభవుండైన నీకిట్లు కుతూహలంబుగలిమితగును. నాకెం
తయు సంతోషంబయ్యెడి వివరించెద వినుమని జనమేజయుం బ్రశంసించి వైశం
పాయనుండిట్లనియె.

### కుమారస్వామి యభిషేకము.

తొల్లి మహేశ్వరువీర్యంబు స్కన్నంబై యగ్నిగతంబగుటయు సర్వభక్షకుఁ
డయ్యు హవ్యవాహనుఁడు తేజోమయమగునాగర్భమును ధరింపనోపక బ్రహ్మదే
వునకెఱింగించి యద్దేవుననుమతిని గంగలోవిడిచిన నమ్మహానది తానును ధరింపఁ
జాలక హిమవత్పర్వతప్రాంతమున శరస్తంబమునం దిగవిడిచె. అందు సకలలోక
ములవెలిఁగింపఁజేయుచుఁ బెరుఁగుచుండఁ గృత్తికలాఱుగు రచ్చోటమెలంగుచు నీ
కుమారుండు నాకునాకని యందఱు నేకతాత్పర్యమునం జన్నులుచేపఁగడాసిన
నక్కుమారుండు వారియాశయంబెఱింగి యాఱుముఖములందనరి యయ్యాఱుగు
రిస్తన్యంబుఁద్రావుటయుఁ గృత్తికలందులకుఁబరమాద్భుతంబందిరి. అవ్విధమున
నాకుమారుఁ డాగ్నేయుండు గాంగేయుండు శరజన్ముండుఁ గార్తికేయుండు ననం
బరఁగి నప్పర్వతప్రాంతమెల్లనిజతేజోనుభావమునఁ గాంచనమయంబుగావించుచుఁ
జంద్రునిచందమునఁబ్రియదర్శనుండై తన్నుఁగొలువవచ్చినగంధర్వులగానములను
నప్సరోగణములనృత్యంబునుం గనుంగొనుచుఁ బెరుఁగుచుండ బృహస్పతి యచ్చ
టికివచ్చి జాతకర్మాదిసంస్కారంబులు నిర్వర్తించె. నాలుగువేదములును ధనుర్వే

దాదులును సాంగంబుగమూర్తీభవించి యచ్చోటంగొలిచె. సరస్వతీదేవి తాన వచ్చి సేవించె. అంత నొక్కనాఁడు మహేశ్వరుఁడు దేవీసమన్వితుండై సింహ వ్యాఘ్రాదినానాముఖులు వికృతాకారులు ఘోరదర్శనులు నగుపార్షదులతోఁడ నచ్చోటికివిచ్చేయుటయు సప్తమాతృగణములు సాధ్యులు విశ్వేదేవులు మరుత్తులు వసువులు పితరులు రుద్రు లాదిత్యులు సిద్ధులు భుజంగులు దానవులు ఖగులు పరమేష్ఠి పద్మనాభుఁడు దేవేంద్రుఁడువహ్ని బృహస్పతిప్రముఖులు నారదాదులు గంగాదులువచ్చుటయు నాకొలువు సాంద్రంబయ్యె. అప్పుడు శంకరుఁడును బార్వతియు నగ్నిహోత్రుఁడును గంగయు నీకుమారుఁ డెవ్వనియొద్దకు గౌరవార్థంబు ముందుఁడాయవచ్చునోయని తమలోఁదలంచుచుండ నయ్యర్థంబెఱింగి యబ్బాలుండు యోగమహిమంబున నాలుగుమూర్తులఁదాల్చి స్కందాభిధానుండై యిందుశేఖరుని విశాఖసమాఖ్యుండై శర్వాణిని శాఖనాముఁడై విభావసుని నైగమేయసంజ్ఞుఁడై గంగనుం జేరనరుదెంచుటయు దేవదానవులు హాహారవములొనర్చుచుండ వారత్యంతాద్భుతంబంది ప్రణామపురస్సరంబుగా బ్రహ్మదేవునితో నీకుమారునకుఁదగినపద మస్మత్ప్రియార్థము నియమింపుమని వేఁడిన నాలోకపితామహుఁడు ముహూర్తమాత్రంబుతనలోఁజింతించి దేవసేనానాయకత్వంబుఁబ్రసాదించి లోకపాలురుమున్నగువారు నీకురక్షణీయులని నాకుమారునికి బోధించె. అంత నతనికి సైనాపత్యాభిషేకశోభనంబునెఱవేర్పఁగ శమంతపంచక పరిసరమున సరస్వతీతీరమునకు బ్రహ్మరుద్రాదులందఱుం జనుదెంచిన బృహస్పతి యగ్నిముఖంబుఁగావించి వేల్చుటయు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు దేవేంద్రుఁడు సూర్యచంద్రులు ధాత విధాత పావకుఁడు పవమానుఁడు ద్వాదశాదిత్యు లేకాదశరుద్రు లష్టవసువులు విశ్వదేవు లశ్వినులు మరుత్తులు పితరులు సాధ్యులు సిద్ధులు గంధర్వు లప్సరసలు యక్షులు రాక్షసులు పన్నగులు దేవర్షులు బ్రహ్మర్షులు వైఖానసులు వాలఖిల్యులు నానాదీక్షితపోనిరతులగుమహామునులు భార్గవు లాంగిరసులు గ్రహములు నక్షత్రములు మూర్తిమంతములైనవేదములు నదులు సముద్రములు నానాపుణ్యతీర్థములు భూమ్యంతరిక్షములు వృక్షము లదితి హ్రీ శ్రీ స్వాహ సరస్వతి యుమ శచి సినీవాలి యనుమతి కుహువు రాక ధిషణ యైరావత ముచ్చైశ్శ్రవము సంవత్స రాయన ర్తు మాస పక్షాహోరాత్ర ముహూర్త కలాకాష్ఠలు గరుత్మంతుఁ డనూరుఁడు యముఁడు మృత్యువు తత్పరిచరులు మఱియుం బెక్కండ్రు తత్పుణ్యాభిషేచనిక భాండముఁగొని సర్వమంగళములు సెలంగ నభిషేకించిన నయ్యభిషేకము మున్నచ్చట వరుణునకుఁ గావించినజలేశ్వరత్వాభిషేకంబుకంటెఁ గడురమ్యంబై నెగడె. అయ్యవసరంబున బ్రహ్మ యతనికి నందిసేనుఁడు లోహితాక్షుఁడు ఘంటాకర్ణుఁడు కుముదమాలి యనునలువురు పార్షదులను స్థాణుఁడు మహాయాశతధరుఁడు కామవీర్యబలాన్వితుఁడు నగుకాముని

నొసంగె. స్థాణుఁడిచ్చినయప్పార్షదుఁడొక్కరుండే దేవదానవసమరంబునఁ జతుర్దశ ప్రయుతదైత్యులం జెగటార్చె. సురలు సురసేననొసంగి జయజయశబ్దములుపలికినం గంధర్వయక్షాదులు నట్లప్రస్తుతించిరి. అప్పుడు యముఁ డున్మాథప్రమాథులను, సూర్యుఁడు సుభ్రాజభాస్కరులను, సోముఁడు మణిసుమణులను, హుతాశనుఁడు జ్యోతిర్జ్వాలాజిహ్వులను, నంశుఁడు పరిఘ, పట, భీమ, దహతి, దహనులను,వాసవుఁడుత్క్రోశపంచకులను,విష్ణువు చక్రవిక్రమకసంక్రములను,నశ్వినులు వర్ధననందనులను ధాత కుంద, కుసుమ,కుముద,డంబ,రాడంబరులను, త్వష్ట చక్రానుచక్రులను, మిత్రుఁడు సువ్రతసత్యసంధులను, విధాత సువ్రతశుభకర్మలను, బూషుఁడు పాణీతకపాణికులను, వాయువు బలాతిబలులను, వరుణుఁడు యమాతియములను, హిమవంతుఁడు సువర్చోతివర్చసులను, మేరువు కాంచనమేఘమాలులను, మఱియు స్థిరాతిస్థిరులను, వింధ్య ముచ్ఛ్రృంగాతిశృంగులను సముద్రుఁడు సంగ్రహవిగ్రహులను, పార్వతి యున్మాదపుష్పదంతశంకుకర్ణులను, వాసుకి జయమహాజయులను, వెండియు వసురుద్రాదిత్యపితృసిద్ధసాధ్యప్రముఖులు శంకుకర్ణనికుంభపద్మకుముదాదులను, నానాముఖులు నానావేషులు నానారూపులు నానాయుధులు ఘోరాకారులు నగువారల నిచ్చిన వారందఱు ముల్లోకములువ్యాపించియుండుప్రభావతీ విశాలాక్షిపాలితాగోస్తనీప్రముఖవృక్షగృహశ్మశానాదినివాసనానామాతృగణములు నాకుమారుంగొల్చియుండిరి. ఇట్లు సకలపారిషదగణ పరివేష్టితుండై తేజరిల్లుచున్నయాకుమారునకు వహ్ని దేవుఁడు శక్త్యస్త్రమును నీలకంఠుఁడు ఘంటను బతాకను నానాయోధగణసమన్వితయగుసేనను, విష్ణుఁడు వైజయంతిని, యమ శుభ్రవస్త్రద్వయంబును, గంగ యమృతకమండలువును, బృహస్పతి దండమును, గరుత్మంతుఁడు మయూరమును, నరుణుఁడు కుక్కుటమును, వరుణుఁడు నాగమును, బ్రహ్మ కృష్ణాజినమును, సంగ్రామవిజయమునుం బ్రసాదించె. అట్లు సంప్రాప్తసేనానీత్వాభిషేకుండై రెండవవీతిహోత్రుండునా వెలుంగుచు సమస్తపార్షద మాతృగణంబులుగొలువ గంధర్వగానము లప్సరోనృత్యంబులునుఁజెలంగ నిండోలగంబుండఁగ సురలు బహువిధములఁబ్రస్తుతించుటయు నంపులకు ముదంబంది స్కందుఁడు కరుణాపరుండై మీకుఁ గీడురోయువారలం బరిమార్తునని వర మొసంగినం గీర్వాణులు ప్రమోదభరితాంతఃకరణులైరి. అవ్విధంబున సకలభూతములకుఁ బ్రహర్షోత్కర్షంబు పొంపిరివోవ వర మొసంగి వ్యవసాయ జయ ధర్మ సిద్ధి లక్ష్మీ ధృతి స్మృతులు ముందు నడచుచుండ వివిధాయుధపాణు లగుదివ్యయోధులు పరివేష్టింప నసురులపై దండయాత్ర వెడలి తేజోబలాన్వితుండై పరమరోషభీషణుండై శక్త్యస్త్రముఁబ్రయోగించుటయు దానం గోటిశక్తులు వెడమి దానవసైన్యంబునీఱుసేసె. అట్లు తమసేన రూపఱినం గోపించి తారకాసురుం డురువడించినం గ్రమ్మఱి శక్తిం బ్రయోగించి తార

కుం బరిమార్చి మహిషత్రిపాద హ్రాదోదరు లనుమువ్వురుసేనాపతులఁ బెక్కం డ్రనుచరులతోడం దెగటార్చె. ఏమిచెప్పుదు దనుజవీరులు కొందఱు పతాకావ లోకనంబునను, గొందఱు ఘంటారవసమాకర్ణనంబునను, గొందఱు కైదువుల తాఁకునను బెదరియుఁ జెదఱియు గుండియలువ్రీలియుఁబొనుపడినం గుమారస్వా మిసైనికులు ప్రమోదసంభరితులై యాడియుఁ బాడియుఁ గలక లనగియుం జె లగిరి. పెక్కండ్రురాక్షసు లట్లు తెగినం జూచి బాణాసురుండు వెఱచి క్రౌంచప ర్వత మాశ్రయించి దేవతలకుఁ గీడు రోయుచుండఁ గార్తికేయుం డెఱింగి తా నచ్చోటి కరిగి శక్తిం బ్రయోగించి క్రౌంచంబు భేదించి తదీయానుచరులం గీట డంచె. క్రౌంచము భేదించునెడ నందలిసింహవ్యాఘ్రగజాదిసంఘములు తూగాడి నేలం బడియె. పక్షులెల్లఁగుప్పగూరలై పడియె. శక్త్యస్త్రంబు కుమారప్రయు క్తంబై యనేకాస్త్రములం దనలోఁ గల్పించికొని చెండాడి క్రమ్మఱ నాదేవసే నానియొద్దకు వచ్చుచుండె. అట్లు శత్రువిజయంబు గొని కుమారస్వామి దే వతలప్రస్తుతివచనముల నాకర్ణించుచుండ దేవదుందుభులు మ్రోసె. పుష్పవ ర్షంబు గురిసె. లలితమారుతంబు వీచె. అక్కుమారుం గొందఱు సనత్కుమా రానుజుం డైన బ్రహ్మసూనుఁగను, మహేశ్వరాత్మజుఁగను, విభావసుసుతుఁగను, నుమాపుత్త్రుఁగను, గంగాతనయుఁగను, గృత్తికానందనుఁగను, జెప్పుదురు. అట్టు లేకద్విచతుఃప్రకారముల వ్యవస్థితుండై యున్న యాయోగీశ్వరేశ్వరుండు దేవసే నానీపదాభిషిక్తుండై యాశ్రితులకు నానావిధైశ్వర్యములఁ బ్రసాదించె. అప్పు ణ్యతీర్థంబున బలభద్రుండు కృతస్నానుండై బ్రాహ్మణులకు నానాదానము లొ సంగి యందొక్కరేయి నివసించె నియ్యది కుమారస్వామి యభిషేకప్రకారంబు. అందే మున్ను వరుణుండు జలాధిపత్యమున నభిషేకంబుఁ బడసె. దాన నాతీర్థ ము తైజస మనం బరఁగె ననిన జనమేజయుండు మునీంద్రా కుమారాభిషేక ప్రకారమును, దైత్యవధంబును విన్నంతన నామనంబు పరమసంప్రీతిభరితం బయ్యె. ప్రసన్నం బయ్యె. మేను పులకాంకురితం బయ్యె. పవిత్రుండ నైతి. నింక వరుణాభిషేకప్రకారంబువినఁగోరుదు. తేటపఱుపవే యని యడుగుటయు వైశంపాయనుం డమ్మనుజనాథునకిట్లనియె.

పూర్వకల్పమునఁ గృతయుగమున సురలందఱు వరుణునొద్ద కరిగి యిం ద్రుఁడు మమ్ముఁబ్రోచుచందమున నీవు సకలజలములం బాలింపుము. సాగరమ ధ్యమున నీకు వాస మయ్యెడి. సముద్రుఁడు నీకు వశుఁడు గాఁగలవాడు. సోము నితోడ నీవును వృద్ధిక్షయముల నెనయుదువనిచెప్పి యతని నంపుల కియ్యకొల్పి విధివిహితవిధానమున నాతీర్థమున నభిషేకించినం దేజరిల్లి వరుణుండు సకలము లకుఁబతియయ్యె. లాంగలి యందునుం దీర్థమాడి నానాదాననిర్వాహణపరుండై యగ్నితీర్థమునకుఁ జనియె. అందుఁ దొల్లి యదృశ్యుం డైనయగ్ని శమీగర్భ

మునఁ గానంబడియె ననినం దత్ప్రకారం బెట్లని యడిగిన నాపారీక్షితున కా వ్యాసశిష్యుం డిట్లనియె.

తొల్లి యగ్నిదేవుఁడు భృగుమునిశాపమున సర్వభక్షకుండై యందుల కెంతయుఁ గొందలం బందుచు నదృశ్యుం డగుటయు నగ్నిక్షయకారణంబున లోకయాత్రావిధానంబు లడంగినం గీర్వాణు లింద్రసమన్వితులై యగ్ని నన్వే షించుచుఁ బెక్కుచోట్ల దిరిగి యగ్నితీర్థమున శమీగర్భమున నిగూఢప్రకార మున నున్న యద్దేవుంగాంచి సంప్రీతచేతస్కులై యతనిం బ్రార్థించిరి. సర్వ భక్షుఁడయ్యుఁ బరమపావనుండుగా బ్రహ్మ యతనికి వరముఁ బ్రసాదించిన నవ్వి భావసుఁడు క్రమ్మఱ దృశ్యుం డగుటయు లోకయాత్ర తొల్లింటియట్లు చెల్లు చుండె. దానంజేసి యాతీర్థ మగ్నితీర్థమునాఁబడియె. అందును స్నానదాన ములు నిర్వర్తించి నీలాంబరుఁడు కౌబేరమునకుఁ జనియె. అందుఁ దొల్లి యైల బిలుఁడు పెద్దకాలము నిష్ఠమైఁ దపంబనుష్ఠించి ధనాధిపత్యంబును శివసఖ్యం బును సురత్వంబును, నుత్తరదిక్పాలకత్వంబును నలకూబరుఁడనుకుమారుని హంసయోజితంబు కామగమనంబు లోకోత్తరము నగుపుష్పక మను విమాన మును మఱియుం బెక్కువాంఛితములనుం బడసె. అందును రాముఁడు కృత స్నానదానుఁడై శ్వేతానులేపనం బనఁబడుబదరపాచనతీర్థమునకుఁ బోయె.

## బదరపాచనతీర్థవర్ణనము.

తొల్లి యందు భరద్వాజునుహిత శ్రుతావతి యనుకన్యక సురేంద్రుం బెండ్లిగాఁ గోరి యత్యంతనిష్ఠమైఁ దీవ్రతపంబుసల్పిన నాతండు వసిష్ఠునాకా రంబుఁ దాల్చి యక్కన్నియకుం బొడసూపిన నత్తపస్విని యతనింబరమ భక్తి మెయి నర్చించి మునీంద్రా యేను సురేంద్రుం బెండ్లియగుదు ననియున్నదానఁ గావున నయ్యది యొక్కండుదక్క మఱియెయ్యది యానతిచ్చినం జేయుదాన ననుటయు వసిష్ఠవేషప్రచ్ఛన్నుండై నయన్నిలింపపతి నగుచు నుగ్రతపఃప్రభావ మునంజేసి నీకోర్కి కొనసాగెడుఁగాక తపంబున కసాధ్యంబుగల్గునే యనిపలికి దానిచిత్తమెఱుంగువాఁడై యైదురేఁగుపం డ్లొసంగి వీని వండు మనియిచ్చి యాచెంగట నుండునింద్రతీర్థమునకుఁ దా నరిగి యందు జపపరుండై యుండె. అక్కన్నియయు వెంటనప్పోయి రాఁజబెట్టి యాబదరములు పాత్రలో నిడి వం డఁదొడంగియు నవి యించుకేనియు నురియక తా దెచ్చినకట్టియలన్నియు సమా ప్తంబులైనం గాత్రములు వేఱు లేమింజేసి మునిమనస్సమారాధనంబు కర్త వ్యం బనునిశ్చయబుద్ధింజేసి కొంచెమేనియుఁ గొంకక తనకాళులు ప్రోయి లోనంబెట్టి మంటచేసి వండుచుండె. మహర్షివాక్యంబుమీఁదిభక్తితాత్పర్యము నంజేసి తనకాళులు కాలుచుండఁ నాకన్యక సుంతేనియు ముఖభేదమును నైమ నస్యమునుం గానక పాకము సేయుచుండినను నాబదరములు పక్వములు గావ

మ్యె. దానిభక్తికి మెచ్చి యింద్రుఁడు నిజరూపమున సన్నిధిచేసి కల్యాణీ, భవదీయభక్తితపోనియమములకుఁ బ్రీతిఁజెందితి. ఈమేను విడిచి త్రిదివమునకు వచ్చి నీకోర్కి కుడువం గలదానవు. బదరపాచనం బన నీతీర్థము సుప్రసిద్ధంబై సర్వపాపహర మగు. తొల్లి సప్తర్షు లరుంధతి నిచ్చటవిడిచి హిమవంతమునకుఁ జని యం దాశ్రమంబుఁ గావించికొని తపంబుసల్పుచు ఫలమూలముల శరీరయాత్ర నడుపుచుండఁ బండ్రెండేం డ్లనావృష్టి సెల్లె. అరుంధతియు నిందుఁ దీవ్రనియమమునఁ దపోనిష్ఠ సల్పుచుండె. అప్పుడు మహాదేవుఁడు తత్తపమునకు మెచ్చి బ్రాహ్మణవేషమున నామునిపత్ని యొద్దకుఁ జని భిక్ష మడుగుటయు నా సాధ్వి యన్న మిచ్చుట లేదు బదరముల నిచ్చెద భక్షింపు మనిన నాతండు వీని వండినం గ్రహింతు ననుటయు బ్రాహ్మణప్రియార్థం బమ్మహాభాగ ప్రోయి రాఁజ బెట్టి దివ్యకథ లాకర్ణించుచుఁ బండ్రెండేం డ్లాహారము వర్జించి యారేఁగుపండ్లు వండుటయు నాద్వాదశవర్షము లొక్కదినమపోలెఁ గడచె. అప్పటి కయ్యనావృష్టి కడచిన నాసప్తర్షులు ఫలములంగొని హిమవంతమునుండి వచ్చుటయుఁ బరమేశ్వరుండు నిజరూపమున నాఋషిపత్నికిఁ బ్రత్యక్షంబై నీచరిత్రకు మెచ్చితిఁ దొల్లింటియట్లు ఋషులను నుపసర్పింపు మనిచెప్పి వారికి నరుంధతీ చరిత్రంబు దేటపఱిచి హిమవంతంబున మీచేసినతపంబు నాకు సమ్మతంబు గాదు. ఇప్పరమసాధ్వి యిందు దుష్కరతపంబు సలిపె ననివారుచ్చి క్రమ్మఱ నాఋషిపత్నిం గాంచి నీకోరినవరం బిత్తు నడుగు మనుటయు నాదేవి సప్తర్షులు వినఁగ నిట్లనియె. భగవంతుఁడు నాయెడ సంప్రీతుండేని యీతీర్థము బదరపాచన మనం బ్రఖ్యాతంబై యిందుఁ ద్రిరాత్రోపవాసంబుఁ గావించునతండు ద్వాదశవార్షికోపవాసఫలముఁబడయున ట్లనుగ్రహింపు మనివే డినం బినాకపాణి యట్లయని యద్దేవి నామంత్రణంబుఁ జేసి నిజావాసమునకుఁ జనియె. సప్తర్షులు పండ్రెండేం డ్లుపవసించియు క్షుత్పిపాసా సమన్వితయయ్యు నించుకేనియు వదనవివర్ణత్వంబును డప్పినిం గానక వెలుంగుచున్నయరుంధతిం గాంచి యబ్బురం బందిరి. నీయట్టులు తొల్లి యరుంధతియు నిందుఁ దీవ్రతపంబు సలిపి సిద్ధిం బడసె. మఱియు నే నొండొక్కవరంబు భవదర్థం బొసంగెద. ఇం దొక్కరేయి యాహారంబు వర్జించి కృతస్నానుం డైనపుణ్యుం డుత్తమలోకంబులం బ్రాపించు నని యింద్రుఁడు వరముఁ బ్రసాదించి నాకలోకమున కరిగె. పదంపడి పుష్పవర్షము గురియ దేవదుందుభులు మ్రోయఁ బుణ్యగంధబంధురంబై నలలితమారుతము వీవఁగ నాశ్రుతావతి తనువుఁద్యజించి స్వర్గలోకమునకుఁ జని యింద్రునపాణిగ్రహణంబుఁ జేసి కృతార్థయయ్యె ననిన జనమేజయుం డాకన్నియకుఁ దల్లి యెవ్వతె యెచ్చటఁ బెరిఁగె వివరింపు మనియడుగ వైశంపాయనుం డిట్లనియె. మున్నొకనాఁడు భరద్వాజుఁడు ఘృతాచి యనునచ్చర వచ్చుచుండఁ గాంచి రేతస్స్ఖలనం

బగుడు నయ్యది నమ్ము గాకుండఁ గరమునం గ్రహించి పత్త్రపుటమున నిక్షేపించి నం గ్రమంబునఁ బుత్త్రిక వ్రేడముటయు దానికి జాతకర్మాదిసంస్కారములు నిర్వర్తించి దేవర్షిగణసభలో శృతావతియను పేరు వెట్టి తనయాశ్రమమున నునిచి తపంబు సల్పువాఁడై హిమవంతమునకుఁ జనియె నయ్యదియే యాశ్రుతావతి. వృష్ణికులుఁ డందుపస్పర్శంబుఁ గావించి విప్రులకు ధనము లొసంగి యింద్రతీర్థమునకుఁ జనియె.

అందును గృష్ణాగ్రజుండు స్నానదానంబులనిర్వర్తించె. అమరేంద్రుఁ డందుఁ గ్రతుశతం బొనరించి బృహస్పతికి బహుళధనంబు లొసంగి శతక్రతుం డునాఁ బరఁగి త్రిదివమునకు రా జయ్యెఁ గావున నయ్యది యింద్రతీర్థమనం బరఁగు. అచ్చోటు గదలి ప్రలంబవైరి రామతీర్థమునకుఁ బోయి కృతస్నానుండై భోజనాచ్ఛాదన దానముల బ్రాహ్మణులం బూజించె. పరశురాముఁడు పెక్కుమాఱులు క్షత్త్రియుల వధించి వాజపేయమును నశ్వమేధమునుం జేసి కశ్యపునకు సకలమహీమండలమును దక్షిణ యిచ్చె. దాన నయ్యది రామతీర్థ మనంబడు. అటఁ దఱలి ముసలాయుధుండు యమునాతీర్థమునకుఁ జని యందుఁగృతావగాహనుం డయ్యె. వరుణుఁ డందు రాజసూయము సల్పినం దదవసానంబున ఘోర సంగ్రామంబు సెల్లె. అందు బహుళదానముల నొసంగి సంకర్షణుం డాదిత్యతీర్థమునకుఁ బోయె. భాస్కరుండు యజ్ఞమాచరించి జ్యోతిశ్చాధిపత్యంబునుం బ్రభావంబునుం బడసినచో టయ్యది. మఱియు నచ్చట విశ్వదేవులు మరుత్తులు గంధర్వు లప్సరసలు యక్షరాక్షసపిశాచులు వ్యాసుఁడు శుకుఁడు మున్నగువారు పలువురు సిద్ధిం బొందిరి. దామోదరుఁడింపుఁగృతస్నానుండై మధుకైటభులం దెగటార్చె.

## ——జైగీషవ్యమునిమాహాత్మ్యవర్ణనము.——

అత్తీర్థంబుననే తొల్లి యసితదేవలుఁడు ధర్మనిరతిశౌచశమదమాదిసంపన్నుండై సమలోష్టకాంచనుండై తుల్యనిందాస్తోత్రుండై త్రికరణపరిశుద్ధుండై దేవతాతిథిపూజాపరుండై బ్రహ్మచర్యనిష్ఠుండై ప్రియాప్రియములు లాభాలాభములు మున్నగుద్వంద్వములం దవులక గృహస్థధర్మము నడుపుచుండ నయ్యాశ్రమమునకు జైగీషవ్యుఁ డనుమునివరుండు సనుదెంచి వాఙ్నియమపరుండై భిక్షాకాలమునందే తన్నుఁగాన్పించుచుండె. దేవలుండును యథాశక్తిపూజ లొనర్చుచుఁ బెక్కేఁడులు సనినపదంపడి యొక్కనాఁడీతం డేల యొక్కొ యేమియు భాషింపఁడని తనలోఁ జింతించి స్నానార్థము కలశముఁ గొని సముద్రమునకు జని యచ్చటఁ దనకుమున్న యరిగియున్న జైగీషవ్యుం గాంచి యెట్టు లీభిక్షుం డిక్కడకింతకుమున్నయే తెంచి కృతస్నానుండై యున్నవాఁ డనితలపోసి యద్భుతంబని తానునంబురాశిలోనం గృతావగాహనుండై జపించి యాహ్నికక్రియాకలాపము

లు నిర్వర్తించి జలపూర్ణ మైనకలశము గ్రహించి నిజాశ్రమమునకు వచ్చె. అం తకుం దదాశ్రమమున నాసీనుండై యున్నజైగీషవ్యుం గని యసితదేవలుండు విస్మితుండై యెట్టు లిమ్మహానుభావుఁడు సముద్రతీరమునను నాశ్రమమునను నా కంటె ముందు వచ్చినవాఁడు. ఇతనిం జూడ నెప్పుడు నేమియుం బలుకఁ డెంత టిమహాత్ముఁడో యనిచింతించి యమ్ముని ప్రభావ మెఱుంగఁ గోరి యంతరిక్ష మున కెగసి యందుఁ జరించుచున్నసిద్ధులను వారిచేతం బూజింపఁబడుచుండుజై గీషవ్యుం గనుంగొని యటఁబితృలోకమునకును, సోమలోకమునకును, బదంబడి యగ్నిహోత్రులయు, దర్శపూర్ణమాసయాజులయుఁ, పశుయాజులయుఁ, జాతు ర్మాస్యయాజులయు, నగ్నిష్టోమయాజులయు, నగ్నిష్టుభయాజులయు, వాజపేయ యాజులయు, రాజసూయయాజులయుఁ, బౌండకరీకయాజులయు, నశ్వమేధయాజు లయు, నరమేధయాజులయు, సర్వమేధయాజులయు, సౌత్రామణియాజులయు, ద్వాదశాహసత్త్రియాజులయు, లోకములకును, మిత్రావరుణలోకమునకును,నాది త్యలోకమునకును, రుద్రలోకమునకును, వసులోకమునకును, బృహస్పతిస్థానంబు నకును, బ్రహ్మసత్త్రిలోకమునకును, గోలోకమునకునుఁ, బతివ్రతాలోకమునకుం జని యచ్చటనెల్లసత్కృతుండై యున్నజైగీషవ్యుం జూచి యచ్చట నాతఁడంత ర్హితుం డగుటయు నచ్చట సిద్ధులకుఁ బ్రాంజలియై జైగీషవ్యునిప్రభావము నతం డచ్చట నదృశ్యుండుఁ గాఁ గారణంబు నడిగిన వా రయ్యా, జైగీషవ్యుండుశాశ్వ తంబై నబ్రహ్మలోకమునకుఁ జనినవాఁడు. అచ్చటికిఁ జన మీబోంట్లకలవి గా దనిన విని క్రమ్మఱి దేవలుండు విహంగంబుతెఱంగున వరుసన లోకములుడిగి నిజాశ్రమమున కరుగుదెంచె. అరుగుదెంచి యచ్చట నెప్పటియట్లున్నజైగీషవ్యుం గాంచి యమ్మునిప్రభావంబున కచ్చెరువడి వినయావనతుండై యమ్మహానీయుం జేర నరిగి మోక్షధర్మంబు బోధింపు మనివేఁడిన నతండు కార్యాకార్యస్వరూ పంబు సన్న్యాసయోగలక్షణంబును గ్రమప్రకారంబున నెఱింగించె. ఎఱింగిన నతండు సన్న్యాసంబున మనసు వెట్టుటయు భూతములు పితరులు నింక మా కెవ్వఁడు పంచిపెట్టువాఁ డనిన వారికి యథాయోగ్యంబుగసంవిభాగం బాచరించి యభయము వేఁడుచున్న సర్వభూతములకు నభయం బొసంగి గార్హస్థ్యముకంటె మోక్షధర్మంబె యుత్తమం బని మదిలో నిశ్చయించి జైగీషవ్యునివలనఁ దత్ప్ర కారంబు గ్రహించి కృతార్థుండయ్యె. అప్పుడు బృహస్పతిప్రముఖు లచ్చటికి వచ్చి జైగీషవ్యుని నతనితపస్సునుం బ్రశంసించుటయు గాలవుండు జైగీషవ్యుఁడు తపస్విగాకున్నను దేవలుని నబ్బురపఱుచుచున్నవాఁడనిన సుర లందఱు నొక్క మొగి నది యట్లు గా దనినిషేధించి తత్ప్రభావంబుప్రస్తుతించిరి. అయ్యది యా జైగీషవ్యదేవలులతపస్స్థానంబు. అంచును హలధరుండు స్నానదానముల నిర్వ ర్తించి సోమతీర్థమునకుఁజనియె. అయ్యది చంద్రుఁడు రాజసూయంబునల్పిన

చోటు అందే తారకాసురసంగ్రామంబుచెల్లె. అందునుం గృతస్నానుండై కా హిణేయుండు సారస్వతతీర్థమునకుం జనియె. అందుం దొల్లి పండ్రెండేం డ్లనావృష్టి దొడరినప్పుడు సారస్వతుం డనుముని బ్రాహ్మణులకు వేదాధ్యాపనంబుం జేసె ననిన జనమేజయుండు తత్ప్రకారం బెట్లని యడుగుటయు వైశంపాయనుం డిట్లనియె.

## సారస్వతతీర్థవర్ణనము.

తొల్లి దధీచుం డనుబ్రాహ్మణుండు బ్రహ్మచారియై యింద్రియములం జయించి తీవ్రతపోనిష్ఠ సల్పుచుండ నతనికి వెఱచి సురేశ్వరుండు పెక్కు విఘ్నముల నాచరించియు వితథప్రయత్నుండై తత్ప్రలోభనార్థం బలంబుస యనునచ్చరం బంపిన నది యమ్ముని సరస్వతిలోనం బితృతర్పణము సేయుచుండునెడ నాచెంగట మెలంగుటయు దానియంగసౌందర్యమునం జేసి యాదధీచునకు రేతస్స్ఖలనం బగుడు సరస్వతి దానిం గ్రహించి తనగర్భమున ధరించి చిరకాలమునకుంగుమారునిం గని దధీచునొద్దకుం దెచ్చి మునీంద్రా నాఁడు స్కన్నంబయిననీరేతస్సు నేను గర్భమునం గ్రహించిన నీతండుపుట్టె. వీఁడు నీకుమారుఁడు గ్రహింపు మని ముందఱం బెట్టిన నమ్మునివరుండు సంప్రీతచిత్తుండై పుత్త్రుం గొని నిండుగాఁగిటం జేర్చికొని శిరంబు మూర్కొని పెద్దయుం బ్రొద్దు ముద్దాడి సరస్వతికావించినకార్యమునకు మెచ్చి నీజలములం దర్పణంబుం జేసినం బితరులు విశ్వదేవులు గంధర్వులు మున్నగువార లత్యంతతృప్తిం జెందఁగల రని వరము నొసఁగి నీవు బ్రహ్మసరస్సున నుద్భవిల్లి ప్రవహించుచున్నదాన వని మునులు నిన్నుం బ్రశంసింతురు. నాకెంతయుం బ్రియం బొనర్చితి వని యభినందించి యితండు నీకుమారుండుగాన నీపేర నితండు సారస్వతుం డనం బ్రసిద్ధుండై ద్వాదశవర్షంబు లనావృష్టి దొడరినప్పుడు బ్రాహ్మణులకు వేదములం జెప్పగలవాం డని పల్కి కుమారు నిచ్చినం గ్రహించి ముదం బంది చనియె. అట్టియెడ దేవదానవులకు ఘోరసంగ్రామంబు సెల్లుటయు రాక్షసులం బరిమార్పనోపినపరమాయుధము ముల్లోకములందును లభింపమికిం జింతించి శతమఖుఁడు దధీచునస్థులంగాని శత్రువులం ద్రుంపరా దని నిశ్చయించి యవి గొనితేర సురల నియోగించిన వా రమ్ముని తదీయ శరీరాస్థుల నడుగుటయు నప్పరమతపోధనుం డంపులకు వగవక ప్రాణత్యాగం బొనర్చి పుణ్యలోకప్రాప్తుం డయ్యె. ప్రజాపతిసుతుం డైనభృగుమహర్షికిం బుత్త్రుండై నయా దధీచమునియస్థులం బదంబడి యింద్రుండు వజ్రాయుధమును మఱియుం బెక్కు ప్రహరణములనుం గల్పించి వానిం గొని రాక్షసులం జయించె. అంతం బెద్దకాలమునకు ద్వాదశవర్షము లనావృష్టి దొడరుటయు సరస్వతీతీరవాసు లగుబుషులు వృత్త్యర్థము నలుదెసలం బఱచుచుండ సారస్వతుండును వారితోడం జనం దలంచుటయు సరస్వతి యతనిం బిలిచి పుత్త్రా నీ విచ్చోటు విడిచి చనవలదు.

బహుళ మత్స్యములు నీ కాహార మే నిత్తు నన నాతం డచ్చటన యుండి దేవర్షి పితృ తర్పణంబు సేయుచు లబ్ధము లైనయాహారము భుజించుచు వేదముల ధరిం చియుండె. ద్వాదశవర్షములు నిండినం గఱవు దీఱుటయు నంతకు మున్నాఁకట సోలి నష్టవేదులై మునులు స్వాధ్యాయకారణమున వేదము లొండొరుల నడిగి యెఱిఁగి దత్ప్రతిభానములేమిఁ జింతించుచున్నంత నొక్కవిప్రుఁడు సారస్వతుండు స్వాధ్యాయము సేయు టెఱింగించినం దక్కటివా రందఱు నతనిపాలి కేతెంచి వేదాధ్యయనంబుఁ జేయింపు మని యడిగిరి. అడుగుటయు నాసారస్వతుండు శిష్య త్వంబుఁ బొందుఁ డనుటయు నీవు బాలుఁడవే మెట్లు నీకు శిష్యుల మగుదు మనిన నాతండు ధర్మమునకు విరోధము పొసఁగనివిధమున చేయుఁడు. అధర్మ మునఁ జెప్పినను గ్రహించినను నిరువురును దురితభాగులు వైరులు నగుదురు. ఏండ్లు చెల్లుటయును వెండ్రుకలు నరయుటయును విత్తమును బంధుత్వమును వృ ద్ధత్వమునకు నిమిత్తములుగావు. మఱి విద్య యొక్కండే వృద్ధత్వకారణం బని చెప్పిన నందుల కియ్యకొని యఱువదివేవురుబ్రాహ్మణులు దర్భముష్టుల నుపాయ నంబులఁ దెచ్చి యాసారస్వతునితోడ వేదములం జదివిరి అందును దేవతీరమ ణుండు స్నానదానక్రియాకలాపము లనుష్ఠించి వృద్ధకన్యాశ్రమంబునకుఁ బోయె ననినఁ దత్ప్రకారంబు వివరింపు మనియడిగిన జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె.

కుణిగర్గుం డనుముని తపోనిరతుండై మనస్సున నొక్కకూఁతుం బుట్టిం చిన నది తపంబు సల్పుచుఁ దండ్రి తనకుఁ బెండ్లి సేయం బూనినఁ దనకుఁ దగిన వరుంగానక యయ్యది వివాహము వర్జించి వ్రతోపవాసముల శరీరముఁ గృశిం పఁజేయుచుఁ బితృదేవాదులనర్చించుచు నత్యంతనిష్ఠమై వ్రతము సల్పుచు ముది మి వచ్చినం గదలనేరక దేహత్యాగంబుఁ జేసి పరలోకమునకుఁ బోవం దలంపు గొనియున్నంత నారదుం డేతెంచి ప్రాణిగ్రహణసంస్కారంబుపడయనిపడఁతి కుత్తమలోకంబులం బ్రాపింప నలవి గా దనుటయుఁ దనతపస్సులో నర్ధము లం చముగా నొసంగి గాలవపుత్త్రుం డైనప్రాక్ఛృంగవంతుం బెండ్లియగుదు నని యుండె. ఆగాలవాత్మజుండు నేకరాత్రసహవాసంబు సంకేతముగ నొనర్చికొనియు దానితపమున సగముగ్రహించియు నావృద్ధకన్యం బెండిలియయ్యె. పాణిగ్రహ ణానంతరం బారాత్రి యావృద్ధకన్య తపఃప్రభావమునం జేసి దివ్యాలంకారమును వర్ణనీయసౌందర్యమునుం దనర నుత్తమాకారంబుతో నయ్యేకరాత్రం బమ్ముని కుమారునితోడ విలాసమున నుండి ప్రభాతం బగుటయు సమయంబుఁ దెలిపి యతండుబమ్మరించుచుండ వీడుకొల్పి పుణ్యలోకమునకుఁ జనియె. ప్రాక్ఛృంగ వంతుండును దానిరూపంబ చింతించుచు దానితపోర్ధమహిమమునం జేసి తల్లోక మునకుఁ బోయె. ఇయ్యది వృద్ధకన్యాచరిత్రము. అందొక్కరేయి వసియించి

దేవతర్పణంబు సేయునతఁ డిఱువదినాలుగేండ్లు బ్రహ్మచర్యవ్రతంబు సల్పినఫలం బుఁ బొందును హలాయుధుండు స్నానదానములం జేసి యచ్చటిబ్రాహ్మణుల వలనం గౌరవపాండవసమరంబున శల్యుండు యుధిష్ఠిరుచేఁ దెగుట తెలిసి శమం తపంచకమార్గమునఁ గురుక్షేత్రమున కరిగి తత్ప్రభావం బచ్చటిమునుల నడు గుటయు వార లాసీరికిట్లనిరి.

## కురుక్షేత్రప్రభావవర్ణనము.

కురుక్షేత్రమునం బ్రజాపతి యజ్ఞవాటమున నుత్తరవేదియై యుండె. అం దుఁ దొల్లి సురలుసత్త్రము లొనర్చి కురుం డనురాజు దున్నినకారణమున నది కురుక్షేత్ర మనం బరఁగె ననినఁ దత్ప్రకారం బెట్లనిన రామునకు ఋషులు వెం డియు నిట్లనిరి. తొల్లి కురుఁ డాచోట దున్నుచుండిన నాఖండలుండు వచ్చి నృ పాలా యేమి కారణమున దున్నెద వనియడిగిన నాతం డిచ్చటదేహత్యాగంబుఁ జేయువారలు పుణ్యలోకములం బ్రాపింపవలయు ననుతలంపున దున్నెద ననుటయు నింద్రుండు పరిహసించి త్రిదివమునకుఁ జనియె. దానికి నిర్వేదంబు నొం దక కురుఁడు తపోనిరతుఁడై దున్నుచునేయుండిన నింద్రుఁడు పలుమాఱు లచ్చోటికి వచ్చి యడుగుచు నవ్వుచునే చనుచుండిన నప్పటికి నెంతేనియు నిర్వే దంబుఁ గాంచక మఱియు నత్యంతతీవ్ర మగు తపము ననుష్ఠించుచుఁ గర్షణ ముఁ జేయుచుండె. అంత నింద్రుఁడు కురునిచికీర్షితంబు సురలకుఁ దెల్పిన వార లారాజర్షిని వరదానమున ననునయింపవలయు నట్లు కాదేని యతనితపము సఫ లంబైన నచ్చటఁ జచ్చి మనుజులు స్వర్గమునకు వచ్చువారలై మనకు యజ్ఞహ విర్భాగముల నొసంగుటఁ బరిత్యజింతు రనుటయు దివస్పతి వల్లెయని యాకురు నొద్దకుఁ జనుదెంచి రాజర్షీ ప్రయాస యుడుగుము. నిరాహారులై దేహముఁ జా లించువారును సమరమున వెనుకదీయక వీర్యదుర్దాంతులై పోరి పడియువా రును, స్వర్గమునుం బ్రాపింతు రని చెప్పి యతని మెప్పించి నాకలోకమునకుఁ జనియె. ఆవరము బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ననుమోదించిరి. కురుక్షేత్రంబు కంటె నుత్తమం బగుపుణ్యస్థానంబు వేఱొండు గన్పట్టను. ఇందుఁ దపోనిరతు లై మేను విడుచువారు బ్రహ్మలోకం బధిగమింతురు. ఇచ్చట నియ్యంబడుదాన ము సహస్రగుణితంబై యెసంగు. ఇందు నివసించువారు యమలోకముఁ గాం చరు. ఇచ్చట నధ్వరము లొనర్చువారు భూమి కలిగినంతకాలము నాకలోకమున సుఖింతురు. గాలికి రేఁగిన కురుక్షేత్రపరాగములేనియు మేనుసోఁకెనేని యెంత పాపాత్ముఁడైన నుత్తమగతిం బ్రాపించు నని యింద్రుండు తా నగ్గాథఁ జేసె. సురలును బ్రాహ్మణోత్తములును నృగప్రముఖు లగురాజులును బెక్కండ్రు నిందు నానాయజ్ఞముల నాచరించియు మేనుల విడిచియు నుత్తమగతిఁ బ్రాప్తు లైరి. తరంతుకారంతకములకును రామహ్రదములకును భచక్రమునకును మ

ధ్యగతం బైనచోటు సమంతపంచకం బనంబడు నిదియె ప్రజాపతియుత్తరవేది యనంబడు ననిఋషులు దెల్పిన విని యదుపుంగవుండు తదీయమహిమమున క ద్భుతం బంది యచ్చట స్నానదానాదుల నడిపి యటఁదఱలి మధూకామ్రప్లక్ష న్యగ్రోధచిరిబిల్వపనసార్జునమండితం బైన యొక్కపుణ్యాశ్రమంబుఁ గాంచి యి ది యెవ్వరియాశ్రమం బని ఋషుల నడుగుటయు వార లాహలాయుధున కిట్ల నిరి. ఇందు విష్ణుదేవుఁడు తొల్లి పరమతపంబు సలిపె. ఇందు విధియుతముగఁ బూర్వకాలమున నానాయజ్ఞములు నడిచె. ఇందుశాండిల్యమునికూఁతురు కౌమా రబ్రహ్మచారిణియై తీవ్రతపము సల్పి యోగమహిమమునఁ ద్రిదివమునకుఁ జనియె. ననిచెప్పిన విని బలభద్రుఁ డయ్యాశ్రమంబునకుఁ జని సంధ్యాకార్యములు దీర్చి యాచెంగట నున్నప్లక్షప్రస్రవణం బనునొక్క పర్వతం బధిరోహించి యటఁ గా రపవనంబునకుం జని యందు సుస్నాతుండై పితృదేవతర్పణంబాచరించి యచ్చట నొక్కరేయి నివసించి యింద్రుఁ డగ్ని యర్యముఁడు మున్నుప్రీతిఁ గాంచినమి త్రావరుణాశ్రమమ్ముం జూచి యందును గృతస్నానుండై యాపర్వతంబునం గూ ర్చుండి ఋషులవలనఁబుణ్యకథలు వినుచుండె.

అట్టియెడఁ గలహప్రియుండై ననారదమునీంద్రుఁడు దండకమండలధరుం డై శ్రుతిసుఖముగ వీణ వాయించుచు నచ్చటికి విచ్చేయుటయుఁ బ్రత్యుత్థానం బుఁజేసి విధియుతముగ నమ్మునిం బూజించి కౌరవపాండవులసమరప్రకారం బడిగి న నాదేవర్షి భీష్మద్రోణకర్ణసైంధవభూరిశ్రవశ్శల్యాదు లందఱుం దెగుటయుఁ గృపకృతవర్మాశ్వత్థామలు మువ్వురే దుర్యోధనుపక్షమువారు బ్రదికియుండుటయు శల్యవధానంతరంబు దుర్యోధనుండు నిస్సహాయుండై వగచి ద్వైపాయనహ్రద మున డాఁగి జలస్తంభనంబు గావించియుండినం బాండవులు కృష్ణసహితంబుగాఁ బోటుమాటల నాతని ననికిఁ జీరుటయు నతండు గదాపాణియై భీమునితోడం బోర వచ్చి యునికియుం దెల్పి శిష్యులగదారణంబుఁ జూడఁ గోరుదేని పొమ్మనినం గృష్ణాగ్రజుండు బ్రాహ్మణులం బూజించియనిచియు ననుచరుల ద్వారవతికిఁ బం పియు నాపర్వతంబు డిగి సరస్వతీవాసస మగునుత్తమప్రీతియు గుణమును నొండొకదానివలన గలుగదు సరస్వతింబొంది దివంబునకుఁ జనినవారు సదా సర స్వతిం దలంతురు. సరస్వతి సర్వనదులలోఁ బుణ్యంబు సరస్వతి సర్వలోకశుభావ హంబు. సరస్వతిం బ్రాసించినజనులు దుష్కృతంబుల నిరసించి యైహికాముష్మి కసుఖములం బడయుదు రనిశ్లోకముఁ గీర్తించి పలుమాఱు సరస్వతినదిదెసం జూచుచు శ్వేతహయయోజితం బైనరథమధిరోహించి యతిత్వరితగమనమున ద్వైపాయనహ్రదమునొద్దకుఁ జనుదెంచె. అచ్చటివృత్తాంతము మున్న తెల్పితిం గదా. అప్పుడు ధృతరాష్ట్రుఁడు సంజయుంజూచి గదాయుద్ధసమయమున రాముఁ

డు సన్నిహితుఁడై నపదంపడి నాకొడుకు భీము నెట్లు మార్కొనియె ననియడిగిన సంజయుం డిట్లనియె.

నరేంద్రా భవదగ్రనందనుండు బలభద్రునిరాకకుఁ బ్రమోదసంభరిత చిత్తుండై యుండె. రాముఁడును యుధిష్ఠిరుం డొసర్చిన పూజలం గ్రహించి పరమసంప్రీతుండై కురుక్షేత్రంబు పరమపావనంబనియు నందు సంగ్రామంబున మేను దొఱంగువారు స్వర్గప్రాప్తు లగుదురనియు ఋషులవలన వినియుండుదు నచ్చోటఁ బోట్లాడు టొప్పు ననిన యుధిష్ఠిరుండు వల్లెయనుటయు నీకొడుకు గదాదండ మంసపీఠమున నమర్చికొని సమరకాంక్షియై సరస్వతీనదిదక్షిణతటమున నరిఘృణమనుప్రదేశమునకుఁ బాండవపరివృతుండై గగనచరులు ప్రస్తుతింప శంఖారవంబులును భేరీనినదంబులు శూరజనసింహనాదములునుం జెలంగ మత్తసింధురంబులీలఁ బాదచారియై యరిగె. భీమసేనుండును గాంచనకవచంబును శిరస్త్రాణంబును ధరియించి మేరుపర్వతంబుచాడ్పునం జూడ నొప్పుచు గదాపాణియై నడిచె. మత్తసింధురములమాడ్కిని గొదమసింగములతెఱంగునను గ్రోల్పులు లవీకనుం బేర్చి సుందోపసుందులచందమునను రామరావణులవిధమునను వాలిసుగ్రీవులభంగిని మధుకైటభులపోలికిని శిఖరోల్లసితంబు లయినగిరివరములతెఱంగునను నిద్దఱువాసుదేవు లిద్దఱురాము లిద్దఱుకుబేరు లిద్దఱువరుణు లిద్దఱుయము లిద్దఱింద్రు లిద్దఱంగారకులు నె ట్లట్లు చూడ నొప్పుచుఁ బావకప్రభులై భుజంగములట్లు క్రోధవిషముఁ గ్రక్కుచు నాఁబోతులఱంకెలచాడ్పునను నేనుంగులఘీంకారములకై వడిని నుత్తమాశ్వములహేషితములరీతిని నార్చుచుం బేర్చుచుఁ గయ్యమునకుఁ గట్టాయితంబై యుండ గాంధారేయాగ్రజుండు కౌంతేయాగ్రజుం జూచి రామకృష్ణులును గేకయపాంచాలాదులును వినుచుండ నాకును భీమునకుం గలిగినయీపోరు మీ రందఱుం గూర్చుండి చూడవలయు నని తెల్పిన నట్లయని యందఱు నుపవిష్టు లగుటయుఁ దన్మధ్యమున నాసీనుం డై నముచాంతకాగ్రజుండు శ్వేతవర్ణుండు గావున నక్షత్ర గణపరివృతుం డై ననిశాకరుం గ్రేణిసేయుచుండె. అప్పుడు దుర్యోధనభీమసేను లొండొరులఁ బరుషముగ నధిక్షేపించికొని రనిన ధృతరాష్ట్రుఁడు సంజయా, మానుషత్వంబు గాల్పనె. ఏకాదశచమూనాయకుం డై ననాకొడుకు సకలరాజులను దనయాజ్ఞకు వశ్యులఁగఁ జేసికొని వసుంధరాభాగం బేలి తుది కనాథుఁడపోలె నిస్సహాయుఁడై గదాపాణియై చనియె ననుటకంటె నేమి గలదు, అక్కటా! దుఃఖము లిట్లు ప్రాప్తము లగునే యనిచెప్పి యూరకుండుటయు సంజయుఁ డిట్లనియె. అట్లు నీకొడుకు శౌర్యసముద్రుండై యాఁబోతు ఱంకెరీతి నార్చి భీముం బోరికిఁ బిలుచునెడ ధూమ్రవాతప్రసారము పాంసువర్షము దిక్తటముల నంధకారావరణ ముల్కాపతనము పర్వము గాకున్నను రాహువాదిత్యుం గ్రహించుట భూకంపము మృగగణకరుణారవము గిరిశిఖరపాతము

నఱఖులయఱపు జలపానములందలినీళ్లు లుబుకుట యశరీర మహానాదములు ము
న్నగునుత్పాతంబులు దోఁచినం జూచి వృకోదరుండు దుర్యోధనుం జూపి ధర్మ
జున కిట్లనియె. ఈమందాత్ముఁడు నన్ను గెలువ నోపఁడు. ఖాండవమునఁ బావకు
నెట్లట్లు వీనిపై నేను జిరకాలదీప్తం బైనక్రోధము విడిచి భవదీయ హృదయ
శల్యంబు నేఁడు పుచ్చెద. మదీయగదాదండమున నీకురుకులాధముని నేఁడు వధి
యించి కీర్తిమాలిక నీకు వేసెద. పాములఁ గఱపించినదానికిని విషాన్నంబుఁ బె
ట్టినదానికినిఁ బ్రమాణకోటిలోఁ ద్రోయించినదానికిని లక్కయింటఁ గాల్పించిన
దానికిని సభలో నపహసించినదానికిని సర్వస్వము నాఁచికొన్నదానికిని వనవాసా
జ్ఞాతవాసాయాసములఁ గల్పించినదానికి నీదురాత్ముఁ డంతము నేఁడు గనంగల
వాఁడు. ఈయొక్కపవలింట వీనిం ద్రోచి యే ననృణుఁడ నగుదు. ఈదుర్మతికి నేఁ
టితో నాయువును దల్లిదండ్రులదర్శనమును బ్రియాంగనావలోకనంబును దీఱె.
ప్రాణములను రాజ్యమును సంపదనుం గోల్పడి యీయుక్కివుండు నేఁడు నేలం
బడువాఁడు. వీనిచావు విని ధృతరాష్ట్రుఁడు శకునిబుద్ధికల్పితంబైన యశుభమెల్ల
నేఁడు తలపోయఁ గలవాఁ డని పలికి సుత్రాముఁడు వృత్రుంబోలె నతనిఁ బోరికిఁ
జీరి యంతనిలువక యతని దెసం జూడ్కి సారించి దుర్మతీ, ధృతరాష్ట్రుఁడును నీవు
నొనర్చిన జతుగృహదహనము ద్యూతవంచనము పాంచాలీపరిభవము మున్నగుదు
ష్కృతములనెల్లఁ దలంచికొనుము. నీవలనంగాదె యేము గర్భవాసముపోలె విరా
టనగరమున నజ్ఞాతవాసక్లేశముఁ గుడిచితి మదియెల్ల వమ్మగునె? నీతదర్థంబె మ
హారథోత్తముఁ డైనగాంగేయుండు శిఖండిపాలితుండై శరతల్పమున నున్నవాఁడు.
ద్రోణకర్ణశల్యాదులు నీతదర్థంబ మడిసిరి. వైరమున కాదికర్త యగుశకునియుం
దెగియె. ద్రౌపదికిఁ గ్లేశముఁ గావించిన ప్రాతికామియుం బొలిసె. నీతమ్ములందఱు
ను వెండియుం బెక్కండ్రురాజులును నీకై చచ్చిరి. నిన్ను నే నిప్పుడు గదచే నడి
చెద నని యెలుంగెత్తి యధిక్షేపించుచున్నభీమసేనునకు దుర్యోధనుండు నిర్భయ
ముగ నిట్లనియె. వృకోదరా! పలుదెఱంగులగు కత్థనంబుల నేమి! చక్కనిల్చి
పోరుము: నీకుఁ గలయుద్ధశ్రద్ధను నేఁ దుడిపెద. కులాధమా, దుర్యోధనుఁడు
ప్రాకృతమనుజునట్లు నీయట్టివానివిభీషికలకు వెఱవఁడు. నీతోడ గదారణము చే
యుదు నని పెద్దకాలంబుగోలెఁ గోరియుండిననాకోర్కి నేఁడు దైవప్రాప్తం
బయ్యె. దుర్మతీ! వ్యర్థవచనములం బ్రయోజనం బేది. చెప్పినమాట కార్యమునఁ
జూపు మని చెప్పినం దద్వచనంబు నచ్చటిసోమకాదు లగు రాజన్యులందఱుం
బ్రశంసించిరి. చేతిచప్పళ్లు నున్మత్తమాతంగంబు తెఱంగునఁ దదభినందనవచనంబు
లకు నెమ్మనంబున నలరి దుర్యోధనుండు పోరికిఁ గట్టాయితంబై నిల్చుటయు భీమ
సేనుండు నతనిం దలపడుటయు నప్పుడు పాండవపక్షమున జయసూచకంబుగాఁ
దురంగహేషితంబులును గజబృంహితంబులును శస్త్రప్రదీప్తంబులును నెసంగె.

### భీమసేన దుర్యోధనులగదాయుద్ధము.

అవ్విధమున భీమసేనుఁడు తలపడినం దుర్యోధనుం డార్చిపేర్చి యతనిం దాఁకుటయు నత్తొలితాఁకు శృంగసముల్లసితంబు లగు మహోక్షముల పోట్లాట తెఱంగునను నింద్రవ్రస్థాసులపోరుతీరునను నత్యంతతుములం బయ్యె. అట్లు గదాపాణులై యయ్యిరువురు లొండొరులం దలపడి యేట్లాడుచు నెత్తుటం జొత్తిల్లి పూచిన మోదుగులచాడ్పునం జూడ నొప్పి యెంతయు డస్సి కొండొకవడి యూఅడిల్లి మగిడి యడరినం గరేణునిమిత్తంబు మార్కొన్న బలవన్మత్తమాతంగముల కరణిం గ్రేణిసేయుచుండినం జూచి దేవదానవాదులు పిచ్చలించిరి. సమానవీర్యులగునయ్యుద్ధఱ తెఱంగుఁ గనుంగొనినంతన సర్వభూతములకును విజయమునెడ సంగియంబు గదిరె. అక్కారణిం దాఁకిన యయ్యిరువురు గదాపాణులై క్రేంకణమునందు సం దరయుచు వివిధమండలగతులం దిరుగుచు భక్ష్యార్థంబు గాట్లాడు మార్జాలములలీల మెఱయుచుఁ జలంబునఁ బెనంగునెడ భీమసేనుం డేచి తుముల ప్రకారంబుగ గదాప్రహారంబు సేయుటయు నబ్బరం బంది గాంధారీనందనుం డును నే శ్చేర్పడ నడరుటయు నయ్యుద్ధఱ నావంతయేనియుం గొఅంత తెలియరానివిధమున నేట్లు తప్పించుటయు విడుచుటయుఁ జుట్టుటయు నెదిరించుటయు మార్కొనుటయు నిల్పుటయు నిగ్రహించుటయుఁ గ్రమ్మఱించుటయు నడ్డగించుటయు నెగయుటయు దాఁటుటయు నేయుటయుఁ దొలంగుటయు మలంగుటయు డాయుటయు నెడయుటయు ముట్టుటయు మున్నుగా ననేకచిత్రములం జరించుచు నన్యోన్యగదాదండముల నితరేతరగదాదండముల నడుచుచు శోణితపరిప్లుతులై వృత్రసుత్రాములట్లుపోరుచు ధార్తరాష్ట్రుండు వలపలిఁచినం బాండవుఁడు డాపలించి యఱిమినం గురురాజు వడముడి శిరగిపార్శ్వములు నడిచిన నందులకుఁ దలంకక యక్కొంతేయుండు గాంధారేయుఁ గదనడిచి మఱియు బహువిధమండలగతులం బోవుచు నతనిగదం దనగదాదండమునఁ బ్రహరించుటయుఁ దుములనిస్వనం బెనంగె. మిడుఁగుఱులు మింటఁ బర్వె. అందుల కలిగి దుర్యోధనుండు దనగదాదండము గిరగిరం ద్రిప్పుటయు నతనిగదా మారుతవేగంబుఁ గాంచి పాండవులు పాంచాలురును భీతిఁ జెందిరి. అట్లు ఘోరప్రకారమున సంగరము సెల్లుచున్నంత నీసుతుం డేచి వివిధవిచిత్రమార్గములం బోవువాయుసూనుం దాఁకిన నాతండు నానిగదం గొట్టుటయు విస్ఫులింగములతోఁ బిడుగున కెనయగునినాదం బెసంగుటయుఁ బుడమి వడఁకుటయుం గసలి గాంధారీసుతుండు కుంతీసుతుని డాఁపలించి చుట్టి తలపై మోఁదిన నందుల కాతండు చలింపఁడయ్యె. అట్టు లొక్కయెడుగేనియుఁ గదలక పవనతనయుండు సుస్థిరుండై యుండుటయు నద్భుతం బయ్యె. తత్ప్రహారమున కలిగి వడముడి కురురాజుం బిట్టేయుటయు నాతండు లాఘవచాతుర్యమున నందఱు నివ్వెఱఁ గంద నాప్రహారమ్ము వమ్ముచేసినం గాంతేయుగద

మహానినదంబుతో భూమి కంపింపఁ బడియె. అప్పుడు నీకొడుకు లావునం బేర్చి వివిధకౌశికమార్గములఁ దిరుగుచు భీమసేనుని వంచించి తదీయవక్షంబు బిట్టడుచుటయుఁ బెనుగాఢతాడనంబున నాతండు మోహపరీతుండై కర్తవ్యం బెఱుంగకున్నంత సోమకపాండవులు తల్లడిల్లిరి. అట్టియెడ వడముడి యలిగించిన యేను గెట్టు లట్టులు రోషభీషణుండై వనగజంబుపై నడరుకొదమసింగము తెఱంగునం గురురాజుపైఁ దలపడి చేరువ కరిగి తదీయపార్శ్వమునం బిట్టడుచుటయు నమ్మహీనాథుఁడు మోఁకరిల్లఁబడినం బాంచాలు రార్చిరి. వారియార్పున కలిగి సుయోధనుండు మహానాగమువోలె రోఁజుచుఁ గన్నుల నిప్పులు రాలం జూచుచు గదఁ గొని భీమునిపై నడరి నిటలశ్రోత్రమధ్యభాగంబు బిట్టేయుటయుఁ గ్రమ్మిననెత్తురు మదజలంబుగా వన్యమాతంగంబు ననుకరించుచు నించుకేనియుం జలింపక కోపించి తనగద యెత్తి భవత్తనయుపై నేయుటయు నాదారుణప్రహారమునం జేసి వాతవిధూతం బైన కుసుమితపాదపంబుచందంబున సంధిబంధము లెడల నేలం బడుటయుఁ బాండవులు సముల్లాసంబున సింహనాదములం జేసిరి. అంతఁ గొంతవడికిఁ దెలిసి రారాజుమదఁ గెడలినచ్చుమదపు టేనుంగు తెఱంగున లేచి వచ్చి కోపదీపితుండై వివిధగతులందిరుగుచు వడముడిం బిట్టడచిన నతండు వెల్లఁబోయి నేల కొఱఁగినం గౌరవుం డార్చిపేర్చి గదాప్రహారంబునఁ గ త్తళంబు వ్రచ్చుటయు మింట దివ్యులయులివును గుసుమవర్షమును నెసంగె. అట్లు భీముఁడు పడుటకును గవచభేదనంబునకును సుయోధనుండు కొఱంతవడయమికిని బాండవులు భీతిల్లుచున్నంత హిడింబాంతకుండు తెలిసి నెమ్మొగమ్ము దుడిచికొని లేచి ధైర్యముఁ బూని రోషరూషితుండై కనుంగవ ద్రిప్పి మార్కొనియుండునంత నర్జునుండు వాసుదేవుం జూచి భీమసేనదుర్యోధనులలో నెవ్వఁ డధికుఁడు ? ఎవ్వనియెడ నేగుణం బెక్కుడు ? తెలియం జెప్పు మనియడుగ నతనికి మురారి యిట్లనియె.

కృష్ణుఁ డర్జునునకు భీమదుర్యోధనుల తారతమ్యముఁ జెప్పుట

ఇరువురికిని విద్యోపదేశంబు తుల్యంబు. భీమునకు లావును దుర్యోధనునకు నేర్పు నెక్కుడై యుండు. ధర్మసమరమున భీముఁడు దుర్యోధనుం గెలువఁ జాలఁడు. అన్యాయమునం జంపఁగలఁడు. అన్యాయంబు చేయఁ దగునె యంటేని వినుము మాయచేతఁగాదె సురలసురుల నిర్జించిరి. మాయచేతనే సురేంద్రుఁడు విరోచనుని వృత్రునిం దెగటార్చె. కావున మాయామయం బగుపరాక్రమంబు భీముఁ డిప్పుడు గ్రహింపవలయు. మఱియు జూదమునాటి భీమసేనుఁడు గదచే నీతొడలు ద్రుంతునని దుర్యోధనునితోఁ బ్రతిజ్ఞఁ జేసినవాఁ డిప్పుఁడాప్రతిజ్ఞ దీర్చికొనుఁగాక. మాయావి యగుకురుకులాధముని మాయోపాయమున వధించుఁగాక. అట్లు చేయకుండినం గెల్పు టరిది గావున యుధిష్ఠిరుఁడు విషమస్థుం డగు. వెండియుం జెప్పెదు. ధర్మజునపరాధమునం జేసి క్రమ్మఱ మనకు భయము సం

ప్రాప్తంబయ్యె. భీష్మప్రముఖు లగుశూరవర్యుల నిర్జించి వైరము వెలార్చి జయమును యశమునుం బొందఁ దగినయిప్పుడు మనకు విజయమునెడ సంశయంబుఁ గల్పించె. ఒక్కని గెల్చినం జాలు నని పందె మాడినధర్మజునియబుద్ధి నేమనం దగును. సుయోధనుండు నేర్పరి వీరుఁ డేకాయనగతుండునై యున్నవాఁడు. ఓడి యొడ లోమ విచ్చి పఱచియుం గ్రమ్మఱి యఱుమువారలయు నవిశేషు లగు నేకాయనగతులయు జీవితాపేక్ష మాని తెంపుపెంపునం దలపడువారలయు ముందఱఁ బోర నిలువ నిర్జరేంద్రునకేనియు నలవి గాదని తొల్లి శుక్రుఁడు నచియించె. తత్ప్రకారమున నోడి యొడ లోమ వెఱచి పఱచి క్రమ్మఱి రాజ్యముమీఁదను జీవితముమీఁదను నపేక్ష యుడిగి యడరినయీసుయోధను నిప్పు డతండు మన రాజ్యము హరింప నోపకున్నను ద్వంద్వయుద్ధమునకుఁ బిలువవచ్చునే! పదుమూఁడేఁడులు గదాయుద్ధమున లెస్సయలవాటు చేసికొన్నవాఁడు గావున వాఁడు భీమసేనుం జంపువాఁడై యూర్ధ్వతిర్యగ్గతులఁ దిరుగుచున్నవాఁడు. నానిరూపించిన మాయోపాయమున భీముఁడు వానిం బరిమార్పఁ డేని యతం డుక్కునం బేర్చి భీముం దెగఁజూచి తాన మీకు రాజగు నని చెప్పిన విని ధనంజయుండు భీమసేనుండు చూడఁగ దనడాపలితొడ నడుచుటయు నవ్వడముడి దాని సన్నగాఁ గొని వివిధ యమకములు సవ్యదక్షిణమండలములు గోమూత్రకంబును దిరుగుచుండ భవత్పుత్రుండును లాఘవంబు మెఱయఁ జిత్రతత్వంబు నెఱయ భీమసేనజిఘాంసాపరుండై యడరిన నయ్యిద్దఱు నంతకదర్పయంబుమాడ్కిఁ జందనాగరురూషితంబు లగుసముద్దండగదాదండములం ద్రిప్పుచు నామిషలోలుపము లగుగరుడములవడువునను నెండొరుల నడిచికొనుచుండినం బ్రళయసమయవాయుసంక్షోభితములగు రెండుసాగరములట్లు ఘూర్ణిల్లుచు మత్తసింధురంబులట్లు పోరి పెద్దయు డస్సి ముహూర్తమాత్ర మూఱడిల్లి యటఁ గడిమి మెఱసి మార్కొని యితరేతరగదాదండములఁ బరస్పరగాత్రములఁ జెక్కుచుఁ బంకస్థితము లగుమహిషములరీతిం భోట్లాడుచు రక్తసంసిక్తగాత్రులై కుసుమితహిమవత్కింశుకములరీతిం జూడ నెప్పిరి. అప్పుడు దుర్యోధనుండు పార్థుండు చేసినసంజ్ఞ యెఱింగి తటాలున డాసినం జూచి వృకోదరుండు గద యెత్తివేయుటయుఁ దత్క్షణంబ యతండు దొలంగిన నదివృథయై నేలం బడిన నది తఱిగాఁ గొని నీకొడుకు భీము నడుచుటయుఁ దత్ప్రహారమున వృకోదరుఁడు నెత్తు రుఱుల మూర్ఛపోయియు నమ్మహాబలుండు నిశ్చియుండినం ద్వదాత్మజుం డతనియవస్థం దెలియక తన్నెతన్ను నని తలంచి తొలంగె.

భీముఁడు దుర్యోధనుతొడలు విఱుగ గొట్టుట.

అంతలో నాశ్వాసితుండై పవనసూనుండు రయమున నీతనయుపై నడరిన నాతండు తత్ప్రహారము వమ్ముసేయుం బూని భీముని వంచించువాఁడై మీఁది కెగయ

నుంకించుచున్నంత దాని నెఱింగి బకాంతకుండు తటాలున డాసి యార్చిపేర్చి యతి
రయమున నూరువులం బట్టి బిట్టేయుటయు నాఘోరప్రకారంబునం జేసి దుర్యోధ
నుండు తొడలు విఱిగి పుడమి ప్రతిధ్వని యొసంగ నేలం బడియె. అప్పుడు దారుణ
వాయువులు వీచుట పాంసువర్షము పృథివీకంపము శోణితవర్షము దివ్యులమహా
నాదము మృగపక్షిగణములదారుణారవము హతశేషగజవాజిమనుజనినదము భేరీ
శంఖమృదంగనిస్వనము ఘోరకబంధదర్శనము ధ్వజాస్త్రశస్త్రచలనము కూప
ప్రహదములు రుధిరము గ్రక్కుట నదు లెదు రెక్కి పాఱుట స్త్రీలు పుల్లింగముల
ను బురుషులు స్త్రీలింగములనుం దాల్చినట్లు కానంబడుట మున్నగునద్భుతోత్పా
తంబులు గాన్పించినం జూచి పాంచాలపాండవు లుద్వేగంబుఁ జెందిరి. చూడ వ
చ్చిన గంధర్వాప్సరశ్చారణాదు లగుదివ్యు లయ్యద్భుతసమరప్రకారముఁ జెప్పు
కొనుచు యథాగతం బరిగిరి. సింహవినిపాతితం బైనమత్తమాతంగంబుభంగి భీ
మసేన పాతితుం డైనదుర్యోధనుం గాంచి పాంచాలపాండవులు రోమాంచకంచు
కితగాత్రులై యుండునంత బకాంతకుఁడు దుర్యోధను డాయం జని మూఢాత్మా,
నాఁ డాసభలో ద్రౌపదిం బరిహసించుచు మమ్ము గోవుగో వనియధిక్షేపించినపా
పమునకు ఫలముఁ బొందు మని తనవామపాదమున నారాజరాజుశిరంబుఁ దన్ని
యంత నిలువక క్రోధపరీతుండై మున్ను మమ్ముఁ బసు లనియార్చి నృత్యంబుఁ
జేసినమూఢుల నిప్పుడు మేము మగుడఁ బసులనియార్చి యాడుదుము. వంచన
యఁ జిచ్చు పెట్టుటయు జూదమును మాయెడం గన్పట్టవు. నిజభుజబలమునఁ బ
గతురం బరిమార్తు మని యెలుం గేర్పడం జెప్పి నవ్వుచు యుధిష్ఠిరుని వాసుదేవు
ని సృంజయులను ధనంజయునిఁ గవలనుం గాంచి రజస్వలయు నేకవస్త్రయు
నగుపాంచాలి నాసభకుఁ దేరంబనిచి పరిభవించినపాపాత్ము లగుధార్తరాష్ట్రులు
యాజ్ఞసేనితపోమహిమవలన నిహతులైరి చూడుఁడు. మున్ను మమ్ము గొడ్డుపోయి
రని యుల్లసమాడిన ధృతరాష్ట్రపుత్త్రులఁ బుత్త్రమిత్త్రామాత్యపరిజనసమన్వితం
బుగా మేము తెగటార్చితి మింక మాకు స్వర్గగమనంబును నరకపతనంబును స
మానములై యుండు నని చెప్పి యప్పురుషపరాక్రముండు చిత్తమున నుల్కొను
క్రోధోద్రేకంబు పెల్లునం జేసి యంతటను నిలువక భూమిపతితుం డైనసుయోధ
నునొద్దకుఁ జని గదాదండమున మెడ యదిమిపట్టికొని యెడమకాల నతనిదలఁ
దన్నుటయు ధర్మపరులగు సోమకోత్తములు తత్కృత్యము మెచ్చరైరి. అప్పు
డట్లు వికత్థనవర్తనపరుం డైనభీముంజూచి ధర్మరా జిట్లనియె. భీమసేనా శుభక
ర్మమున నొండె నశుభకృత్యమున నొండెఁ బగ దీర్చితి వనృణుఁడవై తివి ప్రతిజ్ఞ నె
ఱపితి వింక నూరకుండుము. రాజు జ్ఞాతి హతుఁడు నగునీతనిఁ గాలఁ దాఁచుట
ధర్మంబు గాదు. ఏకాదశాక్షౌహిణీపతి కురురాజు సర్వవిధవికలుఁగు నగునీతనిం
జూచి యిప్పుడు వగవవలయుఁగాని యిట్లు తిరస్కరింపను నుల్లఘంబాడనుం ద

గునే? ఉత్పన్నపిండుఁ డగునితనియెడఁ జేయఁబడునపచారమించుకేనియు న్యాయంబు గాదు. భీమసేనుఁడు ధార్మికుఁ డని లోకమువారు నిన్నుఁ బొగడుదు రదియెల్ల వితథముగా నిట్లు చేయరా దని భీమునకు నీతి జెప్పి బాష్పగద్గద కంఠుండై యుధిష్ఠిరుండు దుర్యోధనుం జేరఁ జనియిట్లనియె. తండ్రీ, క్రోధశోకము లుడుగుము. మనుజుండు పూర్వకృతకర్మముల ఫలములం గుడుచుట నిక్కవంబు. మేము నిన్నుఁ జంపఁ బూనుటయు నీవు మమ్ముఁ బరిమార్పఁ గడంగుటయు నాత్మాపరాధముననే ప్రాప్తంబులయ్యె. లోభమదబాల్యములంజేసి నీవు యుక్తాయుక్తముల నరయనికతంబున మిత్రులం దండ్రులఁ దమ్ములఁ బుత్త్రులఁ బౌత్త్రులను మఱియుఁ బలువురుమహీపతులనుం జంపించి తుది నీవుం దెగితివి. నీయపరాధముననే నీతమ్ములను జ్ఞాతులను మేము తెగఁజూడవలసె. దైవంబుఁగడవ నేరికిం దరంబు గాదు. భవన్మరణంబు ప్రశస్త్యంబు గావున నాత్మశోచనంబు నీకుఁ గర్తవ్యంబు గాదు. మఱి యేమ కూర్పుఁజుట్టలను జెలులున్నగువారలనుం గోల్పడి సర్వావస్థలందును శోచనీయులమైతిమి. వైధవ్యంబునం గుందుకోడండ్రు మున్నగువారల నెట్టులు చూడ నేర్తునని యలందురుదు. వారెల్ల శోకకర్శితులై నన్నుఁ దూలనాడుదురు. నీవు స్వర్గమున కేగి సుఖములం గుడుతువుగాని మేమ యిక్కడ నరకప్రాయ మగు దుఃఖ మనుభవింతు మని పలుదెఱంగులఁ బెద్దయుంబ్రొద్దు విలాపంబు సేసె ననిన విని ధృతరాష్ట్రుండు సంజయుం జూచి గదాయుద్ధవిశేషజ్ఞుఁ డగుబలభద్రుఁ డధర్మమున భీముఁడు దుర్యోధనుం దెగఁ జూచినందుల కేమి చేసె ననియడుగ నవ్విచిత్రవీర్యపుత్త్రునకు సూతపుత్త్రుఁ డిట్లనియె.

### శ్రీకృష్ణుఁడు బలరాముని కోపోపశమనముఁ జేయుట.

భీముఁడు వామచరణమున దుర్యోధను శిరస్తాడనంబుఁ జేయుటం జూచి హలాయుధుండు కోపించి పెలుచ నాక్రోశించి చీచీ! భీమ యనిపలికి నాభికిఁ గ్రింద గదాయుద్ధమున నడువరా దని ధర్మవ్యవస్థ యేర్పడియుండ శాస్త్రనిశ్చయముఁ బరికింపక యీమూఢుఁడు స్వచ్ఛందమునం బ్రవర్తించె ననిచెప్పి యొదవినకినుకపెల్లునంజేసి రథనిక్షిప్తం బయినలాంగలంబుఁ గొని భీముపయిం గవియుటయు నూర్ధ్వబాహుం డైనయమ్ముసలాయుధునప్పటిరూపంబు బహుధాతుచిత్రితంబైన కైలాసశైలంబులీలం బొలుచుచుండఁ బుండరీకాక్షుండు వినయాన్వితుండై పీనాయతభుజముల నాతనిం బట్టుపట్టుటయు సితాసితవర్ణులయిన యావాసుదేవబలదేవులు దినాంతమున నంతరిక్షగతు లగుసూర్యచంద్రులచందమునఁ జూపట్టిరి. అప్పుడు నారాయణుం డన్నకుఁ గోపోపశమనంబుగా నిట్లనియె. ఆత్మవృద్ధి, మిత్రవృద్ధి, మిత్రమిత్రవృద్ధి, శత్రుహాని, శత్రుమిత్రహాని, శత్రుమిత్రమిత్రహానియు, నన వృద్ధి షడ్విధంబై యొప్పును. ఇందులకు విపరీతం బగునేని యాత్మగ్లాని దొడరుం గావున నప్పుడు శాంతిఁ గోనవలయు. నీతిపద్ధతి యిట్లు ప్రవర్తిల్లుఁ

గదా. మనకు సహజమిత్త్రులు మేనత్తకొడుకులు నగుపాండవులవృద్ధి కుల్లమున నుల్లసిల్లవలయుఁ గాని యలుగవచ్చునే! అధర్మమున భీముఁడు దుర్యోధనున కూరుభంగంబుఁ గావించె నంటేని వినుము. క్షత్త్రియునకుఁ బ్రతిజ్ఞాపాలనంబు పరమధర్మ మనియు భీముఁడు దుర్యోధనుతొడలు గదచే విఱుతు నని సభామధ్యమునఁ బ్రతిజ్ఞచేయుటయు నెఱుంగుదువుగదా. మఱియు మైత్త్రేయుండు దుర్యోధనుతొడలు భీముఁడు గదచే నడుచునని శపించినవాఁ డది వృథ యౌనునే! కావున నాకుంజూడ నిందుఁ ద ప్పేమియుఁ గానంబడదు. క్రోధ ముడుగుము. బంధుత్వసౌహార్దసంబంధములం జేసి పాండవులవృద్ధి యస్మద్వృద్ధిగాఁ దలంపు మనిన విని సీరపాణి చక్రపాణి కిట్లనియె.

నీవు చెప్పినది నిక్కవం బయినను ధర్మార్థకామముల కొండొంట బాధ గలుగనివిధముఁ జూడవలయుఁగాని ధర్మబాధకముగ నర్థకామముల నెప్పుడును సేవింపరాదు. భీముఁడు ధర్మపీడనమున సర్వము వ్యాకులంబుఁ గావించె ననుటయు మురారి ప్రలంబారిం జూచి మహాత్మా, నీవు దోషరహితుఁడవనియు ధర్మాత్ముఁడవనియుఁ బ్రఖ్యాతిఁ గాంతు వింక నలుక మాని శాంతిం గొనుము. కలియుగ మాసన్న మయ్యెం గావున నిట్టివి ధర్మంబులై ప్రవర్తిల్లఁగలవు. పాండవునకుఁ బ్రతిజ్ఞాపూర్తియు ననృణత్వంబునుం గలుగుఁగాక యనిన రాముఁడు ధర్మచ్ఛలమునకు సంప్రీతచేతస్కుండు గాక యుపశమించి భీముఁడధర్మమున సుయోధను వధించినకారణమున జిహ్మయోధి యనంబడును. దుర్యోధనుండు ధర్మయుద్ధయాగమున దీక్షితుండై శాత్రవానలంబున నాత్మహోమంబుఁ గావించి యశోవభృథంబుఁ గాంచి శాశ్వతగతిం బొందువాఁ డనిపలికి రథం బధిరోహించి ద్వారకకుఁ బోయె. పాంచాలయాదవపాండవులు నాతిప్రసన్నచిత్తములం దనరిరి.

అప్పుడు శోకోపహతసంకల్పుఁడై చింతాభరమున మోము వాంచియున్న యజాతవైరిం గాంచి వసుదేవనందనుండు ధర్మనందనా, భీముఁడు దుర్యోధను తలఁ గాలఁ దాఁచె నని యధర్మంబుఁ దలంచి వగతువే యనిన నాతం డాతనిం జూచి కృష్ణా, క్రోధకారణమున వృకోదరుఁడు రాజరాజగుదుర్యోధనుశిరంబును వామపాదమునఁ దన్నుట నాకుఁ బ్రియంబు గాదు. కులక్షయసమయమున నిట్టివి చేయఁ జనదు. ధృతరాష్ట్రసుతులు వంచనాపరులై బహువిధముల మమ్ము వంచించి యడవులకుఁ బంపి రనుకోపమున నాతం డట్టు లకృత్య మొనర్చె నని యొప్పరికించితి ననవుడు గోవిందుఁ డది యట్ల యని భీమునకుఁ బ్రియార్థంబు తత్కర్మం బనుమోదించె. అట్టియెడ వృకోదరుఁ డన్నకు మ్రొక్కి కేలుదోయి మోడ్చి యెదుర నిలిచి మహారాజా, నిష్కంటకం బైనయది నేఁడు నీయ

దియయ్యె. స్వధర్మమున నేలుము. వైరకర్తయు వంచనాపరుఁడు నగుదుర్యో
ధనుఁడు నేలం బడియె. దుశ్శాసనుఁడు కర్ణుఁడు శకుని యనుతులువలు ముందె
తెగటారిరి. సకలమహీమండలము నిన్నుఁ జేరె నని యన్నకు నివేదించిన విని
ధర్మనందనుండు వాయునందనుదెస మొగంబు వెట్టి వత్సా, పగ దీర్చితివి, సు
యోధనుం గూల్చితివి, కృష్ణునిమతమునఁ బుడమియెల్ల గెల్చితివి, భాగ్యమునఁ
దల్లికిని గోపమునకు నానృణ్యం బొనర్చితి వని భీము నభినందించె ననిన ధృతరా
ష్ట్రుండు గావల్గణీ, దుర్యోధనుండు గూలినపిదపఁ బాండవపాంచాలు రేమి యొ
నర్చి రనియడుగ నతనికి సంజయుం డిట్లనియె. సింహము మత్తమాతంగంబు
నుంబోలె వృకోదరుండు దుర్యోధనుం గూల్చుటయుఁ బాంచాలురు మున్నగు
పాండవవీరు లుత్తరీయముల విదుర్చువారును సింహనాదములఁ జేయువారును
విండ్ల విక్షేపించువారును జ్యాఘోషంబు నిగిడించువారును జిందము లొత్తువా
రును దుందుభులు మ్రోయించువారును నాడువారును నవ్వువారునై యుండ
భూమికి భారం బైనవిధము దోఁచె. అట్లు వారు సముల్లాసభాసితులై భీమ
సేనుం జేర నరిగి శూరశేఖరా, సుత్రాముఁడు వృత్రుంబోలె నీవు పగతుం బరి
మార్చి దుష్కరకృత్యంబుఁ జేసితివి. వివిధమండలగతులం దిరుగుచు గదార
ణంబు సేయుదుర్యోధనుం గూల్పఁగ వృకోదరుఁడు దక్క నెండొక్కఁడు నేర్చు
నె? మత్తకుంజరమువీఁకం బేర్చి సంగరరంగమున దుర్యోధనుతల భాగ్యమునం
గాలఁ దన్నితివి. సింహము మహిషము నెట్టు లట్టుల దుశ్శాసనుం గూల్చి నె
త్తురు ద్రావితివి. ధర్మజునకుఁ గీడు రోసినవారలతలలం బాదంబుఁ బెట్టితివి.
శత్రునిర్మూలనంబునను దుర్యోధనవధమునను నీకీర్తి జగత్ప్రసిద్ధం బయ్యెడి. వృ
త్రవధానంతరము సురేంద్రుం గాంచినసురలతెఱంగున మే మిప్పుడు నిన్నుఁ
గాంచి యానందింతుము. దుర్యోధనుండు గూలునెడఁ బొడమినపులక లిప్పటి
దనుక నట్లే యున్న వని యగ్గించుచున్నంత మురాంతకుండు వారలం జూచి వ
ధింపఁబడినశత్రునిఁ బరుషవచనముల మఱియు వధింపరాదు. లోభపరీతుండై
శాస్త్రిముల నుల్లంఘించి భీష్మద్రోణకృపవిదురసంజయులు దెల్పినను వినక ని
రపత్రపుండై పాండవులకుఁ దండ్రిప్రా లీక నిరాకరించిననాఁడే వీఁడు హతుఁ డ
య్యె. కాష్ఠభూతుఁ డగువీనిం బ్రల్లదము లాడ నేల? రయమునఁ దేరు లెక్కుఁ
డు పోవుదము. భాగ్యమున నీపాపాత్ముఁడు పుత్త్రిమిత్త్రామాత్యసమన్వితంబుగఁ
డెగియె ననుచున్నంత విని సుయోధనుండు క్రోధపరీతుండై లేచి పిఱుదు లాన్చి
చేతులఁ బుడమిం బట్టి తోఁకతెగినమహోరగంబుకరణిం జూడ నొప్పుచుఁ
గూర్చుండి బొమలు ముడివడఁ గ్రూరవీక్షణంబున నధోక్షజు జుఱచుఱం జూచి
ప్రాణాంతకరణం బయిన ఘోరవేదనను సరకుసేయక పరుషవచనముల నవ్వాసు
దేవున కిట్లనియె.

## దుర్యోధనుఁడు శ్రీకృష్ణు నధిక్షేపించుట.

కంసదాసునిపుత్త్రుఁడా, ధర్మవిరుద్ధముగ గదాయుద్ధమున నన్నుఁ గూల్పించిననీకు సిగ్గు లేదే! తొడల నడువ భీమునకు సన్నఁ జేయు మని నీ వర్జుసునకుఁ దెల్పుచుండ నే నెఱుంగుదు. ప్రతిదినమును బాడి తప్పక పోరాడుమహీపాలురం గుటిలోపాయములఁ జంపించిననీకు సిగ్గు నేవయుం గలుగునే? శిఖండినిఁ బురస్కరించి యర్జునునిచేఁ బితామహుం గూల్పించితివి. అశ్వత్థామనామంబై నయేనుఁగు హత మగుడు నానెపమున నాచార్యు నస్త్రసన్న్యాసంబుఁ జేయించి నృశంసుఁడై ధృష్టద్యుమ్నుఁ డగ్గురునితలఁ దఱుఁగుచుండినం జూచుచుంటివి కాని వారింపవైతివి. అదియెల్ల నాయెఱుంగనియదియె? అర్జునవధార్థంబు కర్ణుండు సంపాదించికొనియున్నశక్తిని ఘటోత్కచునిమీఁద నేయించి తప్పించిననీకంటెఁ బరమపాపకారి యొండొకండు గలుగునే? సాత్యకితోడం బోరుచున్న భూరిశ్రవునిచేయి పార్థునిచేతం దునిమించితివి. సర్పముఖశరము వితథమయి రథచక్రము నేలం గ్రుంగి తల్లడిల్లునప్పుడు కర్ణుం జంపించితివి. ఋజుయుద్ధమున భీష్మద్రోణకర్ణులను నన్నునుం గెలువరాదు. దుష్టాత్ముండవై స్వధర్మానుష్ఠానపరు లైనమ మ్మధర్మమునఁ జంపించితి వనిన వాసుదేవుఁ డిట్లనియె. గాంధారేయా, పాపపరులరై నీవును నీతమ్ములును నీవారలునుం బొలిసితిరి. భీష్మద్రోణులు నీతదర్థంబు ప్రాణహానిం బొందిరి. నీమతం బనువర్తించి కర్ణుఁడు తెగియె. లోభవశుఁడవై నీవు శకునినిశ్చయమునం జేసి పాండవులకుఁ దమయంశము నేను వచ్చి చెప్పినను నియ్యవైతివి. భీమునకు విషముఁ బెట్టించితివి. పరమపతివ్రత యగుయాజ్ఞసేనిని సభకు రావించి పలువిధములఁ బరిభవించితివి. పాండవులు వనవాసాయాసములఁ గృశించునెడ జయద్రథుం బంపి తృణబిందునాశ్రమమున వారు వేటపోయినప్పు డప్పాంచాలిని భంగపెట్టించితివి. అభిమన్యుఁ డొక్కఁడు బాలుఁడు ననక మీరందఱు చుట్టుముట్టి యధర్మమునం జంపితిరి. ఇంతకంటెఁ బాపములు వలయునే? చేసినపాపములం జేసి నీవును నీ వారలునుం దెగటారితిరి. ఆత్మదోషముల లాఁతులపైఁ బెట్టునీకు లజ్జ యెక్కడిది? బృహస్పతి భార్గవులయుపదేశము నెఱుంగవు. పెద్దల సేవింపవు. హితవచనముల వినవు. నీయత్యంతలోభము నిన్నిట్లు చేసెఁ దత్ఫలంబుఁ గుడువు మనిన దుర్యోధనుం డయ్యా, యేను జదివితి నిచ్చితి నేలితిఁ బగవారితలలపై నుండితి నెల్లభోగములం గుడిచితి నిఁక సపరివారముగ స్వర్గమునకుఁ బోవుదు. మీరు హతసంకల్పులరై పశ్చాత్తాపమునం గుందుదురని చెప్పుచున్నంతఁ బుష్పవర్షంబు గురిసె. గంధర్వవాదిత్రరవంబు సెలంగె. అచ్చర లాడిరి. సిద్ధు లగ్గించిరి. లలితసురభిశిశిరమారుతంబు వీచె. దెసలు వెలింగె. నభము వైడూర్యప్రకాశం బయ్యె. అయ్యద్భుతములు దుర్యోధనునకుఁ బూజగాఁ దలంచి పాండ

వులు వ్రీడితులై భీష్మద్రోణకర్ణభూరిశ్రవు లధర్మహతులై రనివగచిరి. అప్పుడు వారివగ పెఱింగి కమలనాభుండు మేఘమంద్రభిస్వనమున నిట్లనియె. ఈ దుర్యోధనుఁడును భీష్మద్రోణకర్ణభూరిశ్రవులును సామాన్యులు గారు. వారల ఋజుయుద్ధమునం గెలువరాదు. భవద్విజయార్థంబు నే ననేకమాయోపాయములు సమయోచితంబుగఁ బన్నినం గెలువ నయ్యె. మీర కాదు లోకపాలురును వారలం గ్రమయుద్ధమున వధింప నోపరు. ఇందులకు వగవం బని లేదు. నానోపాయముల శత్రులం బరిమార్చుట నీతి. తొల్లింటిపెద్ద లాచరించినమార్గము మీరును బట్టితిరిగాని యొండు గాదు. కృతకృత్యుల మైతిమి. ప్రొద్దు గ్రుంకుతటి యయ్యె. విడిదలకుఁ బోవుద మనినం బాంచాలపాండవులు తమతమశంఖము లొత్తుటయు మాధవుఁడు పాంచజన్యంబుఁ బూరించె. అంత ధృష్టద్యుమ్నాదులు పాండవశిబిరములకుఁ జనుటయుఁ బాండవు లేవురును గృష్ణసాత్యకు లిరువురును మనశిబిరమున కరుగుదెంచి నృత్యాంతమున విజనం బైన నాట్యరంగంబుభంగి హతోత్సవం బయినదుర్యోధనునావాసమునకుఁ జనుటయు నచ్చటికావలివారు కృతాంజలులై పొడసూపిన వారల నాదరార్ద్రదృష్టిం బ్రసాదించి ధర్మనందనాదులు రథావతరణంబు సేసిరి.

అగ్నిదగ్ధం బయినయర్జునురథంబు కాలిపోవుట.

అట్టియెడ హృషీకేశుఁడు గుడాకేశుం జూచి నీవు గాండీవము నక్షయ్యతూణీరములనుం గొని ముందు డిగుము. పిదప నేను దిగుద నట్లు చేసిన నీకు మే లయ్యెడి ననిన నర్జునుండు గాండీవతూణీరములం గొని డిగియె. పదంపడి వాసుదేవుఁడు యుగ్యంబులపగ్గముల నొగల ముడిచి యవతరించుటయుఁ గేతనకపి యంతర్హితం బయ్యె. తత్క్షణంబ యమ్మహారథంబు రథ్యసహితంబుగా ద్రోణకర్ణులదివ్యాస్త్రానిలంబున మండి భస్మీభూతం బై పడిన నందఱు విస్మయంబందిరి. అప్పు డర్జునుండు పుండరీకాక్షునకుఁ గృతాంజలియై దేవా, యేల యీతేరిట్లు దగ్ధం బయ్యె నాశ్చర్యం బయ్యెడి వినఁ దగునేని తెల్పు మనియడిగిన మురారి యతని కిట్లనియె. అర్జునా, ద్రోణకర్ణులబహువిధదివ్యాస్త్రములను బ్రహ్మాస్త్రమునను నీరథము మున్నె దగ్ధంబయ్యె నే నధిష్ఠించియున్నకతన విశీర్ణము గాకుండె. ఇప్పుడు నీవు కృతకృత్యుఁడ వైన నేను విడుచుటయుఁ గాలె ననిపలికి చిఱునగవు నెమ్మొగమ్మునఁ దళుకొత్త ధర్మనందనుం గౌఁగిలించికొని కుంతీనందనా, భాగ్యమున నీశత్రువులు వ్రేలిసిరి. నీవును భీముఁడును గాండీవియుఁ గవలు నీవీరక్షయమునఁ దప్పించుకొంటిరి. సమరోద్యోగంపుఁదఱి నే నుపప్లావ్యమునకు వచ్చి నప్పుడు నీవు నాకు మధుపర్కం బిచ్చి వివ్వచ్చుం జూపి యీతఁడు నీచెలికాఁడు సర్వాపదలందును రక్షణీయుఁ డనిచెప్పిన నేను వల్లెయంటినిగదా. ఆసవ్యసాచి సురక్షితుండై విజయంబు గొన్నవాఁ డనిన ధర్మపుత్రుండు రోమాంచకంచుకిత

గాత్రుండై దేవకీపుత్త్రుని కిట్లనియె. అరిమర్దనా, ద్రోణకర్ణులు ప్రయోగించిన బ్రహ్మాస్త్రములు నీ వొర్చితివి కాని యింద్రుండైన సైంప నోపునే? నీప్రసాద మునంగాదె పార్థుండు పరాఙ్ముఖుండు గాక సంశప్తకులం బిలుకుమార్చె. ఉపప్లావ్యమునం బలుమాఱులు కర్మసంతానంబు గుఱించియుఁ దేజోగతియుం గుఱించియు నే నడిగినం గృష్ణద్వైపాయనుండు ధర్మ మేవలనం గలుగు నావలనఁ గృష్ణుఁడు నిల్చుఁ గృష్ణుఁ డేదెస నిలుచు నాదెస గెలుపు సిద్ధించు ననిబోధించెఁ గావున నీప్రాపు గాంచినమాకు దుష్కరం బెయ్యది యని యమ్మహానుభావు నగ్గించి రత్నకనకరజతనానావస్త్రపరిపూర్ణంబు లగుదుర్యోధనుకోశగృహము లను దాసీదాసజనములనుం జూచి గ్రహించి రథ్యముల నపనయింపఁ బంచి యున్నంత మంగళార్థం బీరేయి శిబిరబహిఃప్రదేశంబున నివసించుట లెస్సయని వాసుదేవుఁ డెఱింగించుటయుఁ దత్ప్రకారమునఁ బాండవులు వాసుదేవసాత్యకి సహితంబుగా నాసాయంకాలమున నోఘవతీతీరమున విడిసిరి. అప్పుడు ధర్మరాజు గాంధారీసమాశ్వాసనార్థంబు కరిపురికిఁ గృష్ణుం బొమ్మని ప్రార్థించిన నాతండు దారుకోపనీతం బైనతేరెక్కి యరిగె ననిన జనమేజయుండు వైశంపాయనుం జూచి మునీంద్రా, యేల ధర్మనందనుండు కృష్ణునే పంపె. తొలుత శమార్థంబు నమ్మహాత్మునే యనిచెఁ గావున నిందునుం గార్యం బెద్దియేనియు నుండ నోపు ననితలంతును వివరింపవే యనియడిగిన నమ్మనుజనాథు నభినందించి యమ్మునినాథుఁ డిట్లనియె.

శ్రీకృష్ణుండు గాంధారి నూఱడింపఁ గరిపురి కరుగుట.

అధర్మయుద్ధమున దుర్యోధనుఁడు హతుఁ డగుటకు వగచి పరమతపోధన యగుగాంధారి తమ కేమికీడు రోయునో యని యత్యంతభయాకులుండై ధర్మరాజు వాసుదేవున కిట్లనియె. గోవిందా, భవత్ప్రసాదమునం జేసి దుర్లభం బగు రాజ్యము నిష్కంటకంబుగఁ బడయఁ గంటిమి. దేవదానవసమరమున నమరుల కెట్లట్లు భారతరణమున మాకుఁ దోడ్పడి యేమేమి చేసితి వవియెల్ల నందఱకుం బ్రత్యక్షంబులు. కరుణాభరమునంగాదె పార్థునకు సారథివై జయ మొసంగితివి. కాకున్న మాకు జయంబు గలుగునె? మానిమిత్తంబకదా నీవు నానాస్త్రప్రహారములను బరుషవచనాధిక్షేపంబులనుం బొందితివి. దుర్యోధనవధానంతరము నీ ప్రయత్నము సఫలంబైనను గాంధారి తపోమహిమంబుఁ దలంచిన నస్మదీయక్షేమంబున సందియంబు గ్రందుకొనియెడి. అద్దేవికోప మెఱుంగుదువుకదా. ఆసాధ్వి యలిగెనేని మ మ్మందఱను నీఱుసేయ కుడుగునే? పుత్త్రపౌత్త్రాదులనిధనం బువిని యమ్మహాపతివ్రత మాపై నలుగకుండునే. పుత్త్రశోకపీడిత యగునద్దేవిం జూడను నిప్పు డెవ్వండును శక్తుండు గాఁడు. కావున నీ విప్పుడు హస్తిపురి కరిగి యద్దేవికోపంబు హేతుసమన్వితములు కాలోచితములు నగువచనములం

జల్లార్ప నిన్నుఁ బ్రార్థించెద. అస్మత్పితామహుఁ డైనకృష్ణద్వైపాయనుండు నింతకు నచ్చటికి సన్నిధిచేసియుండు ననితలంచెద. పాండవహితార్థి యగునీ విప్పు డీకార్యంబుఁ జేయవలయు ననివిన్నవించిన విని విష్ణుండు దారుకుం బిలిచి తేరు పూన్పం బంచి తదానీతం బైనరథంబు నధిరోహించి త్వరితగతిం గరినగ రంబునకుఁ జని మొగసాలఁ దేరు డిగ్గి ధృతరాష్ట్రునకుఁ దనరాక యెఱిం గించిపుచ్చి నగరు సొచ్చి యచ్చట నంతకుమున్న యేతెంచియున్న వేదవ్యాసుం గాంచి తొలుత నమ్మునీంద్రునకును బిదప ధృతరాష్ట్రునకును గాంధారికిం బ్రణా మంబులు గావించి కూర్చుండి ధృతరాష్ట్రునికరంబుఁ దనచేత నప్పళించి కొండొ కప్రొద్దు పలవించి యచ్చటికలశజలములఁ గన్నులు గడిగికొని యాచమించి ప్రస్తావసముచితంబుగ నైచిత్రవీర్యున కిట్లనియె.

—— శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రుని గాంధారిని నూరార్చుట. ——

భరతకులోత్తమా, గతానాగతకాలవృత్తంబు నీయెఱుంగనియది కాదు. పాండవులు నీచిత్తము ననువర్తించియుఁ గులక్షయమునకు సమ్మతింపకయు ద్యూ తచ్ఛలనిర్జితులై సమయంబుదప్పక వనవాసాజ్ఞాతవాసంబు లశక్తులట్లు నడిపి తుది సంధిఁ గోరిరి. ఏన వచ్చి యెల్లవారును విన నైదూళ్ళనైన నిమ్మని యాచిం చితి. కాలోపహతుండవై నీవు తత్పరికారంబేనియు నియ్యకొనవైతివి. నీయ పరాధముననే క్షత్రియక్షయం బావహిల్లె. భీష్మద్రోణద్రౌణికృపబాహ్లికసోమ దత్తవిదురులు శమార్థంబు నిన్నుఁ బ్రార్థించినను వినవైతివి. కాలము వచ్చి నప్పు డందఱునీయట్టులే కర్తవ్యం బెఱుంగ రిది నీతప్పునుం గాదు. పాండును తులయెడ నేతప్పునుం గానరాదు. ఇంతయు నెఱింగి వారిపై ననూయ చేయ వలదు. మఱియు నీకును గాంధారికిని బరలోకక్రియాకలాపంబు వారియందే నిల్చియున్నయది కావున వారిక్షేమంబు మీరు కోరవలయు. ధర్మరాజునకు మీయెడఁ గలభక్తిస్నేహములు నీవు నెఱుంగుదుకదా. ఇంతసమరంబు చేసి జయించియు నిన్నునుం గాంధారినిం దలంచుకొని శేయింబవలు నిక్కిలి పరిత పించుచుఁ బుత్రశోకవ్యాకులితబుద్ధు లగు మిమ్ముఁ జూడ లజ్జితుండై యున్న వాఁడు. ఇదియెల్లఁ బరికించి కరుణార్ద్రచిత్తమున వారలం బ్రోవ నిన్ను బ్రమొ క్కి ప్రార్థింతు ననిచెప్పి గాంధారి కిట్లనియె. దేవీ, నీకు సరివచ్చుసాధ్వి యెచ్చ టను గానంబడదు. ఆనాఁ డాసభలో నేను వినుచుండ రెండుపక్షములకు హిత ముగను ధర్మార్థసహితముగను నీకఱపిననీతి నీకొడుకు వినఁడయ్యె. మఱియు యుద్ధమునకు సన్నద్ధులై తఱలు నప్పుడు నీవు దుర్యోధనుం గుఱించి మూఢా, ధర్మ మేదేసనిలుచు నావలన జయము గలుగు నని పరుషముగఁ బలికితివికదా. ఆవాక్యము సఫలం బయ్యె. ఇ క్లైఱింగి శోకం బుడుగుము. పాండవులకుఁ జేటు దలంపవలదు. తపోబలమునంజేసి రోషరూక్షవీక్షణంబున నీవు చరాచరాత్మకం

బగు భూమండలంబెల్ల దహింప నోపు దనిన గాంధారి కేశవా, నీచెప్పిన దట్ల యగు. మనోవ్యాధి గాఱింప వ్యాకులితంబైన నామతి యిప్పుడు భవద్వచనములం దేఱె. అంధుఁడు వృద్ధుఁడు హతసుతుఁడు నగునీరాజునను నీవును బాండవులును గతియనిచెప్పి యప్పరమసాధ్వి వస్త్రాంతమున మొగంబుఁ గప్పికొని యేడ్చినం గేశవుండు హేతుసమన్వితము లగువాక్యముల నాదేవిని ధృతరాష్ట్రుని నూరార్చి యశ్వత్థామయుద్యోగంబు హృదయగోచరం బగుడుఁ దటాలున లేచి పారాశర్యపాదములకుఁ బ్రణమిల్లి ధృతరాష్ట్రుం జూచి రాజేంద్రా! వగ పుడుగుము. ద్రోణ తనయుం డీ రేయి పాండవుల వధియింపఁ బూనినవాఁడు పోయి వచ్చెద వీడ్కొల్పు మనిన నాకురువల్లభుండును గాంధారియు నయ్యా, శీఘ్రుంబ యరిగి పాండవులం గావుము. పునస్సమాగమం బయ్యెడు మని వీడుకొల్పినం గమలనాభుఁడు కృతకృత్యుండై తే రెక్కి రయమునఁ బాండవులయొద్ద కరిగి తద్వృత్తాంత మంతయు వారి కెఱింగించినం బ్రీతచేతస్కులైరి. వాసుదేవుండు సనినపదంపడి సాత్యవతేయుండు ధృతరాష్ట్రునకుఁ దదర్థంబు లెస్స నిరూపించి యంతర్హితుం డయ్యె.

అప్పుడు ధృతరాష్ట్రుఁడు సంజయుం జూచి యక్కటా! నాకొడుకు తొడలు విఱిగి పుడమిం బడి వడముడి డాపలికాలఁ దలఁ దన్నినం బరమవ్యసనప్రాప్తుం డయ్యెఁగదా తదనంతరం బేమి చేసె నని యడుగ సంజయుఁ డతని కిట్లనియె. రాజేంద్రా, తత్సమయంబున నే నరుగఁ బాంసురూషితుండై నెమ్మిగమ్మున నెఱసిన వెండ్రుకలు వెనుకకుఁ దీసికొని క్రోధము నియమించి మహోరగంబుచందమున రోఁజుచుఁ గన్నులు నిండ నీరు పెట్టికొని మత్తద్విపంబుమాడ్కిఁ బలుమాఱులు చేతుల ధరణి నప్పళించి పంక్తి గొఱికి పాండవ జ్యేష్ఠుని నిందించుచుఁ గురురాజు నా కిట్లనియె. భీష్మద్రోణ కర్ణాశ్వత్థామకృపకృతవర్మశకుని ప్రముఖు లత్యంతవీరులు గల్గియుఁ బదునొకం డక్షౌహిణులకుఁ బతి యగునే నీపాటు పడవలసె. అక్కటా ! కాల మేరికి నతిక్రమింప నలవి గాదు. మనవారిలో బ్రదికినవారలం గాంచి భీముఁడు ధర్మము దప్పి నన్నుఁ గూల్చెననియు భీష్మద్రోణకర్ణభూరిశ్రవుల యెడఁ బాండవు లన్యాయంబు సల్పిరనియుం జెప్పుము. పాండవు లింతయన్యాయమునకుఁ దొడరుదురే ? కపటజయమున నేమి ప్రీతి గలిగెడు. ధర్మము దప్పినవాని నేబుధుఁడేని సమ్మానించునే? అధర్మజయమునకుఁ బండితుఁ డెవ్వఁడేని వృకోదరునట్టు లుప్పొంగునే ? తొడలు విఱిగి పడిననాతలఁ గాలఁ దాఁచుటకంటే జిత్ర మొండు గలుగునే ? ఇట్టివాఁడునుం బ్రశంసఁ బడయునే ? నాతల్లిదండ్రులు యుద్ధధర్మముల లెస్స యెఱుంగుదురు. వారి కిది యెల్లఁ దేటపడం జెప్పుము. మఱియు జన్నములఁ జేసితి భృత్యుల భరించితి శత్రుశిరములఁ బాదము పెట్టి భూమండలంబెల్ల నేలితి దేయముల నిచ్చితి

మిత్రులకుఁ బ్రియ మొనర్చితి శత్రువుల బాధించితి బాంధవుల సమ్మానించితిఁ ద్రివర్గంబు లెస్స సేవించితి సకలరాజుల నాయానతిమెయి నడుచునట్లు వీఁకం జేర్చితి గజవాజివిహారంబు లనుభవించితిఁ జదివితి సర్వంబు సాధించితి నోడి పరుల నాశ్రయింపక భాగ్యమున క్షత్రియధర్మపరినిష్ఠితుండనై పుణ్యలోకముల జయించితి ధర్మము దప్పక పోరితి నని నామాటగా జననీజనకులకు విన్నవింపుము, మఱియుఁ గృపకృతవర్మాశ్వత్థామలం జూచి యధర్మప్రవృత్తు లగుపాండవుల నెప్పుడు నమ్మరా దని తెల్పు మనిపలికి యచ్చటికి వచ్చినవార్తాహరులం జూచి నీకొడుకు మఱియు నిట్లనియె. భీమసేననిహతుండ నైనయేను ద్రోణకర్ణశల్య వృషసేనశకునిజలసంధ భగదత్తసోమదత్తసైంధవాదులును దుశ్శాసనాదు లగు తమ్ములును దుశ్శాసనసుతుండును లక్ష్మణుండును మఱియుఁ బలువురురాజులునుం జన్నపుణ్యలోకములకు నిస్సహాయుండనై సాతుదప్పినపాంథునట్లు వెన్నడించి పోయెద. అన్నలు భర్తయుం దెగుట విని నాచెలియలు దుశ్శల దుఃఖభరమున నెట్లు కాఁగలయదియో కటకటా ! కోడండ్రును వారికోడండ్రును శోకకర్శితలై యుండ వారిం జూచుచు ధృతరాష్ట్రగాంధారు లేగతిం బొందుదురో ! లక్ష్మణునితల్లి కొడుకును నాథుఁడునుం జచ్చుట విని శీఘ్రంబ నశించు. పరివ్రాజకుం డైన చార్వాకుఁ డియ్యర్థ మెఱింగెనేని నాకుఁ బ్రీతి జేయఁగలఁడు. త్రైలోక్యవిశ్రుతం బయినశమంతపంచకపుణ్యక్షేత్రమున నిధనంబుఁ బొంది యేను శాశ్వతలోకములం బ్రాపింతు నని బాష్పపూర్ణలోచనుండై యేడ్చిన నాప్రలాపంబు విని యందఱు నార్తులై పలుదెసలం బఱచిరి. అప్పుడు పృథివి కంపించె. ఉలుములు పెల్లుగవినంబడియె. దెసలు మలినంబు లయ్యె.

కృపాదులు మువ్వురు దుర్యోధనునొద్దకు వచ్చుట.

అట్లరిగి యాజను లశ్వత్థామం గని గదాసమరవ్యవహారంబును దుర్యోధనుపాతంబునుం జెప్పుటయుఁ గృపకృతవర్మాశ్వత్థామలు మువ్వురు వాఁడియమ్ముల నెంచినట్లును గదాతోమరశక్తిప్రముఖప్రహరణముల నడిచినట్లును నెంతయు నెచ్చి యతిరయమునం జనుదెంచి వాయువేగప్రభగ్నం బయిన మహాసాలంబుపోల్కిని వ్యాధపాతితం బైనవనగజమువిధమునను యదృచ్ఛాపతితం బయినయాదిత్యుఛత్రముచాడ్పునను భీమపాతితుండై చండమారుతశోషితసాగరంబుకరణిఁ దుషారావృతమండలుం డైనపూర్ణచంద్రునిచందమునను జెన్నుదఱిగి ధరణీరేణురూషితుండై ధనార్థు లగుభృత్యులు నరపతి నెట్టు లట్టులు దారుణక్రవ్యాదభూతగణములు తన్నావరింప రక్తసంసిక్తగాత్రుండై భ్రుకుటీకుటిలవక్త్రుండై యుద్వృత్తనేత్రుండై మేటిగుఱికాఁడు గూల్చినక్రోల్పులిపోఁకం దనరియున్నదుర్యోధనుం జూచి మోహంబుఁ జెంది తేరులు డిగ్గి రయమునం బఱచి వచ్చి యమ్మహీపతిం జూచుచు నేలం గూర్చుండుటయు నాచార్యసూనుండు

బాష్పపూరితలోచనుండై నిట్టూర్పు నిగిడించుచు నిట్లనియె. మహారాజా, మనుజునియెడ సత్యమించుకయుఁ గానంబడదు. అక్కటా! నీ విట్లు పాంసురూషితుఁడవై పడుదువే? పూర్వము రాజేంద్రుఁడవై భూమియెల్లఁ బాలించి నీ విప్పుడీనిర్జనవనంబున నెట్లు లుండెదవు? దుశ్శాసనుఁడు కర్ణుఁడు మఱియుం గలిగినజెలులు నిచ్చటఁ గానఁబడరె? మూర్ధాభిషిక్తుల కగ్రేసరుండైనలోకేశ్వరుఁడక్కటా యిప్పుడీధూళిం బ్రుంగునే? కాలవిపర్యయంబుఁ జూచితే? ఆశ్వేతచ్ఛత్రచామరంబు లాసైన్యంబు నెక్కడకుఁ బోయె? లోకయాత్రాక్రమ మెఱుంగరాదు. లోకగురుఁడవయ్యు నీ వీదుర్దశం బొందుదె? ఇంద్రునితో మత్సరంబు సేయఁ జాలినసంపద నెప్పియున్ననీ విప్పు డీదశఁ జెందుటం జూడ మనుజులయెడ లక్ష్మి చంచల యనుమాట నిశ్చయం బయ్యె ననిన నమ్మాటలు విని నీసుతుండు కన్నులఁ దుడిచికొని కృపాదులకు మువ్వురకుఁ గాలోచితముగ నిట్లనియె. ధాత నిర్దేశించినమర్త్యధర్మం బిట్టిది. సర్వభూతములకుఁ బర్యాయమున వినాశము గల్గుచుండు. అది యిప్పుడు నన్నుఁ జేర వచ్చె. నేను రాజ్యమేలినవిధంబును నాపత్సమయమునను సమరంబున నేరికిం బరావర్తనంబు సేయమియు మీ రెఱుంగుదురుకదా. భాగ్యమునఁ బాపాత్ములు కపటమున నన్నుఁ గూల్చిరి. హతజ్ఞాతిబాంధవుఁడనయ్యు భాగ్యమున నుత్సహించి పోరితి. ఈసమ్మర్దమునఁ దప్పించికొన్నమిమ్ము భాగ్యమునం గంటిని. నాపాటునకు మీరు సాహార్దకారణమున వగవం బని లేదు. వేదములు ప్రమాణమయేని యక్షయ్యలోకములను నేను సాధించితి. అమితతేజుఁడైనకృష్ణునిప్రభావం బెఱింగి యేను క్షత్రధర్మము లెస్స యనుష్ఠించి యతనివలనఁ జ్యుతిం బొరసితి. నన్ను గుఱించి వగవం బని లేదు. మీరును మాకుఁ దగినంత చేసితిరి. దైవము ప్రతికూలము గావున విజయము చేకూఱదయ్యె ననిపలికి దుర్యోధనుం డశ్రువ్యాకులలోచనుండై శ్రమపీడితుండు గావున నూరకుండె. అట్టియెడ ద్రోణతనయుండు క్రోధసంరంభమునం జేసి యుగాంతకాలపావకునిచాడ్పున మండుచుఁ జేతు లప్పళించి బాష్పవిహ్వలవచనంబున నమ్మహీవల్లభున కిట్లనియె. క్షుద్రు లగు పగవారలు క్రూరకర్మంబున నాతండ్రిం జంపినప్పుడు నిప్పటియట్లు తల్లడిల్లనైతి. ఇష్టాపూర్తదానధర్మను కృతంబులయాన వాసుదేవుఁడు సూడఁగ సర్వపాంచాలురను నేఁడు వధియించెద నింతయు నిక్కవం బనుజ్ఞ యిమ్మనుటయు మనస్సముల్లాసకరం బయినయావచనంబు విని కౌరవేశ్వరుండు కృపుం బిలిచి జలపూర్ణ మగుకలశముఁదె మ్మనిన నతండు తెచ్చుటయు దుర్యోధనుం డాశారద్వతుం బిలిచియాచార్యా! నాకుఁ గూర్తువేని నాయానతి నాచార్యతనయు సైనాపత్యమున నభిషేకింపుము. రాజనియోగంబునం బ్రాహ్మణుండు విశేషించి క్షత్రధర్మస్థితుండు పోరఁ దగు నని ధర్మవిదులు సెప్పుదు రనిన గృపుఁడు ద్రోణతనయు నభిషేకించె. అవ్విధమున

సేనాపతిత్వపదస్థుండై యశ్వత్థామ దుర్యోధనుం గౌఁగిలించికొని వీడుకొని సింహనాదమున దెసలు పూరించుచుఁ గృపకృతవర్మసహితుండై యరిగిన వారు శోకసంవిగ్నచిత్తులై చింతించుచుండిరి. దుర్యోధనుండు నారాత్రి యచ్చటఁ గడపె నని సంజయుండు ధృతరాష్ట్రున కెఱింగించె.

క॥ అని యిటు వైశంపాయన। మునివర్యుఁడు శల్యపర్వము న్వివరింపన్ ।
విని జనమేజయనరపతి। ఘనసమ్మోదాబ్ధివీచికలితుం డయ్యెన్॥

ఉ॥ ద్యోగతభానుబింబము సముజ్జ్వలదర్పణమందు బింబితం
బై గృహభిత్తినిం దనరి యద్దము మూసిన నర్కుఁ డొక్కఁడే
యాగతి నాత్మమాయ మెలయన్ జగదీశుఁడు జీవుఁ డంచు మి
థ్యాగతభేదుఁ డైనపరమాత్మ నఖండుఁ దలంతు నిచ్చలున్॥

ఇది శ్రీకాళహస్తినగరాధినాథ శ్రీమద్దామరకుమారాక్కమహీపాల కరుణాపూరస్సరబహుమానపాత్ర, సంస్కృతాంధ్రభాషాకవిత్వచమత్కారపరితోషితబుధస్తోమ సీతారామకవిలలామ పుత్త్రి, సకలశాస్త్రనిరంకుశపాండితీధుర్య లక్ష్మీనరసింహసుధీవర్య సచ్ఛాత్ర,విబుధజనవిధేయ వేంకటరంగనామధేయ విరచితం బైనశ్రీమదాంధ్రవచన భారతంబునందుశల్యపర్వంబునఁ గౌరవసైన్యాధిపత్యంబున నభిషిక్తుండై శల్యుండు దినార్ధంబుపోరి మధ్యాహ్నంబున ధర్మరాజుచే నిహతుం డగుటయు,సహదేవుఁడు శకునిని వధించుటయు, సేనయెల్ల హతభూయిష్ఠంబైనం దనకు సహాయబలంబు లేక దుర్యోధనుండు ద్వైపాయనహ్రదంబు సొచ్చి నిజమాయాబలంబున జలస్తంభనంబుఁ జేసికొని డాఁగుటయు, భీమునిబోయలవలన నది యెఱింగి ధర్మజాదు లచ్చటి కరిగి పరుషవచనముల నతనిఁ బోరికిఁ జీరి భీమునితోడి గదాయుద్ధమునకుఁ బురికొల్పుటయు,బలరామాగమనంబును, సరస్వతీతీర్థప్రభావకథనంబును, భీమదుర్యోధనుల గదాయుద్ధంబును, భీమునిగదాఘాతమున దుర్యోధనుఁడు తొడలు విఱిగి పడుటయునన్నది సర్వంబు నేకాశ్వాసము.



శ్రీకాళహ స్తీశ్వరాయనమః.

# సౌ ప్తి క ప ర్వ ము.

## ప్రథమాశ్వాసము.



క॥ శ్రీకపిల చతుర్వింశతి
ధా కలనా సంగృహీత తత్త్వాపరసం
జ్ఞా కమనీయ క్షేత్ర
వ్యాకృత మాయా త్త సంశ్రయ క్షేత్రజ్ఞా॥

దేవా, ననుఁ గృతార్థుం జేయుము.

సంతతసభ క్తోపసేవితద్వైపాయనుం డైనవైశంపాయనుం డనంతర కథాకర్ణనోదీర్ణకుతుకహృదయుం డై నజనమేజయున కిట్లనియె.

అట్లు ధృతరాష్ట్రున కశ్వత్థామాదులు దుర్యోధను వీడుకొని యరుగుట యెఱింగించి సంజయుండు వెండియు నిట్లనియె.

అవ్విధమున నద్దివసావసానంబునం దఱలి యమ్మువ్వురు రథికులు పాండవ శిబిరంబుఁ దఱియం జని జయముఁ గొని యుప్పొంగుచున్నయవ్వీరుల నప్పుడు చెనయ వెఱచి తదీయసేనానివేశమున కనతిదూరంబునం గహనారణ్యమునఁ బ్రచ్ఛన్నులయి కొండొకవడి యుండి వాఁడికై దువులపోట్ల నెప్పి గదిరినమేనులు నెత్తుటఁ దోఁగిన నెంతయు డప్పిఁ గూరి పెద్దయుంబ్రొద్దు వేఁడినిట్టూర్పులు నిగిడించి జయప్రాప్తు లయినపాండవవీరులయార్పు లాకర్ణించి వెన్నడించి ముట్టు దురో యని వెఱచి ప్రాఙ్ముఖంబునం గొంతదవ్వు పఱచి రథ్యములకుం దమకుఁ బిపాస యెక్కుడై నకతంబున నడువ నోపక నిలిచి రాజవధమునకు సంతప్తులై క్రోధపరీతులై రనిన విని వైచిత్రవీర్యుండు సంజయున కిట్లనియె.

గావల్గణీ, నాగాయుతబలుఁ డగునాకొడుకును భీముఁడు గూల్చె ననుట నమ్మఁ బోలకుండెడి. సర్వభూతములకు నవధ్యుఁ డగునబ్బలియుఁడు పాండవని హతుఁ డయ్యె నకటా ! నాహృదయంబు ఱాఁతఁ జేయంబడినది కాఁబోలు. నూఱుగురు కొడుకులును దెగి రనివినియు నాగుండియ వేయివ్రక్కలు గాకుం డునే ? వృద్ధదంపతు లిట్లు కొడుకుల నందఱనుం బోకార్చుకొని యెట్టులు కా నోపుదురు? ఏ నింకఁ బాండవులరాజ్యమున నుండ నోపను. రాజునై రాజు నకుఁ దండ్రినై యెల్లవారు నాయాజ్ఞం దలఁ దాల్చునట్లు మెలంగి యింక ను

క్కనియాజ్ఞ ననువర్తించి దాసునివిధమున నెట్లుండ నోపుదును? నాకొడుకుల నూఱుగురనుం జంపి ప్రతిన నెఱపినభీమసేనునిపలుకు లిట్లు కట్టులు విన నోపుదు? విదురునిమాటయే తుది సత్యం బయ్యె. అతనిమాట నాకొడుకు విసమింజేసి యింతలు గుడువవలసె. భీముఁడు దుర్యోధను నధర్మమునం జంపినందులకుఁ గృపకృతవర్మాశ్వత్థామ లామీఁద నేమి చేసిరి? తెలియం జెప్పు మనియడిగిన ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె. అట్లు లరిగి కృపాదులు నానాద్రుమల తావృతము నానాక్రూరజంతుసేవితము నానాపక్షిగణావృతము నానాపుష్పోప శోభితము నానాతోయసమాకీర్ణము గహనరమణీయము నగునక్కాంతారమున శాఖాసహస్రపరివృతం బయినయొక్కవటవృక్షముఁ జేరం జని తేరులు డిగ్గి రథ్యము లపనయింపం జెప్పిన నప్పటికి గభస్తిమాలి యస్తగిరిశిఖరాంతర్హితుం డగుటయు సంధ్యోపాసనంబు నిర్వర్తించి యుండునంత నంతరిక్షంబు గ్రహనక్ష త్రపరిపూర్ణం బైనం గాఢాంధకారం బలముటయు రాత్రి యేతెంచిన దివాచ రము లగుభూతములు నిద్రాపరవశము లయ్యె. నక్తంచరభూతములు దారుణ ఘోష మెసంగ సంచరింపఁ దొడంగె. అట్లు ఘోరం బయిననిశాముఖంబునఁ గృపద్రోణికృతవర్మ లాన్యగ్రోధముచెంగటం గూర్చుండి కురుపాండవక్షయంబుఁ జింతించుచు దుఃఖాక్రాంతులై యుండ గాఢశ్రమాన్వితులు గావున భూజశార ద్వతు లత్యంతసుఖార్హులయ్యు నాథులయ్యు ననాథులట్లు లానేల నొరిఁగి నిద్రిం చినం గురుపుత్త్రుండు క్రోధానలదందహ్యమానమానసుండై మహోరగంబు తెఱఁగున రోజుచు నిద్దుర వట్టక కూర్చుండి నానాసత్త్వసేవితంబై యత్యంత దారుణం బైనయగ్గహనంబుఁ గలయం జూచుచు నావటవిటపివిటపంబుల ననేక సహస్రవాయసములు తమతమగూళ్ల సుఖనిద్ర సేయుచుండ నత్యంతదీర్ఘ ఘో షాభీషణంబు బభ్రుపింగలంబు ఘోరనేత్రంబు మహాకాయంబు నగుగూబ యొ క్కండు గరుడవేగమున నేతెంచి చప్పుడు లేకుండ మెల్లన నప్పాదపంబుఁ జొచ్చి యక్కాకములం గాంచి కొన్నింటి ఱెక్కలు వ్రక్కలుచేసియుఁ దలలు దటి గియుఁ గాళులు ద్రుంచియు నానావిధములఁ దన కగపడినవానిం ద్రుంచి యాన్యగ్రోధమండలంబెల్ల వాయసాంగశకలమయంబు గావించి యత్యంతమో దంబుఁ జెందుచుండె. దానిం జూచి యాచార్యసుతుండు శత్రువిధ్వంసనంబున నీపక్షి యుపదేశంబుఁ గావించె. బలవంతులు కృతోత్సాహులు జయశీలురు నగుపాండవులం బరిమార్ప శక్యంబు గాదు. వారలమారొంకనుట చిచ్చులోన మిడుత పడుచందంబు గాకుండునే. న్యాయమున వారితోడఁ బోరినఁ బ్రాణత్యా గంబు దొడరుట నిస్సంశయంబు. కావునఁ గపటముననే వారల వధింపం బ్రయ త్నింపవలయు. క్షత్రధర్మప్రవృత్తుం డైనవాఁ డిది నింద్యం బని యూరకుండఁ జనదు. మఱి, తనకు జయము సిద్ధించుతెఱంగు పట్టి యెద్దియైనం జేయవలసి

యుండు. పాండవులును గపటకర్మముల నొనర్చికాదె గెల్పు గొనిరి. డస్సియున్న ప్పుడు విఱిగిపఱచినప్పుడు పగతు రెత్తిన నుక్కు దక్కినప్పు డెక్కడకేనియుం బోవునప్పుడు చచ్చునప్పుడు నడురేయి నిద్రించునప్పుడు నాయకుఁడు నశించినం బలము నానావిధంబై చిందఱవందఱ యగునప్పుడును విక్రమించి శాత్రువులం జంప నగునని క్షత్రధర్మవిదు లగుధర్మచింతకులు చెప్పిరి. కావున నీరేయి పాంచాలపాండవులు నిద్రించునెడ నాశిబిరంబుఁ జొచ్చి వారలం బొలియింతు నని క్రూరనిశ్చయముఁ జేసి కృపకృతవర్మలను మేల్కొల్పుటయు వారలు కార్యాథరంబుఁ దలంపక నిద్రించుటకు లజ్జితులై యూరకున్నంత నశ్వత్థామ ముహూర్తమాత్రంబు చింతించి బాష్పవిహ్వలుండై వారి కిట్లనియె. ఏకవీరుఁడు రాజరాజు మహాబలుఁ డేకాదశాక్షౌహిణీపతి పరిశుద్ధపరాక్రముఁడు నగుదుర్యోధను నధర్మసంగరమున భీమసేనుఁడు గూల్చె నంతియకాక మూర్ధాభిషిక్తుఁడైనయ తనిశిరం బాదురాత్ముఁ డెడమకాలఁ దన్నె. పాంచాలాదు లందఱకుఁ బరమానందమునం దేలుచు నార్చుచు నవ్వుచు నాడుచుఁ జిందము లొత్తుచు భేరీమృదంగాదినాదములఁ జేయించుచున్నవారు. అదె యిక్కడికిఁ దూర్పున వారిశిబిరమున నశ్వహేషితములు గజబృంహితములు శూరసింహనాదములు రథనేమిధ్వానములును వినంబడుచున్నవి. పాండవులును ధార్తరాష్ట్రులును సమరంబు సేయఁగ నాగశతబలులు సర్వాస్త్రకోవిదులు నగుశూరు లందఱును మనపక్షమునఁ దెగిరి. మనము ముగ్వురమే మిగిలియున్నవారము. దైవవిధానం బిట్టులుండెఁ గాఁబోలు. మనము పాండవులతోఁ బగ పాటించియున్నవారము. కావున వారలఁ దెగఁ జూచు నెరవు పర్యాలోచింపవలసియుండు. మీబుద్ధి మోహవశము గాకుండునేని యియ్యర్థమున నెయ్యది శ్రేయం బగు నద్దానిం జెప్పవలయు నని యడిగినం గృపాచార్యుఁ డశ్వత్థామ కిట్లనియె.

కృపుఁ డశ్వత్థామకు హితంబుఁ జెప్పుట

నీచెప్పినతెఱంగెల్ల వింటిని. నావాక్యంబు నించుక వినుము. మనుజులు దైవపౌరుషముల రెంట నిబంధనంబుఁ బొందియుండుదురు. ఈరెంటికంటె వే ఱొక్కటి గలుగదు. కేవలదైవమునను గేవలపౌరుషముననుం గార్యములు సిద్ధింపవు. కార్యప్రవృత్తినివృత్తులు రెండును నారెంటివలననే కలుగవలసియుండును. పర్జన్యుఁడు పర్వతములందు వర్షించినను సుక్షేత్రము లెస్సదున్నినను ఫలప్రాప్తి గనుపట్టదు. మఱి సుక్షేత్రంబు లెస్స దున్ని యలవరించి గుణవంతంబైనబీజము చల్లిన నందు వర్షించెనేని పురుషకారమును దైవయోగమును గలిసినకతన నది ఫలియించును. కావునం గార్యసిద్ధు లిట్లుండును. ప్రాజ్ఞులు దైవవిరహితంబై నకర్మంబు సిద్ధిం బొంద దని యెఱింగి యది పొసఁగకుండినం దానిదెసఁ బోవరు. కావునఁ బ్రాజ్ఞకృతములు ప్రాయికముగ విఫలతం బొరయవు. అధికశ్రమము

లేకయే యొక్కండు మహాఫలముఁ గాంచును. ఎంతయు శ్రమించియు మఱియొక్కండు ఫల మించుకేనియుం గాంచఁడు. అయ్యిరువురును దుర్గతు లనంబడుదురు. దక్షుఁడు లాలసుండై సుఖమునం జీవింప నోపును. దక్షు లీలోకంబునఁ బ్రాయికముగ హితార్థులై కనంబడుదురు. దక్షుఁ డారంభపరుం డయ్యేనేని కర్మఫలం బధిగమించుట దప్పిననుం దూఱు వడయఁడు. ఆరంభపరుఁడు గానియతఁడు దైవముననే ఫలసిద్ధిం బడసినను నింద్యుఁడై జనవిద్వేష్యుఁ డగును. కార్యారంభప్రకారం బిట్టు లుండఁగ దీని ననాదరించి ప్రవర్తించునతం డనర్థములం గుడుచు. ఇట్లు బుద్ధిమంతులు నీతిం దెల్పుదురు. పౌరుషదైవములు రెండునుం జాలకుండునెడ నారంభము విఫలమేయగు. దేవతలకు మ్రొక్కి కార్యములం దొడరుదక్షుండు విఫలతం బొందక యుత్తమపరిణామంబుఁ గాంచు. వృద్ధోపసేవనంబు తన్మతానువర్తనంబును గార్యసిద్ధికి మూలములు గావున బుద్ధిమంతుఁడు తత్ప్రకారమునఁ బ్రవర్తించి సాధ్యసాధనపరుం డగు. అట్లు కాక కామక్రోధభయలోభపరీతచిత్తుం డైనమానవుఁ డారంభపరుండయ్యు నసమర్థతం జేసి యవమానంబుఁ బ్రాపించి శీఘ్రంబ యైశ్వర్యభ్రష్టుం డగు. దుర్యోధనుండు లోభవశుండై మూఢత్వంబునం జేసి దీర్ఘాలోచనపరుండు గాక హితబుద్ధుల నిరాకరించి యసాధువులతోడం జింతించి యత్యంతగుణమతు లగుపాండవులతోడ వైరముఁ బెట్టుకొనియె. మున్ను నాదుశ్శీలుం డాత్మధైర్య మెఱుంగఁడు. ఇప్పుడు మిత్రులవచనముఁ జేయనైతి నని పరితపించుచున్నవాఁడు. అప్పాపాత్ము ననువర్తించిన కతన మనకును దారుణ మగునియ్యనయంబు సంప్రాప్తం బయ్యె. ఇవ్విషయమున సంతాపంబుఁ జెందియున్ననా కిప్పు డెయ్యది శ్రేయం బనియెఱుంగను దోఁపకుండెడి. మోహముఁ జెందినయతండు సుహృదుల నడుగవలయు. దాన బుద్ధివినయశ్రేయములం బడయ నగుం గావున నయ్యది కార్యములకు మూలం బనియెఱింగి వారల నడిగి నిశ్చయించుకొని తత్ప్రకారమునం బ్రవర్తించుట యుచితంబు. కావున మనము కరినగరంబున కరిగి ధృతరాష్ట్రుని గాంధారిని మహామతి యగువిదురుని నియ్యర్థం బడిగి వారు బోధించుతెఱంగునం జేయుదమది లెస్సయని నామతంబు. లెస్స యాలోచించి కార్యములం దొడంగిన సాఫల్యంబు గలుగదేనియు దైవంబుతోడ్పాటు లే దని యప్పుడు నిశ్చయింపవలసియుండు నని కృపాచార్యుండు ధర్మార్థసమన్వితముగఁ దెలిపిన విని యశ్వత్థామ ప్రదీప్తానలంబు తెఱంగున దుర్భరశోకంబు త న్నెరియింపఁగఁ గ్రూరచిత్తముతో నాకృపకృతవర్మలం జూచి యిట్లనియె.

### అశ్వత్థామ కృపకృతవర్మలతో సంభాషించుట.

ప్రతిపురుషుఁడును దనతనబుద్ధికి సంతోషించుచు దానినే ప్రశంసించుచుఁ దానే యత్యంతబుద్ధిమంతుండనితలంచుచు లాఁతులబుద్ధుల నిందించుచుండును.

మఱియుఁ గారణాంతరనిమిత్తమునఁ దనమతముతోఁ గలిసినవారిబుద్ధులం బహూ
కరించుచు నందుల కుల్లసిల్లుచుఁ గాలయోగమున విపర్యాసంబు గలిగెనేని దూ
ఱుచు భేదింతురు. మనుష్యులును మనుష్యబుద్ధులును నానావిధవిచిత్రగతులం
బ్రవర్తించుటంజేసి చిత్తవైకల్యకారణమున నప్పటప్పటికిఁ దగినవిధమునం
బుద్ధులు పుట్టుచుండును. కుశలుఁడైనవైద్యుఁడు రోగనిదానం బెఱింగి దాని
యుపశాంత్యర్థ మొక్కొకయౌషధముఁ బరిత్యజించి వేఱువేఱుమందుల నుప
యోగించురీతిఁ గార్యయోగార్థము కాలోచితముగ బుద్ధులు మార్చుచుండవల
యును. అప్పటప్పటి కొదవినబుద్ధులం గొని తక్కటివానిం దూషింతురు. మను
జులు యౌవనదశం గలుగుబుద్ధిని నిందించి వృద్ధత్వమున నొండుబుద్ధిం గ్రహించి
ఘోరవ్యసనమొండె నత్యంతసమృద్ధియొండెఁ గలిగెనేని మఱియొక్కబుద్ధివైకృ
తంబుఁ గాంతురు. అట్టివారికిఁ దమబుద్ధియే కృతకృత్యంబు గామింజేసి యొకప్పు
డింపు గాకుండెడి. ప్రజ్ఞానుగుణముగ బుద్ధి నిశ్చయించి ప్రవర్తించుట యుద్యో
గలక్షణంబు. అందఱును దమతమబుద్ధులే లెస్స యనియు హితమనియు నిశ్చ
యించి మారణాదికములగుకర్మములం బ్రవర్తింతురు. కావున నిప్పుడు మదీ
య శోకవినాశంబైనబుద్ధిని మీకుం జెప్పెద వినుఁడు. ప్రజాపతి ప్రజల సృజి
యించి యయ్యైవారి కనురూపముగఁ గర్మముల విధించునెడ బ్రాహ్మణులకు
స్వాధ్యాయంబును దమంబును క్షత్త్రియునకుఁ దేజంబును వైశ్యునకు దక్షత్వం
బును శూద్రునకుఁ ద్రివర్ణానుకూలత్వంబును ధర్మం బని విధించెఁ గావున
దాంతుఁడుగాని బ్రాహ్మణుఁడును దేజోహీనుఁడైనక్షత్త్రియుఁడును దక్షుఁడుగాని
వైశ్యుఁడును ద్రివర్ణప్రతికూలుఁడైనశూద్రుఁడు నధము లనంబడుదురు. ఏను
బ్రాహ్మణకులమున విశేషించి శ్రేష్ఠకులమునందు జనించియు మందభాగ్యతంజేసి
క్షత్త్రధర్మ మనుష్ఠించితి. ఇప్పుడు క్షాత్త్రంబు విడిచి బ్రాహ్మణధర్మ మవలంబింప
మనసు రాదు. మఱియు నుత్తమధనుస్సును దివ్యాస్త్రములును ధరించియున్న
వాఁడఁ గావున క్షాత్త్రంబు విడుపు నా కెంతయు నసమ్మతంబు. తండ్రి నొక్కఁ
డు వధించినం జూచుచుండి యేను సభలో నేమని పలుకుదు? కావునఁ గోర్కి
యీడేఱ క్షాత్త్రధర్మముఁ గొని తండ్రియొక్కయు మహీపతియొక్కయు
మార్గంబుఁ బొందుదు. నేఁడు పాంచాలురు జయముఁ గొంటి మనుహర్షమునం
జేసి కవచము లూడ్చి కైదువు లవలం బెట్టి యలసి యాదమఱచి నిద్రించియుం
డుదురు. అప్పుడు నేను వారిశిబిరంబు సొచ్చి యింద్రుఁడు దానవులంబోలె నిద్రి
తులై నిశ్చేష్టితులై ప్రేతభూతులై యున్నధృష్టద్యుమ్నాదులం దాఁకి ప్రదీప్తా
నలంబు శుష్కతృణపుంజములంబోలె రూపుమాపి శాంతిఁ బొందెద. రుద్రుఁడు
పశుగణములంబోలె సర్వపాండవులం జంపి చెండాడి సంతోషమున రణక్షోణీత
లంబు పీనుంగుపెంటగాఁ జేసి తండ్రిఋణంబుఁ దీర్చి భీష్మకర్ణదుర్యోధనసైంధ

వులరిగిన తెరువులఁ గ్రమ్మఱ వారల నడిపించెద. పశుమారణోదగ్రుం డైన యుగ్రునిమాడ్కి రౌద్రంబున మెఱసి యేను నేఁడు పాంచాలరాజతనుజుం డైనధృష్టద్యుమునిశిరంబుఁ దునిమెద. నిశితఖడ్గమున నీ రేయి సౌప్తికంబునఁ బాంచాలపుత్త్రులను బాండుపుత్త్రులనుం దెగటార్చి కృతార్థుండనై సుఖింతు ననిన నశ్వత్థామకుఁ గృపాచార్యుఁ డిట్లనియె.

కృపాశ్వత్థామసంవాదము.

వత్సా, భాగ్యవశమునం బ్రతీకారనిశ్చితబుద్ధి యగునిన్ను మఱల్ప నింద్రునకుం గాదు. ప్రభాత మైనం బగఱపై నెత్తి యరుగునీవెంట నేనును గృతవర్మయును గత్తళములు దొడిగి తేరు లెక్కి వత్తుము. ఈ రేయి విల్లమ్ములవలఁ బెట్టి కవచ మూడ్చి విశ్రమింపుము. ఈ రేయి విశ్రమించితేని యెల్లి శాత్రవులం దెగటార్ప నోపుదువు. పెద్దయుంబ్రొద్దు మేల్కానియుంటి వింక నిద్రింపుము. విశ్రమించి స్వస్థచిత్తుండవై యుత్తమాస్త్రములం గొని కృపకృతవర్మసహాయమునం బేర్చి పోరికి నడుచునిన్ను దేవేంద్రుఁడునుం జక్క నిల్చి మార్కొన నోపఁ డింక గెలువ నోపఁ డని చెప్పవలయునే? మేము నిప్పు డెంతయు డప్పిఁ గూరియుండెదము. తెల్లవాఱినపదంపడి విశ్రాంతులమై యేపు సూపుదము. నీవును నేనును దివ్యాస్త్రముల నెఱుంగుదుము కృతవర్మయన్ననో యత్యంతసమరచతురుండు. మనము మువ్వరమును సాహసోత్సాహములు పొంపిరివోవం బాండవస్కంధావారమునకుఁ బ్రభాతమున నరిగి పేరు సెప్పి పోరాడి గెలుపు గాంచి సమంచితప్రీతిం బొందుదము. ఏనును గృతవర్మయును దోడ్పడఁ బ్రచండవిక్రమాటోపంబు దీపింపఁ జేయునిన్ను దానవాంతకుండైన మార్కొన నోపఁడు. పెక్కేల? రేపు మనము పాండవులం దాఁకి వారలఁ బరిమార్పక కాని మఱలుట లేదు. మఱియుఁ బాండవుల వధియించుటయొండె వారిచేఁ బొలియుటయొండెఁ గాఁగలయది యింతయు నిక్కువం బని హితము పలుకుచున్న శారద్వతునకు గురుసుతుండు క్రోధతామ్రేక్షణుండై యిట్లనియె. ఆతురునకుఁ గ్రోధవశునకుఁ గార్యచింతకునకుఁ గాముకునకును నిద్ర యెట్లు వచ్చును? ఇం దొక్కటేనియు నిద్రం జెఱుచు నన్ను నీనాలుగును దొడరిననాకు నిద్ర పట్టు టెట్లు? పరమపూజనీయుం డైననాతండ్రి యప్పాపాత్ములచేత నిహతుఁడగుట మీ కందఱకును బ్రత్యక్షంబకదా. అది తలంపునకు వచ్చెనేని రేలుంబవల్లు చిత్తమును దహించుచున్నది. ఇంతకంటె దుఃఖ మొండు వలయునే? ద్రోణుం జంపితి మని ప్రహర్షోత్కర్షమునం బాంచాలురు పలుకుపలుకు లాకర్ణించుచు నాయట్టివాఁడు ముహూర్తమాత్రమేనియు నెమ్మది జీవింపవచ్చునే? ధృష్టద్యుమ్నుం జంపక కాని యేను బ్రదుకఁజాలను. అస్మత్పితృవధనిమిత్తమునం జేసి యప్పాపాత్మునిఁ దదీయులనుం జంపనవలయును. మఱియుఁ దొడలు

విఱిగి పడియున్న రారాజువిలాపంబు విన్న నెంతటిక్రూరునిచిత్తమేనియు నీఱుగా
కుండునే? ఎవ్వనికేనియుఁ గన్నీరు జాలువాఱకుండునే? ఏను బ్రదికియుండఁగ
నాసుహృదులకుఁ జేటు వాటిల్లె నన్నవగ నామనంబునం బెచ్చుపెరుగుచుండెడి.
ఎల్లప్పుడు నయ్యెడరు దవిలి వగచునాకు నిద్రయెట్టులు పట్టును? సుఖ మెట్లు
గలుగును? వాసుదేవార్జునులప్రోపు గాంచినవారలఁ బొడువను సమ్యక్సముత్థితం
బై ననాకోపము నార్పను మహేంద్రునకేనియు శక్యంబు గాదు. వార్తాహరులు
సెప్పఁగ నస్మన్మిత్రపరాజయంబును శత్రువిజయంబును విని నామనం బెంతయు
నెరియుచుండెడి. కావున సౌప్తికమున వారలఁ దెగఁ జూచి యటమీఁద విశ్రాం
తిని సౌఖ్యమునుం బొందుదు నని చెప్పినయాచార్యసుతునకు గౌతముండు వెండి
యు నిట్లనియె. హితశ్రవణకుతూహలుండయ్యు మేధలేనిపురుషుఁడు నియ
తేంద్రియుఁడుగామిం జేసి ధర్మార్థముల నెఱుఁగఁ జాలనివిధమున మేధావియుఁ బె
ద్దలవలన వినయము గ్రహింపఁడేని ధర్మార్థనిశ్చయము కొంచెమేనియు నెఱుంగఁ
డు. జడమతి పెద్దకాలము పండితుల నుపాసించియు దర్వి సూపరసములంబోలె
వారియొద్ద నుండుధర్మముల గ్రహింపఁడు. ప్రాజ్ఞుఁడు ముహూర్తమాత్రమేని
పండితుల నుపాసించి జిహ్వ సూపరసములంబోలె ధర్మముల శీఘ్రమే యెఱుం
గును. కావున శుశ్రూషుఁడు మేధావియు నగుపురుషుఁడు నియతేంద్రియుండై
సర్వాగమములం దెలిసి గ్రాహ్యముఁ జెఱిచికొనఁడు. నీతివిదుఁడు గానిదురా
త్ముఁ డవమానియై యోగ్య మగుభాగ్యము విడిచి పాపకర్మముల నొనరించును.
సుహృదులు నాథవంతుని పాతకములం బ్రతిషేధింతురు. అది విని లక్ష్మీవం
తుఁడుకుత్సితకార్యములఁ దొలంగును. లక్ష్మీరహితుఁడు తొలంగక కుత్సితము
లనే యొనర్చును. విక్షిప్తచిత్తుఁడయ్యు యోగ్యజనుఁడు సుహృదులు తనకు
నానావిధవాక్యముల బోధించినం బాపములఁ బ్రవర్తిల్లక మఱల్ప శక్యుఁ డగు.
అట్టివాఁడు సెడఁడు. అట్టిప్రాజ్ఞుఁడు ప్రమాదమునఁ బాపము లొనర్చుచుండినం
బ్రాజ్ఞు లగుసుహృదులు నేర్చినకొలఁది పలుమాఱు ప్రతిషేధింతురు. కావున
నీవును నాత్మనియమనమునం గల్యాణకర్మములం దాసక్తుఁడవై నావచనంబు
పట్టుము. పశ్చాత్తాపమునం బడక తప్పుదువు. నిద్రితులను నిరాయుధులను
విరథులను శరణాగతులను భీతులను వధించుట ధర్మంబు గాదు. పాంచాలు
రిప్పుడు కత్తళంబు లూడ్చి నెమ్మదిం బరుండి నిద్రించుచు నిశ్చేతనులై యుండు
దురు. అట్టివారికిఁ గీడు రోయుకుటిలమానవుఁ డగాధ మప్లవము నగునరక
మున మునుఁగుట నిక్కువంబు. నీవు సర్వాస్త్రవిదులలో శ్రేష్ఠుఁ డని ప్రసి
ద్ధిఁ బొందితివి. ఇంతకు మున్నెట్టిపాపమునుం జేయక ధర్మపథమునం బ్రవ
ర్తించితివి. కావున నిపుడు విశ్రమించి సూర్యప్రకాశుండవై ననీవు సూర్యో
దయానంతరమునఁ బగవారల గెల్తువు. ఇట్టినీ విప్పుడీపాపకర్మమునకుఁ దొడ

రుదేని శుభ్రవస్త్రమున మసి పూసిన ట్లగు నని నామతం బనిన విని యశ్వ
త్థామ మాతులున కిట్లనియె. మామా, నీచెప్పిన దెల్లయు నిక్కవంబ. నామా
టయు నించుక వినుము. ఎల్లరాజులును మీ రందఱును జూచుచుండఁగనే పాండ
వేయులు ధర్మసేతువును నూఱుతెఱంగులఁ జెడఁ గొట్టి రెట్లంటేని. అస్త్రస
న్న్యాసం బొనర్చి ప్రాయోపవిష్టుం డైనమాతండ్రిని ధృష్టద్యుమ్నుఁడు వధించె.
కర్ణుఁడు క్రుంగినరథచక్రము నెత్తుచుండ గాండీవి యాతనిం దెగటార్చె. న్యస్త
శస్త్రుఁ డైనశాంతనవుని నర్జునుండు శిఖండిని బురస్కరించికొని కూల్చె. భూరి
శ్రవుఁడు ప్రాయోపవిష్టుఁడై యుండఁగ రాజు లందఱు వలదు వలదని వారించు
చున్నను వినక సాత్యకి యాతనితలఁ దునిమె. నిస్సహాయుఁడు వికలుఁడు నగుదు
ర్యోధనుని డాఁకి భీముఁ డధర్మమునఁ దొడలు విఱుగ నడిచె. భగ్నోరుఁ డైన
యారాజరాజు విలాపమును వార్తాహరులు సెప్పినయందలియనయప్రకారమును
నామర్మముల వ్రచ్చుచున్నవి ఇట్టు లన్నివిధముల నధర్మములు చేసినవారల
నేల నీవు నిందింపవు. తండ్రిని జంపినపాంచాలుర నీరేయి సౌప్తికమునం బరి
మార్చి పురుగుగానైనను బక్షిగానైనను బుట్టుదునుగాని యిప్పు డొక్కింతసేపే
నియు నింక నూరకుండ నోపను. ఇట్టినాకు నిద్రయు సౌఖ్యమును నెట్లు గలు
గును? వారలం బరిమార్పఁ గృతనిశ్చయుం డైననన్ను మఱలుప నీలోకమునం
గలుగఁ డనిపలికి రయమునఁ దనతేరు పూన్పించి యాచార్యసూనుండు ప్రాఙ్ము
ఖుండై నడుచుటయుఁ గృపకృతవర్మ లతనిం బిలిచి యేల తేరు పూన్పించితి
వేమి చేయఁగఁ దలంచితి వొక్కటియై కూడియున్నమమ్ము విడిచి నీ వొక్కరుఁడవే
చనం బోలునే? మేమును సుఖమేనియు దుఃఖమేనియు నీతోడిద యనియున్నవా
రము శంకింపవల దనుటయు నశ్వత్థామ పితృవధస్మరణసంధుక్షితక్రోధఘూర్ణ
మానమానసుండై శతసహస్రయోధులం జెండాడి యస్త్రసన్న్యాసం బొనర్చి
శాంతిం బూనియున్ననాతండ్రితలఁ దఱిగినదుష్టాత్ముఁ డగుధృష్టద్యుమ్నుని నిరా
యుధుండైనవానిఁ బశుమారణప్రకారమున బీభత్సరీతిం జంపుదును. పుణ్య
లోకానర్హుఁ డైనయప్పాపాత్ముఁడు శస్త్రవధ్యుఁడు గాఁడని నామతంబు. మీరు
ను గత్తళములఁ దొడిగియు విండ్లు నమ్ములనుం గొనియుఁ గృపాణాదినానాప్రహ
రణములం గ్రహించియు రథారూఢులరై రండని చెప్పి పాండవశిబిరమునకుఁ
దనతేరు వోనిచ్చుటయుఁ గృపాచార్యుఁడును గృతవర్మయుఁ దోడన చనుదెం
చిన నమ్మువ్వురు రథికు లధ్వరముల వ్రేల్వంబడుత్రేతాగ్ను లట్లు తేజరిల్లుచు నిద్రి
తసకలజనంబై నిశ్శబ్దంబై యున్నపాండవశిబిరమునకుఁ జనిరి. ద్రోణతనయుం
డు ద్వారదేశమున నిలిచె ననిన ధృతరాష్ట్రుండు సంజయా, యట్లు ద్వారదేశస్థి
తుం డైనగురుసుతుం జూచి భోజశారద్వతు లేమని రనియడుగుటయు సంజ
యుం డతని కిట్లనియె.

శివుఁడశ్వత్థామకుభూతరూపమునఁ గానబడుట.

అట్లు కృపకృతవర్మల నామంత్రణంబు చేసి యశ్వత్థామ పాండవశిబిర ద్వారంబుఁ జేరం జని యచ్చట మహాకాయము సూర్యచంద్రప్రకాశము వ్యాఘ్రచర్మపరిధానము కృష్ణాజినోత్తరీయము నాగయజ్ఞోపవీతధరము నానాప్రహరణోద్యతపీనాయతబాహువిలసితము కేయూరీకృతభుజంగము జ్వాలామాలాకులము దంష్ట్రాకరాళవ్యాదితాననము నయనసహస్రసముల్లసిత మత్యంతభయంకరము నగునొక్కమహాభూతముం గాంచె. ఏమి చెప్పుదు నాభూతంబురూపవేషములు పేర్కొనననైన శక్యంబులు గావు. ఆభూతమును గాంచినఁ బర్వతములేనియుఁ బగులును. అమ్మహాభూతంబు నేత్రశ్రోత్రనాసావివరంబుల ననేకతేజస్సులు వెడలె. అందు శంఖచక్రగదాధరులైన హృషీకేశులు శతసహస్రసంఖ్యాకు లుద్భవిల్లిరి. అట్లు లోకభయంకరం బైనయమ్మహాభూతముం జూచి యాచార్యసూనుండు తా నించుకేనియు వెఱవక నానాశరము లేయుటయు నయ్యది బడబానలంబు జలపూరముల నెట్లట్ల మ్రింగినం దనయమ్ములు వమ్మగుటకుఁ జింతించి యావీరుఁడు రథశక్తి నేయుడు దీప్తానలశిఖాకారం బైనయప్పరమసాధనంబు యుగాంతసూర్యుం దాఁకినకొఱవియట్లు లడంగె. అట్లది నిరర్థకం బైనం గురుతనూజుండు వాలు పెఱికి వేసినం బిలనిర్గతం బైనమహోరగంబుకరణిం దనరు నాకరవాలం బమ్మహాభూతంబుఁ జొచ్చి బిలప్రవిష్ట మగునకులముచాడ్పున నడంగినం గినిసి యశ్వత్థామ యింద్రధ్వజోపమం బైనజ్వలద్గద వేయుటయు నాభూతంబు దానిని మ్రింగె. ఇట్టులు కైదువు లన్నియు నిరర్థకము లగుటయుఁ దనయొద్ద నొక్కయాయుధమేనియు లేమియు జనార్దనాకారసహస్రసంతతం బై నిరవకాశం బై యున్నయాకాశంబుఁ జూచి యగ్గురుసుతుం డగ్గలం బైనయయ్యద్భుతకృత్యంబునకుఁ బరమసంతప్తచిత్తుం డై కృపవచనంబుఁ దలపోసి యక్కటా! మనకప్రియంబు గానిహితముఁ దెలుపుసుహృదులమాట పట్టనినాయట్టియతం డాపదం బ్రాపించి వగచును. శాస్త్రిదృష్టము లగుధర్మముల నతిక్రమించి హింసాపరుం డై నరుఁడు ధర్మపథప్రచ్యుతుం డై కుపథంబునం బడి ప్రతిహతిం బొరయును. గోబ్రాహ్మణనృపస్త్రీసఖిమాతృగురుహీనప్రాణజడాంధసుప్తభీతోత్థితమత్తోన్మత్తప్రమత్తులయెడ శస్త్రముఁ బ్రయోగింపరా దని గురువు లుపదేశించినశాస్త్రిదృష్టం బైనసనాతనధర్మము నతిక్రమించి యమార్గమునం బ్రవృత్తుండ నై యిట్టు లతిఘోరం బైనయాపదం బొందితిని. మహాకృత్యంబుఁ జేయఁ బూని భయముననొండె నసామర్థ్యముననొండె నివర్తించికొనిన నయ్యది యంతకంటె ఘోర మగునాపద యని పెద్దలు పలుకుదురు. దైవము కంటెఁ బౌరుష మెక్కు డగునె? పురుషప్రయత్నంబుఁ జేసియుఁ గార్యము సిద్ధింపదేని దైవోపహతి కలిగెనని తలంపవలయు. మఱియు నయ్యది ధర్మప్రచ్యు

తం బనియు నెఱుంగవలసియుండును. మదీయదుర్విధానంబునం జేసి యిట్టులు భయం బావహిల్లె. ద్రోణసుతుం డెంతయాపద వచ్చినను సమర ముడుగవచ్చునే? ఇది యెయ్యదియో మహాభూతంబు దైవదండముఁబోలెఁ బొడకట్టెడి. ఎంత చింతించినను దీనివిధం బిట్టి దని యెఱుంగనైతి. కలుష మగునామనం బధర్మమునఁ బ్రవర్తించినదాని కిది ఫలంబై ఘోరవిఘాతం బేర్పడియె నింతయు నిక్కువంబు. సమరంబుఁ జాలించుట నా కిపుడు దైవవిహితంబు కాఁబోలు. అందుల కెట్లు లోఁడంబడుదు? ఐనం గానిమ్ము. దేవదేవుం డైనమహాదేవుని శరణంబు వేఁడెద. తపోవిక్రమముల నిఖిలదేవవర్యుఁ డైనయాభక్తవత్సలుండు మదీయదైవదండము శమియింప నోపు నని తనమనంబున నిశ్చయించె.

## అశ్వత్థామ తనదేహమును శివున కుపహారముగ నర్పించుట.

అవ్విధమునఁ గృతనిశ్చయుండై ద్రోణతనయుండు రథంబు డిగ్గి యేకాగ్రచిత్తుండై యుగ్రుఁడు శివుఁడు స్థాణుఁడు రుద్రుఁడు శర్వుఁ డీశానుఁ డీశ్వరుఁడు నగుమహాదేవు నాత్మోపహారంబున నేను యజియింతు నీయాపద దొలంగ నప్పరమేశ్వరుఁ డనుగ్రహించుఁగాక యావృషభవాహనుండె నాకు శరణం బని ధ్యానించుచున్నంత నతనివ్యవసాయం బెఱింగి యీశ్వరుండు నియోగించుటం జేసి యతనిముందఱఁ గాంచనవేది ప్రాదుర్భూతం బై యందుఁ బ్రదీప్తానలంబు చూపట్టుటయు నాక్షణంబ యనేకనేత్రపాదశిరోభుజులు శ్వవరాహోష్ట్రాదినానావికృతరూపులు హయగోమాయుఋక్షవరాహ మార్జాలవ్యాఘ్రకాకశుకహంసచాషకూర్మనక్రాదినానాముఖులు శంఖవర్ణులు శంఖవక్త్రులు శంఖకర్ణులు శంఖమాలాపరికరులు శంఖధ్వనిసమస్వనులు జటాధరులు పంచశిఖులు ముండు లర్ధముండులు కిరీటు లుష్ణీషులు పద్మోత్పలాపీడధరులు శతఘ్నీముసలదండాదినానాప్రహరణపాణులు నానాభరణులు నానావస్త్రులు నానాగంధు లతిహ్రస్వు లతిదీర్ఘు లతిభైరవులు నానావికృతరూపులు శ్రుతబ్రహ్మచర్యతపోదమాదులం దనరి మనోవాక్కాయకర్మముల మహేశ్వరు నారాధించి తత్ప్రసాదమున గ్రహనక్షత్రాదిసమన్విత మగునంతరిక్షంబును జతుర్విధభూతజాలనిబిడం బైనభూతలంబును వధింప నోపినవారు రక్తమాంసాస్వాదనలోలుపులు నగురుద్రపారిషదులు ద్రౌణికి మహిమసంధుక్షణంబుఁ గావింపను నతనితేజము నెఱుంగను సౌప్తికంబుఁ జూడను నచ్చటికి వచ్చి యాడుచును బాడుచును వివిధవాదిత్రముల వాయించుచును నెగయుచును దుముకుచును నుఱుకుచును నార్చుచును బొబ్బ లిడుచును బొడచూపిరి. దర్శనమాత్రముననే యెల్లవారిని వెఱపింపఁ జాలిన యట్టిఘోరాకారుల నందఱం జూచియు నాచార్యనందనుండు డెందమున నించుకేనియుఁ గొందలం బందకవిండ్లు సమిత్తులుగను శితశరములు పవిత్రములుగను

సమర్చి యాత్మశరీర మనుహవిస్సు నుపహారముగ సమర్పించువాఁడై సంతుష్ట చిత్తమునం గృతాంజలియై విశ్వేశ్వరా, యాంగిరసకులజనితం బైనయీమేను నీకు బలిగా నియ్యగ్నిలో వ్రేల్చెద. సర్వభూతములును నీయం దుండును. నీవు సర్వభూతములయందు నుండుదువు. పరమసమాధితో నత్యంత భక్తి మెయి నీయాపత్సమయమున నింతకుఁ దొడరితిని. శత్రువులను నేను జంపవలయు నేని యీబలిం బరిగ్రహింపు మని ప్రస్తుతించుచు దీప్తానలం బైనయవ్వేది యధిరోహించి యగ్నిమధ్యమున నూర్ధ్వబాహుండై కూర్చుండె.

## అశ్వత్థామకు శివుఁడు ప్రసన్నుఁడై ఖడ్గమిచ్చుట.

అట్లగ్నిప్రవిష్టుం డైనయశ్వత్థామకట్టెదుటం బొడసూపి మహేశ్వరుం డు వత్సా, సత్యశౌచార్జవత్యాగములను దపోనియమములను శాంతిమతిధృతిబు ద్ధులను వచనమునను నన్ను లెస్స యారాధించితివి. కృష్ణుఁడు మిక్కిలి న న్నారాధించినకతన నా కతనికంటె నత్యంతప్రియుఁ డొం డొకండు లేఁడు. అత నికిఁ బ్రియ మొనరించువాఁడనై పాంచాలురం గాచుచు నీకు ఘోరరూపము నం జూపట్టితి. నీకును సమ్మానంబుఁ జేయుదు నింతకుఁ బాంచాలపాలనంబు నం జేసి వాసుదేవుండు సమ్మానితుం డయ్యె. అప్పాంచాలురకుఁ గాలము దీఱెఁ గావున నింక నీకోర్కి నెఱవేర్చికొను మనిచెప్పి యుత్తమఖడ్గము నొసంగి వేగ మున నిజతేజమతనిమేనం బ్రవేశితంబు చేయుటయు నాతండు శిబిరములోనికిఁ జొచ్చినం జూచి భూతగణములు పాండవశిబిరము నలుగడల నాక్రమించె ననిన విని ధృతరాష్ట్రుఁడు సంజయా, ద్రోణతనయుం డట్లు శిబిరప్రవిష్టుఁ డైనం గృ పభోజు లిద్దఱును భయమువనెండె నచ్చటికావలివారు వారించిననొండె మఱల రుగదా. శిబిరం బాక్రమించి పాంచాలపాండవులఁ బరిమార్చిరకాని వారిచేఁ దెగరుకదా. తత్కృత్యం బెట్టు లనవుడు నాంబికేయునకు సంజయుం డిట్లని యె. అశ్వత్థామ యట్లు శిబిరద్వారంబుఁ జొచ్చువాఁడు యత్నవంతు లైన య మ్మహారథుల నిద్దఱంజూచి ప్రహృష్టుండై మెల్లన నిట్లనియె. మీరు సక లక్షత్రియులనుం జంపఁ జాలుదురు. ఇపు డీనిద్రించుచున్నకొందఱం బొరివు చ్చఁగల రనిచెప్ప వలయునే? ఏను శిబిరంబుఁ జొచ్చి కాలునిపోలికం జరించి యందఱను బొరివుత్తు నందుఁ దప్పించికొని యెవ్వరేనియుఁ బఱతురేని మీ రిరువురు నీద్వారదేశమునన యుండి పొదివి యొక్కఁడేనియుఁ దప్పకుండఁ జం పాడవలయు నిది మదీయనిశ్చయం బని తెల్పి యందులకు వారల నియ్యకొల్పి యశ్వత్థామ నిర్భయుండై యద్వారమున శిబిరముఁ జొచ్చి యంతకుమున్న గతాగతజనులవలనఁ బాండవస్కంధావారంబు తెఱంగెల్ల సవిస్తరంబుగ నెఱింగి యున్నవాఁడు గావున మెల్లన ధృష్టద్యుమ్ను నివాసంబునకుఁ జనియె.

### అశ్వత్థామ ధృష్టద్యుమ్నుం జంపుట.

సంగ్రామమున నీడంబోక పెనంగి యెంతయు డయ్యుటంజేసి పరిజనులు గాఢనిద్రావశులై యున్నధృష్టద్యుమ్ననివేశనం బట్లు చొచ్చి యుత్తమాస్తరణసంవృతము క్షౌమావదాతము సురభికుసుమమాలికాసమంచితము పరిమళమిళితధూపచూర్ణవాసితము నగుపాన్పునందు నిర్భయముగ నూఱటఁ జెంది శయనించి యున్నయప్పాంచాల రాజనందనుం బాదప్రహారమున నయ్యాచార్యసుతుండు మేలుకొల్పుటయు నారణదుర్మదుండు ప్రబుద్ధుండై యెదుర నున్న యశ్వత్థామను గాంచి లేచుచున్నంత నవ్విప్రుండు కేశములం బట్టి బలమున నీడ్చి క్రిందఁ ద్రోచి పెలుచం గ్రుద్దిన నాతండు నిద్రాభరంబునను సాధ్వసంబునను జెయ్వులు దక్కి యూరకుండ గురునందనుం డతనికంఠమునను నురమ్మునను దనకాళులు వెట్టి బిట్టుపట్టి గోళ్లగీఱియుఁ గ్రుద్దియుఁ బశుమారణప్రకారమునఁ జిత్రవధముఁ జేయుచుండె. ధృష్టద్యుమ్నుఁ డాబీభత్సకృత్యమునంజేసి మాట వెడలింపనేరక కొండొకవడి పలుకకుండి యెట్టకేలకు వికృతస్వరంబుతో డగ్గుత్తిక వెట్టి యాచార్యపుత్త్రా, శస్త్రిమునం జంపుము తడవు సేయకుము నీవలనం బుణ్యలోకములకుఁ బోవుదు ననిన విని గురుసుతుండు కులపాంసనా, యాచార్యఘాతకులకుఁ బుణ్యలోకములు గలుగవు కావున నీవు శస్త్రివధ్యుండవుగా వని చెప్పి మత్తకుంజరంబుపై నురువడించుకొొదమసింగము తెఱంగునం బేర్చి క్రోధసంభరితుండై మర్మస్థానముల నతనిం గాళ్లఁ దన్ని వధియించె. ఆధ్వనికి లేచి యంతగపుర స్త్రీలును గావలివారు నతిమానుషవిక్రముం డైనయశ్వత్థామను జూచి యిది యెయ్యదియో కాని పెనుభూతం బని నిశ్చయించి నివ్వెఱపెల్లునంజేసి మాట వెడలింపనేరక యూరక చూచుచుండ నగ్గురుసుతుం డగ్గలించి రథంబెక్కి యెుండొక్కయెడకుఁ జనుటయు వారు తమరాజు సచ్చుటం జూచి యార్తులై యాక్రందనంబుఁ జేసిన నయ్యేడ్పువిని సమీపమున నున్నరాజులు మేల్కని సన్నద్ధులై యిది యేమని యడుగుటయు రాజాంగన లాభారద్వాజతనూజుం జూచి వెఱపు గొన్నవారు గావున దీనస్వరమున వీఁడు రాక్షసుఁడో మనుష్యుఁడో యెఱుంగము పాంచాలనాథుం డైనధృష్టద్యుమ్నుం బరిమార్చి తేరెక్కుచున్నవాఁడు శీఘ్రంబ యీదుర్మార్గుం బొదివి పోరుఁ డెయిదుఁ డనినం దక్షణంబ వా రాతనిం దలపడుటయు నావీరుండు రౌద్రాస్త్రిమున వారల నందఱను క్షణమాత్రలోన రూపుమాపె.

అవ్విధమున ధృష్టద్యుమ్నుని నప్పుడు తన్ను మార్కొన్నవారలనుం బరిమార్చి యాగురుసుతుండు త్తమౌజసునింటికిఁ జని శయనమున సుఖసుప్తుండై యున్నయప్పాంచాలకుమారు నురమ్మునను గళమ్మునను గాలు వెట్టి బిట్టదిమి ధృష్టద్యుమ్నుం జంపినవిధంబున నతం డఱచుచుండఁ గఁ జంపె. అయ్యులి నాక

ర్జించి లేచి యుధామన్యుం డుత్తమౌజుని రాక్షసనిహతుంగా వగచి గదాపాణి యై యడరి ద్రోణియురమ్మునం బిట్టేసిన నాతండు లంఘించి యప్పాంచాలవరుం బట్టికొని నేలం ద్రోచి పశుమారణప్రకారంబున నాయుధవ్యాపార మించుకేని యు లేక వధియించి యటఁ జని యచ్చటచ్చట నిద్రించుచున్న మహారథులం జూచి యధ్వరశామిత్రమునఁ బశువులంబోలె నీశ్వరదత్తదారుణకృపాణమునఁ జెండాడి నానామార్గములం దిరుగుచు మధ్యమగుల్మంబుఁ దఱిసి యచ్చటఁ గై దువు లవలఁ బెట్టి కూర్కుచున్నగుల్మరక్షకుల సందఱను క్షణమాత్రలోన ఖండిం చి వెండియుం బలువురుయోధులను ఘోటకములను దంతావళములను నాకృ పాణమున శకలచేసి రక్తసంసిక్తసర్వాంగుఁడై కాలునిరీతిఁ బరమరౌద్రమున మె ఱయుచుఁ గరవాలము నెఱయు బాహుదండమును రక్తమయంబులై తనరఁ బరమభీషణం బైనయమానుషరూపంబుఁ దాల్చియున్నయయ్యశ్వత్థామను జూ చియు నాతండు గజఘోటకాదులఁ జెండాడునెడం బుట్టినదారుణరవంబు విని విహ్వలించియు నొండురులం జూచుచు నీతండు రాక్షసుండ యనుతలంపు గూరఁ గన్నుల మూసికొని యతనిబారిం బడుచుండిరి.

## అశ్వత్థామ ద్రౌపదేయుల నేవురం జంపుట.

అట్లు యుగవిగమసమయకాలునిరీతి ఘోరాకారుండై యాచార్యనంద నుండు హతశేషు లైనసోమకులం బొదివి పొలియించుచుండ నాఘోరనాదమున కులేచి ద్రౌపదీతనయులు శిఖండి మున్నుగాఁ గలచేయంగలదొరలు కొందఱును ధృష్టద్యుమ్నాదివధంబు విని క్రోధదీపితులై యయ్యాచార్యతనయుం దాఁకి శరజాలంబు నిగిడించిన నాతండు సింహనాదంబుఁ జేసి పితృవధస్మరణసంప్రదీపిత క్రోధసంభరితుండై సహస్రచంద్రభాసురం బైనవాలును బలకయుం గొనితేరు డిగ్గి రయమునం బొదివి ప్రతివింధ్యుకుక్షిదేశమును ఖడ్గమున నఱికిన నాధర్మతన యతనయుండు నేలం బడియె. అంతల కల్గి సుతసోముఁడు ప్రాసమున నశ్వత్థా మను బొడిచి కృపాణపాణియై యడరిన నాతం డాతనిచేయి దునిమి తోడన పార్శ్వమునం గరవాల మేయుటయు భిన్నహృదయుండై యక్కుమారుండు గూలె. అట్లు భీమసేనసూనుఁడు హతుఁడైనం గనలి శతానీకుఁడు రథచక్ర మెత్తి గురుసుతుఱొమ్మునం బడ నేసిన నాతండు దానిం బిట్టడిచి నేలం ద్రోచి తలఁ దఱిగె. నకులనందనుం డక్కరణిఁ దెగినం గొందలం బందుచు శ్రుతకర్ముఁ డు పరిఘ మెత్తి ఖేటకసమన్వితం బైనద్రోణివామబాహుదండముపై నేసిన నాతండు శాతాసిచే నాననంబు చెక్కి నేలం గూల్చె. అత్తెఱంగున సహదేవ సుతుండు వికృతాననుండై పడినం జూచి శ్రుతకీర్తి యాభాసురుపై శరనిక రంబుఁ గురియుటయు నాతం డయ్యమ్ములఁ బలుకం జడిసికుండలోల్లసితం బైన యయ్యర్జునతనుజుమస్తకంబు ఖండించె. దాని కెంతయుఁ గోపించి యఖండ

విక్రమంబున శిఖండి యతనిం బొదివి శరజాలం బడరించి భ్రూమధ్యమున నొక్కశిలీముఖము నాటినం గ్రోధసముద్రేకబంధురుండై యగ్గురుసుతుండు శిఖండి రెండుఖండములై పడఁ గృపాణంబున నఱికి సకలప్రభద్రకులను మాత్స్యనీకంబును ద్రుపదపుత్త్రులను బౌత్త్రులను మిత్త్రులను నేర్పడం జూచి జూచి పొలియించుచుండె.

అప్పుడు హతశేషులు తా మంతకుమున్న యుద్ధారంభము మొదలు ప్రతిదినంబును రేయి నిద్రించునెడ రక్తనేత్రవక్త్రయు రక్తమాల్యానులేపనయు రక్తాంబరధరయు నీలవర్ణయు నగునొక్కవనిత కాలరాత్రిపోలె ఘోరాకారమున నొప్పునది నిరాయుధులు నిద్రితులు నగుతమయోధులను గజతురంగాదులను ఘోరపాశములం గట్టి చంపుచు నశ్వత్థామముందఱికిఁ గొనిపోవునట్లును నతండు వారలఁ బిమ్మటఁ బొదివి చంపునట్లును కలలు గాంచుచుండిరి కావున నప్పుడది తలంచుకొని యాస్వప్నంబుఫలం బిది యనినిశ్చయించి దైవోపహతులై యుడివోనిబీరంబునంజేసి మార్కొనుటయు నాయుద్ధదుర్మదుండు కొందఱికాళులం దునిమియుఁ గొందఱిపిక్కలఁ జెక్కియుఁ గొందఱిడొక్కల వ్రచ్చియుఁ గొందఱితలలు దఱిగియు రౌద్రమున మెఱసి యిది యేమి యీతం డెవ్వఁ డిది యేమియులి విదియేమిపని యేల యిట్టు లయ్యెడి నని యాక్రోశించువారును శస్త్రసన్నాహులుగాకయే నిద్రాపరవశత్వమున నడరువారును వెఱపు పెల్లునఁ గర్తవ్యం బెఱుంగక బమ్మరించుచు నొక్కయడుగేనియు ముందఱఁ బెట్టనేరక తొడలు పట్టికొని వెల్లబోవువారును మూర్ఛవోయినవారును దవుదవ్వులం జూచి మీఁది కెగయ నుంకించువారును నాలుక తడఁబడఁ బెదవులెండఁగ నెట్టకేలకు సన్ననియెలుంగున డగ్గుత్తిక వెట్టి యాక్రోశించువారును నసంబద్ధముగ నేమేనియుఁ బలుకువారును వెంద్రుకలముడి వీడఁ బఱచువారును మోహము పెలుచఁ గ్రమ్ముటంజేసి తమలో నొండొరులగుఱుతు లెఱుంగక భ్రమయువారును నైనయోధులను గట్లు ద్రెంచికొనియు మూత్రపురీషముల విడిచియుఁ బెల్లఱచుచు నిటునటు జిల్లునం దిరుగుతురంగమాతంగంబులనుం బొదివి యగ్గురుతనయుండు కరుణ దూలి యద్భుతంబుగఁ దునుముచు భూతప్రేతపిశాచగణములకుఁ దృప్తిగావించుచుండె. అట్టిఘోరప్రకారమునకు వెఱచి యోధులును గుఱ్ఱములు నేనుంగులును బఱచునెడఁ దదీయచరణవిఘట్టితంబై ధరణీరేణుజాలం బెగసి గగనంబాక్రమించినం జీకటు లినుమడించి యలమినకతనఁ గొడుకుల నన్నదమ్ములను దండ్రులను నెఱుంగక యొకళ్లొకళ్లపయిం బడి తమ్ముఁ దామ కూల్చికొనుమానిసులును గుఱ్ఱములం బొదివి పొలియించుగుఱ్ఱములును నేనుంగులం జదుపునేనుంగులునై యత్యంతబీభత్సంబై యుండఁ గొందఱు హాతాత పుత్త్రా యని గోత్రనామములు చెప్పి పిలుచుచు హాహాకారంబు లొనరించుచు

నలుగడలం బాఱుచుండఁగ నశ్వత్థామవారల వారించి యేట్లాడుచుండె. అట్లు
పరమఘోరప్రకారుం డై నయతనిబారిం బడక తప్పించికొని మెట్టులో శిబిరద్వా
రమునకు వచ్చుడుఁ గృపుఁడును గృతవర్మయు నడ్డగించినం బ్రాణత్రాణపరాయ
ణులై కవచము లూడ్చియు వెంట్రుకలముడి సడలించియుఁ గేలుమోడ్చియుఁ
గావరే యని శరణంబు వేఁడినను నాకృపకృతవర్మలు దుర్మతులై యశ్వత్థామ
కుఁ బ్రియముఁ జేయుతలంపునం బోనీక పొదివి వధించుచుండిరి. అవ్విధమ్మున
శిబిరమ్మున నశ్వత్థామయు ద్వారదేశమునఁ గృపహార్దిక్యులునుం గూడి మూఁడు
చోట్లఁ జిచ్చు వెట్టినట్టు లాశిబిరంబు నాశనముఁ జేయం బూనిన నెక్కడఁ జూ
చినను ఘోరకబంధములును దునిసినతలలును దెగినచేతులును విఱిగినకాళులు
ను నలిగినతొడలును నలినలియైనడొక్కలును గజగాత్రఖండములును దురం
గాంగశకలములును విచ్ఛిన్నాయుధభంగములునుంగా నప్పాండవశిబిరంబు ఘో
రబీభత్సం బై యుండునెడ హతశేషు లగుకొంద ఱక్కటా ! నిద్రించుతఱి నిట్టు
లు క్రూరత్వంబునకుఁ గొంకక తొడరుపాపాత్ములును గలుగుదురే ? పాండవులు
సన్నిహితులు గామిం జేసి యిప్పు డీదురాత్ముల కిట్లు చేయం గలిగెఁ గాని పుండ
రీకాక్షసహాయుం డై నగాండీవి చెంగట నుండునేని యక్షరాక్షసగంధర్వాదు లె
వ్వారై నను మమ్ముమార్కొన నోపుదురే ? బ్రహ్మణ్యుఁడు సత్యవచనుఁడు దాం
తుఁడు సర్వభూతదయాళుఁడు నగునప్పాండవమధ్యముఁ బ్రస్తుతింపఁ దరమె? నిద్రిం
చినవానిని నేమఱియున్నవానిని గైదువులేనివానిని గేలుమోడ్చినవానిని బాఱిన
వానిని వెంట్రుకలు జాఱవైచినవానిని నప్పరమధార్మికుఁ డెన్నఁ డైన వధియిం
చునే? యని పలుదెఱంగుల సవ్యసాచిం బొగడుచుండ నాగుసుతనయుండు క్షణ
మాత్రలోన వారల నందఱనుం బరిమార్చి శిబిరంబు నిరవశేషంబు చేసిన నత్తు
ములనినదంబు తత్క్షణంబ ప్రశాంతం బయ్యె. ఆఘోరసంగ్రామమునం జేసి
నెత్తురుటేఱు పాఱుటయు నెగసినపాంసుజాలం బడంగె. అబ్బంగి నభ్భారద్వాజ
తనూజుండు యామద్వయమాత్రలోనఁ బాండవశిబిరంబు పాడు చేయుటయు
ఘోరాకారము లై ననక్తంచరభూతములును బ్రేతపిశాచగణంబులును బుత్రమి
త్రకళత్రసమన్వితంబుగా నచ్చటికి వచ్చి నెత్తురు ద్రావియు మాంసముఁ దిని
యు నందు రుచిమంతంబు లై నవానిం దాము తిని తమవాని కొసంగియుఁ బర
మహర్షమున నాడియుఁ దనియుచుండె. అంపలకు ముదం బంది గురునంద
నుండు యుగాంతమున సర్వంబు భస్మము చేసి వెలుంగుపావకునిరీతిం దనరి రక్త
సిక్తం బై నకృపాణంబు నెత్తుటం దోఁగినతనభుజముతో నేకీభూత మయినరీతిం
గన్పట్టుచుండఁ దొలుతఁ దాను నిద్రితనిశ్శబ్దం బై నశిబిరంబుఁ జొచ్చి నిహతని
శ్శబ్దం బై నయాశిబిరమును బ్రభాతమున నిర్గమించి ద్వారదేశమున నున్నగౌత
మహార్దిక్యులం గాం[illegible] దెలియం

జెప్పిన విని వారు నతనికిఁ బ్రియముఁ గావించువారై భుజాస్ఫాలనంబులను సింహనాదంబులను నొనర్చిరి.

రాజేంద్రా, యిట్లు నిద్రించి యేమఱియున్న పాంచాలాదుల కారాత్రి యత్యంతదారుణం బయ్యె. కాలపర్యాయ ముల్లంఘింప నేరికిని దరంబు గాదు. మహితపరాక్రమక్రమంబున మనవారలఁ దెగటార్చినయావీరవర్యులిట్లు ప్రమాదమునఁ బొలియుదురే యనిన ధృతరాష్ట్రునిం డు సంజయా, గురుసుతుండు తొలుతనే నాకొడుకులగెలుపు గోరి యీపని యేల చేయ కుడిగె? దుర్యోధనుఁడు హతుఁ డై నపిదపఁ జేయఁగఁ గతం బెయ్యది యనిన నోనరేంద్రా, పాండవులకు వెఱచి యశ్వత్థామ ము న్నిట్టులు చేయఁ జాలక యిప్పు డప్పరమవీరులేవురును వాసుదేవసాత్యకులును నచ్చట లేమిం జేసి యింతకుఁ జాలె నావీరుల సమక్షమున నింద్రుఁడై నం దదీయులఁ బరిమార్పఁ జాలునే యనిచెప్పి సంజయుండు వెండియు నాంబికేయున కిట్లనియె.

## అశ్వత్థామాదులు దుర్యోధనునకు సౌప్తికవధ ప్రకారంబుఁ దెలుపుట.

అట్లు కృపాశ్వత్థామకృతవర్మలు ముువ్వురును గూడి సర్వపాంచాలురును నమాత్యులును ద్రౌపదేయులును దెగుటకు హర్షించుచుఁ గృతార్థుల మైతి మని తమలోఁ దలంచికొని యింతకు దుర్యోధనుండు ప్రాణముల నుండిన నాతనిం గాంచి దీని నెఱింగించుట లెస్స యని యూహించి శమంతపంచకంబున భగ్నోరుం డై భక్షణాసక్తిం దఱియవచ్చినకూరసత్త్వముల మెల్లన వారించుచు నెత్తురు గ్రక్కుచు గాఢవేదనం జేసి నేలం బొరలుచు ముమూర్షాదశం జెంది యున్నదుర్యోధనుం జూచి యాతనిం బరివేష్టించి కూర్చుండి త్రేతానలపరివృతం బై నయధ్వరవేదికై వడిఁ దత్కాలంబున నొప్పుచున్నయన్నరనాథునివక్త్రకుహరవినిర్గతం బై నరుధిరంబుఁ జేతులఁ దుడిచి విలపించుచుండునంతఁ గృపాచార్యుఁ డిట్లనియె. దైవమున కతిభార మెద్దియుం గాదు. ఏకాదశాక్షౌహిణీనాథుఁ డై నదుర్యోధనుఁడు శత్రునిహతుండై నెత్తుటం జొత్తిల్లి నేలం బడునే? కాంచితిరే కాంచనప్రకాశం బై నయి మ్మహారాజుచెంగటం బడి కనకసముల్లసితం బై నసముద్దండగదాదండము స్వర్గమునకుఁ బోవునపుడు నీతని విడువక తోడఁ జనువడువున నొప్పుచు మేలిప్రసాదంబున నుత్తమశయనంబున సహగమనంబుఁ జేయు ప్రియభార్యకరణిం గ్రాలెడి. మూర్ధాభిషిక్తు లగురాజులముందఱ నడుచుపరంతపుఁడు ధూళిం బ్రుంగుడుపడియె. అక్కటా! కాలవిపర్యయ మిట్టు లగునే? వీర్యదుర్దాంతు లై నవైరులఁ బరిమార్చినపరాక్రమఘనుండు పగవారిచేఁ బరాజితుం డయ్యె. త న్నెల్లపుడును నమితభయభక్తుల ననేకరాజులు వినతు లై కొలువఁ గొమరారురాజరాజు క్రవ్యాదగణపరివృతుండై వీరశయనమునఁ బరున్న వాఁడు. తదర్థము ఋత్విజులుపాసింపఁ బెంపుసొంపారు నరేశ్వరుండు

మాంసార్థము ఘోరసత్త్వంబులు చుట్టు ముట్టికొనఁగ నడుమనుండెడి నింతకం
టెఁ గష్టంబు గలదే యని పలవించుచున్నంత నశ్వత్థామ యత్యంతకరుణముగ
నిట్లు పరిదేవనంబుచేసె. రాజశార్దూలా, నిన్ను ధానుష్కు లందఱిలో ము
ఖ్యుఁడనియుఁ గుబేరసముఁడనియు సంగ్రామమున సంకర్షణశిష్యుఁడనియుం జెప్పు
దురు. బలియుఁడు నేర్పరియు నగునీయెడఁ బాపాత్ముఁ డగునాభీముఁ డెట్టులు రం
ధ్రముఁ గనియెనొకాని కాలమే బలవత్తరం బనినిశ్చయింపవలసియుండెడు.
సర్వధర్మజ్ఞుఁ డైనని న్నధర్మమున నద్దురాత్ముఁడు భగ్నోరుం గావించె. అంత
టం బోక యెడమకాల నీతలఁ దాఁచె. అప్పుడు కృష్ణుఁడు నర్జునుఁడును ధర్మ
నందనుండును దగ దని వారింపరైరి. వారు ధర్మజ్ఞుల మని తలంచుకొనువా
రలకాని పరికించి చూచిన నిక్కంబ ధర్మవిదులు గారు. కలకాలము వృకోద
రుఁ డధర్మమున దుర్యోధనుం దెగటార్చె నని యందఱు నతనిం దూఱుదురు.
ఆపాండవులును మేము దుర్యోధనుం జంపితి మని యెట్లు చెప్పికొన నేర్తురు? బల
భద్రుఁ డెల్లప్పుడును సభలలో నస్మచ్ఛిష్యుఁ డైనదుర్యోధనునకు గదాయుద్ధ
మున నెవ్వరును దీటు గారని ప్రశంసించుచుండును. నీవు కురుక్షేత్రమున ధర్మ
ము దప్పక పోరి సద్గతిం బొందితివి కావున నిన్ను గుఱించి వగవం బని లేదు. నీవు
ధన్యుఁడవు. వృద్ధులు నంధులు నైనగాంధారీధృతరాష్ట్రులు పుత్త్రపౌత్త్రబాం
ధవాదులం బోకార్చికొని యింక నేగతిం బొందుదురో భిక్షుకులై యెట్లు చరి
యింతురో యని వారలఁ దలఁచికొని యుమ్మలించెద. సర్వకామముల నొడఁ
గూర్చి ప్రోచిన ప్రజాహితమహీపతి యగునీతోడ నాకలోకమునకు రాక తక్కిన
నన్నును గృపకృతవర్మలను నేన నిందించెద. భవత్ప్రసాదమున నేనును మాతం
డ్రియుఁ గృపాచార్యుఁడును గనకమణిభూషణగణసముచితంబులు దాసదాసీజన
సంభృతంబులు నగునుత్తమగృహములం గొని పుత్త్రమిత్త్రబాంధవాదిసమన్వి
తంబుగ నేపట్టునం గొఱంత యింతయు లేక సకలభోగము లనుభవించియు భూ
రిదక్షిణలతో బహుళయజ్ఞముల నాచరించియు నీమన్ననం బడసితిమి. ఇట్టి
నేనును గృపాచార్యుఁడును నింక నెట్టులో ప్రవర్తింపవలసియుండెడి. మేము ము
వ్వురమే నీతోడ రాఁగలుగుభాగ్యము లేమికిఁ జంతిల్లుచు నీయొనర్చినసుకృతముఁ
దలపోయుచు హీనార్థులమై దుఃఖమునఁ ద్రిమ్మరవలసియుండెడి. నిన్నెడఁబాసి
నమాకు శాంతి యెక్కడిది? సౌఖ్య మెక్కడిది? నీవు స్వర్గమునకుఁ జనినప్పు
డచ్చట నుండునాచార్యుం గాంచి జ్యేష్ఠతాశ్రేష్ఠతల కనురూపముగ నామాట
గాఁ బూజించి ధృష్టద్యుమ్నుని నీకొడుకు తెగటార్చె నని తొలుతఁ జెప్పుము.
పదంపడి బాహ్లికసోమదత్తభూరిశ్రవస్సైంధవాదు లగుమహారథులను మఱి
యు స్వర్గగతు లైనరాజుల నందఱను నస్మద్వాక్యంబున నాలింగనమున నాదరిం
చి యనామయక్రమం బడుగు మనిచెప్పి యశ్వత్థామ వెండియు నిట్లనియె. దు

ర్యోధనా, జీవముతో నుండెదవుగదా శ్రవణానందకరం బైన యొక్క మాట విని పించెద వినుము. పాండవు లేవురు కృష్ణసాత్యకు లిద్దఱు ననం బాండవపక్షమున నేడుగురు బ్రదికియున్నారలు. మనపక్షమున మేము ముగురము మిగిలి యున్నవారము. సౌప్తికంబున నేను గృపకృతవర్మసహాయుండనై పాండవశిబిరమున కరిగి యందుఁ జొచ్చి పాపాత్ముఁడైనధృష్టద్యుమ్నునిఁ బశుమారణక్రమమున శస్త్రప్రచారము లేక పాదప్రహారాదిబీభత్సవిధానమునఁ బరిమార్చితిని. వానికొడుకులను దమ్ములనుం జంపితిని. ద్రౌపదీతనయుల నైదుగురం దెగటార్చితిని. సర్వపాంచాలురను నిఖిలమాత్స్యులను మఱియు వారికిఁ గలయోధుల నందఱను హతశేషము లయినతురంగమాతంగగణములనుం బొలియించితిని. వారిచేసినపనికిఁ బ్రతీకారం బిట్టులు చేసితిని. పాండవులును వాసుదేవసాత్యకులును నెచ్చటికిఁ బోయిరో కాని యచ్చటఁ గానంబడ రనినివేదించినం గురుక్షోణీవల్లభుం డుల్లమునకు సముల్లాసంబుఁ గావించునవ్వచనం బాకర్ణించి యోమహాత్మా, పితామహుఁడు నాచార్యుఁడును గర్ణుఁడును గృపకృతవర్మసహితుం డైనయీవు చేసినంత చేయరు. క్షుద్రుం డైనపాండవసేనానాయకుండును శిఖండియును హతు లైరికదా. ఇప్పుడే నింద్రునకు సాటి యగుదు ననితలంచెద. శుభం బయ్యెడి. పునస్సంగమంబు స్వర్గమున నయ్యెడి ననిపలికి యూరకుండె.

## దుర్యోధనుండు ప్రాణత్యాగముఁ జేయుట.

అట్లు తూష్ణీంభూతుండై దుర్యోధనుండు తనసుహృదులకు దుఃఖముఁ గలిగించుచుఁ బ్రాణముల విడిచి పుణ్యలోకమున కరిగె. మేను మేదినిం బడియె. నరేంద్రా, భవదగ్రనందనుం డట్లు శూరులముందఱ నడిచి యరాతినిహతుండై యందఱివెనుకఁ జనియె. కృపాదులు నంతకుమున్న రాజుం గౌఁగిలించికొని యతనిపరిష్వంగసమాదరంబుఁ బడసి వీడుకొని తమతేరు లెక్కి పలుమఱు నతనిదెసం జూచుచు నాప్రత్యూషమున శోకార్తులై నగరమార్గంబు పట్టి యరిగిరి. ఈవిధమున నీదుర్మంత్రమునం జేసి కౌరవపాండవులకు రౌద్రదారుణం బైన సంగ్రామంబు సెల్లె. కృష్ణద్వైపాయనుండు యుద్ధవిశేషము లెల్ల నెఱుంగ నాఁడు నాకుఁ బ్రసాదించినదివ్యదృష్టి నీకొడుకుతో డిద యయ్యె నని సంజయుండు దుర్యోధనవధప్రకారంబు వివరించిన విని ధృతరాష్ట్రుండు పెద్దయుం బ్రొద్దు వేఁడి నిట్టూర్పులు నిగిడించుచుండె నని చెప్పి వైశంపాయనుండు జనమేజయునకు వెండియు నిట్లనియె.

## ధర్మరాజు సౌప్తికవధప్రకారము విని దుఃఖించుట.

అంత నక్కడ నారాత్రి వేగుటయు ధృష్టద్యుమ్నసారథి ధర్మరాజునొద్దకుఁ జనుదెంచి మహారాజా, యశ్వత్థామ కృపకృతవర్మసహాయుండై రాత్రి

మనశిబిరంబు సొచ్చి నిద్రాపరవశులై యున్నమనవారలఁ బొదివి యందఱం బరిమార్చె. ఏమి చెప్పుదు ద్రౌపదీనందను లేవ్వరును దెగిరి. ధృష్టద్యుమ్నుండు పొలిసె. శిఖండిసచ్చె. యుధామన్యూత్తమౌజఃప్రభృతు లగుపాంచాలు రంద ఱును మాత్స్యు లెల్లరును మడిసిరి. గజవాజిగణము లన్నియు సమసె. పె క్కేల? శిబిర మంతయుఁ బా డయ్యె. గండ్రగొడ్డండ్ల నడవి నఱుకంబడు నప్పు డెట్లట్ల ఘోరనాదంబు నింగి ముట్టె. ఏ నెక్కండ నెట్టులో కృతవర్మ యేమఱియుండఁగఁ దప్పించికొని వచ్చితి ననుచున్నంతఁ గర్ణకఠోరం బైనయవ్వ చనం బాకర్ణించి యజాతశత్రుండు పుత్రశోకసమన్వితుండై మహిం బడునెడఁ దటాలున సాత్యకియు భీమార్జునులును గవలును నాతనిం బట్టికొనినఁ గొండొక నడికిఁ దెలిసి యమ్మహాత్ముండు శోకపరీతాత్ముండై దీనస్వనంబున నిట్లని విలపించె. దివ్యదృష్టులకుం గార్యగతి దెలియరాకుండెడి. పరాజితు లగుదురు. అనర్థ మ ర్థప్రాయముగను నర్థ మనర్థదర్శనముగనుం దోఁచుచుండును. మేము వైరులఁ బుత్రమిత్త్రామాత్యబాంధవసమన్వితంబుగాఁ బిలుకుమార్చి జయముఁ గొని యుఁ దుదిఁ బరాజితుల మైతిమి. ఈజయము పరాజయమకాక వాస్తవజయం బగునే? జయించియుఁ బశ్చాత్తాపమున నలందురునతని కాగెలుపు గెలు పగు నే? కర్ణినాళీకాదినారాచములు కోఱలుగా వాలు నాలుకగా విల్లు తెఱచిననో రుగా జ్యాఘోషంబు భీకరారవంబుగా రౌద్రసముద్రేకమునం బేర్చి నరసింహుఁ డన నొప్పినకర్ణునిబారిం బడకయు, రథము హ్రదముగా శరవర్షము కల్లోలమాలి కలుగా శక్తిప్రాసాదులు మీనచక్రాదులుగా విండ్లు సుళ్లుగా నమ్ములు ఫేనమ్ములు గా జ్యాతలనేమినిర్ఘోషంబు మహాస్వనంబుగా సంగ్రామసముత్సాహంబుచంద్రో దయంబుగా నుప్పొంగుచు మహార్ణవంబు ననుకరించునాచార్యుం దరించియు, ధ్వ జోత్తమాగ్రంబు ధూమకేతువుగా మౌర్వీతలనేమినాదంబు చటచ్ఛటారవంబుగా నానాశస్త్రములు హెూమసాధనములుగా మహాసేనలు శుష్కతృణపుంజములు గా వెలుంగుచుఁ బావకునకు దీటయినపితామహు నోర్చియుఁ బ్రమాదమున నిప్పు డు రాజతనూజు లందఱును హతు లైరి. ప్రమత్తునకు విద్యాతపశ్శ్రీకీర్తులం బ డయ శక్యంబుగాదు. అప్రమాదమునంగాదె మహేంద్రుఁడు పగవారల నిర్జిం చి నిర్జరలోకం బేలుచున్నవాఁడు. ఇంద్రతుల్యులగురాజపుత్త్రుల నిప్పుడు ప్ర మాదమునఁ బోకార్చికోలు సముద్రమెల్ల దాటి బేహారు లల్పనదిలో మునిం గి యడంగినతెఱం గయ్యె. వా రందఱును త్రిదివమునకుఁ జని రిది నిస్సంశ యంబు. వృద్ధుఁ డైనతండ్రియు భ్రాతలును గొడుకులును నిట్లు ప్రమాదమున హతు లవుట విని పాంచాలి చిచ్చు వెట్టి కాల్చినట్లు పరమశోకమున నుమ్మలించి మూర్ఛిల్లి ధరణిం దొరుఁగును. సుఖోచిత యగునాకృశాంగి మందభాగ్యమునం జేసి యెంత దురపిల్లునొ యారాజపుత్త్రిని మాతృగణములతో నిటకుఁ దోడ్తెమ్మని

నకులునకుఁ జెప్పిన నాతండు ధర్మస్వరూపుఁడై నయన్న మాటను ధర్మమునం గ్రహించి తేరెక్కి రయమున నుపప్లావ్యమునకుఁ జనియె.

**ధర్మరాజు శిబిరమునకుఁ జని చూచి దుఃఖించుట.**

అట్లు నకులుం డరుగుటయు ధర్మరాజు తక్కినతమ్ములును వాసుదేవసాత్యకులును వెంట రాఁగ నిజశిబిరమునకుఁ జని పీనుంగుపెంట యైనయాప్రదేశంబుఁ జొచ్చి పలుదెఱంగుల శకలంబులై నెత్తుటం దోఁగి నేలం బడియున్న పుత్త్రమిత్త్రబాంధవాదులగాత్రములంజూచి యత్యంతదీనుండై యశ్రుపూర్ణలోచనుండై యార్తరవమున నాక్రందనముఁ జేసి మూర్ఛిల్లి ధరణి నొరఁగినం గృష్ణాదులు లేవ నెత్తి యూరార్చినం దేఱె. అంతట నకులుండు ద్రౌపదిని దోడుకొని వచ్చుటయు నద్దేవి యవ్విప్రియము విన్న మొదలుగాఁ గన్నీరు జాలువాఱ నేడ్చుచు నచ్చటికి వచ్చి తేరు డిగ్గి వాతాభిహతం బైనయనఁటిమ్రానిచాడ్పున నెంతయుఁ గంపించి రాహుగ్రస్తచంద్రబింబముమాడ్కిఁ జెన్ను దఱఁగిననెమ్మొగమ్ముతో ధర్మజుం జేర నరిగి శోకపరీతయై ధరాతలమునం బడిన వృకోదరుండు రెండుచేతులఁ బట్టి లేవ నెత్తి యూరార్చినం బలవించుచు భ్రాతృసహితుం డైనధర్మసుతున కిట్లనియె. రాజేంద్రా, క్షత్త్రధర్మమున సుతులను యమున కర్పించి రాజ్యముఁ బడసి భాగ్యమునఁ గుశలివై తివి. మత్తమాతంగగమనుం డైనసౌభద్రుని దక్కిన కొడుకులను నాతోడఁ దలఁపవుగదా. పాపాత్ముఁ డైనద్రోణాత్మజుండు నిద్రితు లైననావారిం జంపుట విని నామనంబు చిచ్చువెట్టి కాల్చినట్లు తపించెడి. అతని నతనివారలనుం బరాక్రమించి పోరఁ జంపకుండిన నేను బ్రాయోపవేశంబుఁ జేయుదు. ఆద్రోణసుతుండు తనచేసినపాపమునకు ఫలముఁ గుడువకునికి తగునే యనిపలికి యాజ్ఞసేని యుధిష్ఠిరుముందఱం గూర్చుండుటయు నారాజర్షి ప్రియమహిషి కిట్లనియె. కల్యాణీ, ధర్మము నీ వెఱుఁగుదువు గావునఁ జెప్పెద. నీ కొడుకులును భ్రాతలును ధర్మమున నిధనముఁ బొందిరి కావున వారికై శోకింపఁ బని లేదు. ఆద్రోణాత్మజుండు దుర్గమం బైనదూరకాంతారమునకుఁ బఱచినవాఁడ కా నోపుఁ గావున వానిం దెగఁ జూచు టెట్లనినం బాంచాలి రాజపుంగవా, యతనికి సహజం బైనశిరోరత్నము గలదు. వానిం బరిమార్చి దానిం దెచ్చి యిచ్చితేని నీ శిరమునం బెట్టి చూచి బ్రదుకుదు నియ్యది నానిశ్చయం బని ధర్మనందనునకుఁ జెప్పి భీమసేనునొద్దకుఁ జని యతని కిట్లనియె.

**ద్రౌపది యశ్వత్థామను నిర్జింప భీమునిఁ బంపుట.**

మహాబలా, నన్ను రక్షింపుము. క్షత్త్రిధర్మముఁ దలపోసి వాసవుఁడు శంబరుంబోలె నప్పరమపాపాత్ముం బరిమార్చుము. విక్రమమున నీకు సాటివచ్చు

పురుషుఁ డీధరణీతలమునం గలుగఁడు. వారణావతనగరమున లాక్షాగృహదహన
సమయమునను హిడింబదర్శనావసరమునను బాండవేయులకు నీవు దీవి యని
వినియుండుదును. విరాటనగరమున నన్నుఁ గీచకుఁడు పరిభవింపఁ జూచినప్పు
డు శచీదేవిని దేవేంద్రుఁ డెట్టు లట్టు లయ్యా పద నుద్ధరించితివి. ఆకృత్యముల
నెల్లఁ జేసినట్టు లిప్పుడు ద్రౌణిం బరిమార్చి సుఖింపు మనిచెప్పినం బాంచాలివచ
నంబు విని యమర్షవశుండై భీమసేనుఁడు తేరుపూన్పం బంచి నకులుని సారథ్య
మున నియోగించి విల్లమ్ములఁ గొని రథము నధిరోహించి సజ్యం బయిన కార్ము
కంబు నారి సారించి ద్రోణతనయురథము చనినతెరువు పట్టి యతనిఁదెగటార్ప
మనస్సు వెట్టి యతిత్వరితగమనంబునఁ దేరువఱపించె.

అట్లు భీమసేనుం డరుగుటయుఁ బుండరీకాక్షుండు యుధిష్ఠిరున కిట్లనియె.
పాండవోత్తమా, వీఁడె నీతమ్ముఁడు పుత్త్రశోకవ్యాకులితమనంబుతో ద్రౌణిం
దెగటార్ప నొక్కరుండే యరుగుచున్నవాఁడు. తమ్ము లందఱిలో భీముఁ డెంత
యు నీకుఁ గూర్చువాఁడుకదా. అట్టివాఁ డిట్టికృచ్ఛ్రముఁ బ్రాపించినప్పు డేల
యొప్పరికింతువు. ధనుర్ధరశ్రేష్ఠుఁ డైనద్రోణాచార్యుఁ డొసంగినబ్రహ్మశిరోనా
మకం బయినదివ్యాస్త్రము వానియొద్దఁ గలదు. అయ్యది యఖిలభూమండ
లంబు నొక్కనిమేషములోనం గాల్పఁ జాలును. దానిం బ్రీతిపురస్సరముగ
నాచార్యుఁ డర్జునునకుఁ బ్రసాదించినం దెలిసి సహజామర్షుఁ డైనయశ్వత్థామ
యేకాంతమునఁ దండ్రిని జేరి దానిం దన కొసంగు మని వేఁడిన నమ్మహాత్ముఁ
డిద్దు రాత్మునిచాపల మెఱింగినవాఁడు గావున నాతిసంతుష్టచిత్తుండయ్యుఁ బుత్త్ర
వాత్సల్యకారణంబున నొసంగి వత్సా, యెట్టియాపద తొడరినను నిమ్మహనీయా
స్త్రముఁ బ్రయోగింపవలదు విశేషించి మనుజులపై నేయవల దనియనుశాసించి
యంత నిలువక నీవు సన్మార్గమున నొకప్పుడైన నుండుదువే యని కినిసిన నప్రి
యం బైనతండ్రిమాట కలిగి యాదుష్టాత్ముఁడు సర్వకల్యాణముల నిరాశుండై
శోకము పెల్లున మహీమండలమునం దిమ్మరువాఁడు మీరు వనవాసంబు నడుపు
తఱి ద్వారవతి కేతెంచి యొక్కనాఁడు సముద్రతీరమున నేకాంతమున నాతో
నవ్వుచు నిట్లనియె. కృష్ణా, భారతాచార్యుం డైనమాతండ్రి యుగ్రతపమున
నగస్త్యునకు మెచ్చు చేసి యమ్మహామునివలన దేవగంధర్వాదిపూజితం బైన
బ్రహ్మశిరోనామకాస్త్రముం బడసె నయ్యది నాయొద్ద నున్నది. దానిం గొని
శత్త్రునిబర్హణం బైనభవదీయచక్రం బిమ్మని యడిగినం బ్రీతుండనై యేను
దేవదానవగంధర్వమనుష్యపతగోరగాదు వారలందఱు నొక్కటియై కూడినను
వీర్యమున నాకుసాటి గారు. ఇదె నాకార్ముకం బిద్ది నాశక్తి యియ్యది నాచక్ర
మిదియె నాగద వీనిలో నెద్దానిని నీ వెత్తనుం బ్రయోగింపనుం జాలుదు వద్దా
నిం గొనుము. నీయ[illegible] ముందఱం

బెట్టిన నాదురభిమానఘనుండు నాతోడిపోటికి మదీయసహస్రారచక్రంబుఁ గోరు టయు నేనును గ్రహింపు మంటిని. అంత నాసురాశాపరుండు రయమునం జనుదెంచి తొలుత నెడమచేత నెత్తఁ బోయి కదలింపనేరక వలపలికేలం బట్టియు రెండుచేతులం బూన్చియు సర్వప్రయత్నము లొనరించియు నించుకేనియుఁ జలిం పఁజేయఁ జాలక మిక్కిలి డస్సి విన్నఁబోయి యప్పని చాలించికొని యొదిఁగి యుండ నక్కుంభసంభవసంభవునకు నే నిట్లంటి. దేవమనుష్యాదులలోఁ బ్ర మాణపరమత్వంబు సాధించియు నెక్కటిబవరమున దేవదేవు నుమాపతిని మె ప్పించి పాశుపతాస్త్రంబు వడసియుఁ బ్రఖ్యాతుండును బుత్త్రిదారాదులలో నెయ్యదియేనియుఁ దన కియ్యరానిది లేదని యే నత్యంతప్రేమమునఁ జూచునట్లు నా కెంతయుం గూర్చుననుంగుఁజెలి యగుగాండీవియు సహధర్మచారిణి యగు రుక్మిణియందు నాకు జనించి సనత్కుమారునిరీతిఁ దేజస్వియైన ప్రద్యుమ్నుఁ డును మహానుభావుఁ డైనరాముఁడును గదసాంబాదియాదవకుమారులును ము న్నెన్నఁడు నిప్పరమసాధనంబును నన్నడుగరు. ఏను హిమవత్పార్శ్వమునఁ బం డ్రెండేఁడులు ఘోరప్రకారమున బ్రహ్మచర్యనిష్ఠ సలిపి తపోమహిమమున నిప్ప రమసాధనమును సాధించితిని. అయ్యా, నీ వెవ్వరితోఁ బోరఁగ నియ్యాయుధ వరంబుఁ గోరి తనియడుగ నాతండు నిన్నుఁ బూజించి యనుజ్ఞఁ గొని నీతోడన పోరువాఁడనై వేఁడితిని. లోకమున నజేయుఁ డనం బేరు వడయుదు ననియుంటి నింతయు సత్యంబు. నాకోర్కి దుర్లభం బయ్యెఁ జక్రధరుం డైననీతోఁ బోరు వాఁ డీపుడమిం గలుగఁ డనుజ్ఞ యిమ్ము పోయి వత్తు ననిచెప్పిన విని నేనును భా రతాచార్యుం డైనద్రోణునకుఁ గుమారుఁ డనుభావమున సత్కారబుద్ధితో నాతనికి ధనకనకములను నుత్తమరథ్యములను నొసంగి వీడుకొల్పితి. ఆసుర హంకారుఁ డత్యంత సంరంభియుఁ జపలుఁడును గ్రూరుఁడును బ్రహ్మశిరోనామ కాస్త్రిమెఱింగిన వాఁడునుం గావున వృకోదరరక్షణంబు మన కిపు డవశ్యకర్త వ్యంబని ధర్మజునకుఁ దెలియం జెప్పె.

### శ్రీకృష్ణధర్మజార్జునులు భీముని వెంట నరుగుట.

అవ్విధమునఁ జెప్పి పురుషోత్తముఁడు నిజస్యందనోత్తమంబుఁ బూన్పం బంచిన శైబ్యంబును డాఁపటను సుగ్రీవంబును వలపటను మేఘపుష్పవలాహక ములను వానిపార్శ్వములనుం బూన్చి విశ్వకర్మనిర్మితం బై నయున్నతగరుడధ్వజం బెత్తి దారుకుండు దెచ్చినం దాశార్హ్యుండు దాను నొగ లెక్కి పగ్గములు ముని కోలయుం గొని సాత్యకిసహదేవుల నచట నిలిపి ధర్మరాజార్జునులను రథాధిరూఢు లం గావించి యశ్వీను లనుసరించినసురేంద్రుకరణిం జూడ నొప్పుచు భీముని యరద మరిగినతెరువు పట్టి పరమరయమునం దోలి యమ్మహారథు నెయిది వా రించిన నమ్మహాబలనందనుం [illegible] యశ్వత్థామ కరినగరం

బు తెరువు విడిచి చని భాగీరథీతీరమున వేదవ్యాసమునిసన్నిధి నున్నవాఁ డని యెఱింగికొన్నవాఁడు గావున వారు సూచుచుండఁ బటురయమునఁ దనతేరచ్చో టికిఁ బఱపించి సలిలప్రాంతమున ఋషిగణపరివృతుం డైనపారాశర్యుని నాచెం గటం గూర్చున్నరజోమలీమసుం డైనయశ్వత్థామనుం గాంచె. వాసుదేవ ధర్మజార్జును లతనివెంటన చనిరి. అట్లు వృకోదరుఁ డశ్వత్థామను జూచి సశ రం బయినచాపముఁ గొని నిలునిలు మని యదల్చుచు నతనిపై కుఱికె.

## అశ్వత్థామార్జునులు బ్రహ్మశిరోఽస్త్రము లేయుట.

అవ్విధమునఁ దనమీఁదికి వచ్చుశరశరాసనపాణి యైనభీమసేనుని నతనివె నుక జనార్దనరథారూఢు లై వచ్చుచున్నధర్మరాజార్జునులనుం జూచి యాచార్య తనయుండు వ్యథితహృదయుం డై పాప్తకాల మని తలంచి యదీనమానసంబు తో బ్రహ్మశిరోభిధానం బైనయయ్యుత్తమాస్త్రముఁ జింతించి యొక్కయిషీకను గొని యయ్యస్త్రి మభిమంత్రించి యపాండవం బయ్యెడు మని రోషరూషితుం డై దారుణాక్షరవిన్యాసకలితంబుగాఁ బలికి · సర్వలోకప్రమోహార్థము విడుచు టయు ముల్లోకముల నీఱు సేయురీతి నయ్యిషీకలోనం బావకుండు వొడమె. జనార్దనుండు తొలుతనే యింగితమున ద్రోణిదుష్టభావంబుఁ దెలిసి సవ్యసాచిం జూచి యర్జునయర్జునా, ద్రోణోపదిష్టం బైనయప్పరమాస్త్రమున కియ్య ది కాలము సంప్రాప్త మయ్యె. నిన్నును నన్నలను దమ్ములనుం గాచికొనఁగా ద్రోణిప్రముక్తాస్త్రము శమింపఁగ నీవు నయ్యస్త్రమును దడయక ప్రయోగిం పు మనిచెప్పుటయు నప్పురుషోత్తమునివచనంబు విని పాండవమధ్యముండు రయ మునం దేరు డిగ్గి గాండివంబుఁ గొని య మ్మరిఁ బోసి తొలుత గురుసుతునకుఁ గుశలం బయ్యెడుమని చెప్పి పిదప నాత్మక్షేమంబుఁ జింతించి పదంపడి య న్నదమ్ములకు స్వస్తివచనంబుఁ బలికి దేవతలకును గురువులకును బ్రణమిల్లి యస్త్రి మస్త్రమున శమించుఁగాక యనిచెప్పి ప్రయోగించె. ప్రయోగించి నంతన యయ్యస్త్రము యుగాంతానలప్రకాశం బై జ్వాలామాలాభీలం బై నిగి డె. అశ్వత్థామయస్త్రి మట్లు తేజోమండలదారుణం బై నెగడుటయు నయ్యస్త్రి ద్వయముసంఘర్షమునం జేసి పిడుగులు పడియె. కొఱవులు ప్రాలె. ధరణి కం పించె. పర్వతములు గ్రక్కదలె. నభమెల్లఁ బెనుమంటలం గ్రమ్మిపరమదుర్ని రీక్షం బయ్యె. దారుణరవము లెసంగె. సర్వభూతములకత్యంతసంత్రాసంబు

గదిరె. అప్పుడు నారదుఁ డచ్చటికి వచ్చి కృష్ణద్వైపాయనుండును దానును లోకహితార్థముఁ గావించుతలంపున నయ్యస్త్రద్వయంబు మధ్యమున నిల్చి యశ్వత్థామలం బిలిచి కడచినమహారథులు నానాశస్త్రాభిజ్ఞులయ్యు నిట్టియుత్తమాస్త్రముల మానవులపయిం బ్రయోగించిరే? లోకాంతకరం బైనసాహసం బిది యేల చేసితి రనవుడు సవ్యసాచి యమ్మునులకు మ్రొక్కి కృతాంజలియై యిట్లనియె.

## అర్జునుఁడు తా నేసినబ్రహ్మశిరోఽస్త్ర మ్ముపసంహరించుట.

మునీంద్రులారా, యేను హింసార్థం బీమహాస్త్రము నేయనైతిని మఱియాచార్యసుతుం డపాండవం బయ్యెడుమని యయ్యుత్తమాస్త్ర మేసినం దదస్త్రము శమియింపఁ గోరి ప్రయోగించితి నిప్పు డిప్పరమాస్త్రంబు నే నుపసంహరింతునేని యతనియస్త్రము మమ్ము దహించును మాకును లోకములకును నెయ్యది హితం బద్దాని మీమనసునం జింతింపుఁడు మీరు దేవసంకాశులరు మీవచనమునంజేసి నే నిదె మదీయాస్త్రము నుడిగింతు ననిచెప్పి సవ్యసాచి తనయస్త్ర ముపసంహరించె. అప్పరమాస్త్రము ప్రయుక్తమయ్యెనేని మగిడింప నింద్రునకేనియు శక్యంబు గాదు. అర్జునుం డనుష్ఠిత సత్యబ్రహ్మచర్యుండు గావున దాని నుపసంహరింపఁ జాలె. బ్రహ్మచర్యనిష్ఠ లెస్స సల్పనివాఁడు మగిడింపఁ బూనునేని యప్పరమాస్త్రం బయ్యుపసంహర్తను దదీయులను వధించును. బ్రహ్మచర్యానుభావంబునను గురుశుశ్రూషామహిమంబునను గాండీవి యయ్యస్త్రము నుపసంహరించుటయు ద్రోణతనయుండు దానును మగిడింపఁ బూనియు నందులకుఁ జాలక దీనమానసుండై ద్వైపాయనున కిట్లనియె.

## అశ్వత్థామ తనయస్త్రమును బాండవగర్భములపైఁ బ్రయోగించుట.

మునీంద్రా, భీముఁ డధర్మమున దుర్యోధనుతొడలు విఱుగ నడిచె నను కోపముననను నందులకు నాయొనర్చినప్రతీకారమున కలిగి తఱుముచున్నయావృకోదరువలనివెఱపుననుంజేసి యే నుత్తమవ్యసనప్రాప్తుండనై ప్రాణత్రాణపరాయణత్వమున నకృతాస్త్రుండనై యపాండవం బయ్యెడుమని పలికి యిప్పరమాస్త్రముఁ బ్రయోగించితి మగిడింప శక్యంబు గాదు. రోషావేశవివశచేతస్కుండనై పాపముఁ జేసితి ననినఁ బారాశర్యుఁ డయ్యా,ధనంజయుఁ డయ్యస్త్రముఁ దా నెఱింగియు దోషమసీమ నెప్పుడును బ్రయోగింపక యిప్పు డస్త్రమ స్త్రమున శమింపఁ

గోరి ప్రయోగించియు మామాట పట్టి యుపసంహరించె. మీతండ్రియుపదేశమున బ్రహ్మాస్త్రప్రముఖము లైననానాస్త్రముల నేర్చియు నాతండు చలింపకున్నవాఁడు. ఇట్లు ధృతిమంతుఁడు సాధుఁడు సర్వాస్త్రవిదుఁడు నగునాకిరీటికి నతని యన్నదమ్ములకు నేల కీడు రోయుదువు ? బ్రహ్మశిరోఽస్త్రము పరమాస్త్రమునఁ బ్రతిహత మగునేని యాదేశమునఁ బండ్రెండేఁడు లనావృష్టిదురితంబు దొడరు నని నీ కింత చెప్పవలసెఁ గాకున్న నన్నరుండె తనయస్త్రమున నీయస్త్రమును శాంతమును గావించి తన్నును దనవారినిం గాచికొనఁ గలం డది యెఱింగి యర్జునుఁ డుపసంహరించినపదంపడి మగిడింపకునికి నీకుఁ బోలదు. పాండవులను నిన్నును రాష్ట్రమును నవశ్యంబు రక్షింపవలయు. కోప ముడుగుము. పాండవులకు నిరామయం బయ్యెడు. రాజర్షి యైనపాండవాగ్రజుఁ డధర్మమున జయింపఁ గోరమి యందఱకుం దెల్లంబు. నీశిరమున సహజమై యున్నమణిం బాండవుల కిమ్ము. పాండవులు నిన్నుఁ బ్రాణములతో విడుతురు. ఇయ్యది మీకు సముచితం బై నసంధిప్రకారం బనిన విని ద్రౌణి వ్యాసున కిట్లనియె. పాండవులకుఁ గలయఖిలధనరత్నాదులకంటె మదీయశిరోరత్నంబు విశిష్టంబు. దీనిం దాల్చినకతన శస్త్రాస్త్రవ్యాధిక్షుద్భయంబును దేవదానవపన్నగరాక్షసాదిసంత్రాసంబును నాకుఁ గలుగదు. ఐనను భవద్వచన మనతిక్రమణీయము గావున నిమ్మణి నిచ్చెద. మదీయపరమాస్త్ర ముపసంహరింప నశక్యంబు గావున దీనిం బాండవగర్భములమీఁదఁ బ్రయోగింతు ననుటయు సాత్యవతేయుం డయ్యా, యొండుతలంపు మాను మట్ల చేయు మనిన విని యశ్వత్థామ తదస్త్రమును బాండవేయగర్భములపైఁ బ్రయోగించె.

శ్రీకృష్ణుఁడు ద్రౌణ్యస్త్రదగ్ధుఁ డగుపరీక్షితుం బ్రదికింతు నని చెప్పట.

అట్టియెడ హృషీకేశుండు హర్షయుతుండై ద్రౌణి కిట్లనియె. గాండీవికోడలు విరాటుకూఁతురు నగునుత్తర యుపప్లావ్యమున నుండునప్పుడు వ్రతస్థుండై నయొక్కబ్రాహ్మణుం డేతెంచి కౌరవులు పరిక్షీణు లైనపదంపడి నీగర్భమునఁ దొలుతఁ బరిక్షీణుండై పిదప జీవితుం డైనకుమారుఁడు జనించి పరీక్షితుఁ డనం బరఁగఁగలఁ డనిచెప్పె నవ్విప్రునివచనంబు సత్యంబు గాఁగలదు. అతండే పాండవులకు వంశకర్త యనుచున్నంత ద్రోణతనయుండు పరమసంరంభవివశుండై హృషీకేశా, పక్షపాతమున నీవు చెప్పినది యట్ల కానేరదు. నావచనంబు తప్ప

దు. మదీయాస్త్రి ముత్తరాగర్భముఁ జొచ్చి నీకానఁబూనినకుమారుం జంపు ననుటయు భగవంతుఁడాతనికి మఱియు నిట్లనియె. నీయమోఘాస్త్రి ముత్తర గర్భముఁ జొచ్చి పరిక్షీణుం గావించినకుమారుఁడు మదీయమహిమమునఁ బున ర్జీవితుండై యాయుష్మంతుఁ డయ్యెడి. బాలజీవితఘాతకుం డై ననిన్నుఁ బర మపాపాత్ముఁడనియుఁ గుత్సితమానవుఁడనియు నందఱును నిందింతురు. అందు లకు ఫలంబుగా నీవు నిర్జనారణ్యదేశముల నిస్సహాయుఁడవై క్షుద్బాధితుఁడ వై సర్వవ్యాధిపీడితుఁడవై పూయశోణితదుర్గంధనిందితుఁడవై మూడువేలేండ్లు ద్రిమ్మరుగలవాఁడవు. ఆపరీక్షితుండు నీవు సూచుచుండఁగఁ గృపాచార్యుని తోడ నస్త్రవిద్య నేర్చి క్షత్త్రియధర్మపరినిష్ఠితుండై పరమధార్మికుఁ డనఁగఁ బ్ర ఖ్యాతిఁ గాంచి మష్టిహాయనములు కౌరవరాజ్య మేలఁ గలవాఁడు. భవదీయశస్త్రా గ్నిదగ్ధుం డైనయక్కుమారుని నేను బునర్జీవితుం జేయుదును. నరాధమా, మదీ యతపోవీర్యమును సవ్యసాచిమహిమమును జూడు మని నారాయణుండు పల్కు టయు సాత్యవతేయుఁ డతనిదెసం జూడ్కి సారించి యారా సద్బ్రాహ్మణుఁడవ య్యు మ మ్మనాదరించి నీ విట్టులు క్రూరకర్మముఁ జేసినకారణమున దేవకీనం దనువచనము సత్య మయ్యెడు మనిచెప్పిన నశ్వత్థామ యిట్లనియె. మునీం ద్రా, నేనును నీతోడనే మనుష్యులలో నుండఁగలవాఁడను. నీవును బురుషో త్తముఁడును సత్యవచను లగుదురుగాక యనిపలికి తనశిరోరత్నముఁ బాండవుల కొసంగి విమనీభూతుండై యందఱును జూచుచుండఁగ వనమునకుఁ జనియె.

## భీముఁడు ద్రౌణిశిరోరత్నముఁ దెచ్చి ద్రౌపది కిచ్చుట.

పాండవులును వ్యాసనారదుల నామంత్రణంబు చేసి యశ్వత్థామశిరోర త్నంబుఁ బుచ్చుకొని మురారిపురస్సరులై తఱలి తొల్లిటియట్లు రథారూఢులై రథ్యముల నతిత్వరితగతిం బఱపి శిబిరమునకుఁ జనుదెంచి తేరులు డిగ్గి దీనయు నిరానందయు శోకవ్యాకులితచిత్తయు నగుపాంచాలిని డాయం జని యాసా ధ్విం బరివేష్టించి దీనత్వంబు గదురఁ గూర్చుండునెడ భీమసేనుఁడు ధర్మరాజాను జ్ఞాతుండై యమ్మఁణి నమ్మహాపతివ్రత కొసంగి మధురముగ నిట్లనియె. కల్యా ణీ, భవత్సుతభ్రాతృఘాతకునిశిరోరత్న మియ్యది. క్షత్త్రియధర్మముఁ దలపోసి శోక ముడిగి లెమ్ము. శాంత్యర్థము మురారిని గరిపురికిఁ బనుపునపు డుపప్లా వ్యమునఁ బుండరీకాక్షునితోఁ జెప్పినకూరవచనములఁ దలంపునకుఁ దెమ్ము

పాపాత్ముం డైనదుర్యోధనుం జంపియు దుశ్శాసనుం బరిమార్చి నెత్తురు ద్రావి యుఁ బ్రతిన దీర్చితిఁ బగయెల్లఁ దీఱె. బ్రాహ్మణ్యమునను గురుపుత్త్రిగౌరవ మునను నశ్వత్థామ హతుఁడు గాఁడయ్యెఁగాని యతనికిఁ బరిభవమును నాయు ధవిభ్రంశమును గీర్తినాశమును జేయంబడియె ననియూరార్చి యతనిమస్తకమ ణి ముందటఁ బెట్టినం జూచి పాంచాలి మహాత్మా, కేవల మనృణత్వంబుఁ బొం దితి గురుసుతుఁడు నాకును గురుండకాఁడె. నరేంద్రుఁ డిమ్మణిని శిరమునఁ దా ల్చుఁగాక యనుటయు ధర్మరాజు గురూచ్ఛిష్ట మనుతలంపునను ద్రౌపదీవచన మునను నమ్మణిని శిరమున ధరియించి యుదయదిందుమండలాభిరామం బైనయు దయమహీధరంబుకరణిం దనరుచుండఁ గనుంగొని యాజ్ఞసేని యంకిలి దేఱిన చిత్తంబుతో లేచి నెమ్మది నుండె.

శ్రీకృష్ణుఁడు ధర్మజునకు శివమహిమంబుఁ జెప్పుట.

అట్టియెడ యుధిష్ఠిరుండు సౌప్తికమున నశ్వత్థామాదిరథికత్రయముచే నఖిలసైన్యములును హతము లగుటకు శోకించుచు దాశార్హుం జూచి కృష్ణా, కృతాస్త్రులు విక్రాంతులు శతసహస్రయోధులు నగుద్రుపదనందనులును నస్మత్తనూజులును మాత్స్యాదివీరులును బాపాత్ముఁ డగుద్రౌణిచే నిట్లు నిహతు లైరి. తన్నుఁ జూచిన నయ్యాచార్యుఁ డేనియు బవరమునఁ జక్కమొగ మిాక క్రేడించి చనునంతటి బీరంపుఁబెంపునం బొంపిరివోవుధృష్టద్యుమ్ను నగ్గురు పుత్త్రుఁ డెబ్భంగిఁ దెగటార్ప నోపె నాతం డంత కెంతకృత్యంబుఁ జేసినవాఁడో యెఱుంగఁ జెప్పవే యనియడుగ ధర్మనందనునకు వసుదేవనందనుఁ డిట్లనియె. నరేంద్రా ? ద్రోణసుతుండు దేవదేవుఁ డైనబాలేందుధరుని శరణంబుఁ బొందితత్ప్రి భావమునంజేసి యేకాకియయ్యు నందఱను బరిమార్పఁ జాలె. మహాదేవుఁడు ప్రసన్నుఁ డయ్యెనేని యమరత్వంబు నమరేంద్రునైన నిర్జింప నోపినవీర్యమును నొసంగును. అప్పరమేశ్వరునితత్త్వంబును బురాణచరిత్ర లను నే నెఱుంగుదును. భూతముల కాదిమధ్యాంతము లతండె. తత్కా ర్యముననే యీజగమెల్లయుఁ జేష్టిత మయ్యెడి. ఆభూతనాథుండు దొలుత భూతముల సృజియింపఁ దలంచినవిరించి తన్ను సృష్టికిఁ బంచిన వల్లెయని భూ తములదోష మెఱింగి పెద్దకాలము జలనిమగ్నుండై తపము సేయుచుండ దీర్ఘ కాల మతనిరాక వార్చి యారుద్రుం డప్పటికిని నీరు వెడలి రాకుండినం జూచి పితామహుండు ప్రపంచసృష్ట్యర్థము తనమనమున వేఱొక్కపురుషుం బుట్టించి

సృష్టిఁజేయు మనుటయు నాతండు నాకుఁ బూర్వజుఁడు లేకుండిన నేను సృజియిం
తు ననవుడు విధాత యయ్యా, భవత్పూర్వజుఁడైన స్థాణుఁడు సలిలమగ్నుఁ డ
య్యెఁ గావున నీవు విస్రబ్ధుండవై భూతములం బుట్టింపు మని నియోగించె.
బ్రహ్మనియోగమున నాతండు దక్షాదు లగుప్రజాపతుల నేడుగురం బుట్టించుట
యు వారివలనఁ జతుర్విధభూతగ్రామము సృజియింపంబడియె. సృజించినవెం
టనే యాప్రజలు క్షుత్పీడకోర్వలేక దక్షుని భక్షింపఁ బఱచుటయు నాతండు
పితామహునిపాలికా త్మత్రాణపరుండై యరిగి దేవా, యేను బుట్టించినప్రజ లన్న
ముఁ గానక యాఁకటఁ దూలుచు నన్నే కబళింప వచ్చుచున్నారు. వీరికి వృత్తిఁ
గల్పించి నన్నుఁ గావవే యనిప్రార్థించినం దత్ప్రార్థనఁ బాకర్ణించి కమలభ
వుం డోషధులను బలవత్సత్త్వములకు దుర్బలములను నాహారముగ నియ
మించినం దదాహారముఁ గని ప్రజలు యథాగతం బరిగి ముదం బెనసి నిజయో
నుల నాత్మసృష్టిఁ గావింప నీభువనంబు భూతసందోహసాంద్రంబై యొప్పిన
నప్పరమేష్ఠి పరమసంతుష్టుం డయ్యె. అప్పుడు జలనిమగ్నుం డైనభూతపతి
లేచి యేతెంచి ప్రజావృద్ధిం గాంచి కోపించి తనలింగముఁ దునిసి వైచిన నయ్యది
యట్లు ప్రతిష్ఠితం బయ్యె. అట్లలిగినరుద్రుం జేర నరిగి నళినసంభవుం డతనికి
శాంతి నాపాదించువాఁడై శర్వా, సలిలమున దీర్ఘకాలము వసియించి యేమి
యొనర్చితివి లింగ మిట్లు లేల పెఱికి భూమిం బడ వైచితి వనియడుగ మృడుఁ
డయ్యా, పరుఁడు ప్రజల సృజియించిన నింక నీలింగమున నేమి చేయుదుఁ బ్రజల
కన్నమును దపమున సంపాదింపఁబడియె నోషధులును బ్రబలరీతి సంతతము
పరివర్తనముఁ బొందు ననిచెప్పి క్రోధశాంతిం బొందక విమనస్కుఁడై ముంజ
వద్గిరితటమునకుఁ దపము సలుపం జనియె ననిచెప్పి పుండరీకాక్షుండు వెండియు
నిట్లనియె. అంత నతీతదేవయుగమున బృందారకులు వేదప్రమాణపరత్వమున
విధియుతముగ యజ్ఞముఁ జేయఁ బూని యజ్ఞసాధనములను హవిస్సులను భా
గార్హదేవతలను యజ్ఞద్రవ్యములనుం గల్పించి రుద్రమహిమంబు లెస్స యెఱుఁ
గమిం జేసి యద్దేవదేవునకు భాగముఁ గల్పింపకుండినం గినిసి కృత్తివాసుండు సాధ
నసంపాదనపరుండై లోకయజ్ఞ క్రియాయజ్ఞ గృహయజ్ఞ పంచభూతనృయజ్ఞ
ముల నీభువనముల్లెల్ల వ్యాప్తములై యునికిం జేసి లోకయజ్ఞ మనుష్యయజ్ఞ
ములఁ బంచకిష్కుప్రమాణం బైనచాపంబు సృజియించి వషట్కారంబు నారి
గావించి యజ్ఞసాధనచతుష్టయమ్మును సన్నహనమున నమర్చి యయ్యుత్తమకోదం

డముఁ గొని దేవయజనస్థానమునకుఁ జనుదెంచిన నుపాత్తకార్ముకుం డై నయా యవ్యయుని నిత్యబ్రహ్మచారిం జూచి పృథివి వ్యథం బొందె. పర్వతములు కంపించె. పవనుఁడు వీవకుండె. అగ్ని ప్రజ్వలింపఁ డయ్యె. అంతరిక్షముతో నక్షత్రమండలము సంవిగ్నంబై తిరుగుడుపడియె. సూర్యచంద్రులు లెస్స వెలుంగ రై రి. లోకమెల్ల గాఢాంధకారనీరంధ్రం బయ్యె. అమరు లభిభూతులై విషయ ములం దెలియక వెఱచిరి. యజ్ఞము ప్రతిభానవంతంబు గాకుండె. అట్టియెడ రుద్రుఁడు రౌద్రాశుగము నేయుటయు యజ్ఞము మృగంబై పావకునితోడం దొలంగి దివంబున కరిగె. ఇప్పటికిని నభస్తలంబున రుద్రానుయాతమైన మృ గమురూపము చూపట్టెడి. అట్లుయజ్ఞము తొలంగిన నిర్జరులు నష్టసంజ్ఞు లైనం గాలకంధరుండు సవితృనిబాహువులను భగుని నయనములను బూషుని దంతములను వింటికోపునఁ దునిమియుఁ గ్రుచ్చియుఁ బగుల నడిచియుఁ గ్రోధ ము మూర్తీభవించినట్టు లొప్పుచుండ నచ్చట నిలువ నోపక తక్కిననిలింపులు ను యజ్ఞాంగములును నలుగడలం బఱచియు నచ్చటన ఘూర్ణిల్లుచుఁ జచ్చి నట్లు పడియు నున్నంత నంతకాంతకుండు వారలఁ దఱిమియు నుల్లసం బాడి యు వింటికోపున నడ్డగించినం గాంచి యమరు లక్కార్ముకంబు నారి ద్రెవ్వం బలికిన నాగొనయమ్ము తత్క్షణంబ తునిసె. అవ్విధమున విచ్ఛిన్నకార్ముకుఁ డై నయ ద్దేవునొద్దకు సురలు యజ్ఞసమన్వితంబుగాఁ జని శరణంబు వేఁడినం బ్రస న్నుండై మహేశ్వరుండు తనకోపమును జలాశయస్థాపితంబుఁ గావించిన నది యనలంబై జలమును శోషింపఁ జేయుచుండె. అట్లు ప్రశాంతుఁడై పరమేశ్వ రుండు సవితృభగపూషులబాహునేత్ర దంతములను యజ్ఞములనుం గ్రమ్మఱ నొసంగుటయు సర్వంబుఁ సుస్థం బయ్యె. సురలు మఱల యజ్ఞము సంకల్పించి శంకరునకు భాగముఁ గల్పించి కృతార్థులై రి. అమ్మహానుభావుఁ డలిగిన నెల్లయు నస్వస్థంబును బ్రసన్నుండైన స్వస్థంబును నగు. ద్రౌణి యద్దేవునిప్రసాదము వడసినకతన నీకొడుకులను బాంచాలవీరులను బరిమార్ప నోపెఁ గాని యది వాని శక్తి గాదు. అశ్వత్థామ యిట్లు చేసెఁగాయని మనస్సునఁ బెట్టవలదు. విధి విధానం బిట్టి దని యూఱడిల్లి మహాదేవు ప్రసాదమున ననంతరకరణీయముల నాచరింపు మని దేవకీనందనుండు కుంతీనందనునకు బోధించెనని,

క॥ అనఘుఁడు వైశంపాయన । ముని సౌప్తికపర్వవృత్తముఁ దెలియఁగఁజె
ప్పిన విని జనమేజయమే । దినీవిభుఁడు హర్షసంగతిం దనరారెఁ ॥

శా॥ కామక్రోధమదాదికాంతరవిపక్షస్తోమముం దున్మియు
ద్దామక్షాంతినిరీహతాదిగుణసంతానంబు సాధించి ని
జాసీనమజ్ఞాననిరూఢులౌ మునులసచ్చిత్తంబులం బూర్ణతా
స్థేమం దోఁచు నఖండు నాద్యు గణనాతీతుం దలంతు న్మదిన్॥

ఇది శ్రీకాళహస్తినగరాధినాథ శ్రీమద్దామరకుమారాంక మహీపాల కరుణాపురస్సర బహుమానపాత్ర, సంస్కృతాంధ్రభాషాకవిత్వచమత్కారపరితోషిత బుధస్తోమ సీతారామకవిలలామ పుత్త్రి, సకలశాస్త్రినిరంకుశపాండితీధుర్య లక్ష్మీనరసింహసుధీవర్య సచ్ఛాత్ర, విబుధజనవిధేయ, వేంకటరంగనామధేయ విరచితం బైన శ్రీమదాంధ్రవచనభారతంబునందు సౌప్తికపర్వంబున నశ్వత్థామ పాంచాలపాండవులం జంపకకాని కవచ మూడ్పనని దుర్యోధనుతోఁ బ్రతిజ్ఞ చేసి సూర్యాస్తమయసమయమున గహనారణ్యమున వటవృక్షంబుక్రిందఁ గృపకృతవర్మసహితుండై నిల్చి యచ్చట నారేయి గూబ యొక్కండు వైరవృత్తిని వాయసములఁ జంపుటం జూచి సౌప్తికంబునఁ బాండవశిబిరంబుఁ జొచ్చి యందఱం జంపఁగ నిశ్చయించి గౌతమహార్దిక్యులు వెంటరాఁగఁ దచ్ఛిబిరమున కరుగుటయుఁ, దద్ద్వారమున ఘోరరూప మైనభూతమొక్కండు పొడచూపి ద్రౌణి యేసినయస్త్రములనెల్ల గ్రసించిన నాతండు రుద్రు నాత్మోపహారమున నారాధించి తత్ప్రసాదముఁబడసి శిబిరముఁ జొచ్చి ధృష్టద్యుమ్నాదిపాంచాలవీరులను ద్రౌపదేయులను బాండవు లేవురు కృష్ణసాత్యకులును దక్కఁ దక్కినవారలను నిద్రాసమయమున వధించుటయు, ధృష్టద్యుమ్నసారథి యొక్కండు విధిబలమునఁ దప్పించికొని వచ్చి యావృత్తాంతము బాండవులకుఁ దెల్పుటయుఁ, బితృభ్రాతృపుత్త్రాదిమరణశోకమునం గుంది పాంచాలి ద్రోణసుతునకుఁ బ్రతీకార మొనర్పకున్నం బ్రాయోపవేశముఁ జేయుదు నని ధర్మజునితోఁ జెప్పుటయు, ద్రౌపదీప్రియంకరుండై భీముఁ డశ్వత్థామమీఁది కెత్తి చనినం గృష్ణుఁడును ధర్మరాజార్జునులును భీమరక్షణార్థంబు వెంట నరుగుటయు, భీమునకు వెఱచి యశ్వత్థామ యపాండవంబయ్యెడుమని బ్రహ్మశిరోఽస్త్రమున నభిమంత్రించి యైషీకంబుఁ బ్రయోగించుటయుఁ, బార్థుండు దానును గృష్ణానుమతంబున బ్రహ్మశిరోఽస్త్రమేసి యయ్యస్త్రము శమించు తెఱంగు గావించుటయు, ద్రౌణివ్యాసాదులపరస్పరశాప ప్రకారంబును, నశ్వత్థామశిరోరత్నంబుఁ దెచ్చి పాండవులు పాంచాలికొసంగి ప్రహర్షోత్కర్షసంభరితు లగుటయు నన్నది సర్వంబు నేకాశ్వాసంబు.

యుద్ధపంచకము

సమాప్తము.

# ఆంధ్ర గ్రంథమాల

నెం. 6, 7 తంబుశెట్టివీధి, చెన్నపురి.

ఈ గ్రంథమాలయందు విజ్ఞానాభ్యుదయమునకు సాధనములై వివిధ విషయములకు సంబంధించిన గ్రంథములు రెండుమాసముల కొకటివంతున ప్రచురింపబడును. వెలువడిన గ్రంథములు:—

1. శతకసంపుటి (ప్రథమసంపుటము): వృషాధిప, సర్వేశ్వర, దేవకీనందన, ఒంటిమిట్ట రఘువీర, నారాయణ, కాళహస్తీశ్వర, దాశరథి, రంగశాయి, రామతారక, రామచంద్ర శతకములు పదియైదు గలవు. ఒక్కొక్క శతకమునకు పీఠికయు, పాఠభేదములును గలవు. (ఈ శతకములు విడిగను దొరకును.) ౧-౮-౦

2. బసవపురాణము (ద్విపద): పాల్కురికి సోమనాథుడు. అనేక తాళపత్రమాతృకలను బరిశీలించి కూర్చిన మూలము. పాఠభేదములు సూచింపబడినవి. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన విపులమగు పీఠిక గలదు. ౨-౮-౦

3. గాంధిమహాత్ముని బెల్గాము కాంగ్రెసు అధ్యక్షోపన్యాసము ౦-౪-౦

4. కమలాక్షి (చిన్న విచిత్రకథ): శ్రీ రాయసం వెంకటశివుడుగారు, యమ్.ఏ., యల్.టి. ౦-౮-౦

5. నీతినిధి: ఇది యొక యుత్కృష్టనీతిగ్రంథము. ఇది తొలుదొల్తనే రెండు వేలేండ్లకు మున్నొక భారతీయుడను నొక పండితునిచే తిబెతుభాష యందు రచియింపబడి పదపడి యనేకభాషల బరివర్తితమై వ్యాప్తినిగన్నది. అనువాదకులు: శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ౧-౪-౦

6. త్యాగరాజస్వామిచరిత్రము (పద్యకావ్యము): శ్రీ పసుమర్తి కృష్ణమూర్తిశాస్త్రి కృతము. శ్రీరామభక్తాగ్రణియు, గానకళాసాగరుడు నగు శ్రీ త్యాగరాజుగారి చరిత్ర మిందు సరసముగ వర్ణింపబడినది. సందర్భానుసారముగ త్యాగరాజుగారు రచియించిన కృతులను నిందు జేర్చబడినవి ౧-౧౦-౦

7. ధమ్మపదము (వచనము): బౌద్ధమత ధర్మప్రబోధకగ్రంథమగు 'త్రిపిటకము' నందలిది. బౌద్ధమతధర్మతత్త్వము లిందు చక్కగా ప్రతిపాదింపబడినవి. అనువాదకులు: శ్రీ కిళాంబి రంగాచార్యులుగారు, యమ్.ఏ., యల్.టి. ౦-౧౦-౦

కాశీనాథుని నాగేశ్వరరావు, వ్యవస్థాపకుడు.